బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

## సరళ వ్యాఖ్యానసహితం

### ఏడవ సంపుటము

### 10వ స్కంధము - ఉత్తరభాగము


వ్యాఖ్యాతలు

డా॥ నాగళ్ళ గురుప్రసాదరావు

డా॥ ఎన్.వి.ఎస్. రామారావు

డా॥ కె. మలయవాసిని

డా॥ కె.జె. కృష్ణమూర్తి

డా॥ సంగనభట్ల నరసయ్య

ప్రధాన సంపాదకులు

డా॥ సముద్రాల లక్ష్మణయ్య






తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

2017

**Bammera Potanamatya Praneeta**

**SRI MAHABHAGAVATAMU, with Commentary**

**Volume - VII (Skandha - 10-2)**

*Author :* **Potana Mahakavi**

*Commentary by*

**Dr. Nagalla Guruprasada Rao**

**Dr. N.V.S. Ramarao**

**Dr. K. Malayavasini**

**Dr. K.J. Krishnamurthi**

**Dr. Sanganabhatla Narasaiah**

*Edited by*

**Dr. Samudrala Lakshmanaiah**



T.T.D. Religious Publications Series No. 1243

*First Edition :* 2017

*Copies :* 3000

*Published by*

**Dr. D. Sambasiva Rao, I.A.S.,**

Executive Officer

Tirumala Tirupati Devasthanams

Tirupati.

*D.T.P.*

Publications Division

T.T.D., Tirupati.

*Printed at*

Tirumala Tirupati Devasthanams Press

Tirupati - 517 507

# ముందుమాట

**భా**రతీయ సనాతన వాఙ్మయంలో అద్భుతమైన ఆధ్యాత్మిక గ్రంథాలు చాలా ఉన్నాయి. అందులో అమూల్యమైన రత్నాల్లాగా శ్రీమద్రామాయణ, శ్రీ మహాభారత, శ్రీమద్భాగవత గ్రంథాలు సంస్కృత వాఙ్మయ ప్రపంచంలో ప్రకాశిస్తున్నాయి.

వాటిల్లో శ్రీమద్రామాయణ మహాకావ్యం ఆదికవి వాల్మీకి మహర్షి ప్రణీతం. కాగా ఇక మిగిలిన భారత భాగవత గ్రంథాలు రెండూ కృష్ణద్వైపాయనుడైన శ్రీవ్యాసమహర్షి రచించినవి.

తి.తి.దేవస్థానం ధార్మిక సాహిత్య ప్రచురణలో భాగంగా ఇప్పటికే సంస్కృత శ్రీమద్రామాయణ కావ్యాన్నీ, తెలుగు కవిత్రయ మహాభారత కావ్యాన్నీ సవ్యాఖ్యానంగా ప్రచురించింది.

అదే వరుసలో పోతన మహాకవి తెలుగులో రచించిన భాగవతాన్ని కూడా తెలుగువారికి అందించాలన్న సదాశయంతో ప్రముఖ పండితులు డా॥ కరుణశ్రీ గారి ప్రధాన సంపాదకత్వంలో సరళమైన తాత్పర్యంతో పోతన భాగవతగ్రంథాన్ని ఐదుసంపుటాలుగా దేవస్థానం అందించింది. ఈ గ్రంథం పాఠకుల విశేషాదరణకు పాత్రమై పలు ముద్రణలను పొందింది.

ఆ తర్వాత కొందరు పండితుల సలహామేరకు, పాఠకుల అభ్యర్థనలమేరకు, 'కవిత్రయ భారతం' మాదిరిగానే పోతన మహాకవి భాగవతాన్ని కూడా అందరికీ సులభంగా అర్థం అయ్యేట్లు సరళమైనశైలిలో వ్యాఖ్యానాన్ని అందించాలనే లక్ష్యంతో దేవస్థానం ఆ కార్యక్రమాన్ని చేపట్టింది.

ప్రస్తుతం బమ్మెర పోతనగారి భాగవత గ్రంథం, ముప్పైమూడు మంది పండితులు సరళవ్యాఖ్యానాన్ని అందించగా ప్రముఖ సాహితీవేత్తలు విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు గారి ప్రధానసంపాదకత్వంలో తయారయ్యింది. ఈ వ్యాఖ్యానగ్రంథం తయారీలో కృషిచేసిన దేవస్థానం ప్రచురణల విభాగం అధికారి మరియు పోతన భాగవత వ్యాఖ్యాన పర్యవేక్షకులు, సమన్వయకర్త డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారికీ, వారి సహాయకులు, ఉపసంపాదకులు డా॥ నొస్సం నరసింహాచార్య గారికీ, ఈ పోతన భాగవత వ్యాఖ్యానగ్రంథ ప్రధాన సంపాదకులు విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు గారికీ, వ్యాఖ్యాతలకూ, సంపాదకమండలి సభ్యులకూ, సహాయసహకారాలందించినవారికీ, కన్సల్టెంట్లందరికీ, ఈ గ్రంథాన్ని చక్కగా ముద్రింపజేసిన తి.తి.దేవస్థానం ప్రెస్సు వారందరికీ ప్రత్యేకంగా అభినందనలు తెలియజేస్తున్నాను. పోతన పద్యాలకు వ్యాఖ్యానాలనదగిన చక్కనైన బాపుగారి రేఖాచిత్రాలను ఈ గ్రంథ సంపుటాల్లో అక్కడక్కడా పొందుపరుచుటకు అనుమతించిన శ్రీ బాపుగారి కుటుంబ సభ్యులకు ప్రత్యేకంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఈ సరళవ్యాఖ్యాన గ్రంథం ఎనిమిది సంపుటాలుగా, ఆ యా పుటల్లో అక్కడక్కడ ప్రముఖ చిత్రకారులు బాపుగారి బొమ్మల మెరుపులతో సర్వాంగసుందరంగా, శ్రీ హేమలంబి నామసంవత్సరం తెలుగు ఉగాదినాడు తెలుగువారందరికి శ్రీ తిరుమలేశుడు అనుగ్రహిస్తున్న ప్రసాదంగా స్వీకరించగలరని ఆకాంక్షిస్తూ...

*సదా శ్రీవారి సేవలో...*

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

శ్రీరస్తు

# బమ్మెర పోతనామాత్య ప్రణీత శ్రీమహాభాగవత ప్రాజెక్టు పుట్టుపూర్వోత్తరాలు

**వేదకల్పవృక్షవిగళితమై శుక**
**ముఖసుధాద్రవమున మొనసియున్న,**
**భాగవతపురాణఫలరసాస్వాదన**
**పదవి గనుడు రసికభావవిదులు.**

అని భాగవత రచనకు ఉపక్రమించిన సహజకవి పోతనామాత్యుడు భాగవతప్రాశస్త్యాన్ని ఉగ్గడించాడు.

వాల్మీకి విరచితమైన ఆదికావ్యం రామాయణం. “వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా” అన్నట్లు వేదానికి మారురూపంగా అది ప్రసిద్ధి పొందింది. వ్యాసవిరచితమహాభారతాన్ని పంచమవేదంగా (భారతం పంచమో వేదః) భావిస్తారు. సనాతనధర్మానికి అనల్పమైన వ్యాప్తిని గావించిన ఈ మూడుగ్రంథాలు భారతీయ సాహిత్యంలో సాటిలేని మేటిరచనలుగా ప్రసిద్ధి పొందాయి.

తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మ ప్రచారంకోసం ఆధ్యాత్మికగ్రంథాలను పెద్ద ఎత్తున ప్రచురిస్తోంది. దేశంలో మరే ఇతరదేవస్థానం కూడా ధర్మప్రచారంకోసం గ్రంథముద్రణను ఇంత పెద్ద ఎత్తున చెయ్యడం లేదని చెప్పడం అతిశయోక్తి కాదు. వేదార్థాలను ప్రతిపాదించే వాఙ్మయాన్ని వివిధ భాషల్లో ప్రచురించి ప్రచారం చేయడం తిరుమల తిరుపతి దేవస్థానం తన బాధ్యతగా స్వీకరించింది. అనేకభాషల్లో దేవస్థానం ద్వారా వెలువడుతున్న ధార్మికగ్రంథాలలో రామాయణ, భారత, భాగవతాలు మిక్కిలి ప్రధానమైనవని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

1982లో జరిగిన భక్తకవి పోతన పంచశతాబ్ది జయంతి ఉత్సవాలలో పోతన భాగవతాన్ని తాత్పర్యంతో ముద్రించాలని దేవస్థానం సంకల్పించింది. **కరుణశ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రి** గారి నేతృత్వంలో 15 మంది పండితులు పోతనభాగవతానికి తాత్పర్యాన్ని సమకూర్చారు. తొలిసారిగా 1987లో తాత్పర్యసహిత పోతన భాగవతాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం పాఠకలోకానికి అందించింది.

కవిత్రయవిరచితమహాభారతానికి ప్రసిద్ధపండితులచేత ప్రతిపదార్థతాత్పర్యవిశేషవివరణలు వ్రాయించి ప్రచురించాలన్న సంకల్పం 1983లో తిరుమల తిరుపతి దేవస్థానానికి కలిగింది. ముప్పైమంది పండితులు ఈ పద్ధతిలో భారతానికి వ్యాఖ్యానం రచించారు. 2005వ సంవత్సరంలో మహాభారతం సంపూర్ణంగా సవ్యాఖ్యానంగా వెలువడింది.

ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషవ్యాఖ్యానాలతో కవిత్రయభారతం, తాత్పర్యసహితభాగవతం తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలలో అగ్రశ్రేణికి చెందినవిగా రూపొంది అతివిస్తృతమైన ప్రజాదరణకు పాత్రమైనాయి. వేలకొలది ప్రతులు భక్తులకు, పాఠకులకు అందుతున్నాయి.

1981లో డా॥ పన్నాల రాధాకృష్ణశర్మగారి నేతృత్వంలో వ్యాసవిరచితసంస్కృతభాగవతాన్ని ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతాలను సమన్వయించే మూడువ్యాఖ్యానాలతో పరిష్కరించి ప్రచురించాలని దేవస్థానం నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు భాగవతం ప్రాజెక్టు ఏర్పాటైంది. **డా॥ రాధాకృష్ణశర్మ, డా॥ ఎన్.సి.వి.నరసింహాచార్యులు, శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ, డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గార్ల నేతృత్వంలో శ్రీధరీయం (అద్వైతం), వీరరాఘవీయం (విశిష్టాద్వైతం), విజయధ్వజీయం (ద్వైతం) అన్న మూడువ్యాఖ్యానాలతో సమగ్రంగా 14 బృహత్ సంపుటాలుగా 2006 నాటికి భాగవతం సిద్ధమయింది.

ఈ పరిష్కరణ కార్యక్రమం ముగియగానే పురాణ ఇతిహాస ప్రాజెక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** నాటి తితిదే శ్రీకార్యనిర్వహణాధికారి **శ్రీ ఎ.పి.వి.ఎన్. శర్మ** ఐ.ఏ.ఎస్., గారి వద్దకు వెళ్ళి వ్యాసభాగవత పరిష్కరణ పూర్తి అయిందని విన్నవించారు. అప్పుడు కార్యనిర్వహణాధికారిగారు ఎంతో సంతోషించి “పోతన భాగవతాన్ని తాత్పర్యంతో మాత్రమే ముద్రించగలిగాం. తెలుగు ప్రజలందరికీ ఎంతో ప్రియమైన భాగవతాన్ని కూడా అర్థ తాత్పర్య వివరణలతో సిద్ధం చేస్తే బాగుంటుంది. ఇందుకు తగిన ప్రతిపాదనలను సిద్ధం చెయ్యండి” అని నిర్దేశించారు.

ఈ బృహత్కార్యక్రమం భాగవతప్రాజెక్టుద్వారా కాకుండా కవిత్రయ మహాభారతానికి వ్యాఖ్యానం సమకూర్చడంలో అనుభవం గడించిన సప్తగిరి సంపాదక కార్యాలయం ద్వారానే నిర్వహించడం సముచితంగా ఉంటుందని తెలుపుతూ **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** వ్యాఖ్యాన రచనకు అవసరమైన ప్రతిపాదనలను సిద్ధం చేసి కార్యనిర్వహణాధికారివారికి పంపగా వారు ఆమోదించారు.

**డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారి ప్రతిపాదనలో సారాంశం**

- వ్యాఖ్య సామాన్యులకు కూడా అర్థమయ్యే తీరులో ఉండాలి.
- శిష్టవ్యావహారికభాషను ప్రయోగించాలి.
- వ్యాకరణాదివిశేషాలకు ఎక్కువ ప్రాధాన్యం ఉండరాదు.
- ఆధ్యాత్మిక అంశాలను పరిమితంగా విశేషాంశాలలో చెప్పవచ్చు.
- కార్యనిర్వహణాధికారి వారి అధ్యక్షతన తితిదే ప్రజాసంబంధాధికారి, సప్తగిరి ప్రధాన సంపాదకులు, తితిదే స్థానిక పండితులతో ఒక సంఘాన్ని ఏర్పాటుచేసి వ్యాఖ్యాతలను, సంపాదకమండలిని ఎన్నుకోవాలి.

- వ్యాఖ్యాత లందరితో తిరుపతిలో ఒక కార్యశాలను నిర్వహించి అందరి వ్యాఖ్యానం ఒకే విధంగా ఉండేలా చూడాలి.
- ఇంతకు మునుపు తితిదే ముద్రించిన తాత్పర్యసహిత భాగవతానికి తాత్పర్యం వ్రాసిన పండితులలో సమర్థులైనవారిని ఈ కార్యక్రమంలో వినియోగించుకోవచ్చు.

2007లో కార్యనిర్వహణాధికారి **డా॥ కె.వి.రమణాచారి** ఐ.ఏ.ఎస్., గారి ఆమోదంమేరకు నాటి సప్తగిరి సంపాదకులు **డా॥ సి.శైలకుమార్**, భాగవత ప్రాజెక్టు ప్రధానసంపాదకులుగా **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** గారిని నియమించారు. ఆ తరువాత ఈ బృహత్కార్యాచరణకు సలహాలు, సూచనలు చేసేందుకు కవిత్రయభారత వ్యాఖ్యాననిర్వహణలాగే తొమ్మిదిమందితో కూడిన సలహామండలిని ఏర్పాటు చేశారు. దీనికి తితిదే కార్యనిర్వహణాధికారి గౌరవ సంపాదకులుగా వ్యవహరించారు.

**సలహామండలి**

| | | |
|---|---|---|
| **శ్రీ కార్యనిర్వహణాధికారి** | **-** | **గౌరవ సంపాదకులు** |
| **శ్రీ ముదివర్తి కొండమాచార్యులు, తిరుపతి** | **-** | **ప్రధాన సంపాదకులు** |
| **డా॥ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి** | **-** | **సభ్యులు** |
| **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, మద్రాసు** | **-** | **సభ్యులు** |
| **డా॥ శలాక రఘునాథశర్మ, రాజమండ్రి** | **-** | **సభ్యులు** |
| **ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి** | **-** | **పదవీ నిమిత్త సభ్యులు** |
| **సప్తగిరి సంపాదకుడు** | **-** | **సి. శైలకుమార్, కన్వీనర్** |
| **తితిదే ప్రజాసంబంధాధికారి** | **-** | **విశేష ఆహ్వానితులు** |
| **తితిదే ప్రెస్ మేనేజర్** | **-** | **విశేష ఆహ్వానితులు** |

ఈ సంపాదక మండలిలోని పండితవర్గమైన **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, డా॥ సముద్రాల లక్ష్మణయ్య, డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, డా॥ శలాక రఘునాథశర్మ** గార్లతో ప్రధాన సంపాదకమండలిని నెలకొల్పారు. ఆ తరువాత కారణాంతరాలవల్ల **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య** గారి స్థానంలో **డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య** గారు సంపాదక మండలి సభ్యులుగా నియమితులయ్యారు. ఈ ప్రధాన సంపాదక మండలివారు భాగవత

వ్యాఖ్యాన రచనకు ముప్పైమంది పండితులను ఎంపికచేసి ఒక్కొక్కరికి 300 - 350 పద్యగద్యాలకు వ్యాఖ్యాన రచనా బాధ్యతలను అప్పగించారు.

ఆ తరువాత అనుకున్నంత వేగంగా ఈ కార్యక్రమం ముందుకు సాగలేదు.

తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలను, సవ్యాఖ్యాన భాగవతాన్ని త్వరితగతిన వ్యాప్తిలోకి తేవాలన్న ఉద్దేశ్యంతో 2011లో ద్రవిడ విశ్వవిద్యాలయ విశ్రాంత ఉపకులపతి **ఆచార్య రవ్వా శ్రీహరి**గారిని ప్రచురణల విభాగానికి ఎడిటర్-ఇన్-చీఫ్‌గా నియమిస్తూ వీరికి సహాయకులుగా **డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గార్లను ప్రచురణల విభాగానికి ఉపసంపాదకులుగా నియమించారు. అలాగే **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం** గార్లు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు.

అప్పటిదాకా మందకొడిగా సాగుతున్న ప్రచురణ కార్యక్రమంతోపాటు వ్యాఖ్యాన రచనా కార్యక్రమం కూడా **ఆచార్య రవ్వా శ్రీహరి** గారి సారథ్యంలో వేగాన్ని పుంజుకున్నది. వ్యాఖ్యాన రచయితలతో నిరంతరం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ రాయలేమని తెలిపిన వారి భాగాలను వేరే పండితులకు అప్పగిస్తూ 2013నాటికి దాదాపు పండితులందరినుండి భాగవత వ్యాఖ్యానాలను తెప్పించారు. వెనువెంటనే డి.టి.పి. వగైరా పనులుకూడా ముమ్మరంగా సాగాయి. పుటల సంఖ్య ఆధారంగా 12 స్కంధాల భాగవతాన్ని 8 సంపుటాలుగా ముద్రించేందుకు ప్రణాళికలు సిద్ధం చేశారు.

**ఆచార్య రవ్వా శ్రీహరి**గారి తదనంతరం 2014లో ఎడిటర్-ఇన్-చీఫ్‌గా బాధ్యతలు చేపట్టిన పురాణ ఇతిహాస ప్రాజక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** ఈ కార్యక్రమాన్ని మరింత వేగవంతం చేశారు. వ్యాఖ్యాన రచనలను పరిష్కరించడానికి, అక్షర దోషాలను తొలగించడానికి మరి కొందరు పండితులు అవసరం కావడంతో అప్పటికే భాగవతం కన్సల్టెంటుగా ఉన్న **డా॥ గల్లా చలపతి** గారితోపాటుగా **డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు** గార్లు భాగవతం ప్రాజెక్టు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు. భాగవత స్కంధాలను సంపాదకమండలి పరిష్కరణ స్థాయికి వీరు తీసుకువచ్చారు. 2015 ఏప్రిల్ 15వ తేదీన తితిదే కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., మరియు సంయుక్త కార్యనిర్వహణాధికారి (తిరుపతి) **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గార్ల ఆధ్వర్యంలో

**విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**డా॥ శలాక రఘునాథశర్మ**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**గార్లతో కూడిన పోతనభాగవత సంపాదకమండలి తొలి సమావేశం జరిగింది. త్వరితగతిన పరిష్కరణ పూర్తిచేసేందుకు గాను అనుసరించాల్సిన ప్రణాళికను ఈ సమావేశంలో సిద్ధం

చేశారు. ఆ తరువాత **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారి సంయోజకత్వంలో జరిగిన సంపాదక మండలి సమావేశాలలో మూడుస్కంధాల పరిష్కరణ పూర్తిచేసి ముద్రణార్హమైన ప్రతిని సిద్ధం చేశారు. అనివార్యకారణాలవల్ల సంపాదకమండలిలో కొందరు సభ్యులు తదుపరి సమావేశాలకు హాజరు కాలేకపోయారు.

2016లో ప్రచురణల విభాగానికి **శ్రీ ప్రయాగ రామకృష్ణ**గారు ప్రత్యేకాధికారిగా నియమితులయ్యారు. కార్యనిర్వహణాధికారి గారి అమోదం మేరకు వీరు భాగవత పరిష్కరణ కార్యక్రమం త్వరితగతిన పూర్తికావడానికి అంతకు మునుపున్న సంపాదకమండలి స్థానంలో

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య (ప్రధాన సంపాదకులు)**

**శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ**

**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

**డా॥ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి**

**డా॥ ధూళిపాళ రామకృష్ణ**

**డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

**డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి**

**డా॥ కె.వి. సుందరాచార్యులు**

**డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ**గార్లతో కొత్త సంపాదకమండలిని ఏర్పాటు చేశారు. అప్పటినుంచి వ్యాఖ్యాన పరిష్కరణ కార్యక్రమం వేగవంతం అయింది. కాగా 2017 ఉగాదినాటికి సవ్యాఖ్యాన భాగవతం ముద్రించబడి ప్రజలకు అందుబాటులోకి రావాలన్న తితిదే సంకల్పాన్ని అనుసరించి పరిష్కరణ కార్యక్రమాన్ని మరింత త్వరగా పూర్తి చేసేందుకుగాను కార్యనిర్వహణాధికారి వారి ఆమోదంమేరకు

**డా॥ నిట్టల సుబ్రహ్మణ్యేశ్వర శాస్త్రి**

**డా॥ మరడాన శ్రీనివాసరావు**

**డా॥ గల్లా చలపతి** గార్లకు సంపాదకమండలిలో స్థానం కల్పించారు. 2016 సెప్టెంబరునుండి పండితులందరితో ప్రతినెలా దాదాపు 20 రోజులపాటు తిరుపతి శ్వేత సమావేశ మందిరంలో సమావేశాలు ఏర్పాటుచేసి పండితులందరి ఆమోదంమేరకు పరిష్కరణ కార్యక్రమాన్ని విజయవంతంగా ముగించి శుద్ధప్రతిని ముద్రణకు పంపేందుకు సిద్ధం చేశారు. ఇలా అనుకున్న సమయానికి శ్రీమహాభాగవతాన్ని ప్రకటించగలిగినందుకు సంతోషిస్తున్నాము.

సామాన్య పాఠకులను దృష్టిలో ఉంచుకుని వ్యాఖ్యానం సరళంగా ఉండాలన్న కార్యనిర్వహణాధికారి, సంయుక్త కార్యనిర్వహణాధికారిగార్ల సూచనలమేరకు వ్యాఖ్యాన రచనలో విస్తృతంగా విశేషాలను వ్రాసిన పండితుల రచనల్లోంచి సంపాదకమండలి సూచనల ప్రకారం అవసరమైన మేరకు మాత్రమే విశేషాలను స్వీకరించడమయింది.

**కృతజ్ఞతలు**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావడానికి ఆధికారికమైన ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థానముల పాలకమండలి అధ్యక్షులకు మరియు పాలకమండలి సభ్యులందరికీ కృతజ్ఞతలు.

లోగడ తితిదేవస్థానం కార్యనిర్వహణాధికారిగా ఉండి భాగవత ప్రాజెక్టు ప్రారంభానికి కారకులైన **శ్రీ ఎ.పి.వి.ఎన్.శర్మ** ఐ.ఏ.ఎస్., గారికి హృదయపూర్వక ధన్యవాదాలు. అదే పరంపరలో తితిదే కార్యనిర్వహణాధికారులుగా బాధ్యతలు నిర్వహించి భాగవత ప్రాజెక్టుకు సంపూర్ణ సహకారాన్ని అందించిన **డా॥ కె.వి.రమణాచార్య** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎమ్.జి.గోపాల్** ఐ.ఏ.ఎస్., గార్లకు హృదయపూర్వక ధన్యవాదాలు.

పోతనభాగవతం ముద్రణదశకు చేరుకునేందుకు తగిన సూచనలు, సలహాలు ఇచ్చిన సలహామండలి సభ్యులందరికీ ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన భాగవత ప్రచురణలో ఆసక్తిని కనబరుస్తూ అన్నివిధాలా అందుకు తగిన ప్రోత్సాహాన్ని అందజేసిన గౌరవ శ్రీ కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారి **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గారికి మా హృదయపూర్వక నమోవాకాలు.

భాగవత వ్యాఖ్యాన రచనకు అవసరమైన పండితులను ఎన్నుకొని వారికి వ్యాఖ్యాన బాధ్యతలను అప్పగించడంలో కృషిచేసిన నాటి సప్తగిరి ప్రధాన సంపాదకులు **డా॥ సి.శైలకుమార్** గారికి, సంపాదకులు **డా॥ కె.రాధారమణ** (ప్రస్తుత ప్రధాన సంపాదకులు) గార్లకు కృతజ్ఞతలు.

వ్యాఖ్యాతలందరినుండి వ్యాఖ్యాన భాగాలను రప్పించడంలో శ్రమించి, విశేష కృషిచేసిన నాటి ప్రచురణల విభాగం అధికారి **ఆచార్య రవ్వా శ్రీహరి** గారికి, పరిష్కరణ కార్యక్రమాన్ని వేగవంతంచేసిన తదుపరి అధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారికి, కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

పోతన భాగవత పరిష్కరణలో తమ అమూల్య సహాయసహకారాలనందించి శుద్ధప్రతిని తయారు చేయడంలో సహకరించిన **పోతన భాగవత సంపాదకమండలి సభ్యులందరికీ** పేరుపేరునా ధన్యవాదాలు.

ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ అన్నివిధాలా సంపూర్ణ సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగ ఉపసంపాదకులు **డా॥ నొస్సం నరసింహాచార్య** గారికి, పరిష్కరణ, అక్షరదోష సవరణల్లో సహకరించిన కార్యాలయ పండితులు **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, డా॥ గల్లా చలపతి, డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు**గార్లకు, ప్రచురణల విభాగంలో కొంతకాలం ఉపసంపాదకురాలుగా పనిచేసి భాగవత పరిశీలనా కార్యక్రమంలో సహకరించిన **శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవత ముద్రణకు సంబంధించిన దస్త్రాలను నడపడంలోను, సంపాదకమండలి సమావేశాలను ఏర్పాటు చేయడంలోను సహకరించిన **ప్రచురణల విభాగ కార్యాలయ సిబ్బందికి** నా ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవతం ఎనిమిది సంపుటాలలో చివరన ముద్రించిన అకారాదిక్రమ పద్యగద్య సూచికను తయారు చేయడంలో సహకరించిన **శ్రీ వాడపల్లి శేషతల్పశాయి** (ఆంధ్రభారతి.కామ్) గారికి మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాలను అందంగా డి.టి.పి. చేసి చక్కటి వర్ణచిత్రాలతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దడంలో సహకరించిన ప్రచురణల విభాగ కార్యాలయ డి.టి.పి. సిబ్బంది **శ్రీమతి ఎమ్.సుబ్బరత్నమ్మ, శ్రీమతి జె.కరుణ, కుమారి ఎమ్.మానస, శ్రీ ఎమ్.రెడ్డిప్రసాద్** గార్లకు ధన్యవాదాలు.

ఈ గ్రంథంలో ప్రసిద్ధ చిత్రకారులు బాపుగారి అద్భుత వర్ణచిత్రాలను ముద్రించేందుకు అనుమతించిన బాపుగారి కుటుంబసభ్యులకు మా ప్రత్యేకధన్యవాదాలు.

తక్కువ వ్యవధిలో గ్రంథ ముద్రణను పూర్తిచేసి పాఠకులకు అందించేందుకు తోడ్పడిన టిటిడి ముద్రణాలయ ఉపకార్యనిర్వహణాధికారి **శ్రీమతి ఎమ్.గౌతమి** గారికీ, వారి సిబ్బందికీ మా హృదయపూర్వక ధన్యవాదాలు.

*సదా శ్రీవారి సేవలో...*

ప్ర. రామకృష్ణ

**ప్రయాగ రామకృష్ణ**
కన్వీనర్
ప్రత్యేకాధికారి, ప్రచురణల విభాగం
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# సంపాదక మండలి

బమ్మెర పోతనామాత్యప్రణీత

# శ్రీమహాభాగవతము

| వ్యాఖ్యాతలు | స్కంధాలు |
|---|---|
| 1) డా॥ కేసాప్రగడ సత్యనారాయణ | ప్రథమస్కంధము (1-275) |
| 2) డా॥ మల్లెల గురవయ్య | ప్రథమస్కంధము (276-529) |
| 3) డా॥ సముద్రాల లక్ష్మణయ్య | ద్వితీయస్కంధము (1-288) |
| 4) డా॥ కడిమిళ్ళ వరప్రసాద్ | తృతీయస్కంధము (1-388) |
| 5) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (389-717) |
| 6) డా॥ గల్లా చలపతి | తృతీయస్కంధము (718-887) |
| 7) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (888-1055) |
| 8) డా॥ దావులూరి కృష్ణకుమారి | చతుర్థస్కంధము (1-322) |
| 9) డా॥ ఆర్. అనంతపద్మనాభరావు | చతుర్థస్కంధము (323-636) |
| 10) డా॥ శలాక రఘునాథశర్మ | చతుర్థస్కంధము (637-977) |
| 11) డా॥ కె. సర్వోత్తమరావు | పంచమస్కంధము |
| | ప్రథమాశ్వాసము (1-183) |
| | ద్వితీయాశ్వాసము (1-167) |
| 12) శ్రీ జోస్యుల సూర్యప్రకాశరావు | షష్ఠస్కంధము (1-251) |
| 13) డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ | షష్ఠస్కంధము (252-346) |
| 14) డా॥ ఆకురాతి పున్నారావు | షష్ఠస్కంధము (347-440) |
| 15) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం | షష్ఠస్కంధము (441-530) |
| 16) డా॥ ఆకెళ్ళ విభీషణశర్మ | సప్తమస్కంధము (1-186) |

| | |
|---|---|
| 17) డా॥ ఆకురాతి పున్నారావు | సప్తమస్కంధము (187-482) |
| 18) డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద | అష్టమస్కంధము (1-391) |
| 19) శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు | అష్టమస్కంధము (392-744) |
| 20) డా॥ డి. మీరాస్వామి | నవమస్కంధము (1-364) |
| 21) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం | నవమస్కంధము (365-737) |
| 22) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య | దశమస్కంధము పూర్వభాగము (1-288) |
| 23) డా॥ ఎ.ఎస్. గోపాలరావు | దశమస్కంధము పూర్వభాగము (289-610) |
| 24) శ్రీ ప్రభల సుబ్రహ్మణ్యశర్మ | దశమస్కంధము పూర్వభాగము (611-912) |
| 25) డా॥ పి. నరసింహారెడ్డి | దశమస్కంధము పూర్వభాగము (913-1188) |
| 26) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు | దశమస్కంధము పూర్వభాగము (1189-1485) |
| 27) డా॥ పి.ఆర్. హరినాథ్ | దశమస్కంధము పూర్వభాగము (1486-1792) |
| 28) డా॥ నాగళ్ళ గురుప్రసాదరావు | దశమస్కంధము ఉత్తరభాగము (1-245) |
| 29) డా॥ ఎన్.వి.ఎస్. రామారావు | దశమస్కంధము ఉత్తరభాగము (246-537) |
| 30) డా॥ కె. మలయవాసిని | దశమస్కంధము ఉత్తరభాగము (538-764) |
| 31) డా॥ కె.జె. కృష్ణమూర్తి | దశమస్కంధము ఉత్తరభాగము (765-1033) |
| 32) డా॥ సంగనభట్ల నరసయ్య | దశమస్కంధము ఉత్తరభాగము (1034-1343) |
| 33) డా॥ గల్లా చలపతి | ఏకాదశస్కంధము (1-127) |
| | ద్వాదశస్కంధము (1-54) |

**పోతన భాగవతప్రాజెక్టు కన్సల్టెంట్స్**

శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం ✻ డా॥ గల్లా చలపతి ✻ డా॥ ముదివేడు ప్రభాకరరావు

శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు ✻ శ్రీ కట్టా నరసింహులు

# సంకేతాక్షర సూచి

| | | | | | |
|---|---|---|---|---|---|
| క. | – | కందం | య. | – | యగణం |
| ఆ. | – | ఆటవెలది | మ. | – | మగణం |
| తే. | – | తేటగీతి | త. | – | తగణం |
| సీ. | – | సీసపద్యం | ర. | – | రగణం |
| ఉ. | – | ఉత్పలమాల | జ. | – | జగణం |
| చ. | – | చంపకమాల | భ. | – | భగణం |
| మత్త. | – | మత్తకోకిల | న. | – | నగణం |
| మ. | – | మత్తేభవిక్రీడితం | స. | – | సగణం |
| శా. | – | శార్దూలవిక్రీడితం | ల. | – | లఘువు |
| శ్లో. | – | శ్లోకం | గ. | – | గురువు |
| వ. | – | వచనం | వ. | – | వగణం |
| అలం. | – | అలంకారం | | | |

| | | |
|---|---|---|
| అవ. | – | అవతారిక |
| తా. | – | తాత్పర్యం |
| ప్రతి. | – | ప్రతిపదార్థం |
| విశే. | – | విశేషార్థం |
| ప్ర.ఆ. | – | ప్రథమాశ్వాసం |
| ద్వి.ఆ. | – | ద్వితీయాశ్వాసం |
| క్రీ.శ. | – | క్రీస్తుశకం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |
| … | – | తరువాతి పద్యం / వచనంతో అన్వయం |



# దశమస్కంధం - ఉత్తరభాగ పాశస్త్యం

**పో**తన భాగవతాన్ని యథామాతృకంగానే తెనిగించాడు. అయినా గమనించవలసిన రెండు ప్రధాన విషయాలున్నాయి. వ్యాసుడు వ్రాసిన సంస్కృతభాగవతంలో రుక్మిణీ కల్యాణం దశమస్కంధం ఉత్తరార్ధంలో ఉంది. పోతన దీనిని దశమస్కంధ పూర్వభాగంలోకి మార్చాడు. నరకాసుర వధ సంస్కృత భాగవతంలో సంగ్రహంగా ఉంది. నాచన సోమనాథుని ఉత్తర హరివంశంపైగల వ్యామోహంతో నరకాసురవధను పోతన ఎక్కువగా పెంచాడు.

**'దృష్ట్వా సభార్యం గరుడోపరిస్థితమ్'** (10-2-59-15 శ్లో.) అని మూలంలో సూచనప్రాయంగా ఉన్న విషయాన్ని తీసుకొని సత్యభామయుద్ధాన్ని విస్తరంగా వర్ణించాడు.

## భాగవతం-భక్తి

**'భక్త్యా భాగవతం జ్ఞేయం న వ్యుత్పత్త్యా న టీకయా'** భాగవతం పాండిత్యం వల్ల గాని, టీకల వల్లగాని, అర్థం కాదు. భక్తిగల వానికి మాత్రమే భాగవతం తెలుస్తుంది. భాగవతం భక్తిశాస్త్రం. ఇది భగవద్గీతకు భాష్యమని కొందరు చెబుతున్నారు. నారద భక్తి సూత్రాలకు శాండిల్య భక్తిసూత్రాలకు భాగవతం లక్ష్య గ్రంథమని కొందరు చెబుతున్నారు. వ్యాసమహర్షిది సమాధిభాష అని శ్రీవల్లభాచార్యులు నిర్దేశించి విపులవ్యాఖ్య రచించి భాగవతాన్ని 1. ఉపనిషత్ 2. భగవద్గీతా 3. బ్రహ్మసూత్రాల తరువాత నాల్గవ వేదాంతప్రస్థానంగా అంగీకరించారు. వేదం 1. సంహిత 2.బ్రాహ్మణం 3. ఆరణ్యకం 4.ఉపనిషత్తు అని నాలుగు విధాలు. సంహితా బ్రాహ్మణాలు యజ్ఞప్రధానాలై కర్మయోగాన్ని, ఆరణ్యకాలు ఉపాసనాపరాలై భక్తియోగాన్ని, ఉపనిషత్తులు వైరాగ్య ప్రధానాలై జ్ఞానయోగాన్ని బోధిస్తున్నాయి.

షడ్దర్శనాల వలే భక్తిదర్శనం ప్రత్యేకశాస్త్రం. నారదమహర్షి ఎనభైనాలుగు భక్తిసూత్రాలు రచించారు. శాండిల్య మహర్షి మూడు అధ్యాయాలలో ఆరు ఆహ్నికలలో నూటరెండు సూత్రాలు రచించాడు. శాండిల్య సంహిత కూడ ఉంది. శాండిల్య భక్తి దర్శనానికి స్వప్నేశ్వర స్వామి భాష్యం, నారాయణ తీర్థుల చంద్రికావ్యాఖ్య ఉన్నాయి. శ్రీ మలయాళస్వామివారు, దొడ్ల వేంకటరామిరెడ్డిగారు, బులుసు ఉదయభాస్కరం గారు మొదలైనవారు నారద భక్తిసూత్రాలకు తెలుగులో విపుల వ్యాఖ్యలు రచించారు.

## నవవిధభక్తులు

శ్లో. **శ్రవణం కీర్తనం విష్ణోఃస్మరణం పాదసేవనం ।**
**అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనం ॥**

1. శ్రీ విష్ణుమూర్తి కథలు వినటం 2. విష్ణువును కీర్తించటం 3. స్మరించటం 4. పాదసేవ చేయటం 5. అర్చించటం 6. నమస్కరించటం 7.దాస్యం చేయటం 8. స్నేహం చేయటం 9. ఆత్మను నివేదించటం అనేవి తొమ్మిది విధాలైన భక్తిమార్గాలు. ఇవి మనోవాక్కాయ కర్మలలో ఆచరించవలసినవని పోతన ఉపదేశం.

**శ్లో. శ్రీవిష్ణోః శ్రవణే పరీక్షి దభవ ద్వైయాసకిః కీర్తనే**
**ప్రహ్లాదః స్మరణే తదంఘ్రిభజనే లక్ష్మీః పృథుఃపూజనే ।**
**అక్రూర స్త్వభివందనే కపిపతి ర్దాస్యేఽథ సఖ్యేఽర్జునః**
**సర్వస్వాత్మనివేదనే బలి రభూత్ కైవల్య మేషామ్ ఫలమ్ ॥ –భక్తిరసామృత సింధువు (రూపగోస్వామి)**

1. విష్ణుమూర్తి కథలు వినడంవల్ల పరీక్షిత్తుకు 2. కీర్తించడంవల్ల శుకునికి 3. స్మరించడంవల్ల ప్రహ్లాదునికి 4. పాదసేవవల్ల లక్ష్మీదేవికి 5.పూజించడంవల్ల పృథుచక్రవర్తికి 6. నమస్కరించడంవల్ల అక్రూరునికి 7. దాస్యం వల్ల హనుమంతునికి 8. మైత్రివల్ల అర్జునునికి సర్వస్వం నివేదించడంవల్ల బలిచక్రవర్తికి తుల్యమైన కైవల్యం అబ్బింది.

**శ్లో. రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని ।**
**అన్యేషు చావతారేషు విష్ణోరేషాఽనపాయినీ ॥**

విష్ణువు రాముడై పుట్టినప్పుడు లక్ష్మి సీతగా పుట్టింది. కృష్ణుడై పుట్టినప్పుడు రుక్మిణిగా పుట్టింది. అన్ని అవతారలలో నిత్యానపాయినిగా ఉండి విష్ణుసేవ చేసింది. హనుమంతుని దాస్యభక్తికి రామాయణం ఉదాహరణం. తక్కిన భక్తుల కథలన్ని భాగవతంలోనే ఉన్నాయి.

**సూ. యథా వ్రజగోపికానామ్ (నారద–21)**

భగవంతుని విరహం సహింపలేకపోవడం, భగవంతుని మరచినపుడు వ్యాకులత్వం పొందడం, భక్తి లక్షణం. ఈ భక్తి వ్రేపల్లెలో గోపికలలో ఉంది అని నారద మహర్షి చెప్పాడు.

**సూ. పృథు ధ్రువ ప్రహ్లాదాంబరీష శుక సనక నారద భజనాచారశ్చ ।**

1.పృథు చక్రవర్తి 2.ధ్రువుడు 3. ప్రహ్లాదుడు 4. అంబరీషుడు 5. శుకుడు 6. సనకుడు 7. నారదుడు మహాభక్తులని శాండిల్య మహర్షి చెప్పాడు.

ఈ భగవత్ భక్తుల కథలు నిత్యం చదవడం వల్ల జనులకు భక్తిమార్గం అలవడుతుంది.

## అలంకార యోజనం

పోతన భాగవతంలో ఉన్నన్ని శబ్దాలంకారాలు మరే ఇతర గ్రంథాల్లో లేవనడం అతిశయోక్తి కాదు.

**1.వృత్త్యనుప్రాసం**

**వ. అ రక్కసులు వెక్కసంబులగు మొక్కలంబుల సజ్జనుల పజ్జలం బడి తర్జన గర్జన భర్జనాది దౌర్జన్యంబులం జేసి నిర్జించి పాపంబు లార్జించిరి.**

ఈ వచనంలో 'క్క' – 'జ్జ' – 'ర్జ' అక్షరాలు పెక్కుమార్లు వచ్చినందువల్ల వృత్త్యనుప్రాసం. ఇక్కడ ద్విత్వ–సంయుక్తాక్షరాలు ఎక్కువగా వాడటంవల్ల రాక్షసుల దౌష్ట్యం వెల్లడి అవుతున్నది.

**2. లాటానుప్రాసం**

**చ. హరి భజియించు హస్తములు హస్తము; లచ్యుతుఁ గోరి మ్రొక్కు త**
**చ్ఛిరము శిరంబు; చక్రధరుఁ జేరిన చిత్తము చిత్త; మిందిరా**
**వరుఁ గను దృష్టి దృష్టి; మురవైరి నుతించిన వాణి వాణి; య**
**క్షరుకథ లాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁబో భువిన్. (10-2-963)**

ఇక్కడ విష్ణుమూర్తిని భుజించుచేతులే చేతులు, తక్కినవి చేతులుగావు. అచ్యుతునకు మొక్కే శిరస్సే శిరస్సని యీ విధంగా ఒకే పదం తాత్పర్య భేదంతో రెండుమార్లు వచ్చి లాటానుప్రాసం అవుతున్నది.

**3. ఛేకానుప్రాసం**

**సీ. సాంద్రశరచ్చంద్రచంద్రికాకర్పూరనీహారహారాభ దేహ మమర**

నీ హారము= మంచు, హారము= ముత్యాలదండ, ఇక్కడ 'హార– హార' యని రెండేసి హల్లులు అర్థభేదంతో రెండు మార్లు రావడంతో ఛేకానుప్రాసం అయింది.

**4. అంత్యానుప్రాసం**

**సీ. ఇందీవర శ్యాము, వందితసుత్రాముఁ గరుణాలవాలు, భాసుర కపోలుఁ**

**విష్ణు, రోచిష్ణు, జిష్ణు, సహిష్ణుఁ, గృష్ణు.**

అంత్యానుప్రాసంతో నిండిన పద్యాలు భాగవతం నిండా వేలకొద్దీ ఉన్నాయి.

**చతురనటమూర్తి గోపాలచక్రవర్తి. (10-1-769)**

**రిపుదుర్మదమోచనుఁ బద్మలోచనున్. (10-1-1148)**

**ప్రమత్తవిమర్దను నా జనార్దనున్. (10-1-1144)**

**భవబంధ విమోచన! పద్మలోచనా! (10-2-1147)**

**నీ బీరంబు తోరంబుగన్. (10-1-1154)**

**సిద్ధంబు యుద్ధంబునన్. (10-1-1161)**

ఇట్టి అనుప్రాసలు చెవులకు ఇంపై పాఠకుల్ని ఎక్కువగా ఆకర్షిస్తాయి.

**5. యమకం**

**క. పలుతోయంబుల జగములఁ, బలు తోయములందు ముంచి భాసిల్లెడి యా**
**పలుతోయగాఁడు వల్లవ, లలనా కరతోయములఁ జెలంగుచుఁ దడియున్. (10-1-192)**

**క. విషధరరిపు గమనునికిని, విషగళసఖునికిని విమలవిషశయనునికిన్**
**విషభవభవజనకునికిని, విషకుచ చనువిషముఁ, గొనుట విషమే తలఁపన్? (10-1-233)**

**6. ముక్తపదగ్రస్తం**

**ఉ. అన్యసుపూజ్య! నీ జనకుఁడై యభిమన్యుఁడు భూవరేంద్ర! మూ**
**ర్ధన్యుఁడు ధన్యమార్గణ కదంబ విదారిత వైరివీర రా**
**జన్యుఁడు జన్యభీతకురుసైన్యుఁడు సైన్యసమూహనాథదృ**
**జ్మాన్యుఁడు మాన్యకీర్తి మహిమం దనరెం గురువంశకర్తయై. (9-675)**

ఈ పద్యంలో 'ధన్యుఁడు - ధన్య - 'జన్యుఁడు- జన్య' అని ముందు విడిచిపెట్టిన పదాల్ని తరువాత గ్రహించుటచేత ముక్తపదగ్రస్తం.

**వ. చటుల పవన చలితంబులై మిన్ను దన్ని, లెక్కకు మిక్కిలియై....ధేనువ్రజంబు కైవడిఁ బయఃకణ మనోహరంబై, హరకరంబుభంగిఁ బరిపూర్ణ సారంగ భాసురంబై**

ఇట్టి బాణగద్యలు భాగవతంలో ఎక్కువగా ఉన్నాయి. ఇవనీ ముక్తపదగ్రస్తంగా ముగిశాయి. దండి పదలాలిత్యం, బాణుని అనుప్రాసలతో శ్లిష్టోపమలతో కూడిన వచనాలను ఒకేచోట చూడాలంటే భాగవతగద్యలనే చదవాలి.

**7. దీపకం-సహోక్తిధ్వని**

**సీ. విమతులమోములు వెలవెలఁ బాఱంగ విమలాస్యమోము వెల్వెలుకఁ బాఱె (10-1-71)**

గర్భవతి అయిన దేవకి ముఖం వెలవెలబారింది. శత్రువుల ముఖాలు వెలవెలబారాయి అని ఒకేక్రియతో చెప్పటంవల్ల దీపకాలంకారం.

**8. ఉపమాలంకారం**

**అ. జ్ఞానఖలునిలోని శారదయును బోలె, ఘటములోని దీపకళిక వోలె**
**భ్రాతయింట నాఁకఁ బడియుండె దేవకీ, కాంత విశ్వగర్భగర్భ యగుచు. (10-1-77)**

జ్ఞానఖలుడు= జ్ఞానమున్న, దుష్టుడు= కంసుడు.

దుష్టుడైన పండితునిలో ఉన్న సరస్వతివలె; కుండలో ఉన్న చిన్న దీపం వలె దేవకీదేవి కంసుని చెరసాలలో ఉంది. ఈ పోలికలవల్ల శ్రీకృష్ణునికి తల్లికాబోతున్న దేవకి దుస్థితి వ్యక్తమవుతున్నది.

**9. అర్థాంతరన్యాసం**

**అ. వెదకి వెదకి దైత్యవీరులు సాధుల, నణఁప వారి బలము లడఁగిపోయె,**
**యశము సిరియు ధర్మ మాయువు భద్రంబు, నార్యహింస సేయ నణఁగుఁ గాదె! 172**

రాక్షసులు సాధువులైన ఆవులను చంపటంవల్ల వారి బలం తగ్గిపోయిందనే సామాన్యవిషయాన్ని, పూజ్యులను హింసించువారికి కీర్తి, లక్ష్మి మొదలయినవి నశిస్తాయనే విశేష విషయంచే సమర్థించుటచేత అర్థాంతరన్యాసం.

**10. విషమాలంకారం**

**శా. బాలుం డెక్కడ? బండి యెక్కడ? నభోభాగంబుపైఁ జేడ్పడం**
**గాలం దన్నుట...... (10-1-257)**

**11. రూపకాలంకారం**

**సీ. ఘనయమునానదీ కల్లోలఘోషంబు సరసమృదంగ ఘోషంబు గాఁగ (10-1-664)**

ఇక్కడ గొప్ప యమునానది కెరటాల ధ్వనిలో మృదంగ ధ్వని ఆరోపించుటచేత రూపకాలంకారం. భాగవతంలో ఇలాంటి పద్యాలు చాలా ఉన్నాయి.

**12. స్వభావోక్తి**

**మ. నవమాధుర్యము గల్గు కృష్ణు మురళీ నాదామృత స్యందముల్**
**సెవులం జొచ్చి హృదంతరాళముల భాసిల్లన్ సవత్సంబులై**
**యువిదా! మేపులకుం దొఱంగి మృగగోయూథంబు లుత్కంఠతో**
**దివికిం గంఠము లెత్తి లో వదలుఁ బో దేహేంద్రియవ్యాప్తులన్. (10-1-1128)**

ఎప్పటికప్పుడే తియ్యగాఉన్న శ్రీకృష్ణుని మురళీనాదామృతప్రవాహం చెవుల్లో పడగానే మేతమేయటం మాని మృగాలు, ఆవులు, దూడలతో గొంతులెత్తి వింటున్నాయి. ఆ మురళీనాదం వాని హృదయాంతరాళాల్లో, దేహాల్లో, ఇంద్రియాల్లో వ్యాపించిందని జంతువుల స్వభావం ఉన్నదున్నట్లుగా వర్ణించుటచేత స్వభావోక్తి అలంకారం.

**శ్లో. శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తీ గానరసం ఫణిః ।**

సంగీతరసమాధుర్యం శిశువులకు, పశువులకు, పాములకు తెలుస్తుంది.

ఇక్కడ శిశువు= కుమారస్వామి. పశువు= నందికేశ్వరుఁడు. ఫణి= ఆదిశేషుఁడు విశేషార్థం.

**13. సారాలంకారం**

**మ. చెలియా! కృష్ణుఁడు నన్నుఁ బాసి వనముం జేరంగ నయ్యా క్షణం**
**బులు నా కన్నియు నుండ నుండఁగఁ దగన్ బూర్ణంబులై సాఁగి లో**
**పలఁ దోఁచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై**
**నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై. (10-1-1131)**

ఇక్కడ శ్రీకృష్ణుని విరహాన్ని పొందిన గోపికకు ఆ క్షణాలు యామాలు, దినాలు, పక్షాలు, సంవత్సరాలు, యుగాలు, మహాకల్పాలు అయినాయని పూర్వపూర్వ వస్తువులకంటె ఉత్తరోత్తర వస్తువుల్ని గడ్డుకాలాలుగా వర్ణించడంచేత సారాలంకారం.

**14. వ్యాజస్తుతి**

**సీ. గురుదేవ శూన్యుండు కులగోత్ర రహితుండు**
**దలిదంఢ్రు లెవ్వరో తడవఁ గానము... (10-2-790)**

**క. జారుఁడు జన్మావధియును, జోరుఁడు ముప్పోకలాఁడు సుమహితపూజా**
**చారక్రియలకు నర్హుఁడె, వారక యితఁ డనుచు నశుభవాక్యస్ఫూర్తిన్. (10-2-791)**

ఇది రాజసూయయాగ సమయంలో శిశుపాలుడు శ్రీకృష్ణుని నిందించిన విధం. స్తుతిచే నిందగాని, నిందచే స్తుతిగాని వస్తే వ్యాజస్తుతి. ఇక్కడ శిశుపాలుని నిందావాక్యాలన్నీ శ్రీకృష్ణుని విషయంలో స్తుతిగా పరిణమించాయి. అందువల్లనే శిశుపాలుని దివ్యతేజస్సు శ్రీకృష్ణునిలో లీనమైంది.

## ఛందోయోజనం-విశేషవృత్తాలు

**1. ఇంద్రవజ్ర : (త-త-జ-గగ-8)**
**గోపాల కృష్ణుండును - గోపకాంతల్. (10-1-1110)**

'ఇత్తా జగాలై తగు - నింద్రవజ్రన్' -చిత్రకవిపెద్దన లక్షణసార సంగ్రహం.

ఇంద్రవజ్రం పద్యంలోని ప్రతిపాదంలో - త-త-జ-గగ'- గణాలుంటాయి. 8వ యక్షరం యతి స్థానం. దీనిని సంస్కృత కవులు ఎక్కువగా వాడారు. ఇది గానానికి అనుకూలమైన ఛందస్సు.

**2. ఉత్సాహం : (7సూ.1గ. 5వగణం మొదటి అక్షరం యతి)**
**భానువిందుఁ డుద్ధతిన్ వి-పక్షపక్షసైన్యదు (ర్మా) (10-2-860)**
**చారుదేష్ణుఁ డాగ్రహించి శత్రుభీషణోగ్ర దో (స్సా) (10-2-861)**

ఉత్సహపద్యంలో ప్రతిపాదంలో 7 సూర్యగణాలు 1 గురువు ఉంటుంది. నగణం (III) హగణము (U I) సూర్యగణాలు. 5వ గణం మొదటి అక్షరం యతిస్థానం.

ఈ రెండు పద్యాలు సాల్వునికి-యాదవులకు జరిగిన యుద్ధఘట్టంలోనివి. యోధుల ఉత్సాహాన్ని వెల్లడించడానికై ఉత్సాహం వాడటం వృత్తౌచిత్యం.

**2. ఉపేంద్రవజ్ర : (జ-త-జ-గగ-8)**

**తపస్వివాక్యంబులు దప్ప వయ్యెన్ (10-1-407)**

కృతిన్ జతజ్గల్ గము - పేంద్ర వజ్రన్ - (లక్షణసార సంగ్రహం)

ఇది నలకూబర-మణిగ్రీవులు శ్రీకృష్ణుని స్తుతించిన పద్యం. ఉపేంద్రుని, ఉపేంద్ర వజ్రతో స్తోత్రం చేయడం వృత్తౌచిత్యం ఈ పద్యానికి వెంటనే **'నీ పద్యావళు లాలకించు చెవులున్ (10-1-408)** అనే పద్యం వచ్చింది.

**4. కవిరాజ విరాజితం : (న-జ-జ-జ-జ-జ-జ-వ-14)**

**చరణములం గనక స్ఫుటినూపుర-జాలము గల్లనుచుం జెలఁగన్ (10-2-488)**

**చని బలభద్రుని శౌర్య సముద్రుని సంచితపుణ్యు నగణ్యునిఁ జం (10-2-489)**

**రతిరసషద్యతి – రానము షడ్జ్వలు-రాఁ గవిరాజవిరాజితమౌ** (లక్షణసార సంగ్రహం)

కవిరాజ విరాజితంలో బ్రతిపాదంలో 'న-జ-జ-జ-జ-జ-జ-వ' గణాలుంటాయి. 14వ యక్షరం యతిస్థానం.

**5. తరలం : (న-భ-ర-స-జ-జ-గ-యతి 12)**

**నలినలోచన! నీవు నిక్కము నాకుఁ బుట్టెద వంచు నీ (10-1-130)**

భవయతిం దరళం బెసంగు న – భంబులున్ రసజాగముల్ (లక్షణసార సంగ్రహం)

**6. దండకం : (తగణాలు+1గ)**

**శ్రీమానినీమానచోరా! శుభాకార!.... (10-1-1233)**

రెండు నగణాలపై ఇష్టమొచ్చినన్ని రగణాలు వాడటం లేదా ఇష్టమొచ్చినన్ని తగణాలపై ఒక గురువు నిలపడం దండక లక్షణం

ఇది తగణ దండకం. సి.పి.బ్రౌన్ పండితుడు ఛందోగ్రంథంలో దీనినే ఉదాహరించాడు. (The Prosody of the Telugu, పుట.47 )

**7. పంచచామరం : (జ-ర-జ-ర-జ-గ-యతి 10వ అక్షరం)**

**ప్రసూనపింఛమాలికా ప్రభావిచిత్రితాంగుఁడున్ (10-1-585)**

లగాష్టకాత్మభూయతుల్ చె-లంగుఁ బంచచామరన్. (లక్షణసారసంగ్రహం) పంచచామరలో ప్రతిపాదంలోను 'జ-ర-జ-ర-జ-గ' అనే గణాలుంటాయి. 10వ యక్షరం యతిస్థానం.'జటాకటాహ సంభ్రమ భ్రమన్నిలింప నిర్ఝరీ' -అను దశకంఠరావణ స్తోత్రం ప్రసిద్ధమైందే.

**8. మత్తకోకిల : (ర-స-జ-జ-భ-ర-యతి 11)**

పోతన భాగవతంలో మత్తకోకిలలు ఎక్కువగా ఉన్నాయి.

**కంటిఁ గంటి భవాబ్ధి దాఁటఁగఁ-గంటి ముక్తినిధానమున్ (10-1-1152)**

మారుతీ! రసజాభరల్ తగు – మత్తకోకిల దిగ్యతిన్. (లక్షణసార సంగ్రహం)

మత్తకోకిలలో ప్రతిపాదంలో 'ర-స-జ-జ-భ-ర అనే గణాలుంటాయి. యతి 11వ అక్షరం.

**9. మహాస్రగ్ధర : (స-త-త-న-స-ర-ర-గ 9-16)**

**కనియెం దాలాంకుఁ దుద్య-త్కట చటుల నట-త్కాలదండాభ శూలున్ (10-2-940)**

కరిమౌనుల్ వళ్ మహాస్ర-గ్ధర సతతనసల్ - గల్గి రాగంబులుండున్ (లక్షణసార సంగ్రహం)

**10. మానిని : (భ-భ-భ-భ-భ-భ-భ-గ యతి 7-13-19)**

**కాంచనకుండల-కాంతులు గండయు-గంబునఁ గ్రేళ్లుఱు-కన్ జడపై (10-1-214)**

ఏడ్భగురుల్ రవి - నేని రసత్రయి - నేన్వడి మానిని - కిట్లిడనౌ (లక్షణసార సంగ్రహం)

మానినిలో ప్రతిపాదంలో 7 భగణాలు చివర ఒక గురువు ఉంటాయి.

**11. లయగ్రాహి : (భ-జ-స-న-భ-జ-స-న-భ-య. 9-17-25 ప్రాసయతులు)**

**కాల వెస దాఁచియును-గీలెడలఁ ద్రోచియును**

**దాలుములు దూలఁబెడ-కేల వడి వ్రేయన్ (10-2-739)**

ముందు భజసల్ నగణ- మిందు నిరు చోటులను

నొంద భయలందుపయిఁ జెందఁగ లయగ్రా.

లయగ్రాహిలో ప్రతితిపాదంలో 'భ-జ-స-న-భ-జ-స-న-భ-య' గణాలుంటాయి. 9-17-25 స్థానాలలో ప్రాసయతులుండాలి.

**12. లయవిభాతి : (న-స-న-న-స-న-న-స-న-న-స-గ)10-19-28 ప్రాసయతులు**

**బెడ గడరు పెన్గదలు - పొడిపొడిగఁ దాఁకఁ బెను-**

**పిడుగు లవనిం దొరఁగ - నుడుగణము రాలన్. (10-2-737)**

**మునుపు నసనత్రయము - కొన నసగ లుంచినను-**

**నెనయుచును గావ్యములఁ - జను లయవిభాతిన్. (లక్షణసార సంగ్రహం)**

లయవిభాతిలో ప్రతిపాదంలో 'న-స-న-న-స-న-న-స-న-న-స-గ' - గణాలుంటాయి. 10-19-28 స్థానాలలో ప్రాసయతి వాడాలి.

**13. సీసం**

సీసపద్యాలలో అన్నిచోట్ల యతులు వాడడం లేక అన్ని చోట్ల ప్రాస యతులు వాడడం నన్నయ్య నియమం. తరువాత కవులు దీనిని పాటించలేదు. పోతన పెక్కు సీసపద్యాలను యతులతోనే నడిపినాడు. తప్పనిసరి అయినచోట ప్రాసయతి వాడినాడు.

**సీ. భీమమై బహుతీవ్ర-ధామమై హతరిపు**
**స్తోమమై సుమహితో-ద్దామ మగుచుఁ (10-2-534)**

ఈ పాదంలో ప్రాసయతి మాత్రమే ఉంది.

**14.** స్రగ్ధర : **మ-ర-భ-న-య-య-య (యతి 8-15)**

**కూలున్ గుల్మంబు! లేనుం-గులు ధరఁ గెడయున్- గుప్పలై; నుగ్గునూచై(10-2-883)**

**క్ష్మాభృద్భూభృద్యతుల్గా - మరభన యయయల్ - మానగున్ స్రగ్ధరాఖ్యన్.** (లక్షణసార సంగ్రహం)

స్రగ్ధరలో ప్రతిపాదంలో 'మ-ర-భ-న-య-య-య' గణాలుంటాయి. 8-15 అక్షరాలు యతిస్థానాలు.

**15. పోతన ద్విప్రాసలు, త్రిప్రాసలు గల పద్యాలు చాలా వ్రాశాడు.**

**మ. కృతవర్మ క్షితినాయకుండు విశిఖశ్రేణిం బ్రమత్తార్యధి**
**శ్రితవర్మంబులఁ జించి మేనుల శతచ్ఛిద్రంబులం జేయ న**
**ద్భుతకర్మం బని సైనికుల్ వొగడ శత్రుల్ దూలుచో సంగర**
**క్షితి ధర్మంబుఁ దలంచి కాచె రథిక శ్రేష్ఠుండు భూమీశ్వరా ! (10-1-865)**

## వ్యాకరణ విశేషాలు

**ఆ. మాయతోడ మూర్తి మంతుఁడై-యొప్పారుఁ, గలఁడతండు నిఖిల గణములందు**
**భవతిధాతు వెట్లు భావార్థమై సర్వ, ధాతు గణమునందుఁ దనరు నట్లు. (10-1-591)**

'ఇక్శ్తిపౌ ధాతునిర్దేశే' అనే వార్తికం అనుసరించి 'భవతి - ధాతువు' ప్రయోగించబడింది. 'భూవాదయో ధాతవః' అనే సూత్రంతో క్రియావాచులైన 'భూ' మొదలగు వానికి ధాతువులు అని పేరు. పాణినీయధాతుపాఠంలో 1.భ్వాది 2.అదాది 3.జుహోత్యాది 4.దివాది 5.స్వాది 6.తుదాది 7.రుధాది 8.తనాది 9.క్ర్యాది 10.చురాదులని 10 గణములు సుమారు 2000 ధాతువులున్నాయి. ఈ ధాతువులలో కృ-భూ-అస్తి ధాతువులు ముఖ్యమైనవి. ఈ మూడింటిలోను భూధాతువు మరీ ముఖ్యమైనది. అందువల్లనే పాణినిమహర్షి భూ ధాతువుతో ధాతు పాఠాన్ని మొదలుపెట్టాడు. 'భూ' ధాతువునకు 'ఉండుట' అని అర్థం.

'సత్స్వపి బహుష్వర్థేషు మాంగలికత్వాత్, సుప్రసిద్ధత్వాత్, సర్వపదార్థవ్యాపిత్వాచ్చ సత్తాయా నిర్దేశః కృతః అని శ్రీవిద్యారణ్యస్వామి మాధవీయధాతు వృత్తిలో చెప్పాడు. మంగళప్రదమగుటచేత, సుప్రసిద్ధంకావడం చేత, సర్వపదార్థవ్యాపకత్వం కలది కావడం చేత, సత్తార్థం గల భూ ధాతువు ముందు నిర్దేశింపబడింది. నిత్యసత్తాగల పరబ్రహ్మం యొక్క స్మరణం చేత 'భూర్భువః సువః' అనే మహావ్యాహృతులలో మొదటిది కావడం చేత సర్వధాత్వర్థాలు ఇందులో ఇమిడి ఉండటంచేత భూధాతువు మంగళప్రదం. తెలుగులో ఉండే ధాతువులాగానే సంస్కృతంలో భూ ధాతువు సర్వక్రియాసామాన్య వచనం.

ఇది శుకుడు శ్రీకృష్ణ మాహాత్మ్యాన్ని చెప్పిన సందర్భంలోనిది. భూధాతువు సర్వధాతు గణాలలో వ్యాపించి ఉన్నట్లే, శ్రీ కృష్ణపరమాత్మ సర్వభూతగణాలలో వ్యాపించి ఉన్నాడని భావం. ఇది పోతనగారి స్వీయరచన. సంస్కృత భాగవతంలోనిది కాదు.

**2వ. పదప్రమాణంబు, జానుదఘ్నంబు, కటిద్వయసంబు, మధ్యమాత్రంబు, కుచంబులబంటి యని పలుకుచు (10-1-1099)**

ఇది గోపికా శ్రీకృష్ణజలక్రీడా వర్ణనం. 'ప్రమాణే ద్వయిసజ్‌దఘ్న మాత్రచ్' అనే పాణినీయ సూత్రంలోని ప్రత్యయాలన్నింటిని పోతన ఈ వాక్యంలో గుది గుచ్చాడు. తెలుగుపదమైన 'బంటి'ని వాడాడు. ఈ పోతన ప్రయోగాన్ని బట్టి కాబోలు, చిన్నయసూరి 'దఘ్నార్థంబున బంటి కొలఁదులగు' (బాల–తద్ధిత–27) అని సూత్రించినాడు.

**3వ. హస్తాహస్తి (10-1-1318), బాహాబాహి (10-1-1160); ముష్టాముష్టి (10-2-66) అని పోతన ప్రయోగించాడు.**

'హస్తేన హస్తేన ప్రహృత్యేదం యుద్ధమ్ ప్రవృత్తమ్' చేతులతో కొట్టుకొనుచు చేయు యుద్ధం – అనే అర్థంలో బహువ్రీహి సమాసంలో హస్తహస్తి ఏర్పడుతుంది. శ్రీ కృష్ణుడు కువలయాపీడం (ఏనుగు)తో యుద్ధం చేసే సందర్భంలో ఇది ప్రయోగింపబడింది. హస్త శబ్దానికి చేయి అని తొండం అని రెండు అర్థాలు ఉండడం చేత 'హస్తాహస్తి' శబ్దప్రయోగం చాలా రమణీయంగా ఉంది. బాహుశబ్దం ఉకారాంతం కావడం చేత 'బాహూబాహవి' అని అవుతుంది. బాహాశబ్దం ఆకారాంతం కూడా ఉండడం చేత బాహాబాహి అనునదీ సాధువే. ముష్టిశబ్దం ఇకారాంతం అగుటచేత 'ముష్టీముష్టి' అని అవుతుంది. 'ముష్టాముష్టి' శబ్దాన్ని ముగ్ధబోధ వ్యాకరణం సాధించింది.

**4వ. దేవర్షి పితృ ఋణంబులు (10-2-1125)**

పితృ+ఋణము – 'అకః సవర్ణే దీర్ఘః' అను సూత్రంచే పితౄణము అవుతుంది. 'ఋత్యకః' అనే సూత్రంచే పితృఋణము అనేది కూడా సాధువే.

పోతన భాగవతంలో వ్యాకరణ రహస్యప్రయోగాలు వందలకొద్ది ఉన్నాయి. మచ్చుకు కొన్ని చూపబడ్డాయి.

## ప్రయోగ విశేషాలు

**1.క. చూచెదరు గాని సభికులు (10-1-1351)**

ఇక్కడ 'సభ్యు'లనే అర్థంలో 'సభికు' లని ప్రయోగింపబడింది. **'సభ్యాః సామాజికాశ్చతే' 'సభికా ద్యూతకారకాః** 'అమరకోశం అనుసరించి 'సభ్యుడంటే సభలో ఉండేవాడు, సభికుడంటే జూదమాడేవాడని అర్థం.

ఈ సభికుల్ కనుంగొనంగ నిట్లయితిన్? అని తిక్కన ప్రయోగం.

ఇక్కడ ద్యూతకారకుడనే అర్థం కూడ స్ఫురిస్తోంది. దూబగుంటనారాయణ కవి మొదలగు తెలుగుకవులు 'సభ్య - సభిక', శబ్దాలను పర్యాయపదాలుగా వాడినాడు.

**2.క. తియ్యవిలుకాఁడు డీకొని; ప్రయ్యలుగాఁ దూఱనేసె వనితల మనముల్**
**నియ్యాన నింక నయినం, గు య్యాలింపం గదయ్య గోవింద! హరీ! (10-1-1058)**

ఇట్టి ప్రయోగాలు తొమ్మిదవస్కంధంలో రెండున్నాయి.

**క. నియ్యాఁడు దేల పుట్టెను?, మియ్యంతటివారి కొండు మేరయుఁ గలదే? (9-12)**

**క. నియ్యల్లుఁడితఁడు భార్గవుఁ, డయ్యా! జారుండు గాఁడు హర్షము తోడన్ (9-66)**

నీ - మీలపైఁ పోతన త్రికకార్యం చేశాడు. కవిప్రయోగాలున్నాయి.

**శా. తియ్యంబోఁడి వరింపఁగా వసుంధరకేతేరన్ జూచు నాదిత్యులో**
**మియ్యూరుంగులగోత్రముల్ తెలియకే మీనాక్షి! (పాంచాలీ పరిణయము 3-27)**

అని కాకమాని మూర్తికవి పాంచాలీ పరిణయం (భాగవత పాఠపరిశోధనము.)

## శాస్త్రపరిచయం

### 1. వేదాంతం

**సీ. అనయంబు దేహి నిత్యానిత్య సద్విలక్షణమునఁ బంచకోశ వ్యవస్థ**
**నభివృద్ధిఁ బొరయుచు నందులోపల నున్న ప్రాణాన్నబుద్ధివిజ్ఞానమయము**
**లను చతుష్కోశంబు లవ్వల వెలుఁగొందు నానందమయుఁ దీవు గాన దేవ!**
**సురుచిర స్వప్రకాశుండవు నీ పరిగ్రహము గల్గుటం జేసి కాదె ప్రకృతి**

**తే. మహదహంకార పంచతన్మాత్ర గగన, పవన తేజోఽంబుభూ భూతపంచకాది**
**కలిత తత్త్వముల్ బ్రహ్మాండకార్య కరణ, మందు నెపుడు సమర్థంబు లగుటఁ జూడ. (10-2-1212)**

ఈ పద్యములో 1. అన్నమయ 2. ప్రాణమయ 3. మనోమయ 4. విజ్ఞానమయ 5.ఆనందమయాలనే పంచకోశాలు, మూలప్రకృతి, మహత్తు, అహంకారం, పంచతన్మాత్రలు, పంచభూతాలు వీని కార్యకారణ భావం చెప్పబడ్డాయి.

**వ. నిన్నుం బరమాణు కారణవాదులైన కణ్వ గౌతమాదులును, బ్రకృతికారణవాదు లయిన సాంఖ్యులును, దేహాత్మవాదులయిన బౌద్ధులును, వివిధంబులైన కుతర్కంబులచేతం బరస్పరావ్యాహతంబులైన మతంబులు దమ తమ కుతర్కవాదంబుల సమర్థించుచు నిన్నుం దెలియలేరు. (10-2-1220)**

కణాదమహర్షి వైశేషికదర్శనకర్త. గౌతమమహర్షి న్యాయదర్శనకర్త. వీరిద్దరూ జగత్తుకు పరమాణువులే కారణమని చెప్పేవారు. కపిలమహర్షి సాంఖ్యదర్శనకర్త. ఇతను ప్రకృతివల్ల జగత్తు ఏర్పడుతుందని చెప్పేవాడు.

భగవంతుడు జగత్ శరీరుడనీ, నిఖిలహేయప్రత్యనీక కల్యాణగుణాత్మకునికి, భగవంతునికి జీవునికి శేషి–శేష భావమని చెప్పేవారు విశిష్టాద్వైతులు.

**వ. సత్తైన ప్రకృతివలన నుత్పన్నంబైన యీ జగత్తు సత్తు గావలయు... (10–2–1230)**

ఈ వచనంలో సాంఖ్యమతం, అద్వైతమతం, విశిష్టాద్వైతమతం చెప్పబడ్డాయి. భాగవతంలోని శ్రుతి గీతాలలో (1062–1202 నుండి 10–2–1230) వేదాంతమంతా చెప్పబడింది.

**అశ్వశాస్త్రం**

**క. వాజుల నీరాజనములు, రాజుల జయగమనములును రాజిత లక్ష్మీ**
**పూజలు దేవోత్సవములు, రాజిల్లెను జగతియందు రాజకులేంద్రా! (10–1–766)**

ఇది శరత్కాల వర్ణన పోతన స్వీయపద్యం. శరత్కాలంలో రాజులు రథగజతురగాలకు నీరాజనమిచ్చి జైత్రయాత్రకు వెళ్లాలని ధర్మశాస్త్రం.

**శ్లో. భగవతి జలధరపో, క్షపాకరార్కేక్షణే కమలనాభౌ ।**
**ఉన్మీలయతి తురంగమ, కరిరథ నీరాజనాం కుర్యాత్ ॥**

విష్ణుమూర్తి కార్తిక శుద్ధఏకాదశి (ఉత్థానైక ద్వాదశి) నాడు నిద్రనుండి లేచి కన్నులు తెరచిన రోజున గుఱ్ఱాలకు, ఏనుగులకు, రథాలకు, నీరాజనం ఇవ్వవలనని వరాహమిహీరుడు చెప్పాడు.

**శ్లో. తస్మై సమ్యగ్ఘుతో వహ్ని, ర్వాజీనీ రాజనా విధౌ ।**
**ప్రదక్షిణార్చిర్వ్యాజేన హస్తేనైవ జయం దదౌ ॥ (రఘు–4–25)**

అని కాళిదాసు రఘువంశంలో వర్ణించాడు.

**గజశాస్త్రం**

**క. ఱోలను గట్టంబడియు న, బ్బాలుడు విలసిల్లె భక్త పరతంత్రుండై**
**యాలాన సన్నిబద్ధ వి, శాల మదేభేంద్రకలభ సమరుచి నధిపా ! (10–1–380)**

యశోదచే రోటికి కట్టబడిన శ్రీ కృష్ణుడు సంకెళ్ళతో కొయ్యకు కట్టబడిన గజకలభంవలె ఉన్నాడని భావం. అప్పటికి శ్రీకృష్ణుడు అయిదేండ్ల పిల్లవాడు. ఏనుగు గున్నకు 'కలభం' అని పేరు.

**శ్లో. కాష్ఠ త్వక్ తృణసేవన స్తనుచః పంకాంబు పాంసుప్రియః**
**స్వల్పం హృష్యతి కోపమేతిచ సుఖం దుఃఖం యతో బుధ్యతి ।**
**శబ్దా దీనపి వేత్తి యంత్రవశగో హ్యుత్థానవిత్ ప్రోల్లసత్**
**స్వచ్ఛా వగ్రహదంత ఏష కలభః ప్రాప్తః సమాం పంచమామ్ ॥ (గజ–5–58)**

అని పాలకాప్యమహాముని గజశాస్త్రం. ఇక్కడ శ్రీకృష్ణుణ్ణి కలభంతో పోల్చడం సంస్కృత భాగవతంలో లేదు. ఇది పోతన కల్పనే.

**కామ శాస్త్రం**

**ఉ. జాతియుఁ గాలముం గళయు సత్త్వము దేశము భావచేష్టలున్**
**ధాతువుఁ బ్రాయముం గుణముఁ దద్దశయున్ హృదయంబుఁ జూడ్కియుం**
**బ్రీతివిశేషముం దెలిపి పెక్కు విధంబులఁ దొయ్యలిన్ మనో**
**జాత సుఖంబులం దనిపె శౌరి వధూహృదయాపహారియై. (10-1-1493)**

ఇది శ్రీ కృష్ణుడు కుబ్జతో సంభోగించిన వర్ణన. ఈ పద్యమంతా వాత్స్యాయన కామశాస్త్రానికి లక్ష్యం.

**నాట్య శాస్త్రం**

పోతన వర్ణించిన రాసక్రీడాఘట్టమంతా నాట్యశాస్త్రానికి లక్ష్యమే.

**ఉ. ఆ సమయంబునన్ విభు దనంతుఁడు గృష్ణుఁడు చిత్రమూర్తియై**
**చేసెను మండలభ్రమణశీల పరస్పరబద్ధబాహు కాం**
**తా సువిలాసమున్ బహువిధ స్ఫురితానన హస్త పాద వి**
**న్యాసము రాసముం గృతవియచ్చరనేత్ర మనో వికాసమున్. (10-1-1082)**

**వ. ఇట్లు బహుగతులం దిరుగ నేర్పరి యగు హరి...గీతానుసారంబగు విచిత్ర పాదసంచారంబులు సలుపుచు, వర్తులాకార రాసబంధంబుల వర్తనంబునం బ్రవర్తించి, వెండియు వ్రేతలుం దానేరు శంఖ పద్మ వజ్ర కందుక చతుర్ముఖ చక్రవాళ చతుర్భద్ర సౌభద్ర నాగ నంద్యావర్త కుండలీకరణ ఖరరీబంధ ప్రముఖంబు లయిన.... (1061-1083)**

ఈ పెద్ద వచనములో 1. రాసబంధాలు 2.తానకలు 3.పాదాలు 4.పార్థివచారులు 5.వ్యోమచారులు 6. హస్తభేదాలు 7.జానుభేదాలు 8.దైవమండలాలు 9. భ్రమణాలు 10.కరణలు 11.దృష్టులు 12. శిరోభేదాలు 13.అంగహారాలు చెప్పబడ్డాయి. వీని లక్షణాలు నందికేశ్వరుని 'అభినయదర్పణం' (భరతార్ణవం), భరతముని నాట్యశాస్త్రము, జాయపసేనాని నృత్తరత్నావళి, పాలపర్తి వారి భాగతటీక మొదలైన గ్రంథాల్లో ఉన్నాయి.

**సంగీత శాస్త్రం**

**వ. ప్రమద యొకర్తు మాధవుండు పాద విపంచి ధరించి కేల సం**
**భ్రమమునఁ దంత్రి మీటుచుఁ దిరంబుగ ఠాయము సేసి యొక్క రా**
**గము దగ నాలపించి సుభగస్వరజాతులు వేఱు వేఱు కా**
**నమరంగఁ బాడెఁ దన్ రమణుఁ డౌనను దారువు లంకురింపఁగన్. (10-1-1092)**

ఈ పద్యంలో ఠాయం చేయటం, రాగం ఆలపించటం, స్వరజాతులు విడగొట్టటం సంగీత శాస్త్రంలో ప్రసిద్ధాలు. సంగీతానికి ఎండిన కొమ్మలు చిగురించడం కవి సమయం.కాని, కృష్ణావతారంలో శ్రీకృష్ణుని వేణుగానానికి పొయ్యిలో కాలుతున్న వంటకట్టెలు పచ్చికట్టెలై చిగురించడం ప్రారంభించగా వంట జరగడంలేదని ఒక గోపిక, కృష్ణునితో తాను వంట చేస్తున్నపుడు పిల్లనగ్రోవి మ్రోయించకయ్యా! అని ప్రాధేయపడిన దివ్యఘట్టం భాగవతంలో ఉంది.

**వ. కొలఁదికి మీఱఁగా డమరు గోముఖ డిండిమ మడ్డు శంఖ కా**
**హళ మురళీ మృదంగ పణ వానక దుందుభిఢక్క కాంస్య మ**
**ర్దళ మురజారజాది వివిధధ్వను లేపున భూనభోంతరం**
**బులఁ జెలఁగెన్ నటీనటనముల్ దనరారె మనోహరాకృతిన్. (10–2–1100)**

ఈ పద్యంలో సంగీతవాద్యాలు చెప్పబడ్డాయి.

శకున శాస్త్రం

**వ. ఇట్లు హరిరాక కెదురు సూచుచు సకల ప్రయోజనంబులందును విరక్తయై మనోజానలంబునం బొగిలెడి మగువకు శుభంబుఁ జెప్పు చందంబున వామలోచనభుజంబు లదరె (10–1–1735)**

ఈ వచనం రుక్మిణీ కల్యాణం లోనిది. శ్రీకృష్ణుని రాక కెదురు చూచుచున్న రుక్మిణీ దేవికి ఎడమ తొడ, కన్నులు, భుజములు అదిరినవని భావం.

**శ్లో. నాసికాయాం సుగంధాప్తి, ర్దక్షాక్ష్యాదౌ సుదర్శనమ్ ।**
**మధ్యోపరి సుఖావాప్తి, ర్నేత్రాంతే దుఃఖసంక్షయః ॥**
**భుజయో ర్దక్షిణస్పందే పుత్రాలింగన శోభనమ్ ।**
**జంఘోరుస్పందనే డోలావాహన చ్ఛత్రసంపద ॥**
**దక్షిణాంగేషు యత్పుంసాం ఫలం తావత్ ప్రకీర్తితమ్ ।**
**వామాంగస్పందనే స్త్రీణాం తత్ఫలం ప్రవదేత్ సుధీః ॥**
**(శివతత్త్వ రత్నాకరం, 5కల్లో–8తరం–72... 86శ్లో)**

ఎడమ కన్ను అదరడం వలన మంచివారి దర్శనం, భుజం అదరడం వల్ల పుత్రాలింగనం, తొడ అదరడం వల్ల పల్లకీ ఎక్కడం మొదలైన సంపదలు కలుగుతాయి. కుడిప్రక్క మగవారికి, ఎడమప్రక్క ఆడవారికి అవయవాలు అదరడం మంచిఫలమని కేళాది బసవభూపాలుని శివతత్త్వరత్నాకరం చెబుతుంది.

ఈ వర్ణన వల్ల అగ్నిద్యోతనుని దర్శనం, శ్రీకృష్ణుడు రావడం, కల్యాణం, ప్రద్యుమ్నుడు పుట్టడం, పట్టపురాణియై డోలావాహనచ్ఛత్రాదిసంపద రుక్మిణీదేవకి కలుగుతాయని సూచింపబడినాయి.

కావ్యంలో సకల శాస్త్రాలను పరిచయం చేయడం కవిసామ్రాజ్యవ్యంజనం అని క్షేమేంద్రుడు కవికంఠాభరణంలో చెప్పాడు. పోతన సకలశాస్త్రకోవిదుడు అవటం చేత భాగవతంలో అన్ని శాస్త్రరహస్యాలను వెల్లడించి మహాకవి అయినాడు.

**పూర్వకవుల అనుకరణాలు**

**1. భగవద్గీత – పోతన**

**శ్లో. పత్రం పుష్పం ఫలం తోయం, యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః ॥**

ఈ గీతాశ్లోకమే భాగవతంలో యథాతథంగా ఉంది. (10–2–81–4)

**క. దళమైనఁ బుష్పమైనను, ఫలమైనను సలిలమైనఁ బాయని భక్తిం**
**గొలిచిన జను లర్పించిన, నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్. (10–2–1010)**

**చాణక్యుడు – పోతన**

**శ్లో. లాలనా ద్బహవో దోషా స్తాడనా ద్బహవోగుణాః**
**తస్మా త్పుత్రంచ శిష్యంచ తాడయే న్నతు లాలయేత్ ॥ (నీతిదర్పణ 2–12)**

**క. లాలనమున బహుదోషము, లోలిం బ్రాపించుఁ దాడనోపాయములం**
**జాల గుణంబులు గలుగును, బాలురకును దాడనంబ పథ్యం బరయన్. (10–1–366)**

**3. లీలాశుకుడు – పోతన**

**శ్లో. కాళిందీపులినోదరేషు ముసలీ యావద్గతః ఖేలితుం**
**తావత్ కార్పరికం పయః పిబ హరే! వర్ధిష్యతే తే శిఖా ।**
**ఇత్థం బాలతయా ప్రతారణపరాః శ్రుత్వా యశోదాగిరః**
**పాయాన్నః స్వశిఖాం స్పృశన్ ప్రముదితః క్షీరేఽర్ధపీతే హరిః ॥ (శ్రీకృష్ణకర్ణామృతం.2–61)**

**క. 'చుంచెదుగుఁ బాలు ద్రావు ము, దంచితముగ' ననుదు బాలుద్రావి జననితోఁ**
**జుం చెదుగ దంచు లీలా, చుంచుం డై యతఁడు చుంచుఁ జూపు నరేంద్రా! (10–1–419)**

**నన్నయ – పోతన**

**క. వీరెవ్వరయ్య! ద్రుపదమ, హారాజులె? యిట్లు కృపణులయి పట్టుపడన్**
**వీరికి వలెసెనె? యహహా! మ, హారాజ్యమదాంధకార మది వాసెనొకో? (ఆది.6–90)**

**క. వీ రెవ్వరు? శ్రీకృష్ణులు, గారా? యెన్నఁడును వెన్నఁ గానరఁట కదా**
**చోరత్వం బించుకయును, నేర రఁట! ధరిత్రి నిట్టి నియతులు గలరే, (10–1–374)**

సీ. సహకార! మత్ప్రియసహకారుఁ బున్నాగ!
పున్నాగుఁ దిలక! భూభువనతిలకు. (అరణ్య.2–95)

సీ. పున్నాగ! కానవే పున్నాగవందితుఁ
దిలకంబ! కానవే తిలకనిటలు. (10–1–1008)

తిక్కన – పోతన

క. విచ్చెం దిమిరము కాఁపులు, వచ్చె మధుపకులము లబ్జవనముల కురులం
జొచ్చె విరులు తరులతికల, నిచ్చె రథాంగములు వంత యెల్లఁ దొగలకున్ (విరాట.2–237)

క. వచ్చెం జల్లనిగాడ్పులు, విచ్చెం గమలములు తమము విరిసి బిలంబుల్
సొచ్చెం బద్మమరందము, మెచ్చెం దుమ్మెదలు గ్రోలి మిహిరుఁడు వొడమన్ (10–1–1304)

సీ. ప్రాణంబుతోఁ గూడ రక్కసిచన్నుల
పాలు ద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె (ఉద్యో.3–175)

సీ. వీఁడటే రక్కసి విగతజీవఁగఁ జన్నుఁ
బాలు ద్రావిన మేటిబాలకుండు. (10–1–1249)

రంగనాథుడు – పోతన

ద్విపద. ఘనమైన పరుషరాక్షసభాషణములు
సనకాదియోగీంద్ర సన్నుతుల్ గావు
ఉరవడిఁ బఱతెంచు నుగ్రదానవులు
పరిచారికామరప్రతతులు గావు. (రంగనాథ యుద్ధ)

సీ. సమదపుష్పంధయఝుంకారములు గావు
భీషణకుంభీంద్ర బృంహితములు
వాయునిర్గతపద్మవనరేణువులు గావు
తురగరింఖాముఖోద్ధూతరజము (10–2–153)

ఎఱ్ఱన – పోతన

చ. గొడుగుగఁ జేసె గోవులకు గోపకుమారులకున్ నగంబు ని
ట్టొడఁబడవచ్చుఁ బొమ్మనఁగ నొప్పెడు వ్రేళులు పంజుమాడ్కినై
యదరిన మీఁది మేఘతతి యావృతియై శిఖరంబు గుబ్బయై
కడు బెడఁగొందె హస్తమను కామ దిరంబుగఁ దాల్చి పొల్చుటన్ (హరి.పూర్వ.1–178)

మ. హరి దోర్దండము కామ గుబ్బ శిఖరం బాలంబిముక్తావళుల్
పరఁగన్ జాఱెడు తోయబిందువులు గోపాలాంగనాపాంగహా
సరుచుల్ రత్నచయంబుగాఁగ నచలచ్ఛత్రంబు శోభిల్లెఁ ద
ద్గిరిభిద్దుర్మదభంజియై జలధరాక్లిన్నప్రభారంజియై. **(10–1–922)**

నాచన సోమన – పోతన

మ. అరిఁ జూచున్ హరిఁ జూచుఁ జూచుకములం దందంద మందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు లందంబులై
తొరుగం బయ్యెదకొం గొకింత తొలఁగన్ దోర్ద్రో శరాసారమున్
దరహాసామృతపూరమున్ గురియుచున్ దన్వంగి కేళీగతిన్. **(ఉత్తర హరివంశం.1–162)**

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారమున్
జరఁగన్ గన్నులఁ గెంపుసొంపుఁ బరఁగన్ జండాస్త్రసందోహమున్
సరసాలోకసమూహమున్ నెఱపుచున్ జంద్రాస్యహేలాగతిన్ **(10 స్క.2–178)**

సీ. తంత్రీవినోదంబు తడవు సైఁపని వ్రేళ్ళ, గొనయంబు తెగలపైఁ గోరుకొనుట
యద్ధంబు పిడిముట్ట నలయు పాణితలంబు లస్తకం బిఱియించు లావు కలిమి
చెలికత్తె నొత్తిలి చీరలేని యెలుంగు, సింహనాదంబుచేఁ జెదరకునికి
ప్రమదనర్తనకేళిఁ బరిఢవింపని పదం, బైదుతాణంబుల నలఁతఁ బడమి

తే.గీ. సోయగపుఁ జిత్రరూపంబుఁ జూచుచోట, వేసరు విలోచనంబులు వికృతదైత్య
లక్ష్య మీక్షించుటయు మొక్కలంపు గెలుపుఁ గైకొనియె సత్యభామ సంగ్రామసీమ. **(ఉత్త.హ.1–161)**

సీ. వీణెఁ జక్కఁగఁ బట్టు వెరవెఱుంగని కొమ్మ, బాణాసనం బెట్లు పట్టనేర్చె
బ్రాఁకునఁ దీఁగెఁ గూర్పంగ నేరని లేమ, గుణము నేక్రియ ధనుఃకోటిఁ గూర్చె
సరవి ముత్యముఁ గ్రువ్వఁ జాలని యబల యే, నిపుణత సంధించె నిశితశరముఁ
జిలుకకుఁ బద్యంబు సెప్పనేరని తన్వి, యస్త్రమంత్రము లెన్నఁ దభ్యసించెఁ

ఆ.వె. బలుకుమనినఁ బెక్కు పలుకని ముగుద యే, గతి నొనర్చె సింహగర్జనములు
ననఁగ మెఱసెఁ ద్రిగజదభిరామగుణధామ, చారుసత్యభామ సత్యభామ. **(10–2–181)**

స్వీయానుకరణములు

పోతన తన పద్యములను తానే యనుకరించుచుండును.

సీ. జలధరదేహు నాజానుచతుర్బాహు
సరసీరుహాక్షు విశాలవక్షు. **(10-1-112)**

సీ. కమనీయ శుభగాత్రుఁ గంజాత దళనేత్రు
వసుధాకళత్రుఁ బావన చరిత్రు. **(10-2-358)**

సీ. కనియె శుభోపేతుఁ గంధర్వ సంజాతు
మానితదేహు నాజానుబాహు **(10-2-380)**

సీ. నవపద్మలోచను భవబంధమోచను
భరితశుభాకారు దురితదూరు **(10-2-747)**

సీ. ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ
గరుణాలవాలు భాసురకపోలు. **(10-2-979)**

సీ. సజలనీలాంబుదశ్యామాయమానాంగు
నాశ్రితావనముదితాంతరంగు. **(10-2-1311)**

ఈ క్రింది రెండు పద్యాలు పోతన స్వీయానుకరణాలకు సుప్రసిద్ధోదాహరణాలు -

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులన్
విల్లును దాల్చువాఁడు గడు విప్పగు వక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁ డీవుత మా కభీష్టముల్. **(9-361)**

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబుల వాఁడు కృపారసంబు పైఁ
జల్లెడివాఁడు మౌళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వు రా
జిల్లెడు మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో
మల్లియలార! మీ పొదలమాటున లేఁడు గదమ్మ చెప్పరే? **1010**

## పోతనను అనుకరించిన కవులు

పోతన - మొల్ల

సీ. నీల జీమూత సన్నిభ శరీరమువాఁడు
తామరసాభనేత్రములవాఁడు (భాగ. **10-1-1585)**

సీ. నీలమేఘచ్ఛాయఁ బోలుదేహమువాఁడు
ధవళాబ్జపత్రనేత్రములవాఁడు (మొల్ల.సుందర. **102)**

**సీ. పొలఁతుల వాలు చూపులయంద చాంచల్య**
**మబలల నడుముల యందు లేమి. (భాగ.9స్కం.335)**

**సీ. కుటిలతనదులందుఁ గుంతలంబులయందు**
**బొంకు జూదములందు బూతులందు. (మొల్ల.యుద్ధ.3-135)**

**పోతన - నందిమల్లయ, ఘంటసింగయ**

**క. చెందిరి బలమాధువులభి, నందించుచుఁ బరమపావనము నంచితకా**
**ళిందీసంజీవనమున్, బృందావనమున్ మునీంద్ర బృందావనమున్ (10-1-428)**

**క. ముందటనవలోకించె ము, కుందసమీపాభిసారి గోపప్రమదా**
**నందకర కుంజములు గల, బృందావనమున్ మునీంద్ర బృందావనమున్ (వరాహ.7-64)**

**పోతన - విశ్వనాథ నాయకుని స్థానాపతి**

**వ. 'విద్యానగరమందు వీరనరసింహరాయలువారు బ్రాహ్మీముహూర్తాన లేచి ఆరాధ్యనామావళున్ను అధ్యాత్మ సంకీర్తనలున్ను, పాండవగీతలు, భ్రమరగీతలు, గజేంద్రమోక్షం, భారతసావిత్రి, దధివామనస్తోత్రము, గంగాతరణమున్ను నదీస్తోత్రమున్ను, భారతం, భాగవతం, రామాయణం, ముచుకుందస్తుతి, అక్రూరస్తుతి, భీష్మస్తుతి, సంజయుని నీతి, విదురనీతి, చాణక్యనీతి, పద్యనీతి మొదలైనవన్ని నీతి, వైరాగ్యశతకం, పురాణశ్రవణమున్ను రాజనీతులన్నియు విని' (రాయ వాచకము.పుట.2) అని కలదు.**

దీన్నిబట్టి శ్రీకృష్ణదేవరాయలకు అన్న అయిన వీరనరసింహరాయలు వినే గ్రంథాలలో ఆంధ్రభాగవతం కూడ ఉండేదని కూడ ఉహించవచ్చు. దీనికి తోడు రాయవాచకంలో శ్రీకృష్ణదేవరాయలు వినే నీతిపద్యంగా

**చ. మలఁకలు మా ప్రచారములు, మా ముఖముల్ విషవహ్ని ఘోరముల్,**
**ఖలులము, రోషజాతులము, గర్వుల, మే మొక మంచివారమే?**
**నళినదళాక్ష! ప్రాణులకు నైజ గుణంబులు మాన నేర్చునే?**
**వెలయవె? మా వికారములు వింతలె? మే లొనరించి తీశ్వరా!**
**వెలయఁగ మా వికారములు వేయును నెంచఁగ నేల? భూవరా!**

**(భాగ.10స్క.1-693, రాయ.76 పుట)**

అనే పోతనభాగవతపద్యాన్ని స్థానాపతి ఉదాహరించాడు. వీరనరసింహరాయల రాజ్యకాలం 1503-1509. వీరనరసింహరాయలు, శ్రీకృష్ణదేవరాయలు 1470-1475 ప్రాంతంలో జన్మించినవారు. కాబట్టి 1475 నాటికే భాగవతము బాగా ప్రచారంలో ఉందని తెలుస్తుంది.

**పోతన - కంకంటి పాపరాజు**

**మ. అలకభ్రాజితమై సుధాంశునిభమై హాసప్రభోద్దామమై**
**జలజాక్షంబయి కర్ణకుండల విరాజద్గండమై యున్న యా**

జలజాతాక్షు ముఖంబు సూడఁ గలుగున్ సత్యంబు వో నాకు నా
వల దిక్కేఁగుచు నున్న నీ వనమృగ వ్రాతంబు లీత్రోవలన్. **(10-1-1192)**

ఆకర్ణాయతనేత్రమై మణిమయోద్యత్కుండలద్వంద్వ శో
భాకీర్ణాంచితగల్లమై సురదనంబై సుందరభ్రూయుతం
బైకమ్రస్మిత చంద్రికా విలసితంబై యొప్పు శ్రీరాముమో
మీకాయంబునఁ జూచుభాగ్య మిఁకలేదేమో? సుమిత్రాత్మజా! (ఉత్తరరామా.**6-287**)

పోతన – కూచిమంచి తిమ్మకవి

క. జో జో! కమలదళేక్షణ! (భాగ.**10-1-189**)

క. జో జో! ముద్దుల గుమ్మా!
జో జో! కపురంపుదిమ్మ! జో జో! కొమ్మా!
జో జో! బంగరు బొమ్మా!
జో జో! వెలలేని సొమ్మ! జో జో! యనుచున్. (రుక్మిణీపరిణయం.**1-78**)

పోతన – తిరుపతివేంకటకవులు

చ. 'అదె చనుచున్నవాఁడు ప్రియుఁ డల్లదె తేరదె వైజయంతి య
ల్లదె రథ ఘోటకాంఘ్రిరజ మాదెస మార్గము చూడుఁ డంచు లో
నొదవెడి మక్కువన్ హరిరథోన్ముఖలై గములై వ్రజాంగనల్
గదలక నిల్చిచూచి రటు గన్నుల కబ్బిన యంత దూరమున్. **(10-1-1222)**

మ. అదిగో ద్వారక! యాలమందలవిగోనందందె కోరాడు న
ల్లదియే కోట! యదేయగడ్త! యవేరథ్యల్! వారలే యాదవుల్
యదుసింహుండు వసించుమేడ యదిగో.... (పాండవోద్యోగము)

పోతన – విశ్వనాథ

క. జో జో! కమలదళేక్షణ!, జో జో! మృగరాజమధ్య! జో జో! కృష్ణా!
శ్రీజేతృదిలీపాన్వయ, భూజానిలతాగ్రభాసిపూవా! జోజో!

(రామయణ కల్పవృక్షం.బాలకాండ.అవ.**295**)

సంస్కృతభాషాపద్యం

పోతన ఈ స్కంధంలోగూడ ఒక సంస్కృతపద్యం రచించాడు.

ఉ. ధీయుతుఁడై 'నమో భగవతే హరయే పరమాత్మనే ముకుం
దాయ సమస్తభక్తవరదాయ నమః పురుషోత్తమాయ కృ
ష్ణాయ మునీంద్రవంద్యచరణాయ సురారిహరాయ సాంఖ్యయో
గాయ వినీలభాస్వదలకాయ రథాంగధరాయ వేధసే.' **(10–1–1145)**

పోతన – సంస్కృతకవులు

పోతన – వేంకటాధ్వరి

మ. సిరికిం జెప్పఁడు; శంఖచక్ర యుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం పన్నింపఁ డాకర్ణికాం
తర ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై. **(8స్క.96)**

శ్లో. లీలాలోలతమాం రమా మగణయన్ నీలామనాలోకయన్
ముంచన్ కించమహీమహీశ్వరమయం మంచం హఠాద్వంచయన్ ।
ఆకర్షన్ ద్విజరాజ మప్యతి జవాద్ధాహంత! లోకాంతరాత్
శౌరి ర్గోప్తు ముదిత్వరత్వర ఉదైద్గ్రాహగ్రహార్తంగజమ్ ॥ **(విశ్వగుణాదర్శమ్.18)**

ఉ. శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు రాక్షసేంద్రతా
శేషవిభూతిఁ గల్పసమజీవివి గమ్మని నిల్పె నర్థి సం
తోషణుఁ బాపశోషణు నదూషణు శశ్వదరోషణున్ మితా
భాషణు నార్యపోషణుఁ గృపాగుణభూషణు న వ్విభీషణున్. **(9స్కం.314)**

శ్లో. కృతత్రిదశపోషణం కృశరథాంగ సంతోషణం
పిశాచకులభీషణం పృథుతమశ్చటాపేషణమ్ ।
వినమ్రగదశోషణం విహితవారిజోన్మేషణం
నమస్కురుత! పూషణం నను నభఃస్థలీభూషణమ్ ॥ **(విశ్వగుణాదర్శమ్.12)**

పోతన – ఎక్కిరాల శేషాచార్యులు

క. సుందర సాయంసంధ్యా, వందన విప్రార్ఘ్య తోయవజ్ర హతోద్య
న్మందేహాసురరక్త, స్యందముక్రియఁగెంపు సొంపెసఁగెనపరదిశన్ **(10–1–1290)**

శ్లో. సంధ్యావందనసక్త విప్రజనతాహస్తార్ఘ్యతోయాశని
ఛ్ఛిన్నానాం రవిరోధినాం ప్రతికలం మందేహ మర్త్యాశినామ్ ।

**కాయాహార్య వినిస్సృతాస్రతటినీ స్యందోయథాపాశినః**
**కాష్ఠాయామవలోక్యతే కిసలయప్రస్పర్ధి రాగోజనైః ॥ (మదనవిజయ.151)**

**సీ. పల్లవవైభవాస్పదములు పదములు**
**కనకరంభాతిరస్కారులూరు(ల) (10-1-1711)**

**శ్లో. రాకాచంద్ర సఖం ముఖం కరికరై స్సంస్పర్ధినీ సక్థినీ**
**భావా భావవివేక మధ్యమగతం మధ్యంగళో మంగళమ్ ।**
**దృష్టిర్మన్మథ బాణవృష్టి రరుణ చ్ఛాయాకరేత్వత్కరౌ**
**వేశీ నిర్జిత శక్రనీలయమునా వేణీపదే శ్రీప్రదే ॥ (మదనవిజయ.56)**

శ్రీసన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు పోతన భాగవతంలోని 1. ప్రహ్లాదచరిత్ర 2.గజేంద్రమోక్షం 3.వామనావతారం మొదలైన 7 ఘట్టాలను సంస్కృతంలోకి అనువదించారు.

**భాగవతం – ప్రబంధలక్షణాలు**

**మహాకావ్యంబునుంబోలె సరల మృదులతాకలితంబై (1-39)**

**సర్గబంధకావ్యంబు ఎన్ననువున గంభీరమధురంబై (9-230)**

**సమర్థకవి విలసనంబునుంబోలె బహుప్రబంధభాసురంబై (10-1-1082)**

ఇవి పోతనగారి స్వీయకావ్యలక్షణాలు. సరలత, మృదులత, గాంభీర్యం, మాధుర్యం భాగవతంలో ప్రతిపద్యంలోను కనబడతాయి. గజేంద్రమోక్షం, రుక్మిణీకల్యాణం మొదలైన ఉపాఖ్యానాలు ప్రబంధశైలిలో నడిచాయి. వర్ణన ప్రధానమైనది ప్రబంధం. 1.గ్రీష్మఋతువు 2.వర్షఋతువు 3.శరదృతువు 4.హేమంతఋతువు 5.జలక్రీడ 6.సూర్యాస్తమయం 7.చంద్రోదయం 8.సూర్యోదయం 9.యుద్ధాలు 10.కల్యాణం 11. ద్వారకాపట్టణం 12. తీర్థయాత్ర మొదలైన వర్ణనలు ఎక్కువగా ఈ స్కంధంలోనే ఉన్నాయి.

## పోతన పేర్కొన్న గ్రంథాలు

**1. పురుషసూక్తమ్**

**2. విశ్వప్రకాశమ్ (10-1-765)**

**శబ్దశాస్త్ర వేది హృదయంబు చాగున విశ్వప్రకాశాభిరామంబై (10-1-765)**

విశ్వాన్ని ప్రకాశింపచేస్తు అందంగా ఉన్నదని శరత్కాల పరమైనఅర్థం. విశ్వ ప్రకాశమనే నిఘంటువుతో అభిరామమైనది శబ్దశాస్త్రజ్ఞుని హృదయమని రెండవ అర్థం. విశ్వప్రకాశం (విశ్వకోశం) మహేశ్వర పండితుడు రచించిన సంస్కృత నిఘంటువు.

**3. కామతంత్ర టీక**

**ఆ.వె. కామతంత్ర టీక కలువల జోక కం, దర్పుడాక నెటుల తాల్మిపోక**
**చకిత చక్రవాక సంప్రీత జనలోక, రాకవచ్చె మేలు రాకయగుచు. (10-1-964)**

ఇది శరత్కాలంలోని పున్నమి వర్ణన. ఇక్కడ పోతన పేర్కొన్న కామతంత్రటీక వాత్స్యాయన కామసూత్రాలకు జయమంగళవ్యాఖ్య అయి ఉంటుంది.

**సుభాషితాలు**

**క. కావునఁ బరులకు హింసలు, గావింపఁగ వలదు తనకుఁ గల్యాణముగా**
**భావించి పరుల నొంచినఁ, బోవునె? తత్ఫలము పిదపఁ బొందక యున్నే? (10-1-33)**

**ఆ. మానవేంద్ర! సత్యమతికి దుష్కరమెయ్య?, దెఱుక గలుగువాని కిష్ట మెయ్య?**
**దీశభక్తి రతుని కీరాని దెయ్యది?, యెఱుక లేనివాని కేది కీడు? (10-1-48)**

**ఆ. సభకుఁ బోవ రాదు; సభవారి దోషంబు, నెఱిఁగి యూరకున్న నెఱుఁగకున్న**
**నెఱిఁగి యుండియైన నిట్టట్టు వలికినఁ, బ్రాజ్ఞుఁడైనఁ బొందుఁ బాపచయము. (10-1-1356)**

**సాధుపాఠ నిర్ణయం**

**(1) తెంపరివై పోరింబోరిని .... నన్ । నొంచితి విస్సిరో యదియు బీరమె? (10-1-154)**

ఈ పాఠంలో ప్రాసభంగం యతిభంగం ఉన్నాయి. నొప్పింపఁగ నిస్సిరో - అని వావిళ్ళవారిపాఠం

నన్ । బెంపఁగ నిస్సిరో - అని వసుచరిత్రవ్యాఖ్యాత సోమకవిపాఠం 'పెంచు' ధాతువునకు నాశనం చేయు అనే అర్థం కూడఉంది. ఇది పెరుఁగు ధాతువువంటిది. మొక్క పెరిగినది = వృద్ధి పొందినదని అర్థం. గొలుసు పెరిగినది = తెగిపోయినదని అర్థం.

**(2) శబ్దశాస్త్రవేది హృదయంబు చాగున విశద ప్రకాశాభిరామంబై (10-1-765)** అని అకాడమీ ప్రతిపాఠం 'విశ్వప్రకాశాభిరామంబై' అని ఉండాలి. లేకపోతే రెండర్థాలు కుదురవు.

**(3) మహిత రౌద్రంబున మల్లుర కశనియై, నరుల కద్భుతముగ నాథుఁడగుచు... ఖలులకు విరసంబుగా దండియై... (10-1-1322)**

ఇక్కడ 'విరసం' అను పాఠం తప్పు. ఈ పద్యంలో నవరసాలు క్రమంగా చెప్పబడ్డాయి. కాబట్టి 'ఖలులకు వీరంబు గాదండియై' అనే పాఠం సాధువు.

**(4) చంపెరక్కసిఁబట్టి చక్రవాకునిఁగూల్చె. (10-1-1328)**

ముద్రిత ప్రతులన్నిట్లో ఈ పాఠమే ఉంది. 'చక్రవాతునిఁగూల్చె' అని ఉండాలి. చక్రవాతుఁడు= సుడిగాలి రక్కసుఁడు = తృణావర్తుడు.

**(5) భీష్మకవరపుత్త్రినే నుతచరిత్ర వారిజనేత్రన్. (10-2-243)**

అని ముద్రిత పుస్తకాల్లోని పాఠం. అంత్యానుప్రాసం చెడింది.

'భీష్మకవరపుత్త్రిన్, నుతచరిత్రవారిజనేత్రిన్' – అని వ్రాతప్రతుల పాఠం. చరిత్రశబ్ద 'ము' 'ఇష్ట్రన్' ప్రత్యయాంతము. 'చరిత్ర' అని ఉండదు. కాని చరధాతువుపై 'తృచ్' ప్రత్యయంచేరి 'చరితృ' అని ఏర్పడి 'ఋన్నేభ్యోఙీప్' అనే సూత్రంచే 'చరిత్రి' అవుతుంది. 'పొగడబడునట్లు చరించునది' అని అర్థం. 'వారిజనేత్రి' అనే దానిని సారస్వతవ్యాకరణం అంగీకరించింది.

**(6) జలదాభున్ గతలోభున్, అలకాళి జితద్విరేపు నంబుజనాభున్ (10-2-626)**

అని ముద్రితపాఠం. ఇక్కడ అంత్యానుప్రాసం చెడింది. అలకాళిజిత 'ద్విరేభు' నంబుజనాభున్ – అని ఉండాలి.

రిభ్యతే శబ్ద్యత ఇతి రేభో రవర్ణః. ద్వౌరేభౌ భ్రమరనామ్ని. ద్విరేఫము= తుమ్మెద. ద్విరేఫము – ద్విరేభము – రెండు రూపాలు ఉన్నాయి. భంబుకదేనఖంబు కలభంబుకదేనడ... ద్విరేభంబుగదేకచంబు. అని కవిప్రయోగం. (భాగవతపాఠపరిశోధనం).

**(7) మిడుఁగుఱులు పొరిఁజదల నడర హరిదంతముల (10-2-737)**

అని ప్రతులలో ఇదే పాఠం ఉంది. ఇది లయవిభాతి. గణాలు సరిగా లేవు. 'పొరిఁజదల' అనేచోట – 'పెన్‌జదల' అని ఉంటే సరిపోతుంది. ఏ ఆధారంలేకుండ మనం స్వతంత్రించి కవిపాఠం దిద్దరాదు.

**(8) పరమాణు కారణవాదులైన కణ్వగౌతమాదులను (10-2-1220)**

అని వావిళ్ళ, అకాడమీవారి ప్రతుల పాఠాలు. 'కణాదగౌతమాదులును' అని ఉండాలి. పరమాణువాది వైశేషికదర్శనకర్త కణాదుడు కాని కణ్వుడు కాదు.

**పోతన ఆత్మీయత**

**క. ప్రబ్బిన భక్తిని హరిపైఁ, గబ్బంబులు సెప్పి కవులు కైవల్య శ్రీ**
**కబ్బుదు రఁట! హరిపోషణ, మబ్బిన తల్లిదండ్రు లెచటి కబ్బుదురొ తుదిన్. (భాగ.10-1-351)**

పోతన మహాకవి. అచంచల విష్ణుభక్తితో సమాధిస్థితిలో ఉండి ఆంధ్రభాగవతం రచించి కైవల్యం పొందినవాడే. భాగవత రచనవలన పోతన కోరుకొన్నది కైవల్యమే. అందువల్లనే ముక్తి, మోక్షం మొదలైన శబ్దాలకంటె కైవల్యశబ్దాన్నే ఎక్కువగా ప్రయోగించాడు. 'కైవల్యాధిపలక్ష్మి' (10-1-555); కైవల్యశ్రీ (10-1-351); కైవల్యపదంబునొందె (10-1-972) అని చాలమారులు ప్రయోగించటమే కాక 'శ్రీకైవల్యపదంబుఁజేరుటకునై' అని భాగవతాని మొదలుపెట్టి దశమస్కంధం చివర –

**మ. మనుజేంద్రోత్తమ! యేను నీకుఁ ద్రిజగన్మాంగల్యమై యొప్పఁ జె**
**ప్పిన యీ కృష్ణకథాసుధారసము సంప్రీతాత్ములై భక్తిఁ గ్రో**
**లిన పుణ్యాత్ములు గాంతు రిందు సుఖముల్; నిర్ధూతసర్వాఘులై**
**యనయంబుం దుదిఁ గాంతు రచ్యుతపదం బైనట్టి కైవల్యమున్. (10–2–1336)**

అనే పద్యాన్ని కైవల్యంతో ముగించాడు.

కైవల్యం అంటే దుఃఖాలనుండి ముక్తిపొందటంకాదు. భగవంతునిలో లీనమవడం కాదు. కేవలం బ్రహ్మమే అవడం. 'బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి' – బ్రహ్మజ్ఞాని బ్రహ్మమేఅవుతాడు. అందువల్లే శ్రీ శంకరభగవదత్పాద వేదాంతానికి 'కేవలాద్వైతం' అని పేరు.

2. పోతన వ్యవసాయం చేసి జీవితంగడపినవాడు. ఈ భావాలు భాగవతంలో స్పష్టంగా ఉన్నాయి.

**క. వర్షాకాలభుజంగుఁడు, హర్షముతో నిడిన నవనఖాంకము లని యు**
**త్కర్షింప భూమిసతిపైఁ, గర్షక హలరేఖ లమరె గహనాంతమునన్. (10–1–754)**

హాలికులు భూమిని దున్నారు. ఆ నాగటిచాళ్ళు వర్షాకాలమనే విటుడు భూసతిదేహంపై సంతోషంతో చేసిన నఖాంకాలవలె ఉత్కర్షతో ఒప్పినాయట.

**క. చెలువుఁడు ప్రావృట్కాలుఁడు, పొలసినఁ బులకించు భూమి పులకము లనఁగా**
**మొలచి తల లెత్తి నిక్కుచు, సలలితగతి జాలువాఱె సస్యము లధిపా! (10–1–755)**

వర్షాకాలుడనే భర్త తనను చేరగానే పులకించిన భూదేవి ఒంటిపైని పులకలనేటట్లుగా మొలచి పండిన నిటారుగా నిలబడిన పంటచేలు ఒప్పాయి.

**క. హలిహలహృత కరికుంభ, స్థలముక్తాఫలము లోలిఁ దనరెఁ గృషిక లాం**
**గల మార్గ కీర్ణ బీజా, వలి కైవడి నద్భుతాహవక్షేత్రమునన్. (10–1–1563)**

ఇది జరాసంధ యుద్ధవర్ణన. బలరాముని నాగలితో చచ్చిన ఏనుగుల కుంభస్థలాల నుండి రాలిన ముత్యాలు కర్షకుని నాగలిచే దున్నబడిన మార్గాలలో చల్లిన విత్తనాల వలె యుద్ధరంగం అనే పొలంలో ఒప్పినాయి.

ఏనుగుల కుంభస్థలాలలో ముత్యాలుండటం ప్రసిద్ధం.

**క. జలధరఫణిఫణకీచక, జలచర కరిమస్తకేక్షు శంఖవరాహో**
**జ్జ్వల దంష్ట్ర శుక్తులు దరం, బులముత్యము లొదవు వర్ణములు వివిధములై (35)**

**క. పరిపక్వామలకఫల, స్ఫురణంబేపారి వెలుఁగుఁజూపుచునుండున్**
**గరికుంభసంభవంబగునురుతరమగునదియు రాజయోగ్యంబగుచున్. (40)**

ఏనుగుల కుంభస్థలాలలో ఉసిరి పండ్లంత ముత్యాలు ప్రకాశిస్తూ ఉంటాయని భైరవకవి 'రత్నపరీక్ష' లోపేర్కొన్నాడు.

**భాగవతం - వేంకటాచలం**

బలరాముడు తీర్థయాత్రలు చేస్తూ 1. ప్రభాసం 2. సరస్వతీనది 3. బిందుసరస్సు 4. వజ్రతీర్థం 5. విశాలా 6. సరయూ 7. యమునా 8. గంగానదులు 9. నైమిశారణ్యం 10. కౌశిక 11. పులస్త్యాశ్రమం 12. గోమతి 13. గండతి 14. విపాశ 15. శోణనదం 16. గంగాసాగరసంగమం 17. మహేంద్రనగం 18. సప్తగోదావరి 19. కృష్ణవేణి 20. పంపాసరస్సు 21. భీమనది (కుమారస్వామి) 22. శ్రీశైలం 23. వేంకటాచలం 24. కంచి (కామకోటి) 25. కావేరి 26. శ్రీరంగం (శ్రీరంగనాథస్వామి) 27. వృషభాచలం 28. హరిక్షేత్రం 29. మధుర 30. శ్రీరామసేతుబంధం 31. రామేశ్వరం 32. తామ్రపర్ణి 33. మలయాచలం (అగస్త్యమహర్షి) 34. దక్షిణ సముద్రం 35. కన్యాకుమారి (దుర్గాదేవి) 36. పంచాప్సరం 37. గోకర్ణం (శివుడు) 38. తాపి 39. పయోష్ణి 40. నిర్వింధ్యం 41. దండకారణ్యం 42. మాహిష్మతి (మనుతీర్థం) మొదలైన పుణ్యతీర్థాలను పవిత్రక్షేత్రాలను సేవించాడు.

పంచమస్కంధంలోని భూగోళకథనంలో ఈ దశమస్కంధంలోని బలరామతీర్థయాత్రలో శ్రీవేంకటాచల ప్రశస్తి రెండుసార్లు వచ్చినది. వేంకటాచలంపై వెలసిన పెద్దకాలం వేల్పు శ్రీవేంకటేశ్వరస్వామి. 1. కృతయుగంలో యజ్ఞవరాహస్వామిగా 2. త్రేతాయుగంలో శ్రీరామచంద్రునిగా 3. ద్వాపరయుగంలో శ్రీకృష్ణునిగా 4. కలియుగంలో శ్రీవేంకటేశ్వరస్వామిగా ఒప్పిన పరమాత్మ భక్తితో భాగవతం పఠించినవారినందరినీ కరుణాకటాక్షవీక్షణాలతో రక్షించుగాక!

***శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు***

తిరుపతి
17-2-2017

ఇట్లు
సుకలసుకవిబుధజనవిధేయుడు
**గరిమెళ్ళ సోమయాజులు శర్మ**

# దశమస్కంధం - ఉత్తరభాగ కథాసారం

**రు**క్మిణీ వివాహానంతర వృత్తాంతం శుకుడు ఇలా చెపుతున్నాడు. శివునిచే దగ్ధమయిన మన్మథుడు పరమేశ్వరుణ్ణి ఆరాధించి రుక్మిణికి పుట్టాడు. అతడే ప్రద్యుమ్నుడు. పురిటింటిలో ఉండగానే శంబరుడు తనకతడు శత్రువని తెలుసుకొని ఎత్తుకొనిపోయి సముద్రంలో పడవేశాడు. వానిని ఒక చేప మ్రింగింది. చేపలను జాలరులు పట్టికొని వచ్చి శంబరునికి కానుకగా ఇచ్చారు. అతడు వంటశాలకు పంపినాడు. వంట చేసేవారు చేపకడుపులో రాచబిడ్డను చూచి, (మాయావతి రూపంలో) అక్కడే ఉన్న రతీదేవికి ఈ విషయం చెప్పారు. రతీదేవి తన భర్త ఎపుడు శరీరం ధరిస్తాడా! అని ఎదురుచూస్తూ శంబరుని ఇంట్లో ఉంది. వంటవారు ఆమెకు పిల్లవాణ్ణి చూపించారు. ఇంతలో నారదుడు వచ్చి విషయమంతా చెప్పాడు. వెంటనే రతీదేవి గుర్తించింది. శంబరుని దగ్గరకు, వంటవారి దగ్గరకు వెళ్లి ఆ పసివాణ్ణి తీసుకొని పెంచుకోసాగింది.

అతడు శీఘ్రంగా పెరిగాడు. అతణ్ణి చూస్తే యువతులకు కాంక్ష కలగకుండా ఉండేది కాదు. ఆ మన్మథుని మాయావతి చూసింది. ఆమె తన్ను కోరుతోందని తెలిసికొని ప్రద్యుమ్నుడు “తల్లీ! నీవిలా మోహపడరా”దన్నాడు. అపుడు రతి “నీవు మన్మథుడివి. పూర్వజన్మలో నేను నీ భార్యను రతిని. శంబరుడు తల్లి నుండి వేరుచేసి నిను సముద్రంలో పడవేస్తే ఒక చేప నిన్ను మింగింది. ఆ చేపకడుపు నుండి నీవు పుట్టావు” అని మాయావతి ప్రద్యుమ్ననకు సర్వమాయావినాశి అయిన **“మహామాయావిద్య”** ఉపదేశించింది. వెంటనే ప్రద్యుమ్నుడు శంబరుని యుద్ధానికి పిలిచాడు. శంబరాసురుడు గదను ప్రయోగించాడు. తన గదతో ప్రద్యుమ్నుడు శంబరుని కొట్టాడు. అతని మాయలన్నిటిని ఛేదించి కత్తితో శంబరుని తల ఖండించాడు. దేవతలంతా సంతోషించి పూలవాన కురిపించారు. శంబరాసుర భంజనుడని ప్రద్యుమ్నునికి పేరు.

## రతీ ప్రద్యుమ్నులు ద్వారకకు పోవడం

రతీప్రద్యుమ్నులు కలిసి ఆకాశమార్గాన అంతఃపురం చేరారు. అక్కడి అంతఃపురకాంతలు ప్రద్యుమ్నుని చూసి కృష్ణుడనుకొన్నారు. రుక్మిణి తన చెలికత్తెతో “ఆ కుమారుని గూర్చి” ఈ కుమారుడెవరు? ఈతని కన్నతల్లి ఎంత అదృష్టవంతురాలో! అనుకొన్నారు. ఇంతలో రుక్మిణికూడ అక్కడకు వచ్చి “నా కొడుకెక్కడ ఉన్నాడో” అనుకొంది. ఇంతలో కృష్ణుడు దేవకీవసుదేవులతో వచ్చి ఏమీ ఎరుగనట్లే ఉన్నాడు. అంతలో నారదుడు రానేవచ్చాడు. చెప్పవలసినదంతా చెప్పాడు. అందరూ సంతోషించారు. రుక్మిణి తన కొడుకునుచూసి సంతసించింది. ఒక్క విశేషం – మన్మథుని చూసి తల్లులు శ్రీహరిని చూసినట్లే మురిసిపోయారు. ఇతరులయితే మోహంలో మునిగిపోయేవారే!

## స్యమంతకోపాఖ్యానం

శుకుడింకా ఇలా అన్నాడు –

“రాజా! సత్రాజిత్తు కృష్ణునికి కూతుర్నీ స్యమంతకమణినీ కూడా ఇచ్చాడు. అప్పుడు పరీక్షిత్తు ఆ విషయం నాకు వివరంగా చెప్పండి” అని అడిగాడు. శుకుడు చెప్పసాగాడు – “సత్రాజిత్తు సూర్యభక్తుడు. సూర్యుడు

సత్రాజిత్తు భక్తికి సంతసించి స్యమంతకమణిని ఇచ్చాడు. ఒకరోజున సత్రాజిత్తు ఆ మణిని కంఠంలో ధరించి ద్వారకానగరానికి వచ్చాడు.

అతణ్ణి చూచి ప్రజలంతా సూర్యుడనుకొని కృష్ణునితో ఇలా అన్నారు. “దామోదరా! నీవు లోకరక్షకుడవు. యదువంశంలో నిగూఢంగా ఉన్నావు. నిన్ను చూడ్డానికి ఆ సూర్యుడో, బ్రహ్మదేవుడో దిగి వస్తున్నట్లు అనిపిస్తోంది అన్నారు. వెంటనే కృష్ణుడు ఓ చిరునవ్వు నవ్వి “అతడు సత్రాజిత్తు కాని సూర్యుడు కాదు” అన్నాడు. ఆ సత్రాజిత్తు ఆ మణిని తన దేవమందిరంలో నిల్పుకున్నాడు. అది ప్రతిదినం ఎనిమిది బారువుల బంగారం ఇస్తుంది. ఆ రత్నం పూజింపబడేచోట వ్యాధులు కరువుకాటకాలూ ఉండవు. అందుచేత ఆ మణిని యాదవరాజుకి ఇమ్మని కృష్ణుడడిగాడు. అతడివ్వలేదు. పైగా ‘నేనివ్వను పో!’ అన్నాడు. ఇలా ఉండగా సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడు ఒకసారి ఆ మణిని మెడలో ధరించి వేటకై అడవికి వెళ్ళాడు. వాణ్ణి ఒక సింహం చంపి ఆ మణిని తీసుకుపోయింది. జాంబవంతుడు ఆ సింహాన్ని చంపి ఆ మణిని తన కూతురికి కేళీకందుకంగా ఇచ్చాడు.

సత్రాజిత్తు తన తమ్ముడైన ప్రసేనుడు కనబడక పోవడంచేత ఇలా ఆలోచించాడు. మణికోసం మావాణ్ణి శ్రీకృష్ణుడు చంపాడు అని దూషించాడు. ఈ మాట కృష్ణుని చెవిలో పడింది. ఈ నింద ఎలా పోగొట్టుకోవాలా? అనుకున్నాడు కృష్ణుడు. కొద్దిసేపు ఆలోచించాడు. ఆ అడవికి వెళ్ళాడు. ముందుగా కూలిపోయిన గుర్రాన్ని ప్రక్కనే ప్రసేనుణ్ణి కొద్దిదూరంలో సింహాన్నీ చూశాడు. అక్కడనుంచి ఎలుగుబంటి కాలిజాడలు కన్పడగా ఆ జాడల్ని పట్టుకుని ఒక గుహలో ప్రవేశించాడు. గుహద్వారం దగ్గర తనవెంట ఉన్నవారిని ఉండమని చెప్పి అంధకారబంధురమైన గుహలో తాను ప్రవేశించాడు. ఒక బాలికకు కేళీకందుకంగా కట్టబడిన ఆ మణిని చూచాడు. అనాలోచితంగా ఆ మణిని హరించాలనుకొన్నాడు. మెల్లమెల్లగా శిశువు దగ్గరకు వచ్చాడు. ఈ దృశ్యం చూచేసరికి అక్కడ ఉన్న దాది భయపడి గట్టిగా అరిచింది. అది విని జాంబవంతుడు బయటకు వచ్చాడు. తన స్వామి అని తెలియక ఎవరో మానవు డనుకుని అతనితో యుద్ధానికి సిద్ధపడి ఇరవైఎనిమిది రోజులు పోరాడాడు. ఇద్దరూ ముష్టాముష్టి పోరాడారు. జాంబవంతుని శరీరం ముద్దముద్దగా అయిపోయింది. అపుడు జాంబవంతుడు “దేవా! నీవు పురాణపురుషుడవు. సర్వానికీ ఆత్మవు. పూర్వం సముద్రాన్ని ఇంకించావు. దశకంఠుని శిరస్సులను తుంచావు. దయాసముద్రుడవైన రామచంద్రుడవు. తెలియక నీ కపకారం చేశాను. క్షమించు” అని జాంబవంతుడు స్తుతించాడు. వెంటనే శ్రీహరి తన చేతితో అతని శరీరాన్ని స్పృశించి మేఘగంభీర ధ్వనితో ఇలా అన్నాడు. “భల్లుకేశ్వరా! ఈ మణిని మేము దొంగిలించామని అజ్ఞానులు మమ్మల్ని నిందించారు. ఆ నింద తప్పించుకోవడానికి ఈ గుహలోకి మేము వచ్చాం” అనగానే జాంబవంతుడు పరమానందంతో తన కూతుర్ని ఆ మణినీ కూడా కృష్ణునకు సమర్పించాడు.

హరితోబాటు వచ్చినవారు గుహబయట పన్నెండురోజులు ఎదురుచూచి విసిగి పట్టణానికి వెళ్ళిపోయారు. కృష్ణుడు గుహలో చిక్కుబడిపోయాడని అనుకున్నారు. దుర్గమ్మను ప్రార్థించారు. ఆ సమయంలోనే “కృష్ణుడు మణినీ బాలమణినీ కూడా తీసుకుని క్షేమంగా వస్తాడు” అని దుర్గాదేవి పలికింది. రత్నంతోనూ కన్యారత్నంతోనూ కృష్ణుడు నగరానికి వచ్చాడు. అందరూ పండగ చేసుకున్నారు. జాంబవతిని కృష్ణుడు పరిగ్రహించి సత్రాజిత్తును

రాజసభకు పిలిపించి జరిగినదంతా చెప్పాడు. అతనిమణిని అతనికిచ్చేశాడు. సత్రాజిత్తు సిగ్గుపడి బలవద్విరోధం పెట్టుకున్నందుకు భయపడ్డాడు.

**క. పాపాత్ముల పాపములం, బాపంగా నోపునట్టి పద్మాక్షునిపైఁ**
**బాపముగలదని నొడివిన, పాపాత్ముని పాపమునకుఁ బారముగలదే!**

అంటూ ఇంకా ఇలా బాధపడ్డాడు. "నేను శ్రీహరిపై అపనిందమోపాను. పాపాత్ముణ్ణి. లోభిని, దుర్బుద్ధిని, మత్తుణ్ణి. ఇక నాకీ దేహం ఎందుకు? కాల్చనా? కృష్ణుడు ఎలా ప్రసన్నుడౌతాడో" అనుకుని మణినీ కూతురు సత్యభామనూ కృష్ణునికిచ్చి వాని పాదాలు పట్టుకోవడం తప్ప మరో ఉపాయం లేదని ఆలోచించి స్యమంతక రత్నాన్నీ కన్యారత్నాన్నీ శ్రీహరికి సమర్పించాడు. అపుడు కృష్ణుడు "మణిని సూర్యుడు నీకిచ్చాడు. మాకూ మణులున్నాయి. నాకు కుమారీమణి చాలు" అంటూ సత్రాజిత్తుకి మణిని తిరిగి ఇచ్చేశాడు.

ఇంతలో "పాండవులు కుంతితో పాటు లాక్షాగృహంలో దగ్ధమైపోయారు" అని వార్త వచ్చింది. వెంటనే కృష్ణుడు బలరామునితోబాటు హస్తినకు వెళ్ళి భీష్మద్రోణ కృపాదులను విదురాదులను చూచి వారిని ఓదార్చాడు.

## శతధన్వుడు సత్రాజిత్తును చంపి మణిని అపహరించడం

అపుడు అక్రూరకృతవర్మలు శతధన్వుని దగ్గరకు వెళ్ళి మనకిస్తామని తన కూతుర్ని కృష్ణుడి కిచ్చి మాటతప్పాడు సత్రాజిత్తు. అందుచేత నువ్వువెళ్ళి ఏ విధంగానైనా సరే ఆ మణిని సంపాదించు అని శతధన్వుని ప్రేరేపించారు. అప్పుడువాడు నిద్రలో ఉన్న సత్రాజిత్తును చంపి మణిని పట్టుకుపోయాడు. సత్యభామశోకించి సత్రాజిత్తును తైలద్రోణియందుపట్టించి హస్తినాపురానికి వెళ్ళి హరికి విన్నవించింది. బలరామ, కృష్ణులిద్దరూ మనుష్యభావంతో విలపించారు. కృష్ణుడు ద్వారకకు వచ్చి శతధన్వుణ్ణి చంపాలని భావించాడు. ఇది తెలిసిన శతధన్వుడు ప్రాణభయంతో కృతవర్మదగ్గరకు వెళ్ళి తనకు సాయపడమని ప్రార్థించాడు. అప్పుడు కృతవర్మ "ఇక్కడ ఎవరూ రామకృష్ణుల కపకారం తలపెట్టలేరు. జరాసంధుణ్ణి ఎరుగుదుం కదా" అన్నాడు. అప్పుడు శతధన్వుడు అక్రూరుణ్ణి సాయం అడిగాడు. అక్రూరుడు కృష్ణుని బలపరాక్రమాలు వివరించి చెప్పి "మేం కృష్ణుడికి మొక్కుతాం కాని ద్వేషించం, వెళ్ళువెళ్ళు, నీ స్నేహానికి పదివేల నమస్కారాలు." అన్నాడు. వెంటనే శతధన్వుడు గుర్రం ఎక్కి పారిపోయాడు. బలరామ, కృష్ణులు వాణ్ణి వెంబడించారు. శతధన్వుడు మిథిలదాకా వెళ్ళి అక్కడనుంచి గుర్రందిగి పరుగెత్తాడు. వెంటనే శ్రీహరి చక్రంతో వాడి తలఖండించాడు. చనిపోయిన వాడి వస్త్రాల్లో మణి ఉందేమోనని వెతికాడు. మణి దొరకలేదు. అప్పుడు బలరాముడు వీడెవడికో దాచమని ఇచ్చి ఉంటాడు. నువ్వువాణ్ణి వెదుకు. నేను మిథిలాధీశుణ్ణి చూడాలి అని చెప్పి మిథిలకు వెళ్ళిపోయాడు. బలరాముడు మిథిలలో కొన్ని ఏండ్లపాటు ఉన్నాడు. ఆ సమయంలోనే దుర్యోధనుడు మిథిలకు వచ్చి బలరాముని దగ్గర గదావిద్యను అభ్యసించాడు.

కృష్ణుడు ద్వారకకు వెళ్ళి విషయమంతా సత్యభామకు చెప్పి సత్రాజిత్తుకు పరలోక క్రియలు చేయించాడు. శతధన్వుని మరణంవిన్న అక్రూర, కృతవర్మలు ద్వారక విడిచి వెళ్ళిపోయారు. అక్రూరుడు లేకపోవడంచేత ద్వారకావాసులకు శరీర, మానసతాపాలు కలిగాయి. అప్పుడాపట్టణంలోని వృద్ధులు కృష్ణుడితో ఇలా అన్నారు.

"పూర్వం కాశీరాజు తన రాజ్యంలో వానలు కురవకపోతే శ్వఫల్కుని తీసుకుని వెళ్ళి గాందిని అనే కన్యనిచ్చి వివాహం చేయడంతో అక్కడ వానలు కురిశాయి. అతడికొడుకు ఈ అక్రూరుడు. ఇతడూ అటువంటివాడే. మహాతపస్వి. అతణ్ణి రప్పించు" అని చెప్పారు. అనగానే కృష్ణుడు అక్రూరుణ్ణి రావించి ఇలా అన్నాడు. "శతధన్వుడు మీ యింట్లో మణిని తీసుకుని వచ్చి పెట్టాడట నాకు తెలిసింది. సత్రాజిత్తు సంతానం ఆస్తీ అప్పులూ పంచుకోవాలి. అతడికి సత్కర్మలు జరగాలి. మణిని నువ్వే ఉంచుకో దాన్ని బంధువులందరికీ చూపించు. నాకివ్వక్కరలేదు" అన్నాడు. అనగానే అక్రూరుడు వస్త్రంలో దాచిపెట్టినమణిని కృష్ణుడికిచ్చాడు. కృష్ణుడు ఆ మణిని బంధువులందరికీ చూపించాడు తరువాత ఆ మణిని అక్రూరుడికిచ్చేశాడు.

## శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థానికి వెళ్లడం

పాండవుల్ని చూడాలని కృష్ణుడు ఇంద్రప్రస్థానికి వెళ్ళాడు. పాండవులు కృష్ణదర్శనంతో చాలా ఆనందించారు. ద్రౌపదికూడా పద్మాక్షునికి నమస్కరించింది. కృష్ణుడు కుంతీదేవి దగ్గరకు వెళ్ళి నమస్కరించి "కొడుకులూ కోడళ్ళతో సుఖంగా ఉన్నావా" అని అడిగాడు. కుంతీదేవి ప్రేమతో వివశురాలయి కన్నీరు పెట్టుకుంది. సుయోధనుడు చేసిన అపకారాలన్నీ ఆమెకు గుర్తుకువచ్చాయి. "నీ బంధుప్రీతి నాకు చాలా సంతోషంగా ఉంది. నాకూ నా పిల్లలకూ నీవే దిక్కు. ప్రాణులందరికీ నీవే ఆత్మవుకదా!" అని కృష్ణుణ్ణి ప్రశంసించింది. "నీవు మా చుట్టానివి. అది మాపూర్వ పుణ్యం" అంటూ సంతోషించింది. ధర్మరాజు కూడా అలాగే అన్నాడు. కృష్ణుడు కొన్నాళ్ళు ఇంద్రప్రస్థపురంలోనివారికి కనువిందు చేస్తూ అక్కడే ఉన్నాడు. ఆ రోజుల్లో కృష్ణార్జునులు ఒకరోజున వేటకై అడవికి వెళ్ళారు. యమునానది ఒడ్డున కూర్చున్నారు నది కెరటాలలో సూర్యుని కూతురు కాళిందిని చూశారు. కృష్ణుని ప్రేరణతో అర్జునుడు ఆమె దగ్గరకు వెళ్లి ఆమెను గూర్చి వివరాలు అడిగాడు. తాను సూర్యుని కూతుర్ననీ తన పేరు కాళింది అని కృష్ణుణ్ణి భర్తగా కోరి తపస్సు చేస్తున్నాని చెప్పింది. ఇంకా "కృష్ణుడు తనను త్వరలో పెళ్ళి చేసుకుంటాడని" అన్నది. అర్జునుడు ఆమెమాటలు కృష్ణునికి చెప్పాడు. కృష్ణుడామెతో రథంమీద ధర్మరాజు వద్దకుచేరి విశ్వకర్మతో నగరాన్ని నిర్మింపజేశాడు. కృష్ణార్జునుల సాయంతో అగ్ని ఖాండవాన్ని దహించాడు. అప్పుడే మయుని అర్జునుడు రక్షించాడు. అతడు నిర్మించినదే మయసభ.

## శ్రీకృష్ణుడు కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ అనే కన్యల్ని పరిణయమాడడం

కృష్ణుడు తన పురానికి వచ్చి ఒక శుభలగ్నంలో కాళిందిని పెళ్ళి చేసుకున్నాడు. అవంతీదేశాధిపతులైన విందానువిందులు హరికి మేనత్త కొడుకులు. వారు దుర్యోధనుని ఆశ్రితులు. వారు తమ చెల్లెలయిన మిత్రవిందకు పెళ్ళి చెయ్యాలని స్వయంవరం చాటించారు. ఆమెను రాజులందరి ఎదుట శ్రీకృష్ణుడు చేపట్టాడు.

కోసలదేశపురాజు కూతురు నాగ్నజితి. ఆ నాగ్నజితి మాధవుణ్ణే నాథునిగా వరించింది. ఆమె తండ్రిని చూచి 'మేము మీ కన్యను కోరుతున్నాం. కన్యాశుల్కంమాత్రం ఏమీ ఇవ్వం' అని అడిగాడు. అప్పుడాతడు 'మా దగ్గర ఏడు ఎద్దులు ఉన్నాయి. వాటిని లొంగదీసుకున్నవానికి నా కూతుర్ని ఇస్తాను' అన్నాడు. కృష్ణుడు ఆ ఎద్దుల్ని చూచి కేవలం పిడికిటి పోట్లతో నేలమీద పడవేసి వాటిని కట్టి ఈడ్చుకుని వచ్చాడు. నగ్నజిత్తు శ్రీకృష్ణునికి నాగ్నజితిని ఇచ్చి పెళ్ళి చేశాడు. బ్రాహ్మణులు ఆశీర్వదించారు.

ఆమెకోసం ఎద్దులతో పోరాడి ఓడిపోయిన రాజులందరూ ఈ విషయం విని కృష్ణుణ్ణి ఎదిరించారు. అర్జునుడపుడు యుద్ధభూమిలో వారినందరినీ సంహరించాడు. ఈ విధంగా నాగ్నజితిని పెళ్ళిచేసుకుని ద్వారకానగరానికి వచ్చాడు శ్రీకృష్ణుడు.

కృష్ణుడింకా శ్రుతకీర్తి చెల్లెలు అయిన భద్రను వివాహం చేసికొన్నాడు. తరువాత మద్రరాజు బృహత్సేనుని కూతురు లక్షణనుకూడా పరిణయమాడాడు. ఈ విధంగా రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ అనే ఎనమండుగుర్ని వివాహమాడాడు కృష్ణుడు. నరకాసురుణ్ణి వధించి రోహిణి మొదలయిన పదహారువేలమందిని పరిగ్రహించాడు.

'నరకాసురుడు ఆ స్త్రీలను ఎందుకు చెరబట్టాడు' అని పరీక్షిత్తు అడిగాడు. ఆ విషయం శుకుడిలా చెప్తున్నాడు. నరకాసురుడు అదితి కర్ణకుండలాలను, వరుణుని ఛత్రాన్నీ, మేరుపర్వతంమీది మణిపర్వతాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఇంద్రుడు ఈ విషయం హరికి మొరపెట్టుకున్నాడు. ఆ నరకాసురుణ్ణి చంపడానికి శ్రీకృష్ణుడు గరుత్మంతుణ్ణి ఎక్కివెళ్లాడు. అపుడు సత్యభామ కృష్ణుడితో బయలుదేరే సమయంలో ఇలా అంది.

## శ్రీకృష్ణుడు సత్యభామతో వెళ్ళి నరకాసురుణ్ణి వధించడం

"దేవా! నీవు రాక్షససంహారం చేస్తూంటే నీ నైపుణ్యం చూడాలని ఉంది. నన్ను కూడా యుద్ధానికి నీతోబాటు తీసుకొని వెళ్లకూడదా" అని కృష్ణుడిలా అన్నాడు – "నువ్వా? యుద్ధానికా? యుద్ధం అంటే ఏమనుకుంటున్నావు. అవి తుమ్మెదల ఝుంకారాలు కాదు. ఏనుగుల ఘీంకారాలు. అక్కడ పద్మాలపుప్పొడి ఉండదు. గుర్రాలకాలిగిట్టల దుమ్ము మాత్రమే ఉంటుంది. నీటితరగలమీది నురుగుకాదు. శత్రువుల బాణాలు. అవి సరోవరాలు కాదు. సైన్యసమూహాలు. నేను త్వరలోనే వస్తాను. నువ్విక్కడే ఉండు" అన్న కృష్ణునితో సత్యభామ 'నీబాహువుల దగ్గర ఉంటే అవతలివాళ్ళు దానవులయితే నేమి దైత్యులయితేనేమిటి?' అంటూ నేనూ వస్తానని మెత్తగా చెప్పింది. చేతులు జోడించింది. కృష్ణుడు కరకమలాలతో గుచ్చిఎత్తాడు. గరుత్మంతుణ్ణి అధిరోహించాడు. ప్రాగ్జ్యోతిషపురాన్ని సమీపించాడు. గిరిదుర్గం, శస్త్రదుర్గం, జలదుర్గం, అగ్నిదుర్గం, వాయుదుర్గాలతో అభేద్యంగా ఉంది ఆ పురం. కృష్ణుడు ముందుగా ఆ దుర్గాల్ని ముక్కలు చేసి క్రమంగా రూపుమాపాడు. మురుణ్ణి కప్పిన మురాసురుని పాశాలు ఛేదించాడు. ఆ పట్టణప్రాకారాల్ని గదాఘాతాలతో కూల్చివేశాడు. పాంచజన్యం పూరించాడు. ఆ ధ్వనికి పంచశిరుడయిన మురాసురుడు ఆవులిస్తూ నీళ్ళల్లోంచి బయటకు వచ్చాడు. అగ్నిజ్వాలలతో కూడిన శూలాన్ని గరుత్మంతునిమీద ప్రయోగించాడు. భూమ్యాకాశాలు దద్దరిల్లేలా గర్జించాడు. గరుడునిమీద పడవచ్చిన శూలాన్ని కృష్ణుడు ఒడిసి పట్టుకుని మూడుముక్కలుగా చేశాడు. వెంటనే మురుడు గదను విసిరాడు. కృష్ణుడు దాన్ని తన గదతో మూడు ముక్కలు చేశాడు. వాడు చేతులు చాచి ముందుకు వచ్చాడు. అంతలోనే కృష్ణుడు వాడితలలను ఖండించాడు. మురుడు నీళ్ళల్లో కూలిపోయాడు. అతని కొడుకులు ఏడుగురు పీఠడు అనే దండనాథుణ్ణి ముందుంచుకొని హరిని ఎదిరించాడు. ఎన్నో బాణాలు గుప్పించాడు. వాటిని అన్నింటినీ నేలకూల్చాడు కృష్ణుడు. వారిచేతుల్నీ, ముఖాల్నీ, కంఠాల్నీ, నరికివేశాడు. వారందరూ చనిపోవడంతో నరకునికే ఆశ్చర్యం కలిగింది.

యుద్ధానికి సిద్ధమైవచ్చాడు నరకుడు. సత్యభామతో కూడిన శ్రీకృష్ణుణ్ణి చూచాడు. యుద్ధానికి సిద్ధమయ్యాడు. అతణ్ణి చూచి సత్యభామ తన జడముడి చుట్టింది. కోకసరిచేసుకుంది. నగలు సవరించుకుంది. పయ్యెద బిగించింది. తన భర్తముందట లేచి నిలబడింది.

## సత్యభామ నరకాసురునితో యుద్ధం చేయడం

ఆ సత్యభామను చూచి కృష్ణుడు 'ఈ విల్లందుకో' అని సత్యభామకొక విల్లు అందించాడు. వెంటనే ఒక తేజోవిశేషం పుట్టింది. ఆమె ఆ వింటినారిని సంధించింది. ధనుష్టంకారం చేసింది. వీరశృంగారాలు భయరౌద్ర విస్మయాలు రూపుదాల్చినట్లుగా ఉంది. ఎప్పుడు వింటికి బాణం తొడుగుతోందో, ఎపుడు లాగుతోందో ఎపుడు విడుస్తోందో తెలియటం లేదు. బొమలు ముడిపడ్డాయి. అనురాగమందహాసాలు వీరశృంగాలు వ్యక్తమౌతూ అవలీలగా శత్రువును నొప్పిస్తూ భర్తను అలరిస్తోంది. ఒకపాదం ముందుకు ఒకపాదం వెనుకకూ పెట్టి నిలబడింది. లక్ష్యాన్నిమాత్రమే చూస్తోంది. ధనుస్సు వలయాకారంగా ఉంది. బాణాలు పుంఖానుపుంఖాలుగా వదులుతోంది. నిజానికి సత్యభామ సుకుమారి. అలా యుద్ధం చేయడం ఆశ్చర్యంగా ఉంది చూచేవాళ్ళకు. చెలికత్తెల కోలాహల ధ్వనిచే ఓర్చుకోలేని ఆమె భేరీభాంకారాలకు ఎలా ఓర్చుకుంటోందో తెలియటం లేదు. చేత వీణపట్టుకోడానికే తెలియని ముద్దరాలు ధనుస్సు ఎలా పట్టుకుంటోందో తెలియటంలేదు. నెమళ్ళకు నాట్యం నేర్పుతూ ఉన్నట్లు ఆలీఢం మొదలయిన భంగిమలలో కనపడుతోంది. సత్యభామను ప్రశంసిస్తూ కృష్ణుడు విల్లందుకున్నాడు. అపుడు నరకాసురుడు కృష్ణునితో ఇలా అన్నాడు. 'ఆడుది యుద్ధం చేస్తూంటే నీకు మగతనం లేదా! దనుజులు ఆడువారితో యుద్ధం చెయ్యరు' అంటూండగానే శతఘ్ని అనే దివ్యాస్త్రాన్ని ప్రయోగించాడు కృష్ణుడు. శత్రుసైన్యం అంతా హాహాకారాలు చేస్తూ పారిపోయింది. సత్యాకృష్ణులను మోస్తూనే గరుత్మంతుడు కాలిగోళ్ళతో, ముక్కుతో, రెక్కలతో శత్రువుల గజసమూహాన్ని ఛిన్నాభిన్నం చేశాడు. ఆ గాలివేగం సహించలేక చావగా మిగిలిన సైన్యం పారిపోయింది. అదే సమయంలో నరకాసురుడు ఏనుగుమీద విహరిస్తున్నాడు. కృష్ణుడిమీద విసరడానికి శూలం చేత్తోపట్టుకున్నాడు. కృష్ణుడు తన చక్రంతో నరకుని తలనరికాడు. చప్పుడుచేస్తూ ఆ తల నేలపై పడింది. దేవతలు మునులు ఆకాశంనుండి పూలవాన కురిపించారు.

## భూదేవి శ్రీకృష్ణుణ్ణి స్తుతించడం

ఒక మహారత్నాన్ని కృష్ణుడికిచ్చి భూదేవి భక్తిశ్రద్ధలతో సర్వజ్ఞుడైన పరమాత్మకు నమస్కరించింది. "దీనరక్షకా! ఒక్కసారి దయతో ఇటు చూడు. వీడు నరకాసురుని కొడుకు. ఇతరమైన శరణమేదీలేదు వీడికి. ఆ మాటలను ఆమె పూజను అందుకుని శ్రీహరి నరకునికొడుకైన భగదత్తునికి అభయం ఇచ్చాడు. కృష్ణుడు పదహారువేలమంది రాజకన్యలను చూశాడు. వారంతా కుతూహలంతో శ్రీకృష్ణుణ్ణి చూశారు. ధైర్యం కోల్పోయారు. అతడే తమకు ప్రాణనాథుడు కావాలని కోరుకున్నారు. వారు తమలో తాము ఆ రాక్షసుడెవరో చెరపట్టాడని అనుకునేవారం కాని అందువల్లనే కదా ఈ కృష్ణుణ్ణి చూడకలిగాం, ఒక్కసారి ఇతడు మనల్ని కౌగిట చేరిస్తే మనం ధన్యులం. ఆ వైజయంతీమాల ఎంత చక్కగా అతని కంఠం పట్టుకుని వ్రేలాడుతోందో. అతని పీతాంబరమైనా అయ్యాంకాదు.

అతని శరీరంమీద మెరిసిపోతూ ఉండేవాళ్ళం కదా! పాంచజన్యం అయి ఉంటే అతని అధరసుధారసం తాగేవాళ్ళం. నెమలిపింఛమయినా బాగుండేది. నెత్తిమీద గంతులు వేసేవాళ్ళం. ఇలా పలురకాలుగా మాట్లాడుకుంటున్నారు. ఎవరికి వారే ఆ పద్మాక్షుడు నన్నే చూచి నవ్వాడు. నన్ను చూచే ఆలోచిస్తున్నాడు నా పేరుకూడా అడిగాడు. నేనే కృష్ణుడికి భార్య అవుతాను అని ఎవరికివారే నిర్ణయం చేసుకుంటున్నారు. వారందరికీ కృష్ణుడు వస్త్రాభరణాలు పూలమాలలు ఇచ్చి ద్వారకకు పంపాడు. తాను దేవేంద్రుని నగరానికి వెళ్ళి పెదతల్లికి (అదితి) సంతోషం కలిగించాడు. మణికుండలాలు ఇచ్చాడు. శచీంద్రులు ఇద్దరూ సత్యాకృష్ణులిద్దర్నీ పూజించారు. వారిద్దరూ నందనవనం ప్రవేశించారు. అక్కడి పారిజాతాన్ని కృష్ణుడు పెకలించి గరుడునిపైకి చేర్చాడు. ఇంద్రుడు ఎదురువచ్చి యుద్ధంచేశాడు. వారినందరినీ కృష్ణుడు జయించాడు ఆ పారిజాతవృక్షాన్ని సత్యభామ క్రీడోద్యానంలో నాటాడు. నరకాసురుడి ఇంటినుండి తెచ్చిన రాజకన్యలందరికీ నివాసాలు కల్పించాడు. ఒక మంచిలగ్నంలో పదహారువేలరూపాలు ధరించి ఆ పదహారువేలమంది రాజకుమార్తెల్నీ మహావైభవంగా వివాహం చేసుకున్నాడు. గృహస్థధర్మం పాటిస్తూ పూర్ణకాముడై రమించాడు.

## కృష్ణుడు రుక్మిణితో విరసోక్తులాడడం

ఒకనాడు కృష్ణుడు ఒక మనోహర భవనంలో స్వచ్ఛమైన మంచంమీద సుఖంగా కూర్చున్నాడు. రుక్మిణీదేవి చెలికత్తెలతో కలిసి కృష్ణుని చెంతచేరి సేవిస్తోంది. పరిశుద్ధమైన మనస్సు కలిగిన రుక్మిణిని చూచి కృష్ణుడిలా అన్నాడు. “కులరూపత్యాగాది గుణాలలో శిశుపాలాదులు సంపూర్ణులు. నీ తల్లిదండ్రులు అన్నగారు కూడా నిన్ను ఇచ్చినా నీవు అంగీకరించకుండగా ఎక్కడో సముద్రంలో ఉన్న మమ్మల్నెందుకు వరించావు? లోకప్రవర్తనలు మాకు తెలియవు. అసలు మేమెక్కడ ఉన్నామో ఎవరికీ తెలియదు. మాకెప్పుడూ ఈ సముద్రమే శరణ్యం. మేము దరిద్రులం. కలిగినవాళ్లెవరూ మన చుట్టాలు కారు. అసలు గుణాలేవీ లేనివాళ్లం. స్త్రీలెవరూ మమ్మల్ని కోరుకోరు అటువంటి మమ్మల్ని ఎందుకు వరించావు? అందం, ఐశ్వర్యం, వంశం సమానస్థాయిలో ఉంటేనే వియ్యం అయినా నెయ్యమైనా చెల్లుతాయి. లేకపోతే చెల్లవని నీకు తెలియదు. అందుకే నన్ను వరించావేమో? అవన్నీ ఉన్నవాళ్ళ నెవరినైనా వరించి ఉండవలసింది. గుణహీనుల్ని వరించడం భావ్యమా? శిశుపాల‘జరాసంధాదులు రెచ్చిపోయి నా మీదకు ఉరుకుతున్నారనీ, నీ అన్న రుక్మి కూడా పరాక్రమంతో అంధుడైపోతే వారి గర్వం అణచడానికి నిన్ను జయించి తెచ్చానుకాని’ భార్యాపుత్రులమీద ప్రేమతో కాదు. మేము చాలా విరాగులం, క్రియావిరహితులం, పూర్ణులం. ఆత్మబుద్ధితో జీవిస్తూ ఉంటాం. నీవా కొత్త తీగలాంటిదానివి. మాతో ఎంతకాలం బాధపడతావు?” అని ఊరుకున్నాడు  కృష్ణుడు.

ఇలా రుక్మిణీదేవికి ఉన్న గర్వాన్ని పోగొట్టి మిన్నకుండిపోయాడు. భర్తమాటలకు ఎంత విచారించిందో రుక్మిణి. కన్నీరు వరదలై పారింది. ముఖం వాడిపోయింది. శరీరం వడవడా వణికిపోయింది. బొటనవేలితో నేలమీద రాస్తూ నేలచూపులు చూస్తోంది. నేలపై వాలిపోయింది. పుణ్యస్త్రీలలో మొదట లెక్కింపదగిన ఆ రుక్మిణిని వేదాలుకూడా నమస్కరించే కృష్ణుడు దగ్గరకు తీసుకుని నుదుట తిలకాన్ని సరిదిద్ది నగలను చక్కదిద్దాడు. జారినపైట సవరించాడు. బిగికౌగిట చేర్చి సేదదీర్చాడు. అందమైన శయ్యమీదకు చేర్చాడు. మధురభాషణలతో

అనునయించాడు. అపుడామె సిగ్గుతో ఇలా అంది. "లోకేశ్వరా! నేను నీకు తగిన దానినేనా? నీవు సచ్చిదానందమూర్తివి. నీ లీలలు దివ్యమైనవి. యోగీంద్రులకు కూడా నీ మార్గం అంతుచిక్కదు. బ్రహ్మాదుల్ని కూడా తిరస్కరించి మనస్సులో నిన్నే వరించాను. ఇవన్నీ నీ సంపూర్ణ మాయలేతప్ప మరేమీకాదు. నిర్మలజ్ఞానంతో స్థిరంగా నిలిచేవారు నీ పాదపద్మమకరందసౌరభం ఆస్వాదిస్తారు. అది మోక్షరూపమైనది. సత్పురుషులు ప్రశంసించేది ఆకాశంలోని నీలిమేఘాలనుండి పడే నీటిని తాగే చాతక పక్షి నీటిగుంటల దగ్గరకు వెడుతుందా? ముగ్గిన మామిడి పండ్లరసాన్ని తాగే చిలక ఉమ్మెత్త కాయలదగ్గరకు వెడుతుందా? నీ పాదపద్మాలను ఆశ్రయించే మనస్సు ఇతరుల్ని చేరదు. జగదంతరాత్మా! నీ పాదారవిందాలు నా మనస్సులో నిలిచేటట్లు అనుగ్రహించు. నీకు తెలియని విషయం లేదు". ఇలా అంటున్న రుక్మిణి మాటలకు శ్రీకృష్ణుడు సంతోషంతో ఇలా అన్నాడు. "దేవీ! నవ్వులాటకనిన ఈ మాటలకు నీవు మనస్సులో కలత పడరాదు. కయ్యాలలోనూ "రతి సమయాలలోనూ, మాట్లాడే మాటలు విని నొచ్చుకోరాదు. నీ మనస్సు తెలియడంకోసం అలా మాట్లాడాను. అంతేకాదు" అలకలు, ముద్దుమాటలు, కోపపుచూపులు, తియ్యని పెదవులు, వేళాకోళాలుకల భార్యతో రమించడమంటే జన్మసాఫల్యం చెందడమే. నీవు పతివ్రతా శిరోమణివి. నిర్మలమైన ధర్మవివేకాలు, శీలసద్భావాలు కలదానివి. నా సేవ తప్ప నీ మనస్సులో ఏమీ ఉండదు. చిన్నప్పటినుంచీ మనసు తెలిసినా ఇలా మాటలాడినందుకు క్షమించు' అని ఇంకా ఇలా అన్నాడు. "ఇపుడు నీ పాతివ్రత్యం, ప్రేమ స్పష్టంగా తెలిశాయి. నా మాటలవల్ల నీ మనస్సు నాయందే దృఢండా నిలిచి ఉంటుంది. మోక్షం ఇవ్వకలిగిన నన్ను అల్పబుద్ధి గల స్త్రీలు తపోమహిమలతో దాంపత్యయోగం కోసం సేవిస్తారు. అదంతా నా మాయా విజృంభణం. దురదృష్టవంతులైనవారు నరకం పొందుతారు. నీవు అనేకరాజుల్ని తిరస్కరించి నీకేమీదుకట్టి నా శరీరాన్నుంచాను". అని రహస్యంగా బ్రాహ్మణుణ్ణి పంపించావు. నేను మాత్రం ఊరకున్నానా? నీ అన్నగారిని విరూపుణ్ణి చేశాను. అయినా నువ్వు ఊరుకున్నావు. అందుకే అనేక విధాలుగా వ్యక్తమయ్యే నీ సద్గుణాలకు సంతోషించాను. ఇలా సామాన్య మానవునిలా చెప్పి ఊరుకున్నాడు. అమృతంలో తడసినట్లయింది రుక్మిణి. ఆమె ముఖపద్మం వికసించింది. కృష్ణుని ముఖం సాటిలేని కాంతితో వెలిగిపోతోంది. రుక్మిణికి వస్త్రాభరణాలు, కోరిన వరాలు, మిక్కిలిగా ఇచ్చాడు. తాను, ఆమె కలసి పొదరిండ్లలో మల్లెతీగలలో, విరజాజి మొక్కలతో మనోహర సరస్తీరాలలో కొత్తకోరికల్ని చవిచూస్తూ ఆనందంగా అనుభవిస్తున్నారు.

తత్ఫలితంగా కృష్ణునికి రుక్మిణియందు ప్రద్యుమ్నుడు చారుధేష్ణుడు, సుధేష్ణుడు, సుచారువు, చారుదేహుడు, చారుగుప్తుడు, భద్రచారువు, చారుచంద్రుడు, విచారువు, చారువు అనే పదిమంది కొడుకులు కలిగారు. అలాగే సత్యభామ జాంబవతికి, నాగ్నజితికి, కాళిందికి, మాద్రికి, మిత్రవిందకు, భద్రకు వేర్వేరుగా పదిమంది చొప్పున కుమారులు కలిగారు. పదహారువేలమంది భార్యలకు కూడా పదేసిమంది కొడుకులు కలిగారు. ఇలా కృష్ణుడు పిల్లజెల్లతో తామరతంపరగా వృద్ధిపొందాడు. ఆ రాజకుమారులను చదివించే గురుజనులు మూడుకోట్ల ఎనభై ఎనిమిదివేల ఒక వందమంది ఉన్నారంటే ఆ బాలకుల సంఖ్యను లెక్కించగలమా? వారిలో గోవిందుని కుమారుడైన ప్రద్యుమ్నునికి రుక్మి కూతురువల్ల అనిరుద్ధుడు జన్మించాడు.

## అనిరుద్ధుని వివాహంలో బలరాముడు రుక్మి మొదలగువారిని చంపడం

పరీక్షిత్తు శుకమహర్షిని ఇలా అడిగాడు. కృష్ణునివల్ల అవమానం పొందిన రుక్మి శత్రువు కొడుక్కి తను కూతుర్ని ఎలా ఇచ్చాడు? నాకు స్పష్టంగా చెప్పు అని అడిగాడు. వెంటనే శుకయోగి ఇలా చెప్పసాగాడు అవమానం పొందినా, కోపంగా ఉన్నా, రుక్మి చెల్లెలి మీది ప్రేమతో కూతుర్ని మేనల్లుడికి ఇచ్చాడు. రుక్మి రాజకుమారులందరినీ తన కూతురి వివాహానికి పిలిచాడు. కృష్ణుని కొడుకు రుక్మి నగరానికి వెళ్ళాడు. ప్రద్యుమ్నుడు అక్కడ ఉన్న రాజకుమారులందరిమీద తీవ్రబాణపరంపరను ప్రయోగించి రుక్మి కూతుర్ని తెచ్చి వివాహం చేసుకొన్నాడు. భీష్మమహారాజు "రుక్మలోచన"ను అనిరుద్ధునికి పెండ్లిచేసే సమయంలో విదర్భరాజ నగరానికి శ్రీబలరామకృష్ణాదులు రుక్మిణీ ప్రద్యుమ్నాదులు వివాహపు రోజులన్నీ సంతోషంగా గడిపారు. కళింగరాజు రుక్మితో "నీ అవమానానికి ప్రతీకారం చెయ్యడానికి ఇదే సరైన సమయం. బలరాముడికి జూదం ఆడడంలో ఆసక్తి ఉంది కాని, నేర్పులేదు. నువ్వు గెలుస్తావు. రుక్మి ఏమీ ఆలోచించకుండా బలరామునితో జూదం ఆడడానికి మానుకొన్నాడు. పంతంతో ఇద్దరూ పందెం ఒడ్డుతూ ఆడసాగారు. అన్ని ఆటలు బలరాముడు ఓడిపోయాడు. దానికి కళింగరాజు పరిహసిస్తూ బలరాముణ్ణి చులకన చేశాడు. బలరాముడికి కోపంవచ్చి ఒకలక్ష పణంగా పెట్టాడు. గెల్చాడు. అయినా రుక్మి'నేనే గెల్చాను' అంటూ దబాయించాడు. బలరాముడు మిగిలిన రాజకుమారుల్ని "నిజంచెప్పండి" అన్నాడు. వారందరూ రుక్మికి హితులు. వారేమీ మాట్లాడలేదు. బలరాముడు మళ్ళీ పందెం ఒడ్డి గెల్చుకున్నాడు. ఇప్పుడైనా నిజం చెప్పండి అన్నాడు. అపుడు అశరీరవాణి రాముడుగెల్చాడు. రుక్మి ఓడిపోయాడు అని చెప్పింది. అందరూ ఆశ్చర్యంలో ఆనందంలో మునిగిపోయారు. కుటిలురు రుక్మిని రెచ్చగొట్టారు. రుక్మి "అక్ష విద్యలో నేర్పుకల రాకుమారులలో పసులకాపరులు ఎలా సమానమౌతారు?" అన్నాడు బలరాముడికి కోపం వచ్చి ఒక ఇనపగుదియ తీసికొని రుక్మిని అతని సహాయకుల్ని అలసిపోయేలా కొట్టాడు. కళింగరాజు పళ్ళు రాలగొట్టాడు. రాజులంతా భయంతో పరుగెత్తారు. రుక్మిణీ బలదేవులకు కోపం వస్తుందేమోనని కృష్ణుడుకూడా పెదవికదపలేదు. యాదవవీరులందరూ రథంమీద బలరామ రుక్మిణీ కృష్ణులను కొలుస్తూ బయల్దేరి కుశస్థలి చేరారు. ఆనందంతో ఒక ఉద్యానంలో విడిది చేశారు.

## బాణాసురుడు పరమేశ్వరానుగ్రహం పొందడం

శుకుడు పరీక్షిత్తుతో చెప్తున్నాడు. "బలికి నూర్గురు కొడుకులు. పెద్దవాడు బాణుడు, శివభక్తుడు వేయిచేతులున్నాయి వానికి. అతడు శివుణ్ణి చూచాడు. సాష్టాంగ నమస్కారం చేశాడు. శివుడు మహానందం పొందాడు. అపుడు బాణుడు నా కోరిక చెపుతున్నాను. నీవూ పార్వతీ కలిసి నాకోటవాకిలికి కాపలా ఉండాలి. నన్ను రక్షించాలి' అని అర్థించాడు. శివుడు 'అలాగే' అని అక్కడే కాపలా ఉన్నాడు. బాణుడు శివుని పాదాలకు నమస్కరించి ఎంతగానో స్తుతించి ఇలా అన్నాడు. "నా ఈ చేతుల తీట తీరడంలేదు. ఎటువంటి యుద్ధంలో కూడా నా చేతులు తీట తీరడంలేదు. నువ్వే ఆ తీటతీర్చాలి" అన్నాడు. ఆ మాటలు శివునకు అసహ్యం కలిగింది. శివుడిలా అన్నాడు "మూఢా! నీ ధ్వజం నేలకూలినపుడే నీ చేతులన్నీ తెగిపడే యుద్ధం సంభవిస్తుంది" అన్నాడు. బాణుడు తన ధ్వజం ఎప్పుడు పడుతుందా అని ఎదురుచూడసాగాడు. బాణునికి ఉష అనే కూతురుంది. ఆమె

ఒకనాడు మేడమీద మెత్తని పాన్పుమీద నిద్రపోతోంది. నిద్రలో అనిరుద్ధుని కలిసినట్లుగా కలకన్నది. అంతలోనే మెలకువ వచ్చింది. చాలా కలవరపడింది. ఆ సరసాలాపాలు మరచిపోలేకపోయింది. ఊహించుకుంటేనే శరీరం పులకరించిపోతుంది. సిగ్గు 'మోహం' భయం కలిగాయి. విరహంతో కుందిపోతోంది. చెలికత్తె చిత్రరేఖ ఆమె దగ్గరకు వచ్చింది. ఆ చెలికత్తెకు ఈమె పరిస్థితి అర్థమైంది. ఆమెకు తన అనుభవాన్నంతా చెప్పింది ఉష. చిత్రరేఖ నేను సుందరుల చిత్రాలన్నీ వ్రాస్తాను. అందులో నీమనోహారుడెవడో చెప్పు అన్నది. ఎంతోమంది రాకుమారుల చిత్రాలు చూపించింది. అందులో ప్రద్యుమ్నుడి పోలికలు గుర్తించింది ఉష. ఆ వీరుణ్ణి బలాధిక్యం గురించి చెప్పు అన్నది. అతడు యాదవ వంశస్థుడని కృష్ణుని మనుమడని తెలుసుకొన్నది. వెంటనే చిత్రరేఖ తానతనిని తీసుకు వస్తానని. కృష్ణుని పట్టణానికి వెళ్ళి నిద్రిస్తున్న అనిరుద్ధుణ్ణి తన యోగవిద్యాబలంతో తెచ్చింది. ఇచ్చింది. ఉష సంతోషించింది. ఇంత ఉపకారం చేసిన ఆమెను అభినందించి చిత్రరేఖను వెళ్ళిపొమ్మంది. ఇంతలో అనిరుద్ధుడు మేల్కొని ఉషను చూచాడు. వారిద్దరూ ఆనందసాగరంలో మునిగితేలారు. కొద్దీ కాలంలోనే ఉష గర్భవతి అయింది. అంగరక్షకులు చాలా వ్యాకులపడ్డారు. వారంతావెళ్ళి, ఆ విషయం బాణుడికి చెప్పారు. వెంటనే కన్యాసౌధంలోకి ప్రవేశించాడు బాణుడు. అనిరుద్ధుణ్ణి చూచాడు. ఈ నరాధముణ్ణి కట్టివెయ్యండి అన్నాడు. భటులు అనిరుద్ధుణ్ణి సమీపించారు. వారందర్నీ ఎదిరించాడు. యుద్ధపటిమను ప్రదర్శించాడు. అందరూ పారిపోయారు. బాణుడు వచ్చి అనిరుద్ధునితో యుద్ధంచేసి నాగపాశంతో బంధించాడు. ఇది చూచిన ఉషకు మనస్సు వ్యాకులమైంది. అంతలోనే అతని జండా నేలకూలింది. శివునిమాట నిజమౌతోందని బాణుడు అనుకున్నాడు. ఇక్కడ ఇలా ఉండగా ద్వారకలో అనిరుద్ధుడు మాయమై నాలుగు నెలలు గడిచిపోయాయి. నారద మహాముని కృష్ణుని సేవించాలని వచ్చాడు. అనిరుద్ధుని వృత్తాంతం కృష్ణునికి చెప్పాడు. కృష్ణుడు బాణునిమీద యుద్ధం చెయ్యడానికి సిద్ధపడ్డాడు. అతని వెనుక పన్నెండు అక్షౌహిణులసేన కదిలింది. యాదవులు శోణపురం చేరారు. ఎన్నో ప్రాకారాలు నేలకూల్చారు. పట్టణాన్ని దిగ్బంధం చేశారు. యుద్ధబేరి మ్రోగించారు. వీరికి తగినట్లుగానే బాణుడు యుద్ధసన్నద్ధుడయ్యాడు. శివభక్తుడైన బాణుణ్ణి దయతో చూడాలని శివుడే బయలుదేరాడు. ద్వంద్వయుద్ధం మొదలయ్యింది. కృష్ణుడు – శివుడు, ప్రద్యుమ్నుడూ – కుమారస్వామి, బలరాముడు – కూపకర్ణకుంభాండులు, సాంబుడు – బలుడు, సాత్యకి – బాణుడు తలపడ్డారు. మరుక్షణంలో బ్రహ్మాండం బద్దలైనట్లయ్యింది. శివుడు బ్రహ్మాస్త్రాన్ని సంధించి కృష్ణుని మీద ప్రయోగించాడు. కృష్ణుడూ బ్రహ్మాస్త్రాన్నే ప్రయోగించాడు. అలా జరిగిన యుద్ధంలో బాణసైన్యం అనాథయై పారిపోయింది. పోరుఘోరమయింది. ఉభయులు నిర్భయంగా యుద్ధం చేస్తున్నారు. యుద్ధభూమి అంతా రక్తనదియా అని అనిపించింది. కృష్ణుడు నందక మనే కత్తిని ధరించి బాణుని విండ్లనన్నిటినీ విరిచివేశాడు. బాణుడు తెల్లముఖం వేశాడు. అంతలో బాణుని తల్లియైన కోటర నగ్నంగా కృష్ణుని ఎదుట నిలిచింది. చూడలేక కృష్ణుడు ముఖం త్రిప్పుకున్నాడు. బాణుడు తల్లడిల్లిపోయాడు. తలగుడ్డ జారిపోయింది. బాణుడు తన నగరంలోకి వెళ్ళిపోయాడు. మహేశ్వర జ్వరం కోపించి రావడం కృష్ణుడు చూచాడు. కృష్ణుడు మెల్లగా నవ్వుకున్నాడు. వెంటనే వైష్ణవ జ్వరాన్ని పంపాడు. వైష్ణవ జ్వరంధాటికి మహేశ్వర జ్వరం ఓడి పారిపోయింది. శైవ జ్వరం కృష్ణుని పాదాలమీద పడి 'రక్షించు, రక్షించు' అంటూ వేడుకొన్నది. "చిన్మయాత్ముడవైన నిన్ను సేవిస్తాను. నీ మాయను నీవే నివర్తింపచేయగలవు. భూభారాన్ని నివారించడమే ఈ దివ్యావతారానికి ప్రయోజనం. కాబట్టి, నిన్ను వేడుకుంటున్నాను. అంతలో

కృష్ణుడు నన్ను శరణుచొచ్చావు కనుక, నా వైష్ణవజ్వరవేదన నీకు కలుగదు, అంతేకాదు మన ఈ వివాదాన్ని మనస్సులో తలచుకొన్నవారికి శీతోష్ణజ్వరాది తాపాలు కలుగవు" అని అనుగ్రహించాడు.

## బాణాసురుడు రెండవసారి యుద్ధానికి రావడం

బాణుడు మళ్ళీ యుద్ధానికి సిద్ధమయ్యాడు. శ్రీకృష్ణుణ్ణి ఎదుర్కొన్నాడు. బాణుడు ఒక్కసారిగా వేయిచేతులతో బాణప్రయోగం చేశాడు. కృష్ణుడు వాటిని అర్ధచంద్ర బాణాలతో ఖండించాడు. బాణాసురునిపై చక్రం ప్రయోగించాడు. అది బాణుని వేయిచేతుల్ని అరటిచెట్లను నరికినట్లు నరికింది. నాలుగు చేతులు మాత్రం మిగిలాయి.

## శివుడు శ్రీకృష్ణుని స్తుతించడం

శివునికి బాణునిపై దయ ఉంది కనుక అతడు కృష్ణుని వద్దకు వచ్చి పురుషసూక్తంతో స్తుతించాడు. శ్రీహరి మనస్సులో సంతసించాడు ఇలా అన్నాడు. శంకరా! నీ కిష్టమైనది అడుగు ఇస్తాను. వీణ్ణి నేను చంపను ఎందుకంటే ప్రహ్లాదుడు నా భక్తుడు. అంతని వంశంలోవారిని ఎవరిని నేను చంపను. వీడు నీభక్తులలో అగ్రే సరుడౌతాడు. అని అనుగ్రహించాడు. శివుడు సంతోషించాడు.

## ఉషానిరుద్ధులతో కృష్ణుడు ద్వారకకు చేరడం

బాణుడు నగరానికి వెళ్ళి ఉషానిరుద్ధులకు వస్త్రాభరణాలిచ్చాడు. వారిద్దరినీ తీసుకుని వచ్చి గోవిందుడు సంతోషించేలా వారిని కృష్ణునికి సమర్పించాడు.

కృష్ణుడు శివుని వద్ద సెలవు తీసికొని బాణుని ఉండుమని చెప్పి అనిరుద్ధునితో తన నగరానికి చేరాడు. మంత్రి, పురోహిత, స్నేహితులు బ్రాహ్మణుల ఆశీర్వచనం పొందుతూ కృష్ణుడు తన మందిరం చేరాడు.

## నృగమహారాజు చరిత్రం

కృష్ణకథలు వింటూ ఉంటే నా మనస్సు తృప్తి కలగటంలేదు అని పరీక్షిత్తు అనగా శుకుడు ఇలా చెప్పసాగాడు. కృష్ణుని కొడుకు లొకరోజున నగరానికి వెలుపల ఉన్న ఉద్యానవననానికి వెళ్ళారు. అక్కడ స్వేచ్ఛగా విహరించారు. వారికి దాహం వేసింది. నీటికోసం వెతుకుతూ ఒకబావి చూశారు పెద్దశరీరంతో ఒక ఊసరవెల్లి కన్పడింది. దాన్ని ఎలాగైన బావి నుండి వెలుపలకు తీయాలనుకున్నారు కాని తీయలేకపోయారు. వెంటనే ఈ విషయం కృష్ణునికి చెప్పారు. ఆయనకు కూడా ఆశ్చర్యం కలిగింది. వెంటనే కృష్ణుడు దాన్ని ఎడమచేతితో లాగి బయటపడవేశాడు. కృష్ణుడికి దాని వృత్తాంతం అంతా తెలిసినా అక్కడ ఉన్నవారికి తెలియడంకోసం ఏమీ తెలియనట్లు దానిచేతనే చెప్పించాడు. అది ఇలా చెప్పసాగింది. "నేను ఇక్ష్వాకువు కొడుకును. నృగుడు నా పేరు. దానరక్షణం చేస్తాను. కాని, ఇలాంటి మాటలతో నేను ఆత్మస్తుతి చేసుకోవడం ధర్మంకాదు అయినా వస్తుస్థితిని చెప్పాలి కదా. నేను దానం చేసిన గోవుల్ని బ్రహ్మకూడా లెక్కించలేడు న్యాయార్జితమైన సొమ్ముతోనే ఎన్నో దానాలు చేశాను. పంచమహా యజ్ఞాలు చేశాను. కశ్యపుడనే బ్రాహ్మణునికి నేను దానం ఇచ్చిన గోవు దారితప్పి నామందలో కలిసింది. ఆ విషయం తెలియక దాన్ని నేను మరో బ్రాహ్మణునికి దానం ఇచ్చాను. ఆతడు గోవును

తీసుకొని వెళ్లుతుండగా పూర్వం దానం పొందిన బ్రాహ్మణుడు "ఇది నా ఆవు" అన్నాడు. వారిద్దరికీ వాగ్వివాదం కలిగింది. వారిద్దరూ నా దగ్గరకు వచ్చారు. 'నీవు దాతవు, అపహర్తవూ కూడా అయ్యావని' నన్ను నిందించారు. ఆ మాటలకు నాకు తెలియక ఈ పాపం జరిగింది. 'నీకు ఒక లక్షగోవుల్ని ఇస్తాను' అన్నాను నేను. ఎంత వేడుకున్నా అతనికి మాత్సర్యం పెరిగిందే తప్ప ఫలితం లేకపోయింది. ఆ విప్రుడు అక్కడ నుండి వెళ్ళిపోయాడు అలాగే రెండో బ్రాహ్మణుడు కూడా తిరస్కరించి వెళ్ళిపోయాడు. కొంతకాలానికి యమదూతలు నన్ను తీసికొని వెళ్ళారు. యముని ముందు నిలబెట్టారు. ఆయన ఇలా అన్నాడు. "బ్రహ్మ ఆజ్ఞను మనం ఎవరమూ దాటలేము" అంటూ యముడు అక్కడినుంచి తోసివేశాడు. అపుడు నేను మరుక్షణంలో భూమిమీద పడ్డాను అప్పటినుండి ఈ ఊసరవెల్లి రూపం వచ్చింది. "కృష్ణా! నీ పాదారవిందాల్ని దర్శించి నిర్మలబుద్ధిని అయ్యాను" అని ఎన్నో విధాల కృష్ణుణ్ణి ప్రశంసించాడు. "నీ పాదాలు సదా నా హృదయంలో నిలిచేటట్లు అనుగ్రహించు" అన్నాడు. వెంటనే తేజోవిరాజితమైన విమానం ఎక్కి స్వర్గానికి వెళ్ళాడు. అపుడు కృష్ణుడు అక్కడి రాజకుమారులకు ధర్మం బోధిస్తున్నట్లు ఇలా అన్నాడు."బ్రాహ్మణుల సొమ్ము అగ్నిజ్వాల! అది రాజుల ఐశ్వర్యసముద్రాన్నే ఇంకింపచేస్తుంది. రాజులకీర్తిని నశింపచేస్తుంది విప్రుల సొత్తుకంటె విషం మేలు. విప్రులసొత్తు నెన్నడూ అపహరించరాదు. బ్రాహ్మణులకు వినయంతో వందనం చేసే పుణ్యాత్ములు నాకిష్టులు. బ్రాహ్మణ భక్తి కలిగి మెలగండి అని చెప్పి కృష్ణుడు నివాసానికి వెళ్ళిపోయాడు. ఇది చదివిన వారికి కైవల్యం కరతలామలకం.

## బలరాముడు మిత్రుల్నీ బంధువులను చూడటానికి వ్రేపల్లెకుపోవడం

ఒకసారి బలరాముడు వ్రేపల్లెకు వెళ్ళాడు. కుశలప్రశ్నలు అయిన తరువాత గోపాలురు ఇంటిపనులు చూసికొని వచ్చి బలరాముని పాదాలకు నమస్కరించారు. బలరాముడు సముచితంగా వారిని సత్కరించాడు. అతడు నందయశోదలకు నమస్కరించాడు. ఉచిత సంభాషణలతో ప్రొద్దుపుచ్చారు. ఇంతలో గోపవనితలు వచ్చారు. బలభద్రుణ్ణి దర్శించారు. మీ తమ్ముడు నగరవనితల విలాసాలలో మునిగిపోయాడా? మమ్మల్ని తలుచుకుంటున్నాడా? మమ్మల్ని విడిచి పెట్టేసినట్లున్నాడు నమ్మినవారిని మరిచిపోవడం ధర్మమా! అంటూ నర్మోక్తులాడారు. అపుడు బలరాముడు కృష్ణసందేశం వినిపించి వారి దుఃఖం తీర్చాడు. వసంతఋతువులో అక్కడే ఉన్నాడు. ఒకనాడు గోపికలతో జలక్రీడలకు సిద్ధమై యమునను అక్కడకు పిలిచాడు. ఆమె ఆ మాటల్ని లక్ష్యపెట్టక ఆలస్యం చేసింది. బలరాముడికి కోపం వచ్చింది కోపంతో బలరాముడు తన నాగలిని ఆ యమునకు తగిలించిలాగాడు. దానితో యమున స్త్రీ రూపం ధరించి బలరాముని పాదాలకు నమస్కరించి "బలరామా! నీ పరాక్రమాన్ని ఆడవాళ్ళు ఎలా తెలిసికోగలుగుతారు? ఆదిశేషుడు కూడా నీ కళతో పుట్టినవాడే. నేను నీ పాదాలు ఆశ్రయిస్తున్నాను" అన్నది. ఆ మాట విని బలరాముడు ఆ నదిని పూర్వమార్గంలోనే వెళ్లమని ఆదేశించాడు. గోపికలతో కలిసి బలరాముడు జలక్రీడలాడాడు. జలకేళిలోనే సంతోషిస్తున్న బలరామునికి ఆ నది నీలవస్త్రం మొదలయినవి సమర్పించింది. ఇలా బలరాముడు నాగలితో లాగడం వలన యమునా నది చీలి ప్రసిద్ధికెక్కింది. అపుడు కరూషాధిపతియైన పౌండ్రకుడు తన దూతను పిలిచి ఇలా అన్నాడు. "హరి తనను తాను వాసుదేవుడనుకుంటున్నాడట. నీవతని దగ్గరకు వెళ్ళి నా పేరు, నా చిహ్నాలు పెట్టుకుని సిగ్గులేకుండా తిరుగుతున్నానని ఇక ముందైనా అవి విడిచి నన్ను సేవించి బతుకమని చెప్పు" అన్నాడు. ఆ మాటలన్నీ యథాతంగా రాజ్యసభలో వినిపించాడు ఆదూత. అపుడా

కృష్ణుడు "ఆ చిహ్నాలన్నీ ధరించే ఆ యుద్ధంలోకి వచ్చి తనకు కూలుస్తానని చెప్పుమని" ఆ దూతను పంపించాడు. ఆ మాటలకు పౌండ్రకునికి వ్యతిరేకత వచ్చింది. వెంటనే కృష్ణుడు కాశీనగరానికి బయల్దేరాడు. పౌండ్రకుడు రెండు అక్షౌహిణుల సేనతో యుద్ధానికి సిద్ధపడగా కాశీరాజు మూడు అక్షౌహిణుల సేనతో అతనికి సహాయం చేశాడు. కృష్ణుడు వారిద్దరి సైన్యాన్ని తుత్తునియలు చేశాడు. కాశీరాజు తలను ఎగిరి కాశీపట్టణంలో పడేట్లు కొట్టాడు. కృష్ణుడు తన పట్టణానికి తిరిగి వచ్చాడు. ఇక్కడొక చిన్నవిషయాన్ని గమనించాలి. పౌండ్రకుడు మాత్సర్యంతో అయినా కృష్ణచిహ్నాల్ని ధరించాడు. అందుకాతనికి ముక్తి లభించింది. కాశీలో పడిన శిరస్సును చూసి విషయం గ్రహించి కాశీరాజు కొడుకు సుదక్షిణుడు "గోవిందుని యుద్ధంలో ఎలా గెలవాలో తెలుపమ"ని అడిగాడు. పురోహితుడు శివుణ్ణి అడిగాడు. దానికి శివుడు "అభిచారహోమం చెయ్యి. అగ్ని నీ కోరిక తీరుస్తాడు" అన్నాడు.

సుదక్షిణుడు అభిచారహోమంచేశాడు. ఆ హోమంనుండి అతిరౌద్రాకారంతో కృత్యవెలువడింది. అది ఆకాశాన్ని మింగివేస్తోంది. నగ్నవేషంలో ఉంది. ఈ విషయం పురజనులు వచ్చి కృష్ణునికి చెప్పారు. కృష్ణుడు ప్రక్కనే ఉన్నచక్రాన్ని చూచాడు. ఆ చక్రాన్ని శౌరి కృత్యమీదకు పంపాడు. చక్రం ఆ కృత్యను తోసిపడేసింది. ఋత్విక్కులతోపాటు సుదక్షిణుడిని కూడా కాల్చివేసింది. తిరిగి వచ్చి కృష్ణుణ్ణిచేరింది చక్రం.

## బలరాముడు ద్వివిదుడను వానరుని సంహరించడం

బలరాముని అద్భుత కృత్యాలు ఇంకాచెప్పుమని పరీక్షిత్తు అడుగగా శుకుడు ఇలా చెప్పారు. సుగ్రీవుని మంత్రి మైందునికి తమ్ముడైన ద్వివిదుడు నరకాసురుని మిత్రుడు నరకునిచంపినవానినిచంపి పగతీర్చుకోవాలనుకున్నాడు. కృష్ణుని ఏలుబడిలోని పట్టణాలను ద్వివిదుడు బాధించేవాడు. ఒకనాడ తనికి ఒక చక్కని గానం వినపడింది. దాని కోసం రైవతకాద్రిలో గుహకువెళ్ళాడు అక్కడ జూదమాడే ఒకణ్ణి చూచాడు. అతడే బలరాముడు. ద్వివిదుడు అతణ్ణి చూచి కొమ్మలమీదకు ఎక్కి ఊగుతూ మధ్యమధ్యలో నాలుక బయటపెడుతూ గర్వంతో వికృత చేష్టలుచేస్తున్నాడు. బలరాముడు, వెంటనే ఒక రాయిపై వాని విసిరాడు. వాడు దాన్ని తప్పించుకుని చెట్టు కొమ్మ ఎక్కి మదిరా పాత్రను కిందకు విసిరాడు. తన ఆయుధాలు చేతపట్టాడు. ఒక చెట్టును పీకి దానితో బలరాముని నెత్తిపై కొట్టాడు. వెంటనే బలరాముడు ఆ ద్వివిదుని కంఠంమీద కొట్టాడు. అయినా వాడు నిలదొక్కుకున్నాడు. ఒక చెట్టుతో బలరాముణ్ణి కొట్టాడు. బలరాముడు వాటినన్నిటిని ఖండించివేశాడు. అపుడు ద్వివిదుడు శిలావర్షం కురిపించాడు. బలరాముడు వాడిని నుగ్గు నుగ్గుచేశాడు. పిడికిటి పోటులుపొడిచాడు. బలరాముడు వెంటనే ద్వివిదునిమెడను బిగించిపట్టుకున్నాడు. అతడు నేలకూలాడు పుష్పవృష్టి కురిసింది. బలరాముడు తిరిగి నగరానికి వచ్చాడు.

## బలరాముడు హలంతో హస్తినాపురమును గంగలో త్రోయబూనడం

సుయోధనునికి లక్షణ అనే కూతురుంది. ఆమెను కృష్ణుడి కొడుకు సాంబుడు ఎత్తుకుపోయాడు. కౌరవులు చూచి వానిని పట్టితెచ్చి చెరలో పెడితే ఆ యాదవులు ఏం చెయ్యగలరని తలచి వెన్నంటారు. సాంబుని బాణాలతో

ముంచివేశారు. అతడు వారినందరినీ విరథులుగాచేసి పూచిన మోదుగుల్లా చేశాడు. వారంతా కలసి గుర్రాలను సూతుణ్ణీ చంపి సాంబుణ్ణి పట్టుకున్నారు. కౌరవులు కన్యతోపాటు సాంబుణ్ని పట్టణానికి తీసుకువచ్చారు. ఈ వార్త నందుని వల్ల యాదవులకు తెలిసింది. ఉగ్రసేనుని అనుమతితో సైన్యం బయల్దేరింది. అది చూచి బలరాముడు కౌరవులు మనకు దగ్గర బంధువులు, దండెత్తరాదు అంటూ వారించాడు. బలరాముడు హస్తినాపురానికి వెళ్లాడు. హస్తినాపురం ఉద్యానవనంలో అతడు నిలిచి కౌరవులకు కార్యబోధ చెయ్యడానికి ఉద్ధవుణ్ణి పంపాడు. అతడు కౌరవుల దగ్గరకు వెళ్ళి బలరాముడు ఉద్యానవనంలో ఉన్నాడని చెప్పాడు. వారుత్సాహంతో బలరాముని దగ్గరకు వచ్చారు. బలరాముడు కుశలప్రశల అనంతరం ఇలా అన్నాడు. మా రాజు ఉగ్రసేనుడు. ఆయన మాటలు కౌరవులు తలదాల్చాలి. ఒక్క బాలుణ్ణి అనేక మంది కలిసి జయించడం మీ తప్పు. అయినా మా రాజు క్షమించాడు. ఆ మాటలకు దుర్యోధనునికి కోపం వచ్చింది. దుర్యోధనుడు “కాలికి తొడుక్కునే చెప్పులు నెత్తి మీదకెక్కాయి. ఈ యాదవులతో సంబంధస్నేహాలుచాలు” అన్నాడు. తన మందిరానికి వెళ్లిపోయాడు. బలరామునికి కోపం పొంగి పొర్లింది. “ఈ కౌరవులు మంచిమాటలు వినరు” అంటూ ఉగ్రుడై నాగలిని చేతబట్టాడు. హస్తినాపురాన్ని గంగలో కలపడానికి యత్నించాడు. నగరం వణికిపోయింది. ఇది చూసి కౌరవులు ఇది బలరాముడు చేసిన ఉపద్రవమే అని భయపడి బలరామునికి చేతులు మోడ్చారు. అతణ్ణి ప్రస్తుతించారు. బలరాముడు భయపడవద్దని మీరుచేసిన అవినీతి పనివల్ల ఇలా చేయవలసి వచ్చిందని వారికి సెలవిచ్చాడు. సుయోధనుడు అల్లుణ్ణీకూతుర్నీ వినయంగా అప్పగించాడు. చక్కని అరణం ఇచ్చాడు. బలరాముడు నగరం చేరాడు.

## శ్రీకృష్ణుని మహిమను నారదు డెరుగుట

ఈ విషయమంతా నారదుడు విన్నాడు. విని ద్వారకకు వచ్చాడు. అంతఃపురాన్ని పదారు వేల భవనాలనూ చూచాడు. కృష్ణుణ్ణి దర్శించాడు. గోపిక లందరి దగ్గరా ఒక్కొక్క కృష్ణుణ్ణి చూసి కృష్ణుడి మహిమకు ఆశ్చర్యంపొందాడు.

జరాసంధుని కారాగారంలో ఉన్న రాజులు పంపిన ఒక బ్రాహ్మణుడు కృష్ణుని దగ్గరకు వచ్చి వారి విన్నపాన్ని కృష్ణునకు విన్నవించాడు. ఈ లోపున ధర్మరాజు రాజసూయయాగాన్ని చెయ్యాలనుకున్న విషయం చెప్పాడు నారదుడు. అప్పుడు కృష్ణుడు ఉద్ధవుణ్ణి నేనిపుడు జరాసంధుణ్ణి వధింపజేసి కారాగారబద్ధులైన రాజుల్ని విడిపించడమా? లేక రాజసూయయాగానికి వెళ్లడమా? ఏది కర్తవ్యం అని అడిగాడు. ఉద్ధవుడు రాజసూయయాగానికి వెళ్ళడమే కర్తవ్యం. ఆ సందర్భంలోనే జరాసంధుణ్ణి వధించే అవకాశం లభిస్తుంది అని చెప్పాడు. కృష్ణుడు ధర్మరాజాదుల ఆహ్వానాన్నందుకుని ఇంద్రప్రస్థపురం వెళ్ళాడు. శ్రీకృష్ణుని అనుమతితో ధర్మరాజు తన తమ్ములను నలుగురినీ నాలుగుదిక్కులకూ జైత్రయాత్రకు పంపాడు. వారు నాల్గుదిక్కుల రాజుల్ని జయించి కప్పాలు తీసుకుని వచ్చారు. జరాసంధుడు కప్పం కట్టడానికి తిరస్కరించాడు. అపుడు కృష్ణభీమార్జునులు బ్రాహ్మణ వేషాలు ధరించి జరాసంధుణ్ణి దర్శించి యుద్ధభిక్ష అడిగారు. అంగీకరించని జరాసంధుడు భీమునితో యుద్ధం చెయ్యడాని కిష్టపడ్డాడు. యుద్ధం మొదలయింది. కృష్ణుడు జరాసంధుని జన్మమరణరహస్యం తెలిసినవాడు కనుక భీమునికి అలసట లేకుండగా అతనిదేహంలో తన దివ్యతేజస్సుని నింపాడు. భీముడు చూస్తుండగా ఒక రెమ్మను రెండుగా చీల్చి సంజ్ఞచేశాడు. దాని అభిప్రాయం తెలిసిన భీముడు జరాసంధుణ్ణి రెండుగా చీల్చి చంపాడు. అపుడు కృష్ణుడు మగధరాజు

కారాగారంలోని రాజులందర్నీ విడిపించాడు. జరాసంధుని కొడుకు అయిన సహదేవుణ్ణి ఆ రాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. ఇంద్రప్రస్థపురానికి తిరిగివచ్చాడు. ధర్మరాజు జరాసంధుని వధ విని ఆనందించాడు. రాజసూయయాగం ప్రారంభమైంది. అగ్రపూజకు సహదేవుని సూచనమేరకు కృష్ణుణ్ణి నిశ్చయించారు.

శిశుపాలుడు కృష్ణునివైభవం చూసి సహించలేక జారుడనీ చోరుడనీ ఇంకా అనేకవిధాలుగా కృష్ణుణ్ణి నిందించాడు. ఆగ్రహించిన కృష్ణుడు శిశుపాలుణ్ణి చక్రంతో ఖండించాడు. ఆ శిశుపాలుడి శరీరంనుండి ఒక తేజస్సు వెలువడి కృష్ణునిలో లీనమైపోయింది. ఈ సందర్భంలో పరీక్షిత్తు శుకుణ్ణి "కృష్ణనింద చేసిన శిశుపాలుడు కృష్ణునిలో లీనమవ్వడానికి కారణమేమిటి?" అని అడిగాడు. కృష్ణుని మీద మాత్సర్యంతో ఎల్లపుడు శిశుపాలుడు "మూడు జన్మలనుండి కృష్ణరూపనామ గుణాల్ని స్మరిస్తూనే ఉండడంచేత ముక్తి పొందాడు" అని సమాధానించాడు శుకుడు. రాజసూయయాగం ముగిసింది. శ్రీకృష్ణుడు అక్కడే మరికొంత కాలం గడిపాడు. రాజసూయ యాగానికి అందరూ సంతోషించినా దుర్యోధనుడు మాత్రం ధర్మరాజు వైభవం చూచి చాలా దుఃఖపడ్డాడు. కృష్ణుని భార్యలతో బాటుగా వారిలో మెరుపు తీగలా మెరిసిపోతూ విహరించే ద్రౌపదిని చూచి దుర్యోధనుడు దుఃఖాక్రాంతుడై పోయాడు. మయసభను చూసిన దుర్యోధనుని దుఃఖం మరీ ఎక్కువైంది. మయసభలో ఆయనపడ్డ భంగపాటు ఆయన మనస్సును దేషాగ్నితో మండించింది. ఆయన పడ్డ భంగ పాటు చూసి ధర్మరాజు సంజ్ఞలతో వారించినా భీముడు పరిహసించాడు. అంతఃపురకాంతలు కూడా నవ్వారు. కృష్ణుడు కుశస్థలికి చేరాడు.

## శివుని అనుగ్రహంతో సౌభక విమానంపై సాల్వుడు ద్వారకపై దండెత్తడం

పూర్వం రుక్మిణీ వివాహంలో హరిచేతిలో ఓడి పోయిన రాజులలో సాల్వరాజు ఒకడు. అతడు శిశుపాలుని మిత్రుడు. శివుని గురించి తపస్సు చేసి "గరుడగంధర్వులకు యక్షరాక్షసులకు దేవేంద్రాదులకు కూడా లేని ఒక విమానాన్ని నాకివ్వు. అది నా ఇచ్ఛ ననుసరించి నడవాలి" అని కోరాడు. హరుడు వాని కోరికకు తగినట్లు నిర్మించు మని మయుణ్ణి నియోగించాడు. మయుడు సౌభకమనేపేరు గల ఒక విమానాన్ని నిర్మించి సాల్వునికిచ్చాడు. అతడు విమానంపై ద్వారకను ముట్టడించాడు. ప్రజలనందరినీ హింసించాడు. అపుడు ప్రద్యుమ్నుడు సాల్వుణ్ణి ఎదుర్కొన్నాడు. యదువీరులందరూ ప్రద్యుమ్నునికి సహాయపడ్డారు. సాత్యకి శత్రుసైన్యాన్ని సంహరించాడు. భానువిందుడు కూడా శత్రుసైన్యాన్ని నుగ్గుచేశాడు. శుక సారణులు కూడా తమ బాహువిక్రమాన్ని ప్రదర్శించారు. సాల్వుని కోపం పెరిగింది. సౌభకాన్ని విచిత్రగతులలో నడిపించాడు. అపుడు యదుసైన్యం చేతిలో దైన్యం పొందిన తన సైన్యాన్ని సాల్వుడు పురికొల్పాడు. ఇరుపక్షాల యోధులకు ద్వంద్వయుద్ధం జరిగింది. ఇలా ఇరవైఏడు రోజులు ఇరువురికి ఘోరయుద్ధం జరిగింది. అపుడు కృష్ణుడు ఇంద్రప్రస్థంనుంచి ద్వారకకువస్తున్నాడు. భూమి మీద ఆకాశంలోను కనపడుతున్న దుర్నిమితాలు చూసి, 'శిశుపాలుదుని మిత్రులు నాపట్టణాన్ని ఆక్రమించి ఉండ వచ్చు, రథాన్ని వేగంగా పోనీ' అని సారథితో అన్నాడు. నగర సమీపానికి వచ్చాడు శత్రువులతో పోరాడుతున్న యదుసైన్యాన్ని చూశాడు. సాల్వుని సౌభక విమానాన్ని చూశాడు. కృష్ణుడు చూస్తూ ఉండగానే దారుకుని మీద ఒక శక్తిని ప్రయోగించాడు. కృష్ణుడు దాన్ని మధ్యలోనే తుంచి వేశాడు. సాల్వుడు ఒక బాణంతో కృష్ణుని ఎడమ భుజంమీద కొట్టాడు. కృష్ణుని ధనుస్సు జారింది. దేవతలు కూడా ఇది చూసి భయపడిపోయారు. ప్రాణులన్నీ

హాహాకారాలు చేశాయి. ఇంతలో కృష్ణుడు తేరుకున్నాడు. 'శిశుపాలుడు కోరుతున్న స్త్రీని నీవు అన్యాయంగా వరించిన పాపాత్ముడవు. నా బాణాగ్నిలో నిన్ను ముంచి నా స్నేహితుని పగతీర్చుకుంటాను' అంటూ సాల్వుడు విజృంభిస్తే కృష్ణుడు సాల్వునిపై ఒక గద విసిరాడు. సాల్వుడు మూర్ఛ పోయాడు. తెలివి వచ్చిన తరువాత విమానంలో తాను అదృశ్యమై పోయాడు.

అంతలో సాల్వుడు వసుదేవుణ్ణి పట్టి తెచ్చాడని ఒక వ్యక్తి శ్రీకృష్ణునికి చెప్పాడు. శ్రీకృష్ణుడు చాలా దుఃఖించాడు. వెంటనే సాల్వుడు కృతకవసుదేవుని కల్పించి వానిని బంధించి తీసుకుని వచ్చి 'ఇడుగో నీ తండ్రి! నీవు చూస్తు ఉండగానే వీడి తలనరుకుతున్నాను' అంటూ కత్తి ఝళిపించాడు. మాయా వసుదేవుని శిరస్సు నరికాడు. ఒక్కక్షణం కృష్ణుడు శోకాన్ని పొందుతూనే 'ఇది మాయోపాయం' అని తెలుసుకున్నాడు. ఇంతలో మునులు వచ్చి అతిభక్తితో కృష్ణుణ్ణిస్తుతించి 'నీకు భయం అనవసరం' అని చెప్పి వెళ్ళారు. వెంటనే కృష్ణుడు సాల్వుని తలమీద రత్నాన్నీ, వింటినీ, కవచాన్నీ తుంచి గద విసిరి సౌభకాన్ని పిండి పిండి చేశాడు. మరుక్షణంలో సాల్వుడు గదను చేతబట్టి నిలిచాడు. కృష్ణుడు సాల్వుని చేతిని ఖండించాడు. శిరస్సును ఖండించాడు.

## శ్రీకృష్ణుడు దంతవక్త్రుని సంహరించడం

ఇదంతా చూసిన దంతవక్త్రుడు పెద్దగదతో కృష్ణుని సమీపించి తలపై గదతో మొత్తగా కృష్ణుడు మరొక గదతో దంతవక్త్రుణ్ణి కొట్టగా అతడు మరణించాడు. దంతవక్త్రుని శరీరంనుండి బయలుదేరిన ఒక తేజస్సు కృష్ణుని శరీరంలో ప్రవేశించింది. తరువాత విదూరథుడు కత్తి వాలుతో కృష్ణునిపైకి రాగా కృష్ణుడు చక్రంతో తల ఖండించాడు. ఈ రీతిగా కృష్ణుడు శిశుపాలాదుల సంహరించి అందరి ప్రశంసలూ అందుకున్నాడు.

## బలరాముడు తీర్థయాత్రకు వెళ్లడం

కౌరవ పాండవులు యుద్ధానికి సిద్ధపడుతున్నారని తెలిసిన బలరాముడు, తీర్థయాత్ర పేరుతో యుద్ధం నుండి తప్పుకోవాలని సంకల్పించి తీర్థయాత్రలకు బయలుదేరాడు. ప్రభాసతీర్థంలో మొదట తర్పణాదులు చేశాడు. తరువాత బ్రాహ్మణులతో కలసి సరస్వతీ బిందు సరోవరం, వజ్ర తీర్థం, జాహ్నవీ తీర్థం మున్నగు అనేక తీర్థాలలో యథావిధిగా స్నానతర్పణాలు చేసి నైమిశారణ్యం చేరుకున్నాడు. అపుడు బలరాముణ్ణి చూచి కూడా సూతుడు తన పీఠంనుంచి లేవలేదు. ఈ దృశ్యం బలరామునికి  కోపం కలిగించింది. బలరాముడు ఒక దర్భను చేత ధరించి మంత్రించి దానితో సూతుణ్ణి వధించాడు. మునులంతా బలరామునితో 'మేము సూతునికి బ్రహ్మాసనం ఇచ్చాం. అందుకని నీవు వచ్చినా ఈతడు ఆసనం దిగలేదు. కాని నీవది గ్రహింపక అతణ్ణి చంపి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకొన్నావు. ప్రాయశ్చిత్తం చేసుకో' అనగానే బలరాముడు విషయం తెలిసి పశ్చాత్తప్తుడై పాపప్రతీకారం ఏమిటో తెలుపవలసిందిగా ఋషుల్ని కోరాడు. వారిమాటల ననుసరించి సూతుణ్ణి పునర్జీవితుణ్ణి చేసి బలం ఆయురారోగ్య సామర్థ్యాలతో ఆ సూతుడు విలసిల్లేటట్లు అనుగ్రహించి, పాపం పోవడానికి పన్నెండు మాసాలు తీర్థయాత్రలు చేయడానికి  నిశ్చయించుకున్నాడు. నైమిశారణ్యంలో మునులు చేసే యజ్ఞాన్ని ధ్వంసం చేస్తున్న పల్వలుడనే రాక్షసుణ్ణి బలరాముడు సంహరించాడు. తీర్థయాత్రలను కొనసాగిస్తూ అనేకనదులలో స్నానంచేస్తూ మహేంద్రపర్వతంమీద ఉన్న పరశురాముణ్ణి దర్శించాడు.

సప్తగోదావరంలో స్నానంచేశాడు. వేణీ పంపానదులను భీమనదిని దర్శించుకున్నాడు. శ్రీశైలం, వేంకటశైలం మున్నగు పర్వతాల్ని శ్రీరంగనాథుణ్ణి సేవించాడు. అక్కడనుండి వృషభాద్రికి మథురాపురానికి రామేశ్వరానికి వెళ్ళి మలయాచలం ఎక్కి అగస్త్యుని దర్శించాడు. దక్షిణసముద్రాన్ని దర్శించాడు. పంచాప్సరస్తీర్థంలో స్నానంచేసి గోకర్ణంలో శివుని దర్శించి వింధ్యదాటి దండకావనానికి వెళ్ళాడు. మాహిష్మతీపురంలో కొన్నాళ్ళున్నాడు. మను తీర్థం సేవించి తిరిగి ప్రభాస తీర్థానికి వచ్చాడు. అక్కడ బ్రాహ్మణులు కౌరవ పాండవ యుద్ధాన్ని గురించి చెప్పి భీమదుర్యోధనులు గదాయుద్ధానికి సిద్ధమౌతున్నట్లు కూడా వారు చెప్పారు. ఆ గదాయుద్ధాన్ని వారించడానికి అక్కడకు వెళ్ళాడు. యుద్ధాన్ని వారించాలని చూచాడు. ఎవరూ బలరాముని మాట వినలేదు. ద్వారకా నగరం చేరాడు, బలరాముడు. అక్కడనుండి నైమిశరణ్యానికి చేరి ఒక యజ్ఞంచేశాడు. తనపురానికి తిరిగిచేరి సుఖంగా కాలక్షేపంచేయసాగాడు.

## కుచేలోపాఖ్యానం

తరువాత పరీక్షిత్తు ఇలా అన్నాడు. పద్మాక్షుని గురించి ఎన్నిసార్లు విన్నా తృప్తి కలగటంలేదు. భగవంతుని గురించి ఇంకా తెలియ జేయవలసిందని అడగగా శుకుడు ఇలా చెప్పాడు.

కుచేలుడని శ్రీకృష్ణునికి ఒక విప్రమిత్రుడున్నాడు. అతడు విజ్ఞాని, విరాగి, శాంతుడు; కాని పరమదరిద్రుడు. దారిద్ర్యం ఎంత బాధిస్తున్నా ఎవరినీ యాచించేవాడు కాడు. అయాచితంగా వచ్చిన దాన్ని సంతోషంగా స్వీకరించేవాడు.

అతని భార్య ఉత్తమకుటుంబంలో పుట్టిన పతివ్రత. ఒకనాడు ఆమె భర్తతో "మహాత్మా! మీకు పద్మాక్షుడు బాల్య మిత్రుడు కదా! ఆ హరిదయతో, మమ్మల్ని ఉద్ధరించండి" అంది. ఇంకా "ఆ భగవంతుడు దయానిధి! మీరు వెళ్లితే సాటిలేని సంపద లిస్తాడు. ఎపుడూ తలుచుకోని దుష్టాత్ముడైనా తనపాదపద్మాలను తలిస్తే, ఆ శ్రీహరి తనను ఐనా ఇచ్చుకుంటాడు. నిశ్చలమైన భక్తితో భజించే వారు మీరు. మీకెందుకివ్వడు?" అంది. కుచేలుడు ఈ మాటలకు ఎంతో సంతోషించి ఈ పని ఇహపరసాధనమని తలచాడు. భార్యతో "నీవు చెప్పింది నిజమే. ఏం తీసుకుని వెళ్ళి ఇస్తే బావుంటుంది" గుప్పెడు అటుకుల్ని ఆమెభర్త అంగవస్త్రానికి కట్టి సాగనంపింది. అతడు ద్వారక చేరాడు. మన్మథమన్మథుడైన శ్రీకృష్ణుణ్ణి చూచాడు. అల్లంత దూరంలో ఉండగా కృష్ణుడు చూసి ఆనందంతో పొంగిపోయి పానుపునుండి దిగి ఆదరంతో తీసికొనివెళ్లి తనతల్పంమీద కూర్చుండ బెట్టుకున్నాడు. భక్తితో కాళ్ళు కడిగి నెత్తిపై చల్లుకున్నాడు. విసన కర్రతో విసిరాడు. కర్పూర తాంబూలం, ధేనువునూ ఇచ్చి స్వాగతం చెప్పాడు. కుచేలునికి శరీరం పులకరించింది. ఈ దృశ్యం చూసిన వారందరూ అందరి చేత ఉపాసింపబడే ఈ కృష్ణుడు ఇంతగా గౌరవిస్తున్న ఈ మునీశ్వరుడెంత తపస్సు చేసాడో ఎంత అదృష్టవంతుడో అనుకున్నారు. కృష్ణుడు కుచేలుని చేతిని తనచేతిలోకి తీసుకున్నాడు. చిన్నతనంలో గురుసన్నిధిలో తమ 'ప్రవర్తనలు కొన్ని చెప్పుకుని సంతోషిస్తున్న సమయంలో కృష్ణుడు కుచేలునితో' నీభార్య నీకు అనుకూలంగా ఉంటోందా? నిన్ను చూస్తూ ఉంటే నీకు భార్యాపుత్రులమీదా సంపదలమీదా మనస్సు ఆసక్తం కాలేదనిపిస్తోంది. ఉత్తములు కామమోహ రహితులై బంధాలు విడిచి నియమవంతులై ఉంటారు. మనం గురువుగారి ఇంట్లో ఎన్నో విజ్ఞానమహిమలు తెలుసుకున్నాం

మనగురువులు సామాన్యులుకారు. బ్రహ్మజ్ఞానాన్ని అనుభవింపచేసే సత్యగుణభరితులు. ఆయన పండిత కీర్తనీయుడు. జ్ఞానవంతుడు. అందరికీ గురువునైన నేను చెప్పిన మాటలు పాటించి నాపాదపద్మాలను ధ్యానిస్తూ సంసార సాగరాన్ని శీఘ్రంగా తరిస్తారు. నీకు గుర్తుండే ఉంటుంది. గురుపత్ని పంపితే మనం కట్టెలకోసం అడవికి వెళ్ళాం. అప్పుడు ఆకాశం అంతా మబ్బులతో నిండిపోయి మెరుపులతో వ్యాపించింది. ఎక్కడ ఉన్నామో తెలియలేదు. రాత్రంతా అలాగే అడవి అంతా తిరిగాం. మన అదృష్టవశాత్తూ కొద్ది సేపటికి పక్షుల కూతలు వినబడ్డాయి. మన గురువుగారి కంఠధ్వని కూడా వినపడింది. మాకోసం వచ్చి మహారణ్యంలో చాలా బాధపడ్డారు, మీరు. మాఋణంతీర్చుకోవడానికి ఇదిచాలు. ఇక మీకు విస్తారమైన జయం, బహుపుత్ర లాభం, ఆయువూ "ఔన్నత్యం అన్ని సమకూరుతాయి." అంటూ, మనల్ని వెంటబెట్టుకుని ఇంటికి తీసుకు వెళ్ళారు గుర్తుందా? అనగానే కుచేలుడు **"పెద్ద మనస్సుతో ఆలోచిస్తే నీవు ముల్లోకాలకూ గురువువి. నీకు మళ్ళీ మరో గురువెవరు? ఇదంతా నీవినోదం"** అని సాభిప్రాయంగా పలికాడు. ఇలా అంటూ ఉండగానే కృష్ణుడు చిరునవ్వుతో **"నాకు కానుకగా ఏంతెచ్చావు? నీవు తెచ్చింది పత్రమైనా పువ్వైనా, పండైనా, నీళ్ళైనా, సరే భక్తితో సమర్పిస్తేచాలు నేను దానిని రుచిరాన్నంగా భావిస్తాను."** కృష్ణుని ఈ మాటలకు కుచేలుడు ఎంతో సంతోషించాడు. తాను తెచ్చిన అటుకుల్ని కృష్ణునికి అర్పించడానికి సిగ్గుపడుతుండగా కృష్ణుడే కుచేలుని అంగవస్త్రంలో కట్టినా అటుకుల మూటను విప్పి 'ఇది ఏమిటీ' అంటూ ఆ అటుకులు కొన్ని ఆరగించాడు. అంతతో ఆగక ఇంకో పిడికెడు తీసుకోబోతే వెంటనే రుక్మిణి కృష్ణుని చెయ్యిపట్టుకుని ఆపింది. సర్వాత్మా! ఆయనకు సంపదలివ్వడానికి ఇవే సరిపోతాయి. ఇక చాలు, అంది. కుచేలుడు ఆ రాత్రి కృష్ణుని మందిరంలోనే మృదులమైన శయ్యపై నిద్రించాడు. తనను తాను స్వర్గంలో ఉన్నట్లు భావించుకున్నాడు. మరునాటి ఉదయం కాలోచితకృత్యాలు తీర్చుకుని కృష్ణుడు సాగనంపగా తన ఊరికి సాగిన కుచేలుడిలా భావించాడు. "నాపుణ్యం ఎటువంటిదో కాని పుణ్యాత్ముడు, ప్రశాంతుడూ, అచ్యుతుడూ, అయిన శ్రీకృష్ణుణ్ణి దర్శించుకున్నాను. ఆలోచిస్తే నేనెక్కడ ? ఆ వాసుదేవుడెక్కడ? తమ్మునిలా నన్ను కౌగిలించుకున్నాడు. నాపాదాలు ఒత్తాడు. నన్ను కృతార్థుణ్ణి చేశాడు. ఇదంతా ఆయనదయ," అని ధ్యానిస్తూ ఆనందంలో పరవశిస్తూ భవబంధాలు నశించి మోక్షంపొందాడు.

## శ్రీకృష్ణుడు గ్రహణస్నానానికి వెళ్లడం

ఈ మాటలు విని శుకునితో పరీక్షిత్తు ఇలా అన్నాడు. "దుష్ట శిక్షణకు, పాప సంహరణానికి మనుష్యుడుగా పుట్టిన కృష్ణుని నిర్మలమైన చరిత్ర అంతా నాకు వివరంగా చెప్పు" అన్నాడు. శుకుడు ఇలా చెప్పసాగాడు.

బలరామ, కృష్ణులు సుఖసంతోషాలతో ఉండగా ఒకసారి సూర్య గ్రహణం వచ్చింది. అందరూ బలరామ కృష్ణులతో బాటు శమంత పంచకానికి వెళ్ళారు. అక్కడే పూర్వం రాజుల శరీరాలనుండి పరశురాముడు రక్తపుటేరులు ప్రవహింప చేశాడు. ఆ రక్తాన్ని అయిదు మడుగులు చేశాడు. ఆ పుణ్యతీర్థంలో స్నానంచేసి ఉపవాసం చేశారు. విప్రులకు వివిధ వస్తువులు దానంచేశారు. వివిధదేశాల రాజులు ఉగ్రసేనాదియాదవ ప్రముఖుల్ని పూజించారు. కృష్ణుణ్ణి చూశారు. బలరామ కృష్ణులు కూడా వారందరినీ పూజించి తృప్తిచెందారు. వారంతా ఇలా అనుకున్నారు. "ఈ హరి కేవల మోక్ష స్వరూపుడు. వీరిస్నేహం మహాభాగ్యం" అనుకున్నారు. ధైర్యం కోల్పోయి కన్నీరు పెట్టుకుంటున్న

చెల్లెలయిన కుంతిని చూసి వసుదేవుడు అన్నాడు. “కరుణామయుడైన ఈ హరి ఉన్నాడు కాబట్టి మాకు మళ్ళీ ఇల్లు చేరుకునే అవకాశం కలిగింది.” ఇట్లా అంటూ వసుదేవుడు వారిని సత్కరించాడు. రామ కృష్ణులు నందునికి యశోదకు నమస్కరించారు. రోహిణి, దేవకి ఇద్దరూ యశోదను కవుగలించుమని ఆమె చేసిన ఉపకారాలు తలుచుకున్నారు. ఇలా అందరూ మాటలాడుకుంటూ ఉంటే గోపికలకు గోవిందుని చూడాలనే తలపులు అధికం అయ్యాయి. శరీరం మీద పులకలు రేగాయి. కృష్ణుణ్ణి చూస్తూ కన్నులు మూయలేక పోయారు. పరబ్రహ్మాన్ని చూసిన యోగినుల్లా పరవశించి పోయారు. వారి భావాల్ని గ్రహించాడు కృష్ణుడు. ఏకాంతంలో వారిని ప్రీతితో కౌగిలించుకున్నాడు. శత్రువిజయం కోసంవెళ్ళాను. చాలా ఆలస్యం అయ్యింది. ఎక్కువ అలుక వహించకండి **దైవం ఎపుడు ఇలాగే చరాచరాల్ని రెండింటినీ కూడా ఒకసారి కలుపుతూ ఒక సారి విడదీస్తూ ఉంటుంది. కాని గోపికలారా! ప్రాణులకు నామీద భక్తి మోక్షాన్నీ ఆనందాన్నీ ఇస్తుంది. కొద్దిగా ఆలోచిస్తే బ్రహ్మ, శివుడు, సనకాదుల మనస్సులలో కూడా పుట్టని భక్తి మీకు కలిగింది. అది మీ పూర్వపుణ్యం. అది ఇప్పుడు తుదముట్టింది. నాయందే బుద్ధి నిలిపి ధ్యానించండి. జన్మకర్మలు ఇకమీద మీకు కలుగవు. నాకంటె పరమైన దేదీ లేదు. అనగానే వారికి జ్ఞానోదయం అయింది. దేహాభిమానం పోయింది. ‘నీపాద పద్మాలను మామనస్సులో సదానిలిచే విధంగా చెయ్యి’ అని ప్రార్థించారు. కృష్ణుడు అట్లే అని వారిని అనుగ్రహించాడు.**

ధర్మరాజును చూసి కృష్ణుడు “నీవూ నీతమ్ముళ్ళు నిర్మల భక్తితో సత్కర్మలు చేస్తూ సుఖంగా ఉంటున్నారా?” అని అడిగాడు. అపుడు ధర్మరాజు ‘భక్తపారిజాతమా! నీ పాదపద్మాలు ఆశ్రయించే జనులు అతిసౌఖ్యం పొందుతూ సంచరిస్తారు కదా. విశ్వమంతా నీవే అయి ఉన్నావు. సర్వలోకైక నాథా! నీకు నమస్కరిస్తున్నాను అని ప్రశంసించాడు. ఈ మాటలు బంధుమిత్రులు సకల జనులూ విని ఆనందించారు. ఆ సమయంలో శ్రీకృష్ణుని భార్యలూ, ద్రౌపదీ కలసి ముచ్చటలాడుకుంటున్నారు.

## లక్షణ ద్రౌపదికి తన వివాహ వృత్తాంతం చెప్పడం

ఈ సందర్భంలో ద్రౌపది కృష్ణుని భార్యల్ని చూచి, “మిమ్మల్ని కృష్ణుడు వివాహమాడిన విధం చెప్పండి” అని అడిగింది. వారు కూడా తమపరిణయాలను గూర్చి నేను నీకు చెప్పిన రీతిగానే వినిపించారు. అందులో నేను చెప్పని మద్రరాజ కన్యకావృత్తాంతం ఆమెయే ద్రౌపదికి చెప్పింది. ‘అది చెప్తాను’ విను అని శుకుడు పరీక్షిత్తుతో ఇలా అన్నాడు. ద్రౌపదితో లక్షణ ఇలా చెప్తోంది. “నారదుని నుండి గోవిందుని కథామృతం విని నామనస్సు తన్మయం అయింది. అంతలో నామీది వాత్సల్యంతో నా సంగతి విని నా తండ్రి ఒక మంచి ఉపాయం ఆలోచించాడు. ఆకాశంలో కనిపించకుండా కేవలం నీటి మధ్యలో తిరుగుతూ ఉండే మత్స్యయంత్రాన్ని కల్పించాడు. ఎంతవారయినా ఎక్కుపెట్టలేని ధనుస్సును అస్త్రాన్నీ అక్కడ ఉంచాడు. ఈ వింటిని ఎక్కుపెట్టి బాణాన్ని సంధించి మత్స్యయంత్రాన్ని కూల్చిన మహితుణ్ణి నా కూతురు వరిస్తుంది అని చాటింపు వేయించాడు. రాజు లెందరో మద్ర నగరానికి వచ్చారు. వారా ధనుస్సును చూచి సమీపించి ఎత్త ప్రయత్నించారు. కొందరు దానిని ఎత్త లేకపోయారు. మరి కొందరు ఎత్తినా కదల్పలేకపోయారు. ఇంకా కొంతమంది ఎక్కుపెట్టలేక పోయారు. కొంతమంది కొద్దిగా ఎక్కుపెట్ట

గలిగారు. ఇలా రాజులు చాలామంది విఫలులయ్యారు. భీముడు, కర్ణుడు దానిని ఎక్కుపెట్టినా మత్స్యయంత్రాన్ని కొట్టలేక పోయారు.

అర్జునునికి దానిని కొట్టే విధానం తెలుసును. కాని, కొట్టినా ఆచేపను కింద పడవేయలేక పోయాడు. ఇలా రాజకుమారులు తెల్లబోయిచూస్తున్నారు. ఇంతలో కృష్ణుడు మత్స్యయంత్రాన్ని కొట్టాడు. జయజయ శబ్దాలతో ఆకాశంనుండి పూల వాన కురిసింది. నాముఖం పద్మంవలె వికసించింది. నేను సభామధ్యంలోని వచ్చి చూచాను. ఆ రాజులనందరినీ కాదని స్వయంవరమాలను కృష్ణుని కంఠంలో వేశాను. శ్రీకృష్ణుడు నన్ను బంగారు రథంమీదకు చేర్చాడు.

రాజులందరూ కృష్ణుని వైభవం చూడలేక పోయారు. కృష్ణుణ్ణి ఎదిరించారు. కృష్ణుడు పాంచజన్యం పూరించి తనను చుట్టుముట్టిన రాజులందరినీ పారద్రోలాడు. కృష్ణుడు నన్ను తీసికొని ద్వారకానగరం చేరాడు

## నారదాదులు వసుదేవునిచే క్రతువు చేయించడం

బలరాముని శరీరం తెల్లని కాంతితో మెరుస్తుంది. శ్రీకృష్ణుని శరీరం నల్లని కాంతితో ఉంటుంది వారిని చూడటానికి నారదాది మహర్షులు ఎంతో ఉత్సుకతతో విచ్చేశారు. వారందరికీ కృష్ణుడు స్వాగతం పలికి ఎంతో ఆదరించాడు. వారందరూ కృష్ణుని మహిమను ప్రశంసించారు. సెలవు తీసికొని వెళ్ళే సమయంలో వసుదేవుడు చేసిన పాపాలను పోగొట్టుకునే ఉపాయం నాకు చెప్పవలసిందని వారిని అడిగాడు. అపుడు వారు "కృష్ణుణ్ణి గురించి యాగం చెయ్యండి" అని చెప్పారు. ఆయాగంలో దేవ ఋణం తీర్చినట్లు అవుతుందని చెప్పారు. అదే విధంగా వసుదేవుడు యాగం చేశాడు. వారందరి కోరిక ప్రకారం నందయశోదలు బలరామకృష్ణులు మూడు నెలల పాటు ద్వారక లోనే ఉన్నారు.

## బలరామ కృష్ణులు మృతులైన తమ సోదరుల్ని యమపురంనుండి తీసికొని రావడం

ఒకనాడు దేవకి "రామ కృష్ణులిద్దరూ సముద్రంలోనికి వెళ్ళి గురు పుత్రుణ్ణి తీసికొని వచ్చిన విషయం విన్నది. కంసుని చేతిలో చనిపోయిన తనకొడుకుల్ని చూడాలి అనుకుంది. బలరామకృష్ణులకు తన కోరిక విన్నవించింది. వెంటనే వీరిద్దరూ యోగమాయా శక్తి వల్ల సుతలానికి వెళ్ళారు. అక్కడ బలి చక్రవర్తి రామ కృష్ణుల్ని చూచాడు. బలి వీరిరువురికీ నమస్కరించి స్వాగతించాడు. "దేవకీ పుత్రుల్ని కంసుడు చంపి వేశాడు వారిని తీసుకు వచ్చేందుకు మాతల్లి మమ్మల్ని పంపింది. వారు నా దగ్గర ఉన్నారు. వారిని తీసుకుని వెళ్లి మాతల్లి కోరికను తీర్చాలి అని బలితో చెప్పి వీరిని భూమండలానికి తీసుకునివచ్చి తల్లికి అప్పగించారు. దేవకి వారిని కౌగిలించుకుని మోహ పరవశ అయ్యింది. భగవంతుడైన చక్రాయుధుని శరీర స్పర్శతో వారి మనస్సు కుదుట పడింది. వారు నిజరూపాలు ధరించి తమతమస్థానాలకు వెళ్ళి పోయారు. దేవకి చాలా ఆశ్చర్యపడింది.

## సుభద్రా పరిణయం

శుకమహర్షి ఇలా చెప్పనారంభించాడు – అర్జునుడు తీర్థయాత్రకోసం ప్రభాసతీర్థంలో ఉన్నాడు. సుభద్రమీద అతనికి ప్రేమ. బలరాముడును ఆమెను దుర్యోధనునికి ఇవ్వాలనుకుంటున్నాడని తెలుసుకున్నాడు. త్రిదండి

వేషంధరించాడు. ద్వారక నగరానికి వచ్చి వర్ష కాలమంతా అక్కడే ఉన్నాడు. అక్కడ యతివేషంతో ఉన్నాడు. ఒకనాడు అతడు పడుతున్న కష్టంచూచి బలరాముడు ఆ యతిని తనయింటికి తీసుకుని వచ్చి భిక్ష ఇచ్చారు. అర్జునుడు భిక్ష స్వీకరిస్తూ సుభద్రను చూచాడు. సుభద్ర కూడా అపుడే అర్జునుణ్ణి చూసింది. ఇరువురు మన్మథావేశానికి లోనయ్యారు. ఇలా ఉండగా ఒకనాడు ఆ నగరంలో దేవతా మహోత్సవం జరిగింది. సుభద్ర నగరంబయిటకు వచ్చింది. అర్జునుడు కృష్ణుని యొక్క దేవకీ వసుదేవుల అనుజ్ఞను తీసికొని తనుకూడా ఆమెతో వెళ్ళారు. అర్జునుడు ఆమెను తన రథంపైకి తీసుకొన్నాడు. యాదవసైన్యాలు అర్జునుణ్ణి అడ్డుకోగా వారినందరిని పరాభూతుల్ని చేశాడు. అర్జునుడు ఖాండవ ప్రస్థానికి వెళ్ళాడు. ఈ వార్త విని బలరాముడు క్రుద్ధుడయ్యాడు. కృష్ణుడు మొదలయిన వారు ఆయనను అనునయించారు. అపుడు బలరాముడు సుభద్రను అనునయించి పంపించాడు.

## కృష్ణుడు ఋషులతో కలసి మిథిలా నగరానికి వెళ్లడం

శుకుడు ఇంకా ఇలా చెస్తున్నాడు. "విదేహ దేశంలో కథ సిద్ధమైనది. భూకాంత ముఖం చూచుకునేం దుకు పెట్టిన అద్దంలా ఉంటుంది మిథిల. ఆ నగరంలో శ్రుతదేవుడు అయాచితంగా వచ్చిన దాన్ని మాత్రమే స్వీకరిస్తాడు. గృహస్థోచితమైన కర్మలు మాత్రమే చేస్తాడు. ఆపట్టణాన్ని బహుళాశ్వుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. కృష్ణుడు గురువులను చూడాలని అక్కడకు బయలు దేరాడు. నారదాది మహర్షులు నేను (శుకుడు) అతణ్ణి అనుసరించాం. విదేహ నగరాన్ని సమీపించాం. కృష్ణుని రాక బహుళాశ్వునికి తెలిసింది. రాజు తాను శ్రుతదేవుడనే విప్రుడు ఆ మునులందరికి ఎదురు వచ్చి నమస్కరించారు. ఎంతో వినయంతో 'మాపూజలను అనురాగంతో స్వీకరించండి' అని వేడుకున్నారు. కృష్ణునికి మనస్సులో ఎంతో సంతోషం కలిగింది. వారిలో ఒకరికొకరికి తెలియకుండగా ఏక కాలంలోనే వారిమందిరాలకు వెళ్ళాడు. అక్కడ వారి పూజల నందుకున్నాడు. జనకుడు కృష్ణునితో ఇలా అన్నాడు. ఉత్తమజ్ఞానీ! నీవు ప్రాణుల ఆత్మలలో కర్మ సాక్షివై ఉంటావు. భక్తవత్సలుడవు. మాకడకు విజయం చేశావు. నిన్ను కోరే యోగీంద్రులకు నిన్నైనా ఇచ్చేస్తావు కదా. నా గృహాన్ని పావనం చేస్తే నేనిపుడు ధన్యుణ్ణి అవుతాను అని ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు వారి ఇంటికి వెళ్ళి అక్కడ కొన్నిదినాలున్నాడు. శ్రుతదేవుడు కృష్ణుని మాటననుసరించి కృష్ణునితో వచ్చిన మునులందరిని పూజించాడు. వారిదగ్గర సెలవు తీసికొని కృష్ణుడు కుశస్థలికి తిరిగి వచ్చాడు.

## శ్రుతిగీతలు

పరీక్షిత్తు అడిగిన 'బ్రహ్మమునుండి సత్త్వాదిగుణాలు ఎలా ప్రవర్తిస్తాయి' అనే ప్రశ్నకు శుకమహర్షి ఒక కథ చెప్పాడు. అది నారాయణుడు చెప్పిన కథ. నారదుడొకసారి నారాయణుని ఆశ్రమానికి వెళ్ళి ఆయనను దర్శించి సత్త్వాదిగుణాలు లేని బ్రహ్మములో సత్త్వాదిగుణాలచే తెలియబడే వేదాలు ఎలా ప్రవర్తిస్తాయి అని అడిగాడు. నారాయణుడొక కథ చెప్పాడు. ఈ విధమంతా నారాయణుడు నారదుడికి చెప్పాడని చెప్పి ఆ విధమంతా చెప్ప సాగాడు. "దేవా! నీకు జ్ఞానశక్తి షడ్గుణాలు పరిపూర్ణంగా ఉన్నాయి. మాయతో కలిసిన ఆత్మస్వరూపవు మాకు ప్రకృతితో సంబంధంలేకుండా చెయ్యి అని వేదాలు స్తోత్రాలు చేస్తాయి, ప్రళయసమయంలో యోగనిద్రలో మునిగిన సర్వేశ్వరుని వేదాలు స్తుతించిన పద్ధతిని శుకుడు పరీక్షిత్తుకు చెప్పాడు. అదే విధంగా శుకుడు విష్ణు సేవామహత్త్వాన్ని

పరీక్షిత్తుకు వివరించాడు. శివుని వరం పొంది ఆ వరాన్ని పరీక్షించడానికి శివుని నెత్తిమీద చేయి పెట్ట బోయిన వృకాసురుని వారించి, శ్రీమహావిష్ణువు వృకాసురుని అతని నెత్తిమీద అతడే చెయ్యి పెట్టుకొనేటట్లు చేసి నశింపజేశాడు.

శుకునికి మరో వృత్తాంతం చెపుతున్నాడు. మునులకు "త్రిమూర్తులలో ఎవరు గొప్పవా" రనే ప్రశ్న కలిగింది. ఈ సంశయం నివారించుమని భృగువును మహర్షులు అడిగారు. భృగువు త్రిమూర్తుల దగ్గరకు వెళ్లి ముగ్గురిలో సత్త్వ గుణ సంపన్ను డయిన శ్రీమహా విష్ణువే శ్రేష్ఠుడని వారిని పరీక్షించి నిర్ణయించుకొన్నాడు. భృగుమహర్షి విష్ణు వక్షఃస్థలం మీద తన్నినా విష్ణువు కోపం చెందక పోవటమే విష్ణువు యొక్క సాత్త్విక స్వభావానికి నిదర్శనం.

శ్రీకృష్ణుడు కుశస్థలిలో ఉండగా ఒక విప్రుడు వచ్చి మృతశిశువును రాజద్వారం దగ్గర ఉంచి కన్నీరు కారుస్తూ విలపించాడు. తత్పూర్వం ఆ విప్రుడే తన ఎనమండుగురు మృత శిశువుల్ని తెచ్చి రాజద్వారం దగ్గరుంచి ఆ రాజును నిందిస్తూ విలపించాడు. ఇది విన్న అర్జునుడు మరొక సారి పుత్రుడు పుట్టే సమయంలో తనకు చెప్తే తాను రక్షిస్తానన్నాడు. విప్రుడదే విధంగా చెప్పాడు. అర్జునుడు తన విద్యలతో పురుటింటి చుట్టూ ఎన్ని కట్టుదిట్టాలు చేసినా పుత్రుని రక్షించలేక పోయాడు. ఇది అవమానంగా భావించి అగ్ని ప్రవేశం చేయాలనుకొన్నాడు అర్జునుడు. శ్రీకృష్ణుడు వారించి అర్జునుని వైకుంఠానికి తీసికొని వెళ్ళి ఆ పుత్రులను అర్జునునకు చూపించి విప్రునికిచ్చాడు.

శ్రీకృష్ణుడు ద్వారకలో రాజ్యం చేస్తూ పదారువేల మంది గోపికలను ఆనంద పరుస్తూ లోకంకోసం సంసారివలె ప్రవర్తించాడు. రుక్మిణి మొదలైన అష్టమహిషులకు ఒకొక్కరికి పదిమంది చొప్పున అదే విధంగా పదారువేల నూర్గురు గోపికలకు అనేక వేల కుమారులు జన్మించారు. వారికి విద్య నేర్పే గురువులే మూడు కోట్ల ఎనభై వేల ఒక వందమంది ఉన్నారు. (అనగా ఆకుమారులను లెక్కించలేము) పూర్వం దేవదానవ యుద్ధంలో చనిపోయిన రాజులంతా ద్వాపరంలో రాజులుగా పుట్టి ప్రజలను బాధింప సాగారు. వారిని వధించటానికి శ్రీహరి దేవతలను యదు వంశంలో పుట్టించాడు. వారు నూటొక్క కులాలుగా ప్రసిద్ధికెక్కారు.

**– తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

# విషయసూచిక

## దశమస్కంధము - ఉత్తరభాగము

పోతన గారి భాగవత పద్యాలు

నల్లని వాడు పద్మనయనంబులు వాడు కృపారసంబుపై జల్లెడువాడు
మౌళి పరిసర్పిత పింఛము వాడు నవ్వు రాజిల్లెడు మోము వాడొకడు
చెల్వల మానధనంబు దెచ్చెనో మల్లియలార
మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే॥



శ్రీరస్తు

# శ్రీ మహాభాగవతము

## దశమస్కంధము - ఉత్తరభాగము

**శ్రీకర! పరిశోషిత ర, త్నాకర! కమనీయగుణగణాకర! కారు**
**ణ్యాకర! భీకరశర ధా, రా కంపితదానవేంద్ర! రామనరేంద్రా!** **1**

**ప్రతిపదార్థం :** శ్రీకర= శ్రీలు కల్గించేవాడా!; పరిశోషిత= ఇంకిపోవునట్లు చేయబడ్డ; రత్న+ఆకర= సముద్రం కలవాడా!; కమనీయ= మనోహరమయిన; గుణ= గుణాలయొక్క; గణ= సమూహమునకు; ఆకర= నిలయం అయినవాడా!; కారుణ్య= దయకు; ఆకర= గని అయినవాడా!; భీకర= భయాన్ని కలిగించే; శర= బాణాలయొక్క; ధారా= పరంపరలచేత; ఆకంపిత= మిక్కిలి వణకేటట్లు చేసిన; దానవ+ఇంద్ర= రాక్షసరాజయిన రావణుడు కలవాడా!; రామ నర+ఇంద్రా!= రాముడనే పేరు కలిగిన రాజా!

**తాత్పర్యం :** అష్టైశ్వర్యాలూ అనుగ్రహించేవాడా!,సముద్రాన్ని ఇంకింపజేసినవాడా! మనస్సును ఆకర్షించే సర్వసద్గుణాలూ కలవాడా! దయకు గని అయినవాడా! భయం కలిగించే బాణపరంపరలు ప్రయోగించి, రావణాసురుణ్ణి నిలువెల్లా కంపింపజేసినవాడా! శ్రీరామచంద్రా!

**విశేషం :** శ్రీకరుడు అంటే విష్ణు వని అర్థం. ధనం, ధాన్యం, వస్తువు, వాహనం, పుత్రుడు, మిత్రుడు, బంధువు, దాసుడు అనే ఎనిమిది విధాలైన సంపదను కలిగించేవాడా! అందువల్ల శ్రీకర! అనే సంబోధనకు సాక్షాద్విష్ణుమూర్తి అనే అర్థం. రాముడు నారాయణుని అవతారం.

**వ. మహనీయ గుణగరిష్ఠులగు న మ్మునిశ్రేష్ఠులకు నిఖిలపురాణవ్యాఖ్యానవైఖరీసమేతుండైన సూతుం డిట్లనియె, నట్లు ప్రాయోపవిష్టుండైన పరీక్షిన్నరేంద్రుండు రుక్మిణీపరిణయానంతరంబున నైన కథావృత్తాంతం బంతయు వినిపింపు మనిన శుకయోగీంద్రుం డిట్లనియె.** **2**

**ప్రతి :** మహనీయ= గొప్పవైన; గుణ= గుణాలచేత; గరిష్ఠులు= అధికులు; అగు= అయిన; ఆ+మునిశ్రేష్ఠులకున్= ఆ మహామునులతో; నిఖిల= సమస్తమైన; పురాణ= పురాణాలయొక్క; వ్యాఖ్యాన= వ్యాఖ్యానంయొక్క; వైఖరీ= విధానంతో; సమేతుండు= కూడుకొన్నట్టివాడు; ఐన= అయినట్టి; సూతుండు= సూతుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; అట్లు= ఆ విధంగా; ప్రాయ= సర్వకర్మపరిత్యాగం చేసి మరణం కోరి కావించే ఉపవాసమందు; ఉపవిష్టుండు= కూర్చున్నవాడు; ఐన= అయినట్టి; పరీక్షిత్= పరీక్షిత్తు అనే; నర+ఇంద్రుండు= రాజు; రుక్మిణీపరిణయ= రుక్మిణితో వివాహం; అనంతరంబునన్= జరిగిన తర్వాత; ఐన= నడిచిన; కథా= కథకు సంబంధించిన; వృత్తాంతంబు= సమాచారం; అంతయున్= సమస్తమూ; వినిపింపుము= చెప్పుము, అనినన్= అని అడుగగా; శుక= శుకుడనే; యోగి+ఇంద్రుండు= యోగిశ్రేష్ఠుడు; ఇట్లు= చెప్పబోయేవిధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** మహాగుణవంతులయిన శౌనకాదిమునీశ్వరులతో సకలపురాణాలనూ వ్యాఖ్యానింపగలిగిన సూతుడు ఈ విధంగా అన్నాడు. ప్రాయోపవేశం చేస్తున్న పరీక్షిన్మహారాజు “శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని వివాహం చేసుకొన్న తర్వాత జరిగినకథంతా చెప్పండని శుకమహర్షిని అడిగాడు. అప్పుడు ఆ మహాయోగి ఈ విధంగా అన్నాడు.

## ❖ ప్రద్యుమ్నకుమార చరిత్ర ప్రారంభము ❖

**ఉ. తామరసాక్షునంశమున దర్పకుఁ డీశ్వరు కంటిమంటలం**
**దా మును దగ్ధుఁడై పిదపఁ దత్పరమేశుని దేహలబ్ధికై**
**వేమఱు నిష్ఠఁజేసి హరివీర్యమునం బ్రభవించె రుక్మిణీ**
**కామినిగర్భమం దసురఖండనుమాఱటమూర్తియో యనన్. 3**

**ప్రతి :** మును= పూర్వం; తామరస+అక్షు= పద్మాలవంటి కన్నులు గలవానియొక్క, విష్ణువుయొక్క; అంశమునన్= అంశతో; దర్పకుఁడు= మన్మథుడు; తాన్= తాను; ఈశ్వరు= శివునియొక్క; కంటి= మూడవకంటియొక్క; మంటలన్= మంటల్లో; దగ్ధుఁడు= బూడిద అయినవాడు; ఐ= అయి; పిదపన్= తర్వాత; దేహ= శరీరంయొక్క; లబ్ధికిన్+ఐ= ప్రాప్తికై; తత్= ఆ; పరమ+ఈశునిన్= పరమశివుణ్ణిగూర్చి; వేమఱు= చాలాసార్లు; నిష్ఠన్= శ్రద్ధతో; చేసి= తపస్సుచేసి; హరి= కృష్ణునియొక్క; వీర్యమునన్= వీర్యంచేత; రుక్మిణీకామిని= రుక్మిణీదేవియొక్క; గర్భము+అందున్= కడుపున; అసుర= రాక్షసులను; ఖండనున్= సంహరించేవానియొక్క; శ్రీకృష్ణునియొక్క; మాఱట+మూర్తి+ఓ= ప్రతిరూపమా; అనన్= అనగా; ప్రభవించెన్= జన్మించాడు.

**తా :** పూర్వం నారాయణాంశ ఉన్నప్పుడే మన్మథుడు శివునికంటిమంటల్లో భస్మమయ్యాడు. తర్వాత అతడు పరమేశ్వరుణ్ణిగూర్చి అనేకపర్యాయాలు శ్రద్ధతో తపస్సుచేశాడు. ఆ తపస్సుకు ఫలంగా రుక్మిణీకృష్ణులకు కుమారుడై పుట్టాడు. ఈ పునర్జన్మంలో మన్మథుడు శ్రీకృష్ణుని మరొకరూపమా అన్నట్లున్నాడు.

**వ. అంత నా డింభకుండు ప్రద్యుమ్నుండను పేర విఖ్యాతుం డయ్యె, నా శిశువు సూతికాగృహంబునఁ దల్లి పొదిఁగిట నుండం దనకు శత్రుం దని యెఱింగి శంబరుండను రాక్షసుండు దనమాయాబలంబునం గామరూపియై వచ్చి కొనిపోయి, సముద్రంబులో వైచి, తన గృహంబునకుం జనియె, నంత నా శాబకుండు జలధిజలంబునం దిగఁబడ నొడిసి యొక మహామీనంబు మ్రింగె, నందు. 4**

**ప్రతి :** అంతన్= తరువాత; ఆ డింభకుండు= ఆ శిశువు; ప్రద్యుమ్నుండు= ప్రద్యుముడు; అను= అనే; పేరన్= పేరుతో; విఖ్యాతుండు= ప్రసిద్ధుడు; అయ్యెన్= అయ్యాడు; ఆ శిశువు= ఆ శిశువు; సూతికాగృహంబునన్= పురుటింటిలో; తల్లి= తల్లియొక్క; పొదిఁగిటన్= సందిటిలో; ఉండన్= ఉండగా; తనకున్= తనకు; శత్రుండు= శత్రువు; అని= అని; ఎఱింగి= తెలుసుకొని; శంబరుండు= శంబరుడు; అను= అనేపేరు కలిగిన; రాక్షసుండు= రాక్షసుడు; తన= తనయొక్క; మాయాబలంబునన్= మాయాశక్తిచేత; కామరూపి= కోరినరూపాన్ని ధరించేవాడు; ఐ= అయి; వచ్చి; కొనిపోయి= ఎత్తుకొనిపోయి; సముద్రంబులోన్= సముద్రంలో; వైచి= పడవేసి; తన= తనయొక్క; గృహంబునకున్= ఇంటికి; చనియెన్= వెళ్లాడు; అంతన్= తర్వాత; ఆ శాబకుండు= ఆ శిశువు; జలధి= సముద్రంయొక్క; జలంబునన్= నీటిలో; దిగన్+పడన్= కిందికి పోగా; ఒక; మహామీనంబు= పెద్దచేప; ఒడిసి= హఠాత్తుగా పట్టి; మ్రింగెన్= మింగేసింది; అందున్= ఆసముద్రంలో...

**తా :** ఆ శిశువే తర్వాత ప్రద్యుమ్ను డనేపేరుతో ప్రసిద్ధికెక్కాడు. అయితే ఆ పసిగందును శంబరు డనేరాక్షసుడు తనశత్రువుగా పసిగట్టాడు. అందువల్ల ఆ బాలుణ్ణి ఒకనాడు పురిటింట్లో తల్లిసందిటిలో ఉన్నప్పుడు అపహరించి, సముద్రంలో పారవేసి

తన ఇంటికి వెళ్లిపోయాడు. ఆ పిల్లవాడు సముద్రజలంలో అడుగుకు పడిపోగా ఒకపెద్దచేప అతణ్ణి పట్టుకొని మింగేసింది. ఆ సముద్రంలో

**క. జాలిఁబడి పాఱు జలచర, జాలంబులఁ బోవనీక చని రోషాగ్ని**
**జ్వాలలు నిగుడఁగ నూరక, జాలంబులు వైచి పట్టు జాలరు లంతన్ 5**

**ప్రతి :** జాలిన్+పడి= భయపడి (దిగులుపడి); పాఱు= పారిపోయే; జలచర= చేపలయొక్క; జాలంబులన్= గుంపులను; పోవనీక= తప్పించుకొని పోనీకుండా; చని= అడ్డుపడి; రోష= కోప మనెడు; అగ్ని= నిప్పుయొక్క; జ్వాలలు= మంటలు; నిగుడన్+కన్= చెలరేగగా; ఊరక= మానకుండా; జాలంబులు= వలలు; వైచి= వేసి; పట్టు= పట్టుకొనే; జాలరులు= చేపలు పట్టేవారు; అంతన్= తర్వాత...

**తా :** జాలరులు పట్టుకొంటా రనేభయంతో చేపలు - ఆ సముద్రంలో చిక్కకుండా పారిపోయేవి. అప్పుడు జాలరులు ఆగ్రహించి వాటిల్ని తప్పించుకొని పోనీకుండా అడ్డగించి, వలలు వేసి పట్టుకొనేవాళ్లు.

**వ. సముద్రంబులోన నా మీనంబును దత్సహచరంబులైన మీనంబులనుం బట్టికొని తెచ్చి శంబరునకుం గానికఁగా నిచ్చిన నతండు వండి తెండని మహానసగృహంబునకుం బంచిన. 6**

**ప్రతి :** సముద్రంబులోనన్= సముద్రంలో; ఆ; మీనంబును= ప్రద్యుమ్నుని మింగిన పెద్దచేపనూ; తత్= దానియొక్క; సహచరంబులు= వెంటనంటి తిరిగేవి; ఐన= అయిన; మీనంబులనున్= చేపలనూ; పట్టికొని= పట్టి; తెచ్చి; శంబరునకున్= శంబరునికి; కానికన్+కాన్= కానుకగా; ఇచ్చినన్= సమర్పింపగా; అతండు= ఆ శంబరుడు; వండి= ఆ చేపలను కూరగా వండి; తెండు= తీసికొనిరండి!; అని= అని ఆజ్ఞాపించి; మహానసగృహంబునకున్= వంటఇంటికి; పంచినన్= పంపగా...

**తా :** జాలరులు సముద్రంలో ప్రద్యుమ్నుణ్ణి మింగిన పెద్దచేపనూ, దానివెంట తిరిగేచేపలనూ పట్టి తెచ్చి, శంబరాసురునికి కానుకగా సమర్పించారు. అతడు వాటిల్ని వండి తీసికొని రండని ఆజ్ఞ ఇచ్చి వంట ఇంటికి పంపాడు.

**క. రాజునగరి యడబాలలు, రాజీవముకడుపు వ్రచ్చి రాజనిభాస్యున్**
**రాజశిశువుఁ గని చెప్పిరి, రాజీవదళాక్షియైన రతికి నరేంద్రా! 7**

**ప్రతి :** నర+ఇంద్రా= రాజా!; రాజు= రాజుయొక్క; నగరు= అంతఃపురంలోని; అడబాలలు= వంటవాళ్లు; రాజీవము= చేపయొక్క; కడుపున్= పొట్టను; వ్రచ్చి= చీల్చి; రాజ= చంద్రుని (బింబము)తో; నిభ= సమానమయిన; ఆస్యున్= ముఖం కలవాణ్ణి; రాజశిశువున్= రాచబిడ్డను; కని= చూచి; రాజీవ= తామరపూవుయొక్క; దళ= రేకులవంటి; అక్షి= కన్నులుగలది; ఐన= అయినట్టి; రతికిన్= మన్మథునిభార్య అయిన రతీదేవికి; చెప్పిరి= చెప్పారు.

**తా :** పరీక్షిన్మహారాజా! రాజాంతఃపురంలోని వంటవాళ్లు ఆపెద్దచేపపొట్టను చీల్చినప్పుడు, దానిలో వారికి ఒక రాచబిడ్డ కనిపించాడు. వెంటనే వా రీవిచిత్రాన్ని రతీదేవికి తెలియజేశారు.

**వ. అంత నారదుండు వచ్చి బాలకుని జన్మంబును శంబరోద్యోగంబును మీనోదరప్రవేశంబునుం జెప్పిన విని యా రతి మాయావతి యను పేర శంబరునియింటఁ బాతివ్రత్యంబు సలుపుచు దహనదగ్ధుం డయిన తన పెనిమిటి శరీరధారణంబు సేయుట కెదురు చూచుచున్న యది గావున, న య్యర్భకుండు దర్పకుం**

**డని తెలిసి మెల్లన పుత్రార్థినియైనతెఱంగున శంబరునియనుమతి వడసి సూపకారులయొద్ద నున్న పాపనిం దెచ్చి పోషించుచుండె, నా కుమారుండును శీఘ్రకాలంబున నారూఢయౌవనుండై. 8**

**ప్రతి :** అంతన్= తరువాత కొంతకాలానికి; నారదుండు= నారద మహర్షి; వచ్చి; బాలకుని= బాలునియొక్క; (ప్రద్యుమ్నునియొక్క); ఉద్యోగంబును= (ఆ బాలకుణ్ణి చంపటానికి చేసే) ప్రయత్నాన్నీ; మీన= చేపయొక్క; ఉదర= కడుపులో; ప్రవేశంబునున్= (ఆ బాలుడు) ప్రవేశించడాన్నీ; చెప్పినన్= చెప్పగా; విని; ఆ; రతి; మాయావతి= మాయావతి; అను= అనే; పేరన్= పేరుతో; శంబరుని= శంబరునియొక్క; ఇంటన్= అంతఃపురంలో; పాతివ్రత్యంబు= పతివ్రతాధర్మాన్ని; సలుపుచున్= పాటిస్తూ; దహన= అగ్నిచేత; దగ్ధుండు= కాల్చబడినవాడు; అయిన= ఐనట్టి; తన= తనయొక్క, పెనిమిటి= భర్త (మన్మథుడు); శరీర= దేహంయొక్క; ధారణంబు= ధరించడం (మరలా జన్మించటం); చేయుటకున్= చేయటానికి; ఎదురుచూచుచున్= ఎదురుచూస్తూ; ఉన్న+అది= ఉంది; కావునన్= కాబట్టి; ఆ+అర్భకుండు= (చేపకడుపులోని) ఆ పిల్లవాడు; దర్పకుండు= మన్మథుడు; అని తెలిసి= అని గుర్తించి; మెల్లన్+అ= తిన్నగా; పుత్ర+అర్థిని= పుత్రుణ్ణి కోరుకొంటున్నది; ఐన= అయిన; తెఱంగునన్= విధంగా; శంబరుని= శంబరునియొక్క; అనుమతి= సమ్మతి; పడసి= పొంది; సూపకారుల+ఒద్దన్= వంటవాళ్ల దగ్గర; ఉన్న; పాపనిన్= పిల్లవాణ్ణి; తెచ్చి= తెచ్చుకొని; పోషించుచున్= పోషిస్తూ; ఉండెన్= ఉంది; ఆ కుమారుండును= ఆ బాలుడుకూడా; శీఘ్రకాలంబునన్= త్వరగా; ఆరూఢ= ప్రాప్తించిన; యౌవనుండు= యౌవనం కలవాడు; ఐ= అయి...

**తా :** ఒకనాడు నారదుడు శంబరుని అంతఃపురానికి వచ్చి ప్రద్యుమ్నుని జననమూ, శంబరుడు ఆ బాలుణ్ణి చంపటానికి చేసిన ప్రయత్నమూ, అతడు చేపకడుపులో ప్రవేశించటమూ రతికి వివరించాడు; ఇంతకు మునుపే ఆమె మాయావతి అనేపేరుతో శంబరుని అంతఃపురంలో పాతివ్రత్యం అవలంబిస్తూ, శివునికంటిమంటల్లో భస్మమైపోయిన తన భర్త మన్మథుడు తిరిగి ఎప్పుడు శరీరధారి అవుతాడో అని ఎదురుచూస్తూంది. అందువల్ల చేపపొట్టలో ఉన్నబాలుడు మన్మథుడే అని తెలుసుకోగలిగింది. ఆమె తొందరపాటు లేకుండా కొడుకుకోసం తపిస్తున్నదానిమాదిరిగా శంబరునిదగ్గరకువెళ్లి, అతని అంగీకారాన్ని పొంది, వంటవాళ్ల అదుపులో ఉన్న పిల్లవాణ్ణి తెచ్చి పెంచుతూ ఉంది. ఆ బాలుడు పూటపూటకూ పెరుగుతూ యౌవనవంతు డయ్యాడు.

**క. సుందర మగు తనరూపము, సుందరు లొకమాఱు దేఱి చూచినఁ జాలున్**
**సౌందర్య మేమి చెప్పను?, బొందెద మని డాయుబుద్ధిఁ బుట్టించు నృపా! 9**

**ప్రతి :** నృపా= రాజా!; సౌందర్యము= ఆ పడుచువాని అందాన్నిగూర్చి; ఏమి= ఏమని; చెప్పను= చెప్పేది? సుందరము= అందంగా ఉన్నది; అగు= అయిన; తన= అతనియొక్క; రూపమున్= ఆకారాన్ని; సుందరులు= అందగత్తెలు; ఒకమాఱు= ఒకసారి; తేఱిచూచినన్= రెప్పవేయకుండాచూస్తే; చాలున్= సరిపోతుంది; పొందెదము= సంగమించుదాం; అని= అనుకొని; డాయు= అతనిదగ్గరకు వెళ్లే; బుద్ధిన్= తలపును; పుట్టించున్= కలిగిస్తుంది.

**తా :** రాజా! ఆ యువకుని సౌందర్యాన్నిగూర్చి ఏమని చెప్పేది? అందగత్తెలు ఎవరైనాసరే ఒకసారి అతనిరూపాన్ని కళ్లారా చూస్తేచాలు – అతనితో భోగించాలని నిశ్చయించి, అతణ్ణి సమీపించే ఆలోచనను, అతని సౌందర్యం వాళ్లకు జనింపజేస్తుంది.

**విశే :** రూపం అనేది చాలా అర్థవంతమయిన శబ్దం. "రోపయతి విమోహయ తీతి రూపమ్! రుపు విమోహనే – మోహింపజేసేది" అని వ్యుత్పత్తి. మోహింపజేస్తుంది కాబట్టి, రూపం అనే పేరు కలిగింది.

సీ. చక్కనివారలు చక్కఁదనంబున కుపమింప నెవ్వండు యోగ్యుఁ డయ్యె
మిక్కిలితపమున మెఱయు నంబికకునై శంకరు నెవ్వండు సగము సేసె
బ్రహ్మత్వమును బొంది పరఁగు విధాతను వాణికై యెవ్వఁడు వావి సెఱిచె
వేయిడాఁగులతోడి విబుధలోకేశునిమూర్తికి నెవ్వఁడు మూల మయ్యె

తే. మునులతాలిమి కెవ్వఁడు ముల్లుసూపు, మగల మగువల నెవ్వండు మరులుకొలుపుఁ
గుసుమధనువున నెవ్వండు కొను విజయము, చిగురువాలున నెవ్వండు సిక్కువఱుచు? 10

**ప్రతి :** ఎవ్వండు= ఎవడు; చక్కనివారల= మహాసౌందర్యవంతులయొక్క; చక్కన్+తనంబునకున్= సౌందర్యంతో; ఉపమింపన్= పోల్చటానికి; యోగ్యుఁడు= తగినవాడు; అయ్యెన్= అయ్యాడో; ఎవ్వండు= ఎవడు; మిక్కిలి= అధికమైన; తపమునన్= తపస్సుచేత; మెఱయు= ప్రకాశిస్తున్న; అంబికకున్+ఐ= పార్వతీదేవికొరకై; శంకరున్= శివుణ్ణి; సగము+చేసెన్= సగమయ్యేటట్లు చేశాడో (అర్ధనారీశ్వరుడుగా చేశాడో); ఎవ్వఁడు= ఎవడు; బ్రహ్మత్వమును= బ్రహ్మాధికారాన్ని, ప్రజలు వృద్ధి పొందేటట్లు సృష్టిచేయు పదవిని; పొంది= పడసి; పరఁగు= ఒప్పుచున్న; విధాతను= బ్రహ్మను; వాణికిన్+ఐ= సరస్వతికోసమై; వావి+చెఱిచెన్= సహజసంబంధాన్ని చెడగొట్టాడో; ఎవ్వఁడు= ఎవడు; వేయి; డాగులతోడన్= మరకల (మచ్చల గుర్తులతో) కూడిన; విబుధ= దేవతలయొక్క; లోక= సమూహంయొక్క; ఈశుని= రాజుయొక్క (దేవేంద్రునియొక్క); మూర్తికిన్= ఆకారానికి; మూలము= ముఖ్యకారణం; అయ్యెన్= అయ్యాడో; ఎవ్వడు= ఎవడు; మునుల= ఋషులయొక్క; తాలిమికిన్= మనఃస్థైర్యానికి; ముల్లు+చూపున్= త్రాసువలె హెచ్చుతగ్గులను నిర్ణయిస్తాడో; ఎవ్వండు= ఎవడు, మగలన్= పురుషులనూ; మగువలన్= స్త్రీలనూ; మరులుకొలుపున్= ఒకరిమీద ఒకరికి అనురాగం కలిగేటట్లు చేస్తాడో; ఎవ్వండు= ఎవడు; కుసుమధనువునన్= పూలవింటితో; విజయము కొనున్= జయం పొందుతాడో; ఎవ్వండు= ఎవడు; చిగురు= చిగురాకు; వాలునన్= కత్తితో; చిక్కు+పఱచున్= బాధలపాలు చేస్తాడో...

**తా :** ఈ పడుచువాడు నిజంగా మన్మథుడే! మన్మథుడు గొప్ప అందగాళ్ల సొగసుతో పోల్చటానికి తగిన సుందరుడయ్యాడు. విరాగియై స్త్రీవైముఖ్యం కలిగిన శివుణ్ణి ఘోరతపస్సు చేసినపార్వతికి అర్ధశరీరం సమర్పించేటట్లు చేశాడు. సృష్టికర్త అయినబ్రహ్మ కన్నకూతురయిన సరస్వతికోసం వావీవరుసా వదలేటట్లు చేశాడు. దేవేంద్రుడు నిలువెల్లా వేయిమచ్చల గుర్తులు (కన్నులు) పొందటానికి మూలకారకుడయ్యాడు. అతడు మునీశ్వరుల మనోనిగ్రహం ఏ పాటిదో తూకంవేస్తాడు. స్త్రీపురుషులు పరస్పరమూ ప్రేమించుకొనేటట్లు చేస్తాడు. వాడి వత్తలయ్యే పూలవింటితో మహావిజయాలు సాధిస్తాడు. గట్టితనం లేని చిగురాకుకత్తితో లోకాల్ని బాధిస్తాడు.

వ. అని తన్ను లోకులు వినుతించు ప్రభావంబులు గలిగి పద్మదళలోచనుండును, బ్రలంబబాహుండును, జగన్మోహనాకారుండును నైన పంచబాణునిం గని లజ్జాహాసగర్భితంబులైన చూపులం జూచుచు మాయావతి సురతభ్రాంతిఁ జేసినం జూచి ప్రద్యుమ్నుం డిట్లనియె. 11

**ప్రతి :** అని= అని; తన్నున్= తనను; లోకులు= లోకంలోని ప్రజలు; వినుతించు= పొగడే; ప్రభావంబులు= శక్తులు; కలిగి; పద్మదళ= తామరరేకులవంటి; లోచనుండును= కన్నులు కలవాడునూ; ప్రలంబ= మోకాళ్లదాకా వ్రేలాడుతున్న; బాహుండును= చేతులు కలవాడునూ; జగత్= లోకాన్ని; మోహన= మోహింపజేస్తున్న; ఆకారుండును= ఆకారం కలవాడునూ;

ఐన= అయిన; పంచబాణునిన్= ఐదుబాణాలు కలవాణ్ణి అనగా మన్మథుణ్ణి; కని= చూచి; లజ్జా= సిగ్గు; హాస= నవ్వునూ; గర్భితంబులు= లోపల కలవి; ఐన= అయినట్టి ; చూపులన్= చూపులతో; చూచుచున్= చూస్తూ; మాయావతి; సురత= సంభోగమందలి; భ్రాంతిన్= కోరికను; చేసినన్= వెల్లడింపగా; చూచి= గ్రహించి; ప్రద్యుమ్నుండు= ప్రద్యుమ్నుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** ఈ విధంగా ప్రజలందరూ మన్మథునిశక్తులను కొనియాడుతున్నారు. పద్మనేత్రుడూ, ఆజానుబాహుడూ, లోకమోహనస్వరూపుడూ అయిన అతణ్ణి సిగ్గూ, చిరునవ్వూ దాగినచూపులతో చూస్తూ, మాయావతి రతివాంఛను ప్రకటించింది. అప్పుడు ఆమెవాలకం చూచి ప్రద్యుమ్నుడు ఇట్లా అన్నాడు

**విశే :** 1) పంచబాణుడు అంటే అయిదుబాణాలు కలవాడని అర్థం. తామరపూవు, అశోకము, మామిడి, మల్లె, నల్లగలువ అనేవి ఆ పంచబాణాలు –

ఆ బాణాలు చేసే పనులు – సమ్మోహనం (ఆకర్షించునట్లు చేసేది), ఉన్మాదనం (వెర్రి పుట్టించేది), తాపనం (కాక ఎక్కించేది), శోషణం (శుష్కింపజేసేది), స్తంభనం (కొయ్యవారేటట్లు చేసేది).

**మత్త. 'నా తనూభవుఁ డీతఁ డంచును నాన యించుక లేక యో**
**మాత నీ విది యేమి? నేఁడిటు మాతృభావము మాని సం**
**ప్రీతిఁ గామినిభంగిఁ జేసెదు పెక్కు విభ్రమముల్? మహా**
**ఖ్యాతవృత్తికి నీకు ధర్మము గాదు మోహము సేయఁగాన్.' 12**

**ప్రతి :** ఓమాత= ఓతల్లీ!; నీవు; ఈతఁడు= ఇతడు; నా= నాయొక్క; తనూభవుఁడు= కుమారుడు; అంచును= ఇప్పటిదాకా అంటూ; నాన= సిగ్గు; ఇంచుక= కొంచెంకూడా; లేక= లేకుండా; నేఁడు= ఈ రోజు; ఇటు= ఈ విధంగా, మాతృ= తల్లియొక్క; భావమున్= స్వాభావికగుణాన్ని; మాని= వదలి; సంప్రీతిన్= ఎక్కువమక్కువతో; కామినిభంగిన్= కామం కలిగినస్త్రీమాదిరిగా; పెక్కు= అనేకాలయిన; విభ్రమముల్= శృంగారచేష్టల్ని; చేసెదు(వు)= చేస్తున్నావు; ఇది+ఏమి= ఇదేంపని?; మహత్= మిక్కిలి; ఖ్యాత= ప్రసిద్ధికెక్కిన; వృత్తికిన్= ప్రవర్తనం కలిగినదానవయిన; నీకున్= నీకు; మోహము+ చేయన్+కాన్= వలపుచూపటం; ధర్మము+కాదు= న్యాయం కాదు.

**తా :** తల్లీ! ఇన్నాళ్లూ నా కొడుకని అందరికీ నన్నుగూర్చి చెప్పావు. ఇప్పుడు సిగ్గులేకుండా, మాతృత్వాన్ని మంటగలిపి, కాముకురాలివలె ఈ విలాసచేష్టలు చేస్తున్నావు. ఇది ఎంతపాడుపని? సత్ప్రవర్తనకు పేరుపొందిన నీవు నన్ను మోహించటం న్యాయంగాదు.

**వ. అనిన రతి యిట్లనియె: "నీవు నారాయణనందనుండవైన కందర్పుండవు, పూర్వకాలంబున నేను నీకు భార్యనైన రతిని. నీవు శిశువై యుండునెడ నిర్దయుండై దొంగిలి తల్లిం దొఱంగఁ జేసి శంబరుండు కొనివచ్చి నిన్ను నీరధిలో వైచిన నొక్కమీనంబు మ్రింగె; మీనోదరంబు వెడలితీవు, మీఁదటి కార్య మాకర్ణింపుము. 13**

**ప్రతి :** అనినన్= ప్రద్యుమ్ను డీవిధంగా అనగా; రతి= రతిదేవి; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= అతనితో అనింది; నీవు= నీవు; నారాయణ= విష్ణువుయొక్క; నందనుండవు= కుమారుడివి; ఐన= అయిన; కందర్పుండవు= మన్మథుడవు;

పూర్వకాలంబునన్= పూర్వజన్మంలో; నేను; నీకున్= నీకు; భార్యను= భార్యగా; ఐన= అయినట్టి; రతినిన్= రతీదేవిని; నీవు; శిశువు+ఐ= పసిపిల్లవాడుగా; ఉండు+ఎడన్= ఉన్నసమయంలో; శంబరుండు= శంబరుడనే రాక్షసుడు; నిర్దయుండు= దయలేనివాడు; ఐ= అయి; దొంగిలి= నిన్ను అపహరించి; తల్లిన్= మీతల్లి రుక్మిణిని; తొలఁగన్+చేసి= ఎడబాపి; కొనివచ్చి= తీసుకొనివచ్చి; నిన్నున్= నిన్ను; నీరధిలోన్= సముద్రంలో; వైచినన్= పడవేయగా; ఒక్కమీనంబు= ఒక పెద్దచేప; మ్రింగెన్= మ్రింగింది; ఈవు= నీవు; మీన= చేపయొక్క; ఉదరంబు= పొట్టనుండి; వెలువడితి(వి)= బయటబడితివి; మీఁదటి= ఇక ముందు చేయవలసిన; కార్యము= పనిని; ఆకర్ణింపుము= వినుము.

**తా :** ఈ విధంగా పలికిన ప్రద్యుమ్నునితో రతీదేవి "నీవు విష్ణువునకు కుమారుడవు. మన్మథుడవు. నేను నీపత్నిని. రతీదేవిని. నీవు పసికందుగా ఉన్నప్పుడు శంబరుడనే రాక్షసుడు నిన్ను దొంగిలించి, తల్లినుండి వేరుచేసి సముద్రంలో పారవేశాడు. అప్పుడు పెద్దచేప నిన్ను మింగేసింది. ఆ తర్వాత దానిపొట్టనుండి నీవు బయటపడ్డావు. ఇక జరుగవలసిన పనేమిటో చెప్తాను. విను. (శంబరుడు - జటాసురుని కొడుకు)

**క. మాయావి వీఁడు దుర్మతి, మాయఁడు సంగరములం దమర్త్యుల గెలుచున్**
**మాయి కరణమున వీనిన్, మాయింపుము మోహనాదిమాయలచేతన్. 14**

**ప్రతి :** వీఁడు= ఈ శంబరాశుడు; మాయావి= మాయలు చేసేవాడు; సంగరములన్= యుద్ధాలలో; మాయఁడు= చావడు; అమర్త్యులన్= దేవతల్ని; గెలుచున్= జయిస్తాడు; మాయిక రణమునన్= మాయాయుద్ధంలో; మోహన= మోహనమూ; ఆది= మొదలయిన; మాయలచేతన్= మాయలతో; వీనినిన్= ఇతణ్ణి; మాయింపుము= చంపుము.

**తా :** ఈ శంబరుడు మాయలమారి. దుర్బుద్ధి. యుద్ధాల్లో దేవతలనయినా జయిస్తాడు కాని తానుమాత్రం చావడు. కాబట్టి నీవు మాయాయుద్ధంలో మోహనం మొదలైన మాయలచేత వీణ్ణి సంహరించు.

**మత్త. పాపకర్ముఁడు వీఁడు ని న్నిటఁ బట్టి తెచ్చిన లేచి 'నా**
**పాపఁ డెక్కడఁ బోయెనో? సుతుఁ బాపితే విధి 'యంచుఁ దాఁ**
**గ్రేపుఁ బాసిన గోవుభంగిని ఖిన్నయై పడి గాఢ సం**
**తాపయై నిను నోఁచి కాంచినతల్లి కుయ్యిడ కుండునే? 15**

**ప్రతి :** పాపకర్ముఁడు= పాపకార్యాలు చేసేవాడు; వీఁడు= ఈ రాక్షసుడు; నిన్నున్= నిన్ను; ఇటన్= ఇక్కడికి; పట్టి= దొంగిలించి, పట్టుకొని; తెచ్చినన్= తీసుకొని రాగా; నోఁచి= ఎన్నో నోములునోచి; నినున్= నిన్ను; కాంచిన= కనిన; తల్లి= తల్లి (రుక్మిణి); తాన్= తాను; లేచి= మేల్కొని; నాపాపఁడు= నాబిడ్డ; ఎక్కడన్= ఏచోటికి; పోయెన్+ఓ= వెళ్లాడో; విధి!= దైవమా!; సుతున్= కొడుకును; పాపితి(వి)+ఏ= దూరంజేశావా; క్రేపున్= దూడను; పాపిన= ఎడబాసిన; గోవుభంగిని= ఆవువలె; ఖిన్న+ఐ= శోకం పొందినదై; పడి= భూమిమీద పడి; గాఢ= అధికమైన; సంతాప+ఐ= బాధగలదై; కుయ్యి+ఇడక= మొరపెట్టక; ఉండున్+ఏ?= ఉంటుందా?

**తా :** పాపపుపనులు చేసే ఈ శంబరుడు నిన్ను ఇక్కడకు తీసుకొని వచ్చిన తర్వాత నిద్రలేచి, ఎన్నో నోములు నోచి నిన్ను కన్నతల్లి "దేవుడా! నాబిడ్డ ఎక్కడికి పోయాడు? వాణ్ణీ, నన్నూ ఎడబాపావుగదా!" అని దూడకు దూరమైన ఆవువలె కిందబడి దుఃఖంతో, బాధతో కుయ్యోమొర్రో అని అనకుండా ఉంటుందా?

**విశే :** శంబరునివల్ల ఏర్పడిన విద్యకు 'శాంబరీవిద్య' అని పేరు. ఇదొక ప్రత్యేకమైన మాయావిద్య.

**వ. అని పలికి మాయావతి మహానుభావుండైన ప్రద్యుమ్నునికి సర్వశత్రుమాయావినాశి యయిన మహామాయావిద్య నుపదేశించె; నివ్విధంబున. 16**

**ప్రతి :** అని పలికి= అని చెప్పి; మాయావతి; మహా+అనుభావుండు= గొప్ప ప్రభావం కలవాడు; ఐన= అయినట్టి; ప్రద్యుమ్నునికిన్= ప్రద్యుమ్నునికి; సర్వ= సమస్తమైన; శత్రు= వైరులయొక్క; మాయా= మాయలను; వినాశి= వినాశంచేసేది; అయిన= అయినట్టి; మహామాయా= మహామాయ అనే; విద్యన్= విద్యను; ఉపదేశించెన్= నియమపూర్వకంగా బోధించింది; ఈ+విధంబునన్= ఈ రీతిగా...

**తా :** అనిచెప్పి, మాయావతి మహాతేజోవంతుడైన ప్రద్యుమ్నునికి విరోధులమాయ లన్నింటినీ మట్టుపెట్టే 'మహామాయ' అనేవిద్యను ఉపదేశించింది. ఈ విధంగా

**మ. గురుమాయారణవేదియై, కవచియై, కోదండియై, బాణియై**
**హరిజుం డోరి నిశాట! వైచితివి నాఁ డంభోనిధిన్ నన్ను ఘో**
**ర రణాంభోనిధి వైతు నిన్ను నిదె వే రమ్మంచుఁ జీరెన్ మనో**
**హరదివ్యాంబరు నుల్లసద్దనుజసేనాడంబరున్ శంబరున్. 17**

**ప్రతి :** హరిజుండు= శ్రీకృష్ణునికి జన్మించినవాడైన, ప్రద్యుమ్నుడు; గురు= అధికమైన; మాయా= మాయతో కూడిన; రణ= యుద్ధవిధానం; వేది+ఐ= తెలిసినవాడై; కోదండి+ఐ= విల్లుకలవాడై; బాణి+ఐ= బాణాలు కలవాడై; ఓరి నిశాట!= ఓరి రాక్షసుడా! నాఁడు= ఆ రోజు; నన్నున్= నన్ను; అంభస్+నిధిన్= సముద్రంలో; వైచితివి= పడవేశావు; ఇది+ఎ= ఇదిగో ఇప్పుడే; నిన్నున్= నిన్ను; ఘోర= భయంకరమైన; రణ= యుద్ధమనే; అంభస్+నిధిన్= సముద్రంలో; వైతున్= వేస్తాను; (చంపుతానని అర్థం); వే= శీఘ్రంగా; రమ్ము= రా; అంచున్(అనుచున్)= అంటూ; మనస్+హర= మనస్సును ఆకర్షించే; దివ్య= దేవతా సంబంధమైన; అంబరున్= వస్త్రాలు కలవాణ్ణి; ఉల్లసత్= విలసిల్లే; దనుజసేనా= రాక్షససేనలయొక్క; ఆడంబరున్= వేగిరపాటు కలవాణ్ణి; శంబరున్= శంబరుణ్ణి; చీరెన్= పిలిచాడు.

**తా :** మాయాయుద్ధనిపుణుడూ, ధనుర్బాణాలు ధరించినవాడూ అయిన ప్రద్యుమ్నుడు "ఓరీ రాక్షసా! ఆనాడు నన్ను సముద్రంలో పడవేశావు. ఈనాడు నిన్ను భయంకర యుద్ధంలో సంహరిస్తాను. తొందరగా రారా!" అని అన్నాడు. ఆ సమయంలో శంబరుడు మనోజ్ఞమైన దివ్యవస్త్రాలు ధరించి ఉన్నాడు. అతని సేనలు యుద్ధానికి ఉత్సాహంతో కాలుదువ్వుతున్నాయి.

**చ. అదలిచి యిట్లు కృష్ణసుతుఁ డాడిన నిష్ఠురభాషణంబులం**
**బదహతమై వడిం గవియు పన్నగరాజముఁ బోలి శంబరుం**
**డదరుచు లేచి వచ్చి గద నచ్యుతనందను వ్రేసె నుజ్జ్వల**
**ద్భిదురకఠోరఘోషసమభీషణనాదము చేసి యార్చుచున్. 18**

**ప్రతి :** కృష్ణ= కృష్ణునియొక్క; సుతుఁడు= కొడుకైన, ప్రద్యుమ్నుడు; ఇట్లు= ఈ విధంగా; అదలిచి= గద్దించి; ఆడిన= పలికిన; నిష్ఠుర= పరుషమయిన; భాషణంబులన్= మాటలచేత; శంబరుండు= శంబరుడు; అదరుచున్= తత్తరపడుచు

(భయపడుతూ); లేచి; పద= కాళ్లచేత; హతము+ఐ= త్రొక్కబడింద్రై; వడిన్= వేగంగా; కవియు= మీదబడు; పన్నగరాజమున్+పోలి= పెద్దపామునువలె; వచ్చి; ఉజ్జ్వలత్= ప్రకాశిస్తున్న; భిదుర= వజ్రాయుధంయొక్క; కఠోర= కఠినమయిన; ఘోష= ధ్వనితో; సమ= సమానమయిన; నాదము= ధ్వని; చేసి; ఆర్చుచున్= బొబ్బరిస్తూ; అచ్యుత= శ్రీకృష్ణునియొక్క; నందనున్= కుమారుడైన; ప్రద్యుమ్నుణ్ణి; గదన్= గదతో; వ్రేసెన్= కొట్టాడు.

**తా :** ప్రద్యుమ్నుడు గద్దించి కఠినంగా పలికినమాటలకు శంబరుడు సంచలిస్తూ లేచాడు. కాళ్లతో తొక్కబడిన పాము మీదికి వచ్చినట్లుగా వేగంగా సమీపించి, వజ్రాయుధధ్వనివంటి సింహనాదం చేసి, బొబ్బలు పెడుతూ ప్రద్యుమ్నుణ్ణి గదతో కొట్టాడు.

**క. దనుజేంద్రుఁడు వ్రేసిన గదఁ, దన గదచేఁ బాయ నడచి దనుజులు బెదరన్**
**దనుజాంతకునికుమారుఁడు, దనుజేశునిమీఁద నార్చి తన గద వైచెన్. 19**

**ప్రతి :** దనుజ+అంతకుని= రాక్షసులను సంహరించిన కృష్ణునియొక్క; కుమారుఁడు= కొడుకు – ప్రద్యుమ్నుడు; దనుజ+ ఇంద్రుఁడు= రాక్షసరాజు – శంబరుడు; వ్రేసిన= తన్నుకొట్టిన; గదన్= గదను; తన= తనయొక్క; గదచేన్= గదచేత; పాయన్= తొలగునట్లుగా; అడచి= అణగించి; దనుజులు= రాక్షసులు; బెదరన్= భయపడునట్లుగా; ఆర్చి= సింహనాదం చేసి; దనుజ+ఈశుని; మీఁదన్= రాక్షసరాజుమీద; తనగదన్= తనగదను; వైచెన్= విసరివేశాడు.

**తా :** శంబరుడు తనమీద ప్రయోగించిన గదను ప్రద్యుమ్నుడు తనగదచే అణగదొక్కి, రక్కసులు బెదరగా సింహనాదం చేస్తూ తన గదను అతనిమీదికి విసరివేశాడు.

**వ. అంత నా రక్కసుండు వెక్కసంబగు రోసంబునఁ దనకు దొల్లి మయుం డెఱింగించిన దైతేయమాయ నాశ్రయించి మింటికి నెగసి పంచబాణునిపై బాణవర్షంబు గురిసిన న మ్మహారథుండు నొచ్చియు సంచలింపక మచ్చరంబున సర్వమాయావినాశిని యైన సాత్త్వికమాయం బ్రయోగించి దనుజునిబాణవృష్టి నివారించె. మఱియు వాఁడు భుజగగుహ్యకపిశాచమాయలు పన్ని నొప్పించిన నన్నియుం దప్పించి. 20**

**ప్రతి :** అంతన్= ఆ తర్వాత; ఆ రక్కసుండు= ఆ రాక్షసుడు; వెక్కసంబు= అధికము; అగు= అయిన; రోసంబునన్= కోపంతో; తనకున్= తనకు; తొల్లి= పూర్వం; మయుండు= మయుడు; ఎఱింగించిన= తెలిపిన; దైతేయమాయన్= రాక్షసమాయను; ఆశ్రయించి= అండగా చేసికొని; మింటికిన్= ఆకాశానికి; ఎగసి= ఎగిరి; పంచబాణునిపైన్= మన్మథునిమీద; బాణ వర్షంబు= బాణపరంపరల వానను; కురిసినన్= కురిపించగా; ఆ+మహారథుండు= మహారథుడయిన ప్రద్యుమ్నుడు – (పదకొండువేలమంది యోధులతో యుద్ధం చేయగల వీరుణ్ణి మహారథుడంటారు); నొచ్చియున్= బాధపొందికూడా; సంచలింపక= స్థైర్యం కోల్పోక; మచ్చరంబునన్= పట్టుదలతో; సర్వ= సమస్తమయిన; మాయా= మాయలను; వినాశిని= పూర్తిగా నాశంచేసేది; ఐన= అయినట్టి; సాత్త్విక= సాత్త్వికం అనే; మాయన్= మాయను; ప్రయోగించి= ఉపయోగించి; దనుజుని= రాక్షసునియొక్క; బాణ= బాణముల; వృష్టిన్= వానను; నివారించెన్= అడ్డగించాడు; మఱియున్= ఇంకనూ; వాఁడు= వాడు; భుజగ= సర్పములకు సంబంధించిన; గుహ్యక= గుహ్యకులతో ముడిపడిన; పిశాచ= పిశాచాలకు చెందిన; మాయలు; పన్ని= సృష్టించి; నొప్పించినన్= బాధించగా; అన్నియున్= ఆ మాయలనన్నింటినీ; తప్పించి= తొలగద్రోసి...

**తా :** పిదప శంబరుడు కోపంతో మండిపోతూ మయునినుండి తాను గ్రహించిన రాక్షసమాయను తోడుచేసికొని ఆకాశాని కెగిరి, ప్రద్యుమ్నునిమీద బాణాలజడివానను కురిపించాడు. ప్రద్యుమ్నుడు బాధపడికూడా పట్టువదలక సర్వమాయలను ధ్వంసం చేసే సాత్త్వికమాయను శంబరునిమీద ప్రయోగించాడు. వాడు సర్ప–గుహ్యక–పిశాచమాయలను ప్రద్యుమ్నునిమీద ప్రయోగించాడు. ప్రద్యుమ్నుడు ఆ మాయలను పూర్తిగా తొలగద్రోసి

**క. దండధరమూర్తిఁ గైకొని, యొండాడక చక్రిసూనుఁ డుగ్రతరాసిన్**
**ఖండించె శంబరునితలఁ, గుండలకోటీరమణులు గుంభిని రాలన్. 21**

**ప్రతి :** చక్రి= చక్రముధరించిన కృష్ణునియొక్క; సూనుఁడు= కొడుకు – ప్రద్యుమ్నుడు; దండధర= యమునియొక్క; మూర్తిన్= ఆకారాన్ని; కైకొని= పొంది; ఒండు+ఆడక= ఏమనకుండా; ఉగ్రతర= మిక్కిలి భయంకరమైన; అసిన్= కత్తితో; కుండల= చెవి ఆభరణాలలోని; కోటీర= కిరీటంలోని; మణులు; కుంభినిన్= భూమిమీద; రాలన్= రాలిపడునట్లుగా; శంబరుని= శంబరునియొక్క; తలన్= తలను; ఖండించెన్= నరికాడు.

**తా :** ఏమీ మాటాడకుండా ప్రద్యుమ్నుడు యమునివంటివాడై భయంకరఖడ్గంతో శంబరునితలను నరికాడు. కత్తిదెబ్బకు రాక్షసుని చెవిపోగులలోనూ, కిరీటంలోనూ పొదిగిన మణులు నేలమీద రాలిపోయాయి.

**క. చిగురాకడిదపు ధారను, జగములఁ బరవశము సేయు చలపాదికి దొ**
**డ్డగు నుక్కడిదంబునఁ దన, పగతుం దెగవ్రేయు టెంతపని చింతింపన్? 22**

**ప్రతి :** చింతింపన్= ఆలోచించగా; చిగురాకు= చిగురుటాకు అనెడు; అడిదము= కత్తియొక్క; ధారన్= వాదరతో; జగములన్= లోకాల్ని; పరవశము+చేయు= పరాధీనంచేయు; చలపాదికిన్= పంతకానికి; దొడ్డ= పెద్దది; అగు= అయిన; ఉక్కు+అడిదంబునన్= ఉక్కుకత్తితో; తన= తనయొక్క; పగతున్= శత్రువును; తెగన్+వ్రేయుట= ఖండించటం; ఎంతపని?= ఏమంతపెద్దపని?; (తేలికపాటిపని అని అర్థం).

**తా :** లేతచిగురాకుకత్తితో సర్వలోకాలలో నివసించేవారినీ అస్వతంత్రులుగా చేసే పట్టుదలగలవానికి ఉక్కుకత్తితో శత్రువును సంహరించటం ఒకలెక్కా?

**క. బెగడుచు నుండఁగ శంబరుఁ, దెగడుచుఁ బూవింటిజోదు ధీరగుణంబుల్**
**వొగడుచుఁ గురిసిరి ముదమున, నెగడుచుఁ గుసుమములముసురు నిర్జరు లధిపా! 23**

**ప్రతి :** అధిపా= పరీక్షిన్మహారాజా!; నిర్జరులు= దేవతలు; బెగడుచున్= భయపడుతూ; ఉండక= ఉండకుండా; శంబరున్= శంబరుణ్ణి; తెగడుచున్= నిందిస్తూ; పూవింటిజోదు= పూలవిల్లు కలిగిన యోధునియొక్క (మన్మథునియొక్క – ప్రద్యుమ్నుని యొక్క); ధీరగుణంబుల్= ధైర్యం మొదలయిన గుణాల్ని; పొగడుచున్= పొగడుతూ; ముదమునన్= ఆనందంతో; నెగడుచున్= అతిశయిస్తూ; కుసుమముల= పూలయొక్క; ముసురు= ఎడతెగనివాన; కురిసిరి= కురిపించారు.

**తా :** పరీక్షిన్మహారాజా! శంబరుడు చనిపోవటంచేత దేవతలు నిర్భయంగా అతణ్ణి నిందించారు. ప్రద్యుమ్నుని ధైర్యశౌర్యాది గుణాలను స్తుతించారు. ఆనందంతో ఎడతెగకుండా పూలవాన కురియించారు.

## ✤ రతీదేవి ప్రద్యుమ్నసహితయై గగనమార్గంబున ద్వారకకుఁ బోవుట ✤

**వ. ఇట్లు శంబరుని వధియించి విలసిల్లుచున్న ఇంచువిలుకానిం గొంచు నాకాశసంచారిణియైన యా రతీదేవి గగనపథంబుఁబట్టి ద్వారకానగరోపరిభాగమునకుం జనుదెంచిన. 24**

**ప్రతి :** ఇట్లు= ఈవిధంగా; శంబరునిన్= శంబరుణ్ణి; వధియించి= చంపి; విలసిల్లుచున్= సంతోషిస్తూ; ఉన్న= ఉండిన; ఇంచువిలుకానిన్= చెరకువిల్లు కలవాడైన మన్మథుణ్ణి (ప్రద్యుమ్నుణ్ణి); కొంచున్(కొనుచున్)= తీసుకొంటూ; ఆకాశ= ఆకాశంలో; సంచారిణి= సంచరించేది; ఐన= అయినట్టి; ఆ రతీదేవి= ఆ రతీదేవి; గగనపథంబున్= ఆకాశమార్గాన్ని; పట్టి= అనుసరించి; ద్వారకానగర= ద్వారకానగరంయొక్క; ఉపరిభాగంబునకున్= పైభాగానికి; చనుదెంచినన్= రాగా...

**తా :** ప్రద్యుమ్నుడు శంబరుణ్ణి వధించి ఆనందిస్తున్నాడు. అప్పుడు ఆకాశగమనం చేసేరతీదేవి అతణ్ణి తీసుకొని ఆకాశమార్గంలో ద్వారకానగరం పై భాగంలో వస్తుంటే

**ఆ. మెఱుఁగుఁదీఁగెతోడి మేఘంబుకైవడి, యువిదతోడ మింటి నుండి కదలి**
**యరుగుదెంచె మదనుఁ డంగనాజనములు, మెలఁగుచున్న లోని మేడకడకు. 25**

**ప్రతి :** మదనుఁడు= ప్రద్యుమ్నుడు; మెఱఁగు+తీఁగె+తోడి= మెఱపుతీగతో కూడిన; మేఘంబుకైవడిన్= మేఘం మాదిరిగా; ఉవిదతోడన్= భార్య అయిన రతీదేవితో; మింటినుండి= ఆకాశంనుండి; కదలి= బయలుదేరి; అంగనాజనములు= స్త్రీ సమూహం; మెలఁగుచున్+ఉన్న= మెదలుచున్న; లోనిమేడ కడకున్= అంతఃపురప్రదేశానికి; అరుగు+తెంచెన్= వచ్చింది.

**తా :** ప్రద్యుమ్నుడు మెఱపుతీగతో కూడిన మేఘంవలె రతీదేవితో కలసి, ఆకాశంనుండి బయలుదేరి, స్త్రీలు తిరుగుచున్న అంతఃపురానికి వచ్చాడు.

**మ. జలదశ్యాముఁ బ్రలంబబాహుయుగళుం జంద్రాననున్ నీల సం**
**కులవక్రాలకుఁ బీతవాసు ఘనవక్షున్ సింహమధ్యున్ మహో**
**త్పలపత్త్రేక్షణు మందహాసలలితుం బంచాయుధున్ నీరజా**
**క్షులు దా రేమఱుపాటఁ జూచి హరి యంచుం డాఁగి రయ్యె యెడన్. 26**

**ప్రతి :** జలద= వానకారుమేఘంవలె; శ్యామున్= నల్లనైనవాణ్ణి; ప్రలంబ= మిక్కిలి పొడవైన; బాహు= చేతులయొక్క; యుగళున్= జంటగలవాణ్ణి; చంద్ర= చంద్రుణ్ణి పోలిన; ఆననున్= ముఖం కలవాణ్ణి; నీల= నల్లనివియు; సంకుల= దట్టమైన; వక్ర= వంకరలైన; అలకున్= ముంగురులు కలవాణ్ణి; పీత= పచ్చని; వాసున్= వస్త్రంకలవాణ్ణి; ఘన= పెద్దదయిన (విశాలమయిన); వక్షున్= వక్షఃస్థలం కలవాణ్ణి; సింహమధ్యున్= సింహంయొక్క నడుమువంటి నడుము కలవాణ్ణి; మహత్= పెద్దదయిన (పూర్తిగా వికసించిన); ఉత్పల= కలువపూవుయొక్క; పత్ర= రేకులవంటి; ఈక్షణున్= కన్నులు కలవాణ్ణి; మందహాస= చిరునవ్వుచేత; లలితున్= మనోహరుడయినవాణ్ణి; పంచ+ఆయుధున్= అయిదు ఆయుధాలు గలవాణ్ణి (అయిదు బాణాలు గలవాణ్ణి, మన్మథుణ్ణి (ప్రద్యుమ్నుణ్ణి); నీరజ+ఈక్షణుల్= పద్మాలవంటి కన్నులుగలవారైన; అంతఃపుర+అంగనలు= అంతఃపుర స్త్రీలు; తారు= తాము; ఏమఱుపాటన్= పరాకున (ఆకస్మికంగా); చూచి; హరి= శ్రీకృష్ణుడు; అంచున్(అనుచున్)= అనుకొంటూ; అయ్యెయెడన్ (ఆ+ఆ+ఎడన్)= ఆయాచోట్ల; డాఁగిరి= దాగుకొన్నారు.

**తా :** నీలమేఘశరీరుడు, ఆజానుబాహుడు, నల్లని చిక్కని వంకర ముంగురులు కలవాడు, పసుపు పచ్చని వస్త్రం తాల్చినవాడు, విశాల వక్షఃస్థలం గలవాడు; సన్నని నడుముకలవాడు, విచ్చిన కలువరేకులవంటి కన్నులు గలవాడు, చిఱునగవు చిందించేవాడూ, అయిన ప్రద్యుమ్నుణ్ణి చూచి, అంతఃపుర స్త్రీలు ఈ వస్తుండేవాడు కృష్ణుడేమో అని భ్రాంతిపడ్డారు. ఆయన ఎదుటపడకుండా, కంటికి కానరాకుండా తప్పుకొన్నారు.

**క. కొందఱు హరి యగు నందురు, కొందఱు చిహ్నములు కొన్ని కొన్ని హరికి లే**
**వందురు మెల్లనె తెలియుద, మందురు మరుఁ జూచి కొంద ఱబలలు గుములై. 27**

**ప్రతి :** అబలలు= అంతఃపురస్త్రీలు; గుములు+ఐ= గుంపులుగా చేరినవారై; మరున్= మన్మథుణ్ణి – ప్రద్యుమ్నుణ్ణి; చూచి= అరకొరగా చూచి; కొందఱు= కొంతమంది; హరి= కృష్ణుడు; అగున్= అవును; అందురు= గట్టిగా చెప్పుతూన్నారు; కొందఱు= మరికొంతమంది; చిహ్నములు= ఇతని పోలికలు; కొన్ని కొన్ని; హరికిన్= కృష్ణునికి; లేవు; అందురు= అని నిర్ణయిస్తూ ఉన్నారు; కొందఱు= ఇంకా కొంతమంది; మెల్లన్+ఎ= నిదానంగా; తెలియుదము= తెలిసికుందాము; అందురు= అని అనుకొంటూ ఉన్నారు.

**తా :** అంతఃపురస్త్రీలు గుంపులు కట్టి ప్రద్యుమ్నుని విమర్శగా చూడలేదు. వారిలో కొందరు ఇతడు కృష్ణుడే అన్నారు. మరికొందరు ఇతని పోలికలు కొన్ని కృష్ణునిలో లేవన్నారు. ఇంకా కొందరు తొందరపడకుండా ఇత డెవరో ముందుముందు కనుక్కుందా మనుకున్నారు.

**క. హరి యని వెనుచని పిదపన్, హరిఁ బోలెడువాఁడు గాని హరి గాఁ డనుచున్**
**హరిమధ్య లల్లనల్లన, హరినందను డాయ వచ్చి రాశ్చర్యమునన్. 28**

**ప్రతి :** హరిమధ్యలు= సింహంనడుము వంటి సన్నని నడుముగలవారైన – అంతఃపుర స్త్రీలు; హరి+అని= కృష్ణుడని నిశ్చయించి; వెనుచని= వెంబడించి; పిదపన్= తర్వాత; హరిన్= కృష్ణుణ్ణి; పోలెడువాఁడు= పోలినవాడు; కాని= తప్ప; హరి= కృష్ణుడు; కాఁడు= కానేకాడు; అనుచున్= అనుకొంటూ; అల్లన్+అల్లన్+అ= మెల్లమెల్లగా; హరి= కృష్ణునియొక్క; నందనున్= కుమారుణ్ణి; ప్రద్యుమ్నుణ్ణి; ఆశ్చర్యమునన్= ఆశ్చర్యంతో; డాయన్+వచ్చిరి= సమీపించారు.

**తా :** అంతఃపురస్త్రీలు వచ్చిన ఆ పురుషుడు కృష్ణుడనుకొని అతనివెంట కొంతదూరం వెళ్లారు. తర్వాత “ఇతడు కృష్ణుని మాదిరిగా ఉన్నాడు గాని కృష్ణుడుమాత్రం గాడు” అని తేల్చుకొన్నారు. తర్వాత వింతగా, మెల్లమెల్లగా ప్రద్యుమ్నుణ్ణి సమీపించారు.

**ఉ. ‘అన్నులు సేర వచ్చి మరు నందఱుఁ జూడఁగఁ దాను వచ్చి సం**
**పన్నగుణాభిరామ హరిపట్టపుదేవి విదర్భపుత్రి క్రేఁ**
**గన్నుల నా కుమారకునికైవడి నేర్పడఁ జూచి బోటితోఁ**
**జన్నులు సేఁప నిట్లనియె సంభ్రమదైన్యము లుల్లసిల్లఁగన్. 29**

**ప్రతి :** అన్నులు= స్త్రీలు; అందఱున్= అందరూ; చేరన్+వచ్చి= దగ్గరకు వచ్చి; మరున్= మన్మథుని (ప్రద్యుమ్నుని); చూడన్+కన్= చూస్తూ ఉండగా; సంపన్న= సమృద్ధమైన; గుణ= సద్గుణాలచేత; అభిరామ= అందరకూ ఇష్టురాలయి

నట్టిది; హరి= కృష్ణునియొక్క; పట్టము+దేవి= పట్టపురాణి; విదర్భ= విదర్భరాజుయొక్క; పుత్రి= కూతురు - రుక్మిణి; తానున్= తానుకూడా; వచ్చి= చేరి; క్రేఁగన్నులన్ (క్రేవ+కన్నులన్)= కడకన్నులతో; ఆ కుమారకుని= ఆ చిన్నవానియొక్క; కైవడిన్= వాలకమును; ఏర్పడన్= విశదంగా; చూచి; చన్నులు; చేఁపన్= పాలు స్రవింపజేయగా; సంభ్రమ= తత్తరపాటు; దైన్యముల్= దురవస్థయూ; ఉల్లసిల్లన్+కన్= వెల్లడికాగా; బోఁటితోన్= చెలికత్తెతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అనింది.

**తా :** అంతఃపురస్త్రీలందరూ ప్రద్యుమ్నుణ్ణి పరీక్షగా చూస్తూ ఉన్నారు. అప్పు డక్కడకు సద్గుణరాశీ, శ్రీకృష్ణుని పెద్దభార్యా, విదర్భరాజైన భీష్మకుని కూతురూ - రుక్మిణికూడా వచ్చింది. ఆమె కడగంటి చూపులతో ఆ చిన్నవాని వాలకమంతా గమనించింది. వెంటనే ఆమెకు మాతృభావం ఏర్పాడి, చన్నులనుండి పాలుకారటం మొదలయింది. తత్తరపడుతూ, దీనంగా రుక్మిణి చెలికత్తెతో ఇలా అనింది.

**శా. ఈ కంజేక్షణుఁ డీ కుమారతిలకుం డీ యిందుబింబాననుం**
**డీ కంఠీరవమధ్యుఁ డిచ్చటికి నేఁ డెందుండి యేతెంచెనో**
**యీ కల్యాణునిఁ గన్న భాగ్యవతి మున్నేనోములన్ నోఁచెనో**
**యే కాంతామణియందు వీనిఁ గనెనో యే కాంతుఁ డీకాంతునిన్. 30**

**ప్రతి :** ఈ కంజ= తామరపూలవంటి; ఈక్షణుఁడు= కన్నులు గలవాడు; ఈ కుమార= అందమున మన్మథుని మించినవారిలో; తిలకుండు= శ్రేష్ఠుడు; ఈ ఇందుబింబ= చంద్రబింబమువంటి; ఆననుండు= ముఖము కలవాడు; ఈ కంఠీరవ= సింహం నడుము వంటి; మధ్యుఁడు= నడుముకలవాడు; నేఁడు= ఇప్పుడు; ఇచ్చటికిన్= ఇక్కడికి; ఎందున్+ఉండి= ఎక్కడనుండి; ఏతెంచెన్+ఓ= వచ్చెనో; ఈ కల్యాణునిన్= ఈ శుభలక్షణాలు కలవాణ్ణి; కన్న= కనిన; భాగ్యవతి= అదృష్టవంతురాలు; మున్ను= పూర్వజన్మంలో; ఏ నోములన్= ఎట్టి నోముల్ని; నోఁచెన్+ఓ= నోచిందో; ఏ కాంతుఁడు= ఏ భర్త; ఏ; కాంతామణి+అందున్= ఎట్టి స్త్రీరత్నమందు; ఈ కాంతునిన్= ఈ సుందరుడైన; వీనిన్= వీణ్ణి; కనెన్+ఓ= కన్నాడో.

**తా :** కమలాల్లాంటి కన్నులు గలవాడూ, మన్మథుని సౌందర్యాన్ని మించిన సౌందర్యం కలవారిలో అగ్రగణ్యుడూ, చంద్రబింబాన్ని పోలిన ముఖం, కలవాడూ, సింహంనడుమువంటి సన్నని నడుము గలవాడూ అయిన ఈ పడుచువాడు ఎక్కడినుండి ఇక్కడికి వచ్చాడో? ఈ శుభలక్షణునికి జన్మనిచ్చిన అదృష్టవంతురాలు పూర్వజన్మలో ఏ వ్రతాలు చేసిందో? ఏ ఉత్తమపుణ్యదంపతులకు ఇతడు జన్మించాడో?

**శా. ఆళీ! నా తొలుచూలిపాపనికి బోర్కాడించి నే సూతికా**
**శాలామధ్యవిశాలతల్పగతనై చన్నిచ్చి నిద్రింప నా**
**బాలున్ నా చనుఁబాలకుం జెఱిచి యే పాపాత్ము లే త్రోవ ము**
**న్నే లీలం గొనిపోయిరో? శిశువుఁ దా నే తల్లి రక్షించెనో! 31**

**ప్రతి :** ఆళీ!= సఖీ!; నా= నాయొక్క; తొలిచూలి+ఇ(లి)= మొదటికాన్పులో పుట్టిన; పాపనికిన్= మగబిడ్డకు; బోర్కాడించి= స్నానంచేయించి; సూతికాశాలా= ప్రసూతిగృహంయొక్క; మధ్య= నడుమనున్న; విశాల= విశాలమైన; తల్ప= పానుపును; గతను+ఐ= పొందినదాననై; చన్ను+ఇచ్చి= పాలిచ్చి; నిద్రింపన్= నిద్రిస్తుండగా; ఆ బాలున్= ఆ బాలుణ్ణి; నా= నాయొక్క;

చను+పాలకున్= స్తన్యానికి; చెఱిచి= దూరంచేసి; మున్ను= పూర్వం; ఏ పాపాత్ములు= ఏ పాపస్వభావం గలవారు; ఏ త్రోవన్= ఏ మార్గంలో; ఏ లీలన్= ఏ విధంగా; కొనిపోయిరి+ఓ= అపహరించారో?; ఏ తల్లి= ఏ దయామయి; తాన్= తాను; శిశువున్= పసిబిడ్డను; రక్షించెన్+ఓ= కాపాదిందో?

**తా :** చెలీ! నేను మొదట కన్నబిడ్డకు నీళ్లుపోసి, పాలిచ్చి పురిటింటిలో పెద్దపరుపుమంచంమీద నిద్రపోయాను. నాపసికందును తల్లిపాలకు దూరంచేసి, ఏపాపబుద్ధులు ఏరీతిగా దొంగిలించారో? ఏతల్లి నాముద్దుకూనను అక్కున చేర్చుకొనిందో?

**క. కొడుకఁడు నా పొదిగిఁటిలోఁ, జెడిపోయిననాఁట నుండి చెలియా! తెలియం**
**బడ దే వార్తయు నతఁడే, వడువున నె చ్చోట నిలిచి వర్తించెడినో! 32**

**ప్రతి :** చెలియా!= చెలీ!; కొడుకఁడు= నాకుమారుదు; నా= నాయొక్క; పొదిగిఁటిలోన్= సందిటికి; చెడిపోయిన నాటనుండి= దూరమైనప్పటినుండి; ఏవార్తయున్= ఏసమాచారమూ; తెలియన్+పడదు= తెలియడం లేదు; అతఁడు= అతడు; ఏవడువునన్= ఏరీతిగా; ఎచ్చోటన్= ఏ+చోటన్= ఎక్కడ; నిలిచి= ఉండి; వర్తించెడిన్+ఓ= నడుచుకొంటున్నాడో?.

**తా :** సఖీ! నాసందిటికి దూరమయినప్పటినుండి ఈనాటివరకూ కుమారుని వృత్తాంతం చెవినిబడలేదు. వాడెక్కడున్నాడో? ఏంచేస్తున్నాడో కదా!

**క. ఇందాఁక వాఁడు బ్రదికిన, సందేహము లేదు దేహచాతుర్యవయ**
**స్సౌందర్యంబుల లోకులు, వందింపఁగ నితనియంతవాఁ డగుఁ జుమ్మీ! 33**

**ప్రతి :** వాఁడు= నాకొడుకు; ఇందాఁకన్ (ఇంతదాకన్)= ఇప్పటివరకూ; బ్రదికినన్= జీవించి ఉంటే; లోకులు= లోకంలోనివారు; దేహము= శరీరాన్ని; చాతుర్యము= నైపుణ్యాన్ని; వయస్= వయస్సును; సౌందర్యంబులన్= అందాన్ని; వందింపన్+కన్= స్తుతింపగా; ఇతని+అంతవాఁడు= ఇతనితో సమానుడు; అగున్= అయ్యేడివాడు; చుమ్మీ= సుమా!; సందేహము= అనుమానం; లేదు= లేదు.

**తా :** నా కుమారుడు ఈనాటివరకూ బ్రతికి ఉంటే, జనులు అతని శరీరసౌష్ఠవాన్నీ, కార్యదక్షతనూ, యౌవనదశనూ, సౌందర్యాన్నీ ప్రశంసిస్తూ ఉండేవారు. వాడు ముమ్మూర్తులా ఇతనంతవాడయ్యుండేవాడు. ఏ మాత్రమూ అనుమానించాల్సిన పనిలేదు.

**మ. అతివా! సిద్ధము నాఁటి బాలకున కీయాకార మీ వర్ణ మీ**
**గతి యీ హాసవిలోకనస్వరము లీ గాంభీర్య మీ కాంతి వీఁ**
**డతఁడే కాఁదగు నున్నవారలకు నా యాత్మేశుసారూప్య సం**
**గతి సిద్ధింపదు, వీనియందు మిగులం గౌతూహలం బయ్యెడిన్. 34**

**ప్రతి :** అతివా!= చెలీ!; నాఁటి= ఆనాటి; బాలకునకున్= బాలునికి (నాకుమారునికి); ఈ+ఆకారము= ఈ రూపమూ; ఈ వర్ణము= ఈ రంగూ; ఈ గతి= ఈ నడక; ఈ హాస= ఈ చిరునవ్వు; విలోకన= చూపు; స్వరములు= కంఠస్వరమూ; ఈ గాంభీర్యము= మనోవికారాలు లేకుండుట; ఈ కాంతి= లావణ్యమూ; సిద్ధము= ప్రాప్తించినవి; వీఁడు= ఇతడు; అతఁడు+ఏ= నా కుమారుడే; కాన్+తగును= అయి ఉంటాడు; ఉన్నవారలకున్= తక్కినవారికి, (ఇతడుగాక – ఇక్కడుంటే

ఏ కుమారులకూ); నా= నాయొక్క; ఆత్మేశు= ప్రాణేశ్వరునియొక్క; సారూప్య సంగతి= రూపం వంటి రూపం ఉండడం; సిద్ధింపదు= ఒనగూడదు; మిగులన్= అధికంగా; వీని+అందున్= ఇతనియందు; కౌతూహలంబు= ఆసక్తి; అయ్యెడిన్= కలుతూంది.

**తా :** చెలీ! ఆ నాటి నా కొడుకే ఈ రూపమూ, రంగూ, నడక, నవ్వూ, చూపులూ, గొంతూ, గాంభీర్యమూ, లావణ్యమూ తప్పకుండా ప్రాప్తించి ఉండాలి. ఇతడే అతడు కావటానికి అర్హుడు. మిగిలినవారికి నాప్రాణనాయకునిపోలిక లుండటానికి అవకాశమే లేదు. ఇతనిపట్ల నాకు ఆసక్తి పెరుగుతూంది.

**క. పొదలెడి ముదమునఁ జిత్తము, గదలెడి నాయెడమమూఁపు, గన్నులవెంటం**
**బొదలెడి నానందాశ్రులు, మెదలెడిఁ బాలిండ్లఁ బాలు, మేలయ్యెడినో! 35**

**ప్రతి :** చిత్తము= మనస్సు; ముదమునన్= సంతోషంతో; పొదలెడిన్= పొంగుతూంది; నా= నాయొక్క; ఎడమమూఁపు= ఎడమబుజం; కదలెడిన్= అదరుతూంది; కన్నులవెంటన్= కన్నులవెంబడి; ఆనంద+అశ్రులు= ఆనందబాష్పాలు; పొదలెడిన్= అతిశయించుచున్నవి; పాలిండ్లన్= చన్నుల్లో; పాలు; మెదలెడిన్= ఉబుకుచున్నవి; మేలు; అయ్యెడిన్+ఓ= కలుగునాయేమి?

**తా :** మనస్సు సంతోషపూర్ణ మవుతోంది. ఎడమబుజం అదరుతోంది. కన్నులు ఆనందబాష్పాలతో అతిశయిస్తూన్నాయి. స్తనాలలో పాలు పయికుబుకుతూన్నాయి. మేలు కలుగవచ్చునేమో!

విశే : స్త్రీలకు ఎడమకన్ను, ఎడమభుజం అదిర్తే శుభసూచకం. పురుషులకు కుడికన్ను, కుడిభుజం అదిర్తే శుభలాభం – అని శాస్త్రం.

**వ. అని డోలాయమాన మానసయై వితర్కించుచు 36**

**ప్రతి :** అని= అని; డోలాయమాన= ఉయ్యాలవలె ఊగుతున్న; మానస+ఐ= మనస్సుకలదై; వితర్కించుచున్= యుక్తులతో ఆలోచిస్తూ...

**తా :** అని ఉయ్యాలవలె అటునిటు ఊగుతున్న మనస్సుతో అనేకవిధాల భావాలకు లోనై

**క. తనయుఁ డని నొడువఁ దలఁచును, దనయుఁడు గాకున్న మిగులఁ దతిగొని సవతుల్**
**దను నగియెద రని తలఁచు న, తనుసంశయ మలమికొనఁగఁ దనుమధ్య మదిన్. 37**

**ప్రతి :** తనుమధ్య= సన్నని నడుముగలది – రుక్మిణి; తనయుఁడు= ఇతడు నా కుమారుడు; అని= అని; నొడువన్= చెప్పగా; తలఁచును= అనుకొంటుంది; మదిన్= మనస్సులో; అతను= పెద్దదగు; సంశయము= అనుమానం; అలమికొనన్+కన్= ఆవరించగా; తనయుఁడు= కుమారుడు; కాక+ఉన్నన్= కానిచో; సవతులు= శ్రీకృష్ణుని ఇతరభార్యలు; తతి+కొని= గుంపుగా చేరి; మిగులన్= మిక్కిలిగా; తనున్= తనను; నగియెదరు= నవ్వుతారు; అని= అని; తలఁచున్= భావిస్తూంది.

**తా :** రుక్మిణి ఇతడు నా కుమారుడే అని చెప్పాలని మొదట సంకల్పించింది. కానీ మనస్సులో మహాసంశయం కలిగిన తర్వాత వీడు నా కుమారుడు కానట్లైతే సవతులు గుంపుగూడి పరిహసిస్తారని భావించింది. (ఇలా ఏ నిర్ణయమూ చేయలేకుంది.)

**వ. ఇట్లు రుక్మిణీదేవి విచారించుచుండ లోపలి నగరికావలివారివలన విని కృష్ణుండు దేవకీవసుదేవులం దోడ్కొని చనుదెంచి సర్వజ్ఞుం డయ్యు నేమియు వివరింపక యూరకుండె, నంత నారదుండు సనుదెంచి శంబరుఁడు గుమారునిం గొనిపోవుట మొదలైన వార్త లెఱింగించిన, 38**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; రుక్మిణీదేవి; విచారించుచున్+ఉండన్= ఆలోచిస్తూ ఉండగా; లోపలినగరి= అంతఃపురంయొక్క; కావలివారివలనన్= కాపలాకాసేవారి ద్వారా; విని= రతీప్రద్యుమ్నుల వృత్తాంతం విని; కృష్ణుండు= మాధవుడు; దేవకీవసుదేవులన్= దేవకిని, వసుదేవుణ్ణీ; తోడ్కొని= వెంటబెట్టుకొని; చనుదెంచి= వచ్చి; సర్వజ్ఞుండు= అన్నీ తెలిసినవాడు; అయ్యున్= అయినప్పటికీ; ఏమియున్= ఏమీ; వివరింపక= చెప్పక; ఊరక+ఉండెన్= మిన్నకుండెను; అంతన్= అంతలో; నారదుండు= నారదమహర్షి; చనుదెంచి= వచ్చి; శంబరుండు= శంబరాసురుడు; కుమారునిన్= పసిబిడ్డను; కొనిపోవుట= ఎత్తుకొనిపోవుట; మొదలైన= మున్నగు; వార్తలు= సమాచారాలు; ఎఱింగించినన్= తెలియజేయగా...

**తా :** ఈ విధంగా రుక్మిణి ఆలోచిస్తుండగా కృష్ణుడు అంతఃపుర రక్షకులవల్ల జరిగిందంతా విన్నాడు. వెంటనే, దేవకీవసుదేవులతో పాటు వచ్చాడు. ఆయనకు అన్నీ తెలుసు. కానీ, మాటమాత్రమైనా చెప్పలేదు. అంతలోనే నారదుడు వచ్చి, శంబరుడు శిశువయిన ప్రద్యుమ్నుణ్ణి అపహరించికొని వెళ్లటం మొదలయిన వృత్తాంతాలు తెలియజేయగా

**క. "చచ్చిన బాలుఁడు గ్రమ్మఱ, వచ్చినక్రియ వచ్చెఁ బెక్కువర్షములకు నీ**
**సచ్చరితు నేఁడు గంటిమి, చెచ్చెర మున్నెట్టి తపము సేయంబడెనో?" 39**

**ప్రతి :** చచ్చిన= చనిపోయిన; బాలుఁడు= పిల్లవాడు; పెక్కు= చాలా; వర్షములకున్= సంవత్సరాలకు (తర్వాత); క్రమ్మఱన్= మరల; వచ్చిన క్రియన్= వచ్చినట్లుగా; వచ్చెన్= వచ్చాడు; ఈ సత్+చరితున్= ఈ సత్ప్రవర్తన కలవాణ్ణి; నేఁడు= ఈనాడు; కంటిమి= చూచాము; మున్ను= పూర్వజన్మంలో; ఎట్టి= ఎటువంటి; తపము= తపస్సు; చేయన్+పడెన్+ఓ= చేయబడిందో?

**తా :** మరణించిన బాలుడు బ్రతికి చాలాయేళ్లకు మరలా ఇల్లుచేరినట్లుగా ఇతడు వచ్చాడు. ఈనాడు మంచినడవడిగల ఇతణ్ణి ఆకస్మికంగా చూచాము. పూర్వజన్మలో మనము ఎటువంటి తపస్సు చేశామో? (గొప్ప తపస్సు చేసి ఉంటామని భావం)

**వ. అని యంతఃపురకాంతలును, దేవకీ వసుదేవ రామకృష్ణులును యథోచిత క్రమంబున నా దంపతుల దివ్యాంబరాభరణాలంకృతుల సత్కరించి సంతోషించిరి, రుక్మిణీదేవియు నందనుం గౌఁగిలించుకొని. 40**

**ప్రతి :** అని= అని; అంతఃపురకాంతలును= అంతఃపురస్త్రీలును; దేవకీవసుదేవరామకృష్ణులును= దేవకియు, వసుదేవుడును, బలరాముడును, కృష్ణుడును; యథా+ఉచిత= తగిన; క్రమంబునన్= రీతిగా (వారివారి యోగ్యతలకు తగినట్లుగా); ఆ; దంపతులన్= భార్యాభర్తలను (రతీదేవిని, ప్రద్యుమ్నుణ్ణి); దివ్య= దివ్యమైన; అంబర= వస్త్రాలతో; ఆభరణ= నగలతో; అలంకృతులన్= అలంకరింపబడినవారిని; సత్కరించి= సన్మానించి; సంతోషించిరి= ఆనందపడిరి; రుక్మిణీదేవియున్= రుక్మిణియు; నందనున్= కుమారుణ్ణి; కౌఁగిలించుకొని= కౌగిటచేర్చి...

**తా :** ఆ విధంగా పలికి అంతఃపురస్త్రీలూ కృష్ణుడూ మొదలయిన వారూ మనోజ్ఞమయిన వస్త్రాలతో, భూషణాలతో, అలంకరించబడిన రతీప్రద్యుమ్నుల్ని సత్కరించి, ఆనందించారు. అప్పుడు రుక్మిణి కుమారుణ్ణి అక్కున చేర్చికొని

**శా. 'అన్నా? నా చనుఁబాపి నిన్ను దనుజుం డంభోనిధిన్ వైచెనే**
**యెన్నే వర్షము లయ్యెఁ బాసి సుత! నీ వేరీతి జీవించి యే**
**సన్నాహంబున శత్రు గెల్చితివొ? యాశ్చర్యంబు సంధిల్లెడిన్**
**నిన్నుం గాంచితి నింతకాలమునకున్ నే ధన్యతం జెందితిన్. 41**

**ప్రతి :** అన్నా!= నాయనా!; సుత!= కుమారా!; దనుజుండు= రాక్షసుడు - శంబరుడు; నిన్నున్= నిన్ను; నా= నాయొక్క; చనున్= స్తనాన్ని; పాపి= దూరంచేసి; అంభస్+నిధిన్= సముద్రంలో; వైచెన్+ఏ?= త్రోసివేశాడా?; పాసి= నన్ను వదలి; ఎన్ని+ఏన్= ఎన్నో; వర్షములు= సంవత్సరాలు; అయ్యెన్= అయ్యాయి; నీవు; ఏ రీతిన్= ఏ విధంగా; జీవించి= బ్రతికి; ఏ సన్నాహంబునన్= ఏ యుద్ధప్రయత్నములతో; శత్రున్= వైరిని - శంబరుణ్ణి; గెల్చితివి+ఒ= జయించావో; ఆశ్చర్యంబు= ఆశ్చర్యం; సంధిల్లెడిన్= కలుగుతూంది; ఇంత కాలమునకున్= ఇంత కాలానికి (ఇన్నేండ్ల తర్వాత); నిన్నున్= నిన్ను; కాంచితిన్= చూచాను; నేన్= నేను; ధన్యతన్= కృతార్థతను; చెందితిన్= పొందాను.

**తా :** నాయనా! కుమారా! నా చనుబాలు త్రాగటానికి వీలులేకుండా చేసి, నిన్ను శంబరాసురుడు సముద్రంలో పడేశాడా? నిన్ను చూచి ఎన్నేళ్లయిందో! నీవు ఏ విధంగా బ్రతికి బయటబడ్డావు? ఏ పూనికతో యుద్ధంలో శంబరుణ్ణి గెల్చావు? ఆలోచిస్తే ఆశ్చర్యం కలుగుతూందయ్యా! ఇంతకాలానికి నిన్ను చూచాను. కృతార్థురాలి నయ్యాన్నాయనా!!

**వ. అని కొడుకుం జూచి సంతోషించి కోడలిగుణంబులు కైవారంబు సేసి, వినోదించుచుండె, నంత ద్వారకానగరంబు ప్రజలు విని హర్షించి, రందు. 42**

**ప్రతి :** అని; కొడుకున్= కుమారుణ్ణి; చూచి= కనులార చూచి; సంతోషించి= హర్షించి; కోడలి= కోడలయిన రతీదేవియొక్క; గుణంబులు= సద్గుణములు; కైవారంబు+చేసి= ప్రశంసించి; వినోదించుచున్= వేడుకలతో ప్రొద్దుపుచ్చుతూ; ఉండెన్= ఉండింది; అంతన్= అప్పుడు; ద్వారకానగరంబు ప్రజలు= ద్వారకాపురిలోని జనులు; విని= ప్రద్యుమ్నుని వృత్తాంతం విని; హర్షించిరి= సంతోషిచారు; అందున్= ఆ ద్వారకాప్రజలలో...

**తా :** రుక్మిణీదేవి ఈ విధంగా పలికి, కొడుకును చూచి మహానందం పొందింది. కోడలిని పొగడింది. వేడుకలతో కాలక్షేపం చేస్తూ ఉన్నది. ద్వారకా పట్టణప్రజలు కూడా ప్రద్యుమ్నుని రాక విని సంతోషించారు. వారిలో

**క. సిరిపెనిమిటిపుత్త్రకుఁ డగు, మరుఁ గని హరిఁ జూచినట్ల మాతలు దమలోఁ**
**గరఁగుదు రఁట పరకాంతలు, మరుఁ గని మోహాంధకారమగ్నలు గారే? 43**

**ప్రతి :** సిరి= లక్ష్మియొక్క; పెనిమిటి= భర్తయగు విష్ణునియొక్క; పుత్త్రకుఁడు= కుమారుడు; అగు= అయిన; మరున్= మన్మథుణ్ణి; కని= చూచి; మాతలు= తల్లులు - కృష్ణుని భార్యలు; హరిన్= కృష్ణుని; చూచిన+అట్లు+అ= చూచినవిధంగానే; తమలోన్= తమలో తాము; కరఁగుదురు+అఁట= పరవశించిపోతారట!; పరకాంతలు= ఇతరస్త్రీలు; మరున్= మన్మథుణ్ణి; కని= చూచి; మోహ= మోహమనెడు; అంధకార= చీకటిలో; మగ్నలు= మునిగినవారు; కారు+ఏ= కారా? (అవుతారు)

**తా :** శ్రీకృష్ణుని భార్యలు లక్ష్మీనారాయణుల కుమారుడయిన మన్మథుణ్ణి చూచి, శ్రీకృష్ణుణ్ణి చూచినప్పటిమాదిరిగా పరవశిస్తారట! ఇక పరాయిఆడువారు మన్మథుణ్ణి చూచి మోహాంధకారంలో మునిగినవాళ్లు కావటం వింతగాదు గదా!

**వ. అని చెప్పి శుకుం డిట్లనియె. 44**

**ప్రతి :** అని= ఇలా; చెప్పి; శుకుండు= శుకమహర్షి; ఇట్లనియె= ఇలా పలికెను.

**తా :** ఇంతవరకూ చెప్పి శుకుడు ఇంకా ఈ విధంగా అన్నాడు.

## ❖ శ్రీకృష్ణుడు లోకాపవాద నివృత్తికొఱకు స్యమంతకమణిని దెచ్చుట ❖

**క. సత్రాజిత్తు నిశాచర, శత్రునకుం గీడు సేసి సద్వినయముతోఁ**
**బుత్రి స్యమంతకమణియును, మైత్రిం గొని తెచ్చి యిచ్చె మనుజాధీశా! 45**

**ప్రతి :** మనుజ+అధీశా= మానవాధిపతీ, రాజా; సత్రాజిత్తు= సత్రాజిత్తు; నిశాచర= రాత్రియందు సంచరించేవారైన రాక్షసులయొక్క; శత్రునకున్= వైరికి (శ్రీకృష్ణునికి); కీడు+చేసి= అపకారంచేసి; సత్+వినయముతోన్= సజ్జనులవినయంతో; మైత్రిన్+కొని= స్నేహంచేసి; పుత్రిన్= కొమార్తెనూ; స్యమంతకమణియున్= స్యమంతకమణినీ; కొనితెచ్చి= తీసుకొనివచ్చి; ఇచ్చెన్= సమర్పించాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! సత్రాజిత్తు అనే రాజు మొదట శ్రీకృష్ణునికి చెరుపుచేసి, తర్వాత నమ్రత కలవాడై చెలిమిచేసి పుత్రికనూ, స్యమంతకమణినీ అర్పించాడు.

**వ. అనిన విని రా జిట్లనియె. 46**

**ప్రతి :** అనినన్= అనగా; విని= విని; రాజు= పరీక్షిత్తు; ఇట్లుక్ష్మఅనియెన్= ఇలా అడిగాడు.

**తా :** ఆ మాటలు విని రాజు ఈ విధంగా ప్రశ్నించాడు.

**ఆ. శౌరి కేమి తప్పు సత్రాజితుఁడు సేసెఁ?, గూఁతు మణిని నేల కోరి యిచ్చె?**
**నతని కెట్లు కలిగె నా స్యమంతకమణి, విప్రముఖ్య! నాకు విస్తరింపు. 47**

**ప్రతి :** విప్రముఖ్య= బ్రాహ్మణోత్తమా!; సత్రాజితుఁడు= సత్రాజిత్తు; శౌరికిన్= శ్రీకృష్ణునియెడ; ఏమి తప్పు= ఏ అపరాధం; చేసెన్= చేశాడు; కూఁతున్= కొమార్తెనూ; మణినిన్= స్యమంతకమణినీ; కోరి= ఇష్టపడి; ఏల= ఎందువల్ల; ఇచ్చెన్= ఇచ్చాడు?; అతనికిన్= ఆ సత్రాజిత్తుకు; ఆ స్యమంతకమణి= ఆ పేరుగల రత్నం; ఎట్లు= ఏ విధంగా; కలిగెన్= ప్రాప్తించింది; నాకున్= నాకు; విస్తరింపు= పూర్తిగా చెప్పుము.

**తా :** శుకమహర్షీ! సత్రాజిత్తు శ్రీకృష్ణునియెడ ఏ తప్పుచేశాడు? పుత్రికనూ స్యమంతకమణినీ తన ఇష్టానుసారంగా ఏ హేతువువల్ల శ్రీకృష్ణునికి సమర్పించాడు? ఇంతకూ ఆ స్యమంతకమణి అతని కెట్లా లభించింది? నాకు సమగ్రంగా ఈ విషయాలు చెప్పుము.

**వ. అనిన విని శుకయోగివర్యుం డిట్లనియె. సత్రాజిత్తనువాఁడు సూర్యునకు భక్తుండై చెలిమి సేయ నతనివలన సంతసించి సూర్యుండు స్యమంతకమణి నిచ్చె, నా మణి కంఠమున ధరియించి సత్రాజిత్తు భాస్కరునిభంగి భాసమానుండై ద్వారకానగరంబునకు వచ్చిన దూరంబున నతనిం జూచి జనులు మణిప్రభాపటలతేజోహృతదృష్టు లయి సూర్యుం డని శంకించి వచ్చి హరి కిట్లనిరి. 48**

**ప్రతి :** అనినన్= రాజు అడుగగా; విని= విన్నవాడై; శుకయోగివర్యుండు= శుకయోగీంద్రుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికెను; సత్రాజిత్తు+అనువాఁడు= సత్రాజిత్తు; సూర్యునకున్= రవికి; భక్తుండు+ఐ= భక్తుడై; చెలిమి+చేయన్= స్నేహంచేయగా; అతని వలనన్= సత్రాజిత్తుపట్ల; సంతసించి= సంతోషించి; సూర్యుండు= భానుడు; స్యమంతకమణిన్+ఇచ్చెన్= స్యమంతకమణిని ఇచ్చాడు; ఆ మణి= ఆ మణిని; కంఠమునన్= కంఠంలో; ధరియించి= తాల్చి; సత్రాజిత్తు; భాస్కరునిభంగిన్= సూర్యునివలె; భాసమానుండు+ఐ= ప్రకాశిస్తున్నవాడై; ద్వారకానగరంబునకున్= ద్వారకా పట్టణానికి; వచ్చినన్= రాగా; జనులు= పౌరులు; దూరంబునన్= దవ్వులనుండి; అతనిన్= సత్రాజిత్తును; చూచి= కనుగొని; మణి= స్యమంతకమణియొక్క; ప్రభా= కాంతులయొక్క; పటల= సమూహంయొక్క; తేజస్= ప్రభావంచేత; హృత= హరింపబడిన; దృష్టులు= చూపులుగలవారు; అయి; సూర్యుండు= భాస్కరుడు; అని; శంకించి= అనుమానించి; వచ్చి= మందిరం చేరి; హరికిన్= శ్రీకృష్ణునితో; ఇట్లు= ఈ విధంగా; అనిరి= చెప్పారు.

**తా :** శుకయోగీశ్వరుడు పరీక్షిత్తుతో ఈ విధంగా చెప్పాడు :- రాజా! సత్రాజిత్తు అనే రాజు ఒకడున్నాడు. అతడు సూర్యునిభక్తుడు. అతనిసేవలకు మెచ్చుకొని సూర్యభగవానుడు స్యమంతకమణిని ప్రసాదించాడు. ఒకసారి సత్రాజిత్తు ఆ మణిని మెడలో అలంకరించుకొని ద్వారకకు వచ్చాడు. అతడు రెండవసూర్యునిలాగా వెలుగులు విరజిమ్ముతున్నాడు. స్యమంతకమణికాంతులకు ద్వారకావాసులకన్నులు మిఱుమిట్లుగొల్పుతున్నవి. వారు సూర్యుడు దివినుండి భువికి దిగివచ్చాడా అని సందేహించారు. వెంటనే వెళ్లి, శ్రీకృష్ణునికి ఈ విధంగా విన్నవించుకొన్నారు.

**క. నారాయణ! దామోదర!, నీరజదళనేత్ర! చక్రి! నిఖిలేశ! గదా**
**ధారణ! గోవింద! నమ, స్కారము యదుపుత్ర! నిత్యకల్యాణనిధీ! 49**

**ప్రతి :** నారాయణ!= జలం నివాసస్థానముగా కలవాడా!; దామోదర!= (వక్షఃస్థలమున తులసిమాల కలవాడా!) బాల్యమున యశోదచేత ఉదరమందు త్రాటితో కట్టబడినవాడా!; నీరజ= పద్మములయొక్క; దళ= రేకులవంటి; నేత్ర!= కన్నులు గలవాడా!; చక్రి!= చక్రం ఆయుధంగా కలవాడా!; నిఖిల= సమస్త లోకములకు; ఈశ= ప్రభువైనవాడా!; గదాధారణ!= కౌమోదకి అనే గదను ధరించినవాడా!; గోవింద!= గోవర్ధనగిరినెత్తి గోవులను కాపాడినవాడా!; (వరాహరూపంలో భూమిని ఉద్ధరించినవాడా! మత్స్యరూపంలో వేదాలను పొందినవాడా!); యదుపుత్ర= యదువంశీయుడవయిన కుమారా! కృష్ణా!; నిత్య= ఎడతెగని; కల్యాణ= శుభాలకు; నిధీ= ఆశ్రయమయిన వాడా!; నమస్కారము= వందనం.

**తా :** ఓ నారాయణా! దామోదరా! పద్మాక్షా! చక్రధారీ! సర్వేశ్వరా! గదాధరా! వేదోద్ధారకా! యదుకుమారా! నిత్యశుభకరా! శ్రీకృష్ణా! నీకు నమస్కారం.

**మ. దివిజాధీశ్వరు లిచ్చగింతురు గదా దేవేశ! నిన్ జూడ యా**
**దవవంశంబున గూఢమూర్తివి జగత్త్రాణుండవై యుండఁగా**
**భవదీయాకృతిఁ జూడ నేఁడిదె రుచిప్రచ్ఛన్న దిగ్భాగుఁడై**
**రవియో, నీరజగర్భుఁడో యొకఁడు సేరన్ వచ్చె మార్గంబునన్. 50**

**ప్రతి :** దేవ+ఈశ!= దేవతలయొక్క అధిపతీ! కృష్ణా!; దివిజ= దేవతలయొక్క; అధి+ఈశ్వరులు= ప్రభువులు - ఇంద్రుడు మొదలగువారు; నిన్= నిన్ను; చూడన్= దర్శింపగా; ఇచ్చగింతురు+కదా= కోరుదురుగదా; యాదవ= యాదవులయొక్క;

వంశంబునన్= కులంలో; గూఢ= రహస్యమయిన; మూర్తివి= ఆకారం గలవాడివి; జగత్= లోకాలను; త్రాణుండవు= రక్షించేవాడివి; ఐ= అయి; ఉండన్+కాన్= ఉండగా; నేఁడు= ఈనాడు; ఇది+ఎ= ఇదిగో; భవదీయ= నీయొక్క; ఆకృతిన్= ఆకారాన్ని; చూడన్= చూచుటకు; రుచి= కాంతులచేత; ప్రచ్ఛన్న= కప్పబడిన; దిక్+భాగుఁడు= దిక్ప్రదేశాలు కలవాడు; ఐ= అయి; రవి+ఓ= సూర్యుడో; నీరజగర్భుఁడు+ఓ= పద్మం నుండి పుట్టినవాడా! (బ్రహ్మయో); ఒకఁడు= ఒకానొకడు; మార్గంబునన్= ఈ దారిగుండా; చేరన్ వచ్చెన్= దగ్గరగా వచ్చాడు.

**తా :** దేవాధిదేవా! ఇంద్రాదులు నిన్ను చూడాలని ఉవ్విళ్లూరుతారుగదా! యాదవవంశంలో జన్మించి, నీవు స్వస్వరూపాన్ని మరుగుపరచి, లోకాల్ని కాపాడుతూ ఉన్నావు. ఇటువంటి నిన్ను చూడటానికి సూర్యుడో, బ్రహ్మదేవుడో ఎవడో ఒకడు తన వెలుగులచేత నాలుగు దిక్కులనూ కప్పిపుచ్చుతూ ఇదిగో ఈ దారినే దగ్గరకు వచ్చాడు.

**వ. అని యిట్లు పలికిన మూఢజనులఁ జూచి గోవిందుండు నగి మణిసమేతుండైన సత్రాజితుండు గాని సూర్యుండు గాఁ డని పలికె, నంత సత్రాజితుండు శ్రీయుతంబయి మంగళాచారంబైన తన గృహంబునకుం జని, మహీసురులచేత నిజదేవతామందిరంబున న మ్మణిశ్రేష్ఠంబుఁ బ్రవేశంబు సేయించె, నదియును బ్రతిదినంబు నెనిమిదిబారువుల సువర్ణంబు గలిగించుచుండు. 51**

**ప్రతి :** అని+ఇట్లు; పలికిన= అనిచెప్పిన; మూఢజనులన్= తెలివితక్కువవారిని; చూచి; గోవిందుండు= శ్రీకృష్ణుడు; నగి= నవ్వి; మణిసమేతుండు= మణితో కూడుకొన్నవాడు; ఐన= అయినట్టి; సత్రాజితుండు= సత్రాజిత్తు; కాని= తప్ప; సూర్యుండు+ కాఁడు+అని= సూర్యుడు కాదని; పలికెన్= యథార్థం చెప్పాడు; అంతన్= తరువాత; సత్రాజితుండు= సత్రాజిత్తు; శ్రీ= సంపదతో; యుతంబు+అయి= కూడుకొన్నదై; మంగళ+ఆచారంబు+ఐన= శుభాలు కలిగించే సంప్రదాయాలు కలదైన; తనగృహంబునకున్= తన ఇంటికి; చని= వెళ్లి; మహీసురులచేతన్= బ్రాహ్మణులచేత; నిజ= తనయొక్క; దేవతా మందిరంబునన్= దేవుని ఇంటిలో; ఆ+మణిశ్రేష్ఠంబున్= ఆ ఉత్తమ మణిని; ప్రవేశంబు+చేయించెన్= ప్రవేశపెట్టించాడు (పెట్టించాడు); అదియును= ఆ మణికూడా; ప్రతిదినంబు= ప్రతిరోజు; ఎనిమిదిబారువుల= నూటరవై మణుగుల బరువుగల; సువర్ణంబు= బంగారాన్ని; కలిగించుచున్+ఉండున్= కల్గిస్తూంది. (ఇస్తూంది.)

**తా :** తనతో ఈ విధంగా చెప్పిన ఆ మందబుద్ధుల్ని చూచి శ్రీకృష్ణుడు నవ్వుకొన్నాడు. వారితో వచ్చినవాడు స్యమంతకమణి ధరించిన సత్రాజిత్తు గానీ సూర్యుడు కాదని చెప్పాడు. తర్వాత సత్రాజిత్తు సకలసంపదలు కలిగి, శుభకార్యాలు జరిగే తన గృహానికి వెళ్లాడు. స్యమంతకమణిని తన దేవతామందిరంలో (దేవుని ఇంటిలో) బ్రాహ్మణులచేత నెలకొల్పాడు. ఆ మణి ప్రతిరోజూ నూటఅరవై మణుగుల బంగారాన్ని పుట్టిస్తుంది.

**క. ఏ రా జేలెడు వసుమతి, నా రత్నము పూజ్యమానమగు నక్కడ రో**
**గారిష్టసర్వమాయిక, మారీదుర్భిక్షభయము మాను నరేంద్రా! 52**

**ప్రతి :** నర+ఇంద్రా!= రాజా!; ఆ రత్నము= ఆ స్యమంతకమణి; ఏ రాజు= ఏ ప్రభువు; ఏలెడు= పరిపాలిస్తున్న; వసుమతిన్= భూమియందు; పూజ్యమానము= పూజలు పొందుతూండేది; అగున్= అవుతుందో; అక్కడన్= ఆ భూమియందు; రోగ= వ్యాధులవల్ల; అరిష్ట= గ్రహాది పీడలవల్ల; సర్వ= సమస్తమైన; మాయిక= మాయావుల వల్ల; మారీ= మృత్యువులవల్ల; దుర్భిక్ష= కరవువల్ల కలిగే; భయము= భీతి; మానున్= తొలగిపోతుంది.

**తా :** రాజా!; స్యమంతకమణి పూజింపబడుతుండే రాజ్యంలో వ్యాధులు, గ్రహపీడలు, వివిధవంచకులు, మృత్యువు, క్షామం – వీటివల్ల కల్గే భయం ఉండదు.

**క. అ మ్మణి యాదవవిభునకు, ని మ్మని హరి యడుగ నాతఁ డీక ధనేచ్ఛం**
**బొమ్మని పలికెను జక్రికి, ని మ్మణి యీకున్న మీఁద నేమౌ ననుచున్. 53**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; ఆ+మణిన్= ఆ స్యమంతకమణిని; యాదవ= యాదవులయొక్క; విభునకున్= రాజుకు; (ఉగ్రసేనునకు); ఇమ్ము+అని= అర్పింపుమని; అడుగన్= కోరగా; ఆతఁడు= ఆ సత్రాజిత్తు; ధన+ఇచ్ఛన్= ధనమునందలి ఆశ చేత; ఈ+మణి= ఈ మణిని; చక్రికిన్= చక్రం కలవాడైన శ్రీకృష్ణునికి; ఈక+ఉన్నన్= ఈయకుండా ఉంటే; మీఁదన్= భవిష్యత్తులో; ఏమి= ఏ ఆపద; ఔన్= సంభవిస్తుంది; అనుచున్= అనుకొనుచూ; పొమ్ము= ఇయ్యను పో!; అని; పలికెన్= అన్నాడు.

**తా :** శ్రీకృష్ణుడు యాదవరాజయిన ఉగ్రసేనునికి, స్యమంతకమణిని ఇమ్మని సత్రాజిత్తును అడిగాడు. సత్రాజిత్తు ధనాశతో మణిని ఈయకపోతే ఏ కీడు కలుగుతుంది? (కలుగదని అతని భావం) అని అనుకొని శ్రీకృష్ణునితో 'నే నియ్యను పో' అన్నాడు.

**వ. అంత. 54**

**తా :** తర్వాత

**చ. అడరెడు వేడ్కఁ గంఠమున న మ్మణిఁ దాల్చి ప్రసేనుఁ డొక్కనాఁ**
**డడవికి ఘోరవన్యమృగయారతి నేగిన వానిఁ జంపి పైఁ**
**బడి మణిఁ గొంచు నొక్కహరి పాఱఁగ దాని వధించి డాసి యే**
**ర్పడఁ గనె జాంబవంతుఁడు ప్రభాత్తదిగంతము నా స్యమంతమున్. 55**

**ప్రతి :** ప్రసేనుఁడు= ప్రసేనుడు (సత్రాజిత్తు తమ్ముడు); ఒక్కనాఁడు= ఒకరోజు; ఆ మణిన్= ఆ స్యమంతకమణిని; అడరెడు= అతిశయిస్తున్న; వేడ్కన్= ఉబలాటంతో; కంఠమునన్= మెడయందు; తాల్చి= ధరించి; ఘోర= భయంకరమైన; వన్య= అడవిజంతువుల; మృగయా= వేటయందలి; రతిన్= ఆసక్తితో; అడవికిన్; ఏగినన్= వెళ్లగా; ఒక్కహరి= ఒక సింహం; వానిన్= ఆ ప్రసేనుని; పైన్+పడి= మీదబడి; చంపి; మణిన్= మణిని; కొంచున్= తీసుకొని; పాఱన్+కన్= పరిగెత్తగా; జాంబవంతుఁడు= జాంబవంతుడు; దానిన్= ఆ సింహాన్ని; వధించి= చంపి; డాసి= సమీపించి; ప్రభా= కాంతులచేత; ఆత్త= ఆక్రమించిన; దిక్+అంతమున్= దిక్కులకొనలు కలది అయిన; ఆ స్యమంతమున్= ఆ స్యమంతక మణిని; ఏర్పడన్= స్పష్టపడునట్లుగా; కనెన్= చూచాడు.

**తా :** సత్రాజిత్తుతమ్ముడు ప్రసేనుడు. కుతూహలంతో స్యమంతకమణిని మెడలో ధరించి, జంతువుల్ని వేటాడటానికి అడవికి వెళ్లాడు. అక్కడ ఒక సింహం అతణ్ణి చంపి, మణిని ఎత్తుకొని పారిపోయింది. జాంబవంతుడు ఆ సింహాన్ని సంహరించి, దగ్గరకు వెళ్లి, దిగంతాల దాకా వెలుగులు విరజిమ్ముతున్న ఆ స్యమంతకమణిని చూచాడు.

**క. కని జాంబవంతుఁ డా మణిఁ, గొనిపోయి సమీపశైలగుహఁ జొచ్చి ముదం**
**బునఁ దన కూరిమిసుతునకు, ఘనకేళీకందుకంబుగాఁ జేసె నృపా! 56**

**ప్రతి :** నృపా!= ఓ రాజా! (జాంబవంతుడు); కని= చూచి; ఆ మణిన్= ఆ స్యమంతకమణిని; కొనిపోయి= తీసుకొనిపోయి; సమీప= దగ్గఱలో ఉన్న; శైలగుహన్= కొండగుహను; చొచ్చి= ప్రవేశించి; ముదంబునన్= సంతోషంతో; తన= తనయొక్క; కూరిమిసుతునకున్= గారాబుకొడుకునకు; ఘన= గొప్పదైన; కేళీ= ఆటకుపయోగించే; కందుకంబు+కాన్= బంతిగా; చేసెన్= చేసెను. (ఇచ్చాడు.)

**తా :** రాజా! జాంబవంతుడు ఆ మణిని తీసుకొనిపోయి సమీపంలో ఉన్న గుహలో ప్రవేశించాడు. దాన్ని తన ప్రియపుత్రునికి ఆటబంతిగా చేశాడు.

**విశే :** కొన్ని ప్రతులలో "తన కూరిమిసుతకును" అనే పాఠం కనబడుతున్నది; అప్పుడు జాంబవంతుడు తన పుత్రికకు స్యమంతకమణిని ఆటబంతిగా చేశాడని చెప్పాలి. ఇది ఇతరాంధ్రకావ్యాల సాక్ష్యానికి వ్యతిరేకం.ఎఱ్ఱాప్రెగడ హరివంశంలో" ... తన తనయుఁడు శిశువు సుకుమారుఁడను వానిచేతి కాడ మానికంబును నిచ్చె..." అని ఉన్నది. దీనినిబట్టి జాంబవంతుడు తన కుమారునకే స్యమంతకమణిని ఆటబంతిగా చేశాడని స్పష్టమవుతున్నది.

సంస్కృతభాగవతంలో కూడా "సోఽపి చక్రే కుమారస్య మణిం క్రీడనకం బిలే" అని ఉన్నది. జాంబవంతుడు బిలంలో మణిని కుమారునకు క్రీడాసాధనంగా చేశాడని దీని కర్థం. కాబట్టి "తన కూరిమి సుతునకు" అనే పాఠాన్ని ఇక్కడ గ్రహించడమైంది.

**వ. అంత సత్రాజితుండు తన సహోదరుండైన ప్రసేనునిం గానక దుఃఖించుచు. 57**

**ప్రతి :** అంతన్= అటు పిమ్మట; సత్రాజితుండు= సత్రాజితుడు; తన సహ+ఉదరుండు+ఐన= తన తోడబుట్టినవాడైన; ప్రసేనునిన్= ప్రసేనుణ్ణి; కానక= కనుగొనక; దుఃఖించుచున్= దుఃఖపడుతూ...

**తా :** తర్వాత సత్రాజిత్తు తన తమ్ముడు ప్రసేనుడు కనపడకపోవటంచేత దుఃఖిస్తూ

**మ. 'మణి కంఠంబునఁ దాల్చి నేఁ డడవిలో మావాఁడు వర్తింపఁగా**
**మణికై పట్టి వధించినాఁడు హరికిన్ మర్యాద్య లే' దంచు దూ**
**షణముం జేయఁగ వానిదూషణముఁ గంసధ్వంసి యాలించి యే**
**వ్రణమున్ నా యెడ లేదు, నింద గలిగెన్ వారించు టే రీతియో?' 58**

**ప్రతి :** మావాఁడు= మా తమ్ముడు; మణి= స్యమంతకమణిని; కంఠంబునన్= మెడయందు; తాల్చి= ధరించి; అడవిలోన్= అరణ్యంలో; నేఁడు= ఈనాడు; వర్తింపన్+కాన్= తిరుగగా; మణికిన్+ఐ= మణికోసం; పట్టి= పట్టుకొని; వధించినాఁడు= చంపాడు; హరికిన్= శ్రీకృష్ణునికి; మర్యాద= న్యాయమార్గాన్ననుసరించే లక్షణం; లేదు; అంచున్= అనుచు; దూషణము+ చేయన్+కన్= నిందింపగా; కంసధ్వంసి= కంసుణ్ణి చంపినవాడైన శ్రీకృష్ణుడు; వానిదూషణమున్= సత్రాజిత్తు వేసిన నిందను; ఆలించి= విని; ఏ వ్రణమున్= ఏ తప్పు; నా+ఎడన్= నాయందు; లేదు; నింద= దూరు; కలిగెన్= పుట్టింది; వారించుట= దీన్ని తొలగించుట; ఏరీతి+ఓ?= ఏ విధంగానో?...

**తా :** "మా తమ్ముడు స్యమంతకమణిని మెడలో ధరించి, అరణ్యంలో సంచరిస్తుండగా ఆ మణికొరకు శ్రీకృష్ణుడు అతణ్ణి పట్టుకొని చంపాడు. అతనికి నీతినీ, న్యాయాన్నీ పాటించే బుద్ధిలేదు" అని సత్రాజిత్తు నిందవేశాడు. ఆ నింద శ్రీకృష్ణుని చెవినిబడింది. అతడు "నే నే తప్పు చేయలేదు. కానీ నాపై పడిన ఈ అపవాదును పోగొట్టుకోవటం ఎట్లా?"

**వ. అని వితర్కించి.** **59**

**తా :** అని యుక్తియుక్తంగా ఆలోచించి

**మ. తనవారెల్లఁ బ్రసేనుజాడఁ దెలుపం దర్కించుచున్ వచ్చి త**
**ద్వనవీథిం గనె నేలఁ గూలిన మహాశ్వంబుం బ్రసేనుం, బ్రసే**
**నుని హింసించిన సింహమున్, మృగపతిన్ నొప్పించి ఖండించి యేఁ**
**గిన భల్లూకము సొచ్చి యున్న గుహయుం గృష్ణుండు రోచిష్ణుఁడై.** **60**

**ప్రతి :** రోచిష్ణుఁడు= ప్రకాశించేవాడైన (నిందను పోగొట్టుకొన నిశ్చయించినవాడు); కృష్ణుండు= కృష్ణుడు; ఐ= అయి; తనవారు+ఎల్లన్= తనవారందరూ; ప్రసేను= ప్రసేనునియొక్క; జాడన్= దారిని, తెలుపన్= తెలియజేయగా; తర్కించుచున్= ఆలోచిస్తూ; వచ్చి= ఏతెంచి; తద్ వనవీథిన్= ఆ అడవిలోపల; నేలన్= నేలమీద; కూలిన= పడిపోయిన; మహత్+అశ్వంబున్= పెద్ద గుర్రాన్నీ; ప్రసేనున్= ప్రసేనుడినీ; ప్రసేనునిన్= ప్రసేనుణ్ణి; హింసించిన= చంపిన; సింహమున్= సింహాన్నీ; మృగపతిన్= మృగములకు రాజైన సింహాన్ని; నొప్పించి= బాధించి; ఖండించి= చంపి; ఏఁగిన= వెళ్లిన; భల్లూకము= ఎలుగుబంటి (జాంబవంతుడు); చొచ్చియున్న= ప్రవేశించిన; గుహయున్= గుహనూ; కనెన్= చూశాడు.

**తా :** తనకు సంబంధించిన వారందరూ ప్రసేనుడు వెళ్లిన దారిని చూపగా శ్రీకృష్ణుడు ఆలోచిస్తూ ప్రయాణించి చివరకు అడవికి వచ్చాడు. అక్కడ భూమిమీద పడిపోయిన ఒక గుర్రాన్నీ, ప్రసేనుణ్ణీ, అతణ్ణి చంపిన సింహాన్నీ, సింహాన్ని చంపి జాంబవంతుడు చేరిన గుహనూ చూచాడు.

**వ. కని తనవెంట వచ్చిన ప్రజల నెల్ల గుహాముఖంబున విడిచి, సాహసంబున మహానుభావుండైన హరి నిరంతరనిబిడాంధకారబంధురంబయి, భయంకరంబై, విశాలంబయిన గుహాంతరాళంబు సొచ్చి, చని యక్కడ నొక్క బాలున కెదుర దర్శనీయకేళీకందుకంబుగా వ్రేలం గట్టఁబడిన యమ్మణి శ్రేష్ఠంబుఁ గని హరింప నిశ్చయించి.** **61**

**ప్రతి :** కని= చూచి; తనవెంటన్= తన వెంబడి; వచ్చిన= ఏగుదెంచిన; ప్రజలన్+ఎల్లన్= జనుల నందరినీ; గుహా= గుహయొక్క; ముఖంబునన్= గుమ్మంలో; విడిచి= వదలి; సాహసంబునన్= తెగింపుతో; మహత్= గొప్ప; అనుభావుండు= మహిమ గలవాడు; ఐన= అయిన; హరి= శ్రీకృష్ణుడు; నిరంతర= ఎడములేని; నిబిడ= దట్టమయిన; అంధకార= చీకటిచే; బంధురంబు= నిండింది; అయి= అయింది; భయంకరంబు= భయాన్ని కలిగించేది; ఐ= అయి; విశాలంబు+అయిన= విరివియైన; గుహా= గుహయొక్క; అంతరాళంబున్= లోపలి భాగాన్ని; చొచ్చి= ప్రవేశించి; చని= ముందుకు వెళ్లి; అక్కడన్= అచట; ఒక్క బాలునకున్= ఒక పసివానికి; ఎదురన్= ఎదుట; దర్శనీయ= చూడముచ్చటయిన; కేళీ= ఆడుకొనుటకయిన; కందుకంబు+కాన్= బంతిగా; వ్రేలన్= వ్రేలాడునట్లుగా; కట్టన్+పడిన= కట్టబడిందైన; ఆ+మణి శ్రేష్ఠంబున్= ఆ ఉత్తమ రత్నాన్ని; కని= చూచి; హరింపన్= దొంగిలింపగా; నిశ్చయించి...

**తా :** శ్రీకృష్ణుడు తనవెంట వచ్చిన వారినందరినీ గుహవాకిట్లో నిలిపాడు. మహామహిమ కలిగినవాడు కాబట్టి, తెగువతో తానొక్కడే గుహలో ప్రవేశించాడు. దానినిండా చిమ్మచీకట్లు క్రమ్ముకొన్నాయి. నేల చదునుగా లేదు. విరివిగా ఉండి, భయం పుట్టించే ఆ గుహ నడిమికి వెళ్లి అక్కడ ఒక బాలుని కెదురుగా వ్రేలాడగట్టిన స్యమంతకమణిని కృష్ణుడు చూచాడు. అతడు దాన్ని అపహరించాలని నిర్ణయించుకొని

**క. మెల్లన పదము లిడుచు యదు, వల్లభుఁ డా శిశువుకడకు వచ్చిన గుండెల్**
**జల్లనఁగఁ జూచి కంపము, మొల్లంబుగ దానిదాది మొఱపెట్టె నృపా! 62**

**ప్రతి :** నృపా!= రాజా!; యదు= యదువంశీయులలో; వల్లభుఁడు= ముఖ్యుడు (ఉత్తముడు, శ్రీకృష్ణుడు); మెల్లనన్= మెల్లగా; పదములు+ఇడుచున్= అడుగులు పెట్టుతూ; ఆ శిశువు= ఆ పసిబిడ్డ; కడకున్= దగ్గరకు; వచ్చినన్= రాగా; దానిదాది= ఆ శిశువు పెంపుడుతల్లి; గుండెల్= గుండె; జల్లు+అనన్+కన్= జలదరింపగా; చూచి= కనుగొని; కంపము= వణకు; మొల్లంబు+కన్= ఎక్కువకాగా; మొఱపెట్టెన్= ఆర్తధ్వని చేసింది.

**తా :** శ్రీకృష్ణుడు మెల్లగా అడుగులు వేస్తూ, ఆ బాలునిదగ్గరకు వచ్చాడు. అతణ్ణి చూచిన దాది గుండెలదిరి, వణకు ఎక్కువై భయంతో అరుపులు పెట్టింది.

**వ. అంత నాధ్వని విని బలవంతుండైన జాంబవంతుఁడు వచ్చి తనస్వామి యని కృష్ణు నెఱుంగక ప్రాకృతపురుషుం డని తలంచి, కృష్ణునితో రణంబుచేసె. అందు. 63**

**ప్రతి :** అంతన్= అప్పుడు; ఆ ధ్వని= దాదికేక; విని; బలవంతుండు+ఐన= బలం కలవాడయిన; జాంబవంతుండు= భల్లుకరాజు; వచ్చి= అరుగుదెంచి; తనస్వామి= తన ప్రభువు; అని; కృష్ణున్= కృష్ణుణ్ణి; ఎఱుంగక= తెలుసుకొనలేక; ప్రాకృతపురుషుండు= సామాన్య మానవుడు; అని; తలంచి= ఊహించి; కృష్ణునితోన్; రణంబుచేసెన్= యుద్ధం చేశాడు; అందున్= ఆ గుహలో...

**తా :** దాదిఅరుపు విని, జాంబవంతుడు వచ్చాడు. అతడు శ్రీకృష్ణుణ్ణి చూచి, తన అధిపతి అని గుర్తించలేకపోయాడు. సామాన్య మానవుడు అని అనుకొన్నాడు. అనుకొని శ్రీకృష్ణునితో ఆ గుహలో కయ్యం చేశాడు.

**క. పలలమునకుఁ బోరెడు డే, గలక్రియ శస్త్రములఁ దరులఁ గరముల విజయే**
**చ్ఛల నిరువదియెనిమిది దిన, ములు పోరిరి నగచరేంద్రముఖ్యుఁడు హరియున్. 64**

**ప్రతి :** నగచర+ఇంద్ర= వానరశ్రేష్ఠులలో; ముఖ్యుఁడు= ప్రథమగణ్యుడు – జాంబవంతుడు; హరియున్= శ్రీకృష్ణుడును, పలలమునకున్= మాంసంకోసం; పోరెడు= పోరాడునట్టి; డేగల క్రియన్= డేగలవలె; శస్త్రములన్= ఆయుధాలతో; తరులన్= చెట్లతో; కరములన్= చేతులతో; విజయ= విజయమునందలి; ఇచ్ఛలన్= కోరికలతో; ఇరువది యెనిమిది దినములు; పోరిరి= యుద్ధం చేశారు.

**తా :** మాంసంకోసం పోరాడే డేగలమాదిరిగా శ్రీకృష్ణజాంబవంతులు ఒకరినొకరు జయించాలనే వాంఛలు కలిగి, ఆయుధాలతో, వృక్షాలతో, చేతుల్తో ఇరవైయెనిమిది రోజులు పోరాడారు.

**క. అడిదములుఁ దరులు విఱిగిన, బెడిదము లగు మగతనములు బిఱుతివక వడిం**
**బిడుగుల వడువునఁ బడియెడి, పిడికిటిపోటులను గలన బెరసి రిరువురున్. 65**

**ప్రతి :** ఇరువురున్= ఇద్దరునూ; శ్రీకృష్ణజాంబవంతులు; కలనన్= యుద్ధంలో; అడిదములున్= కత్తులునూ; తరులున్= చెట్లునూ; విఱిగినన్= ముక్కలు కాగా; బెడిదములు= అధికములు; అగు= అయిన; మగతనములన్= పరాక్రమాలచేత; పిఱుతివక= వెనుకంజవేయక; వడిన్= వేగంగా; పిడుగుల వడువునన్= పిడుగులవలె; పడియెడి= పడుచున్న; పిడికిటి పోటులన్= పిడికిళ్లపోటులతో; బెరసిరి= తలపడిరి.

**తా :** యుద్ధంలో కత్తులూ, చెట్లూ విరిగి నిరాయుధులయినప్పటికీ, శ్రీకృష్ణజాంబవంతులు శౌర్యాధిక్యంవల్ల వెనుకకు తగ్గలేకపోయాడు. వారు పిడుగులవంటి పిడికిటిపోటులే ఆయుధాలుగా యుద్ధం చేయటానికి పూనుకొన్నారు.

**శా. స్పష్టాహంకృతు లుల్లసిల్ల హరియున్ భల్లూకలోకేశుఁడున్**
**ముష్టాముష్టి నహర్నిశంబు జయసమ్మోహంబునం బోరుచోఁ**
**బుష్టిం బాసి ముకుందముష్టిహతులం బూర్ణశ్రమోపేతుఁడై**
**పిష్టాంగోరుశరీరుఁడై యతఁడు దా భీతాత్ముఁడై యిట్లనున్. 66**

**ప్రతి :** హరియున్= శ్రీకృష్ణుడును; భల్లూక= ఎలుగుబంట్లయొక్క; లోక= జగత్తుకు; ఈశుఁడున్= ప్రభువునూ; జాంబవంతుడును; స్పష్ట= వెల్లడియగు; అహంకృతులు= అహంకారాలు; ఉల్లసిల్లన్= అతిశయింపగా; అహస్+నిశంబు= పగలూ, రాత్రీ; జయ= జయించడం పైగల; సమ్మోహంబునన్= మిక్కిలి వ్యామోహంతో; ముష్టాముష్టిన్= పిడికిళ్లచే ఒకరినొకరు గ్రుద్దుకొంటూ; పోరుచోన్= పోరాడేటప్పుడు; ముకుంద= శ్రీకృష్ణునియొక్క; ముష్టి= పిడికిటియొక్క; హతులన్= పోటులచే; పుష్టిన్= బలాన్ని; పాసి= పోగొట్టుకొని; పూర్ణ= నిండుగా; శ్రమ= ఆయాసంతో; ఉపేతుఁడు+ఐ= కూడినవాడై; పిష్ట= పిండిపిండిగా అయిన; అంగ= అవయవాలుగల; ఉరు= పెద్దదయిన; శరీరుఁడు+ఐ= దేహం కలవాడై; భీత= భయం పొందిన; ఆత్ముఁడు+ఐ= మనస్సుకలవాడై; అతఁడు= ఆ జాంబవంతుడు; తాన్= తాను; ఇట్లు= ఈ విధంగా; అనున్= పలికాడు.

**తా :** శ్రీకృష్ణుడూ, జాంబవంతుడూ అహంకారం అతిశయింపగా, విజయవ్యామోహంతో, ఒకరినొకరు పిడికిళ్లతో పొడుచుకొంటూ అహోరాత్రాలు పోరాడారు. శ్రీకృష్ణుని పిడికిటి గ్రుద్దులకు జాంబవంతుడు బలం కోల్పోయాడు. నిండు అలసట కలిగిన అతని శరీరావయవాలన్నీ నజ్జు నజ్జయ్యాయి. అతడు భయపడి శ్రీకృష్ణునితో ఈ విధంగా అన్నాడు.

**వ. 'దేవా! నిన్నుఁ బురాణపురుషు నధీశ్వరు విష్ణుం బ్రభవిష్ణు నెఱుంగుదు. సర్వభూతంబులకుం బ్రాణప్రతాపధైర్యబలంబులు నీవే, విశ్వంబునకు సర్గస్థితిలయంబు లెవ్వ రాచరింతురు, వారికి సర్గస్థితి లయంబులఁ జేయు నీశ్వరుండవు నీవ, యాత్మవు నీవ'యని మఱియును. 67**

**ప్రతి :** దేవా!= ప్రకాశించేవాడా!; పురాణపురుషున్= జగత్కారణమయినవాణ్ణి (పురాతన పురుషుని); అధీశ్వరున్= జగత్ప్రభువును; విష్ణున్= విశ్వమున వ్యాపించి ఉండేవాణ్ణి; ప్రభవిష్ణున్= ఉత్కృష్టుడయినవాణ్ణి (ప్రభావశీలుని); ఎఱుంగుదున్= తెలియుదును; సర్వ= సమస్తమైన; భూతంబులకున్= ప్రాణులకు (సజీవనిర్జీవపదార్థాలకు); ప్రాణప్రతాప ధైర్యబలంబులు= ప్రాణం, ప్రతాపం, ధైర్యం, బలం; నీవే; విశ్వంబునకున్= ప్రపంచానికి; ఎవ్వరు= ఎవరు; సర్గ= సృష్టి; స్థితి= ఉనికి; లయంబులు= నాశం; ఆచరింతురు (ఆచరించుదురు)= చేయుదురు; వారికిన్= ఆ బ్రహ్మకు; విష్ణువుకు, శివునికి; సర్గస్థితిలయంబులన్+చేయు= సృష్టి స్థితిలయాలు చేసే; ఈశ్వరుండవు= పరమాత్మవు; నీవు+అ= నీవే; ఆత్మవు= జీవాత్మవు; నీవు+అ= నీవే; అని= అని; మఱియును= ఇంకనూ...

**తా :** దేవా! నీవు ఆదిపురుషుడవనీ; సర్వేశ్వరుడవనీ, విష్ణుమూర్తివనీ, మహామహిముడవనీ నాకు తెలుసు. సమస్త జీవరాశికీ ప్రాణం ప్రతాపం, ధైర్యం, బలం నీవే. ఈ ప్రపంచాన్ని పుట్టించే బ్రహ్మనూ, పోషించే విష్ణువునూ నశింపజేసే మహేశ్వరునీ నీవే సృష్టిస్తావు, పోషిస్తావు, నాశం చేస్తావు. నీవే పరమాత్మవు. నీవే జీవాత్మవు.

**విశే :** ప్రపంచాన్ని సృష్టించే బ్రహ్మనూ, పోషించే విష్ణువునూ, నాశంచేసే శివుణ్ణీ శ్రీకృష్ణుడే పుట్టించి, పెంచి, నశింపజేస్తాడని జాంబవంతుడు ప్రతిపాదించాడు. అతడు శ్రీకృష్ణుణ్ణి పరబ్రహ్మంగా భావించాడు.

లోకాలకు సృష్టిస్థితిసంహారాలు గావించే వారు త్రిమూర్తులు. వారిని సృష్టించి, భరించి, నశింపజేసేది పరబ్రహ్మం. అనగా అది ఏకం. సర్వశక్తిమంతం. నిరుపమానం.

**సీ. బాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశి, నింకించి బంధించి యేపు సూపెఁ**
**బరఁగ నెవ్వఁడు ప్రతాపప్రభారాశిచే దానవగర్వాంధతమస మడఁచెఁ**
**గంజాతములు ద్రెంచు కరిభంగి నెవ్వఁడు దశకంఠుకంఠబృందములు ద్రుంచె**
**నాచంద్రసూర్యమై యమరులంకారాజ్యమునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె**

**తే. నన్ను నేలిన లోకాధినాథుఁ డెవ్వఁ, డంచితోదారకరుణారసాబ్ధి యెవ్వఁ**
**డాతఁడవు నీవ కావె, మహాత్మ! నేఁడు, మాఱుపడి యెగ్గు సేసితి మఱవవలయు. 68**

**ప్రతి :** మహా+ఆత్మా!= గొప్ప ఆత్మరూపుడివైన దేవా!; ఎవ్వఁడు= ఎవడు; బాణ= బాణాలయొక్క; అగ్నిన్= అగ్నిని; పఱపి= వ్యాపింపజేసి; పయస్+రాశిన్= సముద్రాన్ని; ఇంకించి= ఇంకేటట్లుచేసి; బంధించి= వారధికట్టి; ఏపు= ఆధిక్యాన్ని; చూపెన్= ప్రకటించాడో; ఎవ్వఁడు= ఎవడు; పరఁగన్= ఖ్యాతిగాంచునట్లుగా; ప్రతాప= పరాక్రమం (అనే సూర్యుని) యొక్క; ప్రభా= కాంతులయొక్క; రాశిచేన్= సమూహంచేత; దానవ= రాక్షసులయొక్క; గర్వ= గర్వమనెడు; అంధతమసము= కటిక చీకటిని; అడఁచెన్= రూపుమాపాడో; ఎవ్వఁడు= ఎవడు; కంజాతములు= పద్మాలు; త్రెంచు= పెరికివేయు; కరిభంగిన్= ఏనుగువలె; దశకంఠు= పదిమెడలు (తలలు) కలవానియొక్క (రావణునియొక్క); కంఠ= కుత్తుకలయొక్క; బృందములు= సమూహాలు; త్రుంచెన్= నరికాడో; ఎవ్వఁడు= ఎవడు; ఆ చంద్రసూర్యము+ఐ= సూర్యచంద్రులున్నంతకాలం ఉండేదై; అమరు= అలరారే; లంకారాజ్యమునకున్= లంకాసామ్రాజ్యానికి; విభీషణుని; నిలిపెన్= రాజుగా నియమించాడో; ఎవ్వఁడు= ఎవడు; నన్నున్= నన్ను; ఏలిన= సేవకునిగా కరుణించిన; లోకాధినాథుఁడు= లోకేశ్వరుడో; ఎవ్వఁడు= ఎవడు; అంచిత= పూజింపదగిన; ఉదార= అధికమైన; కరుణారస= దయారసానికి; అబ్ధి= సముద్రుడో; ఆతఁడవు= ఆ శ్రీరామచంద్రుడివి; నీవు+అ= నీవే; కావు+ఎ= కావా?; నేఁడు= ఈనాడు; మాఱుపడి= పొరపడి; ఎగ్గు= తప్పు; చేసితిన్= చేశాను, మఱవన్ వలయున్= మరచిపోవాలి – స్వామీ!

**తా :** మహాత్మా! రామావతారంలో నీవు బాణాగ్నిచే సముద్రాన్ని ఇంకించి కట్ట కట్టావు. ప్రతాపకాంతులచే రాక్షసుల గర్వాంధకారాన్ని పారదోలావు. ఏనుగు పద్మాలను తెగత్రెంచినట్లుగా రావణునితలలను ఖండించావు. శాశ్వతంగా లంకారాజ్యానికి విభీషణుణ్ణి పట్టంగట్టావు. కరుణించి నన్ను నీదాసునిగా చేశావు. నీవు అపారమయిన దయ కలవాడివి. నేను పొరపాటున తప్పు చేశాను. దాన్ని మరచి, మన్నించుము.

**వ. అని యిట్లు పరమభక్తుండైన జాంబవంతుండు వినుతించిన నతని శరీరనిగ్రహనివారణంబుగా భక్తవత్సలుండైన హరి దన కరంబున నతని మేను నిమిరి గంభీరభాషణంబుల నిట్లనియె. 69**

**ప్రతి :** అని; ఇట్లు; పరమభక్తుండు= మహాభక్తుడు; ఐన; జాంబవంతుండు; వినుతించినన్= స్తుతింపగా; భక్తవత్సలుండు= భక్తులయందు ప్రేమగలవాడు; ఐన; హరి= శ్రీకృష్ణుడు; అతని= జాంబవంతునియొక్క; శరీర= శరీరంయొక్క; నిగ్రహ=

బాధను; నివారణంబు+కాన్= తొలగించుటకుగా; తనకరంబునన్= తనచేతితో; అతనిమేను= జాంబవంతునిశరీరాన్ని; నిమిరి= వాత్సల్యంచే చేతితో తాకి; మేఘ= మేఘధ్వనివలె; గంభీర= గంభీరమయిన; భాషణంబులన్= వాక్కులతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తా :** ఈ రీతిగా ఉత్తమభక్తుడైన జాంబవంతుడు స్తుతించాడు. శ్రీకృష్ణుడు బాధను నివారించటానికి అతని శరీరాన్ని నిమిరి మంద్ర కంఠస్వరంతో ఈ విధంగా అన్నాడు.

**క. 'ఈ మణి మాచేఁ బడె నని, తామసు లొనరించునింద దప్పెడుకొఱకై**
**నీ మందిర మగు బిలమున, కే మరుదెంచితిమి భల్లుకేశ్వర! వింటే!' 70**

**ప్రతి :** భల్లుక+ఈశ్వర!= ఎలుగుబంటుల రాజా!; (జాంబవంతుడా); ఈ మణి= ఈ స్యంమతకమణి; మాచేన్= మాచేతిలో; పడెన్= పడింది; అని; తామసులు= మూఢులు; ఒనరించు= వేసిన; నింద; తప్పెడుకొఱకు+ఐ= తప్పిపోవుటకై; నీమందిరము= నీయిల్లు; అగు= అయిన; బిలమునకున్= గుహకు; ఏము= మేము; అరుదెంచితిమి= వచ్చితిమి; వింటి+ఏ= వింటివా?

**తా :** భల్లూకరాజా! ఈ స్యమంతకమణి మాచేతికి చిక్కిందని అజ్ఞానులు మాకు నింద అంటగట్టారు. మేము ఆ నిందను తొలగించుకొనటానికి నీ నివాసమయిన గుహకు వచ్చాము.

**వ. అనిన విని సంతసించి, జాంబవంతుఁడు మణియునుం, దనకూఁతు జాంబవతి యను కన్యకామణియునుం దెచ్చి, హరికిం గానికఁగా సమర్పించె, నటమున్న హరివెంట వచ్చినవారలు బిలంబు వాకిటం బంౘ్రెండుదినంబులు హరిరాక కెదురు చూచి వేసరి, వగచి పురంబునకుం జని, రంత దేవకీ వసుదేవులును, రుక్మిణియును మిత్రబంధుజ్ఞాతిజనులును గుహ సొచ్చి, కృష్ణుండు రాక చిక్కెనని శోకించి. 71**

**ప్రతి :** అనినన్= శ్రీకృష్ణుడు అనగా; విని= ఆలకించి; సంతసించి= సంతోషించి; జాంబవంతుఁడు; మణియునున్= మణినీ; తనకూఁతున్= తన కొమార్తెను; జాంబవతి అను= జాంబవతి అనే; కన్యకామణియునున్= కన్యలలో శ్రేష్ఠురాలినీ; తెచ్చి; హరికిన్= శ్రీకృష్ణునికి; కానికన్+కాన్= కానుకగా; సమర్పించెన్=అర్పించాడు; అటమున్ను+అ= అంతకుముందే; హరివెంటన్= శ్రీకృష్ణునివెంబడి; వచ్చినవారలు= వచ్చినట్టివారు; బిలంబు= గుహయొక్క; వాకిటన్= ముంగిలిలో; పంౘ్రెండు దినంబులు= పన్నెండురోజులు; హరిరాకకున్= శ్రీకృష్ణునిరాకకు; ఎదురుచూచి= ప్రతీక్షించి; వేసరి= విసుగుచెంది; వగచి= దుఃఖించి; పురంబునకున్= పట్టణంకు (ద్వారకకు); చనిరి= వెళ్లారు; అంతన్= అప్పుడు; దేవకీవసుదేవులును; రుక్మిణియును; మిత్ర= స్నేహితులు; బంధు= చుట్టాలు; జ్ఞాతిజనులును= దాయాదులును; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; గుహ= గుహయందు; చొచ్చి= ప్రవేశించి; రాక= తిరిగిరాకుండా; చిక్కెన్= చిక్కుపడినాడు; అని; శోకించి= దుఃఖించి...

**తా :** శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు విని జాంబవంతుడు సంతోషించాడు. అతడు స్యమంతకమణినీ, కన్యారత్నమయిన తన పుత్రికను జాంబవతినీ, శ్రీకృష్ణునికి కానుకగా ఇచ్చాడు. ఇది జరగటానికి ముందు ద్వారకనుండి శ్రీకృష్ణునివెంట వచ్చినవారు పన్నెండురోజులు గుహవాకిట్లో ఎదురుచూచారు. శ్రీకృష్ణుడు ఎన్నాళ్లకూ రాకపోయేసరికి వారు విసిగి, దుఃఖించి ద్వారకకు వెళ్లిపోయారు. అక్కడ దేవకీ, వసుదేవుడూ, రుక్మిణీ, మిత్రులూ, చుట్టపక్కాలూ; దాయాదులూ శ్రీకృష్ణుడు గుహలో ప్రవేశించి చిక్కుకొనిపోయా డని విచారించి

**క. దుర్గమ మగు బిలమున హరి, నిర్గతుఁడై చేరవలయు నేఁడని పౌరుల్**
**వర్గములై సేవించిరి, దుర్గం గృతకుశలమార్గఁ దోషితభర్గన్. 72**

**ప్రతి :** పౌరుల్= ద్వారకాపట్టణప్రజలు; నేఁడు= ఈ రోజు; హరి= శ్రీకృష్ణుడు; దుర్గమము= ప్రవేశించుటకు శక్యంగానిది; అగు= అయిన; బిలమునన్= గుహనుండి; నిర్గతుఁడు+ఐ= బయటికి వచ్చినవాడై; చేరవలయున్= తప్పకరావాలి; అని= అని కోరుతూ; వర్గములు+ఐ= జట్లుగా ఏర్పడి; కృత= చేయబడిన (చూపిన); కుశల= క్షేమం కల్గించే; మార్గన్= దారులు కలదాన్నీ; తోషిత= సంతోషపెట్టబడిన; భర్గన్= శివునితో కూడిందీ అయిన; దుర్గన్= దుర్గాదేవిని; సేవించిరి= కొలిచారు.

**తా :** ఎవ్వరు చొరరాని ఈ గుహనుండి బయటబడి శ్రీకృష్ణుడు ఈ వేళ ద్వారకాపురి చేరాలని కోరి, పౌరులు జట్టులు కట్టి, క్షేమకర మార్గానికి చేర్చేదీ, శివుణ్ణి సంతోషపెట్టేదీ అయిన దుర్గాదేవిని పూజించారు.

**క. డోలాయితమానసులై, జాలింబడి జనులు గొలువఁ జండిక పలికెన్**
**బాలామణితో మణితో, హేలాగతి వచ్చు నంబుజేక్షణుఁ' డనుచున్. 73**

**ప్రతి :** జనులు= పౌరులు; డోలాయిత= ఊయలవలె ఊగిసలాడుచున్న; మానసులు+ఐ= మనస్సులు కలవారై; జాలిన్+పడి= దుఃఖపడి; కొలువన్= పూజింపగా; అంబుజ+ఈక్షణుఁడు= పద్మములవంటి కన్నులుగలవాడు (శ్రీకృష్ణుడు); బాలామణితోన్= కన్యకామణితో (జాంబవతితో); మణితోన్= స్యమంతకమణితో; హేలా= ఆనందంతో కూడిన; గతిన్= నడకతో; వచ్చున్= రాగలడు; అనుచున్= అనుచూ; చండిక= దుర్గ; పలికెన్= పలికింది.

**తా :** ఆందోళన పడుచున్న మనస్సుతో, దుఃఖంతో ద్వారకానివాసులు పార్వతిని సేవించారు. ఆ దేవి వారితో "శ్రీకృష్ణుడు కన్యామణి అయిన జాంబవతితో, స్యమంతకమణితో సంతోషిస్తూ తిరిగి వస్తాడు" అని పలికింది.

**క. యత్నము సఫలం బయిన స, పత్నసమూహములు బెగడఁ బద్మాక్షుం డా**
**రత్నముతోఁ గన్యాజన, రత్నముతోఁ బురికి వచ్చె రయమున నంతన్. 74**

**ప్రతి :** అంతన్= తర్వాత; పద్మ+అక్షుండు= పద్మాలవంటి కన్నులుగలవాడు, శ్రీకృష్ణుడు; యత్నము= తనప్రయత్నం; సఫలంబు= నెరవేరింది; అయినన్= కాగా; సపత్న= శత్రువులయొక్క; సమూహములు= గుంపులు; బెగడన్= భయపడగా; ఆ రత్నముతోన్= ఆ స్యమంతకమణితో; కన్యాజన= కన్యల సముదాయమందు; రత్నముతోన్= కన్యారత్నమైన జాంబవతితో; రయమునన్= వేగంగా; పురికిన్= పట్టణానికి (ద్వారకకు); వచ్చెన్= వచ్చాడు.

**తా :** తన ప్రయత్నం ఫలించి, శత్రువులు భయపడుతూండగా శ్రీకృష్ణుడు స్యమంతకమణితో, జాంబవతి అనే కన్యామణితో ద్వారకకు వచ్చాడు.

**క. మృతుఁడైనవాఁడు పునరా, గతుఁడైన క్రియం దలంచి కన్యామణి సం**
**యుతుఁడై వచ్చిన హరిఁ గని, వితతోత్సవకౌతుకముల వెలసిరి పౌరుల్. 75**

**ప్రతి :** పౌరుల్= పురజనులు; కన్యా= కన్య అయిన జాంబవతితో; మణి= స్యమంతకమణితో; సంయుతుఁడు+ఐ= కూడినవాడై; వచ్చిన; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; కని= చూచి; మృతుఁడు+ఐనవాఁడు= చనిపోయినవాడు; పునర్= మరల;

ఆగతుఁడు= వచ్చినవాడు; ఐనక్రియన్= అయినట్లు; తలంచి= భావించి; వితత= విరివి అయిన; ఉత్సవ= వేడుకలయందలి; కౌతుకములన్= సంతోషములతో; వెలసిరి= ప్రకాశించారు.

**తా :** స్యమంతకమణితో, జాంబవతితో కూడి వచ్చిన శ్రీకృష్ణుణ్ణి చూచి ద్వారకావాసులు - మృతిచెందినవాడు బ్రతికి వచ్చినట్లుగా భావించి, వేడుకలతో, వినోదాలతో పరమానందం పొందారు.

**వ. ఇట్లు హరి తనపరాక్రమంబున జాంబవతీదేవిం బరిగ్రహించి, రాజసభకు సత్రాజిత్తుం బిలిపించి, తద్వృత్తాంతం బంతయు నెఱింగించి, సత్రాజిత్తునకు మణి నిచ్చె, నతండును సిగ్గువడి మణిం బుచ్చుకొని పశ్చాత్తాపంబు నొందుచు బలవద్విరోధంబునకు వెఱచుచు నింటికిం జని. 76**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; హరి= శ్రీకృష్ణుడు; తన పరాక్రమంబునన్= తన శౌర్యంచేత; జాంబవతీదేవిన్; పరిగ్రహించి= స్వీకరించి; రాజసభకున్= ఆస్థానానికి; సత్రాజిత్తున్; పిలిపించి; తత్= ఆ స్యమంతకమణియొక్క; వృత్తాంతంబు= జరిగింది; అంతయున్; ఎఱింగించి= తెలిపి; సత్రాజిత్తునకున్; మణిన్= స్యమంతకమణిని; ఇచ్చెన్= ఇచ్చాడు; అతండును= సత్రాజిత్తును; సిగ్గువడి (సిగ్గు+పడి)= సిగ్గుచెంది; మణిని; పుచ్చుకొని= తీసుకొని; పశ్చాత్తాపంబున్= తాను చేసినది తప్పని తెలుసుకొని బాధను; ఒందుచున్= పొందుతూ; బలవత్= బలవంతునితోడి, శ్రీకృష్ణునితోడి; విరోధంబునకున్= పగకు; వెఱచుచున్= భయపడుతూ; ఇంటికిన్; చని= వెళ్లి...

**తా :** శ్రీకృష్ణుడు పరాక్రమంచేత జాంబవతిని స్వీకరించాడు. తర్వాత సత్రాజిత్తును కొలువుకూటానికి రప్పించి, జరిగిన కథంతా చెప్పి అతనికి స్యమంతకమణి నిచ్చాడు. సత్రాజిత్తు సిగ్గుతో మణిని తీసుకొని చేసిన తప్పునకు బాధపడ్డాడు. బలవంతుడైన శ్రీకృష్ణునితోడి వైరానికి భయపడ్డాడు. అతడు ఇంటికి వెళ్లి

**క. పాపాత్ముల పాపములం, బాపంగా నోపునట్టి పద్మాక్షునిపైఁ**
**బాపము గల దని నొడివిన, పాపాత్ముని పాపమునకుఁ బారము గలదే? 77**

**ప్రతి :** పాపాత్ముల= పాపబుద్ధిగలవారియొక్క; పాపములన్= పాపాల్ని; పాపన్+కాన్= రూపుమాపగా; ఓపునట్టి= శక్తి కలిగినట్టి; పద్మ+అక్షునిపైన్= శ్రీకృష్ణునిమీద; పాపము= దోషం; కలదు; అని; నొడివిన= నిందవేసిన, పాపాత్ముని పాపమునకున్= పాపిష్ఠివానిపాపానికి; పారము= అంతం; కలదు+ఏ= ఉందా?

**తా :** శ్రీకృష్ణుడు పాపాత్ముల పాపాలను పరిహరించే సామర్థ్యం కలిగినవాడు. అటువంటి వానిమీద తప్పుచేశా దని నిందవేసే పాపిష్ఠుని పాపానికి హద్దు ఉంటుందా? (అపారమైన ఆ పాపం పోనేపోదు అని అర్థం.)

**మ. మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు సే**
**సితిఁ? బాపాత్ముఁడ నర్థలోభుఁడను దుశ్చిత్తుండ మత్తుండ దు**
**ర్మతి నీ దేహముఁ గాల్పనే? దురిత మే మార్గంబునం బాయు? నే**
**గతిఁ గంసారి ప్రసన్నుఁడై మనుచు నన్ గారుణ్యభావంబునన్? 78**

**ప్రతి :** మితభాషిత్వము= పరిమితంగా మాట్లాడడం; మాని; హరిపైన్= శ్రీకృష్ణునిమీద; ఏల= ఎందుకు; మిథ్యా+అభియోగంబు= అసత్యమయిన నిందను; చేసితిన్?= ఆరోపించాను?; పాప+ఆత్ముఁడన్= పాపిష్ఠుణ్ణి; అర్థలోభుఁడను=

ధనలోభం కలవాడిని; దుస్+చిత్తుండన్= దుష్టమయిన మనస్సుకలవాడిని; మత్తుండన్= మదమెక్కిన వాడిని; దుర్+మతిన్= దుర్బుద్ధిని; ఈ దేహమున్= ఈ శరీరం; కాల్పన్+ఏ?= తగులబెట్టడానికా?; ఏ మార్గంబునన్= ఏ రీతిగా; దురితము= ఈ పాపాన్ని; పాయుదున్?= పోగొట్టుకొంటాను?; కంస+అరి= కంసుని శత్రువైన శ్రీకృష్ణుడు; ఏ గతిన్= ఏ విధంగా; ప్రసన్నుఁడు+ఐ= తృప్తిపొందినవాడై; కారుణ్యభావంబునన్= కనికరంగల మనస్సుతో; నన్= నన్ను; మనుచున్= కాపాడును?

**తా :** మితి తెలీకుండా మాట్లాడి నేను ఎందుకు శ్రీకృష్ణునిమీద అసత్యమయిన నిందారోపణం చేశాను? నేను పాపిని. ధనాశాపరుణ్ణి. దుష్టహృదయుణ్ణి. దురహంకారిని. దుర్బుద్ధిని. ఈ అకార్యానికి కారణమయిన ఈ శరీరంవల్ల ఇంకేమి ప్రయోజనం? ఏ విధంగా ఈ పాపంనుండి విముక్తి పొందుతాను? ఏ విధంగా శ్రీకృష్ణుడు సంతుష్టుడై దయతో నన్ను రక్షిస్తాడు?

**ఆ. మణిని గూఁతు నిచ్చి మాధవుపదములు, పట్టుకొంటినేని బ్రదుకు గలదు**
**సంతసించు నతఁడు సదుపాయమగు నిది, సత్య మితరవృత్తిఁ జక్కఁబడదు. 79**

**ప్రతి :** మణిని= స్యమంతకమణిని; కూఁతున్= కొమార్తెను; ఇచ్చి= సమర్పించి; మాధవు= లక్ష్మీనాథునియొక్క (శ్రీకృష్ణునియొక్క); పదములు= కాళ్లు; పట్టుకొంటిన్+ఏనిన్= పట్టుకొంటే; బ్రదుకు+కలదు= బ్రతికిపోవచ్చు; అతఁడు= శ్రీకృష్ణుడు; సంతసించున్= సంతోషిస్తాడు; ఇది; సత్+ఉపాయము= మంచి ఉపాయం; అగును; సత్యము= నిజం; ఇతరవృత్తిన్= మరొకపనిచేత; చక్కన్+పడదు= నెరవేరదు.

**తా :** స్యమంతకమణినీ, కూతురునూ ఇచ్చి శ్రీకృష్ణుని పాదాలు పట్టుకొంటే నేను బ్రతికి బట్టకట్టవచ్చు. అతడు కూడా సంతోషిస్తాడు. ఇదే ఉత్తమోపాయం. ఇది నిజం. ఇంకొకవిధంగా లక్ష్యం సిద్ధింపదు.

**మ. అని యిబ్భంగి బహుప్రకారముల నేకాంతస్థుఁడై యింటిలోఁ**
**దనబుద్ధిం బరికించి నీతి గని సత్రాజిత్తు సంప్రాప్త శో**
**భనుఁడై యిచ్చె విపత్పయోధితరికిన్ భామామనోహారికిన్**
**దనుజాధీశవిదారికిన్ హరికిఁ గాంతారత్నమున్ రత్నమున్. 80**

**ప్రతి :** సత్రాజిత్తు; ఇంటిలోన్= భవనంలో; ఏకాంతస్థుఁడు+ఐ= ఒంటరిగా ఉన్నవాడై; అని; ఈ+భంగిన్= ఈ విధంగా; బహుప్రకారములన్= అనేకరీతులుగా; తనబుద్ధిన్= స్వబుద్ధితో; పరికించి= పరిశీలించి; నీతి= ధర్మాన్ని; కని= తెలిసికొని; సంప్రాప్త= చక్కగా పొందబడిన; శోభనుఁడు= శుభములు కలవాడు; ఐ= అయి; విపత్= ఆపదలనెడి; పయోధి= సముద్రాన్ని దాటించడానికి; తరికిన్= ఓడ ఐనవానికి; భామా= స్త్రీలయొక్క; మనస్= మనస్సుల్ని; హారికిన్= హరించువానికి; దనుజ+అధీశ= రాక్షసరాజులను; విదారికిన్= ఖండించేవానికి; హరికిన్= శ్రీకృష్ణునికి; కన్యారత్నమున్= కన్యలలో శ్రేష్ఠురాలయిన సత్యభామను; రత్నమున్= స్యమంతకమణినీ; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తా :** సత్రాజిత్తు ఇంటిలో ఏకాంతంగా ఉండి, స్వబుద్ధితో బహుముఖంగా ఆలోచించి, తాను చేసిన నిర్ణయం సందర్భోచితమయిన నీతి అని నిశ్చయించుకొన్నాడు. తర్వాత – భక్తుల ఆపదలను తొలగించేవాడూ, స్త్రీల హృదయాల్ని దోచుకొనేవాడూ, రాక్షసరాజుల్ని మట్టుపెట్టేవాడూ అయిన శ్రీకృష్ణునికి స్యమంతకమణినీ, సత్యభామనూ సమర్పించాడు.

**ఉ. తామరసాక్షుఁ డచ్యుతుఁ డుదారయశోనిధి పెండ్లి యాడె నా**
**నా మనుజేంద్రవందితగుణస్థితిలక్షణసత్యభామ ను**
**ద్దామపతివ్రతాత్వనయధర్మవిచక్షణతాదయాయశః**
**కామను సత్యభామను ముఖద్యుతినిర్జితసోమ నయ్యెడన్. 81**

**ప్రతి :** ఆ+ఎడన్= ఆ సమయంలో; తామరస+అక్షుఁడు= పద్మాలవంటి కన్నులుగలవాడు; అచ్యుతుఁడు= నాశం లేనివాడు; ఉదార= గొప్పదయిన; యశస్= కీర్తికి; నిధి= ఆశ్రయమయినవాడు – శ్రీకృష్ణుడు; నానా= అనేకులయిన; మనుజ+ఇంద్ర= రాజశ్రేష్ఠులచేత; వందిత= పొగడబడిన; గుణ= సద్గుణాలయొక్క; స్థితి= ఉనికి అనే; లక్షణ= సల్లక్షణాలచేత; సత్య= కపటంలేనిదైన; భామన్= కాంతి కలదాన్ని; ఉద్దామ= అధికమయిన; పతివ్రతాత్వ= పాతివ్రత్యాన్ని; నయ= నీతినీ; ధర్మ= ధర్మాన్ని; విచక్షణతా= వివేకాన్ని; దయా= దయనూ; యశస్= కీర్తినీ; కామను= కోరేదాన్నీ; ముఖ= ముఖంయొక్క; ద్యుతి= కాంతిచేత; నిర్జిత= జయింపబడిన; సోమన్= చంద్రుడు కలదాన్ని సత్యభామను; పెండ్లి+ఆడెన్= పెండ్లాడినాడు.

**తా :** పద్మనేత్రుడూ, మహాకీర్తి సంపన్నుడూ, నాశరహితుడూ అయిన శ్రీకృష్ణుడు రాజు లనేకులు కొనియాడే సద్గుణాలూ, సత్ప్రవర్తనమూ అనే లక్షణాలతో ప్రకాశించేదీ, పాతివ్రత్యం మొదలైన వానియందు కోరిక కలదీ, చంద్రుణ్ణి మించిన ముఖం కలదీ అయిన సత్యభామను వివాహమాడాడు.

**క. 'మణి యిచ్చినాఁడు వాసర, మణి నీకును, మాకుఁ గలవు మణులు, కుమారీ**
**మణి చాలు' నంచుఁ గృష్ణుఁడు, మణి సత్రాజిత్తునకును మరలఁగ నిచ్చెన్. 82**

**ప్రతి :** కృష్ణుఁడు; వాసరమణి= దినమణి (సూర్యుడు); నీకును; మణి= స్యమంతకమణిని; ఇచ్చినాఁడు; మణులు; మాకున్= మాకునూ; కలవు; కుమారీమణి= కన్యామణి – సత్యభామ; చాలున్= చాలును; అంచున్= అనుచూ; మరలన్+కన్= తిరిగి; సత్రాజిత్తునకును; మణిని; ఇచ్చెన్= ఇచ్చెను.

**తా :** సూర్యుడు స్యమంతకమణిని నీకు ఇచ్చాడు. మాకూ చాలామణులు ఉన్నాయి. కన్యారత్నమయిన సత్యభామ ఒకతే మాకు చాలు – అని చెప్పి, శ్రీకృష్ణుడు సత్రాజిత్తుకు తిరిగి మణిని ఇచ్చాడు.

**వ. అంత నక్కడఁ గుంతీసహితు లయిన పాండవులు లాక్షాగారంబున దగ్ధులై రని విని నిఖిలార్థదర్శ నుండయ్యును, గృష్ణుండు బలభద్రసహితుండై కరినగరంబునకుం జని కృప విదుర గాంధారీ భీష్మద్రోణులం గని దుఃఖోపశమనాలాపంబు లాడుచుండె, నయ్యెడ. 83**

**ప్రతి :** అంతన్= తర్వాత; అక్కడన్= వారణావతంలో; కుంతీసహితులు= కుంతీదేవితో కలసి ఉన్నవారు; అయిన; పాండవులు; లాక్షా+అగారంబునన్= లక్కయింటిలో; దగ్ధులు= కాలిపోయినవారు; ఐరి+అని= అయ్యారని; విని; నిఖిల= సమస్తమయిన; అర్థ= విషయాలు; దర్శనుండు= చూచేవాడు (తెలిసినవాడు); అయ్యునున్= అయినప్పటికీ; కృష్ణుండు; బలభద్ర= బలరామునితో; సహితుండు+ఐ= కూడినవాడై; కరినగరంబునకున్= హస్తినాపురానికి; చని= వెళ్లి; కృప విదుర గాంధారీ భీష్మ ద్రోణులన్= కృపాచార్యుణ్ణీ, విదురుణ్ణీ, గాంధారిని, భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ; కని= చూచి; దుఃఖ= దుఃఖాన్ని; ఉపశమన= తగ్గించేటివైన; ఆలాపంబులు= మాటలు; ఆడుచున్+ఉండెన్= చెప్పసాగాడు; ఆ+ఎడన్= ఆ సమయంలో...

**తా :** కుంతీదేవితో కూడా పాండవులు వారణావతంలో లక్కయింటిలో కాలిపోయారని శ్రీకృష్ణుడు విన్నాడు. అతడు అన్ని విషయాలూ తెలిసినవాడే అయినప్పటికీ బలరామునితో కలసి హస్తినాపురానికి వచ్చాడు. అక్కడ కృపుడు, విదురుడు, గాంధారి, భీష్ముడు, ద్రోణుడు మొదలయిన వారిని చూచి, వారి శోకాన్ని పోగొట్టేమాటలు పలుకుతూ ఉన్నాడు. అప్పుడు

## ❖ శతధన్వుఁడు సత్రాజిత్తునిఁ జంపి మణి నపహరించుట ❖

**సీ. 'జగతీశ! వినవయ్య శతధన్వుఁ బొడగని యక్రూరకృతవర్మ లాప్తవృత్తి**
**'మన కిత్తు' ననుచు సమ్మతిఁజేసి తన కూఁతుఁ బద్మాక్షునకు నిచ్చి పాడి దప్పె**
**ఖలుఁడు సత్రాజిత్తుఁ, దలయ కే క్రియనైన మణి పుచ్చుకొనుము నీ మతము మెఱసి'**
**యని తన్నుఁ బ్రేరేఁప నా శతధన్వుఁడు పశువుఁ గటికివాఁడు పట్టి చంపు**

**అ. కరణి నిదురవోవఁ గడఁగి సత్రాజిత్తుఁ, బట్టి చంపి, వానిభామలెల్ల**
**మొఱలువెట్ట లోభమునఁ జేసి మణి గొంచుఁ, జనియె నొక్కనాఁడు జనవరేణ్య! 84**

**ప్రతి :** జగతీశ! జనవరేణ్య!= మహారాజా! – పరీక్షిన్మహారాజా!; వినవు+అయ్య; అక్రూర కృతవర్మలు= అక్రూరుడు, కృతవర్మ; శతధన్వున్= శతధన్వుణ్ణి; పొడగని= దర్శించి; ఆప్త= విశ్వసింపదగిన హితుల; వృత్తిన్= అభిప్రాయంలాగా; (శతధన్వునితో); సత్రాజిత్తు; ఖలుఁడు=నీచుడు; తనకూఁతున్= తన పుత్రికను; మనకున్= మనకు; ఇత్తున్= ఇస్తాను; అనుచున్= అంటూ; సమ్మతిచేసి= అంగీకరించి; పద్మ+అక్షునకున్= శ్రీకృష్ణునికి; ఇచ్చి; పాడి+తప్పెన్= నీతితప్పాడు; నీ= నీయొక్క; మతము= ఆశయము; మెఱసి= తెలియజేసి; ఏక్రియన్+ఐనన్= ఏవిధంగానైనా; మణి= స్యమంతకమణిని; పుచ్చుకొనుము= తీసికోవయ్యా!; అని; తన్నున్= తనను; ప్రేరేఁపన్= పురికొల్పగా; ఆ శతధన్వుఁడు; ఒక్కనాఁడు= ఒకరోజు; కటికివాఁడు= కసాయివాడు; పశువున్= (జంతువును) మేకను; పట్టి= పట్టుకొని; చంపుకరణిన్= చంపునట్లుగా; నిదుర+పోవన్= నిద్రపోతుండగా; కడఁగి= పూనుకొని; సత్రాజిత్తున్; పట్టిచంపి; వాని= అతని; భామలు+ఎల్లన్= భార్యలందరూ; మొఱలు+పెట్టన్= ఆర్తనాదాలు చేయగా; లోభమునన్+చేసి= దురాశవల్ల; మణి; కొంచున్= గ్రహించి; చనియెన్= వెళ్లాడు.

**తా :** మహారాజా! అక్రూరుడూ, కృతవర్మా శతధన్వుని దగ్గరకు వచ్చి హితం చెప్పేవారివలె "సత్రాజిత్తు తన కొమార్తెను ముందు మన కిస్తానని చెప్పి, తర్వాత శ్రీకృష్ణుని కిచ్చి పెండ్లిచేసి నీతి తప్పాడు. నీవు నీ అభిప్రాయం వెల్లడించి ఏ రీతిగానైనా సరే స్యమంతకమణిని తీసుకో!" అని అతణ్ణి రెచ్చగొట్టారు. ఒకనాడు ఆ శతధన్వుడు సత్రాజిత్తు నిద్రిస్తుండగా అతణ్ణి కసాయివాడు మేకను చంపినట్టు చంపాడు. అతనిభార్య లందరూ మొరపెట్టుకుంటుండగా స్యమంతకమణిని తీసుకొని వెళ్లిపోయాడు.

**వ. ఇట్లు హతుండైన తండ్రిం గని శోకించి సత్యభామ యతనిం దైలద్రోణియందుఁ బెట్టించి హస్తిపురంబునకుం జని సర్వజ్ఞుండైన హరికి సత్రాజిత్తుమరణంబు విన్నవించిన హరియును బలభద్రుండు నీశ్వరు లయ్యును మనుష్యభావంబుల విలపించి, రంత బలభద్రసత్యభామాసమేతుండై హరి ద్వారకా నగరంబునకు మరలి వచ్చి శతధన్వుం జంపెద నని తలంచిన నెఱింగి శతధన్వుండు ప్రాణభయంబునఁ గృతవర్ము నింటికిం జని తనకు సహాయుండవు గమ్మని పలికినం గృతవర్మ యిట్లనియె. 85**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; హతుండు= చంపబడినవాడు; ఐన= అయిన; తండ్రిన్= తండ్రిని; కని= చూచి; శోకించి= దుఃఖించి; సత్యభామ; అతనిన్= తండ్రి అయిన సత్రాజిత్తును; తైలద్రోణి+అందున్= నూనెతొట్టియలో; పెట్టించి; హస్తినాపురంబునకును; చని= వెళ్లి; సర్వజ్ఞుండు= అన్ని విషయాలూ తెలిసినవాడు; ఐన; హరికిన్= శ్రీకృష్ణునికి; సత్రాజిత్తు మరణంబు= సత్రాజిత్తుచావును; విన్నవించినన్= తెలియజేయగా; హరియును; బలభద్రుండున్= బలరాముడును; ఈశ్వరులు= జగన్నియామకులు; అయ్యున్= అయినప్పటికీ; మనుష్య= మానవులయొక్క; భావంబులన్= స్వభావాలతో; విలపించిరి= దుఃఖించారు; అంతన్= తర్వాత; హరి= శ్రీకృష్ణుడు; బలభద్ర సత్యభామా సమేతుండు+ఐ= బలరామునితో, సత్యభామతో కలిసి; ద్వారకానగరంబునకున్; మరలివచ్చి= తిరిగివచ్చి; శతధన్వున్= శతధన్వుణ్ణి; చంపెదను; అని; తలంచినన్= నిశ్చయింపగా; ఎఱింగి= తెలుసుకొని; శతధన్వుండు; ప్రాణభయంబునన్= ప్రాణాలు పోతాయనే భయంతో; కృతవర్మ+ఇంటికిన్= కృతవర్మ ఇంటికి; చని= వెళ్లి; తనకున్= తనకు; సహాయుండవు= సహాయం చేసేవాడవు; కమ్ము= కావయ్యా; అని; పలికినన్= కోరగా; కృతవర్మ; ఇట్లు; అనియెన్= పలికాడు...

**తా :** సత్యభామ సత్రాజిత్తు చనిపోయిన తీరు తెలిసికొని దుఃఖించి, అతణ్ణి నూనెతొట్టిలో పెట్టించి, హస్తినాపురానికి వెళ్లి, సర్వజ్ఞుడయిన హరికి కన్నతండ్రిచావుకబురు చెప్పింది. ఆ మరణవార్త విని బలరామకృష్ణులు సర్వనియామకులయి నప్పటికీ సామాన్య మానవులమాదిరిగా దుఃఖించారు. తర్వాత శ్రీకృష్ణుడు బలరామునితో, సత్యభామతో కలసి ద్వారకకు వచ్చి, శతధన్వుణ్ణి చంపాలని నిశ్చయించాడు. శ్రీకృష్ణునినిశ్చయం తెలిసికొన్న శతధన్వుడు తనకు చావుమూడిం దని భయపడి, కృతవర్మ ఇంటికి వెళ్లి, సహాయం చేయుమని అర్థించాడు. అప్పుడు కృతవర్మ ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'అక్కట! రామకృష్ణులు మహాత్ములు వారల కెగ్గ సేయఁగా**
**నిక్కడ నెవ్వఁ డోపు? విను మేర్పడఁ గంసుఁడు బంధుయుక్తుఁడై**
**చిక్కఁడె? మున్ను మాగధుఁడు సేనలతోఁ బదియేడుతోయముల్**
**దిక్కులఁ బాఱఁడే! మనకు దృష్టము, వారలలావు వింతయే?** **86**

**ప్రతి :** అక్కట!= అయ్యో!; రామకృష్ణులు= బలరాముడు; శ్రీకృష్ణుడు; మహా+ఆత్ములు= గొప్ప ఆత్మస్వరూపులైనవారు (ఘనత చెందినవారు); వారలకున్= వారికి; ఎగ్గు+చేయన్+కాన్= కీడుచేయడానికి; ఇక్కడన్= ఇచ్చట; ఎవ్వఁడు= ఎవడు; ఓపున్= చాలును; (సమర్థుడు అగును); ఏర్పడన్= తేటపడునట్లుగా; వినుము= వివరిస్తాను (విను!); మున్ను= పూర్వం; కంసుఁడు; బంధు= చుట్టాలతో; యుక్తుఁడు+ఐ= కూడినవాడై; చిక్కఁడు+ఎ= నాశమై పోలేదా?; మాగధుఁడు= మగధరాజు జరాసంధుడు; సేనలతోన్= సైన్యాలతో; పదియేడు తోయముల్= పదిహేడు సారులు; దిక్కులన్= దిక్కులందు; పాఱఁడు+ఏ= పరుగెత్తలేదా? మనకున్= మనకందరికీ; దృష్టము= చూడబడిందే (మనం చూచినట్టిదే); వారల= బలరామకృష్ణుల; లావు= బలం; వింత+ఏ?= ఆశ్చర్యమా? (కాదని అర్థం).

**తా :** అయ్యో! ఎంత తెలివి తక్కువ వాడివయ్యావు? బలరాముడూ; శ్రీకృష్ణుడూ సామాన్యులా? వారు మహాత్ములు. ఎవడు వారికి కీడు చేయగలుగుతాడు? నీకు అర్థమయ్యేటట్లు చెప్తాను. విను. ఇంతకు ముందు బలరామకృష్ణుల్ని ఎదిరించి, కంసుడు చుట్టపక్కాలతోపాటు సర్వనాశం గాలేదా? జరాసంధుడు దండెత్తి, పదిహేడుసారులు సైన్యాలతో కూడా దిక్కులు పట్టిపోలేదా? ఆ అన్నదమ్ములశక్తి మనకు కొత్తదా?

**వ. అని యుత్తరంబు సెప్పిన విని శతధన్వుం డక్రూరునియింటికిం జని హరితోడ పగకుం దోడు రమ్మని చీరిన నక్రూరుండు హరిబలపరాక్రమధైర్యస్థైర్యంబు లుగ్గడించి మఱియు నిట్లనియె. 87**

**ప్రతి :** అని; ఉత్తరంబు= సమాధానం; చెప్పిననన్= చెప్పగా; విని; శతధన్వుండు; అక్రూరునియింటికిన్; చని= వెళ్లి; హరితోడన్+పగకున్= శ్రీకృష్ణునితోడి వైరానికి; తోడు= సహాయంగా; రమ్ము; అని; చీరినన్= పిలువగా; అక్రూరుండు; హరి= శ్రీకృష్ణునియొక్క; బల= బలమూ; పరాక్రమ= పరాక్రమమూ; ధైర్య= ధైర్యమూ; స్థైర్యంబు= మనోనిశ్చయమూ; ఉగ్గడించి= తెలిపి; మఱియును= ఇంకనూ; ఇట్లు; అనియెన్= ఇలా పలికాడు.

**తా :** కృతవర్మ చెప్పినమాట విని శతధన్వుడు అక్రూరునియింటికి వెళ్లి, శ్రీకృష్ణునిపై పగబట్టటానికి తోడు రమ్మన్నాడు. అక్రూరుడు శ్రీకృష్ణుని బలపరాక్రమాదులు ప్రకటించి, ఇంకా ఇట్లా అన్నాడు.

**సీ. 'ఎవ్వఁడు విశ్వంబు నెల్ల సలీలుఁడై పుట్టించు రక్షించుఁ బొలియఁ జేయు,**
**నెవ్వనిచేష్టల నెఱుఁగరు బ్రహ్మాదు, లెవ్వనిమాయ మోహించు భువన,**
**మే దేండ్లపాపఁడై యే విభుఁ డొకచేత గోరక్షణమునకై కొండ నెత్తె,**
**నెవ్వఁడు కూటస్థుఁ డీశ్వరుఁ డద్భుత కర్ముఁ డనంతుండు కర్మసాక్షి,**

**తే. యట్టి ఘనునకు శౌరికి ననవరతము, మ్రొక్కెదము గాక! విద్వేషమునకు నేము**
**వెఱతు మొల్లము నీ వొండువెంటఁ బొమ్ము, చాలు పదివేలు వచ్చె నీ సఖ్యమునను. 88**

**ప్రతి :** ఎవ్వఁడు= ఎవడు; సలీలుఁడు= వినోదంతో కూడినవాడు; ఐ= అయి; విశ్వంబునున్+ఎల్లన్= జగత్తునంతా; పుట్టించున్= సృష్టించునో; రక్షించున్= రక్షించునో; పొలియన్+చేయున్= నశింపజేయునో; బ్రహ్మ+ఆదులు= బ్రహ్మ మొదలగువారు; ఎవ్వని= ఎవనియొక్క; చేష్టలన్= పనులను; ఎఱుఁగరు= తెలియజాలరో; ఎవ్వనిమాయ= ఎవనిమాయ; భువనము= విశ్వమును; మోహించున్= భ్రమింపజేస్తుందో; ఏ విభుఁడు= ఏ శాశ్వతుడు; ఏడేండ్ల పాపఁడు= ఏడేళ్ల బాలుడు; ఐ= అయి; గోరక్షణమునకున్+ఐ= గోవులను రక్షించడంకోసం; ఒకచేతన్= ఒంటిచేతితో; కొండన్= గోవర్ధనగిరిని; ఎత్తెన్= ఎత్తెనో; ఎవ్వఁడు= ఎవడు; కూటస్థుఁడు= నిర్వికారుడో; ఈశ్వరుఁడు= సర్వనియామకుడో; అద్భుత= ఆశ్చర్యము కలిగించే; కర్ముఁడు= పనులు చేసేవాడో; అనంతుఁడు= అంతం లేనివాడో; కర్మసాక్షి= సమస్త జీవరాశిచర్యలు తెలిసినవాడో; అట్టి= అటువంటి; ఘనునకున్= గొప్పవానికి; శౌరికిన్= శ్రీకృష్ణునికి; అనవరతము= ఎల్లప్పుడు; ఏము= మేము; మ్రొక్కెదము+కాక= నమస్కరిస్తాము గాని; విద్వేషమునకున్= విరోధానికి; వెఱతుము(వెఱచుదుము)= భయపడతాము; ఒల్లము= ఒప్పుకోము; నీవు; ఒండువెంటన్= మరొకదారిలో; పొమ్ము= వెళ్లు; చాలున్= వద్దు; నీ సఖ్యమునను= నీ పొత్తువల్ల; పదివేలు వచ్చెన్= (వ్యతిరేక లక్షణచే) గొప్పనష్టం కలిగింది.

**తా :** శ్రీకృష్ణుడు సామాన్యుడు గాడు. త్రిమూర్తులవలె వినోదార్థం ప్రపంచాన్ని సృష్టించి, రక్షించి, నాశం చేస్తాడు. బ్రహ్మాదులు సైతం అతని నడతను అర్థంచేసుకోలేరు. అతని మాయ లోకాన్ని భ్రమపెడుతుంది. అతడు ఏడేళ్ల పిల్లవాడుగా ఉన్నప్పుడే ఆవుల్ని రక్షించటానికి ఒకచేతితో కొండను పైకెత్తాడు. శ్రీకృష్ణభగవానుడు నిర్వికారుడు. జగన్నియామకుడు. అద్భుత కార్యనిర్వాహకుడు. సర్వక్రియాసాక్షి – అటువంటి మహానుభావునికి మేము చేయెత్తి మొక్కుతాము. ఆయనతో విరోధం పెట్టుకోటానికి భయపడతాం. అంగీకరించం. నీవు వేరేదారిని పో! నీ పొత్తువల్ల చాలా నష్టం కలిగింది. అది చాలు.

**వ. అని యి ట్లక్రూరుం డుత్తరంబు పలికిన న మ్మహామణి యక్రూరునియొద్ద నునిచి, వెఱచి శతధన్వుండు తురగారూఢుండై శతయోజనదూరంబు సనియె, గరుడ కేతనాలంకృతంబైన తేరెక్కి రామకృష్ణులు వెనుచని, రంత నతండును మిథిలానగరంబుఁ జేరి తత్సమీపంబునందు. 89**

**ప్రతి :** అని; ఇట్లు; అక్రూరుండు; ఉత్తరంబు పలికినన్= బదులుచెప్పగా; ఆ+మహామణి= ఆ గొప్పమణి; అక్రూరుని+ఒద్దన్= అక్రూరునిదగ్గర; ఉనిచి= ఉంచి; వెఱచి= భయపడి; శతధన్వుండు; తురగ= గుర్రాన్ని; ఆరూఢుండు+ఐ= ఎక్కినవాడై; శతయోజన దూరంబు= నూరామడల దూరం; చనియెన్= వెళ్లెను; రామకృష్ణులు= బలరాముడు, శ్రీకృష్ణుడు; గరుడకేతన= గరుడధ్వజంతో; అలంకృతంబు= అలంకరింపబడింది; ఐన= అయిన; తేరు= రథం; ఎక్కి; వెనుచనిరి= వెంబడించారు; అంతన్= అప్పుడు; అతండును= ఆ శతధన్వుడూ; మిథిలానగరంబున్= మిథిల అనే పట్టణాన్ని; చేరి; తత్= ఆ నగరంయొక్క; సమీపంబునందున్= దగ్గరలో...

**తా :** ఈ విధంగా అక్రూరుడు సమాధానం చెప్పిన తర్వాత శతధన్వుడు అతని దగ్గర స్యమంతమణిని దాచి, భయంతో గుర్రమెక్కి నూరామడలదూరం వెళ్లాడు. బలరాముడూ, కృష్ణుడూ గరుడధ్వజంతో అలంకరించిన రథమెక్కి, అతని వెనుక వెళ్లారు. చివరకు శతధ్వనుడు మిథిలానగరం చేరి, దాని సమీపంలో

**చ. తురగము డిగ్గి తల్లడముతో శతధన్వుఁడు పాదచారియై**
**పరువిడఁ 'బోకు పోకు'మని పద్మదళాక్షుఁడు గూడఁ బాఱి భీ**
**కరగతి వానిమస్తకము ఖండితమై పడ వ్రేసెఁ జక్రముం**
**బరిహతదైత్యచక్రముఁ బ్రభాచయమోదితదేవశక్రమున్. 90**

**ప్రతి :** శతధన్వుఁడు; తురగము= గుర్రం; డిగ్గి= దిగి; తల్లడముతోన్= భయంతో; పాదచారి= కాలినడకతో పోయేవాడు; ఐ= అయి; పరువిడన్= పరుగెత్తగా; పద్మదళ= తామరరేకులవంటి; అక్షుఁడు= కన్నులు గలవాడు (శ్రీకృష్ణుడు); పోకుము+పోకుము= వెళ్లకు వెళ్లకు; అని; కూడన్+పాఱి= వెంబడించి; భీకరగతిన్= భయంకరమైన విధంగా; వాని= శతధన్వుని; మస్తకము= తల; ఖండితము+ఐ= తెగిందై; పడన్= నేలమీద పడునట్లుగా; పరిహత= చంపబడిన; దైత్య= రాక్షసులయొక్క; చక్రమున్= సమూహం గలది; ప్రభా= కాంతులయొక్క; చయ= సమూహంచేత; మోదిత= సంతోషింపజేయబడిన; దేవ= దేవతలూ; శక్రమున్= ఇంద్రుడూ కలది అయిన; చక్రమున్= చక్రాన్ని; వ్రేసెన్= ప్రయోగించాడు.

**తా :** శతధన్వుడు గుర్రం దిగి, భయపడుతూ కాలినడకతోనే పరుగెత్తాడు. శ్రీకృష్ణుడు వెళ్లకు మని వారిస్తూ అతనిని కలిసికొన్నాడు. తర్వాత శతధన్వునితల తెగిపడేటట్లుగా – రాక్షసగణాలను సంహరించిందీ, తన కాంతిపుంజంచేత ఇంద్రాది దేవతలను సంతోషపెట్టేదీ అయిన చక్రాయుధాన్ని ప్రయోగించాడు.

**వ. ఇట్లు హరి శతధన్వుని వధియించి వాని వస్త్రంబులందు మణి వెదకి లేకుండుటఁదెలిసి బలభద్రునికడకు వచ్చి శతధన్వుం డూరక హతుం డయ్యె, మణిలే' దనిన బలభద్రుం డిట్లనియె. 91**

**ప్రతి :** ఇట్లు; హరి= శ్రీకృష్ణుడు; శతధన్వుని; వధియించి= చంపి; వాని= అతనియొక్క; వస్త్రంబుల+అందున్= కట్టుకొన్న దుస్తులలో; మణి; వెదకి; లేకుండుటన్= లేకపోవడం; తెలిసి; బలభద్రుని కడకున్= బలరాముని దగ్గరకు; వచ్చి;

శతధన్వుండు; ఊరక= ప్రయోజనం లేకుండా; హతుండు= చంపబడినవాడు; అయ్యెన్; మణి లేదు; అనినన్= అనగా; బలభద్రుండు; ఇట్లు; అనియెన్= పలికెను...

**తా :** శ్రీకృష్ణుడు శతధన్వుని చంపి, మణికోసం అతని దుస్తులలో వెదికాడు. కానీ, మణి ఎక్కడా కనబడలేదు. అప్పుడు హరి బలరామునికడకు వచ్చి "శతధన్వుణ్ణి వ్యర్థంగా చంపాను. అతనిదగ్గర మణి లేదు" అని చెప్పాడు. ఈ మాటలు విని బలరాముడు ఈ కింది విధంగా అన్నాడు.

**సీ. 'ఆ మణి శతధన్వుఁ డపహరించుట నిక్క, మెవ్వరిచే దాఁప నిచ్చినాఁడొ?**
**వేగమె నీ వేఁగి వెదకుము పురిలోన, వైదేహు దర్శింప వాంఛ గలదు,**
**పోయి వచ్చెద, నీవు పొ'మ్మని వీడ్కొని మెల్లన రాముండు మిథిలఁ జొచ్చి**
**పోయిన జనకుండు పొడగని హర్షించి యెంతయుఁ బ్రియముతో నెదురు వచ్చి**

**తే. యర్ఘ్యపాద్యాదికృత్యంబు లాచరించి, యిచ్చగించిన వస్తువు లెల్ల నిచ్చి**
**'యుండు' మని భక్తిచేసిన నుండె ముసలి, కువలయేశ్వర!, మిథిలలోఁగొన్ని యేండ్లు. 92**

**ప్రతి :** కువలయ+ఈశ్వర!= భూపతీ!; శతధన్వుఁడు; ఆ మణిన్= స్యమంతకమణిని; అపహరించుట= దొంగిలించుట; నిక్కము= నిజం; ఎవ్వరి= ఎవరియొక్క; చేన్= చేతికి; దాఁపన్= దాచిపెట్టడానికి; ఇచ్చినాఁడొ?= ఇచ్చాడో?; నీవు; వేగము+ఎ= వేగంగా; ఏఁగి= వెళ్లి; పురిలోనన్= ద్వారకాపట్టణంలో; వెదకుము; వైదేహున్= విదేహదేశ ప్రభువును, జనకుని; దర్శింపన్= చూడగా; వాంఛ= కోరిక; కలదు; పోయివచ్చెదను; నీవు; పొమ్ము= వెళ్లు; అని; వీడ్కొని= విడిచి; రాముండు= బలరాముడు; మిథిలన్= విదేహదేశరాజధానియైన మిథిలానగరాన్ని; చొచ్చి= ప్రవేశించి; పోయినన్= ముందుకు సాగిపోవగా; జనకుండు= జనక మహారాజు; పొడగని= చూచి; హర్షించి= సంతోషించి; ఎంతయున్= మిక్కిలి; ప్రియముతోన్= ప్రీతితో; ఎదురు వచ్చి; అర్ఘ్య= పూజాద్రవ్యాలు సమర్పించడం; పాద్య= కాళ్లు కడుగుకొనేందుకు నీరు ఇచ్చుట; ఆది= మొదలైన; కృత్యంబులు= సదాచారాలు; ఆచరించి= పాటించి; ఇచ్చగించిన= కోరిన; వస్తువులు; ఎల్లన్= అన్నిటినీ; ఇచ్చి; ఉండు; అని; భక్తి చేసినన్= భక్తితో ప్రవర్తింపగా; ముసలి= రోకలి ఆయుధముగా కలవాడు అయిన; బలరాముడు; మిథిలలోన్; కొన్నిఏండ్లు; ఉండెన్= నివసించాడు.

**తా :** "శతధన్వుడు స్యమంతకమణిని నిజంగానే, దొంగిలించాడు. వాడు దాచిపెట్టు మని ఎవరిచేతికయినా ఇచ్చాడేమో? వెంటనే నీవు ద్వారకకు వెళ్లి వెదకు. నాకు జనకుణ్ణి చూడాలనే కోరిక కలిగింది. నేను వెళ్లివస్తాను. నీవూ వెళ్లు" అని బలరాముడు చెప్పి, శ్రీకృష్ణుణ్ణి వీడ్కొలిపి తర్వాత మిథిలకు వెళ్లాడు. అతనిరాక తెలిసి జనకుడు ఎదురువచ్చి అతణ్ణి పూజించి, కోరినవెల్లా ఇచ్చి, మిథిలలో ఉండండని అర్థించాడు. బలరాముడు కొన్నేళ్లు ఆ నగరంలోనే నివసించాడు.

**వ. అంత దుర్యోధనుండు మిథిలానగరంబునకుం జనుదెంచి జనకరాజుచేత సమ్మానితుండై. 93**

**ప్రతి :** అంతన్= పిమ్మట; దుర్యోధనుండు; మిథిలానగరంబునకున్; చనుదెంచి= వచ్చి; జనకరాజుచేతన్= జనకునిచేత; సమ్మానితుండు+ఐ= గౌరవింపబడినవాడై...

**తా :** తర్వాత దుర్యోధనుడు మిథిలానగరానికి వచ్చి, జనకునిచేత సకలగౌరవాలూ పొంది

**క. చలమున గాంధారేయుఁడు, లలితగదాయుద్ధకౌశలము నేర్చెఁ దగన్**
**హలిచే నాశ్రితనిర్జర, ఫలిచేఁ ద్రైలోక్యవీరభటగణబలిచేన్. 94**

**ప్రతి :** గాంధారేయుఁడు= గాంధారి కుమారుడు, దుర్యోధనుడు; ఆశ్రిత= ఆశ్రయించిన వారి పాలిటికి; నిర్జర= దేవతా సంబంధమయిన; ఫలిచేన్= వృక్షముచేత (కల్పవృక్షమువంటివానిచేత); త్రైలోక్య= మూడులోకాలలోని; వీరభట= వీరభటులయొక్క; గణ= సమూహాలయొక్క; బలిచేన్= పూజలు పొందేవానిచేత; హలిచేన్= నాగలిఆయుధంగా కలవాడైన బలరామునిచేత; చలమునన్= పట్టుదలతో; తగన్= శూరునికి తగినట్లుగా; లలిత= తన కోరికైన; గదాయుద్ధ= గదాయుద్ధంలోని; కౌశలము= నేర్పు; నేర్చెన్= నేర్చాడు.

**తా :** ఆశ్రితులకు కల్పవృక్షమయినవాడూ, మూడులోకాలలోని మహావీరుల పూజలు పొందేవాడూ అయిన బలరామునినుండి దుర్యోధనుడు పట్టుదలతో తన ఆశయానుగుణమైన గదాయుద్ధ నైపుణ్యం ఆర్జించాడు.

**విశే :** "త్రైలోక్య వీరభటగణబలిచేన్= మూడు లోకాలలోని వీరభటుల సమూహాలను మృత్యుదేవతకు బలిపశువులుగా సమర్పించేవానిచేత" అనికూడా అర్థం చెప్పవచ్చు.

**వ. అటఁ గృష్ణుండును ద్వారకానగరంబునకుం జని శతధన్వుని మరణంబును, మణి లేకుండుటయును, సత్యభామకుం జెప్పి, సత్యభామాప్రియకరుండు గావున సత్రాజిత్తునకుఁ బరలోకక్రియలు సేయించె, నక్రూరకృతవర్మలు శతధన్వుమరణంబు విని వెఱచి ద్వారకానగరంబు వెడలి బహుయోజనదూర భూమికిం జని, రక్రూరుండు లేమింజేసి వానలు లేక మహోత్పాతంబులును, శరీరమానసతాపంబులును ద్వారకావాసులకు సంభవించిన నందుల వృద్ధజనులు బెగడి హరి కిట్లనిరి. 95**

**ప్రతి :** అటన్= అక్కడ; కృష్ణుండును; ద్వారకానగరంబునకున్; చని= వెళ్ళి; శతధన్వుని మరణంబును; మణి= స్యమంతకమణి; లేకుండుటయును= లేకపోవడం; సత్యభామకున్; చెప్పి; సత్యభామా= సత్యభామకు; ప్రియంకరుండు= ప్రియాన్ని చేసేవాడు; కావునన్= కావడంవల్ల; సత్రాజిత్తునకును; పరలోక క్రియలు= మరణించినవానికి ఉత్తమలోకప్రాప్తికై చేసే కర్మలు; చేయించెన్= తగినవారిచేత చేయించాడు; అక్రూర కృతవర్మలు= అక్రూరుడు, కృతవర్మలు ఇద్దరూ; శతధన్వు= శతధన్వుని; మరణంబు= చావును; విని; వెఱచి= భయపడి; ద్వారకానగరంబు= ద్వారకానగరంనుండి; వెడలి= వెళ్ళి; బహుయోజన= పెక్కు ఆమడల; దూర= దూరంలో ఉన్న; భూమికిన్= ప్రదేశానికి; చనిరి= వెళ్ళారు; అక్రూరుండు; లేమిన్+చేసి= లేకపోవడంవల్ల; వానలు లేక; మహత్= గొప్పవైన; ఉత్పాతంబులును= గ్రహణాలు, ఉల్కలుపడడం, భూకంపం మొదలయిన ఉపద్రవాలు; శరీర= శరీర సంబంధమయిన; మానస= మనస్సునకు సంబంధించిన; తాపంబులును= బాధలును; ద్వారకా+ఆవాసులకున్= ద్వారకలో నివసించేవారికి; సంభవించినన్= కలుగగా; అందుల= ద్వారకయందలి; వృద్ధజనులు= పెద్దవారు; బెగడి= కలతపడి; హరికిన్= శ్రీకృష్ణునితో; ఇట్లు; అనిరి= చెప్పారు...

**తా :** శ్రీకృష్ణుడు ద్వారకకు వెళ్ళి శతధన్వుడు చనిపోవటం, స్యమంతకమణి కనబడకుండటం సత్యభామకు చెప్పాడు. సత్యభామకు ప్రీతికలిగించేవాడు కనుక సత్రాజిత్తుకు ఉత్తరకర్మలు చేయించాడు. శతధన్వునిచావు తెలిసిన అక్రూరుడూ, కృతవర్మా ద్వారక వదలి సుదూర ప్రాంతానికి వెళ్ళిపోయారు. అక్రూరుడు లేకపోవటంవల్ల ద్వారకానివాసులకు రకరకాల ఉపద్రవాలు కలిగాయి. అప్పుడు ఆ పట్టణంలోని వృద్ధులు శ్రీకృష్ణునికి ఇలా చెప్పారు.

**సీ. 'కమలాక్ష! వినవయ్య! కాశీశుఁ డేలెడికుంభిని వానలు గురియకున్నఁ**
**గోరి శ్వఫల్కునిఁ గొనిపోయి యతనికిఁ గాందిని యనియెడు కన్య నిచ్చి**
**కాశీవిభుండు సత్కారంబు సేసిన వానలు గురిసె నా వసుధమీఁద,**
**నాతనిపుత్త్రకుఁడైన యక్రూరుండు నంతటివాఁడు, మహాతపస్వి**

**ఆ. మరలి వచ్చెనేని మాను నుత్పాతంబు, లెల్ల, వాన గురియు నీ స్థలమున,**
**దేవ! యతనిఁ దోడి తెప్పింపు, మన్నింపు, మానవలయుఁ బీడ మానవులకు. 96**

**ప్రతి :** దేవ!= పరమాత్మా!; కమల+అక్ష= తామరలవంటి కన్నులు గలవాడా!; వినవయ్య!= వినుము తండ్రీ!; కాశీ+ఈశుఁడు= కాశీరాజు; ఏలెడి= పాలించెడి; కుంభినిన్= భూమిలో; వానలు, కురియక+ఉన్నన్= వానలు పడకుండుటచే; కాశీవిభుండు= కాశీరాజు; కోరి= ఇష్టపడి; శ్వఫల్కునిన్= వృష్ణియను యాదవరాజు కుమారుడయిన శ్వఫల్కుని; కొనిపోయి= తీసుకొనివెళ్లి; అతనికిన్= శ్వఫల్కునికి; కాందిని; అనియెడు= అను పేరుగల; కన్యన్= పుత్రికను; ఇచ్చి= పెండ్లిచేసి; సత్కారంబు+చేసినన్= గౌరవింపగా; వసుధమీఁదన్= భూమిమీద; వానలు కురిసెను; ఆతని= శ్వఫల్కునియొక్క; పుత్త్రకుఁడు+ఐన= కుమారుడైన; అక్రూరుండున్= అక్రూరుడును; అంతటివాఁడు= తండ్రియంత గొప్పవాడు; మహాతపస్వి (మహత్+తపస్వి)= మహాముని అయిన అక్రూరుడు; మరలి= తిరిగి; వచ్చెన్+ఏనిన్= ద్వారకకు వస్తేనే; ఉత్పాతంబులు+ఎల్లన్= అన్నియుపద్రవాలును; మానున్= తొలగిపోతాయి; ఈ స్థలమునన్= ఇచ్చట; వాన కురియున్; అతనిన్= ఆ అక్రూరుణ్ణి; తోడి తెప్పింపు(ము)= రప్పించుము; మన్నింపు(ము)= అతడు చేసిన తప్పు క్షమించు; మానవులకున్= ద్వారకయందలి మనుష్యులకు; పీడ= బాధ; మానవలయున్= తొలగిపోవాలి.

**తా :** శ్రీకృష్ణపరమాత్మా! ఒకప్పుడు కాశీరాజు రాజ్యంలో వానలు పడలేదు. అనావృష్టి బెడద తొలగించుకొనటానికి అతడు శ్వఫల్కుణి తీసుకొనిపోయి, తన కొమార్తె అయిన కాందిని నిచ్చి పెండ్లిచేసి సత్కరించాడు. అప్పుడు ఆ రాజ్యంలో వానలు కురిశాయి. శ్వఫల్కుణి కుమారుడు అక్రూరుడుకూడా తండ్రియంత గొప్పవాడే. అతడు ద్వారకకు తిరిగివస్తేనే వర్షాలు కురిసి ఆపదలు తొలగిపోతాయి. నీవు అక్రూరుని తప్పు క్షమించు. ఇక్కడకు అతణ్ణి రప్పించు. ప్రజలబాధలు తొలగిపోవటం ముఖ్యం.

**వ. అని పలుకు పెద్దల పలుకు లాకర్ణించి దూతలం బంపి కృష్ణుం డక్రూరుని రావించి, పూజించి ప్రియకథలు కొన్ని సెప్పి, సకలలోకజ్ఞుండు గావున మృదుమధురభాషణంబుల నతని కిట్లనియె. 97**

**ప్రతి :** అని; పలుకు= పలికిన; పెద్దల పలుకులు= పెద్దలమాటలు; ఆకర్ణించి= విని; దూతలను; పంపి; కృష్ణుండు; అక్రూరుణ్ణి; రావించి= రప్పించి; పూజించి; ప్రియ= ఇష్టమయిన; కథలు; కొన్ని; చెప్పి; సకల= సమస్తమయిన; లోకజ్ఞుండు= జనుల స్వభావాలు తెలిసినవాడు; కావునన్= కాబట్టి; మృదు= మెత్తని; మధుర= తియ్యని; భాషణంబులన్= మాటలతో; అతనికిన్= అక్రూరునితో; ఇట్లు; అనియెన్= అన్నాడు...

**తా :** పెద్దల మాటలు విని శ్రీకృష్ణుడు దూతలను పంపి అక్రూరుణ్ణి రప్పించి, పూజించాడు. అతనికి ప్రీతి కలిగించే కథలు కొన్ని చెప్పాడు. సర్వజనుల స్వభావాలు తెలిసినవాడు కాబట్టి మెత్తగా, తియ్యగా అక్రూరునితో ఇలా మాటాడాడు.

సీ. 'తా నేగుతఱి శతధన్వుండు మణిఁ దెచ్చి నీ యింటఁ బెట్టుట నిజము తెలిసి
నాఁడ, సత్రాజిత్తునకుఁ బుత్రకులు లేమి నతనికిఁ గార్యంబు లాచరించి
విత్తంబు ఋణమును విభజించుకొనియెద రతని పుత్రికలెల్ల, నతఁడు పరుల
చేత దుర్మరణంబుఁ జెందినాఁ, డతనికై సత్కర్మములు మీఁద జరుపవలయు,

ఆ. మణి గ్రహింపు మీవ, మా యన్న నను నమ్మఁ, డెలమి బంధుజనుల కెల్లఁ జూపు
మయ్య! నీ గృహమున హాటకవేదికా, సహితమఖము లమరు సంతతమును'. 98

ప్రతి : శతధన్వుండు; తాను; ఏగుతఱిన్= వెళ్లేటప్పుడు; మణిన్; తెచ్చి; నీయింటన్= నీఇంటిలో; పెట్టుట= దాచడం; నిజము= నిజం; తెలిసినాఁడన్= తెలుసుకొన్నాను; సత్రాజిత్తునకును; పుత్రకులు= కుమారులు; లేమిన్= లేకపోవుటచేత; అతని పుత్రికలు+ఎల్లన్= అతని కొమార్తెలందరు; అతనికిన్= సత్రాజిత్తుకు; కార్యంబులు= చేయదగిన క్రియలు; ఆచరించి= చేసి; విత్తంబు= ధనాన్ని; ఋణమును= అప్పును; విభజించుకొనియెదరు= పంచుకొంటారు; అతఁడు= సత్రాజిత్తు; పరులచేతన్= శత్రువులచేత; దుర్మరణంబు= చెడ్డచావు; చెందినాఁడు= పొందినాడు; అతనికిన్+ఐ= అతణ్ణి ఉద్దేశించి; మీఁదన్= ఇక ముందు; సత్కర్మములు= ఉత్తమకార్యాలు; జరుపవలయున్= చేయవలసిఉంది; ఈవు+అ= నీవే; మణిన్= స్యమంతకమణిని; గ్రహింపుము= తీసుకో; మా+అన్న= బలరాముడు; ననున్; నమ్మఁడు; ఎలమిన్= ప్రేమతో; బంధుజనులకున్+ఎల్లన్= చుట్టాలకు అందరికీ; చూపుము+అయ్య!= చూపవయ్యా! నీగృహమునన్= నీయింటిలో; సంతతమును= ఎల్లప్పుడును; హాటక= బంగారంతో నిర్మించిన; వేదికా= తిన్నెలతో; సహిత= కూడికొనిన; మఖములు= యజ్ఞాలు; అమరున్= జరుగుతాయి.

తా : అక్రూరా! శతధన్వుడు పోయేటప్పుడు మీయింటిలో మణిని దాచినమాట నిజం. అది నాకు తెలుసు. సత్రాజిత్తుకు కొడుకులు లేరు. కొమార్తెలే అతనికి చేయదగిన పనులన్నీ చేసి ఆస్తినీ, అప్పునూ పంచుకొంటారు. సత్రాజిత్తు వైరుల మూలంగా రాజుల కుచితంగాని మరణం పొందాడు. ఇక ముందు అతనికొరకు ఉత్తమకర్మలు చేయాలి. నీవే స్యమంతకమణిని ఉంచుకో! నేను మణికై వెంపరలాడుతున్నా నని బలరాముడు నన్ను శంకిస్తాడు. అనురాగంతో చుట్టాలందరికీ మణిని ఒకసారి చూపు. ఈ ఉదారబుద్ధివల్ల నీవు పుణ్యాత్ముడవై బంగారు తిన్నెలమీద కూర్చుండి యజ్ఞాలు చేసేంతటి గొప్పవాడి వవుతావు.

వ. అని యిట్లు సామవచనంబులు హరి పలికిన నక్రూరుండు వస్త్రచ్ఛన్నంబైన మణిం దెచ్చి హరి కిచ్చిన. 99

ప్రతి : అని; ఇట్లు; హరి= శ్రీకృష్ణుడు; సామవచనంబులు= సమ్మతమయిన మాటలు; పలికినన్= పలుకగా; అక్రూరుండు; వస్త్ర= గుడ్డతో; ఛన్నంబు+ఐన= కప్పబడిందైన; మణిన్; తెచ్చి; హరికిన్; ఇచ్చినన్= ఇయ్యగా...

తా : ఈ విధంగా శ్రీకృష్ణుడు నచ్చజెప్పగా అక్రూరుడు గుడ్డతో కప్పిన స్యమంతకమణిని తీసుకొనివచ్చి అతనికివ్వగా

ఉ. సంతసమంది బంధుజనసన్నిధికిన్ హరి దెచ్చి చూపె న
క్రాంతవిభాసమానఘృణిజాలపలాయితభూనభోంతర
ధ్వాంతము హేమభారచయవర్షణవిస్మితదేవమానవ
స్వాంతముఁ గీర్తిపూరితదిశావలయాంతము నా స్యమంతమున్. 100

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; సంతసము+అంది= సంతోషించి; అశ్రాంత= ఎల్లప్పుడు; విభాసమాన= విశేషంగా వెలుగుచున్న; ఘృణి= కాంతులయొక్క; జాల= సమూహంచేత; పలాయిత= పారిపోయిన; భూ= భూమియొక్క; నభస్= ఆకాశంయొక్క; అంతర= మధ్యనున్న; ధ్వాంతము= చీకటిగలది; హేమ= బంగారంయొక్క; భార= బారువులయొక్క; చయ= సమూహాన్ని; వర్షణ= ధారాళంగా ఇవ్వడంచేత; విస్మిత= ఆశ్చర్యపడిన; దేవ= దేవతలయొక్కయు; మానవ= మానవులయొక్కయు; స్వాంతమున్= మనస్సులు కలది; కీర్తి= కీర్తిచేత; పూరిత= వ్యాప్తమయిన; దిశావలయ= గుండ్రంగానున్న దిక్కులయొక్క; అంతమున్= తుదలు కలది అయిన; ఆ స్యమంతమున్= ఆ స్యమంతకమణిని; తెచ్చి= తెచ్చి; బంధుజన= చుట్టాలయొక్క; సంతతికిన్= సమూహానికి; చూపెన్= చూపాడు.

**తా :** శ్రీకృష్ణుడు – మంటికీ మింటికీ నడుమను చీకట్లను పారదోలే వెలుగులుకలదీ, బారువులకొలది బంగారాన్ని తెంపులేకుండా ఇస్తూ – దేవతలనూ, మానవులనూ ఆశ్చర్యపరచేదీ, దిగంతాల దాకా వ్యాపించిన పేరు కలిగిందీ అయిన స్యమంతకమణిని చుట్టపక్కాలందరికీ చూపాడు.

**క. చక్రాయుధుఁ డీ క్రియఁ దన, యక్రూరత్వంబు జనుల కందఱకును ని**
**ర్వక్రముగఁ దెలిపి క్రమ్మఱ, నక్రూరుని కిచ్చె మణిఁ గృపాకలితుండై. 101**

**ప్రతి :** చక్ర+ఆయుధుఁడు= చక్రం ఆయుధంగా కలవాడు; శ్రీకృష్ణుడు; ఈ క్రియన్= ఈ విధంగా; తన; అక్రూరత్వంబు= క్రూరత్వం లేకపోవుటను; సౌమ్యతను; జనులకున్+అందరకును; నిర్వక్రముగన్= సూటిగా; తెలిపి; క్రమ్మఱన్= మరల; కృపా= దయతో; ఆకలితుండు+ఐ= కూడుకొన్నవాడై; అక్రూరునికిన్; మణిన్; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణుడు స్పష్టంగా తనసౌమ్యతను అందరకూ తెలిపి, దయతో అక్రూరునకు తిరిగి మణిని ఇచ్చాడు.

**క. ఘనుఁడు భగవంతుఁ డీశ్వరుఁ, డనఘుఁడు మణి దెచ్చి యిచ్చినట్టి కథనమున్**
**వినినఁ బఠించినఁ దలఁచిన, జనులకు దుర్యశముఁ బాపసంఘముఁ దలఁగున్. 102**

**ప్రతి :** ఘనుఁడు= అందరికంటె గొప్పవాడు; భగవంతుఁడు= ఐశ్వర్యం (లేక మాహాత్మ్యము), ధైర్యం, కీర్తి, సంపద, జ్ఞానం, వైరాగ్యం అనే ఆరూ గలవాడు; ఈశ్వరుఁడు= పరమాత్మ; అనఘుఁడు= పాపరహితుడు అగు శ్రీకృష్ణుడు; మణిన్= స్యమంతకమణిని; తెచ్చి ఇచ్చినట్టి; కథనమున్= కథను; వినినన్= వింటే; పఠించినన్= చదివితే; తలఁచినన్= స్మరిస్తే; జనులకున్= మానవులకు; దుర్యశమున్= అపకీర్తి; పాపసంఘమున్= పాపసమూహంకూడా; తలఁగున్= తొలగిపోతాయి.

**తా :** సర్వోన్నతుడూ, భగవానుడూ, పరమాత్మా, పుణ్యశాలీ అయిన శ్రీకృష్ణుడు మణిని తెచ్చిఇచ్చిన కథను విన్నా, చదివినా, జ్ఞప్తికి తెచ్చుకొన్నా మానవులకు చెడ్డపేరూ, పాపసమూహమూ నశించిపోతాయి.

## ✤ శ్రీకృష్ణుం డింద్రప్రస్థపురంబున కరుగుదెంచుట ✤

**వ. అంత నొక్కనాఁడు పాండవులం జూడ నిశ్చయించి సాత్యకిప్రముఖయాదవులు గొలువఁ బురుషోత్తముం డింద్రప్రస్థపురంబునకుం జనినం బ్రాణంబులం గనిన యింద్రియంబులభంగి వా రఖిలేశ్వరుం డైన హరిం గని కౌఁగిలించుకొని కృష్ణునిదివ్యదేహసంగమంబున నిర్ధూతకల్మషులై యనురాగ హాసవిభాసితంబైన ముకుందముఖారవిందంబు దర్శించి యానందంబు నొందిరి, గోవిందుండును యుధిష్ఠిరభీమసేనుల**

**చరణంబులకు నభివందనంబులు సేసి యర్జును నాలింగనంబున సత్కరించి, నకులసహదేవులు మ్రొక్కిన గ్రుచ్చి యెత్తి, యుత్తమపీఠంబున నాసీనుండై యుండె; నప్పుడు. 103**

**ప్రతి :** అంతన్= తర్వాత; ఒక్కనాఁడు= ఒకరోజున; పురుషోత్తముండు= పురుషులయందు ఉత్తముడైన, శ్రీకృష్ణుడు; పాండవులను; చూడన్= చూడాలని; నిశ్చయించి; సాత్యకి; ప్రముఖ= మొదలయిన; యాదవులు; కొలువన్= సేవింపగా; ఇంద్రప్రస్థపురంబునకున్; చనినన్= వెళ్లగా; ప్రాణంబులను; కనిన= పొందిన; ఇంద్రియంబులభంగిన్= ఇంద్రియాలవలె; వారు= పాండవులు; అఖిల= సర్వానికి; ఈశ్వరుండు+ఐన= నియామకుడయిన; హరిన్= శ్రీకృష్ణుని; కని= చూచి; కౌఁగిలించుకొని; కృష్ణుని= శ్రీకృష్ణునియొక్క; దివ్య= మనోజ్ఞమయిన; దేహ= శరీరంయొక్క; సంగమంబునన్= స్పర్శచేత; నిర్ధూత= తొలగింపబడిన; కల్మషులు+ఐ= పాపాలు కలవారై; అనురాగ= ప్రేమతో; హాస= నవ్వుతో; విభాసితంబు+ఐన= విశేషంగా ప్రకాశించేదైన; ముకుంద= శ్రీకృష్ణునియొక్క; ముఖ+అరవిందంబు= పద్మంవంటి ముఖాన్ని; దర్శించి= చూచి; ఆనందంబును; ఒందిరి= పొందిరి; గోవిందుండును= శ్రీకృష్ణుడును; యుధిష్ఠిరభీమసేనుల= ధర్మరాజుయొక్క; భీమునియొక్క; చరణంబులకున్= పాదాలకు; అభివందనంబులు+చేసి= నమస్కారాలుచేసి; అర్జునున్= అర్జునుణ్ణి; ఆలింగనంబునన్= కౌగిలింతతో; సత్కరించి= గౌరవించి; నకులసహదేవులు; మ్రొక్కినన్= పాదప్రణామంచేయగా; గ్రుచ్చి+ఎత్తి= చేతులు చంకలగుండ దూర్చిపైకి లేవనెత్తి; ఉత్తమపీఠంబునన్= శ్రేష్ఠమైన ఆసనంమీద; ఆసీనుండు+ఐ= కూర్చున్నవాడై; ఉండెన్= ఉండెను; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఒకనాడు శ్రీకృష్ణుడు పాండవులను చూడాలని నిశ్చయించి, సాత్యకి మొదలయిన యాదవులతో ఇంద్రప్రస్థపురానికి వచ్చాడు. ఆ పరమాత్మను చూడగానే పాండవులకు పోయినప్రాణాలు తిరిగి వచ్చినట్లయింది. వారు శ్రీకృష్ణుణ్ణి కౌగిలించుకొనటంచేత సర్వపాపాలనుండి విముక్తి పొందారు. ప్రేమ దరహాసాలతో కూడిన అతనిముఖకమలాన్ని చూచి ఆనందించాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజుకూ, భీమునికీ పాదప్రణామం చేశాడు. అర్జునుణ్ణి కౌగిలించుకొన్నాడు. తన కాళ్లకు మ్రొక్కిన నకులసహదేవులను రెండుచేతులతో పట్టి పైకి లేవనెత్తి, ఒక ఉత్తమపీఠంమీద కూర్చున్నాడు. అప్పుడు

**క. చంచద్ఘనకుచభారా, కుంచితయై క్రొత్తపెండ్లికూఁతు రగుట నిం**
**చించుక సిగ్గు జనింపఁగఁ, బాంచాలతనూజ మ్రొక్కెఁ బద్మాక్షునకున్. 104**

**ప్రతి :** పాంచాల= ద్రుపదుని యొక్క; తనూజ= కూతురు ద్రౌపది; చంచత్= ఒప్పుచున్న; ఘన= పెద్దవి అయిన; కుచ= చన్నులయొక్క; భార= బరువుచేత; ఆకుంచిత+ఐ= ముడుచుకొనేటట్లు చేయబడిందై; క్రొత్తపెండ్లికూఁతురు= కొత్తగా పెండ్లి అయిన యువతి; అగుటన్= అగుటచేత; ఇంచించుక (ఇంచుక+ఇంచుక)= అతిస్వల్పమైన; సిగ్గు= లజ్జ; జనింపన్+కన్= పుట్టగా; పద్మ+అక్షునకున్= కమలాలవంటి కన్నులుగలవానికి; మ్రొక్కెన్= నమస్కరించాడు.

**తా :** స్తనభారంవల్ల ముడుచుకొనిపోయిన శరీరం గలదీ, క్రొత్తగా పెండ్లికావటంచేత కొంచెం కొంచెం సిగ్గు పొందిందీ అగు ద్రౌపది శ్రీకృష్ణునికి నమస్కరించింది.

**వ. అంత సాత్యకి పాండవులచేతం బూజితుండైయొక్కపీఠంబున నాసీనుండై యుండెఁ, దక్కిన యనుచరులును వారిచేతఁ బూజితులై కొలిచి యుండిరి, హరియుం గుంతీదేవి కడకుం జని నమస్కరించి యిట్లనియె. 105**

**ప్రతి :** అంతన్= పిమ్మట; సాత్యకి; పాండవులచేతన్; పూజితుండు+ఐ= సత్కరింపబడినవాడై; ఒక్కపీఠంబునన్= తగిన ఆసనంమీద; ఆసీనుండు+ఐ= కూర్చునవాడై; ఉండెన్= ఉండెను; తక్కిన= మిగిలిన; అనుచరులును= వెంటవచ్చినవారు కూడా; వారిచేతన్= పాండవులచేత; పూజితులు+ఐ= గౌరవింపబడినవారై; కొలిచి= సేవించి; ఉండిరి; హరియున్= శ్రీకృష్ణుడును; కుంతీదేవికడకున్= కుంతీదేవిదగ్గరకు; చని= వెళ్లి; నమస్కరించి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికెను...

**తా :** తర్వాత సాత్యకి పాండవులచేత పూజలు పొంది ఉచితాసనంమీద కూర్చున్నాడు. మిగిలిన అనుయాయులుకూడ పాండవులు మర్యాదలు చేసిన తర్వాత సేవిస్తూ ఉన్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు కుంతీదేవిని సమీపించి ఈ విధంగా అన్నాడు.

**క. 'అత్తా! కొడుకులుఁ గోడలుఁ, జిత్తానందముగఁ బనులు సేయఁగ నాత్మా**
**యత్తానుగవై యాజ్ఞా, సత్తాదులు గలిగి మనుదె సమ్మోదమునన్? 106**

**ప్రతి :** అత్తా!; కొడుకులును; కోడలును; చిత్త+ఆనందము+కన్= మనస్సునకు ఆనందము కలుగగా; పనులు= నీవు చెప్పే పనులు; చేయన్+కన్= చేస్తుండగా; ఆత్మ= మనస్సుకు; ఆయత్త= వశమైందాన్ని; ఇష్టమయినదాన్ని; అనుగవు+ఐ= అనుసరించేదానివై, నీకు నచ్చినట్లుగా నడచుకొంటున్నదానివై; ఆజ్ఞా= నీ ఉత్తరువులు చెల్లునట్లు చేయగల; సత్తా= సౌజన్యం; ఆదులు= మొదలయిన లక్షణాలు; కలిగి; సమ్మోదమునన్= సంతోషంతో; మనుదు+ఎ= కాలం వెళ్లదీస్తున్నావా?

**తా :** అత్తా! కొడుకులూ, కోడలూ నీవుచెప్పిన పనులు నీ మనస్సుకు సంతోషం కల్గిస్తూ చేస్తున్నారు కదా! నీ మనసుకు నచ్చినట్లు నడుచుకొంటూ, నీయాజ్ఞలు తలదాల్చేటట్లు చేయగల మంచితనం మొదలయిన గుణాలు కలిగి హాయిగా బ్రతుకు పండించుకొంటున్నావా?

**చ. అనవుడుఁ బ్రేమవిహ్వలత నందుచు గద్గదభాషణంబులం**
**గనుఁగవ నశ్రుతోయములు గ్రమ్మఁగఁ గుంతి సుయోధనుండు సే**
**సిన యపచారముం దలఁచి చెందినదుఃఖము లెల్లఁ జెప్పి యా**
**దనుజవిరోధి కి ట్లనియెఁ దద్దయుఁ బెద్దఱికంబు సేయుచున్. 107**

**ప్రతి :** అనపుడున్= శ్రీకృష్ణుడు ఆ విధంగా పలికిన తర్వాత; కుంతి= కుంతి; ప్రేమ= ప్రేమవలన కలిగిన; విహ్వలతన్= ఉద్విగ్నతను; అందుచున్= పొందుతూ; కను+కవన్= రెండు కన్నులయందు; అశ్రుతోయములు= కన్నీళ్లు; క్రమ్మన్+కన్= వ్యాపింపగా; గద్గద= వణకుతున్న గొంతుతో, బొంగురుపోయిన గొంతుతో పలికెడి; భాషణంబులన్= మాటలతో; సుయోధనుండు= దుర్యోధనుడు; చేసిన; అపచారమున్= అపకారమును; తలఁచి= స్మరించి; చెందిన= అతనివలన పొందిన; దుఃఖములు+ఎల్లన్= వ్యథలన్నింటినీ; చెప్పి= వివరించి; తద్+దయున్= మిక్కిలి; పెద్దఱికంబు+చేయుచున్= పెద్దదిక్కుగా తలంచుచు; ఆ; దనుజవిరోధికిన్= రాక్షసుల శత్రువుతో, శ్రీకృష్ణునితో; ఇట్లు; అనియెన్= చెప్పింది.

**తా :** శ్రీకృష్ణుని మాటలు విన్నతర్వాత కుంతి ప్రేమోద్వేగానికి లోనయింది. ఆమె కన్నులనిండా దుఃఖాశ్రువులు వ్యాపించాయి. ఆమెకు దుర్యోధనుడు చేసిన అపకారం జ్ఞప్తికి వచ్చింది. తడబడుచున్న గొంతుతో అనుభవించిన దుఃఖాలన్నీ వివరించింది. శ్రీకృష్ణుని పెద్దదిక్కుగా భావించి అతనితో ఈ విధంగా చెప్పింది.

**సీ. 'అన్న! నీ చుట్టాల నరయుదు, మఱవవు, నీవు పుత్తెంచిన నెమ్మితోడ**
**మా యన్న యేతెంచి మముఁ జూచి పోయెను, నిల్చి యున్నారము నీ బలమున,**
**నా పిన్నవాండ్రకు నాకు దిక్కెవ్వరు నేఁడాదిగా నింక నీవె కాక?**
**యఖిలజంతువుల కీ వాత్మవు గావునఁ బరులు నా వారని భ్రాంతి సేయ**

**తే. వయ్య! నా భాగ్యమెట్టిదో? యనవరతముఁ జిత్తమున నుండి కరుణ మా చిక్కులెల్ల**
**వాపుచుందువు గాదె! యో పరమపుణ్య!, యదుకుమారవరేణ్య! బుధాగ్రగణ్య!** **108**

**ప్రతి :** అన్న!= ఇది వాత్సల్యాన్ని ప్రకటించే సంబోధనం; నాయనా!; ఓ పరమపుణ్య!= ఓ మహాపుణ్యాత్మా!; యదుకుమారవరేణ్య= యాదవులలో శ్రేష్ఠుడా!; బుధ= దేవతలలో; అగ్రగణ్య= ప్రథముడుగా ఎన్నదగిన వాడా; నీచుట్టాలను; అరయుదు(వు)= రక్షింతువు; మఱవవు= గుర్తుపెట్టుకొందువు; నీవు; నెమ్మితోడన్= ప్రేమతో; పుత్తెంచినన్= పంపగా; మా+అన్న= మాకు అన్న అయిన అక్రూరుడు; ఏతెంచి= వచ్చి; మమున్= మమ్ము అందరినీ; చూచి; పోయెను; నీబలమునన్= నీశక్తిచేత; నిల్చి+ఉన్నారము= బ్రతికిఉన్నాము; నేఁడు+ఆది+కాన్= నేడు మొదలుకొని; ఇంకన్= ఇక ముందు; నా= నాయొక్క; పిన్నవాండ్రకున్= చిన్నబిడ్డలకు; నాకున్= నాకునూ; నీవు+ఎ= నీవే; కాక= తప్ప; దిక్కు= రక్షకుడు; ఎవ్వరు= ఎవరు; అఖిల= సమస్తమయిన; జంతువులకున్= ప్రాణులకు; ఈవు= నీవు; ఆత్మవు= ఆత్మస్వరూపుడివి; కావునన్= కాబట్టి; పరులు= ఇతరులు; నావారు; అని; భ్రాంతి+చేయవు+అయ్య!= తారతమ్యం చూపడం కాని, భేదబుద్ధిని ప్రకటించడంగాని నీ స్వభావంలో లేదు; నా భాగ్యము= నా అదృష్టం; ఎట్టిది+ఓ?= ఎటువంటి దని చెప్పను?; అనవరతమున్= ఎల్లప్పుడూ; చిత్తమునన్= మా మనస్సులందు; ఉండి; కరుణన్= దయతో; మాచిక్కులు= మాకష్టాలు; ఎల్లన్= అన్నింటినీ; పాపుచున్= పోగొట్టుచు; ఉందువు; కాదు+ఎ!= కదా!

**తా :** మహాపుణ్యాత్మా! యాదవోత్తమా! దేవతాగ్రణీ! నాయనా! శ్రీకృష్ణా! మరచిపోకుండా నీ చుట్టపక్కాలను కాపాడుతుంటావు. నీవు అనురాగంతో పంపగా మా అన్న అక్రూరుడు వచ్చి మా యోగక్షేమాలు తెలుసుకొని వెళ్లాడు. నీ అండదండలవల్లనే మేము బ్రతుకుతున్నాము. ఈనాటినుండి నాబిడ్డలకూ, నాకూ నీవు గాకుండా వేరేదిక్కు ఎవరైనా ఉన్నారా? సర్వజీవరాశికీ నీవే ఆత్మవు. అందువల్ల వీరు పరాయివారు, వీరు నావారు అనే భేదబుద్ధి నీకు లేదయ్యా! నా అదృష్టం ఎటువంటిదో కాని, నీవు ఎప్పుడూ మా మనస్సుల్లో నిలిచి మా కష్టాలన్నింటినీ తొలగిస్తున్నావు కదా!

**వ. అనిన యుధిష్ఠిరుం డి ట్లనియె.** **109**

**ప్రతి :** అనినన్= పలుకగా; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** పైవిధంగా కుంతి పలికిన తర్వాత ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**మ. 'పట్టఁగ లేరు నిన్నుఁ దమభావములందు సనందనాదు లే**
**పట్టుననైన, నట్టి గుణభద్రచరిత్రుఁడ వీవు, నేఁడు మా**
**చుట్టమ వంచు వచ్చెదవు చూచెద వల్పులమైన మమ్ము; నే**
**మెట్టి తపంబు చేసితి మధీశ్వర! పూర్వశరీరవేళలన్?'** **110**

**ప్రతి :** అధి+ఈశ్వర!= సర్వేశ్వరా!; సనందన= సనందనుడు; ఆదులు= మొదలయినవారు; ఏ పట్టునన్+ఐనన్= ఏ సమయంలోనైనా; తమ= తమయొక్క; భావముల+అందున్= అంతఃకరణంలో; నిన్నున్= నిన్ను; పట్టన్+కన్ లేరు= తెలియలేరు; ఈవు= నీవు; అట్టి= అటువంటి; గుణ= సద్గుణాలచేత; భద్ర= మంగళకరమైన; చరిత్రుఁడవు= ప్రవర్తన కలవాడివి; నేఁడు= ఈనాడు; మా= మాయొక్క; చుట్టమవు= చుట్టానివి; అంచున్= అంటూ; వచ్చెదవు= వస్తుంటావు; అల్పులము= క్షుద్రులము; ఐన; మమ్మున్; చూచెదవు= ప్రేమతో చూచుకొందువు; ఏము= మేము; పూర్వశరీరవేళలన్= పూర్వజన్మల్లో; ఎట్టితపంబు= ఎటువంటి తపస్సు; చేసితిమి= చేసియుంటిమో కదా!...

**తా :** సర్వేశ్వరా! సనకుడు, సనందుడు మొదలయిన మహర్షులుకూడా ఏ ఆధ్యాత్మికమార్గాలలో చరించినా నిన్ను తెలుసుకోలేరు. నీవు అట్టి గుణసంపన్నుడవు. శుభప్రదమయిన నడవడి కలవాడివి. ఇప్పుడు మా బాంధవుడివై వస్తున్నావు. హీనులమైన మమ్ము చేరదీసి కాపాడుతున్నావు. మేము పూర్వజన్మల్లో ఎంతగొప్పతపస్సు చేశామో!

**వ. అని ధర్మజుండు దన్నుఁ బ్రార్థించిన నింద్రప్రస్థపురంబువారలకు నయనానందంబు సేయుచు హరి గొన్నినెలలు వసియించి యుండె, నం దొక్కనాఁడు. 111**

**ప్రతి :** అని; ధర్మజుండు= ధర్మరాజు; తన్నున్; ప్రార్థించినన్= ప్రార్థింపగా; హరి= శ్రీకృష్ణుడు; ఇంద్రప్రస్థపురంబువారలకున్= ఇంద్రప్రస్థపౌరులకు; నయన+ఆనందంబు+చేయుచున్= కన్నులపండువుచేయుచు; కొన్ని నెలలు; వసియించి+ఉండెన్= నివసించాడు; అందున్= నివసించి ఉండే రోజుల్లో; ఒక్కనాఁడు= ఒకానొకరోజు...

**తా :** ధర్మరాజు తన్ను వేడగా శ్రీకృష్ణుడు పౌరులకు కనులపండువు చేస్తూ ఇంద్రప్రస్థపురంలో కొన్ని నెలలు నివసించాడు. ఆ నగరంలో ఉన్నప్పుడు ఒకరోజున

**మ. తురగశ్రేష్ఠము నెక్కి కంకటధనుస్తూణీశరోపేతుఁడై**
**హరితోడన్ వనభూమి కేగి విజయుం డాసక్తుఁడై చంపె శం**
**బర శార్దూల తరక్షు శల్య చమరీ భల్లూక గంధర్వ కా**
**సర కంఠీరవ ఖడ్గ కోల హరిణీ సారంగముఖ్యంబులన్. 112**

**ప్రతి :** విజయుండు= అర్జునుడు; కంకట= కవచంతో; ధనుస్= విల్లుతో; తూణీ= అమ్ములపొదితో; శర= బాణాలతో; ఉపేతుండు+ఐ= కూడుకొన్నవాడై; తురగశ్రేష్ఠమున్= ఉత్తమమైన గుర్రాన్ని; ఎక్కి; హరితోడన్= శ్రీకృష్ణునితో; వనభూమికిన్= అరణ్యప్రదేశానికి; ఏగి= వెళ్లి; ఆసక్తుఁడు+ఐ= వేటయందాసక్తి కలవాడై; శంబర= ఎర్రజింకలు; శార్దూల= పెద్దపులులు; తరక్షు= సివంగులు; శల్య= ఏదుపందులు; చమరీ= ఆడుసవరపు మెకములు; భల్లూక= ఎలుగుబంట్లు; గంధర్వ= దుప్పులు; కాసర= దున్నపోతులు; కంఠీరవ= సింహాలు; ఖడ్గ= ఖడ్గమృగాలు; కోల= పందులు; హరిణీ= ఆడుజింకలు; సారంగ= మగజింకలు; ముఖ్యంబులన్= మొదలగువాటిల్ని; చంపెన్= చంపాడు.

**తా :** అర్జునుడు కవచాన్నీ, వింటినీ, అమ్ములపొదినీ, బాణాలనూ గ్రహించి, ఒకమంచి గుర్రమెక్కి, శ్రీకృష్ణుడితో అడవికి వెళ్లి జింకలు, దుప్పులు, పందులు, దున్నలు, సింహాలు, సివంగులు, పెద్దపులులు, ఖడ్గమృగాలు, సవరపుమెకాలు మొదలయిన వాటిల్ని వేటాడినాడు.

**క. అచ్చోటఁ బవిత్రములై, చచ్చిన మృగరాజి నెల్ల జననాథునకున్**
**దెచ్చి యొసంగిరి మెచ్చుగఁ, జెచ్చెర నరుఁ గొల్చియున్న సేవకు లధిపా! 113**

**ప్రతి :** అధిపా!= పరీక్షిన్మహరాజా!; నరున్= అర్జునుణ్ణి; కొల్చి+ఉన్న= సేవించి ఉన్న; సేవకులు; ఆ+చోటన్= ఆ అడవిలో; పవిత్రములు+ఐ= పరిశుద్ధాలై; చచ్చిన; మృగరాజిన్+ఎల్లన్= మృగాల సమూహాల నన్నింటిని; మెచ్చు+కన్= మెచ్చుకొనునట్లుగా; చెచ్చెరన్ (చెర+చెర) = తొందరగా తెచ్చి; జననాథునకున్= రాజునకు; ఒసంగిరి= సమర్పించారు.

**తా :** పరీక్షిన్మహారాజా! చనిపోయినప్పటికీ పరిశుద్ధంగా ఉన్న అడవిమెకాలను - అర్జునుణ్ణి సేవిస్తున్న సేవకులు శీఘ్రంగా తీసుకొనివచ్చి మెచ్చుకొనేటట్లు అతడికి సమర్పించారు.

**వ. అంత నర్జునుండు నీరువట్టున దస్సిన యమునకుం జని య మ్మహారథులైన నరనారాయణు లందు వార్చి జలంబులు ద్రావి యొక పులినప్రదేశంబున నుండి. 114**

**ప్రతి :** అంతన్= తర్వాత; అర్జునుండు; నీరువట్టునన్= దప్పికచేత; దస్సినన్= అలసిపోగా; ఆ; మహారథులు+ఐన= పదునొకండు వేలమంది విలుకాండ్రతో పోరాడే యోధులయిన, (తనను, సారథిని, గుర్రాలను కాపాడుకొంటూ పోరాడే వీరులయిన); నరనారాయణులు= కృష్ణార్జునులు; యమునకున్= యమునానదికి; చని= వెళ్లి; అందున్= ఆ నదిలో; వార్చి= ఆచమించి; జలంబులు= నీళ్లు; త్రావి= తాగి; ఒక పులిన ప్రదేశంబునన్= ఒకానొక ఇసుక దిబ్బమీద; ఉండి...

**తా :** వేటాడిన అర్జునుడు దప్పికచేత బడలిక చెందాడు. అపుడు కృష్ణార్జునులు యమునానదికి వెళ్లి ఆచమించి నీరుత్రాగి ఒక ఇసుక దిబ్బమీద ఉండి

**ఉ. ఉపగతులైన యట్టి పురుషోత్తమ పార్థులు గాంచి రాపగా**
**విపులవిలోలనీలతరవీచికలందు శిరోజభార రు**
**చ్యపహసితాళిమాలిక నుదంచితబాలశశిప్రభాలికం**
**దపనునిబాలికన్ మదనదర్పణతుల్యకపోలపాలికన్. 115**

**ప్రతి :** ఉపగతులు= సమీపించినవారు; ఐన+అట్టి= ఐనట్టి; పురుషోత్తమపార్థులు= శ్రీకృష్ణుడు, అర్జునుడు; ఆపగా= యమునానదియొక్క; విపుల= అధికమయిన; విలోల= మిక్కిలి చలిస్తున్న; నీలతర= ఎక్కువగా నల్లనైన; వీచికల+అందున్= అలలలో; శిరోజ= తలవెంట్రుకలయొక్క; భార= సమూహంయొక్క; రుచి= కాంతిచేత; అపహసిత= పరిహసింపబడిన; అళి= తుమ్మెదలయొక్క; మాలికన్= వరుసలు గలదాన్నీ; ఉదంచిత= మిక్కిలి ఒప్పుచున్న; బాలశశి= బాలచంద్రునియొక్క; ప్రభా= వెలుగు కలిగిన; అలికన్= నుదురుగలదాన్ని; మదన= మన్మథునియొక్క; దర్పణ= అద్దంతో; తుల్యా= సమానమైన; కపోల= చెక్కిళ్లయొక్క; పాలికన్= ప్రదేశాలు గలదాన్ని; తపనుని= సూర్యునియొక్క; బాలికన్= కొమార్తెను; కాళిందిని; కాంచిరి= చూచారు.

**తా :** కృష్ణార్జునులు దగ్గరకు చేరి చలిస్తున్న నల్లని యమునానది అలలలో సూర్యసుత అయిన కాళిందిని చూచారు. కాళింది తల వెంట్రుకలు మిగులనల్లనివై తుమ్మెదలవరుసను హేళనచేస్తున్నాయి. ఆమెనొసలు నెలవంకవెలుగు కలిగిఉన్నాయి. ఆమెచెక్కిలిపట్టులు మన్మథునిఅద్దంవలె ఉన్నాయి.

**వ. కని యచ్యుతుండు పంచిన విర్వచ్చుండు సని యా కన్యకిట్లనియె. 116**

**ప్రతి :** కని= చూచి; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; పంచినన్= పంపగా; విర్వచ్చుండు= అర్జునుడు; చని= వెళ్లి; ఆ కన్యకున్= ఆ కన్యతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికెను...

**తా :** శ్రీకృష్ణుడు పంపగా అర్జునుడు వెళ్లి ఆ కన్యతో ఈ రీతిగా అన్నాడు.

**మ. 'సుదతీ! యెవ్వరిదాన? వేమికొఱ కిచ్చోటం బ్రవర్తించె? దె**
**య్యది నీ నామము? కోర్కి యెట్టిది? వివాహాకాంక్షతోఁగూడి యీ**
**నదికిన్ వచ్చిన జాడ గానఁబడె? ధన్యం బయ్యె నీ రాక, నీ**
**యుదయాదిస్థితి నెల్లఁ జెప్పు మబలా! యుద్యత్కురంగేక్షణా! 117**

**ప్రతి :** సుదతీ!= అందమయిన పలు వరుస గలదానా!; అబలా!= కన్యా!; ఉద్యత్= పైకిలేస్తున్న, చలిస్తున్న; కురంగ= లేడి చూపులవంటి; ఈక్షణా= చూపులు గలదానా!; ఎవ్వరిదానవు?= ఎవరి కొమార్తెవు?; ఏమికొఱకున్= దేనికి; ఈ+చోటన్= ఇక్కడ; ప్రవర్తించెదు(వు)?= ఉన్నావు?; నీనామము= నీపేరు; ఏ+అది= ఏది?; కోర్కి= కోరిక; ఎట్టిది= ఎటువంటిది?; వివాహ= పెండ్లియందలి; ఆకాంక్షతోన్= కోరికతో; కూడి= కూడి; ఈ నదికిన్= ఈ యమునానదికి; వచ్చినజాడ= వచ్చినతీరు; కానన్+పడెన్= తెలుస్తున్నది; నీరాక= నీవు రావడం; ధన్యంబు+అయ్యెన్= ఇష్టకార్యం నెరవేర్చుకొన్నదయింది; నీ= నీయొక్క; ఉదయ= జన్మం; ఆది= మొదలయిన; స్థితిన్+ఎల్లన్= విషయమంతా; చెప్పుము.

**తా :** ఓ కన్యామణీ! మృగాక్షీ! నీవెవరిపుత్రికవు? ఏమి కోరి ఇక్కడికి వచ్చావు? నీపేరేమి? నీకోరిక ఏమి? పెండ్లికొరకై ఇక్కడికి వచ్చినట్లుంది. నీరాక కృతార్థమైంది. నీ పుట్టుపూర్వోత్తరాలు చెప్పమ్మా!

**వ. అనిన నర్జుననకుఁ గాళింది యి ట్లనియె. 118**

**ప్రతి :** అనినన్= అని పల్కగా; అర్జుననకున్, కాళింది; ఇట్లు+అనియెన్= ఈలాగున బదులు పల్కింది.

**తా :** ఇట్లు అడిగిన అర్జునునితో కాళింది ఈవిధంగా అనింది.

**మ. 'నరవీరోత్తమ! యేను సూర్యునిసుతన్, నాపేరు కాళింది, భా**
**స్కర సంకల్పితగేహమందు నదిలోఁ గంజాక్షు విష్ణుం బ్రభున్**
**వరుగాఁ గోరి తపంబు సేయుదు, నొరున్ వాంఛింపఁ, గృష్ణుండు వ**
**న్యరతిన్ వచ్చి వరించు నంచుఁ బలికెన్ నా తండ్రి నాతోడుతన్.' 119**

**ప్రతి :** నరవీర= మానవవీరులలో; ఉత్తమ= శ్రేష్ఠుడా! ఏను= నేను; సూర్యునిసుతన్= సూర్యునికూతుర్ని; నాపేరు; కాళింది; భాస్కర= సూర్యునిచేత; సంకల్పిత= నిశ్చయింపబడిన; గేహము+అందున్= ఇంటిలో; నదిలోన్= ఈ యమునలో; కంజ+అక్షున్= పద్మాలవంటి కన్నులు గలవాడైన; విష్ణున్= విష్ణువును; ప్రభున్= సర్వేశ్వరుణ్ణి; వరున్+కాన్= భర్తగా; కోరి; తపంబు; చేయుదును; ఒరున్= ఇతరుణ్ణి; వాంఛింపన్= పతిగా కోరను; కృష్ణుండు; వన్య= అడవి జంతువులను వేటాడటంలోని; రతిన్= ఆసక్తితో; వచ్చి; వరించున్= వరిస్తాడు; అంచున్= అంటూ; నాతండ్రి; నాతోడుతన్= నాతో; పలికెన్= చెప్పాడు.

**తా :** మానవ వీరాగ్రణీ! నేను సూర్యుని పుత్రికను. నాపేరు కాళింది. యమునానదిలో సూర్యుడు నిశ్చయించిన గృహంలో ఉండి, కృష్ణుణ్ణి భర్తగా కోరి నేను తపస్సు చేస్తుంటాను. మరొకణ్ణి వివాహమాడను. వేటమీది అభిలాషతో శ్రీకృష్ణుడు వచ్చి, నన్ను పెండ్లాడుతాడని నాతండ్రి నాకు చెప్పాడు.

**వ. అనిన విని ధనంజయుఁ డా నీలవేణిపలుకులు హరికిం జెప్పిన విని సర్వజ్ఞుండైన హరియు హరి మధ్యను రథంబుమీఁద నిడుకొని ధర్మరాజుకడకుం జని వారలు గోరిన విశ్వకర్మను రావించి, వారిపురం బతివిచిత్రంబు సేయించె. 120**

**ప్రతి :** అనినన్= అని కాళింది చెప్పగా; విని; ధనంజయుండు= అర్జునుడు; ఆ; నీలవేణి= నల్లని జడగలదైన; కాళిందియొక్క; పలుకులు= మాటలు; హరికిన్= శ్రీకృష్ణునికి; చెప్పినన్= చెప్పగా; విని; సర్వజ్ఞుండు+ఐన= అన్నీ తెలిసినవాడైన; హరియున్= శ్రీకృష్ణుడును; హరిమధ్యను= సింహం నడుమువంటి నడుము గలదాన్ని, కాళిందిని; రథంబు మీఁదన్; ఇడుకొని= కూర్చుండబెట్టుకొని; ధర్మరాజు కడకున్; చని; వారలు= పాండవులు; కోరినన్= కోరగా; విశ్వకర్మను; రావించి= రప్పించి; వారి పురంబు= పాండవుల నగరాన్ని, ఇంద్రప్రస్థాన్ని; అతి= మిక్కిలి; విచిత్రంబు= మనోజ్ఞమయినదాన్నిగా; చేయించెన్= చేయించాడు.

**తా :** అర్జునుడు కాళింది అనినమాటలు శ్రీకృష్ణునికి చెప్పాడు. సర్వమూ తెలిసిన శ్రీకృష్ణుడు కాళిందిని రథంమీద ధర్మరాజు దగ్గరకు తీసుకొనివెళ్లాడు. పాండవులు కోరగా విశ్వకర్మను రప్పించి, ఇంద్రప్రస్థాన్ని సుందరనగరంగా తీర్చిదిద్దించాడు.

**క. దేవేంద్రునిఖాండవ మ, ప్పావకునకు నీఁ దలంచి పార్థుని రథికుం**
**గావించి సూతుఁ డయ్యెను, గోవిందుఁడు మఱఁదితోడఁ గూరిమి వెలయన్. 121**

**ప్రతి :** గోవిందుఁడు= శ్రీకృష్ణుడు; దేవేంద్రుని= దేవేంద్రునియొక్క; ఖాండవము= ఖాండవ వనాన్ని; ఆ+పావకునకున్= ప్రసిద్ధుడయిన అగ్నికి; ఈన్= ఇయ్యగా; తలంచి= నిశ్చయించి; పార్థునిన్= అర్జునుణ్ణి; రథికున్= రథంమీద ఉండి యుద్ధంచేసే యోధునిగా; కావించి= నియమించి; మఱఁదితోడన్= అర్జునునియందలి; కూరిమి= ప్రేమ; వెలయన్= వెల్లడి కాగా; సూతుఁడు= సారథి; అయ్యాడు.

**తా :** శ్రీకృష్ణుడు దేవేంద్రుని ఖాండవ వనాన్ని అగ్నికి ఇవ్వడానికి నిర్ణయించాడు. తా ననుకొనింది నెరవేరటానికి అర్జునుణ్ణి రథయోధునిగా చేసి, అతనిమీద ఉన్న ప్రేమతో సారథి అయ్యాడు.

**వ. ఇట్లు నరనారాయణులు సహాయులుగా దహనుండు ఖాండవవనంబు దహించిన సంతసించి విజయునకు నక్షయతూణీరంబులు, నభేద్యకవచంబును, గాండీవ మనియెడి బాణాసనంబును, దివ్య రథంబును, ధవళరథ్యంబులను నిచ్చె నందు. 122**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; నరనారాయణులు= శ్రీకృష్ణార్జునులు; సహాయులు+కాన్= తోడయినవారుగా; దహనుండు= అగ్ని; ఖాండవ వనంబు; దహించి= కాల్చి; సంతసించి= ఆనందించి; విజయునకున్= అర్జునునికి; అక్షయ= తరిగిపోని బాణాలుగల; తూణీరంబులున్= అమ్ములపొదులు; అభేద్య= విరుగగొట్టడానికి వీలుకాని; కవచంబును= మైమరువును; గాండీవము+అనియెడి= గాండీవమనే; బాణ+ఆసనంబును= ధనుస్సును; దివ్య= లోకాతీతమయిన; రథంబును; ధవళ= తెల్లని; రథ్యంబులను= గుర్రాలను; ఇచ్చెన్= కానుకలుగా ఇచ్చాడు; అందున్= ఆ ఖాండవ వనంలో...

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణార్జునులు తోడుగా అగ్ని ఖాండవవనాన్ని బూడిదచేసి పరమానందం పొందాడు. కృతజ్ఞతతో అర్జునునికి తరుగని అమ్ములపొదులూ, ఛేదించుటకు సాధ్యంగాని కవచమూ, గాండీవ మను విల్లూ, దేవతా సంబంధమయిన రథమూ, తెల్లని గుర్రాలూ సమర్పించాడు. ఆ ఖాండవవనంలో

**ఉ. వాసవసూనుచేఁ దనకు వహ్నిశిఖాజనితోగ్రవేదనల్**
**వాసినఁజేసి యొక్క సభ పార్థున కిచ్చె మయుండు ప్రీతుఁడై**
**యా సభలోనఁ గాదె గమనాగమనంబులఁ గౌరవేంద్రుఁ డు**
**ల్లాసముఁ బాసి యుండుట జలస్థలనిర్ణయబుద్ధిహీనుఁడై. 123**

**ప్రతి :** మయుండు= మయుడు; వాసవ= ఇంద్రునియొక్క; సూనుచేన్= కుమారునిచే, అర్జునునిచే; తనకున్= తనకు; వహ్ని= అగ్నియొక్క; శిఖా= జ్వాలలచేత; జనిత= పుట్టిన; ఉగ్ర= మిక్కుటమైన; వేదనల్= బాధలు; పాసినన్= తొలగిపోగా; ప్రీతుడు+ఐ= ఆనందించిన వాడై; ఒక్కసభ= విచిత్రమయిన సభామందిరాన్ని; చేసి= నిర్మించి; పార్థునకున్= అర్జునునికి; ఇచ్చెన్= సమర్పించాడు; కౌరవ+ఇంద్రుఁడు= కౌరవులలో శ్రేష్ఠుడు, దుర్యోధనుడు; జల= నీళ్లు; స్థల= నేల; నిర్ణయ= అను నిశ్చయం చేసే; బుద్ధి= జ్ఞానంచేత; హీనుఁడు+ఐ= తక్కువవాడై; గమన+ఆగమనంబులన్= రాకపోకలలో; ఉల్లాసమున్= సంతోషం; పాసి= వీడి; ఉండుట; ఆ సభలోనన్= ఆ సభాగృహంలోనే; కాదు+ఎ= కదా!

**తా :** అర్జునుడు కారణంగా తనకు అగ్నిబాధలు తొలగగా ఆనందించి మయుడు అద్భుతమయిన సభాగృహాన్ని నిర్మించి, అతనికి కానుకగా సమర్పించాడు. ఇవి నీళ్లూ, ఇది నేలా అని గ్రహించే జ్ఞానం లేని దుర్యోధనుడు రాకపోకలు సాగించినప్పటికీ ఆ సభామందిరంలో సంతోషం పొందలేకపోయాడు.

## ❖ శ్రీకృష్ణుండు కాళింది మిత్రవింద నాగ్నజితి భద్ర లక్షణ యను వారలఁ బరిణయమాడుట ❖

**వ. అంతం గృష్ణుండు ధర్మరాజ ప్రముఖుల వీడుకొని సాత్యకిప్రముఖసహచరులు గొలువ, మరలి తన పురంబునకుం జని బంధుజనంబులకుఁ బరమానందంబు సేయుచు నొక్కపుణ్యదివసంబున శుభలగ్నంబునం గాళిందిం బెండ్లి యయ్యె, మఱియు నవంతిదేశాధీశ్వరు లయిన విందానువిందులు దుర్యోధనునకు వశులై హరికి మేనత్తయైన రాజాధిదేవి కూఁతురైన తమ చెలియలిని వివాహంబు సేయ నుద్యోగించి స్వయంవరంబుఁ జాటించిన. 124**

**ప్రతి :** అంతన్= తరువాత; కృష్ణుండు; ధర్మరాజ ప్రముఖులన్= ధర్మరాజు మొదలైనవారిని; వీడుకొని= వీడ్కోలు పుచ్చుకొని; సాత్యకి; ప్రముఖ= మొదలైన; సహచరులు= వెంటనుండేవారు (సహాయులు); కొలువన్= సేవింపగా; మరలి= తిరిగి; తన పురంబునకున్= తన పట్టణానికి (ద్వారకకు); చని= వెళ్లి; బంధుజనంబులకున్= చుట్టపక్కాలకు; పరమ+ఆనందంబు+ చేయుచున్= మహాసంతోషం కలిగిస్తూ; ఒక్క= ఒకానొక; పుణ్యదివసంబున= మంచిరోజున; శుభలగ్నంబునన్= శుభముహూర్తంలో; కాళిందిన్= కాళిందిని; పెండ్లి+అయ్యెన్= పెండ్లాడాడు; మఱియున్= పిమ్మట; అవంతిదేశ= అవంతి దేశంయొక్క; అధీశ్వరులు= ప్రభువులు; అయిన; వింద+అనువిందులు= విందుడు, అనువిందుడు అనేవాళ్ళు; దుర్యోధనునకున్; వశులు+ఐ= లొంగినవారై; హరికిన్= శ్రీకృష్ణునికి; మేనత్త+ఐన; రాజాధిదేవి కూఁతురు+ఐన= రాజాధిదేవికూతురయిన; తమ చెలియలినిన్= తమ చెల్లెలికి; వివాహంబు+చేయన్= పెండ్లిచేయగా; ఉద్యోగించి= పూనుకొని; స్వయంవరంబున్= కన్య స్వయంగా వరుని పెండ్లిచేసుకొనే పద్ధతిని; చాటించినన్= చాటింపగా...

**తా :** తర్వాత శ్రీకృష్ణుడు ధర్మరాజు మున్నగువారిని వీడ్కొని, సాత్యకి మొదలైన అనుచరులతో పాటు ద్వారకకు వచ్చి బంధువులను మిత్రులను ఆనందింపజేస్తూ ఒక మంచిరోజు సుముహూర్తంలో కాళిందిని వివాహమాడాడు. రాజాధిదేవి శ్రీకృష్ణుని మేనత్త. విందుడు, అనువిందుడు ఆమె కుమారులు. అవంతిదేశాధిపతులు. దుర్యోధనునికి అధీనులు. వారు తమ చెల్లెలికి (మిత్రవిందకు) పెండ్లి చేయాలని నిశ్చయించి స్వయంవరం చాటింపగా

**క. భూ రమణులు సూడఁగ హరి, వీరతఁ జేకొనియె మిత్రవిందను నిత్యా**
**పూరితసుజనానందం, జారుచికురకాంతివిజితషట్పదబృందన్. 125**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; భూరమణులు= భూమికినాథులు; రాజులు; చూడన్+కన్= చూస్తుండగా; వీరతన్= పరాక్రమంతో; నిత్య= ఎల్లప్పుడూ; ఆపూరిత= నింపబడిన (ఎక్కువగా కలిగించిన); సుజన= సజ్జనులయొక్క; ఆనందన్= ఆనందం కలదాన్ని; చారు= మనోహరమైన; చికుర= తలవెండ్రుకలయొక్క; కాంతి= కాంతిచేత; విజిత= జయింపబడిన; షట్పద= తుమ్మెదలయొక్క; బృందన్= సమూహం కలదాన్ని; మిత్రవిందను; చేకొనియెన్= పెండ్లాడెను.

**తా :** రాజులు చూస్తుండగా శ్రీకృష్ణుడు శూరత్వంతో మిత్రవిందను పెండ్లిచేసికొన్నాడు. మిత్రవింద ఎప్పుడూ సజ్జనులను సంతోషపెడుతుంది. ఆమె నల్లని తలవెండ్రుకలు కాంతితో నల్లని తుమ్మెదలను జయించాయి. మిత్రవింద శిరోజాలు తుమ్మెదల నల్లదనాన్ని మించిన నలుపురంగు కలవని భావం.

**సీ. జననాథ! వినుము కోసలదేశ మేలెడి నగ్నజిత్తను నరనాథుఁ డొకఁడు**
**సుమతి ధార్మికుఁడు దత్సుత నాగ్నజితి యను కన్యక గుణవతి గలదు; దానిఁ**
**బెండ్లియాడుటకునై పృథివీశు లేతెంచి వాఁడికొమ్ములు గల వాని, వీర**
**గంధంబు సోఁకినఁ గాలు ద్రవ్వెడివాని, నతిమదమత్తంబులైన వాని**

**తే. గోవృషంబుల నేడింటిఁ గూర్చి తిగిచి, బాహుబలమున నెవ్వఁడు పట్టి కట్టు**
**నతఁడు కన్యకుఁ దగు వరుం డనిన వానిఁ, బట్టఁజాలక పోదురు ప్రజలు బెగడి. 126**

**ప్రతి :** జననాథ!= రాజా!; పరీక్షిన్మహారాజా!; విను; కోసలదేశము; ఏలెడి= పరిపాలించెడి; నగ్నజిత్తు; అను; నరనాథుఁడు+ఒకడు= ఒకరాజు; సుమతి= బుద్ధిమంతుడు; ధార్మికుఁడు= ధర్మాన్ని ఆచరించేవాడు; తత్+సుత= అతని పుత్రిక; నాగ్నజితి; అను; కన్యక= పెండ్లికాని యువతి; గుణవతి= సద్గుణాలు కలది; కలదు; దానిన్= ఆమెను; పెండ్లి+ఆడుటకున్+ఐ= పెండ్లి చేసుకోవడానికి; పృథివీ+ఈశులు= భూపతులు,(రాజులు); ఏతెంచి= రాగా; వాఁడికొమ్ములు= మొనదేరిన కొమ్ములు; కలవానిన్= కలిగినవాటిల్ని; వీర= వీరులయొక్క; గంధంబు= వాసన; సోఁకినన్= తగిలితే; కాలు+త్రవ్వెడివానిన్= పొగరుతో కలిచే నేలను రాస్తూ, కయ్యానికి కాలు దువ్వేవాటినీ; అతి= మిక్కిలి; మద= మదంచేత; మత్తంబులు= మత్తెక్కినవి; ఐనవానిన్= అయినవాటిని; గోవృషంబులన్= ఆబోతులను; ఏడింటిన్= ఏడిటిని; కూర్చి= కలిపి; తిగిచి= లాగి; ఎవ్వఁడు= ఏ వీరుడు; పట్టి= పట్టుకొని; కట్టున్= కట్టివేస్తాడో; అతఁడు; కన్యకున్= నాకొమార్తెకు; వరుండు= భర్త; అనినన్= అని చాటగా; వానిన్= ఆ ఆబోతులను; పట్టన్+చాలక= పట్టుకోవడానికి సమర్థులు కాక; ప్రజలు= వచ్చిన జనులు; బెగడి= భయపడి; పోదురు= పోతారు (పోతూ వచ్చారు).

**తా :** పరీక్షిన్మహారాజా! కోసలదేశాన్ని పరిపాలించే నగ్నజిత్తు అనేరాజు ఒక డున్నాడు. అతడు మంచి మనస్సు కలవాడు. ధర్మాన్ని పాటించేవాడు. అతని కొక కూతురుంది. ఆమెపేరు నాగ్నజితి. సద్గుణవతి అయిన ఆమెను వివాహమాడటానికి రాజులు రాగా నగ్నజిత్తు వారితో "వాడి కొమ్ములు కలవీ, వీరుల వాసన తగిలితే చాలు ఎదుర్కొనేవీ, మదించినవీ అయిన ఏడు ఆబోతులను పట్టి బంధించినవాడే నా కొమార్తెకు భర్త అవుతా" దని ప్రకటించాడు. వచ్చినవారు ఆబోతులను పట్టుకొని కట్టివేయలేక భయంతో ఇంటిమొగం పట్టేవారు.

**వ. ఇట్లు గోవృషంబుల జయించినవాఁ డక్కన్యకు వరుం డనిన భగవంతుండైన హరి విని సేనాపరివృతుండై కోసలపురంబునకుం జనినం గోసలాధీశ్వరుండును హరి నెదుర్కొని యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి పీఠంబు సమర్పించి ప్రతివందితుండై యున్నయెడ. 127**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; గోవృషంబులన్= ఆబోతులను; జయించినవాఁడు= గెలిచినవాడు; ఆ+కన్యకున్= ఆ కన్య అయిన నాగ్నజితికి; వరుండు= భర్త; అనినన్= అని నగ్నజిత్తు ప్రకటింపగా; భగవంతుండు; ఐన; హరి= శ్రీకృష్ణుడు; విని; సేనా= సేనచేత; పరివృతుండు+ఐ= చుట్టబడినవాడై, (కూడుకొనినవాడై); కోసలపురంబునకున్= కోసలదేశ రాజధానికి; చనినన్= వెళ్లగా; కోసల+అధీశ్వరుండును= కోసలరాజుకూడా; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; ఎదుర్కొని= ఎదురుగా వచ్చి కలసికొని; అర్ఘ్య= పూజకు తగిన వానిని సమర్పించడం; పాద్య= కాళ్లు కడుక్కోవడానికి కావలసిన నీళ్లివ్వడం; ఆది= మొదలైన; విధులన్= శాస్త్రోక్తాలైన క్రియలతో; పూజించి; పీఠంబు= ఆసనం; సమర్పించి= ఇచ్చి; ప్రతి వందితుండు+ఐ= బదులుగా కొనియాడబడినవాడై; ఉన్న+ఎడన్= ఉన్న సమయాన...

**తా :** ఆబోతులను గెలిచినవాడే నాగ్నజితికి భర్త అవుతాడని, విన్న శ్రీకృష్ణుడు కోసలదేశరాజధానికి సేనతో కూడి వెళ్లాడు. కోసలరాజు నగ్నజిత్తు శ్రీకృష్ణునికి ఎదురువచ్చి శాస్త్రోక్త ప్రకారంగా పూజించాడు. ఆసనం సమర్పించాడు. తర్వాత శ్రీకృష్ణుడు కూడా నగ్నజిత్తును కొనియాడాడు.

**క. ఆ రాజకన్య ప్రియమున, నా రాజీవాక్షు మోహనాకారుఁ ద్రిలో**
**కారాధితు మాధవుఁ దన, కారాధ్యుండైన నాథుఁ డని కోరె నృపా! 128**

**ప్రతి :** నృపా!= రాజా!; ఆ; రాజకన్య= రాచకన్నియ; నాగ్నజితి; ఆ; రాజీవ= పద్మాలవంటి; అక్షున్= కన్నులు కలవాణ్ణి; మోహన= మోహింపజేస్తున్న; ఆకారున్= రూపం కలవాడినీ; త్రిలోక= మూడు లోకములచేత; ఆరాధితున్= సేవింప బడినవానిని; మాధవున్= శ్రీకృష్ణుణ్ణి; ప్రియమునన్= వలపుతో; తనకున్= తనకు; ఆరాధ్యుండు= పూజింపదగినవాడు; ఐన= అయిన; నాథుఁడు= భర్త; అని= భావించి; కోరెన్= కోరింది.

**తా :** పరీక్షిన్మహారాజు! నాగ్నజితి కమలాలవంటి కన్నులు కలవాడూ, మోహం పుట్టించు స్వరూపం కలవాడూ, మూడు లోకాల వారిచేత ఆరాధింపబడినవాడు అయిన శ్రీకృష్ణుణ్ణి తనకు పూజ్యుడగు భర్తగా కోరింది.

**వ. మఱియు న క్కన్యకారత్నంబు తన మనంబున. 129**

**ప్రతి :** మఱియున్= ఇంతేకాకుండా; ఆ; కన్యకారత్నంబు= కన్యలలో శ్రేష్ఠురాలైన నాగ్నజితి; తనమనంబునన్= తన మనస్సులో...

**తా :** మరియూ ఆ ఉత్తమకన్య తనమదిలో

**ఆ. విష్ణుఁ డవ్యయుండు విభుఁడు గావలె నని, నోఁచినట్టి తొంటి నోముఫలము**
**సిద్ధ మయ్యెనేనిఁ జేకొనుఁబో నన్నుఁ, జక్రధరుఁడు వైరిచక్రహరుఁడు. 130**

**ప్రతి :** విష్ణుఁడు= ప్రపంచమంతా వ్యాపించి ఉండేవాడు; అవ్యయుండు= నాశం లేనివాడు; విభుఁడు= భర్త; కావలెన్= కావలెను; అని; నోఁచినట్టి; తొంటి= పూర్వజన్మలోని; నోము= నోముయొక్క; ఫలం; సిద్ధము= ప్రాప్తించింది; అయ్యెన్+ఏనిన్= అయినచో; చక్ర= చక్రాన్ని; ధరుఁడు= ధరించినవాడు; వైరి= శత్రువులయొక్క; చక్ర= సమూహాన్ని; హరుఁడు= సంహరించేవాడు; నన్నున్= నన్ను; చేకొనున్+పో= తప్పక వివాహమాడుతాడు.

**తా :** విశ్వవ్యాపకుడూ, నాశరహితుడూ భర్త కావలెనని నేను పూర్వజన్మంలో చేసిన వ్రతం ఫలిస్తే కనుక శత్రుసంహారకుడు, చక్రధారి అయిన శ్రీకృష్ణుడు తప్పక నన్ను పెండ్లిచేసుకుంటాడు.

**మ. సిరియుం బద్మభవేశదిక్పతులు మున్ సేవించి యెవ్వాని శ్రీ**
**చరణాంభోజపరాగముల్ శిరములన్ సమ్యగ్గతిం దాల్తుఁ రీ**
**ధరణీచక్రభరంబు వాపుటకు నుద్యత్కేళిమూర్తుల్ దయా**
**పరుఁడై యెవ్వఁడు దాల్చు నట్టి హరి యెబ్భంగిం బ్రవర్తించునో! 131**

**ప్రతి :** సిరియున్= లక్ష్మియు; పద్మభవ= కమలంనుండి పుట్టిన బ్రహ్మ; ఈశ= ఈశ్వరుడు; దిక్పతులు= దిక్కులను పాలించేవారు, ఇంద్రుడు మొదలగువారు; మున్= పూర్వం; సేవించి; ఏ+వాని= ఎవనియొక్క; శ్రీ= సంపద కలిగించు; చరణ+అంభోజ= పాదపద్మాలయొక్క; పరాగముల్= ధూళియను పుప్పొడులు; శిరములన్= తలలయందు; సమ్యక్+గతిన్= సక్రమంగా విధిని నిర్వహించునట్లుగా; తాల్తురు (తాల్చుదురు)= ధరింతురో; ఈ; ధరణీచక్ర= భూమండలంయొక్క; భరంబు= భారం; పాపుటకున్= పోగొట్టుటకు; ఎవ్వఁడు= ఎవడు; దయాపరుఁడు+ఐ= మిక్కిలి దయగలవాడై; ఉద్యత్= ఉదయిస్తున్న; కేళి= ఆటకొరకయిన; వేడుకకొరకా అన్నట్లు; మూర్తుల్= రూపాలను; తాల్చున్= ధరించునో; అట్టి హరి= అట్టి శ్రీకృష్ణుడు; ఏ+భంగిన్= ఏ విధంగా; ప్రవర్తించున్+ఓ!= వ్యవహరించునో!

**తా :** లక్ష్మి, బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలగు దిక్పాలకులు ఎవని పాదధూళిని శిరస్సులపై ధరిస్తారో, ఎవడు భూభారాన్ని తొలగించుటకై వినోదంకొరకు అవతారాలెత్తుతాడో అలాంటి శ్రీకృష్ణుడు నాపట్ల ఏ విధంగా నడచుకొంటాడో?

**వ. అని యిట్లు నాగ్నజితి విచారించు నెడఁ గృష్ణుం డా రాజుం జూచి మేఘగంభీరనినదంబున నిట్లనియె. 132**

**ప్రతి :** అని; ఇట్లు; నాగ్నజితి; విచారించు+ఎడన్= ఆలోచిస్తున్న సమయంలో; కృష్ణుండు; ఆ రాజున్= నగ్నజిత్తును; చూచి; మేఘ= మేఘంయొక్క; గంభీర= గంభీరమయిన; నినదంబునన్= ధ్వనితో; ఇట్లు; అనియెన్= చెప్పాడు...

**తా :** ఈ విధంగా నాగ్నజితి ఆలోచిస్తూ ఉండగా శ్రీకృష్ణుడు నగ్నజిత్తును చూచి మేఘగంభీర స్వరంతో ఈ రీతిగా అన్నాడు.

**క. అన్యుల యాచింపరు రా, జన్యులు సౌజన్యకాంక్షఁ జనుదెంచితి నీ**
**కన్యన్ వేఁడెద నిమ్మా!, కన్యాశుల్కదుల మేము గాము నరేంద్రా! 133**

**ప్రతి :** నర+ఇంద్రా!= రాజా!; రాజన్యులు= రాజకుమారులు; అన్యులన్= ఇతరులను; యాచింపరు= ఇమ్మని అడుగరు; సౌజన్య= మంచితనంతో కూడిన; కాంక్షన్= కోరికతో; చనుదెంచితిన్= వచ్చితిని; కన్యన్= నీ పుత్రికను; వేఁడెదన్= కోరెదను; ఇమ్ము+ఆ= నాతో పెండ్లిచేయుమయ్యా!; ఏము= మేము; కన్యా= కన్యకొరకు; శుల్కదులము= శుల్కాన్ని ఇచ్చేవాళ్లం; (కన్యను వివాహమాడునపుడు వెలగా ఎదురిచ్చు సొమ్ము కన్యాశుల్కము); కాము.

**తా :** రాజా! క్షత్రియపుత్రులు ఇతరులను ఏమియూ అడుగరు. మంచితనంతో వచ్చాను. నీ కొమార్తెను కోరుచున్నాను. నాకిచ్చి పెండ్లి చేయవయ్యా! కాకపోతే మేము కన్యాశుల్కం ఇచ్చేవాళ్లం కాము సుమా!

**విశే :** ఇందులో ఆనాటి కన్యాశుల్క సంప్రదాయమూ శ్రీకృష్ణుని వ్యక్తిత్వం వ్యక్తమౌతున్నాయి.

**వ. అనిన రాజిట్లనియె. 134**

**తా :** అని శ్రీకృష్ణుడు పలుకగా నగ్నజిత్తు ఇట్లన్నాడు.

**శా. కన్యం జేకొన నిన్నిలోకముల నీకన్నన్ ఘనుండైన రా**
**జన్యుం డెవ్వఁడు? నీ గుణంబులకు నాశ్చర్యంబునుం బొంది తా**
**నన్యారంభము మాని లక్ష్మి భవదీయాంగంబునన్ నిత్యయై**
**ధన్యత్వంబునుఁ జెంది యున్నది గదా తాత్పర్యసంయుక్తయై. 135**

**ప్రతి :** ఇన్నిలోకములన్= సమస్త లోకాలలో; కన్యన్= నా పుత్రికను; చేకొనన్= వివాహమాడటానికి; నీకన్నన్= నీకంటె; ఘనుండు+ఐన= గొప్పవాడైన; రాజన్యుండు= రాజపుత్రుడు; అన్యుండు= ఇతరుడు; ఎవ్వఁడు?= ఎవడున్నాడు?; లక్ష్మి; తాన్= తాను; నీ గుణంబులకున్= నీ సద్గుణాలకు; ఆశ్చర్యంబునున్= ఆశ్చర్యాన్ని; పొంది; అన్య= ఇతరమైన; ఆరంభము= ప్రయత్నం; మాని= వదలి; భవదీయ= నీయొక్క; అంగంబునన్= శరీరంలో; ఎదురు రొమ్మునందు; తాత్పర్య= ఆసక్తితో; సంయుక్త+ఐ= కూడుకొన్నదై; నిత్య+ఐ= ఎల్లప్పుడు ఉండేదై; ధన్యత్వంబును= కృతార్థతను; చెంది+ఉన్నది+కదా= పొంది ఉన్నది కదా!.

**తా :** ఈ పదునాల్గు లోకాలలో నాకొమార్తెను వివాహమాడుటకు నీకంటె గొప్పవాడు ఇంకొకడు ఎవడున్నాడు? నీ కల్యాణ గుణాలకు ఆశ్చర్యపడి లక్ష్మి ఇతర ప్రయత్నాలకు స్వస్తి చెప్పి, నీయందే ఆసక్తి కలిగి, నీ వక్షఃస్థలంలో అనపాయినియై (విడువనిదై) కృతార్థురాలైనది గదా!

**శా. చంచద్గోవృషసప్తకంబుఁ గడిమిన్ సైరించి యెవ్వాఁడు భం**
**జించున్ వానికిఁ గూఁతు నిత్తు నని యేఁ జీరించినన్ వైభవో**
**దంచద్గర్వులు వచ్చి రాజతనయుల్ తత్పాదశృంగాహతిం**
**గించిత్కాలము నోర్వ కేగుదు రనిం గేడించి భిన్నాంగులై. 136**

**ప్రతి :** చంచత్= చెలరేగుచున్న; గోవృష= ఆబోతుల; సప్తకంబున్= ఏడింటిని; కడిమిన్= మహాబలంతో; సైరించి= ఓర్చుకొని; ఏ+వాఁడు= ఎవడు; భంజించున్= భంగపెట్టాడో, లొంగదీయునో; వానికిన్= ఆ వీరునికి; కూఁతున్= కొమార్తెను, నాగ్నజితిని; ఇత్తున్ (ఇచ్చుదున్)= ఇచ్చి పెండ్లి చేస్తాను; అని= చాటి; ఏన్= నేను; చీరించినన్= పిలిపింపగా; వైభవ=

బలంచేత; ఉదంచత్= అతిశయిస్తున్న; గర్వుల్= గర్వం కలవారు; రాజతనయుల్= రాజకుమారులు; వచ్చి; అనిన్= యుద్ధంలో; తత్= ఆ ఆబోతులయొక్క; పాద= కాళ్ళతోడి; శృంగ= కొమ్ములతోడి; ఆహతిన్= దెబ్బలచేత; భిన్న= చీల్చబడిన; అంగులు+ఐ= శరీరాలు కలవారై; కించిత్+కాలము= కొంచెంసేపయినా; ఓర్వక= నిలువలేక; కేడించి= యుద్ధంనుండి తొలగి; ఏగుదురు= పోతారు.

**తా :** ఎవడు పొగరు కలిగిన ఆబోతులు ఏడింటివిజృంభణాన్ని ఓర్చుకొని, వాటిల్ని గెలుస్తాడో, ఆ శూరునికి నా పుత్రికను ఇస్తానని నేను బలగర్వులయిన రాజకుమారులను రప్పించాను. వారు ఆ ఆబోతుల కాళ్లతన్నులకూ, కొమ్ములపోటులకూ కొంచెంసేపయినా పోరాటంలో నిలబడలేక దెబ్బతిన్న శరీరాలతో వైదొలగిపోతారు.

**శా. ఉష్ణాంశుండు తమంబుఁ దోలుక్రియ నీ వుగ్రాహవక్షోణిలోఁ**
**గృష్ణా! వైరులఁ దోలినాఁడవు, రణక్రీడావిశేషంబులన్**
**నిష్ణాతుండవు, సప్తగోవృషములన్ నేఁ డాజి భంజించి రో**
**చిష్ణుత్వంబున వచ్చి చేకొనుము మా శీతాంశుబింబాననన్. 137**

**ప్రతి :** కృష్ణా!= శ్రీకృష్ణా!; ఉష్ణ+అంశుండు= వేడికిరణాలు కలవాడు; సూర్యుడు; తమంబున్= చీకటిని; తోలుక్రియన్= పారదోలు రీతిగా; నీవు; ఉగ్ర= భయంకరమైన; ఆహవక్షోణిలోన్= యుద్ధభూమిలో; వైరులన్= శత్రువులను; తోలినాఁడవు= పారదోలితివి; రణక్రీడా విశేషంబులన్= అసాధారణమయిన యుద్ధక్రీడలలో; నిష్ణాతుండవు=నేర్పరివి; నేఁడు; ఆజిన్= యుద్ధంలో; సప్తగోవృషములన్= ఆబోతులను ఏడింటిని; భంజించి= భంగపరిచి; రోచిష్ణుత్వంబునన్= ప్రకాశించేవాని లక్షణంతో వచ్చి; మా; శీత+అంశు= చల్లని కిరణాలు గల వానియొక్క; చంద్రుని యొక్క; బింబ= బింబంవంటి; ఆననన్= ముఖం కలదాన్ని; చేకొనుము= పెండ్లిచేసుకో.

**తా :** శ్రీకృష్ణా! సూర్యుడు చీకట్లను పారదోలినట్లు నీవు భయంకరమయిన యుద్ధంలో శత్రువుల్ని తరిమివేశావు. అసామాన్యమయిన రణచాతుర్యం కలవాడివి. ఇప్పుడు ఏడు ఆబోతులను పోరాటంలో జయించి ప్రకాశిస్తున్నవాడివై మా పుత్రికను పెండ్లిచేసుకో!

**వ. అని నగ్నజిత్తు తన కూఁతు వివాహంబునకుం జేసిన సమయంబు సెప్పిన విని. 138**

**ప్రతి :** అని; నగ్నజిత్తు; తన కూఁతు వివాహంబునకున్= తన కూతురు పెండ్లికి; చేసిన= పెట్టిన; సమయంబు= నియమం; చెప్పినన్= చెప్పగా; విని...

**తా :** అని నగ్నజిత్తు తన కూతురు పెండ్లికి విధించిన కట్టుబాటు చెప్పగా విని

**చ. కనియె నఘారి వత్సబకకంసవిదారి ఖలప్రహారి దా**
**ఘనతరకిల్బిషంబుల నగణ్యభయంకరపౌరుషంబులన్**
**సునిశితశృంగనిర్దళితశూరసమూహముఖామిషంబులన్**
**హననగుణోన్మిషంబుల మహాపరుషంబుల గోవృషంబులన్. 139**

**ప్రతి :** అఘ= అఘుడనే రాక్షసునికి; అరి= శత్రువు; వత్స= వత్సాసురుణ్ణి; బక= బకాసురుణ్ణి; కంస= కంసుణ్ణి; విదారి= చీల్చినవాడు; ఖల= దుష్టుల్ని; ప్రహారి= దెబ్బదీసేవాడు అగు శ్రీకృష్ణుడు; తాన్= తాను; ఘనతర= అత్యధికంగా; కిల్బిషంబులన్= పాపాలుకల (చేయు) వాటినీ; అగణ్య= లెక్కింపరాని; భయంకర= భయాన్ని కలిగించే; పౌరుషంబులన్= పరాక్రమం కలవాటినీ; సునిశిత= మిక్కిలివాడియైన; శృంగ= కొమ్ములచేత; నిర్దళిత= చీల్చబడిన; శూరసమూహ= వీరుల సమూహంయొక్క; ముఖ= ముఖాలలోని; ఆమిషంబులన్= మాంసములు – కండలు కలవాటినీ; హనన= చంపుట అనే; గుణ= గుణంచేత; ఉన్మిషంబులన్= వికాసం పొందువాటినీ; మహత్= మిక్కిలి; పరుషంబులన్= క్రూరాలైన వాటిని; గోవృషంబులన్= ఆబోతులను; కనియెన్= చూచాడు.

**తా :** అఘాసురునికి శత్రువూ, వత్సబకాసురులనూ, కంసుణ్ణీ సంహరించినవాడూ; దుష్టులను దండించినవాడూ, అయిన శ్రీకృష్ణుడు ఆబోతులను చూచాడు. ఆ ఆబోతులు పాపకార్యాలు చేసేవి. అవి ఇంతింతనరాని పరాక్రమం కలిగినవి. వాడియైన కొమ్ములతో పరాక్రమవంతుల ముఖాలమీది కండలను పీకివేసేవి. మారణకార్యాలు స్వభావంగా చెలరేగేవి. మహాక్రూరా లైనవి.

**ఉ. చేలము చక్కఁ గట్టుకొని చిత్రగతిన్ వడి నేడుమూర్తులై**
**బాలుఁడు దారురూపములఁ బట్టెడు కైవడిఁ బట్టి వీర శా**
**ర్దూలుఁడు గ్రుద్ది నేలఁ బడఁ ద్రోచి మహోద్ధతిఁ గట్టి యీడ్చె భూ**
**పాలకు లెల్ల మెచ్చ వృషభంబులఁ బర్వతసన్నిభంబులన్. 140**

**ప్రతి :** వీర శార్దూలుఁడు= వీరులలో శ్రేష్ఠుడయిన శ్రీకృష్ణుడు; చేలము= వస్త్రాన్ని; చక్కన్= చక్కగా, బిగిసేటట్లుగా; కట్టుకొని= నడుముకు కట్టుకొని; చిత్ర= వింత అయిన; గతిన్= రీతిగా; ఏడుమూర్తులు+ఐ= ఏడురూపాలు ధరించినవాడై; భూపాలకులు+ఎల్లన్= రాజులందరూ; మెచ్చన్= పొగడునట్లుగా; బాలుఁడు; దారురూపములన్= కొయ్యబొమ్మలను; పట్టెడు కైవడిన్= పట్టుకొనేటట్లు; పర్వత= పర్వతాలతో; సన్నిభంబులన్= సమానమైనవాటిని; వృషభంబులన్= ఆబోతులను; పట్టి= పట్టుకొని; గ్రుద్ది; నేలన్= భూమిమీద; పడన్= పడేటట్లుగా; త్రోచి= నెట్టి; మహత్= అధికమయిన; ఉద్ధతిన్= సంరంభంతో; కట్టి= బంధించి; ఈడ్చెన్= ఈడ్చాడు.

**తా :** శ్రీకృష్ణుడు నడుముకు వస్త్రం బిగించి కట్టుకొని, ఏడురూపాలు ధరించి, బాలకుడు ఏడుచెక్కబొమ్మలను పట్టుకొన్నట్లుగా, కొండలవంటి ఆబోతులను పట్టుకొని, గ్రుద్ది నేలమీద పడేటట్లు త్రోచి రాజులు మెచ్చగా ఈడ్చాడు.

**వ. ఇట్లు వృషభంబుల నన్నింటినిం గట్టి యీడ్చినం జూచి హరికి నగ్నజిత్తు నాగ్నజితి నిచ్చిన విధివత్ప్రకారంబునం బెండ్లి యయ్యె, నా రాజసుందరు లానందంబును బొంది, రా సమయంబున బ్రాహ్మ ణాశీర్వాదంబులును, గీత పటహ శంఖ కాహళ భేరీ మృదంగ నినదంబులును జెలంగె, నంత నా కోసలేంద్రుండు దంపతుల రథారోహణంబు సేయించి పదివేల ధేనువులును, విచిత్రాంబరాభరణభూషితలైన యువతులు మూఁడువేలును, దొమ్మిదివేల గజంబులును, గజంబులకు శతగుణంబులైన రథంబులును, రథంబులకు శతగుణంబులైన హయంబులును, హయంబులకు శతగుణాధికంబైన భటసమూహంబును నిచ్చి పుత్తెంచిన వచ్చునప్పుడు. 141**

**ప్రతి :** ఇట్లు; వృషభంబులన్= ఆబోతులను; అన్నింటినిన్= అన్నిటినీ, ఏడిటినీ; కట్టి; ఈడ్చినన్= లాగగా; చూచి; హరికిన్= శ్రీకృష్ణునికి; నగ్నజిత్తు; నాగ్నజితిన్= నాగ్నజితిని; ఇచ్చినన్= అర్పించగా; విధివత్+ప్రకారంబునన్= శాస్త్రపద్ధతిని; పెండ్లి+అయ్యెను; ఆ; రాజసుందరులు= రాజపత్నులు; ఆనందంబును; పొందిరి; ఆ సమయంబున; బ్రాహ్మణ= బ్రాహ్మణుల యొక్క; ఆశీర్వాదంబులును= దీవనలును; గీత= పాటల; పటహ= తప్పెటల; శంఖ= శంఖాల; కాహళ= బాకాల; భేరీ= నగారాల; మృదంగ= మద్దెలల; నినదంబులును= ధ్వనులును; చెలంగెన్= అతిశయించాయి; అంతన్= తరువాత; ఆ; కోసల+ఇంద్రుండు= నగ్నజిత్తు; దంపతులన్= నాగ్నజితిని; శ్రీకృష్ణుణ్ణీ; రథ+ఆరోహణంబు+చేయించి= రథమెక్కించి; పదివేల ధేనువులును= పదివేల ఆవులును; విచిత్ర= వింతవింతలయిన; అంబర= వస్త్రాలచేత; ఆభరణ= నగలచేత; భూషితలు= అలంకరింపబడినవారు; ఐన; యువతులు; మూఁడువేలును= మూడువేలమందిని; తొమ్మిదివేల గజంబులును= తొమ్మిదివేల ఏనుగులును; గజంబులకున్= ఏనుగులకంటె; శతగుణంబులు+ఐన= నూరురెట్లు ఎక్కువఅయిన; రథంబులును; రథంబులకున్= రథములకంటె; శతగుణంబులైన= నూరురెట్లు అధికమైన; హయంబులును= గుఱ్ఱాలను; హయంబులకున్= గుఱ్ఱాలకంటె; శతగుణ+అధికంబు+ఐన= నూరురెట్లు ఎక్కువయిన; భట= భటుల; సమూహంబును; ఇచ్చి= కానుకగా సమర్పించి; పుత్తెంచినన్= పంపగా; వచ్చు+అప్పుడు= (శ్రీకృష్ణుడు నాగ్నజితితో కూడి ద్వారకకు) వచ్చే సమయాన...

**తా :** ఈ విధంగా ఆబోతులను పట్టి కట్టి ఈడ్చిన శ్రీకృష్ణునికి నగ్నజిత్తు తన కొమార్తెను నాగ్నజితిని ఇచ్చి పెండ్లిచేశాడు. శ్రీకృష్ణుడు అల్లుడయినందులకు రాణులు సంతోషించారు. ఆ సమయంలో బ్రాహ్మణులదీవనలూ, వివిధవాద్యాల ధ్వనులూ అతిశయించాయి. నగ్నజిత్తు నూతనదంపతులను రథమెక్కించి సాగనంపాడు. అతడు పదివేల ఆవులనూ, విచిత్రమయిన వస్త్రాభరణాలు ధరించిన మూడువేలమంది యువతులనూ, తొమ్మిదివేల ఏనుగులనూ, వాటికంటె నూరురెట్లు ఎక్కువయిన రథాలనూ, రథాలకంటె నూరు రెట్లు అధికమయిన గుఱ్ఱాలనూ, గుఱ్ఱాలకంటె నూరురెట్లు మించిన వీరభటులనూ కట్నంగా సమర్పించాడు. శ్రీకృష్ణుడు నాగ్నజితితో కూడి ద్వారకకు వెళ్లేటప్పుడు

**ఉ. భూతి యెలర్పఁ గోసలునిపుత్త్రికకై చనుదెంచి తొల్లి యాఁ**
**బోతులచేత నోటువడి పోయిన భూపతులెల్ల మాధవుం**
**డా తరుణిన్ వరించుట చరావలిచే విని త్రోవ సైన్య సం**
**ఘాతముతోడఁ దాఁకి రరిగర్వవిమోచనుఁ బద్మలోచనున్. 142**

**ప్రతి :** తొల్లి= ఇంతకు ముందు; భూతి= ఐశ్వర్యం; ఎలర్పన్= అతిశయింపగా, కోసలుని= కోసలదేశపురాజుయొక్క, నగ్నజిత్తుయొక్క; పుత్త్రికకై= కూతురు నాగ్నజితికోసం; చనుదెంచి - వచ్చి; ఆఁబోతులచేతన్= ఆబోతులచేత; ఓటువడి= అపజయం పొంది; పోయిన= తమ తమ రాజ్యాలకు వెళ్లిన; భూపతులు= రాజులు; ఎల్లన్= అందరునూ; మాధవుండు= శ్రీకృష్ణుడు; ఆ తరుణిన్= ఆ యువతిని, నాగ్నజితిని; వరించుట= పెండ్లాడుట; చర= గూఢచారుల; ఆవలిచేన్= సమూహంచేత; విని; త్రోవన్= ద్వారకకు వెళ్లేదారిలో; అరి= శత్రువుల; గర్వ= గర్వాన్ని; విమోచనున్= పోగొట్టేవాడిని; పద్మలోచనున్= కమలాలవంటి కన్నులుగలవాణ్ణి, శ్రీకృష్ణుణ్ణి; సైన్య= సైన్యాల; సంఘాతముతోడన్= సమూహంతో; తాఁకిరి= ఎదుర్కొన్నారు.

**తా :** ఇంతకు ముందు నాగ్నజితిని వివాహం చేసికోవాలని వచ్చి, ఆబోతులచేత ఓడిపోయి, వెళ్లినరాజులందరూ శ్రీకృష్ణుడామెను పెండ్లాడె నని గూఢచారులద్వారా విని, దారిలో శత్రువులపొగరు అణచివేసే అతణ్ణి ఎదుర్కొన్నారు.

**ఉ. దండి నరాతు లెల్ల హరిఁ దాఁకిన నడ్డము వచ్చి వీఁకతో**
**ఖండనభూమియందుఁ దన బాంధవు లెల్లను సన్నుతింపఁగా**
**గాండివచాపముక్తవిశిఖంబుల వైరుల నెల్లఁ జంపె నా**
**ఖండలనందనుండు శశకంబుల సింహము చంపుకైవడిన్. 143**

**ప్రతి :** అరాతులు+ఎల్లన్= శత్రువు లందరునూ; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; దండిన్= శౌర్యంతో; తాఁకినన్= ఎదుర్కొనగా; ఆఖండల= ఇంద్రునియొక్క; నందనుండు= కుమారుడు; అర్జునుడు; అడ్డమువచ్చి= అడ్డంగా నిల్చి; వీఁకతోన్= పరాక్రమంతో; ఖండనభూమి+అందున్= యుద్ధభూమిలో; గాండివ= గాండివమనే; చాప= ధనుస్సునుండి; ముక్త= విడువబడిన; విశిఖంబులన్= బాణాలతో; శశకంబులన్= కుందేళ్లను; సింహము; చంపుకైవడిన్= చంపునట్లుగా; తనబాంధవులు= తనచుట్టాలు; ఎల్లను= అందరునూ; సన్నుతింపన్+కాన్= పొగడగా; వైరులన్= శత్రువులను; ఎల్లన్= అందరినీ; చంపాడు.

**తా :** శత్రువులయిన రాజులందరూ ప్రతాపంతో శ్రీకృష్ణుణ్ణి ఎదిరించారు., అప్పుడు అర్జునుడు అడ్డుపడి రణరంగంలో గాండీవంనుండి వదలిన బాణాలతో సింహం కుందేళ్లను చంపేటట్లు బంధువులందరూ స్తుతింపగా శత్రువులనందరినీ సంహరించాడు.

**వ. ఇట్లు హరి నాగ్నజితిం బెండ్లియై యరణంబులు పుచ్చుకొని, ద్వారకానగరంబునకు వచ్చి సత్యభామ తోడం గ్రీడించుచుండె; మఱియును. 144**

**ప్రతి :** ఇట్లు; హరి= శ్రీకృష్ణుడు; నాగ్నజితిన్; పెండ్లి+ఐ= పెండ్లిచేసుకొని; అరణంబులు= కట్నాలు; వివాహ సమయంలో వధూవరులకు ఇచ్చేధనం మొదలైనవి; పుచ్చుకొని= స్వీకరించి; ద్వారకానగరంబునకున్= ద్వారకా నగరానికి; వచ్చి; సత్యభామతోడన్= సత్యభామతో; క్రీడించుచున్+ఉండెన్= విహరిస్తూ ఉండినాడు; మఱియును= తరువాత...

**తా :** శ్రీకృష్ణుడు ఈ విధంగా నాగ్నజాతిని వివాహమాడి కట్నాలూ, కానుకలూ తీసుకొని ద్వారకకు వచ్చి సత్యభామతో వినోదిస్తున్నాడు. ఆ పిమ్మట

**మ. జనవంద్యన్ శ్రుతకీర్తి నంద్యఁ దరుణిన్ సందర్శనక్షోణిపా**
**ద్యనుజన్ మేనమఱందలిన్ విమలలోలాపాంగఁ గై కేయి ని**
**ద్ధ నయోన్నిద్రఁ బ్రపూర్ణసద్గుణసముద్రన్ భద్ర నక్షుద్ర నా**
**వనజాతాక్షుఁడు పెండ్లియాడె నహితవ్రాతంబు భీతిల్లఁగన్. 145**

**ప్రతి :** ఆ; వనజాత= నీటినుండి పుట్టిన పద్మాలవంటి; అక్షుఁడు= కన్నులుండేవాడైన ఆ శ్రీకృష్ణుడు; జన= జనులచేత; వంద్యన్= పొగడదగిన దాన్ని; శ్రుతకీర్తి= తల్లి అయిన శ్రుతకీర్తిచే; నంద్యన్= సంతోషపెట్టబడేది; తరుణిన్= యువతిని; సందర్శన= సందర్శనుడనే; క్షోణిప= రాజు; ఆది= మొదలైన వారియొక్క; అనుజన్= తోబుట్టువును; మేనమఱందలిన్= మేనత్తకూతురు; విమల= నిర్మలమయిన; లోల= చలిస్తున్న; అపాంగన్= కడకన్నులు కలదాన్ని; కైకేయిన్= కేకయ రాజపుత్రికను; ఇద్ధ= అడ్డులేని; నయ= నీతివిషయంలో; ఉన్నిద్రన్= జాగరూకత కలదాన్ని; ప్రపూర్ణ= సంపూర్ణమైన; సద్గుణ= మంచిగుణాలకు; సముద్రన్= సముద్రమయిన దాన్ని; అక్షుద్రన్= ఉత్తమురాలిని; భద్రన్= భద్ర అనేపేరు గలదాన్ని; అహిత= శత్రువుల; వ్రాతంబు= సమూహం; భీతిల్లన్+కన్= భయపడగా; పెండ్లి+ఆడెన్= వివాహమాడాడు.

**తా :** శ్రీకృష్ణుడు వైరులు భీతిచెందగా భద్రను పెండ్లిచేసికొన్నాడు. భద్ర శ్రీకృష్ణుని మేనత్త అయిన శ్రుతకీర్తికీ, కేకయరాజుకూ కూతురు. సందర్శన రాజు మున్నగువారి సోదరి. ఆమె జనులు స్తుతింపదగింది. తల్లిచేత సంతోషపెట్టబడేది. యౌవనవతి. నిర్మలాలై చలించే కంటికొనలు కలదీ, నీతిపట్ల జాగ్రత్త కలదీ, అపారమైన సద్గుణాలు కలదీ అయిన ఉత్తమురాలు.

**వ. మఱియును. 146**

**తా :** తరువాత

**చ. అమరులఁ బాఱఁ దోలి భుజగాంతకుఁడైన ఖగేశ్వరుండు ము**
**న్నమృతముఁ దెచ్చుకైవడి మదాంధుల రాజుల నుక్కడంచి యా**
**కమలదళాయతేక్షణుఁడు గైకొని తెచ్చెను మద్రకన్యకన్**
**సమదమృగేక్షణన్ నయవిచక్షణ లక్షణఁ బుణ్యలక్షణన్. 147**

**ప్రతి :** ఆ; కమలదళ= తామరరేకులవంటి; ఆయత= విశాలమైన; ఈక్షణుఁడు= కన్నులుండేవాడు, శ్రీకృష్ణుడు; మున్ను= పూర్వం; భుజగ= పాములకు; అంతకుఁడు= యముడు; ఐన; ఖగ+ఈశ్వరుండు= పక్షిరాజు, గరుత్మంతుడు; అమరులన్= దేవతలను; పాఱన్+తోలి= పారిపోయేట్టుగా తరిమి; అమృతమున్; తెచ్చుకైవడిన్= తెచ్చినట్లు; మద= పొగరుచేత; అంధులన్= కన్నుగాననివారిని; రాజులన్= రాజులను; ఉక్కు+అడంచి= బలహీనుల్ని చేసి; సమద= మదంతో కూడిన; మృగ= లేడికన్నులవంటి; ఈక్షణన్= కన్నులుగల దాన్ని; నయ= నీతివిషయంలో; విచక్షణన్= సమయోచితంగా ప్రవర్తించేది; పుణ్య= శుభాలను కలిగించే; లక్షణన్= మంచి నడవడిక గలదాన్ని; మద్ర= మద్రరాజు యొక్క; కన్యకన్= కొమార్తెను; లక్షణన్= లక్షణ అనే ఆమెను; కైకొని+తెచ్చెన్= పరిగ్రహించి తెచ్చాడు.

**తా :** శ్రీకృష్ణుడు, దేవతలను తరిమి పాములపాలిటి యముడయిన గరుత్మంతుడు అమృతం తెచ్చినట్లుగా, పొగరెక్కి మిన్నూ మన్నూ కానని రాజులను జయించి, మద్రరాజకుమారిని లక్షణను పరిగ్రహించి తెచ్చాడు. లక్షణ మదించిన లేడి కన్నులవంటి కన్నులు కలది. నీతి వివేకం కలది. శుభప్రదమైన లక్షణాలు కలది.

**వ. ఇట్లు హరికి రుక్మిణియు, జాంబవతియు, సత్యభామయుఁ, గాళిందియు, మిత్రవిందయు, నాగ్నజితియు, భద్రయు, మద్రరాజనందనయైన లక్షణయు ననంగ నెనమండ్రు భార్య లైరి, మఱియు నరకాసురుని వధియించి తన్నిరుద్ధకన్యల షోడశసహస్రకన్యల రోహిణి మొదలైనవారిం బరిగ్రహించె నని విని. 148**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; హరికిన్= కృష్ణునికి; రుక్మిణియున్, జాంబవతియున్, సత్యభామయున్, కాళిందియున్, మిత్రవిందయున్, నాగ్నజితియున్, భద్రయున్, మద్రరాజనందన ఐన లక్షణయు అనంగాన్ ఎనమండ్రు భార్యలు= ఎనిమిది మంది భార్యలు; ఐరి; మఱియును= ఇంకను; నరకాసురుణ్ణి; వధియించి= చంపి; తద్= అతనిచేత; నిరుద్ధ= చెరపెట్టబడిన; కన్యలన్= స్త్రీలను; షోడశసహస్ర= పదారువేలమంది; కన్యలన్= పెండ్లికానివారిని, రోహిణి మొదలైనవారిని; పరిగ్రహించెన్= స్వీకరించాడు; అని= అని చెప్పగా...

**తా :** ఈ విధంగా రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ లనే వారు శ్రీకృష్ణునికి అష్టమహిషులయ్యారు. తరువాత నరకాసురుణ్ణి చంపి, అతడు చెరసాలలో పెట్టిన పదారువేలమంది కన్యలనూ, రోహిణి మొదలగువారినీ; శ్రీకృష్ణుడు స్వీకరించాడు – అని చెప్పగా విని

**క. ధరకుం బ్రియనందనుఁ డగు, నరకుని హరి యేల చంపె? నరకాసురుఁ డా**
**వరకుంతల లగు చామీ, కరకుంభస్తనుల నేల కారం బెట్టెన్? 149**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; ధరకున్= భూదేవికి; ప్రియనందనుఁడు= ముద్దుబిడ్డ; అగు= అయిన; నరకునిన్= నరకాసురుణ్ణి; ఏల= ఎందువల్ల; చంపెన్= చంపాడు; నరక+అసురుఁడు; ఆ; వర= శ్రేష్ఠమైన; కుంతలలు= తలవెంట్రుకలుకలవారు; అగు= అయిన; చామీకరకుంభ= బంగారు కుండలవంటి; స్తనులన్= చన్నులు కలవారిని; ఏల= ఏ కారణంచేత; కారన్= చెరసాలలో; పెట్టెన్= పెట్టాడు?

**తా :** శ్రీకృష్ణుడు భూదేవికి గారాబుబిడ్డ అయిన నరకాసురుణ్ణి ఏ కారణంచేత సంహరించాడు? నరకాసురుడు సౌందర్యవతులయిన ఆ యువతులను ఏ కారణంగా చెరసాలలో పెట్టాడు?

**వ. అనిన నరేంద్రునకు మునీంద్రుం డిట్లనియె, నరకాసురునిచేత నదితికర్ణకుండలంబులును, వరుణచ్ఛత్త్రంబును, మణిపర్వత మనియెడు నమరాద్రిస్థానంబును గోలుపడుటయు నింద్రుండు వచ్చి హరికి విన్నవించిన హరి నరకాసురవధార్థంబు గరుడవాహనారూఢుండై చను సమయంబున హరికి సత్యభామ యిట్లనియె. 150**

**ప్రతి :** అనిన= పలికిన; నర+ఇంద్రునకున్= రాజుకు, పరీక్షిన్మహారాజుకు; ముని+ఇంద్రుండు= శుకమహర్షి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు; అదితి; నరకాసురునిచేతన్= నరకాసురునివల్ల; కర్ణకుండలంబులును= చెవుల ఆభరణాలును; వరుణ= వరుణుని; ఛత్రంబును= గొడుగును; మణిపర్వతము; అనియెడు= అనేపేరుగల; అమర+అద్రి= మేరు పర్వతంయొక్క; స్థానంబును= ప్రదేశాన్ని; కోలుపడుటయున్= పోగొట్టుకోవడాన్ని; ఇంద్రుండు; వచ్చి; హరికిన్= శ్రీకృష్ణునికి; విన్నవించినన్= మనవిచేయగా; హరి= శ్రీకృష్ణుడు; నరకాసుర+వధ+అర్థంబు= నరకాసురుణ్ణి చంపడం కోసం; గరుడవాహన= వాహనమైన గరుత్మంతుణ్ణి; ఆరూఢుండు+ఐ= ఎక్కినవాడై; చను సమయంబునన్= వెళ్ళేటప్పుడు; హరికిన్= శ్రీకృష్ణునితో; సత్యభామ; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= అనింది.

**తా :** శుకమహాముని పరీక్షిత్తుతో ఇట్లా అన్నాడు. అదితి నరకాసురుని మూలంగా చెవికమ్మలూ, వరుణునిగొడుగూ, మేరుపర్వతభాగమయిన మణిపర్వతమూ కోల్పోగా – ఇంద్రుడు వచ్చి శ్రీకృష్ణునికి విజ్ఞప్తిచేశాడు. శ్రీకృష్ణుడు గరుత్మంతుణ్ణి ఎక్కి, నరకాసురుణ్ణి సంహరించటానికి బయలుదేరాడు. అప్పుడు సత్యభామ అతనితో ఈ విధంగా పలికింది.

## ❖ శ్రీకృష్ణుఁడు సత్యభామతోఁ గూడ నరిగి నరకాసురుని వధించుట ❖

**శా. 'దేవా! నీవు నిశాటసంఘముల నుద్దీపించి చెండాడ నీ**
**ప్రావీణ్యంబులు సూడఁ గోరుదుఁ గదా! ప్రాణేశ! మన్నించి న**
**న్నీ వెంటం గొనిపొమ్ము నేఁడు కరుణన్, నేఁ జూచి యేతెంచి నీ**
**దేవీసంహతి కెల్లఁ జెప్పుదు భవద్దీప్తప్రతాపోన్నతుల్,' 151**

**ప్రతి :** దేవా!= స్వామీ!; ప్రాణ+ఈశ!= ప్రాణేశ్వరా!; నీవు; ఉద్దీపించి= చెలరేగి; నిశాట= రాక్షసులయొక్క; సంఘములన్= సమూహాలను; చెండాడన్= చంపగా; నీ; ప్రావీణ్యంబులు= నేర్పులు; చూడన్= చూడాలని; కోరుదున్+కదా!= కోరుతూ ఉంటాను కదా!; నేఁడు= ఇప్పుడు; కరుణన్= దయతో; మన్నించి= గౌరవించి; నన్= నన్ను; నీవెంటన్= నీతో; కొనిపొమ్ము= తీసుకొని పొమ్ము; నేన్= నేను; భవత్= నీయొక్క; దీప్త= ప్రకాశించే; ప్రతాప= ప్రతాపంయొక్క; ఉన్నతుల్= ఔన్నత్యాలను; చూచి; ఏతెంచి= వచ్చి; నీ= నీయొక్క; దేవీ= ప్రియపత్నుల; సంహతికిన్= బృందానికి; ఎల్లన్= అందరికి; చెప్పుదున్= చెబుతాను.

**తా :** స్వామీ! ప్రాణనాయకా! నీవు విజృంభించి రాక్షసగణాలను సంహరిస్తుండగా నీ యుద్ధచాతుర్యాన్ని చూడాలని కోరుకుంటానుగదా! ఇప్పుడు నన్నుమన్నించి నీవెంట తీసుకొనివెళ్లు. యుద్ధంలో వెల్లడయిన నీ ప్రతాపాధిక్యాలను చూచివచ్చి నీదేవేరుల కందరికీ ప్రకటిస్తాను.

**వ. అనినఁ బ్రాణవల్లభకు వల్లభుం డిట్లనియె. 152**

**ప్రతి :** అనినన్= అనగా; ప్రాణవల్లభకున్= ప్రాణేశ్వరితో; వల్లభుండు= ప్రియుడు, శ్రీకృష్ణుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు...

**తా :** శ్రీకృష్ణుడు ప్రియపత్నితో ఈ రీతిగా పలికాడు.

**సీ. 'సమదపుష్పంధయఝుంకారములు గావు, భీషణకుంభీంద్రబృంహితములు**
**వాయునిర్గతపద్మవనరేణువులు గావు, తురగరింఖాముఖోద్ధూతరజము**
**లాకీర్ణజలతరంగాసారములు గావు, శత్రుధనుర్ముక్తసాయకములు**
**గలహంససారసకాసారములు గావు, దనుజేంద్రసైన్యకదంబకములు**

**తే. కమలకహ్లారకుసుమసంఘములు గావు, చటులరిపుశూలఖడ్గాదిసాధనములు**
**కన్య! నీ వేడ? రణరంగగమన మేడ?, వత్తు, వేగమ నిలువుము, వలదు వలదు.' 153**

**ప్రతి :** కన్య!= అబలా!, సత్యభామా!; భీషణ= భయంకరమైన; కుంభి+ఇంద్ర= శ్రేష్ఠాలయిన ఏనుగులయొక్క; బృంహితములు= ఘీంకారములు; సమద= మదంతో కూడిన; పుష్పంధయ= తుమ్మెదలయొక్క; ఝుంకారములు= ఝుం అనే కంఠధ్వనులు; కావు; తురగ= గుర్రాలయొక్క; రింఖా= గిట్టలయొక్క; ముఖ= మొనలవలన; ఉద్ధూత= పైకెగరగొట్టబడిన; రజములు= దుమ్ము (ధూళి); వాయు= గాలివలన; నిర్గత= వెలువడిన; పద్మవన= తామరల గుంపుయొక్క; రేణువులు= పుప్పొడులు; కావు; శత్రు= శత్రువులయొక్క; ధనుస్= విండ్లనుండి; ముక్త= వదలబడిన; సాయకములు= బాణాలు; ఆకీర్ణ= అంతట వెదజల్లబడిన; జలతరంగ= నీటి అలల యొక్క; ఆసారములు= తుంపురుల జల్లులు; కావు; దనుజ+ఇంద్ర= రాక్షసరాజు యొక్క; సైన్య= సేనలయొక్క; కదంబకములు= సమూహములు; కలహంస= రాజహంసలు; సారస= బెగ్గురుపక్షులుగల; కాసారములు= సరస్సులు, కావు; చటుల= చలించేవి అయిన; రిపు= శత్రువులయొక్క; శూల= శూలము; ఖడ్గ= కత్తి; ఆది= మొదలయిన; సాధనములు= ఆయుధాలు; కమల= తామరలు; కహ్లార= ఎరుపు, తెలుపు కలసిన రంగు కలిగి మిక్కిలి పరిమళించు కలువలు; కుసుమ= మొదలైన పూలయొక్క; సంఘములు= సమూహములు; కావు; నీవు; ఏడ?= ఎక్కడ?; రణరంగ= యుద్ధరంగానికి సంబంధించిన; గమనము= ప్రయాణం; ఏడ?= ఎక్కడ?; వేగము+అ= తొందరగానే; వత్తున్ (వచ్చుదును)= వస్తాను; నిలువుము= ఇక్కడనే ఉండు; వలదు, వలదు= రావద్దు, రావద్దు.

**తా :** సత్యభామా! మహాగజముల ఘీంకారాలు మదించిన తుమ్మెదల జుమ్మనే రొదలు కావు. గుర్రాల గిట్టల కొనలవల్ల రేగిన ధూళులు గాలికి చెదరిన తామరల పుప్పొళ్లు కావు. శత్రువుల ధనుస్సులనుండి వదలిన బాణాలు, నీటి అలల తుంపురుల జడివానలు గావు. రాక్షసరాజసైన్యాలు – రాజహంసలూ, బెగ్గురు పక్షులూ కల సరస్సులు గావు. శత్రువులు ప్రయోగించే శూలాలూ, కత్తులు మొదలయిన యుద్ధపరికరాలు – తామరలూ కలువలూ కావు. నీవెక్కడ? యుద్ధప్రయాణ మెక్కడ? నేను తొందరగానే వస్తాను. నీవు ఇక్కడనే ఉండు. నా వెంట రానే రావద్దు.

**వ. అనినఁ బ్రియునకుం బ్రియంబు జనియింప డగ్గఱి. 154**

**ప్రతి :** అనినన్= (శ్రీకృష్ణుడు పైవిధంగా) పలుకగా; ప్రియునకున్= భర్తకు; ప్రియంబు= ప్రేమ; జనియింపన్= కలుగగా; డగ్గఱి= సమీపించి...

**తా :** శ్రీకృష్ణుడు పలికిన మాటలు విని సత్యభామ అతనికి ప్రేమ పుట్టునట్లుగా దగ్గరకు వచ్చి

**ఉ. 'దానవులైన నేమి? మఱి దైత్యసమూహము లైన నేమి? నీ**
**మానితబాహుదుర్గముల మాటున నుండఁగ నేమి శంక? నీ**
**తో నరుదెంతు' నంచుఁ గరతోయజముల్ ముకుళించి మ్రొక్కె న**
**మ్మానిని దన్ను భర్త బహుమానపురస్సరదృష్టిఁ జూడఁగన్. 155**

**ప్రతి :** ఆ+మానిని= ఆ మానవతి, సత్యభామ; దానవులు= దనువు అను వానిసంతతి అగు రాక్షసులు; ఐనన్= అయితే; ఏమి?= ఏమి భయం?; మఱి= ఇంకనూ; దైత్య= దితి సంతానమయిన రాక్షసులయొక్క; సమూహాలు; ఐనన్= అయితే; ఏమి?= ఏమి భయం?; నీ= నీయొక్క; మానిత= కొనియాడబడిన, పటిష్ఠమయిన; బాహు= భుజాలు అనే; దుర్గముల= కోటలయొక్క; మాటునన్= చాటున; ఉండన్+కన్= ఉండగా; ఏమి శంక?= అనుమాన మేముంటుంది?; నీతోన్= నీతోపాటు; అరుదెంతున్ (అరుదెంచుదును)= వచ్చెదను; అంచున్= అనుచు; భర్త= శ్రీకృష్ణుడు; తన్ను= తనను; బహుమాన పురస్సర= గౌరవపూర్వకమయిన; దృష్టిన్= చూపుతో; చూడన్+కన్= చూడగా; కరతోయజముల్= పద్మాలవంటి చేతులను; ముకుళించి= మోడ్చి; మ్రొక్కెన్= వంగి నమస్కరించింది.

**తా :** ఆత్మాభిమానం గల సత్యభామ "దానవులయితే నాకేమి?" దైత్యులయితే నాకేమి? నీ భుజాలు అనే కోటల చాటున ఉన్నప్పుడు అనుమానం కల్గుతుందా? నీవెంట వస్తాను" అని శ్రీకృష్ణుడు గౌరవపూర్వకమయిన చూపులతో చూస్తుండగా చేతులు మోడ్చి వంగి మొక్కింది.

**వ. ఇట్లు తనకు మ్రొక్కిన సత్యభామను గరకమలంబులఁ గ్రుచ్చి యెత్తి తోడ్కొని గరుడారూఢుండై హరి గగనమార్గంబునం జని, గిరి శస్త్ర సలిల దహన పవన దుర్గమంబై మురాసురపాశ పరివృతం బయిన ప్రాగ్జ్యోతిషపురంబు డగ్గఱి. 156**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; తనకున్= తనకు; మ్రొక్కిన= వంగి నమస్కరించినట్టి; సత్యభామను; హరి= శ్రీకృష్ణుడు; కరకమలంబులన్= పద్మాలవంటి చేతులతో; క్రుచ్చి= పట్టి; ఎత్తి= పైకి లేవనెత్తి; తోడ్కొని= వెంటబెట్టుకొని; గరుడ= గరుత్మంతుణ్ణి; ఆరూఢుండు= ఎక్కినవాడు; ఐ= అయి; గగనమార్గంబునన్= ఆకాశమార్గంలో; చని= వెళ్లి; గిరి= పర్వత దుర్గంచేత; శస్త్ర= శస్త్రదుర్గాలచేత; సలిల= జలదుర్గాలచేత; దహన= అగ్నిదుర్గాలచేత; పవన= వాయుదుర్గాలచేత;

దుర్గమంబు+ఐ= ప్రవేశించడానికి వీలుకానిదై; ముర+అసుర= మురుడు అను రాక్షసుడు కట్టిన; పాశ= త్రాళ్లచేత; పరివృతంబు= చుట్టబడింది; అయిన; ప్రాగ్జ్యోతిషపురంబున్= ప్రాగ్జ్యోతిషం అనెడి నరకాసురునిపట్టణాన్ని; డగ్గఱి=సమీపించి...

**తా :** శ్రీకృష్ణుడు తనకు నమస్కరించిన సత్యభామను పైకి లేవనెత్తి వెంటతీసుకొనిపోయి, గరుత్మంతుణ్ణి ఎక్కి, ఆకాశమార్గాన ప్రాగ్జ్యోతిషపురంవైపు పయనించాడు. ఆ పట్టణం పర్వత, శస్త్ర, జల, అగ్ని, వాయుదుర్గాలచేత చొరశక్యం గానట్టిది. అది మురాసురుడు కట్టిన త్రాళ్లచేత చుట్టబడింది. దాని దగ్గరకు చేరి

**మ. గదచేఁ బర్వతదుర్గముల్ శకలముల్ గావించి సత్తేజిత**
**ప్రదరశ్రేణుల శస్త్రదుర్గచయమున్ భంజించి చక్రాహతిం**
**జెదరన్ వాయుజలాగ్నిదుర్గముల నిశ్శేషంబులం జేసి భీ**
**ప్రదుఁడై వాలునఁ ద్రుంచెఁ గృష్ణుఁడు మురప్రచ్ఛన్నపాశంబులన్. 157**

**ప్రతి :** కృష్ణుఁడు; భీప్రదుఁడు+ఐ= భయం కల్గించేవాడై; గదచేన్= గదచేత; పర్వతదుర్గముల్= పర్వత దుర్గాలను; శకలముల్= ముక్కలు; కావించి= చేసి; సత్= చక్కగా; తేజిత= సానపెట్టబడిన; ప్రదర= బాణాలయొక్క; శ్రేణులన్= వరుసలచే; శస్త్రదుర్గ= శస్త్రదుర్గాలయొక్క; చయమున్= సమూహాన్ని; భంజించి= నశింపజేసి; చక్ర= చక్రంయొక్క; ఆహతిన్= దెబ్బచే; చెదరన్= చెదరిపడేట్లు; వాయు+జల+అగ్ని+దుర్గములన్= వాయుజలాగ్ని దుర్గాలను; నిశ్శేషంబులన్= మిగులులేనివాటినిగా; చేసి; వాలునన్= కత్తితో; ముర= మురాసురునియొక్క; ప్రచ్ఛన్న= రహస్యాలైన; పాశంబులన్= అగ్నిపాశాలను; త్రుంచెన్= నరికాడు.

**తా :** శ్రీకృష్ణుడు భయంకరుడై గదచేత పర్వతదుర్గాలను ముక్కలు ముక్కలు చేశాడు. వాడిగా ఉన్న బాణపరంపరలచేత శస్త్రదుర్గాలను నాశం చేశాడు. చక్రాయుధం దెబ్బతో వాయుజలాగ్ని దుర్గాలను రూపుమాపాడు. కత్తితో మురుడు చుట్టూ ఉన్న అగ్నిపాశాల్ని నరికాడు.

**వ. మఱియును. 158**

**తా :** ఇంకనూ

**శా. ప్రాకారంబు గదాప్రహారముల నుత్పాటించి యంత్రంబులన్**
**నాకారాతుల మానసంబులును ఖిన్నత్వంబు సెందంగ న**
**స్తోకాకారుఁడు శౌరి యొత్తె విలయోద్ధూతాభ్రనిర్ఘాత రే**
**ఖా కాఠిన్యముఁ బాంచజన్యము విముక్తప్రాణిచైతన్యమున్. 159**

**ప్రతి :** అస్తోక= గొప్పదైన; ఆకారుఁడు= రూపం కలవాడు; శౌరి= శ్రీకృష్ణుడు; గదా= గదయొక్క; ప్రహారములన్= దెబ్బలతో; ప్రాకారంబు= ప్రహరినీ; యంత్రంబులన్= యంత్రాల్నీ; ఉత్పాటించి= పెల్లగించి; నాక= దేవతలయొక్క; అరాతుల= శత్రువులయిన రాక్షసులయొక్క; మానసంబులును= మనస్సులు కూడా; ఖిన్నత్వంబు= దుఃఖం; చెందన్+కన్= పొందేటట్లుగా; విలయ= ప్రళయకాలంలో; ఉద్ధూత= అంతటా ఎగజిమ్మబడిన; అభ్ర= మేఘాలయొక్క; నిర్ఘాత= పిడుగుల; రేఖా= మాదిరిగా; కాఠిన్యమున్= కఠినత్వం కలది; విముక్త= విడువబడిన; ప్రాణి= జీవరాశులయొక్క; చైతన్యమున్= ప్రాణాలతోనున్నదీ అయిన; పాంచజన్యం; ఒత్తెన్= పూరించాడు.

**తా :** మహారూపి అయిన శ్రీకృష్ణుడు గదాఘాతాలచే చుట్టుగోడనూ, దానిమీది యంత్రాలనూ పెకల్చినాడు. రాక్షసుల గుండెలు దిగులు పడేటట్లుగా ప్రళయకాల మేఘాల పిడుగుల వంటిదీ, జీవుల ఉసురులు దీసేదీ అయిన పాంచజన్యాన్ని పూరించాడు.

**వ. అంత లయకాల కాలాభ్రగర్జనంబుపగిది నొప్పు న మ్మహాధ్వని విని పంచశిరుండైన మురాసురుండు నిదుర సాలించి యావులించి నీల్గి లేచి జలంబులు వెడలి వచ్చి హరిం గని ప్రళయకాలకీలికైవడి మండుచు దుర్నిరీక్ష్యుండై కరాళించుచుం దన పంచముఖంబులం బంచభూతమయం బయిన లోకంబుల మ్రింగ నప్పళించు చందంబునం గదిసి యాభీలకీలాజటాలం బగు శూలంబున గరుడుని వైచి భూనభో౽ంతరం బులు నిండ నార్చుచు. 160**

**ప్రతి :** అంతన్= తర్వాత; లయకాల= ప్రళయకాలంలోని; కాల= నల్లనయిన; అభ్ర= మేఘంయొక్క; గర్జనంబు= గర్జ; పగిదిన్= మాదిరిగా; ఒప్పు= విజృంభించు; ఆ+మహాధ్వని= ఆ పెద్ద మ్రోతను; విని; పంచశిరుండు= అయిదు తలలు గలవాడు; ఐన= అయిన; ముర+అసురుండు= మురుడు అనే రాక్షసుడు; నిదుర; చాలించి= వదలి; ఆవులించి; నీల్గి= ఒడలు విరుచుకొని; లేచి; జలంబులు= నీటినుండి; వెడలి= వెలువడి; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; కని= చూచి; ప్రళయకాల= ప్రళయకాలంనాటి; కీలి కైవడిన్= అగ్నివలె; మండుచున్= మండుతు; దుర్+నిరీక్ష్యుండు+ఐ= చూడశక్యంకాని వాడై; కరాళించుచున్= అరుస్తూ; తన= తనయొక్క; పంచముఖంబులన్= అయిదు ముఖాలచేత; పంచభూతమయంబు= భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం అనే వాటిరూపాన; లోకంబులన్= జగత్తులను; మ్రింగన్= మ్రింగడానికి; అప్పళించు= ప్రయత్నించే; చందంబునన్= విధంగా; కదిసి= సమీపించి; ఆభీల= భయంకరమైన; కీలా= అగ్నిజ్వాలల్ని; జటాలంబు= జడలు కలది (మంటలతో నిండిందని అర్థం); అగు= అయిన; శూలంబునన్= శూలంతో; గరుడునిన్= గరుత్మంతుణ్ణి; వైచి= కొట్టి; భూ= భూమియొక్క; నభస్= ఆకాశంయొక్క; అంతరంబులు= మధ్యప్రదేశాలు; నిండన్= నిండునట్లు; ఆర్చుచున్= పెడబొబ్బలు పెట్టుచు...

**తా :** ప్రళయకాలమేఘగర్జవంటి పాంచజన్య ధ్వని విని, అయిదుతలలు గల మురాసురుడు నిద్రలేచాడు. ఆవులించాడు. ఒళ్లు విరుచుకొన్నాడు. నివాసస్థానమయిన నీటిని వదలి వచ్చి శ్రీకృష్ణుణ్ణి చూచాడు. ప్రళయకాలాగ్నివలె మండిపడుతూ చూడడానికి శక్యం కానివా డయ్యాడు. బొబ్బలు పెడుతూ, పంచభూతస్వరూపాలయిన లోకాలను పంచముఖాలతో మ్రింగటానికి ప్రయత్నించే విధంగా దగ్గరకు వచ్చి, అగ్ని జ్వాలామయమయిన శూలాన్ని గరుత్మంతుని మీద ప్రయోగించాడు. భూమ్యాకాశమధ్యప్రదేశాలు నిండేటట్లుగా పెడబొబ్బలు పెడుతూ

**క. దురదురఁ బరువిడి బిరుసున, 'హరి హరి! నిలునిలువు' మనుచు నసురయుఁ గదిసెన్**
**మురముర దివిజులహృదయము, మెరమెర యిదె యడఁగు ననుచు మెఱసెన్ హరియున్. 161**

**ప్రతి :** అసురయున్= రాక్షసుఁడు, మురుడు; దురదురన్= తొందర తొందరగా; బిరుసునన్= పొగరుతో; పరువిడి= పరుగెత్తి; హరి హరి!= శ్రీకృష్ణా! శ్రీకృష్ణా!; నిలువుము+నిలువుము= నిలువు, నిలువు; అనుచున్= అని పలుకుతూ; కదిసెన్= సమీపించాడు; హరియున్= శ్రీకృష్ణుడును; ముర ముర!= మురాసురా!, మురాసురా!; దివిజుల= దేవతల; హృదయం మెరమెర= హృదయాల్లోని దిగులు; ఇదె= ఇదిగో!; అడఁగున్= సమసిపోతుంది; అనుచున్= అని అంటూ; మెఱసెన్= విజృంభించాడు.

**తా :** మురాసురుడు బిరబిరా పరుగెత్తికొని వచ్చి "శ్రీకృష్ణా! శ్రీకృష్ణా! ఆగు ఆగు!" అంటూ దగ్గరకు వచ్చాడు. శ్రీకృష్ణుడు కూడా "మురాసురా! మురాసురా! ఇదిగో! ఈనాటితో దేవతల దుఃఖాలు తొలగిపోతాయి" అని మాటల్లో మించిపోయాడు. ఆతడిపైకి చెలరేగాడు.

**వ. అప్పుడు. 162**

**తా :** ఆ సమయాన

**క. గరుడునిపైఁ బడ వచ్చిన, మురశూలము నడుమ నొడిసి ముత్తునియలుగాఁ**
**గరముల విఱిచి ముకుందుఁడు, మురముఖముల నిశితవిశిఖములు వడిఁ జొనిపెన్. 163**

**ప్రతి :** ముకుందుఁడు= శ్రీకృష్ణుడు; గరుడునిపైన్= గరుత్మంతునిమీద; పడన్+వచ్చిన= పడుటకు వచ్చుచున్న; మురమురునియొక్క; శూలమును; నడుమన్= నడుమనే; కరములన్= చేతులతో; ఒడిసి= హఠాత్తుగా పట్టుకొని; మూఁడు+తునియలు= మూడు ముక్కలు; కాన్= అగునట్లుగా; విఱిచి= విరుగగొట్టి; మురమురునియొక్క; ముఖములన్= ఐదు ముఖాలలో; నిశిత= వాడియైన; విశిఖములు= బాణాలు; వడిన్= వేగంగా; చొనిపెన్= నాటాడు.

**తా :** శ్రీకృష్ణుడు గరుత్మంతునిమీద పడబోవుతున్న మురుని శూలాన్ని మధ్యలోనే చేతులతో ఆకస్మికంగా పట్టుకొని మూడు ముక్కలు చేశాడు. తర్వాత ఆ రాక్షసుని అయిదు ముఖాలందు వాడియయిన బాణాల్ని వేగంగా చొప్పించాడు.

**మ. గద వ్రేసెన్ మురదానవుండు హరిపైఁ, గంసారియుం దద్గదన్**
**గదచేఁ ద్రుంచి సహస్రభాగములుగాఁ గల్పించె, నాలోన వాఁ**
**డెదురై హస్తము లెత్తికొంచు వడి రా నీక్షించి లీలాసమ**
**గ్ర దశన్ వానిశిరంబు లైదును వడిన్ ఖండించెఁ జక్రాహతిన్. 164**

**ప్రతి :** మురదానవుండు= మురాసురుడు; హరిపైన్= శ్రీకృష్ణునిమీద; గద= గదను; వ్రేసెన్= విసరివేశాడు; కంస+అరియున్= కంసుని శత్రువుకూడ; శ్రీకృష్ణుడుకూడ; తద్= ఆ; గదన్= గదను; గదచేన్= తన గదచేత; త్రుంచి= ఖండించి; సహస్ర= వేయి; భాగములు+కాన్= తునకలుగా; కల్పించెన్= చేసెను; ఆలోనన్= ఆలోపల; వాఁడు= మురుడు; హస్తములు= చేతులు; ఎత్తికొంచున్= పైకెత్తికొని; ఎదురై= ఎదురుమొగమయినవాడై; వడిన్= వేగంగా; రాన్= రాగా; ఈక్షించి= చూచి; చక్ర= చక్రంయొక్క; ఆహతిన్= దెబ్బతో; లీలా= వినోదంయొక్క; సమగ్ర= పూర్ణమైన; దశన్= స్థితితో; వాని శిరంబులు= అతని తలలు; ఐదును; విడిన్= వేగంగా; ఖండించెన్= నరికాడు.

**తా :** మురుడు శ్రీకృష్ణునిమీద గదను ప్రయోగించాడు. శ్రీకృష్ణుడు దాన్ని వేయిముక్కలు చేశాడు. తర్వాత మురాసురుడు చేతులు పైకెత్తికొని శ్రీకృష్ణునికి ఎదురుగా నడుస్తూ వేగంగా వచ్చాడు. అప్పుడు శ్రీకృష్ణుడు వినోదప్రాయంగా చక్రం దెబ్బతో అతనితలలు ఐదింటినీ ఖండించాడు.

**వ. ఇట్లు శిరంబులు చక్రి చక్రధారాచ్ఛిన్నంబు లయిన వజ్రివజ్రధారాదళితశిఖరంబై కూలెడి శిఖరిచందంబున మురాసురుండు జలంబులందుఁ గూలిన, వానిసూనులు జనకవధజనితశోకాతురులై జనార్దను మర్దింతు మని రణకుర్దనంబునఁ దామ్రుండు, నంతరిక్షుండు, శ్రవణుండు, విభావసుండు,**

**వసుండు, నభస్వంతుండు, నరుణుండు నన నేడ్వురుయోధులు సక్రోధులై కాలాంతకచోదితంబైన ప్రళయపవనసప్తకంబు భంగి నరకాసురప్రేరితులై రయంబునఁ బీఠుం డనియెడు దండనాథుం బురస్కరించుకొని, పఱతెంచి హరిం దాఁకి శరశక్తిగదాఖడ్గకరవాలశూలాదిసాధనంబులు ప్రయోగించిన. 165**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; శిరంబులు= తలలు; చక్రి= చక్రంగల వానియొక్క, శ్రీకృష్ణునియొక్క; చక్ర= చక్రంయొక్క; ధారా= అంచులచేత; భిన్నంబులు= ఖండింపబడ్డాయి; అయినన్= కాగా; వజ్ర= వజ్రాయుధంయొక్క; ధారా= వాదరచేత; దళిత= బద్దలు చేయబడిన; శిఖరంబు+ఐ= శిఖరాలు కలద్రై; కూలెడి= పడెడి; శిఖరిచందంబునన్= కొండవలె; మురాసురుండు; జలంబుల+అందున్= నీళ్లలో; కూలినన్= పడిపోగా; వానిసూనులు= వానికుమారులు; జనక= తండ్రియొక్క; వధ= వధచేత; జనిత= పుట్టిన; శోక= దుఃఖంచేత; ఆతురులు+ఐ= బాధపడుతున్నవారై; జనార్దనున్= శ్రీకృష్ణుణ్ణి; మర్దింతుము= చంపేస్తాము; అని; రణ= యుద్ధమనెడు; కుర్దనంబునన్= క్రీడయందలి ఆసక్తిచేత; తామ్రుండు; అంతరిక్షుండు; శ్రవణుండు; విభావసుండు; వసుండు; నభస్వంతుండు; అరుణుండు; అనన్= అనగా; ఏడ్వురు= ఏడుగురు; యోధులు= వీరులు; సక్రోధులు+ఐ= క్రోధంతో కూడుకొన్నవారై; కాలాంతక= శివునిచేత; చోదితంబు+ఐన= ప్రేరేపింపబడిన; ప్రళయ= ప్రళయకాలంలోని; వాయుసప్తకంబు భంగిన్= ఏడువాయువుల్లాగా; నరకాసుర= నరకాసురునిచేత; ప్రేరితులు+ఐ= ప్రేరేపింపబడినవారై; రయంబునన్= శీఘ్రంగా; పీఠుండు; అనియెడు= అను పేరుగల; దండనాథున్= సేనాధిపతిని; పురస్కరించుకొని= ముందుంచుకొని; పఱతెంచి= పరుగెత్తుకొనివచ్చి; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; తాఁకి= ఎదిరించి; శర= బాణాలు; శక్తి= శక్తి; గదా= గద; ఖడ్గ= పెద్దకత్తి; కరవాల= చేతికత్తి; శూల= శూలం; ఆది= మొదలైన; సాధనంబులు= ఆయుధాలను; ప్రయోగించినన్= ఉపయోగింపగా...

**తా :** ఇంద్రుడు వజ్రాయుధంతో శిఖరాల్ని బ్రద్దలు చేసి, పర్వతాన్ని కూల్చినట్లుగా శ్రీకృష్ణుడు చక్రంతో తలలు నరికి మురాసురుణ్ణి పడగొట్టాడు. మురుడు నీళ్లల్లో కూలిపోయాడు. అతనికి ఏడుగురు కొడుకులు. వారు తామ్రుడు, అంతరిక్షుడు, శ్రవణుడు, విభావసుడు, వసుడు, నభస్వంతుడు, అరుణుడు. వీరు తండ్రిచావుకు క్రోధం చెలరేగగా, శ్రీకృష్ణుణ్ణి రణక్రీడలో చంపాలని నిశ్చయించారు. శివుడు సప్తవిధవాయువులను ప్రళయకాలంలో ప్రేరేపించినట్లు, నరకాసురుడు మురుని కుమారులను ఏడుగురినీ రెచ్చగొట్టాడు. వారు పీఠుడనే సేనాపతి అండతో శ్రీకృష్ణుణ్ణి ఎదిరించి నానావిధ యుద్ధసాధనాలను ప్రయోగింపగా

**విశే : సప్తవిధ వాయువులు –** 1) ఆవహం 2) ప్రవహం 3) సంవహం 4) ఉద్వహం 5) నివహం 6) పరివహం 7) పరావహం.

**ఉ. ఆ దనుజేంద్రయోధవివిధాయుధసంఘము నెల్ల నుగ్రతన్**
**మేదినిఁ గూలనేయుచు సమిద్ధనిరర్గళమార్గణాళిఁ గ్ర**
**వ్యాదకులాంతకుం డసురహస్తభుజాననకంఠజాను జం**
**ఘాదులఁ ద్రుంచి వైచెఁ దిలలంతలు ఖండములై యిలం బడన్. 166**

**ప్రతి :** క్రవ్యాద= రాక్షసుల; కుల= సమూహానికి; అంతకుండు= యముడు; శ్రీకృష్ణుడు; సమిద్ధ= మిక్కిలి తీక్ష్ణమయిన; నిరర్గళ= అడ్డులేని; మార్గణ= బాణాల; ఆళిన్= సమూహాన్ని; ఉగ్రతన్= భయంకరత్వంతో; ఆ; దనుజేంద్ర= ఆ రాక్షస

శ్రేష్ఠులయిన; యోధ= యోధులయొక్క; వివిధ= అనేకవిధాలయిన; ఆయుధ= ఆయుధాలయొక్క; సంఘమున్= సంఘాన్ని; ఎల్లన్= అంతయు; మేదినిన్= భూమిమీద; కూలన్= పడిపోయేటట్లుగా; ఏయుచున్= ప్రయోగిస్తూ; అసుర= రాక్షసులయొక్క; హస్త= చేతులు; భుజ= భుజాలు; ఆనన= ముఖాలు; కంఠ= కంఠాలు; జాను= మోకాళ్లు; జంఘ= పిక్కలు; ఆదులన్= మొదలైన దానిని; తిలలంతలు= నువ్వుగింజలంత; ఖండములు+ఐ= తునియలై; ఇలన్= నేలమీద; పడన్= పడునట్లుగా; త్రుంచివైచెన్= నరికివేశాడు.

**తా :** శ్రీకృష్ణుడు వాడి అమ్ములు ప్రయోగించి రాక్షసవీరుల ఆయుధాలన్నీ భూమిమీద విరిగి పడేటట్లు చేశాడు. అంతేకాకుండా వారిశరీరావయవాలు నువ్వు గింజలంత తునకలయి నేలమీద రాలేటట్లు ఖండించాడు.

**వ. మఱియు హరిశరజాలచక్రనిహతులయి తనవారలు మడియుటకు వెఱఁగుపడి రోషించి గరుడగమనుని దూషించి తన్ను భూషించుకొని సరకుసేయక నరకుండు వరకుండలప్రముఖాభరణభూషితుం డయి దానసలిలధారాసిక్త గండంబులును, మహోద్దండశుండాదండంబులు నైన వేదండంబులు తండతండంబులై నడువ వెడలి భండనంబునకుం జని. 167**

**ప్రతి :** మఱియున్= ఇంకను; నరకుండు; హరి= శ్రీకృష్ణునియొక్క; శర= బాణాల; జాల= సమూహంచేత; చక్ర= చక్రంచేత; నిహతులు+అయి= కొట్టబడినవారై; తనవారలు= తనవారు; మడియుటకున్= మరణించడానికి; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; రోషించి= కోపించి; గరుడగమనుని= గరుడునిమీద ప్రయాణించేవాణ్ణి; శ్రీకృష్ణుణ్ణి; దూషించి= తిట్టి; తన్నున్= తనను; భూషించుకొని= పొగడుకొని; సరకు+చేయక= లెక్కచేయక; వర= శ్రేష్ఠాలైన; కుండల= కర్ణాభరణాలు; ప్రముఖ= మొదలయిన; ఆభరణ= నగలచేత; భూషితుండు+అయి= అలంకరింపబడినవాడై; దానసలిల= మదజలంయొక్క; ధారా= ధారలచేత; సిక్త= తడుపబడిన; గండంబులును= చెక్కిళ్లు గలవియు; మహత్+ఉద్దండ (మహా+ఉద్దండ)= మహాభయంకరమైన; శుండాదండంబులును= కర్రలవంటి తొండాలు కలవియు; ఐన; వేదండంబులు= ఏనుగులు; తండ తండంబులు= గుంపులు గుంపులు; ఐ= అయి; నడువన్= నడువగా; వెడలి= బయలుదేరి; భండనంబునకున్= యుద్ధానికి; చని= వెళ్లి...

**తా :** శ్రీకృష్ణుని బాణాల వ్రేటులకూ, చక్రం దెబ్బలకూ, తనవారందరూ మరణించగా నరకాసురుడు ఆశ్చర్యం పొందాడు. కోపపడ్డాడు. శ్రీకృష్ణుణ్ణి తిట్టాడు. తన్ను తాను పొగడుకొన్నాడు. లెక్కసేయనివాడై చెవిపోగులు మొదలయిన నగలు ధరించి, యుద్ధానికి బయలుదేరాడు. అతనివెంట ఏనుగులు గుంపులుకట్టి నడిచాయి. వానిచెక్కిళ్లనుండి మదజలం ధారాపాతంగా స్రవిస్తూంది. చెట్టుబోదెలవంటి వానితొండాలు మహాభయం కలిగిస్తున్నాయి.

**మ. బలవంతుండు ధరాసుతుండు గనె శుంభద్రాజబింబోపరి**
**స్థలశంపాన్వితమేఘమో యన ఖగేంద్రస్కంధపీఠంబుపై**
**లలానారత్నముఁ గూడి సంగరకథాలాపంబులం జేయు ను**
**జ్జ్వలనీలాంగుఁ గనన్నిషంగుఁ గుహనాచంగున్ రణాభంగునిన్. 168**

**ప్రతి :** బలవంతుండు= బలం కలవాడైన; ధరా= భూదేవియొక్క; సుతుండు= కుమారుడు; నరకాసురుడు; శుంభత్= ప్రకాశిస్తున్న; రాజబింబ= చంద్రబింబంయొక్క; ఉపరిస్థల= పైతట్టున; శంపా= మెరుపుతీగతో; అన్విత= కూడిన;

మేఘము+ఓ= మేఘమేమో; అనన్= అనునట్లు; ఖగ+ఇంద్ర= పక్షిశ్రేష్ఠుడయిన గరుత్మంతుని; స్కంధ= మూపు అనెడు; పీఠంబుపైన్= ఆసనంమీద; లలనా= స్త్రీలయందు; రత్నమున్= శ్రేష్ఠురాలయిన సత్యభామను; కూడి= కలసి; సంగరకథా= యుద్ధకథలకు సంబంధించిన; ఆలాపంబులన్= మాటలు; చేయు= చెప్తున్న; ఉజ్జ్వల= ప్రకాశిస్తున్న; నీల= నల్లని; అంగున్= దేహం కలవాణ్ణి; కనత్= వెలుగుతున్న; నిషంగున్= అమ్ములపొదులు కలవాణ్ణి; కుహనా= మాయతో కూడిన; చంగున్= నేర్పరిని; రణ= యుద్ధంలో; అభంగునిన్= భంగపడనివాణ్ణి; శ్రీకృష్ణుని...

**తా :** బలశాలి అయిన నరకాసురుడు చంద్రబింబంమీద మెరపుతో కూడిన మేఘమేమో అనిన చందంగా గరుత్మంతుని మూపుమీద సత్యభామతో కలసి కయ్యపుముచ్చట్లలో మునిగి తేలుచున్న శ్రీకృష్ణుని చూచాడు. శ్రీకృష్ణుడు నల్లనిశరీరం కలవాడు. మంచి అమ్ములపొదులు కలవాడు. మాయాచాతుర్యం కలవాడు. యుద్ధంలో ఓడిపోనివాడు

**వ. కని కలహంబునకు నరకాసురుండు గమకింపం దమకింపక విలోకించి సంభ్రమంబున. 169**

**ప్రతి :** కని= చూచి; కలహంబునకున్= యుద్ధానికి; నరకాసురుండు; గమకింపన్= ప్రయత్నింపగా; (సత్యభామ) తమకింపక= జంకక; విలోకించి= చూచి; సంభ్రమంబునన్= త్వరత్వరగా...

**తా :** నరకాసురుడు యుద్ధానికి తలపడగా, సత్యభామ జంకూకొంకూ లేకుండా చూచి వేగిరపాటుతో

**శా. వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ**
**శ్రేణిం దాల్చి ముఖేందుమండల మరీచీజాలముల్ పర్వఁగాఁ**
**బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీర సంరంభయై**
**యేణీలోచన లేచి నిల్చెఁ దన ప్రాణేశాగ్రభాగంబునన్. 170**

**ప్రతి :** ఏణీలోచన= ఆడులేడి కన్నులవంటి కన్నులు కలది; (సత్యభామ); వేణిన్= జడను; చొల్లెము+పెట్టి= చుట్టచుట్టి; సంఘటిత= బిగింపబడిన; నీవీబంధ+ఐ= పోకముడి కలదై; భూషణ= నగల; శ్రేణిన్= సమూహాన్ని; తాల్చి= ధరించి; ముఖ= ముఖమనే; చంద్రమండల= చంద్రబింబంయొక్క; మరీచీ= కాంతులయొక్క; జాలముల్= సమూహాలు; పర్వన్+కాన్= వ్యాపింపగా; పాణిన్= చేతితో; పయ్యెదన్= పైటను; చక్కన్+కాన్= సరిగా; తుఱిమి= అమర్చుకొని; శుంభత్= ప్రకాశిస్తున్న; వీర= వీరునియొక్క; సంరంభ+ఐ= వేగిరపాటు కలదై; లేచి; తన; ప్రాణ+ఈశ= ప్రాణేశ్వరునియొక్క; అగ్రభాగంబునన్= ముందుతట్టున; నిల్చెన్= నిలబడింది.

**తా :** సత్యభామ జడను గట్టిచుట్టగా చుట్టింది. పోకముడిని గట్టిగా బిగించుకొనింది. నగలు సవరించుకొనింది. ముఖకాంతులు సర్వత్ర వ్యాపింపగా, ఒక మహావీరుని ఆటోపంతో లేచి తన ప్రాణనాయకుడైన శ్రీకృష్ణుని ముందు వీరవనితగా నిలబడింది.

## ❖ సత్యభామ నరకాసురునితో యుద్ధంబు సేయుట ❖

**క. జన్యంబున దనుజుల దౌ, ర్జన్యము లుడుపంగఁ గోరి చనుదెంచిన సౌ**
**జన్యవతిఁ జూచి యదురా, జన్యశ్రేష్ఠుండు సరససల్లాపములన్. 171**

**ప్రతి :** యదురాజన్య= యాదవరాజులలో; శ్రేష్ఠుండు= శ్రేష్ఠుడు, శ్రీకృష్ణుడు; జన్యంబునన్= యుద్ధంలో; దనుజుల= రాక్షసుల యొక్క; దౌర్జన్యములు= దుష్ట చేష్టల్ని; ఉడుపన్+కన్= పోగొట్టగా; కోరి; చనుదెంచిన= వచ్చిన; సౌజన్యవతిన్= ప్రేమ, ఔదార్యాలుగల; సత్యభామను; చూచి; సరస= రసవంతమయిన; సల్లాపములన్= సరసపుమాటలతో...

**తా :** శ్రీకృష్ణుడు యుద్ధంలో దుర్మార్గులయిన రాక్షసుల్ని సంహరించటానికి వచ్చిన సత్యభామను చూచి, రసమయము లయిన మంచి మాటలతో

**క. లేమా! దనుజుల గెలువఁగ, లేమా? నీ వేల కడఁగి లేచితి? విటు రా!**
**లే! మాను మాన వేనిన్, లే మా విల్లందికొనుము లీలం గేలన్. 172**

**ప్రతి :** లేమా!= నారీమణీ!; సత్యభామా!; దనుజులన్= రాక్షసులను; గెలువన్+కన్+లేమా?= జయింపజాలమా? నీవు; ఏల; కడఁగి= పూనుకొని, లేచితివి?= లేచావు?; ఇటు; రా= రమ్ము; లే= లెమ్ము; మాను= యుద్ధప్రయత్నం మానుము; మానవు+ఏనిన్= మానుకొననిచో; లే!= లెమ్ము; మావిల్లు= మావింటిని; లీలన్= విలాసంగా; కేలన్= చేతితో; అందికొనుము= తీసుకొమ్ము.

**తా :** సత్యభామా! నేను రాక్షసుల్ని జయించలేనా? నీవెందుకు కయ్యానికి పూనుకొని లేచావు? ఈ ప్రక్కకు రా! లెమ్ము. యుద్ధప్రయత్నం మాను; మానుకోలేకపోతే నా ధనుస్సును చేతితో తీసికో! లే!

**వ. అని పలికి. 173**

**తా :** అని చెప్పి

**క. హరిణాక్షికి హరి యిచ్చెను, సురనికరోల్లాసనమును శూరకఠోరా**
**సురసైన్యత్రాసనమును, పరగర్వనిరాసనమును బాణాసనమున్. 174**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; సుర= దేవతల; నికర= సమూహానికి; ఉల్లాసనమును= సంతోషింపజేసేది; శూర= శూరులూ; కఠోర= గట్టివారు అయిన; అసుర= రాక్షసుల; సైన్య= సేనకు; త్రాసనమును= భయం కల్గించేదీ; పర= శత్రువులయొక్క; గర్వ= పొగరును; నిరాసనమును= రూపుమాపేదీ అయిన; బాణ+ఆసనమున్= ధనుస్సును; హరిణ+అక్షికిన్= లేడికన్నులవంటి కండ్లు గల ఆ సత్యభామకు; ఇచ్చెన్= ఇచ్చెను.

**తా :** శ్రీకృష్ణుడు దేవతలను ఆనందింపజేయునదీ, వీరులూ గట్టివారు అయిన రాక్షససైన్యానికి భయం కలిగించేదీ, శత్రువుల అహంకారాన్ని పోగొట్టేదీ అయిన వింటిని సత్యభామకు ఇచ్చాడు.

**శా. ఆ విల్లంది బలంబు నొంది తదగణ్యానంతతేజోవిశే**
**షావిర్భూతమహాప్రతాపమున వీరాలోకదుర్లోకయై**
**తా వేగన్ సగుణంబుఁ జేసె ధనువుం దన్వంగి దైత్యాంగనా**
**గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణక్రీడామహోత్కంఠతోన్. 175**

**ప్రతి :** తన్వంగి (తను+అంగి)= సన్నని శరీరం కలదైన, సత్యభామ; తాన్= తాను; ఆ= ఆ యొక్క; విల్లు= ధనుస్సు; అంది= అందుకొని; బలంబున్= బలాన్ని; ఒంది= పొంది; తద్= ఆ బలంవల్ల కలిగిన; అగణ్య= లెక్కింపలేని; అనంత= హద్దులేని; తేజస్= తేజస్సుయొక్క; విశేష= ఆధిక్యంచేత; ఆవిర్భూత= పుట్టిన; మహత్= గొప్ప; ప్రతాపమునన్= పౌరుషంచేత; వీర= వీరులయొక్క; ఆలోక= చూపులకు; దుర్లోక= చూచుటకు సాధ్యం గానిది; ఐ= అయి; రణ= యుద్ధం అనెడి; క్రీడా= ఆటయందలి; మహత్= అధికమయిన; ఉత్కంఠతోన్= వేగిరపాటుతో; దైత్య+అంగనా= రాక్షస స్త్రీలయొక్క; గ్రీవా=

మెడలయొక్క; సంఘము= సమూహం; నిర్+గుణంబుగన్= (వివాహకాలమున వారి భర్తలు కట్టిన) మంగళసూత్రం లేనిదయ్యేటట్లుగా; ధనువున్= వింటిని; సగుణంబున్= అల్లెత్రాడుకలదిగా; చేసెన్= చేసింది.

**తా :** సత్యభామ శ్రీకృష్ణుడు ఇచ్చిన వింటిని పుచ్చుకొనింది. వెంటనే ఆమె బలం పొందింది. ఆ బలంవల్ల మహాతేజస్సూ, ఆ తేజస్సుచేత మహాపరాక్రమమూ ఆమెలో కలిగాయి. అప్పుడు ఆమెవైపు కన్నెత్తి చూడటానికి రాక్షసవీరులకు అశక్యమయింది. తర్వాత సత్యభామ యుద్ధంమీద గల తహతహపాటుతో రాక్షసస్త్రీల కంఠాలకున్న మంగళసూత్రాలు తెగిపోయేటట్లు తన వింటియందు అల్లెత్రాటిని బిగించింది.

**విశే :** ఇక్కడ సత్యభామ ఒక తాడును బిగిస్తుంటే, అక్కడ మరొక తాడు తెగిపోతున్నది అనడం ఇందులోని చమత్కారం.

**క. నారి మొరయించె రిపు సే, నా రింఖణహేతువైన నాదము నిగుడన్**
**నారీమణిబలసంప, న్నారీభాదికము మూర్ఛనంద నరేంద్రా! 176**

**ప్రతి :** నర+ఇంద్రా= పరీక్షిన్మహారాజా!; నారీమణి= సత్యభామ; రిపు= శత్రువుల; సేనా= సేనలు (యొక్క); రింఖణ= జారిపడటానికి; హేతువు= కారణం; ఐన= అయిన; నాదము= ధ్వని; నిగుడన్= వ్యాపింపగా; బలసంపన్న= చతురంగబల సంపద కలిగిన; అరి= శత్రువులయొక్క; ఇభ= ఏనుగులు; ఆదికము= మొదలయినవి; మూర్ఛన్+అందన్= మూర్ఛపోగా; నారి= అల్లెత్రాటిని; మొరయించెన్= మ్రోగించింది.

**తా :** సత్యభామ, శత్రుసైన్యం తత్తరపడే ధ్వని వ్యాపింపగా, ఏనుగులు మొదలయినవి మూర్ఛపడగా అల్లెత్రాటిని మ్రోగించింది.

**సీ. సౌవర్ణకంకణఝుణఝుణనినదంబు శింజినీరవముతోఁ జెలిమిసేయఁ**
**దాటంకమణిగణధగధగదీప్తులు గండమండలరుచిఁ గప్పికొనఁగ**
**ధవళతరాపాంగధళధళరోచులు బాణజాలప్రభాపటలి నడఁప**
**శరఘాత ఘుమఘుమశబ్దంబు పరిపంథి సైనిక కలకలస్వనము నుడుప**

**తే. వీరశృంగారభయరౌద్రవిస్మయములు, గలసి భామిని యయ్యెనో కాక యనఁగ**
**నిషువుఁ దొడుగుట దివుచుట యేయు టెల్ల, నెఱుఁగ రాకుండ నని సేసె నిందువదన. 177**

**ప్రతి :** ఇందు= చంద్రునివంటి; వదన= ముఖం కలదైన, సత్యభామ; సౌవర్ణ= బంగారంతో చేసిన; కంకణ= చేతి కడియాలయొక్క; ఝుణఝుణ= ఝుణఝుణ అనే; నినదంబు= ధ్వని; శింజినీ= అల్లెత్రాటియొక్క; రవముతోన్= ధ్వనితో; చెలిమి+చేయన్= స్నేహంచేయగా, ఒకటి కాగా; తాటంక= చెవికమ్మలయందలి; మణి= మణులయొక్క; గణ= సమూహం యొక్క; ధగధగ= ధగధగమనే; దీప్తులు= కాంతులు; గండమండల= చెక్కిళ్ల ప్రాంతంలోని; రుచిన్= కాంతిని; కప్పికొనన్+కన్= కప్పివేయగా; ధవళతర= మిక్కిలి తెల్లనివయిన; అపాంగ= కడకన్నులయొక్క; ధళధళ= ధళధళమనే; రోచులు= కాంతులు; బాణ= బాణాల; జాల= సమూహంయొక్క; ప్రభా= కాంతుల; పటలిన్= గుంపును; అడఁపన్= అణచివేయగా; శర= బాణాలయొక్క; ఘాత= దెబ్బల; ఘుమఘుమ= ఘుమఘుమ అనే; శబ్దంబు= ధ్వని; పరిపంథి= శత్రువుల; సైనిక= సైనికులయొక్క; కలకల= కలకలమనే; స్వనమున్= ధ్వనిని; ఉడుపన్= ఆపగా; వీర శృంగార, భయ, రౌద్ర, విస్మయములు= వీరం, శృంగారం, భయానకం, రౌద్రం, అద్భుతాలు అనే రసాలు; కలసి= కూడి; భామిని= ఈ వీరనారి; అయ్యెనో కాక=

అయ్యెనేమో; అనఁగన్= అని అనునట్లుగా; ఇషువున్= బాణమును; తొడుగుట= కూర్చుట; తివుచుట= లాగడం; ఏయుట= ప్రయోగించడం; ఎల్లన్= అనేవి అన్నీ; ఎఱుఁగరాక+ఉండన్= తెలియకుండ; అని= యుద్ధం; చేసెన్= చేసింది.

**తా :** సత్యభామ యుద్ధం చేసేటప్పుడు ఆమెబంగారుగాజుల ఝణఝణధ్వనీ, అల్లెత్రాటిధ్వనీ ఏకమయ్యాయి.ఆమె చెవిపోగులలో పొదిగిన మణుల ధగధగమనే కాంతులు చెక్కిళ్లకాంతులను కప్పివేశాయి. ఆమెకడగన్నుల తళతళమనే కాంతులు బాణాల కాంతులను అణచి వేశాయి. ఆమె ఏయుచున్న బాణాల ఘుమఘుమారావం, సైనికుల కలకలాన్ని మాన్పింది. వీర–శృంగార–భయానక–రౌద్ర–అద్భుత రసాలు కలసి, ఈ వీరనారిగా రూపొందిందేమో అని అనుకొనునట్లుగా ఆమె కనబడుతూంది. ఆమె ఎప్పుడు బాణాన్ని వింటియందు కూర్చుతూ ఉందో, ఎప్పుడు నారిని లాగుతూ ఉందో! ఎప్పుడు బాణాన్ని ప్రయోగిస్తుందో తెలియడం లేదు.

**మ. పరుఁజూచున్ వరుఁజూచు నొంప నలరింపన్, రోషరాగోదయా**
**విరతభ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారమున్**
**జరగన్, గన్నులఁ గెంపు సొంపుఁ బరఁగం జండాస్త్రసందోహమున్**
**సరసాలోకసమూహమున్ నెఱపుచుం జంద్రాస్య హేలాగతిన్. 178**

**ప్రతి :** చంద్ర+ఆస్య= చంద్రుని పోలిన ముఖం కలదైన, సత్యభామ; హేలా= విలాసంతో కూడిన; గతిన్= పోకడతో; రోష= కోపంయొక్క; రాగ= ప్రేమయొక్క; ఉదయ= పుట్టుకచేత; అవిరత= ఎడతెగని; భ్రూకుటి= బొమముడితో; మందహాసములతోన్= చిరునవ్వుతో; వీరంబు= వీరం; శృంగారమున్= శృంగారం; జరగన్= వ్యాపింపగా; కన్నులన్= కన్నులలో; కెంపు= క్రోధంవల్ల కలిగిన ఎరుపు; సొంపున్= అనురాగంచేత కలిగిన సొగసు; పరఁగన్= కనబడగా; చండ= తీక్ష్ణమయిన; అస్త్ర= మంత్రపూర్వకంగా విడిచే బాణాలయొక్క; సందోహమున్= సమూహాన్ని; సరస= రసవంతమయిన; ఆలోక= చూపులయొక్క; సమూహమున్= పరంపరను; నెఱపుచున్= ప్రసరింపజేస్తూ; పరున్= వైరిని; నొంపన్= బాధింపగా; చూచున్= ప్రయత్నించును; వరున్= భర్తను; అలరింపన్= సంతోషింపజేయగా; చూచున్= చూడసాగింది.

**తా :** సత్యభామ ఒయ్యారపుపోకడలు పోతూ రోషంతో ఏర్పడిన బొమముడులతో, వీరరసం అతిశయించగా, వాడి అయిన అస్త్రాలను ప్రయోగిస్తూ నరకాసురుణ్ణి పీడించటానికి ప్రయత్నించింది. అనురాగంవల్ల జనించిన చిరునవ్వులు చిందిస్తూ, శృంగారరసం ఉద్దీపింపగా; కన్నులలో సొగసు కనబడగా; రసమయములయిన చూపులను ప్రసరింపజేస్తూ భర్త అయిన శ్రీకృష్ణుణ్ణి ఆనందింపజేయటానికి ప్రయత్నించింది. ఇలా వీర శృంగారాల్ని ఒక్కట ప్రదర్శించిన వీర శృంగారనారి సత్యభామ.

**మ. అలినీలాలక చూడ నొప్పెసఁగెఁ బ్రత్యాలీఢపాదంబుతో**
**నలికస్వేదవికీర్ణకాలకలతో నాకర్ణికానీత స**
**ల్లలితజ్యానఖపుంఖ దీధితులతో లక్ష్యావలోకంబుతో**
**వలయాకారధనుర్విముక్తవిశిఖవ్రాతాహతారాతియై. 179**

**ప్రతి :** అలి= తుమ్మెదలవలె; నీల= నల్లనైన; అలక= ముంగురులు కలది (సత్యభామ); ప్రత్యాలీఢ పాదంబుతోన్= విలుకాడు ఎడమకాలు ముందుంచి యుద్ధంచేయ నిలిచిన భంగిమతో; అలిక= నుదుటిపైగల; స్వేద= చెమటయందు;

వికీర్ణక= మిక్కిలి చెదరిన; అలకలతోన్= ముంగురులతో; ఆకర్ణిక = చెవివరకు; ఆనీత= తీసుకొనిరాబడిన (లాగిన); సత్= గట్టిదయిన; లలిత= అందమైన; జ్యా= అల్లెత్రాటిని; నఖ= పట్టుకొన్న చేతిగోళ్ళయొక్క; పుంఖ= బాణం వెనుక చివర యొక్క; దీధితులతోన్= కాంతులతో; లక్ష్య= గురి తప్పని; అవలోకంబుతోన్= చూపుతో; వలయ+ఆకార= గుండ్రని రూపం పొందిన; ధనుస్= వింటినుండి; విముక్త= వదలబడిన; విశిఖ= బాణాలయొక్క; వ్రాత= సమూహాలచేత; ఆహత= చావగొట్టబడిన; అరాతి+ఐ= శత్రువులు కలదై; చూడన్= చూచుటకు; ఒప్పు+ఎసఁగెన్= సొగసు అతిశయించింది.

**తా :** సత్యభామ సొగసు – ఉట్టి పడేటట్లు రాక్షసులతో యుద్ధం చేసేటప్పుడు విలుకానివలె ఎడమకాలు ముందుంచి నిలిచింది. ఆమె ముంగురులు నొసలి చెమటలో చెదిరాయి. ఆమె చెవివరకు లాగిన అల్లెత్రాటిని పట్టుకొన్న చేతివ్రేళ్ల గోళ్ల కాంతులూ, అమ్ముల వెనుక భాగపు కాంతులూ అంతటా వ్యాపిస్తున్నాయి. ఆమె చూపు గురి తప్పలేదు. ఆమె నారిని లాగటంవల్ల గుండ్రంగా అయిన వింటినుండి బాణాలు వదలి శత్రువుల్ని సంహరించింది. ఇలా సత్యభామ తన యుద్ధవిద్యావైశారద్యాన్ని ప్రదర్శించింది.

**సీ. 'బొమ్మ పెండ్లిండ్లకుఁ బోనొల్ల' నను బాల రణరంగమున కెట్లు రాఁ దలంచె?**
**మగవారిఁ గనినఁ దా మఱుఁగు చేరెడు నింతి పగవారి గెల్వ నే పగిదిఁ జూచెఁ?**
**బసిఁడియుయ్యేల లెక్క భయ మందు భీరువు ఖగపతిస్కంధ మే కడిఁది నెక్కె?**
**సఖుల కోలాహలస్వనము లోర్వనికన్య పటహభాంకృతుల కెబ్భంగి నోర్చె?**

**ఆ. నీలకంఠములకు నృత్యంబుఁ గఱపుచుఁ, నలసి తలఁగిపోవు నలరుఁబోఁడి**
**యే విధమున నుండె నెలమి నాలీఢాది, మానములను రిపులమాన మడఁప? 180**

**ప్రతి :** బొమ్మపెండ్లిండ్లకున్= బొమ్మల పెళ్లిళ్లకు; పోన్= పోవడానికి; ఒల్లన్= ఇష్టపడను; అను= అనే; బాల= బాలిక; రణరంగమునకున్= యుద్ధభూమికి; ఎట్లు= ఏ విధంగా; రాన్= వచ్చుటకు; తలంచెన్?= నిశ్చయించింది; మగవారిన్= పురుషుల్ని; కనినన్= చూస్తే; తాన్= తాను; మఱుఁగుచేరెడు= చాటుకు వెళ్లే; ఇంతి= స్త్రీ; పగవారిన్= శత్రువులను; గెల్వన్= గెల్వడానికి; ఏ పగిదిన్= ఏ విధంగా; చూచెన్= చూచింది?; పసిఁడి= బంగారంతో చేసిన; ఉయ్యేలు= ఉయ్యాల్ని; ఎక్కన్= ఎక్కడానికి; భయము+అందు= భయపడే; భీరువు= పిరికిది; ఖగపతి= పక్షిరాజయిన గరుత్మంతుని; స్కంధము= మూపు; ఏ+కడిఁదిన్= ఏ సాహసంచేత; ఎక్కెన్= ఎక్కెను?; సఖుల= చెలికత్తెలయొక్క; కోలాహల= కలకలంయొక్క; స్వనములు= ధ్వనులు; ఓర్వని= సహింపని; కన్య= ఈ చిన్నది; పటహ= యుద్ధవాద్యపు మ్రోతలయిన; భాంకృతులకున్= భాంకారాలకు; ఏ+భంగిన్= ఏ రీతిగా; ఓర్చెన్= ఓర్చుకొనింది?; నీలకంఠములకున్= నెమళ్లకు; నృత్యంబున్= నృత్యమును; కఱపుచున్= నేర్పుతు; అలసి= బడలిక పొంది; తలఁగిపోవు= తొలగిపోవు; అలరురు+పోఁడి= పూవువలె సుకుమారమైన శరీరం కలది; ఏ విధమునన్= ఏ రీతిగా; ఆలీఢ= కుడికాలు ముందుంచి బాణప్రయోగం చేయుట; ఆది= మొదలయిన; మానములను= (పాదాలను చాచే) పద్ధతులతో; రిపుల= శత్రువుల; మానం= రోషాన్ని; అడఁపన్= అణచివేయగా; ఎలమిన్= ప్రీతితో; ఉండెన్= సిద్ధమయింది?

**తా :** బొమ్మలపెళ్లిళ్లకు వెళ్లటాని కంగీకరించని బాలిక యుద్ధరంగాని కేవిధంగా రావాలనుకొనింది? మగవాళ్ళను చూచి చాటుకు వెళ్లే మహిళ శత్రువుల్ని జయించాలని ఎట్లా నిశ్చయించింది? బంగరు టుయ్యాలల్ని ఎక్కటానికి భయపడే

పిరికిది గరుత్మంతుని మూపు ఏ తీరుగా ఎక్కింది? చెలికత్తెల పెద్దరొదలను సహింతచని చిన్నది యుద్ధవాద్య భాంకారాలను ఏ రకంగా ఓర్చుకొన్నది? నెమళ్లకు నృత్యం నేర్పుతూ కొంచెం సేపటికే అలసిపోయే సుకుమారి ఆలీఢపాదాదిపద్ధతులతో శత్రువుల గర్వం అణచివేయటానికి ఏ విధంగా సిద్ధపడింది?

**సీ. వీణెఁ జక్కఁగఁ బట్ట వెర వెఱుంగని కొమ్మ బాణాసనం బెట్లు పట్ట నేర్చె?**
**ప్రాఁకునఁ దీఁగెఁ గూర్పంగ నేరని లేమ గుణము నే క్రియ ధనుఃకోటిఁ గూర్చె?**
**సరవి ముత్యము గ్రువ్వఁజాలని యబల యే నిపుణత సంధించె నిశితశరముఁ?**
**జిలుకకుఁ బద్యంబు సెప్పనేరని తన్వి యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ?**

**ఆ. బలుకు మనినఁ బెక్కు పలుకని ముగుద యే, గతి నొనర్చె సింహగర్జనములు?**
**ననఁగ మెఱసెఁ ద్రిజగదభిరామ, గుణధామ, చారుసత్యభామ, సత్యభామ. 181**

**ప్రతి :** వీణెన్= వీణను; చక్కన్+కాన్= సరిగ్గా; పట్టన్= పట్టుకోవడానికి; వెరవు= ఉపాయం; ఎఱుంగని= తెలియని; కొమ్మ= స్త్రీ (సత్యభామ); బాణ+ఆసనంబు= విల్లు; ఎట్లు= ఏ విధంగా; పట్టనేర్చెన్?= పట్టుకోవడం నేర్చింది?; ప్రాఁకునన్= చెట్టుకు; తీఁగెన్= లతను; కూర్పన్+కన్= అల్లుకొనేటట్లు కట్టడం; నేరని= చేతకాని; లేమ= స్త్రీ; ఏ క్రియన్= ఏ విధంగా; గుణంబు= అల్లెత్రాటిని; ధనుస్+కోటిన్= వింటికొనయందు; కూర్చెన్?= అమర్చింది?; సరవి= క్రమంగా; ముత్యము= ముత్యాన్ని; క్రువ్వన్+చాలని= క్రుచ్చుటకు అశక్తురాలయిన; అబల= మృదు (స్త్రీ); ఏ; నిపుణతన్= ఏ నేర్పుతో; నిశిత= వాడియైన; శరమున్= బాణాన్ని; సంధించెన్?= ఎక్కుపెట్టింది?; చిలుకకున్= చిలుకకు; పద్యంబు= పద్యాన్ని; చెప్పనేరని= చెప్పడం నేర్చని; తన్వి= స్త్రీ; ఎన్నఁడు= ఎప్పుడు; అస్త్రమంత్రములు= అస్త్రాలకు సంబంధించిన మంత్రాలు; అభ్యసించెన్?= నేర్చుకొనింది?; పలుకుము= చెప్పమ్మ; అనినన్= అని అడుగగా; పెక్కు= పలుమాటలు; పలుకని= చెప్పలేని; ముగుద= ముగ్ధ; సింహగర్జనములు= యుద్ధవీరుల హుంకారాలను; ఏ గతిన్= ఏ విధంగా; ఒనర్చెన్= చేసింది?; అనన్+కన్= అనుకొనేటట్లుగా; త్రిజగత్= మూడులోకాల్లో; అభిరామ= మనోహరమయిన; గుణ= సుగుణాలకు; ధామ= నిలయమయింది; చారు= మనోజ్ఞమయిన; సత్య= నిజమయిన; భామ= ప్రకాశం కలది అయిన, సత్యభామ; మెఱసెన్= ప్రకాశించింది.

**తా :** వీణను చక్కగా పట్టుకోలేని వనిత వింటిని ఏ విధంగా పట్టగలిగింది? తీగను చెట్టుకు కట్టలేని మహిళ ఏ విధంగా వింటిచివర అల్లెత్రాటిని బిగించింది? క్రమంగా ముత్యాలు గ్రుచ్చలేని అబల ఏవిధంగా అల్లెత్రాటితో బాణాన్ని సంధించింది? చిలుకకు పద్యం చెప్పలేని అశక్తురాలు అస్త్రమంత్రాలు ఎప్పుడు నేర్చుకొనింది? మాట్లాడ మన్నప్పుడు ఎక్కువసేపు మాట్లాడలేని అమాయకురాలు ఏ విధంగా సింహనాదాలు చేసింది? - అని అనుకొనేటట్లుగా సద్గుణరాశీ, మనోజ్ఞకాంతిసంపన్న ఐన సత్యభామ ప్రకాశించింది.

**శా. జ్యావల్లీధ్వని గర్జనంబుగ, సురల్ సారంగ యూథంబుగా,**
**నా వి ల్లింద్రశరాసనంబుగ, సరోజాక్షుండు మేఘంబుగాఁ,**
**దా విద్యుల్లతభంగి నింతి సురజిద్దావాగ్నిమగ్నంబుగాఁ**
**బ్రావృట్కాలము సేసె బాణచయ మంభశ్శీకరశ్రేణిగాన్. 182**

**ప్రతి :** ఇంతి= స్త్రీ, సత్యభామ; జ్యావల్లీ= తీగవంటి అల్లెత్రాటియొక్క; ధ్వని= శబ్దం; గర్జనంబు+కన్= ఉరుముగా; సురల్= దేవతలు; సారంగ= చాతకపక్షులయొక్క; యూథంబుగాన్= సమూహంగా; ఆ= ప్రసిద్ధమయిన; విల్లు= శార్ఙ్గధనుస్సు; ఇంద్రశర+ఆసనంబుగన్= ఇంద్రధనుస్సుగా; సరోజ= పద్మాలవంటి; అక్షుండు= కన్నులగలవాడు; శ్రీకృష్ణుడు; మేఘంబు+కాన్= మేఘంగా; తాన్= తాను; విద్యుల్లతభంగిన్= మెఱపుతీగగా; సురజిత్= దేవతలను జయించిన రాక్షసులనెడి; దావాగ్ని= కార్చిచ్చు; మగ్నంబు+కాన్= మునిగిపోగా; ఆరిపోగా; బాణ= బాణాలు; చయము= సమూహం; అంభస్= నీటియొక్క; శీకర= తుంపురుల; శ్రేణి+కాన్= వరుసగా; జల్లుగా; ప్రావృట్కాలము= వర్షాకాలం; చేసెన్= ప్రకృతిలో హఠాత్తుగా మార్పు కల్గించింది.

**తా :** సత్యభామ, అల్లెత్రాటిమ్రోత ఉరుముగా, దేవతలు చాతకపక్షులుగా, ధనుస్సు ఇంద్రధనుస్సుగా, శ్రీకృష్ణుడు మేఘంగా, తాను మెఱపుతీగగా, బాణాలు నీటితుంపురులుగా, రాక్షసులు అనే కార్చిచ్చు ఆరిపోగా వర్షాకాలాన్ని సృష్టించింది.

**సీ. రాకేందుబింబమై రవిబింబమై యొప్పు నీరజాతేక్షణ నెమ్మొగంబు,**
**కందర్పకేతువై ఘనధూమకేతువై యలరుఁ బూఁబోఁడిచేలాంచలంబు,**
**భావజుపరిధియై ప్రళయార్కుపరిధియై మెఱయు నాకృష్టమై మెలఁత చాప,**
**మమృతప్రవాహమై యనలసందోహమై తనరారు నింతిసందర్శనంబు,**

**తే హర్షదాయియై మహారోషదాయియై, పరఁగు ముద్దరాలిబాణవృష్టి,**
**హరికి నరికిఁ జూడ నందంద శృంగార, వీరరసము లోలి విస్తరిల్ల. 183**

**ప్రతి :** శృంగారవీరరసములు= శృంగారరసం, వీరరసం; అందున్+అందున్= అక్కడక్కడే; ఓలిన్= క్రమంగా; విస్తరిల్లన్= అతిశయింపగా; హరికిన్= శ్రీకృష్ణునికి; అరికిన్= వైరికీ; నరక+అసురన్= నరకాసురునికి; చూడన్= చూడగా; నీరజాత= పద్మాలవంటి; ఈక్షణ= కన్నులుగల ఆమెయొక్క, సత్యభామయొక్క; నెమ్మొగంబు (నెఱి+మొగంబు)= అందమైన ముఖం; రాకా= పున్నమినాటి; ఇందుబింబము= చంద్రబింబం; ఐ=అయి; రవిబింబము= సూర్యబింబం; ఐ= అయి; ఒప్పున్= ప్రకాశిస్తూంది; పూఁబోడి= పుష్పంవలె మనోజ్ఞమైన దేహంగల ఆమెయొక్క, సత్యభామయొక్క; చేల= చీరయొక్క; అంచలంబు= కొంగు; కందర్ప= మన్మథునియొక్క; కేతువు+ఐ= జెండాయై; ఘన= పెద్దదియగు; ధూమకేతువు+ఐ= తోకచుక్కయై; అలరున్= ఒప్పుతూంది; మెలఁత= స్త్రీ యొక్క, సత్యభామయొక్క; చాపము= ధనుస్సు; ఆకృష్టము+ఐ= లాగబడిందై; భావజు= మన్మథునియొక్క; పరిధి+ఐ= కాంతిమండలమై; ప్రళయ= ప్రళయకాలంనాటి; అర్కు= సూర్యునియొక్క; పరిధి+ఐ= దివ్యప్రభగలిగి (కాంతిపుంజములచే చుట్టబడి); మెఱయున్= వెలుగుతూంది; ఇంతి= స్త్రీయొక్క, సత్యభామయొక్క; సందర్శనంబు= చూచుట; అమృతప్రవాహము+ఐ= అమృతప్రవాహమై; అనల= అగ్నియొక్క; సందోహము+ఐ= సమూహమై; తనరారున్= ఒప్పుతూంది; ముద్దరాలి= ముగ్ధయగు సత్యభామయొక్క; బాణవృష్టి= బాణవర్షం; హర్షదాయి= సంతోషాన్ని ఇచ్చేది; ఐ= అయి; మహత్+రోష= అధిక కోపాన్ని; దాయి+ఐ= కలిగించేదై; పరఁగున్= అతిశయిస్తూంది.

**తా :** శృంగారరసం అతిశయించటం చేత ప్రియుడయిన శ్రీకృష్ణునికి సత్యభామ ముఖం పూర్ణిమనాటి చంద్రబింబమై, చీరకొంగు మన్మథధ్వజమై, గుండ్రని విల్లు మన్మథుని కాంతిమండలమై, ఆమె సందర్శనం అమృత ప్రవాహమై, బాణవర్షం సంతోషదాయకమై గోచరించాయి. వీరరసం విజృంభించటంవల్ల శత్రువయిన నరకాసురునికి సత్యభామ ముఖం

సూర్యబింబంగా, పయ్యెదకొంగు అరిష్టహేతువయిన తోకచుక్కగా; గుండ్రని విల్లు ప్రళయకాలం నాటి సూర్యుని ప్రభాపుంజంగా, ఆమెసందర్శనం అగ్నిజ్వాలాసమూహంగా, బాణవర్షం మహాకోపప్రదంగా కనబడింది. శృంగారవీరరసాల్ని ఇలా హరికి, అరికి మధ్య విస్తరింపజేసింది సత్య!

**విశే :** ఈ నరకాసురవధాఘట్టాన్ని పోతన నాచనసోముని ఉత్తర హరివంశంనుండి గ్రహించి, రూపొందించాడు.

**వ. ఇ వ్విధంబున. 184**

**ప్రతి :** ఈ+విధంబునన్...

**తా :** ఈ తీరున

**క. శంపాలతాభ బెడిదపు, టంపఱచే ఘోరదానవానీకంబుల్**
**పెంపఱి సన్నాహంబుల, సొంపఱి భూసుతుని వెనుకఁ జొచ్చెన్ విచ్చెన్. 185**

**ప్రతి :** శంపాలతా= మెరుపుతీగతో; ఆభ= సమాన అయిన సత్యభామయొక్క; బెడిదము= వాడియైన; అంపఱచేన్= బాణపరంపరచే; ఘోర= భయంకరమయిన; దానవ= రాక్షసుల; అనీకంబుల్= సేనలు; పెంపఱి= పెంపుచెడి; సన్నాహంబులన్= యుద్ధప్రయత్నాలలో; సొంపఱి= సమృద్ధి నశించి; భూసుతుని= భూదేవి కుమారుడైన; నరకాసురుని యొక్క; వెనుకన్+చొచ్చెన్= వెనుక చేరాయి; విచ్చెన్= చెల్లాచెదరయ్యాయి.

**తా :** సత్యభామ ప్రయోగించిన వాడి బాణాలకు తాళజాలక పెంపుచెడి, సమృద్ధి కోల్పోయి యుద్ధ ప్రయత్నాలు చేయలేక రాక్షససేనలు నరకాసురుని మరుగుజొచ్చాయి. చెదరిపోయాయి.

**వ. అ య్యవసరంబునం గంససంహారి మనోహారిణిం జూచి సంతోషకారియుం, గరుణారసావలోకన ప్రసారియు, మధురవచనసుధారసవిసారియుం, దదీయసమరసన్నాహనివారియునై యిట్లనియె. 186**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; కంస సంహారి= కంసుణ్ణి చంపినవాడు; శ్రీకృష్ణుడు; మనోహారిణిన్= మనస్సును ఆకర్షించే, సత్యభామను; చూచి= కనుగొని; సంతోషకారియున్= సంతోషం కలిగించేవాడును; కరుణారస= దయారసంతో కూడిన; ఆలోకన= చూపులను; ప్రసారియున్= ప్రసరింపజేసేవాడును; మధుర= తియ్యనైన; వచన= పలుకులు అనే; సుధారస= అమృతరసాన్ని; విసారియున్= వ్యాపింపజేసేవాడును; తదీయ= ఆమెయొక్క; సమరసన్నాహ= యుద్ధప్రయత్నాన్ని; నివారియున్= నివారించేవాడును; ఐ= అయి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తా :** అప్పుడు శ్రీకృష్ణుడు సత్యభామను చూచి సంతోషం కలిగించేవాడు, దయతో చూచేవాడు; అమృతంవంటి మాటలు పలికేవాడు, ఆమె యుద్ధప్రయత్నాల్ని నివారించేవాడూ అయి ఇట్లా అన్నాడు.

**క. 'కొమ్మా! దానవనాథుని, కొ మ్మాహవమునకుఁ దొలఁగె గురువిజయముఁ గై**
**కొమ్మా! మెచ్చితి నిచ్చెదఁ, గొ మ్మాభరణములు నీవు గోరిన వెల్లన్.' 187**

**ప్రతి :** కొమ్మా!= ప్రియురాలా! దానవనాథుని= రాక్షసరాజుయొక్క; కొమ్ము= సైన్యం; యుద్ధమునకున్= యుద్ధంనుండి; తొలఁగెన్= వైదొలగింది; గురు= గొప్ప; విజయమున్= విజయాన్ని; కైకొమ్మా!= పొందుమా!; మెచ్చితిన్= మెచ్చుకొన్నాను; నీవు; కోరినవి+ఎల్లన్= కోరినవన్నీ; ఆభరణములు= నగలు; ఇచ్చెదన్= ఒసగెదను; కొమ్ము= తీసుకో.

**తా :** సత్యా! రాక్షసరాజుసైన్యం యుద్ధరంగంనుండి పారిపోయింది. నీవు మహావిజయం పొందావు. నిన్ను మెచ్చాను. నీవు కోరిన సొమ్ములన్నీ ఇస్తాను. స్వీకరించు.

**వ. అని పలికి సమ్మానరూపంబులును, మోహనదీపంబులును, దూరీకృతచిత్తవిక్షేపంబులు నైన సల్లాపంబులం గళావతిం దద్దయుఁ బెద్దఱికంబు సేసి, తత్కరకిసలయోల్లసితబాణాసనంబు మరల నందు కొనియె, నప్పుడు సురవైరి మురవైరి కిట్లనియె. 188**

**ప్రతి :** అని; పలికి; సమ్మాన= గౌరవంయొక్క; రూపంబులును= లక్షణాలు కలవీ; మోహన= మోహాన్ని; దీపంబులును= ప్రకాశింపజేసేవి; దూరీకృత= దూరంగా చేయబడిన; చిత్త= మనస్సుయొక్క; విక్షేపంబులును= కలవరపాట్లు కలవియు; ఐన= అయిన; సల్లాపంబులన్= మంచిమాటలతో; కళావతిన్= కళలుగలదైన, సత్యభామను; తద్దయున్= మిక్కిలి; పెద్దఱికంబు+చేసి= మన్ననచేసి; తత్= ఆమెయొక్క; కరకిసలయ= చిగురాకువంటి చేతియందు; ఉల్లసిత= ప్రకాశిస్తున్నట్టి; బాణ+ఆసనంబు= విల్లును; మరలన్= తిరిగి; అందుకొనియెన్= తీసుకొన్నాడు; అప్పుడు; సురవైరి= దేవతల శత్రువు; నరకాసురుడు; మురవైరికిన్= మురాసురుని శత్రువు అయిన, శ్రీకృష్ణునితో; ఇట్లు; అనియెన్= ఇట్లన్నాడు...

**తా :** శ్రీకృష్ణుడు గౌరవాన్ని వెల్లడించేవీ, మోహాన్ని పుట్టించేవీ, మనస్సునందలి కలతలను దూరంచేసేవీ అయిన సరస సల్లాపాలతో కళావిశారద అయిన సత్యభామను బహుమానించి ఆమె చేతిలో ఉన్న వింటిని తిరిగి తీసుకొన్నాడు. అప్పుడు నరకాసురుడు అతనితో ఇలా అన్నాడు.

**క. మగువ మగవారి ముందఱ, మగతనములు సూప రణము మానుట నీకున్**
**మగతనము గాదు; దనుజులు, మగువల దెసఁ జనరు మగలమగ లగుట హరీ! 189**

**ప్రతి :** హరీ!= శ్రీకృష్ణా!; మగువ= ఆడుది; మగవారి ముందఱన్= పురుషుల యెదుట; మగతనములు= పౌరుషాలు; చూపన్= ప్రదర్శిస్తే; రణము= యుద్ధం; మానుట= విరమించడం; నీకున్= నీకు; మగతనము= పౌరుషం; కాదు; దనుజులు= రాక్షసులు; మగలమగలు= మగవాళ్లకు మగవాళ్లం (వీరులకే వీరులం); అగుటన్= అగుటచే; మగువలదెసన్= స్త్రీలవైపునకు; చనరు= వెళ్లరు.

**తా :** శ్రీకృష్ణా! ఆడుది మగవారిముందు పౌరుషం ప్రదర్శిస్తున్నప్పుడు నీవు యుద్ధం మానటం పౌరుష మనిపించుకోదు. రాక్షసులు వీరులకే వీరులు కావటంవల్ల అబలలతో యుద్ధం చేయరు.

**వ. అనిన హరి యిట్లనియె. 190**

**తా :** నరకాసురు డారీతిగా పలుకగా శ్రీకృష్ణుడు ఈ విధంగా అన్నాడు.

**క. 'నరకా! ఖండించెద మ, త్కరకాండాసనవిముక్తఘనశరముల భీ**
**కరకాయు నిన్ను సుర కి, న్నరకాంతలు సూచి నేఁడు నందం బొందన్.' 191**

**ప్రతి :** నరకా!= నరకాసురా! నేఁడు= ఇప్పుడు; భీకర= భయంకరమయిన; కాయున్= శరీరంకలవాడిని, నిన్ను; మత్= నాయొక్క; కర= చేతియందలి; కాండ+ఆసన= వింటినుండి; విముక్త= వదలిన; ఘన= గొప్పవయిన; శరములన్=

బాణాలతో; సుర+కిన్నర+కాంతలు= దేవతాస్త్రీలు, కిన్నర స్త్రీలు; చూచి= కనుగొని; నందంబు= ఆనందం; ఒందన్= పొందగా; ఖండించెదన్= చంపుతాను.

**తా :** ఓరీ నరకాసురా! దేవతాస్త్రీలు, కిన్నరాంగనలు చూచి సంతోషింపగా మహాభయంకరమైన శరీరం కలిగిన నిన్ను నేడే నా బాణాలతో సంహరిస్తాను.

**వ. అని పలికి హరి నరకాసురయోధులమీఁద శతఘ్ని యను దివ్యాస్త్రంబు ప్రయోగించిన నొక్క వరుసను వార లందఱు మహావ్యథం జెందిరి, మఱియును. 192**

**ప్రతి :** అని; పలికి; హరి= శ్రీకృష్ణుడు; నరకాసుర= నరకాసురుని; యోధులమీఁదన్= యుద్ధభటులమీద; శతఘ్ని; అను= అనే; దివ్య= దేవతా సంబంధమయిన; అస్త్రంబు= మంత్రపూర్వకంగా విడిచే బాణాన్ని; ప్రయోగించినన్= ప్రయోగించగా; ఒక్క వరుసను= ఒక్కసారిగా; వారలు; అందఱు; మహావ్యథన్= మహాసంక్షోభం; చెందిరి= పొందారు; మఱియును= ఇంకను...

**తా :** శ్రీకృష్ణుడు 'శతఘ్ని' అనే లోకాతీతమయిన అస్త్రాన్ని నరకాసురుని భటులమీద వేయగా వారందరూ మహాక్షోభకు గురి అయ్యారు.

**మ. శరవిచ్ఛిన్నతురంగమై పటుగదాసంభిన్నమాతంగమై,**
**యురుచక్రాహతవీరమధ్యపదబాహుస్కంధముఖ్యాంగమై,**
**సురభిత్సైన్యము దైన్యముం బొరయుచున్ శోషించి హైన్యంబుతో**
**హరి మ్రోలన్ నిలువంగ లేక పఱచెన్ హాహానినాదంబులన్. 193**

**ప్రతి :** సురభిత్= దేవతలను బ్రద్దలు చేసేవానియొక్క; నరకాసురునియొక్క; సైన్యము= సేన; శర= బాణాలచే; విచ్ఛిన్న= ఖండింపబడిన; తురంగము+ఐ= గుర్రాలు కలదై; పటు= దృఢమయిన; గదా= గదచేత; సంభిన్న= బ్రద్దలు చేయబడిన; మాతంగము+ఐ= ఏనుగులు కలదై; ఉరు= గొప్పదైన; చక్ర= చక్రంచేత; ఆహత= కొట్టబడిన; వీర= వీరులయొక్క; మధ్య= నడుములు; పద= పాదాలు; బాహు= భుజాలు; స్కంధ= మూపులు; ముఖ్య= మొదలైన; అంగము+ఐ= అవయవాలు కలదై; దైన్యమున్= దురవస్థను; పొరయుచున్= పొందుతూ; శోషించి= బలం కోల్పోయి; హైన్యంబుతోన్= హీనత్వంతో; హరి= శ్రీకృష్ణునియొక్క; మ్రోలన్= సమీపంలో; నిలువ+కన్ లేక= నిలబడలేక; హాహానినాదంబులన్= దుఃఖంవల్ల చేసే 'హాహా' అనే ధ్వనులతో, హాహాకారాలతో; పఱచెన్= పారిపోయింది.

**తా :** శ్రీకృష్ణుని బాణాలచేత ఖండించిన గుర్రాలూ; గదచేత బ్రద్దలుచేసిన ఏనుగులూ, చక్రంచేత అవయవాలు తెగకొట్టబడిన వీరులూ గలదైన రాక్షససైన్యం దురవస్థపాలై, దుర్బలమై, హీనదశకు వచ్చి, అతనియెదుట నిలువలేక హాహాకారాలు చేస్తూ పారిపోయింది.

**వ. అప్పుడు. 194**

**తా :** ఆ సమయంలో

**ఆ. మొనసి దనుజయోధముఖ్యులు నిగుడించు, శస్త్రసముదయముల జనవరేణ్య!**
**మురహరుండు వరుస మూఁడేసి కోలల, ఖండితంబు సేసె గగనమందు. 195**

**ప్రతి :** జనవరేణ్య!= పరీక్షిన్మహారాజా! ముర= మురాసురుని; హరుండు= చంపినవాడు; శ్రీకృష్ణుడు; దనుజయోధ= రాక్షసయోధులలో; ముఖ్యులు= అగ్రగణ్యులు; మొనసి= పూనుకొని; కదనము+అందున్= యుద్ధంలో; నిగుడించు= ఏసే; శస్త్ర= బాణాల; సముదయములన్= సమూహాలను; వరుసన్= క్రమంగా; మూఁడేసి కోలలన్= మూడు మూడు బాణాలతో; ఖండితంబు+చేసెన్= ముక్కలుగా చేశాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుడు రాక్షసయోధశ్రేష్ఠులు ప్రయోగించిన బాణాల్ని మూడుమూడు బాణాలను తడవ తడవకు వేసి, ముక్కముక్కలు చేశాడు.

**క. వెన్నుని సత్యను మోచుచుఁ, బన్నుగఁ బదనఖరచంచుపక్షాహతులన్**
**భిన్నములు సేసె గరుడుఁడు, పన్నిన గజసముదయములఁ బౌరవముఖ్యా! 196**

**ప్రతి :** పౌరవ= పురుచక్రవర్తి (యయాతి కుమారుడు) వంశీయులలో; ముఖ్యా!= శ్రేష్ఠుడా!; వెన్నునిన్= శ్రీకృష్ణుణ్ణి; సత్యను= సత్యభామను; మోచుచున్= మూపున మోస్తూ; గరుడుఁడు= గరుత్మంతుడు; పద= పాదాల; నఖర= గోళ్లయొక్క; చంచు= ముక్కుయొక్క; పక్ష= రెక్కలయొక్క; ఆహతులన్= చీల్చడం, పొడవడం, కొట్టడం అనే పనులతో; పన్నిన= యుద్ధానికి సిద్ధం చేసిన; గజ= ఏనుగుల; సముదయములన్= గుంపులను; పన్నుగన్= ఒప్పునట్లుగా; భిన్నములు+చేసెన్= ఛేదించాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుణ్ణీ, సత్యభామను మూపున మోస్తూ, గరుత్మంతుడు యుద్ధానికి సిద్ధపరచిన నరకాసురుని గజబలాన్ని గోళ్లతో రక్కాడు. ముక్కుతో పొడిచాడు. రెక్కలతో బాదాడు.

**వ. మఱియును విహగరాజపక్షవిక్షేపణసంజాతవాతంబు సైరింపం జాలక హతశేషంబైన సైన్యంబు పురంబు సొచ్చుటం జూచి నరకాసురుండు మున్ను వజ్రాయుధంబుం దిరస్కరించిన తనచేతిశక్తిం గొని గరుడుని వైచె, నతండును విరులదండవ్రేటునఁ జలింపని మదోద్దండవేదండంబునుంబోలె విలసిల్లె, న య్యవసరంబున గజారూఢుండై కలహరంగంబున. 197**

**ప్రతి :** మఱియున్= ఇంకనూ; విహగరాజ= పక్షిరాజయిన గరుత్మంతునియొక్క; పక్ష= రెక్కల్ని; విక్షేపణ= ఆడించడంచేత; సంజాత= పుట్టిన; వాతంబు= గాలిని; సైరింపన్= ఓర్చుకోడానికి; చాలక= సమర్థంకాక; హతశేషంబు= మరణించగా మిగిలింది; ఐన= అయినట్టి; సైన్యంబు= సేన; పురంబు= ప్రాగ్జ్యోతిషపురాన్ని; చొచ్చుటన్= ప్రవేశించడం; చూచి; నరకాసురుండు; మున్ను= పూర్వం; వజ్ర+ఆయుధంబున్= వజ్రాయుధాన్ని; తిరస్కరించిన= త్రిప్పికొట్టిన; తనచేతిశక్తిన్= తనచేతియందలి శక్తి అనే ఆయుధంతో; కొని= గురిగా చేసి; గరుడునిన్= గరుత్మంతుణ్ణి; వైచెన్= కొట్టాడు; అతండును= ఆ గరుత్మంతుడును; విరులదండ= పూలదండయొక్క; వ్రేటునన్= దెబ్బచేత; చలింపని= కదలని మెదలని; మద= మదంచేత; ఉద్దండ= భయంకరమైన; వేదండంబునున్+పోలెన్= ఏనుగువలె; విలసిల్లెన్= ఒప్పాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; గజ+ఆరూఢుండు= ఏనుగునెక్కినవాడు; ఐ= అయి; కలహరంగంబునన్= యుద్ధరంగంలో...

**తా :** గరుత్మంతుడు రెక్కలాడించటంవల్ల పుట్టిన గాలితాకుడు సహింపలేక – చావగా మిగిలిన సైన్యం పట్టణంలో ప్రవేశించింది. ఇది చూచి నరకాసురుడు పూర్వం వజ్రాయుధాన్నే త్రిప్పికొట్టిన తనశక్త్యాయుధాన్ని గరుడునిమీద ప్రయోగించాడు. గరుత్మంతుడు పూలదండవ్రేటుకు చలింపని మదగజంమాదిరిగా ఆ శక్తిదెబ్బకు తట్టుకొని నిలబడగలిగాడు. అప్పుడు ఏనుగునెక్కి నరకాసురుడు యుద్ధరంగంలో

**మ. సమదేభేంద్రము నెక్కి భూమిసుతుఁ డా చక్రాయుధున్ వైవ శూ**
**లము చేఁ బట్టిన నంతలోన రుచిమాలాభిన్నఘోరాసురో**
**త్తమ చక్రంబగు చేతిచక్రమున దైత్యధ్వంసి ఖండించె ర**
**త్నమయోదగ్రవినూత్నకుండలసమేతంబైన తన్మూర్ధమున్. 198**

**ప్రతి :** భూమిసుతుఁడు= భూదేవి కుమారుడు, నరకాసురుడు; సమద= మదంతో కూడిన; ఇభ+ఇంద్రమున్= గజరాజాన్ని; ఎక్కి; ఆ; చక్ర+ఆయుధున్= చక్రం ఆయుధంగా కల ఆ శ్రీకృష్ణుణ్ణి; వైవన్= కొట్టగా; శూలము; చేన్= చేతియందు; పట్టినన్= పట్టుకొనగా; అంతలోనన్= ఆ లోపలనే; దైత్య= రాక్షసులను; ధ్వంసి= నాశం చేసేవాడు, శ్రీకృష్ణుడు; రుచి= కాంతులయొక్క; మాలా= పరంపరచే; భిన్న= బ్రద్దలు చేయబడిన; ఘోర= భయంకరమైన; అసుర+ఉత్తమ= రాక్షస శ్రేష్ఠుల; చక్రంబు= సమూహం కలది; అగు= అయిన; చేతి చక్రమునన్= తనచేతియందలి సుదర్శనచక్రంతో; రత్నమయ= రత్నాలు పొదిగిన; ఉదగ్ర= గొప్పవయిన; వినూత్న= మిక్కిలిక్రొత్తవయిన; కుండల= చెవిపోగులతో; సమేతంబు= కూడింది; ఐన= అయిన; తద్= అతనియొక్క, నరకాసురునియొక్క; మూర్ధమున్= తలను; ఖండించెన్= నరికాడు.

**తా :** మదించిన ఏనుగు నెక్కి, నరకాసురుడు శ్రీకృష్ణుణ్ణి కొట్టటానికి శూలం చేపట్టాడు. అతడు శూలాన్ని చేతితో అందుకొనే లోపల శ్రీకృష్ణుడు తన కాంతిపరంపరచే రాక్షసవీరుల్ని ధ్వంసంచేసే చక్రాన్ని చేపట్టి, రత్నకుండలాలతో కూడిన అతనితలను నరికాడు.

**శా. 'ఇల్లాలం గిటియైన కాలమున మున్నే నంచు ఘోషింతు వో**
**తల్లీ! నిన్నుఁ దలంచి యైన నిచటం దన్నుం గృపం గావఁడే!**
**చెల్లంబో! తలఁ ద్రుంచె' నంచు నిల నాక్షేపించుచందంబునన్**
**ద్రెళ్లెం జప్పుడు గాఁగ భూమిసుతుఁ డుద్దీప్తాహవక్షోణిపై. 199**

**ప్రతి :** ఓ తల్లీ!= ఓ అమ్మా!; ఏన్= నేను; మున్ను= పూర్వం; కిటి= విష్ణువు దివ్యవరాహరూపంగా; ఐన కాలమునన్= అవతరించినప్పుడు; ఇల్లాలన్= భార్యను; అంచున్= అంటూ; ఘోషింతువు= చాటుతుంటావు; నిన్నున్= నిన్ను; తలంచి+ఐనన్= జ్ఞప్తికి తెచ్చుకొనియైనా; కృపన్= దయతో; తన్నున్= తనను; కావఁడు+ఏ= కాపాడడు గదా!; చెల్లంబో!= అయ్యో!; తలన్= తలను; త్రుంచెన్= నఱికెను; అంచున్= అంటూ; భూమిసుతుఁడు= భూదేవి కుమారుడు, నరకాసురుడు; ఇలన్= తల్లియైన భూదేవిని; ఆక్షేపించుచందంబునన్= నిందిస్తున్నట్లుగా; చప్పుడు+కాన్+కన్= శబ్దమయ్యేట్టుగా (రోదిస్తూ); ఉద్దీప్త= ప్రకాశించేదయిన (భయంకరమయిన); ఆహవ క్షోణిపైన్= యుద్ధభూమిమీద; త్రెళ్లెన్= పడ్డాడు.

**తా :** ఓ తల్లీ! "పూర్వం వరాహావతారసమయంలో నేను విష్ణువునకు భార్య నయ్యానని చాటుకొంటూ ఉంటావు. నిన్ను తలచి అయినా నన్ను కాపాడడు గదా! అయ్యో! నిర్దయుడై శిరస్సును ఖండించాడు" అని తల్లిని నిందిస్తున్నట్లు యుద్ధభూమిమీద రోదిస్తూ నరకాసురుడు పడిపోయాడు.

**క. 'కంటిమి నరకుఁడు వడఁగా, మంటిమి నేఁ'డనుచు వెస నమర్త్యులు మునులున్**
**మింటం బువ్వులు గురియుచుఁ, బంటింపక పొగడి రోలిఁ బద్మదళాక్షున్. 200**

**ప్రతి :** అమర్త్యులు= దేవతలు; మునులున్= మునులును; నరకుఁడు= నరకాసురుడు; నేఁడు= ఈనాడు; పడన్+కాన్= నేలగూలగా; కంటిమి= చూచాము; మంటిమి= బతికాము; అనుచున్= అంటూ; వెసన్= శీఘ్రంగా; మింటన్= ఆకాశంలో ఉండి; పువ్వులు; కురియుచున్= కురిపిస్తూ; పద్మదళ= తామర రేకులవంటి; అక్షున్= కన్నులు గలవాణ్ణి; శ్రీకృష్ణుణ్ణి; పంటింపక= సందేహించకుండా; ఓలిన్= క్రమంగా; పొగడిరి= స్తుతించారు.

**తా :** "నరకాసురుడు నేలగూలటం ఈ దినం కళ్లారా చూచాము. బ్రతికిపోయాము గదా!" అని దేవతలూ, మునులూ వెంటనే ఆకాశంనుండి పూలవాన కురిపిస్తూ, ఏ సందేహం లేకుండా శ్రీకృష్ణుణ్ణి స్తుతించారు.

**వ. అంత భూదేవి వాసుదేవుని దగ్గఱ నేతెంచి జాంబూనదరత్న మండితంబైన కుండలంబులును, వైజయంతియను వనమాలయును, వరుణదత్తంబైన సితచ్ఛత్త్రంబును, నొక్క మహారత్నంబును సమర్పించి మ్రొక్కి భక్తితాత్పర్యంబులతోడం గరకమలంబులు ముకుళించి, విబుధవందితుండును, విశ్వేశ్వరుండును నైన దేవదేవుని నిట్లని వినుతించె. 201**

**ప్రతి :** అంతన్= తర్వాత; భూదేవి; వాసుదేవుని= శ్రీకృష్ణునికి; దగ్గఱన్= దగ్గరగా; ఏతెంచి= వచ్చి; జాంబూనద= బంగారంతో; రత్న= రత్నాలతో; మండితంబు+ఐ= ప్రకాశిస్తున్న; కుండలంబులును= చెవిపోగులును; వైజయంతి అను= వైజయంతి అనే పేరుగల; వనమాలయును= (అన్ని ఋతువుల్లో పూచే పూలతో కట్టిందీ, మోకాళ్లవరకు వ్రేలాడుచుండేదీ, మధ్య భాగాన లావుగా ఉండేదైన) పూలదండకూడా; వరుణ= వరుణునిచే, దత్తంబు= ఈబడినది; ఐన; సిత= తెల్లని; ఛత్రంబును= గొడుగును; ఒక్క= ఒకానొక; మహారత్నంబును= గొప్పరత్నాన్ని; సమర్పించి= ఇచ్చి; మ్రొక్కి= నమస్కరించి; భక్తి తాత్పర్యంబులతోడన్= భక్తితో, ఆసక్తితో; కరకమలంబులు= తామరపూలను పోలిన చేతులను; ముకుళించి= జోడించి; విబుధ= దేవతలచే స్తుతింపబడినవాడును; విశ్వ+ఈశ్వరుండును= పరమాత్మయును; ఐన; దేవదేవునిన్= దేవతలకే దేవుడయినవాణ్ణి; ఇట్లు= ఈ విధంగా; అని= అంటూ; వినుతించెన్= పొగడింది...

**తా :** పిమ్మట భూదేవి శ్రీకృష్ణుణ్ణి సమీపించి, బంగారపు రత్నకుండలాలను, వైజయంతి అనే వనమాలను, వరుణుడు ఇచ్చిన తెల్ల గొడుగును, ఒక మహారత్నాన్ని సమర్పించి, భక్తితాత్పర్యాలతో చేతులు జోడించి, దేవాధిదేవుడూ, పరమాత్మ అయిన శ్రీకృష్ణుణ్ణి ఈ రీతిగా స్తుతించింది.

## ❖ భూదేవి శ్రీకృష్ణుని స్తుతించుట ❖

**సీ. 'అంభోజనాభున కంభోజనేత్రున కంభోజమాలాసమన్వితునకు**
**నంభోజపదున కనంతశక్తికి వాసుదేవునకును దేవదేవునకును**
**భక్తులు గోరినభంగి నే రూపైనఁ బొందువానికి నాదిపురుషునకును**
**నఖిలనిదానమై యాపూర్ణవిజ్ఞానుఁడైనవానికిఁ బరమాత్మునకును**

**ఆ. ధాతఁ గన్న మేటితండ్రికి నజునికి, నీకు వందనంబు నే నొనర్తు**
**నిఖిలభూతరూప! నిరుపమ! యీశ! ప, రాపరాత్మమహిత! యమితచరిత! 202**

**ప్రతి :** నిఖిల= సమస్తమైన; భూత= జీవరాశియొక్క; రూప!= స్వరూపమయినవాడా!; నిరుపమ!= పోలిక లేనివాడా!; ఈశ!= ప్రభూ!; పరా= పరాప్రకృతియొక్క; అపరా= అపరాప్రకృతియొక్క; ఆత్మ= రూపం కలిగి ఉండటంచేత; మహిత=

పూజింపబడిన; చరిత!= సత్ప్రవర్తన కలవాడా!; 'అంభోజ నాభునకున్= పద్మం నాభియందు కలవానికి; అంభోజ నేత్రునకున్= పద్మాలవంటి కన్నులు గలవానికి; అంభోజమాలా= తామరపూలదండతో; సమన్వితునకున్= కూడిన వానికి; అంభోజ పదునకున్= పద్మాలను పోలిన పాదాలు గలవానికి; అనంత= అంతంలేనట్టి; శక్తికిన్= శక్తి గలవానికి; వాసుదేవునకును= వసుదేవుని కుమారునికి; దేవదేవునకునున్= దేవతలకే దేవుడైనవానికి; భక్తులు; కోరినభంగిన్= కోరినవిధంగా; ఏ రూపు+ఐనన్= ఏ రూపమయినా; పొందువానికిన్= ధరించేవానికి; ఆదిపురుషునకును= సృష్టికి పూర్వం ఉన్న పురుషునికి; అఖిల= అన్నింటికి; నిదానము+ఐ= మూలకారణమై; ఆపూర్ణ= పరిపూర్ణమైన; విజ్ఞానుఁడు= విజ్ఞానం కలవాడు; ఐన వానికిన్; పరమాత్మునికి; ధాతన్= బ్రహ్మను; కన్న= కనిన; మేటి తండ్రికిన్= గొప్పతండ్రికి; అజునికిన్= పుట్టుక లేనివానికి; నీకున్= నీకు; నేను; వందనంబు= నమస్కారం; ఒనర్తున్= చేస్తున్నాను.

**తా :** అఖిలజీవస్వరూపా! నిరుపమానా! ఈశ్వరా! పరాపర ప్రకృతి ద్వయరూపా! నిరవధికచరితా! శ్రీకృష్ణా! నీవు పద్మం నాభియందు కలవాడివి. కమలాలవంటి కన్నులు గలవాడివి. పద్మహారం కలవాడివి. పద్మాలవంటి చరణాలు కలవాడివి. అనంతశక్తి సంపన్నుడివి. వసుదేవునికుమారుడివి. దేవతలకే దేవుడివి. భక్తులు కోరిన ఏ రూపమైనా ధరించేవాడివి. సృష్టికి పూర్వమే ఉండే పురుషుడివి. సర్వానికీ మూలకారణమైనవాడివి. పరిపూర్ణ విజ్ఞానివి. పరమాత్ముడివి. బ్రహ్మను కనిన గొప్పతండ్రివి. జననం లేనివాడివి. ఇట్టి నీకు నేను నమస్కరిస్తున్నాను.

**వ. దేవా! నీవు లోకంబులు సృజియించుటకు రజోగుణంబును, రక్షించుటకు సత్త్వగుణంబును, సంహరించుటకుఁ దమోగుణంబును ధరియింతువు; కాలమూర్తివి. ప్రధానపూరుషుండవు పరుండవు, నీవ! నేనును, వారియు, వహ్నియు, ననిలుండు, నాకాశంబు, భూతతన్మాత్రలును, నింద్రియంబులును, దేవతలును, మనంబును, గర్తయును, మహత్తత్త్వంబును, జరాచరంబైన విశ్వంబును, నద్వితీయుండవైన నీయందు సంభవింతుము. 203**

**ప్రతి :** దేవా! నీవు; లోకంబులు= లోకాలను; సృజియించుటకున్= సృష్టించడానికి; రజోగుణంబును= రజోగుణాన్నీ; రక్షించుటకున్= కాపాడటానికి; సత్త్వగుణంబును= సత్త్వగుణాన్నీ; సంహరించుటకున్= తుద ముట్టించడానికి; తమోగుణంబును= తమోగుణాన్నీ; ధరియింతువు; కాలమూర్తివి= కాలస్వరూపుడివి; ప్రధాన పూరుషుండవు= మూలకారణమైన ప్రకృతి, జీవుడు అయినవాడివి; పరుండవు= పరమాత్మవు; నీవు+అ= నీవే; నేనును= భూమినైన నేనూ; వారియున్= జలమూ; వహ్నియున్= అగ్నీ; అనిలుండున్= వాయువూ; ఆకాశ= ఆకాశమూ; భూత తన్మాత్రలును= శబ్దం, స్పర్శం, రసం, గంధం, రూపం అనేవీ; ఇంద్రియంబులును= చర్మం, కన్ను, చెవి, నాలుక, ముక్కు అను అయిదు జ్ఞానేంద్రియాలూ; వాక్కు, హస్తాలు, పాదాలు, గుదస్థానం; స్త్రీ పురుష మర్మావయవాలు అనే కర్మేంద్రియాలూ; దేవతలును= ఇంద్రియాల అధిదేవతలునూ; మనంబును= మనస్సునూ; కర్తయును= అహంకారమునూ; మహత్తత్త్వంబును= బుద్ధియూ; చర= తిరిగేవాటితో; అచర= తిరగనివాటితో కూడిందీ; ఐన= అయిన; విశ్వంబును= జగత్తును; అద్వితీయుండవు= సాటిలేని వాడివీ; ఐన= అయిన; నీ+అందున్= నీయందు; సంభవింతుము(సంభవించుదుము)= జన్మిస్తున్నాము.

**తా :** దేవా! నీవు రజోగుణంతో కూడి బ్రహ్మవై లోకాలను సృష్టిస్తావు. సత్త్వగుణం కలిగి విష్ణువువై వాటిల్ని రక్షిస్తావు. తమోగుణాన్ని ధరించి వాటిల్ని నశింపజేస్తావు. నీవే కాలస్వరూపుడవు. పరమాత్మవు; ప్రకృతి, పురుషుడు, మనస్సు, బుద్ధి, అహంకారం, పంచభూతాలు, జ్ఞానేంద్రియాలూ, కర్మేంద్రియాలూ, శబ్దరూపరసాదులూ - అనే పంచవింశతితత్త్వాలూ (25), ఇంద్రియాల అధిదేవతలూ, స్థావరజంగమాలతో కూడిన యావద్విశ్వమూ సాటిలేని నీయందే పుడుతున్నాము.

**చ. దయ నిటు సూడుమా! నరకదైత్యునిబిడ్డఁడు వీఁడు, నీ దెసన్**
**భయమున నున్నవాఁడు, గడు బాలుఁ, డనన్యశరణ్యుఁ, డార్తుఁ, డా**
**శ్రయరహితుండు, దండ్రిక్రియ శౌర్యము నేరఁడు, నీ పదాంబుజ**
**ద్వయిఁ బొడఁగాంచె భక్తపరతంత్రసువీక్షణ! దీనరక్షణా! 204**

**ప్రతి :** భక్త= భక్తులకు; పరతంత్ర= అధీనమైన; సువీక్షణ!= మంచిచూపుగలవాడా!; దీనరక్షణా!= దీనుల్ని రక్షించేవాడా!; దయన్= దయతో; ఇటు= ఈ వైపు; చూడుమా!= చూడవయ్యా!; వీఁడు= ఇతడు; నరకదైత్యుని= నరకాసురుని యొక్క; బిడ్డఁడు= కొడుకు; నీదెసన్= నీయెడ; భయమునన్= భయంతో; ఉన్నవాఁడు= ఉన్నాడు; కడున్= మిక్కిలి; బాలుఁడు= చిన్నవాడు; అనన్య శరణ్యుఁడు (న+అన్యశరణ్యుఁడు)= మరొక రక్షకుడు లేనివాడు; ఆర్తుఁడు= దుఃఖం పొందినవాడు; ఆశ్రయరహితుండు= అండ లేనివాడు; తండ్రిక్రియన్= తండ్రివలె; శౌర్యము= పరాక్రమం; నేరఁడు= చూపనేర్చినవాడు కాడు; నీ= నీయొక్క; పద+అంబుజ= పాదపద్మాల; ద్వయిన్= జంటను; పొడన్+కాంచెన్= దర్శించాడు.

**తా :** భక్తుల్ని చల్లని చూపులతో చూచేవాడా! జాలిగొలుపే వారిని కాపాడేవాడా! దయతో ఈ వైపు చూడవయ్యా!. వీడు నరకాసురుని కుమారుడు. నిన్ను చూచి భయపడుతున్నాడు. వీడు పసిబిడ్డ. దిక్కులేనివాడు. దుఃఖిస్తున్నాడు. ఏ ఆశ్రయం లేనివాడు. తండ్రిమాదిరిగా పరాక్రమంతో ఎదురు తిరుగడం తెలియనివాడు. నీ కాళ్ల దగ్గరకు చేరాడు.

**వ. అని యిట్లు భూదేవి భక్తితోడ హరికిం బ్రణమిల్లి వాక్కుసుమంబులం బూజించిన నర్చితుండై భక్తవత్సలుం డయిన పరమేశ్వరుండు నరకపుత్త్రుం డయిన భగదత్తున కభయం బిచ్చి, సర్వసంపద లొసంగి నరకాసురగృహంబు ప్రవేశించి యందు. 205**

**ప్రతి :** అని; ఇట్లు; భూదేవి; భక్తితోడన్= భక్తితో; హరికిన్= శ్రీకృష్ణునికి; ప్రణమిల్లి= నమస్కరించి; వాక్= మాటలనెడు; కుసుమంబులన్= పూలతో; పూజించినన్= పూజించగా; అర్చితుండు+ఐ= పూజించబడినవాడై; భక్త= భక్తులపట్ల; వత్సలుండు= ప్రేమగలవాడు; అయిన; పరమ+ఈశ్వరుండు= పరమాత్మ; విష్ణువు; నరకపుత్త్రుండు= నరకునికుమారుడు; అయిన; భగదత్తునకున్; అభయంబు+ఇచ్చి= భయనివృత్తి చేసి; సర్వ= సమస్తమయిన; సంపదలు= ఐశ్వర్యాలు; ఒసంగి= ప్రసాదించి; నరకాసుర గృహంబు= నరకాసురుని భవనం; ప్రవేశించి= చొచ్చి; అందున్= ఆ సౌధంలో...

**తా :** ఈ విధంగా భూదేవి భక్తితో శ్రీకృష్ణునికి నమస్కరించి, మాటల పూలతో పూజచేసింది. భక్తానురాగం కలిగిన శ్రీకృష్ణుడు నరకాసురుని కుమారుడయిన భగదత్తునికి అభయప్రదానం చేసి, సర్వభాగ్యాలూ ప్రసాదించాడు. తర్వాత నరకునిభవనం ప్రవేశించి, దానిలో

## ❖ శ్రీకృష్ణుఁడు పదాఱువేల కన్నియల వరించి దేవలోకమునకుఁ బోయి పారిజాతముఁ దెచ్చుట ❖

**ఉ. రాజకులావతంసుఁడు పరాజితకంసుఁడు సొచ్చి కాంచె ఘో**
**రాజుల రాజులం బటుశరాహతి నొంచి ధరాతనూజుఁ డు**
**త్తేజితశక్తిఁ దొల్లిఁ జెఱదెచ్చినవారిఁ బదాఱువేల ధా**
**త్రీజనమాన్యలన్ గుణవతీవ్రతధన్యల రాజకన్యలన్. 206**

**ప్రతి :** రాజకుల= రాజవంశంలో; అవతంసుఁడు= శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడు; పరాజిత= అపజయం పొందిన; కంసుఁడు= కంసుణ్ణి గలవాడు (కంసుణ్ణి జయించినవాడు); శ్రీకృష్ణుడు; సొచ్చి= ప్రవేశించి; ఘోర= భయంకరమైన; ఆజులన్= యుద్ధాలలో; పటు= శక్తిమంతమైన; శర= బాణాలయొక్క; ఆహతిన్= దెబ్బచేత; రాజులన్= రాజులను; నొంచి= బాధించి; ధరాతనూజుఁడు= భూదేవి కుమారుడు; నరకుడు; ఉత్తేజిత= ప్రకాశింపజేయబడిన; శక్తిన్= శక్తితో; తొల్లి= పూర్వం; చెఱదెచ్చినవారిన్= బందీలుగా పట్టితెచ్చినవారిని; పదాఱువేల= పదారువేలమంది; ధాత్రీజన= భూజనులచేత; మాన్యలన్= గౌరవింపదగినవారిని; గుణవతీ= సద్గుణవతుల యొక్క; వ్రత= జీవన పద్ధతిచేత; ధన్యలన్= కృతార్థత నొందినవారిని (పొగడదగిన వారిని); రాజకన్యలన్= పెండ్లికాని రాజపుత్రికలను; కాంచెన్= చూచాడు.

**తా :** రాజవంశ శ్రేష్ఠుడూ, కంసుణ్ణి జయించినవాడూ అయిన శ్రీకృష్ణుడు, రాజులను గెలిచి నరకాసురుడు బందీలుగా పట్టితెచ్చిన పదారువేలమంది రాజకన్యలను ఆ భవనంలో చూచాడు. ఆ రాజపుత్రికలు జనులచేత గౌరవింపదగినవారు. సుగుణవతుల జీవనమార్గం అనుసరించి ధన్యత నొందినవారు.

**మ. కని రా రాజకుమారికల్ పరిమళత్కౌతూహలాక్రాంతలై**
**దనుజాధీశచమూవిదారు నతమందారున్ శుభాకారు నూ**
**తన శృంగారు వికారదూరు సుగుణాధారున్ మృగీలోచనా**
**జనచేతోధనచోరు రత్నమకుటస్ఫారున్ మనోహారునిన్. 207**

**ప్రతి :** ఆ రాజకుమారికల్= ఆ రాజపుత్రికలు; పరిమళత్= పరిమళించుచున్న; కౌతూహల= కుతూహలంచేత; ఆక్రాంతలు+ఐ= ఆక్రమించబడినవారై; దనుజ+అధీశ= రాక్షసరాజు యొక్క; చమూ= సైన్యాన్ని; విదారున్= చీల్చేవాణ్ణి; నత= నమస్కరించేవారికి; మందారున్= కల్పవృక్షమైనవాణ్ణి; శుభ+ఆకారున్= మంగళకరమైన ఆకారం కలవాణ్ణి; నూతన శృంగారున్= అపూర్వమయిన శృంగార వేషం కలవాణ్ణి; వికార= స్వాభావిక స్థితినుండి కలిగేమార్పులకు; దూరున్= దూరమయిన వాణ్ణి; మృగీలోచనాజన= ఆడులేడి కన్నులవంటి కన్నులు గల స్త్రీ జనులయొక్క; చేతస్= మనస్సులనెడు; ధన= ధనాన్ని; చోరున్= అపహరించేవాణ్ణి; రత్నమకుట= రత్నకిరీటంతో; స్ఫారున్= ప్రకాశించువాణ్ణి; మనోహారునిన్= మనస్సుల్ని ఆకర్షించేవాణ్ణి; కనిరి= చూచారు.

**తా :** ఆ రాజకన్యలు నిలువెల్లా కుతూహలం గలవారై రాక్షస సేనలను ఛేదించేవాణ్ణీ, మొక్కే వారికి కల్పవృక్షమయినవాణ్ణీ, శుభాలు కలిగించే రూపం గలవాణ్ణీ, నిత్యనవీనమయిన శృంగారం కలవాణ్ణీ; భావవికారాలు లేనివాణ్ణీ; సద్గుణాలకు నిలయుడయినవాణ్ణీ; యువతుల హృదయ ధనాన్ని దొంగిలించువాణ్ణీ, మనస్సులను ఆకర్షించువాణ్ణీ, రత్నాలు పొదిగిన కిరీటంతో ప్రకాశించేవాణ్ణీ శ్రీకృష్ణుణ్ణి చూచారు.

**వ. కని యతని సౌందర్యగాంభీర్యచాతుర్యాదిగుణంబులకు మోహించి, తమకంబులు జనియింప, ధైర్యంబులు సాలించి, సిగ్గులు వర్జించి, పంచశరసంచలితహృదయలై, దైవయోగంబునం బరాయత్తంబులైన చిత్తంబుల నమ్మత్తకాశినులు దత్తరంబున మనోజుం దుత్తలపెట్ట నతండు దమకుఁ బ్రాణవల్లభుం డని వరియించి. 208**

**ప్రతి :** కని= చూచి; అతని= శ్రీకృష్ణుని; సౌందర్య= అందం; గాంభీర్య= స్థిరమైన మనస్థితి; చాతుర్య= నైపుణ్యం; ఆది= మొదలయిన; గుణంబులకున్= గుణాలవల్ల; మోహించి= వలచి; తమకంబులు= ఉత్కంఠలు; జనియింపన్= కలుగగా;

ధైర్యంబులు= గంభీరతలు; చాలించి= విడిచి; సిగ్గులు= బిడియాలు; వర్జించి= వదలి; పంచశర= మన్మథునిచేత; సంచలిత= కలతపెట్టబడిన; హృదయలు+ఐ= హృదయాలు కలవారై; దైవయోగంబునన్= దైవవశాన; పర= ఇతరులకు; ఆయత్తంబులు+ఐన= వశమైన (స్వాధీనత తప్పిన); చిత్తంబులన్= మనస్సులతో; ఆ మత్తకాశినులు= ఆ నిండు యౌవనంతో ప్రకాశించే ఆ యువతులు; తత్తరంబునన్= తత్తరపాటుతో; మనోజుండు= మన్మథుడు; ఉత్తలపెట్టన్= పరితపింపజేయగా; అతండు= శ్రీకృష్ణుడు; తమకున్= తమకు; ప్రాణవల్లభుండు= ప్రాణేశ్వరుడు; అని; వరియించి= కోరి...

**తా :** రాజపుత్రికలు శ్రీకృష్ణుణ్ణి చూచి, అతనిసౌందర్యం, గాంభీర్యం, నైపుణ్యం మొదలయిన గుణాలవల్ల అతణ్ణి ప్రేమించారు. వారికి తహతహపాటు కలిగింది. వారు ధైర్యం కోల్పోయారు. బిడియాన్ని వదలివేశారు. మన్మథుడు వారి హృదయాల్ని కలతపెట్టాడు. దైవవశంతో వారిమనస్సులు అదుపు తప్పాయి. ఆ ఉత్తమాంగనలు మన్మథతాపానికి లోనై శ్రీకృష్ణుడే తమకు ప్రాణేశ్వరుడని నిశ్చయించుకొని

**ఉ. పాపపురక్కసుండు సెఱపట్టె నటంచుఁ దలంతు మెప్పుడుం**
**బాపుఁడె? వీనిధర్మమునఁ బద్మదళాక్షునిఁ గంటి మమ్మ! ము**
**న్నీ పురుషోత్తముం గదియ నేమి వ్రతంబులు సేసినారమో?**
**యా పరమేష్ఠి పుణ్యుఁడు గదమ్మ! హరిన్ మముఁ గూర్చె నిచ్చటన్. 209**

**ప్రతి :** పాపము+రక్కసుండు= పాపాత్ముడయిన రాక్షసుడు (నరకాసురుడు); చెఱపట్టెన్= కారాగారంలో బంధించాడు; అటంచున్= అంటూ; ఎప్పుడున్= ఎప్పుడూ; తలంతుము(తలంచుదుము)= అనుకొంటాము; పాపుఁడు+ఎ?= పాపియా?; వీని= ఇతని, నరకాసురుని; ధర్మమునన్= పుణ్యంచేత; పద్మదళ= తామరరేకులవంటి; అక్షునిన్= కన్నులు గలవాణ్ణి, శ్రీకృష్ణుణ్ణి; కంటిమి= చూచాము; అమ్మ!; మున్ను= పూర్వం; ఈ; పురుష+ఉత్తమున్= ఈ పురుషశ్రేష్ఠుణ్ణి; కదియన్= కలసికొనేందుకు; ఏమి వ్రతంబులు= ఏయే నోములు; చేసినారము+ఓ?= నోచితిమో?; ఆ పరమేష్ఠి= ఆ బ్రహ్మ; పుణ్యుఁడు= పుణ్యాత్ముడు; కద+అమ్మ!; ఇచ్చటన్= ఇక్కడ; హరిన్= శ్రీకృష్ణుణ్ణి; మమున్= మమ్మల్ని; కూర్చెన్= ఒకచోటికి చేర్చాడు.

**తా :** మహాపాపియైన నరకాసురుడు నిర్బంధించాడని ఎప్పుడూ అనుకొంటాము. నిజంగా వాడు పాపాత్ముడా? వాని పుణ్యమా అని శ్రీకృష్ణుణ్ణి దర్శింపగలిగాము కదమ్మా! ఈనాడు పురుషశ్రేష్ఠుడయిన ఇతణ్ణి కలసికొనేందుకై పూర్వజన్మంలో మనం ఎట్టి నోములు నోచామో? ఆ బ్రహ్మదేవుడు పుణ్యాత్ముడు గదమ్మ! కాబట్టే, శ్రీకృష్ణుణ్ణీ, మమ్మల్నీ ఇక్కడ చేర్చాడు.

**క. ఉన్నతి నీతఁడు గౌఁగిట, మన్నింపఁగ నింక బ్రదుకుమానిని మనలో**
**ము న్నేమి నోము నోఁచెనొ, సన్నుతమార్గముల విపినజలదుర్గములన్. 210**

**ప్రతి :** మనలోన్= మనందరిలో; ఈతఁడు= శ్రీకృష్ణుడు; కౌఁగిటన్= కౌగిలిలో; ఉన్నతిన్= ఎక్కువగా; మన్నింపన్+కన్= ఆదరింపగా; ఇంకన్= ఈపైని; బ్రదుకు= సుఖజీవనం చేసే; మానిని= కాంత; మున్ను= పూర్వం; సన్నుత= కొనియాడబడిన; మార్గములన్= కార్యం నడిపే పద్ధతులతో; విపిన= అడవుల్లో కలిగే; జల దుర్గములన్= నీటి దుర్గాలలో; నోము= ఎటువంటి నోము; నోచున్+ఒ?= నోచిందో.

**తా :** మనందరిలో శ్రీకృష్ణుడు కౌగిలించి ఆదరించగా సుఖంగా జీవించే అదృష్టవతి పూర్వజన్మంలో సదాచారాలు పాటిస్తూ, అడవుల్లో నీళ్లల్లో నిలిచి, కష్టాలు పడి ఏ వ్రతా లాచరించిందో? (లేకుంటే అంతటి అదృష్టం కల్గదని భావం).

**క. విన్నారమె యీ చెలువముఁ?, గన్నారమె యిట్టి శౌర్యగాంభీర్యంబుల్?**
**మన్నార మింతకాలముఁ, గొన్నారమె యెన్నఁ డయినఁ గూరిమి చిక్కన్. 211**

**ప్రతి :** ఇంతకాలమున్= చాలాకాలంగా; మన్నారము= (మనం) జీవించి ఉన్నాం గదా!; ఈ చెలువమున్= ఇటువంటి సౌందర్యం; విన్నారము+ఎ?= ఎవరియందైనా కలదని విన్నామా?; ఇట్టి= ఇటువంటి; శౌర్యగాంభీర్యంబుల్= శౌర్యమూ, గంభీరత్వమూ; కన్నారము+ఎ?= (ఇంకొకనియందు) చూచామా?; ఎన్నఁడు+అయినన్= ఎప్పుడయినా; కూరిమి= ప్రేమ; చిక్కన్= మనకే దక్కేటట్లు; కొన్నారము+ఎ= (ఎవరినుండైనా) పొందామా?

**తా :** మనం చాలాకాలం నుండి బ్రతుకుతూ ఉన్నాం గదా! ఎవరిలో అయినా ఈ అందం ఉందని విన్నామా? ఇంతటి ప్రతాపమూ, గంభీరతా మరొకనియందు చూచామా? ఎవని నుండయినా, ఎప్పుడయినా ఈ ప్రేమను దక్కించుకొన్నామా?

**సీ. వనజాక్షి! నేఁగన్న వైజయంతిక నైన గదిసి వ్రేలుదు గదా కంఠమందు**
**బింబోష్ఠి! నేఁగన్న పీతాంబరము నైన మెఱసి యుండుదు గదా మేనునిండఁ**
**గన్నియ! నేఁగన్న కౌస్తుభమణి నైన నొప్పు సూపుదుఁగదా యురమునందు**
**బాలిక! నేఁగన్న పాంచజన్యము నైన మొనసి చొక్కుదుఁగదా మోవిఁ గ్రోలి**

**ఆ. పద్మగంధి! నేను బర్హదామము నైనఁ, జిత్రరుచుల నుందు శిరమునందు**
**ననుచుఁ బెక్కుగతుల నాడిరి కన్యలు, గములు గట్టి గరుడగమనుఁ జూచి. 212**

**ప్రతి :** కన్యలు= రాజపుత్రికలు; గములు+కట్టి= గుంపులు గుంపులుగా చేరి; గరుడగమనున్= గరుత్మంతుని మీద ప్రయాణం చేసేవాడైన, శ్రీకృష్ణుణ్ణి; చూచి; వనజ+అక్షి= కమలాలను పోలిన కన్నులు గలదానా చెలీ!; నేన్+కన్కన్= నేను గనుక; వైజయంతికన్= వైజయంతి అనుపేరుగల వనమాలను; ఐనన్= అయినచో; కంఠము+అందున్= మెడలో; కదిసి= చేరి; వ్రేలుదున్+కదా= వ్రేలాడుతుంటాను గదా!; బింబ+ఓష్ఠి!= దొండ పండువంటి పెదవి గలదానా!; నేన్+కన్కన్= నేను గనుక; పీత+అంబరమున్= పచ్చని (పట్టు) బట్టను; ఐనన్= అయినచో; మేను= శరీరం; నిండన్= నిండేటట్లుగా; మెఱసి= ప్రకాశించి; ఉండుదున్+కదా= ఉంటానుగదా!; కన్నియ!= కుమారీ!; నేన్+కన్కన్= నేను గనుక; కౌస్తుభమణిన్= కౌస్తుభం అనే మణిని; ఐనన్= అయినచో; ఉరము+అందున్= హృదయంపై; ఒప్పు+చూపుదున్+కదా= అందం కనబరుస్తాను గదా; బాలిక!= చిన్నదానా!; నేన్+కన్కన్= నేను గనుక; పాంచజన్యమున్= పాంచజన్యమనే శంఖాన్ని; ఐనన్= అయినచో; మొనసి= యత్నించి; మోవిన్= పెదవిని; క్రోలి= త్రాగి (అధరపానంచేసి); చొక్కుదున్+కదా= పరవశిస్తాను కదా!; పద్మగంధి!= పద్మాల పరిమళం గలదానా!; నేను; బర్హ= నెమలిపురితో కూర్చిన; దామమున్= దండను; ఐనన్= అయినచో; శిరము+అందున్= తలపై; చిత్ర= చిత్రమయిన; రుచులన్= కాంతులతో; ఉందున్= ఒప్పుచుంటాను కదా!; అనుచున్= అంటూ; పెక్కుగతులన్= అనేక విధాలుగా; ఆడిరి= తమలో తాము అనుకొన్నారు.

**తా :** ఆ రాజకన్యలు గుంపులుగూడి తమలో తాము "నేను గనుక వైజయంతిమాల నయితే శ్రీకృష్ణుని మెడలో వ్రేలాడుతుంటాను గదా! నేను గాని పసుపు పచ్చని పట్టుబట్టనయితే అతని ఒంటినిండా ప్రకాశిస్తూ ఉందునుగదా! నేను గనుక కౌస్తుభమణి నయితే అతని వక్షంపై తళతళమెఱుస్తూ ఉంటాను గదా! నేను గనుక పాంచజన్యాన్ని అయితే అతని అధరామృతాన్ని సేవించి, పరవశిస్తూ ఉంటాను గదా!" అని తలకొక విధంగా చెప్పుకోసాగారు.

**శా. భూనాథోత్తమ! కన్యకల్ వరుస నంభోజాతనేత్రుండు న**
**న్నే నవ్వెం దగఁ జూచె దగ్గఱియె వర్ణించెన్ వివేకించె స**
**మ్మానించెం గరుణించెఁ బే రడిగె సన్మార్గంబుతోఁ బెండ్లి యౌ**
**నేనే చక్రికి దేవి నంచుఁ దమలో నిర్ణీతలై రందఱున్. 213**

**ప్రతి :** భూనాథ+ఉత్తమ= రాజోత్తమా! పరీక్షిన్మహారాజా!; కన్యకల్= రాజకన్యలు; అందఱున్= అందరునూ; తమలోన్= తమలో తాము; అంభోజాత= పద్మాలవంటి; నేత్రుండు= కన్నులు గలవాడు, శ్రీకృష్ణుడు; నన్నున్+ఏ= నన్నే; నవ్వెన్= ఎగతాళిచేశాడు; తగన్= తగినట్లుగా; చూచెన్= చూచాడు; దగ్గఱియెన్= దగ్గరగా వచ్చాడు; వర్ణించెన్= అందాన్ని వర్ణించాడు; వివేకించెన్= విచారణ చేశాడు; పేరు+అడిగెన్= పేరు అడిగాడు; సత్+మార్గంబుతోన్= సదాచారం ప్రకారం; పెండ్లి; ఔన్= అవుతుంది; నేను+ఏ= నేనే; చక్రికిన్= శ్రీకృష్ణునికి; దేవిన్= పట్టపురాణిని; అంచున్= అంటూ; వరుసన్= క్రమంగా; నిర్ణీతలు= నిర్ణయింపబడినవారు; ఐరి= అయ్యారు.

**తా :** పరీక్షిన్మహారాజా! రాజకన్యలందరూ క్రమంగా తమలో తాము "శ్రీకృష్ణుడు నన్నే పరిహసించాడు; యుక్తంగా చూచాడు; నా సౌందర్యాన్ని వర్ణించాడు; నన్ను గూర్చి చక్కగా తెలుసుకొన్నాడు; నన్ను మన్నించాడు; నాపై దయ చూపాడు; నాపేరు అడిగాడు; ఆచారం ప్రకారం వివాహమవుతుంది; నేనే అతని పట్టమహిషిని" అని నిశ్చయించుకొన్నవారయ్యారు.

**వ. ఇట్లు బహువిధంబులం దమ తమ మన్ననలకు నువ్విళ్ళూరుకన్నియలం బదాఱువేల ధవళాంబ రాభరణమాల్యానులేపనంబు లొసంగి, యందలంబుల నిడి, వారలను నరకాసుర భాండాగారంబులం గల నానావిధంబు లయిన మహాధనంబులను, రథంబులను, దురంగంబులను; ధవళంబులై, వేగవంతంబులై, యైరావతకులసంభవంబులైన చతుర్దంతదంతావళంబులను, ద్వారకానగరంబునకుం బనిచి, దేవేంద్రునిపురంబునకుం జని యదితిదేవిమందిరంబు సొచ్చి, యా పెద్దమ్మకు ముద్దు సూపి, మణికిరణపటలపరిభావితభానుమండలంబులైన కుండలంబు లొసంగి, శచీసమేతుండైన మహేంద్రునిచేత సత్యభామతోడం బూజితుండై, పిదప సత్యభామ కోరిన నందనవనంబు సొచ్చి. 214**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; బహు విధంబులన్= అనేకవిధాలుగా; తమ తమ= తమ తమయొక్క; మన్ననలకున్= గౌరవాలకు; ఉవ్విళ్లూరు= త్వరపడుచున్న; కన్నియలన్= రాజకన్యలను; పది+ఆఱువేలన్= పదహారు వేలమందిని; ధవళ= తెల్లని; అంబర= బట్టలు; ఆభరణ= నగలు; మాల్య= పూలదండలు; అనులేపనంబులు= మైపూతలు; ఒసంగి= ఇచ్చి; అందలంబులన్= పల్లకీలలో; ఇడి= కూర్చుండబెట్టి; వారలను= వారినీ; నరకాసుర= నరకాసురునియొక్క; భాండాగారంబులన్= కోశాగారాలలో; కల= ఉన్న; నానావిధంబులు= అనేకవిధాలు; అయిన; మహాధనంబులను= అమూల్య ధనాలను; రథంబులను= రథాలను; తురంగంబులను= గుర్రాలను; ధవళంబులు+ఐ= తెల్లనివై; వేగవంతంబులు+ఐ= వేగం గలవై; ఐరావత= ఐరావతంయొక్క; కుల= వంశంలో; సంభవంబులు= పుట్టినవి; ఐన= అయిన; చతుర్+దంత= నాలుగు దంతాలుగల; దంతావళంబులను= ఏనుగులనూ; ద్వారకా నగరంబునకున్= ద్వారకకు; పనిచి= పంపి; దేవ+ఇంద్రుని= దేవేంద్రునియొక్క; పురంబునకున్= పట్టణానికి (అమరావతికి); చని= వెళ్లి; అదితిదేవి= అదితిదేవియొక్క; మందిరంబు= భవనం; చొచ్చి= ప్రవేశించి; ఆ; పెద్ద+అమ్మకున్= పెద్దతల్లికి; ముద్దు+చూపి= తనప్రేమ చాటి; మణి కిరణ= మణుల

కాంతులయొక్క; పటల= సమూహంచేత; పరిభావిత= పరాభవింపబడిన (తక్కువ చేయబడిన); భానుమండలంబులు= సూర్యమండలాలు కలవి; ఐన= అయిన; కుండలంబులు= చెవిపోగులు; ఒసంగి= ఇచ్చి; శచీసమేతుండు= శచీదేవితో కూడినవాడు; ఐన; మహేంద్రునిచేతన్= దేవేంద్రునిచేత; సత్యభామతోడన్= సత్యభామతోపాటు; పూజితుండు+ఐ= పూజింపబడినవాడై; సత్యభామ; కోరినన్= కోరగా; నందనవనంబు= ఇంద్రుని నందనోద్యానవనాన్ని; చొచ్చి= ప్రవేశించి...

**తా :** ఈ విధంగా రాజకన్యలు ముందు ముందు శ్రీకృష్ణునివల్ల తమకు ప్రాప్తించే గౌరవాదులను గూర్చి ఆరాటపడుతున్నారు. అప్పుడు శ్రీకృష్ణుడు ఆ పదాఱువేలమందికీ తెల్లనిబట్టలూ, నగలూ, పూలదండలూ, మైపూతలూ ఇచ్చి, పల్లకీలు సమకూర్చాడు. వారినీ, నరకాసురుని ధనరాశులనూ, రథాలనూ, గుర్రాలనూ, ఏనుగులనూ ద్వారకకు పంపాడు. ఆ ఏనుగులు సామాన్యమయినవి కావు. అవి తెల్లనివి. వేగం గలవి. ఐరావత గజ సంతతికి చెందినట్టివి. నాలుగు దంతాలు కలవి. తర్వాత శ్రీకృష్ణుడు అమరావతికి వెళ్లి అదితిని సందర్శించాడు. ఆమెకు సూర్యకాంతిని మించిన కాంతి కలిగిన కుండలాలను ఇచ్చాడు. శచీదేవితో కూడిన ఇంద్రునిచేత సత్యభామాసహితుడై పూజలు పొందాడు. సత్యభామకోరిక ననుసరించి నందనోద్యానవనానికి వెళ్లి

**మ. హరి కేలం బెకలించి తెచ్చి భుజగేంద్రారాతిపైఁ బెట్టె సుం**
**దరగంధానుగతభ్రమద్భ్రమరనాదవ్రాతముం బల్లవాం**
**కుర శాఖాఫలపర్ణపుష్పకలికాగుచ్ఛాదికోపేతమున్**
**గిరిభిత్త్రాతముఁ బారిజాతముఁ ద్రిలోకీయాచకాఖ్యాతమున్. 215**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; సుందర= మనోహరమైన; గంధ= సువాసనలను; అనుగత= అనుసరిస్తూ; భ్రమత్= తిరుగుచున్న; భ్రమర= తుమ్మెదలయొక్క; నాద= ధ్వనులయొక్క; వ్రాతమున్= సమూహాలు కలది; పల్లవ= చిగుళ్లయొక్క; అంకుర= మొలకలతో కూడిన; శాఖా= కొమ్మలతో; ఫల= పండ్లతో; పర్ణ= ఆకులతో; పుష్ప= పూలయొక్క; కలికా= మొగ్గలయొక్క; గుచ్ఛ= గుత్తులు; ఆదిక= మొదలయిన వాటితో; ఉపేతమున్= కూడిందీ; గిరిభిత్= పర్వతాలను భేదించినవానిచేత, ఇంద్రునిచేత; త్రాతమున్= రక్షింపబడిందీ; త్రిలోకీ= మూడు లోకాల్లోని; యాచక= యాచకులచేత; ఆఖ్యాతమున్= కీర్తింపబడినదైన; పారిజాతమున్= పారిజాతాన్ని; కేలన్= చేతితో; పెకలించి= పెల్లగించి; తెచ్చి= తీసికొనివచ్చి; భుజగ+ ఇంద్ర= సర్పరాజులకు; అరాతిపైన్= శత్రువయిన గరుత్మంతునిమీద; పెట్టెన్= ఉంచాడు.

**తా :** శ్రీకృష్ణుడు చేతితో పెల్లగించి పారిజాతవృక్షాన్ని గరుత్మంతునిమీద పెట్టాడు. ఆ పారిజాత పుష్పాల సువాసనలకై, చేరి అట్టిటు తిరుగుతూ తుమ్మెదలు రొద చేస్తున్నాయి. చిగుళ్లతో, ఆకులతో, కొమ్మలతో, పండ్లతో పూమొగ్గల గుత్తులతో ఆ కల్పవృక్షం అందగిస్తూంది. అది ఇంద్రునిచేత రక్షింపబడింది. దాన్నిగూర్చి మూడులోకాల్లోని యాచకులు చెప్పుకొంటూ, పొగడుతున్నారు.

**వ. ఇట్లు పారిజాతంబును హరించి యదువల్లభుండు వల్లభయుం, దానును విహగవల్లభారూఢుండయి చనుచున్న సమయంబున. 216**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; యదు= యదువంశానికి; వల్లభుండు= అధిపతి అయిన శ్రీకృష్ణుడు; పారిజాతంబును; హరించి= దొంగిలించి; వల్లభయున్= ప్రియురాలయిన సత్యభామతోకూడ; తానును; విహగవల్లభ= పక్షిరాజయిన గరుత్మంతుణ్ణి; ఆరూఢుండు= ఎక్కినవాడు; అయి; చనుచున్న సమయంబునన్= వెళ్లేటప్పుడు...

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణుడు పారిజాతాన్ని అపహరించి, సత్యభామతో కూడి గరుత్మంతునిమీద వెళ్లేటప్పుడు

**సీ. నరకాసురునిబాధ నలcగి గోవిందునికడ కేగి తత్పాదకమలములకుc**
**దన కిరీటము సోcక దండప్రణామముల్ గావింప నా చక్రి కరుణ సేసి**
**చనుదెంచి భూసుతు సమయించి తనవారిc దన్ను రక్షించుటc దలcప మఱచి**
**యింద్రుండు బృందారకేంద్రత్వమదమునc 'బద్మలోచన! పోకు పారిజాత**

**ఆ. తరువు విడువు' మనుచుc దాcకె నడ్డము వచ్చి, తఱిమి సురలు నట్లు దాcకి రకట!**
**యెఱుక వలదె నిర్జరేంద్రత కాల్పనే?, సురల తామసమును జూడ నరిది. 217**

**ప్రతి :** ఇంద్రుండు= ఇంద్రుడు; నరకాసురుని బాధన్= నరకాసురుడు పెట్టే బాధచే; నలcగి= పీడింపబడి; గోవిందుని కడకున్= శ్రీకృష్ణుని దగ్గరకు; ఏగి= వెళ్లి; తత్= అతని; పాదకమలములకున్= పాదపద్మాలకు; తన కిరీటం; సోcకన్= తాకునట్లుగా; దండ ప్రణామముల్= సాష్టాంగనమస్కారాలు; కావింపన్= చేయగా; ఆ, చక్రి= ఆ శ్రీకృష్ణుడు; కరుణ+చేసి= దయదాల్చి; చనుదెంచి= వచ్చి; భూసుతున్= భూదేవి కుమారుడైన నరకాసురుణ్ణి; సమయించి= చంపి; తనవారిన్= తనకయిన వారినీ; తన్నున్= తననూ; రక్షించుటన్= రక్షించడం; తలcపన్= స్మరించడం; మరచి; బృందారక+ఇంద్రత్వ= దేవతలమీది ఆధిపత్యంవల్ల కలిగిన; మదమునన్= మదంతో; పద్మలోచన!= పద్మాలవంటికన్నులు గలవాడా!, శ్రీకృష్ణా!; పోకు= వెళ్లకు; పారిజాత తరువున్= పారిజాతవృక్షాన్ని; విడువుము= విడిచిపెట్టు; అనుచున్= అంటూ; అడ్డమువచ్చి= అడ్డపడి; తాcకెన్= ఎదిరించెను; సురలున్= దేవతలుకూడ; అట్లు= ఆ విధంగానే; తఱిమి= వెంటపడి పరుగెత్తించి; తాcకిరి= ఎదిరించిరి; అకట!= అయ్యో!; ఎఱుక= జ్ఞానం; వలదు+ఎ= ఉండనక్కర లేదా?; నిర్జర+ఇంద్రత= దేవతాధిపత్యం; కాల్పన్+ఏ?= తగులబెట్టడానికా? ఎందుకు? వ్యర్థమనడం; సురల= దేవతలయొక్క; తామసమును= మూఢత్వాన్ని; చూడన్= చూడగా; అరిది= ఆశ్చర్యకరం.

**తా :** నరకాసురుడు నానాయాతనలు పెట్టగా శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్లి, కిరీటం కాళ్లకు తగిలేటట్లుగా నేలమీద చాగిలబడి మ్రొక్కటం, శ్రీకృష్ణుడు దయగలిగి నరకాసురుణ్ణి చంపి తననూ, తనవారినీ రక్షించటం, ఇవన్నీ దేవతాధిపత్యంవల్ల కలిగిన మదంచేత ఇంద్రుడు విస్మరించాడు. అతడు అడ్డపడి "శ్రీకృష్ణా! వెళ్లకు, పారిజాతవృక్షాన్ని విడువు" మని పలుకుతూ ఎదిరించాడు. దేవతలు కూడా తరిమి శ్రీకృష్ణుణ్ణి తమ ప్రభువు మాదిరిగానే ఎదుర్కొన్నారు. అయ్యో! ఈ పనిచేయదగునా? చేయదగదా? అనే జ్ఞానం ఉండనక్కర లేదా? దేవేంద్రత్వం దేనికి? మంటబెట్టటానికా? చూస్తుంటే దేవతలపొగరు ఆశ్చర్యకరంగా ఉంది.

**వ. ఇట్లు తనకు నొద్దారించి యడ్డంబు వచ్చిన నిర్జరేంద్రాదుల నిర్జించి తన పురంబునకుం జని, నిరంతర సురభికుసుమమకరందమాధురీవిశేషంబులకుc జొక్కి చిక్కక నాకలోకంబున నుండి వెంట నరుగుదెంచు తుమ్మెదలకు నెమ్మి దలంచుచున్న పారిజాతమ్ము నాశ్రితపారిజాతుం డయిన హరి మహాప్రేమాభిరామ యగు సత్యభామతోc గ్రీడించు మహోద్యానంబున సంస్థాపించి, నరకాసురునియింటం దెచ్చిన రాజకన్యక లెందఱందఱకు నన్ని నివాసంబులు గల్పించి గృహోపకరణంబులు సమర్పించి. 218**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; తనకున్= తనకు; ఒడ్డారించి= ఎదిరించి; అడ్డంబువచ్చిన= అడ్డపడిన; నిర్జర+ఇంద్ర= దేవేంద్రుడు; ఆదులన్= మొదలగువారిని; నిర్జించి= జయించి; తన పురంబునకున్= తన పట్టణానికి (ద్వారకకు); చని= వెళ్లి; నిరంతర= ఎడతెగని; సురభి= వాసనగల; కుసుమ= పూలయొక్క; మకరంద= తేనెయొక్క; మాధురీ= తియ్యదనానికి సంబంధించిన; విశేషంబులకున్= శ్రేష్ఠత్వాలకు; చొక్కి= పరవశించి; చిక్కక= ఉన్నచోట నిలువక; నాకలోకంబుననుండి= స్వర్గంనుండి; వెంటన్= వెంబడి; అరుగుదెంచు= వస్తున్న; తుమ్మెదలకున్= తుమ్మెదలకు; నెమ్మి= సుఖస్థితిని; తలంచున్+ఉన్న= కలిగిస్తున్న; పారిజాతమ్మును; ఆశ్రిత= ఆశ్రయించినవారికి; పారిజాతుండు= కల్పవృక్షమయినవాడు; అయిన; హరి= శ్రీకృష్ణుడు; మహత్+ప్రేమ= అధిక ప్రేమచేత; అభిరామ= ప్రియమైంది; అగు; సత్యభామతోన్; క్రీడించు= విహరించే; మహత్+ఉద్యానంబునన్= గొప్పతోటలో; సంస్థాపించి= నాటి; నరకాసురుని ఇంటన్= నరకాసురుని యింటినుండి; తెచ్చిన= తీసుకొనివచ్చిన; రాజకన్యకలు; ఎందఱు= ఎందరు కలరో; అందఱకున్= అందరికినీ; అన్ని; నివాసంబులు= గృహాలు; కల్పించి= కట్టించి; గృహ= ఇండ్లకు కావలసిన; ఉపకరణంబులు= పనిముట్లు, సామానులు; సమర్పించి= ఇచ్చి...

**తా :** శ్రీకృష్ణుడు తన్నెదిరించి అడ్డపడిన దేవేంద్రుణ్ణీ, దేవతల్నీ జయించి, ద్వారకకు వెళ్లాడు. ఆశ్రితులపాలిటికి కల్పవృక్షమైన అతడు తన పూలతేనెల తీపిని మరగి ఉన్నచోటు వదలి, వెంటవస్తున్న తుమ్మెదలకు మేలుచేసే పారిజాతాన్ని సత్యభామతో కలసి తాను విహరించే ఉద్యానవనంలో నాటాడు. నరకాసురుని యింటినుండి తీసుకొని వచ్చిన రాజకన్యల కందరికీ గృహాలు కట్టించి సమస్త గృహోపకరణాలను సమకూర్చాడు.

**చ. అమితవిహారుఁ డీశ్వరుఁ డనంతుఁడు దా నొకనాఁడు మంచి ల**
**గ్నమునఁ బదాఱువేలభవనంబులలోనఁ బదాఱువేల రూ**
**పములఁ బదాఱువేల నృపబాలలఁ బ్రీతిఁ బదాఱువేల చం**
**దముల విభూతి నొందుచు యథావిధితో వరియించె భూవరా! 219**

**ప్రతి :** భూవరా!= పరీక్షిన్మహారాజా!; అమిత= మితిలేని; విహారుఁడు= వేడుకతో తిరుగుటలు కలవాడు; ఈశ్వరుఁడు= సర్వనియామకుడు; అనంతుఁడు= తుది లేనివాడు, శ్రీకృష్ణుడు; తాన్= తాను; ఒకనాఁడు= ఒకదినం; మంచి లగ్నమునన్= శుభముహూర్తాన; ప్రీతిన్= సంతోషంతో; విభూతిన్= వైభవాన్ని; ఒందుచున్= పొందుచు; పదాఱువేల భవనంబులన్= పదారువేలసౌధాలలో; పదాఱువేల రూపములన్= పదారువేల ఆకారాలతో; పదాఱువేల నృపబాలలన్= పదారువేల రాజకన్యలను; యథావిధితోన్= శాస్త్రోక్త క్రమంలో; వరియించెన్= పెండ్లాడినాడు.

**తా :** అనేక విధాలైన వినోద సంచారాలు చేసేవాడు, సర్వనియామకుడు, అంతం లేనివాడు అయిన శ్రీకృష్ణుడు ఒకరోజున శుభముహూర్తఆనందంతో పదియారువేలభవనాలలో, పదియారువేలఆకృతులతో, పదియారువేల రీతులుగా, పదియారువేలమంది రాజపుత్రికలను వైభవంగా పెండ్లాడినాడు.

**ఉ. దానములందు సమ్మదవిధానములం దవలోకభాషణా**
**హ్వానములందు నొక్కక్రియ నా లలితాంగుల కన్నిమూర్తులై**
**తా ననిశంబు గానఁబడి తక్కువ యెక్కువ లేక యుత్తమ**
**జ్ఞానగృహస్థధర్మమునఁ జక్రి రమించెఁ బ్రపూర్ణకాముఁడై. 220**

**ప్రతి :** చక్రి= శ్రీకృష్ణుడు; తాను; ఉత్తమ= మంచిదయిన; జ్ఞాన= జ్ఞానంగల; గృహస్థ= గృహస్థునియొక్క; ధర్మమునన్= ధర్మంతో; దానముల+అందున్= కోరినవాటిల్ని ఇవ్వడంలో; సమ్మద= సంతోషం కలిగించే; విధానముల+అందున్= ఏర్పాటులందు; ఒక్క క్రియన్= ఒకే విధంగా; ఆ; లలిత= సుకుమారమైన; అంగులకున్= శరీరములు గలవారికి; అన్ని మూర్తులు+ఐ= అన్నిరూపాలు కలవాడై; అనిశంబు= ఎల్లప్పుడు; కానన్+పడి= కనబడి; ఎక్కువ తక్కువలేక= సర్వసమానంగా; ప్రపూర్ణ= పూర్తిగా నెరవేరిన; కాముఁడు+ఐ= కోరికలు గలవాడై; రమించెన్= క్రీడించాడు.

**తా :** శ్రీకృష్ణుడు ఉత్తమ గృహస్థుడై రాజకన్యకలకు ఒకేవిధంగా, సమానంగా కోరిన వస్తువులను ఇచ్చేవాడు. సంతోషం కలిగించేవాడు. ఒకే తీరున వారిని చూచేవాడు. వారితో మాటలాడేవాడు. వారిని పిలిచేవాడు. వారికందరికీ అన్ని రూపాలతో ఎప్పుడూ కనబడేవాడు. అతడు అన్ని కోరికలూ సిద్ధించినవాడై వారితో క్రీడించాడు.

**క. తరుణులు పెక్కం డ్రయినను, బురుషుఁడు మనలేఁడు సవతిపోరాటమునన్**
**హరి యా పదాఱువేవురు, తరుణులతో సమత మనియె దక్షత్వమునన్. 221**

**ప్రతి :** పురుషుఁడు= మగవాడు; తరుణులు= కాంతలు (భార్యలు); పెక్కండ్రు= పలువురు; అయినను= అయినచో; సవతి పోరాటమునన్= సవతుల పోరులతో; మనలేఁడు= మనశ్శాంతితో బ్రతుకలేడు; హరి= శ్రీకృష్ణుడు; ఆ; పదాఱువేవురు= పదారువేలమంది; తరుణులతోన్= స్త్రీలతో (పత్నులతో); దక్షత్వమునన్= నేర్పుతో; సమతన్= సమభావంతో; మనియెన్= జీవించాడు.

**తా :** పెక్కుమంది భార్యలుగల మగవాడు సవతుల కయ్యం కారణంగా సుఖశాంతులతో బ్రతుకలేడు. కాని, శ్రీకృష్ణుడు ఆ పదారువేలమంది భార్యలతో నేర్పుకలిగి సమచిత్తంతో ప్రవర్తించాడు.

**శా. ఎన్నేభంగుల యోగమార్గముల బ్రహ్మేంద్రాదు లీక్షించుచున్**
**ము న్నేదేవునిఁ జూడఁ గానక తుదిన్ మోహింతు, రా మేటి కే**
**విన్నాణంబుననో సతుల్ గృహిణులై విఖ్యాతి సేవించి ర**
**చ్ఛిన్నాలోకనహాసభాషణరతిశ్లేషానురాగంబులన్. 222**

**ప్రతి :** మున్ను= పూర్వం; బ్రహ్మ= బ్రహ్మ; ఇంద్ర= ఇంద్రుడు; ఆదులు= మొదలయినవారు; ఎన్ని+ఏన్+భంగులన్= ఎన్నెన్నో విధాలుగా; యోగమార్గములన్= యోగాలచేత; ఈక్షించుచున్= చూస్తూ; ఏ దేవునిన్= ఏ పరమాత్మను; చూడన్+కానక= చూడలేక; తుదిన్= చివరకు; మోహింతురు= అజ్ఞానాన్ని పొందుదురో; ఆ; మేటికిన్= గొప్పవానికి; ఏ; విన్నాణంబునన్+ఓ= నేర్పువల్ల; సతుల్= స్త్రీలు, రాజకన్యలు; గృహిణులు+ఐ= భార్యలై; అచ్ఛిన్న= ఎడతెగని; ఆలోకన= చూపులచేత; హాస= నవ్వులచేత; భాషణ= మాటలచేత; రతి= సంభోగాలచేత; శ్లేష= కౌగిలింతల చేత; అనురాగంబునన్= ప్రేమచేత; విఖ్యాతిన్= కీర్తితో; సేవించిరి= కొలిచారు.

**తా :** బ్రహ్మ, ఇంద్రుడు మొదలయినవారు ఎన్నెన్నో విధాలుగా యోగాల్ని ఆశ్రయించి చూడలేని పరమాత్మకు భార్యలై రాజపుత్రికలు చూపులు, నవ్వులు, మాటలు, సురతాలు, ఆలింగనాలు, ప్రేమలు అనేవాటిచేత సేవించి వాసికెక్కారు.

**సీ. ఇంటికి వచ్చిన నెదురేగుదెంచుచు నానీతవస్తువు లందుకొనుచు**
**సౌవర్ణమణిమయాసనములు వెట్టుచుఁ బదములు గడుగుచు భక్తితోడ**

**సంవాసితస్నానజలము లందించుచు సద్గంధవస్త్రభూషణము లొసఁగి**
**యిష్టపదార్థంబు లిడుచుఁ దాంబూలాదు లొసఁగుచు విసరుచు నోజ మెఱసి**

**తే. శిరము దువ్వుచు శయ్యపైఁ జెలువు మిగుల, నడుగు లొత్తుచు దాసీసహస్రయుక్త**
**లయ్యుఁ గొలిచిరి దాసలై హరి నుదారుఁ, దారకాధిపవదనలు దారు దగిలి. 223**

**ప్రతి :** తారకా+అధిప= నక్షత్రాలకు రాజయినవాణ్ణి పోలిన (చంద్రునిపోలిన); వదనలు= ముఖాలు కలవారు, రాజకన్యలు; తారు= తాము; తగిలి= మిక్కిలి ఆసక్తికలిగి; దాసీసహస్ర= వేలకొలది పరిచారికలతో; యుక్తలు= కూడినవారు; అయ్యున్= అయినప్పటికి; దాసలు+ఐ= పనికత్తెలై; ఇంటికిన్ వచ్చినన్= భర్త ఇంటికి వస్తే; ఎదురు= ఎదురుగా; ఏగుదెంచుచున్= వస్తూ; ఆనీత= తీసుకొనిరాబడిన; వస్తువులు; అందుకొనుచున్= పుచ్చుకొనుచు; సౌవర్ణ= బంగారంతో చేసి; మణిమయ= మణులు పొదిగిన; ఆసనములు= పీటలు; పెట్టుచున్= వేస్తూ; భక్తితోడన్= భక్తితో; పదములు= కాళ్లు; కడుగుచున్= కడుగుతు; సంవాసిత= పన్నీరు మొదలగువాటితో సువాసన కలవిగా సిద్ధంచేసిన; స్నానజలములు= స్నానానికి వాడుకొనే నీళ్లు; అందించుచున్= చేతికిస్తూ; సత్= మేలయిన; గంధ= చందనం; వస్త్ర= దుస్తులు; భూషణాలు= నగలు; ఒసఁగి= ఇచ్చి; ఇష్ట= ఇష్టమయిన; పదార్థంబులు= భోజనపదార్థాలు; ఇడుచున్= పెట్టుతు; తాంబూల+ఆదులు= తాంబూలం మొదలయినవి; ఒసఁగుచున్= ఇస్తూ; శిరము దువ్వుచున్= తల దువ్వుచు; శయ్యపైన్= సెజ్జమీద; చెలువు= అందం; మిగులన్= అతిశయింపగా; అడుగులు+ఒత్తుచున్= కాళ్లొత్తుచు; ఉదారున్= ఘనుని; హరిన్= శ్రీకృష్ణుని; కొలిచిరి= సేవించారు.

**తా :** పదారువేలమంది రాచకొమార్తెలు వేలకొలది పనికత్తెలచేత ఊడిగం చేయించుకొనే వారే అయినప్పటికీ, వారు స్వయంగా శ్రీకృష్ణునికి పరిచర్యలు చేసెడివారు. ఆ రాజకన్యలు భర్త ఇంటికి వచ్చినపుడు ఎదురుపోయేవారు. అతడు తెచ్చిన వస్తువులను తీసికొనేవారు. కూర్చోవడానికి మణులు పొదిగిన బంగారుపీటలు వేసేవారు. భక్తితో కాళ్లు కడిగి సుగంధిజలంతో స్నానం చేయించి, చందనవస్త్రాభరణాలు ఇచ్చేవారు. ఇష్టపదార్థాలతో భోజనం పెట్టిన తర్వాత తాంబూలమిచ్చి, వీవనలతో వీచేవారు. తలదువ్వి, పానుపుపై మృదువుగా పాదములొత్తుతూ సేవించేవారు.

**శా. 'నన్నే పాయఁడు, రాత్రులన్ దివములన్ నన్నే కృపం జెందెడిన్,**
**నన్నే దొడ్డగఁ జూచు వల్లభలలో, నాథుండు నా యింటనే**
**యున్నా' డంచుఁ బదాఱువేలుఁ దమలో నూహించి సేవించి రా**
**యన్నుల్ గాఢపతివ్రతాత్వపరిచర్యాభక్తియోగంబులన్. 224**

**ప్రతి :** ఆ; అన్నుల్= ఆ స్త్రీలు; పదాఱువేలున్= పదారువేలమందీ; రాత్రులన్= రాత్రులందు; దివములన్= పగళ్లలో; నన్నున్+ఏ= నన్ను మాత్రమే; పాయఁడు= వదలిపెట్టి ఉండదు; నన్ను+ఏ= నన్ను మాత్రమే; కృపన్= దయతో; చెందెడిన్= కలసి మెలసి ఉంటున్నాడు; వల్లభలలోన్= ప్రియురాండ్రలో; నన్ను+ఏ= నన్నుమాత్రమే; దొడ్డగన్= గొప్పదాన్నిగా; చూచున్= మన్నిస్తాడు; నాథుండు= భర్త; నా+ఇంటన్+ఏ= నాయింటిలోమాత్రమే; ఉన్నాఁడు= ఉన్నాడు; అనుచున్= అంటూ; తమలోన్= తమ మనస్సులలో; ఊహించి= ఊహించుకొని; గాఢ= దృఢమైన; పతివ్రతాత్వ= పాతివ్రత్యం; పరిచర్యా= దాస్యంతో కూడిన; భక్తి= భక్తి అనే; యోగంబులన్= యోగాలతో; సేవించిరి= సేవలు చేశారు.

**తా :** ఆ పదారువేలమంది రాజకన్యలు "పగలూ రేయీ నన్ను మాత్రమే ఎడబాయడు. దయతో నాతోమాత్రమే పొందు పొసగి ఉంటాడు. ప్రియపత్నులలో నన్నుమాత్రమే దొడ్డయిల్లాలిగా గౌరవిస్తాడు. ప్రాణేశ్వరుడు నా ఇంటిలోనే ఉన్నాడు" అని తమ మనస్సులలో భావించి, పాతివ్రత్యదాస్యభక్తియోగాలతో శ్రీకృష్ణుణ్ణి సేవిస్తున్నారు.

**క. ఆ రామలతో నెప్పుడుఁ, బోరాములు సాల నెఱపి పురుషోత్తముఁడున్**
**గారామునఁ దిరిగెను సౌ, ధారామలతాసరోవిహారముల నృపా! 225**

**ప్రతి :** నృపా= రాజా! పరీక్షిన్మహారాజా!; పురుష+ఉత్తముఁడున్= శ్రీకృష్ణుడును; ఆ; రామలతోన్= ఆ స్త్రీలతో; ఎప్పుడున్= ఎప్పుడు; పోరాములు= స్నేహాలు (ప్రణయ వ్యవహారాలు); చాలన్= మిక్కిలి; నెఱపి= చేసి (నడపి); గారామునన్= ప్రీతితో; సౌధ= మేడలయందలి; ఆరామ= ఉద్యానవనాలందలి; లతా= తీగ పొదరిళ్లలోని; సరస్= సరోవరాలందలి; విహారములన్= వినోదాలతో, క్రీడలతో; తిరిగెన్= తిరిగాడు.

**తా :** శ్రీకృష్ణుడు కూడా పదారువేలమంది రాజకన్యలయందు అత్యధిక ప్రేమకలిగి మేడలలో, ఉద్యానవనాల్లోని లతాగృహాలలో, సరస్సులలో వాళ్లతోకూడి విహరించాడు.

**క. ఏ దేవుఁడు జగముల ను, త్పాదించును మనుచుఁ జెఱుచుఁ బ్రాభవమున మ**
**ర్యాదారక్షణమునకై, యా దేవుం డట్లు మెఱసె యాదవులందున్. 226**

**ప్రతి :** ఏ దేవుఁడు= ఏ పరబ్రహ్మం; జగములన్= లోకాలను; ఉత్పాదించును= సృష్టిస్తున్నాడో; మనుచున్= పోషిస్తున్నాడో; చెఱుచున్= లయింపజేస్తున్నాడో; ఆ దేవుండు= ఆ భగవంతుడు; ప్రాభవమునన్= దొరతనంతో; మర్యాదా= వర్ణాశ్రమ ధర్మాలయొక్క; రక్షణమునకై= కాపాడటంకోసం; యాదవుల+అందున్= యాదవులలో; అట్లు= ఆ విధంగా; మెఱసెన్= ప్రకాశించాడు.

**తా :** లోకాలను సృష్టించి, పోషించి, లయింపజేసే పరమాత్మ అయిన శ్రీకృష్ణుడు ప్రభువై వర్ణాశ్రమధర్మాలను రక్షించడానికి ఆ రాజకన్యలతో ఆ విధంగా వ్యవహరిస్తూ యాదవులలో ప్రకాశించాడు.

## ❖ శ్రీకృష్ణుండు కేళీగృహమునందు రుక్మిణీదేవితో విరసోక్తు లాడుట ❖

**వ. అంత నొక్కనాఁడు రుక్మిణీదేవి లోఁగిట మహేంద్రనీలమరకతాదిమణిస్తంభవలభివిటంకపటల దేహళీకవాటవిరాజమానంబును, శాతకుంభకుడ్యగవాక్షవేదికాసోపానంబును, విలంబమాన ముక్తాఫలదామ విచిత్రకౌశేయవితానంబును, వివిధమణిదీపికావిసరవిభ్రాజమానంబును, మధుకరకుల కలితమల్లికాకుసుమ మాలికాభిరామంబును, జాలకరంధ్రవినిర్గతకర్పూరాగరుధూపధూమంబును, వాతాయనవిప్రకీర్ణశిశిరకరకిరణ స్తోమంబును, బారిజాతప్రసవామోదపరిమళితపవనసుందరంబు నయిన లోపలిమందిరంబున శరచ్చంద్ర చంద్రికాధవళపర్యంకమధ్యంబున, జగదీశ్వరుం డయిన హరి సుఖాసీనుండై యుండ, సఖీజనంబులుం దానును దగ్గఱి కొలిచి యుండి. 227**

**ప్రతి :** అంతన్= తర్వాత; ఒక్కనాఁడు= ఒకరోజు; రుక్మిణీదేవి లోఁగిటన్= రుక్మిణీదేవి ఇంటిలో; మహేంద్ర నీల= ఇంద్రనీలాలు; మరకత= మరకతాలు; ఆది= మొదలయిన; మణి= మణులు పొదిగిన; స్తంభ= స్తంభాలతో; వలభి=

ఇంద్ల ముంజూరులతో; విటంక= పావురాళ్ల గూళ్లతో; పటల= పైకప్పులతో; దేహళీ= గడపలతో; కవాట= తలుపులతో; విరాజమానంబును= ప్రకాశిస్తుండేదీ; శాతకుంభ= బంగారంతో నిర్మించిన; కుడ్య= గోడలు; గవాక్ష= కిటికీలు; వేదికా= అరుగులు; సోపానంబును= మెట్లు కలదీ; విలంబమాన= వ్రేలాడుచున్న; ముక్తాఫల= ముత్యాల; దామ= దండలతో కూడిన; విచిత్ర= పలురంగులు గల; కౌశేయ= పట్టుబట్టలయొక్క; వితానంబును= మేలుకట్లు కలిగిందీ; వివిధ= అనేక విధాలయిన; మణిదీపికా= రత్నదీపాలయొక్క; విసర= సమూహంతో; విభ్రాజమానంబును= వెలుగొందుతుండేదీ; మధుకర= తుమ్మెదలయొక్క; కుల= గుంపులతో; కలిత= కూడిన; మల్లికా కుసుమ= మల్లెపూలయొక్క; మాలికా= దండలచేత; అభిరామంబును= మనోహరమయిందీ; జాలక= కిటికీల; రంధ్ర= సందులగుండా; వినిర్గత= బయటికి వచ్చిన; కర్పూర= కర్పూరం; అగరు= అగరు అనెడి; ధూప= సుగంధ ద్రవ్యాలయొక్క; ధూమంబును= పొగ కలిగిందీ; వాతాయన= కిటికీలలో; విప్రకీర్ణ= వ్యాపించిన; శిశిరకర= చంద్రునియొక్క; కిరణ= కిరణాలయొక్క; స్తోమంబును= సమూహం కలదీ; పారిజాత= పారిజాతవృక్షంయొక్క; ప్రసవ= పూలయొక్క; ఆమోద= సువాసనలచేత; పరిమళిత= పరిమళించేటట్లుచేయబడిన; పవన= గాలిచేత; సుందరంబును= మనోహరమయిందీ; అయిన; లోపలి మందిరంబునన్= లోపలియింటిలో; శరత్= శరత్కాలంలోని; చంద్ర= చంద్రునియొక్క; చంద్రికా= వెన్నెలవలె; ధవళ= తెల్లనయిన; పర్యంక= పానుపుయొక్క; మధ్యంబునన్= నడుమ; జగత్+ఈశ్వరుండు= లోకాధిపతి; అయిన; హరి= శ్రీకృష్ణుడు; సుఖ= సుఖంగా; ఆసీనుండు+ఐ= కూర్చున్నవాడై; ఉండన్= ఉండగా; సఖీజనంబులున్= చెలికత్తెలును; తానును; దగ్గఱి= సమీపించి; కొలిచి= సేవిస్తూ; ఉండి...

**తా :** ఈ వచనంలో కవి రుక్మిణీదేవి సౌధంలోపలి మందిరాన్ని వర్ణిస్తున్నాడు. రుక్మిణీదేవి అభ్యంతరగృహం నవరత్నాలు పొదిగిన స్తంభాలు, ముంజూరులు, పావురాళ్లగూళ్లు మొదలయినవానితో వెలిగే ఆ మందిరం గోడలు, కిటికీలు, అరుగులు, మెట్లు బంగారుమయాలు. దానిలో ముత్యాలదండలు వ్రేలాడుతున్న పట్టు మేలుకట్లు ఉన్నాయి. అవి రత్నదీపాలతో ప్రకాశిస్తున్నాయి. సువాసనలకు మూగిన తుమ్మెదలతో కూడియున్న మల్లెపూలదండలతో ఆ భవనం ఒప్పారుతూ ఉంది. అందలి కిటికీల సందులనుండి అగరు కర్పూరాల పొగలు బయటికి వస్తున్నాయి. గవాక్షాలలో చంద్ర కిరణాలు వ్యాపించాయి. పారిజాత పుష్పాల పరిమళం గ్రహించి గాలులు మనస్సులకు ఆహ్లాదం కల్గిస్తున్నాయి. ఇట్టి అభ్యంతరగృహంలో ఒకనాడు శ్రీకృష్ణుడు శరత్కాలంనాటి పండువెన్నెలవలె తెల్లనైన పాన్పునడుమ కూర్చుని ఉన్నాడు. రుక్మిణి చెలికత్తెలతోకూడా ప్రాణేశ్వరునివద్దకు వచ్చి సేవిస్తూ ఉన్నాడు.

**సీ. కుచకుంభములమీఁది కుంకుమతో రాయు హారంబు లరుణంబు లగుచు మెఱయఁ**
**గరపల్లవము సాఁచి కదలింప నంగుళీయకకంకణప్రభ లావరింపఁ**
**గదలిన బహురత్నకలితనూపురముల గంభీరనినదంబు గడలు కొనఁగఁ**
**గాంచనమణికర్ణికామయూఖంబులు గండపాలికలపై గంతు లిడఁగఁ**

**తే. గురులు నర్తింపఁ బయ్యెదకొంగు దూఁగ, బోటి చేనున్న చామరఁ బుచ్చుకొనుచు**
**జీవితేశ్వరు రుక్మిణి సేర నరిగి, వేడ్క లిగురొత్త మెల్లన వీవఁ దొడఁగె. 228**

**ప్రతి :** కుచ కుంభముల మీఁది= కుండలవంటి స్తనాలమీద పూసిన; కుంకుమతో= కుంకుమతోన్; రాయు= ఒరసికొనేటట్లుగా; హారంబులు= తెల్లనిముత్యాలదండలు మొదలగునవి; అరుణంబులు= ఎఱ్ఱనివి; అగుచున్= అవుతు; మెఱయన్= ప్రకాశించగా;

కరపల్లవము= చిగురాకువలె మృదువైన చేతిని; చాఁచి= ముందుకు చాచి; కదలింపన్= చలింపజేయగా; అంగులీయక= చేతివ్రేళ్లకు పెట్టుకొన్న ఉంగరాలయొక్క; కంకణ= ముంజేతియందలి గాజులయొక్క; ప్రభలు= కాంతులు; ఆవరింపన్= చుట్టూ క్రమ్ముకొనగా; కదలినన్= అట్టిటు కదలినచో; బహు= అనేకాలైన; రత్న= రత్నాలతో; కలిత= కూడిన; నూపురముల= కాలియందెల; గంభీరనినదంబు= గంభీరధ్వని; కడలుకొనఁగన్= అతిశయించగా; కాంచనమణి= బంగారంతో చేసి; రత్నాలు పొదిగిన; కర్ణికా= చెవికమ్మలయొక్క; మయూఖంబులు= కాంతులు; గండపాలికలపైన్= చెక్కిళ్ల ప్రదేశాలలో; గంతులిడఁగన్= గంతులువేయగా; కురులు= తలవెంట్రుకలు; నర్తింపన్= నాట్యం చేయగా (ఎగురగా); పయ్యెదకొంగు= పైటకొంగు; తూఁగన్= చలింపగా; రుక్మిణి; బోటి= చెలికత్తెయొక్క; చేన్= చేతిలో; ఉన్న; చామరన్= వింజామరాన్ని; పుచ్చుకొనుచున్= తీసుకొంటూ; జీవిత+ఈశ్వరున్= ప్రాణేశ్వరుడైన శ్రీకృష్ణుణ్ణి; చేరన్= సమీపించగా; అరిగి= వెళ్లి; వేడ్కలు= కోరికలు; ఇగురొత్తన్= ఉదయించగా; మెల్లనన్= మెల్లగా; వీవన్= వీచుటకు; తొడఁగెన్= పూనుకొనింది.

**తా :** రుక్మిణీ కుచాలమీది కుంకుమంతో ఒరసికొన్న హారాలు ఎర్రనివి కాగా, చేతిని చాచినప్పుడు ఉంగరాల గాజులకాంతులు చుట్టు వ్యాపింపగా, కదలినప్పుడు కాళ్లయందలి కడియాల గంభీరధ్వని అతిశయింపగా, రత్నాలు పొదిగిన బంగారు చెవికమ్మల కాంతులు చెక్కిళ్లపై చిందులు త్రొక్కగా, తలవెంట్రుకలు చలింపగా, పైటకొంగు అల్లలనాడగా చెలికత్తె చేతిలో ఉన్న వింజామరాన్ని తాను తీసుకొని శ్రీకృష్ణుణ్ణి సమీపించి ఆయనకు మెల్లగా వీవసాగింది.

**వ. అప్పుడు. 229**

**తా :** ఆ సమయమున

**మ. పతి యే రూపము దాల్చినం దదనురూపంబైన రూపంబుతో**
**సతి దా నుండెడు నట్టి రూపవతి నా చంద్రాస్య నా లక్ష్మి నా**
**సుతనున్ రుక్మిణి నా యనన్యమతి నా శుద్ధాంతరంగం గళా**
**చతురత్వంబున శౌరి యిట్లనియెఁ జంచన్మందహాసంబుతోన్. 230**

**ప్రతి :** సతి= పతివ్రత (సద్గుణవతి); తాన్= తాను; పతి= భర్త; ఏ రూపం; తాల్చినన్= ధరించినప్పటికినీ; తద్= ఆ రూపానికి; అనురూపంబు+ఐన= అనుగుణమైన (సాటియైన); రూపంబుతోన్= రూపంతో; ఉండెడున్= ఒప్పుతుండేట్టి; అట్టి= ఆ సతిని పోలునట్టి; రూపవతిన్= సౌందర్యవతినీ; ఆ; చంద్ర+ఆస్యన్= చంద్రముఖినీ; ఆ లక్ష్మిన్= ఆ లక్ష్మినీ; ఆ సుతనున్= ఆ శోభనాంగినీ; ఆ; అనన్యమతిన్ (న+అన్యమతిన్)= ఇతరులయందు మనస్సు నిలుపనిదాన్ని; ఆ; శుద్ధ= నిర్మలమయిన; అంతరంగన్= హృదయంగలదాన్నీ; రుక్మిణిన్= రుక్మిణిని గూర్చి; శౌరి= శ్రీకృష్ణుడు; కళా= సంభాషణ కళలో; చతురత్వంబునన్= నేర్పుతో; చంచత్= ఒప్పుచున్న; మందహాసంబుతోన్= చిఱునవ్వుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** పతివ్రత, భర్త ధరించిన రూపానికి అనుగుణమైన రూపంతోనే విరాజిల్లేదీ, సుందరి, చంద్రముఖి, లక్ష్మీస్వరూపిణి, శోభనాంగి, ప్రాణేశ్వరాంకితమతి, నిర్మలహృదయ అయిన రుక్మిణి మహాపతివ్రత. ఆమెతో వాక్చాతుర్యం కలిగిన శ్రీకృష్ణుడు చిరునవ్వులు చిందించుచు ఈ రీతిగా పలికాడు.

**విశే :** రుక్మిణీకృష్ణులు సాక్షాత్తు లక్ష్మీనారాయణులు. ఒకర్ని వదలి మరొకరు ఉండరు. స్వామి ఎన్ని అవతారాలెత్తినా లక్ష్మి తదనుగుణంగా తగిన రూపంతో ఆయన్ను చేరే ఉంటుంది. స్వామి రాముడైనప్పుడు లక్ష్మి సీత అయింది. కృష్ణుడైనప్పుడు

రుక్మిణి అయింది. ఇలా లక్ష్మి శ్రీహరికి అనపాయిని (ఎడబాటులేనిది). ఇట్లుండడం ఆ దివ్యదంపతుల అన్యోన్య ప్రేమకు నిదర్శనం. ఈ పద్యంలో ఆ లక్ష్మియే రుక్మిణి అనే విషయం స్పష్టం చేయబడింది.

**మ. బలశౌర్యంబుల భోగమూర్తి కులరూపత్యాగసంపద్గుణం**
**బుల దిక్పాలురకంటెఁ జైద్యముఖరుల్ పూర్ణుల్ ఘనుల్, వారికిన్**
**నెలఁతా! తల్లియుఁ దండ్రియున్ సహజుఁడున్ ని న్నిచ్చినం బోక యీ**
**బలవద్భీరుల వార్ధిలీనుల మముం బాటింప నీ కేటికిన్? 231**

**ప్రతి :** నెలఁతా!= కాంతా!; చైద్య= చేదిదేశ ప్రభువు, శిశుపాలుడు; ముఖరుల్= మొదలయినవారు; బలశౌర్యంబులన్= బలంచేత, పరాక్రమంచేత; భోగ= భోగంచేత; మూర్తి= రూపంచేత; కుల= కులంచేత; రూప= సౌందర్యంచేత; త్యాగ= త్యాగంచేత; సంపత్= ఐశ్వర్యంచేత; గుణంబులన్= గుణాలచేత; దిక్పాలురకంటెన్= దిక్కులు పాలించువారైన, ఇంద్రుడు మొదలగువారికంటె; పూర్ణుల్= సర్వలక్షణాలు సంపూర్తిగా గలవారు; ఘనుల్= గొప్పవారు; తల్లియున్= మీ తల్లియు; తండ్రియున్= తండ్రియును; సహజుఁడున్= తోడబుట్టినవాడును; వారికిన్= ఆ శిశుపాలునికి; నిన్నున్= నిన్ను; ఇచ్చినన్= ఇచ్చి పెండ్లి చేస్తుంటే; పోక= వెళ్లకుండ; ఈ; బలవత్= బలవంతుల్ని చూచి; భీరులన్= భయపడేవారిని; వార్ధి= సముద్రాన్ని; లీనులన్= ఆశ్రయించినవారిని; మమున్= మమ్మల్ని; పాటింపన్= పరిగణించడం; నీకున్+ఏటికిన్= నీకెందుకు?

**తా :** రుక్మిణీ! శిశుపాలుడు మొదలయినవారు కులబలరూపశౌర్యాదులచేత ఇంద్రుడు మొదలయిన దిక్పాలురకంటె గొప్పవారు. ఏ లోటూ లేనివారు. మీ తల్లిదండ్రులు, తోబుట్టువు – వాళ్లకు వివాహం చేస్తుంటే నీవు వారితోపాటు వెళ్లకుండ బలవంతుల్ని చూచి భయపడేవారినీ, భూమిమీద నిలువనీడలేక సముద్రంలో దాగినవారినీ మమ్మల్ని ఎందుకు అంగీకరించావు? (అంగీకరించకుండా ఉండాల్సింది).

**సీ. లోకుల నడవడిలోనివారము గాము, పరులకు మా జాడ బయలు పడదు,**
**బలమదోపేతులు పగగొంద్రు మా తోడ, రాజపీఠములకు రాము తఱచు,**
**శరణంబు మాకు నీ జలరాశి సతతంబు నిష్కించనుల మేము, నిధులు లేవు,**
**కలవారు చుట్టాలు గారు, నిష్కించనజనబంధులము ముక్తసంగ్రహులము,**

**ఆ. గూఢవర్తనులము, గుణహీనులము, భిక్షు, లైన వారిఁగాని నాశ్రయింప,**
**మిందుముఖులు దగుల రిటువంటి మముబోఁటి, వారి నేల తగుల వారిజాక్షి! 232**

**ప్రతి :** వారిజ+అక్షి!= పద్మాలవంటి కన్నులు గలదానా!; రుక్మిణీ!; లోకుల= లోకంలోనివారియొక్క; నడవడిలోని వారము= నడతలకు; లొంగినవారం; కాము; పరులకున్= ఇతరులకు; మా జాడ= మా నడవడి; బయలుపడదు= వెల్లడికాదు; బల= ధనాదుల బలంవల్ల కలిగిన; మద= మదంతో; ఉపేతులు= కూడినవారు; మా తోడన్= మాతో; పగగొంద్రు= పగపూనుతారు; తఱచు= సామాన్యంగా; రాజపీఠములకున్= రాజసింహాసనాలకు; రాము= రాము; మాకున్= మాకు; ఈ; జలరాశి= సముద్రం; సతతంబు= ఎల్లప్పుడు; శరణంబు= ఇల్లు; ఏము= మేము; నిష్కించనులము= ఏమియు లేనివారం; నిధులు= పాతిపెట్టిన నిధులూ, నిక్షేపాలూ; లేవు; కలవారు= ధనవంతులు, చుట్టాలు= బంధువులు; కారు; నిష్కించనజన= దరిద్రజనులయొక్క; బంధులము= చుట్టాలం; ముక్త= విడువబడిన; సంగ్రహులము= కూడబెట్టే

పని కలవారం (కూడబెట్టిన ఆస్తిలేనివారం); గూఢ= రహస్యమయిన; వర్తనులము= ప్రవర్తన గలవారం; గుణ=సద్గుణాలచేత; హీనులము= తక్కువైనవాళ్లం; భిక్షులు= బిచ్చమెత్తువారు, ఐన; వారిన్+కాని= వారినిగాని; ఆశ్రయింపము; ఇటువంటి= ఇట్టి లక్షణాలుగల; మముబోఁటివారిన్= మావంటివారిని; ఇందుముఖులు= చంద్రునివంటిముఖంగలవారు (సౌందర్యవతులు); తగులరు= మోహింపరు; తగులన్= నీవు మోహించుట; ఏల?= ఎందులకు?

**తా :** రుక్మిణీ! మేము లోకాచారప్రకారంగా ప్రవర్తింపం. ఇతరులకు మా నడవడి తెలియదు. బలమదం గలవారు మామీద పగపూనుతారు. సింహాసనాలెక్కి రాజ్యాలు పరిపాలింపం. మాకు ఈ సముద్రమే ఆశ్రయం. మేము దరిద్రులం. మాకు సొమ్ము పాతరలు లేవు. శ్రీమంతులు మా బంధువులు గారు. మేము దరిద్రులకు చుట్టాలం. ధనం కూడబెట్టలేదు. మా నడవడి గుట్టుగా ఉంటుంది. మేము మంచిగుణాలు లేనివారం. బిచ్చమెత్తుకొంటూ బతుకు లీడ్చేవారిని ఆశ్రయిస్తాం? ఇటువంటి మమ్ముల్ని సుందరు లెవ్వరూ ప్రేమించరు. నీవేల ప్రేమించావు?

**విశే :** ప్రస్తుత పద్యంలో ఒక అర్థం పరిహాసంగా మాటాడే శ్రీకృష్ణునికీ, రెండవ అర్థం శ్రీకృష్ణావతారమెత్తిన విష్ణువుకు అంటే పరమాత్మకూ సంబంధించి ఉంటుంది. మొదటి అర్థం తాత్పర్యంలో ఉంది.

**రెండవది – విష్ణుపరమైన అర్థం :** 1. ఈ చరాచర ప్రపంచానికి నేనే సృష్టికర్తను. కాబట్టి, నా నడవడి ఈ లోకంలోనివారి నడవడిని పోలియుండదు. 2. త్రికాలజ్ఞుడనయిన నన్ను ఎవ్వరును తెలుసుకొనలేరు. 3. బలమదం గలవారు ప్రతి అవతారంలోను నాతో వైరం పెట్టుకొంటారు. 4. నే నేయవతారంలోను రాజ్యసింహాసన మధిష్ఠించని లోకేశ్వరుణ్ణి 5. క్షీరసాగరమే మాకు గృహం. 6. మానవుల లక్షణాలు – జననం, మరణం మొదలగునవేవియు లేనివాణ్ణి. నేను పరాప్రకృతిని. అణిమ మొదలయిన అష్టైశ్వర్యాలు కలవాణ్ణి మోక్షప్రదాతను. 7. ధనవంతులు నాకు భక్తులు కాలేరు. 8. నేను దీనబాంధవుణ్ణి. భక్తులే నా సంపద. 9. అజ్ఞానులు నా తత్త్వాన్ని గ్రహించలేరు. 10. నేను నిర్గుణుణ్ణి. 11. మహాయోగులే నాకు ఆప్తులు. 12. నేను ఆత్మారాముణ్ణి – ఇలా పైకి తనను కించపరుచుకొంటున్నా – లోపల తన తత్త్వాన్ని వ్యక్తం చేస్తూ – రుక్మిణిని పరీక్షిస్తున్నాడు శ్రీకృష్ణుడు.

**క. సిరియును వంశము రూపును, సరియైన వివాహసఖ్యసంబంధంబుల్**
**జరుగును, సరి గాకున్నను, జరగవు, లోలాక్షి! యెట్టి సంసారులకున్. 233**

**ప్రతి :** లోల+అక్షి!= చలించే కన్నులు గలదానా! రుక్మిణీ! ఎట్టి= ఎటువంటి; సంసారులకున్= సంసారాలు చేసేవారికయినా; సిరియును= ధనమును; వంశమున్= మంచి కులమును; రూపును; అందమును; సరి+ఐనన్= సమానమయితేనే; వివాహము= పెండ్లి; సఖ్యము= స్నేహం; సంబంధంబుల్= బంధుత్వం; జరుగును= అవుతాయి; సరి+కాక+ఉన్నను= సమానం గాకుంటే; జరగవు= కావు.

**తా :** ఎంతగొప్ప సంసారుల మధ్యనయినా ధనం, సత్కులం, సౌందర్యం సమానంగా నున్నప్పుడే పెండ్లి జరుగుతుంది. స్నేహ మేర్పడుతుంది. చుట్టరికం కుదుర్తుంది. అవి సమానాలు కాకపోతే ఇవి జరగవు.

**క. తగ దని యెఱుఁగవు మమ్ముం, దగిలితివి మృగాక్షి! దీనఁ ద ప్పగు; నీకుం**
**దగిన మనుజేంద్రు నొక్కనిఁ, దగులుము, గుణహీనజనులఁ దగునే తగులన్? 234**

**ప్రతి :** మృగ+అక్షి!= లేడికన్నులవంటి కన్నులు గలదానా! రుక్మిణీ!; తగదు= తగింది కాదు; అని; ఎఱుఁగవు= తెలుసు కోలేకపోయావు; మమ్మున్= మమ్ము; తగిలితివి= పొందితివి; దీనన్= ఈ పనిచేత; తప్పు= దోషం; అగున్= కలుగుతుంది; నీకున్= నీకు; తగిన= తగినవాడయిన; మనుజ+ఇంద్రున్; రాజును; ఒక్కనిన్= ఒకణ్ణి; తగులుము= పొందుము; గుణ= దుర్గుణాలచేత; హీన= తక్కువవారయిన, మంచిగుణములు లేనివారయిన; జనులన్= పురుషుల్ని; తగులన్= మోహించగా; తగున్+ఏ= సముచితమా? (సముచితం కాదని భావం)

**తా :** రుక్మిణీ! ఇది మంచిపని కాదని తెలుసుకోలేక నీవు నన్ను పెండ్లాడినావు. దీనివల్ల నీవు తప్పు చేసిందానివయ్యావుయ నీకు తగిన ఒకరాజును పతిగా వరించుకో. సద్గుణాలు లేనివారిని మోహించడం న్యాయమా? (కాదని అర్థం).

**సీ. సాల్వ జరాసంధ చైద్యాదిరాజులు చెలఁగి నన్ వీక్షించి మలయుచుండ**
**నది గాక రుక్మి నీ యన్నయు గర్వించి వీర్యమదాంధుఁడై వెలయుచున్న**
**వారిగర్వంబులు వారింపఁగాఁ గోరి చెలువ ని న్నొడిచి తెచ్చితిమి, గాని**
**కాంతాతనూజార్థకాముకులము గాము, కామమోహాదులఁ గ్రందుకొనము.**

**తే. విను, ముదాసీనులము, క్రియావిరహితులము, పూర్ణులము మేము, నిత్యాత్మబుద్ధితోడ**
**వెలుఁగుచుందుము గృహదీపవిధము మెఱసి, నవలతాతన్వి! మాతోడ నవయ వలదు. 235**

**ప్రతి :** నవలతాతన్వి!= లేత తీగవంటి శరీరం గలదానా!, రుక్మిణీ!; సాల్వ= సాల్వుడు; జరాసంధ= జరాసంధుడు; చైద్య= శిశుపాలుడు; ఆది= మొదలైన; రాజులు; నన్= నన్ను; వీక్షించి= చూచి; చెలఁగి= చెలరేగి; మలయుచున్= విజృంభిస్తూ; ఉండన్= ఉండగా; అది+కాక= అదేకాక; రుక్మి; నీ+అన్నయున్= నీ అన్నకూడా; గర్వించి; వీర్య= బలంవలన కలిగిన; మద= మదంచేత; అంధుఁడు= కన్నుగానని వాడు; ఐ= అయి; వెలయుచున్+ఉన్నన్= మిడిసి పడుతూంటే; వారి గర్వంబులు; వారింపన్+కాన్= అణపగా; కోరి; చెలువన్= సుందరిని; నిన్నున్= నిన్ను; ఒడిచి= బలాత్కారంగా గ్రహించి; తెచ్చితిమి; కాని= ఇంతేకాని; కాంతా= స్త్రీలను (భార్యలను); తనూజ= కుమారులను; అర్థ= ధనాన్ని; అర్థులము= కోరినవారం; కాము; కామ= కామం; మోహ= మోహం; ఆదులన్= మొదలగువానిచేత; క్రందుకొనము= గగ్గోలుపడం; వినుము; ఏము= మేము; ఉదాసీనులము= తటస్థులం; క్రియా విరహితులము= ప్రాపంచిక వ్యవహారాలు లేనివారం; పూర్ణులము= తృప్తిపడినవారం (ఏ అపేక్షలు లేనివారం); నిత్య+ఆత్మబుద్ధితోడన్= పరమాత్మననే బుద్ధితో; గృహదీపవిధము= గృహమునందలి దీపమువలె; మెఱసి= ప్రకాశింపజేసి; వెలుఁగుచుందుము= ప్రకాశిస్తాము; మాతోడన్= మాతోపాటు; నవయవలదు= బాధపడవద్దు.

**తా :** రుక్మిణీ! సాల్వుడు, జరాసంధుడు, శిశుపాలుడు మొదలగు రాజులు నన్ను చూచి చెలరేగుతుంటారు. నీ అన్న రుక్మికూడా పొగరుబట్టి బలమదంతో కన్నుగానక ఎగిరిపడుతుంటాడు. వాళ్ల తలపొగరు అణపదలచి నిన్ను బలాత్కారంగా తీసుకొని వచ్చానే కాని సంసారం చేయాలని కాదు. నేను దారైషణ, పుత్రైషణ, ధనైషణ అను మూడు కోరికల్నీ వదిలినవాణ్ణి. కామాదులైన అరిషడ్వర్గం లేనివాణ్ణి. అన్నిటా తటస్థుడిని. ప్రాపంచిక వ్యవహారాలలో చిక్కుకోను. పూర్ణకాముడిని. పరమాత్మననే బుద్ధితో ఇంటిలోని దీపం మాదిరిగా వెలుగుతూ వెలుగొందజేస్తాను. ఇటువంటి నాతో కలసి నీవు బాధపడవద్దు.

**వ. అని యిట్లు భగవంతుండైన హరి తన్నుఁ బాయక సేవించుటం బ్రియురాలను, పట్టంపుదేవి ననియెడి రుక్మిణిదర్పంబు నేర్పున నుపసంహరించి యూరకుండిన నమ్మానవతి యప్రియంబులు నపూర్వంబులునైన మనోవల్లభుమాటలు విని దురంతంబైన చింతాభరంబున సంతాపంబు నొందుచు. 236**

**ప్రతి :** అని; ఇట్లు; భగవంతుడు= ఐశ్వర్యం, వీర్యం, యశం, శ్రీ, జ్ఞానం, వైరాగ్యం అను ఆరు గుణాలు కలవాడు; ఐన; హరి= శ్రీకృష్ణుడు; తన్నున్= తనను; పాయక= విడువక; సేవించుటన్= సేవించడంచేత; ప్రియురాలను= నేను ప్రియ పత్నిని; పట్టంపుదేవిన్= పట్టము+దేవిన్= నేనే పట్టాభిషిక్తురాలనయిన దేవిని; అనియెడి= అనే; రుక్మిణి= రుక్మిణియొక్క; దర్పంబున్= అహంకారాన్ని; నేర్పునన్= నేర్పుతో; ఉపసంహరించి= మరలించి (తగ్గించి); ఊరకుండినన్= మిన్నకుండగా; ఆ+మానవతి= ఆత్మాభిమానం కలిగిన ఆమె; అప్రియంబులున్= ప్రీతి కలిగింపనివీ; అపూర్వంబులున్= ఇంతకుముందు విననివీ; ఐన; మనస్+వల్లభు= ప్రాణేశ్వరునియొక్క; మాటలు= పలుకులు; విని; దురంతంబు+ఐన= అంతంలేనిదయిన; చింతా= దుఃఖంయొక్క; భరంబునన్= భారంచేత; సంతాపంబున్= పరితాపాన్ని; ఒందుచున్= పొందుతూ...

**తా :** షడ్గుణ సంపన్నుడైన శ్రీకృష్ణుడు ఈ విధంగా మాట్లాడి, నిత్యమూ అన్ని సేవలూ చేస్తూ ఉండడంచేత "నేనే ప్రియురాలిని, నేనే పట్టపురాణిని" అని చెప్పే రుక్మిణిఅహంకారాన్ని అణచి, మాటాడక ఊరకున్నాడు. మానవంతురాలయిన ఆమె వినడానికి ఇష్టంగానివీ, ఇంతకు ముందు ఏనాడూ పలుకనివీ అయిన ప్రాణేశునిమాటలు విని, మేరలేని దుఃఖాతిశయంవల్ల పరితపిస్తూ

**సీ. కాటుక నెఱయంగఁ గన్నీరు వరదలై కుచకుంభయుగళకుంకుమము తడియ**
**విడువక వెడలెడు వేఁడినిట్టూర్పుల, లాలితాధరకిసలయము గందఁ**
**జెలువంబు నెఱిదప్పి చిన్నవోవుచు నున్న వదనారవిందంబు వాడు దోఁప**
**మారుతాహతిఁ దూలు మహితకల్పకవల్లివడువున మేన్ వడవడ వడంకఁ**

**తే. జిత్త మెఱియంగఁ జెక్కిటఁ జెయ్యి సేర్చి, కౌతుకం బేది పదతలాగ్రమున నేల**
**వ్రాసి పెంపుచు మో మరవాంచి వగలఁ, బొందె మవ్వంబు గందిన పువ్వుఁబోలె. 237**

**ప్రతి :** కాటుక; నెఱయన్+కన్= చెదరగా; కన్నీరు; వరదలై; కుచకుంభ= కుండలవంటి స్తనాలయొక్క; యుగళ= జంటమీద అలదిన; కుంకుమము= కుంకుమ; తడియన్= తడిసిపోగా; విడువక= ఎడతెగకుండ; వెడలెడు= బయటికి వస్తున్న; వేఁడి= వెచ్చని; నిట్టూర్పులన్= నిట్టూర్పులచేత; లాలిత= మృదువైన; అధరకిసలయము= చిగురుటాకువంటి పెదవి; కందన్= నల్లబడగా; చెలువంబునెఱి= అందముయొక్క నిగ్గు; తప్పి= తొలగి; చిన్న+పోవుచున్= కళతప్పుతు; ఉన్న= ఉండిన; వదన+అరవిందంబు= పద్మంవంటిముఖం; వాడు= వాడిపోవడం; తోఁపన్= కనబడగా; మారుత= గాలియొక్క; ఆహతిన్= దెబ్బచేత; తూలు= చలిస్తున్న; మహిత= గొప్పదయిన; కల్పకవల్లి= కల్పవృక్షం; వడువునన్= విధంగా; మేన్= శరీరం; వడవడ వడంకన్= వడవడ వణకగా; చిత్తము= మనస్సు; ఎఱియన్+కన్= బాధపడగా (మండిపోవగా); చెక్కిటన్= చెక్కిలియందు; చెయ్యి= చేయి; చేర్చి= ఉంచి; కౌతుకము= సంతోషం; ఏది= నశించి; పదతల= పాదంయొక్క క్రిందిభాగం; అగ్రమునన్= కొనతో (కాలిబొటన వ్రేలితో); నేల= నేల; వ్రాసి= రాసి; పెంపుచున్= లోతుగా గీతలు పడునట్లు చేసి చెడగొట్టుచు; మోము= ముఖం; అర+వాంచి= సగము క్రిందికి వంచి; మవ్వంబు= మృదుత్వం; కందిన= నశించిన; పువ్వున్= పువ్వును; పోలెన్= వలె; వగలన్= సంతాపాలను; పొందెన్= పొందింది.

**తా :** మగనిఎత్తి పొడుపుమాటలకు సంతాపం పొందిన రుక్మిణి స్వరూపాన్ని కవి వర్ణిస్తున్నాడు. కాటుక చెదరిపోయేట్లుగా కారిన కన్నీటిచే స్తనద్వయంమీదికుంకుమం తడిసిపోయింది. ఎడతెగని వేడినిట్టూర్పులచే చిగురాకువంటి పెదవి కందింది. సౌందర్యం నిగ్గు తగ్గిపోయి, కళావిహీనమై ముఖం వాడిపోయింది. గాలిదెబ్బకు అల్లల్లాడే కల్పవృక్షంవలె మేను గజగజ వణికింది. మనస్సు బాధపడింది. రుక్మిణి చెక్కిట చేయిచేర్చి, సంతోషం కోల్పోయి, కాలిబొటనవ్రేలితో నేల రాస్తూ, ముఖం సగంవంచి తపించింది. ఆమె కోమలత్వం నశించినపువ్వులాగా కనబడింది.

**చ. అలికుల వేణి తన్నుఁ బ్రియుఁ డాడిన యప్రియభాష లిమ్మెయిన్**
**సొలవక కర్ణరంధ్రముల సూదులు చొచ్చిన రీతిగాఁగ బె**
**బ్బులి రొద విన్న లేడిక్రియఁ బొల్పఱి చేష్టలు దక్కి నేలపై**
**వలనఱి వ్రాలెఁ గీ లెడలి వ్రాలినపుత్తడిబొమ్మకైవడిన్. 238**

**ప్రతి :** అలికుల= తుమ్మెదల చాలువంటి; వేణి= జడగలది; రుక్మిణి; ప్రియుఁడు= శ్రీకృష్ణుడు; ఈ+మెయిన్= ఈ రీతిగా; తన్నున్= తననుగూర్చి; ఆడిన= పలికిన; అప్రియ= ఇష్టంకానివైన; భాషలు= మాటలు; సొలవక= తగ్గక (ఎక్కువగా); కర్ణరంధ్రములన్= చెవుల బిలాలలో; సూదులు; చొన్పినరీతి= గ్రుచ్చినతీరు; కాన్+కన్= కాగా; బెబ్బులిరొద= పెద్దపులి గాండ్రింపు; విన్న= వినిన; లేడిక్రియన్= లేడివలె; పొల్పు+అఱి= స్థైర్యం నశించి; చేష్టలు= శరీరంతో చేసే పనులు; తక్కి= వదలి; వలను+అఱి= శక్తి క్షీణించి; కీలు= సీల; ఎడలి= సడలి; వ్రాలిన= క్రిందపడిన; పుత్తడిబొమ్మ కైవడిన్= బంగారపుబొమ్మవలె; నేలపైన్= భూమి మీద; వ్రాలెన్= పడింది.

**తా :** తనతో ప్రియుడు పలికిన అప్రియమైన మాటలు చెవులలో గ్రుచ్చిన సూదులు కాగా, రుక్మిణి పులిగాండ్రింపు విన్న లేడివలె స్థైర్యం కోల్పోయి, కదలలేక, మెదలలేక చీల ఊడిపోయిన బంగారుబొమ్మవలె భూమిమీద పడిపోయింది.

**విశే :** శ్రీకృష్ణుడు నిష్కారణంగా ఏమాటా మాట్లాడడు. కనుక తనకు ప్రాణప్రియ అయిన రుక్మిణిని ఇలా నిందించడం వెనుక ఏదో ప్రయోజనం ఉంటుంది. రుక్మిణి ఎప్పుడూ తనకు సేవలు చేస్తుందే కానీ - తానెప్పుడూ ఆమెకు సేవలు చేయలేదు. అందుకే కృష్ణుడు ఇలాంటి మాటల్తో ఆమెను నొప్పించి, నేలపై పడేట్టుగా చేశాడు. తర్వాత ఆమెకు సేవలు చేసి, అనునయించి, లాలించి, సంతోషపరుస్తాడు. ఇది ఆ స్వామికి ఒక ఆనందలీలావిలాసం.

**వ. ఇట్లు వ్రాలిన. 239**

**తా :** ఇట్లు నేలమీద పడిపోగా...

**మ. ప్రణతామ్నాయుఁడు కృష్ణుఁ డంతఁ గదిసెన్ బాష్పావరుద్ధారుణే**
**క్షణ, విస్రస్తవినూత్నభూషణ దురుక్తక్రూరనారాచ శో**
**షణ, నాలింగితధారుణిన్ నిజకులాచారైకసద్ధర్మచా**
**రిణి విశ్లేషిణి వీతతోషిణిఁ బురంధ్రీగ్రామణిన్ రుక్మిణిన్. 240**

**ప్రతి :** ప్రణత= (తనకు) నమస్కరించిన (తన్ను పూజించిన); ఆమ్నాయుఁడు= వేదాలు గలవాడు; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; అంతన్= తర్వాత; బాష్ప= కన్నీటిచేత; అవరుద్ధ= అడ్డగింపబడిన; అరుణ= ఎర్రనయిన; ఈక్షణన్= కన్నులచూపు కలదాన్నీ;

విస్రస్త= జారిపడిన; వినూత్న= మిక్కిలి క్రొత్తవి అయిన; భూషణన్= ఆభరణాలు కలదాన్నీ; దురుక్త= చెడ్డ మాటలనే; క్రూర= భయంకరమైన; నారాచ= బాణాలచేత; శోషణన్= శుష్కించినదాన్నీ; ఆలింగిత= కౌగిలించుకొనబడిన; ధారుణిన్= భూమిగలదాన్నీ; నిజ= తనయొక్క; కులాచార (కుల+ఆచార)= కులాచారమనే; ఏక= ముఖ్యమయిన; సత్= ఉత్తమమయిన; ధర్మ= ధర్మంతో; చారిణిన్= చరించేదాన్నీ; విశ్లేషిణిన్= ఎడబాసినదాన్నీ; వీత= తొలగిన; తోషిణిన్= సంతోషం కలదాన్నీ; పురంధ్రీ= కుటుంబజీవనానికి అలవాటుపడిన స్త్రీలలో; గ్రామణిన్= శ్రేష్ఠురాలయినదాన్నీ; రుక్మిణిన్= రుక్మిణిని; కదిసెన్= సమీపించాడు.

**తా :** వేదపూజితుడయిన శ్రీకృష్ణుని కన్నీటిపొరలు కమ్ముకోవడంచేత చక్కగా చూడలేనిదీ, శరీరంనుండి జారిపోయిన ఆయా నగలు గలదీ, భర్త మాటాడిన చెడ్డమాటలవల్ల కళదప్పిందీ, భూమిమీద పడిందీ, కులాచారమనే ఉత్తమధర్మంతో చరించేదీ, మగనికి దూరమయిందీ, సంతోషం లేనిది, కుటుంబినులలో అగ్రగణ్య ఐన రుక్మిణిని సమీపించాడు.

**సీ. కని సంభ్రమంబునఁ దనువునం దనువుగా ననువునఁ జందనం బల్ల నలఁది**
**కన్నీరు పన్నీటఁ గడిగి కర్పూరంపుఁబలుకులు సెవులలోఁ బాఱ నూఁది**
**కరమొప్ప ముత్యాలసరుల చిక్కెడలించి యురమునఁ బొందుగా నిరవు కొలిపి**
**తిలకంబు నునుఫాలఫలకంబుపైఁ దీర్చి వదలినభూషణావళులఁ దొడిగి**

**తే. కమలదళచారుతాలవృంతమున విసరి, పొలుచు పయ్యెదఁ గుచములఁ బొందు పఱిచి**
**చిత్త మిగురొత్త నొయ్యన సేదఁ దీర్చి బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నిమిరి. 241**

**ప్రతి :** కని= చూచి; సంభ్రమంబునన్= తత్తరపాటుతో; తనువునన్= శరీరంపై; తనువుగాన్= పలుచగా, మనోజ్ఞంగా; అనువునన్= నేర్పుతో; చందనంబు= మంచిగంధం; అల్లన్= మెల్లగా; అలఁది= పూసి; పన్నీటన్= పన్నీటితో; కన్నీరు= కన్నీరు (కన్నీటిచారలు); కడిగి; కర్పూరంపుఁబలుకులు (కర్పూరము+పలుకులు)= చిన్నచిన్న కర్పూరపు ముక్కలను; చెవులలోన్= చెవులలో; పాఱన్= పడునట్లుగా; ఊఁది; కరము= మిక్కిలి; ఒప్పన్= ఒప్పుగా; ముత్యాలసరుల= ముత్యాలదండలయొక్క; చిక్కు= మెలిక; ఎడలించి= తొలగించి; ఉరమునన్= వక్షమునందు; పొందు+కాన్= చక్కగా; ఇరవుకొలిపి= ఉండాల్సిన రీతిలో ఉంచి; నును= నున్ననయిన; ఫాలఫలకంబుపైన్= చదునైన నుదుటిమీద, తిలకంబు; తీర్చి= అందంగా దిద్ది; వదలిన= పడిపోయిన, జారిపోయిన; భూషణ= ఆభరణాల యొక్క; ఆవళులన్= సమూహాలను; తొడిగి= వానివాని స్థానాలలో ఉంచి; కమలదళ= తామరరేకులవలే; చారు= అందమయిన; తాలవృంతమునన్= (తాటి తొడిమవంటి తొడిమ కలది) విసనకఱ్ఱచేత; విసరి= వీచి; పొలుచు= ఒప్పుచున్న; పయ్యెదన్= పైటను; కుచములన్= స్తనాలమీద; పొందుపఱిచి= చక్కగా సవరించి; చిత్తము= మనస్సు; ఇగురు+ఒత్తన్= వికసించగా (ఆనందించగా); ఒయ్యనన్= క్రమంగా; సేదన్+తీర్చి= అలసట పోగొట్టి; బిగియన్= గట్టిగా; కౌఁగిటన్= కౌగిలియందు; చేర్చి; నెఱి+మొగము= అందమైన ముఖాన్ని; నిమిరి= ప్రేమతో చేతితో తడవి...

**తా :** నేలమీద వ్రాలిన రుక్మిణికి శ్రీకృష్ణుడు ఉపచారాలు చేస్తున్నాడు. అతడు, ఆమెశరీరంపై పలుచగా మంచిగంధం పూశాడు. పన్నీటితో కన్నీటిమకిల కడిగాడు. చెవులలోపల కర్పూరపు పలుకులు పడునట్లుగా ఊదాడు. ముత్యాలదండల చిక్కుదీసి వక్షస్థలంపై సర్దినాడు. నుదుట తిలకం దిద్దాడు. పడిపోయిన నగలు పెట్టాడు. తామరరేకులవంటి విసనకఱ్ఱతో విసిరాడు. స్తనాలమీద పైట సవరించాడు. అలసట పోగొట్టాడు. బిగికౌగిట చేర్చాడు. ముఖం నిమిరాడు.

**తే. నెరులు గల మరునీలంపుటురుల సిరుల, నరులుగొనఁజాలి నరులను మరులు కొలుపు**
**నిరుల గెలిచిన తుమ్మెద గఱులఁ దెగడు, కురుల నులిదీర్చి విరు లిడి కొప్పువెట్టి. 242**

**ప్రతి :** నెరులు= వంకరలు; కల= కలిగిన; మరు= మన్మథునియొక్క; నీలంపు= నల్లనయిన; ఉరుల= ఉచ్చులయొక్క; సిరులన్= సంపదలను; అరులు+కొనన్= కప్పాలుగా స్వీకరింపగా (జయించినవని అర్థం); చాలి= శక్తి కలిగి (సమర్థములై); నరులను= మానవులను; మరులుకొలుపు= మోహింపజేసే; ఇరులన్= చీకట్లను; గెలిచిన; తుమ్మెదగఱులన్= తుమ్మెదల ఱెక్కలను; తెగడు= తిరస్కరించే; కురుల= వెంట్రుకలయొక్క; నులి+తీర్చి= చిక్కుదీసి; కొప్పు+పెట్టి= కొప్పుపెట్టి; విరులు= పూలు; ఇడి= తురిమి...

**తా :** శ్రీకృష్ణుడు వంకరలై, మన్మథుని నల్లనియుచ్చులను మించినవై అనగా కామోద్దీపనములై, చీకట్లును మించిపోయిన తుమ్మెద రెక్కలకంటె మిక్కిలి నీలంగా ఉండే రుక్మిణి తలవెంట్రుకల చిక్కు తీర్చి, కొప్పుపెట్టి పూలు తురిమాడు.

**క. మురసంహరుఁ డిందిందిర, గరుదనిలచలత్ప్రసూనకలికాంచిత సుం**
**దరశయ్యఁ జేర్చె భీష్మక, వరపుత్రిన్ నుతచరిత్ర వారిజనేత్రన్. 243**

**ప్రతి :** మురసంహరుఁడు= మురాసురుణ్ణి చంపినవాడు, శ్రీకృష్ణుడు; నుత= పొగడబడిన; చరిత్రన్= ప్రవర్తనం గలదాన్ని; వారిజ= పద్మాలవంటి; నేత్రన్= కన్నులు గలదాన్ని; భీష్మక= భీష్మకునియొక్క; వర= ఉత్తమురాలయిన; పుత్రిన్= కొమార్తను; ఇందిందిర= తుమ్మెదలయొక్క; గరుత్= రెక్కలనుండి పుట్టిన; అనిల= గాలిచేత; చలత్= చలించుచున్న; ప్రసూన= పూలతో; కలికా= మొగ్గలతో; అంచిత= ఒప్పుతున్న; సుందర= అందమైన; శయ్యన్= పానుపునందు; చేర్చెన్= చేర్చాడు.

**తా :** శ్రీకృష్ణుడు, ప్రశంసింపబడిన ప్రవర్తన గలదీ, పద్మాలనుపోలినకన్నులుగలదీ, భీష్మకునిపుత్రిక అయిన రుక్మిణిని తుమ్మెదల రెక్కల గాలిచే కదలుతున్న పూలతో, మొగ్గలతో అందంగా ఉన్న పానుపుపై చేర్చాడు.

**వ. ఇట్లు పానుపునం జేర్చి మృదుమధురభాషణంబుల ననునయించిన. 244**

**ప్రతి :** ఇట్లు; పానుపునన్= మెత్తని పరుపుగల శయ్యమీద; చేర్చి; మృదు= మెత్తనివైన; మధుర= తియ్యనివైన; భాషణంబులన్= మాటలచేత; అనునయించినన్= ఓదార్చగా...

**తా :** రుక్మిణిని పాన్పుమీద చేర్చి శ్రీకృష్ణుడు మెత్తని తియ్యని మాటలతో ఓదార్చగా

**క. పురుషోత్తముముఖకోమల, సరసిజ మ య్యిందువదన సవ్రీడా హా**
**స రుచిస్నిగ్ధాపాంగ, స్ఫురదవలోకనము లొలయఁ జూ చిట్లనియెన్. 245**

**ప్రతి :** ఆ+ఇందువదన= ఆ చంద్రముఖి, రుక్మిణి; పురుషోత్తము= శ్రీకృష్ణునియొక్క; ముఖ= ముఖమనే; కోమల= మృదువయిన; సరసిజము= పద్మమును; సవ్రీడా= సిగ్గుతో కూడిన; హాస= చిరునవ్వుయొక్క; రుచి= కాంతిచేత; స్నిగ్ధ= అందమైన; అపాంగ= కడగన్నులయొక్క; స్ఫురత్= ప్రకాశిస్తున్న; అవలోకనములు= చూపులు; ఒలయన్= వ్యాపింపగా; చూచి; ఇట్లు; అనియెన్= పలికాడు.

**తా :** రుక్మిణి సిగ్గుతో, చిరునవ్వుతో కూడి మనోహరంగా ఉన్న కడగంటి చూపులతో శ్రీకృష్ణుని ముఖపద్మాన్ని చూచి ఈ విధంగా పలికింది.

## ✤ రుక్మిణిదేవి శ్రీకృష్ణ లాలితయై యతనిని స్తుతించుట ✤

**క. మురహర! దివసాగమ దళ, దరవిందదళాక్ష! తలఁప నది యట్టి దగున్**
**నిరవధికవిమలతేజో, వరమూర్తివి, భక్తలోకవత్సల! యెందున్. 246**

**ప్రతి :** మురహర!= ఓ కృష్ణా!; దివస+ఆగమ= ప్రాతఃకాలంలో; దళత్= వికసిస్తున్న; అరవిందదళ+అక్ష= తామర రేకులవంటి కన్నులుకలవాడా!; నిరవధిక= మేరలేనట్టి; విమల= నిర్మలమైనట్టి; తేజః= కాంతిచే; వరమూర్తివి= ప్రియమైన రూపం కలిగినవాడివి; భక్తలోకవత్సల= భక్తులగు జనులయందు వాత్సల్యం కలవాడా!; తలఁపన్+అది= భావింపగా అది; ఎందున్= ఎచ్చటనైనను; అట్టిది+అగున్= అట్టిదే అవుతుంది.

**తా :** ఓ కృష్ణా! ప్రాతఃకాలంలో వికసిస్తున్న తామరరేకులవంటి కన్నులుకలిగినవాడా! అంతులేని నిర్మలమైన కాంతిచే ప్రియమైన రూపం కలిగినవాడా! నీవనింది – తగినమాటే!

**తే. సంచితజ్ఞానసుఖబలైశ్వర్యశక్తు, లాదిగాఁ గల సుగుణంబు లమరు నీకు,**
**నేను దగుదునె? సర్వలోకేశ్వరేశ!, లీలమై సచ్చిదానందశాలి వనఘ! 247**

**ప్రతి :** సర్వలోక+ఈశ్వర+ఈశ= అన్నిలోకాలకు ప్రభువైనవారికి ప్రభువా!; అనఘ= పాపరహితుడా!; సంచిత= ప్రోగుచేయబడిన; జ్ఞానసుఖబల+ఐశ్వర్యశక్తులు+ఆది+కాన్+కల= జ్ఞానం, సుఖం, బలం, సంపదలు, శక్తి మొదలైన; సుగుణంబులు= మంచిగుణాలు; అమరి= ఒప్పియున్న; నీకున్= నీకు; సత్+చిత్+ఆనందశాలివి= సత్ చిత్ అనే దివ్యాంశల చేత ఆనందాన్ని పొందే; లీలమైన్= స్వభావంచేత; నీకున్= నీకు; నేను= నేను; తగుదునే= యోగ్యు రాలినా?

**తా :** సర్వలోకేశ్వరులకు ప్రభువైన ఓ కృష్ణా! జ్ఞానం, సుఖం, శక్తి, సంపన్నత మున్నగు మంచిగుణాలు గలిగిన, పాపరహితుడవైన మీ దృష్టిలో నేను యోగ్యురాలినా? నేను తగుదునా? అని రుక్మిణీదేవి శ్రీకృష్ణుని ప్రశ్నిస్తున్నది.

**విశే :** శ్రీకృష్ణుడు ఆత్మసంతృప్తుడు. సచ్చిదానందశాలి అనడంవల్ల సర్వం కలిగినవాడని స్ఫురిస్తున్నది. రుక్మిణీదేవి మాటలవల్ల నామెలోని ఆత్మానందం వ్యక్తమవుతూంది. సచ్చిదానందం అనగా సత్, చిత్, ఆనంద స్వరూపుడని అర్థం. కృష్ణుడు తనను తక్కువ చేసుకొని, రుక్మిణిని గొప్పగా పొగడాడు. ప్రస్తుతం రుక్మిణి కృష్ణుని పరతత్త్వాన్ని గుర్తించి, తనను తక్కువ చేసుకొని, ఆయన్ను ప్రశంసిస్తూ – అసలు నీకు నేను తగినదాన్నా? మీ తాహత్తుకు మా తాహత్తు చాల తక్కువదని ఎదురు ప్రశ్నలతో బదులివ్వడం ఆమె ఔన్నత్యానికి నిదర్శనం.

**సీ. రూఢిమైఁ బ్రకృతి పూరుషకాలములకు నీశ్వరుఁడవై భవదీయచారుదివ్య**
**లలితకళాకౌశలమున నభిరతుఁడై కడఁగు నీ రూప మెక్కడ మహాత్మ!**
**సత్త్వాదిగుణసముచ్చయయుక్తమూఢాత్మ నయిన నే నెక్కడ? ననఘచరిత!**
**కోరి నీ మంగళగుణభూతిదానంబు సేయంగఁబడు నని చెందు భీతి**

**తే. నంబునిధిమధ్యభాగమం దమృతఫేనపటలపాండురనిభమూర్తి! పన్నగేంద్ర**
**భోగశయ్యను బవ్వళింపుచును దనరు, నట్టి యున్నతలీల దివ్యంబు దలఁప. 248**

**ప్రతి :** మహా+ఆత్మ!= మహానుభావ!; రూఢిమైన్= నిశ్చయంగా; ప్రకృతి= ప్రకృతికి; పురుష= మానవులకు; కాలములకున్= త్రికాలాలకు; ఈశ్వరుఁడవు+ఐ= ప్రభువువై; భవదీయ= నీయొక్క; చారు= అందమైన; దివ్య= పవిత్రమయిన; లలితకళా=

లలితకళలందలి; కౌశలమునన్= నేర్పరితనంతో; అభిరతుఁడు+ఐ= అపేక్షకలిగినవాడివై; కడఁగు= పూనుకొనే; నీ= నీయొక్క; రూపము= రూపం; ఎక్కడ= ఎక్కడ?; సత్త్వ+ఆది గుణసముచ్చయ= సత్వం మున్నగు గుణసమూహంతో; యుక్త= కూడిన; మూఢ+ఆత్మన్+అయిన= తెలివితక్కువజీవినైన; నేను+ఎక్కడ= నేను ఎక్కడ; అనఘచరిత= పాపరహితమైన చరిత్రకలవాడా!; నీ= నీయొక్క; మంగళగుణ= శుభప్రదమైన; భూతి= సంపద; కోరి= కోరి; దానంబు+చేయన్+కన్+పడు= దానము చేయబడునేమోయనే; భీతిన్= భయంతో; అంబునిధి= సముద్రంయొక్క; మధ్యభాగము+అందున్= మధ్యభాగంలో; అమృతఫేనపటలపాండురనిభమూర్తి= అమృతపు నురుగు యొక్క సమూహంవలె తెల్లదనంతో సమానమైన ఆకారంతో ఉన్న; పన్నగ+ఇంద్ర= నాగశ్రేష్ఠుడైన శేషుని; భోగశయ్యన్= పడగ అనే పడకపై; పవ్వళించుచున్= నిద్రిస్తూ; తనరునట్టి= ఒప్పుచున్న; ఉన్నతలీల= గొప్పదైనలీల; తలఁపన్= భావింపగా; దివ్యంబు= దివ్యమయిందికదా!

**తా :** ఓ మహాత్మా! ప్రకృతికీ, మానవులకూ, కాలాలకు నీవు ప్రభుడివి. సుందరం, పవిత్రం అయిన లీలామాధుర్యంతో కూడిన నీ రూపమెక్కడ? సత్త్వాదిగుణాలతోకూడిన తెలివితక్కువదానినైన నేనెక్కడ? నీయొక్క శుభప్రదాలయిన గుణసంపద దానం చేయబడుతుందనే భయంతో సముద్రమధ్యభాగంలో శేషతల్పంపై నిద్రిస్తున్నావు. ఇట్టి నీ లీలలు దివ్యమైనవి.

**వ. శబ్దస్పర్శరూపరసగంధంబు లనియెడు గుణంబులచేతఁ బరిగ్రహింపఁబడిన మంగళసుందర విగ్రహుండవై, యజ్ఞానాంధకారనివారకంబైన రూపంబుఁ గైకొని, భవదీయులైన సేవకులకు ననుభావ్యుండ వైతి, భవత్పాదారవిందమకరందరసాస్వాదలోలాత్ములైన యోగీంద్రులకైనను భవన్మార్గంబు స్ఫుటంబుగా, ద ట్లగుటం జేసి యీ మనుజపశువులకు దుర్విభావ్యం బగుట యేమి సెప్ప? నిట్టి యీశ్వరుండవైన నీకు నిచ్ఛ స్వతంత్రంబు గావున నదియును నా కభిమతంబు గావున నిన్ను నే ననుసరింతు, దేవా! నీ వకించనుఁడ వైతేని బలిభోక్త లయిన బ్రహ్మేంద్రాదు లెవ్వనికొఱకు బలిసమర్పణంబు సేసిరి? నీవు సమస్త పురుషార్థమయుండ వనియును, ఫలస్వరూపి వనియును నీ యందలి ప్రేమాతిశయంబులం జేసి విజ్ఞానదీపాంకురంబున నిరస్తసమస్తదోషాంధకారులై యిహసౌఖ్యంబులు విడిచి సుమతులు భవదీయదాస సంగంబు గోరుచుండుదు; రట్లు సేయనేరక నిజాధికారాంధకారమగ్నులైనవారు భవత్తత్త్వంబు దెలిసి బలిప్రక్షేపణంబులు సేయంజాలక మూఢులై సంసారచక్రంబునం బరిభ్రమింతు రదియునుం గాక. 249**

**ప్రతి :** శబ్ద= శబ్దం; స్పర్శ= స్పర్శ; రూప= రూపం; రస= రసం; గంధంబులు= గంధములు; అనియెడు= అనబడే; గుణంబులచేతన్+పరిగ్రహింపన్+పడిన= గుణాలచేత గ్రహింపపడిన; మంగళ= శుభప్రదమైన; సుందర= అందమైన; విగ్రహుండవు+ఐ= ఆకారం కలిగినవాడివై; అజ్ఞాన+అంధకార= తెలివితక్కువతనమనే చీకటిని; నివారకంబు+ఐన= పోగొట్టే; రూపంబున్+కైకొని= రూపం గ్రహించి; భవదీయులు+ఐన= మీవారయిన; సేవకులకున్= సేవించేవారికి; అనుభావ్యుండవు+ఐతివి= భావింపబడేవాడివయ్యావు; భవత్+పాద+అరవింద= నీయొక్కపాదాలనెడితామరలయొక్క; మకరందరస+ఆస్వాద= తేనె త్రాగడంలో; లోల+ఆత్ములు+ఐన= ఆసక్తమైన మనస్సు కలిగినవారైన; యోగి+ఇంద్రులకున్+ఐనను= యోగులలో శ్రేష్ఠులకుకూడ; భవత్+మార్గంబు= నీవు నడిచేవిధానం; స్ఫుటంబు+కాదు= స్పష్టంకాదు; అట్లు+అగుటన్+చేసి= ఆప్రకారంగా ఉండటంచేత; ఈ మనుజ పశువులకున్= పశుప్రాయులైన ఈ మనుష్యులకు; దుర్విభావ్యంబు+అగుట= ఊహింపశక్యం కానిదనే విషయం; ఏమి+చెప్పన్= ఏమనిచెప్పను?; ఇట్టి= ఇట్టి; ఈశ్వరుఁడవు+ఐన= ప్రభువువైన; నీకున్= నీకు; ఇచ్ఛ= కోరిక; స్వతంత్రంబు= స్వతంత్రమైంది; కావునన్+అదియున్= కావున అదికూడ; నాకున్+అభిమతము=

నాకు సమ్మతం; నేను= నేను; నిన్నున్= నిన్ను; అనుసరింతు(అనుసరించుదును)= అనుసరిస్తాను; దేవా!= ప్రభూ!; నీవు+న+కించనుఁడవు+ఐతి(వి)+ఏనిన్= నీవు దరిద్రుడివే అయితే; బలి= పూజార్హాలైన కానుకల్ని; భోక్తలు+అయిన= గ్రహించేవారైన; బ్రహ్మ+ఇంద్ర+ఆదులు= బ్రహ్మ, ఇంద్రుడు మొదలయినవారు; ఎవ్వనికొఱకున్= ఎవ్వరికొరకు; బలి= పూజార్హాలైన కానుకలను; సమర్పణంబు+చేసిరి= ఇచ్చారో? (అట్టి); నీవు; సమస్త= అన్ని; పురుష+అర్థమయుండవు+ అనియును= పురుషార్థస్వరూపుడ వనీ; ఫలస్వరూపివి+అనియును= ఫలరూపుడవని; నీ+అందలి= నీలోని; ప్రేమ+అతిశయంబులన్+చేసి= అధికమైనప్రేమచే; విజ్ఞానదీప+అంకురంబునన్= మోక్షవిషయమైన దీపపు వెలుగుచే; నిరస్త= తొలగింపబడిన; సమస్త= సర్వమైన; దోష+అంధకారులు+ఐ= దోషమనే చీకటికలవారై; ఇహసౌఖ్యంబులు= ఈ లోకసుఖాలను; విడిచి= వదలి; సుమతులు= బుద్ధిమంతులు; భవదీయ= నీయొక్క; దాస= భక్తులయొక్క; సంగంబు= కలయికను; కోరుచున్+ఉండుదురు= కోర్తుంటారు; అట్లు= ఆ విధంగా; చేయనేరక= చేయలేక; నిజ+అధికార+ అంధకారమగ్నులు+ఐనవారు= తమయొక్క అధికారమనే చీకటిలో మునిగినవారు; భవత్= నీయొక్క; తత్త్వంబు= స్వరూపాన్ని; తెలిసి= ఎరిగి; బలిప్రక్షేపణంబులున్= పూజావిధానాలను; చేయన్+చాలక= చేయనేరక; మూఢులు+ఐ= తెలియనివారై; సంసారచక్రంబునన్= సంసారమనెడి చక్రంలో; పరిభ్రమింతురు (పరిభ్రమించుదురు)= తిరిగెదరు; అదియునున్+కాక= అదేకాకుండ...

**తా :** శబ్దం, స్పర్శ, రూపం, రసం, అనే గుణాలచేత గ్రహించబడిన శుభప్రదం, సుందరం అగు శరీరం కలవాడివై నీవు అజ్ఞానమనే అంధకారాన్ని తొలగించే రూపాన్ని స్వీకరించి, నీ సేవకులకు సదా అనుభవించదగినవాడివై ఉన్నావు. నీ పాదారవిందమకరందాన్ని ఆస్వాదించే యోగిశ్రేష్ఠులుసైతం నీ మార్గాన్ని తెలుసుకోలేరు. ఇక ఈ పశుప్రాయులైన మనుషులకు అది భావించరానిదని వేరే చెప్పవలెనా? నీ ఇచ్ఛ స్వతంత్రమైంది, నీకు ఇష్టమైంది. అందువల్ల నేను నిన్ను అనుసరిస్తాను. ప్రభూ! నీవు ఏమీలేని దరిద్రుడవైతే బలిని స్వీకరించే బ్రహ్మేంద్రాదులు బలి ఎవరికిచ్చినట్లు? నీవు పురుషార్థస్వరూపుడివి. ఫలరూపుడివి. నీపైగల ప్రేమచేత విజ్ఞానదీప ప్రకాశంతో దోషాంధకారం నశించగా బుద్ధిమంతులు లౌకికసౌఖ్యాలు వదిలేస్తారు. నీ దాసులతో కలయికను అభిలషిస్తారు. అలా చేయకుండా, అధికారమనే అంధకారంలో మునిగినవాళ్లు నీ తత్త్వం గ్రహించి బలిసమర్పణం చేయలేక అజ్ఞానులై సంసారమనే చక్రంలో తగుల్కొని తిరుగుతూ ఉంటారు.

**ఆ. వరమునీంద్రయోగివరసురకోటిచే, వర్ణితప్రభావవైభవంబు**
**గలిగి యఖిలచేతనులకు విజ్ఞానప్ర, దుండ వగుదు వభవ! దురితదూర! 250**

**ప్రతి :** అభవ!= జన్మలేనివాడా!; దురితదూర!= పాపాలకు దూరమైనవాడా!; వరముని+ఇంద్ర!= ఉత్తమ మునిశ్రేష్ఠులయొక్క; యోగివర= యోగివర్యులయొక్క; సుర= దేవతలయొక్క; కోటిచేన్= సమూహంచే; వర్ణిత= వర్ణింపబడిన; ప్రభావ= ప్రభావంయొక్క; వైభవంబు కలిగి= వైభవం కలిగి; అఖిల= సర్వ; చేతనులకున్= జీవులకు; విజ్ఞానప్రదుండవు+అగుదువు= విశేషమైనబుద్ధిని ఇచ్చినవాడివి అవుతున్నావు.

**తా :** జన్మపాపాలులేనివాడా! శ్రేష్ఠులైనమునులచే, మహాయోగులచే, దేవతాసమూహాలచే, వర్ణింపబడిన ప్రభావం కలవాడివై సర్వజీవులకు విజ్ఞానమిస్తున్నావు.

**వ. దేవా! భవదీయకుటిలభ్రూవిక్షేపోదీరితకాలవేగంబుచేత విధ్వస్తమంగళులగు కమలభవభవ పాకశాసనాదులం దిరస్కరించినట్టి మదీయచిత్తంబున. 251**

**ప్రతి :** దేవా!= ప్రభూ!; భవదీయ= నీయొక్క; కుటిల= వంకరైన; భ్రూ= కనుబొమలయొక్క; విక్షేప+ఉదీరిత= కదలికల చేత ప్రేరితమైన; కాల= కాలంయొక్క; వేగంబుచేతన్= వేగంచేత; విధ్వస్త= నశింపజేయబడిన; మంగళులు+అగు= శుభాలు కల్గినవారైన; కమలభవ= బ్రహ్మ; భవ= శివుడు; పాకశాసన+ఆదులన్= ఇంద్రుడుమున్నగువారిని; తిరస్కరించినట్టి= నిరాకరించినట్టి; మదీయ= నాయొక్క; చిత్తంబునన్= మనస్సుతో...

**తా :** దేవా! మీ నిశిత దృష్టి ప్రభావంతో ప్రేరణపొందిన కాలవేగంచేత శుభాలకు దూరమైన బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలైనవారిని తిరస్కరించిన నా మనస్సుతో

**విశే :** శివ, బ్రహ్మ, ఇంద్రాలకు మంగళత్వం విష్ణుదేవుని కాలవేగ తీవ్రదృష్టి పడనంతవరకే! నని రుక్మిణి – విష్ణువును (కృష్ణుణ్ణి) ఆదిమూలతత్త్వంగా భావించింది.

**చ. నిను వరియించినం బెలుచ నీరజలోచన! శార్ఙ్గసాయకా**
**సన నినదంబులన్ సకలశత్రుధరాపతులన్ జయించి బో**
**రన పశుకోటిఁ దోలు మృగరాజునిజాంశము భూరిశక్తిఁ గై**
**కొనిన విధంబునన్ నను నకుంఠితశూరతఁ దెచ్చి తీశ్వరా! 252**

**ప్రతి :** నీరజలోచన!= పద్మాక్షా!; ఈశ్వరా!= సర్వాన్ని నియంత్రించేవాడా! (నేను); నినున్= నిన్ను; వరియించినన్= పెండ్లి చేసుకోవాలని నిర్ణయించిన విషయం తెలిసి; పెలుచన్= భయంకరంగా; శార్ఙ్గసాయక+ఆసన= శార్ఙ్గమనే ధనుస్సుయొక్క; నినదంబులన్= శబ్దాల మాత్రంతోనే; సకల= సమస్తమైన; శత్రుధరాపతులన్= శత్రువులైన శిశుపాలుని పక్షం వాళ్లయిన రాజుల్ని; జయించి= జయించి; బోరనన్= వెంటనే; పశుకోటిన్= నక్కలు మున్నగు జంతుసమూహాన్ని; తోలు= పారద్రోలునట్టి మృగరాజు= సింహం; భూరిశక్తిన్= గొప్ప బలంతో; నిజ+అంశమున్= తన భాగమైన మాంసాన్ని; కైకొనిన విధంబునన్= తీసుకొన్నట్లుగా; అకుంఠిత= మొక్కవోనట్టి; శూరతన్= శౌర్యంతో; ననున్= నన్ను; తెచ్చితి(వి)= తెచ్చినావు కదా!

**తా :** పద్మాక్షా! ఈశ్వరా! శ్రీకృష్ణా! నిన్నే పెండ్లి చేసుకోవాలని నేను నిశ్చయించి ఉండగా, ఆ విషయం తెలిసి, నీవు నీ శార్ఙ్గమనే ధనుస్సుయొక్క ధ్వనిమాత్రంతోనే సమస్త శత్రురాజులైన శిశుపాల పక్షంవాళ్లను జయించి, సింహం తన మహాబలశౌర్యాలతో ఇతర పశువుల్ని పారద్రోలి, తన మాంసభాగాన్ని తాను తెచ్చుకొన్నట్లు – నీవు మొక్కవోని మహాశౌర్యంతో నన్ను నీ సొమ్ముగా గ్రహించావు కదా!

**ఉ. అట్టి నృపాల కీటముల నాజి నెదుర్పఁగ లేనివాని య**
**ట్లొట్టిన భీతిమై నిటు పయోధిశరణ్యుఁడ వైతి వింతయున్**
**నెట్టన మాయ గాక యివి నిక్కములే? భవదీయభక్తులై**
**నట్టి నరేంద్రమౌళిమణు లంచితరాజఋషుల్ ముదంబునన్. 253**

**ప్రతి :** అట్టి= ఆ విధమైన; నృపాలకీటములన్= పురుగులవంటిరాజులను; ఆజిన్= యుద్ధంలో; ఎదుర్పన్+కన్+లేని= ఎదిరించలేని; వాని+అట్లు= వానివలె; ఒట్టిన; భీతిమైన్= కల్గిన భయంతో; ఇటు= ఈ రీతిగ; పయోధిశరణ్యుఁడవు= సముద్రుణ్ణి శరణుకోరినవాడివి; ఐతివి= అయ్యావు; ఇంతయున్= ఇదిఅంతా; నెట్టన= నిజంగా; మాయ+కాక=

మాయయేగాక; ఇవి= ఇవి; నిక్కములు+ఏ= యథార్థాలేనా?; భవదీయభక్తులు+ఐన+అట్టి= నీయొక్క భక్తులైనట్టి; నర+ఇంద్రమౌళిమణులు= శ్రేష్ఠులైన చక్రవర్తులు; అంచిత= పూజింపబడ్డ; రాజఋషుల్= రాజర్షులు; ముదంబునన్=సంతోషంతో...

**తా :** అట్టిరాజుల్ని యుద్ధరంగంలో ఎదిరించలేక భయపడ్డట్లు నటించి, సముద్రుణ్ణి శరణుకోరావు. నిజంగా ఇది నీ మాయకాక యథార్థమైన విషయమా? నీ భక్తులైన చక్రవర్తులు, రాజర్షులు సంతోషంతో

**విశే :** ఈ పద్యంలో శ్రీకృష్ణుడు భయంనటిస్తూ సముద్రుని శరణుకోరుట ఆతని యుద్ధనీతికి ఉదాహరణంగా పేర్కొనవచ్చు.

**ఆ. వితతరాజ్యగరిమ విడిచి కాననముల, నాత్మలందు మీ పదాబ్జయుగము**
**వలఁతి గాఁగ నిలిపి వాతాంబుపర్ణాశ, నోగ్రనియతు లగుచు నుందు రభవ! 254**

**ప్రతి :** అభవ= జన్మయే లేనట్టివాడా! అచ్యుతా!; వితత= విస్తారమైన; రాజ్య= రాజ్యంయొక్క; గరిమన్= ఆధిక్యాన్ని; విడిచి= వదలుకొని; ఆత్మల+అందున్= మనస్సులలో; మీ= మీయొక్క; పద+అబ్జయుగము= పాదపద్మాల జంటను; వలఁతికాన్+కన్= తమకు అనుకూల స్థానంగా; నిలిపి= స్థాపించుకొని; వాత= గాలి; అంబు= నీరు; పర్ణ= ఆకులు; అశన= ఆహారంగా; ఉగ్ర= తీవ్రమైన; నియతులు+అగుచున్= నియమం గలవాళ్లై; కాననములన్= అడవుల్లో; ఉందురు= ఉంటారు.

**తా :** ఓ కృష్ణా! నిన్నెదిరించిన రాజులు తమమనస్సులలో నీ పాదకమలాలను నిలుపుకొని గాలి, నీరు, ఆకులు ఆహారం కాగా, కఠిననియమాలతో అరణ్యంలో నివసిస్తూ ఉన్నారు. అంటే మోక్షమార్గాన్ని పొందే స్థితిలో ఉన్నారని అర్థం.

**మ. విమలజ్ఞాననిరూఢులైన జనముల్ వీక్షింప మీ పాదకం**
**జ మరందస్ఫుటదివ్యసౌరభము నాస్వాదించి నిర్వాణరూ**
**పము సత్పూరుషవాగుదీరితము శోభాశ్రీనివాసంబు నౌ**
**మిము సేవింపక మానవాధముని దుర్మేధాత్ము సేవింతునే? 255**

**ప్రతి :** విమల= నిర్మలమైన; జ్ఞాన= జ్ఞానంతో; నిరూఢులు+ఐన= మిక్కిలి ప్రసిద్ధులైన; జనముల్= ప్రజలు; వీక్షింపన్= చూడగా; మీ= మీయొక్క; పాదకంజ= పాదాలనెడి తామరలలోని; మరంద= తేనెయొక్క; స్ఫుట= స్పష్టమైన; దివ్య= దివ్యమైన; సౌరభమున్+ఆస్వాదించి= సువాసనను గ్రహించి; నిర్వాణరూపము= మోక్షరూపం అయిందీ; సత్+పూరుష= సజ్జనుల; వాక్+ఉదీరితము= వాక్కుచే వర్ణితము; శోభాశ్రీనివాసంబున్+ఔ= శోభాలక్ష్మికి నిలయమైన; మిము= మిమ్ము; సేవింపక= సేవించక; దుర్+మేధా+ఆత్మున్= చెడ్డబుద్ధి కలిగిన; మానవ+అధమునిన్= అల్పుడగుమానవుణ్ణి; సేవింతునే? (సేవించుదున్+ఏ)= సేవిస్తానా? (సేవించను)

**తా :** నిర్మలమైన జ్ఞానంతో ప్రసిద్ధులైనవారు చూస్తుండగా మీపాదపద్మాలలోని మకరందంయొక్క సువాసనను ఆస్వాదించి మోక్షాన్ని కలిగించేదీ, సజ్జనులచే స్తుతింపబడిందీ, శోభా లక్ష్మికి నివాసమూ అయిన మిమ్ము సేవింపక మరేబుద్ధి కలిగిన అల్పమానవుణ్ణి సేవిస్తానా? (సేవించను)

**విశే :** రుక్మిణీదేవి ఆత్మసంకల్పం వర్ణింపబడింది.

**వ. మఱియును దేవా! భూలోకంబునందును, నిత్యనివాసంబునందును, సకలప్రదేశంబులందును జగదీశ్వరుండ వయిన నిన్ను నభిమతంబు లయిన కామరూపంబులు గైకొని వరియింతు, భవదీయ చరణారవిందమకరందాస్వాదనచాతుర్యధుర్యభృంగియైన కామిని యతిహేయంబైన త్వక్ శ్మశ్రు రోమ నఖ కేశంబులచేతఁ గప్పంబడి యంతర్గతం బయిన మాంసాస్థి రక్త క్రిమి విట్కఫపిత్తవాతంబులం గల జీవచ్ఛవం బయిన నరాధముని మూఢాత్మయై కామించునే? యదియునుం గాక. 256**

**ప్రతి :** దేవా!; మఱియును= ఇంకను; భూలోకంబున్+అందును= భూలోకంలోను; నిత్యనివాసంబున్+అందును= ఎల్లపుడు నివసించే వైకుంఠంలోను; సకలప్రదేశంబులందును= సర్వప్రదేశాలలోను; జగత్+ఈశ్వరుండవు+అయిన= లోకేశ్వరుడవు అయిన; నిన్నున్= నిన్ను; అభిమతంబులు+అయిన= సమ్మతములయిన; కామరూపంబులు+కైకొని= ఇష్టం వచ్చిన రూపాలను గ్రహించి; వరియింతున్= పొందకోరుతాను; భవదీయ= మీ యొక్క; చరణ+అరవింద= పాదపద్మాలయందలి; మకరంద+ఆస్వాదన= మకరందాన్ని త్రాగునట్టి; చాతుర్యధుర్య= నేర్పుకలిగిన; భృంగి+ఐన కామిని= ఆడతుమ్మెదవంటి స్త్రీ; అతిహేయంబు+ఐన= మిక్కిలి అసహ్యమగు; త్వక్= చర్మం; శ్మశ్రు= మీసం; రోమ= దేహంపైనుండే వెంట్రుకలు; నఖ= గోళ్ళు; కేశంబులచేతన్= వెంట్రుకలుచేత; కప్పన్+పడి= కప్పపడిన; అంతర్+గతంబు+అయిన= లోపలనున్న; మాంస= మాంసం; అస్థి= ఎముకలు; రక్త= రక్తం; క్రిమి= పురుగులు; విట్= మలం; కఫము= శ్లేష్మం; పిత్త= పైత్యరసం; వాతంబులన్+కల= వాతాలతో కూడిన; జీవత్+శవంబు+అయిన= ప్రాణంతో నున్న శవంవలె అయిన; నర+అధమునిన్= అల్పుడగు మానవుణ్ణి; మూఢ+ఆత్మ+ఐ= తెలివితక్కువదైన; కామించునే?= కోరునా?; అదియునున్+కాక= అదీకాకుండా...

**తా :** ఓ దేవా! సర్వప్రపంచానికి ప్రభువైన నిన్ను భూలోకంలోను, వైకుంఠంలోను, అన్ని ప్రదేశాల్లోను నీవు కోరిన రూపంలో సేవిస్తాను. నీ పాదపద్మాల మకరందాన్ని ఆస్వాదించటంలో నైపుణ్యంగల ఆడుతుమ్మెద అయిన స్త్రీ అతినీచమైన చర్మ, నఖ, కేశాదులచేత కప్పబడి, లోపల మాంసము, ఎముకలు, రక్తము, క్రిములు, మలము, కఫము, పిత్తము, వాతముగల జీవచ్ఛవమైన మానవాధముణ్ణి మూఢురాలై ప్రేమించగలదా? అంతేకాక

**సీ. నీరదాగమమేఘనిర్యత్పయఃపానచాతకం బేగునే చౌటి పడెకుఁ?**
**బరిపక్వమాకందఫలరసంబులు గ్రోలు కీరంబు చనునె దుత్తూరములకు?**
**ఘనరవాకర్ణనోత్కలికమయూరము గోరునే కఠిన ఝిల్లీరవంబుఁ?**
**గరికుంభపిశితసద్గ్రాసమోదితసింహ మరుగునే శునక మాంసాభిలాషఁ**

**తే. బ్రవిమలాకార! భవదీయపాదపద్మ, యుగసమాశ్రయనైపుణోద్యోగచిత్త**
**మన్యుఁ జేరునె తన కుపాస్యంబు గాఁగ? భక్తమందార! దుర్భర భవవిదూర! 257**

**ప్రతి :** భక్తమందార!= భక్తులపాలిటి కల్పవృక్షమైనవాడా!; దుర్భర= భరింపలేని; భవ= పుట్టుకకు; విదూర= దూరమైనవాడా!; ప్రవిమల+ఆకార= పవిత్రమైన రూపం కలిగినవాడా!; నీరద+ఆగమ= వర్షాకాలంలోని; మేఘ= మేఘాలనుండి; నిర్యత్+పయః= స్రవించేనీటిని; పాన= తాగే; చాతకంబు= చాతకపక్షి; చౌటిపడెకున్= చవిటి గుంతలకు; ఏగునే= వెళుతుందా?; పరిపక్వ= పండిన; మాకందఫల= మామిడిపండ్లు; రసంబులు= రసాలను; క్రోలు= గ్రహించే; కీరంబు= చిలుక; దుత్తూరములకున్= ఉమ్మెత్తలకొరకు; చనునె= వెళ్ళుతుందా?; ఘన= మేఘాలయొక్క; రవ= శబ్దాన్ని; ఆకర్ణన= వినుటకు;

ఉత్కలిక= ఉత్కంఠకల; మయూరము= నెమలి; కఠిన= కఠినమైన; ఝిల్లీ= ఈలపురుగుయొక్క; రవంబున్= శబ్దాన్ని; కోరునే= కోరుతుందా?; కరికుంభ= ఏనుగుకుంభస్థలమందలి; పిశిత= మాంసమనే; సత్+గ్రాస= మంచి ఆహారంచేత; మోదిత= ఆనందించే; సింహము= సింహం; శునక= కుక్కయొక్క; మాంస+అభిలాష= మాంసంమీది కోరికతో; అరుగునే?= వెళ్ళుతుందా?; భవదీయ= నీయొక్క; పాదపద్మయుగ= పాదపద్మాలయొక్క జంటను; సమ్+ఆశ్రయ= బాగుగా ఆశ్రయించే; నైపుణ+ఉద్యోగ= నేర్పుగలప్రయత్నంతో ఉండే; చిత్తము= హృదయం; తనకున్= తనకు; ఉపాస్యంబు+కాన్+కన్= ఉపాసింపతగిందిగా; అన్యునిన్= ఇతరుణ్ణి; చేరునా?= చేరుతుందా?

**తా :** భక్తమందార! దుర్భరభవవిదూర! నిర్మలాకారా! వర్షాకాలంలో మేఘాలనుండి వచ్చేనీటిని తాగే చాతకపక్షి చవిటిగుంతల్లోని నీటిని తాగుతుందా? మామిడిపండు రసాన్ని తాగే చిలుక ఉమ్మెత్తలకొఱకు వెళ్ళుతుందా? మేఘ శబ్దాన్ని వినే నెమలి ఈలపురుగు ధ్వని కోరుతుందా? ఏనుగుకుంభస్థలమాంసం కోరే సింహం కుక్క మాంసాన్ని మంచి ఆహారంగా భావిస్తుందా? మీ పాదద్వయాన్ని కోరి, ఆశ్రయించే హృదయం అన్యుల్ని కోరుతుందా?

**క. వాసవవందిత! భవ కమ, లాసన దివ్యప్రభాసభావలి కెపుడున్**
**నీ సమధికచారిత్ర క, థా సురుచిరగాన మవితథం బయి చెల్లున్. 258**

**ప్రతి :** వాసవ= ఇంద్రునిచే; వందిత= నమస్కరింపబడినవాడా!; భవ= ఈశ్వరునియొక్క; కమల+ఆసన= బ్రహ్మయొక్క; ప్రభా= దివ్యకాంతిమంతమైన; సభా+ఆవళికిన్= సభలకు; ఎల్లపుడున్= ఎల్లసమయాలలో; నీ= నీయొక్క; సమధిక= శ్రేష్ఠమైన; చారిత్ర= దివ్య నడవడికకు సంబంధించిన; కథా= కథలయొక్క; సురుచిరగానము= అందమైన గానం; అవితథంబు+అయి= సత్యమైనదై; చెల్లున్= చెల్లుతుంది.

**తా :** త్రిలోకాధిపతియైన ఇంద్రునిచే నమస్కరింపబడినవాడా! కైలాసంలో, సత్యలోకంలో నీ చరిత్ర అందమైన పాటలుగా పాడబడుతున్నది.

**క. ధరణీనాథులు దమతమ, వరవనితామందిరముల వసియించుచు గో**
**ఖర మార్జాలంబుల గతి, స్థిరబద్ధు లగుదురు నిన్నుఁ దెలియని కతనన్. 259**

**ప్రతి :** నిన్నున్+తెలియనికతనన్= నిన్ను తెలుసుకోలేని కారణంగా; ధరణీనాథులు= రాజులు; తమతమ= తమయొక్క; వరవనితా= శ్రేష్ఠులైన స్త్రీలయొక్క; మందిరములన్= భవనాలలో; వసియించుచున్= నివసిస్తూ; గో= ఎద్దులయొక్క; ఖర= గాడిదలయొక్క; మార్జాలంబుల= పిల్లులయొక్క; గతిన్= విధంగా; స్థిరబద్ధులు+అగుదురు= నిలకడగా బంధింపబడ్డవారు అవుతారు.

**తా :** విషయాసక్తులైన రాజులు మిమ్మల్ని తెలుసుకోలేక తమతమ అంతఃపురకాంతల మందిరాలలో ఎద్దులు, గాడిదలు, పిల్లులమాదిరి బద్ధులై సంచరిస్తారు.

**విశే :** ఈ జంతువులు సంసారంలోపడి తలమున్కలవుతున్న వాళ్లకు – ప్రతీకలుగా చెప్పబడ్డాయి. ఇవి అజ్ఞాన సంకేతాలు.

**ఆ. జలజనాభ! సకలజగదంతరాత్మవై, నట్టి దేవ! నీ పదారవింద**
**యుగళి సానురాగయుక్తమై నా మదిఁ, గలుగునట్లు గాఁగఁ దలఁపు మనఘ! 260**

**ప్రతి :** అనఘా!= పాపరహితుడా!; జలజనాభ= కమలం నాభియందు కలవాడా!; సకల= సర్వాలైన; జగత్+అంతర+ ఆత్మవు+ఐనట్టి= అన్ని లోకాలందూ ఆత్మవైనట్టి; దేవా!; నీ= నీయొక్క; పద+అరవింద= పాదపద్మాల; యుగళిన్= జంటయందు; స+అనురాగ= కూరిమితో; యుక్తము= తగినదై; నామది= నాహృదయంలో; కలుగునట్లు+కాన్+కన్= ఏర్పడునట్లు; తలఁపుము= భావించవయ్యా!

**తా :** ఓ కృష్ణా! సర్వలోకాలలోనూ అంతరాత్మవైన దేవా! నీ పాదపద్మాలపై నాహృదయంలో అనురాగం నిరంతరం ఉండేటట్లు చేయవయ్యా!

**ఆ. పృథురజోగుణప్రవృద్ధ మైనట్టి నీ, దృష్టిచేత నన్నుఁ దేరుకొనఁగఁ**
**జూచు టెల్ల పద్మలోచన! నా మీఁద, ఘనదయార్ద్రదృష్టిగాఁ దలంతు. 261**

**ప్రతి :** పద్మలోచన= పద్మాలవంటి కన్నులు కలిగినవాడా!; పృథురజస్+గుణ= గొప్పదైన రాజసగుణంతో; ప్రవృద్ధము+ఐనట్టి= అభివృద్ధి చెందిన; నీ దృష్టిచేతన్= నీ చూపుచే; నన్నున్= నన్ను; తేరుకొనన్+తన్= స్వస్థతచెందునట్లు; చూచుట; ఎల్లన్= అంతయు; నా మీఁదన్= నాపైన; ఘన= గొప్పదైన; దయా+ఆర్ద్ర= దయతో నిండిన; దృష్టి+కాన్= దృష్టిగా; తలంతున్= భావిస్తాను.

**తా :** పద్మాలవంటి కన్నులుకలిగిన కృష్ణా! నీవు రాజసంతో నిండిన కన్నులతో నన్ను చూచుట నాపైగల గొప్ప దయగా భావిస్తాను.

**వ. అదియునుం గాక, మధుసూదనా! నీ వాక్యంబులు మిథ్యలు గావు, తల్లివచనంబు కూఁతున కభిమతంబు గాదె? యౌవనారూఢమదంబున స్వైరిణి యగు కామిని పురుషాంతరాసక్త యగుట విచారించి పరిజ్ఞాని యైనవాఁడు విడుచు, నవివేకి యయిన పురుషుం డింద్రియలోలుండై రతిం దగిలి దాని విడువనేరక పరిగ్రహించి యుభయలోకచ్యుతుండగు, నట్లు గావున నీ యెఱుంగని యర్థంబు గలదే? యని విన్నవించిన రుక్మిణీదేవివచనంబులకుఁ గృష్ణుండు సంతసిల్లి యిట్లనియె. 262**

**ప్రతి :** మధుసూదనా!= మధువనే రాక్షసుణ్ణి సంహరించినవాడా! కృష్ణా!; అదియున్+కాక= అంతేకాకుండ; నీవాక్యంబులు= నీయొక్క మాటలు; మిథ్యలు= అసత్యాలు; కావు= కావు; తల్లివచనంబులు= తల్లిమాటలు; కూతునకున్= కుమార్తెకు; అభిమతంబు= సమ్మతం; కాదె= కాదా?; యౌవన+ఆరూఢ= మంచివయస్సువల్ల కలిగిన; మదంబునన్= గర్వంతో; స్వైరిణి= జారిణి; అగు= అయిన; కామిని= స్త్రీ; పురుష+అంతర+ఆసక్త= పరపురుషునియందు అపేక్షతో కూడింది; అగుటన్= అగుటను; విచారించి= ఆలోచించి; పరిజ్ఞాని+ఐనవాడు= తెలివిగలవాడు; విడుచును= ఆమెను వదలివేస్తాడు; అవివేకి= బుద్ధిహీనుడు; అయిన= అగు; పురుషుండు= మానవుడు; ఇంద్రియలోలుండు+ఐ= ఇంద్రియాలపై ఇచ్ఛకలిగినవాడై; రతిన్+తగిలి= రతియందు ఆసక్తి కలిగినవాడై; దానిన్= ఆ స్త్రీని; విడువన్+నేరక= వదలలేక; పరిగ్రహించి= ప్రియంతో గ్రహించి; ఉభయలోకచ్యుతుండు+అగున్= ఇహపరాలకు దూరమైనవాడు అవుతాడు; అట్లు+కావునన్= అట్టిది కావడంచేత; నీ+ఎఱుంగని= నీకు తెలియని; అర్థంబు కలదే?= ప్రయోజనం ఉందా?; అని= అని; రుక్మిణీ దేవియొక్క; వచనంబులకున్= మాటలకు; కృష్ణుండు= కృష్ణుఁడు; సంతసిల్లి= సంతోషించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఓ మధుసూదనా! నీమాటలు అసత్యంకాదు. కన్నతల్లిమాటలు ప్రియమైనకుమార్తెకు సమ్మతమే కదా! వయస్సువల్ల కలిగిన గర్వంతో జారిణియైన స్త్రీ పరపురుషాసక్త ఐతే తెలివిగల ప్రేమికుడు ఆమెను వదలివేస్తాడు. వివేకం లేనివాడు ఆ జారిణితోనే సంబంధం పెట్టుకొని, ఆమెతోనే సంసారం చేస్తూ, ఇహపరాలకు కాకుండాపోతాడు. నీకు తెలియనివేమైన ఉన్నాయా? అని చెబుతున్న రుక్మిణిమాటలకు కృష్ణుడు సంతోషించి ఇలా అన్నాడు.

## ✤ కృష్ణుండు రుక్మిణీదేవి నూరడించుట ✤

**చ. 'అలికులవేణి! నవ్వులకు నాడినమాటల కింత నీ మదిం**
**గలఁగఁగ నేల? వేఁటలను గయ్యములన్ రతులందు నొవ్వఁగాఁ**
**బలికిన మాట లెగ్గు లని పట్టుదురే? భవదీయచిత్తముం**
**దెలియఁగఁ గోరి యేఁ బలికితిన్ మదిలో నిటు గుంద నేఁటికిన్? 263**

**ప్రతి :** అలికులవేణి!= తుమ్మెదల బారును పోలిన కేశపాశం కలదానా! ఓ రుక్మిణీ!; నవ్వులకున్+ఆడిన= వేళాకోళంగా అనిన (తమాషాకై); మాటలకున్= మాటలకు; ఇంతన్= ఇంతగా; నీ= నీయొక్క; మదిన్+కలఁగన్+కన్= హృదయంలో సంక్షోభించటం; ఏల?= ఎందుకు?; వేటలను= వేటాడే సమయాల్లో; కయ్యములన్= కలహాల్లో; రతుల+అందున్= సంగమ సుఖసమయాల్లో; నొవ్వన్+కాన్= మనస్సును బాధపెట్టేట్టుగా; పలికిన= పలికిన; మాటలు+ఎగ్గులు+అని= పలుకులు అనాదరాలనీ; పట్టుదురే?= భావిస్తారా?; భవదీయ= నీయొక్క; చిత్తమున్+తెలియన్+కన్+కోరి= మనస్సును తెలుసుకోడానికై; ఏన్= నేను; పలికితిన్= మాట్లాడాను; మదిలోన్= మనస్సులో; ఇటు= ఈ విధంగా; కుందన్+ఏటికిన్= దుఃఖించడమెందుకు?

**తా :** ఓ రుక్మిణీ! కేవలం నవ్వులకు మాట్లాడిన మాటలకు బాధపడుతున్నావా? వేట సమయాల్లో, కలహాల్లో, రతి సమయాల్లో బాధించేమాటల్ని పలికినా విచారిస్తారా? నీ మనస్సు తెలియగోరి పలికాను. నీవు మనస్సులో బాధపడకు.

**వ. అదియునుం గాక. 264**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాకుండా...

**ఉ. కింకలు ముద్దుబల్కులును గెంపుఁగనుంగవ తియ్యమోవియున్**
**జంకెలు తేటిచూపు లెకసక్కెములున్ నెలవంకబొమ్మలుం**
**గొంకక వీడ నాడుటలుఁ గూరిమియుం గల కాంతఁ గూడుటల్**
**అంకిలిలేక జన్మఫల మబ్బుట గాదె కురంగలోచనా!' 265**

**ప్రతి :** కురంగలోచన!= జింక కన్నులవంటి కన్నులున్న ఓ రుక్మిణీ! కింకలు (కినుకలు)= అలుకలు (ప్రణయ కోపాలు); ముద్దు+పల్కులన్= ముద్దుపలుకులు; కెంపు+కను+కవ= ఎర్రనైన రెండు కన్నులు; తియ్య= తీయనైన; మోవియున్= పెదవియునూ; జంకెలు= బెదరించే మాటలు; తేటిచూపులు= తేటదనం గల చూపులు; ఎకసక్కెములున్= వేళాకోళపు మాటలు; నెలవంకబొమ్మలున్= చంద్రవంకవలె వంపుగా ఉండే కనుబొమలలు (కోపంవల్ల); కొంకక= సంకోచించక; వీడన్+ఆడుటల్= విడిపోతానని ఖండితంగా చెప్పే మాటలు; కూరిమియున్+కల= ప్రేమ గలిగిన; కాంతన్= ప్రియురాల్ని;

కూడుటల్= కలియుటలూ; అంకిలిలేక= అడ్డులేకుండ; జన్మఫలము= పుట్టుక యొక్కప్రయోజనం; అబ్బుట+కాదె= దొరకుటయే కదా!

**తా :** ఓ హరిణలోచనా! అలుకలు, ముద్దుపలుకులు, ఎర్రవారిన కన్నులు, తియ్యనిపెదవి, బెదరింపులు, వేళాకోళాలు, కనుబొమల చిట్లింపులు, విదిలింపులకు సంకోచించక వలపుగల స్త్రీ సమాగమం లభిస్తే అది జన్మఫలం లభించినట్లే కదా!

**వ. అని మఱియు నిట్లనియె. 266**

**ప్రతి :** అని; మఱియున్= ఇంకను; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** అని ఇంకా ఈ విధంగా చెప్పాడు.

**ఉ. 'నీవు పతివ్రతామణివి నిర్మలధర్మవివేకశీల స**
**ద్భావవు నీ మనోగతులఁ బాయక యెప్పుడు నస్మదీయ సం**
**సేవయ కాని యన్యము భజింపవు, పుట్టిననాఁటనుండి నీ**
**భావ మెఱింగి యుండియును బల్కిన తప్పు సహింపు మానినీ!' 267**

**ప్రతి :** మానినీ= ఓ రుక్మిణీ!; నీవు; పతివ్రతామణివి= పతివ్రతలలో శ్రేష్ఠురాలివి; నిర్మల= స్వచ్ఛమైనట్టి; ధర్మ= ధర్మమార్గం; వివేక= తెలివి; శీల= సత్ప్రవర్తనగల; సత్+భావవు= మంచిభావాలు కలదానివి; పుట్టిన నాటనుండి= పుట్టినప్పటినుంచి; నీ= నీయొక్క; మనస్+గతులన్= మనస్సుయొక్క నడకల్ని; పాయక= విడువక; ఎప్పుడున్= ఎల్లప్పుడు; అస్మదీయ= నాయొక్క; సంసేవయ= సేవే; కాని= తప్ప; అన్యము= ఇతరమును; భజింపవు= సేవించవు; నీ= నీయొక్క; భావము= అభిప్రాయాన్ని; ఎఱింగి+ఉండియును= తెలుసుకొని ఉండికూడా; పల్కిన= నేను మాట్లాడిన; తప్పున్= తప్పును; సహింపు(ము)= ఓర్చుకొమ్ము.

**తా :** ఓ రుక్మిణీ! నీవు పతివ్రతవు, పుణ్యాత్మురాలవు, మహాసద్గుణశీలవు, బాల్యంనుండీ నీవు స్థిరమైన భావంతో నన్ను సేవించావు. ఇదంతా తెలిసికూడా తప్పుగా మాట్లాడిన నన్ను క్షమించుము.

**వ. అని వెండియు నిట్లనియె, 'నీ వాక్యంబులు శ్రవణసుఖంబు గావించె, నీవు వివిధంబులైన కామంబులు గోరితివేని, నవియన్నియు నా యంద యుండుటం జేసి యేకాంతసేవాచతురవైన నీకు నవి యన్నియు నిత్యంబులై యుండు. నీ పాతివ్రత్యంబును, నా యందలిస్నేహంబు నతివిశదంబు లయ్యె, నా వాక్యములచేత భవదీయచిత్తంబు చంచలంబు గాక నాయందలి బుద్ధి దృఢం బగుం గావున సకలసంపద్విలసితంబైన ద్వారకానగర దివ్యమందిరంబులందు నీదు భాగ్యంబునం జేసి సంసారి కైవడి నీ యందు బద్ధానురాగుండనై వర్తింతుఁ, దక్కిన ప్రాణేంద్రియపరవశత్వంబున వికృత శరీరధారిణియైన సతి నన్నుం జెందుట దుష్కరం;, బదియునుం గాక మోక్షప్రదుండనైన నన్నుఁ గామాతురలైన యల్పమతులు వ్రతతపోమహిమలచేత దాంపత్య యోగంబుకై సేవింతు, రదియంతయు నా మాయావిజృంభితంబు, దానంజేసి వారు మందభాగ్యలై నిరయంబు నొందుదు; రట్లు గావున నీ సమానయైన కాంత యే కాంతలందైనఁ గలదె? నీ వివాహకాలంబున ననేకరాజన్యవర్యులఁ గైకొనక భవదీయమధురాలాపశ్రవణాత్మకుండ నయిన నా సన్నిధికి "నా శరీరం**

**బితర యోగ్యంబు గాదు, నీకు శేషంబునయి యున్నదాన'నని యేకాంతంబునం బ్రాహ్మణునిం బుత్తెంచిన నేనును జనుదెంచి నీ పరిణయసమయంబున భవత్సహోదరుం బట్టి విరూపుం గావించిన నది గనుంగొనియును నా యందలి విప్రయోగభయంబున నూరకుండితి; నది గావున బహుప్రకారంబులై వర్తించు నీ సద్గుణంబులకు సంతసింతు"నని యి వ్విధంబున దేవకీసుతుండు నరలోక విడంబనంబుగ గృహస్థునిభంగి నిజగృహకృత్యంబు లాచరించు చుండె నని శుకుండు మఱియు నిట్లనియె. 268**

**ప్రతి :** అని; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; నీ= నీయొక్క; వాక్యంబులు= మాటలు; శ్రవణ= చెవులకు; సుఖంబు+కావించెన్= సంతోషాన్ని కలిగించాయి; నీవు= నువ్వు; వివిధములు+ఐన= అనేక విధాలైన; కామంబులు+కోరితి(వి) ఏనిన్= కోరికలను కోరితే; అవి+అన్నియున్= అవి అన్నీ; నా+అందున్+అ+ఉండుటన్+చేసి= నాలోనే ఉండుటచేత; ఏకాంత సేవాచతురవు+ఐన= ఏకాంతసేవలో మిక్కిలి నేర్పరివైన; నీకున్= నీకు; అవి+అన్నియున్= అవి అన్నీ; నిత్యంబులు+ఐ+ఉండున్= ఎల్లపుడును ఉంటాయి; నీ= నీ యొక్క; పాతివ్రత్యంబును= పతివ్రతాలక్షణాన్ని; నా+అందలి= నాయందుండే; స్నేహంబును= స్నేహభావాన్ని; అతి= మిక్కిలి; విశదంబులు+అయ్యెన్= తెలిసివచ్చాయి; నా= నాయొక్క; వాక్యములచేతన్= మాటలతో; భవదీయ చిత్తంబు= నీ మనస్సు; చంచలంబు+కాక= చంచలించక; నా+అందలి= నాపై ఉన్న; బుద్ధి= మతి; దృఢంబు+అగున్= స్థిరపడుతుంది; కావునన్= కాబట్టి; సకల= సమస్త; సంపత్+విలసితంబు+ఐన= సంపదలతో ప్రకాశించే; ద్వారకానగర= ద్వారకా నగరంలోని; దివ్యమందిరంబుల+అందున్= గొప్పవైన భవనాలలో; నీదు= నీయొక్క; భాగ్యంబునన్+చేసి= అదృష్టంవల్ల; సంసారికైవడిన్= గృహస్థునివలె; నీ+అందున్= నీయందు; బద్ధ+అనురాగుండను+ఐ= స్థిరమైన ప్రేమకలవాడినై; వర్తింతున్ (వర్తించుదును)= ఉంటాను; తక్కిన= ఇతరములైన; ప్రాణ+ఇంద్రియ= ప్రాణం, ఇంద్రియాల; పరవశత్వంబునన్= ప్రభావంలో పడిన కారణంగా; వికృత= వికారమైన; శరీరధారిణి+ఐన= శరీరం కలిగిన; సతి= స్త్రీ; నన్నున్+చెందుట= నన్ను పొందడం; దుష్కరము= కష్టం; అదియున్+కాక= అంతేకాకుండ; మోక్షప్రదుండను+ఐన= ముక్తినిచ్చేవాడినయిన; నన్నున్= నన్ను; కామ+ఆతురలు+ఐన= కామంతో బాధింపబడే స్త్రీలు; అల్పమతులు= నీచబుద్ధి కలవారు; వ్రత= ఉపవాసాదిపుణ్యకర్మలయొక్క; తపస్= తపస్సులయొక్క; మహిమలచేతన్= ప్రభావంతో; దాంపత్య= దంపతిభావంయొక్క; యోగమునకున్+ఐ= కూడికకై; సేవింతురు= సేవిస్తారు; అది= అది; అంతయున్= అంతా; నామాయా= నా యొక్క మాయ; విజృంభింతంబు= చెలరేగటమే; దానన్+చేసి= అందువలన; వారు= అట్టివారు; మందభాగ్యులు+ఐ= అదృష్టంలేనివారై; నిరయంబును= నరకం; ఒందుదురు= పొందుతారు; అట్లు+కావునన్= అందుచేత; నీ సమాన= నీతో సరియగు; కాంత= స్త్రీ; ఏకాంతల+అందున్+ఐననున్+కలదె= ఏ స్త్రీలయందైనా ఉన్నదా?; నీ= నీయొక్క; వివాహకాలంబునన్= వివాహసమయంలో; అనేక= పెక్కురు; రాజన్యవర్యులన్= ముఖ్యులైన రాజులను; కైకొనక= గ్రహించక; భవదీయ= నీయొక్క; మధుర+ఆలాప= తీయనిమాటలను; శ్రవణ+ఆత్మకుండన్+అయిన= వినే ఆసక్తికల; నాసన్నిధికిన్= నా దగ్గరకు; నాశరీరంబు= నా దేహం; ఇతరులకున్= ఇతరులకు అనగా నీకుతప్ప; యోగ్యంబున్+కాదు= తగిందికాదు; నీకున్= నీ కోసం; శేషంబున్+అయి+ఉన్నదానను= శరీరంతో మిగిలినదానినై ఉన్నాను; అని= అని తెల్పుతూ; ఏకాంతంబునన్= రహస్యంగా; బ్రాహ్మణునిన్= బ్రాహ్మణుణ్ణి; పుత్తెంచినన్= పంపగా; ఏనును= నేనును; చనుదెంచి= వచ్చి; నీ= నీయొక్క; పరిణయసమయంబునన్= వివాహసమయంలో; భవత్+సహోదరున్+పట్టి= నీ యొక్క సోదరుణ్ణి పట్టుకొని; విరూపున్+కావించిన= వికృతాకారుని చేయగా; అది= ఆ పనిని; కనున్+కొనియును= చూచినప్పటికీ; నా+అందలి= నాయొక్క; విప్రయోగ= ఎడబాటువలని; భయంబునన్= భయంచేత;

ఊరక+ఉండితివి= ఊరకుంటివి; అదికావున= అందువల్ల; బహుప్రకారంబులు+ఐ= అనేకవిధాలై; వర్తించు= ప్రవర్తించు; నీ= నీయొక్క; సత్+గుణంబులకున్= మంచిగుణాలకు; సంతసింతున్= సంతోషిస్తాను; అని= అని; ఈ+విధంబునన్= ఈ విధంగా; దేవకీసుతుండు= దేవకీదేవికుమారుడగు కృష్ణుడు; నరలోక= మానవలోకాన్ని; విడంబనంబు+కన్= అనుసరణంగా (అనుకరణంగా); గృహస్థుని భంగిన్= సామాన్య గృహస్థునివలె; నిజ= తన; గృహకృత్యంబులు= గృహకార్యాల్ని; ఆచరించుచున్+ఉండెను+అని= ఆచరిస్తూ ఉన్నాడని; శుకుండు= వ్యాసమహర్షి కుమారుడగు శుకమహర్షి; మఱియున్= ఇంకను; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** నీ మాటలు నాకు ఆనందాన్ని కలిగించాయి. నీవు పతివ్రతవు. ఏకాంతసేవలో నేర్పరివైన నీకు అన్నీ నెరవేరుతాయి. నీ పాతివ్రత్యం, నీకు నాయందుగల ప్రేమ స్పష్టమైనాయి. కాబట్టి, ద్వారకానగరంలో గృహస్థునిమాదిరి నీయందు గాఢానురాగంతో ఉంటాను. ఇంద్రియలోలవై కాంతలు నన్నుపొందడం మిక్కిలికష్టం. వ్రతాలవల్ల, తపస్సుచేత, నన్ను పొందాలని ప్రయత్నించి, విఫలవై నరకాన్ని పొందుతారు. నీవు వివాహకాలంలో ఎందరో రాజశ్రేష్ఠులను తిరస్కరించావు. "నా శరీరంపై ఇతరులకు అధికారం లే"దంటూ చెప్పి – బ్రాహ్మణుణ్ణి నాయొద్దకు పంపావు. నిన్ను వివాహమాడే సమయంలో నీ సోదరుణ్ణి వికృతుణ్ణి కావించాను. నా ఎడబాటును సహించలేక, ఏమీ మాటాడక ఊరకున్నావు. ఇట్టి నీ మంచిగుణాలకు మిక్కిలి సంతోషించాను–" అని పలికి దేవకీదేవి కుమారుడగు శ్రీకృష్ణుడు సామాన్యగృహస్థునివలె ద్వారకలో గృహకృత్యాలు నిర్వహిస్తూండినాడని శుకమహర్షి పరీక్షిత్తుకు తెలిపాడు.

**క. అని యిట్లు కృష్ణుఁ డాడి న, వినయవివేకానులాపవితతామృత సే**
**చన, ముదితహృదయయై య, వ్వనితామణి వికచవదనవనరుహ యగుచున్. 269**

**ప్రతి :** అని= అని; ఇట్లు= ఈ విధంగా; కృష్ణుఁడు+ఆడిన= కృష్ణుడు మాట్లాడినట్టి (వినయంతోకూడిన); వివేక+అనులాప= జ్ఞానవంతమైన మాటలు అనే; వితత+అమృత= విస్తృతి చెందిన అమృతంయొక్క; సేచన= చల్లుటచేత; ముదిత= సంతోషించిన; హృదయ+ఐ= మనస్సు కలిగిందయి; ఆ+వనితామణి= ఆస్త్రీ (రుక్మిణీదేవి); వికచ= వికసించిన; వదన= ముఖమనెడు; వనరుహ= కమలం కలిగింది; అగుచున్= అవుతూ...

**తా :** అని పలికిన శ్రీకృష్ణుని వినయ, వివేచనాపూర్వకమైన మాటలకు అమృతం చల్లినట్లై సంతోషాన్ని కల్గించగా, వికసించిన ముఖకమలం కలదవుతూ

**క. నగ వామతించు చూపులు, నగధరుమోమునను నిలిపి నయమునఁ గరముల్**
**మొగిచి వినుతించెఁ గృష్ణున్, ఖగవాహున్ రుచిరదేహుఁ గలితోత్సాహున్. 270**

**ప్రతి :** నగవు+ఆమతించు= నవ్వును ఆహ్వానించే (నవ్వుతోకూడిన); చూపులు= చూపులు; నగధరు= శ్రీకృష్ణుని; మోమునన్= ముఖంపై; నిలిపి= నిలిపి; నయమునన్= వినయంతో; కరములు= చేతుల్ని; మొగిచి= జోడించి; ఖగవాహున్= గరుడవాహనుడైన; రుచిరదేహున్= అందగాడైన; కలిత+ఉత్సాహున్= ఉత్సాహవంతుడయిన; కృష్ణన్= కృష్ణుని; వినుతించెన్= ఇలా ప్రశంసించింది...

**తా :** రుక్మిణి చిరునవ్వును ఆహ్వానిస్తున్న చూపులతో శ్రీకృష్ణుణ్ణిచూచి, చేతులు జోడించి, గరుడవాహనుడూ, అందగాడూ, ఉత్సాహపూర్ణుడూ అయిన శ్రీకృష్ణుణ్ణి పొగడింది.

**చ. అతులవిరాజమానముఖుఁడై వివిధాంబరచారుభూషణ**
**ప్రతతులతోడఁ గోరినవరంబులు దద్దయు నిచ్చెఁ గృష్ణుఁ డు**
**న్నతశుభమూర్తి దేవగణనందితకీర్తి దయానువర్తియై**
**యతిమృదువాణికిం గిసలయారుణపాణికి నీలవేణికిన్. 271**

**ప్రతి :** ఉన్నతశుభమూర్తి= గొప్పశుభప్రదమైనఆకారం కలిగినవాడు; దేవగణ= దేవతలసమూహంచేత; నందిత= ప్రశంసించబడిన; కీర్తి= యశస్సు గలిగిన; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; దయా+అనువర్తి+ఐ= దయతో ప్రవర్తించేవాడై; అతుల= సాటలేని; విరాజమాన= ప్రకాశిస్తున్న; ముఖుఁడు+ఐ= ముఖం కలిగినవాడై; అతి= మిక్కిలి; మృదు= మెత్తనైన; వాణికిన్= పలుకుకలిగినదీ; కిసలయ+అరుణపాణికిన్= చిగురువలె ఎర్రనైన చేతులుకలదీ; నీలవేణికిన్= నల్లనిజుత్తు కలిగినదీ అయిన రుక్మిణికి; వివిధ= అనేకములైన; అంబర= వస్త్రములను; చారు= అందమైన; భూషణ= నగల; ప్రతతులతోడన్= సమూహములతో; కోరిన= కోరిన; వరంబులు= కోరికలను; తద్దయున్= మిక్కిలిగా; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తా :** దేవతాగణాలచే ప్రశంసింపబడి, సాటిలేని ప్రకాశవంతమైన ముఖంతో శుభప్రదమైన ఆకారంతో, దయతో కూడిన శ్రీకృష్ణుడు, చిగురులవలె ఎర్రగానున్న (సుకుమారమైన) చేతులు కలిగిన రుక్మిణికి వస్త్రాలు, నగలు, వరాలూ కోరినరీతిగా ఇచ్చాడు.

**వ. ఇట్లు సమ్మానించి కృష్ణుండు రుక్మిణియుం దానును దదనంతరంబ. 272**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సమ్మానించి= సత్కరించి; కృష్ణుండు= శ్రీ కృష్ణుడు; రుక్మిణియున్+తానును= రుక్మిణియు, శ్రీకృష్ణుడును; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత...

**తా :** రుక్మిణిని సన్మానించిన పిదప, తానును రుక్మిణియు

**చ. ఎలమి ఘటింపఁగాఁ గలసి యీడెల నీడల మల్లికా లతా**
**వలిఁ గరవీరజాతి విరవాదుల వీథులఁ గమ్మ దెమ్మెరల్**
**వొలయు నవీనవాసములఁ బొన్నలఁ దిన్నెలఁ బచ్చరచ్చలన్**
**గొలఁకుల లేఁగెలంకులను గోరిక లీరిక లొత్తఁ గ్రొత్తలై. 273**

**ప్రతి :** ఈడెల నీడల= ఎర్రకిత్తలి చెట్లనీడలో; మల్లికా= మల్లెల; లతా+ఆవలి= లతల గుంపులో; కరవీర= గన్నేరు; జాతి= జాజి; విరవాదుల= విరజాజుల; వీథులన్= వరుసలలో; కమ్మ+తెమ్మెరల్= కమ్మనైన చల్లనిగాలులతో; పొలయు= వ్యాపించే; నవీనవాసములన్= క్రొత్త గృహాలలో; పొన్నలన్= పొన్నచెట్ల; తిన్నెలన్= అరుగుల పైన; పచ్చ= మరకతమణుల; రచ్చలన్= వేదికలపైనను; కొలఁకులన్= చెరువులయొక్క; కెలంకులన్= సుకుమారమైన తీరప్రదేశాలలో; క్రొత్తవై= క్రొత్తవై; కోరికలు+ఈరికలు+ఒత్తన్= కోరికలు మొలకలెత్తగా; ఎలమి= ప్రేమ; ఘటింపఁగాన్= కలుగగా; కలిసి= కలసి...

**తా :** శ్రీకృష్ణుడూ, రుక్మిణీదేవీ చెట్లనీడల్లో మల్లెలలతలసమూహాల్లో, విరజాజిపొదల్లో, శిలావేదికలపై, కొలనుల అందమైన తీరాల్లో కలసి,

**క. ఆరామభూములందు వి, హారామలసౌఖ్యలీల నతిమోదముతో**
**నా రామానుజుఁ డుండెను, నా రామామణియుఁ దాను నభిరామముగన్. 274**

**ప్రతి :** ఆరామభూముల+అందు= ఉద్యానవనాల్లో; విహార= విహారమందలి; అమల= స్వచ్ఛమైన; సౌఖ్యలీలన్= సుఖాన్ని కలిగించే లీలలతో; అతి= మిక్కిలి; మోదముతోన్= సంతోషంతో; ఆ= ఆ; రామామణియున్= స్త్రీ రత్నమైన రుక్మిణీదేవియు; తానును (కృష్ణుడూ); అభిరామముకన్= ఒప్పిదంగా; ఆ= ప్రసిద్ధుడైన; రామ+అనుజుఁడు= బలరాముని సోదరుడయిన కృష్ణుడు; ఉండెనున్= ఉన్నాడు.

**తా :** కేళీ ఉద్యానవనాల్లో విలాసంగా విహరించడానికి అనుకూలమైన స్వచ్ఛమైన ప్రదేశాలలో సుఖలీలావిలాసాలతో, ఎంతో సంతోషంతో, ఆ రుక్మిణీదేవితో కలిసి జంటగా బలరాముని సోదరుడైన శ్రీకృష్ణుడు చరించాడు.

**వ. మఱియు ననేకవిధమణివితానాభిశోభితప్రాసాదోపరిభాగంబులను, లాలితనీలకంఠకలకంఠ కలవింక శుకకలాపకలితతీరంబులను, మకరందపానమదవదిందిందిరఝుంకారసంకులకమల కహ్లార సుధాసారనీహారపూరితకాసారంబులను, ధాతునిర్ఝరరంజిత సానుదేశగిరికుంజపుంజంబులను, గృతకశైలంబులను, గ్రీడాగృహంబులనుం జెలంగి నందనందనుండు విదర్భరాజనందనం దగిలి కందర్పకేళీ లోలాత్ముం డయ్యె, ననంతరం బా సుందరీలలామంబువలనఁ బ్రద్యుమ్నుండు, చారుధేష్ణుండు, చారుదేవుండు, సుధేష్ణుండు, సుచారువు, చారుగుప్తుండు, భద్రచారువు, చారుభద్రుండు, విచారువు, చారువు ననియెడు పదుగురు తనయులం బడసె, నట్లు సత్యభామాజాంబవతీ నాగ్నజితీ కాళిందీ మాద్రి మిత్రవిందా భద్రలకు వేఱు వేఱ పదుగురేసి భద్రమూర్తులైన కుమారు లుదయించి రవ్విధంబున మఱియును. 275**

**ప్రతి :** మఱియున్= ఇంకను; అనేక= పెక్కైన; విధ= రకాలైన; మణివితాన+అభిశోభిత= మణులతో కూడిన మేడల పైకప్పులతో మిక్కిలి ప్రకాశించే; ప్రాసాద= సౌధాలయొక్క; ఉపరిభాగంబులను= పై భాగాలలోనూ; లాలిత= బుజ్జగింపబడిన; నీలకంఠ= నెమళ్ల; కలకంఠ= కోకిలల; కలవింక= ఊరపిచ్చుకల; శుక= చిలుకల; కలాప= సమూహంతో; కలిత= కూడియున్న; తీరంబులను= సరస్సుల గట్టులలో; మకరంద= పూఁదేనెను; పాన= త్రాగి; మదవత్+ఇందిందిర= మదించిన తుమ్మెదల; ఝుంకార= ఝుంకారాలతో; సంకుల= కూడిన; కమల= కమలాల, కహ్లార= ఎఱ్ఱకలువల; సుధా+ఆసార= మకరందప్రవాహాలతో; నీహార= మంచుతో; పూరిత= నిండిన; కాసారంబులను= చెరువులలోను; ధాతు= ధాతువులతో కూడిన; నిర్ఝర= సెలయేరులతో; రంజిత= ఎఱ్ఱనైన; సానుదేశ= చరియలుగల; గిరి= కొండల; కుంజ= పొదరిండ్ల; పుంజంబులను= సమూహాల్లోను; కృతకశైలంబులను= కృత్రిమాలైన కొండలలోను; క్రీడాగృహంబులను= క్రీడాగృహాలలోను; చెలంగి= ఉత్సహించి; నందనందనుడు= నందుని కుమారుడగు కృష్ణుడు; విదర్భరాజనందనన్= విదర్భరాజు కుమార్తె అయిన రుక్మిణీదేవిని; తగిలి= కూడి; కందర్పకేళిన్= మన్మథక్రీడలో; లోల+ఆత్ముండు= కోరికకలిగినవాడు; అయ్యెన్= అయ్యెను; అనంతరంబు= తరువాత; ఆ సుందరీలలామంబువలనన్= ఆ సుందరియైన రుక్మిణివల్ల; ప్రద్యుమ్నుండు= ప్రద్యుమ్నుడు; చారుధేష్ణుండు= చారుధేష్ణుడు; చారుదేవుండు= చారుదేవుడు; సుధేష్ణుండు= సుధేష్ణుడు; సుచారువు= సుచారువు; చారుగుప్తుండు= చారుగుప్తుడు; భద్రచారువు= భద్రచారువు; చారుభద్రుండు= చారుభద్రుడు; విచారువు= విచారువు; చారువు= చారువు; అనియెడు= అనబడే; పదుగురు= పదిమంది; తనయులన్= కుమారులను; పడసెన్=

పొందాడు; అట్లు= ఆ విధంగా; సత్యభామా= సత్యభామ; జాంబవతీ= జాంబవతి; నాగ్నజితీ= నాగ్నజితి; కాళిందీ= కాళింది; మాద్రి= మాద్రి; మిత్రవిందా= మిత్రవింద; భద్రలకున్= భద్ర అనే కాంతలందూ; వేఱువేఱ= విడివిడిగా; పదుగురు+ఏసి= పదిమందిచొప్పున; కుమారులు= కుమారులు; ఉదయించిరి= కలిగారు; ఆ+విధంబునన్= ఆ ప్రకారంగా; మఱియును= ఇంకా...

**తా :** రకరకాలైన మణులచే ప్రకాశించే రాజసౌధాలపైభాగాలలోను; నెమళ్ళు, కోకిలలు, ఊరపిచ్చుకలు, చిలుకలు ఉండే ప్రాంతాలలోను, చల్లనిసరస్సులలోను, జలప్రవాహాలలోను, ధాతువులతో కూడిన సెలయేర్లలోను, కొండలలోను, క్రీడా గృహాలలోను, ఉత్సాహంగా శ్రీకృష్ణుడును రుక్మిణియును మన్మథక్రీడల్లో మునిగారు. ఆ తరువాత శ్రీకృష్ణునివల్ల ఆమెకు పదిమందికుమారులు కలిగారు. వారు – 1. ప్రద్యుమ్నుడు; 2. చారుధేష్ణుడు; 3. చారుదేవుడు; 4. సుధేష్ణుడు; 5. సుచారువు; 6. చారుగుప్తుడు; 7. భద్రచారువు; 8. చారుభద్రుడు; 9. విచారువు; 10. చారువు. ఆ విధంగానే సత్యభామ, 2. జాంబవతి 3. నాగ్నజితి 4. కాళింది 5. మాద్రి 6. మిత్రవింద 7. భద్రలకూ వేరువేరుగా పదిమంది కుమారులు కలిగారు.

**చ. అనఘ! పదాఱువేలసతులందు జనించిరి వేఱు వేఱ నం**
**దన దశకంబు తత్సుతవితానము గాంచి రనేకసూనుల**
**న్నెనయఁగ నిట్లు పిల్లచెఱ కీనిన కైవడిఁ బుత్త్రపౌత్ర వ**
**ర్ధనమున నొప్పెఁ గృష్ణుఁడు ముదంబునఁ దామరతంపరై భువిన్. 276**

**ప్రతి :** అనఘ!= పాపరహితుడా!; పదాఱువేల= పదహారువేల; సతులందున్= భార్యలందు; వేఱువేఱ= విడివిడిగా (ఒక్కొక్కరికి); నందనదశకంబు= పదిమందికుమారులు; జనించిరి= పుట్టారు; తత్+సుత= ఆ కుమారుల; వితానము= సమూహంకూడ; అనేక= పెక్కురు; సూనులన్= కుమారులను; ఎనయఁగన్= పోలునట్లు; కాంచిరి= పొందారు; ఇట్లు= ఈ విధంగా; పిల్లచెఱకు+ఈనిన= లేత చెరకు ప్రసవించిన; కైవడి= ప్రకారం; తామరతంపరై= తామరల సమూహమై; పుత్రపౌత్ర= కుమారుల, మనుమల; వర్ధనమున= పెరుగుటవల్ల; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ముదంబునన్= సంతోషంతో; ఒప్పెన్= ఒప్పాడు.

**తా :** పుణ్యాత్ముడా! పదహారువేల భార్యల్లో ఒక్కొక్కరికి పదిమంది పుత్రులు శ్రీకృష్ణునకు కలిగారు. ఇలా వారికి పిల్లచెరకు ప్రసవించినట్లు పిల్లలు కలిగారు. పుత్రులతో, మనుమలతో, మునిమనుమలతో శ్రీకృష్ణుడు సంతోషంగా ఉన్నాడు.

**తే. అట్లు యదు వృష్ణి భోజాంధకాది వివిధ, నామధేయాంతరముల నెన్నంగ నూట**
**యొక్కటై చాల వర్ధిల్లె నక్కులంబు, నృపకుమారులఁ జదివించు నేర్పు గలుగు. 277**

**ప్రతి :** అట్లు= ఆ ప్రకారం; యదు= యదు; వృష్ణి= వృష్ణి; భోజ= భోజ; అంధక+ఆది= అంధకమొదలైన; వివిధ= అనేక; నామధేయ+అంతరముల= నామభేదాలతో; ఎన్నంగన్= పేర్కొనగ; నూఱు+ఒక్కటి+ఐ= నూటఒక్కటై; ఆ+కులంబు= ఆ వంశం; వర్ధిల్లెన్= వృద్ధి చెందింది; నృపకుమారులన్= రాజకుమారులను; చదివించు= చదివించే; నేర్పు= ప్రావీణ్యం; కలుగు= కలిగిన...

**తా :** ఆ ప్రకారం యదు, వృష్ణి, భోజ, అంధక, మున్నగునవి నూటొక్కవంశాలై మిక్కిలి అభివృద్ధి చెందాయి. ఆ రాజపుత్రులకు విద్యనేర్పడానికి ప్రావీణ్యం కలిగిన

**తే. గురుజనంబులు విను మూఁడు కోట్లమీఁద, నెనుబ దెనిమిదివేలపై నెసఁగ నూర్వు**
**రన్నఁ దద్బాలకావలి నెన్న ఁదరమె, శూలికైనను దామరచూలికైన? 278**

**ప్రతి :** విను= వినుము; గురుజనంబులు= అధ్యాపకులు; మూఁడుకోట్లమీఁదన్= మూడు కోట్లపైన; ఎనుబది+ఎనిమిదివేల= ఎనభై ఎనిమిదివేల; పైన్= పైన; ఎసఁగన్= అతిశయంగా; నూర్వురు+అన్నన్= వంద అన్నా; తద్= ఆ; బాలక+ఆవలిన్= బాలుర సమూహాన్ని; ఎన్నన్= లెక్కించడం; శూలికిన్+ఐనను= ఈశ్వరునకయినా; తామరచూలికిన్+ఐనన్= బ్రహ్మకైనా; తరమా?= శక్యమా? (శక్యంకాదు)

**తా :** వారందరికి మూడుకోట్ల, ఎనభైఎనిమిదివేల ఒక నూరుమంది విద్యనేర్పే గురువులున్నారంటే, ఆ బాలుర సంఖ్య లెక్కించడానికి ఈశ్వరునకీ, బ్రహ్మకూ శక్యంకాదు (గురువులు 3 కోట్ల, 88 వేల, 100 మంది).

**వ. అందు గోవిందనందనుండైన ప్రద్యుమ్నునకు రుక్మి కూఁతువలన ననిరుద్ధుండు సంభవించె ననిన మునివరునకు భూవరుం డిట్లనియె. 279**

**ప్రతి :** అందున్= ఆరాజకుమారులలో; గోవిందనందనుఁడు+ఐన= శ్రీకృష్ణునికుమారుడైన; ప్రద్యుమ్నునకున్= ప్రద్యుమ్నుడనేవానికి; రుక్మికూతువలనన్= రుక్మికుమార్తెవల్ల; అనిరుద్ధుండు= అనిరుద్ధుడు; సంభవించెను= కలిగాడు; అనినన్= అనిపలికిన; మునివరునకున్= శుకమహర్షికి; భూవరుండు= పరీక్షిన్మహారాజు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నునికి రుక్మి కూతురైన అనిరుద్ధుడనే కుమారుడు కలిగాడనిచెప్పగా పరీక్షిన్మహారాజు శుకమహర్షిని ఈ విధంగా అడిగాడు.

## ❖ అనిరుద్ధుని వివాహ సమయమున బలరాముఁడు రుక్మి మొదలగు వారినిం జంపుట ❖

**క. బవరమునఁ గృష్ణుచే ము, న్నవమానము నొంది రుక్మి యచ్యుతు గెలువం**
**దివురుచుఁ దన సుత నరిసం, భవునకు నెట్లిచ్చె? నెఱుఁగఁ బలుకు మునీంద్రా! 280**

**ప్రతి :** ముని+ఇంద్రా!= ఓ శుకమునీ!; బవరమునన్= యుద్ధంలో; కృష్ణుచేన్= కృష్ణునిచేత; మున్ను= పూర్వం; అవమానమున్+ఒంది= అవమానం పొంది; రుక్మి= రుక్మి; అచ్యుతున్= కృష్ణుణ్ణి; గెలువన్+తివురుచున్= గెలుచుటకు ప్రయత్నిస్తూ; తన= తనయొక్క; సుతన్= కుమార్తెను; అరిసంభవునకున్= శత్రువుయొక్క కుమారునికి; ఎట్లు= ఏ విధంగా; ఇచ్చెన్= ఇచ్చాడు; ఎఱుఁగన్= తెలిసేటట్లు; పలుకు= చెప్పుము.

**తా :** కృష్ణునిచే అవమానం పొంది, అతణ్ణి జయించాలని అనుకొంటున్న రుక్మి శత్రుకుమారుడగు అనిరుద్ధునితో తన కుమార్తె వివాహం ఏ విధంగా చేశాడు? ఓ శుకమునీ! ఈ విషయం నాకు తెలిసేటట్లు విశదంగా చెప్పు.

**సీ. నావుడు శుకయోగి 'నరనాయకోత్తమ! నీవు చెప్పిన యట్ల నెమ్మనమునఁ**
**బద్మాయతాక్షుచేఁ బడిన బన్నమునకుఁ గనలుచు నుండియు ననుజతోడి**
**నెయ్యంబునను భాగినేయున కిచ్చెను గూఁతు నంచితపుష్పకోమలాంగిఁ**
**దనపూన్కి దప్పినఁ దగ విదర్భేశుండు విను మెఱింగింతు న వ్విధము దెలియఁ**

**తే. బరఁగ 'రుక్మవతీ స్వయంవరమున కొగి, నరుగుదెం డని భీష్మభూవరసుతుండు**
**వరుస రప్పించె రాజన్యవరకుమార, వరుల ననువార్త కలరి యా హరిసుతుండు. 281**

**ప్రతి :** నావుడున్= అని పల్కగా; శుకయోగి= శుకముని; నరనాయక+ఉత్తమ= ఓ రాజశ్రేష్ఠా!; నీవు= నీవు; చెప్పిన+అట్ల= మాట్లాడిన విధంగా; నెఱ+మనమునన్= నిండుమనస్సుతో; పద్మ+ఆయత+అక్షుచేన్= శ్రీకృష్ణునిచేత; పడిన= పొందిన; బన్నమునకున్= అవమానానికి; కనలుచున్= కోపిస్తూ; ఉండియున్= ఉన్నప్పటికీ; విదర్భ+ఈశుండు= రుక్మి; తనపూన్కితప్పినన్= తన ప్రయత్నం తప్పిపోగా; తగన్= తగినట్లు; అనుజతోడి= చెల్లెలుతో; నెయ్యంబునన్= స్నేహంవల్ల; భాగినేయునకున్= మేనల్లునకు; అంచిత= సుందరమగు; పుష్ప= పూవువలె; కోమల+అంగి= మృదువైన దేహం కలిగిన; కూతున్= కుమార్తెను; ఇచ్చెను= ఇచ్చాడు; ఆ+విధం= ఆ ప్రకారాన్ని; తెలియన్+పరఁగన్= తెలియునట్లుగా; ఎఱిగింతున్= చెబుతాను; వినుము= విను; రుక్మవతీ స్వయంవరమునకున్= రుక్మవతీ స్వయంవరానికి; ఒగిన్= పూనికతో; రాజన్యవరకుమారవరులన్= శ్రేష్ఠులైన రాజకుమారులను; వరుసన్= బంధుత్వక్రమం అనుసరించి (వ్యవహారసరణితో); అరుగుతెందు+అని= రమ్మనమని; భీష్మభూవరసుతుండు= భీష్మరాజుకుమారుడైన రుక్మి; రప్పించెన్= రప్పించెను; అనువార్తకున్= అనే వార్తకు; అలరి= సంతోషించి; ఆ; హరిసుతుండు= కృష్ణుని కుమారుడు.

**తా :** శుకమహర్షి పరీక్షిన్మహారాజున కిలా చెప్పాడు. ఓ రాజా! నీవు అన్నట్లుగానే రుక్మిణీ వివాహ సందర్భంలో కృష్ణునిచే పొందిన అవమానానికి రుక్మి బాధపడుతూ, తన పగను తీర్చుకొనే ప్రయత్నంలో ఉన్నాడు. కానీ, అవి ఏమియు ఫలింపలేదు సరికదా! తన సోదరియందలి ప్రేమతో – తన కుమార్తె రుక్మవతిని కృష్ణుని కొడుకు ప్రద్యుమ్నున కివ్వడానికి పూనుకున్నాడు. స్వయంవరానికి రాజకుమారులను అందరిని ఆహ్వానించాడు. ఆ వార్త విని కృష్ణుని కుమారుడగు ప్రద్యుమ్నుడూ వచ్చాడు.

**చ. వరమణిభూషణప్రభలవర్గ మనర్గళభంగిఁ బర్వఁ బ్ర**
**స్ఫురితరథాధిరోహణవిభూతి దలిర్ప మనోహరైక సు**
**స్థిరశుభలీల నేగె యదుసింహకిశోరము రాజకన్యకా**
**పరిణయవైభవాగతనృపాలకకోటికి రుక్మివీటికిన్. 282**

**ప్రతి :** వర= ఉత్తమమైన; మణి= మణులయొక్క; భూషణ= నగలయొక్క; ప్రభల= కాంతుల; వర్గము= సమూహం; అనర్గళ= అడ్డులేని; భంగిన్= విధంగా; పర్వన్= వ్యాపించగా; ప్రస్ఫురిత= ప్రకాశించే; రథ+అధిరోహణ= రథంపైన ఎక్కుట అనే; విభూతి+తలిర్పన్= శోభ అతిశయించగా; మనోహర+ఏక= ముఖ్యంగా అందమైన; సుస్థిర= స్థిరమైన; శుభలీలన్= శుభప్రదమగువిధాన; యదుసింహకిశోరము= యాదవులలో సింగపు పిల్లవంటి ప్రద్యుమ్నుడు; రాజకన్యకా= రాజకుమారియొక్క; పరిణయ వైభవ+ఆగత= వివాహమహోత్సవానికి వచ్చిన; నృపాలక కోటికిన్= రాజసమూహంకల; రుక్మివీటికిన్= రుక్మినగరానికి; ఏగెన్= వెళ్ళాడు.

**తా :** ఉత్తమ మణిభూషణాలతో ప్రకాశిస్తూ, రమణీయరథమెక్కి రాజకుమార్తె స్వయంవరానికి వచ్చిన రాజకుమారులున్న రుక్మి నగరానికి ప్రద్యుమ్నుడు చేరాడు.

**చ. చని పురిఁ జొచ్చి వృష్ణికులసత్తముఁ డచ్చట మూఁగియున్న య**
**మ్మనుజవరేణ్యనందనులు మానము దూలి భయాకులాత్ములై**
**చనఁగ ననేకచండతరసాయకసంపదఁ జూపి రుక్మి నం**
**దనఁ గొనివచ్చి వేడ్క నిజధామము సొచ్చె నవార్యశౌర్యుఁడై. 283**

**ప్రతి :** చని= వెళ్ళి; పురిన్+చొచ్చి= నగరంలో ప్రవేశించి; వృష్ణికులసత్తముఁడు= వృష్ణికులశ్రేష్ఠుడు (ప్రద్యుమ్నుడు); అచ్చటన్= ఆ నగరంలో; మూఁగి+ఉన్న= చుట్టుకొన్న; ఆ+మనుజవరేణ్య= ఆ రాజశ్రేష్ఠుల; నందనులు= కుమారులు; మానమున్+తూలి= పౌరుషాన్ని పోగొట్టుకొని; భయ+ఆకుల+ఆత్ములై= భయంతో కూడిన మనస్సుకలవారై; చనన్+కన్= పారిపోయేటట్లుగా; అనేక= అనేకములైన; చండతర= మిక్కిలి తీవ్రమైన; సాయక= బాణాల; సంపదన్+చూపి= సంపదను చూపి; అవార్య= అడ్డగింపని; శౌర్యుఁడు+ఐ= పరాక్రమం కలిగి; రుక్మినందనన్+కొనివచ్చి= రుక్మికుమార్తె అయిన రుక్మవతిని తీసికొని వచ్చి; వేడ్కన్= వేడుకతో; నిజధామము= తనభవనాన్ని; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తా :** యదుసింహ కిశోరమైన ప్రద్యుమ్నుడు రుక్మినగరంలో ప్రవేశించి, స్వయంవరానికి వచ్చిన రాజకుమారులకు తన బాణసంపదనుచూపగా వారు భయపడిపారిపోయారు. అంతట ప్రద్యుమ్నుడు రుక్మవతిని తీసుకొని వచ్చి, వేడుకతో తన భవనంలో ప్రవేశించాడు.

**వ. ఇట్లు తెచ్చి ప్రద్యుమ్నుండు హరిణనయనం బరిణయం బంది నిఖిలసుఖంబు లనుభవింపుచుండె. ననంతరంబ. 284**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; తెచ్చి= తీసుకొనివచ్చి; ప్రద్యుమ్నుండు= ప్రద్యుమ్నుడు; హరిణనయనన్+పరిణయంబు+అంది= లేడికన్నులవంటి కన్నులుకల రుక్మవతిని వివాహమాడి; నిఖిల= సర్వ; సుఖంబులన్+అనుభవించుచున్+ఉండెన్= సుఖాలను అనుభవించసాగాడు; అనంతరంబు+అ= తరువాతే...

**తా :** తన భవనంలో ప్రవేశించిన తరువాత ప్రద్యుమ్నుడు రుక్మవతిని వివాహమాడి, అన్ని సుఖాలను పొందసాగాడు. పిదప

**క. ధీరుఁడు కృతవర్మని సుకు, మారుఁడు వరియించె రుచిరమండనయుత నం**
**భోరుహముఖి రుక్మిసుతం, జారుమతీకన్యఁ బ్రకట సజ్జనమాన్యన్. 285**

**ప్రతి :** ధీరుఁడు= ధైర్యము కలిగిన; కృతవర్మని= కృతవర్మయొక్క; సుకుమారుఁడు= అందగాడయిన కుమారుడు; రుచిర= ఒప్పిదమైన; మండనయుతన్= అలంకారాలతో కూడినదాన్ని; అంభోరుహముఖిన్= పద్మవదనను; ప్రకటసజ్జనమాన్యన్= ప్రసిద్ధులగు ఉత్తములచే గౌరవింపదగినట్టి దాన్ని; రుక్మిసుతన్= రుక్మికుమార్తెను; చారుమతీకన్యన్= చారుమతి అనే కన్యను; వరియించెన్= వివాహమాడాడు.

**తా :** కృతవర్మ కుమారుడు రుక్మికుమార్తె చారుమతిని వివాహమాడాడు.

**విశే :** కృతవర్మ భోజదేశపురాజు హృదికుని కుమారుడు. దుర్యోధనునకు మిత్రుడు. కౌరవపాండవుల యుద్ధంలో దుర్యోధనుని పక్షంలో ఉండేవాడు. (చూడు. పూర్వగాథాలహరి)

**తే. ప్రకటచరితుండు భీష్మభూపాలసుతుఁడు, మనము మోదింపఁ దన కూర్మిమనుమరాలి**
**రుక్మలోచన నసమాన రుక్మకాంతిఁ, జెలిమి ననిరుద్ధునకు బెండ్లి సేయు నపుడు. 286**

**ప్రతి :** ప్రకటచరితుండు= ప్రసిద్ధమైన ప్రవర్తనకలవాడు; భీష్మభూపాలసుతుండు= భీష్మరాజు కుమారుడయిన రుక్మి; మనము= మనస్సు; మోదింపన్= సంతోషించగా; తన= తనయొక్క; కూర్మి= గారాబు; మనుమరాలిన్= మనుమరాలిని; అసమాన= సాటిలేని; రుక్మకాంతిన్= బంగారుతేజస్సు కలిగిన; రుక్మలోచనన్= రుక్మలోచనను; చెలిమిన్= స్నేహభావంతో; అనిరుద్ధునకున్= అనిరుద్ధునికి; పెండ్లిన్= వివాహం; చేయున్= చేస్తున్న; అపుడు= సమయంలో...

**తా :** ప్రసిద్ధుడగు రుక్మి తన మనుమరాలగు రుక్మలోచన వివాహాన్ని అనిరుద్ధునితో చేస్తున్న సమయంలో

**విశే :** అనిరుద్ధుడు శ్రీకృష్ణుని పుత్రుడగు ప్రద్యుమ్నుని కుమారుడు. ఈతడు మొదట మేనమామ కుమార్తెయగు రుక్మలోచనను, తదుపరి బాణాసురుని కుమార్తెయగు ఉషను వివాహం చేసికొన్నాడు.

**క. పొలుపుగ రత్నవిభూషో, జ్జ్వలుఁ డయి శుభవేళ న వ్వివాహార్థము ని**
**ర్మల బహువైభవశోభన, కలితవిదర్భావనీశకటకంబునకున్. 287**

**ప్రతి :** పొలుపుగన్= ఒప్పునట్లుగ; (తగినట్లుగ); రత్నవిభూషా+ఉజ్జ్వలుడు+అయి= రత్నాలతో చేయబడిన ఆభరణాలచే ప్రకాశించేవాడై; శుభవేళన్= శుభప్రదమైన సమయంలో; ఆ+వివాహ+అర్థమున్= ఆ వివాహంకోసం; నిర్మల= నిర్మలమైన; బహువైభవ= అనేక సంపదలతో; కలిత= కూడిన; విదర్భ+అవనీశ= విదర్భరాజుయొక్క; కటకంబునకున్= కటకానికి...

**తా :** రత్నభూషణాల నలంకరించుకొని తేజస్వంతుడై శుభసమయంలో వివాహానికి రుక్మిరాజధానీ నగరానికి

**చ. హరియును రుక్మిణీసతియు నా బలభద్రుఁడు శంబరారియున్**
**నరిమదభేది సాంబుఁడును నాదిగ రాజకుమారకోటి సిం**
**ధుర రథవాజిసద్భటులతోఁ జని యందు సమగ్రవైభవా**
**చరితవివాహయుక్తదివసంబులు వేడుకఁ బుచ్చి యంతటన్. 288**

**ప్రతి :** హరియును= కృష్ణుడూ; రుక్మిణీసతియున్= రుక్మిణిదేవీ; ఆ= ప్రసిద్ధుడైన; బలభద్రుఁడున్= బలరాముఁడూ; శంబర+అరియును= శంబరుడనే రాక్షసునికి శత్రువైన ప్రద్యుమ్నుడూ; అరి= శత్రువుల; మద= మదాన్ని; భేది=భేదించునట్టి; సాంబుఁడున్= సాంబుడూ; ఆది= మొదలగు; రాజకుమార= రాజకుమారుల; కోటి= సమూహం; సింధుర= ఏనుగులతో; రథ= రథాలతో; వాజి= గుర్రాలతో; సత్+భటులతో= ఉత్తమభటులతో; చని= వెళ్ళి; అందున్= అచ్చట; సమగ్ర= సంపూర్ణంగా; వైభవ+ఆచరిత= వైభవంగా ఆచరింపపడిన; వివాహయుక్త= వివాహంతో కూడిన; దివసంబులు= రోజులు; వేడుకన్+పుచ్చి= వేడుకతో గడిపి; అంతటన్= అనంతరం...

**తా :** రుక్మిణీ కృష్ణులు, బలరాముడు, ప్రద్యుమ్నుడు, సాంబుడు, మొదలగు రాజకుమారులతో సైన్యయుక్తులై వివాహానికి వెళ్ళి, వివాహం జరిగినన్ని రోజులు సంతోషంగా గడిపారు. అనంతరం

**క. ఒకనాఁడు యదుకుమారకు, లకలంకసమగ్ర వైభవాటోపమహో**
**త్సుకులై యుండఁగఁ జూపో, పక యెకసక్కెమున నవనిపాలురు వరుసన్. 289**

**ప్రతి :** ఒకనాఁడు= ఒకరోజు; యదుకుమారకులు= యాదవకుమారులు; అకలంక= దోషంలేని; సమగ్ర= సమగ్రమైన; వైభవ+ఆటోప= వైభవంతో కూడిన ఆడంబరంగా; మహో+ఉత్సుకులు+ఐ= మిక్కిలి ఉత్సాహంతో; ఉండన్+కన్= ఉండగా; చూపు+ఓపక= చూడలేక; అవనిపాలురు= రాజులు; వరుసన్= పంక్తిగా; ఎకసక్కెమునన్= పరిహాసంగా...

**తా :** యాదవకుమారులు మిక్కిలి ఉత్సాహంతో ఉండడం చూడలేక, కొందరు రాజులు పరిహసించగా

**ఉ. ఎచ్చరికం గళింగధరణీశుఁడు రుక్మిమొగంబు సూచి నీ**
**యొచ్చెముఁ దీర్చికో నిదియ యొప్పుగువేళ బలుండు జూదమం**
**దిచ్చ గలండు, గాని పొలు పెక్కిన నేర్పరి గాఁడు, గాన నీ**
**కిచ్చు నవశ్యమున్ జయము నీఁగుము తొల్లిటఁ బడ్డ బన్నముల్. 290**

**ప్రతి :** కళింగధరణి+ఈశుడు= కళింగదేశపు ప్రభువు; ఎచ్చరికన్= హెచ్చరించుతున్నట్లు; రుక్మిమొగంబున్= రుక్మిముఖంవైపు; చూచి= చూచి; నీ= నీ యొక్క; ఒచ్చెమున్= అవమానాన్ని; తీర్చికోన్= తీర్చుకొనేందుకు; ఇది+అ= ఇదే; ఒప్పు+అగువేళ= సరైన సమయం; బలుండు= బలరాముడు; జూదము+అందున్= జూదమాడడంలో; ఇచ్ఛ= కోరిక; కలండు= ఉన్నవాడు; కాని= కాని; పొలుపు+ఎక్కిన= ఎక్కువైన; నేర్పరి+కాడు= నైపుణ్యం కలవాడు కాదు; కాన= కావున; నీకున్= నీకు; అవశ్యమున్= తప్పక; జయమును= విజయాన్ని; ఇచ్చున్= ఇస్తాడు; తొల్లిటన్= పూర్వం; పడ్డ= పడిన; బన్నమున్= అవమానాలను; ఈఁగుము= ఇప్పుడు తీర్చుకో.

**తా :** కళింగ దేశప్రభువు రుక్మిముఖంవైపు చూచి, హెచ్చరిస్తున్నట్లుగా, నీ యొక్క అవమానాన్ని తీర్చికొనేందుకు ఇదే సరైన సమయం అని చెప్పాడు. బలరామునికి జూదమాడే కోరిక ఉంది. కాని, ఆటయందు నేర్పరికాడు. ఆతడు నీకు విజయమిస్తాడు. నీవు పూర్వం పడ్డ అవమానాలు తీర్చుకో.

**క. అని పురికొల్పిన రుక్మియుఁ, దనచేటు దలంపలేక తాలాంకుని తో**
**డన జూదమాడఁ దివిరెను, వనజాసనుకృతము గడచు వా రెవ్వ రిలన్? 291**

**ప్రతి :** అని= ఈ విధంగ; పురికొల్పినన్= ప్రోత్సహించగా; రుక్మియున్= రుక్మికూడ; తనచేటున్= తన కీడును; తలంపలేక= ఊహించలేక; తాల+అంకుని= తాటిచెట్టుబొమ్మ ధ్వజంగాగల బలరాముని; తోడన= తోడ; జూదము+ఆడన్= జూదమాడుటకు; తివిరెను= అంగీకరించాడు; ఇలన్= భూమిమీద; వనజ+ఆసను= బ్రహ్మచే; కృతము= చేయబడినదాన్ని; కడచువారు= దాటగలవారు; ఎవ్వరు? (ఎవ్వరూలేరని భావం)

**తా :** ఈ విధంగా కళింగదేశరాజు రుక్మిని ప్రోత్సహించాడు. రుక్మికోరికను బలరాముడు అంగీకరించాడు. విధివ్రాతను ఎవరు తప్పించగలరు?

**వ. అంత. 292**

**ప్రతి :** అంత= అంతట...

**క. కోరి విదర్భుఁడు కుటిల వి, హారుండై పిలిచె జూదమాడ జితారిన్**
**హారిన్ సన్నుతసూరిన్, సీరిన్ రైవతసుతార్ద్రచిత్తవిహారిన్. 293**

**ప్రతి :** కోరి= తగవుకోరి; విదర్భుఁడు= రుక్మి; కుటిల= కపట; విహారుండు+ఐ= వినోదియై; జిత+అరిన్= జయించబడిన శత్రువుల్ని కలవాణ్ణి; హారిన్= ముత్యాలుహారాలు ధరించినవాణ్ణి; సన్నుతసూరిన్= పొగడబడిన పండితులు గలవాణ్ణి; రైవతసుతా+ఆర్ద్రచిత్త విహారిన్= రేవతియొక్క మృదువైన మనస్సునందు విహరించేవాణ్ణి; అయిన; సీరిన్= నాగలి ఆయుధంగా గల బలరాముణ్ణి; జూదము+ఆడన్= జూదమాడుటకు; పిలిచెన్= పిలిచాడు.

**తా :** రుక్మి కావాలనే కపటవినోదియై బలరాముణ్ణి జూదమాడటానికి పిలిచాడు.

**ఆ. 'పూని మనము గొంత ప్రొద్దువోకకు రామ!, నెత్త మాడ నీవు నేర్తు వనఁగ**
**విందు, మిపుడు గొంతవెల యొడ్డి యాడుద' మనిన బలుఁడు లెస్స యని చెలంగె. 294**

**ప్రతి :** రామ!= బలరామా!; పూని= శ్రద్ధతో; మనము= నీవూ, నేనూ; కొంత= కొద్దిగ; ప్రొద్దుపోకకున్= కాలక్షేపానికి; నెత్తము+ఆడన్= పాచికలాటను ఆడుటను; నీవు; నేర్తువు (నేర్చుదువు)+అనఁగ= అభ్యసించితివి అని; విందుము= వినియున్నాము; ఇపుడు= ఇప్పుడు; కొంత= కొద్దిగ; వెల+ఒడ్డి= పందెంవేసి; ఆడుదుము+అనిన= ఆడుదమని చెప్పగా; బలుఁడు= బలరాముఁడు; లెస్స= బాగుంది, సరే; అని= అని; చెలంగెన్= ఉత్సాహపడ్డాడు.

**తా :** ఓ బలరామ! పాచికలాట నీకు తెలుసునని విని ఉన్నాను. కనుక, కాలక్షేపానికి పాచికలు పందెంవైచి ఆడదాం – ఆడదాం అనగానే బలరాముడు ఉత్సాహం చూపాడు.

**క. మదిలోని చలము డింపక, పది యిరువది నూఱు వేయి పదివే లిదె ప**
**న్నిద మని యొడ్డుచు నాడిరి, మదమున నిద్దఱును దురభిమానము పేర్మిన్. 295**

**ప్రతి :** మదిలోని= మనస్సులోని; చలమున్= పట్టుదలను; డింపక= వదలక; పది= పది; ఇరువది= ఇరవై; నూఱు= వంద; వేయి= వెయ్యి; పదివేలు= పదివేలు; ఇది+ఎ= ఇదే; పన్నిదము+అని= పందెమని; ఒడ్డుచున్= పందెంవేస్తూ; ఆడిరి= పాచికల ఆటను ఆడారు; ఇద్దఱున్= రుక్మియు, బలరాముడును; మదమునన్= గర్వంతో; దుర్+అభిమానము= చెడ్డ అభిమానంయొక్క; పేర్మిన్= ఆసక్తితో; ఆడిరి= పాచికలు ఆడారు.

**తా :** మనస్సులోని పట్టును వదలక పది, ఇరవై, నూరు, వేయి, పదివేలు అంటూ పందెం వేస్తూ, రుక్మియు, బలరాముడును దురభిమానంతో పాచికలాటను ఆడసాగారు.

**ఉ. ఆడిన యాటలెల్లను హలాయుధుఁ డోడిన రుక్మి గెల్చుడున్**
**దోడి నృపాలకోటి పరితోషముఁ జెందఁ గళింగభూవిభుం**
**'డోడె బలుం'డటంచుఁ బ్రహసోక్తుల నెంతయు రాముఁ జుల్కఁగా**
**నాడెను దంతపంక్తి వెలి యై కనుపట్టఁగఁ జాల నవ్వుచున్. 296**

**ప్రతి :** హల+ఆయుధుఁడు= నాగలి ఆయుధంగా కలిగినవాఁడు – బలరాముడు; ఆడినఆటలు+ఎల్లను= ఆడిన ఆటలన్నీ; ఓడినన్= ఓడిపోగా; రుక్మి= రుక్మి; గెల్చుడున్= గెలవటంతో; తోడి= వెంటనున్న; నృపాలకోటి= రాజసమూహం;

పరితోషమున్+చెందన్+కన్= సంతోషాన్ని పొందగా; బలుండు= బలరాముఁడు; ఓడెన్+అటంచున్= ఓడిపోయాడంటూ; కళింగభూవిభుండు= కళింగదేశపు ప్రభువు; ప్రహస+ఉక్తులన్= పరిహాసంతో కూడిన మాటలను; ఎంతయున్= ఎంతగానో; దంతపంక్తి= పలువరుస; వెలియై= బయటికి; కనుపట్టన్+కన్= కన్పించగా; చాలన్= ఎక్కువగ; నవ్వుచున్= నవ్వుతు; రామున్= బలరాముణ్ణి; చుల్కన్+కాన్= చాలా చుల్కనగా; ఆడెన్= మాట్లాడినాడు.

**తా :** బలరాముడు ఆడిన ప్రతి ఆటా ఓడిపోవడంవల్ల శత్రురాజసమూహానికి సంతోషం కలిగింది. బలరాముణ్ణి పరిహాసమాడుతూ అవమానపరుస్తూ కళింగరాజు వేళాకోళపుమాటలు పలుకసాగాడు.

**తే. బలుఁడు కోపించి యొకలక్ష పణము సేసి, యాడి ప్రకటంబుగా జూద మపుడు గెల్చె,**
**గెల్చినను రుక్మి 'యిది యేను గెల్చియుండ, గెలుపు నీ దని కికురింప నలవి యగునె? 297**

**ప్రతి :** బలుఁడు= బలరాముడు; కోపించి= కోపంపొంది; ఒక= ఒక; లక్ష= లక్ష; పణము+చేసి= పందెంకట్టి; ఆడి= ఆడి; ప్రకటంబుగా= స్పష్టంగా; అపుడు= అప్పుడు; జూదము= జూదాన్ని; గెల్చెన్= గెల్చాడు; గెల్చిననున్= గెలిచినప్పటికీ రుక్మి; ఇది+ఏను= ఈ ఆటను నేను; గెల్చియుండన్= గెలువగా; గెలుపు= విజయం; నీది+అని= నీకు చెందిందని; కికురింపన్= మోసగించడానికి; అలవి+అగునె= శక్యమవుతుందా?

**తా :** బలరాముడు కోపంతో ఒక లక్షపందెం కట్టి, ఆట గెల్చాడు. నేను పందాన్ని గెలిస్తే, విజయం నీదని మోసగిస్తున్నావా? అని రుక్మి పలికినాడు.

**తే. అనవుడు హలధరుఁ డచ్చుటి, జనపాలకసుతులఁ జూచి సత్యము పలుకుం**
**దని యడిగిన వారలు రు, క్మనిహితులై పలుకరైరి మొగమోటమునన్. 298**

**ప్రతి :** అనవుడున్= అనినపిమ్మట; హలధరుఁడు= బలరాముడు; అచ్చుటి= అచ్చట ఉన్న; జనపాలకసుతులన్+చూచి= రాజకుమారులను చూచి; సత్యము= నిజాన్ని; పలుకుండు+అని= చెప్పండని; అడిగినన్= అడగగా; వారలు= వారు; రుక్మని= రుక్మిప్రభువుయొక్క; హితులు+ఐ= ఆప్తులగుటచే; మొగమోటమునన్= మొగమోటమిచేత; పలుకరు+ఐరి= సమాధానం చెప్పలేదు.

**తా :** బలరాముడు అచ్చట ఉన్న రాజకుమారుల్ని చూచి, నిజం చెప్పండని కోరాడు. వారు రుక్మి పక్షంవాళ్లు కనుక మొగమోటమి చెంది సమాధానం చెప్పలేదు.

**ఉ. అప్పటి యట్ల యొడ్డి ముసలాయుధుఁ డేపున నాడి జూదముం**
**జొప్పడ గెల్చి యీ గెలుపు సూడఁగ నాదియొ వానిదో జనుల్**
**దప్పక చెప్పుఁ డన్న విదితధ్వనితో నశరీరవాణి తా**
**నిప్పటియాట రాముఁడె జయించె; విదర్భుఁడె యోడె నావుడున్. 299**

**ప్రతి :** అప్పటి అట్ల= పూర్వంవలె; ఒడ్డి= పందెం వైచి; ముసల+ఆయుధుఁడు= బలరాముడు; ఏపునన్+ఆడి= ఆధిక్యంతో ఆడి; జూదమున్+చొప్పు+పడన్= జూదంలో సరిపడగా; గెల్చి= జయించి; ఈ గెలుపు= ఈ విజయం; చూడన్+కన్= చూచి; నాది+ఒ= నాదా?; వానిది+ఓ= (రుక్మిదో) వానిదా?; తప్పక= తప్పనిసరిగ; చెప్పుఁడు+అనినన్= చెప్పవలసిందనగా;

విదిత= స్పష్టమైన; ధ్వనితోన్= శబ్దంతో; అశరీరవాణి= ఆకాశవాణి; తాన్= తాను; ఇప్పటి ఆట= ప్రస్తుతం ఆడిన ఆట; రాముడు+ఎ= బలరాముడే; జయించెన్= గెలిచాడు; విదర్భుడె= విదర్భదేశానికి రాజైన రుక్మి (రుక్మిణి అన్నగారు); ఓడెన్= ఓడిపోయాడు; నావుడున్= అనగా...

**తా :** బలరాముడు పందెంవేసి మరో ఆటలో కూడా గెలిచాడు. ఈ విజయం నాదా? రుక్మిదా? అని అచ్చట ఉన్నవారిని అడిగాడు. అప్పుడు ఆకాశవాణి ఈ ఆటను బలరాముడే గెల్చాడు. రుక్మి ఓడిపోయా డని స్పష్టంగా చెప్పింది. తర్వాత

**వ. అనిన విని సకలజనంబులు నద్భుతానందనిమగ్నమానసులైరి. కుటిలస్వభావు లయిన భూవరులు రుక్మిం గైకొల్పిన నతండు తన తొల్లింటి పరాభవము దలంచి యెదిరిం దన్ను నెఱుంగక బలాబలవివేకంబు సేయనేరక విధివశానుగతుండై చలంబున బలునిం గని "యిప్పటియాటయు నేన గెల్చియుండ వృథా జల్పకల్పనుండవయి 'గెల్చితి" నని పల్కెద, వక్షవిద్యానైపుణ్యంబు గల భూపకుమారులతోఁ బసులకాపరు లెత్తువత్తురే" యని క్రొవ్వన నవ్వుచుం బలికిన న ప్పలుకులు సెవులకు ములుకుల క్రియం దాఁకినఁ గోపోద్దీపిత మానసుండై పెట పెటం బండ్లు గొఱుకుచుం గన్నుల నిప్పు లుప్పతిల్లం గినుకం దోఁక ద్రొక్కిన మహోరగంబు నోజ రోఁజుచు దండతాడితం బయిన పుండరీకంబులీల హుమ్మని మ్రోయుచుఁ బ్రచండబాహుదండంబులు సాఁచి, పరిఘం బందుకొని పరిపంథియైనరుక్మిని నతని కనుకూలంబయిన రాజలోకంబును బడలుపడ నడిచె, న య్యవసరంబున. 300**

**ప్రతి :** అనినన్= అనగా; విని= విని; సకలజనంబులున్= ప్రజలందరు; అద్భుత+ఆనంద= ఆశ్చర్యకరమైన సంతోషంలో; నిమగ్న= మునిగిన; మానసులు+ఐరి= మనస్సు కలిగినవారైరి; కుటిలస్వభావులు+అయిన= మోసపుస్వభావం కలిగిన; భూవరులు= రాజులు; రుక్మిన్+కైకొల్పినన్= రుక్మినిరెచ్చగొట్టగా; అతండు= ఆ రుక్మి; తన= తనయొక్క; తొల్లింటి= పూర్వపు; పరాభవమున్+తలంచి= పరాభవాన్ని (అవమానము) తలచుకొని; ఎదిరిన్+తన్నున్= ఎదుటివానిని; తనను; ఎఱుంగక= తెలుసుకొనలేక; బలాబలవివేకంబు చేయనేరక= బలాన్నీ, దౌర్బల్యాన్నీ తెలుసుకొనలేక; విధివశ+అనుగతుఁడు= విధికి లోబడినవాడై; చలంబునన్= పట్టుదలతో; బలునిన్= బలరాముణ్ణి; కని= చూచి; ఇప్పటి= ఈ పర్యాయం; ఆటయున్= ఆటనుకూడ; నేన్+అ= నేనే; గెల్చి+ఉండన్= గెలువగా; వృథా= వ్యర్థమైన; జల్పకల్పనుండవు= వదరుబోతువు; అయి= అయి; గెలిచితిన్+అని= గెలిచాను అని; పల్కెదవు= మాట్లాడుతున్నావు; అక్షవిద్యానైపుణ్యంబు= పాచికల ఆటలో నేర్పరితనం; కల= కలిగిన; భూపకుమారులతోన్= రాజకుమారులతో; పసులకాపరులు= పశువులను కాసేవారు; ఎత్తువత్తురే= సాటిరాగలరా?; క్రొవ్వునన్= మదంతో; నవ్వుచున్= నవ్వుతూ; పలికినన్= పలుకగా; ఆ+పలుకులు= ఆ మాటలు; చెవులకున్= చెవులకు; ములుకులక్రియన్+తాఁకినన్= సూదులవలె తగులగా; కోప+ఉద్దీపిత= కోపంచేత మిక్కిలి ప్రకాశించిన; మానసుండు+ఐ= మనస్సు కలిగినవాడై; పెటపెటన్= పటపట; పండ్లున్= దంతములను; కొఱుకుచున్= కరచుచు; కన్నులన్= కళ్ళలో; నిప్పులు= నిప్పులు; ఉప్పతిల్లన్= కలుగగా; కినుకన్= కోపంతో; తోఁక= తోక; త్రొక్కిన= తొక్కినట్టి; మహా+ఉరగము= పెద్దపాము; ఓజన్= విధాన; రోజుచున్= నిట్టూర్చుచు; దండ= కఱ్ఱచే; తాడితంబు+అయిన= కొట్టబడిన; పుండరీకంబులీల= పెద్దపులివలె; హుమ్మని మ్రోయుచున్= హుంకరిస్తూ; ప్రచండ= దృఢమైన; బాహుదండంబులు చాచి= చేతుల్ని చాచి; పరిఘంబు+అందుకొని= ఇనుపగుదియ తీసుకొని; పరిపంథి+ఐన= శత్రువైన; రుక్మినిన్= రుక్మినీ; అతనికిన్+అనుకూలంబు+ఐన= రుక్మికి అనుకూలురు అయిన; రాజలోకంబును= రాజులసమూహాన్ని; బడలుపడన్= చచ్చేట్టుగా; అడచెన్= మోదాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** ఆకాశవాణి మాటలు విని, అక్కడివారంతా సంతోషించారు. రాజులలో కొందరు కపటస్వభావంతో రుక్మిని ప్రేరేపించగా అతడు "ఈ ఆటను కూడ నేనే గెల్చాను. కాని, నీవు వ్యర్థంగా వక్రమైన మాటలు చెబుతున్నావు అంటూ జూదమాడటంలో నేర్పరులైన రాకుమారులతో పసులకాపరులు సరితూగగలరా?" అని పల్కాడు. ఆ మాటలకు బలరాముడు తోక త్రొక్కిన పాములాగా, కొట్టబడిన పెద్దపులిలాగా విజృంభించి బలమైన చేతులు చాచి రుక్మినీ, అతనికి అనుకూలురైన రాజుల్నీ ఇనుపగుదెతో చావమోదాడు.

**క. మును దంతపంక్తి వెలిగాఁ, దను నవ్విన య క్కళింగుఁ దల వట్టి రయం**
**బునఁ బడఁ దిగిచి వదన మే, పునఁ బెడచే వ్రేసి దంతములు వెస డులిచెన్. 301**

**ప్రతి :** మును= ముందుగా; దంతపంక్తి= పలువరుస; వెలి+కాన్= బయటకు వచ్చేటట్లు; తనున్= తనను (చూచి); నవ్విన= ఎగతాళి చేసిన; ఆ+కళింగున్= ఆ కళింగప్రభువును; తల+పట్టి= తలపట్టుకొని; రయంబునన్= వేగంగా; పడన్= పడునట్లు; తిగిచి= ఈడ్చి; వదనము= ముఖాన్ని; ఏపునన్= అతిశయంతో; పెడచేన్= ఎడమచేతితో; వ్రేసి= కొట్టి; దంతములు= పండ్లను; వెసన్= వేగంగా; డులిచెన్= రాల్చాడు.

**తా :** ఇంతకుముందు తనను చూచి నవ్విన కళింగ ప్రభువును కిందికి పడవైచి ఎడమచేతితో ముఖంపై ఒకదెబ్బ వేయగానే వాని పండ్లు ఊడి పడిపోయాయి.

**క. అంతం బోవక రుక్మిని, దంతంబులు మున్ను డులిచి తను వగలింపన్**
**అంతకుపురి కేగెను వాఁ, డెంతయు భయ మంది రాజు లెల్లం గలఁగన్. 302**

**ప్రతి :** అంతన్+పోవక= అంతటితో ఆగక; రుక్మిని= రుక్మియొక్క; దంతంబులు= పండ్లు; మున్ను= పూర్వమే; డులిచి= ఊడగొట్టి; తనువున్+అగలింపన్= శరీరాన్ని భేదించగా; రాజులు+ఎల్లన్= రాజులందరును; కలఁగన్= కలతపడగా; ఎంతయున్= ఎంతగానో; భయము+అంది= భయపడి; వాఁడు= రుక్మి; అంతకుపురికిన్= యముని నగరానికి; ఏగెను= వెళ్లాడు.

**తా :** అంతటితో ఆగక, రుక్మియొక్కపండ్లు ముందే ఊడగొట్టి, శరీరాన్ని భేదింపగా రాజులందరూ భయపడేటట్లుగా వాణ్ణి యముని నగరానికి పంపాడు (చంపాడని భావం).

**వ. అట్లుచేసి య య్యాదవసింహం బసహ్యావిక్రమంబునం జెలంగె నంత. 303**

**ప్రతి :** అట్లు= ఆ విధంగ; చేసి; ఆ+యాదవసింహంబు= ఆ యాదవసింహం అయిన బలరాముడు; అసహ్యా= సహింప వీలుకాని; విక్రమంబునన్= పరాక్రమంచేత; చెలంగెన్= ఒప్పాడు; అంతన్= ఆ తర్వాత...

**తా :** ఆ విధంగా యాదవ సింహమైన బలరాముడు అసామాన్య పరాక్రమంతో విజృంభించాడు.

**క. భూవర! పద్మాక్షుఁడు దన, బావ హతుం డగుట గనియుఁ బలుకక యుండెన్**
**భావమును రుక్మిణీ బల, దేవుల కే మనఁగ నెగ్గు దేరునొ? యనుచున్. 304**

**ప్రతి :** భూవర!= పరీక్షిన్మహారాజా!; పద్మ+అక్షుఁడు= పద్మాలవంటి నేత్రాలు కలిగినవాడు- శ్రీకృష్ణుడు; తన= తనయొక్క; బావ= బావమరదియగు రుక్మి; హతుండు+అగుటయున్= చావగా; కనియున్= చూచికూడా; రుక్మిణీ= భార్యయగురుక్మిణికి;

బలదేవులకు= సోదరుడగు బలరామునికీ; ఏమి+అనన్+కన్= ఏమి మాట్లాడితే; ఎగ్గు= కీడు; తేరునో= కలుగుతుందో; అనుచున్= అనుకొంటూ; భావమును= తన అభిప్రాయాన్ని; పలుకక ఉండెన్= ప్రకటించలేదు.

**తా :** శ్రీ కృష్ణునకు తన బావమరదియగు రుక్మి హతుడైన విషయం తెలిసినా కూడా భార్య రుక్మిణి, సోదరుడు బలరాముడు ఏమి అనుకుంటారో అని తన అభిప్రాయం ప్రకటించలేదు.

**వ. అంత నా విదర్భానగరంబు నిర్గమించి. 305**

**ప్రతి :** అంతన్= ఆ తర్వాత; ఆ= ఆ; విదర్భానగరంబున్= విదర్భ అను నగరంనుంచి; నిర్గమించి= వెడలి...

**తా :** రుక్మి బలరామునిచే చంపబడిన తర్వాత వారు విదర్భానగరం నుండి బయలుదేరి

**క. పరమానురాగరస సం, భరితాంతఃకరణు లగుచుఁ బాటించి వధూ**
**వరులను రథమం దిడి హల, ధరహరిరుక్మిణులఁ గొల్చి తగ యదువీరుల్. 306**

**ప్రతి :** యదువీరుల్= యాదవవీరులు; పరమ+అనురాగ= మేలైనప్రేమ అనే; రస= రసంచే; సంభరిత= నింపబడిన; అంతఃకరణులు= మనస్సుకలిగినవారు; అగుచున్= అవుతూ; పాటించి= ఆదరంతో; వధూవరులను= పెండ్లికుమార్తెను, పెండ్లికుమారుణ్ణీ; రథము+అందు+ఇడి= రథంలో ఉంచి; హలధర+హరి+రుక్మిణులన్= బలరాముణ్ణి, శ్రీకృష్ణుణ్ణి, రుక్మిణీదేవిని; కొల్చి= సేవించి...

**తా :** యాదవవీరులు ఎంతో ప్రేమ ఉప్పొంగే హృదయంతో, ఆదరంతో, వధూవరులను రథంలో కూర్చుండబెట్టి, బలరాముని, శ్రీకృష్ణుని, రుక్మిణీదేవిని సేవించి

**ఉ. మంగళతూర్యఘోషము లమందగతిం జెలఁగంగ మత్త మా**
**తంగ తురంగసద్భటకదంబముతోఁ జని కాంచి రంత నా**
**రంగ లవంగలుంగవిచరన్మదభృంగసురంగనాద స**
**త్సంగతరంగిణీకలిత సంతతనిర్మల నా కుశస్థలిన్. 307**

**ప్రతి :** న+మందగతిన్= పెద్దపెట్టున; మంగళ= శుభప్రదాలైన; తూర్యఘోషములు= వాద్యాల శబ్దాలు; చెలగన్+కన్= వ్యాపించగా; మత్త= మదించిన; మాతంగ= ఏనుగుల; తురంగ= గుర్రాల; సత్+భట= మంచిభటులయొక్క; కదంబముతోన్+చని= సమూహంతో వెళ్ళి; నారంగ= నారింజ; లవంగ= లవంగాల; లుంగ= పుల్ల మాదీఫలంచెట్లలో; విచరత్= స్వేచ్ఛగా సంచరించే; మద= మదించిన; భృంగ= తుమ్మెదల; సురంగ= మనోహరమైన; నాద= శబ్దంతో; సత్+సంగ= చక్కగా కూడుకొన్న; తరంగిణీ= నదులతో; కలిత= కూడిన; సంతత= ఎల్లపుడు; నిర్మలన్= స్వచ్ఛమైనదాన్ని; ఆ= ప్రసిద్ధమైన; కుశస్థలిన్= కుశస్థలీ నగరాన్ని; అంతన్= అప్పుడు; కాంచిరి= చూచారు.

**తా :** శుభకరాలైన వాద్యాలశబ్దం పెద్దపెట్టున వ్యాపించగా, మదించిన ఏనుగులతో, గుర్రాలతో, ఉత్తములైన సైనికులతో వెళ్ళి, నారింజ, లవంగ, మాదీ ఫలవృక్షాలలో స్వేచ్ఛగా సంచరిస్తున్నవై మదించిన తుమ్మెదల ఝుంకారనాదాలతో, నిరంతరం పుణ్యనదులతో కూడి స్వచ్ఛతనొందిన కుశస్థలీనగరాన్ని చూచారు.

**వ. ఇట్లు పురోపవనోపకంఠంబునకుం జని. 308**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పుర+ఉపవన= నగరంలోని ఉద్యానవనంయొక్క; ఉపకంఠంబునకున్= సమీపస్థలానికి; చని= వెళ్ళి...

**తా :** ఈ విధంగా కుశస్థలీపురంలోని ఉద్యానవన సమీపానికి వెళ్ళి

**క. అందు వసించిరి నందిత, చందనమందారకుందచంద్రలస న్మా**
**కందముల నీడ హృదయా, నందము సంధిల్ల నందనందనముఖ్యుల్. 309**

**ప్రతి :** అందున్= ఆ ఉద్యానవనంలో; నందనందనముఖ్యుల్= బలరామకృష్ణులు మొదలైన ప్రముఖులు; నందిత= ఆనందకరంగా (పోషించబడిన); చందన= గంధపుచెట్లయొక్క; మందార= మందారం చెట్లయొక్క; కుంద= గన్నేరు చెట్లయొక్క; చంద్ర= ఏలకుల తీగలయొక్క; లసత్= ప్రకాశించే; మాకందముల= మామిడిచెట్లయొక్క; నీడన్= నీడలో; హృదయ+ఆనందము= మనస్సుకు సంతోషం; సంధిల్లన్= ఏర్పడగా; వసించిరి= విడిది చేశారు.

**తా :** ఆ ఉద్యానవనంలో చందన, మందార, కుంద, చూతవృక్షాసల నీడలలో బలరామ, కృష్ణులు మొదలగువారు విడిది చేశారు.

**వ. తదనంతరంబ పురప్రవేశంబు సేసి రని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షి న్నరేంద్రున కిట్లనియె. 310**

**ప్రతి :** తద్+అనంతరంబు= ఆ తరువాత; పురప్రవేశంబు= నగరప్రవేశం; చేసిరి+అని= చేశారని; శుకయోగి+ఇంద్రుడు= శ్రేష్ఠుడైన శుకయోగి; పరీక్షిత్+నర+ఇంద్రునకున్= పరీక్షిత్‌మహారాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తా :** తరువాత నగరప్రవేశం చేసినా రని శుకమహర్షి పరీక్షితుకు చెప్పాడు.

## ❖ బాణాసురుం డీశ్వర ప్రసాదంబు నొందుట ❖

**తే. అనఘ! బలినందనులు నూర్వు రందులోన, నగ్రజాతుండు బాణుఁ డత్యుగ్రమూర్తి**
**చిరయశోహారి విహితపూజితపురారి, యహితతిమిరోష్ణకరుఁడు సహస్రకరుఁడు. 311**

**ప్రతి :** అనఘా!= పుణ్యాత్ముడా!; (పరీక్షిన్మహారాజా!); బలినందనులు= బలికుమారులు; నూర్వురు= వందమంది; అందులోనన్= వారిలో; అతి+ఉగ్రమూర్తి= మిక్కిలి తీక్షణమైనవాడు; చిర= దీర్ఘకాలం; యశోహారి= యశస్సుచేత మనోహరుడు; విహిత= తగినవిధంగా; పూజిత= పూజింపబడిన; పుర+అరి= పురములకు శత్రువైనవాని (శివుని) కలవాడు; అహిత= శత్రువులనే; తిమిర= చీకటికి; ఉష్ణకరుఁడు= సూర్యుడు; సహస్రకరుఁడు= వేయిచేతులు కలవాడు అయిన; బాణుఁడు= బాణుడు; అగ్రజాతుండు= మొదట పుట్టినవాడు (ప్రథమసంతానం).

**తా :** పాపరహితుడవైన పరీక్షిన్మహారాజా! బలికి వందమంది కుమారులు. అందులో మిక్కిలి తీక్ష్ణమైనవాడు, దీర్ఘయశస్సు పొందినవాడు, శివుణ్ణి పూజించినవాడు, శత్రువులు అనే చీకటికి సూర్యుడు, వేయిచేతులను కలిగినవాడు, బలికి ప్రథమసంతానమైనవాడు బాణుడు.

**క. బాణుఁడు విక్రమజిత గీ, ర్వాణుఁడు సని కాంచె భక్తివశుఁడైన గణ**
**స్థాణున్ నిర్దళితాసమ, బాణుం దాండవధురీణు భక్తత్రాణున్. 312**

**ప్రతి :** భక్తివశుఁడు+ఐన= భక్తికి లోబడినవాడయిన; గణస్థాణున్= ప్రమథగణాలతో కూడిన శివుణ్ణి; నిర్+దళిత+ అసమబాణున్= ఛేదింపబడిన విషమబాణాలున్న మన్మథుడు గలవాణ్ణి; తాండవధురీణున్= తాండవనాట్యంలో నేర్పు కలిగినవాణ్ణి; భక్తత్రాణున్= భక్తులకు రక్షకుడైన శివుణ్ణి; విక్రమ జితగీర్వాణుఁడు= తన పరాక్రమంచే దేవతలను జయించిన; బాణుఁడు= బాణుడు; చని= కైలాసానికి వెళ్ళి; కాంచెన్= చూచాడు.

**తా :** తన పరాక్రమంచేత దేవతలను జయించిన బాణుడు కైలాసానికి వెళ్లి భక్తివశుడూ, ప్రమథగణాలతో కూడినవాడూ, మన్మథుణ్ణి జయించినవాడు, తాండవనాట్యంలో నిపుణుడైనవాడు, భక్తరక్షకుడూ అయిన శివుణ్ణి చూశాడు.

**క. కని యనురాగవికాసము, దన మనమునఁ గడలుకొనఁగ ధరఁ జాఁగిలి వం**
**దన మాచరించి మోదము, దనరఁగఁ దాండవము సలుపు తఱి నయ్యభవున్. 313**

**ప్రతి :** అనురాగ= కూరిమియొక్క; వికాసము= పెరుగుట; తన= తనయొక్క; మనమునన్= మనస్సులో; కడలుకొనన్+కన్= కలుగగా; ధరన్+చాగిలి= భూమిపై సాగిలబడి; వందనము+ఆచరించి= నమస్కరించి; మోదము+తనరన్+కన్= సంతోషం ఒప్పుతుండగా; తాండవము= తాండవనృత్యం; సలుపు= చేసే; తఱిన్= సమయాన; ఆ+అభవుని= ఆ శివుణ్ణి; కని= చూచి...

**తా :** తన మనస్సులో, కూర్మి అధికం కావడంతో భూమిపై సాగిలఁబడి నమస్కరించి తాండవనృత్యం చేసే సమయంలో శివుణ్ణి చూచి

**ఉ. సంచితభూరిబాహుబలసంపద పెంపున నారజంబు వా**
**యించి యనేకభంగుల సుమేశుఁ ద్రిలోకశరణ్యు నాత్మ మె**
**చ్చించి ప్రమోదియై నిజవశీకృత నిశ్చలితాంతరంగుఁ గా**
**వించి తదాననాంబురుహ వీక్షణుఁడై తగ మ్రొక్కి యిట్లనున్. 314**

**ప్రతి :** సంచిత= సంపన్నమైన; భూరి= అధికమైన; బాహుబల= బాహుబలమన్తే; సంపద= సంపదయొక్క; పెంపునన్= అతిశయంవల్ల; ఆరజంబు= వాద్యం; వాయించి= మ్రోగించి; అనేక భంగులన్= పెక్కు రీతుల; ఉమా+ఈశు= శివుణ్ణి; త్రిలోకశరణ్యున్= మూడులోకాలకు రక్షకుడైనవాణ్ణి; ఆత్మన్= మనస్సులో; మెచ్చించి= మెప్పించి; ప్రమోదియై= సంతోషించినవాడై; నిజవశీకృత= తనకులోబడిన; నిస్+చలిత= స్థిరమగు; అంతరంగునిన్+కావించి= మనస్సు కలిగిన వాణ్ణిగా చేసి; తద్= వానియొక్క; ఆనన+అంబురుహ= పద్మంవంటి ముఖాన్ని; వీక్షణుఁడు+ఐ= చూచినవాడై; తగన్= ఉచితరీతిని; మ్రొక్కి= మ్రొక్కి; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తా :** బాణుడు తన బాహుశక్తికి తగినట్లుగా వాద్యం వాయిస్తూ త్రిలోకరక్షకుడైన శివుణ్ణి సంతోష పరచి, ఉచితరీతిలో ప్రశంసించి మ్రొక్కి ఈ విధంగా పలికాడు.

**ఉ. శంకర! భక్తమానసవశంకర! దుష్టమదాసురేంద్ర నా**
**శంకర! పాండునీలరుచిశంకరవర్ణనిజాంగ! భోగి రా**
**ట్కంకణ! పార్వతీహృదయకైరవకైరవమిత్ర! యోగి హృ**
**త్పంకజపంకజాప్త! నిజతాండవఖేలన! భక్తపాలనా! 315**

**ప్రతి :** శంకర= సుఖాన్ని కల్గించేవాడా!; భక్త= భక్తుల; మానస= హృదయాల్ని; వశంకర= లోబరచుకొనేవాడా!; దుష్ట= చెడ్డవారైన; మద+అసుర+ఇంద్ర= దురహంకారులైన రాక్షస ప్రముఖుల్ని; నాశంకర!= నాశనం చేసేవాడా!; పాండునీలరుచి= తెల్లని, నల్లని కాంతులచే; శంకర= శుభప్రదమైన; వర్ణ= రంగుగల; నిజ+అంగ= స్వశరీరం గలవాడా!; భోగిరాట్= సర్పరాజైన వాసుకిని; కంకణ= చేతికడియంగా గలవాడా!; పార్వతీహృదయ= పార్వతీదేవిహృదయమనే; కైరవ= తెల్లకలువకు; కైరవమిత్ర= కలువలకు మిత్రుడైన చంద్రునివంటివాడా!; యోగి= యోగుల; హృత్+పంకజ= హృదయపద్మాలకు; పంకజ+ఆప్త= పద్మాలకు మిత్రుడైన సూర్యునివంటివాడా!; నిజ= తనయొక్క; తాండవఖేలన= తాండవమనే నృత్యంచేతనే క్రీడించేవాడా!; భక్తపాలనా!= భక్తులను ఏలుకొనువాడా.

**తా :** సుఖప్రదుడవైన ఈశ్వరా! భక్తుల హృదయాలను వశపర్చుకొన్నవాడా!, దురహంకారులైన రాక్షసులను నాశనం చేసేవాడా! ధవళనీలవర్ణ శరీరంకలవాడా!, వాసుకిని చేతికడియంగా ధరించినవాడా!, పార్వతీహృదయేశ్వరా!, యోగులహృదయ వికాసకారకా!, తాండవనృత్య క్రీడయందు ఆసక్తి కలవాడా!, భక్తులను కాపాడేవాడా! నీకు నమస్కారం.

**విశే :** శివుడు అర్ధనారీశ్వరుడు - కుడివైపు తెలుపు, ఎడమవైపు నలుపు వర్ణం కలవాడు. శివుడు తెలుపు, పార్వతి నలుపు- కనుక ధవళనీలవర్ణుడు.

**వ. అని వినుతించి. 316**

**ప్రతి :** అని= అని; వినుతించి= స్తుతించి...

**తా :** అని స్తుతించి

**ఉ. దేవ! మదీయవాంఛితము తేటపడ న్నిటు విన్నవించెదన్**
**నీవును నద్రినందనయు నెమ్మిని నా పురికోటవాకిటం**
**గావలియుండి నన్నుఁ గృపఁ గావుము భక్తఫలప్రదాత! యో**
**భావభవారి! నీ చరణపద్మము లెప్పుడు నాశ్రయించెదన్. 317**

**ప్రతి :** దేవ= దేవా!; భక్తఫలప్రదాత= భక్తులకు వరాలిచ్చేవాడా!; ఓ భావభవ+అరి= ఓ మన్మథునికి శత్రువైనవాడా!; మదీయ= నాయొక్క; వాంఛితము= కోరిక; తేటపడన్= స్పష్టంగా; ఇటు= ఇలా; విన్నవించెదన్= మనవిచేస్తాను; నీవును= నీవును; అద్రినందనయున్= పర్వతరాజకుమార్తెయును (పార్వతీదేవియు); నెమ్మినిన్= ప్రేమతో; నా= నాయొక్క; పురి= పట్టణయొక్క; కోట= ప్రహరికోటయొక్క; వాకిటన్= ప్రధానద్వారంలో; కావలి+ఉండి= రక్షకులుగా ఉండి; నన్నున్= నన్ను; కృపన్= దయతో; కావుము= కాపాడుము; నీ= నీయొక్క; చరణపద్మములు= పాదపద్మాలను; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; ఆశ్రయించెదన్= శరణు జొచ్చి జీవిస్తాను.

**తా :** ఓ శివా! నా మనస్సులోని కోరిక నీకు స్పష్టంగా చెబుతాను. నీవూ, పార్వతీదేవీ నా నగరంలో కోటరక్షకులుగా ఉండాలి. నేను ఎల్లప్పుడూ మీ పాదపద్మాలనే ఆశ్రయించి ఉంటాను.

**వ. అని యభ్యర్థించినం బ్రసన్నుండై భక్తవత్సలుం డగు పురాంతకుండు గౌరీసమేతుండై తారకాంతక గజాననాదిభూతగణంబులతో బాణనివాసం బగు శోణపురంబు వాకిటం గాఁపుండెఁ, బదంపడి యొక్కనాఁ డబ్బలినందనుండు. 318**

**ప్రతి :** అని; అభ్యర్థించినన్= యాచించగా (కోరగా); ప్రసన్నుండు+ఐ= అనుగ్రహం కలవాడై; భక్తవత్సలుండు+అగు= భక్తవాత్సల్యం కలవాడైన; పుర+అంతకుఁడు= త్రిపురాలను దహించిన శివుడు; గౌరీసమేతుండు+ఐ= గౌరీదేవితోకూడినవాడై; తారక+అంతక= తారకుణ్ణి సంహరించిన కుమారస్వామి; గజ+ఆనన+ఆది= గణపతి మొదలయిన; భూతగణంబులతోన్= భూతగణాలతో; బాణ= బాణునియొక్క; నివాసంబు+అగు= నివాసమైన; శోణపురంబు= శోణపురంయొక్క; వాకిటన్+కాపు+ఉండెన్= కోటగుమ్మం దగ్గర రక్షకుడుగా ఉన్నాడు; పదంపడి= తదుపరి; ఒక్కనాడు+ఆ+బలినందనుఁడు= ఒకదినం బలికుమారుడైన ఆ బాణుడు...

**తా :** బాణాసురుని ప్రార్థన మన్నించిన శివుడు – గౌరీదేవి, కుమారస్వామి, గణపతులతో – ఇంకనూ ప్రమథగణాలతో వచ్చి శోణపురద్వారందగ్గర కాపుగా నిలిచాడు. ఆ తరువాత ఒకనాడు ఆ బాణుడు

**తే.** **దర్పమునఁ బొంగి రుచిరమార్తాండదీప, మండలముతోడ మార్పడు మహితశోణ**
**మణికిరీటము త్రిపురసంహరుని పాద, వనజములు సోఁక మ్రొక్కి యిట్లని నుతించె.** **319**

**ప్రతి :** దర్పమునన్= గర్వంతో; పొంగి= ఉబ్బి; రుచిర= కాంతిమంతమయిన; మార్తాండ= సూర్యుడనే; దీప= దీపంయొక్క; మండలముతోడన్= పరివేషంతో; మారు+పడు= పోటీపడే; మహిత= గొప్పదైన; శోణ= ఎర్రని; మణికిరీటము= మణులు తాపినకిరీటం; త్రిపురసంహరుని= త్రిపురాల్ని, త్రిపురాసురుల్ని సంహరించిన శివునియొక్క; పాదవనజములు= పాదాలనే పద్మాల్ని; సోఁకన్= తాకేటట్లు; మ్రొక్కి= నమస్కరించి; ఇట్లు+అని= ఈ విధంగా; నుతించెన్= పొగడాడు.

**తా :** గర్వియైన బాణాసురుడు కెంపులతో కూడిన తనకిరీటాన్ని శివునిశిరస్సుకు తగిలేటట్లు ఆయనకు నమస్కరించి, ఇలా పొగడాడు.

**సీ.** **'దేవ! జగన్నాథ! దేవేంద్రవందిత! వితతచారిత్ర! సంతతపవిత్ర!**
**హాలాహలాహార! యహిరాజకేయూర! బాలేందుభూష! సద్భక్తపోష!**
**సర్వలోకాతీత! సద్గుణసంఘాత! పార్వతీహృదయేశ! భవవినాశ!**
**రజతాచలస్థాన! గజచర్మపరిధాన! సురవైరివిధ్వస్త! శూలహస్త!**

**తే.** **లోకనాయక! సద్భక్తలోకవరద!, సురుచిరాకార! మునిజనస్తుతవిహార!**
**భక్తజనమందిరాంగణపారిజాత!, నిన్ను నెవ్వఁడు నుతిసేయ నేర్చు నభవ!** **320**

**ప్రతి :** దేవా!= ఓ ప్రభూ!; జగన్నాథ= లోకేశ్వరా!; దేవ+ఇంద్ర= దేవేంద్రునిచేత; వందిత= పొగడ్తలందుకొన్నవాడా!; వితతచారిత్ర= విస్తరించిన చరిత్రకలవాడా!; సంతతపవిత్ర= నిత్య పరిశుద్ధుడైనవాడా!; హాలాహల+ఆహార= హాలాహలం భోజనంగా కలవాడా!; అహిరాజ= నాగరాజును; కేయూర= భుజకీర్తులుగా కలిగినవాడా!; బాల+ఇందుభూష= బాలచంద్రుడు భూషణంగా కలిగినవాడా! (చంద్రశేఖరా!); సత్+భక్తపోష= ఉత్తమభక్తులను రక్షించేవాడా!; సర్వలోక+అతీత= సర్వలోకాలకూ అతీతమైనవాడా!; సత్+గుణసంఘాత= మంచిగుణాలకు ప్రోవైనవాడా!; పార్వతీహృదయ+ఈశ= పార్వతీహృదయనాథా!; భవవినాశ= జన్మలను నాశనం చేసేవాడా!; రజత+అచలస్థాన= వెండికొండస్థానంగా కలిగినవాడా! (కైలాసవాసి); గజచర్మపరిధాన= ఏనుగుచర్మం వస్త్రంగా కలవాడా! (శివా); సురవైరివిధ్వస్త= దేవతలకు శత్రువులగు రాక్షసుల్ని నశింపచేసేవాడా!; శూలహస్త= చేతిలో శూలంకలవాడా!; లోకనాయక!= లోకాలకు నాయకుడైనవాడా!; సత్+భక్తలోకవరద=

ఉత్తములైన భక్తకోటి కోరికలను తీర్చేవాడా!; సురుచిర+ఆకార= మనోహరమైన ఆకారం కలవాడా!; మునిజనస్తుతవిహార!= మునుల పొగడ్తలందే విహరించేవాడా!; భక్తజన= భక్తులైనవారి; మందిర+అంగణ= గృహాల ముంగిట; పారిజాత= పారిజాత వృక్షమైనవాడా!; (కోరికలను తీర్చునట్టివాడా); అభవ= శివా!; నిన్నున్= నిన్ను; ఎవ్వఁడు= ఎవడు; నుతి+చేయన్= ప్రశంసించడానికి; నేర్చున్= నేర్వగలడు?

**తా :** ఓ దేవా! పరమేశ్వరా! దేవేంద్రునిచేత పొగడ్తలందినవాడా! జగన్నాథా! విస్తరించిన చరిత్రకలవాడా! పరిశుద్ధమైనవాడా! హాలాహలాన్ని మింగినవాడా! వాసుకీ మున్నగు నాగరాజులను భుజకీర్తులుగా కలవాడా! చంద్రశేఖరా! భక్తరక్షకా! సర్వలోకాతీత! సద్గుణసమూహా! పార్వతీపతీ! మోక్షప్రదాతా! వెండికొండను గృహంగా కలవాడా! గజచర్మధారీ! రాక్షససంహారకా! శూలపాణీ! లోకనాయకా! ఉత్తమభక్త సమూహాలకు పారిజాతమైనవాడా! మునిజనప్రశంసాపాత్రా!; భక్తులకోరికలను తీర్చేవాడా! శివా! మహామహిమగల నిన్ను పొగడతరమా? (కాదని భావం)

**వ. అని స్తుతియించి. 321**

**ప్రతి :** అని= ఇట్లు; స్తుతియించి= ప్రశంసించి...

**తా :** అని ప్రశంసించి

**మ. అనిలో నన్ను నెదిర్చి బాహుబలశౌర్యస్ఫూర్తిఁ బోరాడఁ జా**
**లిన వీరుం డొకఁడైన బందెమునకున్ లేఁడయ్యె, భూమండలి**
**న్ననయంబున్ భవదగ్ర్యదత్తకరసాహస్రంబుకండూతి వా**
**యు నుపాయంబును లేద యీ భరము నెట్లోర్తు న్నుమానాయకా! 322**

**ప్రతి :** ఉమానాయకా= ఉమాదేవి భర్త అయిన శివా!; భూమండలిన్= భూమిమండలిలో; అనిలోన్= యుద్ధంలో; నన్నున్+ఎదిర్చి= నన్ను ఎదిరించి; బాహుబల= చేతుల బలంతో కూడిన; శౌర్యస్ఫూర్తిన్+పోరాడన్+చాలిన= పరాక్రమంయొక్క ప్రకాశంతో పోరాడ కలిగిన; వీరుండు+ఒకఁడు+ఐనన్= ఒక్కవీరుడు కూడా; పందెమునకున్= కలహానికి; లేడు+అయ్యెన్= లేడు; అనయంబున్= ఎల్లపుడును; భవత్+అగ్ర్యదత్త= మీ చేత ముఖ్యంగా ఈయబడిన; కరసాహస్రంబు= వేయి చేతుల; కండూతి= దురద; పాయు+ఉపాయంబు= తొలగే ఉపాయం; లేదు+అ= లేదా?; ఈ భరమున్= ఈ బరువు; ఎట్లు+ఓర్తున్= ఎలా ఓర్చుకోగలను?

**తా :** ఓ ఉమాపతీ! నీవు ప్రసాదించిన వేయిచేతుల పరాక్రమాన్ని ఎదిరించి పోరాడగల్గిన వీరుడు ఈ భూమిపై లేడు. ఈ పోరాటనను నేనెలా భరించేది? అని బాణుడు శివునితో అన్నాడు.

**సీ. హుంకారకంకణక్రేంకారశింజినీటంకారనిర్ఘోషసంకులంబు**
**చండదోర్దండభాస్వన్మండలాగ్రప్రకాండఖండితరాజమండలంబు**
**శూలాహతక్షతోద్వేలకీలాలకల్లోలకేళీసమాలోకనంబు**
**శుంభదున్మదకుంభికుంభస్థలధ్వంససంభూతశౌర్యవిజృంభణంబు**

**తే. గలుగు నుద్దామభీమసంగ్రామకేళి, ఘనపరాక్రమవిక్రమక్రమము గాఁగ**
**జరపలేనట్టి కరములు కరము దుఃఖ, కరము లగుఁ గాక సంతోషకరము లగునె? 323**

**ప్రతి :** హుంకార= హుంఅనెడి ధ్వనియొక్క; కంకణక్రేంకార= చేతికడియాల ధ్వనియొక్క; శింజినీ= వింటినారియొక్క; టంకార= టంకారధ్వనియొక్క; నిర్+ఘోషసంకులంబు= మిక్కిలి రొదతో నిండి ఉన్నది; చండ= భయంకరమైన; దోస్+దండ= పెద్దకర్రలవంటి చేతుల్లో; భాస్వత్= ప్రకాశించే; మండలాగ్ర ప్రకాండ= శ్రేష్ఠమైన ఖడ్గంచేత; ఖండిత= ఖండింపబడ్డ; రాజమండలంబు= రాజుల సమూహంగలది; శూల+ఆహత= శూలంతో కొట్టబడ్డ; క్షత+ఉద్వేల= గాయాలచే మిక్కుటమైన; కీలాల= రక్తంయొక్క; కల్లోలకేళీ= పెద్ద అలల క్రీడయొక్క; సమ్+ఆలోకనంబు= ప్రదర్శనం గలదీ; శుంభత్+ఉన్మద= ఎక్కువైన మదంతో నిండిన; కుంభికుంభస్థల= ఏనుగుల కుంభస్థలాల్ని; ధ్వంస= పగులగొట్టడంవల్ల; (నాశనము చేయడంవల్ల); సంభూత= కలిగిన; శౌర్య= పరాక్రమంయొక్క; విజృంభణంబు= చెలరేగుటలు; కలుగు= కలుగునట్టి; ఉద్దామ= తీవ్రమైన; భీమ= భయంకరమైన; సంగ్రామకేళి= యుద్ధక్రీడయే; ఘన= అధిగమైన; పరాక్రమ= శత్రువుల్ని ఆక్రమించుటందలి; విక్రమ క్రమముకాన్+కన్= శౌర్యంయొక్క పద్ధతి అయ్యేటుగా; జరపలేని+అట్టి= (యుద్ధం) చేయలేని; కరములు= చేతులు; కరము= మిక్కిలి; దుఃఖకరములు= దుఃఖాన్ని కల్గించేవి; అగున్+కాక= అవుతాయి కాని; సంతోషకరములు+అగునే?= సంతోషాన్ని కల్గించేవి అవుతాయా? (కలిగించవు అని అర్థం).

**తా :** దిక్కులు దద్దరిల్లేవిధంగా హుంకారం చేస్తూ ధనుష్టంకారం చేసేదీ, చేతుల కదలికవల్ల కలిగే కంకణాల క్రీంకారం గలదీ, భయంకరమైన భుజదండంలో ప్రకాశించే శ్రేష్ఠమైన ఖడ్గంచేత శత్రురాజుల సమూహాల శిరస్సులను ఖండించేదీ, శరీరాలనుండి భయంకరంగా రక్తధారలు చిమ్మేవిధంగా శూలపుపోట్లు పొడిచేదీ, మదపుటేనుగుల కుంభస్థలాలను బ్రద్దలు చేసే వీరవిజృంభణం గలదీ అయిన భీకర సంగ్రామంలో పరాక్రమాన్ని ప్రదర్శించలేని వట్టిచేతుల వలన ఉపయోగమేమున్నది? ఆ కరాలు నావంటి వీరులకు దుఃఖకరాలే గానీ సంతోషకరాలు కావు కాదా స్వామీ!

**ఉ. కాన మదీయచండభుజగర్వపరాక్రమకేళికిన్ సముం**
**డీ నిఖిలావనిం గలఁడె యిందుకళాధర! నీవు దక్కనా;**
**నా నిటలాంబకుండు దనుజాధిపు మాటకుఁ జాల రోసి లో**
**నూనిన రోషవార్ధి గడ లొత్తఁగ నిట్లని పల్కె భూవరా! 324**

**ప్రతి :** ఇందుకళాధర= చంద్రకళను ధరించినవాడా! ఓ శివా!; కానన్= కాబట్టి; మదీయ= నాయొక్క; చండ= భయంకరమయిన; భుజ= చేతులయొక్క; గర్వ= మదంయొక్క; పరాక్రమకేళికిన్= శౌర్యక్రీడకు; సముండు= సమానమైనవాడు; ఈ= ఈయొక్క; నిఖిల+అవనిన్= సమస్త భూమండలంలో; కలడు+ఎ= ఉన్నాడా?; నీవు; తక్కన్= తప్ప; నాన్= అని చెప్పగా; ఆ; నిటల+అంబకుఁడు= ముక్కంటి ఐన శివుడు; దనుజ+అధిపు= రాక్షసప్రభువగు బాణుని; మాటకున్= మాటకు; చాలన్= మిక్కిలిగా; రోసి= అసహ్యించుకొని; లోన్+ఊనిన= లోపలకలిగిన; రోషవార్ధి= కోపమనే సముద్రం; కడలు+ఒత్తన్+కన్= పొంగుతుండగా; భూవరా!= ఓ పరీక్షిన్మహారాజా!; ఇట్లు+అని= ఈ విధంగా; పల్కెన్= అన్నాడు.

**తా :** ఓ పరమేశ్వరా! నా శౌర్యపరాక్రమక్రీడ ఎదిరించడానికి నీవు తక్క నాకు సమానమైన బలం కలవాడు ఈ విశాల భూమండలంలో ఎక్కడా లేడని చెప్పిన బాణుని మూర్ఖత్వానికి శివుడు అసహ్యించుకొని, తనలో కోపసముద్రం ఉప్పొంగుతుండగా వానితో ఇలా అన్నాడు.

**క. 'విను మూఢహృదయ! నీ కే, తన మెప్పు దకారణంబ ధారుణిపైఁ గూ**
**లును నపుడు నీ భుజావలి, దునియఁగ నా యంతవానితో నని గల్గన్. 325**

**ప్రతి :** మూఢహృదయ= మందబుద్ధీ!; విను(ము)= వినుము; నీ= నీయొక్క; కేతనము= జెండా; ఎప్పుడు= ఏ సమయాన; అకారణంబు+అ= కారణంలేకుండానే; ధారుణిపైన్= భూమిపై; కూలును= పడుతుందో; అపుడు= ఆ సమయాన; నీ= నీయొక్క; భుజ+ఆవలిన్= అన్ని చేతులూ; తునియన్+కన్= ఖండింపబడేటట్లు; నా+అంతవానితోన్= నాతో సమానమైన వానితో; అని= యుద్ధం; కల్గున్= కలుగుతుంది.

**తా :** మందబుద్ధివైన బాణాసురా! ఎప్పుడు నీ తేరిజెండా అకారణంగా భూమిమీద పడుతుందో అప్పుడు నీ చేతులు తెగునట్లుగా నా అంతవానితో నీకు యుద్ధం కలుగుతుంది.

**వ. అని పలికిన నట్లు సంప్రాప్తమనోరథుండై నిజభుజవినాశకార్యధురీణుండగు బాణుండు సంతుష్టాంతరంగుం డగుచు నిజనివాసంబునకుం జని, తన ప్రాణవల్లభల యుల్లంబులు పల్లవింపఁ జేయుచు నిజధ్వజనిపాతంబు నిరీక్షించుచుండె, తదనంతరంబ. 326**

**ప్రతి :** అని పలికినన్= అని చెప్పగా; అట్లు= ఆ విధంగా; సంప్రాప్త= చక్కగా లభించిన; మనస్+రథుండు+ఐ= కోరిక కలవాడై; నిజ= తనయొక్క; భుజ= హస్తముల; వినాశ= నాశరూపమైన; కార్యధురీణుండు+అగు= కార్యభారం మోసేవాడయిన; బాణుండు= బాణుడు; సంతుష్ట+అంతరంగుడు+అగుచు= సంతృప్తి కలిగిన మనస్సు కలిగినవాడవుతూ; నిజ= తన; నివాసంబునకున్+చని= భవనానికి వెళ్లి; తన= తనయొక్క; ప్రాణవల్లభల= భార్యలయొక్క; ఉల్లంబులు= మనస్సులు; పల్లవింపన్+చేయుచున్= ప్రేమతో చిగురింపచేస్తూ; నిజ= తన; ధ్వజ= పతాకం; నిపాతంబు= పడటానికై; నిరీక్షించుచున్+ఉండెన్= ఎదురు చూస్తున్నాడు; తద్+అనంతరంబు+అ= ఆ పిమ్మట...

**తా :** శివుని మాటలు విన్న బాణుడు కోరిక నెరవేరినవాడై, తన భుజ వినాశానికి కావలసిన పనిలో నిమగ్నుడై చాలాసంతృప్తిని పొంది తన భవనానికి వెళ్లి, భార్యలమనస్సుల్లో ప్రేమను చిగురింపచేస్తూ – హాయిగా వాళ్లతో కాలం గడుపుతూ, ఏ సమయంలో తన రథకేతనం కూలుతుందో అని వేచి ఉన్నాడు.

**విశే :** దురదృష్టానికి అర్రులు చాచేవాడుంటాడా? అన్నట్లు బాణాసురుని మూర్ఖ మనస్తత్వవ్యక్తీకరణానికి ఉదాహరణంగా చిత్రించబడింది. **'వినాశకాలే విపరీతబుద్ధిః'** అని సూక్తి.

**సీ. ఆ దానవేశ్వరుననుఁగుఁగుమారి యుషాకన్య విమలసౌజన్యధన్య**
**రూపవిభ్రమకళారుచిరకోమలదేహ యతనునాఅవబాణ మనఁగఁ బరఁగు**
**సుందరీరత్నంబు నిందునిభానన యలినీలవేణి పద్మాయతాక్షి**
**యొకనాఁడు రుచిరసౌధోపరివేదికాస్థలమున మృదుశయ్య నెలమిఁ గూర్కి**

**తే. మున్ను దన దౌల నెన్నఁడు విన్న యతఁడుఁ, గన్నులారంగఁ దాఁ బొడగన్న యతఁడుఁ**
**గాని యసమానరూపరేఖావిలాస, కలితు ననిరుద్ధు నర్మిలిఁ గవిసినటులు. 327**

**ప్రతి :** విమల= నిర్మలమైన; సౌజన్య= మంచితనంచే; ధన్య= ధన్యురాలు; రూప= సౌందర్యంతో; విభ్రమ= శృంగారచేష్టా విశేషంతో; రుచిర= అందమైన; కోమలదేహ= సుకుమారమగు శరీరం కలిగింది; అతను+ఆఅవబాణము+అనన్+కన్+పరఁగన్= మన్మథుని ఆరవబాణమా అన్నట్లు ఒప్పే; సుందరీరత్నంబు= సౌందర్యవతుల్లో శ్రేష్ఠ ఐనది; ఇందునిభ+ఆనన=

చంద్రునివంటి ముఖం కలది; అలి= తుమ్మెద బారులవంటి; నీల= నల్లని; వేణి= జడకలది; పద్మ+ఆయత+అక్షి= పద్మాలవలె దీర్ఘాలైన కన్నులు కలది; ఆ= ఆ; దానవ+ఈశ్వరుని= ఆ రాక్షస ప్రభువగు బాణుని; అనుఁగు= గారాబు; కుమారి= కుమార్తె; ఉషాకన్య= ఉష అనే పేరుగలకన్య; ఒకనాఁడు= ఒకరోజున; రుచిర= అందమైన; సౌధ= భవనంయొక్క; ఉపరి= పై భాగంలో ఉన్న; వేదికాస్థలమునన్= వేదికపై; మృదుశయ్యన్= మెత్తని పడకపై; ఎలమిన్= సంతోషంతో; కూర్కి= నిద్రించి; మున్ను= పూర్వం; తన= తన; దౌలన్= దూరంలో కూడా; ఎన్నఁడున్= ఎప్పుడును; విన్న+అతఁడున్= విన్నవాడును; కన్నులు+ఆరంగన్= కన్నులనిండుగా; తాన్= తాను; పొడఁగన్న= చూచిన; అతఁడు= వాడును; కాని= కానట్టి; అసమాన= సాటిలేని; రూప= చక్కని రూపంయొక్క; రేఖా= కళయొక్క; విలాస= శృంగార చేష్టలతో; కలితున్= కూడినవాణ్ణి; అనిరుద్ధునిన్= అనిరుద్ధుణ్ణి; అర్మిలిన్= అనురాగంతో; కవిసినటులు= భోగించిన విధంగా...

**తా :** బాణునికుమార్తె ఉషాకుమారి తన భవనం పై భాగంలో నిద్రించింది. నిద్రలో తను ముందెన్నడూ వినని, కనని అసమాన సౌందర్యవంతుడైన అనిరుద్ధునితో సుఖించినట్లుగా

**చ. కల గని యంత మేలుకని కన్నుల బాష్పకణంబు లొల్కఁగాఁ**
**గలవలెఁ గాక నిశ్చయముగాఁ గమనీయవిలాసవిభ్రమా**
**కలిత తదీయరూపము ముఖంబున వ్రేలిన యట్ల దోఁచినం**
**గళవళ మందుచున్ బిగియఁ గౌఁగిటిచే బయ లప్పళించుచున్ 328**

**ప్రతి :** కల గని= స్వప్నంరాగా; అంతన్= అంతలోనే; మేలుకని= మేల్కొని; కన్నులన్= కన్నులలో; బాష్పకణంబులు+ఒల్కన్+కాన్= ఆనందంతో కన్నీళ్ళుకారగా; కలవలెన్+కాక= కలవలే కాకుండ; నిశ్చయముకాన్= నిజంగానే; కమనీయ= మనోహరమైన; విలాస= శృంగారచేష్టల; విభ్రమ+ఆకలిత= ఆశ్చర్యంతో కూడిన; తదీయ= వానియొక్క; రూపము= ఆకారం; ముఖంబునన్= ముఖంపై; వ్రేలిన+అట్లు= కదలుచున్నట్లు; తోచినన్= తోచగా; కళవళము+అందుచున్= తొట్రుపాటుపడుతూ; కౌగిటిచే= కౌగిలింతతో; బిగియన్= బిగించుకొనేందుకై; బయలు= శూన్యాన్ని; అప్పళించుచున్= అదిమిపట్టుకొంటూ...

**తా :** స్వప్నం అనుభవించిన ఉషాకన్య మేలుకొంది. ఆమె కండ్లనుండి ఆనందంతో కన్నీరుకారుతున్నది. ఇది స్వప్నం కాక నిజమే నేమో అనే భ్రాంతి కలిగింది. కలలో కన్పించినవాని ఆకారం ముఖంపై కదులుతున్నట్లయింది. గాలిలో ఆ రూపాన్ని కౌగిట్లో గట్టిగా బంధించుకొంటూ

**వ. మఱియును. 329**

**ప్రతి :** మఱియును= ఇంకను...

**చ. సరసమృదూక్తులుం గుసుమసాయక కేళియు శాటికా కచా**
**కరషణముల్ నఖక్రియలుఁ గ్రమకపోలలలాటమేఖలా**
**కరకుచబాహుమూలములుఁ గైకొని యుండుట లాదిగాఁ దలో**
**దరి మది గాఢమై తగిలె దర్పకుఁ దచ్చున నొత్తినట్లయై. 330**

**ప్రతి :** సరస= రసవంతమైన; మృదు= సౌమ్యమైన; ఉక్తులున్= మాటలూ; కుసుమసాయకకేళియున్= మన్మథక్రీడయూ; శాటికా= పైట; కచ= కొప్పుముడిని; ఆకరషణముల్= లాగడాలు; నఖక్రియలు= గోటిగిచ్చులు; కమ్రకపోల= ఇంపైన చెక్కిళ్లనూ; లలాట= నుదుటిని; మేఖల= మొలనూలును (ఒడ్డాణం); కర= చేతులను; కుచ= స్తనాలను; బాహుమూలములున్+కైకొని= చంకలూ పట్టుకొని; ఉండుటలు= ఉండడాలూ; ఆదికాన్= ఇంకా ఏవేవో; తల+ఉదరి= సన్నని నడుముగల; మదిన్= ఆ ఉషయొక్క హృదయంలో; దర్పకుఁడు= మన్మథుఁడు; అచ్చునన్+ఒత్తినట్లు+ఐ= ముద్రవేసినట్లు భావనకలిగి; గాఢము+ఐ= అధికంగా; తగిలెన్= హత్తుకొన్నాయి.

**తా :** రసవంతాలూ, సౌమ్యాలూ అయిన సంభాషణలు, పైటనూ, జుట్టునూ లాగడం, చెక్కిళ్లను, నుదుటినీ, వడ్డాణాన్నీ, చేతుల్నీ, ఎదనీ, చంకల్నీ, పొదివి పట్టుకోవడం - ఇలాంటివన్నీ మన్మథుడు అచ్చుగుద్దినట్లుగా ఉషాకన్య మనస్సుకు గట్టిగా తగిలాయి.

**సీ. కలికిచేష్టలు భావగర్భంబు లైనను బ్రియుమీఁది కూరిమి బయలుపఱుపఁ**
**బిదపిదనై లజ్జ మదిఁ బద నిచ్చినఁ జెలి మేనఁ బులకలు చెక్కు లొత్త**
**మదనాగ్నిసంతప్తమానస యగుటకు గురుకుచహారవల్లరులు గందఁ**
**జిత్తంబు నాయకాయత్తమై యుంటకు మఱుమాట లాడంగ మఱపు గదుర**

**తే. నతివ మనమున సిగ్గు మోహంబు భయముఁ, బొడమ నునుమంచు నెత్తమ్మిఁ బొదువుమాడ్కిఁ**
**బ్రథమచింతాభరంబునఁ బద్మనయన, కోరి తలచీర వాటింప నేర దయ్యె. 331**

**ప్రతి :** కలికిచేష్టలు= ఆమెయొక్క గడుసుపనులు; భావగర్భంబులు= శృంగారభావపూరితాలు; ఐనను= అయినప్పటికీ; ప్రియునిమీఁది= ప్రియుని మీదున్న; కూరిమి= స్నేహం; బయలుపఱుపన్= వ్యక్తీకరిస్తుండగా; పిదపిదన+ఐ= మెత్తనిదై; లజ్జ= సిగ్గు; మదిన్= మనస్సులో; పదను+ఇచ్చినన్= తీక్ష్ణతచూపగా; చెలిమేనన్= ఆమె శరీరంలో; పులకలు= రోమాంచం; చెక్కులు+ఒత్తన్= వ్యాపింపగా; మదన+అగ్ని= మన్మథునివేడిచేత; సంతప్తమానస+అగుటకు= తపించిన మనస్సు కలదగుటకు (నిదర్శనంగా); గురుకుచ= గొప్పవైన స్తనాలమీది; హారవల్లరులు= ముత్యాలపేరులు; కందన్= కందిపోగా; చిత్తంబు= మనస్సు; నాయక+ఆయత్తము+ఐ= నాయకుని (అనిరుద్ధుని) ఆధీనమై; ఉంటకున్= ఉండుటకు; మఱు మాటలు+ఆడన్+కన్= బదులుమాటలాడుటకు; మఱపు= మఱపు; కదురన్= అతిశయించగా; అతివమనమునన్= ఆమెమనస్సులో; సిగ్గు= సిగ్గు; మోహంబు= మిక్కిలి ప్రేమ; భయమున్= భయమూ; పొడమన్= కలుగగా; నునుమంచు= కొద్దిపాటి మంచు; నెఱ+తమ్మిన్= వికసించిన పద్మాన్ని; పొదువు= క్రమ్ముకొన్న; మాడ్కిన్= వలె; ప్రథమ చింతాభరంబునన్= తొలివలపు చింతాభారంచే; పద్మనయన= పద్మాలవంటి కన్నులు కలిగిన (ఆ ఉషాకన్య); కోరి= ఇచ్ఛతో; తలచీరన్= మేలి ముసుగును కూడా; పాటింపన్+నేరదు+అయ్యెన్= ధరింపలేకపోయింది.

**తా :** ఆమె చేష్టల్లో, భావంలో ప్రియునిపైగల ప్రేమ వ్యక్తమవుతూంది. హృదయంలో సిగ్గు కలిగి ఆమెశరీరంపై రోమాంచ మేర్పడుతున్నది. ఆమె మనస్సు మదనాగ్నిచే తపింపబడడానికి చిహ్నంగా ఆమె వక్షఃస్థలంపై నున్న ముత్యాలహారాలు కందిపోతున్నవి. ఆమె మనస్సు ప్రియునిపై లగ్నంకావడంతో మారుమాటలాడలేక పోతున్నది. ఆమెమనస్సులో సిగ్గు, వలపు, భయం కలిగాయి. ఆమెను మంచుక్రమ్మిన పద్మంవలె ఉంది. తొలివలపు భారంచే సంప్రదాయానుసారంగా ధరించవలసిన మేలిముసుగు కూడా ధరించలేకపోయింది.

**వ. ఇట్లు విరహవేదనాదూయమానమానసయై యుండె, నంత నెచ్చెలులు డాయం జనుదెంచినం దన మనంబునం బొడము మనోజవికారంబు మఱు వెట్టుచు నప్పుడు. 332**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విరహ= ఎడబాటువలన ఏర్పడిన; వేదన= బాధచే; దూయమాన= తపిస్తున్న; మానసయై= హృదయం కలిగిందై; ఉండెన్= ఉంది; అంతన్= అంతలో; నెఱ+చెలులు= ప్రాణస్నేహితురాండ్రు; డాయన్= సమీపానికి; చనుదెంచినన్= రాగా; తన= తనయొక్క; మనంబునన్= మనస్సులో; పొడము= కలిగే; మనోజవికారంబున్= మన్మథతాపంవల్ల ఏర్పడిన వికారాన్ని; మఱు+పెట్టుచున్= మరుగుపరుస్తూ; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఉష విరహబాధను పొందుతున్నపుడు ఆమె చెలికత్తెలు ఆమెను సమీపించారు. అప్పుడు ఉష తన మనస్సులోని వికారాన్ని వారికి తెలియకుండా మరుగుపరుస్తూ – అప్పుడు

**చ. పొరిఁబొరిఁ బుచ్చు నూర్పుగమిఁ బుక్కిటనుంచి, కుచాగ్రసీమపై**
**బెరసిన సన్న లేఁజెమట బిందువు లొయ్యన నార్చుఁ, గన్నులం**
**దొరఁగెడు బాష్పపూరములు దొంగలిఱెప్పల నాని చుక్కలం**
**దరుణులు రండు చూత మని తా మొగ మెత్తును గూఢరాగయై. 333**

**ప్రతి :** పొరిన్+పొరిన్= మాటిమాటికి; పుచ్చున్= గ్రహిస్తూంది; ఊర్పుగమిన్= నిట్టూర్పులను; పుక్కిటన్+ఉంచి= బుగ్గలోపలి భాగంలో ఉంచి; (అణచి); కుచ+అగ్రసీమపైన్= వక్షోజాలపై భాగంలో; పెరసిన= పడిన; సన్న= అల్పమైన; లేత+ చెమటబిందువులు= పలుచనైన చెమటబొట్లను; ఒయ్యనన్= మెల్లగా; ఆర్చున్= ఎండింపచేసింది; కన్నులన్= కన్నుల్లో; తొరగెడు= స్రవించే; బాష్పపూరములు= కన్నీటి ముంపుల్ని; తొంగలిఱెప్పలన్+ఆని= దట్టమైన కనురెప్పల్లో అడ్డగించి; తరుణులు= చెలులార!; చుక్కలను= నక్షత్రాలను; చూతము(చూచుదము)= చూద్దాం; రండు+అని= రండని; గూఢరాగ+ఐ= అనురాగాన్ని రహస్యపరచిందై; తాన్= తాను; మొగము= ముఖాన్ని; ఎత్తును= ఎత్తుతుంది.

**తా :** మాటిమాటికీ వచ్చే నిట్టూర్పుల్ని పుక్కిట్లోనే అణచుకొని నిల్పేసింది. ఎదపై వ్యాపించిన సన్నని చెమట బిందువుల్ని మెల్లగా తుడిచింది. కన్నీటిముంపును రెప్పలచాటున దాచింది. నక్షత్రాలను చూద్దాం రండని పిలిచి, ముఖం ఆకాశం మీదికి ఎత్తి తన నాయకునిపై నుండే ప్రేమను దాచింది.

**వ. ఇవ్విధంబునం జరియించుచుండె నట్టియెడ. 334**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ పద్ధతిగా; చరియించుచున్+ఉండెన్= ప్రవర్తిస్తూ ఉండింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో...

**తా :** ఉష ఈ పద్ధతిలో ప్రవర్తిస్తుండే సమయంలో

**తే. అంతకంతకు సంతాప మతిశయించి, వలుఁదచన్నులు గన్నీటివఱదఁ దడియఁ**
**జెలులదెసఁ జూడఁ జాల లజ్జించి మొగము, వాంచి పలుకక యుండె న వ్వనరుహాక్షి. 335**

**ప్రతి :** ఆ+వనరుహ+అక్షి= ఆ పద్మాలవంటి కన్నులు కలిగిన ఉష; అంతకున్+అంతకున్= క్రమక్రమంగా; సంతాపము= బాధ; అతిశయించి= అధికమై; వలుఁదచన్నులు= గుండ్రంగా ఉన్న స్తనాలు; కన్నీటి= కన్నీటియొక్క; వఱదన్= వరదలో;

తడియన్= తడవగా; చెలులదెసన్= చెలికత్తెలవైపు; చూడన్= చూచేందుకు; చాలన్= మిక్కిలి; లజ్జించి= సిగ్గుపడి; మొగము= ముఖం; వాంచి= వంచుకొని; పలుకక+ఉండెన్= మాట్లాడలేకపోయింది.

**తా :** ఉషకు క్రమంగా బాధ అధికమైంది. కన్నీటిప్రవాహంతో వక్షోజాలు తడుస్తున్నాయి. చెలికత్తెలవైపు చూడలేక, ముఖమెత్తి వారితో మాటాడలేక సిగ్గుపడి ఊరకుండిపోయింది.

**వ. అంత.** **336**

**ప్రతి :** అంతన్= ఆ తర్వాత...

**తే. బలితనూభవుమంత్రి కుంభాండుతనయ, తన బహిఃప్రాణ మిది యనఁ దనరునట్టి**
**కామినీమణి ముఖపద్మకాంతివిజిత, శిశిరకరచారురుచిరేఖ చిత్రరేఖ.** **337**

**ప్రతి :** బలి= బలిచక్రవర్తి; తనూభవు= కుమారుడైన బాణుని; మంత్రి= మంత్రియగు; కుంభాండు= కుంభాండుని; తనయ= కుమార్తె; ఇది= ఈమె; తన= తనయొక్క; బహిస్= వెలుపలి; ప్రాణము= ప్రాణం; అనన్= అనేట్టుగా; తనరున్+అట్టి= ఒప్పునట్టి; కామినీమణి= శ్రేష్ఠమైన స్త్రీ; చిత్రరేఖ= చిత్రరేఖ; ముఖపద్మకాంతి= పద్మంవంటి ముఖకాంతిచే; విజిత= జయింపబడ్డ; శిశిరకర= చల్లని కిరణాలుగల చంద్రునియొక్క; చారు= అందమైన; రుచిరేఖ= కాంతిరేఖ గలది.

**తా :** బాణాసురుని మంత్రి కుంభాండకుని కుమార్తె చిత్రరేఖ, ఆమె ముఖసౌందర్యం చంద్రుణ్ణి మించింది. బాణుని కుమార్తె ఉషకు ఆమె బహిఃప్రాణం.

**వ. కదియ వచ్చి య బ్బాల నుపలక్షించి.** **338**

**ప్రతి :** కదియన్+వచ్చి= దగ్గరగా వచ్చి; ఆ+బాలన్= ఆ ఉషను; ఉపలక్షించి= చూచి...

**తా :** చిత్రరేఖ ఉషదగ్గరకు వచ్చి ఆమెను చూచి

**తే. భామినీమణి సొబగుని బయల వెదకు, విధమునను నాత్మవిభుఁ బాసి విహ్వలించు**
**వగను జేతికి లోనైనవానిఁ బాసి, భ్రాంతిఁ బొందిన భావంబు ప్రకట మయ్యె.** **339**

**ప్రతి :** భామినీమణి= స్త్రీ రత్నమైన ఉష; సొబగునిన్= అందగాణ్ణి; బయలన్= బహిఃప్రదేశంలో; వెదకు విధమునను= వెదికే ప్రకారంగా; ఆత్మవిభున్+పాసి= పతిని ఎడబాసి; విహ్వలించు= క్షోభించే; వగను= బాధతో; చేతికిన్= చేతికి; లోను+ఐన= దొరికిన; వానిన్= వాణ్ణి; పాసి= పోగొట్టుకొన్న; భ్రాంతిన్+పొందిన= భ్రమను పొందిన; భావము= భావం; ప్రకటము+అయ్యెన్= స్పష్టమయింది.

**తా :** ఉష తన ప్రియుణ్ణి బహిఃప్రదేశంలో వెదకుతున్నట్లుగా, ప్రాణనాథునికి దూరమై బాధపడుతున్నట్లు, చేతికి దొరకిన పతిని కోల్పోయిన భ్రాంతిని పొందినట్లు చెలికత్తె గమనించింది.

**తే. వనిత! నాకన్న నెనరైనవారు నీకుఁ గలుగ నేర్తురె! నీ కోర్కిఁ దెలియఁ జెప్ప**
**కున్న మీ యన్నతో డన్నఁ గన్నుఁగవను, నలరు నునుసిగ్గుతో నగ వామతింప.** **340**

**ప్రతి :** వనిత= ఓ ఉషా; నాకన్నన్= నా కంటె; నెనరు+ఐనవారు= ఇష్టమైనవారు; నీకున్= నీకు; కలుగన్+నేర్తురు+ఎ= ఉన్నారా?; నీ= నీయొక్క; కోర్కిన్= కోరికను; తెలియన్= తెలిసేటట్లు; చెప్పక+ఉన్నన్= చెప్పకపోతే; మీ అన్న= మీ తండ్రిపై; తోడు= ఒట్టు; అన్నన్= అనగా; కన్ను+కవన్= రెండుకండ్లలో; అలరు= ఒప్పుతున్న; నునుసిగ్గుతోన్= లేతసిగ్గుతో; నగవున్= నవ్వును; ఆ మతింపన్= తెప్పించుకోగా...

**తా :** 'ఉషా! నా కంటె ఇష్టమైనవారు నీకు ఎవరు ఉన్నారు? నీ కోరిక నాకు చెప్పకపోతే, మీ తండ్రిపై ఒట్టు' అనగానే ఆమె సిగ్గుతో కూడిన నవ్వుగలదై చెలితో ఇలా పలికింది (ఆమె నవ్వును సిగ్గు అణిచేస్తుంటే – ఎట్లో తప్పించుకొని నవ్వింది. అంటే ఆమెకు నవ్వుకంటే – సిగ్గే ఎక్కువయింది).

**విశే :** అన్న= తండ్రి (తమిళ, మరాఠీ భాషల్లో అన్న, అణ్ణా శబ్దాలు పితృవాచకంగా ఉన్నవి)

**వ. ఇ వ్విధంబునఁ జిత్రరేఖం గనుంగొని యిట్లనియె. 341**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధంగా; చిత్రరేఖన్= చిత్రరేఖను; కనున్+కొని= చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తా :** ఉష చిత్రరేఖను చూచి ఈ విధంగా చెప్పింది.

**చ. 'చెలి కలలోన నొక్క సరసీరుహనేత్రుఁడు హారరత్నకుం**
**డల కటకాంగుళీయకరణన్మణినూపురభూషణుండు ని**
**ర్మలకనకాంబరుండు సుకుమారతనుండు వినీలదేహుఁ డు**
**జ్జ్వలరుచి నూతనప్రసవసాయకుఁ డున్నతవక్షుఁ డెంతయున్. 342**

**ప్రతి :** చెలి= స్నేహితురాలా! చిత్రరేఖా!; కలలోన్= స్వప్నంలో; ఒక్క= ఒక; సరసీరుహనేత్రుఁడు= పద్మాలవంటి నేత్రాలు కలవాడు; హార= ముత్యాలహారాలు; రత్న= రత్నములతో కూడిన; కుండల= చెవిపోగులు; కటక= కడియాలు; అంగుళీయక= ఉంగరాలు; రణత్= ధ్వనిస్తున్న; మణినూపుర= మణులు పొదిగిన అందెలు; భూషణుండు= అలంకారాలుగా గలవాడు; నిర్మల= స్వచ్ఛమైన; కనక+అంబరుండు= బంగారు వస్త్రం గలవాడు; సుకుమార= కోమలమైన; తనుండు= శరీరం కలవాడు; వినీలదేహుఁడు= నల్లని శరీరం కలవాడు; ఉత్+జ్వలత్= ప్రకాశిస్తున్న; రుచి= కాంతికల; నూతన= కొత్త; ప్రసవసాయకుఁడు= మన్మథుఁడు (నవమన్మథుడు); ఎంతయున్= మిక్కిలి; ఉన్నత= ఎత్తైన; వక్షుఁడు= వక్షస్థలం కలవాడు.

**తా :** ఓ స్నేహితురాలా! నా స్వప్నంలో పద్మనేత్రుడు, ముత్యాలహారాలు, రత్నకుండలాలూ, చేతి కడియాలూ, ఉంగరాలూ, అందెలూ ధరించినవాడు, బంగారువర్ణం దుస్తులు ధరించినవాడు, కోమల శరీరం కలవాడు, నీలదేహుడు, ఎత్తైన వక్షః స్థలం కలిగి నవమన్మథుడుగా ఉన్నవాడు కన్పించాడు.

**చ. నను బిగియారఁ గౌఁగిట మనం బలరారఁగఁ జేర్చి మోదముం**
**దనుకఁగ నంచితాధరసుధారస మిచ్చి మనోజకేళికిం**
**బనుపడఁ జేసి మంజుమృదుభాషలఁ దేలిచి యంతలోననే**
**చనియెను దుఃఖవార్ధిఁ బెలుచన్ ననుఁ ద్రోచి సరోరుహాననా! 343**

**ప్రతి :** సరోరుహ+ఆననా!= పద్మం వంటి ముఖం కలిగిన చిత్రరేఖా!; ననున్= నన్ను; బిగియారన్= గాఢంగా; కౌఁగిటన్= కౌగిలిలో; మనంబు= మనస్సు; అలరారన్+కన్= సంతోషించేటట్లు; చేర్చి= దగ్గరకు తీసికొని; మోదమున్= సంతోషం; తనుకన్+కన్= అతిశయించేటుగా; అంచిత+అధరసుధారసము= ఒప్పిదమైన అధరామృతాన్ని; ఇచ్చి= ఇచ్చి; మనోజకేళికిన్= మన్మథక్రీడకు; పనుపడన్+చేసి= వశమగునట్లు చేసి; మంజు= మనోజ్ఞమైన; మృదు= మెత్తని; భాషలన్= మాటలతో; తేల్చి= తేల్చి; ననున్= నన్ను; దుఃఖవార్ధిన్= దుఃఖమనే సముద్రంలో; పెలుచన్= దయ లేకుండా; త్రోచి= త్రోసి; చనియెను= వెళ్లాడు.

**తా :** చెలీ చిత్రరేఖా! ఆతడు నా మనస్సు సంతోషించేటట్లు నన్ను దగ్గరకు తీసుకొని, గాఢమైన కౌగిట చేర్చుకొన్నాడు. అధరామృతమిచ్చాడు. మన్మథక్రీడలో తేల్చి, మృదువైన మాటలు చెప్పి, దుఃఖ సముద్రంలోకి, త్రోసి వెళ్లిపోయాడు.

**వ. అనుచు నమ్మత్తకాశిని త్తంబు చిత్తజాయత్తం బయి తత్తరంబున విరహానలం బుత్తలపెట్టఁ గన్నీరు మున్నీరుగా వగచుచు విన్ననయిన వదనారవిందంబు వాంచి యూరకున్నఁ జిత్రరేఖ దన మనంబున నయ్యింతిసంతాపంబు చింతించి యిట్లనియె. 344**

**ప్రతి :** అనుచున్= అనిచెప్పుచు; ఆ+మత్తకాశిని= నిండుయౌవనదశలో ఉన్న ఆ యువతియొక్క; చిత్తంబు= మనస్సు; చిత్తజ+ఆయత్తంబు+అయి= మన్మథుని వశం అయి; తత్తరంబునన్= తొట్రుపాటుతో; విరహ+అనలంబు= వియోగాగ్ని; ఉత్తలము+పెట్టన్= కలతపరచగా; కన్నీరుమున్నీరుగా= కంటినీరు సముద్రం కాగా; వగచుచున్= విచారిస్తూ; విన్నన్+అయిన= వివర్ణమైన; వదన+అరవిందంబు= పద్మంవంటి ముఖాన్ని; వాంచి= వంచి; ఊరక+ఉన్నన్= మాట్లాడకుండగా; చిత్రరేఖ= చిత్రరేఖ; తన= తనయొక్క; మనంబునన్= మనస్సులో; ఆ+ఇంతి= ఆమెయొక్క; సంతాపంబు= బాధనుగూర్చి; చింతించి= ఆలోచించి; ఇట్లు+అనియెన్= ఇలా అంది...

**తా :** ఉషమనస్సు మన్మథవశమై కూడి విరహవేదన కలతపెట్టగా, ఆమె కన్నీరుమున్నీరుగా వగచి, వివర్ణమైన చెందిన ముఖం వంచుకొని మిన్నకుండిపోయింది. ఆమె బాధను చూచి బాగా ఆలోచించిన చిత్రరేఖ ఇలా అంది.

**చ. 'సరసిజనేత్ర! యేటికి విచారము? నా కుశలత్వ మేర్పడన్**
**నరసురయక్షకింపురుషనాగనభశ్చరసిద్ధసాధ్యకి**
**న్నరవరముఖ్యులం బటమునన్ లిఖియించినఁ జూచి నీ మనో**
**హరుఁ గని 'వీడె పొ' మ్మనిన నప్పుడె వానిని నీకుఁ దెచ్చెదన్.' 345**

**ప్రతి :** సరసిజనేత్ర!= పద్మాలవంటి కన్నులుకలదానా!; ఏటికిన్= ఎందుకు; విచారము= సంతాపం; నా= నా యొక్క; కుశలత్వము= నేర్పు; ఏర్పడన్= స్పష్టపడేటట్లు; నర= నరులు; సుర= దేవతలు; యక్ష= యక్షులు; కింపురుష= కింపురుషులు; నాగ= నాగులు (నాగపాము) జాతి; నభస్+చర= గరుడులు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; కిన్నర= కిన్నరులు (వీరికి); వర= నాయకులైన; ముఖ్యులను= ప్రముఖుల్ని; పటమునన్= చిత్రాలు వేసే వస్త్రాలపై; లిఖియించినన్= వ్రాస్తే; చూచి; నీ= నీయొక్క; మనస్+హరునిన్= మనస్సును హరించిన ప్రియుణ్ణి; కని= చూచి (నిర్ధరించుకొని); వీడు+ఎ+పొమ్ము= ఇతడేసుమా; అనినన్= అని నీవనగానే; అప్పుడు+ఏ= ఆ సమయంలోనే; వానినిన్= ఆ నీ ప్రియుని; నీకున్= నీ కొరకు; తెచ్చెదన్= తీసుకొనివస్తాను.

**తా :** ఉషా! నీవు విచారించడం ఎందుకు? దేవతలు, మానవులు, యక్షులు, కింపురుషులు, నాగులు, కిన్నరులు, ఖేచరులు, కింపురుషులు, సిద్ధులు, సాధ్యులు – ఈ జాతులకు ప్రభువులైన పురుషుల్ని చిత్రపటాలలో లిఖించి, చూపుతాను. వారిలో నీ మనస్సును హరించిన ప్రియుణ్ణి గుర్తించగానే అతణ్ణి నీ ఒద్దకు తీసుకొని వస్తాను.

**వ. అని యొడంబఱిచి మిలమిలని మంచుతోడం బురుడించు ధళ ధళ మను మెఱుంగులు దుఱంగలిగొను పటంబు నావటంబుసేసి, వజ్రంబున మేదించి, పంచవన్నియలు వేఱు వేఱ కనకరజతపాత్రంబుల నించి కేలం దూలిక ధరించి యొక్క విజనస్థలంబునకుం జని ముల్లోకంబులం బేరు గలిగి వయోరూపసంపన్ను లయిన పురుషముఖ్యుల నన్వయగోత్రనామధేయంబులతోడ వ్రాసి, యాయితంబయిన య ప్పటంబు దన ముందటఁ దెచ్చి పెట్టి యప్పటంబునం దగులనివారు లేరు, వారిం జెప్పెద, సావధానంబుగ నాకర్ణింపు' మని యిట్లనియె. 346**

**ప్రతి :** అని; ఒడంబఱిచి= అంగీకరింపచేసి; మిలమిలని= తళతళమను; మంచుతోడన్= మంచుతో; పురుడించు= సమానమైన; ధళధళమను= తళతళలాడే; మెఱుంగులు= మెఱుగులు; తుఱంగలిన్+కొను= అతిశయించేటట్లు చేరిన; పటంబున్= చిత్రాలు గీయటానికి అనువైన వస్త్రాన్ని; ఆవటంబు+చేసి= సిద్ధంచేసి; వజ్రంబునన్= ఒక విధమగు సున్నాన్ని; మేదించి= మర్దించి; పంచెవన్నియలు= ఐదురంగులు; వేఱువేఱన్= విడివిడిగా; కనకరజతపాత్రంబులన్= బంగారు, వెండిగిన్నెలలో; నించి= నింపి; కేలన్= చేతియందు; తూలికన్= కుంచెను; ధరించి= గ్రహించి; ఒక్క= ఒక; విజనస్థలంబునకున్= నిర్జన ప్రదేశానికి; చని= వెళ్లి; మూఁడు+లోకంబులన్= స్వర్గ, మర్త్య, పాతాళలోకాలలో; పేరుగలిగి= ప్రసిద్ధులైన; వయస్+రూపసంపన్నులు+అయిన= వయస్సుచేత; రూపంచేత, సమృద్ధులైన; పురుషముఖ్యులన్= పురుషశ్రేష్ఠులను; అన్వయ= కులం; గోత్ర= వంశం; నామధేయంబులతోడన్= పేర్లతోపాటు; వ్రాసి= లిఖించి; ఆయితంబు+అయిన= సిద్ధమైన; ఆ+పటంబున్= ఆ చిత్రాలు వ్రాసిన వస్త్రాన్ని; తన= తన (ఉష); ముందటన్= ఎదుటకు; తెచ్చి= తీసుకొనివచ్చి; పెట్టి= ఉంచి; ఆపటంబునన్= ఆ చిత్రపటంలో; తగులనివారు= చిక్కనివారు; లేరు= లేరు; వారిన్= వారినిగూర్చి; చెప్పెదన్= చెబుతాను; స+అవధానంబుగన్= శ్రద్ధగా; (ఏకాగ్రతతో) ఆకర్ణింపుము= వినుము; అని= అని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తా :** అని చెప్పి ఉషాకన్యను అంగీకరింపజేసింది. మంచువలె కాంతిమంతమైన వస్త్రాన్ని సిద్ధం చేసింది. వజ్రంలాంటి తెల్లని సున్నాన్ని ఆ వస్త్రానికి పూసింది. అయిదు బంగారు, వెండి పాత్రలలో ఐదు రంగుల్ని నింపుకొనింది. ఒక చేతిలో కుంచెను ధరించి, రంగులతో నిండినపాత్రల్ని తీసుకొని ఏకాంతప్రదేశానికి వెళ్లింది. ముల్లోకాలలో ప్రసిద్ధి చెందినవాళ్ల చిత్రాలు లిఖించింది. వారి పేర్లూ, గోత్రాలూ వ్రాసింది. అలా పూర్తి చేసిన చిత్రపటాన్ని తెచ్చిచూపింది. వీరినిగూర్చి పూర్తిగా చెబుతాను. విను అని చెప్పసాగింది.

**సీ. కమనీయసంగీతకలితకోవిదులు కింపురుషగంధర్వకిన్నరులు వీరె!**
**సతతయౌవనయదృచ్ఛావిహారులు సిద్ధసాధ్యచారణనభశ్చరులు వీరె!**
**ప్రవిమలసౌఖ్యసంపద్వైభవులు సుధాశనమరుద్యక్షరాక్షసులు వీరె!**
**నిరుపమరుచికళాన్వితకామరూపులై పొగడొందునట్టి పన్నగులు వీరె!**

**తే. చూడు'మని నేర్పు దీపింపఁ జూపుటయును, జిత్తము నిజమనోరథసిద్ధి వడయఁ**
**జాలకుండిన మధ్యమక్ష్మాతలాధి, పతులఁ జూపుచు వచ్చె నప్పద్మనయన. 347**

**ప్రతి :** ఆ+పద్మనయన= పద్మనేత్ర ఐన ఆ చిత్రరేఖ; కమనీయ= ఇంపైన; సంగీత= సంగీతంతో; కలిత= కూడిన; కోవిదులు= పాండిత్యం కలవారు; కింపురుష= కింపురుషులు; గంధర్వ= గంధర్వజాతివారు; కిన్నరులు= కిన్నరజాతివారు; వీరు+ఎ= వీరే; సతత= ఎల్లపుడు; యౌవన= మంచిప్రాయంలో; యదృచ్ఛావిహారులు= ఇష్టం వచ్చినట్లు సంచరించే; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; చారణ= చారణజాతివారు; నభస్+చరులు= గరుడులూ; వీరు+ఎ= వీరే; ప్రవిమల= మిక్కిలి నిర్మలమైన; సౌఖ్య= సుఖాలయొక్క; సంపత్+వైభవులు= సంపదతో మహిమ గల్గినవారు; సుధా+అశన= దేవతలు; మరుత్= మరుత్తులు; యక్ష= యక్షులు; రాక్షసులు; వీరు+ఎ= వీరె; నిర్+ఉపమ= సాటిలేని; రుచి+కళా= కాంతికళలతో; అన్విత= కూడినట్టి; కామరూపులు+ఐ= ఇచ్ఛారూపం కలవారై; పొగడు+అందునట్టి= ప్రశంసింపబడే; పన్నగులు= నాగ జాతివారు; వీరు+ఎ= వీరె; చూడుము+అని= చూడుమని; నేర్పు= నేర్పు; దీపింపన్= ప్రకాశించగా; చూపుటయున్= చూపగా; చిత్తము= మనస్సు; నిజ= తనయొక్క; మనోరథసిద్ధిపడయన్= మనస్సునందలి కోరిక ఫలించుటను పొందుటకై; చాలక+ఉండినన్= చాలినదికాకపోగా; మధ్యమక్ష్మాతల+అధిపతులన్= భూలోకంలోని రాజుల్ని; చూపుచున్+వచ్చెను= చూపసాగింది.

**తా :** ఉషా! సంగీతకోవిదులైన గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు - వీరే! నిత్యయౌవనులు, స్వేచ్ఛావిహారులు, ఆకాశగమనులు అయిన సిద్ధులు, సాధ్యులు, చారణులు - వీరే! నిర్మలమైన సౌఖ్యసంపదల మహిమగల్గిన దేవతలు, మరుత్తులు, యక్షులు, రాక్షసులు - వీరే! కళానిధులై, కామరూపులై ప్రశస్తులైన నాగకుమారులు - వీరే! చూడుము అని ఆమె చూపించగా అందు తన ప్రియుడు కన్పించనందున మిన్నకున్నది. చిత్రరేఖ అప్పుడు భూలోకంలోని రాజుల్ని చూపసాగింది.

**ఉ. మాళవకొంకణద్రవిడమత్స్యపుళిందకళింగభోజనే**
**పాళవిదేహపాండ్యకురుబర్బరసింధుయుగంధరాంధ్రబం**
**గాళకరూశటేంకణత్రిగర్తసుధేష్ణమరాటలాటపాం**
**చాలనిషాదఘూర్జరకసాళ్వమహీశులు వీరె కోమలీ! 348**

**ప్రతి :** కోమలీ= ఓ రాజకుమారీ!; మాళవ= మాళవం; కొంకణ= కొంకణం; ద్రవిడ= ద్రవిడం; మత్స్య= మత్స్యం; పుళింద= పుళిందం; కళింగ= కళింగం; భోజ= భోజం; నేపాళ= నేపాళం; విదేహ=విదేహం; పాండ్య= పాండ్యం; కురు= కురువు; బర్బర= బర్బరం; సింధు= సింధువు; యుగంధర= సాళ్వదేశంలోని యొక రాష్ట్రం; ఆంధ్ర= ఆంధ్రం; బంగాళ= బంగాళం; కరూశ= కరూశం; టేంకణ= టేంకణం; త్రిగర్త= త్రిగర్తం; సుధేష్ణ= సుధేష్ణం; మరాట= మరాటం; లాట= లాటం; పాంచాల= పాంచాలం; నిషాద= నిషాదం; ఘూర్జరక= ఘూర్జరకం; సాళ్వ= సాళ్వం - అనే దేశాలయొక్క; మహీ+ఈశులు= ప్రభువులు; వీరు+ఎ= వీరే!

**తా :** ఓ రాజకుమారీ! వీరు - మాళవ, కొంకణ, ద్రవిడ, మత్స్య, పుళింద, కళింగ, భోజ, నేపాల, విదేహ, పాండ్య, కురు, బర్బర, సింధు, యుగంధర, ఆంధ్ర, బంగాళ, కరూశ, టేంకణ, త్రిగర్త, సుధేష్ణ, మరాట, లాట, పాంచాల, నిషాద, ఘూర్జరక, సాళ్వదేశప్రభువులు చూడుము.

**ఉ. సింధురవైరివిక్రముఁడు శీతమయూఖమరాళికాపయ**
**స్సింధుపటీరనిర్మలవిశేషయశోవిభవుండు శౌర్యద**
**ర్పాంధరిపుక్షితీశనికరాంధతమఃపటలార్కుఁ డీ జరా**
**సంధునిఁ జూడు మాగధుని సద్బృహదశ్వసుతుం గృశోదరీ! 349**

**ప్రతి :** కృశ+ఉదరీ= సన్నని నడుముగల ఓ ఉషా!; సింధురవైరివిక్రముఁడు= సింహపరాక్రమం కలిగినవాడు; శీతమయూఖ= చంద్రునివలె; మరాళిక= హంసవలె; పయస్+సింధు= పాలకడలిలాగా; పటీర= చందనంవలె; నిర్మల= శుద్ధమైన; విశేష= అధికమైన; యశస్= కీర్తి అనే; విభవుండు= గొప్ప సంపద కలవాడు; శౌర్య= పరాక్రమంయొక్క; దర్ప+అంధ= గర్వంచే గుడ్డివారయిన; రిపుక్షితి+ఈశ= శత్రురాజులయొక్క; నికర= సమూహం యొక్క; అంధతమస్= గుడ్డితనంయొక్క; పటల= సమూహానికి; అర్కుడు= సూర్యునివంటివాడు; ఈ= ఈయొక్క; మాగధునిన్= మగధదేశపు ప్రభువును; సత్= శ్రేష్ఠుఁడైన; బృహదశ్వసుతున్= బృహదశ్వుని కుమారుడగు; జరాసంధున్= జరాసంధుణ్ణి; చూడుము= చూడు.

**తా :** ఓ రాజకుమారీ! సింహపరాక్రముడూ, చంద్రుడు, హంసలు, పాలసంద్రం, మంచిగంధం – వీటివలె స్వచ్ఛమైన కీర్తిగలవాడు, బలగర్వితులైన శత్రురాజులనెడి చీకటిని కూల్చే సూర్యునివలె మహాతేజోవంతుడు, బృహదశ్వుని కొడుకు, మగధదేశాధీశ్వరుడూ అయిన, జరాసంధుడు – ఇతడు. చూడుము.

**మ. సకలోర్వీతలనాథసన్నుతుఁడు శశ్వద్భూరిబాహాబలా**
**ధికు డుగ్రాహవకోవిదుండు త్రిజగద్విఖ్యాతచారిత్రకుం**
**దకలంకోజ్జ్వలదివ్యభూషుఁడు విదర్భాధీశ్వరుండైన భీ**
**ష్మకభూపాలకుమారుఁ జూడు మితనిన్ మత్తద్విరేఫాలకా! 350**

**ప్రతి :** మత్త+ద్విరేఫ+అలకా!= మదించిన తుమ్మెద ముంగురులువంటి వెంట్రుకలు కలదానా! ఓ ఉషాకన్య!; సకల+ఉర్వీతలనాథ= రాజులందరిచేత; సన్నుతుఁడు= పొగడ్తలందినవాడు; శశ్వత్= నిరంతరం; భూరి= గొప్పదైన; శశ్వత్; బాహాబల+అధికుండు= భుజబలంచేత గొప్పవాడు; ఉగ్ర+ఆహవకోవిదుండు= భయంకరమైన యుద్ధంలో నేర్పరి; త్రిజగత్+విఖ్యాత= మూడులోకాల్లో ప్రసిద్ధమైన; చారిత్రకుండు= చరిత్రకలవాడు; అకలంక= స్వచ్ఛమైన; ఉజ్జ్వల= కాంతిమంతమైన; దివ్య= పవిత్రమైన; భూషుఁడు= అలంకారాలు గలవాడు; విదర్భ+అధీశ్వరుండు+ఐన= విదర్భకు ప్రభువగు; భీష్మకభూపాల= భీష్మకమహారాజుయొక్క; కుమారున్= కుమారుడైన రుక్మి అనే; ఇతనిన్= ఇతణ్ణి; చూడుము= చూడవమ్మా!

**తా :** ఓ ఉషా! సమస్త రాజులందరిచేత పొగడ్తలందినవాడు, భుజబలసంపన్నుడు, భయంకరయుద్ధాల్లో నేర్పరి, మూడులోకాల్లో ప్రఖ్యాతచరిత్ర కలవాడు, స్వచ్ఛమైన కాంతిమంతమైన అలంకారాలు కలవాడు, విదర్భప్రభువైన భీష్మకునివైన కుమారుడు రుక్మి అనే ఇతణ్ణి చూడమ్మా!

**ఉ. సంగరరంగనిర్దళితచండవిరోధివరూధినీశ మా**
**తంగతురంగసద్భటరథప్రకరైకభుజావిజృంభణా**

**భంగపరాక్రమప్రకటభవ్యయశోమహనీయమూర్తి కా**
**ళింగుఁడు వీఁడె చూడు తరళీకృతచారుకురంగలోచనా! 351**

**ప్రతి :** తరళీకృత= తళుకు బెళుకులతో కదలాడే; చారు= అందమైన; కురంగలోచనా!= జింక కన్నులవంటి కన్నులు కలదానా ఉషా!; వీడు= ఈయనయే; సంగరరంగ= యుద్ధభూమిలో; నిర్దళిత= చీల్చబడిన; చండ= భయంకరమైన; విరోధి= శత్రువులు; వరూధినీ+ఈశ= సైన్యాధిపతులు; మాతంగ= ఏనుగులు; తురంగ= గుఱ్ఱాలు; సత్+భట= పరాక్రమవంతులైన భటులు; రథప్రకర= రథాల సమూహాలు కలిగిన; ఏకభుజ= ఒంటిచేతితో; విజృంభణ= చెలరేగుటలో; అభంగ= మొక్కవోని; పరాక్రమ= పరాక్రమంచేత; ప్రకట= స్పష్టమైన; భవ్య= ప్రసిద్ధమైన; యశస్= కీర్తిచేత; మహనీయమూర్తి= గొప్ప స్వరూపం గలవాడు; కాళింగుఁడు= కళింగదేశపురాజు; చూడు= చూడవమ్మా!

**తా :** జింక కన్నులవంటి తళుకు బెళుకులుగల కన్నులున్న ఓ ఉషా! ఈయన శత్రుసైన్యాన్ని రణరంగంలో చెండాడేవాడు. శత్రురాజుల చతురంగబలాన్ని తన పరాక్రమంతో జయించిన మహాయశస్వి - కాళింగుడు సుప్రసిద్ధుడు. అట్టి వీరాగ్రేసరుణ్ణి చూడమ్మా!

**మ. సుగుణాంభోనిధి ఫాలలోచను నుమేశు న్నాత్మ మెప్పించి శ**
**క్తి గరిష్ఠంబగు శూలముం బడసె నక్షీణప్రతాపోన్నతిన్**
**జగతిన్ మిక్కిలి మేటివీరుఁడు రణోత్సాహుండు భూపౌత్రుఁ డీ**
**భగదత్తుం గనుఁగొంటె! పంకజముఖీ! ప్రాగ్జ్యోతిషాధీశ్వరున్. 352**

**ప్రతి :** పంకజముఖీ= పద్మంవంటి ముఖం కలిగినదానా ఉషా!; సుగుణ+అంభోనిధి= మంచిగుణాలకు సముద్రునివంటివాడు; ఫాలలోచనున్= నుదుటకన్నుగలవాడైన; ఉమా+ఈశున్= శివుణ్ణి; ఆత్మన్= మనస్సునందు; మెప్పించి= మెచ్చుకొనేట్టుగాచేసి; శక్తిన్= భలంచేత; గరిష్ఠంబగు= శ్రేష్ఠమయింది అగు; శూలమున్= శూలాన్ని; పడసెన్= పొందాడు; అక్షీణ= క్షీణింపని; ప్రతాప+ఉన్నతిన్= పరాక్రమాధిక్యంతో; జగతిన్= ప్రపంచంలో; మిక్కిలి= అధికమైన; మేటి= సాటిలేని; వీరుఁడు= శూరుడు; రణ+ఉత్సాహుండు= యుద్ధమందు ఉత్సాహం గలవాడు; భూపౌత్రుండు= భూదేవిమనుమడైన; ఈ= ఈ; ప్రాగ్జ్యోతిష+అధీశ్వరున్= ప్రాగ్జ్యోతిషప్రభువైన; భగదత్తున్= భగదత్తుణ్ణి; కనుగొంటివి+ఏ= చూచితివా? (చూడుము)

**తా :** ఈశ్వరుణ్ణి మెప్పించి మహాశక్తిమంతమైన శూలాన్ని పొందినవాడు, ప్రపంచంలోని రాజుల్లో మిక్కిలి పరాక్రమవంతుడు, యుద్ధోత్సాహుడు, భూదేవిమనుమడు అయిన ప్రాగ్జ్యోతిషపురప్రభువయిన భగదత్తుణ్ణి చూడవమ్మా! పద్మముఖీ!

**మ. వికచాంభోరుహపత్రనేత్రుఁ డగు గోవిందుండు దాఁ బూను నం**
**దకచక్రాబ్జగదాదిచిహ్నములచేతన్ వాసుదేవాఖ్య ను**
**త్సుకుఁడై యెప్పుడు మచ్చరించు మదిఁ గృష్ణుం డన్న నేమేటి పౌం**
**డ్రకుఁ గాశీశసఖుం గనుంగొనుము వేడ్కం జంద్రబింబాననా! 353**

**ప్రతి :** చంద్రబింబ+ఆననా= చంద్రబింబంవంటి ముఖం కలిగినదానా ఉషా!; వికచ= వికసించిన; అంభోరుహ పత్రనేత్రుడు+అగు= తామరరేకులవంటి కన్నులుకలిగిన; గోవిందుండు= కృష్ణుడు; తాన్+పూను= తాను ధరించే; నందక=

నందకమనే ఖడ్గం; చక్ర= సుదర్శనచక్రం; అబ్జ= పాంచజన్యమనే శంఖం; గద= కౌమోదకి అనే గద; ఆది= మొదలైనవాని; చిహ్నముల చేతన్= గుర్తులచేత; ఈమేటి= ఈ ఘనుడు; వాసుదేవ+ఆఖ్యన్= వాసుదేవుని కుమారుడగు కృష్ణునిపేరుతో; ఉత్సుకుఁడు+ఐ= ఉవ్విళ్లూరువాఁడై; ఎప్పుడున్= ఎల్లపుడు; కృష్ణుఁడు+అన్నన్= కృష్ణుడంటే; మదిన్= మనస్సున; మచ్చరించుచున్= ఓర్వలేనివాడవుతూ; కాశీ+ఈశ+సఖున్= కాశీరాజుకు మిత్రుడు అయిన; పౌండ్రకునిన్= పౌండ్రకుణ్ణి; వేడ్కన్= కుతూహలంతో; కనుంగొనుము= చూడమ్మా!

**తా :** శ్రీమన్నారాయణుడు ధరించే ఖడ్గం, చక్రం, శంఖం, గద మున్నగు చిహ్నాలు తానూ ధరించి, వాసుదేవుడనే పేరుగల శ్రీకృష్ణుణ్ణి ఎల్లపుడు ద్వేషించేవాడు, కాశీరాజుకు స్నేహితుడు అగు ఈ పౌండ్రక వాసుదేవుడు అనే కుతూహలంతో చూడమ్మా! చంద్రముఖీ!

**మ. ద్విజశుశ్రూషయు సూనృతవ్రతము సద్వృత్తిన్ భుజాగర్వమున్**
**విజయాటోపముఁ జాపనైపుణియు ధీవిస్ఫూర్తియుం గల్గు నీ**
**రజనీనాథకులప్రదీపకులఁ బాఱం జూడు పద్మాక్షి! ధ**
**ర్మజ భీమార్జున మాద్రినందనుల సంగ్రామైకపారీణులన్. 354**

**ప్రతి :** పద్మ+అక్షి!= పద్మంవంటి కన్నులు కలదానా! (ఓ రాజకుమారీ!); ద్విజ= బ్రాహ్మణులయొక్క; సద్వృత్తిన్= సత్ప్రవర్తన; శుశ్రూషయు= సేవ; సూనృతవ్రతమున్= సత్యభాషణవ్రతము; భుజాగర్వం= బాహువుల మదం; విజయ+ఆటోపము= విజయంయొక్క సంభ్రమం; చాపనైపుణియున్= వింటియొక్క నేర్పరితనం; ధీవిస్ఫూర్తియున్= బుద్ధియొక్కప్రకాశం; కల్గు= కలిగిన; సంగ్రామ+ఏక+పారీణులన్= యుద్ధప్రవీణులైన; ఈ= ఈ; రజనీనాథకుల= చంద్రవంశాన్ని; ప్రదీపకులన్= ప్రకాశింపచేసేవారైన; ధర్మజ= ధర్మరాజును; భీమ= భీముణ్ణి; అర్జున= అర్జునుణ్ణి; మాద్రినందనులన్= మాద్రికుమారులైన నకుల, సహదేవుల్ని; పాఱన్+చూడు(ము)= చక్కగా చూడుము.

**తా :** బ్రాహ్మణుల సేవ, సత్యవ్రతం, సత్ప్రవర్తన, బాహుగర్వం, బుద్ధి, విజయాటోపం, ధనుర్విద్యా నైపుణ్యం కలిగి, చంద్రవంశ ప్రదీపకులైన ధర్మరాజును, భీముణ్ణి, అర్జునుణ్ణి, నకుల సహదేవుళ్లను చక్కగా చూడు – రాజకుమారీ!

**మ. బలిమిన్ సర్వనృపాలుర న్నదిమి కప్పంబుల్ దగం గొంచు ను**
**జ్జ్వల తేజోవిభవాతిరేకమున భాస్వత్కీర్తి శోభిల్లఁగాఁ**
**బొలుపొందం దను రాజరా జన మహాభూరిప్రతాపంబులుం**
**గల దుర్యోధనుఁ జూడు సోదరయుతుం గంజాతపత్రేక్షణా! 355**

**ప్రతి :** కంజాతపత్ర+ఈక్షణా= తామర రేకులవంటి కన్నులు కల ఓ ఉషా!; బలిమిన్= పరాక్రమంతో; సర్వ= అందరు; నృపాలురన్+అదిమి= రాజులను అణచి; కప్పంబులన్= కానుకలను; తగన్= ఒప్పునట్లుగా; కొంచున్= తీసుకొంటూ; ఉజ్జ్వల= ప్రకాశించే; తేజస్= కాంతియొక్క; విభవ+అతిరేకమునన్= సంపదయొక్క అతిశయంతో; భాస్వత్+కీర్తి= ప్రకాశిస్తున్న కీర్తి; శోభిల్లన్+కాన్= అందగిస్తుండగా; పొలుపు+ఒందన్= వృద్ధి పొందుతూ; తనున్= తనను; రాజరాజు+అనన్= రాజులకురాజు అని అంటుండగా; మహా= గొప్పదైన; భూరి= భూరి; ప్రతాపంబులున్= గొప్ప ప్రతాపం; కల= కలిగిన; సోదరయుతున్= తమ్ముళ్ళతో కూడిన; దుర్యోధనున్= దుర్యోధనుణ్ణి; చూడు= చూడుము.

**తా :** కమలాక్షీ! తన పరాక్రమంతో శత్రురాజులను అణచివేసి కప్పాలు తీసుకొనేవాడు; మహాప్రతాపసంపన్నుడూ, రారాజు అనే కీర్తిని పొందినవాడు అయిన, తన సోదరులతో కూడిన దుర్యోధనుణ్ణి జూడు.

**వ. అని యిట్లు సకలదేశాధీశ్వరులగు రాజవరుల నెల్లఁ జూపుచు యదువంశసంభవులైన శూరసేన వసుదేవోద్ధవాదులం జూపి మఱియును. 356**

**ప్రతి :** అని= అని; ఇట్లు= ఈ విధంగా; సకలదేశ+అధీశ్వరులు+అగు= అన్ని దేశాలకు ప్రభువులయిన; రాజవరులన్= రాజశ్రేష్ఠులను; ఎల్లన్= అందరిని; చూపుచున్= చూపిస్తూ; యదువంశసంభవులు+ఐన= యదువంశములో జన్మించిన; శూరసేన= శూరసేనుడు; వసుదేవ+ఉద్ధవ+ఆదులన్= వసుదేవుడు, ఉద్ధవుడు మున్నగువారిని; చూపి= చూపించి; మఱియును= ఇంకా...

**తా :** ఈ విధంగా రాజులందరిని చూపుతూ, యదువంశంలో జన్మించిన శూరసేనుడు, వసుదేవుడు, ఉద్ధవుడు మొదలగువారిని చూపింది. ఇంకా

**ఉ. శారదనీరదాబ్జఘనసారసుధాకరకాశచంద్రికా**
**సార పటీరవర్ణు, యదుసత్తము, నుత్తమనాయకుం, బ్రమ**
**త్తారినృపాలకాననహుతాశనమూర్తిఁ, బ్రలంబదైత్య సం**
**హారునిఁ, గామపాలుని హలాయుధుఁ, జూడుము దైత్యనందనా! 357**

**ప్రతి :** దైత్యనందనా!= రాక్షస రాజకుమారీ! (ఓ ఉషాకన్యా); శారద= శరత్కాలమందలి; నీరద= మేఘంవలె; అబ్జ= తామరవలె; ఘనసార= పచ్చకర్పూరంవలె; సుధాకర= చంద్రునివలె; కాశ= రెల్లువలె; చంద్రికాసార= వెన్నెలధారవలె; పటీర= చందనంవంటి; వర్ణున్= స్వచ్ఛమైన శరీరవర్ణం కలవాణ్ణి; ఉత్తమ= శ్రేష్ఠుడైన; నాయకున్= నాయకుణ్ణి; యదుసత్తమున్= యాదవశ్రేష్ఠుణ్ణి; ప్రమత్త= బాగుగ మత్తెక్కిన; అరినృపాల= శత్రురాజులనే; కానన= అరణ్యాలకు; హుత+అశనమూర్తిన్= అగ్ని స్వరూపమైనవాణ్ణి; ప్రలంబ= ప్రలంబుడనే; దైత్య= రాక్షసుణ్ణి; సంహారునిన్= చంపినవాణ్ణి; కామపాలునిన్= కామపాలుడుగ ప్రసిద్ధిచెందిన; హల+ఆయుధున్= నాగలి ఆయుధంగా కలిగిన బలరాముణ్ణి; చూడుము= చూడవమ్మా! ఉషావధూ!

**తా :** రాక్షస రాజకుమారీ! శరత్కాలమందలి మేఘంవలె, పచ్చకర్పూరంవలె, చంద్రునివలె, వెన్నెలవలె, చందనంవలె, శోభిస్తున్న ఈతడు బలరాముడు. ఉత్తమనాయకుడు, మదించిన శత్రురాజులనే కాననానికి అగ్నిదేవునివంటివాడు. ప్రలంబరాక్షసుణ్ణి సంహరించినవాడు, హలాయుధుడు. ఇతణ్ణి చూడవమ్మా! ఉషాకన్యా!

**సీ. కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రు, వసుధాకళత్రుఁ బావనచరిత్రు**
**సత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు, నతపన్నగాకల్పు నాగతల్పుఁ**
**గౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు, శ్రితజనపోషు నంచితవిశేషు**
**నీలనీరదకాయు నిర్జితదైతేయు, ధృతపీతకౌశేయు నతవిధేయు**

**తే. నఘమహాగదవైద్యు వేదాంతవేద్యు, దివ్యమునిసన్నుతామోదుఁ దీర్ఘపాదు**
**జిష్ణు వరసద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ, జూడు దైతేయకులబాల! సుభగలీల! 358**

**ప్రతి :** దైతేయకుల బాల= రాక్షసకులంలోని బాల!; కమనీయ= ఇంపైన; శుభగాత్రున్= శుభమైన దేహం కలవాణ్ణి; కంజాతదళనేత్రున్= పద్మదళనేత్రుణ్ణి; వసుధాకళత్రున్= భూదేవికి భర్తను; పావనచరిత్రున్= పవిత్రమైన నడవడికలవాణ్ణి; సత్యసంకల్పున్= సత్యమే ఉద్దేశంగా కలవాణ్ణి; నిశాచర= రాక్షసులకు; ఉగ్ర= క్రూరమైన; వికల్పున్= ప్రళయం చేసేవాడు (నాశం చేసేవాడు); నత= నమస్కరించిన; పన్నగ+ఆకల్పునిన్= సర్పభూషణుడైన శివుడు గలవాణ్ణి (ఆకల్పము= వస్త్రాది అలంకారం); నాగతల్పున్= పామును పడకగా కల్గినవాణ్ణి; కౌస్తుభమణిభూషున్= కౌస్తుభమణి సొమ్మైనవాణ్ణి; గంభీరమృదుభాషున్= గంభీరంగా, సుకుమారంగా మాట్లాడేవాణ్ణి; శ్రితజనపోషున్= ఆశ్రయించినవారిని పోషించేవాణ్ణీ; అంచిత= ఒప్పిదమైన; విశేషు= చరిత్ర విశేషాలుకలవాణ్ణి; నీల నీరదకాయున్= నల్లని మేఘంవంటి శరీరం గలవాణ్ణి; నిర్జిత దైతేయున్= రాక్షసుల్ని జయించినవాణ్ణి; ధృత= ధరించిన; పీతకౌశేయున్= పచ్చని పట్టుబట్టను కట్టినవాణ్ణి (పీతాంబరం ధరించినవాణ్ణి); అఘ= పాపమనే; మహా+గద+వైద్యున్= గొప్ప రోగాలకు వైద్యంచేసేవాణ్ణి; వేద+అంత= ఉపనిషత్తులలో; వేద్యున్= తెలియదగినవాణ్ణి; దివ్యముని= దేవలోకసంబంధులైన మునులయొక్క; సన్నుత= పొగడ్తలచే; ఆమోదున్= సంతోషించేవాణ్ణి; తీర్థపాదున్= గంగ పుట్టినట్టి పాదాలు కలవాణ్ణి; జిష్ణున్= జయశీలుడైనవాణ్ణి; వర= శ్రేష్ఠమైన; సత్+గుణ= మంచిగుణాలచే; అలంకరిష్ణున్= అలంకరింపబడినవాణ్ణి; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; సుభగలీలన్= సౌభాగ్యలీలతో (కోరినవిధంగా); చూడు(ము)= చూడు.

**తా :** రాక్షసరాజకుమారీ! కంటికి ఇంపైన శరీరసౌందర్యంగలవాడు, పద్మపత్రాలవంటి విశాలనేత్రాలు గలవాడు, పవిత్రమైన నడవడిక కలవాడు, ఎల్లప్పుడూ సత్యమే సంకల్పంగా గలవాడు, రాక్షసులను సంహరించడంలో ఉగ్రస్వరూపుడు, శివునిచే నమస్కరింపబడేవాడు, ఆదిశేషునిపై పవ్వళించినవాడు,వక్షస్థలంలో కౌస్తుభమణిని ధరించినవాడు, గంభీరమైన కంఠస్వరంతోపాటు గంభీరంగా, మధురంగా మాట్లాడేవాడు, ఆశ్రితుల్ని రక్షించేవాడు, నల్లని మేఘంవంటి శరీరకాంతి గలవాడు, దుష్టశిక్షణ చేసినవాడు, పీతాంబరమనే పచ్చని పట్టువస్త్రాన్ని ధరించినవాడు, పాపాలనే రోగాలకు ఔషధమిచ్చే వైద్యుడు (భవరోగ వైద్యుడు), ఉపనిషత్తులచే తెలియదగినవాడు, దివ్యులైన మునులచే కీర్తింపబడినవాడు, తన పాదస్పర్శచే ఈ భూమిని పవిత్రీకరించినవాడు, నిత్య జయశీలుడు, సద్గుణాలచే అలంకరింపబడినవాడు అయిన ఈ శ్రీకృష్ణుణ్ణి చూడవమ్మా ఉషాకుమారీ!

**చ.** **స్ఫురదళిశింజినీరవవిభూషితపుష్పధనుర్విముక్త భా**
**స్వరనవచూతకోరకనిశాతశిలీముఖపాతభీత పం**
**కరుహభవాదిచేతననికాయు మనోజనిజాంశు రుక్మిణీ**
**వరసుతు రాజకీరపరివారుని మారునిఁ జూడు కోమలీ! 359**

**ప్రతి :** కోమలీ= సుకుమారియైన ఉషాసుందరీ!; స్ఫురత్= చలించే; అళి= తుమ్మెదల; శింజినీ= వింటినారి; రవ= శబ్దంతో; విభూషిత= అలంకరింపబడిన; పుష్ప= పూవుల; ధనుస్= వింటినుండి; విముక్త= విడువబడిన; భాస్వర= ప్రకాశించే; నవ= లేత; చూతకోరక= మామిడి చిగుళ్లరూపంలో ఉన్న; నిశాత= వాడియైన; శిలీముఖ= బాణాలు; పాత= పడుటచే; భీత= భయపడ్డ; పంకరుహ భవాది= పద్మంలో పుట్టిన బ్రహ్మమొదలైనవారి; చేతన= ప్రాణులయొక్క; నికాయున్= సమూహం కలవాణ్ణి; మనోజ= మన్మథునియొక్క; నిజ+అంశున్= స్వకీయభాగం గలవాణ్ణి; రుక్మిణీవరసుతున్= రుక్మిణీదేవియొక్క ప్రసిద్ధుడైన కుమారుణ్ణి; రాజకీర= రాచిలుకలు; పరివారునిన్= పరివారంగాకలిగిన; మారునిన్= మన్మథుణ్ణి; (ప్రద్యుమ్నుణ్ణి అనుట); చూడు= చూడవమ్మా!

**తా :** కోమలీ! ఈయన రుక్మిణీసుతుడయిన ప్రద్యుమ్నుడు. తన వింటినారి నుంచి విడువబడిన పుష్పబాణాల తాకిడిచే బ్రహ్మాదిదేవతలను చలింపజేయగల్గిన మన్మథుని అవతారమే ఈ ప్రద్యుమ్నుడు. చూడవమ్మా చూడు!

**వ. ఇ వ్విధంబునం జూపిన. 360**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధముగ; చూపినన్= చూపగ...

**తా :** ఈ విధంగా బలరామకృష్ణ ప్రద్యుమ్నుల్ని చూపగా

**మ. వనితారత్నము కృష్ణనందనునిభావప్రౌఢిఁ దాఁ జూచి గ్ర**
**ద్దనఁ ద న్నర్థి వరించి చన్న సుగుణోత్తంసంబ కా నాత్మలో**
**ననుమానించి యనంతరంబ యనిరుద్ధాఖ్యున్ సరోజాక్షు నూ**
**తనచేతోభవమూర్తిఁ జూచి మది సంతాపించుచు న్నిట్లనున్. 361**

**ప్రతి :** వనితారత్నము= స్త్రీలలో శ్రేష్ఠురాలైన ఉషాకన్య; కృష్ణనందనునిన్= కృష్ణుని కుమారుఁడైన ప్రద్యుమ్నుణ్ణి; భావప్రౌఢిన్= ఆలోచనాప్రాగల్భ్యంతో; తాన్= తాను; చూచి; గ్రద్దనన్= శీఘ్రంగా; తన్నున్= తనను; అర్థిన్= కోరికతో; వరించి= ప్రేమించి; చన్న= వెళ్ళిన; సుగుణ+ఉత్తంసంబు+అ= మంచిగుణాలకు తలమానికమైనవాడే; కాన్= అగునట్లు; ఆత్మలోన్= మనస్సులో; అనుమానించి= సందేహించి; అనంతరంబు+అ= తరువాత; సరోజ+అక్షున్= పద్మాలవంటి కన్నులు గలవాణ్ణి; నూతనచేతస్+భవమూర్తిన్= నవమన్మథమూర్తిని (అపరమన్మథాకారుణ్ణి); అనిరుద్ధ+ఆఖ్యున్= అనిరుద్ధుడనే పేరు కలవాణ్ణి; చూచి= చూచి; మదిన్= మనస్సులో; సంతాపించుచున్= సంతాపం చెందుతూ; ఇట్లు= ఈ విధంగా; అనున్= అంటూంది.

**తా :** స్త్రీలలో శ్రేష్ఠురాలైన ఉషాకుమారి కృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుణ్ణి సాలోచనగా చూచి, వెంటనే తనను వరించి, ప్రేమించి వెళ్లిన సుగుణవంతుడు ఇతడేనని మనస్సులో సందేహించి, ఆ తర్వాత పద్మపత్రనేత్రుడైన, అపర మన్మథాకారుడైన అనిరుద్ధు డనే పేరుకలవాణ్ణి కనులు విప్పిచూచి సంతాపంతో ఇలా అన్నది'.

**ఉ. ఇంతి మదీయమానధన మెల్ల హరించిన ముచ్చు నిమ్మెయిం**
**బంత మెలర్ప వ్రాసి పటభాగనిరూపితుఁ జేసినట్టి నీ**
**యంతటిపుణ్యమూర్తిఁ గొనియాడఁగ నేర్తునె? నీ చరిత్రముల్**
**వింతలె నాకు? నీ మహితవీరుకులంబు బలంబుఁ జెప్పుమా! 362**

**ప్రతి :** ఇంతి= చిత్రరేఖా!; మదీయ= నాయొక్క; మానధనము+ఎల్లన్= మానమనే ధనమంతా; హరించిన= దొంగిలించిన; ముచ్చున్= దొంగను; ఈ+మెయిన్= ఈ విధంగా; పంతము+ఎలర్పన్= ప్రతిజ్ఞ తీరునట్లు; వ్రాసి= చిత్రించి; పటభాగ= చిత్రలేఖన వస్త్రంలో; నిరూపితున్ చేసిన= చూపించిన; అట్టి= అట్టి; నీ+అంతటి= నీతో సమానమైన; పుణ్యమూర్తిన్= పుణ్యస్వరూపురాల్ని; కొని+ఆడగన్= ప్రశంసించడానికి; నేర్తున్+ఏ? (నేర్చుదునే)= చాలి ఉన్నానా?; నాకున్= నాకు; నీ= నీయొక్క; చరిత్రముల్= నడతలు; వింతలె= కొత్తవా?; ఈ= ఈ; మహిత= గొప్పవాడైన; వీరుకులంబు= వీరుని కులాన్ని; బలంబున్= పరాక్రమాన్ని; చెప్పుము+ఆ= తెల్పుము.

**తా :** చిత్రరేఖా! నా మానధనం అంతటినీ దొంగిలించిన వీనిస్వరూపాన్ని చిత్రించి చూపావు. పుణ్యస్వరూపిణివైన నిన్ను ప్రశంసించే నేర్పు నాకుందా? నీ చరిత్రలు నాకు కొత్తకాదు. ఈ వీరునికులాన్ని, పరాక్రమాన్ని నాకు తెల్పుము.

**చ. అనవుడుఁ జిత్రరేఖ జలజాక్షికి నిట్లను 'నీ కుమారకుం**
**దనఘుఁడు యాదవాన్వయసుధాంబుధిపూర్ణసుధాకరుండు నాఁ**
**దనరిన కృష్ణపౌత్త్రకుఁ దుదారచరిత్రుఁడు భూరిసింహ సం**
**హననుఁ దరాతిసైన్యతిమిరార్కుఁడు, పే రనిరుద్ధుఁ డంగనా! 363**

**ప్రతి :** అనవుడున్= అనినపిమ్మట; చిత్రరేఖ; జలజ+అక్షికిన్= తామరలవంటి కన్నులు గల ఉషతో; ఇట్లు+అనున్= ఇలా అంటుంది; అంగనా!= ఓ (ఉషా) స్త్రీ!; ఈ= ఈ; కుమారకుండు= బాలుడు; అనఘుఁడు= పుణ్యాత్ముడు; యాదవ+ అన్వయ= యాదవవంశం అనే; సుధా+అంబుధి= అమృత సముద్రానికి; పూర్ణసుధాకరుండు= నిండుజాబిల్లి; నాన్= అన్నట్లు; తనరిన= ఒప్పిన; కృష్ణ= కృష్ణునియొక్క; పౌత్రకుఁడు= మనుమడు; ఉదార= గొప్ప; చరిత్రుఁడు= నడవడికలవాడు; భూరి= గొప్పదైన; సింహసంహననుఁడు= సింహపరాక్రమం కలవాడు; అరాతిసైన్య= శత్రుసైన్యమనే; తిమిర= చీకటికి; అర్కుఁడు= సూర్యునివంటివాడు; పేరు= ఇతనిపేరు; అనిరుద్ధుఁడు= అనిరుద్ధుడు.

**తా :** చిత్రరేఖ రాజకుమారి అయిన ఉషతో ఇలా చెప్పింది. ఈ బాలుడు యాదవ వంశమనే అమృత సముద్రానికి చంద్రునివంటివాడు. శ్రీకృష్ణునియొక్క మనుమడు గొప్పనడవడిక కలవాడు. మిక్కిలి అందగాడు, సింహ శరీరుడు. ఈయన పేరు అనిరుద్ధుడు.

**వ. అని చెప్పి యే నతిత్వరితగతిం జని య క్కుమారరత్నంబుఁ దోడ్కొనివచ్చు నంతకు సంతాపింపకుండు మని యా క్షణంబ వియద్గమనంబునం జని ముందట. 364**

**ప్రతి :** అని= అని; చెప్పి= చెప్పి; ఏన్= నేను; అతి= మిక్కిలి; త్వరితగతిన్= వేగంగా; చని= వెళ్లి; ఆ+కుమార రత్నంబున్= ఆ కుమారశ్రేష్ఠుణ్ణి; తోడు+కొని= వెంటబెట్టుకొని; వచ్చు+అంతకున్= వచ్చేదాకా; సంతాపింపక= విచారించకుండా; ఉండుము= ఉండు; అని= అని (చెప్పి); ఆ క్షణంబు+అ= వెంటనే; వియత్+గమనంబునన్= ఆకాశమార్గంలో; చని= వెళ్లి; ముందటన్= ఎదుట...

**తా :** అని చెప్పి నేను మిక్కిలి వేగంతో వెళ్లి ఆ కుమారుణ్ణి తీసుకొనివస్తాను. అందాకా నీవు విచారించకు మనిపల్కి, ఆ క్షణమే ఆకాశయానంలో వెళ్లి ఎదుట

**క. సరసిజముఖి గనుఁగొనె శుభ, భరిత విలోకనవిధూతభవవేదనమున్**
**బరసాధనమును సుకృత, స్ఫురణాపాదనముఁ గృష్ణపుటభేదనమున్. 365**

**ప్రతి :** సరసిజముఖి= పద్మంవంటి ముఖమున్న చిత్రరేఖ; శుభభరిత= మేలుతోనిండిన; విలోకన= చూపుతోనే; విధూత= తోసివేయబడ్డ; భవవేదనమున్= సంసారదుఃఖం కలదాన్ని; పరసాధనమున్= పరలోకాన్ని సాధించేదాన్ని (ముక్తిని సాధించేదాన్ని); సుకృత= పుణ్యంయొక్క; స్ఫురణ+ఆపాదనమున్= ప్రకాశాన్ని కలిగించేదాన్ని; కృష్ణ= కృష్ణునియొక్క; పుటభేదనమున్= నగరాన్ని; కనుగొనెన్= చూచింది.

**తా :** ఎల్లప్పుడూ శుభాలతో నిండిందీ, తనను చూచినంతనే సంసారదుఃఖాల్ని తొలగించేదీ, ముక్తిసాధనమైందీ, పుణ్యతేజస్సును కలిగించేదీ అయిన శ్రీకృష్ణుని ద్వారకానగరాన్ని చిత్రరేఖ కళ్లారా చూచింది.

**వ. కని డాయం జని తదీయసుషమావిశేషంబులకుం బరితోషంబు నొందుచుం గామినీచరణ రణితమణి నూపురఝుణంఝుణధ్వనితమణిగోపురంబును, నతివిభవవిజితగోపురంబును నగు ద్వారకాపురంబు నిశాసమయంబునం బ్రచ్ఛన్నవేషంబునం జొచ్చి కనకకుంభకలితసౌధాగ్రంబున మణిదీపనిచయంబు ప్రకాశింపఁ జంద్రకాంతశిలాభవనంబున సుధాధామరుచిరరుచిచయంబు నపహసించు హంసతూలికా తల్పంబున నిజాంగనారతిశ్రమంబున నిద్రాసక్తుండై యున్న యనిరుద్ధుం జేరి తనయోగవిద్యామహత్త్వంబున నతని నెత్తుకొని మనోవేగంబున శోణపురంబునకుం జని బాణాసురనందన యగు నుషాసుందరీతల్పంబునం దునిచి యిట్లనియె. 366**

**ప్రతి :** కని= చూచి; డాయన్= సమీపానికి; చని= వెళ్లి; తదీయ= ఆ నగరానికి చెందిన; సుషమా= మిక్కిలి కాంతియొక్క; విశేషంబులకున్= విశేషలక్షణాలకు; పరితోషంబున్+ఒందుచున్= సంతోషిస్తూ; కామినీ= స్త్రీలయొక్క; చరణ= పాదాలయందలి; రణిత= ధ్వనిచేయు; మణినూపుర= మణులతో కూడిన అందెలచేత; ఝుణంఝుణ ధ్వనిత= ఝుణఝుణ శబ్దాలతో నిండిన; మణిగోపురంబును= మణులు తాపిన గోపురాలు కలదీ; అతివిభవ= ఎక్కువైన ఐశ్వర్యంచేత; విజిత= జయింపబడిన; గో= స్వర్గం; పురంబును= దేవపట్టణమైన అమరావతి కలిగిందీ; అగు= అయిన; ద్వారకాపురంబున్= ద్వారకానగరాన్ని; నిశా సమయంబునన్= రాత్రివేళలో; ప్రచ్ఛన్నవేషంబునన్= రహస్యవేషంతో; చొచ్చి= ప్రవేశించి; కనకకుంభ= బంగారు కుండలతో; కలిత= కూడిన; సౌధ+అగ్రంబునన్= భవనం పైభాగంలో; మణిదీప= మణిదీపాల; నిచయంబు= సమూహం; ప్రకాశింపన్= వెలుగుతుండగా; చంద్రకాంత శిలాభవనంబునన్= చలువరాళ్లభవనంలో; సుధాధామ= చంద్రునియొక్క; రుచిరరుచిచయంబున= అందమైన కాంతి సమూహాన్ని; అపహసించు= ఎగతాళిచేసే; హంసతూలికా= హంసల ఈకల; తల్పంబునన్= శయ్యమీద; నిజ+అంగనా= తన భార్యతోడి; రతి= సంయోగంవల్ల కలిగిన; శ్రమంబునన్= అలసటవలన; నిద్రా+ఆసక్తుఁడు+ఐ= నిద్రమీది ధ్యాస కలవాడయి; ఉన్న= ఉన్న; అనిరుద్ధున్= అనిరుద్ధుణ్ణి; చేరి= సమీపించి; తన= తనయొక్క; యోగవిద్యా= యోగవిద్యయొక్క; మహత్త్వంబునన్= గొప్పతనంతో; అతనిన్= అనిరుద్ధుణ్ణి; ఎత్తుకొని= అపహరించి; మనస్+వేగంబున్= మనోవేగంతో; శోణపురంబునకున్= శోణపురానికి; చని= వెళ్లి; బాణ+ అసురనందన+అగు= రాక్షసుడగు బాణుని కుమార్తె అయిన; ఉషాసుందరీ= ఉషాకన్యయొక్క; తల్పంబు+అందున్= పాన్పునందు; ఉనిచి= ఉంచి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అనింది.

**తా :** ద్వారకానగరాన్ని చూచి, దాని సుందరత్వానికి చాలా సంతోషించింది. రాత్రి సమయంలో ద్వారకలో ప్రవేశించింది. అక్కడ స్త్రీల పాదాలకుగల మణులు పొదిగిన అందెలయొక్క ఝుణఝుణధ్వనులతో ప్రతిధ్వనించే మణిగోపురాలున్నాయి. ఆ నగరంలోని మేడపైనున్న చంద్రకాంతశిలాభవనంలో హంసతూలికాతల్పంపై రతిసుఖశ్రమవల్ల నిద్రిస్తున్న అనిరుద్ధుణ్ణి తన యోగవిద్యావిశేషంతో గ్రహించి, ఉషాసుందరీ భవనానికి చేర్చి, అందు ఆమెశయ్యపై పరుండబెట్టి చిత్రరేఖ ఇలా అంది.

**క. వనజాక్షి! చూడు నీ విభు, ననిమిషనగధీరు శూరు నభినవమారున్**
**వనధిగభీరు నుదారుని, ననిరుద్ధకుమారు విదళితాహితవీరున్. 367**

**ప్రతి :** వనజ+అక్షి!= తామరలవంటి నేత్రాలుకలదానా!; (ఓ ఉషా!); అనిమిషనగధీరున్= మేరుపర్వతంతో సమానమైన ధైర్యం కలవాణ్ణి; శూరున్= పరాక్రమవంతుణ్ణి; అభినవమారున్= నవమన్మథుణ్ణి; వనధిగభీరు= సముద్రంవలె గంభీరమైనవాణ్ణి;

ఉదారునిన్= సరళస్వభావుణ్ణీ; విదళిత+అహితవీరున్= సంహరింపబడిన శత్రువీరుల్ని కలవాణ్ణి; నీ= నీయొక్క; విభునిన్= పతిని; అనిరుద్ధకుమారునిన్= అనిరుద్ధ కుమారుణ్ణి; చూడు= ప్రత్యక్షంగా చూడవమ్మా!

**తా :** ఉషా! మేరుపర్వతంతో సమానమైన ధైర్యవంతుడు, పరాక్రమవంతుడు, నవమన్మథుడు, సముద్రునివలె గంభీరమైనవాడు, శత్రువీరుల్ని సంహరించేవాడు, అయిన నీపతి అనిరుద్ధకుమారుణ్ణి చూడు.

**క. అనిన నుషాసతి దన మన, మున ననురాగిల్లి మేనఁ బులకాంకురముల్**
**మొనయఁగ నానందాశ్రులు, గనుఁగవ జడి గురియ ముఖవికాస మెలర్పన్. 368**

**ప్రతి :** అనినన్= అనిపలుకగా; ఉషాసతి= ఉషాకన్య; తన= తనయొక్క; మనమునన్= మనస్సులో; అనురాగిల్లి= ప్రేమ కలిగిందై; మేనన్= శరీరంలో; పులక+అంకురముల్= మొగ్గ తొడిగిన గగుర్పాట్లు; మొనయన్+కన్= కలుగగా; ఆనంద= సంతోషంవల్ల కలిగిన; అశ్రులు= కన్నీరు; కనుఁగవ= రెండుకండ్లనుండి; జడిన్= ఎడతెగక; కురియన్= వర్షింపగా; ముఖవికాసము= ముఖప్రకాశం; ఎలర్పన్= అతిశయింపగా...

**తా :** చెలిపలుకులకు ఉష మనస్సులో ప్రేమకలిగింది. శరీరంలో పులకాంకురాలు కలిగాయి. సంతోషంవల్ల కళ్లనుండి నీరు కారసాగింది. ముఖంలో కాంతి అతిశయిస్తుండగా

**వ. ఇట్లు మనంబున నుత్సహించి చిత్రరేఖం గనుంగొని యయ్యింతి యిట్లనియె. 369**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; మనంబునన్= మనస్సులో; ఉత్సహించి= విజృంభించి; చిత్రరేఖన్= చిత్రరేఖను; కనుంగొని= చూచి; ఆ+ఇంతి= ఆ స్త్రీ (ఉష); ఇలా= ఈ విధంగా; అనియెన్= అనింది.

**తా :** ఉషమనస్సుకు సంతోషం కాగా చిత్రరేఖను చూచి ఈ విధంగా పలికింది.

**సీ. అతివ! నీ సాంగత్య మను భానురుచి నాకుఁ, గలుగుటఁ గామాంధకార మడఁగెఁ**
**దరలాక్షి! నీ సఖిత్వం బను నావచేఁ, గడిఁది వియోగాబ్ధిఁ గడవఁ గంటి**
**నబల! నీ యనుబంధ మను సుధావృష్టిచే, నంగజసంతాప మార్పఁ గంటి**
**వనిత! నీ చెలితనం బను రసాంజనముచే, నా మనోహరనిధానంబుఁ గంటిఁ**

**తే. గలలఁ దోఁచిన రూప గ్రక్కన లిఖించు, వారు నౌనన్నఁ దోడ్తెచ్చువారు గలరె?**
**నీటిలో జాడఁ బుట్టించు నేర్పు నీక, కాక గల్గునె మూఁడులోకములయందు? 370**

**ప్రతి :** అతివ!= ఓ స్త్రీ (చిత్రరేఖా!); నీ= నీయొక్క; సాంగత్యము+అను= సహవాసం అనే; భాను= సూర్యునియొక్క; రుచి= కాంతి; నాకున్= నాకు; కలుగుటన్= కలుగుటచే; కామ+అంధకారము+అడఁగెన్= మన్మథవేదన అనే చీకటి నశించింది; తరల+అక్షి= చలించే కన్నులుగల చిత్రరేఖా!; నీ= నీయొక్క; సఖిత్వంబు+అను= చెలిమి అనే; నావచేన్= ఓడవల్ల; కడిది= లోతైన; వియోగ+అబ్ధిన్= ఎడబాటుకడలిని; కడవన్+కంటిన్= దాటగలిగాను; అబల= తరుణీ చిత్రరేఖా!; నీ= నీయొక్క; అనుబంధము+అను= చేరిక అనే; సుధావృష్టిచేన్= అమృతవర్షంచేత; అంగజ+సంతాపము= మన్మథ సంబంధమైన తాపాన్ని; ఆర్పన్+కంటిన్= చల్లార్చ కలిగాను; వనిత!= స్త్రీ (చిత్రరేఖా!); నీ= నీయొక్క; చెలితనంబు+అను= స్నేహం అనే; రస+అంజనముచేన్= (స్నేహ)రసమనే అంజనవిశేషంచేత; నా= నాయొక్క; మనోహరనిధానంబున్= ప్రియుడనే నిధిని;

కంటిన్= చూశాను; కలల= కలలలో; తోచిన= కన్పించిన; రూపు+అ= ఆకారాన్నే; గ్రక్కన= వెంటనే; లిఖించువారు= వ్రాసేవారునూ; ఔన్+అన్నన్= అంగీకరించగనే; తోడు+తెచ్చువారున్= వెంట తీసుకొను వచ్చేవారునూ; కలరు+ఎ?= ఉన్నారా?; నీటిలోన్= నీటిలోపల; జాడన్= త్రోవను; పుట్టించు= కల్పించే; నేర్పు= తెలివి; నీకున్+అ+కాక= నీకుతప్ప; మూడులోకముల+అందున్= స్వర్గ, మర్త్య, పాతాళలోకాలలో; కల్గున్+ఎ= ఎవరికైనా సంభవిస్తుందా?

**తా :** ఓ చిత్రరేఖా! నీ స్నేహమనే సూర్యకాంతిచే నా మన్మథతాపం అనే చీకటి నశించింది. నీ సఖిత్వం అనే ఓడను ఆధారం చేసుకొని మిక్కిలి ఎడబాటు అనే సముద్రాన్ని దాటాను. నీ సంబంధం అనే అమృతవర్షంచేతనే మన్మథతాపాన్ని ఆర్పినాను. నీ స్నేహమనే అంజనంవల్ల నా ప్రియుడు అనే నిధిని కనుగొన్నాను. ఆకారాన్ని చూచిన వెంటనే చిత్రాన్ని చిత్రింపకలవారుగానీ, ఔనని అంగీకరించిన వెంటనే తీసుకొనివచ్చేవారు కానీ ఎవరైనా ఉందురా? నీటిలో దారిని ఏర్పరచడం, నీకుతప్ప ఆ స్వర్గమర్త్యపాతాళలోకాలలో ఎవ్వరికైనా సాధ్యమౌతుందా?

**వ. అని వినుతించి చిత్రరేఖను నిజమందిరంబునకుం బోవం బనిచినం జనియె, ననంతరంబ వింతజనుల కెవ్వరికిం బ్రవేశింప రాని యంతఃపురసౌధాంతరంబున ననిరుద్ధుండు మేల్కని య య్యింతిం గనుంగొని యప్పుడు. 371**

**ప్రతి :** అని; వినుతించి= ప్రశంసించి; చిత్రరేఖను= చిత్రరేఖను; నిజమందిరంబునకున్= తన భవనానికి; పోవన్= వెళ్లేందుకు; పనిచినన్= పంపగా; చనియెన్= వెళ్లింది; అనంతరంబు+అ= తరువాత; వింతజనులకున్= క్రొత్తవారికి; ఎవ్వరికిన్= ఎవ్వరికిని; ప్రవేశింపరాని= ప్రవేశింపలేని; అంతఃపుర= అంతఃపుర; సౌధ= భవనంయొక్క; అంతరంబునన్= లోపలిభాగమున; అనిరుద్ధుండు= అనిరుద్ధుడు; మేల్కని= నిద్దురలోనుండి మేల్కని; ఈ+ఇంతినిన్= ఈ స్త్రీని (ఉషను); కనుంగొని= చూచి; అప్పుడు= ఆ సమయంలో…

**తా :** అని చిత్రరేఖను ప్రశంసించి, ఆమెను ఆమెభవనానికి వెళ్లవలసిందిగా చెప్పిపంపింది. తరువాత ఇతరులెవ్వరూ ప్రవేశింపలేని భవనంలో అనిరుద్ధుడు మేల్కొని ఉషను చూచాడు. అప్పుడు

**క. సురుచిరమృదుతల్పంబునఁ, బరిరంభణసరసవచనభావకళా చా**
**తురి మెఱయ రాకుమారుఁడు, తరుణీమణిఁ బొందె మదనతంత్రజ్ఞుండై. 372**

**ప్రతి :** రాకుమారుఁడు= అనిరుద్ధుడు; సురుచిర= అందమైన; మృదు= మెత్తనైన; తల్పంబునన్= సెజ్జపై; పరిరంభణ= కౌగిలింతలయొక్క; సరసవచన= శృంగార రసభరితమైన మాటలయొక్క; భావకళాచాతురి= భావాలు, కళలయొక్క నేర్పు; మెఱయన్= ప్రకాశింపగా; మదనతంత్రజ్ఞుడు+ఐ= మన్మథశాస్త్ర విషయం తెలుసుకొన్నవాడయి; తరుణీమణిన్= ఆ స్త్రీ రత్నాన్ని; పొందెన్= అనుభవించాడు.

**తా :** అందమైన, సుకుమారమైన సెజ్జపై బిగికౌగిలింతలు, సరసపు మాటలు, భావాలు, కళలూ – వీటియందలి నేర్పు తగినట్లుగా, మదనకళాతంత్రజ్ఞుడైన అనిరుద్ధుడు ఉషాకన్యతో శృంగారలీలావిలాసాలను అనుభవించాడు.

**వ. ఇవ్విధంబున నతిమనోహరవిభవాభిరామంబులగు దివ్యాంబరాభరణమాల్యానులేపనంబులను, గర్పూరతాంబూలంబులను, వివిధాన్నపానంబులను, సురుచిరమణిదీపనీరాజనంబులను, సుగంధ బంధురాగరుధూపంబులను, నాటపాటల వీణావినోదంబులను, బరితుష్టిం బొంది కన్యాకుమారకు**

**లానందసాగరాంతర్నిమగ్నమానసులై యుదయాస్తమయనిరూపణంబు సేయనేరక, ప్రాణంబు లొక్కటియైన తలంపులం గదిసి యిష్టోపభోగంబుల సుఖియించుచుండి, రంత. 373**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా; అతిమనోహర= మిక్కిలి అందమైన; విభవ+అభిరామంబులు+అగు= వైభవంతో ఒప్పినవి అగు; దివ్య+అంబర+ఆభరణ= విలువగల వస్త్రములు, నగలు; మాల్య+అనులేపనంబులను= పూలదండలతోను, శరీరానికి అలదుకొనే చందనపుపూతలతో; కర్పూరతాంబూలంబులను= కర్పూరపుతాంబూలాలతోను; వివిధ+అన్నపానంబులను= రకరకాల భోజనాలతో, పానీయాలతో; సురుచిర= కాంతిమంతమైన; మణి= మణుల; దీప= దీపాలయొక్క; నీరాజనంబులను= హారతులతోను; సుగంధ= మంచివాసనలతో; బంధుర= మేలైన; అగరు= పరిమళ ద్రవ్యాలయొక్క; ధూపంబులను= పొగలతోను; ఆటపాటలన్= ఆటలచేతను, పాటలచేతను; వీణా= వీణయొక్క; వినోదంబులను= వేడుకలతోడను; పరితుష్టిన్+పొంది= సంతృప్తిని పొంది; కన్యాకుమారకులు= ఉషా, అనిరుద్ధులు; ఆనంద= సంతోషమనెడి; సాగర= సముద్రంయొక్క; అంతర్= లోపల; నిమగ్న= మునిగిన; మానసులు+ఐ= మనస్సులు కలిగినవారై; ఉదయ+అస్తమయ= సూర్యుని రాకపోకలయొక్క; నిరూపణంబు= నిర్ణయం; చేయనేరక= చేయలేక; ప్రాణంబులు+ఒక్కటి+ఐన= ఇద్దరి ప్రాణాలూ ఒకటే అనే; తలంపులన్= ఆలోచనలతో; కదిసి= కూడి; ఇష్ట+ఉపభోగంబులన్= ప్రియమైన అనుభవాలతో; సుఖియించుచుండిరి= సుఖిస్తున్నారు; అంతన్= అంతట.

**తా :** ఈ విధంగా మనస్సును హరించే ఆభరణాలు, పూలదండలు, మైపూతలు, షడ్రసోపేతభోజనాలు, కర్పూరతాంబూలాలు, ఆటలు, పాటలు, అగరుధూపాలు, మణిదీపాలు, వీణావాదనలు మున్నగువానితో సూర్యోదయాస్తమానాలు తెలియనంతగా ఒక్కటై కాలం హాయిగా గడిపారు.

**విశే :** ఉపభోగములు : 1. అనుభవం 2. ఆస్వాదించుట 3. తినుట 4. వినియోగించుట 5. సంభోగం 6. విషయసుఖం.

**క. ఆలోనన యతిచర మగు, కాలము సుఖలీల జరుగఁగా వరుస నుషా**
**బాలాలలామ కొయ్యనఁ, జూ లేర్పడి గర్భ మొదవె సురుచిరభంగిన్. 374**

**ప్రతి :** ఆలోనన్+అ= ఆలోపలనే; అతిచరము+అగు= మిక్కిలి వేగంగా కదలే; కాలము= సమయం; సుఖలీలన్= సుఖక్రీడలతో; జరుగన్+కన్= కడవగా; వరుసన్= క్రమంగా; ఉషాబాలాలలామకున్= ఉషాకన్యకు; ఒయ్యనన్= నెమ్మదిగా; చూలు+ఏర్పడి= నెలతప్పి; సురుచిరభంగిన్= ప్రకాశించేట్టుగా; గర్భము= గర్భం; ఒదవెన్= కలిగింది.

**తా :** ఈ విధంగా కాలం మిక్కిలి వేగంగా గడుస్తుండగా ఉషాకన్యకు గర్భమేర్పడి చిహ్నాలు స్పష్టంగా కన్పించాయి.

**క. ఆ చిన్నె లంగజాలలు, సూచి భయాకులత నొంది స్రుక్కుచుఁ దమలో**
**నో చెల్ల! యెట్టులో? యీ, రా చూలికిఁ జూలు నిలిచెరా! యి బ్భంగిన్' 375**

**ప్రతి :** ఆ= ఆ; చిన్నెలు= గుర్తులు; అంగజాలలు= రాణివాసపుకావలివారు; చూచి= చూచి; భయ+ఆకులతన్+ఒంది= భయంవల్ల వ్యాకులం చెంది; స్రుక్కుచున్= దుఃఖిస్తూ; తమలోన్= తమలో తాము; ఓచెల్ల= అయ్యయో!; ఎట్టులు+ఓ= ఏ రీతిగానో!; ఈ= ఈ; రాచూలికిన్= రాజకుమారికి; ఈ భంగిన్= ఈ విధంగ; చూలు= గర్భం; నిలిచెరా!= స్థిరపడిందే.

**తా :** రాణివాసపు కావలివారు ఉషాబాలలో కన్పించే గర్భచిహ్నాలు చూశారు. భయపడ్డారు. ఈ రాజకుమార్తెకు గర్భం ఏ విధంగా కలిగింది అనుకొంటూ బాధపడ్డారు.

**క. అని గుజగుజ వోవుచు ని, ప్పని దప్పక దనుజలోకపాలునితోడన్**
**వినిపింపవలయు నని వే, చని బాణునిఁ జేరి మ్రొక్కి సద్వినయమునన్. 376**

**ప్రతి :** అని= అనుకొని; గుజగుజ+పోవుచున్= గుసగుసలాడుచు; ఈ+పనిన్= ఈ కార్యాన్ని; తప్పక= తప్పనిసరిగ; దనుజలోక= రాక్షసలోక; పాలునితోడన్= ప్రభువుతో; వినిపింపవలయును+అని= చెప్పాలని; వే= వేగంగా; చని= వెళ్లి; బాణునిన్= బాణాసురుణ్ణి; చేరి= సమీపించి; సత్+వినయమునన్= చక్కని వినయంతో; మ్రొక్కి= నమస్కరించి...

**తా :** ఏ విధంగా జరిగిందో అని తమలో తాము గుసగుసలాడుకొంటూ, ఈ విషయాన్ని తప్పక ప్రభువగు బాణాసురునికి చెప్పాలి అనుకొని, ప్రభువగు బాణాసురుని వద్దకుపోయి సవినయంగా నమస్కరించి

**క. మంతనమున దేవర! క, న్యాంతఃపుర మేము గాచి యరయుచు నుండన్**
**వింతజనములకుఁ జొరఁగ దు, రంతము విను పోతుటీఁగకైన సురారీ! 377**

**ప్రతి :** దేవర!= ప్రభూ!; సుర+అరీ= దేవతలకు శత్రువైనవాడా!; మంతనమునన్= ఏకాంతంలో; ఏము= మేము; కన్యా+అంతఃపురము= కన్యలయొక్క అంతఃపురాన్ని; కాచి= కనిపెట్టి; అరయుచున్+ఉండన్= విచారిస్తూండగా; వింతజనములకున్= కొత్త మనుషులకు; (పోతుటీగ) పోతు+ఈగకున్+ఐన= (చివరకు) మగ ఈగకైనా; చొరన్+కన్= ప్రవేశించడానికి; దుర్+అంతము= సాధ్యం కాదు.

**తా :** రాక్షసప్రభువైన బాణునితో కావలికాచే భటులు ప్రభూ! మేము కన్యాంతఃపురాన్ని ఎంతో రహస్యంగా, జాగ్రత్తగా కనిపెట్టి పరిశీలిస్తూ ఉంటాము. సురారీ! అందు పోతుటీగలకైనను ప్రవేశించడం కష్టం కాగా ఇక కొత్త మగవారి విషయం చెప్పడానికి వీలులేదు.

**తే. ఇట్టిచోఁ గావలున్న మే మెవ్వరమును, నేమి కనుమాయయో కాని యెఱుఁగ మధిప!**
**నీ కుమారిక గర్భంబు నివ్వటిల్లి, యున్న దన్నను విని రోషయుక్తుఁ డగుచు. 378**

**ప్రతి :** అధిప= ప్రభూ!; ఇట్టిచోన్= ఈ విధంగా; కావలి+ఉన్న= కాపలాకాస్తున్న; మేము+ఎవ్వరము= మాలో ఒక్కడుకూడా; ఏమి= ఎట్టి; కనుమాయయోకాని= కనుకట్టోకాని; ఎఱుగము= తెలుసుకొనలేక పోయాము; నీ= నీయొక్క; కుమారిక= కుమార్తె; గర్భంబు= కడుపు; నివ్వటిల్లి+ఉన్నది= ఏర్పడి ఉంది; అన్నను= అనగా; విని= విని; రోషయుక్తుఁడు= కోపంతో కూడినవాడు; అగుచున్= అయి...

**తా :** జాగ్రత్తగా కాపలాకాస్తున్నా, ఏ కనుకట్టోకాని మాకెవ్వరికీ తెలియకుండ, మీ కుమార్తె గర్భవతి అయింది అనేమాటలు విన్నబాణుడు కోపోద్రిక్తుడై

**వ. అట్టియెడ దానవేంద్రుండు రోషభీషణాకారుండై, కటము లదర, బొమలు ముడివడం, గనుంగవల ననలకణంబు లుప్పతిల్ల, సటలు వెఱికినం జటులగతి నెగయుసింగంబు విధంబున లంఘించుచు, భీకరకరవాలంబు గేలం దాల్చి సముద్దండగతిం గన్యాసౌధాంతరంబునకుం జని. 379**

**ప్రతి :** అట్టి+ఎడన్= ఆ సమయంలో; దానవ+ఇంద్రుండు= రాక్షసశ్రేష్ఠుఁడగు బాణుఁడు; రోష= కోపంతో; భీషణ+ఆకారుండు+ఐ= భయంకర రూపం కలవాడై; కటములు= చెక్కిళ్లు; అదరన్= కంపించగా; బొమలు= కనుబొమలు;

ముడివడన్= ముడిపడగా; కనుంగవలన్= కండ్లయందు; అనల= నిప్పు; కణంబులు= రవ్వలు; ఉప్పతిల్లన్= చెలరేగగా; సటలు+పెటికినన్= జూలు లాగగా; చటులగతిన్= తీవ్ర గమనంతో; ఎగయు= పైకిలేచే; సింగంబు విధంబునన్= సింహంవలె; లంఘించుచున్= దాటుతూ; భీకర= భయంకరమైన; కరవాలంబున్= ఖడ్గాన్ని; కేలన్= చేతియందు; తాల్చి= పట్టుకొని; సముద్దండగతిన్= భయంకరమైన నడకతో; కన్యాసౌధ+అంతరంబునకున్= ఉషాకన్య ఉండే భవనంలోపలికి; చని= వెళ్లి...

**తా :** ఆ సమయంలో రాక్షసశ్రేష్ఠుడైన బాణాసురుడు కోపంతో భయంకరుడై చెక్కిళ్లు అదరుతుండగా, కనుబొమలు ముడివడుచుండగా కండ్లనుండి నిప్పురవ్వలు రగులుతుండగా జూలు లాగిన సింహంవలె దాటుతూ ఖడ్గాన్ని ధరించి, ఉష భవనంలోకి మహావేశంతో ప్రవేశించి

## ❖ బాణాసురుం డనిరుద్ధుని నాగపాశబద్ధునిఁ జేయుట ❖

**సీ. కనియె శుభోపేతుఁ గందర్పసంజాతు, మానితదేహు నాజానుబాహు**
**మకరకుండలకర్ణు మహితప్రభాపూర్ణుఁ, జిరయశోల్లాసుఁ గౌశేయవాసుఁ**
**గస్తూరికాలిప్తు ఘనకాంతికుముదాప్తు, హారశోభితవక్షు నంబుజాక్షు**
**యదువంశతిలకు మత్తాలినీలాలకు, నవపుష్పచాపుఁ బూర్ణప్రతాపు**

**తే. నభినవాకారు నక్షవిద్యావిహారు, మహితగుణవృద్ధు మన్మథమంత్రసిద్ధుఁ**
**గలితపరిశుద్ధు నఖిలలోకప్రసిద్ధుఁ, జతురు ననిరుద్ధు నంగనాజననిరుద్ధు. 380**

**ప్రతి :** శుభ+ఉపేతున్= శుభలక్షణాలతో కూడినవాణ్ణి; కందర్పసంజాతున్= మన్మథుని కొడుకైనవాణ్ణి; మానితదేహున్= గౌరవింపదగ్గ దేహం కలవాణ్ణి; ఆజానుబాహున్= జానువులదాకా చేతులు కలవాణ్ణి; మకరకుండలకర్ణున్= మొసలి ఆకారంలో ఉండే చెవిపోగులు కలవాణ్ణి; మహిత ప్రభాపూర్ణున్= గొప్ప తేజస్సుచేత నిండినవాణ్ణి; చిర= శాశ్వతమైన; యశోల్లాసున్= కీర్తిచేత ప్రకాశించేవాణ్ణి; కౌశేయవాసున్= పీతాంబరమనే పట్టుబట్టలతో ఉన్నవాణ్ణి; కస్తూరికాలిప్తున్= కస్తూరి పూసుకొన్నవాణ్ణి; ఘనకాంతి= గొప్పదైన లావణ్యంచేత; కుముద+ఆప్తున్= చంద్రుడైనవాణ్ణి; ఘన= గొప్పవైన; హార= హారాలచే; శోభిత= ప్రకాశించబడిన; వక్షున్= వక్షస్థలం కలవాణ్ణి; అంబుజ+అక్షున్= తామరలవంటి కన్నులు కలవాణ్ణి; యదువంశ= యాదవవంశానికి; తిలకున్= శ్రేష్ఠుడైనవాణ్ణి; మత్త+అలి= మదించిన తుమ్మెదలవంటి; నీల+అలకున్= నల్లని ముంగురులు కలవాణ్ణి; నవపుష్పచాపున్= అభినవమన్మథుణ్ణి; పూర్ణప్రతాపున్= నిండుప్రతాపం కలవాణ్ణి; అభినవ+ ఆకారున్= నూత్నమైన రూపంతో ఉండేవాణ్ణి; అక్షవిద్యా= పాచికలాటలో; విహారున్= విహరించేవాణ్ణి; మహితగుణ= గొప్ప గుణాలచేత; వృద్ధున్= పెద్దయినవాణ్ణి; మన్మథమంత్రసిద్ధున్= మన్మథమంత్రంలో సిద్ధి పొందినవాణ్ణి; కలిత= కూడుకొన్న; పరిశుద్ధున్= పరిశుద్ధి కలవాణ్ణి; అఖిలలోకప్రసిద్ధున్= సర్వలోక ప్రసిద్ధుణ్ణి; చతురున్= నేర్పరినీ; అంగనాజన= స్త్రీ జనాన్ని; నిరుద్ధున్= సౌందర్యంచేత అడ్డగించేవాణ్ణి; అనిరుద్ధున్= అనిరుద్ధుణ్ణి; కనియెన్= చూచాడు.

**తా :** శుభలక్షణాలతో కూడినవాడు, మన్మథ కుమారుడు, మాన్యుడు, ఆజానుబాహుడు, చెవులకు మకరకుండలాలు గలవాడు, కాంతిమంతుడు, సత్కీర్తిమంతుడు, పీతాంబరాలు ధరించినవాడును, కస్తూరి లేపనంగలవాడు, చంద్రునివలె కాంతిమంతుడు హారాలతో శోభిల్లేవాడు, కమలాలవంటి కన్నులుగలవాడు, యదుకుల తిలకుడు, తుమ్మెదలవంటి నల్లని

ముంగురులు గలవాడు, నవమన్మథుడు, ప్రతాపోజ్జ్వలుడు, పాచికలాటలో కుశలుడు, సద్గుణసంపన్నుడు, మన్మథ మంత్రసిద్ధుడు, పరిశుద్ధుడు, లోకప్రసిద్ధుడు, తన సౌందర్యంతో స్త్రీలను అడ్డగించేవాడు అయిన అనిరుద్ధుణ్ణి బాణుడు చూశాడు.

**చ. కని కన లగ్గలింప సురకంటకుఁ డుద్ధతి సద్భటావళిం**
**గనుఁగొని యీ నరాధమునిఁ గట్టుఁడు, పట్టుఁడు, కొట్టుఁడన్న వా**
**రనుపమహేతిదీధితు లహర్పతితేజము మాయఁ జేయ డా**
**సిన నృపశేఖరుండు మదిఁ జేవయు లావును నేర్పు దర్పమున్. 381**

**ప్రతి :** సురకంటకుడు= దేవతలకు ముల్లువంటివాడైన బాణుడు; కని= చూచి; కనలు= కోపం; అగ్గలింపన్= అధికంకాగా; ఉద్ధతిన్= గర్వంతో; సత్+భట+ఆవళిన్= మంచి సైనికుల సమూహాన్ని; కనుంగొని= చూచి; ఈ= ఈ; నర+అధమునిన్= నీచమానవుణ్ణి; కట్టుడు= బంధించండి; పట్టుఁడు= పట్టుకోండి; కొట్టుఁడు= కొట్టండి; అన్నన్= అనగా; వారు= ఆ భటులు; అనుపమహేతి= సాటిలేని ఆయుధాల; దీధితుల్= కాంతులు; అహర్పతితేజము= సూర్యకాంతి; మాయన్+చేయన్= మాసిపోవునట్లు చేయగా; డాసినన్= సమీపించగా; నృపశేఖరుండు= రాజశ్రేష్ఠుడు (అనిరుద్ధుడు); మదిన్= మనస్సులో; చేవయున్= శక్తియు; లావును= బలమును; నేర్పు= ప్రావీణ్యం; దర్పమున్= గర్వం... (అహర్పతిః - అహ్నఃపతిః - పగటికి పతి - సూర్యుడు)

**తా :** రాక్షసరాజైన బాణునికి కోపం అధికమై ఈ నరాధముణ్ణి 'బంధించండి, పట్టుకోండి, కొట్టండి' అని ఆజ్ఞాపించగా, ఆ రాక్షసభటులు సాటిలేని ఆయుధాల కాంతులు సూర్యతేజస్సును మాసిపోయేట్టు చేస్తుండగా, అనిరుద్ధుణ్ణి బంధించడానికి దగ్గరికి వచ్చారు. అప్పుడు అనిరుద్ధుడు శక్తి, బలం, ప్రావీణ్యం, దర్పం

**చ. కలిగి, మహోగ్రవృత్తిఁ బరిఘంబు గరంబున లీలఁ దాల్చి దో**
**ర్బల ఘనవిక్రమప్రళయభైరవుభంగి విజృంభణక్రియా**
**కలన నెదిర్చె దానవనికాయముతోఁ దలపాటుఁ బోటునుం**
**జలము బలంబు ధైర్యమును శౌర్యము వ్రేటును వాటుఁ జూపుచున్. 382**

**ప్రతి :** కలిగి= కలవాడై; మహా+ఉగ్రవృత్తిన్= మిక్కిలి భయంకరవ్యాపారంతో; కరంబునన్= చేతిలో; పరిఘంబున్= ఇనుపగుదియను; లీలన్+తాల్చి= విలాసంగా ధరించి; దోస్+బల= భుజబలంచేత; ఘన= అధికమైన; విక్రమ= పరాక్రమంచేత; ప్రళయభైరవుభంగిన్= ప్రళయకాలభైరవుని (రుద్రుని) విధంగా; విజృంభణక్రియా+ఆకలనన్+ఎదిర్చెన్= చెలరేగుట అనే క్రియయొక్క కూడిక కలవాడై; దానవనికాయముతోన్= రాక్షస సమూహంతో; తలపాటున్= తలపడుటయు; పోటునున్= యుద్ధం; చలము= పట్టుదల; బలము= బలిమి; ధైర్యము= గంభీరత; శౌర్యము= పరాక్రమం; వ్రేటును= కొట్టుటయు; వాటున్= దెబ్బలును; చూపుచున్= ప్రదర్శిస్తూ; ఎదిర్చెన్= ఎదిరించాడు.

**తా :** అనిరుద్ధుడు ప్రళయకాలరుద్రునివలె విజృంభించి ఇనుపగుదియను పట్టుకొని, మహోగ్రతతో భయంకరుడై రాక్షసులను ఎదిర్చి, తన ధైర్యసాహసాలను ప్రదర్శించాడు.

**చ. పదములు బాహులుం దలలు ప్రక్కలు చెక్కులు జానుయుగ్మముల్**
**రదములు గర్ణముల్ మెడ లురంబులు మూఁపులు వీఁపు లూరువుల్**
**చిదురుపలై ధరం దొఱఁగఁ జిందఱవందఱ సేయ సైనికుల్**
**కదనపరాఙ్ముఖక్రమముఁ గైకొని పాఱిరి కాందిశీకులై. 383**

**ప్రతి :** పదములు= పాదాలు; బాహులు= భుజాలు; తలలు= తలలు; ప్రక్కలు= పార్శ్వాలు; చెక్కులు= చెంపలు; జానుయుగ్మము= మోకాళ్లరెండు; రదములు= దంతాలు; కర్ణముల్= చెవులు; మెడలు= మెడలు; ఉరంబులు= వక్షస్థలాలు; మూపులు= మూపులు; వీపులు= వీపులు; ఊరువుల్= తొడలు; చిదురుపలై= చిన్నముక్కలై; ధరన్= నేలపై; తొఱగన్= పడునట్లుగా; చిందఱవందర+చేయన్= చిన్నచిన్న ముక్కలుగా చేయగా; సైనికుల్= భటులు; కదన= యుద్ధానికి; పరాఙ్ముఖక్రమమున్= పెడమొగముపెట్టి పారిపోయే విధానాన్ని; కైకొని= గ్రహించి; కాందిశీకులై= దిక్కుతోచనివారై; పాఱిరి= పారిపోయారు.

**తా :** అనిరుద్ధుని యుద్ధకౌశలానికి దానవసైనికుల పాదాలు, చేతులు, తలలు, మోకాళ్లు, పండ్లు, చెవులు, మెడలు, తొడలు, వీపులు, మూపులు చిన్నచిన్న ముక్కలుగా భూమినిండా చిందర వందరగా పడ్డాయి. అనిరుద్ధునితో యుద్ధం చేయలేక రాక్షస సైనికులు రణరంగం నుంచి దిక్కుతోచక పారిపోయారు.

**వ. ఇవ్విధంబున సైన్యంబు దైన్యంబు నొంది వెఱచియుం, బఱచియు; విచ్చియుం, జచ్చియుఁ; గలంగియు, నలంగియు; విఱిగియు, సురిఁగియుఁ; జెదరియు, బెదరియుఁ; జేవదఱిఁగి నుఱుములై తన మఱుఁగు సొచ్చిన బాణుండు శౌర్యధురీణుండును, గోపోద్దీపిత మానసుండునై కదిసి యేసియు, వ్రేసియు; బొడిచియు, నడిచియుఁ బెనంగి. 384**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగ; సైన్యంబు= సైన్యం; దైన్యంబున్+ఒంది= దీనత్వాన్ని పొంది; వెఱచియున్= భయపడియు; పఱచియున్= పారిపోయియు; విచ్చియున్= చీలియును; చచ్చియున్= చనిపోయియు; కలంగియున్= కలతపడియు; విఱిగియు= విరిగియు; సురిగియున్= తప్పించుకొనియు; చెదరియున్= చెల్లా చెదరయియు; చేవ+తఱిగి= శక్తి తగ్గినవారునై; నుఱుములు+ఐ= ఖండింపబడినవారై; తన= తన (బాణాసురుని)యొక్క; మఱుఁగు+చొచ్చినన్= చాటుకురాగా; బాణుండు= బాణాసురుడు; శౌర్యధురీణుండును= పరాక్రమవంతుడూ; కోప+ఉద్దీపితమానసుండున్+ఐ= కోపంతో కూడిన మనస్సుకలవాడూ అయి; కదిసి= దగ్గరకు చేరి; ఏసియు= బాణములను వేసికూడా; వ్రేసియున్= ఖడ్గంతో నరికియు; పొడిచియున్= పొడిచియు; అడచియున్= అణచియును; పెనంగి= పోరి.

**తా :** ఈ విధంగా దానవసైన్యం చేవచచ్చి బాధతో భయంతో బెదరి చెదరి వచ్చి, బాణాసురుని మరుగు చొచ్చింది. బాణాసురుడు శౌర్యక్రోధాలతో అనిరుద్ధునిపై దూకి భీకర యుద్ధం చేశాడు.

**క. క్రుద్ధుండై యహిపాశ ని, బద్ధుం గావించె నసురపాలుఁడు రణ స**
**న్నద్ధున్ శరవిద్ధు నని, రుద్ధున్ మహితప్రబుద్ధు రూపసమృద్ధున్. 385**

**ప్రతి :** అసురపాలుఁడు= రాక్షసరాజు; క్రుద్ధుండు+ఐ= కోపించినవాడై; రణసన్నద్ధున్= యుద్ధానికి సిద్ధపడినవాణ్ణి; శరవిద్ధున్= బాణం దెబ్బ తగిలినవాణ్ణి; మహిత= గొప్ప; ప్రబుద్ధున్= తెలివితేటలు కలిగినవాణ్ణి; రూపసమృద్ధున్= రూపసమృద్ధి కలవాణ్ణి; అనిరుద్ధున్= అనిరుద్ధుణ్ణి; అహిపాశబద్ధున్+కావించెను= నాగపాశంచే బంధించాడు.

**తా :** బాణుడు యుద్ధంలో విజృంభించి, యుద్ధానికి సిద్ధపడ్డ అందగాడైన అనిరుద్ధుణ్ణి తన బాణాలచేత కొట్టి నాగపాశంతో బంధించాడు.

**వ. ఇట్లు కట్టి త్రోచిన నుషాసతి శోకవ్యాకులితచిత్తయై యుండె నంత. 386**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కట్టి= బంధించి; త్రోచినన్= ఒకవైపునకు తోసివేయగా; ఉషాసతి= ఉష; శోక= దుఃఖంచేత; వి+ఆకులిత= కలత పెట్టబడిన; చిత్తయై= మనస్సుకలిగిందై; ఉండెన్= ఉండింది; అంతన్= అంతట...

**తా :** ఈ విధంగా అనిరుద్ధుణ్ణి బంధించినందుకు ఉష దుఃఖంవల్ల మనస్సు కలతచెంది ఉండింది. అంతట

**క. నీలపటాంచితమై సువి, శాలంబై వాయునిహతిఁ జండధ్వని నా**
**భీలమగు నతని కేతన, మాలోన నకారణంబ యవనిం గూలెన్. 387**

**ప్రతి :** నీలపట+అంచితము+ఐ= నీలవర్ణపువస్త్రంతో ఒప్పిదమై; సువిశాలంబు+ఐ= విశాలమైందై; ఆభీలము+అగు= భయంకరమైన; అతని= ఆ బాణునియొక్క; కేతనము= జండా; (ధ్వజము); వాయునిహతిన్= గాలిఒత్తిడివల్ల; చండ= తీవ్రమైన; ధ్వనిన్= శబ్దంతో; ఆలోనన్= అప్పుడే; అకారణంబు+అ= కారణం లేకుండానే; అవనిన్= భూమిమీద; కూలెన్= కూలింది.

**తా :** తీవ్రంగా గాలివీచడంచేత బాణాసురుని నీలవర్ణపతాకం వెంటనే అకారణంగా పెద్ద ధ్వనితో నేలపై కూలింది.

**క. అది చూచి దనుజపాలుఁడు, మదనాంతకుఁ డాడినట్టిమాట నిజముగాఁ**
**గదనంబు గలుగు ననుచును, నెదురెదురే చూచుచుండె నెంతయుఁ బ్రీతిన్. 388**

**ప్రతి :** అదిచూచి= ఆ పతాకం పడిపోవడం చూచి; దనుజపాలుఁడు= రాక్షసరాజు (బాణుడు); మదన+అంతకుఁడు= మన్మథుణ్ణి సంహరించినవాడైన శివుడు; ఆడిన+అట్టిమాట= పలికిన మాట; నిజముకాన్= యథార్థం అగునట్లుగా; కదనంబు= యుద్ధం; కలుగున్+అనుచున్= కలుగుతుందని; ఎంతయున్= మిక్కిలి; ప్రీతిన్= ప్రేమతో; ఎదురు+ఎదురు+ఏ= ఎప్పుడెప్పుడా అని; చూచుచున్+ఉండెన్= చూస్తూ ఉండినాడు.

**తా :** పతాకం పడటం చూచి బాణుడు సంతోషపడ్డాడు. శివుడు తనతో పల్కిన విధంగా జరుగుతుందనుకొని నిశ్చయించి యుద్ధం కోసం ఎదురు చూడసాగాడు.

**వ. అంత నక్కడ. 389**

**ప్రతి :** అంతన్= అంతట; అక్కడ= ద్వారకానగరంలో...

**క. ద్వారకలో ననిరుద్ధ కు, మారుని పోకకును యదుసమాజము వగలం**
**గూరుచు నొకవార్తయు విన, నేరక చింతింప నాల్గునెల లరిగె నృపా! 390**

**ప్రతి :** నృపా= ఓ రాజా!; ద్వారకలోన్= ద్వారకానగరంలో; అనిరుద్ధకుమారుని= అనిరుద్ధ కుమారునియొక్క; పోకకున్= వెళ్లడానికి; యాదవసమాజము= యాదవులసమూహం; వగలన్+కూరుచున్= శోకంలో మునిగి; ఒకవార్తయును= అతణ్ణి గూర్చిన ఒక్క సమాచారమూ; విననేరక= వినక; చింతింపన్= దుఃఖపడుతుండగా; నాల్గునెలలు= నాలుగునెలలు; అరిగెన్= గడచాయి.

**తా :** ఓ రాజా! ద్వారకానగరంలో అనిరుద్ధుని పోకా, జాడా యాదవులకు నాలుగు నెలలుగా తెలియదు. యాదవులందరును మిక్కిలి దుఃఖింపసాగారు.

## ❖ నారదుని వలన వృత్తాంతమును విని కృష్ణుఁడు బాణాసురునిపై దండెత్తుట ❖

**వ. అ య్యవసరంబున. 391**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**క. శారదనిర్మలనీరద, పారదరుచిదేహుఁ డతులభాగ్యోదయుఁ డా**
**నారదముని యేతెంచె న, పారదయామతి మురారిభజనప్రీతిన్. 392**

**ప్రతి :** శారద= శరత్కాలమందలి; నిర్మల= స్వచ్ఛమైన; నీరద= మేఘంయొక్కయు; పారద= పాదరసంయొక్క; రుచి= కాంతివంటి; దేహుఁడు= దేహంకలవాడు అయిన; అతుల= సాటిలేని; భాగ్య+ఉదయుఁడు= అదృష్ట సంపద కలిగినవాడు; అపార దయామతిన్= హద్దులేని దయాబుద్ధితో; ముర+అరి= శ్రీకృష్ణునియొక్క; భజనప్రీతిన్= సేవించి, కీర్తించడంలో; నారదముని= నారదుడనే ముని; ఏతెంచెన్= వచ్చాడు.

**తా :** శరత్కాలమేఘం పాదరసంవంటి స్వచ్ఛమైన శరీరకాంతిగలవాడూ, సాటిలేని అదృష్టసంపన్నుడు అయిన నారదుడు దయాబుద్ధిగలవాడై; శ్రీకృష్ణుణ్ణి సేవించడానికి వచ్చాడు.

**వ. ఇట్లు సనుదెంచిన యద్దివ్యమునికి నిర్మలమణివినిర్మితసుధర్మాభ్యంతరంబున యదువృష్ణి భోజాంధకవీరులు గొలువం గొలువున్న గమలలోచనుండు ప్రత్యుత్థానంబు చేసి, యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి, సముచితకనకాసనాసీనుం జేసిన నత్తాపసోత్తముండు పురుషోత్తము నుదాత్తతేజోనిధిం బొగడి, యనిరుద్ధువృత్తాంతం బంతయుఁ దేటపడ నెఱింగించి, యప్పుండరీకాక్షునిచేత నామంత్రణంబు వడసి, యంతర్ధానంబు నొందెఁ, దదనంతరంబ కృష్ణుండు శుభముహూర్తంబున దండయాత్రాభిముఖుండై ప్రయాణభేరి వేయించి, బలంబుల వెడలింప బ్రద్దలవారిం బనిచి, తానును గట్టాయితం బయ్యె, నంత. 393**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; చనుదెంచిన= వచ్చిన; ఆ+దివ్యమునికిన్= ఆ దేవమునికి (నారదునికి); నిర్మల= స్వచ్ఛమైన; మణివినిర్మిత= మణులచేత నిర్మింపబడిన; సుధర్మ+అభ్యంతరంబునన్= సుధర్మమనే సభ లోపలిభాగంలో; యదు+వృష్ణి+భోజ+అంధకవీరులు= యదు, వృష్ణి, భోజ, అంధకవీరులు; కొలువన్= సేవిస్తుండగా; కొలువు+ఉన్న= కొలువుతీరి ఉన్న (రాజసభతీరి ఉన్న); కమలలోచనుండు= పద్మనేత్రుడు (కృష్ణుడు); ప్రతి+ఉత్థానముచేసి= ఎదురుగాపోయి; అర్ఘ్యపాద్య+ఆదివిధులన్+పూజించి= అర్ఘ్యం, పాద్యం మున్నగు విధుల పూజించి; సమ్+ఉచిత= తగిన; కనక+ఆసన+ఆసీనున్+చేసినన్= బంగారు ఆసనంపై కూర్చుండపెట్టగా; ఆ+తాపస+ఉత్తముండు= మునులలో ఉత్తముడగు ఆ నారదుడు; ఉదాత్త= గొప్ప; తేజస్+నిధిన్= కాంతికి నిధి అయినవాణ్ణి; పురుష+ఉత్తమునిన్= పురుషులలో శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుని; పొగడి= ప్రశంసించి; అనిరుద్ధున్= అనిరుద్ధుని; వృత్తాంతంబు+అంతయున్= వార్త అంతటిని; తేటపడన్= స్పష్టమయ్యేట్లు; ఎఱింగించి= తెలిపి; ఆ+పుండరీక+అక్షునిచేతన్= ఆ శ్రీకృష్ణునిచే; ఆమంత్రణంబు+పడసి= వీడ్కోలుపొంది; అంతర్ధానంబున్+ఒందెను= అదృశ్యుడయ్యాడు (వెళ్లెను); తద్+అనంతరంబు+అ= ఆ వెంటనే; కృష్ణుండు= శ్రీకృష్ణుండు; శుభముహూర్తంబునన్=

మంచికాలంలో; దండయాత్రా+అభిముఖుండు+ఐ= దండయాత్రకు సిద్ధపడినవాడై; ప్రయాణభేరి= ప్రయాణం తెల్పేందుకై పెద్ద నగారాను; వ్రేయించి= వాయింపజేసి; బలంబులన్= సైనికుల్ని; వెడలింపన్= తరలించడానికి; బ్రద్దలవారిన్+పనిచి= వేత్రహస్తుల్ని నియమించి; తానును= శ్రీకృష్ణుడును; కడు+ఆయితంబు+అయ్యెన్= మిగుల సిద్ధపడ్డాడు; అంతన్= అంతట...

**తా :** ఈ విధంగా వచ్చిన నారదమునిని సుధర్మాసభలో శ్రీకృష్ణుడు, యదు, వృష్ణి, భోజ, అంధకవీరులు అర్ఘ్యపాద్యాదులిచ్చి ఉన్నతాసనంలో కూర్చుండ పెట్టి దేవమునిని గౌరవించాడు. నారదుడు అనిరుద్ధుని వృత్తాంతమంతా స్పష్టంగా తెలిపాడు. శ్రీకృష్ణుడు బాణాసురునిపై యుద్ధానికి మంచి ముహూర్తం నిర్ణయించి, సైన్యాన్ని సిద్ధం చేసేందుకు వేత్రహస్తుల్ని నియమించి, తానూ యుద్ధానికి సిద్ధమయ్యాడు.

**విశే :** యదు, వృష్ణి, భోజ, అంధకములనేవి నాల్గు రాజవంశాల పేర్లు. యదువంశానికి చెందినవాడు నందగోపుడు, ఆయన భార్య యశోద. కృష్ణుని పెంచి పెద్ద చేసినవారు. వృష్ణి వంశపురాజు వసుదేవుడు, దేవకీదేవి. శ్రీకృష్ణుని తల్లితండ్రులు, భోజవంశపురాజు కుమార్తె కుంతీదేవి. ఈయనకు కుంతిభోజుడనీ పేరు. అంధక వంశపురాజు ఉగ్రసేనుడు. ఆయన కుమారుడు కంసుడు. తండ్రిని చెరసాలలో బంధించి సింహాసనమెక్కినవాడు, కంసుని ఆస్థానంలోని మల్లయుద్ధ వీరులైన చాణూరముష్టికులు అంధకదేశీయులు. శ్రీకృష్ణుడు ఈ మల్లయుద్ధ వీరులిద్దరినీ, మేనమామ కంసుణ్ణి సంహరించి, తాతగారైన ఉగ్రసేనుణ్ణి సింహాసనాసీనుణ్ణి చేశాడు.

**సీ. హారకిరీటకేయూరకంకణకట, కాంగులీయకనూపురాదివివిధ**
**భూషణప్రతతిచేఁ బొలుపారి కరముల, ఘనగదాశంఖచక్రములు దనర**
**సురభిచందనలిప్తసురుచిరోరస్థలిఁ, బ్రవిమలకౌస్తుభప్రభలు నిగుడఁ**
**జెలువారు పీతకౌశేయచేలము కాసె, వలనుగా రింగులు వాఱఁ గట్టి,**

**తే శైబ్యసుగ్రీవమేఘపుష్పకవలాహ, కములఁ బూన్చిన తే రాయితముగఁ జేసి,**
**దారుకుఁడు దేర నెక్కె మోదం బెలర్ప, భానుఁ డుదయాచలం బెక్కుపగిది మెఱసి. 394**

**ప్రతి :** హార= హారాలు; కిరీట= కిరీటం; కేయూర= భుజకీర్తులు; కంకణ+అంగులీయక= చేతికడియాలు, ఉంగరాలు; నూపుర= నూపురాలు; ఆది= మున్నగు; వివిధభూషణ= రకరకాల సొమ్ములయొక్క; ప్రతతిచేన్= సమూహంచేత; పొలుపు+ఆరి= ప్రకాశించి; కరములన్= చేతుల్లో; ఘన= గొప్పవైన; గదాశంఖచక్రములు= గద, శంఖం, చక్రం; తనరన్= ఒప్పుగా; సురభి= మంచివాసనగల; చందన= గంధంచేత; లిప్త= పూయబడ్డ; సురుచిర= ప్రకాశవంతమైన; ఉరస్+స్థలిన్= వక్షఃస్థలంలో; ప్రవిమల= నిర్మలమైన; కౌస్తుభ= కౌస్తుభమణియొక్క; ప్రభలు= కాంతులు; నిగుడన్= వ్యాపిస్తుండగా; చెలువు+ఆరు= శోభించే; పీత= పసుపురంగుగల; కౌశేయ= పట్టువస్త్రం (పీతాంబరం); కాసెవలను+కాన్= కాసెకట్టు విధంగా; చేలము= కొంగు; రింగులు వారన్= చెంగులు వ్రేలాడేటట్లుగా; కట్టి; శైబ్య, సుగ్రీవ, మేఘపుష్పక, వలాహకములన్= శైబ్యం, సుగ్రీవం, మేఘపుష్పకం, వలాహకం - అనే గుర్రాలను; పూన్చిన= కట్టిన; తేరు= రథం; ఆయితము+కన్+చేసి= సిద్ధం చేసి; దారుకుడు= రథసారథి; తేరన్= తీసుకొనిరాగా; భానుఁడు= సూర్యుడు; ఉదయ+అచలంబు= తూర్పుకొండమీదికి; ఎక్కు= ఎక్కినట్టి; పగిదిన్= విధంగా; మెఱసి= ప్రకాశించి; మోదము= సంతోషం; ఎలర్పన్= అతిశయించగా; ఎక్కెన్= ఎక్కాడు.

**తా :** శ్రీకృష్ణుడు హారాలు, కిరీటం, భుజకీర్తులు, చేతికడియాలు, ఉంగరాలు, నూపురాలు మున్నగు అలంకారాలూ, ఆభరణాలూ ధరించాడు. చేతుల్లో గద, శంఖం, చక్రం ప్రకాశించగా సువాసనగల చందనం అద్దినవక్షఃస్థలంపై గల, కౌస్తుభమణి కాంతులు వ్యాపించగా పసుపురంగు పట్టువస్త్రం కుచ్చిళ్లు ఏర్పడేటట్లు కట్టాడు. సారథి దారుకుడు రథాన్ని సిద్ధం చేసుకొనిరాగా, తూర్పుకొండపై సూర్యుడు ఎక్కినట్లు – సంతోషాతిశయంతో – ఆ రథాన్ని ఎక్కాడు.

**వ. ఇట్లు రథారోహణంబు సేసి, భూసురాశీర్వచనపూతుండును, మహితదూర్వాంకురాలంకృతుండును, లలితపుణ్యాంగనాకరకిసలయకలితశుభాక్షతవిన్యాసభాసురమస్తకుండును, మాగధమంజుల గానానుమోది తుండును, వందిజనసంకీర్తనానందితుండును, బాఠకపఠనరవవికాసితహృదయుండును నయి వెడలు నవసరంబున. 395**

**ప్రతి :** ఇట్లు= ఈవిధంగా; రథ+ఆరోహణంబు+చేసి= రథమెక్కి; భూసుర+ఆశీస్+వచన= బ్రాహ్మణుల దీవనలచేత; పూతుండును= పవిత్రుఁడూ; మహిత= పూజింపబడ్డ; దూర్వా+అంకుర+అలంకృతుండును= లేతగరికలచే అలంకరింపబడిన వాడూ; లలిత= సుకుమారమగు; పుణ్య+అంగనా= ముత్తైదువుల; కరకిసలయ= చిగురులవంటి చేతుల్లో; కలిత= కూడిన; శుభ+అక్షత= శుభములుకూర్చే అక్షతలయొక్క; విన్యాస= ఉంచడం (చల్లుట)చేత; భాసుర= ప్రకాశించే; మస్తకుండును= శిరస్సుకలవాడూ; మాగధ= స్తోత్రపాఠకుల; మంజుల= మనోహరమైన; గాన= గానానికి; అనుమోదితుండు= సంతోషించేవాడూ; వందిజన= నమస్కరించేవారియొక్క; సంకీర్తన+ఆనందితుఁడు= ప్రశంసలచేత ఆనందించేవాడూ; పాఠక= పురాణాది పాఠకులయొక్క; పఠన= పఠించేటప్పటి; రవ= ధ్వనిచే; వికాసిత= వికసింపబడిన; హృదయుండును= మనస్సుకలవాడూ; అయి= అయి; వెడలు= వెళ్లు; అవసరంబునన్= సమయంలో...

**తా :** శ్రీకృష్ణుడు రథం ఎక్కగానే బ్రాహ్మణులు ఆశీర్వదించారు. ముత్తైదువలు అక్షతలు చల్లారు. వందిమాగధులు కైవారాలు చేశారు. స్తోత్రపాఠకులు చేసే ప్రశంసలకు కృష్ణుడు ఆనందించాడు.

**సీ. బలభద్రసాత్యకిప్రద్యుమ్నముఖయదు, వృష్ణిభోజాంధకవీరవరులు**
**దుర్వారపరిపంథిగర్వభేదనకళా, చతురబాహాబలోత్సాహలీల**
**వారణస్యందనవాజిసందోహంబు, సవరణ సేయించి సంభ్రమమున**
**సముచితప్రస్థానచటులభేరీభూరి, ఘోష మంభోనిధిఘోష మడఁప**

**తే. ద్వాదశాక్షౌహిణీ బలోత్కరము లోలి, నడచెఁ గృష్ణునిరథము వెన్నంటి చెలఁగి**
**పృథులగతి మున్ భగీరథురథమువెనుక, ననుగమించు వియన్నది ననుకరించి. 396**

**ప్రతి :** బలభద్ర= బలరాముడు; సాత్యకి= సాత్యకి; ప్రద్యుమ్న= (శ్రీకృష్ణుని కుమారుడైన) ప్రద్యుమ్నుడు; ముఖ= ప్రధానమైన; యదు వృష్ణి భోజ అంధక వీరవరులు= శ్రేష్ఠులైనవీరులు; దుర్+వార= వారించడానికి వీలుకాని; పరిపంథి= శత్రువులయొక్క; గర్వభేదన= గర్వాన్ని భేదించడం అనే; కళా= విద్యయందు; చతుర= నేర్పుగల; బాహా= చేతులయొక్క; బల+ఉత్సాహలీల= బలంయొక్క ఉత్సాహలీలతోను; వారణ= ఏనుగుల; స్యందన= రథాల; వాజి= గుర్రాల; సందోహంబు= సమూహాన్ని; సంభ్రమమునన్= తొందరపాటుతో; సవరణ+చేయించి= అలంకరింపచేసి; సముచిత= తగిన; ప్రస్థానభేరీ= యుద్ధప్రయాణాన్ని తెలుపువాద్యాలయొక్క; భూరి= గొప్ప; ఘోషమున్= ధ్వని; అంభోనిధి= సముద్రం యొక్క; ఘోషము= ధ్వనిని; అడపన్=

క్రిందుపరచగా; ద్వాదశ+అక్షౌహిణి= పంద్రెండు అక్షౌహిణుల; బల+ఉత్కరములు= సైన్యసమూహాలు; ఓలిన్= క్రమంగా; మున్= పూర్వం; భగీరథు= భగీరథునియొక్క; రథమువెనుకన్= రథంవెంట; అనుగమించు= అనుసరించే; వచ్చే; వియత్+నదిన్= ఆకాశగంగను; అనుకరించి= పోలిందై; కృష్ణుని= శ్రీకృష్ణుని; వెన్ను+అంటి= వెంబడిని; చెలఁగి= విజృంభించి; పృథులగతిన్= అధికవేగంతో; నడచెన్= నడిచింది.

**తా :** బలరాముడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు మొదలైన ప్రముఖ యదు, వృష్ణి, భోజ, అంధకవీరులు శత్రుబలనిర్మూలనకై చతురంగ బలసమేతులై పంద్రెండు అక్షౌహిణులతో, పూర్వం ఆకాశగంగ భగీరథుని వెంటవెళ్లిన విధంగా కృష్ణుని వెంట నడిచారు.

**వ. ఇవ్విధంబునం గదలి కతిపయప్రయాణంబుల శోణపురంబు సేరం జని వేలాలంఘనంబు సేసి యదువీరు లంత. 397**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగ; కదలి= నడచి; (కదలుచు); కతిపయ= కొన్ని; ప్రయాణంబులన్= ప్రయాణాలతో; శోణపురంబు= బాణుని రాజధాని అయిన శోణపురాన్ని; చేరన్+చని= వెళ్లి; యదువీరులు= యాదవవీరులు; అంతన్= అంతట; వేలాలంఘనంబు+చేసి= నగర సరిహద్దులు దాటి; అంతన్= ఆ తర్వాత...

**తా :** కొన్ని దినాల తరువాత యాదవవీరులు శోణనగరం హద్దులు దాటి, ఆ నగరాన్ని చేరారు. అంతట

**మ. సరిదారామసరోవరోపవనయజ్ఞస్థానముల్ మాపి, వే**
**పరిఖల్ పూడిచి, యంత్రముల్ దునిమి, వప్రవ్రాతముల్ ద్రొబ్బి, గో**
**పురముల్ గూలఁగఁద్రోచి, సౌధభవనంబుల్ నూకి, ప్రాకారముల్**
**ధరణిం గూల్చి, కవాటముల్ విఱిచి, రుద్దండక్రియాలోలురై. 398**

**ప్రతి :** సరిత్= నదులను; ఆరామ= పెంపుడు తోటల్ని; సరోవర= సరస్సుల్ని; ఉపవన= స్త్రీలు విహరించే శృంగారవనాల్ని; యజ్ఞస్థానముల్= యజ్ఞాలు చేసేస్థలాలను; మాపి= రూపుమాపి; వే= వేగంగా; పరిఖల్= అగడ్తలను; పూడిచి= పూడ్చి; యంత్రముల్+తునిమి= యంత్రాలను విరిచి; వప్ర వ్రాతముల్= కోటలను; ద్రొబ్బి= పడగొట్టి; గోపురముల్= తోరణ ద్వారాలను; కూలన్+కన్+త్రోచి= కూలగొట్టి; సౌధ భవనంబుల్= రాజభవనాల్ని; నూకి= కూలదోసి; ప్రాకారముల్= కోటగోడల్ని; ధరణిన్+కూల్చి= నేలకూల్చి; కవాటముల్= తలుపుల్ని; ఉత్+దండ= భయంకర; క్రియా+ఆలోలురు+ఐ= కార్యంలో ఆసక్తి కలిగినవారై; విఱిచిరి= విరగగొట్టారు.

**తా :** యాదవసైన్యం శోణపురప్రాంతానికి చేరి నదులను, సరస్సులను, విహార స్థలాలనూ, ఉద్యానవనాలను, యజ్ఞస్థలాలను నాశనం చేశారు. అనేక అగడ్తలను పూడ్చారు. యంత్రాలను పాడుచేశారు. గోపురాలను పడగొట్టారు. రాజభవనాల్ని కూలద్రోశారు. ప్రాకారాలను నేలకూల్చారు. అమితోత్సాహంతో తలుపులను బ్రద్దలుకొట్టారు.

**వ. ఇట్లనేకప్రకారంబుల గాసి చేసి, పురంబు నిరోధించి పేర్చి యార్చినం జూచి యాగ్రహసమగ్రోగ్రమూర్తియై బాణుండు సమరసన్నాహసంరంభవిజృంభమాణుండై సంగరభేరి వ్రేయించిన. 399**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; అనేక; ప్రకారంబులు+కాన్= రకరకాలుగా; గాసిచేసి= కల్లోలం చేసి; పురంబున్= శోణపురాన్ని; నిరోధించి= అడ్డగించి; పేర్చి= చెలరేగి; ఆర్చినన్= అరవగా; చూచి= చూచి; ఆగ్రహ= కోపంయొక్క; సమగ్ర= పరిపూర్తితో;

ఉగ్ర= భయంకరమైన; మూర్తి+ఐ= ఆకారం గలవాడై; సమర= యుద్ధానికి; సన్నాహసంరంభ= సిద్ధపరచుటలోని, వేగిరపాటుతో; విజృంభమాణుండు+ఐ= చెలరేగినవాడై; సంగరభేరి= యుద్ధ నగారా; వ్రేయించిన= మ్రోగించగా...

**తా :** యాదవవీరులు శోణపురాన్ని అనేకవిధాలుగా నిరోధించారు. రాక్షసరాజగు బాణుడు కోపోగ్రమూర్తియై సైన్యసంసిద్ధతకై యుద్ధభేరి మ్రోగించగా

**సీ.** **ఆచక్రవాళాచలాచక్ర మంతయు, బలసి కుమ్మరిసారెపగిదిఁ దిరిగె**
**ఘనఘోణిఖురకోటిఘట్టితనదముల, కరణి నంభోనిధుల్ గలఁగి పొరలెఁ**
**గాలరుద్రాభీలకరశూలహతి రాలు, పిడుగులగతి రాలె నుడుగణంబు**
**చటులానిలోద్ధూతశాల్మలీతూలంబు, చాడ్పున మేఘముల్ చదలఁ దూలె**

**తే.** **గిరులు వడఁకాడె, దివి పెల్లగిల్లె, సురల, గుండె లవిసె, రసాతలక్షోభ మొదవె**
**దిక్కు లదరె విమానముల్ తెరలి, చెదరెఁ, గలఁగి గ్రహరాజచంద్రులగతులు దప్పె.** **400**

**ప్రతి :** ఆచక్రవాళ+అచలాచక్రము+అంతయున్= చక్రంవలె భూమినిచుట్టుకొని ఉన్న లోకాలోకపర్వతం దాకా వ్యాపించిన భూమండలమంతా; బలసి= శక్తిమంతమై; కుమ్మరిసారె= కుమ్మరివాడు కుండలు చేయుటకుపయోగించే చక్రం; పగిదిన్= వలె; తిరిగెన్= తిరిగింది; ఘన= గొప్ప; ఘోణి= ఆదివరాహస్వామియొక్క; ఖురకోటి= కాలిగిట్టల కొనలచేత; ఘట్టిత= తొక్కబడినట్టి; నదముల= (పడమరగాపారే)నదుల; కరణిన్= వలె; అంభస్+నిధుల్= సముద్రాలు; కలఁగి= కలతపడి; పొరలెన్= పొంగాయి; కాలరుద్ర= ప్రళయకాల రుద్రునియొక్క; ఆభీల= భయంకరమైన; కర= చేతిలోని; శూల= శూలంయొక్క; హతిన్= దెబ్బచేత; రాలు= పడే; పిడుగుల= పిడుగుల; గతిన్= విధంగా; ఉడుగణంబు= నక్షత్రాల సమూహం; రాలెన్= రాలిపడింది; చటుల+అనిల+ఉద్ధూత= భయంకరమైన గాలిచే ఎగురగొట్టబడ్డ; శాల్మలీతూలంబు= బూరుగుదూది; చాడ్పునన్= వలె; మేఘముల్= మేఘాలు; చదలన్+తూలెన్= ఆకాశంలో ఎగిరాయి; గిరులు= పర్వతాలు; వడకాడెన్= కంపించాయి; దివి= స్వర్గం; పెల్లగిల్లెన్= క్షోభించింది; సురల= దేవతలయొక్క; గుండెలు+అవిసెన్= గుండెలు పగిలాయి; రసాతల= పాతాళలోకంలో; క్షోభము+ఒదవెన్= కలత ఏర్పడింది; దిక్కులు= అష్టదిక్కులు; అదరెన్= చలించాయి; విమానముల్= విమానాలు; తెరలి= తూలి; చెదరెన్= చెదిరాయి; కలఁగి= తొట్రుపాటువల్ల; గ్రహరాజ చంద్రుల= సూర్యచంద్రులయొక్క; గతులు= మార్గాలు; తప్పెన్= తప్పాయి.

**తా :** భూమి కుమ్మరిసారెవలె తిరిగింది. ఆదివరాహస్వామియొక్క గిట్టల తాకిడికి కలతచెందిన నదీనదాల్లాగా సముద్రాలు క్రిందుమీదుగా లేచే అలలతో పొర్లాయి. శివుని చేతిలోని శూలం దెబ్బలకు రాలే పిడుగులవలె నక్షత్రాలు నేల రాలాయి. భయంకరమైన గాలికి ఎగిరిన బూరుగుదూది విధంగా మేఘాలు చెల్లాచెదరయ్యాయి. పర్వతాలు కంపించాయి. స్వర్గం క్షోభించింది. దేవతల గుండెలు కలతపడ్డాయి. దిక్కులు చలించాయి. విమానాలు దారితప్పాయి. సూర్యచంద్రులు మార్గం తప్పారు.

**వ. అట్టి సమరసన్నాహంబునకుఁ గట్టాయితంబై, మణిఖచితభర్మవర్మనిర్మలాంశుజాలంబులును, శిరస్త్రాణకిరీటకోటిఘటితవినూత్నరత్నప్రభాపటలంబులును, గనకకుండలగ్రైవేయహారకంకణ తులాకోటి వివిధభూషణవ్రాతరుచినిచయంబులును, బ్రచండబాహుదండసహస్రంబున వెలుంగుచు శరశరాసనశక్తి**

**ప్రాసతోమరగదాకుంతముసలముద్గరభిందిపాలకరవాలపట్టిసశూలక్షురికాపరశు పరిఘాదినిశాతహేతి వ్రాతదీధితులును, వియచ్చరకోటినేత్రంబులకు మిఱుమిట్లు గొలుపం గనకాచల శృంగసముత్తుంగం బగు రథం బెక్కి యరాతివాహినీసందోహంబునకుం దుల్యంబైన నిజసేనాసమూహంబు లిరుగడల నడవ బాణుం డక్షీణప్రతాపంబు దీపింప ననికి వెడలె, న య్యవసరం బున. 401**

**ప్రతి :** అట్టి= ఆ విధమైన; సమరసన్నాహంబునకున్= యుద్ధప్రయత్నానికి; కడు+ఆయితంబు+ఐ= బాగా సన్నద్ధమై; మణి= మణులతో; ఖచిత= పొదుగబడ్డ; భర్మ= బంగారు; వర్మ= కవచంయొక్క; నిర్మల+అంశు= స్వచ్ఛమైన కిరణాల; జాలంబులును= సమూహాలూ; శిరస్+త్రాణ= తలను కాపాడే; కిరీటకోటి= కిరీటంయొక్క అంచున; ఘటిత= కూర్చబడ్డ; వినూత్న= కొత్తదైన; రత్నప్రభా= రత్నాలకాంతుల; పటలంబులును= సమూహాలూ; కనక= బంగారు; కుండల= చెవిపోగులూ; గ్రైవేయహార= మెడయందలి హారాలూ (కంటెమున్నగునవి); కంకణ= చేతికిపెట్టుకొనే కడియాలూ; తులాకోటి= అందెలూ; వివిధ= రకరకాల; భూషణ= అలంకారాల; వ్రాత= సమూహంయొక్క; రుచి= కాంతుల; నిచయంబులును= సమూహాలూ; ప్రచండ= భయంకరమైన; బాహుదండ= పెద్ద కర్రవంటి బాహువుల; సహస్రంబునన్= వేయింటితో; వెలుంగుచున్= ప్రకాశిస్తూ; శర= బాణాలు; శర+ఆసన= విల్లు; శక్తి= శక్తి అనే ఆయుధవిశేషం; ప్రాస= బల్లెములూ; తోమర= చిన్న ఈటె; గదా= గద; కుంత= ఈటె; ముసల= రోకలి; ముద్గర= ఇనుపసమ్మెట; భిందిపాల= ఇనుప బాణం కర్ర; కరవాల= ఇనుపబాణం కర్రసాగు; పట్టిస= పట్టాకత్తి; శూల= శూలం; క్షురికా= చురకత్తి; పరశు= గండ్రగొడ్డలి; పరిఘ+ఆది= ఇనుపగుదియ మొదలైన; నిశాత= వాడి అయిన; హేతి= ఆయుధాల; వ్రాత= సమూహంయొక్క; దీధితులును= కాంతులూ; వియత్+చరకోటి= దేవతాసమూహాలయొక్క; నేత్రంబులకున్= కళ్లకు; మిఱుమిట్లు కొలుపన్= మిరిమిట్లు కలిగించగా; కనక+అచల= మేరుపర్వతంయొక్క; శృంగ= శిఖరంవలె; సముత్తుంగంబు+అగు= బాగుగా ఎత్తయిన; రథంబు+ఎక్కి= రథంపైకి ఎక్కి; అరాతి= శత్రుల; వాహినీ= సైన్యంయొక్క; సందోహంబునకున్= సమూహానికి; తుల్యంబు+ఐన=సమానమైన; నిజ= తనయొక్క; సేనా= సైన్యంయొక్క; సమూహంబులు= సమూహాలు; ఇరుగడలన్= రెండువైపులా; నడవన్= నడువగా; బాణుండు= రాక్షసప్రభువైన బాణుడు; అక్షీణ= క్షీణించని; ప్రతాపంబు= శౌర్యం; దీపింపన్= ప్రకాశించగా; అనికిన్= యుద్ధానికి; వెడలెన్= వెళ్లాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** యుద్ధసన్నాహానికి సిద్ధపడ్డ బాణుడు బంగారుకవచాన్ని, రత్నకాంతులతో కూడిన కిరీటాన్ని, కుండలాలను, హారాలను ధరించి ప్రాసం, తోమరం, గద, ఖడ్గం మొదలైన అనేక ఆయుధాలతో తనసైన్యం శత్రుసైన్యాలకు దీటుగా ఇరువైపుల నడువగా ఉన్నతమైన రథం ఎక్కి మహాశౌర్యంతో యుద్ధానికి వెళ్లాడు. ఆ సమయంలో

### ✣ బాణాసురునికి సహాయభూతుండగు శివునకు కృష్ణునకు యుద్ధ మగుట ✣

**చ. వరదుఁ డుదారభక్తజనవత్సలుఁడైన హరుండు బాణునిం**
**గర మనురక్తి నాత్మజులకంటె దయామతిఁ జూచుఁ గానఁ దా**
**దుర మొనరించువేడ్కఁ బ్రమథుల్ గుహుఁడున్ నిజభూతకోటియున్**
**సరస భజింప నుజ్జ్వల నిశాతభయంకరశూలహస్తుఁడై. 402**

**ప్రతి :** వరదుఁడు= వరాలిచ్చేవాడు; ఉదార= గొప్పవాడూ; భక్తజన వత్సలుఁడు+ఐన=భక్తులపట్ల ప్రేమగలవాడైన; హరుండు= శివుడు; బాణునిన్= బాణుణ్ణి; కరము= మిక్కిలి; అనురక్తిన్= అనురాగంతో; ఆత్మజులకంటెన్= కుమారులకంటె;

దయామతిన్= కృపాబుద్ధితో; చూచున్= చూస్తాడు; కానన్= కావున; తాన్= తాను; దురము+ఒనరించు= యుద్ధంచేసే; వేడ్కన్= కుతూహలంతో; ప్రమథులు= ప్రమథగణాలు; గుహుఁడున్= కుమారస్వామి; నిజ= తన; భూతకోటియున్= భూతాల సమూహం; సరసన్= సమీపంలో; భజింపన్= సేవిస్తుండగా; ఉత్+జ్వల= ప్రకాశించే; నిశాత= వాడిఐన; భయంకర= భయం కలిగించే; శూలహస్తుఁడు+ఐ= శూలాన్ని చేతిలో ధరించినవాడై...

**తా :** భక్తులపట్ల ప్రేమకలవాడూ, కోరికల్ని తీర్చేవాడూ అయిన శివుడు బాణుణ్ణి తనకుమారులకంటే అధికంగా చూస్తాడు. కనుక, తాను బాణునిపక్షంలో యుద్ధం చేయడానికి కుమారస్వామి, ప్రమథగణాలూ వెంటరాగా శూలం ధరించినవాడై

**సీ. ఖురపుటాహతి రేఁగు ధరణీపరాగంబు, పంకేరుహాప్తబింబంబుఁ బొదువ**
**విపులవాలాటోపవిక్షేపజాతవా, తాహతి వారివాహములు విరియఁ**
**గుఱుచ తిన్నని వాఁడికొమ్ములఁ జిమ్మిన, బ్రహ్మాండభాండకర్పరము వగుల**
**నలవోక ఖణిఖణిల్లని ఱంకె వైచిన, రోదసీకుహరంబు భేదిలంగ**

**తే. గళచలద్భర్మఘంటికాఘణఘణ ప్ర, ఘోషమున దిక్తటంబు లాకులత నొంద**
**లీల నడతెంచు కలధౌతశైల మనఁగ, నుక్కు మిగిలిన వృషభేంద్రు నెక్కి వెడలె. 403**

**ప్రతి :** ఖురపుట+ఆహతిన్= కాలిగిట్టలదెబ్బలతో; రేగు= పైకిలేచే; ధరణీ పరాగము= (నేలమీద లేచిన) దుమ్ము; పంకేరుహ+ఆప్తబింబంబు= సూర్యబింబాన్ని; పొదువన్= ఆవరించగా; విపుల= విశాలమైన; వాల+ఆటోప= తోకయొక్క విజృంభణంగల; విక్షేప= కదుపుటచేత; జాత= కలిగిన; వాత+ఆహతిన్= గాలిదెబ్బకు; వారివాహములు= మేఘాలు; విరియన్= చెదరగా; కుఱుచ= పొట్టివైన; తిన్నని= సూటియైన; వాడి= పదునైన; కొమ్ములన్= కొమ్ములతో; చిమ్మినన్= పొడువగా; బ్రహ్మ+అండ= బ్రహ్మాండం అనే; భాండ= పాత్రయొక్క; కర్పరము+పగులన్= మూతపగులగా; అలవోకన్= తేలికగా; ఖణిఖణిల్లు+అని= ఖణిఖణిల్లని; ఱంకె= ధ్వని; వైచినన్= చేయగా; రోదసీకుహరంబు= భూమి ఆకాశాల మధ్యగల గుహలాంటి ప్రదేశం; భేదిలంగన్= బ్రద్దలుకాగా; గళ= కంఠంలో; చలత్= కదలాడే; భర్మఘంటికా= బంగారు గంటలయొక్క; ఘణఘణ ప్రఘోషమునన్= ఘణఘణ ధ్వనికి; దిక్+తటంబులు= దిక్కుల అంచులు; ఆకులతన్+ఒందన్= కలతచెందగా; లీలన్= ఆటవలె; నడతెంచు= నడచివచ్చే; కలధౌతశైలము+అనన్+కన్= వెండికొండా అనేట్లు; ఉక్కుమిగిలిన= బలం అతిశయించిన; వృషభ+ఇంద్రున్= నందీశ్వరునిపై; ఎక్కి; వెడలెన్= శివుడు బయలుదేరాడు.

**తా :** నందీశ్వరుని కాలిగిట్టల తాకిడికి రేగిన దుమ్ము సూర్యుణ్ణి కమ్మివేసింది. తోకను కదుపగా ఏర్పడిన గాలికి మేఘాలు చెదరాయి. కొమ్ములవిసురుకు బ్రహ్మాండమనే పాత్రమూత పగిలింది. నందీశ్వరునిరంకెలకు ఆకాశం బ్రద్దలైంది. మెడలో వేలాడే బంగారు గంటలధ్వనికి దిక్కులు కలత చెందాయి. నడచివస్తున్న వెండికొండా అన్నట్లు నందీశ్వరుణ్ణి శివుడు అధిరోహించి యుద్ధానికి బయలుదేరాడు.

**వ. ఇట్లు వెడలి సమరసన్నాహసముల్లాసంబు మొగంబులకు వికాసంబు సంపాదింపం బ్రతిపక్షబలంబుల తోడం దలపడిన ద్వంద్వయుద్ధం బయ్యె, నప్పు డప్పురాతనయోధుల యాయోధనంబుఁజూచు వేడ్కం జనుదెంచిన, సరసిజసంభవశక్రసురయక్షసిద్ధసాధ్యచారణగంధర్వకిన్నరకింపురుష గరుడోరగాదులు నిజవిమానారూఢులై వియత్తలంబున నిలిచి రట్టియెడం గృష్ణుండును - హరుండును, మారుండును -**

**గుమారుండును, గూపకర్ణ - కుంభాండులును - గామపాలుండును; బాణపుత్త్రుండగు బలుండును - సాంబుండును; సాత్యకియును - బాణుండును, రథికులు - రథికులును, నాశ్వికులు - నాశ్వికులును, గజారోహకులు - గజారోహకులును, బదాతులు - పదాతులునుం దలపడి యితరేతరహేతిసంఘట్టనంబుల మిణుఁగుఱులు సెదరం బరస్పరాహ్వానబిరుదాంకితసింహనాదహుంకార శింజినీటంకారవారణఘీంకార వాజిహేషారవంబులను, బటహకాహళభేరీమృదంగశంఖతూర్యఘోషంబులను బ్రహ్మాండకోటరంబు పరిస్ఫోటితంబయ్యె, న య్యవసరంబున. 404**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; వెడలి= వెళ్లి; సమర= యుద్ధ; సన్నాహ= ప్రయత్నాలతో; సముల్లాసంబు= మహానందం; మొగంబులకు= ముఖాలలో; వికాసంబు= సంతోషాన్ని; సంపాదింపన్= కలిగింపగా; ప్రతిపక్షబలంబులతోడన్= ఎదుటి వారి సేనలతో; తలపడినన్= డీకొనగా; ద్వంద్వయుద్ధంబు+అయ్యెన్= ఎదురెదురు ఇద్దరు చేసే యుద్ధమైంది; అప్పుడు= ఆ సమయంలో; ఆ+పురాతనయోధుల= ఆ ప్రాచీనయుద్ధవీరుల; ఆ యోధనంబున్= యుద్ధాన్ని; చూచు= చూచే; వేడ్కన్= కోరికతో; చనుదెంచిన= వచ్చిన; సరసిజసంభవ= బ్రహ్మ; శక్ర= ఇంద్రుడు; సుర= దేవతలు; యక్ష= యక్షులు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; చారణ= దేవగాయకులు; గంధర్వ= గంధర్వులు; కిన్నర= కిన్నరులు; కింపురుష= కింపురుషులు; గరుడ= గరుడజాతివారు; ఉరగ+ఆదులు= సర్పాలు మొదలైనవి; నిజ= తమ; విమాన+ఆరూఢులు+ఐ= విమానాల్లో కూర్చున్నవారై; వియత్+తలంబునన్= ఆకాశప్రదేశంలో; నిలిచిరి= నిలబడ్డారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; కృష్ణుండును, హరుండును= కృష్ణుడూ శివుడూ; మారుండును కుమారుండును= ప్రద్యుమ్నుడూ కుమారస్వామీ; కూపకర్ణ కుంభాండులును= కూపకర్ణుడూ కుంభాండులూ; కామపాలుండును= బలరాముడూ; బాణుని పుత్రుండగు బలుండును= బాణుని కుమారుడైన బలుడూ; సాంబుడును= సాంబుడూ; సాత్యకియు బాణుండును= సాత్యకీ, బాణుడూ; రథికులు రథికులునున్= రథికులు రథికులతోనూ; ఆశ్వికులు ఆశ్వికులును= ఆశ్వికులు అశ్వసైన్యంతోనూ; గజ+ఆరోహకులు గజ+ఆరోహకులును= గజారోహకులు గజారోహకులతోనూ; పదాతులు= కాలినడకనపోవు సైనికులు; పదాతులన్= పదాతులతోనూ; తలపడి= ఎదుర్కొని; ఇతర+ఇతర= ఇతరులు ఇతరులతో; హేతి= ఆయుధాలయొక్క; సంఘట్టనంబులన్= రాపిళ్లచేత; మిణుగురులు= నిప్పురవ్వలు; చెదరన్= చెదరగా; పరస్పర= ఒకరినొకరు; ఆహ్వాన= పిలుచుకొంటూ; బిరుద+ అంకిత= తమ తమ బిరుదుల్ని ప్రకటిస్తూ; సింహనాదము= సింహంవంటి ధ్వని చేస్తూ; హుంకార= హుంకారం చేస్తూ; శింజినీటంకార= వింటినారి ధ్వనులచేత; వారణఘీంకార= ఏనుగుల ఘీంకారాలచేత; వాజి= గుర్రాలయొక్క; హేషారవంబులను= సకిలింపుశబ్దాలచేత; పటహ= తప్పెటల; కాహళ= బాకాల; భేరీ= భేరీవాద్యాల; మృదంగ= మద్దెళ్ల; శంఖ= శంఖాల; తూర్య= ఢక్కలయొక్క; ఘోషంబులను= ధ్వనులచేత; బ్రహ్మాండ= బ్రహ్మాండం అనే; కోటరంబు= తొర్ర; పరిస్ఫోటితంబు= చీల్చబడినవి; అయ్యెన్= అయ్యాయి; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** పరమేశ్వరుడు సమరసన్నాహసముల్లాసంతో వెళ్లి ఎదుటివారి సైన్యాన్ని ఎదుర్కొన్నాడు. అప్పుడు ద్వంద్వయుద్ధం జరిగింది. ఆ పురాతన వీరులయుద్ధాన్ని చూడడానికి బ్రహ్మ, ఇంద్రుడు, దేవతలు, మొదలైనవారు వచ్చారు. శ్రీకృష్ణుడూ - శివుడూ; ప్రద్యుమ్నుడూ - కుమారస్వామీ; కూపకర్ణుడూ - కుంభాండులతో, బలరాముడూ - బలుడూ - సాంబుడూ; రథికులు - రథికులతోనూ, ఆశ్వికులు ఆశ్వికులతోనూ, గజారోహకులు గజారోహకులతోనూ, పదాతిదళం పదాతిదళంతోనూ; యుద్ధం చేశారు. సింహధ్వనులతో, హుంకరింపులతో, వింటినారిధ్వనులతో, ఏనుగుల ఘీంకారాలతోనూ, గుర్రపుసకిలింపులతో, తప్పెటల, బాకాల భేరీశబ్దాలతో, మద్దెళ్ల, ఢక్కాలు, శంఖాల ధ్వనులతో బ్రహ్మాండం బద్దలయినట్లు అయింది.

**విశే :** ఇందు జగన్నాటకసూత్ర ధారి అయిన శ్రీకృష్ణుడు ఒకపక్క భక్తపరాధీనుడగు శివుడు ఒకపక్క యుద్ధభారాన్ని వహించారు. ఇందలి శ్రీకృష్ణుడు జయశీలి. బాణుడు శాపగ్రస్తుడు. విచిత్ర మేమంటే బాణుడు శివునినుండి పొందింది. వరరూపంలో ఉన్న శాపం. ఆ వరమిచ్చింది శివుడే. తిరిగి బాణునిపక్షాన యుద్ధం చేస్తున్నదీ, బాణుణ్ణి రక్షించే ప్రయత్నం చేసిందీ – పరమేశ్వరుడే! ఇదొక విచిత్ర యుద్ధసన్నివేసం! అయినా హరిహరుల లక్ష్యంమాత్రం దుష్టశిక్షణం, శిష్టరక్షణమే! బాణుణ్ణి కూల్చడమే! బాణుడు తన ఆరాధ్యదైవాన్నే తనతో యుద్ధానికి రమ్మనడం – వాని దురహంకారానికీ, నాశనానికీ పునాది అయింది.

**చ. జలరుహనాభుఁ డార్చి నిజశార్ఙ్గశరాసనముక్తసాయకా**
**వలి నిగుడించి నొంచెఁ బురవైరి పురోగములన్ రణక్రియా**
**కలితుల గుహ్యకప్రమథకర్బురభూతపిశాచడాకినీ**
**బలవదరాతియోధులను బమ్మెరపోయి కలంగి పాఱఁగన్. 405**

**ప్రతి :** జలరుహనాభుఁడు= పద్మనాభుడైన శ్రీకృష్ణుడు; ఆర్చి= బొబ్బపెట్టి; నిజ= తనయొక్క; శార్ఙ్గ= శార్ఙ్గమనే; శర+ఆసన= వింటినుండి; ముక్త= వదలిన; సాయక+ఆవలిన్= బాణాలసమూహంతో; నిగుడించి= విజృంభించి; పురవైరి పురోగములన్= శివుడు మొదలైన వారిని; రణక్రియా+ఆకలితులన్= యుద్ధక్రియలతో కూడినవారిని; గుహ్యక= గుహ్యకులు; ప్రమథ= ప్రమథగణాలు; కర్బుర= రాక్షసులు; భూత= భూతగణాలు; పిశాచ= పిశాచాలు; డాకినీ= (కనిపించుటతో) ఉపద్రవం కల్గించే పిశాచస్త్రీలు; బలవత్= శక్తిమంతులైన; అరాతి= శత్రు; యోధులను= వీరులను; బమ్మెరపోయి= భయం కలిగించి; కలంగి= తొట్రుపాటుచెంది; పాఱఁగన్= పరుగెత్తేటట్లు; నొంచెన్= బాధించాడు.

**తా :** శ్రీకృష్ణుడు సింహనాదం చేసి తన యుద్ధనైపుణ్యంతో, బాణప్రయోగంతో శివుడు మొదలైన యోధుల్ని బాధించాడు. శత్రుసైనికులు భయంతో కలతచెంది పారిపోయేటట్లు చేశాడు.

**వ. ఇట్లేసి యార్చిన కుంభినీధరుభుజావిజృంభణసంరంభంబునకు సహింపక, నిటలాంబకుం డనలకణంబు లుమియునిశితాంబకంబులం బీతాంబరు నేసిన, వాని నన్నింటి నడుమన ప్రతిబాణంబు లేసి, చూర్ణంబు సేసినం గనుంగొని మఱియును. 406**

**ప్రతి :** ఇట్లు+ఏసి= ఇలా బాణాలువేసి; ఆర్చిన= సింహనాధం చేసిన; కుంభినీధరు= కృష్ణునియొక్క; భుజావిజృంభణ= బాహుపరాక్రమంయొక్క; సంరంభంబునకున్= ఆటోపానికి; సహింపక= ఓర్చుకోలేక; నిటల+అంబకుండు= ఫాలాక్షుడైన శివుడు; అనలకణములు= అగ్నికణాలు; ఉమియు= కక్కుతున్న; నిశిత+అంబకంబులన్= వాడి బాణాలతో; పీత+అంబరునిన్= కృష్ణుణ్ణి; ఏసినన్= కొట్టగా; వానిని= ఆ బాణాల్ని; అన్నింటిన్+నడుమన= అన్నింటి మధ్యలోనే; ప్రతిబాణంబులు+ఏసి= తిరుగు బాణాలు వేసి; చూర్ణంబున్= వాటిల్ని పొడిగా; చేసినన్= చేయగా; కనుగొని= చూచి; మఱియును= ఇంకా...

**తా :** కృష్ణుని విజృంభణం చూడలేక పరమేశ్వరుడు నిప్పులు కక్కే బాణాలు వేశాడు. కృష్ణుడు వాటిని ప్రతిబాణాలతో పొడిపొడిగా చేశాడు. ఇంకా

**మ. అనలాక్షుండు త్రిలోకపూజ్యమగు బ్రహ్మాస్త్రం బరింబోసి యా**
**వనజాతేక్షణుమీఁదఁ గ్రోధమహిమవ్యాకీర్ణుఁడై యేసె, నే**

**సినఁ దద్దివ్యశరంబుచేతనె మఱల్చెం గృష్ణుఁ డత్యుద్ధతిన్**
**జనితాశ్చర్యరసాబ్ధిమగ్ను లగుచున్ శక్రాదు లగ్గింపఁగన్.** **407**

**ప్రతి :** అనల+అక్షుండు= నొసట కన్నుగల శివుడు; త్రిలోకపూజ్యము+అగు= మూడులోకాల్లో పూజించదగిందై; బ్రహ్మ+అస్త్రము= బ్రహ్మాస్త్రం అనే పేరున్న దివ్యాస్త్రాన్ని; అరిన్+పోసి= వింటికి సంధించి; ఆ వనజాత+ఈక్షణు మీఁదన్= ఆ కృష్ణునిపై; క్రోధమహిమవ్యాకీర్ణుఁడై= మిక్కిలికోపం కలవాడై; ఏసెన్= వేశాడు; ఏసినన్= వేయగా; తద్+దివ్యశరంబు చేతన్+ఎ= ఆ లోకాతీతమైన బాణంవల్లనే; అతి+ఉద్ధతిన్= మిక్కిలి గర్వంతో; కృష్ణుఁడు= కృష్ణుడు; మరల్చెన్= మరలించాడు; జనిత+ఆశ్చర్యరస+అబ్ధిమగ్నులు+అగుచున్= కలిగిన ఆశ్చర్య రససముద్రంలో మునిగినవారై; శక్ర+ఆదులు= ఇంద్రుడు మొదలైనవారు; అగ్గింపగన్= పొగడగా...

**తా :** శివుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. శ్రీకృష్ణుడు అదే బ్రహ్మాస్త్రంతోనే దాన్ని తేలికగా తిప్పికొట్టాడు. ఆ ప్రయోగాన్ని చూచి ఇంద్రాది దేవతలు ఆశ్చర్యపడి కృష్ణుని పొగడగా

**శా. వాయవ్యాస్త్ర ముపేంద్రుపై నలిగి దుర్వారోద్ధతి న్నేయ దై**
**తేయధ్వంసియుఁ బార్వతాశుగముచేఁ ద్రెంచెం, గ్రతుధ్వంసి యా**
**గ్నేయాస్త్రం బడరించె నుగ్రగతి లక్ష్మీనాథుపై, దాని వే**
**మాయం జేసెను నైంద్రబాణమునఁ బద్మాక్షుండు లీలాగతిన్.** **408**

**ప్రతి :** ఉపేంద్రుపైన్= కృష్ణునిపై; అలిగి= కోపించి; వాయవ్య+అస్త్రమున్= వాయవ్యాస్త్రాన్ని; దుర్+వార+ఉద్ధతిన్+ఏయన్= నివారింప శక్యంకాని గర్వంతో వేయగా; దైతేయ= రాక్షసుణ్ణి; ధ్వంసియున్= నాశనం చేసేవాడైన కృష్ణుడు; పార్వత+ఆశుగమున్= పార్వతమనే బాణంతో; త్రెంచెన్= తెగవేశాడు; క్రతుధ్వంసి= శివుడు (దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేసినవాడు); ఆగ్నేయ+ అస్త్రంబు= ఆగ్నేయాస్త్రాన్ని; ఉగ్రగతిన్= భయంకరంగా; లక్ష్మీనాథుపైన్= కృష్ణునిపై; అడరించెన్= ప్రయోగించాడు; దానిన్= ఆ బాణాన్ని; వే= వేగంగా; ఐంద్రబాణమునన్= ఇంద్రాస్త్రంతో; పద్మ+అక్షుఁడు= కృష్ణుడు; లీలాగతిన్= విలాసంగా; మాయన్+చేసెను= నిర్వీర్యమయ్యేట్లు చేశాడు.

**తా :** శివుడు కృష్ణునిపై వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. కృష్ణుడు ఈ అస్త్రాన్ని పార్వతబాణంతో తుంచాడు. శివుడు ఆగ్నేయాస్త్రాన్ని వేయగా కృష్ణుడు ఐంద్రాస్త్రంతో దానిప్రభావాన్ని నిర్మూలించాడు.

**వ. మఱియును.** **409**

**ప్రతి :** మఱియును= ఇంకా...

**ఉ. పాయని కిన్కతో హరుఁడు పాశుపతాస్త్రము నారిఁ బోసినన్**
**దోయరుహాయతాక్షుఁడును దోడన లోకభయంకరోగ్ర నా**
**రాయణబాణరాజము రయంబున నేసి మరల్చె దానిఁ జ**
**క్రాయుధుఁ డిత్తెఱంగునఁ బురారిశరావలి రూపుమాపినన్.** **410**

**ప్రతి :** హరుఁడు= శివుడు; పాయని= తొలగని; కిన్కతోన్= కోపంతో; పాశుపత+అస్త్రమున్= పాశుపతాస్త్రాన్ని; నారిన్+ పోసినన్= అల్లెతాడులో ఎక్కుపెట్టగా; తోయరుహ+అక్షుఁడున్= కృష్ణుడూ; తోడన్+అ= వెంటనే; లోకభయంకర= లోకానికి భయం కలిగించే; ఉగ్ర= తీవ్రమైన; నారాయణ బాణరాజమున్= శ్రేష్ఠమైన నారాయణాస్త్రాన్ని; రయంబునన్+ఏసి= వేగంగా వేసి; దానిన్= ఆ పాశుపతాస్త్రాన్ని; మరల్చెన్= మరల్చాడు; చక్ర+ఆయుధుఁడు= శ్రీకృష్ణుడు; ఈ+తెఱంగునన్= ఇలా; పుర+అరి= త్రిపురాలకు శత్రువైన శివునియొక్క; శర+ఆవలిన్= బాణాల సమూహాన్ని; రూపుమాపినన్= నశింపచేయగా...

**తా :** శివుడు పాశుపతాస్త్రం వేశాడు. శ్రీకృష్ణుడు నారాయణాస్త్రం సంధించి, ఆ అస్త్రాన్ని మరల్చాడు. ఈ విధంగా శివుని అస్త్రాలు అన్నిటినీ కృష్ణుడు నిర్వీర్యం చేస్తుండగా

**క. ఊహ కలంగియు విగతో, త్సాహుండగు హరునిమీఁద జలజాక్షుఁడు స**
**మ్మోహనశిలీముఖం బ, వ్యాహతజయశాలి యగుచు నడరించె నృపా! 411**

**ప్రతి :** నృపా!= ఓ రాజా!; ఊహ= ఆలోచన; కలంగియున్= వ్యాకులపాటు పొందగా (చిత్తం చలించగా); విగత+ ఉత్సాహుండు+అగు= నిరుత్సాహుడైన; హరునిమీఁదన్= శివునిపై; జలజ+అక్షుఁడు= శ్రీకృష్ణుడు; సమ్మోహన=సమ్మోహనమనే; శిలీముఖంబున్= బాణాన్ని (అస్త్రాన్ని); అవ్యాహత; జయశాలి= ఎదురులేక గెలిచే శీలంకలవాడు; అగుచున్= అవుతూ; అడరించెన్= ప్రయోగించాడు.

**తా :** కలతచెంది నిరుత్సాహుడై ఉండే శివునిపై జయశాలి అయిన కృష్ణుడు సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించాడు.

**వ. అట్లేసిన. 412**

**ప్రతి :** అట్లు+ఏసినన్= అలా వేయగా...

**క. జృంభణశరపాతముచే, శంభుఁడు నిజతనువు పరవశం బయి సోలన్**
**జృంభితుఁడై ఘననిద్రా, రంభతవృషభేంద్రుమూఁపురముపై వ్రాలెన్. 413**

**ప్రతి :** జృంభణశరపాతముచే= జృంభకాస్త్రం పడడంతో (దీన్నే సమ్మోహనాస్త్రం అనీ అంటారు); శంభుఁడు= శివుడు; నిజ= తనయొక్క; తనువు= శరీరం; పరవశంబు+అయి= మైకంకమ్మి; సోలన్= అలసిపోగా; జృంభితుఁడు+ఐ= ఆవులిస్తూ; ఘన= గొప్పదైన; నిద్రా+ఆరంభతన్= నిద్ర రావడంవల్ల; వృషభ+ఇంద్రు= నందీశ్వరునియొక్క; మూఁపురముపైన్= మూపురంపై; వ్రాలెన్= వాలిపోయాడు.

**తా :** శివుడు సమ్మోహనాస్త్రప్రభావంతో శరీరం స్వాధీనం తప్పగా, చేష్టలుడిగి, నిద్రవచ్చి నందీశ్వరునిమూపురంపై వాలిపోయాడు.

**వ. ఇట్లు వ్రాలినం జక్రపాణి పరబలంబుల నిశితబాణపరంపరలం దునిమియు, నొక్కయెడం గృపాణంబులం గణికలు సేసియు, నొక్కచో గదాహతులం దుత్తుమురుగా మొత్తియు ని వ్విధంబునఁ బీనుంగుపెంటలఁ గావించె, నంత. 414**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వ్రాలినన్= పడిపోగా; చక్రపాణి= కృష్ణుడు; పరబలంబులన్= శత్రుసైన్యాలను; నిశిత= వాడియైన; బాణపరంపరలన్= బాణాలవరుసలతో; తునిమియున్= ఖండించీ; ఒక్క+ఎడన్= కొన్ని స్థలాలలో; కృపాణంబులన్= ఖడ్గాలతో; కణికలు= ముక్కలు; చేసియున్= చేసి; ఒక్కచోన్= ఒక్కచోట; గదా= గదయొక్క; ఆహతులన్= దెబ్బలతో; తుత్తుమురు+కాన్= పొడిపొడి అయ్యేట్టుగా; మొత్తియున్= కొట్టి; ఈ విధంబునన్= ఈ రీతిగా; పీనుంగుపెంటలన్= శవాల గుట్టల్ని; కావించెన్= చేశాడు; అంతన్= ఆ తర్వాత...

**తా :** ఈ విధంగా శివుడు నందీశ్వరునిపై నిద్రమత్తులో పడగా, కృష్ణుడు శత్రుసైనికుల్ని బాణపరంపరతో ఖండించాడు. ఖడ్గాన్ని చేపట్టి శత్రుసైనికులలో మిగిలినవారిని బాధించాడు. ఈ రీతిగా రణరంగాన్ని శవాలగుట్టగా చేశాడు.

**చ.** **తఱిమి మురాంతకాత్మజుఁ డుదాత్తబలంబున బాహులేయుపైఁ**
**గఱకరిఁ దాఁకి తీవ్రశితకాండపరంపర లేసి నొంపఁగా**
**నెఱఁకులు గాఁడి పైఁదొరఁగు నెత్తుట జొత్తిలి వైరు లార్వఁ గాఁ**
**బఱచె మయూరవాహనముఁ బైకొని తోలుచు నాజి భీతుఁడై.** **415**

**ప్రతి :** ముర+అంతక+ఆత్మజుఁడు= ప్రద్యుమ్నుడు; ఉదాత్తబలంబునన్= గొప్పశక్తితో; తఱిమి= వెంబడించి; కఱకరిన్= సమర్థతతో; తాకి= ఎదుర్కొని; బాహులేయుపైన్= కుమారస్వామిమీద; తీవ్రశితకాండపరంపరన్= వాడి అయిన బాణాల సమూహాన్ని; ఏసి= వేసి; నొంపన్+కాన్= నొప్పించగా; నెఱఁకులు= మర్మస్థలాలను; గాడి= నాటుకొని; పైన్+తొరఁగు= పైనుంచి కారుతున్న; నెత్తుటన్= రక్తంలో; చొత్తిలి= తడిసి, ఎర్రబారి; వైరులు+ఆర్వన్+కాన్= శత్రువులు కేకలు వేస్తుండగా; మయూరవాహనమున్= నెమలి వాహనాన్ని; పైకొని= ఎక్కి; తోలుచున్= తోలుకొంటూ; ఆజిన్+భీతుఁడు+ఐ= యుద్ధంలో భయపడినవాడై; పఱచెన్= పారిపోయాడు.

**తా :** ప్రద్యుమ్నుడు గొప్ప సైన్యంతో కుమారస్వామిని ఎదుర్కొన్నాడు. వాడిబాణాలతో బాధింపగా కుమారస్వామి దేహం రక్తపుముద్దయై బాధపడుతుంటే, శత్రువులు సంతోషంతో కేకలు పెడ్తుంటే యుద్ధం అంటే భయపడి; తన నెమలివాహనంపై రణరంగం నుండి పారిపోయాడు.

**ఉ.** **పంబి రణక్షితిన్ శరవిపాటితశాత్రవవీరుఁడైన యా**
**సాంబుఁడు హేమపుంఖశితసాయకజాలము లేర్చి భూరికో**
**పంబున నేసినన్ బెదరి బాణతనూభవుఁ డోడి పాఱె శౌ**
**ర్యంబును బీరముం దగవు నాఱడిపోవ బలంబు లార్వఁగన్.** **416**

**ప్రతి :** రణక్షితిన్= యుద్ధభూమిలో; పంబి= విజృంభించి; శరవిపాటిత= బాణాలచే నాశనం చేయబడ్డ; శాత్రవ వీరుఁడు+ఐన= శత్రువులకు వీరులుగల; ఆ సాంబుండు= ఆ సాంబుడు; హేమపుంఖ= బంగారపు పింజలుగల (బాణం పట్టుకొనే భాగం కుచ్చు); శిత= వాడియైన; సాయకజాలములు= బాణాల సమూహాన్ని; ఏర్చి= సంధించి; భూరి= అధికమైన; కోపంబునన్= కోపంతో; ఏసినన్= ఏయగా; శౌర్యంబునున్= పరాక్రమాన్ని; బీరమును= ధైర్యాన్ని; తగవును+ ఆఱడి+పోవన్= జగడం వ్యర్థమైపోగా; బలంబులు+ఆర్వన్+కన్= సైనికులు బాధతో కేకలువేయగా; బాణతనూభవుడు= బాణుని కుమారుడైన బలాసురుడు; ఓడి; పాఱెన్= పారిపోయాడు.

**తా :** యుద్ధభూమిలో శత్రువీరుడైన సాంబుడు కోపోద్రిక్తుడై బంగారు పిళ్లుగల వాడి బాణాలు వేయగా బాణుని కుమారుడైన బలాసురుడు అధైర్యంతో ఓడి పారిపోయాడు.

**మ. వరబాహాబలశాలి యా హలి రణావష్టంభసంరంభ వి**
**స్ఫురదుగ్రాశనితుల్యమైన ముసలంబుం బూన్చి వ్రేసెన్ బొరిం**
**బొరిఁ గుంభాండక కూపకర్ణుల శిరంబుల్ వ్రస్సి మేదంబు నె**
**త్తురు గర్ణంబుల వాతనుం దొరఁగ సంధుల్ వ్రీలి వే చావఁగన్. 417**

**ప్రతి :** వర= శ్రేష్ఠమైన; బాహా= చేతులయొక్క; బలశాలి= బలంచే ప్రకాశించేవాడు; ఆ హలి= నాగలి ఆయుధంగా కల ఆ బలరాముడు; రణ+అవష్టంభ= యుద్ధ ప్రారంభానికై; సంరంభ= వేగిరపాటుచేత; విస్ఫురత్+ఉగ్ర+అశని= మెరిసే తీక్ష్ణమైన వజ్రాయుధంతో; తుల్యము+ఐన= సమానమైన; ముసలంబున్= రోకలిని; పూన్చి= ధరించి; పొరిన్+పొరిన్= మాటిమాటికి; కుంభాండక కూపకర్ణుల= కుంభాండకుడూ, కూపకర్ణుడు అనేవాళ్ల; శిరంబుల్= తలలు; వ్రస్సి= బద్దలై; మేదంబు= కొవ్వు; నెత్తురు= రక్తం; కర్ణంబులన్= చెవులనుండి; వాతన్= నోటినుండి; తొరఁగన్= కార్తుండగా; సంధుల్= కీళ్లు; వ్రీలి= చీలి; వే= వేగంగా; చావన్+కన్= చచ్చిపోయేట్లుగా; వ్రేసెన్= కొట్టాడు.

**తా :** బలరాముడు వజ్రాయుధంవంటి ముసలంతో కుంభాండ కూపకర్ణుల శిరస్సుపై మోదగా, వారు ముసలం దెబ్బలకు తలలు పగిలి రక్తం కక్కుతూ చచ్చారు.

**వ. అట్టియెడ సైన్యంబు దైన్యంబు నొంది యనాథం బయి చెడి, విఱిగి పాఱినం గని బాణుండు సాత్యకిం గేడించి ప్రళయాగ్నియుంబోలె విజృంభించి చెయి వీచి బలంబుల మరలం బురికొల్పి తానును ముంగలియై నడచె, నప్పు డుభయసైన్యంబు లన్యోన్యజయకాంక్షం దలపడు దక్షిణోత్తరసముద్రంబుల రౌద్రంబున వీఁకం దాఁకినం బోరు ఘోరంబయ్యె, నట్టియెడ గదల నడిచియుఁ, గుఠారంబులఁ బొడిచియు; సురియలం గ్రుమ్మియు, శూలంబులం జిమ్మియు; శక్తుల నొంచియుఁ, జక్రంబులం ద్రుంచియు; ముసలంబుల మొత్తియు, ముద్గరంబుల నొత్తియుఁ; గుంతంబుల గ్రుచ్చియుఁ, బంతంబు లిచ్చియుఁ; బరిఘంబుల నొంచియుఁ, బట్టిసంబులం ద్రుంచియు; శరంబుల నేసియుఁ, గరవాలంబుల వ్రేసియు; సత్రాసులై పాసియు, విత్రాసులై డాసియుఁ బెనఁగినం దునిసిన శిరంబులును, దునుకలైన కరంబులును, దెగిన కాళ్ళును, ద్రెస్సిన వ్రేళ్ళును; దుమురులైన యెముకలును, బ్రోవులైన ప్రేవులును; నులిసిన మేనులును, నలిసిన జానువులును; నొగిలిన వర్మంబులును, బగిలిన చర్మంబులును, వికలంబులయిన సకలావయవంబులును, వికీర్ణంబులయిన కర్ణంబులును; విచ్ఛిన్నంబులైన నయనంబులును, వెడలురుధిరంబులును; బడలుపడుబలంబులును, గొండలవడువునం బడు మాంసఖండంబులును; వాచఱచు కొఱప్రాణంబులును, వ్రాలిన తేరులును; గూలిన కరులును, నొఱగిన గుఱ్ఱంబులును; దెరలిన కాలుబలంబులును గలిగి, పలలఖాదనకుతూహలజనిత మదాంధీభూత పిశాచ డాకినీ భూత బేతాళ సమాలోలకోలాహలభయంకరారావబధిరీకృతసకలదిశావకాశంబయి సంగరాంగణంబు భీషణం బయ్యె, న య్యవసరంబున. 418**

**ప్రతి :** అట్టి+ఎడన్= ఆ సమయంలో; సైన్యంబు= సైన్యం; దైన్యంబున్+ఒంది= దీనత్వం పొంది; అనాథంబు+అయి= దిక్కులేనిదై; చెడి= నశించి; విఱిగి= ఓడి; పాఱినన్+కని= పారిపోగా చూచి; బాణుఁడు= బాణుడు; సాత్యకిన్= సాత్యకిని; కేడించి= అలక్ష్యం చేసి; ప్రళయ+అగ్నియున్+పోలెన్= ప్రళయకాలంనాటి అగ్నివలె; విజృంభించి= చెలరేగి; చేయివీచి= చెయ్యిచాచి; బలంబులన్= (తన) సైన్యాన్ని; మరలన్= తిరిగివచ్చేటట్లు; పురికొల్పి= ప్రోత్సాహపరచి; తానునున్= తానుకూడా; ముంగలియై= ముందున్నవాడై; నడచెన్= నడిచాడు; అప్పుడు= ఆ సమయంలో; ఉభయసైన్యంబులు= రెండుపక్షాలలోని సైనికులు; అన్యోన్య= పరస్పర; జయకాంక్షన్= జయంపొందాలనే కోరికతో; తలపడు= సిద్ధపడు; దక్షిణ+ఉత్తరసముద్రంబుల= దక్షిణ ఉత్తర సముద్రాలవలె; రౌద్రంబునన్= ప్రతాపంతో; తాకినన్= ఎదుర్కోగా; పోరు= యుద్ధం; ఘోరంబు+అయ్యెన్= మిక్కిలి భయంకరం అయింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; గదలన్= గదలచేత; అడిచియున్= కొట్టి; కుఠారంబులన్= గండ్రగొడ్డళ్ళచే; పొడిచియున్= పొడిచి; సురియలన్= చురకత్తులతో; క్రుమ్మియున్= కుమ్మీ; శూలంబులన్= శూలాలతో; చిమ్మియున్= చిమ్మీ; శక్తులన్= శక్తి అనే ఆయుధాలతో; నొంచియున్= నొప్పించీ; చక్రములన్= చక్రాలతో; త్రుంచియున్= ఖండించీ; ముసలంబులన్= రోకళ్ళచే; మొత్తియును= బాది; ముద్గరంబులన్= సమ్మెటల్తో; ఒత్తియున్= అదిమీ; కుంతంబులన్= బల్లేలచే; గ్రుచ్చియున్= పొడిచీ; పంతంబులు+ఇచ్చియు= వీరాలాపాలాడి; పరిఘంబులన్+ఒంచియు= గుదియలచే వంచి; పట్టిసంబులన్= పట్టిసం అనే ఆయుధాలతో; త్రుంచియున్= ముక్కలు చేసీ; శరంబులన్= బాణాలతో; ఏసియున్= కొట్టీ; కరవాలంబులన్= ఖడ్గాలచే; వ్రేసియున్= ఖండించీ; సంత్రాసులు+ఐ= భయపడినవారై; పాసియున్= (యుద్ధరంగాన్ని) వీడి; విత్రాసులు+ఐ= భయం వీడినవారై; డాసియున్= శత్రువును ఢీకొని; పెనఁగినన్= పోరాడగా; తునిసినన్= ముక్కలైన; శిరంబులును= తలలూ; తునకలు+ఐన= ముక్కలైన; కరంబులున్= చేతులూ; తెగిన= తెగిపడిన; కాళ్లూ; త్రెస్సిన= తెగిన; వ్రేళ్ళును= వేళ్లూ; తుమురులు+ఐన= చిన్నముక్కలైన; ఎముకలును= ఎముకలూ; ప్రోవులును+ఐన= రాశులైన; ప్రేవులును= పేగులూ; నులిసిన= పొడి పొడి అయిన; మేనులున్= శరీరాలూ; అలసిన= అలసటపొందిన; జానువులును= మోకాళ్లూ; నొగిలిన= బాధనొందిన; వర్మంబులును= కవచాలూ; పగిలిన= చీలిన; చర్మంబులు= చర్మాలూ; వికలంబులు+అయిన= విరిగిపోయిన; సకల అవయవంబులున్= సర్వశరీరభాగాలూ; వికీర్ణంబులు+అయిన= చెదరిన; కర్ణంబులును= చెవులూ; విచ్ఛిన్నంబుల్+అయిన= చీల్చబడిన; నయనంబులు= కన్నులూ; వెడలు= బయిటకువచ్చు; రుధిరంబులును= నెత్తురులూ; బడలుపడు= బడలికనందిన; బలంబులున్= సైన్యమూ; కొండలవడువునన్= కొండలరీతిగా; పడు= పడే; మాంసఖండంబులును= మాంసపు ముద్దలూ; వాచఱచు కొఱప్రాణంబులును= లబలబలాడుతున్న ప్రాణాలూ; వ్రాలిన తేరులును= పడిన రథాలూ; కూలిన= పడిపోయిన; కరులును= ఏనుగులూ; ఒఱగిన= క్రిందపడ్డ; గుఱ్ఱంబులు= గుర్రాలూ; తెరలిన= త్రెళ్ళిపడిన; కాలుబలంబులును= పదాతిదళాలూ; కలిగి= కలదై; పలల= మాంసాన్ని; ఖాదన= తినుటయందుగల; కుతూహల= ఉత్సుకతచే; జనిత= కలిగిన; మద+అంధీభూత= మదంతో కన్నులు కానని; పిశాచ= పిశాచాలు; డాకినీ= పిశాచ స్త్రీ; భూత= భూతాల; బేతాళ= బేతాళాలయొక్క; సమ+ఆలోల= అంతటా వ్యాపించిన; కోలాహల= కలకలంయొక్క; భయంకర+ఆరావ= భయాన్ని కల్గించే ధ్వనులచే; బధిరీకృత= చెవుడునొందిన; సకలదిశా+అవకాశంబు+అయి= అన్ని దిక్కులమధ్య భాగం కలదై; సమర+అంగణము= రణరంగం; భీషణంబు+అయ్యెన్= భయంకరమైంది; ఆ+అవసరంబున= అట్టిసమయంలో...

**తా :** ఆ సమయంలో బాణునిసైన్యం దీనత్వం పొంది, దిక్కులేనిదై, పారిపోసాగింది. బాణాసురుడు సాత్యకి లక్ష్యంగా ప్రళయకాలాగ్నివలె విజృంభించి యుద్ధం చేసి, సైన్యాన్ని తిరిగి పురికొల్పాడు. ఉభయసైన్యాలు తీవ్రంగా పోరాడాయి.

ఇరుపక్షాల సైన్యాలు దక్షిణ ఉత్తర సముద్రాలవలె భయంకర యుద్ధం చేశాయి. గదలు, ఖడ్గాలు, గండ్రగొడ్డళ్ళు, శూలాలు, చక్రాలు, చురకత్తులు, శక్తులు, బల్లెములు, పట్టిసాలు మొదలైన ఆయుధాలతో యుద్ధం జరిగింది. కాళ్లు, వేళ్లు, తలలు, చేతులు తెగాయి. కళ్ళు పాడయ్యాయి. గజాలు, గుర్రాలు నేలకూలాయి. గుట్టలుగుట్టలుగా పడున్న పీనుగుల్ని తినడానికై పిశాచాలు, భూతాలు, భేతాళాలు గుంపులు గుంపులుగా వచ్చాయి. ఈ భయంకరయుద్ధంవల్ల రణరంగం భీషణంగా మారింది.

**చ. శరకుముదంబు లుల్లసితచామరఫేనము లాతపత్ర భా**
**సురనవపుండరీకములు శోణితతోయము లస్థిసైకతో**
**త్కరము భుజాభుజంగమనికాయము కేశకలాపశైవల**
**స్ఫురణ రణాంగణం బమరెఁ బూరిత శోణనదంబు పోలికన్. 419**

**ప్రతి :** శరకుముదంబులు= బాణాలనే కలువలు; ఉల్లసిత= వికసించిన; చామర= వింజామరలనే; ఫేనము= నురుగు; ఆతపత్ర= గొడుగులవలె; భాసుర= ప్రకాశించే; నవ= కొత్తవైన; పుండరీకములు= తెల్లతామరపూలు; శోణిత= రక్తం అనే; తోయము= నీరు; అస్థి= ఎముకలు అనే; సైకత+ఉత్కరము= ఇసుకరాశి; భుజ= చేతులనే; భుజంగమనికాయము= పాముల సమూహం; కేశకలాప= తలవెంట్రుకల గుంపు అనే; శైవల= నాచుయొక్క; స్ఫురణన్= స్ఫూర్తితో; పూరిత= నింపబడిన; శోణనదంబుపోలికన్= శోణనది విధంగా; రణ+అంగణంబు= యుద్ధభూమి; అమరెన్= ఒప్పింది;

**తా :** బాణాలు కలువపూలుగా; వింజామరలు నురుగులుగా; గొడుగులు తెల్లతామరపూలుగా, రక్తం నీరుగా, ఎముకల గుట్ట ఇసుకరాశిగా, చేతులు పాముల గుంపుగా, తలవెంట్రుకలు నాచుగా తోచుటచే రణరంగం ఎర్రటి నదిలాగా కన్పించింది.

**వ. అట్టి యెడ బాణుండు గట్టలుకం గృష్ణునిపైఁ దనరథంబుఁ బఱపించి, యఖర్వబాహాసహస్ర దుర్వారగర్వాటోపప్రదీప్తుండై కదిసి. 420**

**ప్రతి :** అట్టియెడన్= ఆ సమయంలో; బాణుండు= బాణుడు; కడు+అలుకన్= మిక్కిలి కోపంతో; కృష్ణునిపైన్= కృష్ణునిపైకి; తన; రథంబున్= రథాన్ని; పఱపించి= పరువెత్తించి; అఖర్వ= వ్యర్థంకాని; బాహాసహస్ర= వేయిబాహువులచేత; దుర్వార= నివారింపశక్యంకాని; గర్వ= అహంకారంయొక్క; ఆటోప= అతిశయంవల్ల; ప్రదీప్తుండు+ఐ= మిక్కిలి వెలిగినవాడై; కదిసి= సమీపించి...

**తా :** ఆ సమయంలో బాణాసురుడు మిక్కిలి కోపంతో శ్రీకృష్ణునిపైకి రథాన్ని పరుగెత్తించి, తాను సహస్రబాహుడ ననే గర్వంతో సమీపించి

**మ. ఒక యే నూఱు కరంబులన్ ధనువు లత్యుగ్రాకృతిం దాల్చి త**
**క్కక యొక్కొక్కట సాయకద్వయము వీఁకం బూన్చు నాలోన నం**
**దకహస్తుండు తదుగ్రచాపచయవిధ్వంసంబు గావించి కొం**
**చక తత్సారథిఁ గూల నేసి రథముం జక్కాడి శౌర్యోద్ధతిన్. 421**

**ప్రతి :** ఒక; ఏనూఱు= ఐదువందల; కరంబులన్= చేతులలో; ధనువులు= విల్లుల్ని; అతి+ఉగ్ర+ఆకృతిన్= మిక్కిలి భయంకరమయిన రూపంతో; తాల్చి= ధరించి; తక్కక= మిగిలిన; ఒక్కొక్కటన్= ఒక్కొక్క చేతిలో; సాయకద్వయము= రెండేసి బాణాల్ని; వీఁకన్= ఉత్సాహంతో; పూన్చు= సంధిస్తుండగా; ఆలోనన్= అంతలో; నందకహస్తుండు= నందకమనే ఖడ్గం చేతిలో కలవాడు - (కృష్ణుడు); తత్+ఉగ్ర+చాపచయ= ఆ భీషణములైన వింటి సమూహాన్ని; విధ్వంసంబున్= విరుగగొట్టడం; కావించి= చేసి; కొంచక= సందేహించక; శౌర్య+ఉద్ధతిన్= పరాక్రమంయొక్క గర్వంచే; తత్+సారథిన్= ఆ రథాన్ని నడిపేవాణ్ణి; కూలన్+ఏసి= పడమొత్తి; రథమున్= రథాన్ని; చక్కు+ఆడి= ఖండించి...

**తా :** బాణాసురుడు ఒకసారిగా అయిదువందల చేతులతో ధనువులను ధరించి, మిగిలిన చేతులతో రెండేసి బాణాలను తీసుకొని సంధించేలోపలే శ్రీకృష్ణుడు ఆ బాణాల్నీ, ధనుస్సులనూ ధ్వంసం చేశాడు. సారథిని సంహరించి, రథాన్ని ధ్వంసం చేసి

**తే.** **ప్రళయజీమూతసంఘాతభయదభూరి, భైరవారావముగ నొత్తెఁ బాంచజన్య**
**మఖిలజనులు భయభ్రాంతులయి చలింపఁ, గడఁగి నిర్భిన్నరాక్షసీగర్భముగను.** **422**

**ప్రతి :** ప్రళయ= ప్రళయకాల; జీమూత= మేఘాల; సంఘాత= సమూహంయొక్క; భయద= భయాన్ని కల్గించే; భూరి= అధికమైన; భైరవ= భయంకరమైన; ఆరావము+కన్= ధ్వని కలుగునట్లుగా; అఖిలజనులు= అందరూ; భయ= భయంవల్ల; భ్రాంతి= ఉన్నదిలేనట్లు లేనిది ఉన్నట్లు కలిగే భావనచేత; చలింపన్= కదిలేటట్లు; నిర్భిన్న= భేదిల్లిన; రాక్షసీగర్భముగను= రాక్షసస్త్రీల గర్భాలు కలుగునట్లుగా; పాంచజన్యమున్+ఒత్తెన్= పాంచజన్యశంఖాన్ని పూరించాడు.

**తా :** శ్రీకృష్ణుడు ప్రళయకాలమేఘగర్జనతో సమానమైన శబ్దాన్ని కల్గించే పాంచజన్యాన్ని పూరించాడు. జనులందరూ భయభ్రాంతులయ్యారు. ఆ ధ్వనికి రాక్షసస్త్రీల గర్భాలు విచ్ఛిన్నమయ్యాయి.

**వ.** **అట్టి యవక్రవిక్రమపరాక్రమంబునకు వెగడుపడి బాణుండు లేటమొగంబువడి చేయునది లేక విన్ననయి యున్నయెడ.** **423**

**ప్రతి :** అట్టి= ఆ విధమైన; అవక్ర= ఎదురులేని; విక్రమ= పరాక్రమంచే; పరాక్రమంబునకున్= శత్రువుల్ని లొంగదీయుటకు; వెగడు+పడి= ఆశ్చర్యపడి; బాణుండు= బాణుడు; లేటమొగంబు+పడి= పెడముఖం పెట్టి; చేయు+అది లేక= ఏమీచేయలేక; విన్నన+అయి= కళతప్పి; ఉన్న+ఎడన్= ఉన్న సమయంలో...

**తా :** శ్రీకృష్ణుని ఎదురులేని శౌర్యపరాక్రమాలకు భయపడి, బాణుడు పెడమొగం పెట్టి ఏమీ చేయలేక న్యూనతతో ఊరకుండిపోయిన సమయంలో

**సీ.** **అత్తఱిఁ గోటర యను బాణజనయిత్రి, సుతుఁ గాచు మతము సన్మతిఁ దలంచి**
**వీడి శిరోజముల్ వ్రేలంగ నిర్ముక్తపరిధానయై మురాసురవిభేది**
**యెదుర నిల్చినఁ జూడ మదిఁ జాల రోసి ప, రాఙ్ముఖుఁడై యున్న నను వేచి**
**తల్లడించుచు బాణుఁ డుల్లంబు గలగంగఁ, దలచీర వీడ యాదవులు నవ్వ**

**తే.** **నవ్యకాంచనమణి భూషణములు రాలఁ, బాదహతి నేలఁ గంపింపఁ బాఱి యాత్మ**
**పురము వడిఁ జొచ్చె నప్పుడు భూతగణము, లాకులతతోడ నెక్కడే నరుగుటయును.** **424**

**ప్రతి :** ఆ+తఱిన్= ఆ సమయంలో; కోటర= కోటర; అను= అనే పేరుగల; బాణ= బాణుని; జనయిత్రి= తల్లి; సుతున్= కుమారుణ్ణి; కాచు= రక్షించే; మతము= అభిప్రాయాన్ని; సత్+మతిన్= మంచిబుద్ధితో; తలంచి= ఆలోచించి; శిరోజముల్= తలవెంద్రుకలు; వీడి= వీడిపోయి; వ్రేలన్+కన్= వేలాడుతుండగా; నిర్+ముక్త= విడువబడిన; పరిధానయై= వస్త్రాలు కలిగిందై; ముర+అసురవిభేది= మురాసురుణ్ణి చంపినవాడైన కృష్ణునియొక్క; ఎదురన్= ఎదుట; నిల్చినన్= నిలబడగా; చూడన్= చూడడానికి; మదిన్= మనస్సులో; చాలన్= మిక్కిలి; రోసి= అసహ్యించుకొని; పరాక్+ముఖుఁడు+ఐ= ముఖం తిప్పుకొని; ఉన్నన్= ఉండగా; అనువు= అవకాశం కోసం; వేచి= ఎదురుచూచి; తల్లడించుచున్= చలిస్తూ; బాణుండు= బాణుడు; ఉల్లంబు= మనస్సు; కలగన్+కన్= చెదరగా; తలచీర= తలపాగ; వీడన్= జారిపోగా; యాదవుల్= యాదవులు; నవ్వన్= నవ్వుతూ ఉండగా; నవ్య= కొత్తవైన; కాంచన= బంగారు; మణి= మణులతో కూడిన; భూషణములు= అలంకారాలు; రాలన్= కిందపడగా; పాదహతిన్= పాదాల తాకిడికి (నొక్కి అడుగులు వేయడంవల్ల కలిగిన ఒత్తిడికి); నేల= భూమి; కంపింపన్= కంపించగా; పాఱి= పరుగెత్తి; ఆత్మపురమున్= తన నగరాన్ని (శోణపురం); వడిన్= వేగంగా; చొచ్చెన్= ప్రవేశించాడు; అప్పుడు= ఆ సమయంలో; భూతగణములు= పిశాచసమూహం; ఆకులతతోడన్= వ్యాకులతతో; ఎక్కడేన్= ఎక్కడికో; అరుగుటయును= వెళ్లడమూ...

**తా :** ఆ సమయంలో బాణునితల్లి కోటర తన కుమారుడైన బాణుణ్ణి రక్షించాలనే తలపుతో వివస్త్రయై కృష్ణుని ఎదుట నిలబడగా, అసహ్యభావంతో అతడు పరాఙ్ముఖుడయ్యాడు. బాణుడు మనస్సు బాధపడుతుండగా, తలపాగ ఊడిపోగా బంగారుమణిభూషణాలు పడిపోతుండగా, యాదవులు నవ్వుతుండగా తన నగరానికి పారిపోయాడు. భూతగణాలుకూడా ఎక్కడికో వెళ్ళిపోగా

**క.** **శిరములు మూఁడును ఘనభీ, కరపదములు మూఁడుఁ గలిగి కనలి మహేశ**
**జ్వర మురుఘోరాకృతితో, నరుదేరఁగఁ జూచి కృష్ణుఁ డల్లన నగుచున్.** **425**

**ప్రతి :** శిరములు= తలలు; మూఁడును= మూడు; ఘన= గొప్పవైన; భయంకర= భయం కలిగించే; పదములు= పాదాలు; మూఁడును= మూడు; కలిగి= ఉండి; కనలి= కోపించి; మహేశజ్వరము= శివజ్వరం; ఉరు= అధికమైన; ఘోర+ఆకృతితోన్= భయంకర రూపంతో; అరుదేరన్+కన్= రాగా; చూచి; కృష్ణుఁడు= కృష్ణుడు; అల్లనన్= నెమ్మదిగా; నగుచున్= నవ్వుతూ...

**తా :** మూడుతలలు, మిక్కిలి భయంకరమైన మూడుపాదాలు కలిగి కోపంతో శివజ్వరం రాగా చూచి, కృష్ణుడు మెల్లగా నవ్వుతూ

**చ.** **పరువడి వైష్ణవజ్వరముఁ బంచిన న య్యుభయజ్వరంబులున్**
**వెరవును లావుఁ జేవయును వీరము బీరము గల్గి ఘోర సం**
**గర మొనరింప నందుఁ గరకంఠకృతజ్వర ముగ్రవైష్ణవ**
**జ్వరమున కోడి పాఱె ననివారణ వైష్ణవి వెంట నంటఁగన్.** **426**

**ప్రతి :** పరువడిన్= క్రమంగా (కృష్ణుడు); వైష్ణవజ్వరమున్= విష్ణుజ్వరాన్ని; పంచినన్= పంపగా; ఆ+ఉభయజ్వరంబులన్= శైవవైష్ణవజ్వరాలు రెండూ; వెరవును= (ఉపాయం); లావున్= బలం; చేవయును= సామర్థ్యం; వీరము= శౌర్యం; బీరము+కల్గి=

పరాక్రమం కలిగి; ఘోర= భయంకరమైన; సంగరము+ఒనరింపన్= యుద్ధం చేయగా; అందున్= ఆ యుద్ధంలో; కరకంఠ కృతజ్వరము= శైవజ్వరం; ఉగ్ర= భయంకరమైన; వైష్ణవజ్వరమునకున్+ఓడి= వైష్ణవజ్వరానికి లొంగి; అనివారణన్= నివారించడానికి వీలుకాక; వైష్ణవి= వైష్ణవ జ్వరం; వెంటన్+అంటన్+కన్= వెంబడించగా; పాఱెన్= పారిపోయింది.

**తా :** శైవవైష్ణవజ్వరాలు రెండూ, ఉపాయం, సామర్థ్యం, బలం, పరాక్రమం కలిగి పోరాడగా శైవజ్వరం ఓడిపోయింది. వైష్ణవజ్వరం ధాటికి ఆగలేక భయపడి పారిపోయింది.

**తే. పాఱి యే దిక్కుఁ గానక ప్రాణభీతి, నెనసి యేడ్చుచు నా హృషీకేశుపాద**
**కంజములఁ బడి 'ననుఁ గావు కావు' మనుచు, నిటలతటఘటితాంజలిపుటయు నగుచు. 427**

**ప్రతి :** పాఱి= పారిపోయి; ఏ దిక్కున్+కానక= ఏ దిక్కూ తోచక; ప్రాణభీతిన్= ప్రాణభయాన్ని; ఎనసి= పొంది; ఏడ్చుచున్= ఏడుస్తూ; ఆ; హృషీక+ఈశు= ఇంద్రియాలకు అధిపతియైన కృష్ణునియొక్క; పాదకంజములన్= పాదపద్మాలపై; పడి; నిటలతటఘటిత= ఫాలభాగానికి చేర్చిన; అంజలిపుటయు అగుచు= దోసిలి కలిగి (నమస్కరిస్తూ); ననున్= నన్ను; కావుము, కావుము+అనుచున్= రక్షించు రక్షించుమంటూ...

**తా :** శైవజ్వరం దిక్కుతోచక ఏడుస్తూ ప్రాణభయంతో వచ్చి, కృష్ణునిపాదాలపైబడి, నమస్కరించి నన్ను రక్షించు రక్షించు అంటూ ప్రార్థించింది.

**వ. ఇట్లు వినుతించె. 428**

**ప్రతి :** ఇట్లు= ఇలా; వినుతించెన్= కొనియాడింది.

**తా :** ఈ విధంగా ప్రార్థించింది.

**సీ. అవ్యయు ననఘు ననంతశక్తిని బరులైనట్టి బ్రహ్మరుద్రామరేంద్ర**
**వరుల కీశ్వరుఁ డైనవాని సర్వాత్మకు జ్ఞానస్వరూపు సమానరహితు**
**వరదుని జగదుద్భవస్థితిసంహారహేతుభూతుని హృషీకేశు నభవు**
**బ్రహ్మచిహ్నంబులై పరఁగు సుజ్ఞానశక్త్యాదుల నొప్పు బ్రహ్మంబు నీశు**

**ఆ. నజు షడూర్మిరహితు నిజయోగమాయా వి, మోహితాఖిలాత్ము ముఖ్యచరితు**
**మహితతేజు నాదిమధ్యాంతహీనునిఁ, జిన్మయాత్ము నిను భజింతుఁ గృష్ణ! 429**

**ప్రతి :** కృష్ణ!= శ్రీకృష్ణా!; న+వ్యయున్= నాశం లేనివాణ్ణి; న+అఘున్= పాపరహితుణ్ణీ; న+అంత+శక్తిన్= అంతంలేని శక్తి కలవాణ్ణీ; పరులు+ఐనట్టి= తనకంటే ఇతరులైనట్టి; బ్రహ్మ= బ్రహ్మ; రుద్ర= రుద్రుడు; అమర+ఇంద్ర= దేవేంద్రుడు అనే; వరులకున్= ప్రభువులకు; ఈశ్వరుఁడు+ఐనవానిన్= ప్రభువైనవాణ్ణి; సర్వ+ఆత్మకున్= సర్వమూ తన రూపంగా కలవాణ్ణీ; జ్ఞానస్వరూపున్= జ్ఞానస్వరూపుణ్ణీ; సమానరహితున్= తనతో సమానుడు లేనివాణ్ణి; వరదున్= వరాలు ఇచ్చేవాణ్ణి; జగత్= ప్రపంచంయొక్క; ఉద్భవ= పుట్టుకకు; స్థితి= నిలుపుదలకు; సంహార= సంహరించడానికి (లయం చేయడానికి); హేతుభూతునిన్= కారణమైనవాణ్ణి; హృషీక+ఈశున్= ఇంద్రియాలకు ప్రభువైనవాణ్ణీ; న+భవున్= జన్మ లేనివాణ్ణి; బ్రహ్మచిహ్నంబులు+ఐ పరఁగు= పరబ్రహ్మస్వరూపంగా ఒప్పుతున్న; సుజ్ఞానశక్తి+ఆదులన్= మంచి జ్ఞానం, శక్తి

మొదలైనవాటితో; ఒప్పు= ఒప్పిదమవుతున్న; బ్రహ్మంబున్= పరమాత్ముణ్ణీ; ఈశున్= సర్వానికీ ప్రభువును; న+జ= అజ= అజున్= పుట్టుక లేనివాణ్ణి; షట్+ఊర్మిరహితున్= యోగసాధనకు ఆటంకాలు కల్గించే ఆరువిధాలైన జీవధర్మాలు లేనివాణ్ణి; నిజ= తనయొక్క; యోగమాయా= మూలప్రకృతిచే; విమోహిత= మోహపరచబడిన; అఖిల+ఆత్మన్= సర్వప్రాణులు కలవాణ్ణి; ముఖ్య= ప్రధాన; చరితున్= నడవడి కలవాణ్ణి; మహిత= గౌరవప్రదమైన; తేజున్= వర్చస్సు కలవాణ్ణి; ఆది మధ్య+అంతహీనునిన్= ఆదిమధ్యాంతాలు లేనివాణ్ణి; చిత్+మయ+ఆత్మన్= సచ్చిదానంద స్వరూపం కలవాణ్ణి; నినున్= నిన్ను; భజింతున్= సేవిస్తాను.

**తా :** కృష్ణా! అవ్యయుడవు, అనఘుడివి, అనంతశక్తియుక్తుడివి, బ్రహ్మరుద్రేందాదులకు ప్రభువైనవాడివి; సర్వాత్మకుడివి; జ్ఞానమయుడివి; జగదుద్భవస్థితి సంహారకారకుడివి; ఉత్తమ జ్ఞాన శక్త్యాదులచే ఒప్పునట్టివాడివి, పరమాత్మస్వరూపుడివి, ప్రభుడివి; నీ మూలప్రకృతి మహిమతో సర్వప్రాణులను మోహపరచునట్టివాడివి; గౌరవప్రదమైన వర్చస్సు కలవాడివి; ఆదిమధ్యాంతాలులేనివాడివి; సచ్చిదానంద స్వరూపుడివీ అయిన నిన్ను సేవిస్తాను.

**విశే :** షట్+ఊర్ములు= షడూర్ములు. 'ఊర్మి' అంటే అల. యోగసాధనకు ఆటంకాలను కల్గించే ఆరువిధాలైన అలజడులే – జీవధర్మాలే షడూర్ములు. అవి క్షుత్ (ఆకలి), పిపాస (దప్పిక), శోకం, మోహం, జర (ముదిమి), మరణం. ఇవి ప్రతిజీవికి సహజమైనవే. అయితే ఇవి సమపాళ్లలో ఉండవు. ఒక్కొక్కరోజు ఒక్కొక్క తీరుగా ఉంటాయి. జీవసహజమైన ఈ అలజడులను, ధర్మాలనూ జయించడం యోగసాధనలో ఒక భాగం. షడూర్ములలో ఆకలి (ఆహారం), దప్పికలు – సూక్ష్మశరీర ధర్మాలు; శోకమోహాలు – కారణ శరీరధర్మాలు – జరామరణాలు= స్థూల శరీర ధర్మాలు. ఈ ధర్మాలు లేనివాడు పరమాత్మ. సుజ్ఞానమంటే – ఇతర సాధనాలతో అవసరంలేని, స్వయంప్రకాశకమైన తత్త్వజ్ఞానం. శక్తులు – ఇవి పరమాత్మకు సంబంధించిన సర్వజ్ఞత్వం, సర్వేశ్వరత్వం, సర్వాంతర్యామిత్వం – మొదలైనవి.

**వ. అదియునుం గాక లోకంబున దైవం బనేకప్రకారంబులై యుండు, నది యెట్టి దనినం గలాకాష్ఠా ముహూర్తంబులనం గల కాలంబును, సుకృతదుష్కృతానుభవరూపంబులైన జీవకర్మంబులును; స్వభావంబును, సత్త్వరజస్తమోగుణాత్మకంబైన ప్రకృతియును, సుఖదుఃఖాశ్రయంబైన శరీరంబును, జగజ్జంతు నిర్వాహకంబైన ప్రాణంబును, సకలపదార్థపరిజ్ఞానకారణంబైన యంతఃకరణంబును, మహదహంకారశబ్ద స్పర్శరూపరస గంధతన్మాత్రతత్కార్యభూతగగనపవనానలసలిలధరాదిపంచభూతంబు లాదిగాఁ గల ప్రకృతి వికారంబులును, నన్నింటిసంఘాతంబును, బీజాంకురన్యాయంబునం గార్యకారణరూపప్రవాహంబునునై, జగత్కారణశంకితంబై యుండు, నది యంతయు భవదీయమాయావిడంబనంబుగాని యున్నయది కాదు, తదీయమాయానివర్తకుండ వైన నీవు నానావిధదివ్యావతారాదిలీలలం జేసి దేవగణంబులను, సత్పురుషులను, లోకనిర్మాణచణులైన బ్రహ్మాదులను బరిరక్షించుచు లోకహింసాప్రవర్తకులైన దుష్టమార్గగతులం గ్రూరాత్ముల హింసించుచుందువు, విశ్వవిశ్వంభరాభారనివారణంబు సేయుటకుఁ గదా భవదీయదివ్యావతారప్రయోజనంబు, గావున నిన్ను శరణంబు వేఁడెద. 430**

**ప్రతి :** అదియున్+కాక= ఇంకా; లోకంబునన్= ప్రపంచంలో; దైవంబు= భగవంతుడు; అనేక= పెక్కు; ప్రకారంబులు+ఐ= విధాలై; ఉండున్= ఉంటాడు; అది= ఆ విధం; ఎట్టి+అది+అనినన్= ఎటువంటిదంటే; కలా= ముప్పదికాష్ఠల కాలం; కాష్ఠ= పదునెన్మిది రెప్పపాట్ల కాలం; ముహూర్తము= నలభై ఎనిమిది నిమిషాలకాలం (అల్పకాలం); అనన్+కల=

అనబడే; కాలంబును= భూత, భవిష్యత్, వర్తమాన రూపమైన కాలాన్ని; సుకృత= మంచిపనియొక్క; దుష్కృత= చెడుపనియొక్క; అనుభవ= అనుభవమే; రూపంబులు+ఐన= ఆకారాలుగా ఉన్న; జీవ= జీవునియొక్క; కర్మంబులును= పాపపుణ్య కర్మలూ; స్వభావంబును= స్వభావాల్ని; సత్త్వ= సత్త్వం; రజస్= రజస్సు; తమస్= తమస్సు - అనే; గుణ+ఆత్మకంబు+ఐన= గుణాలు గల్గిన; ప్రకృతియును= ప్రకృతీ; సుఖదుఃఖ+ఆశ్రయంబు+ఐన= సుఖదుఃఖాలకు ఆధారమైన; శరీరమును= దేహాన్నీ; జగత్+జంతు= లోకంలోని ప్రాణులను; నిర్+వాహకంబు+ఐన= నిర్వహించేదైన; ప్రాణంబును= ప్రాణాన్నీ; సకల= సమస్త; పదార్థ= సర్వవస్తువులయొక్క; పరిజ్ఞాన= సంపూర్ణజ్ఞానానికి; కారణంబు+ఐన= కారణమైన; అంతఃకరణంబును= మనస్సునూ; మహత్+అహంకార= మహత్తు, అహంకారం అనే తత్త్వాలూ; శబ్ద= శబ్దం; స్పర్శ= తాకుట; రూప= ఆకారం; రస= రసం; గంధ= వాసన అనేవి; తద్+మాత్ర= పంచతన్మాత్రలనబడేవి; తత్+కార్య= వానికార్యరూపాలైన; భూత= చేతనాచేతన వస్తువులు; గగన= ఆకాశం; పవన= గాలి; అనల= అగ్ని; సలిల= నీరు; ధరా+ఆది= భూమిమున్నగు; పంచభూతంబులు+ఆదికాన్+కల= పంచభూతాలు మున్నగునవై ఉన్న; ప్రకృతివికారంబులునున్= ప్రకృతియొక్క మార్పులు; అన్నింటి సంఘాతంబును= అన్నింటి సమూహాలు; బీజ+అంకురన్యాయంబునన్= బీజం, అంకురం అనే న్యాయంతో; కార్యకారణ= కార్యం, కారణం అనే; రూప= రూపంగల; ప్రవాహంబును+ఐ= ప్రవాహమై; జగత్+కారణ= ప్రపంచహేతువుగా; శంకితంబు+ఐ= సందేహించదగిందై; ఉండును= ఉంటుంది; అది; అంతయున్= అంతా; భవదీయ= నీ; మాయావిడంబనంబు= మాయయొక్క అనుకరణం; కాని= కాని; ఉన్న+అది= నిజంగా ఉన్నది; కాదు; తదీయ= దాని; మాయానివర్తకుండవు+ఐన= మాయను తొలగించేవాడివైన; నీవు; నానావిధ= అనేకాలైన; దివ్య+అవతార+ఆది= దేవతాపరమైన అవతారాలు మున్నగు; లీలలన్+చేసి= విలాసాల్ని చేసి; దేవగణంబులను= దేవతల సమూహాల్ని; సత్+పురుషులను= ఉత్తములైనవార్ని; లోకనిర్మాణచణులైన= లోకాలను నిర్మించడంలో నేర్పరులైన; బ్రహ్మ+ఆదులను= బ్రహ్మ మున్నగువారిని; పరిరక్షించుచున్= కాపాడుతూ; లోకహింసాప్రవర్తకులు+ఐన= లోకంలో హింస కలిగేందుకు కారణమైన; దుష్టమార్గగతులన్= చెడుమార్గం అనుసరించేవారిని; క్రూర+ఆత్ములన్= క్రూరమైన మనస్సు కలవార్ని; హింసించుచున్= బాధపెడుతూ; ఉందువు= ఉంటావు; విశ్వ= సమస్తమైన; విశ్వంభరా= ధరిత్రియొక్క; భార= బరువును; నివారణంబున్+చేయుటకున్= పోగొట్టడానికి; కదా; భవదీయ= నీయొక్క; దివ్య+అవతార= పవిత్రమైన అవతారాల; ప్రయోజనంబు= ఫలితం; కావునన్= కాబట్టి; నిన్నున్= నిన్ను; శరణంబు= శరణు; వేఁడెదన్= కోరుతున్నాను.

**తా :** కృష్ణా! లోకంలో భగవంతుడు అనేకవిధాలుగా కన్పిస్తాడు. కళ, కాష్ఠ, ముహూర్తాలనబడేకాలాలూ, మంచిపనులూ, చెడుపనులూ, ప్రత్యక్షాదిజ్ఞానరూపాలైన జీవునికర్మలూ, స్వభావాలూ, సత్త్వరజోతమోగుణాలచే కూడిన ప్రకృతీ, బీజాంకురన్యాయంతో కార్యకారణరూపమై ప్రవాహమైన ఈ జగత్తు సత్యమేమో అనిపిస్తుంది. ఇది నీ మాయేగాని వాస్తవం కాదు. ఆ మాయను నివారించగల నీవు పెక్కు అవతారాలెత్తి లోకనిర్మాణనిపుణులైన బ్రహ్మ, ఇంద్రుడు మున్నగువారిని, పుణ్యపురుషుల్ని, దేవతల సమూహాన్ని కాపాడుతున్నావు. క్రూరకర్ములగు దుష్టాత్ములను శిక్షిస్తున్నావు. నీ అవతారంయొక్క ప్రయోజనం భూభారాన్ని తగ్గించడమే! అందువల్ల నిన్ను శరణుకోరుతున్నాను.

**సీ.** **శాంతమై మహితతీక్ష్ణసుదుస్సహంబై యు, దారమై వెలుఁగొందు తావకీన**
**భూరిభాస్వత్తేజమునఁ దాప మొందితిఁ, గడుఁ గృశించితి నన్ను గరుణఁ జూడుఁ**
**మితరదేవోపాస్తిరతి మాని మీ పాద, కమలముల్ సేవించు విమలబుద్ధి**
**యెందాక మది దోఁప దందాఁకనే కదా, ప్రాణులు నిఖిలతాపములఁ బడుట?**

**తే. యవిరళానన్యగతికుల నరసి బ్రోచు, బిరుదు గల నీకు ననుఁ గాచు టరుదె? దేవ!**
**ప్రవిమలాకార! సంసారభయవిదూర! భక్తజనపోష పరితోష! పరమపురుష! 431**

**ప్రతి :** ప్రవిమల+ఆకార= మిక్కిలి స్వచ్ఛమైన ఆకారం (రూపం) కలవాడా!; సంసారభయ విదూర= సంసారభయాన్ని పోగొట్టేవాడా!; భక్త జనపోష పరితోష= భక్తులను పోషించడంవల్ల సంతోషం పొందేవాడా!; పరమపురుషా= పరమపురుషా!; దేవ= ఓ ప్రభూ!; శాంతము+ఐ= శాంతమైన; మహిత= పూజింపబడిందై; సుదుస్సహంబు+ఐ= మిక్కిలి భరించరానిదై; ఉదారము+ఐ= గొప్పదై; వెలుఁగు+ఒందు= ప్రకాశించే; తావకీన= నీ యొక్క; భూరి= అధికమైన; భాస్వత్+తేజమునన్= ప్రకాశించే కాంతితో; తాపము+ఒందితిన్= తపించాను; కడున్= మిక్కిలి; కృశించితిన్= నీరసించాను; నన్నున్= నన్ను; కరుణన్= దయతో; చూడుము= చూడు; ఇతరదేవ= అన్యదేవతలయొక్క; ఉపాస్తి= ఉపాసనయొక్క; రతిన్= ప్రీతిని; మాని= విడిచి; మీ= మీ యొక్క; పాదకమలముల్= పాదపద్మాల్ని; సేవించు= పూజించే; విమల= స్వచ్ఛమయిన; బుద్ధి= బుద్ధి (ఆలోచన); ఎందాకన్= ఎంతవరకు; మదిన్= మనస్సులో; తోఁపదు= తోచదో; అందాకన్+ఎ= అంతవరకే; కదా!; ప్రాణులు= జీవులు; నిఖిలతాపములన్= అన్నిబాధల్ని; పడుట= పొందుట; అవిరళ= ఎడతెగకుండా; అనన్యగతికులన్= వేరేదిక్కు లేనివారిని; అరసి= పరిశీలించి; బ్రోచు= రక్షించే; బిరుదము= బిరుదు; కల= ఉన్న; నీకున్= నీకు; ననున్= నన్ను; కాచుట= రక్షించుట; అరుదు+ఎ= అరుదా? (ఆశ్చర్యమా?)

**తా :** ప్రవిమలాకారా! సంసారభయాన్ని దూరం చేసేవాడా! భక్తజనులను పోషించడంలో ఆనందం పొందేవాడా! పరమపురుషా! దేవా! శాంతమై, పూజనీయమై, తీక్ష్ణమై, ఉదారమై ప్రకాశించే నీ కాంతిచే తాపాన్ని పొందాను. కృశించాను, నన్ను రక్షించు. నీ పాదపద్మాలను సేవించే బుద్ధి కలిగేటంతవరకే మానవులు పాపాలు చేస్తారు. అనాథ రక్షకుడనే బిరుదు కలిగిన నీకు నన్ను కాపాడుట వింతయా? (కాదని భావం)

**చ. అనినఁ బ్రసన్నుఁడై హరి యనంతుఁడు దైత్యవిభేది దాని కి**
**ట్లనియె మదీయసాధన మనన్యనివారణ మౌట నీ మదిం**
**గని నను నార్తిఁ జొచ్చితివి గావున మజ్జ్వరతీవ్రదాహవే**
**దన నినుఁ బొంద దింకఁ బరితాపము దక్కుము నీ మనంబునన్. 432**

**ప్రతి :** అనినన్= అని ప్రార్థించగా; ప్రసన్నుఁడు+ఐ= దయగలవాడై; అనంతుఁడు= అంతం లేనివాడు, శాశ్వతుడు; దైత్యవిభేది= రాక్షసులను భేదించేవాడు ఐన; హరి= కృష్ణుడు; దానికిన్= ఆ శైవజ్వరంతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; మదీయ= నా యొక్క; సాధనము= జ్వరం; అనన్యనివారణము+ఔట= మరియొక విధానంతో తొలగించడం సాధ్యంకానిది కనుక; నీ= నీయొక్క; మదిన్= మనస్సులో; ననున్= నన్ను; కని= చూచి; ఆర్తిన్= బాధతో; చొచ్చితివి= శరణుకోరావు; కావునన్= కాబట్టి; మత్= నాయొక్క; జ్వర= జ్వరంయొక్క (వైష్ణవజ్వరంయొక్క); తీవ్ర= తీవ్రమైన; దాహవేదన= తాపజనిత బాధ; నినున్= నిన్ను; పొందదు; ఇంకన్= ఇకపై; నీ= నీయొక్క; మనంబునన్= మనస్సులో; పరితాపము= విచారం; తక్కుము= మానుము!

**తా :** అనగా శ్రీకృష్ణుడు దయగలవాడై సాధనమైన జ్వరం (వైష్ణవజ్వరం) ఇతరమైన సాధనాలతో నివారణం కాదు. కానీ, నీవు నీ మనస్సులో నన్ను చూచి, (నా తత్త్వం తెలుసుకొని) శరణు కోరావు. కనుక నా వైష్ణవజ్వరతాపం ఇకపై నిన్ను బాధించదు. ఇక మనోవేదన చెందవద్దు.

**విశే :** 'సర్వధర్మాలను పరిత్యజించి, నన్నే శరణుపొందు, సర్వపాపాలనుండి నిన్ను నేను విముక్తుణ్ణి చేస్తాను. విచారించకు' అనిన గీతాచార్యుని వాక్యం - ప్రస్తుతం - శైవజ్వరశక్తి విషయంలో నిరూపితమైంది.

**వ. అని మఱియు న ప్పుండరీకాక్షుం డిట్లను, 'నెవ్వరేనియు నీ యుభయజ్వరవివాదంబును, నీవు మత్ప్రపత్తిం జొచ్చుటయునుఁ జిత్తంబులం దలంతు రట్టిపుణ్యాత్ములు శీతోష్ణజ్వరాదితాపంబులఁ బొరయ' రని యానతిచ్చిన న మ్మహేశ్వరజ్వరంబు పరమానందభరితహృదయంబై యా రథాంగపాణికి సాష్టాంగ దండప్రణామం బాచరించి నిజేచ్ఛం జనియె, నంత బాణాసురుండు నక్కడ. 433**

**ప్రతి :** అని; మఱియున్= ఇంకా; ఆ+పుండరీక+అక్షుండు= ఆ కృష్ణుడు; ఇట్లు= ఈ రీతిగా; అనున్= అన్నాడు; ఎవ్వరు+ ఏనియున్= ఎవ్వరైనా; ఈ; ఉభయజ్వర= శైవ వైష్ణవ జ్వరాలయొక్క; వివాదంబును= కలహాన్నీ; నీవు= నీవు (శివజ్వరం); మత్= నాయొక్క; ప్రపత్తికిన్= శరణాగతికి; చొచ్చుటయును= కోరుటయును; చిత్తంబులన్= మనస్సుల్లో; తలంతురో= తలుస్తారో; అట్టి= అటువంటి; పుణ్య+ఆత్ములు= పుణ్యస్వరూపులు; శీత+ఉష్ణజ్వర+ఆదులన్= శీతోష్ణ జ్వరాలు మున్నగువానివల్ల కలిగే; తాపంబులన్= బాధల్ని; పొరయరు= పొందరు; అని; ఆనతి= ఆజ్ఞను; ఇచ్చినన్= ఇవ్వగా; ఆ+మహా+ఈశ్వరజ్వరంబు= ఆ శివజ్వరం; పరమ+ఆనంద= మిక్కిలి ఆనందంతో; భరిత= నిండిన; హృదయంబు+ఐ= మనస్సుకలదై; ఆ; రథ+ అంగపాణికిన్= సుదర్శన చక్రాయుధుడైన శ్రీకృష్ణునికి; స+అష్ట+అంగదండప్రణామంబు+ఆచరించి= ఎనిమిది శరీరభాగాలతో కూడిన నమస్కారంచేసి; నిజ+ఇచ్ఛన్= తాను కోరినట్లు; చనియెన్= వెళ్లింది; అంతన్= తరువాత; బాణ+ అసురుండును= బాణుడు కూడా; అక్కడన్= శోణపురంలో...

**తా :** ఆ శ్రీకృష్ణుడు ఇంకా ఈ విధంగా అన్నాడు. ఎవ్వరైనా ఈ శైవ వైష్ణవజ్వరాల కలహాన్నీ, నీవు (శైవజ్వరం) విష్ణుప్రపత్తికి సిద్ధపడటాన్నీ మనస్సులో తలుస్తారో అట్టిపుణ్యాత్ములను శీతోష్ణజ్వరాలు బాధింపవు అని చెప్పగా ఆ శైవజ్వరం కృష్ణునికి సాష్టాంగంగా నమస్కరించి తన కోరికను అనుసరించి వెళ్లింది. తరువాత బాణాసురుడు శోణపురంలో

## ❖ బాణాసురుఁడు రెండవసారి యుద్ధమునకు వచ్చుట ❖

**సీ. కమనీయకింకిణీఘంటికాసాహస్ర, ఘణఘణధ్వనిచేత గగన మగల**
**నన్యజనాలోక నాభీలతరళోగ్ర, కాంచనధ్వజపతాకలు వెలుంగఁ**
**బృథునేమిఘట్టనఁ బృథివి కంపింపంగ, వలనొప్పు పటుజవాశ్వములఁ బూన్చి**
**నట్టి యున్నతరథం బత్యుగ్రగతి నెక్కి, కరసహస్రమున భీకరతరాసి**

**తే. శరశరాసనముఖదివ్యసాధనములు, దనరఁ జలమును బలము నుత్కటము గాఁగ**
**హర్ష మిగురొత్తఁ గయ్యంపుటాయితమునఁ, బురము వెలువడె బలిపుత్త్రుఁ దురుజవమున. 434**

**ప్రతి :** కమనీయ= మనోహరమైన; కింకిణీ= చిరుమువ్వలు అనే; ఘంటికాసాహస్ర= వేయిగంటలయొక్క; ఘణఘణధ్వనిచేతన్= ఘణఘణమనే ధ్వనితో; గగనము= ఆకాశం; అగలన్= భేదిల్లగా; అన్యజన+ఆలోకన= శత్రుజనులు చూచేందుకు; ఆభీల= భయంకరంగా; తరళ= చలించుటచే; ఉగ్ర= క్రూరంగా కన్పిస్తున్న; కాంచన= బంగారపు; ధ్వజ= జెండాకొయ్యలూ; పతాకలు= జెండాలు; వెలుంగన్= కాంతిమంతం కాగా; పృథునేమి= పెద్దవైన చక్రాల; ఘట్టన= ఒరిపిడివల్ల; పృథివి=

భూమి; కంపింపన్+కన్= వణకగా; వలను+ఒప్పు= అనుకూలమగు; పటు= శక్తిమంతమైన; జవన= వేగవంతాలైన; అశ్వములన్= గుర్రాల్ని; పూన్చిన+అట్టి= కట్టినట్టి; ఉన్నతరథంబు= ఎత్తైనరథాన్ని; ఎక్కి= అధిష్ఠించి; అతి+ఉగ్రతన్= మిక్కిలి కాఠిన్యంతో; కరసహస్రమునన్= వేయిచేతుల్లో; భీకరతర+అసి= మిక్కిలి భయంకరమైన ఖడ్గాన్ని; శర= బాణాల్ని; శర+ఆసన+ముఖ= విల్లులు మొదలైన; దివ్యసాధనములు= లోకాలకు అతీతమైన ఉపకరణాలు; తనరన్= ఒప్పగా; చలమును= పట్టుదలా; బలమును= శక్తీ; ఉత్కటము= అధికం; కాన్+కన్= కాగా; హర్షము= సంతోషం; ఇగురు+ఒత్తన్= అంకురింపగా; కయ్యము+ఆయితమునన్= యుద్ధపుసన్నాహంతో; ఉరు= అధికమయిన; జవమునన్= వేగంతో; బలిపుత్రుఁడు= బాణుడు; పురము= నగరంనుండి; వెలువడెన్= బయటకు వచ్చాడు.

**తా :** బాణుని రథంయొక్క చిరుమువ్వల ధ్వనులనే చిన్న గంటల ధ్వనులు ఆకాశాన్ని బద్దలయ్యేలా చేస్తున్నాయి. శత్రుజనులు భయపడేటట్లుగా బాణుని రథం బంగారు ధ్వజస్తంభాలతో, పతాకాలతో ప్రకాశిస్తుండగా, రథచక్రాల కమ్ముల ఒరిపిడికి భూమి కంపించగా, అనుకూలమూ, శక్తిమంతమూ అయిన యౌవనమందున్న గుర్రాల్ని రథానికి పూన్చి, ఎత్తైనరథాన్ని అధిష్ఠించి, దివ్యమైన బాణాలు, విల్లులు మున్నగు అరుదైన ఉపకరణాలను సమకూర్చుకొని బలం, పట్టుదల, శక్తి అధికమై సంతోషం పొంగిపొరలగా యుద్ధానికి సిద్ధమై, మిక్కిలి వేగంగా నగరంనుండి యుద్ధభూమికి వచ్చాడు.

**క. చని రణభూమిని మధ్యం, దినమార్తాండప్రచండదీప్తాకృతితోఁ**
**దనరుచుఁ బరిపంథిబలేం, ధనదవశిఖియైన కృష్ణుఁ దాఁకెం బెలుచన్. 435**

**ప్రతి :** చని= యుద్ధభూమికి వచ్చి; రణభూమిన్= యుద్ధభూమిలో; మధ్యందిన మార్తాండ= మధ్యాహ్నకాల సూర్యునివలె; ప్రచండ= తీవ్రంగా; దీప్త+ఆకృతితోన్= ప్రకాశించే రూపంతో; తనరుచున్= ఒప్పుతూ; పరిపంథి= శత్రువులయొక్క; బల= సేనయొక్క; ఇంధన= ఎండు కట్టెలకు; దవశిఖి+ఐన= దావాగ్నిజ్వాల అయిన; కృష్ణున్= కృష్ణుణ్ణి; పెలుచన్= ఆగ్రహంతో; తాకెన్= ఎదుర్కొన్నాడు.

**తా :** బాణాసురుడు రణభూమికి వచ్చి, రంగస్థలంలో మధ్యాహ్నకాల సూర్యునివలె తీవ్రంగా ప్రకాశిస్తూ దావాగ్ని జ్వాలవంటి కృష్ణుణ్ణి ఎదిరించాడు.

**ఉ. తాఁకి భుజావిజృంభణము దర్పము నేర్పును నేర్పడంగ నొ**
**క్కూఁకున వేయిచేతుల మహోగ్రశరావళి పింజ పింజతోఁ**
**దాఁకఁగ నేసినన్ మురవిదారుఁడు తోడన తచ్ఛరావళి**
**న్నాఁక గొనంగఁ ద్రుంచె నిశితార్ధశశాంకశిలీముఖంబులన్. 436**

**ప్రతి :** తాకి= ఎదుర్కొని; భుజా= బాహువులయొక్క; విజృంభణము= చెలరేగడం; దర్పము= గర్వం; నేర్పునున్= ప్రావీణ్యం; ఏర్పడన్+కన్= ఏర్పడేటట్లు; ఒక్క+ఊకునన్= ఒకే ప్రయత్నంతో; వేయిచేతులన్= వేయిచేతులతో; మహా+ఉగ్రశర+ఆవళిన్= గొప్ప భయంకర బాణసమూహాన్ని; పింజపింజతోన్= ఒక బాణం వెనుక మరొక బాణం; తాఁకగన్= తాకేటట్లుగా; ఏసినన్= వేయగా; మురవిదారుఁడు= మురాసురుణ్ణి కూల్చిన కృష్ణుడు; తోడన్+అ= వెంటనే; తత్= ఆ; శర+ఆవళిన్= బాణాల సమూహాన్ని; ఆఁకన్+కొనంగన్= అడ్డగించడానికి; నిశిత= వాడియైన; అర్ధశశ+అంకశిలీముఖంబులన్= అర్ధచంద్రాకారబాణాలతో; త్రుంచెన్= ఖండించాడు.

**తా :** బాణుడు శ్రీకృష్ణుణ్ణి ఎదుర్కొని, యుద్ధంలో చెలరేగి, గర్వంతో, నేర్పుతో వేయిచేతులా పుంఖానుపుంఖాలుగా అతనిపై బాణాలు వదిలాడు. కృష్ణుడు వెంటనే ఆ బాణసమూహాన్ని అర్ధచంద్రాకారబాణాలతో ఖండించాడు.

**వ. అంత. 437**

**ప్రతి :** అంతన్= అంతట...

**చ. నుతనవపుండరీకనయనుం డన నొప్పు మురారి రోషఘూ**
**ర్ణితమహితారుణాబ్జదళనేత్రుఁడు దా నటు పంచె దైత్యుపై**
**దితిసుతకాననప్రవరదీపితశుక్రము రక్షితాంచితా**
**శ్రితజనచక్రమున్ సతతసేవితశక్రము దివ్యచక్రమున్. 438**

**ప్రతి :** నుత= ప్రశంసార్హమైన; నవ= అప్పుడే వికసించిన; పుండరీకనయనుండు= తెల్లతామరరేకులవంటి విశాల నేత్రాలు కలవాడు; అనన్= అనగా; ఒప్పు= తగినట్టి; ముర+అరి= కృష్ణుడు; రోష= కోపంతో; ఘూర్ణిత= తీవ్రంగా కదలాడుతున్న; మహిత+అరుణదళ+నేత్రుఁడు= కొనియాడదగిన పూలరేకులవంటి నేత్రాలు కలవాడై (కోపించినవాడై); దితిసుతకానన= దితికుమారులైన రాక్షసులనే అరణ్యానికి; ప్రవర= శ్రేష్ఠమైన; దీపిత= మండే; శుక్రము= అగ్ని (దావాగ్ని) వంటిది; రక్షిత= కాపాడబడిన; అంచిత= ఒప్పే; ఆశ్రితజన చక్రమున్= ఆశ్రయించిన జనసమూహం కలదాన్ని; సతత= ఎల్లప్పుడూ; సేవిత= కొలువబడే; శక్రమున్= ఇంద్రుడు గలది అయిన; దివ్యచక్రమున్= దేవతాకమయిన సుదర్శన చక్రాన్ని; అటు= అటువైపు; దైత్యుపై= రాక్షసుడగు బాణునిపై; తాన్= తాను (శ్రీకృష్ణుడు); పంచెన్= పంపాడు.

**తా :** అప్పుడే వికసించిన తెల్లతామరపూరేకులవంటి విశాలనేత్రాలు గలవాడైన శ్రీకృష్ణుడు ముర అనే రాక్షసుని సంహరించినవాడు, కనుకనే కోపంతో, రోషంతో తీవ్రంగా కదలాడుతున్న ఎర్రతామరరేకులవంటి నేత్రాలు గలవాడై, దితి కుమారులైన రాక్షసులనే గొప్ప అరణ్య సమూహాన్ని కాల్చివేసే దావాగ్నియై విజృంభించి, తనను ఆశ్రయించిన వారిని రక్షించేదీ; నిరంతరం ఇంద్రునిచే రక్షణకై పూజించబడేదీ, దివ్యలక్షణ లక్షితమైనదీ అగు సుదర్శన చక్రాన్ని రాక్షసరాజైన బాణునిపై ప్రయోగించాడు.

**వ. అదియునుం బ్రచండమార్తాండమండలప్రభావిడంబితంబును, భీషణశతసహస్రకోటిదంభోళి నిష్ఠురనిబిడనిశితధారాసహస్రప్రభూతజ్వలనజ్వాలికాపాస్తసమస్తకుటిలపరిపంథిదుర్వారబాహాఖర్వ గర్వాంధకారంబును, సకలదిక్పాలదేవతాగణజేగీయమానంబును, సమదదానవజనశోకకారణభయంకర దర్శనంబును, సమంచితసజ్జనలోకప్రియంకర స్పర్శనంబును నగు సుదర్శనం బసురాంతకప్రేరితంబై చని, యారామకారుండు కదళికాకాండంబుల నేర్పు చందంబునం బేర్చి సమదవేదండశుండాదండంబుల విడంబించుచుఁ గనకమణివలయకేయూరకంకణాలంకృతంబు నగు తదీయబాహాసహస్రంబుఁ గరచతుష్ట యావశిష్టంబుగాఁ దునుము నవసరంబున. 439**

**ప్రతి :** అదియున్= ఆ సుదర్శన చక్రం; ప్రచండ= తీవ్రమైన; మార్తాండమండల= సూర్యమండలంయొక్క; ప్రభా= కాంతిని; విడంబితంబును= అనుకరించేదీ; భీషణ= భయంకరమైన; శతసహస్రకోటి= నూరువేల కొనలుగల; దంభోళి=

వజ్రాయుధంవలె; నిష్ఠుర= కఠినమైన; నిబిడ= దృఢమైన; నిశిత= వాడియైన; ధారాసహస్ర= వేయికత్తివాదరలవల్ల; ప్రభూత= పుట్టిన; జ్వలన= అగ్నియొక్క; జ్వాలికా= మంటలచే; అపాస్త= తొలగింపబడ్డ; సమస్త= సర్వ; కుటిల= మోసంచేసే; పరిపంథి= శత్రువులచేత; దుర్+వార= వారింప శక్యం కాని; బాహా= భుజాలయొక్క; అఖర్వ= మొక్కపోని; గర్వ+అంధకారంబును= గర్వమనే చీకటి కలదీ; సకల= సర్వ; దిక్+పాలుర= దిక్కులను పాలించేవారిచే; దేవతాగణ= దేవతాసమూహంచే; జేగీయమానంబు= స్తుతులు గైకొనేదీ; సమద= గర్వంతో కూడిన; దానవజన= రాక్షసజనులయొక్క; శోక= దుఃఖానికి; కారణ= కారణమైన; భయంకర= భయం కల్గించే; దర్శనము= దర్శనం కలదీ; సమంచిత= బాగుగా; సజ్జనలోక= సజ్జనసమూహానికి; ప్రియంకర= ఇష్టం కలిగించే; స్పర్శనంబును= స్పర్శకలదీ, అగు= అయిన; సుదర్శనంబు= సుదర్శనచక్రం; అసుర+అంతక= రాక్షసులను సంహరించేవాడైన కృష్ణుడు; ప్రేరితంబు+ఐ= ప్రయోగింపబడిందై; చని= వెళ్ళి; ఆరామకారుఁడు= ఉద్యానవనపాలకుడు; కదళికా= అరటిచెట్లయొక్క; కాండంబులన్= బోదెలను; ఏర్చు చందంబునన్= కాల్చునట్లుగా; పేర్చి= విజృంభించి; సమద= మదంతో కూడిన; వేదండ= ఏనుగులయొక్క; శుండాదండములన్= బలమైన కర్రలవంటి తొండాల సమూహాన్ని; విడంబించుచున్= అనుకరిస్తూ; కనక= బంగారుతో చేయబడ్డ; మణివలయ= మణులు పొదిగిన కడియాలచే; కేయూర= భుజకీర్తులచే; కంకణ= చేతికడియాలచే; అలంకృతంబున్+అగు= అలంకరింపబడిందైన; తదీయ= వానియొక్క (బాణాసురుని); బాహాసహస్రంబున్= వేయిచేతుల్ని; కర+చతుష్టయ+ అవశిష్టంబు+కన్= నాలుగు చేతులుమాత్రమే మిగిలేటట్లుగా; తునుము= ఖండించే; అవసరంబునన్= సమయంలో...

**తా :** ప్రచండసూర్యమండలంలా శోభిస్తూ నూరువేల కొనలుగల వజ్రాయుధంవలె అగ్నికీలలతో కుటిల శత్రువుల గర్వాంధకారాన్ని నశింపజేస్తూ, ఇంద్రాది సమస్త దేవతల స్తుతులు అందుకుంటూ, తన దర్శనంచే రాక్షసులకు శోకం కలిగించేదీ తన స్పర్శతో సజ్జనులకు ఆనందం కలిగించేదీ, అయిన సుదర్శనచక్రాన్ని, కృష్ణుడు ప్రయోగించగా – రత్నాలు పొదిగిన బంగారు చేతికడియాలతో అందగిస్తూ మదించిన ఏనుగుల తొండాల్లాగా వెలుగొందుతున్న బాణాసురుని వేయిచేతుల్లో నాల్గింటిని వదలి తక్కిన వాటిని తోటమాలి అరటిబోదెల్ని కాల్చివేసినట్లు ధ్వంసం చేసే సమయంలో

## ❖ శివుండు బాణుని రక్షింప శ్రీకృష్ణుని స్తుతించుట ❖

**తే.** **కాలకంఠుఁడు బాణుపైఁ గరుణ గలఁడు, గాన నఖిలాండపతిఁ గృష్ణుఁ గదియ వచ్చి**
**పురుషసూక్తంబు సదివి సంపుటకరాబ్జుఁ, డగుచుఁ బద్మాయతాక్షు నిట్లని స్తుతించె. 440**

**ప్రతి :** కాలకంఠుఁడు= శివుడు; బాణుపైన్= బాణునిపట్ల; కరుణ= దయ; కలఁడు= కలవాడు; కానన్= కావున; అఖిల+అండపతిన్= సర్వలోకాలకూ ప్రభువైన; కృష్ణున్= కృష్ణుణ్ణి; కదియన్+వచ్చి= సమీపించి; పురుషసూక్తంబు= పురుషసూక్తం; చదివి= పఠించి; సంపుట= ముకుళించిన; కర+అబ్జుఁడు= పద్మంవంటిచేతులుకలవాడు; అగుచున్= అవుతూ (చేతులో జోడించి నమస్కరించినవాడై); పద్మ+ఆయత+అక్షునిన్= పద్మనేత్రుణ్ణి (కృష్ణుణ్ణి); ఇట్లు+అని= ఇలా; స్తుతించెన్= స్తోత్రం చేశాడు.

**తా :** బాణునిపై శివునికి దయ ఉంది. అందువల్ల శ్రీకృష్ణుణ్ణి సమీపించి, ముకుళితహస్తుడై నమస్కరిస్తూ, పురుషసూక్తం పఠించి, ఇలా స్తుతించాడు.

**వ.** **'దేవా! నీవు బ్రహ్మరూపంబగు జ్యోతిర్మయుండవు, నిఖిలవేదవేదాంతనిగూఢుండవు, నిర్మలుండవు, సమానాధికరహితుండవు, సర్వవ్యాపకుండవైన నిన్ను నిర్మలాంతఃకరణులైనవార లాకాశంబుపగిది**

**నవలోకింతు, రదియునుం గాక పంచోపనిషన్మయం బయిన భవదీయదివ్యమంగళమహావిగ్రహ పరిగ్రహంబు సేయు నెడ నాభియం దాకాశంబును, ముఖంబునం గృశానుండును, శిరంబున స్వర్గంబును, శ్రోత్రంబుల దిశలును, నేత్రంబుల సూర్యుండును, మనంబునఁ జంద్రుండును, బాదంబుల వసుంధరయు, నాత్మయం దహంకారంబును, జఠరంబున జలధులును, రేతంబున నంబువులును, భుజంబుల నింద్రుండును, రోమంబుల మహీరుహౌషధీవ్రాతంబును, శిరోజంబుల బ్రహ్మలును, జ్ఞానంబున సృష్టియు నవాంతర ప్రజాపతులును, హృదయంబున ధర్మంబును గలిగి మహాపురుషుండవై లోకకల్పనంబుకొఱకు నీ యకుంఠితతేజంబు గుప్తంబు సేసి జగదుద్భవంబుకొఱకుఁ గైకొన్న భవదీయదివ్యావతారవైభవం బెఱింగి నుతింప నెంతవారము; నీవు సకలచేతనాచేతననిచయంబులకు నాద్యుండవు, అద్వితీయుండవు, పురాణపురుషుండవు, సకలసృష్టిహేతుభూతుండవు, ఈశ్వరుండవు; దినకరుండు కాదంబినీ కదంబావృతుం డగుచు భిన్నరూపుండై బహువిధచ్ఛాయలం దోఁచువిధంబున నీ యఘటితఘటనానిర్వాహకంబైన సంకల్పంబునఁ ద్రిగుణాతీతుండ వయ్యును సత్త్వాదిగుణవ్యవధానంబుల ననేకరూపుండవై గుణవంతులైన సత్పురుషులకుఁ దమోనివారకంబైన దీపంబురూపంబునం బ్రకాశించుచుందువు; భవదీయమాయా విమోహితు లయిన జీవులు పుత్త్రదారగృహక్షేత్రాదిసంసారరూపకంబైన పాపపారావారమహావర్త గర్తంబుల మునుంగుచుం దేలుచుందురు; దేవా! భవదీయదివ్యరూపానుభవంబు సేయంజాలక యింద్రియపరతంత్రుండై భవత్పాదసరసీరుహంబులఁ జేర నెఱుంగని మూఢాత్ముం డాత్మవంచకుం డనంబడు; విపరీతబుద్ధిం జేసి ప్రియుండవైన నిన్ను నొల్లక యింద్రియార్థానుభవంబు సేయుట యమృతంబు మాని హాలాహలంబు సేవించుట గాదె? జగదుదయపాలనలయలీలాహేతుండవై శాంతుండవయి సుహృజ్జన భాగధేయుండవై సమానాధికవస్తుశూన్యుండవైన నిన్ను నేనును బ్రహ్మయుం బరిణతాంతఃకరణులైన మునిగణంబులును భజియించుచుందుము, మఱియును.** **441**

ప్రతి : దేవా!= కృష్ణా!; నీవు; బ్రహ్మరూపంబు+ఐన= పరబ్రహ్మ స్వరూపుడవయిన; జ్యోతిస్+మయుండవు= ప్రకాశమే స్వరూపంగా గలవాడివి; నిఖిల= సమస్త; వేద= వేదాల్లో; వేద+అంత= ఉపనిషత్తుల్లో; నిగూఢుండవు= రహస్యంగా ఉంటావు; సమాన= సమానమైనవాడు; అధిక రహితుండవు= అధికమైనవాడు లేనివాడివి; సర్వవ్యాపకుండవు+ఐన= అన్నింటియందు వ్యాపించినవాడవైన; నిన్నున్= నిన్ను; నిర్మల+అంతఃకరణులు+ఐనవారలు= స్వచ్ఛమైనమనస్సు కలవారు; ఆకాశంబు పగిదిన్= ఆకాశంవలె; అవలోకింతురు= చూస్తారు; అదియున్+కాక= అంతేకాకుండ; పంచ+ఉపనిషత్+ మయంబు+ఐన= పంచోపనిషత్తులతో కూడిన; భవదీయ= నీయొక్క; దివ్యమంగళమహావిగ్రహ= దేవతాపరంగా శుభపరమయిన గొప్ప ఆకారాన్ని; పరిగ్రహంబున్+చేయు+ఎడన్= తీసుకొనేటపుడు; నాభి+అందున్= బొడ్డులో; ఆకాశంబును= ఆకాశం; ముఖంబున= ముఖంలో; కృశానుండును= అగ్ని; శిరంబునన్= శిరస్సులో; స్వర్గంబును= స్వర్గం; శ్రోత్రంబులన్= చెవుల్లో; దిశలును= దిక్కులును; నేత్రంబులన్= కండ్లలో; సూర్యుండును= సూర్యుఁడును; మనంబునన్= మనస్సులో; చంద్రుండును= చంద్రుడును; పాదంబులన్= కాళ్ళలో; వసుంధరయున్= భూమియు, ఆత్మన్= జీవునిలో; అహంకారంబును= అహం అనే భావాన్ని; జఠరంబునన్= కడుపులో; జలధులును= సముద్రాలును; రేతంబునన్= పురుషవీర్యంలో; అంబువులును= జలాలును; భుజంబులన్= భుజాల్లో; ఇంద్రుండును= ఇంద్రుడును; రోమంబులన్=

వెంద్రుకలలో; మహీరుహ+ఓషధీవ్రాతంబును= వృక్ష, ఔషధీసమూహమూ; శిరోజంబులన్= తలవెంద్రుకలలో; బ్రహ్మలును= బ్రహ్మలును; జ్ఞానంబునన్= జ్ఞానంలో; సృష్టియున్= సృష్టియు; అవాంతరప్రజాపతులను= ప్రజాపతులను (కశ్యపమరీచ్యాదులు); హృదయంబునన్= హృదయంలో; ధర్మంబును= ధర్మమూ; కలిగి= కలిగియుండి; మహాపురుషుండవు+ ఐ= గొప్పవాడివై; లోకకల్పనంబు కొఱకున్= లోకసృష్టికోసం; నీ= నీయొక్క; అకుంఠితతేజంబున్= మొక్కవోని తేజస్సును; గుప్తంబు+చేసి= దాచి; జగత్+ఉద్భవంబుకొఱకున్= జగత్తుల్ని సృష్టించడానికి; కైకొన్న= తీసుకొన్న; భవదీయ= నీ యొక్క; దివ్య= గొప్ప ప్రకాశవంతమైన; అవతార= అవతారం యొక్క; వైభవంబు= గొప్పతనాన్ని; ఎఱింగి= తెలిసికొని; నుతింపన్= ప్రశంసించేందుకు; ఎంతవారము= ఎంతటివారం?; నీవు; సకల= సమస్త; చేతన+అచేతన= చర; అచర (సృష్టికి) నిచయంబులకున్= సమూహానికి; ఆద్యుండవు= మొదటివాడవు; అద్వితీయుండవు= రెండవవాడు లేనివాడివి; పురాణపురుషుఁడవు= సృష్టికి ముందున్నవాడివి; సకలసృష్టి= సమస్తసృష్టికి; హేతుభూతుండవు= కారణమైనవాడివి; ఈశ్వరుండవు= ప్రభుడివి; దినకరుండు= సూర్యుడు; కాదంబినీ= మేఘాలయొక్క; కదంబ= సమూహంచే; ఆవృతుఁడు= కప్పబడ్డవాడు; అగుచున్= అయి; భిన్నరూపుండు+ఐ= అనేకాలైన రూపాలు కలిగినవాడై; బహువిధ+ఛాయలన్+ తోఁచు= అనేక కాంతులతో కన్పించే; విధంబునన్= రీతిగ; నీ= నీయొక్క; అఘటిత= సంభవింపనివాటిని; ఘటనా నిర్వాహకంబు+ఐన= సంభవింపచేయగల; సంకల్పంబునన్= అభిప్రాయంలో; త్రిగుణ+అతీతుండు= మూడుగుణాలకు అందనివాడవు; అయినను= అయినప్పటికి; సత్త్వ+ఆది= సత్త్వం మొదలయిన; గుణ= గుణాలయొక్క; వ్యవధానంబులన్= తేడావల్ల; అనేక= అనేకములైన; రూపుండవు+ఐ= రూపాలు కలిగినవాడివై; గుణవంతులు+ఐ= మంచిగుణాలచేకూడిన; సత్+పురుషులకున్= పుణ్యులకు; తమస్+నివారకంబు+ఐన= చీకటిని తొలగించే; దీపంబు రూపంబునన్= దీపంయొక్క ఆకారంలో; ప్రకాశించుచున్= వెలుగులిస్తూ; ఉందువు= ఉంటావు; భవదీయ= నీయొక్క; మాయ= మాయచే; విమోహితులు= మిక్కిలి మోహం పొందినవారు; అయినట్టి; జీవులు; పుత్త్ర= సంతానం; దార= భార్య; గృహ= ఇల్లు; క్షేత్ర= పొలాలు; ఆది= మొదలైన; సంసారరూపకంబు+ఐన= సంసారరూపమైన; పాప= పాపమనే; పారావార= సముద్రంయొక్క; మహా+ఆవర్త= గొప్ప సుడిగుండాలనే; గర్తంబులన్= లోతైన నీళ్లలో; మునుంగుచున్= మునుగుతూ; తేలుచున్= తేలుతూ; ఉందురు= ఉంటారు; దేవా!= దేవా!; భవదీయ= నీ యొక్క; దివ్యరూప= పవిత్రమయిన రూపంయొక్క; అనుభవంబున్= అనుభవాన్ని; చేయన్+చాలక= పొందలేక; ఇంద్రియ= ఇంద్రియాలకు; పరతంత్రుండు+ఐ= పరాధీనుడై; భవత్= నీయొక్క; పాదసరసీరుహంబులన్= పాదపద్మాల్ని; చేరన్+ఎఱుంగని= సమీపించడం తెలియని; మూఢ+ఆత్ముండు= తెలివి లేనివాడు; ఆత్మవంచకుండు= తనను తాను మోసం చేసికొనేవాడు; అనన్+పడున్= అనబడతాడు; విపరీత= ప్రతికూల; బుద్ధిన్+చేసి= బుద్ధిచే; ప్రియుండవు+ఐన= ఇష్టుడవైన; నిన్నున్= నిన్ను; ఒల్లక= అంగీకరించక; ఇంద్రియ+అర్థ+అనుభవమున్= ఇంద్రియవిషయాల అనుభవాన్ని; చేయుట= పొందడం; అమృతంబున్= అమృతాన్ని; మాని= వదలుకొని; హాలహలంబున్= మహావిషాన్ని; సేవించుట= గ్రహించడం; కాదు+ఎ= కాదా?; జగత్= జగత్తుయొక్క; ఉదయ పాలనలయలీలాహేతుండవు+ ఐ= సృజించుట, పాలించుట, నశింపచేయుట అనే విలాసాలకు కారణమైనవాడివై; శాంతుండవు+అయి= శాంతస్వభావం కలవాడవై; సుహృత్+జన= మంచి హృదయం కలవారికి (సజ్జనులకు); భాగధేయుండవు+ఐ= భాగ్యస్వరూపుండవై; సమాన+అధిక= సమానము; అధికం అగు; వస్తు= పదార్థంచే; శూన్యుండవు= లేనివాడవు; ఐన= అయి ఉన్న; నిన్నున్= నిన్ను; నేనును= నేనూ; బ్రహ్మయున్= బ్రహ్మయును; పరిణత+అంతఃకరణులు+ఐన= పండిన మనస్సు కలిగినవారైన; మునిగణంబులునున్= మునుల సమూహాలు; భజియించుచున్= సేవిస్తూ; ఉందుము= ఉంటాము; మఱియును= ఇంకా...

**తా :** ఓ కృష్ణా! నీవు బ్రహ్మస్వరూపుడివి; ప్రకాశమే స్వరూపంగా గలవాడివి, సమస్తవేద వేదాంతరహస్యాలు తెలిసినవాడివి, సమాన అధిక భేదాలు లేనివాడివి. అన్నింటా వ్యాపించినవాడివి అయిన నిన్ను నిర్మలాంతః కరణులు ఆకాశం (శూన్యం) వలె చూస్తారు. అంతే కాకుండ పంచోపనిషత్తులతో కూడిన నీ దేవతాపరశుభాకారాన్ని చూస్తారు. ఆ ఆకారదర్శనంలో బొడ్డులో ఆకాశాన్ని, ముఖంలో అగ్నినీ, శిరస్సులో స్వర్గాన్నీ, చెవుల్లో దిక్కుల్నీ, కండ్లలో సూర్యుణ్ణీ, మనస్సులో చంద్రుణ్ణీ, కాళ్ళలో భూమినీ, జీవునిలో అహంభావాన్నీ, కడుపులో సముద్రాల్నీ, రేతంలో నీటినీ, భుజాలలో ఇంద్రుణ్ణీ, వెంద్రుకలలో వృక్ష ఓషధీ సమూహాల్నీ, తలవెంద్రుకలలో బ్రహ్మల్నీ, జ్ఞానంలో సృష్టినీ, ప్రజాపతుల్నీ, హృదయంలో ధర్మాన్నీ కలిగిన మహాపురుషుడవు. లోక సృష్టికొరకు మొక్కవోని కాంతిని దాచి సృష్టికోసం నీ అవతారంయొక్క గొప్పతనాన్ని తెలుసుకొని మిమ్ము ప్రశంసించడానికి మేమెంతవాళ్లం? నీవు సమస్త చరాచర అచరసమూహానికి మూలకారకుడివి, అద్వితీయుడివి, పురాణపురుషుడివి, సమస్త సృష్టికి కారణమైనవాడివి, ప్రభుడివి, సూర్యుడు మేఘాల సమూహంతో కప్పబడినవాడై అనేక రూపాలు కలిగినవాడయి అనేకరీతులలో కన్పించేటట్లు, నీ అఘటితఘటనాన్ని చేసే అభిప్రాయంలో త్రిగుణాతీతుడవు అయినప్పటికీ సత్త్వం మొదలైన గుణాలతో అనేకరూపాలు కలిగినవాడివై, సత్పురుషులకు చీకటిని తొలగించి, కాంతిని ఇస్తావు. నీ మాయచే మోహం పొందినవాళ్లు, భార్య, పుత్రులు, గృహం, ఆస్తి మొదలైన సంసారరూపంలోని పాపమనే సముద్రంలోని సుడిగుండాలలో మునుగుతూ తేలుతున్నారు. నీ పవిత్రమైన రూపానుభవాన్ని పొందలేక, ఇంద్రియాధీనుడై నీ పాదపద్మాల్ని చేరేందుకు మార్గం తెలియని మూఢుడు, తనను తాను మోసం చేసుకొనేవాడు అవుతాడు. ప్రతికూలబుద్ధితో- ఇష్టుడవైన నిన్ను అంగీకరింపక, ఇంద్రియప్రయోజనానుభవం పొందేందుకు అమృతం వదలి, విషం గ్రహించడమే కదా! ప్రపంచసృష్టికీ, పాలనకూ, లయకూ కారకుడివైన నీవు శాంతస్వభావం కలవాడవై, సజ్జనులకు భాగ్యం ఇచ్చేవాడివై, సమానాధికభావం లేనివాడివై ఉండుటచే నిన్ను నేను, బ్రహ్మయు, మునులును సేవిస్తున్నాము. ఇంకా

**విశే : పంచ+ఉపనిషత్తులు=** నారాయణ, బ్రహ్మ, తైత్తిరీయ, గార్గ, వరాహ - ఉపనిషత్తులు.

**తే. అవ్యయుండ, వనంతుండ, వచ్యుతుండ, వాదిమధ్యాంతశూన్యుండ, వఖిలధృతివి**
**నిఖిలమం దెల్ల వర్తింతు నీవు దగిలి, నిఖిలమెల్లను నీయంద నెగడుఁ గృష్ణ! 442**

**ప్రతి :** కృష్ణా!= ఓ కృష్ణా!; అవ్యయుండవు= నాశం లేనివాడివి; అనంతుండవు= అంతంలేనివాడివి; అచ్యుతుండవు= చ్యుతి లేనివాడివి; ఆదిమధ్య+అంతశూన్యుండవు= మొదలు, నడుమ, చివర లేనివాడివి; అఖిల= సమస్తాన్ని; ధృతివి= ధరించేవాడివి; నిఖిలము+అందున్+ఎల్లన్= సర్వంలోను; నీవు= నీవు; తగిలి= సంబంధం కల్పించుకొని; వర్తింతు(వు)= సంచరిస్తావు; నిఖిలము+ఎల్లన్= సర్వం; నీ+అందున్= నీలో; నెగడున్= వ్యాపించి ఉంటుంది.

**తా :** కృష్ణా! నీవు నాశరహితుడివి, అంతం లేనివాడివి, మొదలు, నడుమ, చివర (ఆదిమధ్యాంతాలు) లేనివాడివి. చ్యుతి లేనివాడివి, సమస్తాన్ని ధరించువాడివి. అంతటా నీవున్నావు అన్నీ నీలో వ్యాపించి ఉన్నాయి.

**విశే :** వాసుదేవుని తత్త్వస్వరూపమిక్కడ చక్కగా చెప్పబడింది.

**సీ. అని సన్నుతించిన హరి యాత్మ మోదించి, మొగమునఁ జిఱునవ్వు మొలకలెత్త**
**లలితబాలేందుకళామౌళి కిట్లను, శంకర! నీమాట సత్య మరయ**
**నేది నీకిష్టమై యెసఁగెడు దానిన, వేఁడుము నీ కిత్తు వీఁ డవధ్యుఁ**
**డిది యెట్టి దనినఁ బ్రహ్లాదుండు మద్భక్తుఁ, డతనికి వరము నీ యన్వయమున**

**తే. జనన మందినవారలఁ జంప ననుచుఁ, గడఁక మన్నించితిని యది కారణమున**
**విశ్వవిశ్వంభరాభారవిపులభూరి, బలభుజాగర్వ మడఁపంగ వలయుఁ గాన. 443**

**ప్రతి :** అని= అని; సన్నుతించినన్= ప్రశంసించగా; హరి= శ్రీకృష్ణుడు; ఆత్మన్= మనస్సులో; మోదించి= సంతోషించి; మొగమునన్= ముఖంలో; చిఱునవ్వు= మందహాసం; మొలకలు+ఎత్తన్= అంకురింపగా; లలిత= సుకుమారమైన; బాల+ఇందుకళామౌళికిన్= బాలచంద్రకళను సిగలో కలవాడైన శివునితో; ఇట్లు+అనున్= ఇలా అన్నాడు; శంకర= శివా!; అరయన్= విచారిస్తే; నీ= నీయొక్క; మాట= పలుకు; సత్యము= నిజం; ఏది; నీకున్+ఇష్టము+ఐ= నీకుప్రియమై; ఎసఁగెడున్= ఒప్పుతుందో; దానిన్= దానినే; వేడుము= కోరుకో; నీకున్= నీకు; ఇత్తున్= ఇస్తాను; వీడు; అవధ్యుడు= చంపతగ్గవాడు కాడు; ఇది= ఈ విషయం; ఎట్టి+అది+అనినన్= ఎటువంటిదంటే; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడు; మత్+భక్తుడు= నాయొక్క భక్తుడు; నీ= నీయొక్క; అన్వయమునన్= వంశంలో; జననము+అందిన= పుట్టిన; వారలన్= వాళ్లను; చంపను+ అనుచున్= చంపనని; అతనికిన్= ప్రహ్లాదునికి; కడఁకన్= ఉత్సాహంతో; వరమున్= వరాన్ని; మన్నించితిని= ఇచ్చి, ఆదరించాను; విశ్వ= సమస్తమైన; విశ్వంభరా= భూమియొక్క; భార= బరువుయొక్క; విపుల= విరివైన; భూరి= అధికమైన; బల= బలంతోకూడిన; భుజాగర్వము= బాహువులగర్వాన్ని; అడపంగన్+వలయున్= అణచాలి; కానన్= కాబట్టి...

**తా :** అని శివుడు ప్రశంసిస్తే – కృష్ణుడు బాగా సంతోషించి చిరునవ్వుతో శంకరా! నీ మాట సత్యమే! నీకు ప్రియమైన వరం కోరుకో. దాన్నే ఇస్తాను. ఈ బాణుడు చంపదగ్గవాడు కాడు. ఎందుకంటే నాభక్తుడయిన ప్రహ్లాదునిమనుమడు. ప్రహ్లాదునివంశంలోని వారిని చంపనని వరమిచ్చాను. వీనిగర్వం అణచడానికి ప్రయత్నించాను – కనుక

**క. కరములు నాలుగు సిక్కం, బరిమార్చితి, వీఁడు నీదు భక్తుల కగ్రే**
**సరుఁడై పొగడొంది జరా, మరణాదిభయంబు దక్కి మను నిట మీఁదన్. 444**

**ప్రతి :** కరములు= చేతులు; నాలుగు= నాలుగు; చిక్కన్= మిగిలేటట్లుగా; పరిమార్చితిన్= ఖండించాను; వీఁడు= ఈ బాణుడు; నీదు= నీయొక్క; భక్తులకున్= భక్తులలో; అగ్రేసరుఁడు+ఐ= మొదటివాడై; పొగడు+ఒంది= ప్రశంసలందుకొని; జరా= ముసలితనం; మరణ+ఆది= చావు మున్నగువానివలన; భయంబున్= భీతిని; తక్కి= వదలి; ఇటమీఁదన్= ఇకపై; మనున్= జీవిస్తాడు.

**తా :** బాణునిచేతులు నాలుగింటిని తప్ప మిగిలినవాటిల్ని ఖండించాను. నీ భక్తులలో మొదటివాడని పేరుపొంది ముసలితనం, మరణం లేకుండా జీవిస్తాడు.

**వ. అని యాన తిచ్చిన నంబికావరుండు సంతుష్టాంతరంగుం డయ్యె, నబ్బలినందనుం డట్లు రణరంగ వేదిం గృష్ణదేవతాసన్నిధిం బ్రజ్వలితచక్రకృశానుశిఖాజాలంబులందు నిజబాహాసహస్ర శాఖాసమి త్ప్రచయంబును, దత్క్షతోద్వేలకీలాలమహితాజ్యధారాశతంబును, బరభయంకరవీరహుంకార మంత్రంబుల తోడ వేల్చి, పరిశుద్ధిం బొంది, విజ్ఞానదీపాంకురంబున భుజాఖర్వగర్వాంధకారంబు నివారించినవాఁడై యనవరతపూజితస్థాణుండగు నబ్బాణుండు భుజవనవిచ్ఛేదజనితవిరూపితస్థాణుం డయ్యును దదీయవర దానకలితానందహృదయారవిందుం డగుచు గోవిందచరణారవిందంబులకుఁ బ్రణామంబు లాచరించి యనంతరంబ. 445**

**ప్రతి :** అని= అని; ఆనతి+ఇచ్చినన్= సెలవీయగా; అంబికావరుండు= శివుడు; సంతుష్ట+అంతరంగుడు+అయ్యెన్= సంతృప్తి చెందిన మనస్సు కలవాడయ్యాడు; ఆ+బలినందనుండు= బాణుడు; అట్లు= ఆ విధంగా; రణరంగవేదిన్= యుద్ధరంగమనేవేదికపైన; కృష్ణదేవతా= కృష్ణుడనే దేవుని; సన్నిధిన్= సమీపంలో; ప్రజ్వలిత= మండుచున్న; చక్ర= సుదర్శనచక్రమనెడి; కృశాను= అగ్నియొక్క; శిఖా= జ్వాలలయొక్క; జాలంబుల+అందున్= సమూహాలలో; నిజ= తనయొక్క; బాహుసహస్ర= వేయిచేతులనెడి; శాఖా= కొమ్మలవంటి; సమిత్= సమిధల; ప్రచయంబును= రాశిని; తత్= ఆ భుజాలయొక్క; క్షత= దెబ్బలవల్ల; ఉత్+వేల= మితిమీరి కారుతున్న; కీలాల= రక్తమనే; మహిత= అధికమైన; ఆజ్యధారాశతంబును= (పైనుండి పడు) నూరునేతిధారల్ని; పర= శత్రువులకు; భయంకర= భయం కలిగించే; వీరహుంకార= వీరులు హుమ్మనే ధ్వనులనెడి; మంత్రములతోడన్= మంత్రాలతో; వేల్చి= హోమంచేసి; పరిశుద్ధిన్= మిక్కిలిశుద్ధిని; పొంది= పొంది; విజ్ఞానదీప+అంకురంబునన్= విజ్ఞానమనే దీపంతో; భుజా= బాహువుల; అఖర్వ= అధికమైన; గర్వ+అంధకారంబున్= గర్వం అనే చీకటిని; నివారించినవాఁడు+ఐ= పోగొట్టినవాడై; అనవరత= ఎల్లపుడు; పూజిత= పూజింపబడుతున్న; స్థాణుండు+అగు= శివుడుకలవాడైన; ఆ+బాణుడు= ఆ బాణుండు; భుజవన= బాహువులనేవనాన్ని; విచ్ఛేద= ఖండించుటవల్ల; జనిత= కలిగిన; విరూపిత= వికృతరూపంగలవాడుగ చేయబడ్డ; స్థాణుండు+అయ్యును= చెట్టు మొదలు (మొద్దు) వంటివాడయ్యును; వరదానకలిత= వరంవల్ల కల్గిన; ఆనంద= సంతోషంతో; హృదయ+అరవిందుండు+అగుచున్= హృదయపద్మం కలిగినవాడవుతూ; గోవింద= కృష్ణునియొక్క; చరణ+అరవిందములకున్= పాదపద్మాలకు; ప్రణామంబులు+ ఆచరించి= నమస్కారాలుచేసి; అనంతరంబు+అ= తరువాత...

**తా :** ఈ విధంగా కృష్ణుడు అనుగ్రహించాడు. పరమేశ్వరుండు పరమానందం పొందాడు. బాణుడు రణరంగమనే యజ్ఞవేదికపై కృష్ణుడనే దేవుని సన్నిధిలో భగభగమండుతున్న చక్రాయుధమనే మంటల్లో తన హస్తాలనే సమిధల్ని, రక్తధారలనే నేతిధారలతో, హుంకారాలనే మంత్రాలతో వేల్చి పరిశుద్ధుడయ్యాడు. విజ్ఞానదీపం వెలిగింది. భుజగర్వం అనే చీకటి తొలగింది. ఎల్లప్పుడు పరమేశ్వరధ్యానంలో ఉన్న బాణుడు కృష్ణు డిచ్చిన వరంతో ఆనందించి, గోవిందుని పాదారవిందాలకు వందనం చేశాడు. తరువాత

## ✤ ఉషానిరుద్ధ సహితుండై కృష్ణుండు ద్వారకాపురి కరుగుట ✤

**క. పురమున కేగి యుషాసుం, దరికిని ననిరుద్ధునకు ముదంబున భూషాం**
**బరదాసదాసికాజన, వరవస్తువితాన మొసఁగి వారని భక్తిన్. 446**

**ప్రతి :** (బాణుడు) పురమునకున్+ఏగి= నగరానికివెళ్ళి; ఉషాసుందరికిని అనిరుద్ధునకున్= ఉషా అనిరుద్ధులకు; ముదంబునన్= సంతోషంతో; భూషా= నగల్ని; అంబర= వస్త్రాల్ని; దాసదాసికాజన= సేవకజనుల్ని; వర= శ్రేష్ఠమైన; వస్తువితానమున్+ ఒసంగి= వస్తువుల సమూహాన్ని ఇచ్చి; వారని భక్తిన్= అడ్డులేని భక్తితో...

**తా :** బాణుడు తన రాజధానీ నగరానికి వెళ్ళి, ఉషానిరుద్ధులకు వివాహం చేశాడు. నగల్నీ, వస్త్రాల్నీ, సేవకజనాన్నీ, శ్రేష్ఠమైన వస్తువుల సమూహాన్ని అడ్డులేని ఆసక్తితో ఇచ్చి నిండుభక్తితో

**క. కనకరథంబున నిడుకొని, ఘనవైభవ మొప్పఁ గన్యకాయుక్తముగా**
**ననిరుద్ధుని గోవిందుం, డనుమోదింపంగఁ దెచ్చి యర్పించె నృపా! 447**

**ప్రతి :**నృపా= ఓ రాజా!; కనకరథంబునన్= బంగారురథంలో; ఇడుకొని= ఉంచి; ఘనవైభవము+ఒప్పన్= మిక్కిలి వైభవం శోభిల్లగా; కన్యకాయుక్తము+కాన్= తన కుమార్తె ఉషతోకూడా; అనిరుద్ధునిన్= అనిరుద్ధ కుమారుణ్ణి; గోవిందుఁడు+అనుమోదింపన్+కన్= కృష్ణుడు అంగీకారం తెలుపగా; తెచ్చి= తీసుకొనివచ్చి; అర్పించెన్= ఇచ్చాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! ఉషా – అనిరుద్ధుల్ని బంగారు తేరుపై ఎక్కించుకొని వచ్చాడు. శ్రీకృష్ణుని ఆమోదం పొంది తన కుమార్తెతోపాటు అనిరుద్ధుణ్ణి గోవిందునికి అప్పగించాడు. శ్రీకృష్ణుడు సంతోషించాడు.

**ఉ. అంత మురాంతకుండు త్రిపురాంతకు వీడ్కొని బాణు నిల్పి య**
**త్యంతవిభూతిమై నిజబలావలితోఁ జనుదేర నా యుషా**
**కాంతుఁడు మున్నుగాఁ బటహకాహళతూర్యనినాదపూరితా**
**శాంతరుఁడై వెసం జనియె నాత్మపురీముఖుఁడై ముదంబునన్. 448**

**ప్రతి :** అంతన్= తరువాత; ముర+అంతకుఁడు= కృష్ణుడు; త్రిపుర+అంతకున్= శివుణ్ణి; వీడ్కొని= పోయిరమ్మని సెలవిచ్చిపంపి; బాణున్= బాణుణ్ణి; నిల్పి= ఇక్కడే ఉండమని చెప్పి; అతి+అంత= మిక్కిలి; విభూతిమైన్= ఐశ్వర్యంతో; నిజబల+ఆవలి= తన సైన్య సమూహంతో; చనుదేరన్= బయలుదేరగా; ఆ; ఉషాకాంతుడు= అనిరుద్ధుడు; మున్ను+కాన్= ముందుండగా; పటహ= తప్పెటలు; కాహళ= బాకాలు; తూర్య= వాద్యాలయొక్క; నినాద= ధ్వనులచే; పూరిత= నిండిన; ఆశా+ అంతరుఁడు+ఐ= దిక్కుల మధ్యప్రదేశం కలవాడై; ఆత్మపురీముఖఁడు+ఐ= తన ద్వారకానగరం వైపునకు బయలుదేరి; ముదంబునన్= ఆనందంతో; వెసన్= శీఘ్రంగా; చనియెన్= వెళ్లాడు.

**తా :** తర్వాత – కృష్ణడు శివుణ్ణి వీడ్కొల్పి, బాణాసురుణ్ణి అచ్చటనే నిల్పి, మిక్కిలి వైభవంతో చతురంగ బలసమేతుడై – అనిరుద్ధుణ్ణి ముందుంచుకొని, మంగళవాద్యాల ధ్వనులు దిగంతాలకు వ్యాపిస్తుండగా తన ద్వారకానగరానికి బయలుదేరాడు.

**మ. కనియెన్ గోపకుమారశేఖరుఁడు రంగత్ఫుల్లరాజీవ కో**
**క నదోత్తుంగతరంగసంగతలసత్కాసారకన్ భూరి శో**
**భన నిత్యోన్నతసౌఖ్యభారక నుదంచద్వైభవోదారకన్**
**జనసంతాపనివారకన్ సుజనభాస్వత్తారకన్ ద్వారకన్. 449**

**ప్రతి :** గోపకుమారశేఖరుఁడు= యాదవకుమారులలో అగ్రగణ్యుడు (శ్రీకృష్ణుడు); రంగత్+ఫుల్లరాజీవ= బాగా చలిస్తున్న– వికసించిన తామరలతో; కోకనద= ఎర్రకలువలతో; ఉత్తుంగ= మిక్కిలి ఎత్తయిన; తరంగ= అలలతో; సంగత= కూడిన; లసత్+కాసారకన్= ఒప్పునట్టి కొలకులు కలదాన్నీ; భూరి= అధికమైన; శోభన= శుభకార్యాలతో; నిత్య+ఉన్నత= ఎల్లప్పుడూ గొప్పదైన; సౌఖ్యభారకన్= సుఖమనే భారాన్ని మోసేదాన్నీ; ఉదంచత్+వైభవ+ఉదారకన్= అధికమైన ఐశ్వర్యంతో వెలిగేదాన్నీ; జన= ప్రజలయొక్క; సంతాప= దుఃఖాన్ని; నివారకన్= నివారించేదాన్నీ; సుజన= సజ్జనులచే; భాస్వత్= ప్రకాశిస్తున్న; తారకన్= నక్షత్రాలు కలదాన్ని; ద్వారకన్= ద్వారకానగరాన్ని; కనియెన్= చూశాడు.

**తా :** బాగా వికసించిన ఎర్రతామరలతో, ఎత్తయిన అలలతో కూడిన సరస్సులతో, అధిక ఐశ్వర్యంతో వృద్ధి చెందుతున్నదీ, సుఖమనే భారాన్ని మోస్తున్నదీ, ప్రజల దుఃఖాన్ని నివారిస్తున్నదీ, సజ్జనులనే నక్షత్రాలతో ప్రకాశిస్తున్నది అయిన ద్వారకానగరాన్ని శ్రీకృష్ణుడు చూశాడు.

**వ. కని డాయం జనఁ బురలక్ష్మి కృష్ణసందర్శనకుతూహలయై చేసన్నలం జీరుచందంబున నందంబు నొందు నుద్ధూతతరళ విచిత్ర కేతుపతాకాభిశోభితంబును, మహనీయ మరకత తోరణ మండితంబును, గనకమణి వినిర్మితగోపురసౌధప్రాసాదవీథికావిలసితంబును, మౌక్తికవితానవిరచితమంగళరంగవల్లీవిరాజితంబును, శోభనాకలితవిన్యస్తకదళికాస్తంభసురభికుసుమమాలికాక్షతాలంకృతంబును, గుంకుమసలిలసిక్త విపణిమార్గంబును, శంఖదుందుభిభేరీమృదంగపటహకాహళమృదంగాదిమంగళారావకలితంబును, వందిమాగధసంగీత ప్రసంగంబునునై యతిమనోహరవిభవాభిరామంబైన య ప్పురవరంబు సచివపురోహితసుహృద్బాంధవ ముఖ్యు లెదురుకొన భూసురాశీర్వాదంబులను బుణ్యాంగనాకరకలిత లలితాక్షతలను గైకొనుచుం గామినీమణులు గర్పూరనీరాజనంబులు నివాళింప నిజమందిరంబుం బ్రవేశించి యప్పుండరీకాక్షుండు పరమానందంబున సుఖం బుండె, నంత. 450**

**ప్రతి :** కని= చూచి; డాయన్+చనన్= సమీపానికి వెళ్ళగా; పురలక్ష్మి= ద్వారకానగర మనే లక్ష్మి; కృష్ణ= కృష్ణుణ్ణి; సందర్శన= చూచుటయందలి; కుతూహల+ఐ= ఉత్సుకత కలదై; చేసన్నలన్= చేతిసంజ్ఞలతో; చీరు= పిలచే; చందంబునన్= విధంగా; అందంబున్+ఒందు= అందాన్ని పొంది ఉన్న; ఉత్+ధూత= ఎగురుతున్న; తరళ= ప్రకాశించే; విచిత్ర= ఆశ్చర్యకరమైన; కేతు= ధ్వజాలతోనూ; పతాక+అభిశోభితంబును= పతాకాలతోనూ శోభిస్తున్న; మహనీయ= గొప్పవైన; మరకత= పచ్చల; తోరణ= దండలతోనూ; మండితంబును= అలంకరింపబడ్డదీ; కనక= బంగారంతో; మణి= మణులతో; వినిర్మిత= నిర్మింపబడ్డ; గోపుర= గోపురాలచే; సౌధ= రాజగృహాలచే; ప్రాసాద= మేడలచే; వీథికా= వీథులతో; విలసితంబును= ఒప్పుతున్నదీ; మౌక్తిక= ముత్యాల; వితాన= మేలుకట్టుతో; విరచిత= కూర్చబడ్డ; మంగళ= శుభప్రదమైన; రంగవల్లీ= ముగ్గులచే; విరాజితంబును= ప్రకాశించేది; శోభన+ఆకలిత= శుభప్రదంగా; విన్యస్త= ఉంచబడ్డ; కదళికాస్తంభ= అరటిబోదెలచే; సురభి= వాసనగల; కుసుమమాలికా= పూలమాలలచే; అక్షత+అలంకృతంబును= అక్షతలచేత అలంకరింపబడిందీ; కుంకుమ= కుంకుమ కలిసిన; సలిల= నీటిచేత; సిక్త= తడిసిన; విపణిమార్గము= వ్యాపారస్థలం; శంఖ= శంఖాలచే; దుందుభి= దుందుభివాద్యాలచే; భేరీ= భేరీవాద్యాలచే; పటహ= తప్పెట; కాహళ= బాకా; మృదంగ+ఆది= మృదంగం మొదలయిన వాద్యాలచే; మంగళ+ఆరావకలితంబును= శుభప్రదమైన ధ్వనులచేత కూడింది; వంది= స్తోత్ర పాఠకులయొక్క; మాగధ= వంశమర్యాదలను పొగడి ఉపజీవించేవారియొక్క; సంగీత ప్రసంగంబునున్+ఐ= సంగీత ప్రస్తావన కలదై; అతిమనోహర= మిక్కిలి ఆహ్లాదకరమైన; విభవ+అభిరామంబు+ఐన= వైభవంచే ప్రకాశించే; ఆ+పురవరంబు= ఆ ద్వారకనగరంలోని; సచివ= మంత్రులు; పురోహితులు; సుహృత్+బాంధవ= స్నేహితులు, బంధువులు; ముఖ్యులు= నగరంలో ప్రముఖులు; ఎదురుకొనన్= ఎదురురాగా; భూసుర+ఆశీస్+వాదములు= బ్రాహ్మణుల ఆశీస్సులు; పుణ్య+అంగనా= ముత్తయిదువుల; కరకలిత= చేతుల్లో ఉన్న; లలిత+అక్షతలన్= మనోజ్ఞమైన అక్షతలను; కైకొనుచున్= స్వీకరిస్తూ; కామినీమణులు= స్త్రీలు; కర్పూరనీరాజనంబులు= కర్పూర నీరాజనాలు; నివాళింపన్= హారతులెత్తగా; నిజ= తమ; మందిరంబున్= భవనాన్ని; ప్రవేశించి= చేరి; ఆ+పుండరీక+అక్షుండు= ఆ కృష్ణుడు; పరమ+ఆనందంబునన్= మిక్కిలి సంతోషంతో; సుఖంబు+ఉండెన్= సుఖంగా ఉన్నాడు; అంతన్= తరువాత...

**తా :** ద్వారకానగరంలోని పతాకలు కదులుతూ శ్రీకృష్ణుని సందర్శించు కుతూహలంతో ఆ నగరలక్ష్మి చేతుల్తో ఆహ్వానిస్తున్నట్లు ఉన్నాయి. గొప్ప పచ్చలచే అలంకరింపబడ్డ తోరణాలతోనూ, మణులు పొదిగిన భవనాలతోనూ, బంగారం, మణులచే

నిర్మింపబడిన గోపురాలూ, భవనాలూ, సౌధాలూ, వీథులున్నాయి. బంగారు తాపడం చేసిన మేలుకట్టుతో కూర్చిన శుభప్రదమైన ముగ్గులతో ప్రకాశించేదీ; సౌందర్యంకోసం కట్టబడిన అరటిబోదెలచే, అక్షతలచే పుష్పమాలలచే అలంకరింపబడిందీ, కుంకుమ కలిపిన నీటితో తడిసిన వ్యాపారస్థలం కలదీ, శంఖం, దుందుభి, భేరీ, పటహం, కాహళం, మృదంగం మొదలైన వాద్యాలచేతా, స్తోత్రాలతో, వందిమాగధ సంగీత ప్రసంగాలతో మిక్కిలి మనోహరమైన ద్వారకానగరం, అందలి మంత్రులు, పురోహితులు, బంధువులు, నగరప్రముఖులు ఎదురురాగా, బ్రాహ్మణాశీర్వచనాలతో, ముత్తయిదువుల ఆశీస్సుల అక్షతలు స్వీకరిస్తూ, కర్పూరనీరాజనాలివ్వగా నగరప్రవేశం చేసి, సుఖంగా కాలం గడిపారు. ఆ తర్వాత

**క. శ్రీకృష్ణునివిజయం బగు, నీ కథఁ బఠియించువార లెప్పుడు జయముం**
**గైకొని యిహపరసౌఖ్యము, లాకల్పోన్నతి వహింతు రవనీనాథా! 451**

**ప్రతి :** అవనీనాథా!= పరీక్షిన్మహారాజా!; శ్రీకృష్ణుని= శ్రీకృష్ణునియొక్క; విజయంబు+అగు= విజయం అనే పేరుగల; ఈ కథన్= ఈ కథను; పఠియించువారలు= చదివేవాళ్లు; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; జయమున్= గెలుపును; కైకొని= పొంది; ఆకల్ప= బ్రహ్మకల్పపర్యంతం; ఇహ= ఈ లోకానికి చెందిన; పర= పరలోకానికి చెందిన; సౌఖ్యములన్= సుఖాల్ని; ఉన్నతిన్= అభివృద్ధిని; వహింతురు= పొందుతారు.

**తా :** పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుని విజయం అనే ఈ గాథను చదివినవారు ఎల్లపుడు విజయాన్ని పొంది, ఇహపరలోక సౌఖ్యాల్ని ఆకల్పోన్నతినీ పొందుతారు.

**క. అని చెప్పిన శుకయోగికి, జననాయకుఁ డనియెఁ గృష్ణచరితము విన నా**
**మన మెపుడుఁ దనియ దింకను, వినవలతుం గరుణఁ జెప్పవే మునినాథా! 452**

**ప్రతి :** అని= అని; చెప్పినన్= చెప్పగా; శుకయోగికిన్= వ్యాసునికుమారుడగు శుకయోగితో; జననాయకుఁడు= రాజగు పరీక్షిత్తు; అనియెన్= అన్నాడు; మునినాథా!= మునిశ్రేష్ఠా!; కృష్ణచరితము= కృష్ణచరిత్ర; వినన్= వినగా; నా= నాయొక్క; మనము+ఎప్పుడున్= మనస్సు ఎప్పుడూ; తనియదు= తృప్తిచెందదు; ఇంకను= ఇంతకంటె అధికంగా; వినన్= వినడం; వలతున్= కోరుకుంటాను; కరుణన్= దయతో; చెప్పవు+ఏ= చెప్పుము.

**తా :** మునిశ్రేష్ఠా! శ్రీకృష్ణుని చరిత్రను వినడంలో నామనస్సు ఎప్పుడూ తృప్తి చెందదు. శ్రీకృష్ణకథను వినడమే కోరుకొంటాను. దయచేసి శ్రీకృష్ణకథను చెప్పు అనే శుకయోగిని పరీక్షిన్మహారాజు కోరాడు.

**వ. అనినఁ బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 453**

**ప్రతి :** అనినన్= అనగా; పరీక్షిత్+నర+ఇంద్రునకున్= రాజైన పరీక్షిత్తుతో; శుకయోగి+ఇంద్రుఁడు= యోగిశ్రేష్ఠుడైన శుకుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** శ్రీకృష్ణ కథను చెప్పవలసిందిగా కోరిన పరీక్షిన్మహారాజుతో శుకయోగీంద్రుడు ఇలా చెప్పాడు.

## ❖ నృగమహారాజు చరిత్రము ❖

**సీ. ధరణీశ! యొకనాఁడు హరితనూజులు, రతీశ్వరసాంబసారణచారుభాను**
**లాదిగా యదుకుమారావలి యుద్యాన, వనమున కతివైభవమున నేగి**

**వల నొప్ప నిచ్ఛానువర్తులై సుఖలీలఁ, జరియించి ఘనపిపాసలను జెంది**
**నెఱి దప్పి సలిల మన్వేషించుచును, వేగ వచ్చుచో నొకచోట వారిరహిత**

**తే. కూపమును నందులో నొక కొండవోలె, విపుల మగుమేని యూసరవెల్లిఁ గాంచి**
**చిత్తముల విస్మయం బంది తత్తఱమున, దాని వెడలించు వేడుక దగులుటయును. 454**

**ప్రతి :** ధరణీశ= పరీక్షిన్మహారాజా!; ఒకనాడు= ఒకరోజు; హరి= కృష్ణునియొక్క; తనూజులు= కుమారులు; రతి+ఈశ్వర= ప్రద్యుమ్నుడు; సాంబ= సాంబుడు; సారణ= సారణుడు; చారుభానుడు= చారుభానుడు; ఆదిగా= మొదలగు; యదుకుమార+ ఆవలి= యదుకుమారుల సమూహం; ఉద్యానవనమునకున్+అతివైభవమునన్+ఏగి= ఉద్యానవనానికి మిక్కిలి వైభవంతో వెళ్ళి; వలను ఒప్పన్= ఒప్పిదంగా; ఇచ్ఛా+అనువర్తులు+ఐ= ఇష్టం వచ్చినట్లు నడచి; సుఖలీలన్= సుఖమైన విధంగా; చరియించి= సంచరించి; ఘన= ఎక్కువైన; పిపాసలనున్+చెంది= దాహం కలిగినవారై; నెఱిదప్పి= వివశులై; సలిలము+ అన్వేషించుచున్= నీటిని వెదకుతూ; వేగ= తొందరగా; వచ్చుచోన్= వస్తుండగా; ఒకచోటన్= ఒకచోట; వారిరహిత= నీరులేని; కూపమునున్= బావినీ; అందులోన్= దానిలో; ఒకకొండ+పోలెన్= ఒకకొండవలె ఉన్న; విపులము+అగు= అధికమగు; మేని= శరీరం కల; ఊసరవెల్లిన్= యధాప్రదేశంగా రంగులను మార్చగల తొండను; కాంచి= చూచి; చిత్తములన్= మనస్సులలో; విస్మయంబు+అంది= ఆశ్చర్యం పొంది; తత్తఱమునన్= సంభ్రమంతో; దానిన్= ఆ తొండను; వెడలించు= వెలికితీసే; వేడుక= కుతూహలం; తగులుటయును= కలుగగా...

**తా :** శ్రీకృష్ణుని కుమారులగు ప్రద్యుమ్నుడు, సాంబుడు, సారణుడు, చారుభానుడు మొదలగు యాదవకుమారులు ఉద్యానవనానికి వచ్చారు. అక్కడ వారు యథేచ్ఛగా సంచరించారు. దాహం వేయడంతో నీటికోసం వెదికారు. వారికి నీళ్ళులేని బావి కన్పించింది. అందులో కొండవలె ఉన్న ఒక తొండను చూచి, దాన్ని బయటకు తీయడానికి ప్రయత్నించారు.

**చ. పరువిడి పోయి తెచ్చి ఘనపాశచయంబుల నంటఁ గట్టి య**
**గ్గురుభుజు లందఱుం గదిసి కోయని యార్చుచు దాని నెమ్మెయిం**
**దరలఁగఁ దీయలేక దగ దట్టముగా మది దుట్టగిల్ల నొం**
**డొరు గడవంగ వే చని పయోరుహనాభున కంతఁ జెప్పినన్. 455**

**ప్రతి :** పరువు+ఇడి= పరుగెత్తి; పోయి= వెళ్ళి; ఘన= పెద్ద; పాశ= తాళ్ల; చయంబులన్= సమూహంతో; అంటన్+కట్టి= అంటేటట్లు కట్టి; ఆ+గురుభుజులు= ఆ పొడవైన బాహువులుకలవారు; అందఱున్= అందరూ; కదిసి= చేరి; కోయని= కో అని; ఆర్చుచున్= అరుస్తూ; దానినిన్= ఆ తొండను; ఏ+మెయిన్= ఏ విధంగానైనా; తరలన్+కన్= బయటకు వచ్చేటట్లుగా; తీయలేక; తగన్= తగునట్లు; దట్టము+కాన్= గాఢంగా; మది= మనస్సు; తుట్టగిలన్= బాధపడగా; ఒండు+ఒరున్= ఒకరినొకరు; కడవన్+కన్= దాటుకొంటూ; వే= వేగంగా; చని= వెళ్ళి; అంతన్= అంతా; పయోరుహనాభునకున్= కృష్ణునికి; చెప్పినన్= చెప్పగా...

**తా :** వారు పరుగున వెళ్ళి, పెద్దతాళ్ళను తెచ్చి బిగించికట్టారు. ఆ తొండను బయటకుతీసే ప్రయత్నం చేశారు. తీయలేక, ఆ విషయం శ్రీకృష్ణునికి చెప్పగా

**ఉ. విని నరసీరుహాక్షుఁ డతివిస్మితుఁడై జలశూన్యకూప మ**
**ల్లన కదియంగ నేఁగి కృకలాసము నొక్కతృణంబుఁ బోలె గొ**
**బ్బున వెడలించె వామకరపద్మమున న్నది యంతలోనఁ గాం**
**చనరుచి మేనఁ గల్గు పురుషత్వముతోఁ బొడసూపి నిల్చినన్. 456**

**ప్రతి :** విని; సరసీరుహ+అక్షుఁడు= కృష్ణుడు; అతివిస్మితుఁడు+ఐ= మిక్కిలి ఆశ్చర్యం గలవాడై; జలశూన్య= నీరులేని; కూపమున్= నూతిని; అల్లనన్= మెల్లగా; కదియన్+కన్+ఏగి= సమీపించి; కృకలాసమున్= తొండను; ఒక్క= ఒక; తృణంబున్ పోలెన్= గడ్డిపరకవలె; గొబ్బునన్= శీఘ్రంగా; వామకరపద్మమునన్= పద్మంలాంటి ఎడమచేతితో; వెడలించెన్= బయటకు తీశాడు; అది; అంతలోనన్= ఆలోపల; కాంచనరుచి= బంగారపురంగు; మేనన్= శరీరంలో; కల్గు= కలిగిన; పురుషత్వముతోన్= పురుషరూపంతో; పొడచూపి= కన్పించి; నిల్చినన్= నిలువగా...

**తా :** యదుకుమారులు చెప్పిన మాటలువిని కృష్ణుడాశ్చర్యంతో నీరులేని నూతిలోనికి చూచి, అందున్న తొండను ఎడమచేతితో పైకి తీయగా అది బంగారువర్ణంతో కూడిన శరీరంతో పురుషుడై నిలవగా

**వ. చూచి కృష్ణుం డతని వృత్తాంతం బంతయు నెఱింగియు నక్కడిజనంబులుం గుమారవర్గంబును దెలియుకొఱకు నతని చేతఁ దద్వృత్తాంతం బంతయు నెఱింగించువాఁడై యిట్లనియె. 457**

**ప్రతి :** చూచి; కృష్ణుండు= కృష్ణుడు; అతని= అతనియొక్క; వృత్తాంతంబు+అంతయున్= సంగతి అంతా; ఎఱింగియున్= తెలిసీ; అక్కడి= అక్కడే ఉన్న; జనంబులున్= ప్రజలూ; కుమారవర్గంబున్= కొడుకులూ; తెలియుకొఱకున్= తెలుసుకునేందుకు; అతనిచేతన్= ఆ పురుషుని చేతనే; తద్+వృత్తాంతంబు+అంతయున్= వాని విషయాన్నంతటిని; ఎఱిగించువాఁడు+ఐ= తెలియజేసేవాడై; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** కృష్ణునికి జరిగిన విషయమంతా తెలిసినా, అక్కడున్న ప్రజలకు, తన సంతానానికి ఆ విషయం తెలిసేందుకు ఆ పురుషునిచేతనే చెప్పించాలని ఆతనితో ఇలా అన్నాడు.

**చ. కనదురురత్నభూషణనికాయుఁడవై మహనీయమూర్తివై**
**యనుపమకీర్తిశోభితుఁడవై విలసిల్లుచు ధాత్రిమీఁదఁ బెం**
**పొనరిన నీకు నేమి గతి నూసరవెల్లితనంబు చొప్పడెన్**
**విన నిది చోద్యమయ్యె సువివేకచరిత్ర! యెఱుంగఁ జెప్పుమా!' 458**

**ప్రతి :** సువివేకచరిత్ర!= మంచి తెలివితేటలు కలవాడా!; కనత్= ప్రకాశించే; ఉరు= శ్రేష్ఠమైన; రత్నభూషణ= రత్నాలతోకూడిన నగలయొక్క; నికాయుఁడవు+ఐ= సముదాయం కలవాడివై; మహనీయమూర్తివి+ఐ= గొప్పరూపం కలిగినవాడివై; అనుపమ= సాటిలేని; కీర్తి= ఖ్యాతిచే; శోభితుఁడవు+ఐ= ప్రకాశించేవాడివై; ధాత్రిమీఁదన్= భూమిపై; విలసిల్లుచున్= ప్రకాశిస్తూ; పెంపు+ఒనరిన= అభివృద్ధి చెందిన; నీకున్= నీకు; ఏమిగతిన్= ఏ విధంగా; ఊసరవెల్లితనంబు= తొండరూపం; చొప్పడెన్= వచ్చింది; ఇది= ఈ విషయం; వినన్= వినడానికి; చోద్యము+అయ్యెన్= ఆశ్చర్యమైంది.

**తా :** సువివేకచరిత్రా! రత్నభూషణాలచే ప్రకాశిస్తూ, సాటిలేనికీర్తితో ప్రకాశించే మంచి రూపంగల నీకు ఊసరవెల్లిరూపం ఏవిధంగా కలిగిందో చెప్పు. వినడానికి ఈ వింత సంగతిని వివరించు.

**క. అని యడిగిన మురరిపు పద, వనజంబులఁ దన కిరీటవరమణు లొరయన్**
**వినయమున మ్రొక్కి యిట్లను, ఘనమోదముతోడ నిటలఘటితాంజలియై. 459**

**ప్రతి :** అనియడిగినన్= అని అడగ్గా; మురరిపు= శ్రీకృష్ణుని; పదవనజంబులన్= పాదపద్మాలకు; తన= తనయొక్క; కిరీట= కిరీటంలోని; వర= శ్రేష్ఠమైన; మణులు= మణులు; ఒరయన్= తగిలేటట్లు; వినయమునన్= వినయంతో; మ్రొక్కి= నమస్కరించి; ఘన= గొప్ప; మోదముతోడ= సంతోషంతో; నిటల= నుదుట; ఘటిత= చేర్చిన; అంజలి+ఐ= చేమోడ్పు కలవాడై (నమస్కరిస్తూ); ఇట్లు+అనున్= ఇలా అంటున్నాడు.

**తా :** ఇలా అడగ్గా శ్రీకృష్ణుని పాదపద్మాలకు తన కిరీటంలోని మణులు తగిలేటట్లుగా నుదుటిపై రెండుచేతులు ఆన్చి, సంతోషంగా వినయంతో నమస్కరించి, ఇలా అంటున్నాడు.

**తే. విశ్వసంవేద్య! మహిత! యీ విశ్వమందుఁ, బ్రకటముగ నీ వెఱుంగని దొకటి గలదె**
**యైన నాచేత విన నిష్ట మయ్యెనేని, నవధరింపుము వినిపింతు నంబుజాక్ష! 460**

**ప్రతి :** అంబుజ+అక్ష= కృష్ణా; విశ్వసంవేద్య= అంతా తెలిసినవాడా!; మహిత= కొనియాడబడేవాడా!; ఈ; విశ్వము+అందున్= ప్రపంచంలో; ప్రకటము+కన్= స్పష్టంగా; నీవు; ఎఱుంగనిది= తెలియనిది; ఒకటి= ఒక్కటైనా; కలదు+ఎ= ఉందా?; ఐనన్= అయినప్పటికి; నాచేతన్= నానుండి; వినన్= వినడం; ఇష్టము= ప్రీతి; అయ్యెన్+ఏనిన్; అయితే; అవధరింపుము= చిత్తగించండి; వినిపింతున్= చెబుతాను.

**తా :** ఓ కృష్ణా! నీవు విశ్వవేద్యుడిస్తే ప్రపంచంలో స్పష్టంగా నీకు తెలియంది ఏది అయిన ఉందా? అయినప్పటికీ నానుండే వినడం మీకు ప్రీతిని కలిగిస్తే శ్రద్ధతో వినుము. నా కథ చెబుతాను అన్నాడు.

**శా. ఏ నిక్ష్వాకుతనూజుఁడన్ నృగుఁడు నా నేపారు భూపాలుఁడన్**
**దీనవ్రాతము నర్థిఁ బ్రోచుచు ధరిత్రీనాయకుల్ గొల్చి స**
**మ్మానింపం జతురంతభూభరణసామర్థ్యుండనై సంతత**
**శ్రీ నిండారినవాఁడ నుల్లసితకీర్తిస్ఫూర్తి శోభిల్లఁగన్. 461**

**ప్రతి :** ఏన్= నేను; ఇక్ష్వాకు తనూజుఁడన్= ఇక్ష్వాకునియొక్క కుమారుణ్ణి; నృగుఁడు నాన్= నృగుడు అనే; ఏపారు= ఒప్పు; భూపాలుఁడన్= రాజును; దీనవ్రాతమున్= బీదల్ని; అర్థిన్= ప్రీతితో; ప్రోచుచున్= రక్షిస్తూ; ధరిత్రీనాయకుల్= రాజులు; కొల్చి= సేవించి; సమ్మానింపన్= గౌరవిస్తుంటే; చతురంతభూభరణ= నాలుగంచులుగల భూమిని మోపే; సామర్థ్యుండను+ఐ= సమర్థతగలవాడనై; ఉల్లసిత= ప్రకాశించే; కీర్తి= యశస్సుయొక్క; స్ఫూర్తి= స్ఫురణ; శోభిల్లన్+కాన్= ఒప్పుతుండగా; సంతత= ఎల్లపుడు; శ్రీ= సిరి; నిండారినవాఁడన్= బాగా ఉన్నవాణ్ణి.

**తా :** నేను ఇక్ష్వాకుడనేరాజుయొక్క కుమారుణ్ణి. బీదవారు వేడినంతనే రక్షించేవాడిని. రాజులు సేవించి గౌరవిస్తూంటే సమస్త భూవలయాన్ని పాలించే సమర్థత కలవాణ్ణి. నావద్ద సంపద ఎల్లప్పుడూ ఉండేది. ప్రకాశవంతమైన కీర్తి అంతటా వ్యాపించి ఉండేవాణ్ణి.

**చ. పలుకులఁ దన్నుఁ దాఁ బొగడఁ బాతకమందు ర టుండెఁ దారకా**
**వలి సికతావ్రజంబు హిమవారికణంబులు లెక్క పెట్టఁగా**
**నలవడుఁ గాని యేను వసుధామరకోటికి దాన మిచ్చు గో**
**వుల గణుతింప ధాతయును నోపఁడు మాధవ! యేమి సెప్పుదున్? 462**

**ప్రతి :** మాధవ!= కృష్ణా!; పలుకులన్= మాటలచే; తన్నున్= తనను; తాన్= తాను; పొగడన్= ప్రశంసించుకోవడం; పాతకము= పాపం; అందురు= అంటారు; అటు+ఉండెన్= అది యట్లుండనీ; తారక+ఆవలిన్= నక్షత్రాల సమూహాన్నీ; సికతా+వ్రజంబున్= ఇసుక రేణువుల్నీ; హిమవారికణంబులన్= మంచుబిందువుల్నీ; లెక్కపెట్టన్+కాన్= లెక్కించడానికి; అలవఁడున్+కాని= సాధ్యమవుతుంది; కానీ; ఏను= నేను; వసుధా+అమరకోటికిన్= బ్రాహ్మణుల సమూహానికి; దానము+ఇచ్చు= దానం చేయునట్టి; గోవుల= ఆవులను; గణుతింపన్= లెక్కించడానికి; ధాతయున్+ఓపఁడు= బ్రహ్మదేవుడు కూడా సమర్థుడు కాడు; ఏమి= ఏమని; చెప్పుదున్= చెప్పేది?

**తా :** కృష్ణా! మాటలచేత తనను తాను పొగడుకోవడం పాపమంటారు. అది అలా ఉండనీ. నక్షత్రసమూహాన్ని, ఇసుక రేణువుల్ని, మంచుబిందువుల్ని లెక్కించడం సాధ్యమవుతుంది – కానీ, నేను బ్రాహ్మణసమూహానికి ఇచ్చిన గోవుల్ని లెక్కించడం బ్రహ్మదేవునికి కూడా శక్యం కాదు. ఏమని చెప్పేది?

**వ. అదియునుం గాక 463**

**ప్రతి :** అదియున్+కాక= అంతేకాకుండా...

**చ. పొలుచు సువర్ణశృంగఖురముల్ దనరం దొలిచూలులై సువ**
**త్సలు గల పాఁడియావుల నుదాత్తతపోవ్రతవేదపాఠముల్**
**గలిగి కుటుంబులై విహితకర్మములం జరియించు పేద వి**
**ప్రులకు సదక్షిణంబుగ విభూతి దలిర్పఁగ నిత్తు నచ్యుతా! 464**

**ప్రతి :** అచ్యుతా!= కృష్ణా!; సువర్ణ= బంగారు; శృంగ= కొమ్ములు; ఖురముల్= కాలిగిట్టలు; తనరన్= ఒప్పుతుండగా; తొలిచూలులు+ఐ= మొదటి ఈతగలవై; సువత్సలు= మంచిదూడలు; కల= ఉన్న; పాఁడి+ఆవులన్= పాలిచ్చే ఆవుల్ని; ఉదాత్త= శ్రేష్ఠమైన; తపస్+వ్రత= తపస్సులు, వ్రతాలు; వేదపాఠముల్= వేదపఠనాలు; కలిగి= పొంది; కుటుంబులు+ఐ= భార్యాబిడ్డలు కలవారై; విహిత= శాస్త్రంచే విధింపబడిన; కర్మములన్+చరియించు= పనుల్ని చేసే; పేదబ్రాహ్మణులకున్= బీద బ్రాహ్మణులకు; సదక్షిణంబు+కన్= దక్షిణతోకూడ; విభూతి= సంపద; తలిర్పన్+కన్= ఒప్పగా (నా సంపదకు తగినట్లుగా); ఇత్తున్= ఇస్తూ వచ్చాను.

**తా :** కృష్ణా! గొప్ప తపస్సు, వ్రతం, వేదపఠనాలు చేసే సంసారులై విధింపబడిన కర్మలు ఆచరించే బీదబ్రాహ్మణులకు బంగారు కొమ్ములు, గిట్టలు కలిగి, తొలిఈత దూడలుగల పాడి ఆవుల్ని దక్షిణతో కలిపి నా సంపదకు తగినట్లుగా ఇస్తూ ఉంటాను.

**వ. మఱియును న్యాయసముపార్జితవిత్తమ్ములగు గో భూ హిరణ్య రత్న నివాస రథ హస్తి వాజి కన్యా సరస్వతీ వస్త్ర తిల కాంచన రజత శయ్యాది బహువిధదానంబు లనూనంబులుగా ననేకంబులు సేసితిఁ,**

**బంచమహాయజ్ఞంబు లొనరించితి, వాపీ కూప తటాక వన నిర్మాణంబులు సేయించితి, ని వ్విధంబునం జేయుచో నొక్కనాఁడు. 465**

**ప్రతి :** మఱియును= ఇంకా; న్యాయ= న్యాయమార్గంలో; సమ్+ఉపార్జిత= సంపాదించిన; విత్తమ్ములు+అగు= ధనం కల్గినవైన; గో= ఆవులు; భూ= భూమి; హిరణ్య= ధనం; రత్న= రత్నాలు; నివాస= గృహాలు; రథ= రథాలు; హస్తి= ఏనుగులు; కన్యా= ఎనిమిదేండ్ల వయస్సుకలబాలికలు; సరస్వతీ= విద్య; వస్త్ర= వస్త్రాలు; తిల= నువ్వులు; కాంచన= బంగారం; రజత= వెండి; శయ్య+ఆది= పాన్పుమున్నగు; బహువిధ= అనేక విధాలైన; దానంబులున్= దానాలు; అనూనంబు+కాన్= అధికంగా; అనేకంబులు= పెక్కు; చేసితిన్= చేశాను; పంచమహాయజ్ఞంబులు+ఒనరించితిన్= పంచమహాయజ్ఞాల్ని చేశాను; వాపి= దిగుడుబావి; కూప= నూతుల్ని; తటాక= చెరువుల్ని; వన= ఉద్యానవనస్థలాల్ని; నిర్మాణంబులున్+చేయించితిని= నిర్మించాను; ఈ+విధంబునన్= ఈ రీతిగా; చేయుచోన్= చేస్తుండగా; ఒక్కనాఁడు= ఒక రోజున...

**తా :** న్యాయంగా సంపాదించిన ధనంతో – గోవులు, భూమి, బంగారు, రత్నాలు, గృహాలు, రథాలు, గజాలు, కన్యాదానం, విద్యాదానం, వస్త్ర, రజత, శయ్యధనాది దానాలనేకం చేశాను. నూతులు, చెరువులు నిర్మించాను. నివేశ స్థలాలను దానం చేశాను. ఈ రీతిగా చేస్తుండగా ఒకరోజు

**విశే :** 1. దేవ, పితృ, మనుష్య భూత, బ్రహ్మయజ్ఞాలను పంచయజ్ఞాలంటారు.
2. సప్తసంతానాలు : 1. తటాకం, 2. నిధి, 3. అగ్రహారం, 4. దేవాలయం, 5. వనం, 6. కావ్యం, 7. సంతానం.

**క. అనఘా! మునుపడఁ గశ్యపుఁ, డను విప్రున కే నకల్మషాత్ముఁడనై యి**
**చ్చిన గోవు దప్పి నా మం, దను గలసినఁ దెలియలేక తగ నా గోవున్. 466**

**ప్రతి :** అనఘా!= పుణాత్ముఁడా!; మునుపడన్= ముందుగా; కశ్యపుడు+అను= కశ్యపుడనే; విప్రునకున్= బ్రాహ్మణునికి; ఏన్= నేను; అకల్మష+ఆత్ముఁడను+ఐ= మలినంలేని మనస్సుతో; ఇచ్చిన; గోవు= ఆవు; తప్పి= (మందనుంచి) తప్పిపోయి; నా= నాయొక్క; మందన్= గుంపులో; కలసినన్= కలవగా; తెలియలేక= తెలుసుకోలేక; ఆ; గోవును= ఆవును; తగన్= యుక్తమగునట్లు...

**తా :** అనఘా! నేను ముందుగా ఆ గోవును కశ్యపుడనే బ్రాహ్మణునికి నిర్మలమైన మనస్సుతో దానం చేశాను. కానీ, ఆ గోవు మందనుండి తప్పిపోయి నామందలో ప్రవేశించింది. అది తెలియక నేను ఆ గోవును

**క. ఒండొక భూమీసురకుల, మండనునకు దాన మీయ మసలక యా వి**
**ప్రుం డా గోవుం గొని చను, చుండన్ మును ధారగొన్న యుర్వీసురుఁడున్. 467**

**ప్రతి :** ఒందు+ఒక= మరియొక; భూమీసురకులమండనునకున్= బ్రాహ్మణకుల శ్రేష్ఠునికి; దానము+ఈయన్= దానం ఇవ్వగా; మసలక= ఆలస్యంచేయక; ఆ; విప్రుండు= బ్రాహ్మణుడు; ఆ; గోవున్+కొని= ఆవును తీసుకొని; చనుచున్+ఉండన్= వెళ్లుతుండగా; మును= పూర్వం; ధారన్+కొన్న= ధారాపూర్వకంగా దానంపట్టిన; ఉర్వీసురుఁడున్= బ్రాహ్మణుడు...

**తా :** నేను ఒక బ్రాహ్మణశ్రేష్ఠునికి ఆవును దానమిచ్చాను. అతడు ఆవును తీసుకొని వెళుతున్నాడు. పూర్వం ధారాపూర్వకంగా దానంపట్టిన బ్రాహ్మణుడు

**క. మది రోష మొదవ దోవతి, వదలిన బిగియించుకొనుచు వడిఁ గది సిది నా**
**మొదవు, నడివీథి దొంగిలి, వదలక కొనిపోయె, దిట్టివారుం గలరే? 468**

**ప్రతి :** మదిన్= మనస్సులో; రోషము= కోపం; ఒదవన్= కలుగగా; దోవతి= పంచె; వదలినన్= పట్టువదలగా; బిగియించుకొనుచున్= బిగించుకొంటూ; వడిన్= వేగంగా; కదిసి= దగ్గరకువచ్చి; ఇది= ఈ ఆవు; నా; మొదవు= గోవు; దొంగిలి= దొంగిలించి; వదలక= పట్టుకొని; నడివీథిన్= రాజవీథిలో; కొనిపోయెదు(వు)= తీసుకొనివెళుతున్నావు; ఇట్టివారు= ఇలాంటివారు; కలరు+ఏ= ఉన్నారా?

**తా :** మనస్సులో కోపం కలుగగా ఆ బ్రాహ్మణుడు వేగంగా, పంచెపట్టు వదలితే బిగించుకొంటూ, ఈ ఆవు నాది, దీన్ని దొంగిలించి రాజమార్గంగుండా కొనిపోతున్నావు. నీలాంటివారు ఉన్నారా?

**చ. అనవుడు నాతఁ డిట్లనియె నాతనితో నిపు డేను దీని నీ**
**జనపతిచేత ధారగొని సాధుగతిం జన నీది యంట యె?**
**ట్లనిన నతండు 'నేనును ధరాధిపుచే మును ధారగొన్న యా'**
**వని వినిపింప నిద్దఱకు నయ్యె నపారవివాద మచ్చటన్. 469**

**ప్రతి :** అనవుడున్= అలా అనిన పిమ్మట; అతఁడు= ఆ బ్రాహ్మణుడు; ఇట్లు= ఈ విధంగా; ఆతనితోన్= బ్రాహ్మణునితో; ఇపుడు+ఏన్= ఇప్పుడు నేను; దీనిని= ఈ ఆవును; ఈ; జనపతిచేతన్= రాజుచే; ధారగొని= దానంగా తీసుకొని; సాధుగతిన్= ఉదాత్తమైనవిధంగా; చనన్= వెళ్ళుతుండగా; నీది+అంట= నీదంటావా?; ఎట్లు= ఎలాగా; అనినన్= అని చెప్పగా; అతండును= ఆ బ్రాహ్మణుడూ; ఏనును= నేనుకూడా; ధరా+అధిపుచేన్= ఆ రాజుచేతనే; మును= పూర్వం; ధారగొన్న= ధారాపూర్వక దానంగా తీసుకొన్న; ఆవు; అని; వినిపింపన్= చెప్పగా; ఇద్దఱకున్= ఆ బ్రాహ్మణులకు ఇద్దరికీ; అచ్చటన్= అక్కడ; అపార= అంతులేని; వివాదము+అయ్యెన్= తగవు అయింది.

**తా :** అంటే ఆ బ్రాహ్మణుడు నేను ప్రభువునుండి దానంగా గ్రహించి, ఈ ఆవును తీసుకొనిపోతున్నానని పలికాడు. పూర్వం నేను దానంగా స్వీకరించిన ఆవు 'ఇదే' అని పలికాడు మొదటి బ్రాహ్మణుడు. వారికి అక్కడనే పెద్ద కలహమయింది.

**వ. ఇట్లు విప్రు లిద్దఱుం దమలో నంతకంతకు మచ్చరంబు పెచ్చు పెరిఁగి కలహించి నా యున్న యెడకుం జనుదెంచిరి, మున్ను నాచేత గోదానంబు గొన్న బ్రాహ్మణుం డిట్లనియె. 470**

**ప్రతి :** ఇట్లు= ఇలా; విప్రులు+ఇద్దఱునున్= బ్రాహ్మణులిద్దరూ; తమలోన్= వారిలో వారు; అంతకున్+అంతకున్= క్రమంగా; మచ్చరంబు= పట్టుదల; పెచ్చుపెరిగి= వృద్ధిచెంది; కలహించి= తగవుపడి; నా+ఉన్న+ఎడకున్= నేను ఉన్న స్థలానికి; చనుదెంచిరి= వచ్చారు; మున్ను= పూర్వం; నాచేతన్= నానుండి; దానంబున్= దానం; కొన్న= తీసుకొన్న; బ్రాహ్మణుండు= బ్రాహ్మణుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** బ్రాహ్మణులిద్దరూ తమలోతాము కలహించుకొని తగవు తీర్చండని నా దగ్గరకు వచ్చారు. పూర్వం ఆవును దానంగా గ్రహించిన బ్రాహ్మణుడు నాతో ఇట్లన్నాడు.

**సీ. 'మనుజేంద్ర! ప్రజ లధర్మ ప్రవర్తనముల, నడవకుండఁగ నాజ్ఞ నడపు నీవు**
**మనమున నే ధర్మ మని యాచరించితి?, ముసు నాకు నిచ్చిన మొదవు దప్పి**
**వచ్చి నీ మందలోఁ జొచ్చిన నిప్పు డీ, భూసురునకు ధార వోసి యిచ్చి**
**తగవు మాలితివి దాతవు నపహర్తవు, నైన ని న్నేమందు? నవనినాథ!**

**తే. యనిన మాటలు సెవులు సోఁకినఁ గలంగి, భూసురోత్తమ! యజ్ఞానపూర్వకముగ**
**నిట్టి పాపంబు దొరసె నే నెఱిఁగి సేయఁ, గొనుము నీ కిత్తు నొక లక్ష గోధనంబు.' 471**

**ప్రతి :** మనుజ+ఇంద్ర= ఓ రాజా!; ప్రజలు= జనులు; అధర్మప్రవర్తనములన్= ధర్మవిరుద్ధాలైన పనులలోకి; నడవకుండన్+కన్= వెళ్ళకుండా; ఆజ్ఞ= ఆజ్ఞను; నడపు= అమలుచేసే; నీవు; మనమునన్= మనస్సులో; ఏ; ధర్మము+అని= ధర్మమని; ఆచరింతి(వి)= పాటించావు?; ముసు= పూర్వం; నాకున్= నాకు; ఇచ్చిన; మొదవు= పశువు (ఆవు); తప్పి= దారితప్పి; వచ్చి; నీ= నీయొక్క; మందలోన్= గుంపులో; చొచ్చినన్= దూరితే; ఇప్పుడు= ఇపుడు; ఈ భూసురునకున్= బ్రాహ్మణునికి; ధార+పోసి= ధారాపూర్వకంగా ఈ గోవును దానమిచ్చి; తగవుమాలితివి= న్యాయమార్గం తప్పావు; దాతవును= ఇచ్చినవాడవూ; అపహర్తవున్= దొంగవూ; ఐన= అయిన; నిన్నున్+ఏమి+అందున్= నిన్నేమని అనగలను?; అవనీనాథ= ఓ రాజా!; అనినన్= అనగా; మాటలు= పలుకులు; చెవులు= చెవులకు; సోకినన్= తగులగా; కలంగి= కలతపడి; భూసుర+ఉత్తమ= బ్రాహ్మణులలో శ్రేష్ఠుడైనవాడా!; అజ్ఞానపూర్వకముగన్= తెలియకపోవుటచే; ఇట్టి= ఈ విధమైన; పాపంబు+దొరసెన్= పాపం కలిగింది; ఏన్+ఎఱిఁగి+చేయన్= నేను తెలిసిచేయలేదు; ఒకలక్ష; గోధనంబు= గోవులనే ధనం; నీకున్+ఇత్తున్= నీకు ఇస్తాను; కొనుము= తీసుకొమ్ము.

**తా :** ఓ రాజా! జనులు అధర్మప్రవర్తనకు పాల్పడకుండా ఆజ్ఞాపించేవాడివైన నీవు ఏ ధర్మమని భావించి ఈ ఆవును మరియొక బ్రాహ్మణునికి దానం చేశావు? పూర్వం నాకు దానం చేసిన ఆవు దారి తప్పి గుంపులో నుంచి వచ్చి, నీ మందలో కలిసింది. నీవు దానినే వేరొకరికి దానం చేశావు. దాతవు, చోరుడవు కూడ అయ్యావు" అన్నాడు. బ్రాహ్మణుని మాటలు వినగానే రాజుయొక్క మనస్సు కలతపడింది. "ఇది నాకు తెలియకుండ జరిగిన తప్పు" అని ఆ బ్రాహ్మణునితో చెప్పి "దానికి బదులు నీకు ఒకలక్ష గోధనం ఇస్తాను తీసుకో" అన్నాను.

**క. అని మఱియును న వ్విప్రుని, సునయోక్తుల ననునయింపుచును నిట్లంటిన్**
**ననుఁ గావు, నరకకూపం, బునఁ బడఁగా జాలఁ విప్రపుంగవ!' యనుచున్. 472**

**ప్రతి :** అని; మఱియున్= ఇంకా; ఆ+విప్రునిన్= ఆ బ్రాహ్మణుణ్ణి; సునయ+ఉక్తులన్+అనునయింపుచున్= మంచిసాంత్వనపు మాటలతో బుజ్జగిస్తూ; ఇట్లు+అంటిన్= ఇలా అన్నాను; విప్రపుంగవ!= బ్రాహ్మణశ్రేష్ఠుడా!; నరకకూపంబున్= నరకమనే నూతిలో; పడన్+కాన్+చాలన్= పడలేను; ననున్= నన్ను; కావు= రక్షింపుము; అనుచున్= అంటూ...

**తా :** ఆ బ్రాహ్మణుని మంచిమాటలతో బుజ్జగిస్తూ ఇలా చెప్పాను. నేను నరకబాధ పొందలేను. నన్ను రక్షింపుము – అని చెప్తూ

**తే. ఎంత వేఁడిన మచ్చరం బంత పెరిఁగి, మొదల నా కిచ్చినట్టి యీ మొదవె కాని**
**యెనయ నీ రాజ్య మంతయు నిచ్చితేని, నొల్ల నని విప్రుఁ డచ్చుట నుండ కరిగె. 473**

**ప్రతి :** ఎంత= ఎంతగా; వేడినన్= బతిమాలినా; విప్రుఁడు= ఆ బ్రాహ్మణుడు; మచ్చరంబు= పట్టినపట్టు; అంతన్= ఆ సమయాన; పెరిగి= పెరిగిందై; మొదల= మునుపు; నాకున్= నాకు; ఇచ్చిన+అట్టి= ఇచ్చినట్టి; ఈ; మొదవు+ఎ+కాని= ఈ ఆవేతప్ప; ఎనయన్= సమానమయినట్టి; ఈ; రాజ్యము+అంతయున్= రాజ్యమంతటినీ; ఇచ్చితి(వి)+ఎనిన్= ఇచ్చినప్పటికీ; ఒల్లన్+అని= అంగీకరింపనని; విప్రుఁడు= ఆ బ్రాహ్మణుడు; అచ్చట= అక్కడ; ఉండక= ఉండకుండా; అరిగెన్= వెళ్లాడు.

**తా :** ఎంతగా కోరినప్పటికీ పట్టుదల వీడకుండా, నీవు పూర్వమిచ్చిన ఆవును తప్ప, దానికి బదులుగా నీ రాజ్యం అంతటినీ ఇచ్చినప్పటికీ గ్రహింపనని పలుకుతూ, అచ్చట ఉండకుండా వెళ్ళిపోయాడు.

**వ. అ ట్లతం డరిగిన నా రెండవ బ్రాహ్మణునిం బ్రార్థించిన నతండును జలంబు డింపక పదివే లేఱి కోరిన పాఁడి మొదవుల నిచ్చిన నైనను దీనిన కాని యొల్ల నని నిలువక చనియె, నంతఁ గాలపరిపక్వంబైన నన్ను దండధరకింకరులు గొనిపోయి వైవస్వతుముందటం బెట్టిన నతండు నన్ను నుద్దేశించి యిట్లనియె. 474**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; అతండు= ఆ బ్రాహ్మణుడు; అరిగినన్= వెళ్ళగా; ఆ; రెండవ+బ్రాహ్మణునిన్= రెండవ బ్రాహ్మణుణ్ణి; ప్రార్థించినన్= వేడగా; అతండును= అతడుకూడా; చలంబున్= పట్టుదలను; డింపక; వదలక; పదివేలు; ఏఱి= ఎంపిక చేసుకొని; కోరిన; పాఁడి మొదవులన్= పాడి ఆవుల్ని; ఇచ్చినన్+ఐనను= ఇచ్చినా; దీనిన్+అ+కాని= ఈ ఆవును తప్ప; ఒల్లను= మరొకటి అంగీకరింపను; అని; నిలువక= ఉండక; చనియెన్= వెళ్లాడు; అంతన్= అంతట; కాలపరిపక్వంబు+ఐనన్= మరణం సంభవించగా; నన్నున్= నన్ను; దండధరకింకరులు= యమభటులు; కొనిపోయి= తీసుకొనివెళ్ళి; వైవస్వతుముందటన్= యముని ఎదుట; పెట్టినన్= ఉంచగా; అతండు= యముడు; నన్నున్+ఉద్దేశించి= నన్నుచూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** రెండవబ్రాహ్మణుణ్ణి కూడా నేను ఆ విధంగానే ప్రార్థించాను. ఆయనకూడా అంగీకరించలేదు. ఎన్నుకొన్న పదివేల ఆవుల్ని ఇచ్చినా కూడా నేను అంగీకరించను. ఆ ఆవే కావాలన్నాడు. కాలంకడచింది. మరణించాడు. యమభటులు నన్ను తీసుకొని వెళ్ళి యముని ఎదుట నిలబెట్టారు. అతడు నన్ను ఉద్దేశించి ఇలా పలికాడు.

**మ. మనుజేంద్రోత్తమ! వంశపావన! జగన్మాన్యక్రియాచార! నీ**
**ఘనదానక్రతుధర్మముల్ త్రిభువనఖ్యాతంబులై చెల్లెడిన్,**
**మును దుష్కర్మఫలంబు నొంది పిదపం బుణ్యానుబంధంబులై**
**చను సౌఖ్యంబులఁ బొందు, పద్మజునియాజ్ఞం ద్రోవఁగా వచ్చునే? 475**

**ప్రతి :** మనుజ+ఇంద్ర+ఉత్తమ= రాజశ్రేష్ఠా; వంశపావన= ఇక్ష్వాకువంశాన్ని పవిత్రం చేసినవాడా!; జగత్+మాన్యక్రియా+ ఆచార= ప్రపంచంలో లోకంచే కొనియాడబడే పనుల్ని ఆచరించేవాడా!; నీ= నీయొక్క; ఘన= గొప్పవగు; దాన= దానాలు; క్రతు= యజ్ఞాలు; ధర్మముల్= పుణ్యకర్మలు; త్రిభువన= స్వర్గ, మర్త్య, పాతాళలోకాల్లో; ఖ్యాతంబులు+ఐ= ప్రసిద్ధాలై; చెల్లెడిన్= అంగీకరించబడ్డాయి; మును= ముందు; దుస్+కర్మఫలంబున్+ఒంది= చెడుకర్మ (పాపం) ఫలం పొంది; పిదపన్= తరువాత; పుణ్య= పుణ్యాల్ని; అనుబంధంబులు+ఐ= అనుసరించినవై; చను= చెల్లునట్టి; సౌఖ్యంబులన్+ పొందు=సుఖాలను పొందుము; పద్మజుని= బ్రహ్మయొక్క; ఆజ్ఞను= ఆనను; త్రోవగాన్+వచ్చునే= తీసివేయవచ్చునా? (వీలుకాదు)

**తా :** రాజా! ఇక్ష్వాకు వంశాన్ని పవిత్రం చేసినవాడా! నీవు చేసిన దానాలూ, యజ్ఞాలూ పుణ్యకార్యాలూ స్వర్గ, మర్త్య పాతాళలోకాల్లో ప్రసిద్ధాలై పేరుపొందాయి. ముందుగా పాపానికి పొందవలసిన ఫలాన్ని పొంది, తర్వాత పుణ్యకర్మల ఫలితాన్ని పొందాలి అనడం బ్రహ్మ ఆజ్ఞ! దాన్ని కాదనగలమా?

**వ. అని వేగంబున ద్రొబ్బించిన నేను బుడమిం బడునపుడ యీ నికృష్టంబయిన యూసరవెల్లి రూపంబుఁ గైకొంటి నింతకాలంబు దద్దోషనిమిత్తంబున నిద్దురవస్థం బొందవలసెఁ, బ్రాణులకుఁ బుణ్యపాపంబు లనుభావ్యంబులు గాని యూరక పోనేరవు. నేఁడు సమస్త దురితనిస్తారకం బయిన భవదీయపాదారవింద సందర్శనంబునం జేసి యీ ఘోరదుర్దశలం బాసి నిర్మలాత్మకుండ నైతి నని పునఃపునః ప్రణామంబు లాచరించి మఱియు నిట్లనియె. 476**

**ప్రతి :** అని= అంటూ; వేగంబునన్= వేగంగా; ద్రొబ్బించినన్= పడతోయిస్తే; ఏను= నేను; పుడమిన్= భూమిపై; పడునపుడు+అ= పడేటప్పుడే; ఈ నికృష్టంబు+అయిన= ఈ అధమమయిన; ఊసరవెల్లి రూపంబున్= తొండరూపాన్ని; కైకొంటిని= గ్రహించాను; ఇంతకాలంబు= ఇంతకాలం; తద్+దోష+నిమిత్తంబున= ఆ తప్పిదం కారణంగా; ఈ; దురవస్థన్+ పొందవలసెన్= ఈ కష్టస్థితిని పొందవలసివచ్చింది; ప్రాణులకున్= జీవులకు; పుణ్యపాపంబులు= పుణ్యాలు, పాపాలు; అనుభావ్యంబులు= అనుభవించాల్సినవే కాని; ఊరక= ఊరకనే; పోనేరవు= పోవు; నేఁడు= ఈ రోజు; సమస్త= సర్వ; దురిత= పాపాలనుండి; నిస్తారకంబు+అయిన= దాటించడానికి; భవదీయ= నీ; పాద+అరవింద= పాదపద్మాలయొక్క; సందర్శనంబునన్+చేసి= దర్శనంచే; ఈ; ఘోర= భయంకర; దుర్+దశలను= కష్టస్థితుల్ని; పాసి= వదలి; నిర్మల+ఆత్మకుండన్+ ఐతిని+అని= పవిత్రమయిన మనస్సు కలవాణ్ణి అయ్యానని; పునఃపునః= మాటి మాటికి; ప్రణామంబులు= నమస్కారాలు; చేసి; మఱియున్+ఇట్లు+అనియెన్= ఇంకా ఇలా అన్నాడు.

**తా :** యముడు ఆ రాజును భూమిపైకి తోయించాడు. భూమిపై పడేటప్పటికి ఊసరవెల్లి రూపం కలిగింది. ఆనాటినుండి నేటివరకు ఈ దురవస్థను అనుభవిస్తున్నాను. జీవి పుణ్యాపాపఫలాల్ని అనుభవించక తప్పదు. నీ దర్శనఫలితంగా సర్వపాప ఫలాల్నీ పోగొట్టుకొన్నాను - అని కృష్ణుడికి పదే పదే ప్రణామాలు ఆచరించి ఇట్లని పలికాడు.

**ఆ.వె. 'కృష్ణ! వాసుదేవ! కేశవ! పరమాత్మ!, యప్రమేయ! వరద! హరి! ముకుంద!**
**నిన్నుఁ జూడఁ గంటి, నీ కృపఁ గనుగొంటి, నఖిలసౌఖ్యపదవు లందఁ గంటి'. 477**

**ప్రతి :** కృష్ణ= కృష్ణా!; వాసుదేవ= వసుదేవుని కుమారా!; కేశవ= కేశవా; పరమ+ఆత్మ= పరమాత్మా!; అప్రమేయ= ఇంతటివాడని చెప్పడానికి శక్యంగానివాడా!; వరద= వరాలు ఇచ్చేవాడా!; హరి= హరీ; ముకుంద= ముకుందా!; నిన్నున్+చూడన్+కంటిన్= నిన్ను చూడగలిగాను; నీ= నీయొక్క; కృపను= దయను; కనుగొంటిన్= చూడగలిగిగాను; అఖిల= సర్వ; సౌఖ్య= సుఖవంతమైన; పదవులన్= స్థానాల్ని (పదవుల్ని); అందన్+కంటిన్= పొందగలిగాను.

**తా :** కృష్ణా! వాసుదేవా! కేశవా! పరమాత్మా! అప్రమేయా! వరదా! హరీ! ముకుందా నిన్ను చూడగలిగాను. నీ దయకు పాత్రుడనయ్యాను. సర్వసౌఖ్యపదవుల్ని పొందగలిగాను.

**వ. అని యనేకభంగులం గొనియాడి గోవిందునిపదంబులు దన కిరీటంబు సోఁకం బ్రణమిల్లి 'దేవా! భవదీయపాదారవిందంబులు నా హృదయారవిందంబును బాయకుండునట్లుగాఁ బ్రసాదింపవే?' యని**

**తదనుజ్ఞాతుండై యచ్చటిజనంబులు సూచి యద్భుతానందంబులం బొంద నతులతేజోవిరాజిత దివ్యవిమానారూఢుండై దివంబున కరిగె, నంత నమ్మాధవుండు నచ్చట నున్న పార్థివోత్తములకు ధర్మబోధంబుగా నిట్లనియె. 478**

**ప్రతి :** అని; అనేకభంగులన్+కొనియాడి= అనేకవిధాలుగా ప్రశంసించి; గోవిందునిన్= కృష్ణునియొక్క; పదంబులు= పాదాలు; తన= తనయొక్క; కిరీటంబు= కిరీటం; సోఁకన్= తగిలేటట్లుగా; ప్రణమిల్లి= నమస్కరించి; దేవా!= ప్రభూ!; భవదీయ= నీ; పాద+అరవిందంబులు+పాదపద్మాలు; నా= నా; హృదయ+అరవిందంబును= హృదయపద్మాన్ని; పాయకుండునట్లు+కాన్= వదలిపెట్టకుండునట్లుగా; ప్రసాదింపవు+ఏ= అనుగ్రహించవా?; అని= అని; తద్+ అనుజ్ఞాతుండు+ఐ= వానినుండి సెలవు తీసికొని; అచ్చటి= అక్కడ ఉన్న; జనంబులున్= ప్రజలును; చూచి= చూచి; అద్భుత+ఆనందంబులన్= మిక్కిలి సంతోషాన్ని; పొందన్= పొందగా; అతుల= సాటిలేని; తేజస్= కాంతిచే; విరాజిత= ప్రకాశింపబడిన; దివ్య= దేవతా; విమాన+ఆరూఢుండు+ఐ= విమానం ఎక్కినవాడై; దివంబునకున్= స్వర్గానికి; అరిగెన్= వెళ్ళాడు; అంతన్= అంతట; ఆ+మాధవుండున్= ఆ కృష్ణుడును; అచ్చటన్+ఉన్న= అక్కడ ఉన్న; పార్థివ+ఉత్తములకున్= రాజశ్రేష్ఠులకు; ధర్మబోధంబు+కన్= ధర్మం చెప్పినట్లు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** ఓ కృష్ణా! నీ అనుగ్రహం నాలో ఎల్లపుడు ఉండేటట్లుగా అనుగ్రహించు – అని కృష్ణుని పాదారవిందాలకు నమస్కరిస్తూ సెలవు తీసుకొని, దివ్యవిమానం ఎక్కి స్వర్గానికి వెళ్లాడు. అక్కడున్న రాజులకు ధర్మబోధం చేస్తూ కృష్ణ డిలా అన్నాడు.

**సీ. నరనాథ! కులకాననము దహించుటకును, నవనీసురుల విత్త మగ్నికీల,**
**జననాయకుల నిజైశ్వర్యాబ్ధి నింకింప, బ్రాహ్మణక్షేత్రంబు బాడబంబు,**
**పార్థివోత్తముల సంపచ్ఛైలములఁ గూల్ప, భూసురధనము దంభోళిధార,**
**జగతీవరుల కీర్తిచంద్రిక మాప వి, ప్రోత్తముధనము సూర్యోదయంబు,**

**తే. విప్రతతిసొమ్ముకంటెను విషము మేలు, గరళమునకును బ్రతికృతి గలదు గాని**
**దాని మాన్పంగ భువి నౌషధములు లేవు, గాన బ్రహ్మస్వములు గొంట గాదు పతికి. 479**

**ప్రతి :** అవనీసురుల= బ్రాహ్మణులయొక్క; విత్తము= ధనం; నరనాథుల= రాజులయొక్క; కులకాననమున్= వంశమనే అరణ్యాన్ని; దహించుటకునున్= కాల్చేందుకు; అగ్నికీల= అగ్నిజ్వాల; బ్రాహ్మణక్షేత్రంబు= బ్రాహ్మణుల పొలం; జననాయకుల= రాజులయొక్క; నిజ+ఐశ్వర్య+అబ్ధిన్+ఇంకింపన్= సొంత సంపద అనే సముద్రాన్ని ఇంకించేందుకు; బాడబంబు= బడబానలం; భూసురధనము= బ్రాహ్మణుల సొమ్ము; పార్థివ+ఉత్తముల= ఉత్తములైన రాజులయొక్క; సంపత్+శైలములన్= సంపదలనే కొండల్ని; కూల్పన్= కూల్చేందుకు; దంభోళిధార= వజ్రాయుధం అంచు; విప్ర+ఉత్తము= బ్రాహ్మణశ్రేష్ఠునియొక్క; ధనము= ధనం; జగతీవరుల= రాజశ్రేష్ఠుల; కీర్తిచంద్రికన్= కీర్తి అనే వెన్నెలను; మాపన్= నశింపచేసేందుకు; సూర్య+ఉదయంబు= పొద్దు పొడుపు; విప్రతతిసొమ్ము= బ్రాహ్మణసమూహంయొక్క ధనంకంటే; విషము= గరళం; మేలు= మంచిది; గరళమునకున్= విషానికి; ప్రతికృతి= ప్రతిక్రియ (చికిత్స) ఉంది కాని; దానిన్+మాన్పన్+కన్= బ్రాహ్మణధనాన్ని అపహరించడం అనే వ్యాధిని మాన్పేందుకు; ఔషధములు= మందులు; భువిన్= భూమిపై; లేవు; కానన్= కాబట్టి; బ్రహ్మస్వములన్+కొంట= బ్రాహ్మణధనాలను తీసుకోవడం; పతికిన్= రాజుకు; కాదు= తగదు.

**తా :** రాజకులాలను దహించేందుకు బ్రాహ్మణులధనం (నిప్పు) అగ్నికణం. రాజకులాల సంపద అనే సముద్రాన్ని ఇంకింపచేసేందుకు బ్రాహ్మణక్షేత్రం బడబాగ్ని. రాజులసంపద అనే కొండల్ని కూల్చేందుకు బ్రాహ్మణులధనం, వజ్రాయుధం. రాజులకీర్తి వెన్నెలను మాపేందుకు బ్రాహ్మణధనం పొద్దుపొడుపు. బ్రాహ్మణులసొమ్ముకంటే విషమే మేలు. విషానికైనా చికిత్స ఉంది కానీ బ్రాహ్మణుల సొమ్ముకు చికిత్స లేదు. కాబట్టి, బ్రాహ్మణులసొమ్మును రాజులు గ్రహించరాదు.

**క. ఎఱుఁగమి నైనను భూసుర, వరుల ధనం బపహరింప వలవదు పతికిన్.**
**మఱపున ననలము ముట్టిన, దరికొని వెసఁ గాల్పకున్నె తను వెరియంగన్? 480**

**ప్రతి :** ఎఱుగమిన్+ఐనను= తెలియకపోయినప్పటికీ; పతికిన్= రాజుకు; భూసురవరుల= బ్రాహ్మణశ్రేష్ఠుల; ధనంబు= సొమ్ము; అపహరింపన్= దొంగిలించడం; వలవదు= తగదు; మఱపునన్= ఏమరుపాటున; అనలము= నిప్పు; ముట్టినన్= తాకినా; దరికొని= మండి; వెసన్= వేగంగా; తనువు+ఎరియన్+కన్= శరీరం బాధపడేటట్లు; కాల్పకున్ని+ఎ= కాల్చకుండా ఉంటుందా?

**తా :** అజ్ఞానంతోనైనా బ్రాహ్మణుని సొమ్ము దొంగిలించరాదు. నిప్పును తెలియక తాకినా శరీరం బాధపడేటట్లు, అది కాల్చకుండా ఉంటుందా?

**వ. మఱియును దనధనంబు పరులచేతఁ గోల్పడినవిప్రుండు దుఃఖమున రోదనంబుసేయ రాలిన యశ్రుకణంబుల నవని రేణువు లెన్ని తడియు నన్ని వేలేండ్లు తదుపేక్షాపరుండైనపతి దారుణవేదనలు గల కుంభీపాకనరకంబు నొందు. మఱియు నతనితోడఁ గ్రిందటఁ బదితరంబులవారును, ముందటఁ బదితరంబులవారును మహానరకవేదనలం బొందుదురు. స్వదత్తంబైన నర్థలోభంబునం జేసి దుశ్శీలుండై యెవ్వఁడు బ్రాహ్మణక్షేత్రసంభూతధాన్యధనాదికంబు భుజించు నప్పాపాత్ముం డఱువదివేలసంవత్సరంబులు మలకూపంబునం గ్రిమిరూపంబున వర్తించు. నట్లగుట యెఱింగి విప్రు డెంత తప్పు చేసిన నెన్ని గొట్టిన, నెన్ని దిట్టిన నతని కెదురు పలుకక వినయంబున వందనం బాచరించు పుణ్యాత్ములు నాదుపాలింటివా, రదియునుం గాక యేనును బ్రతిదినంబును భూసురుల నతివినయంబునఁ బూజింతు. నిట్లు సేయక విపరీతవర్తనులైన తామసుల నేను వెదకి దండింతు. నది గావున మీరలును బ్రాహ్మణజనంబులవలనం బరమభక్తి గలిగి మెలంగుం డని యానతిచ్చి యాదవప్రకరంబులు సేవింప నఖిలలోకశరణ్యుండైన యప్పుండరీకాక్షుండు నిజనివాసంబునకుం జనియె' నని చెప్పి శుకుం డిట్లనియె. 481**

**ప్రతి :** మఱియును= ఇంకా; తన= తనయొక్క; ధనంబు= సొమ్మును; పరులచేతన్= ఇతరులవల్ల; కోలు+పడిన= పోగొట్టుకొన్న; విప్రుండు= బ్రాహ్మణుడు; దుఃఖమునన్= బాధతో; రోదనంబు+చేయన్= ఏడిస్తే; రాలిన= పడిన; అశ్రుకణంబులన్= కన్నీటి చుక్కలచేత; అవని= నేలయందలి; రేణువులు= దుమ్ము కణాలు; ఎన్ని; తడియున్= తడుస్తాయో; అన్ని; వేల+ఏండ్లు= వేలసంవత్సరాలు; తద్+ఉపేక్షాపరుండు+ఐన= దానిని నిర్లక్ష్యంచేసే; పతి= రాజు; దారుణ= ఘోర; వేదనలు+కల= బాధలు కల; కుంభీపాకనరకంబున్+ఒందున్= కుంభీపాకం అనే నరకం పొందుతాడు; మఱియున్= ఇంకా; అతనితోడన్= ఆ రాజుతోపాటు; క్రిందటన్= వెనుకటి; పదితరములవారున్= పదితరాలకు చెందిన తన వంశపురాజులు; ముందటన్= రానున్న; పదితరంబులవారున్= పదితరాలకు చెందినవారూ; మహా= గొప్ప; నరకవేదనలన్=

నరకంలోని కష్టాలను; పొందుదురు= అనుభవిస్తారు; స్వ= తనచే; దత్తంబు+ఐన= ఈయబడ్డ; అర్థ= ధనం; లోభంబునన్+చేసి= దురాశచే; దుస్+శీలుండు+ఐ= చెడుప్రవర్తనకలవాడై; ఎవ్వఁడు= ఎవడు; బ్రాహ్మణక్షేత్ర= బ్రాహ్మణుని పొలంలో; సంభూత= పండిన; ధాన్యధన+ఆదికంబు= ధాన్యం, ధనం మొదలైనవాటిల్ని; భుజించున్= తింటాడో; ఆ పాప+ఆత్ముఁడు= ఆ పాపపు మనస్సు కలిగినవాడు; అఱువదివేల= అరవైవేల; సంవత్సరంబులు= సంవత్సరాలు; మలకూపంబునన్= అశుద్ధంతో నిండిన గోతిలో; క్రిమిరూపమునన్= సూక్ష్మమయిన పురుగురూపంలో; వర్తించున్= జీవనం గడపుతాడు; అట్లు= ఆ విధంగా; అగుటను; ఎఱింగి= తెలుసుకొని; విప్రుండు= బ్రాహ్మణుండు; ఎంత తప్పు చేసినను= ఎంతటి తప్పు చేసినా; ఎన్ని; కొట్టినన్= (దెబ్బలు) కొట్టినా; ఎన్ని; తిట్టినన్= తిట్లుతిట్టినప్పటికీ; అతనికిన్= అతనికి; ఎదురుపలుకక= వ్యతిరేకంగా మాటలాడక; వినయంబునన్= వినయంతో; వందనంబు+ఆచరించు= నమస్కారం చేసే; పుణ్య+ఆత్ములు= పుణ్యులు; నాదుపాలింటివారు= నాకు చెందినవారు; అదియున్+కాక= అదీగాక; ఏనునున్= నేనుకూడా; ప్రతిదినంబున్= ప్రతిరోజూ; భూసురులను= బ్రాహ్మణుల్ని; అతివినయంబునన్= మిక్కిలి వినయంతో; పూజింతున్= పూజిస్తాను; ఇట్లు+చేయక= ఈ విధంగా చేయక; విపరీతవర్తనులు+ఐన= విరుద్ధమైన నడక గలవారైన; తామసులన్= తామసగుణం కలవార్ని (చెడ్డవార్ని); ఏను= నేను; వెదకి= అన్వేషించి; దండింతున్= శిక్షిస్తాను; అదికావునన్= కాబట్టి; మీరలును= మీరును; బ్రాహ్మణ జనంబులవలనన్= బ్రాహ్మణుల విషయంలో; పరమభక్తిన్= మిక్కిలి భక్తిని; కలిగి= పొంది; మెలంగుండు= ప్రవర్తించండి; అని; ఆనతి+ఇచ్చి= ఆజ్ఞాపించి; యాదవప్రకరంబు= యాదవసమూహం; సేవింపన్= తనను సేవిస్తూండగా; అఖిలలోకశరణ్యుండు+ఐన= సర్వలోకాలనూ రక్షించే సామర్థ్యం కలవాడైన; ఆ+పుండరీక+అక్షుండు= ఆ కృష్ణుడు; నిజనివాసంబునకున్+చనియె= స్వగృహానికి వెళ్లాడు; అని; చెప్పి; శుకుండు+ఇట్లు+అనియెన్= శుకమహర్షి ఇలా అన్నాడు.

**తా :** ఇతరులవల్ల తన ధనాన్ని పోగొట్టుకొని రాజుకు చెప్పినా రాజుపట్టించుకోక పోతే ఆ బ్రాహ్మణుడు ఏడ్చినపుడు ఎన్ని మట్టికణాలు కన్నీటితో తడుస్తాయో అన్ని వేలసంవత్సరాలు ఆ రాజ్యాన్ని పాలించే రాజు కుంభీపాకనరకం అనుభవిస్తాడు. అంతేకాదు – అట్టి రాజువంశంలోని పూర్వులు పదితరాలవారూ, తరువాతి పదితరాలవారూ నరకం అనుభవిస్తారు. రాజు అరవైవేలసంవత్సరాలు ఘోరనరకం అనుభవిస్తాడు. బ్రాహ్మణుడు ఎంతటి తప్పుచేసినా, కొట్టినా, తిట్టినా, ప్రభువు మాత్రం వినయపూర్వకంగా ఉండాలి. నేనుకూడా బ్రాహ్మణులకు వినయపూర్వకంగా నమస్కరిస్తాను. అట్లు చేయనివారిని విరుద్ధమైన చెడువర్తనం కలవారిని వెదకి శిక్షిస్తాను. కాబట్టి, మీరు బ్రాహ్మణులపట్ల మిక్కిలి భక్తి గలిగి ప్రవర్తించండి – అని శ్రీకృష్ణుడు ఆజ్ఞాపించి, యాదవసమూహం సేవిస్తుండగా, సర్వరక్షకుడు ఆ స్వామి నిజనివాసానికి వెళ్లాడని శుకమహర్షి చెప్పాడు.

**క. ఈ కథఁ జదివిన వారలుఁ, గైకొని వినువారు విగతకలుషాత్మకులై**
**లౌకికసౌఖ్యము నొందుదు, రా కైవల్యంబుఁ గరతలామలక మగున్. 482**

**ప్రతి :** ఈ; కథన్= కథను; చదివినవారలున్= చదివినవారూ; కైకొని= స్వీకరించి; వినువారు= విన్నవారూ; విగత= పోగొట్టుకొన్న; కలుష+ఆత్మకులు+ఐ= పాపపుమనస్సుకలవారై; లౌకికసౌఖ్యమున్= ప్రాపంచిక సౌఖ్యాన్ని; ఒందుదురు= పొందుతారు; కైవల్యంబున్= మోక్షం కూడా; కరతల+ఆమలకము+అగున్= (అరచేతిలోని ఉసిరిక కాయవలె) సులభం అవుతుంది.

**తా :** ఈ కథను చదివినవారూ, విన్నవారూ పాపాలను పోగొట్టుకొని, ఈ లోకంలో సుఖాన్నీ, పిదప కైవల్యాన్నీ కూడా సులభంగా పొందుతారు.

## ✤ బలరాముండు సుహృద్బంధుజన దర్శనార్థమై వ్రేపల్లెకుఁ బోవుట ✤

**సీ. నరనాథ! విను మొకనాఁడు తాలాంకుండు చుట్టాల బంధులఁ జూచువేడ్క**
**సుందరకాంచనస్యందనారూఢుఁడై, భాసిల్లుచున్న వ్రేపల్లె కరిగి**
**చిరకాలసంగతస్నేహులై గోపగో, పాంగనానికర మాలింగనములు**
**సముచితసత్కృతుల్ సలుపఁ గైకొని మహో, త్సుకలీల నందయశోదలకును**
**తే. వందనం బాచరించిన వారు మోద, మంది బిగియారఁ గౌఁగిళ్ల నొందఁ జేర్చి**
**సమత దీవించి యంకపీఠమునఁ జేర్చి, శిరము మూర్కొని చుబుకంబుఁ గరము పుణికి. 483**

**ప్రతి :** నరనాథ! = రాజా!; వినుము= విను; ఒకనాడు= ఒకరోజు; తాల+అంకుఁడు= జెండాపై తాటిచెట్టుబొమ్మ గలవాడైన బలరాముడు; చుట్టాలన్= చుట్టాలను; బంధులన్= బంధువులను; చూచు= చూడాలనే; వేడ్కన్= కోరికతో; సుందర= అందమైన; కాంచన= బంగారు; స్యందన+ఆరూఢుఁడు+ఐ= రథం ఎక్కినవాడై; భాసిల్లుచున్+ఉన్న= ప్రకాశిస్తున్న; వ్రేపల్లెకున్= వ్రేపల్లెకు (గొల్లపల్లెకు); అరిగి= వెళ్ళి; చిరకాలసంగతస్నేహులు+ఐ= చాలకాలం కలిసిన స్నేహం కలవారై; గోప= గోపాలకుల; గోప+అంగన= గోపికల; నికరము= సమూహం; ఆలింగనములు= కౌగిలింతలు; సముచిత= తగిన; సత్+కృతులు= గౌరవాలు; సలుపన్= చేయగా; కైకొని= స్వీకరించి; మహా+ఉత్సుకలీలన్= గొప్ప సంతోషంతో; నందయశోదలకున్= నందునికి యశోదకు; వందనంబు+ఆచరించినన్= నమస్కారం చేయగా; వారు= ఆ నందయశోదలు; మోదము+అంది= ఆనందం పొంది; బిగియారన్= గాఢమైన; కౌగిళ్ళన్+ఒందన్+చేర్చి= కౌగిళ్లలోనికి తీసుకొని; సమతన్= తగినవిధంగా; దీవించి= ఆశీర్వదించి; అంకపీఠమునన్+చేర్చి= తొడపై చేర్చుకొని; శిరము= తల; మూర్కొని= ఆఘ్రాణించి; చుబుకంబున్= గడ్డాన్ని; కరము పుణికి= మిక్కిలి తడిమి...

**తా :** ఓ ప్రభూ! బలరాముడు స్నేహితుల్ని, బంధువుల్ని చూడాలనే కోరికతో వ్రేపల్లెకు వెళ్ళాడు. అక్కడ ఉన్న చిరకాలస్నేహితులైన గోపాలకుల్నీ, గోపికల్నీ కలిశాడు. వారూ బలరామునికి సముచితమర్యాదలు చేశారు. బలరాముడు నందయశోదలను చేరి వారికి నమస్కరించాడు. బలదేవుణ్ణి ఆప్యాయంగా దగ్గరకు తీసుకొని సంతోషంతో కౌగిళ్లలో చేర్చుకొని, దీవించి, తొడపై కూర్చుండబెట్టుకొని, తల మూర్కొని, గడ్డం పుణికి

**వ. మఱియు నానందబాష్పధారాసిక్తకపోలయుగళంబులతోడం గుశలప్రశ్నంబుగా నిట్లని రన్నా! నీవును నీ చిన్నతమ్ముండగు వెన్నుండును లెస్సయున్నవారె? మమ్మెప్పుడు నరసి రక్షింపవలయు, మాకు నేడుగడయ మీరు కాక యొరులు గలరే? యని సముచితసంభాషణంబులం బ్రొద్దుపుచ్చు చుండి రంత. 484**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ఆనందబాష్పధారా= సంతోషంతో కూడిన కన్నీటి ప్రవాహంతో; సిక్త= తడిసిన; కపోలయుగళంబులతోడన్= రెండు చెక్కిళ్ళతోనూ; కుశలప్రశ్నంబు+కాన్= క్షేమ సమాచారాలను అడుగగా; ఇట్లు= ఈ విధంగా; అనిరి= చెప్పారు; అన్నా!; నీవును= నీవూ; నీ= నీయొక్క; చిన్నతమ్ముండు+అగు= నీ చిన్నతమ్ముడైన; వెన్నుండును= కృష్ణుడూ; లెస్స= క్షేమంగా; ఉన్నవారె?= ఉన్నారా?; మమ్మున్= మమ్మల్ని; ఎపుడున్= ఎల్లపుడును; అరసి= గమనించి; రక్షింపవలయున్= కాపాడాలి; మాకున్= మాకు; ఏడుగడయు= రక్షకులు (శరణం); మీరు= మీరు; కాక= కాకుండ; ఒరులు= ఇతరులు; కలరు+ఏ+అని= ఉన్నారా అని; సముచిత= తగినట్లు; సంభాషణంబులన్= మాటలచే; ప్రొద్దుపుచ్చుచుండిరి= కాలం గడుపుతూండిరి; అంతన్= అంతట...

**తా :** ఆ నందయశోదలు బలరాముణ్ణి కుశలప్రశ్నలు అడుగుతూ, మమ్మల్ని మీరే కాపాడాలి. మీరు కాక మా రక్షణకు వేరెవరు ఉన్నారు? అని తమ విషయాలను చెపుతూ కాలక్షేపం చేశారు.

**క. గోపాలవరులు ప్రమదం, బాపోవని మది నివర్తితాఖిలగేహ**
**వ్యాపారు లగుచు హలధరు, శ్రీపాదంబులకు నతులు సేసిరి వరుసన్. 485**

**ప్రతి :** గోపాలవరులు= గోపాలకముఖ్యులు; నివర్తిత= వదలిన; అఖిల= సమస్తమైన; గేహ= ఇంటికి సంబంధించిన; వ్యాపారులు+అగుచున్= కార్యాలు కలవారవుతూ; ప్రమదంబు= సంతోషంతో; ఆపోవని= తృప్తిపొందని; మదిన్= మనస్సుతో; హలధరు= బలరామునియొక్క; శ్రీపాదంబులకున్= మంగళకరమైన పాదాలకు; వరుసన్= క్రమంగా; నతులు= నమస్కారాలు; చేసిరి= చేశారు.

**తా :** వ్రేపల్లెలోని గోపాలకులు తమగృహకార్యాలను కూడా వదలిపెట్టి, తృప్తి పొందని మనస్సుతో బలరాముని పాదాలకు వరుసగా నమస్కరించారు.

**క. సీరియు వారికిఁ గరుణో, దారుండై నడపె సముచితక్రియ లంతం**
**గోరి తనయీడు గోప కు, మారులఁ జే చఱచి బలుఁడు మందస్మితుఁడై. 486**

**ప్రతి :** సీరియు= నాగలి ఆయుధంగా ధరించే బలరాముడూ; వారికిన్= ఆ గోపాలకులకు; కరుణా+ఉదారుఁడు+ఐ= కనికరంతో గొప్పవాడై; సముచితక్రియలన్= సమయోచితాలైన మర్యాదల్ని; నడపెన్= నిర్వహించాడు; అంతన్= అంతట; కోరి; తన; ఈడు= వయస్సుకల; గోపకుమారులన్= గోపాలకుల్ని; బలుఁడు= బలరాముడు; చేచఱచి= చేతిలో చేతినుంచి; మందస్మితుఁడు+ఐ= చిరునవ్వుతో కూడినవాడై...

**తా :** బలరాముడు కూడా వారికి సముచిత మర్యాదల్ని చేశాడు. తన వయస్సు కల గోపాలకులను చిరునవ్వుతో చేతితో తట్టి పలుకరించాడు.

**క. నిజసుందర దేహద్యుతి, రజతాచలరుచులఁ దెగడ రాముఁడు వారల్**
**భజియింప నేగి యొకచో, విజనస్థలమున వసించి విలసిల్లు నెడన్. 487**

**ప్రతి :** రాముఁడు= బలరాముడు; నిజ= తన; సుందర= మనోహర; దేహ= శరీరంయొక్క; ద్యుతి= కాంతి; రజత+అచల= వెండికొండయొక్క; రుచులన్= కాంతుల్ని; తెగడన్= ధిక్కరించగా; వారల్= స్నేహితులు; భజియింపన్= సేవిస్తుండగా; ఏగి= వెళ్ళి; ఒకచోన్= ఒకచోట; విజనస్థలమునన్= జనం లేనిచోట; వసించి= ఉండి; విలసిల్లు+ఎడన్= ప్రకాశించే సమయంలో...

**తా :** బలరాముడు తన శరీరకాంతి వెండికొండ కాంతుల్ని ధిక్కరిస్తూండగా స్నేహితులతో కలిసి ఏకాంత స్థలానికి వెళ్ళి, ఉండగా

**కవిరాజ విరాజితము**

**చరణములం గనకస్ఫుటనూపురజాలము గల్లనుచుం జెలఁగం**
**గరములఁ గంకణముల్ మొరయన్ నలి కౌ నసియాడఁ గుచాగ్రములన్**

**సరులు నటింపఁ గురుల్ గునియన్ విలసన్మణి కుండలకాంతులు వి**
**స్ఫురితకపోలములన్ బెరయన్ వ్రజసుందరు లంద అమందగతిన్.** **488**

**ప్రతి :** చరణములన్= పాదాల్లో; కనకస్ఫుట= స్పష్టమైన బంగారుయొక్క; నూపుర= అందెల; జాలము= సమూహం; గల్+అనుచున్= ఘల్ అంటూ; చెలఁగన్= విజృంభించగా; కరములన్= చేతులకున్న; కంకణముల్= కడియాలును; మొరయన్= ధ్వనిస్తుండగా; నలికౌను= సన్నని నడుం; అసియాడన్= వణకగా; కుచ+అగ్రములన్= స్తనాలపై; సరులు= మెడలోని హారాలు; నటింపన్= అల్లల్లాడుతుండగా; కురులు= శిరోజాలు; కునియన్= కదలాడుతుండగా; విలసత్= ప్రకాశిస్తున్న; మణికుండల= మణికుండలాలయొక్క; కాంతులు= కాంతులు; విస్ఫురిత= ప్రకాశించే; కపోలములన్= చెక్కిళ్ళపై; పెరయన్= వ్యాపిస్తుండగా; వ్రజసుందరుల్= గోపికలు; అందఱున్= అందరూ; అమందగతిన్= వేగంగా...

**తా :** పాదాలకున్న బంగారు కడియాలు ఘల్లుమని శబ్దం చేస్తుండగా, చేతులకున్న కంకణాలు శ్రావ్యంగా ధ్వనిస్తుండగా, సన్నని నడుం వణకుతూండగా, స్తనాలపై కంఠహారాలు నాట్యం చేస్తుండగా, శిరోజాలు కదలాడుతుండగా, మణికుండలకాంతులు చెక్కిళ్ళపై వ్యాపిస్తుండగా గోపికలందరూ వేగంగా

**కవిరాజవిరాజితము**

**చని బలభద్రుని శౌర్యసముద్రుని సంచితపుణ్యు నగణ్యునిఁ జం**
**దనఘనసారపటీరతుషారసుధారుచికాయు విధేయు సుధా**
**శనరిపుఖండను సన్మణిమండను సారవివేకు నశోకు మహా**
**త్మునిఁ గని గోపిక లోపిక లేక యదుప్రభు నిట్లని రుత్కలికన్.** **489**

**ప్రతి :** గోపికలు= గోపస్త్రీలు; చని= వెడలి; శౌర్యసముద్రునిన్= పరాక్రమంలో సముద్రునివంటివాణ్ణి (తరగని శౌర్యం కలవాడు); సంచితపుణ్యున్= పుణ్యాల ప్రోవైనవాణ్ణి; అగణ్యునిన్= లెక్కింపశక్యంకానివాణ్ణి; చందన= గంధంవలె; ఘనసార= కర్పూరంవలె; పటీర= చందనంవలె; తుషార= మంచువలె; సుధారుచికాయున్= అమృతంవలె తెల్లని కాంతికలవాణ్ణి; విధేయున్= వినయం కలిగినవాణ్ణి; సుధా+అశన+రిపుఖండనున్= దేవతలకు శత్రువులైన రాక్షసుల్ని సంహరించినవాణ్ణి; సద్+మణి= మంచి మణులచేత; మండనున్= అలంకరింపబడేవాణ్ణి; సార= యోగ్యతకల; వివేకున్= జ్ఞానిని; అశోకున్= దుఃఖం లేనివాణ్ణి; మహా+ఆత్మునిన్= మహాపురుషుడైనవాణ్ణి; బలభద్రునిన్= బలరాముణ్ణి; కని= చూచి; ఓపికలేక= ఓర్పుకోల్పోయి; ఉత్కలికన్= ఉత్కంఠతో; యదుప్రభున్= యాదవులకు రాజైన; ఇట్లు+అనిరి= ఈ విధంగ చెప్పారు.

**తా :** ఆ విధంగా వెడలి శౌర్యసముద్రుడు, సంచితపుణ్యుడు, అగణ్యుడు, చందన, ఘనసార, పటీర, తుషార, సుధారుచికాయుడు, వినయం కలిగినవాడు, రాక్షసుల్ని సంహరించినవాడు, మణులతో అలంకరించుకొనేవాడు, జ్ఞాని, వివేకి, దుఃఖంలేనివాడు అయిన బలరాముణ్ణి చూచి ఓర్పు నశించి కోరికతో ఇలా అన్నారు.

**చ.** **'హలధర! నీ సహోదరుఁ డుదంచితకంజవిలోచనుండు స**
**ల్లలితపురాంగనాజనవిలాసవిహారసమగ్రసౌఖ్యముల్**
**గలిగి సుఖించునే? మము నొకానొక వేళనయేని బుద్ధిలోఁ**
**దలఁచునొ? నూతనప్రియలఁ దార్కొని యేమియుఁ బల్కకుండునో?** **490**

**ప్రతి :** హలధర!= బలరామా!; నీ= నీయొక్క; సహ+ఉదరుఁడు= సోదరుడగు కృష్ణుడు; ఉత్+అంచిత= మిక్కిలి ఒప్పిదమైన; కంజ విలోచనుఁడు= పద్మాలవంటి కన్నులు గలవాడు; సత్+లలిత= లెస్స అయిన, మనోహరమైన; పుర+అంగనా+జన= నగరంలోని స్త్రీలయొక్క; విలాస= శృంగార క్రీడలతో కూడిన; విహార= వినోద సంచారాలతో; సమగ్ర= అన్నీ; సౌఖ్యముల్= సుఖాల్ని; కలిగి= పొంది; సుఖించున్+ఏ?= ఆనందిస్తున్నాడా?; ఒక+ఒక= ఒకానొక; వేళను+అ+ఏనిన్= ఏదో ఒక సమయంలోనైనా; మమున్= మమ్మల్ని; బుద్ధిలోన్= మనస్సులో; తలఁచున్+ఒ= తలచుకొంటున్నాడా?; నూతనప్రియలన్= కొత్త ప్రియరాండ్రను; తార్కొని= పొంది; ఏమియున్= ఏమీ; పల్కక+ఉండున్+ఓ= మాట్లాడకున్నాడా?

**తా :** నీ సోదరుడు, పద్మనేత్రుడు అగు కృష్ణుడు నగరస్త్రీలతో విహరిస్తూ సుఖంగా ఉన్నాడా? ఎప్పుడైనా మమ్మల్ని మనస్సులో తలుస్తున్నాడా? లేకక్రొత్త ప్రియురాండ్రతో కూడి ఏమీ మాట్లాడక ఊరకున్నాడా?

**క. జననీజనకుల ననుజులఁ, దనుజుల బంధువుల మిత్రతతుల విడిచె నె**
**మ్మనమున నొండు దలంపక, తను నమ్మినవారి విడువఁ దగునే హరికిన్? 491**

**ప్రతి :** జననీజనకులన్= తల్లిదండ్రులనూ; అనుజులన్= సోదరులనూ; తనుజులన్= కుమారులనూ; బంధువులన్= బంధువులనూ; మిత్ర= మిత్రుల; తతులన్= సమూహాన్నీ; విడిచెన్= విడిచిపోయాడు; నెఱ+మనమునన్= నిండు మనస్సులో; ఒండు తలంపక= వేరే ఆలోచింపక; తనన్= తనను; నమ్మినవారిన్= నమ్మినవారిని; విడువన్= విడుచుట; హరికిన్= కృష్ణునికి; తగున్+ఏ= సముచితమేనా?

**తా :** తల్లిదండ్రుల్ని, సోదరుల్ని, కుమారుల్ని, బంధువుల్ని, మిత్రుల సమూహాన్నీ మనస్సులోకూడా అనుకోకుండా తనను నమ్మినవారిని శ్రీకృష్ణుడు వదలిపెట్టవచ్చునా?

**సీ. సలలితయామునసైకతస్థలమున, నుండ మ మ్మేమని యూఱడించె**
**విమలబృందావనవీథి మా చుబుకముల్, పుణుకుచు నే మని బుజ్జగించెఁ**
**బుష్పవాటికలలోఁ బొలుచు మా కుచయుగ్మ, మంటుచు నే మని యాదరించెఁ**
**గాసారముల పొంతఁ గౌఁగిట మముఁ జేర్చి, నయమొప్ప నే మని నమ్మఁ బలికె**

**తే. నన్నియు మఱచెఁ గాఁబోలు వెన్నుఁ డాత్మఁ, గోరి తా జాయలున్నైన వారి విడుచు**
**నట్టి కృష్ణుఁడు దము ఱట్టు వెట్టు ననక, యేల నమ్మిరి పురసతుల్ బేల లగుచు. 492**

**ప్రతి :** వెన్నుఁడు= కృష్ణుడు; సలలిత= మనోజ్ఞమైన; యామున= యమునానదియొక్క; సైకతస్థలమునన్+ఉండన్= ఇసుక తావులో ఉండగా; మమ్మున్= మమ్మల్ని; ఏమి+అని= (ఏమని); ఊరడించెన్= బుజ్జగించాడు!; విమల= స్వచ్ఛమైన; బృందావనవీథిన్= బృందావన ప్రదేశాల్లో; మా= మాయొక్క; చుబుకముల్= చెక్కిళ్ళు; పుణుకుచున్= తాకుతూ; ఏమి+అని= ఏ విధంగా; బుజ్జగించెన్= ఊరడించాడు!; పుష్పవాటికలలోన్= ఉద్యానవనాలలో; పొలుచు= ఒప్పునట్టి; మా= మాయొక్క కుచయుగ్మమున్= స్తనద్వయాన్ని; అంటుచున్= తాకుతూ; ఏమి+అని= ఏ విధంగా; ఆదరించెన్= గౌరవించాడు!; కాసారముల+పొంతన్= కోనేర్ల సమీపంలో; కౌగిటన్= కౌగిట్లో; మమున్= మమ్ముల్ని; చేర్చి= తీసుకొని; నయము+ఒప్పన్= నేర్పుగా; ఏమి+అని= ఏమని; నమ్మన్+పలికెన్= నమ్మిక కలుగునట్లుగా మాట్లాడాడు; అన్నియున్= ఈ విషయాల నన్నింటిని; మఱచెన్= మరచిపోయాడు; కాన్+పోలున్= కాబోలు!; ఆత్మన్+కోరి= మనసారాకోరి; తాన్= తాను; జాయలున్=

భార్యలుగా; అయినవారిని= అయినట్టివారిని కూడా; విడుచున్+అట్టి= వదులునట్టి; కృష్ణుఁడు= కృష్ణుడు; తమున్= తమను; ఱట్టువెట్టున్+అనక= అల్లరిపెట్టునని అనుకొనక; పురసతుల్= పురకాంతలు; బేలలు+అగుచున్= అమాయకలయి; ఏల= ఎట్లు; నమ్మిరి= విశ్వసించారో కదా!

**తా :** బలరామా! యమునానది ఇసుకతావుల్లో మమ్మల్ని ఏ రీతిగా బుజ్జగించాడు? బృందావనానికి వెళ్ళే త్రోవలో మా చెక్కిళ్ళు స్పృశిస్తూ ఎంతగా ఊరడించాడు? పుష్పోద్యానవనాలలో కన్పిస్తే మా స్తనాల్ని స్పృశిస్తూ ఎంతగా ఆదరించాడు? సరోవరాల చెంత మమ్మల్ని కౌగిటిలోకి తీసుకొని నమ్మిక కలిగేట్లు ఎంతగా నమ్మపలికాడు? కృష్ణుడు వీని నన్నింటిని మరచిపోయాడు కాబోలు! భార్యలైనవారిని కూడా విడిచిపెట్టేవాడు కృష్ణుడు. నగర కాంతలు అమాయకులై కృష్ణుణ్ణి ఏ విధంగా విశ్వసించి మోసపోయారో?

**మ. అని యిబ్భంగి సరోజలోచనుని నర్మాలాపముల్ నవ్వులు**
**న్ననుబంధుల్ పరిరంభణంబులు రతివ్యాసంగముల్ భావముల్**
**వినయంబుల్ సరసోక్తులుం దలఁచి యుబ్బిళ్ళూరుచిత్తంబులన్**
**జనితానంగశరాగ్నిచేత దురవస్థం బొంది శోకించినన్. 493**

**ప్రతి :** అని; ఈ+భంగిన్= ఈ విధంగా; సరోజలోచనుని= శ్రీకృష్ణునియొక్క; నర్మ+ఆలాపముల్= పరిహాసపు మాటలు; నవ్వులున్= నవ్వులు; అనుబంధుల్= అనుసరించడాలు; పరిరంభణంబులు= కౌగిలింతలు; రతివ్యాసంగముల్= రతికార్యాలు; భావముల్= ఊహలు; వినయంబుల్= వినయాలు; సరస+ఉక్తులు= సరసపుమాటలు; తలఁచి= తలచికొని; ఉబ్బిళ్ళూరు= తహతహపడే; చిత్తంబులన్= మనస్సులతో; జనిత+అనంగ+శర+అగ్నిచేతన్= మన్మథబాణాలవల్ల పుట్టిన అగ్నిచే (మన్మథ తాపంచేత); దుర్+అవస్థను= కష్టదశను; పొంది; శోకించినన్= దుఃఖించగా...

**తా :** గోపికలందరు శ్రీకృష్ణుని పరిహాసపూర్వకాలైన మాటల్ని, నవ్వుల్ని, కౌగిలింతల్ని, రతికార్యాలను, భావాలను, వినయాల్ని, సరసపు మాటల్ని తలచుకొని తహతహపడే మనస్సులతో మన్మథబాణాలవల్ల కలిగే కష్టాలనూ తలచుకొని దుఃఖించగా

**వ. అంత బలభద్రుండు వారలమనంబుల సంతాపంబులు వారింప నుపాయంబు లగు సరసచతుర వచనంబులఁ గృష్ణునిసందేశంబులు సెప్పి విగతఖేదలం జేసి యచ్చట మాసద్వయంబు నిలిచి వసంతవాసరంబులు గడపుచుఁ గాళిందీతీరంబున. 494**

**ప్రతి :** అంతన్= అంతట; బలభద్రుండు= బలరాముడు; వారల= గోపికలయొక్క; మనంబులన్= మనస్సుల్లో; సంతాపంబులు= బాధలు; వారింపన్= పోగొట్టేందుకు; సరసచతురవచనంబులన్= ప్రేమతో కూడిన పరిహాసపుమాటలతో; కృష్ణుని సందేశంబులన్= కృష్ణునియొక్క సమాచారాన్ని; చెప్పి; విగతఖేదలన్+చేసి= పోయిన దుఃఖం కలవారుగాచేసి; అచ్చటన్= అక్కడ; మాసద్వయంబు= రెండునెలలు; నిలిచి= ఉండి; వసంతవాసరంబుల్= చైత్ర వైశాఖమాసపు దినాల్ని; కడపుచున్= కడపుతూ; కాళిందీతీరంబునన్= కాళిందీ నదీతీరంలో...

**తా :** అంతట బలరాముడు గోపికల మనసులోని దుఃఖాన్ని పరియాచకపుమాటలతోడను, కృష్ణునిసందేశాలను చెప్పడంతో పోగొట్టాడు. అక్కడ బలరాముడు రెండుమాసా లున్నాడు. వసంత కాలాన్ని కాళిందీ నదీతీరంలో గడుపుతూ

సీ. మాకందజంబీరమందారఖర్జూర, ఘనసారశోభితవనములందు
నేలాలతాలోలమాలతీమల్లికా, వల్లీమతల్లికావాటికలను
దరళతరంగశీకరసాధుశీతల, సైకతవేదికాస్థలములందు
మకరందరసపానమదవదిందిందిర, పుంజరంజితమంజుకుంజములను

తే. విమలరుచి గల్గు సానుదేశములయందు, లలితశశికాంతఘనశిలాతలములందు
లీల నిచ్ఛావిహారవిలోలుఁ డగుచు, సుందరీజనములు గొల్వఁ జూడ నొప్పె. 495

**ప్రతి :** మాకంద= తియ్యమామిడి చెట్లతో; జంబీర= నిమ్మచెట్లతో; మందార= మందారాలతో; ఖర్జూర= ఖర్జూరాలతో; ఘనసార= కర్పూరపు చెట్లతో; శోభిత= శోభించే; వనముల+అందున్= ఉద్యానవనాల్లో; ఏలాలతా= ఏలకి తీగలయొక్క; లోల= కదలాడే; మాలతీ మతల్లికా= శ్రేష్ఠమైన మాలతీ లతలయొక్క; మల్లికావల్లీ= మల్లెతీగలయొక్క; వాటికలను= తోటల్లో; తరళ= చలించే; తరంగ= అలలయొక్క; శీకర= తుంపురులచే; సాధు= మేలైన; శీతల= చల్లని; సైకత= ఇసుకయొక్క; వేదికాస్థలముల+అందున్= తిన్నెలలో; మకరంద= పూలతేనెయొక్క; రస= రసాన్ని; పాన= తాగుటతో; మదవత్= మదం కల్గిన (మత్తిర్లిన); ఇందిందిర= తుమ్మెదలయొక్క; పుంజ= సమూహంచే; రంజిత= శోభించే; మంజు= అందమైన; కుంజములను= పొదరిండ్లలో; విమలరుచి గల్గు= స్వచ్ఛమగు కాంతిగల; సానుదేశముల+అందున్= కొండచరియలలో; లలిత= సుకుమారమైన; శశికాంత= చంద్రకాంతా మణులయొక్క; ఘనశిలాతలముల+అందున్= గొప్పవగు శిలావేదికలపై; లీలన్= విలాసంగా; ఇచ్ఛావిహారలోలుఁడు+అగుచున్= స్వేచ్ఛగా సంచరించుటలో ఆసక్తి కలవాడవుతూ; సుందరీ జనములు= అందమగు స్త్రీలు; కొల్వన్= సేవిస్తుండగా; చూడన్+ఒప్పెన్= చూడతగి ఉన్నాడు.

**తా :** మామిళ్ళు, నిమ్మలు, మందారాలు, ఖర్జూరాలు, కర్పూరపు చెట్లతో శోభిల్లే ఉద్యానవనాల్లో, ఏలకీ తీగలచే, కదలాడే శ్రేష్ఠమైన మాలతీలతలచే, మల్లెతీగలచే ఒప్పుతూ, అందమైన పొదరిండ్లలోనూ, అలల తుంపురలచే చల్లనైన ఇసుక తిన్నెలపై, పూతేనెలరసం తాగి మత్తెక్కిన తుమ్మెదలతో నిండిన పొదరిండ్లలోనూ, స్వచ్ఛమైన కాంతికలిగిన కొండచరియల్లో చల్లని చంద్రకాంత శిలావేదికల మీదనూ స్వేచ్ఛగా సంచరించడంలో ఆసక్తి కలిగిన బలరాముణ్ణి సుందరీమణులు సేవించారు.

తే. అట్లు విహరింప వరుణునియాజ్ఞఁ జేసి, వారుణీదేవి మద్యభావంబు నొంది
నిఖిలతరుకోటరములందు నిర్గమించి, మించు వాసనచేత వాసించె వనము. 496

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; విహరింపన్= వేడుకతో తిరుగుతుండగా; వరుణుని; ఆజ్ఞన్+చేసి= ఆజ్ఞచేత; వారుణీదేవి= వారుణి అనే రసాధిదేవత; మద్యభావంబున్+ఒంది= మద్యరూపం పొంది; నిఖిల= అన్ని; తరు= చెట్లయొక్క; కోటరముల+ అందున్= తొర్రల్లోనుండి; నిర్గమించి= వెలువడి; మించు= ప్రకాశించే; వాసనన్= వాసనచేత; వనము= వనం; వాసించెను= పరిమళించింది.

**తా :** ఆ విధమైన వేడుకతో సంచరిస్తుండగా వరుణుని ఆజ్ఞతో వారుణి అనే రసాధిదేవత మద్యంయొక్క యథార్థరూపం పొందింది. అప్పుడు ఆ వనమంతా మద్యం వాసనలతో నిండింది.(బలరాముడు మద్యపాన ప్రియుడు)

వ. అట్టియెడ. 497

**ప్రతి :** అట్టి+ఎడన్= ఆ సందర్భంలో...

**మ.** **కర మొప్పారు నవీనవాసనల నాఘ్రాణించి గోపాలసుం**
**దరులుం దానును డాయనేగి యతిమోదం బొప్ప సేవించి యా**
**తరళాక్షుల్ మణిహేమకంకణఝుణత్కారానుకారంబులై**
**కరతాళంబులు మ్రోయఁ బాడుచును వేడ్క న్నాడుచున్ సోలుచున్. 498**

**ప్రతి :** కరము= మిక్కిలి;; ఒప్పారు= ఒప్పిదమైన; నవీన= కొత్త(ఘాటైన); వాసనలన్+ఆఘ్రాణించి= వాసనల్ని పీల్చి; గోపాలసుందరులున్= గోపాలకస్త్రీలూ; తానునున్= బలరాముడూ; డాయన్+ఏగి= దగ్గరికివెళ్ళి; అతి= మిక్కిలి; మోదంబు+ఒప్పన్= ఆనందం ఒప్పుతుండగా; సేవించి= మద్యంతాగి; ఆ; తరళ+అక్షుల్= (చంచలించే కండ్లు కలిగిన) స్త్రీలు; మణి= మణులతో; హేమ= బంగారంయొక్క; కంకణ= చేతికడియాల; ఝుణత్కార= ఝణంఝణ శబ్దాల్ని; అనుకార్యంబులు+ఐ= అనుకరించేవైన; కరతాళంబులు= చేతి దరువులు; మ్రోయన్= శబ్దించగా; పాడుచున్= పాడుతూ; వేడ్కన్= వేడుకతో; ఆడుచున్= ఆడుతూ; సోలుచున్= పరవశిస్తూ...

**తా :** ఆ సువాసనలు పీల్చి, బలరాముడూ, గోపాలకస్త్రీలూ వనందగ్గరికి వెళ్ళి మిక్కిలి ఆనందంతో ఆ మద్యాన్ని (కాదంబరి అనే మద్యాన్ని) సేవించి, స్త్రీలు మణులతో కూడిన బంగారపు చేతికడియాలు గల్గిన హస్తాలతో ఝణంఝణమ్మని తాళం వేస్తూ సవ్వడి చేస్తుండగా వేడుకతో ఆడుతూ, పాడుతూ పరవశిస్తూ

**సీ.** **తనమీఁది బిరుదాంకితములైన గీతముల్, వాడుచు రా బలభద్రుఁ డంత**
**మహితకాదంబరీమధుపానమదవిహ్వ, లాక్షుండు లలితనీలాలకుండు**
**నాలోలనవపుష్పమాలికోరస్థులుఁ, డనుపమమణికుండలాంచితుండు**
**ప్రాలేయసంయుక్తపద్మంబుగతి నొప్పు, సలలితాననఘర్మజలకణుండు**

**తే.** **నగుచు వనమధ్యమున సలిలావగాహ, శీలుఁడై జలకేళికిఁ జేరి యమున**
**నిందు రమ్మని పిలువఁ గాళింది యతని, మత్తుఁ డని సడ్డసేయక మసలుటయును. 499**

**ప్రతి :** తనమీది= తనపైనగల; బిరుద+అంకితములు+ఐన= పౌరుషం, పరాక్రమం, శౌర్యం వివరించే; గీతముల్= పాటలు; పాడుచున్= పాడుతూ; రాన్= రాగా; బలభద్రుఁడు= బలరాముడు; అంతన్= అంతట; మహిత= ఒప్పిదమైన; కాదంబరీ= కదంబపుష్పములనుండి తీసిన; మధుపాన= మద్యం తాగడంవల్ల కలిగే; మద= మత్తుచే; విహ్వల+ అక్షుఁడు= తేలిపోతున్న కండ్లు కలవాడు; లలిత= మనోహరమైన; నీల+అలకుండున్= నల్లనిముంగురులు కలవాడు; ఆలోల= కదలునట్టి; నవ= నూతనమైన; పుష్పమాలికా+ఉరస్+స్థలుడు= పుష్పమాలికలు ఎదమీదున్నవాడు; అనుపమ= సాటిలేని; మణికుండల+అంచితుండు= మణికుండలాలతో ఒప్పుతున్నవాడు; ప్రాలేయ= మంచుతో; సంయుక్త= కూడిన; పద్మంబుగతిన్= పద్మంవలె; ఒప్పు= ఒప్పుతు్న; సలలిత+ఆనన= మనోహరమయినముఖంపైగల; ఘర్మజలకణుండున్+ అగుచున్= చెమట బిందువులున్నవాడై; వనమధ్యమునన్= వనమధ్యభాగంలో; సలిల+అవగాహనశీలుఁడు+ఐ= నీటియందు స్నానం చెయ్యాలనే కోరిక కలవాడై; జలకేళికిన్= నీరాటకు; చేరి= చేరి; యమునన్= యమునానదిని; ఇందున్= ఇచ్చటికి; రమ్ము+అని= 'రా' అని; పిలువన్= పిలువగా; కాళింది= ఆ యమున; అతనిన్= ఆ బలరాముణ్ణి; మత్తుఁడు+అని= మదించినవాడని; సడ్డచేయక= లక్ష్యపెట్టక; మసలుటయును= ఆలస్యం చేయగా...

**తా :** గోపాలకస్త్రీలు బలరాముని పౌరుషాన్నీ, పరాక్రమాన్నీ, శౌర్యాన్నీ వర్ణించేగీతాలు పాడుతూ వచ్చారు. బలరాముడు – కదంబ పుష్పాల మద్యం(కాదంబరి) సేవించాడు, కళ్లు మత్తెక్కాయి, ముంగురులు మనోహరంగా కదలుతూ ఉన్నాయి. ఎదమీద పూలహారాలున్నాయి. చెవులకు మణికుండలాలున్నాయి. ముఖంపై చెమటపట్టింది. ఆయన జలకేళి చెయ్యాలనుకొన్నాడు. యమునను తనవద్దకే రమ్మని పిలిచాడు. మత్తులో ఉన్నవాడు పిలిస్తే నేను వెళ్లడమా అని యమున అతని మాట లెక్క చేయక ఆలస్యం చేయగా

**చ. ఘనకుపితాత్ముఁడై యమునఁ గన్గొని రాముఁడు వల్కెఁ డాయఁ జీ**
**రినఁ జనుదేక తక్కితి పురే! విను నిందఱుఁ జూడ మద్భుజా**
**సునిశితలాంగలాగ్రమున సొంపఱ నిప్పుడు నూఱుత్రోవలై**
**చన వెసఁ జించివైతు నని చండపరాక్రమ మొప్ప నుగ్రుఁడై. 500**

**ప్రతి :** రాముఁడు= బలరాముడు; ఘన= మిక్కిలి; కుపిత+ఆత్ముఁడు+ఐ= కోపించిన మనస్సుకలవాడై; యమునన్= యమునను; కన్+కొని= చూచి; డాయన్= దగ్గరగా రమ్మని; చీరినన్= పిలిస్తే; చనుదేక తక్కితి(వి)= రాక మానితివి; పురే= ఔరా!; విను= విను; ఇందఱున్= ఈ జనులందరూ; చూడన్= చూస్తుండగా; మత్= నా; భుజా= బాహువులయందలి; సునిశిత= వాడి అయిన; లాంగల= నాగలియొక్క; అగ్రమునన్= పైకొనతో; సొంపు+అఱన్= సొంపు చెడేటట్లు; ఇప్పుడు= ఇప్పుడే; నూఱుత్రోవలు+ఐ= వందపాయలై; చనన్= వెళ్ళేటట్లు; వెసన్= వేగంగా; చించివైతున్+అని= నిన్ను చీల్చివేస్తానని; చండ= తీవ్రమైన; పరాక్రమము= పరాక్రమం; ఒప్పన్= ఒప్పునట్లుగా; ఉగ్రుఁడు+ఐ= భయంకరుడై; పలికెన్= పలికాడు.

**తా :** బలరాముడు మిక్కిలి కోపంతో యమునను చూచి, నీవు నేను పిల్చినపుడు రాలేదు. కనుక ఇందరూ చూస్తుండగా నా నాగలికొనతో నీవు వందమార్గాలలో వెళ్ళేటట్లు చేస్తానని మిక్కిలి భయంకరాకారుఁడై పలికాడు.

**విశే :** బలరాముని ప్రగల్భోక్తులు మద్యపానమత్తులో వెలువడ్డాయి. బలరామునికి యమునాభేది అనే పేరు దీనివల్ల ఏర్పడింది.

**వ. అట్లు కట్టలుక రాము దుద్దామంబగు బాహుబలంబున హలంబు సాఁచి య మ్మహావాహినిం దగిల్చి పెకలిరాఁ దిగిచిన న న్నది భయభ్రాంతయై సుందరీరూపంబు గైకొని యతిరయంబునం జనుదెంచి, య య్యదువంశతిలకుండగు హలధరునిపాదారవిందంబులకు వందనం బాచరించి యిట్లనియె. 501**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; కడు+అలుకన్= మిక్కిలి కోపంతో; రాముఁడు= బలరాముడు; ఉద్దామంబు+అగు= అడ్డులేనిదైన; బాహుబలంబునన్= భుజశక్తితో; హలంబున్= నాగలిని; చాచి= ముందుకు చాచి; ఆ+మహావాహినిన్= ఆ మహానదిని; తగిల్చి= తగిలించి; పెకలిరాన్= పెల్లగిల్లి వచ్చేట్లు; తిగిచినన్= లాగగా; ఆ+నది= ఆ యమునానది; భయభ్రాంత+ఐ= భయంతోకూడిందై; సుందరీరూపంబున్= స్త్రీ ఆకారాన్ని; కైకొని= గ్రహించి; అతిరయంబునన్= మిక్కిలి వేగంగా, చనుదెంచి= వచ్చి; ఆ+యదువంశతిలకుండు+అగు= ఆ యదువంశశ్రేష్ఠుడైన; హలధరుని= నాగలిని ధరించినవాడగు బలరామునియొక్క; పాద+అరవిందములకున్= పాదపద్మాలకు; వందనంబు+ఆచరించి= నమస్కరించి; ఇట్లు+అనియెన్= ఇలా అంది.

**తా :** బలరాముడు తన మహా భుజశక్తిని ఉపయోగించి యమునానదిని ముందుకు తనవద్దకు వచ్చునట్లు నాగలిని చాచి, పెకలించి లాగాడు. అప్పుడు యమున భయపడి స్త్రీ రూపం పొంది, బలరామునికి నమస్కరించి ఇలా చెప్పింది.

**మ. 'బలరామా! ఘనబాహ! నీ యతులశుంభద్విక్రమం బంగనల్**
**దెలియం జాలెడివారె? యీ యఖిలధాత్రీభారధౌరేయ ని**
**శ్చలసత్త్వుండగు కుండలీశ్వరుఁడునుం జర్చింప నీ సత్కళా**
**కలితాంశప్రభవుండు! నీ గురుభుజాగర్వంబు సామాన్యమే? 502**

**ప్రతి :** ఘన= గొప్పవైన; బాహ= బాహువులుకలవాడా!; బలరామా= బలరాముడా!; నీ= నీయొక్క; అతుల= సాటిలేని; శుంభత్+విక్రమంబు= ప్రకాశించే పరాక్రమం; అంగనల్= స్త్రీలు; తెలియన్+చాలెడివారు+ఎ= తెలుసుకొనేశక్తి కలవారలా?; ఈ; అఖిలధాత్రిన్= సమస్త భూమియొక్క; భార= బరువును; ధౌరేయ= మోస్తూ; నిశ్చల= స్థిరమైన; సత్త్వుండు+అగు= శక్తికలవాడయిన; కుండలి+ఈశ్వరుండు= శేషుడును; చర్చింపన్= ఆలోచిస్తే; నీ= నీయొక్క; సత్+కళా+కలిత+అంశ= మంచికళలతో కూడిన అంశాలతో; ప్రభవుండు= జన్మించినవాడు; నీ= నీయొక్క; గురు= గొప్పవయిన; భుజా= చేతులయొక్క; గర్వంబు= పొగరు; సామాన్యము+ఏ= సామాన్యమా? (సామాన్యంకాదు)

**తా :** గొప్ప చేతులు కల బలరామా! నీ పరాక్రమాన్ని స్త్రీలు తెలిసికొనగలరా? ఈ సమస్త భూభారాన్ని వహిస్తున్న శేషుడు కూడా నీ అంశవల్ల కలిగినవాడే. నీ బాహువుల మదం సామాన్యమైందా? కాదుగదా!

**చ. అని వినుతించి యేను భవదంఘ్రిసరోజము లాశ్రయించెదన్**
**ననుఁ గరుణింపు మన్న యదునందనుఁ డన్నదిఁ బూర్వమార్గవై**
**చను మని కామినీనికరసంగతుఁడై జలకేళి సల్పె నిం**
**పెనయఁ గరేణుకాయుతమదేభము చాడ్పున నమ్మహానదిన్. 503**

**ప్రతి :** అని= ఇట్లు; వినుతించి= పొగడి; ఏను= నేను; భవత్+అంఘ్రిసరోజములు= మీ పాదపద్మాల్ని; ఆశ్రయించెదన్= ఆశ్రయిస్తాను; ననున్= నన్ను; కరుణింపుము= కనికరించు; అన్నన్= అనగా; యదునందనుఁడు= యాదవ కుమారుడగు బలరాముడు; ఆ+నదిన్= ఆ నదిని; పూర్వమార్గవు+ఐ= తూర్పుకు వెళ్ళే పూర్వమార్గంలోనే; చనుము= వెళ్ళు; అని; కామినీనికర= స్త్రీల సమూహంతో; సంగతుఁడు+ఐ= కలిసినవాడై; ఇంపు+ఎనయన్= సొగసొప్పగా; కరేణుకాయుత= ఆడ ఏనుగులతో కూడిన; మద+ఇభము చాడ్పునన్= మదించిన పోతుటేనుగువలె; ఆ+మహానదిన్= ఆ యమునలో; జలకేళి= స్నానం; సల్పెన్= చేశాడు.

**తా :** యమున బలరాముణ్ణి స్తుతించి, మీపాదపద్మాల్ని ఆశ్రయిస్తున్నాను. నన్ను కనికరించు అని కోరింది. నీవు నీ తూర్పుమార్గంలో వెళ్ళు అని చెప్పి, గోపాంగనలతో కలసి బలరాముడు యమునలో స్నానమాడాడు.

**తే. అంత జలకేళి సాలించి సంతసంబు, నందుచుండ వినీలవస్త్రాదిరత్న**
**మండనంబులుఁ గాంచనమాలికయును, దెచ్చి హరి కిచ్చి చనె నా నదీలలామ. 504**

**ప్రతి :** అంతన్= అంతట; జలకేళిన్= జలక్రీడను; చాలించి= పూర్తి కావించి; సంతసంబును+అందుచున్+ఉండన్= సంతోషిస్తూ ఉండగా; ఆ నదీలలామ= ఆ యమునానది అనే స్త్రీ; వినీలవస్త్ర+ఆది= వినీలవర్ణవస్త్రాలు మున్నగు;

రత్నమండనంబులున్= రత్నాలంకారాల్నీ; కాంచనమాలికయును= బంగారపుహారాల్నీ; తెచ్చి= తీసుకొనివచ్చి; హరికిన్+ఇచ్చి= బలరామునికి ఇచ్చి; చనెన్= వెళ్లింది.

**తా :** జలక్రీడ ముగించి సంతోషంతో ఉండే బలరామునికి నీలపువస్త్రాలు, రత్నాలంకారాలు, బంగారపుహారాలు, యమునాదేవి తీసుకొనివచ్చి ఇచ్చింది.

**క. అవి యెల్లఁ దాల్చి హలధరుఁ, డవిరళగతి నొప్పి వల్లవాంగనలును దా**
**దివిజేంద్రుఁ బోలి మహితో, త్సవమున వర్తించుచుండె సౌఖ్యోన్నతుఁడై. 505**

**ప్రతి :** అవి+ఎల్లన్+తాల్చి= వాటిని అన్నింటినీ ధరించి; హలధరుఁడు= బలరాముడు; అవిరళగతిన్= అడ్డులేని విధంగా; ఒప్పి; దివిజ+ఇంద్రున్= దేవేంద్రుణ్ణి; పోలి= అనుకరిస్తూ; సౌఖ్య+ఉన్నతుఁడు+ఐ= ఉన్నత సౌఖ్యాధిక్యంకలవాడై; మహిత+ఉత్సవమునన్= గొప్ప సంతోషంతో; వల్లవ+అంగనలును= గోపాలకస్త్రీలూ; తానును= తానూ; వర్తించుచున్+ఉండెన్= సంచరిస్తూ ఉన్నాడు.

**తా :** బలరాముడు యమున ఇచ్చిన వస్త్రాల్ని; రత్నహారాల్ని; బంగారపు హారాల్ని ధరించి దేవేంద్రునివలె ప్రకాశిస్తూ గోపస్త్రీలతో మహోత్సవంలో మునిగి తేలాడు.

**క. అవనీశ! యిట్లు హలమునఁ, దివిచినఁ గాళింది వ్రయ్య దెలియఁగ నేఁడున్**
**భువి నుతి కెక్కెను రాముని, ప్రవిమలతరమైన బాహుబలసూచకమై. 506**

**ప్రతి :** అవనీశ= రాజా!; ఇట్లు= ఈ విధంగా; హలమునన్= నాగలితో; తివిచినన్= లాగితే; కాళింది= యమునా నదియొక్క; వ్రయ్య= చీలిక; తెలియన్+కన్= తెలుసుకొనేందుకు; నేడును= నేడు కూడా; రాముని= బలరాముని; ప్రవిమలతరము+ఐన= మిక్కిలిస్వచ్ఛమైన; బాహుబలసూచకము+ఐ= భుజబలాన్ని సూచించేదై; భువిన్= భూమిమీద; నుతికిన్+ఎక్కెను= పొగడ్తకెక్కింది.

**తా :** ఈ విధంగా నాగలితో ఏర్పడిన యమునానది చీలిక నేటికీ బలరాముని స్వచ్ఛమైన బాహుబలపరాక్రమానికి గుర్తుగా మిగిలి ఉంది.

**వ. అంత బలభద్రుండు వ్రజసుందరీసమేతుండై నందఘోషంబునం బరితోషంబు నొందుచుండె, నంత నక్కడఁ గరూశాధిపతియైన పౌండ్రకుండు తనదూతం బిలిచి యిట్లనియె. 507**

**ప్రతి :** అంతన్= ఆ తరువాత; బలభద్రుండు= బలరాముడు; వ్రజసుందరీసమేతుండు+ఐ= గోపాంగనలతో కూడినవాడై; నంద= నందునియొక్క; ఘోషంబునన్= గొల్లపల్లెలో; పరితోషంబున్= సంతోషాన్ని; ఒందుచున్+ఉండెన్= పొందుతూ ఉన్నాడు; అంతన్= తరువాత; అక్కడన్= అచట (ద్వారకానగరంలో); కరూశ+అధిపతి+ఐన= కరూశదేశపు రాజైన; పౌండ్రకుండు= పౌండ్రకుడు; తన= తనయొక్క; దూతన్+పిలిచి= రాయబారిని పిలిచి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** బలరాముడు గోపస్త్రీలతో గొల్లపల్లెలో సంతోషంగా ఉన్నాడు. అచ్చట ద్వారకలో – కరూశాధిపతియైన పౌండ్రకవాసుదేవుడు తనరాయబారిని పిలిచి ఇలా అన్నాడు.

## ❖ కృష్ణుండు పౌండ్రకవాసుదేవునిమీఁద దండెత్తిపోయి వానిం జంపుట ❖

సీ. మనుజేశ! బలగర్వమున మదోన్మత్తుఁడై, యవనిపై వాసుదేవాఖ్యుఁ డనఁగ
నే నొక్కరుఁడ గాక యితరుల కీ నామ, మలవడునే? యని యదటు మిగిలి
తెగి హరి దా వాసుదేవుఁడ ననుకొను, నఁట! పోయి వలదను మనుచు దూతఁ
బద్మాయతాక్షుని పాలికిఁ బొమ్మన, నరిగి వాఁ డంబుజోదరుఁడు పెద్ద

తే. కొలువుఁ గైకొని యుండ సంకోచపడక, వినుము మా రాజుమాటగా వనజనాభ!
యవని రక్షింప వాసుదేవాఖ్య నొంది, నట్టి యే నుండ సిగ్గు వోఁదట్టి నీవు. 508

ప్రతి : మనుజ+ఈశ= ఓ రాజా!; పరీక్షిన్మహారాజా!; బలగర్వమునన్= బలంవల్ల కలిగిన పొగరుచే; మద+ఉన్మత్తుఁడు+ఐ= పిచ్చివాడై; అవనిపైన్= భూమిమీద; వాసుదేవ+ఆఖ్యుఁడు+అనన్+కన్= వాసుదేవుడనే పేరుకలవాడుగా; నేన్+ఒక్కరుఁడన్+కాక= నేను ఒక్కడినే కాక; ఇతరులకున్= పరులకు; ఈ పేరు; అలవడున్+ఏ?= తగునా?; అని= అంటూ; అదటు మిగిలి= గర్వం మీరి; తెగి= సాహసించి; హరి= కృష్ణుడు; తాన్= తాను; వాసుదేవుఁడన్+అనుకొనున్+అఁట= వాసుదేవుడను అని అనుకొంటున్నాడట!; పోయి= వెళ్ళి; వలదు+అనుము= అనుకోవద్దని చెప్పు; అనుచున్= అంటూ; దూతన్= రాయబారిని; పద్మ+ఆయత+అక్షుని= పద్మాలవంటి నేత్రాలు కల కృష్ణుని; పాలికిన్= దగ్గరకు; పొమ్ము+అనన్= వెళ్ళుము అనగా; అరిగి= వెళ్ళి; వాఁడు= ఆ రాయబారి; అంబుజ+ఉదరుఁడు= పద్మనాభుడైన కృష్ణుడు; పెద్దకొలువున్= గొప్పరాజసభను; కైకొని+ఉండన్= తీర్చి ఉండగా; సంకోచపడక= జంకకుండా; వనజనాభ!= ఓ కృష్ణా!; మా రాజుమాటగా= మా ప్రభువగు పౌండ్రకవాసుదేవుని మాటగా; విను; అవనిన్= భూమిని; రక్షింపన్= కాపాడేందుకు; వాసుదేవ+ఆఖ్యన్= వాసుదేవుడనే పేరును; ఒందిన+అట్టి= గ్రహించినట్టి; ఏన్+ఉండన్= నేను ఉండగా; సిగ్గు= సిగ్గును; పోన్+తట్టి= విడిచిపెట్టి; నీవు...

**తా :** పౌండ్రక వాసుదేవుడు బలంవల్ల కలిగిన పొగరుతో పిచ్చివాడై భూమిపై వాసుదేవుడనే పేరు నాకు ఒక్కడికే కాక ఇతరులకు తగునా? కృష్ణుడు తాను వాసుదేవుణ్ణి అని అనుకొంటున్నట్లు తెలిసింది అని తన రాయబారిని పిలిచి, కృష్ణుని దగ్గరకు పంపాడు. ఆ రాయబారి కృష్ణుడు రాజసభలో ఉండగా జంకకవెళ్ళి, పౌండ్రకునిమాటలుగా ఇలా చెప్పాడు. 'కృష్ణా! భూమిని కాపాడేందుకు వాసుదేవుడని పేరు కలిగిన నేను ఉండగా - సిగ్గులేనివాడవై - నీవు

క. నా పేరును నా చిహ్నము, లేపున ధరియించి తిరిగె దిది పంతమె? యిం
తే పో! మదిఁ బరికించిన, నే పంత మెఱుంగు గొల్లఁ డే మిట నైనన్? 509

ప్రతి : నా పేరును= నాపేరూ; నా చిహ్నములు= నా గురుతులూ (లాంఛనాల్ని); ఏపునన్= ఉత్సాహంతో; ధరియించి= తాల్చి; తిరిగెదు(వు)= సంచరిస్తున్నావు; ఇది= ఈ కార్యం; పంతము+ఏ?= పోటీయా?; ఇంతే పో= ఇంతేకదా!; మదిన్= మనస్సులో; పరికించినన్= చూస్తే; గొల్లఁడు= గొల్లవాడు; ఏమిటన్+ఐనన్= ఎందులోనైనా; ఏ= ఏ; పంతము+ఎఱుంగున్= తీరు తెలిసినవాడా?

**తా :** నా నామాల్ని, లాంఛనాల్ని దాల్చి సంచరిస్తున్నావు. ఈ పనిలో నీకు నాతో పోటీయా? గొల్లవానికి రాచమర్యాద ఏ తీరున తెలుస్తుంది?

**ఆ. ఇంతనుండి యైన నెదిరిఁ ద న్నెఱిఁగి నా, చిన్నె లెల్ల విడిచి చేరి కొలిచి**
**బ్రదుకు మనుము కాక పంతంబు లాడెనా, యెదురు మనుము ఘోరకదనముననుు. 510**

**ప్రతి :** ఇంతనుండి+ఐనన్= ఇప్పటినుంచైనా; ఎదిరిన్= ఎదుటివార్ని; తన్= తనను; ఎఱిఁగి= తెలుసుకొని; నా= నాయొక్క; చిన్నెలు+ఎల్లన్= చిహ్నాలన్నింటినీ; విడిచి= వదలి; చేరి= నన్ను సమీపించి; కొలిచి= సేవించి; బ్రదుకుము+ అనుము= జీవించుమని చెప్పుము; కాక= కానిచో; పంతంబులు+ఆడెనా= పౌరుషవాక్యాలుపల్కాడా?; ఘోరకదనముననుు= భయంకరమైన యుద్ధంలో; ఎదురుము+అనుము= ఎదుర్కోమను.

**తా :** ఇప్పటినుండైనా తన శక్తినీ, ఎదుటివారిశక్తినీ తెలుసుకొని నా చిహ్నాలనన్నింటిని వదలి, నన్ను సేవించి బతకమని చెప్పు. అలా కానట్లయితే భయంకరమైన యుద్ధంలో ఎదుర్కోమను, చూద్దాం.

**క. అను దుర్భాషలు సభ్యులు, విని యొండొరు మొగము సూచి విస్మితు లగుచున్**
**'జనులార! యెట్టి క్రొత్తలు, వినఁబడియెడు నిచట? లెస్స వింటిరె?' యనఁగన్. 511**

**ప్రతి :** అను= అన్నట్టి; దుర్+భాషలు= చెడుమాటలు; సభ్యులు; విని; ఒండు+ఒరుమొగము చూచి= ఒకరి మొగాన్ని ఒకరు చూచుకొని; విస్మితులున్+అగుచున్= ఆశ్చర్యం పొంది; జనులార!= ప్రజలారా! (సభ్యులారా!); ఎట్టి= ఎటువంటి; క్రొత్తలు= క్రొత్తమాటలు; ఇచటన్= ఇక్కడ; వినన్+పడియెడున్= వినిపించాయి; లెస్స= బాగా ఉంది; (పరిహాసము); వింటిరె= విన్నారా?; అనన్+కన్= అనగా...

**తా :** రాయబారిప్రలాపాలు విని, సభ్యులు పరస్పరం ఒకరిముఖాన్ని ఒకరు చూచుకొన్నారు. సభ్యులారా! మనం- ఎలాంటి కొత్తమాటలు వింటున్నాం. ఈ రాయబారిమాటలను బాగుగ విన్నారుకదా! అనగా

**వ. అట్టియెడఁ గృష్ణుండు వాని కిట్లనియె. 512**

**ప్రతి :** అట్టియెడన్= ఆ సమయంలో; కృష్ణుండు= కృష్ణుడు; వానికిన్= రాయబారితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** ఆ సందర్భంలో కృష్ణుడు పౌండ్రకుని రాయబారితో ఇలా చెప్పాడు.

**మ. వినరా! మీ నృపుఁ డన్న చిహ్నములు నే వే వచ్చి ఘోరాజిలో**
**దనమీఁదన్ వెస వైవఁ గంకముఖగృధ్రవ్రాతముల్ మూఁగఁగా,**
**ననిలో దర్పము దూలి కూలి వికలంబై సారమేయాళికి**
**న్ననయంబున్ నశనంబ వయ్యె దను మే నన్నట్లుగా వానితోన్. 513**

**ప్రతి :** వినరా= విను; ('రా'అనుటచే నిందార్థం); మీ= మీయొక్క; నృపుడు+అన్న= రాజుచెప్పిన; చిహ్నములు= లాంఛనాలు (గుర్తులు); నేన్= నేను; వే= వేగంగా; వచ్చి; ఘోర+ఆజిలోన్= భయంకర యుద్ధంలో; తనమీఁదన్= తనపైన; వెసన్= వేగంగా; వైవన్= (ఆయుధాలు)వేయగా; కంక= రాబందు; ముఖ= మొదలైన; గృధ్రవ్రాతముల్= గద్దల సమూహాలు; మూఁగన్+కాన్= చుట్టూచేరగా; అనిలోన్= యుద్ధంలో; దర్పమున్= గర్వాన్ని; తూలి= పోగొట్టుకొని; కూలి= కిందపడి;

వికలంబు+ఐ= విరిగిన అవయవాలతో; సారమేయ+ఆళికిన్= కుక్కలగుంపులకు; అశనంబవు+అయ్యెదు(వు)= ఆహారం అవుతావు (అని); ఏను+అన్నట్లుగాన్= నేను చెప్పినట్లుగా; వానితోన్= వానితో (పౌండ్రకునితో); అనుము= చెప్పు.

**తా :** ఓరీ! విను. "మీరాజు పౌండ్రకుడు చెప్పిన చిహ్నాలతో వచ్చి, భయంకరయుద్ధంలో వాటిల్ని ప్రయోగించగా తాను భూమిపైబడి అవయవాలను పోగొట్టుకొని రాబందులు, గద్దలు, మూగగా కుక్కల గుంపులకు ఆహారమౌతావని మీరాజు పౌండ్రకునితో నేను చెప్పినట్లు చెప్పు" అని కృష్ణుడు పలికాడు.

**క. అని యుద్రేకముగా నా, డిన మాటల కులికి వాఁడు డెందము గలఁగం**
**జని తన యేలిక కంతయు, వినిపించెను నతనిమదికి విరసము గదురన్. 514**

**ప్రతి :** అని; ఉద్రేకము+కాన్= ఆవేశంతో; ఆడిన= పలికిన; మాటలకున్= పలుకులకు; ఉలికి= భయపడి; వాడు (రాయబారి); డెందము= హృదయం; కలఁగన్= కలతపడగా; చని= వెళ్ళి; తన= తనయొక్క; ఏలికకున్= ప్రభువుకు; అంతయున్= పూర్తిగా; అతని= పౌండ్రకుని; మదికి= మనస్సుకు; విరసము= విపరీతభావన; కదురన్= కలిగేట్లుగా; వినిపించెనున్= చెప్పాడు.

**తా :** కృష్ణుడు ఆవేశంతో పల్కిన మాటలకు భయపడి హృదయం కలతపడుతుండగా తన ప్రభువయిన పౌండ్రకునికి విపరీతభావం కల్గేట్టుగా చెప్పాడు.

**వ. అంతఁ గృష్ణుండు దండయాత్రోత్సుకుఁడై వివిధాయుధకలితంబును, విచిత్రకాంచనపతాకాకేతు విలసితంబునగు సుందరస్యందనంబుఁ బటుజవతురంగంబులం బూన్చి దారుకుండు తెచ్చిన నెక్కి యతిత్వరితగతిం గాశికానగరంబున కరిగినం బౌండ్రకుండును రణోత్సాహంబు దీపింప నక్షౌహిణీ ద్వితయంబుతోడం బురంబు వెడలె, నప్పు డతనిమిత్రుండైన కాశీపతియును మూఁడక్షౌ హిణులతోడం దోడుపడువాఁడై వెడలె, ని ట్లాప్తయుతుండై వచ్చువాని. 515**

**ప్రతి :** అంతన్= అంతట; కృష్ణుండు= కృష్ణుడు; దండయాత్రా+ఉత్సుకుఁడు+ఐ= దండయాత్రా కార్యక్రమానికి పూనుకొన్నవాడై; వివిధ+ఆయుధకలితంబును= అనేక విధాలైన ఆయుధాలతో కూడిందీ; విచిత్ర= నానా వర్ణాలతో ఆశ్చర్యకరమైన; కాంచన= బంగారంయొక్క; పతాకా= టెక్కేలతో; కేతు= ధ్వజాలతో; విలసితంబును+అగు= ప్రకాశించేది అయిన; సుందర= అందమైన; స్యందనంబున్= రథాన్ని; పటు= నేర్పుగల; జవ= వేగంగల; తురంగంబులన్= గుర్రాల్ని; పూన్చి= కట్టి; దారుకుండు= దారుకుడనే రథసారథి; తెచ్చినన్= తీసుకొనిరాగా; ఎక్కి; అతిత్వరితగతిన్= మిక్కిలిశీఘ్రగమనంతో; కాశికానగరంబునకున్= వారణాసిపురానికి; అరిగినన్= వెళ్ళగా; పౌండ్రకుండును= పౌండ్రకుడు కూడా; రణ+ఉత్సాహంబు= యుద్ధకుతూహలం; దీపింపన్= ప్రకాశింపగా; అక్షౌహిణీద్వితయంబుతోడన్= రెండు అక్షౌహిణులతో; పురంబు= నగరంనుండి; వెడలెన్= బయలుదేరాడు; అప్పుడు= ఆ సమయంలో; అతనిమిత్రుండు+ఐన= పౌండ్రకుని స్నేహితుడైన; కాశీపతియును= కాశీరాజుకూడా; మూఁడు+అక్షౌహిణులతోడన్= మూడు అక్షౌహిణులతో; తోడుపడువాడు+ఐ= సహాయం చేసేవాడై; వెడలెన్= వెళ్ళాడు; ఇట్లు= ఈ విధంగా; ఆప్తయుతుండు+ఐ= హితులతో కూడినవాడై; వచ్చు= వస్తున్న; వానిన్= పౌండ్రకుణ్ణి...

**తా :** కృష్ణుడు కదనకుతూహులుడై దారుకుడు తెచ్చిన రథాన్ని అధిరోహించాడు. పౌండ్రకుడూ రెండుఅక్షౌహిణుల సైన్యంతో మిత్రుడు, కాశీరాజు మూడు అక్షౌహిణులసైన్యంతో కదనరంగానికి వెళ్ళారు.

**విశే :** 1. అక్షౌహిణి అనగా– 21870 రథాలూ, 21870 ఏనుగులూ; 65610 అశ్వములూ, 109350 పదాతులును కలిగినసేన. ఒక అక్షౌహిణి అంటే – 218700ల సేనతో కూడింది.

**సీ. చక్రగదాశంఖశార్ఙ్గాదిసాధనుఁ, గృత్రిమగౌస్తుభశ్రీవిలాసు**
**మకరకుండలహారమంజీరకంకణ, మణిముద్రికావనమాలికాంకుఁ**
**దరళవిచిత్రపతంగపుంగవకేతుఁ, జెలువొందు పీతకౌశేయవాసు**
**జవనాశ్వకలితకాంచనరథారూఢుని, రణకుతూహలు లసన్మణికిరీటు**

**తే. నాత్మసమవేషు రంగవిహారకలిత, నటసమానునిఁ బౌండ్రభూనాథుఁ గాంచి**
**హర్ష మిగురొత్త నవ్వెఁ బద్మాయతాక్షుఁ, డంత వాఁడును నుద్వృత్తుఁ డగుచు నదరి. 516**

**ప్రతి :** పద్మ+ఆయత+అక్షుఁడు= పద్మాలవంటి విశాలమయిన కన్నులు కల కృష్ణుడు; చక్ర= సుదర్శనచక్రం; గదా= కౌమోదకీగద; శంఖం; శార్ఙ్గం+ఆది= శార్ఙ్గం అనే విల్లుమొదలగు; సాధనున్= ఆయుధాలు కలవాణ్ణి; కృత్రిమ= కల్పితమయిన; కౌస్తుభ= కౌస్తుభంతోనూ; శ్రీవిలాసున్= లక్ష్మితోనూ ప్రకాశించేవాణ్ణి; మకరకుండల= మకరకుండలాల్నీ; హార= కంఠమాలల్నీ; మంజీర= కాలిఅందెల్నీ; కంకణ= కడియాల్నీ; మణిముద్రికా= రత్నపుటుంగరాల్నీ; వనమాలికా= ఆకులు, పూలు మడిచి చేసిన మాలనూ; (వక్షఃస్థలంలో) అంకున్= గుర్తులుగా కలవాణ్ణీ; తరళ= చలిస్తున్న; విచిత్ర= చిత్రవర్ణమైన; పతంగపుంగవకేతున్= గరుడధ్వజం కలవాణ్ణి; చెలువు+ఒందు= అందాన్ని పొందే; పీతకౌశేయవాసున్= పసుపువర్ణంగల పట్టువస్త్రాన్ని ధరించినవాణ్ణీ; జవన+అశ్వ+కలిత= వేగం కలిగిన గుఱ్ఱాలతోకూడిన; కాంచన= బంగారుయొక్క; రథ+ఆరూఢునిన్= రథంపైకి ఎక్కినవాణ్ణీ; రణకుతూహలున్= యుద్ధానికి ఉత్సహిస్తున్నవాణ్ణీ; లసత్+మణికిరీటున్= ప్రకాశించేమణికిరీటం కలిగినవాణ్ణీ; ఆత్మ సమవేషున్= తనతో (కృష్ణునితో)సమానవేషం కలిగినవాణ్ణీ; రంగ విహారకలిత నటసమానునిన్= నాటకరంగంలో విహరించేనటుని వంటివాడైన; పౌండ్రభూనాథునిన్= పౌండ్రకరాజును; కాంచి= చూచి; హర్షము+ఇగురు+ఒత్తన్= సంతోషం చిగురించగా; నవ్వెన్= నవ్వాడు; అంతన్= అంతట; వాఁడును= ఆ పౌండ్రకుడూ; ఉత్+వృత్తుఁడు+అగుచున్= గర్వించినవాడవుతూ; అదరి= విజృంభించి...

**తా :** శంఖం, చక్రం, గద, శార్ఙ్గాలనే ఆయుధాలను పౌండ్రకుడు ధరించాడు. కృత్రిమకౌస్తుభమణిని వక్షఃస్థలంలో ధరించాడు. మకరకుండలాలు, హారాలు, కంకణాలు, రత్నపుటుంగరాలు, మెడలో వనమాల ధరించాడు. గరుడకేతనాన్ని రథంపై కూర్చాడు. పీతాంబరాన్ని ధరించాడు. వేగంగల గుర్రాల్ని కట్టిన రథాన్ని అధిరోహించాడు. ప్రకాశించే కిరీటాన్ని ధరించాడు. అట్టి పౌండ్రకుణ్ణి చూచి నాటక రంగంపై విహరించే నటుణ్ణిగా భావించి, శ్రీకృష్ణుడు నవ్వాడు. ఆ నవ్వు చూచి పౌండ్రకునికి కోపం కలిగి

**క. పరిఘశరాసనపట్టిస, శరముద్గరముసలకుంతచక్రగదా తో**
**మరభిందిపాలశక్తి, క్షురికాసిప్రాసపరశుశూలముల వెసన్. 517**

**ప్రతి :** పరిఘ= ఇనుపగుదియ; శర+ఆసన= విల్లు; పట్టిస= అడ్డకత్తి; శరము= బాణం; ముద్గర= ముద్గరమనే ఆయుధ విశేషాన్ని; ముసల= రోకలి; కుంత= బల్లెం; చక్ర= చక్రం; గదా= గద; తోమర= చిల్లకోల; భిందిపాల= భిందిపాల అనే ఆయుధవిశేషం; శక్తి= శక్తి అనే ఆయుధవిశేషం; క్షురిక= కత్తి; అసి= ఖడ్గం; ప్రాస= ఈటె; పరశు= గండ్రగొడ్డలి; శూలముల= శూలాలతో (ఈ ఆయుధాలన్నింటితో); వెసన్= వేగంగా...

**తా :** పరిఘ, శరాసన, పట్టిస, శర, ముద్గర, ముసల, కుంత, చక్ర, గద, తోమర, భిందిపాల, శక్తి, క్షురిక, అసి, ప్రాస, శూలాది ఆయుధాలతో వేగంగా

**చ. పరువడి వైచినన్ దనుజభంజనుఁ డంత యుగాంతకాల భీ**
**కర మహితోగ్రపావకుని కైవడి నేచి విరోధిసాధనో**
**త్కరముల నొక్కటన్ శరనికాయములన్ నిగిడించి త్రుంచి భా**
**స్వరగతి నొత్తె సంచలితశాత్రవసైన్యముఁ బాంచజన్యమున్. 518**

**ప్రతి :** పరువడిన్= వేగంగా; వైచినన్= వేయగా; దనుజభంజనుఁడు= రాక్షసుల గర్వాన్ని అణచినవాడు - కృష్ణుడు; అంతన్= అంతట; యుగ+అంతకాల= యుగకాలానికి చివర సమయంనాటి; భీకర= భయంకరమైన; మహిత= గొప్పదైన; ఉగ్ర= తీవ్రమైన; పావకునికైవడిన్= అగ్నివలె; ఏచి= విజృంభించి; విరోధి= శత్రువుయొక్క; సాధన+ఉత్కరములన్= ఆయుధాల సమూహాన్ని; నిగిడించి= ప్రయోగించి; త్రుంచి= ఖండించి; సంచలిత శాత్రవసైన్యమున్= శత్రువుల దండును వణికించినది అయిన ; పాంచజన్యమున్= పాంచజన్యమనే శంఖాన్ని; భాస్వరగతిన్= ప్రకాశవంతంగా; ఒత్తెన్= ఊదాడు.

**తా :** శ్రీకృష్ణుడు ఆయుధాల్ని వేగంగా విసరి పౌండ్రకునిపై శత్రువుల ఆయుధాల్ని తుంచి, వాళ్లను వణికించే పాంచజన్యం పూరించాడు.

**ఉ. వారని యల్కతోఁ గినిసి వారిజనాభుఁడు వారిసైన్యముల్**
**మారి మసంగినట్లు నుఱుమాడినఁ బీనుఁగుఁబెంటలై వెసం**
**దేరులు వ్రాలె, నశ్వములు ద్రెళ్ళె, గజంబులు మ్రొగ్గె, సద్భటుల్**
**ధారుణిఁ గూలి, రిట్లు నెఱి దప్పి చనెన్ హతశేషసైన్యముల్. 519**

**ప్రతి :** వారని= తగ్గని; అల్కతోన్= కోపంతో; కినిసి= విజృంభించి; వారిజనాభుఁడు= కృష్ణుడు; మారిమసంగిన+అట్లు= మృత్యుదేవత చెలగాటమాడినట్లు; నుఱుము+ఆడినన్= ఖండించగా; పీనుఁగు పెంటలు+ఐ= శవాలగుట్టలై; వెసన్= శీఘ్రంగా; తేరులు= రథాలు; వ్రాలెన్= విరిగిపడ్డాయి; అశ్వములు= గుర్రాలు; త్రెళ్ళెన్= కూలాయి; గజంబుల్= ఏనుగులు; మ్రొగ్గెన్= ఒరిగాయి; సత్+భటులు= వీరులైన భటులు; ధారుణిన్= భూమిపై; కూలిరి= కూలారు; ఇట్లు= ఈ విధంగా; హతశేష= చనిపోగా మిగిలిన; సైన్యముల్= సైన్యాలు; నెఱిదప్పి= పరాక్రమంకోల్పోయి; చనెను= పారిపోయాయి.

**తా :** కృష్ణుడు తగ్గని కోపంతో విజృంభించాడు. మృత్యుదేవత చెలగాటమాడినట్లు శత్రుసైన్యాలు శవాల గుట్టలయ్యాయి. రథాలు నేలపై పడ్డాయి. గుర్రాలు కూలాయి. ఏనుగులు ఒరిగాయి. వీరులైన భటులు మరణించారు. మిగిలినవారు చావు తప్పించుకొన్నారు.

**వ. అట్టియెడ రుధిరప్రవాహంబులును, మేదోమాంసపంకంబును నై సంగరాంగణంబు ఘోరభంగి యయ్యె, న య్యవసరంబునం గయ్యంబునకుం గాలు ద్రవ్వు న ప్పౌండ్రకునిం గనుంగొని హరి సంబోధించి యి ట్లనియె. 520**

**ప్రతి :** అట్టి+ఎడన్= ఆ సందర్భంలో; రుధిరప్రవాహంబులును= రక్తప్రవాహాలూ; మేదస్+మాంస= క్రొవ్వు, మాంసాలయొక్క; పంకంబులును+ఐ= బురదగలదై; సంగర+అంగణంబు= యుద్ధభూమి; ఘోరభంగి+అయ్యెన్= మిక్కిలి భయంకరమైనదైంది; ఆ+అవసరంబునన్= అట్టి సమయంలో; కయ్యంబునకున్= యుద్ధానికి; కాలుద్రవ్వు= సిద్ధపడుతున్న; ఆ+పౌండ్రకునిన్= ఆ పౌండ్రకుణ్ణి; కనున్+కొని= చూచి; హరి= కృష్ణుడు; సంబోధించి= పిలిచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ సమయంలో రక్తప్రవాహంలో క్రొవ్వు, మాంసంపడి బురదగా అయింది. యుద్ధభూమి మిక్కిలి భయంకరమయింది. అట్టి సమయంలో తగవుకు సిద్ధపడుతున్న పౌండ్రకుణ్ణి చూచి పిలిచి కృష్ణుడు ఈ విధంగా చెప్పాడు.

**మ. 'మనుజేంద్రాధమ! పౌండ్రభూపసుత! నీ మానంబు బీరంబు నేఁ**
**డనిలో మాపుదు, నెద్దు క్రొవ్వి పెలుచ న్నాఁబోతుపై ఱంకె వై**
**చిన చందంబున దూతచేత నను నాక్షేపించి వల్దన్న పే**
**రును జిహ్నంబులు నీ పయిన్ విడుతు నర్చుల్ పర్వ నేఁ డాజిలోన్. 521**

**ప్రతి :** మనుజ+ఇంద్ర+అధమ= రాజులలో అధముడైనవాడా!; పౌండ్రభూపసుత= పౌండ్రరాజకుమారా!; నీ= నీయొక్క; మానము= గర్వం; బీరము= పౌరుషం; నేఁడు= ఈ రోజు; అనిలోన్= యుద్ధంలో; మాపుదున్= పోగొడతా; ఎద్దు; క్రొవ్వి= మదమెక్కి; పెలుచన్= అతిశయించి; ఆఁబోతుపై= ఆ బోతుపై; ఱంకె= ఱంకె (ఎద్దు చేసే ధ్వని); వైచిన= వేసిన; చందంబునన్= విధంగా; దూతచేతన్= రాయబారిచే; ననున్= నన్ను; ఆక్షేపించి= నిందించి; వల్దు+అన్న= నాకు పనికి రాదని నీవన్న; పేరును= నామాన్ని; చిహ్నంబులున్= లాంఛనాల్ని; అర్చులు+పర్వన్= మంటలు వ్యాపింపగా; నేడు= ఈ రోజు; ఆజిలోన్= యుద్ధంలో; నీపయిన్= నీపైకి; విడుతున్= ప్రయోగిస్తాను.

**తా :** రాజాధమా! పౌండ్రరాజకుమారా! నీ పౌరుషాన్ని నేటియుద్ధంలో రూపుమాపేటట్లు చేస్తాను. ఎద్దు కొవ్వెక్కి ఆబోతు పై రంకెలు వేసినట్లుగా నీ మాటలు ఉన్నాయి. నీవు ఆక్షేపించిన నా పేరు, చిహ్నాలు మంటలు కురిపిస్తుండగా నేటియుద్ధంలో నీపై ప్రయోగిస్తాను.

**క. అది గాక నీదు శరణము, పదపడి యేఁ జొత్తు నీవు బలవిక్రమ సం**
**పద గల పోటరి వేనిం, గదలక నిలు 'మనుచు నిశితకాండము లంతన్. 522**

**ప్రతి :** అదిగాక= అంతేకాకుండా; ఏన్= నేను; నీదు= నీయొక్క; శరణము= ఆశ్రయాన్ని; పదపడి= తరువాత; చొత్తున్= అంగీకరిస్తాను; నీవు; బల= సైన్యం; విక్రమ= పరాక్రమాల; సంపద+కల= ఐశ్వర్యం కలిగిన; పోటరివి+ఏనిన్= యోధుడవైతే; కదలక= స్థిరంగా; నిలు= ఉండుము; అనుచున్= అంటూ; నిశిత= వాడియైన; కాండములు= బాణాలు; అంతన్= అంతట (తరువాత)...

**తా :** నేను నీ శరణును తరువాత వేడుకొంటాను. నీవు బలపరాక్రమ సంపద కలిగినవాడివి అయితే యుద్ధంలో స్థిరంగా పలుకుతూ వాడి అయిన బాణాలు

**మ. చల మొప్పన్ నిగుడించి వానిరథముం జక్కాడి తత్సారథిం**
**దల వే ద్రుంచి హయంబులన్ నరికి యుద్దండప్రతాపక్రియం**
**బ్రలయార్కప్రతిమానచక్రమున నప్పౌండ్రున్ వెసం ద్రుంప వాఁ**
**డిలఁ గూలెం గులిశాహతి న్నొరగు శైలేంద్రాకృతిన్ భూవరా! 523**

**ప్రతి :** భూవరా!= ఓ పరీక్షిన్మహారాజా!; చలము+ఒప్పన్= పట్టుదలతో; నిగుడించి= విజృంభించి; వాని= పౌండ్రకుని; రథమున్= రథాన్ని; చక్కాడి= ఖండించి; తత్+సారథిన్= ఆ రథం నడిపేవాణ్ణి; తలన్= శిరస్సును; వే= వేగంగా; త్రుంచి= ఖండించి; హయంబులన్= గుర్రాల్ని; నరికి= ఖండించి; ఉద్దండ= భయంకర; ప్రతాపక్రియన్= పరాక్రమంతో; ప్రలయ+అర్కప్రతిమాన= ప్రళయకాలంనాటి సూర్యుణ్ణి పోలిన; చక్రమునన్= సుదర్శనచక్రంతో; ఆ+పౌండ్రున్= ఆ పౌండ్రకరాజును; వెసన్= శీఘ్రంగా; త్రుంపన్= ఖండించగా; వాఁడు= వాడు; కులిశ+ఆహతిన్= వజ్రాయుధంయొక్క దెబ్బచే; ఒరగు= కూలే; శైల+ఇంద్ర+ఆకృతిన్= గొప్ప పర్వతంవలె; కూలెన్= పడ్డాడు.

**తా :** కృష్ణుడు విజృంభించి పౌండ్రకుని రథాన్ని, గుర్రాల్ని సారథిని చంపి, భయంకరమయిన పరాక్రమంతో ప్రళయకాల సూర్యునివలె మంటలు క్రక్కే, సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు. ఆ చక్రం దెబ్బతో పౌండ్రకుడు వజ్రాయుధం దెబ్బకు కూలిన పర్వతంవలె నేలకూలాడు.

**చ. మదవక కాశికావిభునిమస్తక ముద్ధతిఁ ద్రుంచి బంతి కై**
**వడి నది పింజ పింజ గఱవన్ విశిఖాళి నిగుడ్చి వాని యే**
**లెడి పురిలోన వైచె నవలీల మురాంతకుఁ డిట్లు వైరులన్**
**గడఁగి జయించి చిత్తమునఁ గౌతుకముం జిగురొత్త న త్తఱిన్. 524**

**ప్రతి :** mుర+అంతకుఁడు= కృష్ణుడు; మదవక= వెనుదిరగక; కాశికావిభుని= కాశీరాజుయొక్క; మస్తకము= శిరస్సును; ఉద్ధతిన్+త్రుంచి= గర్వంతో ఖండించి; బంతికైవడిన్= బంతివలె; అది= శిరస్సు; పింజపింజన్+కఱవన్= ఒక బాణం కింది చివరను, మరొక బాణం ములికి కరచుకున్నట్లు; విశిఖ+ఆళిన్= బాణాల సమూహాన్ని; నిగుడ్చి= వదలి; వాని= ఆ రాజుయొక్క; ఏలెడి= పరిపాలించే; పురిలోనన్= పురంలో; వైచెన్= వేశాడు; ఇట్లు= ఈ విధంగా; అవలీలన్= సులభంగా; వైరులన్= శత్రువుల్ని; కడగి= ప్రయత్నించి; జయించి= గెల్చి; చిత్తమునన్= మనస్సులో; కౌతుకమున్= సంతోషం; చిగురు+ఒత్తన్= పల్లవింపగా; ఆ+తఱిన్= ఆ సమయంలో...

**తా :** కాశీరాజు శిరస్సును శ్రీకృష్ణుడు ఖండించాడు. ఆ శిరస్సును ఎగురకొడుతూ కాశీపట్టణంలో పడేటట్లు చేశాడు. ఒకదానివెనుక మరోబాణం చివర్ల గుచ్చుకొనేట్లు సాగే బాణాలను ప్రయోగించాడు. ఈ విధంగా కృష్ణుడు శత్రువుల్ని జయించి ఆనందిస్తూ

**క. సుర గంధర్వ నభశ్చర, గరుడోరగసిద్ధసాధ్యగణము నుతింపన్**
**మరలి చనుదెంచి హరి నిజ, పురమున సుఖ ముండె నతివిభూతి దలిర్పన్. 525**

**ప్రతి :** సుర= దేవతలు; గంధర్వ= గంధర్వులు; నభస్+చర= ఖేచరులు; గరుడ+ఉరగ= గరుడులు, పాములు; సిద్ధ= అణిమాదులైన ఎనిమిది సిద్ధులు కలిగిన దివ్య పురుషులయొక్కయు; సాధ్య= పండ్రెండుమంది గణదేవతలయొక్కయు;

గణము= సమూహం; నుతింపన్= ప్రశంసిస్తూండగా; మరలి= తిరిగి; చనుదెంచి= వచ్చి; హరి= కృష్ణుడు; నిజపురమునన్= తన నగరంలో; అతివిభూతి= మిక్కిలిసంపద; తలిర్పన్= అతిశయించగా; సుఖము+ఉండెన్= సుఖంగా ఉన్నాడు.

**తా :** సుర, గంధర్వ, గరుడ, ఉరగ, సిద్ధ సాధ్య గణాలు తనను ప్రశంసిస్తూ ఉండగా తిరిగివచ్చి, కృష్ణుడు తన నగరంలో మిక్కిలి వైభవంతో సుఖంగా ఉన్నాడు.

**క. వనజోదరు చిహ్నంబులు, గొనకొని ధరియించి పౌండ్రకుఁడు మచ్చరియై**
**యనవరతము హరి దన తలఁ, పునఁ దగులుటఁ జేసి ముక్తిఁ బొందె నరేంద్రా! 526**

**ప్రతి :** నర+ఇంద్రా= ఓ రాజా!; వనజ+ఉదరు= కృష్ణునియొక్క; చిహ్నంబులు= లాంఛనాల్ని; కొనకొని= ప్రయత్నించి; ధరియించి= తాల్చి; మచ్చరి+ఐ= మాత్సర్యం కలవాడై; అనవరతమున్= ఎల్లప్పుడూ; హరి= కృష్ణుడు; తన= తనయొక్క; తలఁపునన్= ఆలోచనలో; తగులుటన్+చేసి= తగుల్కోవడంవల్ల; పౌండ్రకుఁడు= పౌండ్రకుడు; ముక్తిన్+పొందెన్= మోక్షాన్ని పొందాడు.

**తా :** కృష్ణుని లాంఛనాలు ధరించడంచేత, మత్సరబుద్ధితో కృష్ణుణ్ణి సర్వకాల సర్వావస్థల్లో స్మరించడంవల్ల, పౌండ్రకునికి మోక్షం లభించింది.

**సీ. అక్కడఁ గాశిలో నా రాజు మందిరాం, గణమునఁ గుండలకలిత మగుచుఁ**
**బడి యున్న తలఁ జూచి పౌరజనంబులు, దమరాజు తలయకాఁ దగ నెఱింగి**
**చెప్పిన నా నృపుజీవితేశ్వరులును సుతులు, బంధువులును హితులు గూడి**
**మొనసి హాహాకారమున నేడ్చి, రత్తఱిఁ, దత్తనూభవుఁడు సుదక్షిణుండు**

**తే. వెలయఁ దండ్రికిఁ బరలోకవిధు లొనర్చి, జనకు ననిలో వధించిన చక్రపాణి**
**నదరి మర్దింపఁ దగు నుపాయంబు దలఁచి, చతురుఁ దగునట్టి తన పురోహితునిఁ బిలిచి. 527**

**ప్రతి :** అక్కడన్= అచ్చట; కాశిలోన్= కాశీపురంలో; ఆ రాజు= ఆ ప్రభువు; మందిర+అంగణమునన్= భవనప్రదేశంలో; కుండలకలితము+అగుచున్= కర్ణాభరణములచేత కూడిందై; పడియున్న= క్రిందపడ్డ; తలన్; చూచి; పౌరజనంబులు= నగరప్రజలు; తమ= తమయొక్క; రాజు= ప్రభువుయొక్క; తల+అ+కాన్= తలయే అని; తగన్+ఎఱింగి= తగునట్లు తెలుసుకొని; చెప్పినన్= తెలియచేయగా; ఆ నృపు= ఆ రాజుయొక్క; జీవిత+ఈశ్వరులునున్= భార్యలును; సుతులు= కుమారులు; బంధువులును= చుట్టాలును; హితులునన్= ఇష్టమగువారును; కూడి= కలిసి; మొనసి= పూని; హాహాకారమునన్+ఏడ్చిరి= హాహాకారాలతో రోదించారు; ఆ+తఱిన్= ఆ సమయంలో; తత్= వాని పౌండ్రకునియొక్క; తనూభవుఁడు= కుమారుడు; సుదక్షిణుండు= సుదక్షిణుడు అనేవాడు; వెలయన్= ప్రసిద్ధికెక్కునట్లు; తండ్రికిన్= తండ్రికి; పరలోకవిధులు+ఒనర్చి= పరలోకక్రియలుచేసి; జనకునిన్= తండ్రిని; అనిలోన్= యుద్ధంలో; వధించిన= చంపిన; చక్రపాణిన్= కృష్ణుణ్ణి; అదరి= పూనుకొని; మర్దింపన్= నూరేందుకు (జయించేందుకు); తగున్= తగినట్టి; ఉపాయంబు= వెరవు (మార్గం); తలఁచి= ఆలోచించి; చతురుఁడు+అగునట్టి= నేర్పరి ఐనట్టి; తన= తనయొక్క; పురోహితునిన్= పురోహిత బ్రాహ్మణుణ్ణి; పిలిచి= ఆహ్వానించి.

**తా :** పౌండ్రకుని మరణాని కాయన భార్యలు, బంధువులు, మిక్కిలి పరితపించారు. పౌండ్రకుని కుమారుడగు సుదక్షిణుడు శాస్త్రోక్తంగా తండ్రికి పరలోకక్రియలు చేశాడు. యుద్ధంలో తండ్రిని వధించిన కృష్ణుణ్ణి నుగ్గు చేసేందుకు తగిన ఉపాయం ఆలోచించి, అందుకు నేర్పరి అయిన తన పురోహితుణ్ణి ఆహ్వానించాడు.

**క. అతడుం దానును జని పశు, పతిపదసరసిజములకును బ్రమదముతో నా**
**నతుఁడై య ద్దేవుని బహు, గతులం బూజింప నతఁడు కరుణాన్వితుఁడై. 528**

**ప్రతి :** అతడున్= ఆ పురోహితుడూ; తానును= సుదక్షిణుడూ; చని= వెళ్ళి; పశుపతి= శివునియొక్క; పదసరసిజములకున్= పాదపద్మాలకు; ప్రమదముతోన్= సంతోషంతో; ఆనతుఁడు+ఐ= మొక్కి; ఆ+దేవునిన్= ఆ శివుణ్ణి; బహుగతులన్= అనేక విధాలుగా; పూజింపన్= సేవించగా; అతఁడు= ఆ శివుడు; కరుణా+అన్వితుఁడు+ఐ= దయతోకూడిన...

**తా :** రాజపురోహితుడూ, సుదక్షిణుడూ శివునిపాదపద్మాలకు మొక్కి, ఆ దేవుణ్ణి అనేకవిధాలుగా సేవించగా, శివుడు దయకలిగి

**క. మెచ్చితి నే వర మైనను నిచ్చెద నను వేఁడు మనిన నీశ్వర ! నన్నున్**
**మచ్చిక రక్షింతువు పొర, పొచ్చెము సేయక మహేశ! పురహర! యభవా! 529**

**ప్రతి :** మెచ్చితిన్= మీ భక్తికి మెచ్చాను; ఏవరము+ఐనను= ఏ కోరిక అయినా; ఇచ్చెదనున్= ఇస్తాను; ననున్= నన్ను; వేడుము= కోరుము; అనినన్= అనగా; మహా+ఈశా!= మహేశ్వరా; పురహర= త్రిపురసంహారా!; అభవ= పుట్టుకలేనివాడా!; ఈశ్వర= శివా!; మచ్చికన్= ప్రేమతో; పొరపొచ్చెము= భేదబుద్ధి; చేయక= కాకుండా; రక్షింతువు= రక్షిస్తుంటావు.

**తా :** 'మీరు నన్ను సేవలతో మెప్పించారు. మీరు కోరే కోరిక తప్పక తీరుస్తాను' అని శివుడు అంటే సుదక్షిణుడు శివా! అభవా! పురహరా! తనవాడు పరవాడు అనే భేదంలేకుండా ప్రేమతో మమల్ని రక్షించేవాడివి నువ్వే!

**క. దేవా! మ జ్జనకుని వసు, దేవాత్మజుఁ డాజిలో వధించెను, నే నా**
**గోవిందుని ననిలోపల, నే విధమున గెలుతు నాన తీవె పురారీ!' 530**

**ప్రతి :** దేవా!= ప్రభూ!; పుర+అరీ= శివా!; మద్+జనకునిన్= నా తండ్రిని; వసుదేవ+ఆత్మజుఁడు= వసుదేవుని కుమారుడగు కృష్ణుడు; ఆజిలోన్= యుద్ధంలో; వధించెను= చంపాడు; నేన్= నేను; ఆ= ఆ; గోవిందునిన్= కృష్ణుణ్ణి; అనిలోపలన్= యుద్ధంలో; ఏవిధమునన్= ఏ రీతిగా; గెలుతున్= గెలుస్తాను; ఆనతి= ఆజ్ఞను; ఈవు+ఎ= ఇమ్ము.

**తా :** ఓ శివా! నా తండ్రిని కృష్ణుడు యుద్ధంలో చంపాడు. నేను కృష్ణుణ్ణి యుద్ధభూమిలో ఏ విధంగా గెలుస్తానో చెప్పుమని సుదక్షిణుడు పలికాడు.

**తే. అనిన శంకరుఁ డతనికి ననియె ననఘ!, నీవు ఋత్విజులును భూసురావళియును**
**బ్రీతి నభిచార మొనరింప భూతయుక్తుఁ, డగుచు ననలుండు దీర్చు నీ యభిమతంబు'. 531**

**ప్రతి :** అనినన్= అని చెబితే; శంకరుఁడు= శివుడు; అతనికిన్= (పౌండ్రకుని) కుమారునితో; అనియెన్= చెప్పాడు; అనఘ!= పుణ్యాత్ముడా; నీవు; ఋత్విజులును= యజ్ఞం చేయించే బ్రాహ్మణులును; ప్రీతిన్= తృప్తితో; అభిచారము+ఒనరింపన్=

మారణహోమం చేస్తే (అభిచారికహోమం); భూతయుక్తుఁడు+అగుచున్= భూతాలతో కూడిన వాడవుతూ; అనలుండు= అగ్ని; నీ= నీయొక్క; అభిమతంబున్= కోరికను; తీర్చున్= తీరుస్తాడు.

**తా :** సుదక్షిణుని కోరిక విని, శివు డాతనితో ఈ విధంగా చెప్పాడు. పుణ్యాత్ముడా! నీవూ, ఋత్విజులగు బ్రాహ్మణులూ తృప్తిగా అభిచారహోమం చేస్తే భూతాలతో కూడిన అగ్ని నీ కోరికను తీరుస్తాడు.

**తే. అనిన నా చంద్రమౌళివాక్యములభంగి, భూరినియమముతో నభిచారహోమ**
**మొనరఁ గావింప నగ్ని యథోచితముగఁ, జెలఁగ దక్షిణవలమాన శిఖల వెలిఁగె. 532**

**ప్రతి :** అనినన్= అని చెప్పగా; ఆ= ఆ; చంద్రమౌళివాక్యములయొక్క భంగిన్= శివునిమాటల ప్రకారంగా; భూరి= అధికమైన; నియమముతోన్= కట్టుబాటుతో; అభిచారహోమము= మారణక్రియకు సంబంధించిన హోమవిధివి; ఒనరన్= ఒప్పిదంగా; కావింపన్= చేయగా; అగ్ని; యథా+ఉచితముగన్= యథాశాస్త్రీయంగా; చెలఁగన్= వ్యాపించగా; దక్షిణ= దక్షిణదిశకు; వలమాన= కదలుచున్న; (ప్రదక్షిణంగా) శిఖలన్= జ్వాలలతో; వెలిగెన్= ప్రకాశించింది.

**తా :** శివుడు చెప్పిన విధంగా సుదక్షిణుడు అధికమైన నియమాలతో మారణహోమం చేశాడు. అగ్నిదేవుడు తృప్తి చెంది ప్రదక్షిణంగా తిరుగుతున్న జ్వాలలతో ప్రకాశించాడు.

**వ. అందుఁ దామ్రశ్మశ్రుకేశకలాపంబును, నశనిసంకాశంబు లైన నిడుదకోఱలును, నిప్పులుప్పతిల్లు చూడ్కులును, ముడివడినబొమలును, జేవురించిన మొగంబును గలిగి కృత్య యతిరౌద్రాకారంబునఁ బ్రజ్వరిల్లుచుఁ గుండంబు వెలువడి యనుదిననిహన్యమానప్రాణిరక్తారుణమృత్యుకరవాలంబు లీలం జూపట్టు నాలుకను సెలవుల నాకికొనుచు నగ్నికీలాభీలంబగు శూలంబు గేలం దాల్చి భువనకోలాహలంబుగా నార్చుచు, నుత్తాలతాలప్రమాణపాదద్వయహతులం దూలు పెంధూళి నింగి ఁమ్రింగ, భూతంబులు సేవింప, నగ్నవేషయై, నిజవిలోచనసంజాతసముద్ధూతనిఖిలభయంకరజ్వాలికాజాలంబున దిశాజాలంబు లోలిం బ్రేల్చుచు, నుద్వేగగమనంబున నగధరునగరంబున కరుగుదేరఁ, బౌరజనంబులు భయాకులమానసులై దావదహనునిం గని పఱచువనమృగంబులచాడ్పునం బఱచి, సుధర్మాభ్యంతరంబున జూదం బాడు దామోదరునిం గని రక్షరక్షేతిరవంబుల నార్తులయి 'కృష్ణ! కృష్ణ! పెనుమంటలఁ బురంబు గాల్పం బ్రళయాగ్ని సనుదెంచె' నన వారిం జూచి 'యోడ కోడకుఁ' డని భయంబు నివారించి, సర్వరక్షకుండైన పుండరీకాక్షుండు జగదంతరాత్ముండు గావునం దద్వృత్తాంతం బంతయుఁ దనదివ్యచిత్తంబున నెఱింగి కాశీరాజపుత్త్రప్రేరితయైన య మ్మహాకృత్యను నిగ్రహింపం దలంచి నిజపార్శ్వవర్తియై యున్న య ద్దివ్య సాధనంబు గనుంగొని యప్పుడు. 533**

**ప్రతి :** అందున్= ఆ మంటలనుండి; తామ్ర= ఎఱ్ఱని; శ్మశ్రు= మీసాలయొక్క; కేశ= వెండ్రుకలయొక్క; కలాపంబును= సమూహమూ; అశని= పిడుగుతో; సంకాశంబులు+ఐన= సమానాలైన; నిడుదకోరలును= దీర్ఘాలైన కోరలూ; నిప్పులు+ఉప్పతిల్లు= నిప్పులుకక్కే; చూడ్కులును= చూపులూ; ముడి+పడిన= ముడిపడ్డ; బొమలున్= కనుబొమలూ; జేవురించిన= ఎఱ్ఱగాకందిన; మొగంబును= ముఖమూ; కలిగి; కృత్య అనే భూతం; రౌద్ర+ఆకారంబునన్= భయంకర

రూపంతో; ప్రజ్వరిల్లుచున్= మండుతూ; కుండంబు= హోమగుండంనుండి; వెలువడి= బయటికి వచ్చి; అనుదిన= ప్రతిదిన ప్రళయంలో; నిహన్యమాన= చంపే; ప్రాణి= ప్రాణుల; రక్త+అరుణ= రక్తంచే ఎర్రబడిన; మృత్యుకరవాలంబులీలన్= మృత్యుదేవతచేతికత్తి విధంగా; చూపట్టు= కన్పించే; నాలుకను= నాలుకతో; సెలవులన్= పెదవుల పార్శ్వాలను; నాకికొనుచున్= తడుపుకొంటూ; అగ్నికీలా= అగ్నియొక్కజ్వాలవంటి; శూలంబున్= శూలాన్ని; కేలన్+తాల్చి= చేతియందు ధరించి; భువన కోలాహలంబు+కన్= అన్నిలోకాల్లో కలకలం వ్యాపించేట్లుగా; ఆర్చుచున్= కేకలువేస్తూ; ఉత్+తాల తాలప్రమాణ= తాటిచెట్టంతపొడవైన; పాదద్వయ= రెండుపాదాలయొక్క; హతులన్= దెబ్బలచే; తూలు= ఎగిరిపడుతున్న; పెన్+ధూళి= దుమ్ము; నింగిమింగన్= ఆకాశాన్ని కమ్ముకొనగా; భూతంబులు= బేతాళుదులైన భూతాలు; సేవింపన్= సేవిస్తుండగా; నగ్నవేష+ఐ= దిగంబరంగా; నిజ= తనయొక్క; విలోచన= నేత్రాలనుండి; సంజాత= పుట్టిన; సముద్ధూత= విజృంభించిన; నిఖిల= అందరికీ; భయంకర= భయం కలిగించే; జ్వాలికాజాలంబునన్= మంటల సమూహంతో; దిశాజాలంబులన్= దిక్కుల సమూహాన్ని; ఓలిన్= క్రమంగా; ప్రేల్చుచున్= కాల్చుచుతూ; ఉత్+వేగ= భయపెట్టే; గమనంబునన్= నడకతో; నగధరునగరంబునకున్= గోవర్ధనపర్వతాన్ని తాల్చిన శ్రీకృష్ణునియొక్క నగరమైన ద్వారకకు; అరుగుదేరన్= రాగా; పౌరజనంబుల్= పురంలోని ప్రజలు; భయ+ఆకుల+మానసులు+ఐ= భయంతో కూడిన మనస్సులు కలవారై; దావదహనిన్= దావాగ్నిని; కని= చూచి; పరచు= పరువెత్తునట్టి; వనమృగంబుల= అడవిజంతువుల; చాడ్పునన్= విధంగా; పఱచి= పారిపోయి; సుధర్మ+అభి+అంతరమున= 'సుధర్మ' అనే సభాస్థలమధ్యభాగంలో; కని= చూచి; రక్షరక్ష+ఇతి రవంబులన్= రక్షించు రక్షంచు అనేశబ్దాలతో; ఆర్తులు+అయి= బాధను పొందినవారై; కృష్ణ!కృష్ణ!= కృష్ణా!, కృష్ణా!; పెనుమంటలన్= పెద్దమంటలతో; పురంబున్= పురాన్ని; కాల్పన్= కాల్చుటకై; ప్రళయ+అగ్ని= ప్రళయకాలంనాటి అగ్ని; చనుదెంచెన్= వచ్చిపడింది; అనన్= అని చెప్పగా; వారిన్= ఆ ప్రజలను; చూచి; ఓడకుడు+ఓడకుఁడు+అని= భయపడవద్దు, భయపడవద్దు అంటూ; భయంబు= భయాన్ని; నివారించి= పోగొట్టి; సర్వరక్షకుండు+ఐన= అన్నిటినీ కాపాడేవాడైన; పుండరీక+అక్షుండు= శ్రీకృష్ణుడు; జగత్+అంతర+ఆత్ముడు+ఐ= విశ్వవ్యాపకుడైనాడు; కావునన్= కాబట్టి; తద్+వృత్త+అంతంబు+అంతయున్= ఆ సమాచారం అంతటినీ; తన= తనయొక్క; దివ్యచిత్తంబునన్+ఎఱింగి= దివ్యమనస్సులో తెలుసుకొని; కాశీరాజపుత్ర= కాశీరాజు కుమారుడగు సుదక్షిణునిచే; ప్రేరిత+ఐన= ప్రేరేపింపబడిందైన; ఆ+మహాకృత్యను= ఆ గొప్పకృత్యను; నిగ్రహింపన్= అడ్డగించుటకై; తలఁచి= కోరి; నిజపార్శ్వవర్తి+ఐ= తనకు సమీపంలో; ఉన్న; ఆ+దివ్య= ప్రసిద్ధమైనా, దేవతాసంబంధమైన; సాధనమును= పరికరాన్ని (సుదర్శనం); కనుంగొని= చూచి; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** మారణహోమాగ్ని ఉన్న హోమకుండం నుండి కృత్య భయంకర రూపంతో, రక్తంతో కూడిన నాలుకతో పెదవులను నాకుకొంటూ వచ్చి, అగ్నిజ్వాలవంటి శూలాన్ని ధరించి, తన పాదఘట్టనవల్ల దుమ్ము వ్యాపిస్తుండగా భూతాలు తనను సేవిస్తూండగా, కన్నులనుండి రాలే మంటలతో దిక్కులను కాలుస్తూ, మిక్కిలి వేగంగా కృష్ణుడుండే ద్వారకానగరం చేరింది. ద్వారకావాసులు భయపడి రక్షించు రక్షించుమని కృష్ణుణ్ణి వేడారు. కృష్ణుడు పారిపోకుడని వారికి ధైర్యం చెబుతూ, తన దివ్యదృష్టితో విషయం తెలుసుకొన్నాడు. ఈ పని సుదక్షిణుడు చేసిన మారణహోమఫలం అని తెలిసికొని, కృత్యను అడ్డగించేందుకు సుదర్శనచక్రాన్ని పంపాడు.

**విశే :** కృత్య శత్రుసంహారంకోసం - అందుకు తగిన మంత్రాలతో, వస్తువుల్తో హోమంచేస్తే ఆ హోమంనుండి పుట్టే క్షుద్రదేవతా శక్తి. 'కృత్య - ఆజ్ఞాపించినపనిని చేసేది' అని వ్యుత్పత్తి.

సీ. భీమమై బహుతీవ్రధామమై హతరిపుస్తోమమై సుమహితోద్దామ మగుచుఁ
జండమై విజితమార్తాండమై పాలితాజాండమై విజయప్రకాండ మగుచు
దివ్యమై నిఖిలగంతవ్యమై సుజనసంభావ్యమై సద్భక్తసేవ్య మగుచు
నిత్యమై నిగమసంస్తుత్యమై వినమితాదిత్యమై నిర్జితదైత్య మగుచు

తే. విలయసమయసముద్భూతవిపులభాస్వ, దళికలోచనలోచనానలసహస్ర
ఘటితపటుసటాజ్వాలికాచటులసత్త్వ, భయదచక్రంబు కృత్యపైఁ బంపె శౌరి. 534

**ప్రతి :** శౌరి= కృష్ణుడు; భీమము+ఐ= భయంకరమైనదై; బహుతీవ్రధామము+ఐ= మిక్కిలి తీవ్రమగు కాంతికలదై; హత= చంపబడ్డ; రిపు= శత్రువుల; స్తోమము+ఐ= సమూహం కలదియై; సుమహిత+ఉద్దామము+అగుచున్= తీవ్రమైన మహామహిమ విజృంభణంకలది అవుతూ; చండము+ఐ= తీవ్రమై; విజిత= జయింపబడ్డ; మార్తాండము+ఐ= సూర్యుడు కలదై; పాలిత+అజాండమై= పాలింపబడ్డ బ్రహ్మాండం గలదై; విజయప్రకాండము+అగుచున్= విజయపరంపరచే శ్రేష్ఠమైనది అవుతూ; దివ్యము+ఐ= లోకాతీతమైనదై; నిఖిల= అన్నిదిక్కులకు; గంతవ్యము+ఐ= పోగలిగిందై; సుజన= మంచివారిచే; సంభావ్యము+ఐ= సమ్మానింపదగిందై; సత్+భక్త= మంచిభక్తులకు; సేవ్యము+అగుచున్= సేవింపదగింది అవుతూ; నిత్యము+ఐ= శాశ్వతమైందై అవుతూ; నిగమసంస్తుత్యము+ఐ= వేదాలచే స్తుతించదగిందై; వినమిత= వినయంతో వంగిన; ఆదిత్యము+ఐ= ఆదిత్యుని కలదై; నిర్జిత= జయింపబడ్డ; దైత్యము+అగుచున్= రాక్షసులుగలది అవుతూ; విలయసమయ= ప్రళయకాలంలో; సముద్భూత= పైకెగసిన; విపుల= విస్తారమైన; భాస్వత్= ప్రకాశించే; అళికలోచన= నుదిటి కన్నుగల శివుని; లోచన+అనల= నేత్రాగ్నియొక్క; సహస్రఘటితపటు సటాజ్వాలికా= వేలకొలదిగా గుబురుకొన్న జూలు అనెడి మంటలచేత; చటుల= తీక్ష్ణమైన; సత్త్వభయద= ప్రాణులకు భయాన్ని కల్గించేదైన; చక్రంబు= సుదర్శనచక్రాన్ని; కృత్యపైన్= కృత్యమీదికి; పంపెన్= పంపాడు.

**తా :** కృష్ణుడు భయంకరమైన శత్రువులను చంపేట్టిదీ, సూర్యకాంతిని ధిక్కరించేకాంతి కలదీ, అన్ని దిక్కులకు పోగలిగినట్టిదీ, శాశ్వతమైందీ, వేదాలచే స్తుతింపదగిందీ, సుజనులచే స్తుతింపబడేదీ, భక్తులచేత సేవింపబడేదీ, దేవతలచే నమస్కరింపబడేదీ, రాక్షససంహారం చేసేదీ, ప్రళయకాలంలో శివునిఫాలనేత్రంనుంచి వెలువడిన మంటలవలె భయంకరమై తన జూలు అనెడి అగ్నిజ్వాలలతో ప్రాణులకు భయాన్ని కల్గించేదీ అయిన సుదర్శనచక్రాన్ని కృత్యపైకి పంపాడు.

**వ. అదియును బ్రళయవేళాసంభూతజీమూతసంఘాతప్రభూతఘుమఘుమాటోపనినదాధరీకృత మహాదుస్సహకహకహ నిబిడనిస్వన నిర్ఘోషపరిపూరితబ్రహ్మాండకుహరంబును, నభ్రంలిహకీలాసముత్కట పటుచిటపటస్ఫుటద్విస్ఫులింగచ్ఛటాభీలంబును, సకలదేవతాగణ, జయ జయ, శబ్దకలితంబును, ననంతతేజోవిరాజితంబును నగుచుం గదిసినం బంటింపక కంటగించు కృత్యను గెంటి వెంట నంటిన నది తన తొంటి రౌద్రంబు విడిచి మరలి కాశీపురంబు సొచ్చి పౌరలోకంబు భయాకులతం బొంది వాపోవ, రోషభీషణాకారంబుతో నప్పుడు ఋత్విజ్నికాయయుతంబుగ సుదక్షిణుని దహించె, నత్తఱిఁ జక్రంబును దన్నగరంబు సౌధప్రాకారగోపురాట్టాలకాదివివిధవస్తువాహననికరంబుతో భస్మంబు గావించి మరలి యమరులు వెఱఁగందఁ గమలలోచనపార్శ్వవర్తియై నిజప్రభాపుంజంబు వెలుఁగొందఁ గొల్చియుండె నని చెప్పి మఱియు నిట్లనియె.** 535

**ప్రతి :** అదియును= ఆ సుదర్శనచక్రం; ప్రళయవేళా= ప్రళయకాలంలో; సంభూత= ఏర్పడిన; జీమూత= మేఘాలయొక్క; సంఘాత= సంయోగంవల్ల; ప్రభూత= పుట్టిన; ఘుమఘుమ+ఆటోప= ఘుమఘుమ అనే ధ్వనులయొక్క; ఆటోప= ఆడంబరంచే కలిగిన; నినద= ధ్వనులచే; అధరీకృత= తక్కువగా చేయబడిన; మహా= గొప్పవైన; దుస్సహ= సహించలేని; కహకహ= గర్జనలవల్ల కలుగుధ్వనిచే; నిబిడ= గాఢమైన; నిస్వన= ధ్వనియొక్క; నిర్+ఘోషపరిపూరిత= మ్రోతచే బాగుగ నిండిన; బ్రహ్మాండకుహరంబును= బ్రహ్మాండాలనే బిలం(రంధ్రం)కలదియు; అభ్రంలిహ= మేఘాల రాపిడివల్ల కలిగే; కీలా= మంటలయొక్క; సముత్కట= ఆధిక్యంతో; పటు= దిటవుగల; చిటపట= చిటపటధ్వనులయొక్క; స్ఫుటత్+విస్ఫులింగ+ ఛటా+ఆభీలంబున్= స్పష్టమైన అగ్నికణాలయొక్కకాంతిచే భయాన్ని కలిగించేది; సకల= సర్వ; దేవతాగణ= దేవతలసమూహం యొక్క; జయజయశబ్దకలితంబునున్= జయ, జయ అనే శబ్దాలచేత కూడింది; అనంత= అంతంలేని; తేజస్= తేజంచే; విరాజితంబునున్= ప్రకాశించబడేది; అగుచున్= అవుతూ; కదిసినన్= మీదకురాగా; పంటింపక= సంకోచింపక; కంటగించు= ద్వేషించే; కృత్యను= కృత్యను; గెంటి= నెట్టివేసి; వెంటన్+అంటినన్= అనుసరించి వెడలగా; అది= ఆ కృత్య; తన= తనయొక్క; తొంటి= పూర్వపు; రౌద్రము= కోపాన్ని; విడిచి= వదలి; మరలి= వెనుకకు తిరిగి; కాశీపురంబున్+చొచ్చి= కాశీనగరం దూరి; పౌరలోకము= పురప్రజలు; భయ+ఆకులతన్= భయంతో వ్యాకులపాటు; పొంది= పొందినవారై; వాపోవన్= దుఃఖంతో అరుస్తుండగా; రోష= కోపంచే; భీషణ= భయంకరమైన; ఆకారంబుతో= రూపంతో; అప్పుడు= ఆ సమయంలో; ఋత్విజ్+నికాయ= అభిచారహోమం చేయించే బ్రాహ్మణులసమూహంతో; యుతంబుగ= కూడిన; సుదక్షిణునిన్= సుదక్షిణుణ్ణి; దహించెన్= కాల్చింది; ఆ+తఱిన్= ఆ సమయంలో; చక్రంబును= సుదర్శనచక్రంకూడా; తద్+నగరంబు= ఆ పట్టణంలోని; సౌధ= భవనాల్ని; ప్రాకార= చుట్టుగోడల్ని; గోపుర+అట్టాలక+ఆది= గోపురాలు, బురుజులు మొదలగు; వివిధవస్తువాహననికరంబుతోన్= అనేకం అయిన వస్తు వాహనముల సమూహంతోపాటుగా; భస్మంబు కావించి= బూడిద చేసి; మరలి= వెనుకకు వచ్చి; అమరులు= దేవతలు; వెఱగందన్= ఆశ్చర్యపడుతూండగా; కమలలోచనపార్శ్వవర్తియై= కృష్ణునియొక్క సమీపంలో ఉన్నదై; నిజ= తనయొక్క; ప్రభాపుంజంబు= కాంతి సమూహం; వెలుఁగు+ఒందన్= ప్రకాశిస్తుండగా; కొల్చి= సేవించి; ఉండెన్+అని= ఉండెనని; చెప్పి; మఱియున్= ఇంకా; ఇట్లు+ అనియెన్= ఈ విధంగా అన్నాడు - శుకమహర్షి

**తా :** ఆ చక్రాయుధం ప్రళయకాలంనాటి మేఘాలనుంచి పుట్టిన ధ్వనివంటి భయంకర ధ్వనితో, ఆకాశాన్నంటుతున్న అగ్నిజ్వాలలతో, సకలదేవతలు జయ జయధ్వానాలు చేస్తుండగా, అమిత తేజస్సుతో వెలుగొందుతూ కృత్యను సమీపించింది. తనను చూచి తడబడకుండా కంటగించుకుంటున్న కృత్యను గెంటివేసి వెంటబడింది. అప్పుడు కృత్య తన పూర్వపు రౌద్రరూపాన్ని వదలి తిరిగి కాశీపురంలో దూరింది. మరలి వచ్చిన కృత్యను చూచి పౌరులంతా భయపడి శోకిస్తుండగా ఆ కృత్య రోషభీషణమైన ఆకారంతో ఋత్విజులతోపాటు సుదక్షిణుణ్ణి దహించివేసింది. అప్పుడు శ్రీకృష్ణుని చక్రాయుధం సౌధగోపుర ప్రాకారాలతో పాటు ఆ నగరాన్ని భస్మీపటలం చేసింది. దేవతలంతా ఆశ్చర్యపడేట్లు శ్రీకృష్ణునిచెంతకు చేరింది అని శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుతో చెప్పి, కృష్ణగాథను ఇంకా కొనసాగించాడు.

**క. మురరిపువిజయాంకితమగు, చరితము సద్భక్తిఁ దగిలి చదివిన వినినన్**
**దురితములఁ బాసి, జను లిహపరసౌఖ్యము లతనిచేతఁ బడయుదు రధిపా! 536**

**ప్రతి :** అధిపా!= ఓరాజా!; మురరిపు= కృష్ణునియొక్క; విజయ+అంకితము+అగు= 'శ్రీకృష్ణవిజయం' అనే పేరుగల; చరితము= ఈ చరిత్రను; సత్+భక్తిన్= ఉత్తమ భక్తితో; చదివినన్= చదివినా; వినినన్= విన్నా; జనులు= ప్రజలు;

దురితములన్+పాసి= పాపాల్ని పోగొట్టుకొని; అతనిచేతన్= ఆ భగవంతునివల్ల; ఇహ= ఈలోకంయొక్క; పర= పరలోకంయొక్క; సౌఖ్యములు= సుఖాల్ని; పడయుదురు= పొందుతారు.

**తా :** పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణ విజయం అనే పేరుగల ఈ చరిత్రను చదివినా, విన్నా భగవంతుని కృపచే పుణ్యాత్ములై ఇహపరలోక సుఖాలను పొందుతారు.

**వ. అనిన శుకయోగికి రాజయోగి యిట్లనియె. 537**

**ప్రతి :** అనినన్= అనిచెప్పగా; శుకయోగికిన్= వ్యాసుని కుమారుడగు శుకునితో; రాజయోగి= రాజయోగి అయిన పరీక్షిన్మహారాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** రాజయోగియగు పరీక్షిన్మహారాజు శుకునితో ఇలా అన్నాడు.

### ✤ బలరాముండు ద్వివిదుఁడను వానరుని సంహరించుట ✤

**క. బలభద్రుఁ డప్రమేయుం, డలఘుఁ డనంతుండు నతనియద్భుతకర్మం**
**బులు వినియు, దనియ దింకను, దెలియఁగ నా కాన తిమ్ము దివ్యమునీంద్రా! 538**

**ప్రతి :** దివ్యముని+ఇంద్రా!= దైవత్వంగల ఓ మునిశ్రేష్ఠా!; బలభద్రుఁడు= బలరాముడు; న+ప్రమేయుండు= అప్రమేయుండు= ఇంతంత అని చెప్పడానికి వీలుకానివాడు; న+లఘుఁడు= అలఘుఁడు= గొప్పవాడు; న+ అంతుఁడున్= అంతంలేనివాడు(అయిన); అతని= ఆ బలరామునియొక్క; అద్భుతకర్మంబులు= (అతడు)చేసిన అపురూపమైన పనులు; వినియున్= విన్నప్పటికీ; తనియదు= తృప్తికలుగలేదు; ఇంకను= ఇంకా మరికొన్ని; తెలియన్+కన్= తెలుసుకునేలా; నాకున్= నాకు; ఆనతి+ఇమ్ము= సెలవీయండి.

**తా :** దైవత్వంగల ఓ శుకమహర్షీ! బలరాముడు ఎంతో గొప్పవాడు, సర్వాధికుడు, అంతంలేనివాడు. అతణ్ణి గురించి, అతడుచేసిన అద్భుతమైన పనుల్ని గురించి ఎంత విన్నప్పటికీ నాకు తనివి తీరడంలేదు. ఆ బలరాముణ్ణి గురించి మరికొన్నివిశేషాలు నాకు విశదీకరించి తెలియజేయండి – అని పరీక్షిన్మహారాజు కోరాడు.

**విశే :** ఈ పద్యంలో బలరాముడికి – అప్రమేయుడు, అలఘుడు, అనంతుడు – అనే మూడువిశేషణాలు ప్రయోగించాడు – కవి. వీటిలో అనంతుడు అనేది సాభిప్రాయవిశేషణం. అనంతుడు అంటే శ్రీహరికి పాన్పుగా ఉన్న ఫణిరాజు అనికూడా అర్థం. బలరాముడు శేషునిఅవతారం. ఆ అర్థాన్నికూడా ఇక్కడ సమన్వయించుకోవాలి. మూలంలోని 'అనంతస్యాప్రమేయస్య' – అనే ప్రయోగంలోని చమత్కారాన్ని గమనించి, పోతన యథాతథంగా అనుసరించారు.

**వ. అనిన రాజునకు శుకుం డిట్లనియె. 539**

**ప్రతి :** అనినన్= అనగా; రాజునకున్= రాజుతో; శుకుండు= శుకమహర్షి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** బలరాముని విశేషాలు మరికొన్ని చెప్పుమన్న రాజుతో శుకమహర్షి ఇలా చెప్పాడు.

**క. జననాయక! విను సుగ్రీ, వుని సచివుఁడు మైందునకు సహోదరుఁ డనఁగా**
**వినుతికి నెక్కిన ద్వివిదుం, డను ప్లవగుఁడు నరకసఖ్యుఁ డతిదర్పితుఁడై. 540**

**ప్రతి :** జననాయక!= ఓ రాజా!; విను= వినవయ్యా!; సుగ్రీవుని సచివుఁడు= శ్రీరామునితో మైత్రినెరపిన సుగ్రీవుడనే వానరరాజుకు మంత్రియైన; మైందునకున్= మైందుడు అనేవానికి; సహోదరుఁడు= తోడబుట్టినవాడు; అనఁగా= అని; వినుతికిన్ ఎక్కిన= ప్రసిద్ధికెక్కిన; (ప్రశంసలు పొందినవాడు); ద్వివిదుండు+అను= ద్వివిదుడు అనే పేరుగల; ప్లవగుఁడు= వానరుడు; నరకసఖ్యుఁడు= నరకాసురుని మిత్రుడు; అతిదర్పితుఁడు+ఐ= మిక్కిలి మదించినవాడై...

**తా :** ఓ రాజా! సుగ్రీవునిమంత్రి, మైందునికి తోడబుట్టినవాడు అయిన ద్వివిదుడు అనే వానరశ్రేష్ఠుడు నరకాసురునికి చెలికాడు కావడంతో మిక్కిలి గర్వితుడై

**విశే :** ఈ పద్యంలో ప్రస్తావింపబడిన సుగ్రీవుడు - మైందుడు - ద్వివిదుడు - త్రేతాయుగంలో శ్రీరాముని వానరసేనలోనివారే. సుగ్రీవుడు రామునికి ప్రియమిత్రుడు.

**సీ. చెలికానిపగఁ దీర్పఁ దలఁచి కృష్ణుం డేలు పురములు జనపదంబులు దహించి**
**సరిదుపవనసరోవరములు గోరాడి మందలఁ గొందల మందఁజేసి**
**ప్రాసాదములు ద్రొబ్బి పరిఖలు మాయించి చతురంగబలముల సమయఁజేసి**
**పురుషుల సతులను భూధరగుహలలోఁ బెట్టి వాకిలి గట్టి బిట్టు నొంచి**

**తే. ఫలితతరువులఁ ద్రుంచి సాధుల నలంచి, కోట లగలించి పడుచుల నీట ముంచి**
**ధరణి నిబ్భంగిఁ బెక్కుబాధలఁ జలంబు, పరఁగఁ జేయుచు నొకనాఁడు ప్లవగవరుఁడు. 541**

**ప్రతి :** చెలికానిపగన్= మిత్రుడైన నరకాసురునిపగను; తీర్పన్= తీర్చడానికి; తలఁచి= ఆలోచించి; కృష్ణుండు+ఏలు= శ్రీకృష్ణుడు పరిపాలించే; పురములు= పట్టణాలు; జనపదంబులు= పల్లెపట్టులు; దహించి= కాల్చి; సరిత్+ఉపవన+సరోవరములు= నదులు, ఉద్యానవనాలు, కొలనులు; కోరాడి= మట్టిత్రవ్వి ఎగజల్లి; మందలన్= ఆవుల గుంపుల్ని; కొందలము+అందన్= బాధపడేట్లు చేసి; ప్రాసాదములు= మేడలు; ద్రొబ్బి= పడగొట్టి; పరిఘలు= అగడ్తల్ని; మాయించి= పూడ్చివేసి; చతురంగబలములు= రథ, గజ, తురగ, పదాతులనే నాలుగుఅంగాలుగల సేనల్ని; సమయఁన్+చేసి= చంపి; పురుషులన్= మగవారిని; సతులన్= ఆడువారిని; భూధరగుహలలోన్= కొండగుహల్లో; పెట్టి= బంధించి; వాకిలి= ఆ గుహల ద్వారాలు; కట్టి= మూసి; బిట్టు= మిక్కిలి; నొంచి= బాధించి; ఫలిత తరువులన్= పండినపళ్లతో నిండిన చెట్లను; త్రుంచి= విరిచి; సాధులన్= ఎట్టిపాపకార్యాలు చేయనిసాధుల్ని; అలంచి= శ్రమపెట్టి; కోటలు= కోటలూ (ప్రాకారాలూ); అగలించి= పెల్లగించి; పడుచులన్= స్త్రీలను; నీటన్+ముంచి= నీళ్ళలో ముంచి; ధరణిన్= భూమిపై; ఈ+భంగిన్= ఈ విధంగా; పెక్కుబాధలన్= అనేకవిధాలయినబాధలతో; చలంబు పరఁగన్+చేయుచున్= మాత్సర్యం వహిస్తూ; ఒకనాఁడు= ఒకానొకనాడు; ప్లవగవరుఁడు= ఆ వానరశ్రేష్ఠుడు...

**తా :** ద్వివిదుడు తన స్నేహితుడైన నరకుణ్ణి శ్రీకృష్ణుడు చంపినందుకు శ్రీకృష్ణునిమీద పగదీర్చుకోదలచాడు. అందుకై కృష్ణుడు పరిపాలించే పట్టణాల్లోనూ, పల్లెల్లోనూ ప్రవేశించి వాటిల్ని పాడుచేస్తూ, దహించివేస్తూ, రాజులు నివసించే అంతఃపురాలను పడగొట్టి, అగడ్తలు పూడ్చివేసి, నదుల్ని, ఉద్యానవనాల్ని, కొలనుల్ని తవ్విపోసి, స్త్రీపురుషుల్ని పట్టుకుని తీసుకుపోయి కొండగుహల్లో బంధించి, గుహల వాకిళ్లు మూసివేసి నానావిధాలయిన బాధలుపెట్టి, బాగా పండినచెట్లను విరిచివేసి, సాధువుల్ని హింసించి - భూమినంతా బహురీతులుగా మాత్సర్యంతో బాధలుపెడుతూ ఆ వానరుడు ఒకనాడు

**క. చతురమృదు గీతరవము, న్నతి వీతెంచినఁ జెలంగి నగచరుఁ డా రై**
**వతగిరికందరమున కా, యతిగతిఁ జని యందు నెత్త మాడెడువానిన్. 542**

**ప్రతి :** చతుర= మనోజ్ఞమైన; మృదు= లలితమైన; గీతరవము= సంగీతధ్వని; ఉన్నతిన్= మేలిమిగా – పెద్దస్వరంతో; వీతెంచినన్= వినిపించగా; నగచరుఁడు= కొండలలో చరించేవానరుడు, (ద్వివిదుడు); ఆ+రైవతగిరి= ఆ రైవతమనే పర్వతంయొక్క; కందరమునకున్= గుహలోనికి; ఆయతగతిన్= తొందర తొందరగా; చని= వెళ్ళి; అందున్= ఆ గుహలో; నెత్తము+ఆడెడువానిన్= పాచికలు ఆడుతున్నవాణ్ణి (జూదం అని చెప్పవచ్చు)...

**తా :** మిక్కిలి మనోజ్ఞమయిన లలితగీతంయొక్క సవ్వడి వినబడగా, ఆ పాట వినబడిన దిక్కుగా రైవతపర్వతం గుహదగ్గరకు వడివడిగా వెళ్ళి, అక్కడ పాచికలాడుతున్నవాణ్ణి

**చ. లలితవినీలవస్త్రుని విలాసవతీయుతుఁ జంద్రచంద్రికా**
**కలితమహోన్నతాంగు మణికాంచనదివ్యవిభూషణోన్నతున్**
**విలసితవారుణీసమదవిహ్వలలోచనుఁ గాంచె సీర ని**
**ర్దళితరిపుక్షితీశనిజధాముని రాముని కామపాలునిన్. 543**

**ప్రతి :** లలితవినీలవస్త్రునిన్= సుకుమారమైన నీల వస్త్రంగలవాణ్ణి; విలాసవతీయుతున్= శృంగారభావాలతో కూడిన యువతులతో కూడి ఉండేవాణ్ణీ; చంద్రచంద్రికా= చంద్రుని వెన్నెలతో; కలిత= కూడుకున్న; మహా+ఉన్నత+అంగున్= గొప్పదేహంగలవాణ్ణి; మణి= మణులు పొదిగిన; కాంచన= బంగారంతో చేయబడిన; దివ్యవిభూషణ+ఉన్నతున్= దివ్యమైన నగలతో అధికుడైనవాణ్ణి; విలసిత= ప్రకాశిస్తున్న; వారుణీ= కాదంబరీ అనే మద్యంవల్ల; సమద= మదంతోగూడిన; విహ్వల= తిరుగుడుపడుచున్న; లోచనున్= కన్నులుగలవాణ్ణి; సీర= నాగటిచే; నిర్దళిత= చీల్చబడిన; రిపుక్షితి+ఈశ= శత్రురాజులయొక్క; నిజ= స్వకీయమైన; ధామునిన్= ఇండ్లుగలవాణ్ణి; కామపాలునిన్= మన్మథుని పాలించేవాడు అయిన; రామునిన్= బలరాముణ్ణి; కాంచెన్= చూశాడు.

**తా :** మనోహరమైన నీలపువస్త్రాలు ధరించినవాడూ, వేడుక కత్తెలయిన యువతులతో కూడుకున్నవాడూ, స్వచ్ఛమైన వెన్నెలకాంతివంటి కాంతిగల తెల్లనిదేహంగలవాడూ, మణిమయాలైన బంగారుసొమ్ములు అలంకరించుకొన్నవాడూ, కాదంబరీ అనే మద్యపానంచేత తిరుగుడుపడుతున్న కన్నులుగలవాడూ, నాగలితో శత్రురాజుల పట్టణాలను ధ్వంసం చేసినవాడూ; మన్మథుణ్ణి పాలించినవాడూ అయిన బలరాముణ్ణి చూశాడు.

**సీ. కనుఁగొని తత్పురోగమభూమిరుహశాఖ, లెక్కి యూఁచుచుఁ జాల వెక్కిరించుఁ;**
**గికురించుచును బండ్లిగిల్చి చూపుచు వెసఁ గొమ్మకొమ్మకు నుఱుకుచు నదల్చుఁ;**
**దోఁక నూరక మేను సోఁకఁగ నులివెట్టు; వెడవెడ నాలుక వెడలఁ బెట్టు;**
**బరుల నఖంబుల గిరగిర గోఁకుచుఁ బొరిఁబొరి ఫలములు గఱచివైచు;**

**తే. గోళ్ళు తెగ గొర్కి యుమియును; గుదము సూపు;, బలసి మర్కటజాతి యి ప్పగిదిఁ జేయఁ**
**గోపమున హలధరుఁ డొక గుండు వైవ, దానిఁ దప్పించుకొని ప్రల్లదమున నతని. 544**

**ప్రతి :** కనున్+కొని= చూచి; తత్+పురోగమ= ఆ బలరామునికి ఎదురుగా ఉన్న; భూమిరుహ= వృక్షాలయొక్క; శాఖలు= కొమ్మలను; ఎక్కి; ఊఁచుచున్= ఊపుతూ; చాలన్= మిక్కిలి; వెక్కిరించున్= వెక్కిరిస్తూ; కికురించుచున్= మోసంచేస్తూ; పండ్లు+ఇగిల్చి+చూపుచున్= పండ్లికిలించి చూపుతూ; నవ్వుచున్= నవ్వుతూ; కొమ్మకొమ్మకున్+ఉఱుకుచున్= ఈ కొమ్మమీదనుండి ఆ కొమ్మమీదకు, ఆ కొమ్మమీదనుండి ఈ కొమ్మమీదకు దుముకుతూ; అదల్చున్= గద్దిస్తూ; తోఁక= తోఁకను; ఊరక= అదేపనిగా కారణంలేకుండా; మేనుసోఁకఁగన్= శరీరానికి తాకేట్లుగా; నులివెట్టు= మెలిపెడుతూ; వెడవెడనాలుక= మధ్యమధ్యలో నాలుకను; వెళ్ళన్+పెట్టు= బయటకి చూపుతూ; బరులన్= శరీరంయొక్క పక్కభాగాల్ని; నఖంబులన్= గోళ్లతో; గిరగిరన్= గిరగిర అనే ధ్వని కలుగునట్లు; గోఁకుచున్= గోకుకొంటూ; పొరిన్+పొరిన్= మాటిమాటికీ; ఫలములు= పండ్లు; కఱచివైచున్= కొరికి కిందపడేస్తూ; గోళ్లు= గోళ్లను; తెగన్+కొర్కి= అదేపనిగా కొరికి; ఉమియును= ఉమ్మేస్తూ; గుదమున్= ముడ్డిని; చూపున్= కనబరుస్తూంది; బలిసి= కొవ్వి; మర్కటజాతి= కోతిజాతికి చెందిన వానరుడు; ఈ+పగిదిన్+చేయన్= ఈ రీతిగా చేస్తూండగా; హలధరుఁడు= బలరాముడు; కోపమునన్= కోపంతో; ఒకగుండు; వైవన్= వేయగా; దానిన్= ఆ గుండుదెబ్బను; తప్పించుకొని; ప్రల్లదమునన్= ధూర్తత్వంతో...

**తా :** ఆ బలరాముణ్ణి చూచి, ఆయనకు ఎదుట ఉండే మాకులెక్కి దానికొమ్మల్ని ఊగులాడించడం, పండ్లిగిలించి, యేమరించి ఏదో ఎత్తుకొనిపోవడం, ముడ్డిచూపడం, చెట్లపళ్లను కొఱికి కొఱికి పారవేయడం మొదలయిన కోతిచేష్టలు చేస్తూండగా బలరాముడు కోపించి ఒక గుండెత్తి ఆ కోతిపై వేశాడు. ఆ కోతి ఆ గుండుదెబ్బను తప్పించుకొని దుష్టత్వంతో బలరాముణ్ణి

**క. నగి యాసవకలశముఁ గొని, జగతీరుహశాఖ యెక్కి చాపలమున న**
**జ్జగతిపయి వైచెఁ దద్ఘట, మగలగ; నది చూచి కోప మగ్గల మొదవన్. 545**

**ప్రతి :** నగి= నవ్వి – పరిహాసంచేసి (వెక్కిరించి); ఆసవకలశమున్+కొని= ఆ కల్లు ముంతను తీసుకొని; జగతీరుహశాఖ+ఎక్కి= చెట్టుకొమ్మనెక్కి; చాపలమునన్= చపలత్వంతో; ఆ+జగతిపయిన్= ఆ భూమిమీద; తద్+ఘటము= ఆ ముంతను; అగలన్+కన్= పగులునట్లుగా; వైచెన్= పడవేశాడు; అది చూచి; కోపం; అగ్గలము+ఒదవన్= అధికంకాగా...

**తా :** బలరాముణ్ణి వెక్కిరిస్తూ ఆ ద్వివిదుడు అక్కడగల బలరాముని మద్యపుకుండను ఎత్తుకొని ఒక చెట్టుకొమ్మ మీదికిపోయి అక్కడనుండి నేలమీదకు పడవేసి పగులగొట్టాడు – కల్లుకుండ ఛిన్నాభిన్నమై పడిఉండటాన్ని చూచిన బలరాముడు మిక్కిలి కోపంతో

**వ. మఱియును. 546**

**తా :** ఇంకనూ

**క. సీరినిఁ దన మనమున నొక, చీరికిఁ గైకొనక కదిసి చీరలు చింపన్**
**వారక దా భువిజనములఁ, గారించుట మాన్పఁ దలఁచి ఘనకుపితుండై. 547**

**ప్రతి :** సీరినిన్= బలరాముణ్ణి; తన మనమునన్= తన మనస్సులో; ఒక చీరికిన్+కైకొనక= ఒక కొంచెమైన లెక్కసేయక; కదిసి= దగ్గరకు వచ్చి; చీరలు చింపన్= కట్టుకున్న వస్త్రాలు చింపగా; వారక= తప్పక; తాన్= తాను; భువిజనములన్= భూమిమీద ప్రజలను; కారించుటన్= బాధించుటను; మాన్పన్+తలఁచి= మాన్పింపతలచి; ఘనకుపితుండు+ఐ= మిక్కిలి కోపించినవాడై...

**తా :** ద్వివిదుడు బలరాముణ్ణి ఏ కొంచెంకూడా లక్ష్యపెట్టక, సమీపానికి వచ్చి, ఆయన ధరించిన వస్త్రాలు చింపాడు. ఆ చర్యకు బలరాముడు కోపించి, ఈ ద్వివిదునివలని బాధలు భూమిమీది ప్రజలకందరికీ లేకుండ చేయదలచినవాడై

**విశే :** చీర= వస్త్రవిశేషం. ఒకప్పుడు పురుషులూ, స్త్రీలూ అనే భేదం లేకుండా అందరూ ధరించే పెద్దవస్త్రాన్ని చీర అనే పేర్కొనేవారు. ఆధునికకాలంలో 'చీర' – అనేది స్త్రీలు ధరించే వస్త్రానికే పరిమితమయింది.

**వ. ఇట్లు కోపోద్దీపితమానసుండై కనుంగొని హలాయుధుం డప్పుడు. 548**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కోప+ఉద్దీపిత మానసుండు+ఐ= కోపంతో ప్రకాశించే (మండుతున్న) మనస్సుకలవాడై; హల+ఆయుధుండు= బలరాముడు; కనున్+కొని= ఆ ద్వివిదుణ్ణి చూచి; అప్పుడు= ఆ సమయంలో...

**చ. ముసలముఁ దీవ్రశాతహలమున్ ధరియించి సమస్తచేతన**
**గ్రసనమునాఁడు పొంగు లయకాలునిభంగి నదల్చి నిల్వ; వా**
**డసదృశవిక్రమక్రమవిహార మెలర్ప సమీపభూజమున్**
**వెసఁ బెకలించి మస్తకము వ్రేసెఁ జలంబు బలంబు చొప్పడన్. 549**

**ప్రతి :** ముసలమున్= తన ఆయుధమైన రోకలిని; తీవ్రశాతహలమున్= తీవ్రమైన పదును కలదైన నాగేటిని; ధరియించి= చేతపుచ్చుకొని; సమస్తచేతన గ్రసనమునాఁడు= ఎల్లప్రాణులను మింగునట్టి ప్రళయకాలంలో; పొంగు= విజృంభించే; లయకాలునిభంగిన్= ప్రళయకాలంలోని యమునిలాగా; అదల్చి= అదలించి; నిల్వన్= నిలువగా; వాఁడు= ఆ ద్వివిదుడు; అసదృశ= సాటిలేని; విక్రమ= పరాక్రమంయొక్క; క్రమ= తీరు; విహారము= మెలకువ; ఎలర్పన్= ప్రకాశింపగా; సమీపభూజమున్= దగ్గరలోగల వృక్షాన్ని; వెసన్= వేగంగా; పెకలించి= పెళ్లగించి; చలంబు= మాత్సర్యమూ; బలంబు= శక్తీ; ఏర్పడన్= కలిసేట్లుగా; మస్తకమున్= బలరామునిశిరస్సును; వ్రేసెన్= కొట్టాడు.

**తా :** బలరాముడు అప్పుడు తన ముసలాయుధాన్నీ, హలాయుధాన్నీ ధరించి, సమస్తప్రాణికోటిని నశింపచేసే ప్రళయకాలంలోని యమునిలాగా ఆ వానరుణ్ణి అదిలించి, ఎదురు నిలిచాడు. ద్వివిదుడుకూడా బలరాముణ్ణి లక్ష్యపెట్టక పరాక్రమాతిశయంతో తనకు చేతివాటు దూరంలోని ఒక్క వృక్షాన్ని పెళ్లగించుకొని వచ్చి, బలరాముణ్ణి తలమీద మోదాడు.

**వ. ఇట్లు వ్రేయ బలుం డప్పుడు. 550**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వ్రేయన్= మోదగా; బలుండు= బలరాముడు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఈ విధంగా ఆ వానరుడు కొట్టగా బలరాముడు ఆ సమయంలో

**చ. ఉరవడి దండతాడితమహోరగుభంగిఁ గడంగి వీర సా**
**గరమన నేఁచి హేమకటకంబుల నొప్పు సునందనామ భీ**
**కర ముసలంబునన్ ద్వివిదుకంఠము వ్రేసినఁబొల్చె వాఁడు జే**
**గురు గల కొండచందమునఁ గోయని యార్చి సురల్ నుతింపఁగన్. 551**

**ప్రతి :** ఉరవడిన్= మిక్కిలి వేగంగా; దండతాడిత= కర్రతో కొట్టబడిన; మహా+ఉరగుభంగిన్= పెద్దపామువలె; కడంగి= పూని; వీరసాగరము+అనన్= వీరరస సముద్రమనేలా; ఏఁచి= విజృంభించి; కో అని+ఆర్చి= 'కో' అనే ధ్వని కలిగేలా

కేకవేసి; సురలు= దేవతలు; నుతింపన్+కన్= పొగడగా; హేమకటకంబులన్= బంగారుకట్లతో; ఒప్పు= అందంగా కనబడే; సునందనామ= సునందం అనే పేరుగల; భీకర= భయం కలిగించే; ముసలంబునన్= రోకటితో; ద్వివిదుకంఠమున్= ద్వివిదుని మెడమీద; వ్రేసినన్= కొట్టగా; వాఁడు= ఆ ద్వివిదుడనే వానరుడు; జేగురు గల కొండచందమునన్= ఎర్రని చారికలుగల కొండవలె; పొల్చెన్= కనబడ్డాడు (చలించలేదు).

**తా :** కర్రతో కొట్టబడిన పెద్దపాము మిక్కిలి వేగంగా ఒక్కసారిగా ఎగసిపడినట్లు, అంతులేని వీరరసం విజృంభించినట్లు బలరాముడు ప్రకాశిస్తూ, సునందం అనే పేరుగలదీ, బంగారపుకట్లువేసి తయారు చేయబడినదీ అయిన రోకలితో – ఒకవైపు దేవతలందరూ కోయని కేకలువేస్తూ, పొగడుతూ ఉండగా, ద్వివిదుని మెడమీద కొట్టాడు. ఆ దెబ్బతో వాడు ఎర్రని చారికలుగల కొండవలె ఒంటినిండా నెత్తురు క్రమ్మగా నేలమీద చదికిలబడ్డాడు.

**మత్త. అంత వాఁడొకయింత మూర్ఛిలి యంతలోఁ దెలివొంది దు**
**ర్దాంతభూరిభుజావిజృంభణుఁడై మహీజము పూన్చి దై**
**త్యాంతకాగ్రజు వ్రేసె; వ్రేసిన నాగ్రహంబున దాని నిం**
**తింతలై ధర రాలఁ జేసె నహీనవిక్రమశాలియై. 552**

**ప్రతి :** అంతన్= అంతట; వాఁడు= ఆ ద్వివిదుడు; ఒక+ఇంత= ఒక కొంచెం; మూర్ఛిలి= మూర్ఛపోయి; అంతలోన్= వెనువెంటనే; తెలివి+పొంది= మూర్ఛనుండి తేరి; దుర్దాంత= అణచుటకు శక్యంగాని; భూరి= అధికమైన; భుజా= భుజబలంయొక్క; విజృంభణుడు+ఐ= అతిశయంగలవాడై; మహీజమున్= చెట్టును; పూని= చేతపట్టుకొని; దైత్య= రాక్షసులను; అంతక= నశింపచేసేవాడైనవాణ్ణి; అగ్రజున్= అన్నను (కృష్ణుని అన్నగారయిన బలరాముని); వ్రేసెన్= కొట్టారు; వ్రేసినన్= వాడు అట్లుకొట్టగా; అహీన= తక్కువకాని; విక్రమశాలి+ఐ= పరాక్రమంతో ఒప్పుతున్నవాడై; దానినిన్= ఆ వృక్షాన్ని; ఇంతింతలు+ఐ(ఇంతలు+ఇంతలు)= చిన్న చిన్న ముక్కలై; ధరన్= భూమిమీద; రాలన్+చేసెన్= రాలేటట్లుగా కొట్టాడు.

**తా :** అంతట ఆ ద్వివిదుడు కొంచెంసేపు మూర్ఛపొంది ఉంది, వెంటనే తేరుకొని అణపలేని ఆటోపంతో తన భుజబలం మెరసేటట్లు ఒక చెట్టును పెరికి బలరామునిపై వేశాడు. అంతట బలరాముడు ఆ మ్రాను తనమీద పడకముందే అది తునాతునకలై నేలపడేటట్లుగాగొట్టి తనయొక్క పరాక్రమాతిశయాన్ని ప్రకాశింపజేశాడు.

**క. మఱియును జల ముడుగక వెసఁ, దరుచరుఁ డొకతరువు వ్రేయఁ దాలాంకుఁ డనా**
**దరమునఁ దునిమిన వెండియుఁ, దొరఁగించెఁ గుజంబు లతఁడు దోడ్తోఁ దునుమన్. 553**

**ప్రతి :** మఱియునున్= ఇంకా; చలము= పట్టుదల; ఉడుగక= మానక; వెసన్= వెంటనే; తరుచరుఁడు= వానరుడైన ద్వివిదుడు; ఒకతరువు= ఒక చెట్టు; వ్రేయన్= ఎత్తుకొనివేయగా; తాల+అంకుఁడు= బలరాముడు; అనాదరమునన్= లెక్కచేయకుండా; తునిమినన్= నరకగా; వెండియున్= మరలా; అతఁడు= బలరాముడు; తోడ్తోన్= వెంటవెంటనే; తునుమన్= నరకుచుండగా; కుజంబులు= చెట్లు; తొరఁగించెన్= (అదేపనిగా పెల్లగించి) పడగొట్టాడు.

**తా :** అంతటితో తనపట్టుదలను వదలక ఆ వానరుడు ఒకచెట్టును పెరికి తనపై ప్రయోగించగా బలరాముడు దాన్ని లెక్కచేయక నరికేశాడు. వానరుడుకూడా ఆగక బలరాముడు విరగ గొట్టుతుండగా, అదేపనిగా మాకులు పెల్లగించి వేయసాగాడు.

**విశే :** తాలాంకుఁడు= తనజెండామీద **'తాటిచెట్టు బొమ్మ'** గుర్తుగా ఉండేవాడు

**క. ఆ చందంబున వనచరుఁ, డేచి మహీరుహచయంబు లెల్లను హలిపై**
**వైచి యవి శూన్య మగుటయుఁ, జూచి శిలావృష్టిఁ గురిసె సుర లగ్గింపన్. 554**

**ప్రతి :** ఆ+చందంబునన్= ఆ విధంగా; వనచరుఁడు= వానరుడు; ఏచి= అతిశయించి; మహీరుహచయంబున్= చెట్లసముదాయాన్ని; ఎల్లన్= అన్నిటినీ; హలిపై= బలరామునిపై; వైచి= వేసి; అవి= ఆ చెట్లు; శూన్యము+అగుటయున్= లేకుండడం; చూచి; శిలావృష్టి= రాళ్ళవాన; కురిసెన్= కురిపించాడు; సురలు= దేవతలు; అగ్గింపన్= కొనియాడగా...

**తా :** ఆ వానరుడు ఆ విధంగా చెట్లన్నీ పెరికివేసి, అన్నీ అయిపోగా ఒకసారి పరిస్థితిని గమనించి, బలరామునిపై రాళ్లవానను కురిపించాడు. దేవతలు పొగిడేలా

**క. బలుఁ డపుడు ఱాలు తుమురై, యిల రాలఁగఁ జేసి యార్వ నే పుడుగక యా**
**వలిముఖుఁడు తాలసన్నిభ, ము లయిన నిజబాహుదండముల నుగ్రుండై. 555**

**ప్రతి :** బలుఁడు+అపుడు= అప్పుడు బలరాముడు; ఱాలు= రాళ్లు; తుమురు+ఐ= పొడియై; ఇలన్= నేలమీద; రాలన్+కన్= రాలేటట్లుగా; చేసి; ఆర్చెన్= పెద్దగా కేక పెట్టాడు; ఆ+వలిముఖుఁడు= ఆ వానరుడు; ఏపు= గర్వాన్ని; ఉడుగక= మానక; తాలసన్నిభములు= తాటిచెట్టును బోలినవి; అయిన= అయినట్టి; నిజబాహుదండములన్= పెద్ద కర్రల్లాంటి తన బాహువులతో; ఉగ్రుండు+ఐ= భయంకరుడై...

**తా :** అప్పుడు బలరాముడు ఆ రాళ్లన్నీ పొడిపొడియై నేలరాలేటట్లుగా చేసి, సింహనాదం చేశాడు. అది విని ఆ వానరుడు వెనుదీయక తాటిచెట్టునుబోలిన తన నిడుపాటి చేతులు రెండింటితోను భయంకరుడై

**క. వడిఁ బిడుగుఁబోనిపిడికిటఁ, బొడిచిన వడి సెడక బలుఁడు ముసలము హలమున్**
**విడిచి ప్లవంగుని మెడఁ గడు, వెడవెడ బిగియించె గ్రుడ్లు వెలి కుబుకంగన్. 556**

**ప్రతి :** వడిన్= వేగంతో; పిడుగున్+పోని+పిడికిటన్= పిడుగుతో సమానమయిన పిడికిటితో; పొడిచినన్= పొడువగా; బలుఁడు= బలరాముడు; ముసలమున్= రోకటిని; హలమున్= నాగలిని; విడిచి= విడిచిపెట్టి; ప్లవంగునిన్= వానరుణ్ణి; మెడన్= మెడను; కడున్= మిక్కిలి; గ్రుడ్లు= కనుగుడ్లు; వెలికిన్= బయటికీ; ఉబుకన్+కన్= ఉబుకునట్లుగా; వెడవెడన్ (వెంటవెంటనే)= కొంచెం కొంచెంగా; బిగియించెన్= బిగించాడు.

**తా :** ద్వివిదుడు పిడుగుతో సమానమయిన తన పిడికిటితో పొడువగా బలరాముడు ఏ మాత్రం వెనుకకు తగ్గక రోకటిని, నాగేటిని వదలివేసి, ఆ వానరునిమెడను పట్టుకొని కనుగుడ్లు ఉబికి బయటికి వచ్చేవిధంగా మెల్లమెల్లగా బిగించడం ప్రారంభించాడు. (కనుగ్రుడ్లు ఊడిపడేలా మెడను బిగించా డన్నమాట.)

**క. వదనమునఁ జెవుల రుధిరము, మెదడును దొరఁగంగ వాఁడు మేదినిమీఁదం**
**జదికిలఁ బడి యొక యింతయు, మెదలక మిడుకంగ లేక మృతిఁ బొందె నృపా! 557**

**ప్రతి :** నృపా!= ఓ పరీక్షిన్మహారాజా!; వదనమునన్= నోటినుండీ; చెవులన్= చెవులనుండీ; రుధిరము= నెత్తురూ; మెదడును= తలలోనుండు క్రొవ్వూ; తొరఁగన్+కన్= కారుతుండగా; వాఁడు= ఆ వానరుడు; మేదిని మీఁదన్= భూమి

మీద; చదికిలcబడి= కూలబడి; ఒక+ఇంతయున్= ఒ కొంచెమయినా; మెదలక= కదలిక లేకుండ; మిడుకన్+కన్= కదలుటకు; లేక= శక్తిలేక; మృతిన్+పొందెన్= చనిపోయాడు.

**తా :** ఓ రాజా! నోటినుండీ, చెవులనుండీ నెత్తురు, క్రొవ్వు అదేపనిగా కారుతుండగా ఆ వానరుడు నేలమీద చదికిలబడి తిరిగి లేవలేక చనిపోయాడు.

**తే. వానిపాటున కప్పుడు వనసమేత, మగుచు నా శైలరాజ మల్లల్ల నాడె;**
**సురగణంబులు రాముపై సురభి కుసుమ, వృష్టి గురియించి రతుల సంతుష్టి మెఱసి. 558**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; వానిపాటునకున్= ఆ ద్వివిదుడు అలా పడి మరణించడంచే; వనసమేతము+ అగుచున్= అడవితో కూడిందై; ఆ శైలరాజము= ఆ గొప్పకొండ - ఆ రైవతకపర్వతం; అల్లల్లనాడెన్= చలించిపోయింది; సురగణంబులు= దేవతాసమూహాలు; అతుల సంతుష్టి= అధికసంతోషాన్ని; మెఱసి= వ్యక్తంచేసి (ప్రకాశింపచేసి); రాముపైన్= బలరామునిమీద; సురభి కుసుమవృష్టి= సువాసనలతోకూడిన పూలవాన; కురియించిరి= కురిపించారు.

**తా :** ఆ సమయంలో ద్వివిదుడు పడి మరణించినపుడు ఆ బరువుకు ఆ రైవతకపర్వతం తనమీది అడవులతోగూడ గడగడవడకింది. దేవతలు మిక్కిలి సంతోషించి, సువాసనలతో నిండిన పూలవాన కురిపించారు.

**విశే :** లోకకంటకుడు ఒకడు మరణించినందుకు దేవతలు ఆనందించి - ఆ మహత్కార్యాన్ని నిర్వర్తించిన బలరాముని మీద సువాసనలతో కూడిన పూలవాన కురిపించి తమ ఆనందాన్ని వ్యక్తపరచారు. బలరాముణ్ణి అభినందించారు.

**వ. ఇ వ్విధంబున భువనకంటకుండైన దుష్టశాఖామృగేంద్రుని వసుంధరకుం బలిచేసి సకల జనంబులుc బరమానందకందళితహృదయారవిందులై తన్ను నందింప న య్యదునందనుండు నిజనగరంబున కరుదెంచె; నని శుకుండు వెండియు న మ్మనుజపతి కిట్లనియె. 559**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా; భువనకంటకుండు= లోకానికి ముల్లు అయినవాడు (బాధించేవాడు); ఐన= అయినట్టి; దుష్టశాఖామృగ+ ఇంద్రున్= చెడ్డ వానర రాజును; వసుంధరకున్= భూమికి; బలిచేసి= బలియిచ్చి; సకలజనంబులు= జనులందరూ; పరమ+ఆనంద= అధికమైన ఆనందంతో; కందళిత= సంతసించే; హృదయ+ అరవిందులు+ఐ= మనస్సులు అనే కమలాలుకలవారై; తన్నున్= తనను (బలరాముని); నందింపన్= అభినందించగా; ఆ+యదునందనుండు= యాదవవంశంలో పుట్టిన ఆ బలరాముడు; నిజనగరంబునకున్= తన పట్టణానికి; అరుదెంచెన్= వచ్చాడు; అని= అని పలికి; అమ్మనుజ పతికిన్= ఆ రాజుతో; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** ఈ విధంగా లోకంలోని జనులందరినీ బాధిస్తున్న ఆ వానరుణ్ణి భూమికి బలి ఇచ్చి, సకలజనులు తనను ఎంతో ఆనందంతో పొగడుతూండగా బలరాముడు తనపట్టణానికి విజయుడై వచ్చా దని శుకమహర్షి రాజుతో చెప్పాడు.

## ✤ బలరాముండు హస్తినాపురమును గంగలోc ద్రోయc బూనుట ✤

**సీ. కోరి సుయోధనుకూcతురు సర్వలక్షణములు గల్గి లక్షణ యనంగ**
**మహి నొప్పు కన్యకామణి వివాహంబునc జక్రహస్తునితనూజాతుcడైన**

**సాంబుఁడు బలసాహసమున నెత్తుక పోవఁ గౌరవు లీక్షించి కడఁగి క్రొవ్వి**
**'పడుచువాఁ డొకఁ డదె బాలికఁ గొనిపోవుచున్నాఁడు గై కొన కుక్కు మిగిలి**

**తే. యిట్టి దుర్మదుఁ గయిముట్టి పట్టి తెచ్చి, జనులు వెఱఁగందఁ జెఱపెట్టి యునుతుమేని**
**యదువులు మనల నేమి సేయంగఁగలరొ, యనుచుఁ గురువృద్ధజనముల యనుమతమున. 560**

**ప్రతి :** చక్రహస్తుని తనూజాతుఁడు= శ్రీకృష్ణుని తనయుడైన; ఐన సాంబుఁడు= సాంబుడు అనేవాడు; కోరి= మనసుపడి; సుయోధను కూఁతురు= దుర్యోధనుని కూతురు; సర్వలక్షణములు+కల్గి= అన్ని శుభలక్షణాల్ని కలిగి; లక్షణ+అనన్+కన్= లక్షణ అనే పేరు గల్గింది; మహిన్= భూలోకంలో; ఒప్పు= ప్రకాశించే; కన్యకామణిన్= శ్రేష్ఠురాలైన కన్యకను – (అవివాహితను); వివాహంబునన్= ఆమె పెళ్లిజరుగుతుండగా; బలసాహసమునన్= బలంతోను, సాహసంతోను; ఎత్తుకపోవన్= ఎత్తుకొనిపోగా; కౌరవులు= దుర్యోధనాదులు; ఈక్షించి= చూచి; కడఁగి= పూనికతో; క్రొవ్వి= మదించి; పడుచువాఁడు+ఒకఁడు= ఒక యువకుడు; అది+ఎ= అదిగో; బాలికన్= మన అమ్మాయిని; కైకొనక= కొంచెమైనా మనల్ని లెక్కచేయక; ఉక్కుమిగిలి= అతిశయించిన బలంతో; కొనిపోవుచున్నాఁడు= ఎత్తుకొనిపోతున్నాడు; ఇట్టి దుర్మదున్= ఇట్టి దుష్టుణ్ణి; కయి= చేయి; ముట్టిపట్టి= అంటబట్టుకొని; తెచ్చి= తీసుకొనివచ్చి; జనులు= చూస్తున్నప్రజలు; వెఱఁగు+ అందన్= ఆశ్చర్యపడేలా; చెఱన్+పెట్టి= చెఱలో పెట్టి; ఉనుతుము+ఏనిన్= ఉంచినట్లయితే; యదువులు= యదువంశస్థులైన శ్రీకృష్ణాదులు; మనలన్= మనందరిని; ఏమి+చేయన్ కన్+కలరొ= ఏమి చేస్తారో చూద్దాం!; అనుచున్= అని; కురువృద్ధజనముల= వృద్ధులైన కౌరవులయొక్క; అనుమతమునన్= సమ్మతితో...

**తా :** శ్రీకృష్ణుని కుమారుడైన సాంబుడు – (సాంబుడు జాంబవతి శ్రీకృష్ణుల తనయుడు) దుర్యోధనునికూతురు శుభ లక్షణములు గల లక్షణ అనే పేరుగల కన్యకను – ఆమెవివాహసమయంలో అతిసాహసంతో ఎత్తుకొని పోగా – దుర్యోధనాదులైన కౌరవులందఱు ఒక కుర్రవాడు ఇలా వివాహమండపంనుండి మన కన్నెపిల్లను దొంగిలించుకొని పోతూఉంటే మనం చూస్తూ ఉపేక్షించడం పౌరుషం కాదు. కాబట్టి, ఆ కుర్రవాణ్ణి పట్టి తీసుకొనివచ్చి చెరలో పెడదాం. ఆ తరువాత యాదవులైన శ్రీకృష్ణాదులు ఏమి చేస్తారో చూద్దాం! అనే ఆలోచనతో తమపెద్దల అనుమతిని పొందినవారై

**వ. ఇట్లు గడంగి యుద్ధసన్నద్ధులై బలశౌర్యోపేతులగు కర్ణ శల్య భూరిశ్రవో యజ్ఞకేతు సుయోధనాదులు సమున్నతరథారూఢులై కూడ నరిగిన వారలఁ గనుంగొని జాంబవతీనందనుండు మందస్మితవదనారవిందుం డగుచు సింగంబుభంగి గర్జించుచు మణిదీప్తం బైన చాపంబుఁ బూని నిల్చిన వారును సాంబు నదల్చి నిలునిలు మని పలికి. 561**

**ప్రతి :** ఇట్లు= ఈ రీతిగా; కడంగి= పూనుకొని; యుద్ధసన్నద్ధులు+ఐ= యుద్ధానికి సిద్ధపడినవారై; బలశౌర్య+ఉపేతులు= బలంతో, పరాక్రమంతో; కూడినవారు; అగు= అయిన; కర్ణ; శల్య; భూరిశ్రవ; యజ్ఞకేతు; సుయోధన+ఆదులు= దుర్యోధనుడు మొదలైనవారు; సమున్నత రథాధిరూఢులు+ఐ= ఎత్తైన రథాల్నిఎక్కినవారై; కూడ నరిగినన్= వెంబడిరాగా; వారలన్= ఆ కర్ణదుర్యోధనాదుల్ని; కనున్+కొని= చూచి; జాంబవతీనందనుండు= జాంబవతికొడుకైన సాంబుడు; మందస్మితవదనార విందుండు= చిరునవ్వుతోకూడిన ముఖపద్మంకలవాడు; అగుచున్= అవుతూ; సింగంబుభంగిన్= సింహంవలె; గర్జించుచున్= గర్జిస్తూ; మణిదీప్తంబు+ఐన= మణులతో కాంతిమంతమైన; చాపంబున్= ధనుస్సును; పూని నిల్చినన్= చేతపట్టి నిలువగా; వారున్= వారూ; ఆ సాంబునిన్= ఆ కృష్ణపుత్రుడైనసాంబుణ్ణి; అదల్చి= అదిలించి; నిలునిలుము+అని పలికి= ఆగుమాగుమని పలికి...

**తా :** ఇలా ప్రయత్నంతో యుద్ధానికి సిద్ధపడిన బలవంతులు, పరాక్రమవంతులు అయిన కర్ణుడు, శల్యుడు, భూరిశ్రవసుడు, యజ్ఞకేతుడు, దుర్యోధనుడు మొదలైన కౌరవులు మిక్కిలి ఎత్తైన రథాల్ని అధిరోహించి, సాంబుని సమీపానికి వెళ్లి అతణ్ణి అదిలించి, నిలువు నిలువు మంటూ చుట్టుముట్టినా – వీరిని చూచి సాంబుడు భయపడక రత్నఖచితమై ప్రకాశిస్తున్న వింటిని ధరించి సింహంలా గర్జిస్తూ

**తే. చండకోదండముక్తనిశాతవిశిఖ, జాల మందంద వఱప యాభీలముగను**
**నందనందననందనస్యందనంబు, ముంచి రచలేంద్రమును ముంచు మంచుపగిది. 562**

**ప్రతి :** చండకోదండ= భయంకరమైన వింటినుండి, ముక్త= విడువబడిన, నిశాత= మిక్కిలి వాడి గల; విశిఖజాలము= బాణాల సమూహం; అందన్+అందన్= మీదమీద; వఱపి= ప్రయోగించి; ఆభీలముగను= భయంకరంగా; నందనందన నందన= నందుని కొడుకైన శ్రీకృష్ణుని తనయుడైన సాంబుని; స్యందనంబున్= రథాన్ని; అచలేంద్రమును= పర్వతరాజాన్ని; ముంచు= ముంచివేసే; మంచుపగిదిన్= మంచువలె; ముంచిరి= ముంచివేశారు.

**తా :** అట్లు ఎదిరించిన సాంబునిమీద కౌరవులు తీక్ష్ణములైన బాణాలూ ఎడతెగక ప్రయోగించి కొండపై మంచుకమ్మినట్లు సాంబుని రథాన్ని బాణాలతో కప్పివేశారు.

**వ. మఱియును. 563**

**తా :** ఇంకనూ

**శా. శౌర్యాటోపవిజృంభణంబుల సరోజాతాక్షసూనున్ సురా**
**హార్యస్థైర్యుని మీఁద నేయ నతఁ డుద్యద్భూరిబాహాబలా**
**వార్యుండై శితసాయకాలి నవి మాయం జేసినన్ దేవతా**
**తూర్యంబుల్ దివి మ్రోసెఁ; నంత నతఁ డస్తోకప్రతాపోన్నతిన్. 564**

**ప్రతి :** శౌర్య= శూరత్వంతోను; ఆటోప= వేగిరపాటుతో; విజృంభణంబులన్= మిక్కిలి అతిశయించుటలతో; సరోజాత+అక్షసూనున్= శ్రీకృష్ణుని కుమారుణ్ణి; సుర+అహార్య+స్థైర్యునిన్= మేరుపర్వతంవలె చలింపక నిలిచిన సాంబుణ్ణి; మీఁదన్= పైన; ఏయన్= ప్రయోగించగా (బాణాల్ని); అతఁడున్= ఆ సాంబుడూ; ఉద్యత్= ప్రకాశిస్తున్న; భూరి= అధికమైన; బాహా= భుజాలయొక్క; బల= బలంచేత; అవార్యుండు+ఐ= అడ్డగించడానికి వీలు కానివాడై; శితసాయక+ఆలిన్= వాడియైన బాణాల పరంపరచే; అవి= వాటిని; మాయన్+చేసినన్= నశించేట్లు చేయగా; దేవతాతూర్యంబులన్= దేవతల వాద్యాలు; దివిన్+మ్రోసెన్= ఆకాశంలో మ్రోగాయి; అంతన్= అంతట; అతఁడు= ఆ సాంబుడు; అస్తోక= అధికమైన; ప్రతాప= ప్రతాపంయొక్క; ఉన్నతిన్= అతిశయంతో...

**తా :** ఉత్సాహంతో కూడినశూరత్వంతో విజృంభించి మేరుపర్వతమా అన్నట్లు చలింపక నిలిచి ఉన్న సాంబునిమీద లెక్కలేనన్ని బాణాలు ప్రయోగించారు. కానీ, సాంబుడు శక్యంగాని పరాక్రమోపేతుడై విజృంభించి వాడియైన బాణాలు గుప్పించి శత్రువుల బాణాలనన్నింటినీ ధ్వంసం చేశాడు. అతనివీరకృత్యాన్ని ఆకాశంనుంచి చూస్తున్న దేవతలు ఆనందంతో వాద్యాలను వాయించి తమ ఆనందాన్ని వ్యక్తం చేశారు. ఆ సాంబుడు ఇంకా అతిశయించిన శౌర్యంతో

**విశే :** సురాహార్యము (సుర+అహార్యము). సురలు అంటే దేవతలు. అహార్యము అంటే పర్వతము. సురలు నివసించే పర్వతం – సురాహార్యం – మేరుపర్వతం (బంగారుకొండ). శివుడు త్రిపురాసురసంహారసమయంలో మేరుపర్వతాన్ని విల్లుగా ధరించినట్లు పురాణ కథనం. అహార్యము= హరించడానికి వీలుకానిది – పర్వతాన్ని ఎవరూ హరించలేరు కనుక – అహార్యం అనే పేరు కొండకు ఏర్పడింది. హర్తుం అశక్యః= హరింపశక్యంకానిది అని వ్యుత్పత్తి.

**వ. ఇట్లు గడంగి బాణజాలంబులు పరcగించి యందఱ కన్నిరూపులై రథసూతధ్వజపతాకాతపత్రంబులు చూర్ణంబులు గావించి, విరథులం జేసి వారల మెయిమఱవు లఱువుళ్ళు గావించి, యొక్కొక్కనిc బెక్కుబాణంబుల నుచ్చిపో నేసిన వారలు శోణితదిగ్ధాంగులైకుసుమితకింశుకంబులం బోలియుండి రంత. 565**

**ప్రతి :** ఇట్లు= ఈ తీరుగా; కడంగి= పూనుకుని; బాణజాలంబులు= బాణసమూహాలు; పరcగించి= ప్రయోగించి; అందఱకున్= యుద్ధరంగంలో ఉన్నవారందరికీ; అన్నిరూపులు+ఐ= తానొక్కడే అన్నిరూపాలతో ఎదిరించినవాడై; రథ= రథాలు; సూత= సారథులు; ధ్వజ= టెక్కెపు కంబాలు (జెండాకర్ర); పతాక= జెండాలు; ఆతపత్రంబులు= ఎండనుండి రక్షించేవి (గొడుగులు); చూర్ణంబులు= పొడులు; కావించి= చేసి; వారల మెయిమఱవు లఱువుళ్లు గావించి – వారల = ఆ యుద్ధవీరుల యొక్క; మెయిమఱవు= మెయి= శరీరం; మఱవులు= కవచాలు – శరీరానికి గల యుద్ధవీరుల కవచాలు; అఱవుళ్లు= శిథిలాలు; కావించి= చేసి; విరథులన్+చేసి= రథాలు లేనివారిగా చేసి; ఒక్కనిన్+ఒక్కనిన్= ఒక్కొక్కణ్ణీ; పెక్కుబాణంబులన్= అనేకబాణాలతో; ఉచ్చిపోనేసిన= దూసుకొని పోయేటట్లు వేయగా; వారలు= ఆ బాణాలు గుచ్చుకొన్నవారు (కౌరవులు); శోణిత= నెత్తుటిచే; దిగ్ధ= పూయబడిన; అంగులు+ఐ= శరీరాలు గలవారై; కుసుమిత కింశుకంబులన్= పూచిన మోదుగపూలలాగా; పోలి+ఉండిరి= పోలి ఉన్నారు; అంతన్= అటు పిమ్మట...

**తా :** ఈ తీరుగా యుద్ధరంగంలో ఉండేవారినందర్నీ తానొక్కడే ఎదిరించడానికి పూనుకొని (అనేకబాణాలతో) వారి రథాలు, సారథులు, జెండాకర్రలు, జెండాలు, గొడుగులు అన్నింటినీ నుగ్గుచేసి, వారు ధరించిన కవచాలన్నింటికీ చిల్లులు పడేలా చేయగా, కౌరవులు పూచినఎర్రనిమోదుగులనుపోలిన నెత్తుటితో పూయబడిన దేహాలు కలవారయ్యారు. అటు పిమ్మట

**ఉ. వార లనేకులయ్యు బలవంతులు నయ్యు మహోగ్రసంగ రో**
**దార పరాక్రమప్రకటదక్షులు నయ్యుc గుమారకున్ జగ**
**ద్వీరుని నొక్కనిం జెనకి వ్రేలును వంపcగలేక సిగ్గునం**
**గూరిన చింత నొండొరులc గూడుచు విచ్చుచు వెచ్చనూర్పుచున్. 566**

**ప్రతి :** వారలు= ఆ కౌరవులు; అనేకులు= ఎక్కువమంది; అయ్యున్= అయి ఉండీ; బలవంతులు= బలంగలవారూ; అయ్యున్= అయి ఉండీ; మహా+ఉగ్ర= మిక్కిలి భయంకరమైన; సంగర= యుద్ధంలో; ఉదార= గొప్పదైన; పరాక్రమ= శత్రువుల్ని లోబరచుకొనే సామర్థ్యాన్ని; ప్రకట= అందరికీ తెలిసేట్లు చేయటంలో; దక్షులు అయ్యున్= సమర్థులైనప్పటికీ; జగత్+వీరునిన్= లోకంలో వీరుడు అనదగినవాణ్ణి; కుమారకున్= పిన్నవాణ్ణి; చెనcకి= ఎదిరించి; వ్రేలును వంపcగన్+ లేక= వాణ్ణి కొంచమైనా భయపడేటట్లు చేయలేక; సిగ్గునన్+కూరినచింతన్= సిగ్గుతోకూడిన విచారంతో; ఒండు+ఒరులు= ఒకరితోనొకరు; కూడుచున్= కలిసికొంటూ; విచ్చుచున్= విడిపోతూ; వెచ్చన్+ఊర్చుచున్= దుఃఖంతో వేడి నిట్టూర్పులు విడుస్తూ...

**తా :** ఆ కౌరవులు తాము సంఖ్యాబలంచే అనేకులుండికూడా, బలవంతులైనప్పటికీ, ఎన్నో యుద్ధాల్లో నేర్పు ప్రదర్శించి గడితేరిన వారైనా, ఒంటివాడైన సాంబుణ్ణి ఏమీ చేయలేక వానికి భయపడి, సిగ్గుపడి, ఎంతో విచారంతో ఒకరితో ఒకరు చేరి ఆలోచిస్తూ మనవల్ల కావటంలేదని తొలగిపోతూ, మళ్లీ కలుస్తూ దుఃఖంతో వేడి నిట్టూర్పులు విడుస్తూ ఏమి చేయాలి అంటూ ఆలోచిస్తూ

**విశే :** కౌరవుల బలము నూర్గురది. సాంబుని బలము ఒక్కనిది. **'సాంబుడు ఒక్కడు నూర్గురపెట్టు'. 'వాడు ఒక్కడే వందమంది పెట్టు'** అనే తెలుగు నుడికారం సరిగా సరిపోయే సందర్భం ఇది. 'వేలును వంపఁగ లేక' - తెలుగు నుడికారం.

**వ. మగిడి సమరసన్నద్ధులై సంరంభించి. 567**

**ప్రతి :** మగిడి= తిరిగి; సమరసన్నద్ధులై= యుద్ధంచేయడానికి సిద్ధపడినవారై; సంరంభించి= తొందరపడి...

**తా :** ఆ కౌరవులు తిరిగి యుద్ధం చేయడానికి తొందరపడి

**ఉ. అందఱు నొక్కపెట్ట దనుజాంతకనందనుఁ జుట్టు ముట్టి యం**
**దంద నిశాతసాయకచయంబుల ముంచి రథంబు నుగ్ర లీ**
**లం దునుమాడి చాపము చలంబునఁ ద్రుంచి హయాలిఁ జంపి సూ**
**తుం దెగటార్చి యంత విరథుం డగుడున్ వెసఁ జొచ్చి పట్టినన్. 568**

**ప్రతి :** అందఱున్= కౌరవులందర్నీ; ఒక్కపెట్టన్= ఒక్కసారిగా; దనుజ+అంతకనందనున్= రాక్షసులను అంతమొందించే కృష్ణుని కుమారుడైన సాంబుణ్ణి; చుట్టుముట్టి= నాల్గు వైపులా ముట్టడించి; అందున్+అందున్+అ= మాటిమాటికి; నిశాత= మిక్కిలి వాడియైన; సాయక చయంబులన్= బాణాలసమూహంతో; ముంచి= కప్పివేసి; రథంబున్= రథాన్ని; ఉగ్రలీలన్= భయంకరమైన రీతితో; తునుము+ఆడి= ధ్వంసం చేసి; చాపమున్= వింటిని; చలంబునన్= పట్టుదలతో; త్రుంచి= విఱిచి; హయ+ఆలిన్= గుఱ్ఱపు దండును; చంపి; సూతునిన్= రథసారథిని; తెగటార్చి= సంహరించి; అంతన్= అంతట; విరథుండు+అగుటన్= రథంలేనివాడు కావడంతో; వెసన్= వేగంగా; చొచ్చి= సమీపించి; పట్టినన్= పట్టుకొనగా...

**తా :** కౌరవులందరూ ఒక్కసారిగా గుమిగూడి సాంబుణ్ణి చుట్టుముట్టి వాడియైనబాణాలు అదేపనిగా ప్రయోగించి, ఎడతెరపి లేకుండా యుద్ధంచేసి అతణ్ణి ఆ బాణపరంపరలో ముంచివేశారు. అంతేకాక, వెంటవెంటనే వాడియైన బాణాలు ప్రయోగించి, రథాన్ని, గుఱ్ఱాల్ని, సారథిని, వింటినికూడా తెగనరికారు. రథం ధ్వంసం కావడంతో సాంబుడు ఎటూ వెళ్లలేక నిలిచి ఉండగా వాణ్ణి సమీపించి పట్టుకోగా

**తే. బాలకుఁడు చేయునది లేక పట్టువడియెఁ, గౌరవులు దమ మనములఁ గౌతుకంబు**
**లొలయఁ సాంబునిఁ గన్యకాయుక్తముగను, బురమునకుఁ దెచ్చి రతులవిభూతి మెఱసి. 569**

**ప్రతి :** బాలకుఁడు= ఆ చిన్నవాడు - సాంబుడు; చేయునది లేక= ఏవిధంగానూ ఎదిరించడానికి వీలులేక; పట్టు వడియెన్= వారికి పట్టుబడ్డాడు; కౌరవులు= కౌరవులుకూడా; తమ మనములన్= తమ తమ మనస్సుల్లో; కౌతుకంబులు= ఆనందాలు; ఒలయన్= అధికం కాగా; సాంబునిన్= సాంబుణ్ణి; కన్యకాయుక్తముగను= తమ ఆడపడుచు అయిన

లక్షణతో కూడా; అతులవిభూతిన్= సాటిలేని వైభవం; మెఱసి= ప్రకాశించి; పురమునకున్= తమ నగరమైన హస్తినాపురానికి; తెచ్చిరి= తీసుకొనివచ్చారు...

**తా :** కౌరవుల విజృంభణకు ఆ సాంబుడు ఏ విధంగానూ తప్పించుకోవడానికి గాని, ఏదైనా చేయడానికి గాని శక్యంగాక పోవడంతో వీరికి పట్టుబడ్డాడు. కౌరవులు ఆనందంతో వేడుకతో సాంబుడిని తమ ఆడపడుచు లక్షణతో పాటుగా హస్తినాపురానికి తీసుకొనివచ్చి తమ వైభవాన్ని ప్రకటిస్తూ

**వ. అంత ద్వారకానగరంబున. 570**

**ప్రతి :** అంతన్= ఆ సమయంలో; ద్వారకా నగరంబున...

**తా :** ఇక్కడ సాంబుడి స్థితి ఇలా కౌరవులచే పట్టుబడి ఉండగా అక్కడ ద్వారకానగరంలో

**ఉ. జాంబవతేయువార్త యదుజాతులు నారదయోగిచే సమ**
**స్తంబును విన్నవా రగుచు సంగరకౌతుక ముప్పతిల్లఁ జి**
**త్తంబులఁ గౌరవాన్వయకదంబము నొక్కట నుక్కడంచు కో**
**పంబున నుగ్రసేనజనపాలుననుజ్ఞ ననూనసైన్యముల్. 571**

**ప్రతి :** జాంబవతేయు వార్త= జాంబవతికొడుకైన సాంబుడు కౌరవులచేత పట్టుబడిన సమాచారం; యదుజాతులు= యదువంశంలో పుట్టినయాదవులు; నారదయోగిచేన్= నారదమహర్షివల్ల; సమస్తంబును= వివరమంతా; విన్నవారు+ అగుచున్= విన్నవారై; చిత్తంబులన్= మనస్సులలో; సంగరకౌతుకము= యుద్ధం చెయ్యాలి అనే కుతూహలం; ఉప్పతిల్లన్= పుట్టగా; కౌరవ+అన్వయకదంబమున్= కురువంశజుల సమూహాన్ని; ఒక్కటన్= ఒక్కసారిగా; ఉక్కడంచు= సంహరించాలి అనే; కోపంబునన్= కోపంతో; ఉగ్రసేనజనపాలు= ఉగ్రసేనమహారాజుయొక్క; అనుజ్ఞన్= అనుమతితో; సమస్తసైన్యముల్= సమస్త చతురంగ బలాలూ...

**తా :** జాంబవతికుమారుడైన సాంబుడు కౌరవులచేత చిక్కాడనే విషయాన్ని త్రిలోకసంచారి అయిన నారదమహర్షి చెప్పగా విన్న యాదవులమనస్సులలో కౌరవులతో యుద్ధం చేయాలనే వేడుక పుట్టడమే కాదు – కౌరవకులాన్నంతా ఒకేసారి సంహరించాలి అన్నంత కోపంతో – ఉగ్రసేనమహారాజుఅనుమతి తీసుకుని, సకలసైన్యాల్నీ

**తే. కూడి నడవంగఁ గని వారితోడ బలుఁడు, ధార్తరాష్ట్రులు మనకు నెంతయును దాసి**
**నట్టి బంధులు; వారిపై నిట్టి యలుక, నెత్తి చనుచుంట యిది నీతియే తలంప? 572**

**ప్రతి :** కూడినడవన్+కన్= సేన అంతా కలసి నడుస్తూండగా; కని= చూచి; బలుఁడు= బలరాముడు; వారితోడన్= ఆ సేనాసమూహంతో; ధార్తరాష్ట్రులు= ధృతరాష్ట్రుని కొడుకులు; మనకున్= మనందరకు; ఎంతయును= మిక్కిలి; డాసినట్టి బంధులు= దగ్గరి చుట్టాలు; వారిపైన్= అట్టి చుట్టాలమీద; ఇట్టి+అలుకన్= ఇటువంటికోపంతో; ఎత్తిచనుచుంట= దండెత్తి వెళ్లుట; ఇది= ఈ పని; తలంపన్= ఆలోచిస్తే; నీతి+ఏ= న్యాయమా?

**తా :** తమవారందరూ సేనను కూర్చుకొని ఆవిధంగా దండు వెడలడం చూచి బలరాముడు – ధృతరాష్ట్రునికొడుకులు మనకు ఎంతో దగ్గరిచుట్టాలు కదా! వారిమీదికి మీరిలా కోపంతో దండెత్తి వెళ్లడం న్యాయమా? అని ప్రశ్నించాడు.

**వ. అని వారల వారించి తత్క్షణంబ బంధు ప్రియుండైన బలరాముం డనలార్క సంకాశంబగు కాంచనరథం బెక్కి యనురక్తులైన భూసురులును, నుద్ధవాదులగు కులవృద్ధులును సేవింపం గరిపురంబునకుం జని తత్పురోపకంఠవనంబున సురభికుసుమఫలభరితతరుచ్ఛాయావిరచితచంద్రకాంతశిలాతలంబునందు వసియించి, మహితగ్రహమధ్యగతుండైన పూర్ణచంద్రు ననుకరించి యుండె; నంతఁ గార్యబోధనంబు సేయుటకై కౌరవులకడకుఁ బ్రబుద్ధుండైన యుద్ధవునిం బనిచినం జని యతం డాంబికేయునకు ధనురాచార్యాపగాతనూభవసుయోధనులకుం బ్రణమిల్లి వారిచేత నభినందితుండై యిట్లనియె. 573**

**ప్రతి :** అని= అట్లు పలికి; వారలన్= ఆ యుద్ధసన్నద్ధులైనవారిని; వారించి= నిలిపి; తత్+క్షణంబు+అ= వెంటనే; బంధుప్రియుండు+ఐన= చుట్టాలయందు ప్రీతిగలవాడైన; బలరాముండు= బలరాముడు; అనల+అర్క+సంకాశంబు+అగు= అగ్నితోనూ, సూర్యునితోనూ సమానమైందిగా ఉన్న; కాంచనరథంబు+ఎక్కి= బంగారు రథం ఎక్కి; అనురక్తులు+ఐన= అనురాగంగల; భూసురులును= బ్రాహ్మణులూ; ఉద్ధవ+ఆదులు+అగు= ఉద్ధవుడు మొదలైనవారూ; కులవృద్ధులును= తమ కులంలోని పెద్దలూ; సేవింపన్= తనను కొలుస్తుండగా; కరిపురంబునకున్= హస్తినాపురానికి; చని= వెళ్లి; తత్+పుర+ఉపకంఠ+వనంబునన్= ఆ పట్టణం పొలిమేరలోగల తోటలో; సురభి= సువాసనగల; కుసుమ= పూలతోనూ; ఫలభరిత= పండ్లతోనూ నిండిన; తరు= చెట్లయొక్క; ఛాయా= నీడలలో; విరచిత= కట్టబడిన; చంద్రకాంత శిలాతలంబు+అందున్= చంద్రకాంత శిలలతో నిర్మించిన అరుగులమీద; వసియించి= ఉండి; మహిత= గొప్పదైన మహిమతో కూడుకున్న; గ్రహ= గ్రహాలయొక్క; మధ్యగతుండు+ఐన= నడుమ ఉన్నవాడైన; పూర్ణచంద్రున్= పున్నమినాటి చంద్రుణ్ణి; అనుకరించి+ఉండెన్= పోలి ఉన్నాడు; అంతన్= అంతట; కార్యబోధనంబు+చేయుటకున్+ఐ= తామువచ్చిన పనిని ఎరిగించుటకై; కౌరవుల కడకున్= దుర్యోధనాదులవద్దకు; ప్రబుద్ధుండు+ఐన= మిక్కిలి తెలివితేటలుగల; ఉద్ధవునిన్= ఉద్ధవుణ్ణి; పనిచినన్= పంపగా; చని= వెళ్లి; అతండు= ఆ ఉద్ధవుడు; ఆంబికేయునకున్= అంబికాతనయుడైన ధృతరాష్ట్రునికి; ధనుస్+ఆచార్య= ద్రోణాచార్యునికి; ఆపగాతనూభవ= గంగా తనయుడైన భీష్మునికి; సుయోధనులకున్= దుర్యోధనునికి; ప్రణమిల్లి= నమస్కరించి; వారిచేతన్= ఆ ముగ్గురిచేత; అభినందితుండు+ఐ= ప్రశంసింపబడినవాడై; ఇట్లు+అనియెన్= ఈవిధంగా చెప్పాడు.

**తా :** బలరాముడు - దగ్గరబంధువులైన దుర్యోధనాదులమీద దండెత్తి పోవడం తగదని సైన్యాన్ని ఆపి, బంధుప్రీతిగలవాడై వెంటనే బయలుదేరి - అగ్నివలె, సూర్యునివలె ప్రకాశిస్తున్న బంగారురథాన్ని ఎక్కి, తనకు ప్రియమైన బ్రాహ్మణులు, ఉద్ధవుడు మొదలైన కులవృద్ధులునూ వెంటరాగా హస్తినాపురానికి వెళ్లి, ఆ పట్టణం పొలిమేరలో ఉన్న ఒక తోపులో విడిది చేశాడు. ఆ తోపులో - పరిమళభరితాలయిన పూలతో, పళ్లతో నిండినచెట్లనీడల్లో చంద్రకాంతశిలలతో నిర్మించిన అరుగులమీద విశ్రమించి, తాము వచ్చిన పనిని కౌరవులకు తెలియజేయడానికి బుద్ధిమంతుడైన ఉద్ధవుణ్ణి పంపాడు. ఉద్ధవుడు కౌరవులవద్దకు వెళ్లి, ముందుగా ధృతరాష్ట్రునికి నమస్కరించి, ఆ తరువాత ద్రోణునికి, భీష్మునికి, దుర్యోధనునికీ నమస్కరించి, మొక్కి వారి ప్రశంసలందుకొని ఇలా చెప్పాడు.

**విశే :** ఈ వచనంలో ఉద్ధవుడు చాలా బుద్ధిమంతుడు, తెలివిగలవాడు అనే విషయం చెప్పడానికే 'ప్రబుద్ధుడైన' ఉద్ధవుడు అని ప్రయోగం. కొన్ని మాటలకు కాలక్రమాన అర్థాలు మారిపోతూ ఉంటాయి. ఆదిలో ఉన్న అర్థం కంటె భిన్నమైన అర్థాన్ని సంతరించుకుంటాయి. అలాంటి పదాలలో ఈ 'ప్రబుద్ధుడు' ఒకటి. ఈనాడు 'ప్రబుద్ధుడు' అంటే ఎందుకు

పనికిరాని వాడు అని వ్యవహారంలో స్థిరపడింది. కానీ దాని అసలు అర్థం – 'విశేషమైన తెలివితేటలు కలవాడు' అని అర్థం! ప్రకృష్టమైన జ్ఞానంలో మేల్కొన్నవాడు **'జ్ఞానోదయం పొందినవాడు'** అని అర్థం!

**సీ. భూరియశోధనులార! తాలాంకుండు చనుదెంచి నగరోపవనమునందు**
**నున్నవాఁ'డనిన వా రుత్సాహమున బలుఁబొడగను వేడుక బుద్ధిఁ దోఁపఁ**
**దనరారు కానికల్ గొని చని యర్ఘ్యపాద్యాదిసత్కృతులు నెయ్యమునఁ జేసి**
**ధేనువు నిచ్చి సమ్మానించి యందఱు నందందవందనం బాచరించి**

**తే. యుచితభంగిని నచటఁ గూర్చున్నయెడను, గుశలమే మీకు? మాకును గుశల మనుచుఁ**
**బలికి రాముఁడు కురునరపాలుఁ జూచి, యచటిజనములు వినఁగ నిట్లనియెఁ దెలియ. 574**

**ప్రతి :** భూరియశస్+ధనులార!= అధికమైన కీర్తియే ధనంగా గల ప్రభువులారా!; తాల+అంకుండు= బలరాముడు – (తాటిచెట్టు తన జెండామీద గుర్తుగా గలవాడు); చనుదెంచి= హస్తినాపురానికి వచ్చి; నగర+ఉపవనము+అందున్= పట్టణం సమీపాన గల తోటలో; ఉన్నవాడు= విడిసి ఉన్నాడు; అనినన్= అనగా; వారు= ఆ కౌరవులు; ఉత్సాహమునన్= ఉత్సాహంతో; బలున్= బలరాముణ్ణి; పొడగను వేడుకన్= చూడాలనే కోరిక; బుద్ధిన్ తోఁపన్= మనస్సులో కలుగగా; తనరారు= గొప్పవైన; కానికల్+కొని చని= బహుమానాలు తీసుకొని వెళ్లి; అర్ఘ్యపాద్య+ఆది= కాళ్లు చేతులు కడుగుకోవడానికి నీళ్లు ఇవ్వడం మొదలైన; సత్కృతుల్= మర్యాదలు; నెయ్యమునన్= ప్రీతితో; చేసి= నిర్వర్తించి; ధేనువును+ఇచ్చి= గోవును బహుమానంగా సమర్పించి; సమ్మానించి= గౌరవించి; అందఱు= కౌరవులందరూ; అందున్+అందన్= మరల మరల; వందనంబు+ఆచరించి= నమస్కరించి; ఉచితభంగిన్= తగిన రీతితో; అచటన్= బలరాముడు విడిసినతావున; కూర్చున్న+ఎడను= కూర్చుని ఉండగా; కురునరపాలున్= దుర్యోధనుణ్ణి; చూచి; రాముడు= బలరాముడు; మీకున్= మీ అందరికీ; కుశలము+ఏ?= క్షేమమా?; మాకును= మాకు అందరికీ; కుశలము+అనుచు= కుశలమే అంటూ; పలికి= చెప్పి; అచటి జనములు= అక్కడకు వచ్చినవారు; వినన్+కన్= వినునట్లుగా; తెలియన్= స్పష్టంగా తెలిసేట్లుగా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** విశేషమైన కీర్తియే ధనంగాగల ప్రభువులారా! బలరాముడు మీ పట్టణం పొలిమేరలోగల తోటలో విడిది చేశాడు – అని ఉద్ధవుడు చెప్పగానే కౌరవులు చాలా ఉత్సాహంతో బలరాముణ్ణి చూడాలి అనే కుతూహలంతో తగిన కానుకలు పట్టుకొని, బలరాముణ్ణి చేరి ఆయనకు అర్ఘ్యపాద్యాదిమర్యాదలు చేసి, గోవును ఇచ్చి, సన్మానించి – అందరూ పదేపదే అతనికి నమస్కరించి, తగిన విధంగా కూర్చున్నారు. అప్పుడు బలరాముడు దుర్యోధనుణ్ణి చూచి – కుశలప్రశ్నలు అడిగాడు. మీరంతా క్షేమమేకదా! మేము క్షేమమే అని, అక్కడి జనులందరికీ స్పష్టంగా తెలిసేటట్లు ఇలా అన్నాడు.

**ఉ. 'మా నరనాథునాజ్ఞ నిజమస్తములన్ ధరియించి కౌరవుల్**
**మానుగఁ జేయు టొప్పగుఁ; గుమారకు నొక్కనిఁ బెక్కుయూథపుల్**
**పూనిన లావుమై నెదిరి పోర జయించుట మీఁది తప్పు; త**
**ప్పైనను గాచె బాంధవహితాత్మకుఁడై మనుజాధినాథుఁడున్. 575**

**ప్రతి :** మా నరనాథు+ఆజ్ఞన్= మా రాజైన ఉగ్రసేనమహారాజుయొక్క ఆజ్ఞను; కౌరవులు= కురువంశజులైన మీరు; నిజమస్తములన్ ధరియించి= మీరు శిరసావహించి; మానుగన్= చక్కగా; చేయుట= ఆచరించుట; ఒప్పు+అగున్= తగిన విధమవుతుంది; కుమారకున్+ఒక్కనిన్= ఒక్క చిన్నకుర్రవాణ్ణి; పెక్కు= అనేకులయిన; యూథపుల్= సేనాధులు; పూనినలావుమైన్= అతిశయించిన బలదర్పంతో; ఎదిరి= ఎదిరించి; పోరన్= యుద్ధంలో; జయించుట= గెలవడం; మీఁదితప్పు= మీ నేరం; మనుజ+అధినాథుఁడున్= మనరాజైన ఉగ్రసేనుడు; తప్పు+ఐనను= మీరు చేసింది తప్పే అయినా; బాంధవహితా+ఆత్మకుఁడు+ఐ= చుట్టాల మేలుకోరే మనస్సుగలవాడై; కాచెన్= మన్నించాడు.

**తా :** మీరు మా రాజైన ఉగ్రసేనుని ఉత్తరువును శిరసావహించి తప్పక ఆచరించాలి. మీరు ఎంతోమంది మహాయోధులు ఒక్కుమ్మడిగా ఒంటరిగాడైన మా పిల్లవానితో పోరి, చుట్టుముట్టి యుద్ధంలో గెలవడం మీ తప్పు. మీరు ఇంత ఆదర్శంగా చేసిన యుద్ధాన్ని అది తప్పిదమే అయినా, మా రాజు మన్నించాడు. మా రాజు బంధుప్రీతి కలవాడు కావడం వల్ల మీ తప్పుల్ని సహించాడు - అన్నాడు - బలరాముడు.

**క. అను మాటలు విని కౌరవ, జననాయకుఁ డాత్మ నలిగి చాలుఁ బురే? యే**
**మనఁ గలదు కాలగతి? చ, క్కనఁ గాలం దొడుగుపాదుకలు దల కెక్కెన్. 576**

**ప్రతి :** అనుమాటలు, విని= బలరాముడు అన్నమాటలు విని; కౌరవజననాయకుఁడు= దుర్యోధనుడు; ఆత్మన్= మనస్సులో; అలిగి= కోపగించుకున్నవాడై; చాలున్= నీ మర్యాదలు చాలును; పురే?= ఔరా?; కాలగతి= కాలం నడచేతీరు; ఏమనగలదు?= ఏమని చెప్పవచ్చు?; చక్కనన్= చక్కగ; కాలన్= కాలితో; తొడుగుపాదుకలు= తొడిగే పాదరక్షలు; తలకున్+ఎక్కెన్= తలమీదికి ఎక్కాయి.

**తా :** బలరాముడు చెప్పిన మాటలు విన్న దుర్యోధనుడు మనస్సులో చాల కోపించినవాడై యాదవులతో, “చాలును మీ మర్యాద ఔరా! ఏమి ఈ కాలవైపరీత్యం! - దీన్ని ఏమనగలం! కాలికింద ఉండవలసిన పాదరక్షలు తమంతట తామే తలకెక్కాయి. మన సేవకులుగా ఉండవలసినయాదవులు మనల్నే హెచ్చరిస్తున్నారు - ఏమి కాలగతి?” అన్నాడు.

**ఆ. మనము బంధువరుస మన్నించు మన్ననఁ, గాదె రాజ్యభోగగరిమఁ బొదలి**
**వసుధఁ బేరు గలిగి వాసికి నెక్కుటఁ, దమకు ననుభవింపఁ దగని యట్టి. 577**

**ప్రతి :** మనము; బంధువరుసన్= చుట్టరికంతో; మన్నించు+మన్నన్+గాదె= ఆదరించి గౌరవించడంచేతనే కదా!; రాజ్యభోగగరిమన్= రాజ్య భోగం అతిశయంచేత; పొదలి= వర్ధిల్లి; వసుధన్= భూమండలంలో; పేరు+కలిగి= పేరుగాంచి; వాసికిన్+ఎక్కుటన్= ప్రసిద్ధి పొందుట; తమకున్= యాదవులకు; అనుభవింపన్= అనుభవించడానికి; తగని+అట్టి= వీలుకానట్టి...

**తా :** మనము బంధుప్రీతితో గౌరవించడంవల్లనే కదా యాదవులు రాజ్యభోగాలు అనుభవించడమూ, పేరుప్రతిష్ఠలు గల్గి ప్రసిద్ధి పొందడం జరిగింది. నిజానికి వారికి అనుభవించే అవకాశం లేనట్టి

**వ. సితచ్ఛత్రచామరశంఖకిరీటచిత్రశయ్యాసౌధసింహాసనంబులు గైకొనుట మన మందెమేలంబునం గాదె? యిట్టిచో సరివారునుంబోలె నూరక గర్వించు యదుకులులతోడి సంబంధసఖ్యంబులు సాలుఁ; బాములకుఁ బాలు వోసి పెంచిన విషంబు దప్పునే? మమ్ముం దమపంపు సేయు మనుట సిగ్గులేకుంటఁ గాదె!**

**యదియునుంగాక దివ్యాస్త్రకోవిదులైన గంగానందన గురు కృపాశ్వత్థామ కర్ణాది యోధవీరులకున్ లోఁబడ్డవానిని మహేంద్రునకైనను విడిపింపవచ్చునే? యహహా! వృథాజల్పంబుల కేమిపని?' యని దుర్భాషలాడుచు దిగన లేచి నిజమందిరంబునకుం జనియె; నప్పుడు హలాయుధుం దమ్మాటల కదిరిపడి. 578**

**ప్రతి :** సిత+ఛత్ర= తెల్లని గొడుగులు; చామర= వింజామరలు; శంఖ= శంఖాలు; కిరీట= కిరీటాలు; చిత్రశయ్యాసౌధ సింహాసనంబులు= ఆశ్చర్యకరమైన పరుపులు, మేడలు, సింహాసనాలు; కైకొనుట= స్వీకరించుట; మన= మన కౌరవుల; మందెమేలంబునన్+కాదె= మనం పట్టించుకోకపోవడంచేతనే కదా; ఇట్టిచోన్= ఇట్లుండగా; సరివారును+పోలెన్= మనతో సమానులవలె; ఊరక= మిక్కిలి; గర్వించు= గర్వించే; యదుకులులతోడి= యాదవులతోడి; సంబంధసఖ్యంబులు= ఇచ్చిపుచ్చుకొనే బాంధవ్యాలు, స్నేహాలు; చాలున్= ఇంతమట్టుకు చాలు; పాములకున్= పాములకు; పాలు+పోసి పెంచినన్= పాలుపోసి పెంచినప్పటికి; విషంబు తప్పునే= దాని సహజ లక్షణమైన విషం లేకుండా ఉంటాయా?; మమ్మున్= కౌరవులమయిన మనల్ని; తమ పంపు+చేయుము+అనుట= వారిఆనతులచొప్పున నడచుకోమనడం; సిగ్గులేకుంటన్= కొంచెమయినా సిగ్గు లేకపోవడం; కాదు+ఏ= కదా!; అదియునున్+కాక= అదీకాక; దివ్య+అస్త్రకోవిదులు+ ఐన= దివ్యమైన అస్త్రవిద్యయందు పండితులైన; గంగానందన= భీష్ముడు; గురు= ద్రోణుడు; కృప= కృపుడు; అశ్వత్థామ= ద్రోణపుత్రుడగు అశ్వత్థామ; కర్ణ+ఆది= కర్ణుడు మొదలైన; యోధవీరులకున్= శూరులైన యుద్ధవీరులకు; లోఁబడ్డవానిన్= పట్టుబడ్డవాణ్ణి; మహా+ఇంద్రునకున్+ఐనను= దేవేంద్రునికైనా!; విడిపింపవచ్చున్+ఏ!= విడుదలచేయుట శక్యమా; అహహా!= ఔరా!; వృథాజల్పంబులకున్= వట్టి పనికిరానిమాటలకు; ఏమిపని?= ప్రయోజనమేమి?; అని= అని; దుర్భాషలు+అడుచున్= నిందావాక్యాలు పల్కుతూ; దిగ్గనన్= తటాలున; లేచి; నిజమందిరంబునకున్= తన ఇంటికి; చనియెన్= వెళ్లిపోయాడు; అప్పుడు= ఆ సమయంలో; హల+ఆయుధుండు= నాగలి ఆయుధంగా గలిగిన బలరాముడు; ఆ+మాటలకున్= దుర్యోధనుని ఆ మాటలకు; అదిరిపడి= ఉల్కికిపడి...

**తా :** మనం బంధుప్రీతితో గౌరవించడం చేతనేకదా!, ఈ యాదవులు రాజ్యభోగాలు అనుభవించడం? తమకంటూ పేరు ప్రతిష్ఠలు ఏర్పడడం, వారికి అనుభవించడానికి తగిన తెల్లగొడుగులు, వింజామరలు, శంఖాలు, కిరీటాలు, పానుపులు, సింహాసనాలు, మేడలు పొంది సుఖిస్తుండడం? మనం వారి విషయం పట్టించుకోక ఉపేక్షించడంవల్లనే వారు గర్వంతో ఈనాడు తమ స్థానం మరచి, మనతో సరిసమానులైన వారివలె ప్రవర్తిస్తున్నారు. యాదవులతో బంధుత్వాలు, సంబంధాలు, స్నేహాలు ఇంతమట్టుకు చాలు. పాములకు పాలుపోసి పెంచినా వాటివిషం పోదుకదా! అలాగే వీరు మనల్ని ఇప్పుడు వాళ్ల ఆజ్ఞను పాటించి నడుచుకోవాలంటున్నారు. సిగ్గు లేకపోబట్టే కదా ఆ మాటలు! పై పెచ్చు అస్త్రవిద్యల్లో ఆరితేరిన భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణాదులయిన వీరవరులచేత చిక్కినవాణ్ణి విడిపించడం మహేంద్రునికైనా సాధ్యమా? ఈ పనికిమాలినమాటలతో ప్రయోజనం లేదు అంటూ నిందావాక్యాలు పల్కుతూ దుర్యోధనుడు దిగ్గనలేచి తన మందిరానికి వెళ్లిపోయాడు. దుర్యోధనునిమాటలకు బలరాముడు ఉలికిపడి

**ఉ. కౌరవుఁ డాడి పోయిన యగౌరవభాషల కాత్మఁ గిన్క దై**
**వాఱఁగ నుల్ల సత్ప్రళయభానునికైవడి మండి చండ రో**
**షారుణితాంబకుం డగుచు యాదవవృద్ధులఁ జూచి పల్కెఁ 'బెం**
**పారినరాజ్యవైభవమదాంధులమాటలు మీరు వింటిరే? 579**

**ప్రతి :** కౌరవులు= దుర్యోధనుడు; ఆడి, పోయిన+అగౌరవభాషలకున్= మాట్లాడిన నిందావాక్యాలకు; ఆత్మన్= మనస్సులో; కిన్క= కోపం; దైవాఱన్+కన్= అతిశయించగా; ఉల్లసత్+ప్రళయభానుని కైవడిన్= మిక్కిలి ప్రకాశించే కాలమందలి సూర్యునివలె; మండి= కోపించి; చండరోష+అరుణిత+అంబకుండు= భయంకరమైన కోపంతో ఎర్రబడిన నేత్రాలు కలవాడు; అగుచున్= అవుతూ; యాదవవృద్ధులన్= యదువంశజులలోని పెద్దవారిని; చూచి; పల్కెన్= ఇట్లు చెప్పాడు; పెంపు+ఆరిన= అధికంగా వృద్ధి పొందిన; రాజ్యవైభవ= ప్రభుత్వ సంపదలయొక్క; మద= క్రొవ్వుచే; అంధుల= కన్ను కానని వారైన కౌరవులయొక్క; మాటలు= పలుకులు; మీరు వింటిరి+ఏ= మీరు విన్నారు కదా?

**తా :** దుర్యోధనుడు అలా మంచీ మర్యాదా లేకుండా మాట్లాడిన మాటలకు బలరామునికి మనస్సులో పట్టరానికోపం వచ్చి – ప్రళయకాలసూర్యునిలాగా ఎర్రనైన కండ్లతో మండిపడుతూ – తనవారైన యాదవులలోని పెద్దవారిని చూచి – మించిన రాజ్యసంపదమదంతో; కన్నుమిన్ను కానక దుర్యోధనుడు వాగినవాగుడు మీరుకూడా చక్కగా విన్నారుకదా! అని అన్నాడు బలరాముడు.

**తే.** **శ్రీమదాంధులు సామంబుచేతఁ జక్కఁ, బడుదురే యెందు? బోయఁడు పసులఁ దోలు**
**పగిది నుగ్రభుజావిజృంభణసమగ్ర, సుమహితాటోప మనిలోనఁ జూపకున్న.** **580**

**ప్రతి :** ఎందున్= ఎక్కడైనా; శ్రీ+మద+అంధులు= సంపదలవల్ల మదించి కన్ను గాననివారు; బోయండు= బోయవాడు; పసులన్= జంతువుల్ని; తోలుపగిదిన్= తరుమునట్లు; ఉగ్ర= భయంకరమైన; భుజా= భుజబలంయొక్క; విజృంభణ= అతిశయంతో; సమగ్ర= పూర్ణమైన; సుమహిత= మిక్కిలి కొనియాడదగిన; ఆటోపమున్= సంభ్రమాన్ని; అనిలోనన్= యుద్ధరంగంలో; చూపక+ఉన్నన్= కనబరచకపోతే; సామంబుచేతన్= మంచితనంతో; చక్కఁన్+పడుదురు+ఏ?= బాగుపడుదురా?

**తా :** ఎక్కడైనా ఐశ్వర్యంవల్ల కన్ను కానక కొవ్విఉండే దుష్టులు కేవలం మంచితనంతో బాగుపడతారా? వేటాడే బోయవాడు మృగాలమీద చూపే ఉగ్రతవలె – యుద్ధంలో భుజబలం ప్రదర్శించి పరాక్రమం చూపవలసిందే! సామంతో చక్కబడే సందర్భం కాదిది. యుద్ధనైపుణి ప్రదర్శించి ఎదుటివారిపొగరు అణచవలసిందే! – అని బలరాముని భావం!

**క.** **కౌరవుల సమయఁ జేయ ను, దారత యదువీరవరులు దామోదరుఁడున్**
**రా రావల దని యచ్చట, వారించితిఁ గాదె బంధువత్సలయుక్తిన్.** **581**

**ప్రతి :** బంధువత్సలయుక్తిన్= చుట్టాలమీద వాత్సల్యం కూడికున్నవాడినై; కౌరవులన్= కురువంశజులను; సమయన్+చేయన్= సంహరించాలని; ఉదారతన్= గొప్పగా; యదువీరవరులు= యాదవ వీరులలో శ్రేష్ఠులు; దామోదరుఁడున్= శ్రీకృష్ణుడును; రాన్= బయలుదేరిరాగా; రాన్+వలదు+అని= మీరు రావద్దు అని; అచ్చటన్= ద్వారకలో; వారించితిన్+కాదు+ఎ!= నివారించాను కదా!.

**తా :** కౌరవులను చంపాలి అనే ఉత్సాహంతో యదువీరాగ్రగణ్యులూ శ్రీకృష్ణుడూ సన్నద్ధులై బయలుదేరుతుండగా, కౌరవులూ మనవాళ్లు బంధువులు అనే వాత్సల్యభావంతో నేను వారందరినీ నివారించి – నేను వచ్చాను గదా!

**వ.** **అదియునుం గాక.** **582**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక...

**సీ.** **ఏ దేవు భృత్యులై యింద్రాదిదిక్పాలవరులు భజింతురు వరుసతోడ**
**నే దేవు మందిరం బేపారు దేవతాతరుసభావిభవసుందరతఁ జెంది**
**యే దేవుపదయుగం బేప్రొద్దు సేవించు నఖిలజగన్మాతయైన లక్ష్మి**
**యే దేవుచారుసమిద్ధకళాంశసంభవులము పద్మజభవులు నేను**

**తే.** **నట్టి దేవుండు దుష్టసంహారకుండు, హరి ముకుందుండు పంపుసేయంగ నొప్పు**
**నుగ్రసేనునిరాజ్యసమగ్రగరిమ, యంతయును దార యిచ్చిన దంట! తలఁప.** **583**

**ప్రతి :** తలఁపన్= ఆలోచిస్తే; ఏదేవుభృత్యులు+ఐ= ఏ దేవునికి సేవకులై; ఇంద్రాది దిక్పాలవరులు= ఇంద్రుడు మొదలైన దిక్పాలక శ్రేష్ఠులు; వరుసతోడన్= క్రమంగా; భజింతురు= సేవిస్తారో; ఏ దేవుమందిరంబు= ఏ దేవుని ఇల్లు; దేవతాతరు= కల్పవృక్షంయొక్కయు; సభా= సుధర్మమనే సభయొక్కయు (ఇంద్రుని కొలువుకూటానికి 'సుధర్మ' అని పేరు); విభవ= సంపదలతో కూడిన; సుందరతన్= సౌందర్యంతో; చెంది= కూడి; ఏపారున్= అతిశయించిఉంటుందో; ఏ దేవు పదయుగంబు= ఏ దేవునియొక్క పాదాలజంటను; ఏ ప్రొద్దున్= ఎల్లప్పుడూ; అఖిల జగన్మాత+ఐన లక్ష్మి= సకల జగాలకు తల్లియైన లక్ష్మీదేవి; సేవించున్= సేవిస్తూ ఉంటుందో; పద్మజ+భవులు+ఏను= బ్రహ్మ, శివుడు, నేను (బలరాముడు); ఏదేవు= ఏ దేవునియొక్క; చారుసమిద్ధకళా+అంశ= మనోహరమై ప్రకాశించే ఒక కళలోని భాగంగా; సంభవులము= అవతరించిన వారమో; అట్టి దేవుండు= అటువంటి లక్షణాలుగల దేవుడు; దుష్ట సంహారకుండు= దుష్టుల్ని చంపేవాడు; హరి= పాపాల్ని హరించే కృష్ణుడు; ముకుందుఁడు= శ్రీకృష్ణుడు; పంపు+చేయన్+కన్= చెప్పిన పనులు చేస్తూ ఉండగా; ఒప్పు= ఉండే; ఉగ్రసేనుని రాజ్య సమగ్ర గరిమ= ఉగ్రసేనమహారాజుయొక్క కొరత లేని రాజ్యగౌరవం; అంతయున్= సమస్తం; తారు+అ+ఇచ్చిన+అది+అంట!= తామే ఇచ్చిందట!

**తా :** ఏ దేవుణ్ణి ఇంద్రుడు మున్నగు దిక్పాలకులు వరుసగా సేవకులై సేవిస్తుంటారో, కోరిన కోర్కెల్ని తీర్చే కల్పవృక్షం, సుధర్మ అనే పేరుగల సుందరసభాసంపద ఏ దేవుని ఇంటిలో ఉందో, ఎల్ల లోకాలకు తల్లియైన లక్ష్మీదేవి ఏ దేవుని పాదపద్మాల్ని నిరంతరం సేవిస్తూ ఉంటుందో, ఏ దేవుని దివ్యకళలో అంశాలుగా బ్రహ్మ, రుద్రుడు, నేను ఉద్భవించామో, అటువంటి దేవుడు, దుష్టసంహారకుడు, పాపాలన్నింటినీ హరించే శ్రీకృష్ణుడు చెప్పిన పనులు ఉగ్రసేనమహారాజు చేస్తూండగా – ఆయన పాలించే సమస్తరాజ్యసంపద ఈ కౌరవులు దయతో మనకు ఇచ్చిందట! విన్నారా?–

**విశే :** ఈ పద్యంలో బలరాముడు స్వయంగా శ్రీకృష్ణుని దైవత్వాన్ని వివరించాడు.

**చ.** **అదియును గాక యెవ్వని పదాంబుజచారురజోవితాన మా**
**త్రిదివవరాదిదిక్పతికిరీటములందు నలంకరించు; భూ**
**విదితపుఁదీర్థముం గడు బవిత్రము సేయును; నట్టి కృష్ణుచేఁ**
**బొదలిన రాజ్యచిహ్నములఁ బొందఁగ రా దఁట యేమి చోద్యమో!** **584**

**ప్రతి :** అదియును+కాక= అదిమాత్రమే కాక; ఎవ్వని= ఏ దేవదేవునియొక్క; పదాంబుజ= పాదపద్మాలలోని; చారు= అందమైన; రజస్= ధూళియొక్క; వితానము= సమూహం; ఆ= ప్రసిద్ధమైన; త్రిదివవర+ఆది= దేవతలకు అధిపతియైన

ఇంద్రుడు మొదలైన; దిక్పతి= దిక్పాలకుల; కిరీటముల+అందున్= కిరీటాలలో; అలంకరించున్= అలంకరిస్తుందో; భూవిదితపున్= భూలోకంలో ప్రసిద్ధి చెందిన; తీర్థమున్= గంగానదీ జలాన్నీ; పవిత్రము+చేయునున్= పవిత్రంగా చేస్తూందో; అట్టి కృష్ణుచేన్= అటువంటి కృష్ణదేవునిచే; పొదలిన= వృద్ధిపొందిన; రాజ్య చిహ్నములన్= ప్రభువుల బిరుదాల్ని; పొందఁగన్ రాదు+అఁట= మేము పొందగూడదట; ఏమి చోద్యము+ఓ!= ఇది ఎక్కడి వింతయో!.

**తా :** అంతేగాక ఏ దేవునియొక్క పాదధూళిని ఇంద్రుడు మొదలగు దిక్పాలకులు తమ కిరీటాలకు అలంకారంగా గ్రహిస్తున్నారో – (కిరీటాలు గల తలలు వంచి ఆయాదేవతలు శ్రీకృష్ణునికి పాదనమస్కారం చేయగా ఆ దేవుని పాదధూళి కిరీటాలకు మరింత సొంపుకూర్చిందని తాత్పర్యం). ఏ దేవుని పాదధూళి భూలోకంలోని నదుల్ని, నీటి కొలనుల్ని అత్యంత పవిత్రీకరిస్తుందో అట్టి శ్రీకృష్ణదేవునిఅనుగ్రహంవలన పొంది, అభివృద్ధి చెందుతున్న రాజ్యంగల మేము రాజ్యచిహ్నాల్ని ధరించకూడదు అనటం ఎంత ఆశ్చర్యంగా ఉందో! (చూచారా! యని బలరాముని మాట).

**క. తా మఁట తలఁపం దల లఁట, యే మఁట పాదుకల మఁటగణింపఁగ రాజ్య**
**శ్రీమదమున ని ట్లాడిన, యీ మనుజాధమునిమాట కేమన వచ్చున్? 585**

**ప్రతి :** తలఁపన్= ఆలోచిస్తే; తాము+అఁట= ఆ కౌరవులేమో; తలలు+అఁట= అంగాలలో శ్రేష్ఠమైన శిరస్సుల; ఏము+అఁట= మేము – యాదవులమైన మేమేమో; పాదుకలము+అఁట= కాళ్లకు తొడుగుకొనే పావుకోళ్లమట; గణింపన్+కన్= చూడగా; రాజ్యశ్రీమదమునన్= రాజ్యసంపదవలన కలిగిన మదంతో; ఇట్లు+ఆడిన= ఇలా మాట్లాడిన; ఈ మనుజ+అధముని= మానవులలో నీచుడైన ఈ దుర్యోధనుని; మాటకున్= పలుకులకు; ఏమి+అనన్+వచ్చున్?= ఏమి అనగలం?

**తా :** ఈ నీచబుద్ధిగల దుర్యోధనుడు ఆడినమాటలు ఎట్లున్నాయో చూడండి! కౌరవులు తలలట! మేము కాళ్ళకు తొడుగుకొనే పాదరక్షలమట! రాజ్యసంపదతో క్రొవ్వెక్కి ఈ అధముడైన ఈ దుర్యోధనుడు పలికిన మాటకు ఏమి అనగలం?

**వ. అని సక్రోధమానసుండై యప్పుడు. 586**

**ప్రతి :** అని= అంటూ; సక్రోధమానసుండు+ఐ= కోపంతో కూడిన మనస్సు కలవాడై; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఆవిధంగా చెబుతూ కోపంతో కూడిన మనస్సుగలవాడై బలరాముడు అప్పుడు

**క. ధారుణి నిటమీఁదట ని, ష్కౌరవముగఁ జేయకున్నఁ గా దని యుగ్రా**
**కారుండై బలభద్రుఁడు, సీరము వెసఁ బూన్చి లావుఁ జేవయు నెసఁగన్. 587**

**ప్రతి :** ఇటమీఁదటన్= ఇకమీదట; ధారుణిన్= భూమిపై; నిష్కౌరవము+కన్= కౌరవులనే పేరు లేకుండా; చేయక+ఉన్నన్= చేయకపోతే; కాదు= కుదరదు; అని= అని నిశ్చయించుకుని; ఉగ్ర+ఆకారుండు+ఐ= భయంకరమైన ఆకారం కలవాడై; బలభద్రుఁడు= బలరాముడు; సీరము= నాగలిని; వెసన్= వేగంగా; పూన్చి= గ్రహించి; లావున్= బలం; చేవయున్= గర్వమూ; ఎసఁగన్= అతిశయించేటట్లుగా...

**తా :** 'ఇకపై భూమిమీద కౌరవులు అనే పేరు లేకుండ చేయక తప్పదు' అని బలరాముడు నిశ్చయించుకొని, భయంకరాకారుడై అతి బలగర్వాలతో తన ఆయుధమైన నాగలిని గ్రహించి, అతిశయిస్తూ

**వ. ఇట్లు పూని కౌరవరాజధానియైన కరినగరంబు కడతల హలాగ్రంబును జొనిపి, య పుటభేదన విస్తారంబగు గడ్డ భుజాగర్వ దుర్వారుండై పెకలించి, తిగిచి, గంగాప్రవాహంబునం బడఁద్రోయ గమకించిన నప్పుడు మహాజలమధ్యవిలోలంబగునావచందంబున నన్నగరంబు వడవడ వడంకుచు గోపురవప్ర ప్రాకారసౌధాట్టాలకతోరణధ్వజద్వారకవాటకుడ్యవీథీయుతంబుగా నొడ్డగెడవైనఁ బౌరజనంబులు పుడమి నడుగు లిడంగ రాక తడంబడుచు, నార్తులై కుయ్యిడుచుండి; రట్టియెడ న మ్మహోత్పాతంబులు గనుంగొని తాలాంకుండు గినుక వొడమి కావించిన యుపద్రవంబుగా నెఱింగి దానికిఁ బ్రతీకారంబు లేమిని గళవళంబున భయాకులమానసులై పుత్రమిత్రకళత్రబంధుభృత్యపౌరజనసమేతంబుగా భీష్మదుర్యోధనాది కౌరవులు వేగంబున నతని చరణంబుల శరణంబులుగాఁ దలంచి, సాంబునిఁ గన్యకాయుక్తంబుగా ననేక మణిమయభూష ణాంబరజాలంబుతోఁ గొనివచ్చి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు మొగిడ్చి యిట్లనిరి. 588**

ప్రతి : ఇట్లు పూని= నాగలిని ఆవిధంగా గ్రహించి; కౌరవరాజధాని+ఐన= కురువంశరాజుల ప్రధాన పట్టణమైన; కరినగరంబు= హస్తినాపురంయొక్క; కడతల= కొనతట్టు (చివర); హల+అగ్రంబు= నాగలి కొనను; చొనిపి= చొప్పించి; అ+పుట భేదన విస్తారంబు= ఆ పట్టణపువిస్తీర్ణంగల; గడ్డ= భూభాగాన్ని; భుజాగర్వదుర్వారుండు+ఐ= వారింపశక్యంగాని భుజగర్వం కలవాడై; పెకలించి= పెల్లగించి; తిగిచి= లాగి; గంగా ప్రవాహంబునన్= నీటి ప్రవాహంలో; పడఁ+త్రోయన్= పడవేయడానికి; గమకించినన్= పూనుకోగా; అప్పుడు= ఆ సమయంలో; మహాజలమధ్య= అధికమైన జలమధ్యంలో; విలోలంబు+అగు= అల్లకల్లోలమైన; నావచందంబునన్= నావవలె; ఆ+నగరంబు= ఆ హస్తినాపురం; వడవడవడంకుచున్= కంగారుతో అల్లాడుతూ; గోపుర= గోపురాలు; ఎత్తైన కట్టడాలు; వప్ర= అగడ్తలోనుండి ఎత్తి, ప్రాకారానికి చుట్టూ బలంకోసం పోసే మట్టిదిబ్బలూ; ప్రాకార= కోట ప్రహరీలు; సౌధ= మేడలు; అట్టాలక= కోటలో ఎత్తైన ప్రదేశంలో కట్టబడిన అంతస్తులు; తోరణ= తలవాకిళ్లు; ధ్వజ= ధ్వజస్తంభాలు; ద్వార= ద్వారబంధాలు; కవాట= తలుపులు; కుడ్య= గోడలు; వీథీ యుతంబు+కాన్= వీథులు మొదలగువాటితో కూడినపట్టణం; ఒడ్డగెడవు+ఐనన్= ఒక ప్రక్కకు ఒరిగిపోగా; పౌరజనంబులు= పురంలోని ప్రజలు; పుడమిన్= భూమిమీద; అడుగులు+ఇడంగన్+రాక= అడుగులు వేయడానికి వీలుకాక; తడన్+పడుచున్= తడబడుతూ (పడుతూ లేస్తూ); ఆర్తులు+ఐ= దుఃఖం పొందినవారై; కుయ్యిడుచుండిరి= మొఱపెట్టుతున్నారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆ+మహా+ఉత్పాతంబులు= ఆ గొప్ప ఉపద్రవాలు; కనున్+కొని= చూచి; తాల+అంకుండు= బలరాముడు; కినుక= కోపము; పొడమి= దహించి; కావించిన= చేసినట్టి; ఉపద్రవంబు+కాన్= ఆపదగా; ఎఱింగి= తెలిసికొని; దానికిన్= బలరాముడు చేసిన ఆ పనికి; ప్రతీకారంబు= ప్రతిక్రియ లేమిని బదులు చేయగల్గింది లేకపోవడంవల్ల; కళవళంబునన్= కంగారు పడుతూ; భయ+ఆకుల మానసులు+ఐ= భయంచే చెదరిన మనస్సులు కలవారై; పుత్ర మిత్ర కళత్ర బంధు భృత్య పౌరజన= కొడుకులు, స్నేహితులు, భార్యలు, చుట్టాలు, సేవకులు, పురమందలి జనులతో; సమేతంబు+కాన్= కూడుకొని; భీష్మ దుర్యోధన+ఆది కౌరవులు= భీష్ముడు, దుర్యోధనుడు మొదలైన కౌరవులు; వేగంబునన్= తొందరగా; అతని= బలరాముని; చరణంబులు+అ= పాదాలే; శరణంబులు+కాన్= శరణంగా (రక్షగా); తలంచి= భావించినవారై; సాంబునిన్= సాంబుణ్ణి; కన్యకాయుక్తంబు+కాన్= తమ కన్య అయిన లక్షణతోకూడా; అనేక= లెక్కలేనన్ని; మణిమయ భూషణ+అంబరజాలంబుతోన్= మణులతో కూడిన ఆభరణాలయొక్కయు, వస్త్రాలయొక్క సమూహంతో; కొనివచ్చి= తీసుకువచ్చి; దండప్రణామంబులు= సాగిలపడి మ్రొక్కుట (సాష్టాంగ నమస్కారం చేసి); ఆచరించి= నిర్వర్తించి; కరకమలంబులు మోడ్చి= నమస్కరించి; ఇట్లు+అనిరి= ఇలా చెప్పారు.

**తా :** ఈ విధంగా బలరాముడు తన హలాయుధపుమొనను హస్తినాపురానికి ఒక చివర, అడుగుదాకా చొప్పించి, ప్రయత్నపూర్వకంగా పట్టణం మొత్తం పెల్లగించి, గంగలో పడవెయ్యడానికి లాగి ఎత్తాడు. అతని ప్రయత్నానికి ఆ పట్టణం మొత్తం సముద్రమధ్యంలో చిక్కుకున్న ఓడలా అల్లాడిపోతూ – గోపురాలు, ప్రాకారాలు, కోటలు, కోటలమీది కట్టడాలు, రాజుల మేడలు, వీథులు, గోడలు, తలుపులు, ద్వారబంధాలు సమస్తమూ ఒక పక్కకు ఒరిగిపోగా, పట్టణంలోని జనులకు నేలమీద కాలు నిలపడానికి వీలు లేకపోయింది. ప్రజలందరూ ఆందోళనతో, భయంతో 'కుయ్యోమొర్రో' అని మొరపెట్టసాగారు. ఈ ఉపద్రవానికి బలరాముని కోపమే కారణమని తెలుసుకొని భీష్ముడు, దుర్యోధనుడు మొదలైన కౌరవులందరూ – ఏమీ ప్రతిక్రియ చేయలేక బలరాముని పాదాలనే శరణువేడడం మంచిదని నిర్ణయించుకొని – తమ కన్యతోకూడా సాంబునికి మణిమయ భూషణాలూ, వస్త్రాలు బహుమానంగా తీసుకొని బలరాముని సన్నిధికి చేరి, ఆయనకు సాగిలబడి మొక్కి, చేతులు జోడించి ఇలా అన్నారు.

**విశే :** ఈ ఘట్టంలో సంకర్షణుడైన బలరాముని దైవికమైన అతిమానుష శక్తిసామర్థ్యాలు మహాభాగవతపురాణం వెల్లడి చేసింది. పాంచరాత్ర ఆగమంలోని నాల్గువ్యూహాలలో రెండవ వ్యూహం సంకర్షణం – సంకర్షణుడే బలరాముడు. ఆయన పేరులోనే 'బల' ముంది. 'బలదేవుడని' శ్రీవైష్ణవ సంప్రదాయం. సంకర్షణుడు లయకారకుడు. వేదాలు ఆయనవల్లనే నిలచి ఉన్నాయి. ఆయనే ఆదిశేషుడు. సృష్టిలో తొట్టతొలి జీవుడు. వేదవ్యాఖ్యాత. నారాయణతత్త్వం యొక్క మూలబీజం సంకర్షణ వ్యూహగతమై ఉంది.

**క. 'రామ! సమంచితముక్తా, దామ! యశఃకామ! ఘనసుధాధామరుచి**
**స్తోమ! జయసీమ! జగదభి, రామ! గుణోద్దామ! నిఖిలరాజలలామా! 589**

**ప్రతి :** సమంచిత= మిక్కిలి మెరసే; ముక్తాదామ= మంచి ముత్యాలహారం కలవాడా!; యశఃకామ= స్వచ్ఛమైన కీర్తిని కోరువాడా; ఘన= గొప్పదైన; సుధాధామ= చంద్రునియొక్క; రుచి= కాంతివంటి దేహకాంతి; స్తోమ= సముదాయం కలవాడా; జయసీమ!= జయానికి హద్దైనవాడా; జగత్+అభిరామ!= అన్ని లోకాలలో ఒప్పిదమైన సౌందర్యం కలవాడా! గుణ= సద్గుణాలచేత; ఉద్దామ!= ఆధిక్యం గలవాడా!; నిఖిల రాజలలామా!= రాజులెల్లరకు భూషణమైనవాడా; రామ!= ఓ బలరామా!.

**తా :** మేలైన మంచి ముత్యాల సరాల్ని పోలిన తెల్లని, కీర్తిగలవాడా! చంద్రుని కాంతివంటి స్వచ్ఛమైన, ఆహ్లాదకరమైన దేహకాంతి కలవాడా! జయానికి హద్దుగా కలవాడా! లోకంలోని ఉత్తమగుణాలకు నిలయమైనవాడా! రాజులలో శ్రేష్ఠుడైనవాడా! బలరామా!"

**క. నీ మహిమ యెఱిఁగి పొగడఁగఁ, నే మెంతటివార? మఖిలనేతవు; త్రిజగత్**
**క్షేమంకరుఁడవు; సుమతివి, తామసులము మమ్ముఁ గావఁ దగు హలపాణీ! 590**

**ప్రతి :** హలపాణీ= నాగలి అనే ఆయుధాన్ని చేత ధరించిన బలరామా!; నీ మహిమలు= నీ ప్రభావాలు; ఎఱిఁగి= తెలిసి; పొగడన్+కన్= పొగడటానికి; ఏము= మేము; ఎంతటివారము= ఎంతటివాళ్లం; అఖిలనేతవు= సర్వనియామకుడవు; త్రిజగత్= స్వర్గ, మర్త్య, పాతాళ లోకాలకు; క్షేమంకరుఁడవు= క్షేమాన్ని కల్గించే; సుమతివి= మంచిబుద్ధి గలవాడివి; తామసులము= మేము ఏ మూఢులం; మమ్మున్= మమ్మల్ని; కావన్+తగున్= ఈ ఆపదనుండి తొలగించి కాపాడాలి.

**తా :** ఓ బలరామా! నీవు అందరికీ నాయకుడవి. ముల్లోకాలకీ మేలు చేసేవాడివి. రాగద్వేషాలు లేని బుద్ధిమంతుడివి. ఇట్టి నీ మహిమలు తెలుసుకొని పొగడటానికి మేమెంత వాళ్లం? ఏ మాత్రం తెలివిలేని మమ్మల్ని ఈ ఆపదనుండి రక్షించవయ్యా! – అని ప్రార్థించారు.

**క. భూచక్ర మెల్లఁదాల్చిన, యా చక్రీశ్వరుఁడు దావకాంశుఁడు బలదే**
**వా! చక్రికి నగ్రజుఁడవు, నీచ క్రియ లుడుపఁజెల్లు నీకు జితారీ! 591**

**ప్రతి :** జిత+అరీ= ఎందరో శత్రువుల్ని జయించినవాడా!; బలదేవా!= బలరామా!; భూచక్రము+ఎల్లన్= ఈ భూమండలాన్నంతటినీ; తాల్చిన= ధరించిన; చక్రి+ఈశ్వరుఁడు= ఆ సర్పరాజగు ఆదిశేషుడు; తావక+అంశుఁడు= నీయంశ కలవాడు; చక్రికిన్= చక్రం ఆయుధంగా గల శ్రీకృష్ణునికి; అగ్రజుఁడవు= అన్నవు; నీకున్= అటువంటి నీకు; నీచ క్రియలు= అల్పకార్యాలు; ఉడుపన్+తగున్= మాన్పించడం సరైందే!

**తా :** అంతశ్శత్రువుల్నీ, బాహ్యశత్రువుల్నీ జయించిన ఓ బలరామా! ఈ భూమండలాన్ని సదా మోసే ఆదిశేషునిఅంశలో పుట్టినవాడిని. విష్ణుమూర్తి అవతారమైన శ్రీకృష్ణునికి అన్నవు. కనుక, మాబోటి తెలివిమాలిన వాళ్లు చేసే నీచకార్యాలు మాన్పటం నీకు తగిందే!

**క. రక్షింపుము రక్షింపు ము, పేక్షింపక నమితనిఖిలబృందారక! ఘో**
**ర క్షణదాచరవిషనిట, లాక్ష! భయాతురుల మమ్ము నరయు మనంతా! 592**

**ప్రతి :** అనంతా= ఓ శేషావతారుడా!; ఉపేక్షింపక= అనాదరం చేయక; రక్షింపుము రక్షింపుము= మమ్మల్ని కాపాడవయ్యా, కాపాడు; నమిత= మొక్కబడిన; నిఖిల బృందారక!= సకల దేవతలుకలవాడా!; ఘోర= భయంకరులైన; క్షణదా చర= రాక్షసుల పాలిటి; విషనిటలాక్ష= విషంతో సమానమైన నొసటమూడవ కన్నుగల రుద్రుడా; భయ+ఆతురులన్= భయంచే పీడింపబడుతున్న; మమ్మున్= మమ్మల్నందరినీ; అరయుము= ఆదరించి కాపాడవయ్యా!

**తా :** ఆదిశేషుని అవతారంగా పుట్టిన ఓ బలరామా! నీవు ఎల్ల దేవతలచే మొక్కులందు కొనేవాడివి. రాక్షసులకు విషసదృశుడవై నొసట కన్నుగల రుద్రునివలె భస్మం చేయగలవాడివైన దేవా! నీవలన మేము భయాతురులమై ఉన్నాం. మమ్మల్ని ఆదరించి కాపాడవయ్యా, కాపాడు అని ప్రార్థించారు.

**వ. మఱియును దేవా! యీ సచరాచరంబు జగంబుల నీ లీలావినోదంబులం జేసి, దుష్టజనమర్దనంబును, శిష్టజనరక్షణంబునుం జేయుచు, జగదుత్పత్తిస్థితిలయహేతువైన నీకు సమస్కరింతు' మని వెండియు నిట్లనిరి. 593**

**ప్రతి :** మఱియును= ఇంకా; దేవా!= బలదేవా!; సచరాచరంబు= నడిచేవీ, నడకలేని ప్రాణులతో ఉండే; ఈ జగంబులన్= ఈ పద్నాలుగు లోకాలలో; నీ లీలావినోదంబులన్+చేసి= నీవు వేడుకగా చేసే వినోదాలచే; దుష్ట జనమర్దనంబును= దుష్టులను దండించడమూ; శిష్టజన రక్షణంబును= ఉత్తమజనులను రక్షించడమూ; చేయుచున్= చేస్తూ; జగత్+ఉత్పత్తి స్థితి లయహేతువు+ఐన= ఈ ప్రపంచాన్ని పుట్టించి, పెంచి, నశింపచేయుటకు కారణమైన; నీకున్= నీకు; నమస్కరింతుము= మొక్కుతున్నాము; అని; వెండియున్= మరియు; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** ఓ! బలదేవా! స్వామీ! ఇదిగాక చరాచరజంతువులతో కూడి ఈ లోకాల్ని నీవు వేడుకగా సృష్టించి, వాటితో ఆట్లాడుతుంటావు. దుష్టజనుల్ని శిక్షించడం, సజ్జనుల్ని రక్షించడం నీ వినోదంలో భాగాలే. ఈ ప్రపంచం పుట్టడానికి, పెరగడానికి, నాశం కావడానికి నీవే మూలకారణభూతుడవు అటువంటి మహాత్ముడివైన నీకు మేము మ్రొక్కుతున్నాము. మమ్మల్ని కాపాడు అంటూ ఇంకా ఇలా చెప్పసాగారు.

**తే. 'అవ్యయుండవు; సర్వభూతాత్మకుఁడవు; సర్వశక్తిధరుండవు; శాశ్వతుఁడవు**
**విశ్వకరుఁడవు గురుఁడవు విమలమూర్తి, వైన నిన్ను నుతింప బ్రహ్మకును దరమె?' 594**

**ప్రతి :** న+వ్యయుండవు= అవ్యయుండవు= నాశనం లేనివాడివి; సర్వభూత+ఆత్మకుఁడవు= సర్వప్రాణులకునూ ఆత్మగా ఉండేవాడివి; సర్వశక్తిధరుండవు= సర్వమహాశక్తులను ధరించినవాడివి; శాశ్వతుడవు= ఎల్లప్పుడు ఉండేవాడి వి; విశ్వకరుఁడవు= ఈ ప్రపంచాన్నంతటినీ చేసేవాడివి; గురుఁడవు= అజ్ఞానాన్ని పోగొట్టి భక్తులను జ్ఞానవంతులుగా చేసే గురువువి; విమల మూర్తివి+ఐన= స్వచ్ఛమైన మూర్తిగలవాడవు అయిన; నిన్నున్= నిన్ను; నుతింపన్= కొనియాడడం; బ్రహ్మకును= బ్రహ్మకైనా; తరము+ఎ= శక్యమా?

**తా :** ఓ బలరామదేవా! నీవు నాశనం లేనివాడివి, సకలజీవుల ఆత్మస్వరూపుడివి, సర్వశక్తులు గలవాడివి, సర్వకాల సర్వావస్థలలో ఉండేవాడివి, సృష్టిస్థితిలయాలనే క్రియలతో ప్రపంచాన్ని నడిపేవాడివి, భక్తుల అజ్ఞానాన్ని పోగొట్టే సద్గురుడివి, విమలమూర్తివి అయిన నిన్ను పొగడడం బ్రహ్మతరంకూడా కాదు.

**విశే :** పద్యం 589 మొదలుకొని 594 వరకు గల ఆరు పద్యాలు కౌరవులైన దుర్యోధనాదులుచేసిన **బలరామస్తోత్రం.** విడిగా మనకు బలరామస్తోత్రాలు అరుదు. ఇక్కడ భాగవతపురాణంలో శ్రీకృష్ణునికి అన్న అయిన బలరాముని మహామహిమ వెల్లడిచేయబడింది.

**ఎ) అవ్యయుండవు :** న+వ్యయ= అవ్యయః, ఇది బలరామునికి, విష్ణువుకు సమానంగా ఉన్నపేరు. బలరాముడు ఆదిశేషుని అవతారం. ఆది-శేషుడంటే సృష్టియొక్క 'ఆది' లో పుట్టి, సృష్టి చివరి దాకా శేషించి ఉండేవాడు.

**బి) సర్వభూతాత్మకుడు :** సర్వభూత+ఆత్మకుడు. సకల ప్రాణికోటిలో ఆత్మస్వరూపంగా ఉండేవాడు. పాంచరాత్ర ఆగమానుసారం వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహాలలో బలరాముడు రెండవదైన సంకర్షణవ్యూహానికి అధిపతి.

**ఎఫ్) విమలమూర్తి :** నిర్మలమైన అంతఃకరణం గలవాడు. అక్కడే వాసుదేవతత్త్వం ప్రకాశిస్తుంది. దానికి ప్రతిజీవి హృదయాన్ని కర్షణం చేసేవాడే సంకర్షణుడైన బలరాముడు.

**చ. అని వినుతించినం బ్రముదితాత్మకుఁడై హలపాణి వారలం**
**గనుఁగొని 'యోడ కోడకుఁడు కార్యగతిం దగి లిట్లు మీరు సే**
**సిన యవినీతిచేత నిటు చేసితి; నింక భయంబు దక్కి పొం'**
**దనిన సుయోధనుండు వినయంబున నల్లునిఁ గూఁతునుం దగన్. 595**

**ప్రతి :** అని= ఆ విధంగా; వినుతించినన్= పొగడగా; హలపాణి= బలరాముడు; ప్రముదిత+ఆత్మకుఁడు+ఐ= ఆనందించిన మనస్సు గలవాడై; వారలన్= ఆ కౌరవుల్ని; కనున్+కొని= చూచి; ఓడకుఁడు+ఓడకుఁడు= భయపడకండి భయపడకండి;

కార్యగతిన్= కార్యవశాన్న; తగిలి= పట్టుదల పెరిగి; ఇట్లు= ఈ రీతిగా; మీరు చేసిన అవినీతిచేతన్= మీరు చేసిన అవమానం; ఇటు చేసితిన్= నేను ఈ విధంగా మీ నగరాన్ని పెల్లగించాను; ఇంకన్= ఇక; భయంబు+తక్కి= భయాన్ని విడిచి; పొండు= వెళ్లండి; అనినన్= అని బలరాముడు చెప్పగా; సుయోధనుండు= దుర్యోధనుడు; వినయంబునన్= అణకువతో; అల్లునిన్= అల్లుడయిన సాంబుణ్ణి; కూతునున్= తన కుమార్తె అయిన లక్షణనూ; తగన్= ఒప్పునట్లుగా...

**తా :** అని కౌరవులు భయభక్తులతో ప్రార్థించగా బలరాముడు ప్రీతుడై ఆ కౌరవులతో మీరు ఇక భయపడవద్దు. మీరు మీ పనిలోని పట్టుదలతో మమ్మల్ని నిర్లక్ష్యంచేసి చిన్నచూపు చూడడం వల్ల నేను ఈ విధంగా ప్రవర్తించాను కాని, వేరే కాదు. 'ఇక భయపడకుండా పొండి' అన్నాడు. ఆ మాటలు విని దుర్యోధనుడు వినయంతో తన అల్లుడగు సాంబుణ్ణి తన కూతురు లక్షణను ఒప్పునట్లుగా

**క. అనుపుచు నరణము దాసీ, జనముల వేయింటి లక్షసైంధవములఁ దా**
**నినుమడి యేనుంగులఁ గాం, చన రథముల నాఱువేల సమ్మతి నిచ్చెన్. 596**

**ప్రతి :** అనుపుచున్= పంపుతూ, సాగనంపుచూ; దాసీ జనములన్= ఊడిగం చేసే పరిచారికల్ని; వేయింటిన్= వేయి మందిని; సైంధవములన్= సింధుదేశపు శ్రేష్ఠమైన గుర్రాల్ని; లక్ష= లక్ష సంఖ్యను; దానికిన్+ఇనుమడి= దానికి రెట్టింపు అనగా రెండు లక్షలు; ఏనుంగులన్= ఏనుగుల్ని; కాంచనరథంబులన్= బంగారు తేరుల్ని; ఆఱువేలన్= ఆఱువేలను; అరణము= సారెగా; సమ్మతిన్= ఇష్టంతో; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తా :** తన కూతురు లక్షణను, అల్లుడు సాంబుణ్ణి బలరాముని వెంట పంపుతూ, దుర్యోధనుడు వేయిమందిపరిచారికల్నీ, లక్షగుర్రాల్ని, రెండులక్షల ఏనుగుల్ని, ఆరువేలబంగారు రథాల్ని – అరణంగా ఆనందంతో ఇచ్చాడు.

**వ. ఇట్లిచ్చి యనిచిన భద్రుండు గొడుకునుం గోడలిం దోడ్కొనుచుఁ బరమానందంబు నొందుచు, నక్కడక్కడి జనంబులు పదివేలవిధంబులం బొగడ, నిజపురంబున కరిగి యచ్చట యాదవులతోడఁ దాఁ గరిపురంబునకుం బోయినవిధంబును, వారలాడినదురాలాపంబులును, దా నందులకై యొనర్చిన ప్రతీకారంబును నెఱింగించి సుఖంబుండె; వారణపురంబు నేఁడును దక్షిణం బెగసి యుత్తరభాగం బొకించుక గంగకై క్రుంగి బలభద్రునిమాహాత్మ్యంబుఁ దెలుపుచున్న' దని యమ్మహాత్మునిభుజవీర్యం బవార్యం బని చెప్పి, శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 597**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ఇచ్చి= అరణం ఇచ్చి; అనిచిన= సాగనంపగా; భద్రుండు= బలరాముడు; కొడుకునున్+కోడలిన్= కొడుకు సాంబుణ్ణి, కోడలు లక్షణని; తోడ్కొనుచున్= వెంటపిల్చుకొని; పరమ+ఆనందంబు+చెందుచున్= మిక్కిలి ఆనందపడుతూ; అక్కడక్కడి జనంబులు= తోవల్లో జనులు; పదివేలవిధంబులన్= అనేకరీతులుగా; పొగడన్= మెచ్చుకొంటుండగా; నిజపురంబునకున్= తన పురమైన ద్వారకకు; అరిగి= వెళ్లి; అచ్చట యాదవులతోడన్= అక్కడ తమవారైన యాదవులతో; తాన్= తాను; కరిపురంబునకున్= హస్తినాపురానికి; పోయిన విధంబును= వెళ్లిన తీరూ; వారలు+ఆడిన= ఆ కౌరవులు పలికిన; దుర్+ఆలాపంబులూ= నిందా వాక్యములూ; తాన్= తాను; అందులకున్+ఐ= వారట్లు నిందించడంచే; ఒనర్చిన= చేసిన; ప్రతీకారంబునున్= ప్రతిక్రియనూ; ఎఱింగించి= తెలియపరచి; సుఖంబు+ఉండె= సుఖంగా ఉన్నాడు; వారణపురంబు= హస్తినాపురం; నేఁడును= నేటికీ; దక్షిణంబు+ఎగసి= దక్షిణపుదిక్కున ఎత్తుగా;

ఉత్తరభాగంబు= ఉత్తరపు దిక్కున; ఒక+ఇంచుక= కొంచెం; గంగకై= గంగకోసం, దిక్కుకు; క్రుంగి= మొగ్గి; బలభద్రుని= బలరాముని; మాహాత్మ్యంబున్= మహిమను; తెలుపుతున్నది అని= తెలియజేస్తూ ఉంది అని; ఆ+మహా+ఆత్ముని= ఆ మహానుభావుని; భుజవీర్యంబు= భుజబలం; అవార్యంబు= వారింపశక్యముగానిది; అని= అంటూ; చెప్పి= వివరించి; శుకయోగి+ఇంద్రుండు= శుకమహర్షి; పరీక్షిత్+నరేంద్రునకున్= పరీక్షిన్మహారాజుతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ ప్రకారంగా దుర్యోధనుడు అరణమిచ్చి, కొత్త దంపతుల్ని పంపగా బలరాముడు కొడుకును కోడలిని వెంటబెట్టుకుని ద్వారకానగరానికి వచ్చి, అచటి తమవారితో తాను హస్తినాపురానికి వెళ్లడం, దుర్యోధనాదుల దుష్ప్రలాపాలూ చెప్పి, ఆ మాటలకు ప్రతిక్రియగా తాను హస్తినాపురాన్ని నాగలితో పెకలించి గంగలో పడవేయబోవడం, కౌరవులు ఆ దెబ్బకు గజగజలాడి క్షమను కోరడం వివరించి చెప్పి, సుఖంగా కాలం గడపసాగాడు. నేటికీ హస్తినాపురంమాత్రం దక్షిణపుతట్టు ఎత్తుగాను, ఉత్తరపుతట్టు గంగవైపు మొగ్గి ఉండి, బలరామునిమహిమను తెలియజేస్తూ ఉంది. ఆ మహాత్ముని భుజబలం ఎదురులేనిది అని శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుకు చెప్పి ఇంకా ఇట్లన్నాడు.

**విశే :** భారతదేశంలో భౌగోళికమైన ఈ మార్పు నేటికీ హస్తినాపురంలో కనబడడం - నాటిచర్యకు నిదర్శనం.

## ❖ షోడశసహస్రస్త్రీ సంగతుండైన శ్రీకృష్ణుని మహిమ నారదుఁడు తెలిసికోవడం ❖

**చ. నరవర! యొక్కనాఁడు విను నారదసంయమి మాధవుండు దా**
**నరకునిఁ ద్రుంచి వానిభవనంబున నున్న పదాఱువేల సుం**
**దరులను నొక్కమాటు ప్రమదంబున నందఱ కన్నిరూపులై**
**పరిణయ మయ్యె నా విని శుభస్థితిఁ దద్విభవంబుఁ జూడఁగన్. 598**

**ప్రతి :** నరవర!= ఓ పరీక్షిన్మహారాజా!; విను= వినుము; ఒక్కనాఁడు= ఒకరోజు; నారదసంయమి= నారదమహర్షి; మాధవుండు= శ్రీకృష్ణుడు; తాన్= తాను; నరకునిన్= నరకాసురుణ్ణి; త్రుంచి= సంహరించి; వాని భవనంబునన్= ఆ నరకాసురుని ఇంటిలో; ఉన్న= ఉన్నట్టి; పదాఱువేల= పదహారువేల; సుందరులను= అందగత్తెల్ని; ఒక్కమాటు= ఒకేసారి; ప్రమదంబునన్= సంతోషంతో; అందఱకున్= ఆ స్త్రీలందరికీ; అన్నిరూపులు+ఐ= ఎంతమంది స్త్రీలున్నారో అన్నిరూపాలు ధరించినవాడై (అనగా పదహారువేల మంది కృష్ణరూపాల్ని ధరించి); పరిణయము+అయ్యెన్= వివాహమాడాడు; నాన్= అనగా; విని= విన్నవాడై; శుభస్థితిన్= శుభమైనరీతితో; తద్+విభవంబున్= ఆ శ్రీకృష్ణునిపెండ్లివేడుకలను; చూడన్+కన్= చూడటానికి...

**తా :** ఓ రాజా! శ్రీకృష్ణుడు నరకాసురుణ్ణి సంహరించి అతని భవనంలో బందీలుగా ఉన్న పదహారువేలమందిసుందరాంగుల్ని ఒకేమాటుగా తాను పదహారువేల రూపాలు ధరించి పెండ్లి చేసుకొన్న వృత్తాంతం ఒకనాడు నారదమహర్షి విని, ఆ వేడుక చూడాలి - అని

**వ. ఇట్లు దలంచి కృష్ణపాలితం బయిన ద్వారకానగరంబు డాయం జని ముందట. 599**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; తలంచి= వేడుక చూడగోరి; కృష్ణపాలితంబు+అయిన= కృష్ణునిచే రక్షింపబడుతున్న; ద్వారకానగరంబు= ద్వారకా పట్టణాన్ని; డాయన్+చని= సమీపించి; ముందటన్= ఎదురుగా...

**తా :** శ్రీకృష్ణుని పెండ్లివేడుకలు చూడాలనే ఆలోచనతో నారదుడు కృష్ణుడు కాపాడుతున్న ద్వారకానగరానికి వెళ్లి ఎదుటగా

**సీ. శుకశారికాశిఖిపికకూజితప్రసవాంచితోద్యానవనౌఘములను**
**గలహంససారసకైరవకమలకహ్లారశోభితకమలాకరములఁ**
**గలమాదిసస్యసంకులవరేక్షుక్షేత్రభూరిలసన్నదీతీరములను**
**గిరిసానుపతితనిర్ఝరకణసందోహసంతతహేమంతసమయములను**

**తే. గమలసంభవకాంచనకార రచిత, చిరతరైశ్వర్యనగరలక్ష్మీకరాబ్జ**
**ఘటితనవరత్నమయహేమకటక మనఁగ, సొబగు మీఱిన కోటయుఁ జూచె మౌని. 600**

**ప్రతి :** శుక= చిలుకల; శారికా= గోరువంకల; శిఖి= నెమళ్ల; పిక= కోకిలల; కూజిత= కలకలధ్వనులచే; అంచిత= ఒప్పుతున్న; ఉద్యానవన= పూలతోటల; ఓఘములను= సమూహాల్ని; కలహంస= ఉత్తమజాతికి చెందిన అందమైన హంసలచే; సారస= బెగ్గురుపక్షులచే; కైరవ= తెల్లకలువలచే; కమల= తామరపువ్వులచేతా; కహ్లార= ఎఱ్ఱకలువల చేతా; శోభిత= ప్రకాశింపబడిన; కమల+ఆకరములన్= సరస్సులను; కలము+ఆది= వరి మొదలైన; సస్య= పైరులతో; సంకుల= కూడి ఉన్న; వర= శ్రేష్ఠమైన; ఇక్షుక్షేత్ర= చెరకుతోటలతోను; భూరి= మిక్కిలి; లసత్= ప్రకాశించే; నదీతీరములను= ఏటిగట్లను; గిరిసాను= కొండచరియలనుండి; పతిత= పడుతున్న; నిర్ఝర= సెలయేళ్లయందలి; కణ= నీటిబిందువుల; సందోహ= సమూహంచే; సంతత= ఎడతెగని; హేమంత సమయములను= హేమంత ఋతుకాలాన్ని; కమలసంభవ= బ్రహ్మ అనే; కాంచనకార= కంసాలిచే; రచిత= చేయబడిన; చిరతర= మిక్కిలి పురాతనమైన; ఐశ్వర్య= కలిమితోకూడిన; నగరలక్ష్మీ= పురమనే లక్ష్మియొక్క; కర+అబ్జ= హస్తాబ్జమందు (చేతియందు); ఘటిత= కూర్చబడిన; నవరత్నమయ= తొమ్మిది విధాలైన రత్నాలు పొదిగిన; హేమకటకము= బంగారు కడియం; అనన్+కన్= అనునట్లుగా; సొబగుమీఱిన= అతిశయించిన అందంగల; కోటయున్= కోటను; మౌని= నారదమహర్షి; చూచెన్= చూశాడు.

**తా :** చిలుకలు, గోరువంకలు, నెమళ్లు, కోయిలలు అనే పక్షుల మనోహరమైన కలకలనాదాలతో, పువ్వులతో విలసిల్లే ఉద్యానవనాల సమూహాల్ని, హంసలు, బెగ్గురుపక్షులువంటి నీటిపక్షులతోను, తామరలు, ఎఱ్ఱతామరలు, తెల్లకలువలు మొదలగు పుష్పాలతోనూ ప్రకాశిస్తున్న కొలకులనూ, వరి మొదలైన పైరులతో, చెఱకుతోటలతో అందంగా కనిపించే ఏటిఒడ్లను, కొండచరియలనుండి పడే సెలయేళ్ల నీటితుంపురులచే మంచుకురిసే హేమంతఋతువును తలపించే ప్రదేశాల్నీ, బ్రహ్మ అనే కంసాలిచేత నవరత్నాలు పొదిగి చేయబడిన పురమనేలక్ష్మిచేతికి ఉండే బంగారుకడియమా? అనేట్లు ప్రకాశించే కోటగల ద్వారకాపట్టణాన్ని నారదుడు చూశాడు.

**వ. మఱియును సముత్తుంగమణిసౌధగవాక్షరంధ్రనిర్గతనీరంధ్రఘనసారచందనాగరుధూపధూమపటల విలోకనసంజనితపయోధరాభిశంకాంగీకృతతాండవకేళీవిలోలపురకామినీజనోపలాలితనీలకంఠ సముదయంబును, జంద్రకాంతమణిస్ఫటికస్తంభసంభృతమరకతపద్మరాగఘటితనవరత్నకాంచన ప్రాసాద శిఖరాగ్రవిన్యస్తబహుసూర్యవిభ్రమకృదంచితశాతకుంభకుంభనిచయంబును, సమస్తవస్తువిస్తార సమర్పిత వైశ్యాగారవీథీవేదికాకలితంబును, మహితాతపనివారణతరళవిచిత్రకేతనాబద్ధ మయూరశింజినీ నినదపూరితా శాంతరిక్షంబును, సరోజనాభపూతనాచేతనాపహారాదినూతన విజయసందేశలిఖితస్వర్ణవర్ణావళీ విభాసిత**

**గోపురమణి విటంకప్రదేశంబును, యాదవేంద్రదర్శనోత్సవాహూయమానసమాగతనానాదేశాధీశ భూరివారణ దానజలప్రభూతపంకనిరసనైకగతాగతజనసమ్మర్ద కరకంకణకషణవికీర్యమాణరజఃపుంజంబును; వినూత్న రత్నమయమంగళరత్నవల్లీవిరాజిత ప్రతిగృహప్రాంగణంబును, గుంకుమసలిలసిక్త విపణి మార్గంబును, వందిమాగధసంగీతమంగళారావ విలసితంబును, భేరీమృదంగకాహళశంఖతూర్య రవాధరీకృత సాగరఘోషంబునునై, యమరావతీ పురంబునుం బోలె వసుదేవనందననివాసంబై, యనలపుట భేదనంబునుం బోలెఁ గృష్ణమార్గసంచారభూతంబై, సంయమనీనామనగరంబునుంబోలె హరితనూభ వాభిరామంబై, నైరృతి నిలయంబునుంబోలెఁ బుణ్యజనాకీర్ణంబై, వరుణనివాసంబునుంబోలె గోత్రరక్షణభువన ప్రశస్తంబై, ప్రభంజనపట్టణంబునుం బోలె మహాబలసమృద్ధంబై, యలకాపురంబునుంబోలె ముకుందవరశంఖ మకరాంకకలితంబై, రజతాచలంబునుంబోలె నుగ్రసేనాధిపార్యాలంకృతంబయి, నిగమంబునుంబోలె వివిధవర్ణక్రమవిధ్యుక్త సంచారంబయి, గ్రహమండలంబునుంబోలె గురుబుధ విరాజమిత్రవిరాజితంబయి, సంతతకల్యాణ వేదియుంబోలె వైవాహికోపేతంబయి, బలిదానవకరతలంబునుంబోలె సంతతదానవారి యుక్తంబయి, యొప్పు నప్పురంబు ప్రవేశించి, యందు విశ్వకర్మనిర్మితంబైన యంతఃపురంబున నుండు షోడశసహస్ర హర్మ్యంబులందు. 601**

ప్రతి : మఱియును= ఇంకా; సముత్తుంగ= మిక్కిలి ఎత్తైన; మణిసౌధ= రత్నాలమేడల; గవాక్ష= కిటికీలయొక్క; రంధ్ర= కన్నాలనుండి; నిర్గత= వెడలిన; నీరంధ్ర= దట్టమైన; ఘనసార= కర్పూరాలతో; చందన+అగరుధూప= గంధంతో అగరులతో వేసిన ధూపాల; ధూమపటల= పొగలసముదాయాన్ని; విలోకన= చూడడంచే; సంజనిత= పుట్టిన; పయోధర+అభి శంకలు= మేఘాలనేసందేహాన్ని; అంగీకృత= పొందినవై; తాండవకేళీ= ఉద్ధతమైన తాండవమనే నృత్యంలో; విలోల= మిక్కిలి ఆసక్తి కలిగిన; పురకామినీజన= పట్టణంలోనున్న స్త్రీలచేత; ఉపలాలిత= బుజ్జగింపబడిన; నీలకంఠ= నెమళ్లయొక్క; సముదయంబును= గుంపుకలదియు; చంద్రకాంతమణి= చంద్రకాంతపు రాళ్లచేత; స్ఫటిక= పటికపు రాళ్లతో చేయబడిన; సంభృత= బాగుగా నింపిన; మరకత= పచ్చలతో; పద్మరాగ= కెంపులతో; ఘటిత= కూర్చబడిన; నవరత్న= తొమ్మిదిరకాల రత్నాలతో; కాంచన= బంగారుమయమైన; ప్రాసాద= కట్టడాల; శిఖర+అగ్ర= పై అంతస్తులందు; విన్యస్త= అమర్చబడిన; బహుసూర్య= లెక్కకు మిక్కిలి సూర్యులా అన్నట్లు; విభ్రమకృత్= భ్రమను కలగజేసే; అంచిత= ఒప్పుతున్నట్టి; శాతకుంభకుంభ= బంగారు కుండలయొక్క; నిచయంబును= సమూహం కలదియు; సమస్త వస్తు= సకల పదార్థాల్ని; విస్తార= సమృద్ధిగా; సమర్పిత= అమర్చబడిన; వైశ్య+అగార= కోమట్లయొక్కఇండ్లతోనూ; వీథివేదికా= వీథి అరుగులతోనూ; కలితంబును= కూడుకొనిందీ; మహిత= గొప్పదైన; ఆతప= వేడిని; నివారణ= పోగొట్టగల; తరళ= చలిస్తున్న; విచిత్ర= వివిధచిత్రాలతో కూడుకున్న; కేతన= జెండాలయందు; ఆబద్ధ= అంతటా కట్టబడిన; మయూర= నెమళ్లయొక్క; శింజినీ= వింటినారులయొక్క; నినద= ధ్వనులచేత; పూరిత= నిండిన; ఆశా=దిక్కులును; అంతరిక్షంబును= ఆకాశం గలిగింది; సరోజనాభ= శ్రీకృష్ణునిపైన; పూతనా= పూతన అను రాక్షసియొక్క; చేతన= ప్రాణాలను; అపహార+ఆది= అపహరించుట మున్నగు; నూతన= కొత్తవైన; విజయ= విజయాలయొక్క; సందేశ= వార్తలు; లిఖిత= రాయబడిన; స్వర్ణవర్ణావళీ= బంగారు అక్షరాలవరుసలచే; విభాసిత= వెలుగొందుతున్న; గోపుర= గోపురంలోని; మణివిటంక= రత్నాలచూరు పట్టుల; ప్రదేశంబును= స్థానాలుకలదియు; యాదవేంద్ర= శ్రీకృష్ణుని; దర్శన= చూచుట అనే; ఉత్సవ= వేడుకకోసం; ఆహూయమాన= ఆహ్వానింప బడినవారై; సమాగత= విచ్చేసిన; నానాదేశ= వివిధదేశాల; అధీశ= ప్రభువులైన రాజుల; భూరి= అధికమైన; వారణ దానజల=

ఏనుగుల మదజలంచే; ప్రభూత= పుట్టిన (ఏర్పడిన); పంక= బురద; నిరసన= అణచుటయందు; ఏక= ముఖ్యమైన; గత+ఆగత= రాకపోకలు చేస్తూ; జనసమ్మర్ద= జనుల కూటమియొక్క ఒత్తిడిచేత; కరకంకణ నికర్షణ= చేతులకు గల కడియాల రాపిడివలన; వికీర్యమాణ= రాలుచున్న; రజస్+పుంజంబును= రాసులుగా పడిన ధూళి గలదియు; వినూత్న రత్నమయ= సరిక్రొత్త రత్నాలతో కూడిన; మంగళ రంగవల్లీ= శుభసూచకమైన ముగ్గులచేత; విరాజిత ప్రతిగృహ= ప్రకాశిస్తున్న ఇంటింటి; ప్రాంగణంబును= ముంగిళ్లు కలిగిందీ; కుంకుమ సలిల= కుంకుమ నీళ్లచేత; సిక్త విపణిమార్గంబును= తడుపబడిన అంగడి వీథులు కలిగినదీ; వందిమాగధ= వంశచరిత్రలను కీర్తించువారు; సంగీత మంగళారావ= మంగళ ప్రదమైన కీర్తనలతో; విలసితంబును= ఒప్పుచున్నట్టియు; భేరీమృదంగ= ఢంకా/నగారాలు, మద్దెళ్లు; కాహళ, శంఖ= తూర్యములు, బాకాలు, శంఖాలు మొదలైన; తూర్య రవ= వాద్యాల ధ్వనులచేత; అధరీకృత సాగరఘోషంబును= అణగదొక్కబడిన సముద్రఘోష గలదియు; అయి= అయి; అమరావతీపురంబునన్+పోలెన్= ఇంద్రుని నగరమైన అమరావతిలాగా; వసుదేవనందన నివాసంబు+ఐ= వసువులకూ, దేవతలకూ, నందనవనానికీ స్థానమై (ద్వారకాపరంగా – వసుదేవుని కొడుకైన కృష్ణునికి ఉనికిపట్టై); అనలపుటభేదనంబునున్+పోలెన్= అగ్నిదేవుని పట్టణంవలె; కృష్ణమార్గ సంచారభూతంబు+ఐ= ధూమమార్గంగల అగ్నియొక్క వ్యాప్తిచే పరిశుద్ధమయి (ద్వారక – కృష్ణదేవుని దారినడకలవల్ల పావనంబై); సంయమనీ నగరంబునన్+పోలెన్= యమునిపట్టణంవలె; హరితనూభవ+అభిరామంబు+ఐ= సూర్యుని కొడుకైన యమునివల్ల ఒప్పిందై (ద్వారక – కృష్ణుని కొడుకులవల్ల మనోజ్ఞమయిందై); నైరృతిమందిరంబునున్+పోలెన్= నైరృతి పట్టణంవలె; పుణ్యజన+ఆకీర్ణంబు+ఐ= రాక్షసులచేత నిండిందై (ద్వారక – పుణ్యాత్ములచేత నిండిందై); వరుణనివాసంబునున్+పోలెన్= వరుణుని పట్టణంవలె; గోత్రరక్షణ భువనప్రశస్తంబు+ఐ= కొండల్ని రక్షించునట్టి నీళ్లతో ప్రశస్తికెక్కిందై (ద్వారక – తమవంశాన్ని రక్షించుకొనే జనులచేత ప్రసిద్ధికెక్కిందై); ప్రభంజనపట్టణంబుస్+పోలెన్= వాయుదేవుని పట్టణంవలె; మహాబలసమృద్ధంబు+ఐ= గాలియొక్క సమృద్ధిగలదై (ద్వారక – గొప్పసేనలయొక్క సమృద్ధిగలదై); అలకాపురంబునున్+పోలెన్= కుబేరుని పట్టణంవలె; ముకుందవరశంఖమకర+అంకకలితంబు+ఐ= ముకుందం, వరం, శంఖం, మకరం మొదలగు తొమ్మిది నిధులతో కూడిందై (ద్వారక – కృష్ణునియొక్క ఉత్తమశంఖంతోను, మొసలిటెక్కంగల ప్రద్యుమ్నునితోను కూడుకొనిందై); రజతాచలంబున్+పోలెన్= వెండికొండవలె; ఉగ్రసేనాధిపార్వా+అలంకృతంబు+ఐ= శివుడు, కుమారస్వామి, పార్వతీదేవి – వీరిచే అలంకరింపబడిందీ (ద్వారక – ఉగ్రసేనుడనే మహారాజుచే యోగ్యులైన పెద్దలచే అలంకరింపబడిందీ); నిగమంబునున్+పోలెన్= వేదంవలె; వివిధవర్ణక్రమవిధ్యుక్తసంచారంబు+ఐ= అనేక అక్షరాలు, పదక్రమాలు, పదవిభాగాలూ అనే విధివిధానాలతో ప్రవర్తించేదై (ద్వారక – అనేకులైన బ్రాహ్మణాది వర్ణాలయొక్క క్రమమైన సంచారం కలదై); గ్రహమండలంబున్+పోలెన్= గ్రహాలుండే మండలంవలె; గురుబుధకవిరాజమిత్రవిరాజంబు+ఐ= బృహస్పతి, బుధుడు, శుక్రుడు, చంద్రుడు, సూర్యుడు మున్నగు గ్రహాలతో ప్రకాశించేదై (ద్వారక – పూజ్యులైన పండితులూ, కవిశ్రేష్ఠులూ, స్నేహితులూ మున్నగువారితో ప్రకాశించేదై); సంతతకల్యాణవేదియున్+పోలెన్= శాశ్వతమైన పెండ్లి అరుగువలె; వైవాహిక+ఉపేతంబు+ఐ= పెండ్లిండ్లతో కూడిందై (ద్వారక – పెద్దనగరం కనుక ఎన్నో వివాహాది మంగళకార్యాలతో కూడిందై); బలిదానవకరతలంబునున్+పోలెన్= బలిచక్రవర్తి అరచేతివలె; సంతతదానవారియుక్తంబు+ఐ= నిరంతరంగా దానం చేస్తున్నందున – దానజలంతో నిండిన అరచేయి కలదై (ద్వారక – నిరంతరం దానవులకు శత్రువైన కృష్ణునితో కూడిందై); ఒప్పు= ఒప్పునట్టి; ఆ+పురంబున్= ఆ పట్టణంలో; ప్రవేశించి; అందున్= ఆ ప్రధానస్థలంలో; విశ్వకర్మనిర్మితంబు= విశ్వకర్మచే కట్టబడిన; అంతఃపురంబునన్+ఉందు= లోపలి నగళ్లలో ఉండే; షోడశ సహస్రహర్మ్యంబుల+అందున్= పదహారువేల మేడలలో…

**తా :** మిక్కిలి ఎత్తుగా కట్టబడిన రత్నాలమేడల కిటికీల నుండి బయటికి వ్యాపించే కర్పూరహారతుల అగరుధూపాల పొగల్ని చూచి మబ్బులనుకొని, ఆ పురమందలి స్త్రీలచేత పెంపబడి నృత్యం చేయడానికి సిద్ధమవుతున్న నెమళ్లగుంపులు గలదీ; చంద్రకాంతశిలలతోనూ, స్ఫటికాలతోనూ కట్టబడిన స్తంభాలతో నవరత్నాలు పొదిగి స్వర్ణమయంగా తీర్చి అంతస్తుల పైభాగం మీద పెట్టిన బంగారు కలశాలు - చాలామంది సూర్యులవలె ఒప్పుతున్నదీ; సమస్తమైన వస్తువులు పేర్చిన వైశ్యుల వీథులు అరుగులతో ఒప్పుచున్నదీ; తాపాన్ని పోగొట్టడానికి కట్టిన రంగు రంగుల టక్కెముల రెపరెపలు, వాటికి కట్టిన నెమళ్లు, వింటినారుల ధ్వనులతో దిక్కులన్నీ నిండినదీ; శ్రీకృష్ణుడు పూతన మొదలైన రాక్షసుల్ని చంపి, జయించిన విశేషాలు బంగారు రేకులమీద చెక్కబడిన అక్షరపంక్తులతో ప్రకాశిస్తున్న ద్వారబంధపు చూరులు గలదీ; కృష్ణుని దర్శనానికి ఆహ్వానించగా వచ్చిన రాజుల యేనుగులయొక్క మదజలం కారడంవల్ల బురద బురదగా తయారైన ప్రదేశం - ఆ వచ్చిన రాజులు సమ్మర్దంతో వారి చేతుల కడియాలు ఒకరివి ఒకరికి ఒరుసుకుని ఆ కంకణాలలోని మణుల ధూళిరాలిపడడంవల్ల - ఈ బురద ఇంకి నేల బిగుసుకొన్నట్టిదీ, ఇళ్లముంగిళ్లన్నీ రత్నాలముగ్గులతో నిండి శుభసూచకాలతో ఒప్పునట్టిదీ, కంకుమాది పరిమళద్రవ్యాలు కలిపిన నీళ్లు చల్లుటచే తడిసిన అంగడివీథులు గలదీ, వంశచరిత్రల్ని కీర్తించే వందిమాగధుల; సంగీతగాయకుల - మేలైన ధ్వనులతో ఒప్పుతున్నదీ; సముద్రఘోషను తక్కువ చేయగల భేరీలు, నగారాలు, మద్దెలలు, మొదలైన తూర్యరావాల ధ్వనులతో కూడిందీ; ఇంద్రుడు మొదలగు దిక్పాలకుల పట్టణాలతో పోల్చదగిన గురుతులు గలిగి ఉగ్రసేనునిచేత పాలింపబడుతూ, వేదంలాగా, గ్రహమండలంలాగా, ప్రకాశిస్తూ, కల్యాణవేదికవలె, బలిచక్రవర్తి చేతివలె దానధారలతో కూడిందై ఒప్పుతున్న ఆ ద్వారకాపట్టణంలో ప్రవేశించి నారదుడు - ఆ నగరంలో విశ్వకర్మచే నిర్మింపబడిన పదియాఱువేల శ్రీకృష్ణుని పత్నుల మేడలలో

**విశే :** ఈ ద్వారకాపురవర్ణనలో పోతన మూలాన్ని అతిశయించి వర్ణించాడు. ముఖ్యంగా శ్లేషాలంకారంతో కూర్చిన వర్ణన పోతన ప్రతిభకు తార్కాణం. పోతన వర్ణనంలో శ్లేష, విరోధాభాస అలంకారాల ప్రయోగం అధికంగా కానవస్తుంది.

**సీ. పటికంపుఁగంబముల్ పవడంపుఁబట్టెలు మరకతరచితముల్ మదురు లమర**
**వైడూర్యమణిగణవలభులఁ బద్మరాగంబులమొగడలకాంతు లొలయ**
**సజ్జాతివజ్రలసజ్జాలరుచులతో భాసిల్లునీలసోపానములును**
**గరుడపచ్చలవిటంకములును ఘనరుచి వెలసిన శశికాంతవేదికలును**

**తే. వఱలు మౌక్తికఘటితకవాటములును, బ్రవిమలస్వర్ణమయసాలభంజికలును**
**మించు కలరవ మెసఁగఁ గ్రీడించుమిథున, లీల నొప్పు కపోతపాలికలుఁ గలిగి. 602**

**ప్రతి :** పటికము(ంపు)= స్ఫటికపురాళ్లతో చేయబడిన; కంబముల్= స్తంభాలు; పవడము(ంపు) పట్టెలు= పగడాల అడ్డకర్రలు; మరకత రచితముల్= పచ్చలు తాపి తయారుచేసిన; మదురులు= గోడలమీది కప్పులు; అమరన్= ఒప్పగా; వైడూర్యమణిగణవలభులన్= వైడూర్యమణులతో ఒప్పుచున్న చూరులుగలిగి; పద్మరాగంబుల= పద్మరాగమణులయొక్క; మొగడల= మొగ్గలు; కాంతులు+ఒలయన్= కాంతులు ప్రకాశిస్తూ ఉండగా; సజ్జాతి= తన ఉత్తమజాతికి చెందిన; వజ్రలసత్+ జాలరుచులతో= వజ్రాల కాంతుల సమూహంతో; భాసిల్లు= ప్రకాశంతో ఒప్పుతున్న; నీలసోపానములును= నీలమణులు తాపిన మెట్లును; గరుడపచ్చలు= శ్రేష్ఠమైన గరుడపచ్చలతో చేసిన; విటంకములును= చూరులును; ఘనరుచిన్= గొప్ప కాంతితో; వెలసిన= తయారుచేయబడిన; శశికాంత వేదికలును= చంద్రకాంత శిలలతో కట్టిన అరుగులును; వఱలు=

ఒప్పుతున్న; మౌక్తికఘటిత= ముత్యాలు పొదిగిన; కవాటములును= తలుపులును; ప్రవిమల= మిక్కిలి స్వచ్ఛమైన; స్వర్ణమయ= బంగారుమయమైన; సాలభంజికలును= బొమ్మలతో; మించుకలరవము= గొప్ప మనోహరమైన ధ్వనులు; ఎసఁగన్= అతిశయించగా; క్రీడించు= వినోదించే; మిథునలీలన్+ఒప్పు= ఆలుమగల విలాసాలతో సుందరమైన; కపోతపాలికలున్+ కలిగి= పావురపుగూళ్లు కలిగి...

**తా :** స్ఫటికాలతో చేసిన స్తంభాలు, పగడాలతో కుచ్చిన అడ్డకర్రలు, పచ్చలు తాపిన గోడలమీది కప్పులు ఒప్పగా వైడూర్యమణులతో, పద్మరాగమణులతో కూర్చిన బొగడలు అమరగా (గోడలమీద కోసుగా కట్టిన అలంకారాలు) జాతి వజ్రాల మేలైనకాంతితో ఒప్పే నీలాలు తాపిన మెట్లతో, గరుడపచ్చలతో ప్రకాశిస్తున్న చూరులు, అత్యంత కాంతిమంతాలైన చంద్రకాంతశిలామణులతో కట్టిన అరుగులు, ముత్యాలు తాపిన తలుపులు, మేలిమి బంగారంతో చేసిన సాలభంజికలూ, అవ్యక్తమధురమైన ధ్వనులతో క్రీడించే పావురాలజంటలగూళ్లు గలిగి

**తే. చేటికానీక పదతులాకోటిమధుర, నినదభరితమై రుచిరమాణిక్య దీప**
**మాలికయుఁ గల్గి చూపట్టఁగ్రాలు నొక్క, జలజలోచన నిజసౌధతలమునందు. 603**

**ప్రతి :** చేటికా+అనీక= పరిచారికల సమూహంయొక్క; పద తులాకోటి= పాదాల అందెలయొక్క; మధురనినదభరితము+ఐ= ఇంపైన ధ్వనిచేత నిండిందై; రుచిరమాణిక్యదీపమాలికయున్ కల్గి= కాంతిమంతమైన రత్నదీపాలవరుస కలిగి; చూపట్టన్+ కన్= కనబడుతుండగా; ఒక్క జలజలోచన= ఒక తామర రేకులవంటి కన్నులు గల స్త్రీయొక్క; నిజసౌధతలము+అందున్= తన భవనం పైభాగంలో; క్రాలు= ప్రకాశిస్తూ...

**తా :** పరిచారికల సమూహంయొక్క కాలిఅందెల చప్పుళ్లు వ్యాపించిందీ; రత్నాలనే ద్వీపాలవరుసతో ప్రకాశించేదీ అయిన ఒక స్త్రీ మేడపై విలాసంగా ప్రకాశిస్తూ

**తే. కనకకంకణఝణఝణత్కారకలిత, చంద్రబింబాననాహస్తజలజఘటిత**
**చామరోద్ధూతమారుతచలితచికుర, పల్లవునిఁ గృష్ణు వల్లవీపల్లవునిని. 604**

**ప్రతి :** కనక కంకణ= బంగారు కడియాలయొక్క; ఝణఝణత్కార కలిత= ఝణఝణమనే మోతతో కూడిన; చంద్రబింబ+ ఆననా= చంద్రబింబంవంటి ముఖంగల స్త్రీలయొక్క; హస్తజలజ ఘటిత చామర= తామరపూలవంటి అరచేతులలో పట్టుకొన్న వింజామరలచే; ఉద్ధూత మారుత= ఎగసే గాలిచే; చలిత చికురపల్లవునిన్= కదలింపబడిన ముంగురులు గలవాణ్ణీ; వల్లవీ పల్లవునిన్+కృష్ణునిన్= గోపికలకు విటుడైన శ్రీకృష్ణుణ్ణీ...

**తా :** పరిచారికలు తమ చేతులయందలి బంగారుగాజులు ఝణఝణమని మోగుచుండగా వీచే వింజామరలవల్ల బుట్టిన గాలిచేత కదలుతూండే ముంగురులుగలవాడూ, గోపికల ప్రియుడూ అయిన శ్రీకృష్ణుణ్ణి

**వ. మఱియు హాటకనిష్కంబు లఱ్ఱులందు వెలుగొందఁ, గంచుకంబులు శిరోవేష్టనంబులుఁ గనక కుండలంబులు ధరించి, సంచరించు కంచుకులును, సమానవయోరూపగుణవిలాసవిభ్రమకలితలయిన విలాసినీసహస్రంబులును గొలువం గొలువున్న యప్పద్మలోచనుం గాంచనసింహాసనాసీనుం గాంచె; న ప్పుండరీకాక్షుండును నారదుం జూచి ప్రత్యుత్థానంబు సేసి యప్పుడు. 605**

**ప్రతి :** మఱియున్= మరియూ; హాటక నిష్కంబులు= బంగారుకాసులు; అఱ్ఱుల+అందున్= మెడలో; వెలుగొందన్= ప్రకాశించగా; కంచుకంబులు= చొక్కాలూ; శిరస్+వేష్టనంబులున్= తలపాగాలూ; కనక కుండలంబులు= బంగారు చెవిపోగులూ; ధరించి= పెట్టుకొని (అలంకరించుకుని); సంచరించు= తిరిగే; కంచుకులును= హెగ్గడివారు; సమాన వయస్+రూపగుణ విలాసవిభ్రమ కలితలు+ఐన= ఒకే వయస్సూ, రూపమూ, గుణాలూ గల్లి వినోదచేష్టలతో కూడినవారైన; విలాసినీ సహస్రంబులును= వేలకొలదివేడుకకత్తెలు; కొలువన్= సేవిస్తుండగా; కొలువు+ఉన్న= కొలువుదీరియున్న; ఆ+పద్మలోచనున్= పుండరీకాక్షుడైన ఆ శ్రీకృష్ణుణ్ణి; కాంచనసింహ+ఆసన+ఆసీనున్= బంగారు సింహాసనంపై కూర్చున్నవాణ్ణి; కాంచెన్= చూచాడు; ఆ+పుండరీక+అక్షుండును= ఆ శ్రీకృష్ణుడూ; నారదున్= నారదమహర్షిని; చూచి= కనుగొని; ప్రత్యుత్థానంబు+చేసి= ఎదురేగి; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** బంగారుకాసులదండలు మెడలో వేసుకొని, తలపాగాలు ధరించి, చొక్కాలు తొడుగుకొని, చెవులకు బంగారం పోగులు పెట్టుకొని, అంతఃపురంలో కలియ తిరుగుచున్న కావలివాండ్రూ, సమానమైన వయస్సు, చక్కదనం, మంచిగుణాలు వినోదచేష్టలు గలిగి ఉత్సాహంతో మెలగునట్టి వేడుకకత్తెలూ సేవిస్తూ ఉండగా బంగారుసింహాసనంపై కూర్చుని కొలువుతీరియున్న శ్రీకృష్ణుణ్ణి నారదుడు చూశాడు. ఆ కృష్ణుదును నారదుణ్ణి చూచి ఎదురేగి

**క. మునివరుపాదాంబుజములు, దన చారుకిరీటమణివితానము సోఁకన్**
**వినమితుఁడై నిజసింహా, సనమునఁ గూర్చుండఁ బెట్టి సద్వినయమునన్. 606**

**ప్రతి :** మునివరు= నారదమునిశ్రేష్ఠునియొక్క; పాద+అంబుజములు= పాదపద్మాలు; తన= తనయొక్క; చారుకిరీటమణి వితానము= అందమైన కిరీటంలోని మణుల సమూహం; సోకన్= తాకేట్లుగా; వినమితుఁడు+ఐ= వంగి నమస్కరించినవాడై; నిజసింహ+ఆసనంబునన్= తనయొక్క సింహాసనంపై; కూర్చుండన్+పెట్టి= కూర్చొనబెట్టి; సత్+ వినయమునన్= మంచి అణకువతో...

**తా :** ఆ మునిశ్రేష్ఠుడైన నారదుని పాదపద్మాలకు తన కిరీటంలో పొదగబడిన మణులు సోకునట్లుగా నమస్కరించి, తాను కూర్చున్న సింహాసనంమీద ఆ మహర్షిని కూర్చుండబెట్టి మిక్కిలి వినయంతో

**క. తన పాదకమలతీర్థం, బున లోకములం బవిత్రముగఁ జేయు పురా**
**తనమౌని లోకగురుఁ డ, మ్మునిపదతీర్థంబు మస్తమున ధరియించెన్. 607**

**ప్రతి :** తన పాదకమలతీర్థంబునన్= తన పాదపద్మాల జలంచేత (గంగాజలంచేత); లోకములన్= పధ్నాలుగు లోకాలనూ; పవిత్రము+కన్= పావనంగా; చేయు= చేయగల; పురాతనమౌని= అతిప్రాచీనమైన ఋషి (ఆదిఋషి) అయిన నారాయణుడు; లోకగురుఁడు= సమస్త లోకాలకు గురువూ, తండ్రీ అయిన శ్రీకృష్ణుడు; ఆ+ముని= ఆ నారదమహర్షియొక్క; పదతీర్థంబు= పాదాలు కడిగిన నీటిని; మస్తమునన్= శిరస్సున; ధరియించెన్= తాల్చాడు. (చల్లుకొన్నాడు)

**తా :** ఎల్ల లోకాలను తన పాదంలో పుట్టిన గంగాజలంతో పవిత్రంగా చేయునట్టి ఆదిముని అయిన నారాయణఋషి అవతారమైనవాడూ, ఎల్లలోకాలకు తండ్రియైనవాడూ, అయిన ఆ శ్రీకృష్ణుడు నారదమహర్షియొక్క కాళ్లుకడిగిన నీళ్లను తన శిరస్సున చల్లుకొన్నాడు.

**వ. ఇట్లు బ్రహ్మణ్యదేవుండును నరసఖుండు నైన నారాయణుం డశేష తీర్థోపమానంబయిన మునీంద్రపాద తీర్థంబు ధరించినవాఁడయి సుధాసారంబులైన మితభాషణంబుల నారదున కిట్లనియె. 608**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; బ్రహ్మణ్యదేవుండును= వేదప్రతిపాదిత ధర్మాన్ని నిర్వర్తించే దేవుడూ; నర సఖుండును+ఐన= అర్జునునికి మిత్రుడూ అయిన; (నరనారాయణులు ప్రాచీన ఋషిపుంగవులు – వారిలో నారాయణుడు శ్రీకృష్ణుడుగా, నరుడు అర్జునుడుగా అవతరించాడు); నారాయణుండు= శ్రీకృష్ణుడు; అశేషతీర్థ+ఉపమానంబు+ఐన= ఎల్లతీర్థాలకు సాటి ఐనట్టి; ముని+ఇంద్ర పాదతీర్థంబు= నారదమహాముని కాళ్లు కడిగిన పవిత్రజలాన్ని; ధరియించినవాఁడు+ఐ= శిరస్సున జల్లుకొన్నవాడై; సుధాసారంబులు+ఐన= అమృత రసంలాంటి రసవంతాలైన; మితభాషణంబులన్= పరిమితి గల మాటలతో; నారదునకున్= నారదునితో; ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు.

**తా :** ఈ విధంగా వేదోక్తప్రకారంగా ధర్మాన్ని నడుపునట్టివాడూ; అర్జునునిస్నేహితుడూ అయిన శ్రీకృష్ణుడు – లోకాలలోని తీర్థాలన్నిటితో పోల్చదగినంతటి పవిత్రమైన నారదమహాముని పాదతీర్థాన్ని శిరసున ధరించి, అమృతతుల్యమైన, మితమైన మాటలతో నారదునితో ఇలా అన్నాడు.

**క. ఏ పని పంచినఁ జేయుదుఁ, దాపసవర! యనుడు నతఁడు దామోదర! చి**
**ద్రూపక! భవదవతార, వ్యాపారము దుష్టనిగ్రహార్థము గాదే! 609**

**ప్రతి :** తాపసవర!= ఓ మునిశ్రేష్ఠుడా!; ఏ పనిపంచినన్= ఏ పని చెయ్యమని ఆజ్ఞాపించినా; చేయుదున్= ఆ పనిచేస్తాను; అనుఁడున్= అనగా; అతఁడు= ఆ నారదుడు; దామోదర!= శ్రీకృష్ణా!; చిద్రూపక!= జ్ఞానస్వరూపా!; భవత్+అవతార వ్యాపారము= నీవు అవతరించిన కర్తవ్యం; దుష్టనిగ్రహ+అర్థము= చెడ్డవారిని శిక్షించుటకొఱకే; కాదు+ఏ!= కదా!.

**తా :** ఓ మునిశ్రేష్ఠా! మీరు ఏ పని చేయాలని ఆజ్ఞాపించినా ఆ పని చేస్తానని శ్రీకృష్ణుడు చెప్పగా, నారదుడు కృష్ణా! ఓ జ్ఞానస్వరూపా! నీవు అవతారమెత్తింది దుష్టుల్ని శిక్షించటానికే కదా! అన్నాడు.

**తే. అఖిలలోకైకపతివి దయార్ద్రమతివి, విశ్వసంరక్షకుండవు శాశ్వతుఁడవు**
**వెలయ నే పనియైనఁ గావింతు ననుట, యార్తబంధుండ విది నీకు నద్భుతంబె? 610**

**ప్రతి :** అఖిలలోక+ఏక పతివి= సర్వలోకాలకు ప్రధాన అధిపతివి; దయా+ఆర్ద్రమతివి= దయారసంతో నిండిన బుద్ధిగలవాడివి; విశ్వసంరక్షకుండవు= ఈ ప్రపంచాన్నంతా రక్షించేవాడివి; శాశ్వతుఁడవు= ఎల్లప్పుడూ ఉండేవాడివి; ఆర్తబంధుండవు= దుఃఖంలో ఉన్నవారికి చుట్టమైనవాడివి; వెలయన్= ప్రసిద్ధంగా; ఏ పని+ఐనన్= ఏ పని అయినా; కావింతున్= చేస్తాను; అనుట= అని చెప్పడం; ఇది నీకు= ఈ పద్ధతి నీయెడల; అద్భుతంబు+ఎ!= ఆశ్చర్యమా?

**తా :** అన్న లోకాలకు ముఖ్య ప్రభుడివి. మిక్కిలి దయగలవాడివి. సర్వలోక సంరక్షకుడివి. శాశ్వతంగా ఉండేవాడివి. కష్టాల్లో మునిగి ఉన్న వారిదుఃఖాన్ని పోగొట్టే చుట్టానివి తెప్పడం ఉంది.

**తే. అబ్జసంభవహరదేవతార్చనీయ!, భూరిసంసారసాగరోత్తారణంబు**
**నవ్యయానందమోక్షదాయకము నైన, నీ పదధ్యాన మాత్మలో నిలువ నీవె. 611**

**ప్రతి :** అబ్జసంభవ= పద్మంలో పుట్టిన బ్రహ్మచేత; హర= శివునిచేత; దేవత+అర్చనీయ= ఇంద్రాది దేవతలచేత అర్చింపదగినవాడా; భూరి= అధికమైన; సంసార= సంసారమనే; సాగర= సముద్రాన్ని; ఉత్తారణంబు= దాటించేదీ; అవ్యయ= నశింపనిదీ; ఆనంద= ఆనందాన్ని; మోక్ష= ముక్తిని; దాయకమున్= ఇచ్చేదీ; ఐన= అయిన; నీ= నీయొక్క; పదధ్యానము= నీ పాదపద్మాల్ని ధ్యానించడం; ఆత్మలోన్= మనస్సులో; నిలువన్+ఈవు+ఎ= నిలిచేటట్లు చేయవయ్యా!

**తా :** బ్రహ్మరుద్రుడు, ఇంద్రాదిదేవతలచే పూజింపదగినవాడా! సంసారమనే మహాసముద్రాన్ని దాటించి, నాశనంలేని ఆనందాన్ని, ముక్తిని ప్రసాదించే నీ పాదపద్మాల్ని ధ్యానించటాన్నే నా మనస్సులో ఎల్లప్పుడూ నిలిచేటట్లు చేయవయ్యా!

**వ. అని యభ్యర్థించి య ద్దేవునివలనం బ్రసన్నత వడసి, తన్మందిరంబు వెడలి మునివరుం డ మ్మహాత్ముని యోగమాయాప్రభావంబు దెలియం గోరి, వేఱొకచంద్రబింబాననాగేహంబునకుం జని, యందు నెత్తమాడుచున్న పురుషోత్తము నుద్ధవయుతుం గని యద్భుతంబు నొందుచు నతనిచేత సత్కృతుండై యచ్చోటు వాసి చని. 612**

**ప్రతి :** అని= అంటూ; అభ్యర్థించి= వేడుకొని; ఆ+దేవునివలనన్= ఆ కృష్ణదేవునివల్ల; ప్రసన్నతన్= అనుగ్రహాన్ని; వడసి= పొంది; తద్+మందిరంబు వెడలి= ఆ యింటినుండి బయటకు వచ్చి; మునివరుండు= ఆ నారదమునిశ్రేష్ఠుడు; ఆ+మహ+ఆత్ముని= ఆ శ్రీకృష్ణమహాత్మునియొక్క; యోగమాయాప్రభావంబున్= యోగమాయామహిమను; తెలియన్+కోరి= తెలుసుకోవాలని భావించి; వేఱు+ఒక= మరొక్క; చంద్రబింబ+ఆననా గేహంబునకున్= మరొక చంద్రునివంటి ముఖంగల స్త్రీ ఇంటికి; చని= వెళ్లి; అందున్= ఆ యింటిలో; నెత్తము+ఆడుచున్న= పాచికలాటనాడుతున్న; పురుష+ఉత్తమున్= పురుషులలో ఉత్తముడైన శ్రీకృష్ణుణ్ణి; ఉద్ధవయుతున్= ఉద్ధవునితో కలిసి ఉన్నవాణ్ణి; కని= చూచి; అద్భుతంబున్ ఒందుచున్= ఆశ్చర్యాన్ని పొందుతూ; అతనిచేతన్= ఆ శ్రీకృష్ణునిచే; సత్+కృతుండు+ఐ= సన్మానింపబడినవాడై; ఆ+చోటున్= ఆ యింటిని; వాసి= విడిచి; చని= వెళ్లి...

**తా :** ఆ విధంగా శ్రీకృష్ణుని వేడుకొని ఆయన అనుగ్రహాన్ని పొంది, ఆ ఇల్లు విడిచి బయలుదేరి కృష్ణపరమాత్మ యోగమాయా మహిమను తెలుసుకోవాలనే కోరికతో మరియొక ఇల్లాలియింటికి వెళ్లాడు. అక్కడ ఉద్ధవునితో కలిసి జూదమాడుతున్న శ్రీకృష్ణుణ్ణి దర్శించి ఆశ్చర్యపడి శ్రీకృష్ణునిచే ఆ యింటిలో కూడా సన్మానం పొంది ఆ ఇంటినుండి బయలుదేరినవాడై

**క. మునివరుఁడు కాంచె నొండొక, వనజాయతనేత్ర నిజనివాసంబున నం**
**దనయుతు జిష్ణు సహిష్ణున్, వినుతగుణాలంకరిష్ణు విష్ణున్ గృష్ణున్. 613**

**ప్రతి :** మునివరుఁడు= నారదముని; ఒండు+ఒక= మరియొక; వనజ+ఆయతనేత్ర= తామరపూలలాగా అందమైన కన్నులుగల స్త్రీయొక్క; నిజనివాసంబునన్= (తన) ఇంటిలో; నందనయుతున్= కొడుకులతో కూడియున్న; జిష్ణున్= జయశీలుడైన వాణ్ణి; సహిష్ణున్= సర్వదోషాలను సహించేవాణ్ణి; వినుత గుణ+అలంకరిష్ణున్= నుతింపదగిన గుణాలతో అలంకరించబడేవాణ్ణి; విష్ణున్= సర్వవ్యాపకుడైన వాణ్ణి; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; కాంచెన్= చూచాడు.

**తా :** నారదమహర్షి మరియొక భార్య యింటికి పోయి, అచట జయశీలుడు, సర్వవిషయ సహనశీలుడు, కొనియాడబడిన గుణాలు కలవాడు, సర్వవ్యాపకుడునై కొడుకులతో కూడి వేడుకతోనున్న శ్రీకృష్ణుణ్ణి (నారదుడు) చూచాడు.

**క. నారదుఁ డట చని కనె నొక, వారిజముఖియింట నున్నవాని మురారిన్**
**హారిన్ దానవకుల సం, హారిన్ గమలామనోవిహారిన్ శౌరిన్. 614**

**ప్రతి :** నారదుఁడు+అటన్+చని= నారదుడు అటనుండి వెడలి; ఒక వారిజముఖి+ఇంటన్= పద్మంలాంటి ముఖం గల ఒక స్త్రీ ఇంటిలో; ఉన్నవానిన్= ఉన్నటువంటి వాణ్ణి; ముర+అరిన్= మురాసురుణ్ణి సంహరించిన వాణ్ణి; హారిన్= ముత్యాలహారాలు ధరించినవాణ్ణి; దానవకులసంహారిన్= రాక్షసకులాన్ని చంపేవాణ్ణి; కమలామనోవిహారిన్= లక్ష్మీదేవిమనస్సులో విహరించేవాణ్ణి; శౌరిన్= శూరసేనుని మనుమడైన శ్రీకృష్ణుణ్ణి; కాంచెన్= చూచాడు.

**తా :** నారదుడు ఆ ఇంటినుండి మరొక పద్మముఖి ఇంటికి పోయి అచట ముత్యాలహారాలు ధరించినవాడూ, రాక్షసులను సంహరించేవాడూ, లక్ష్మీదేవి మనస్సులో విహరించేవాడూ, మురాసురుణ్ణి సంహరించి మురారి అని ప్రసిద్ధి పొందినవాడూ, శూరునివంశజుడై శౌరిగా వ్యవహరింపబడేవాడూ అయిన శ్రీకృష్ణుణ్ణి చూచాడు.

**వ. ఇట్లు కనుంగొనుచుం జనుచుండ నొక్కయెడ నమ్మునీంద్రునకు ముకుందుండు ప్రత్యుత్థానంబు చేసి మునీంద్రా! సంపూర్ణకాములయిన మిమ్ము నపూర్ణకాములమైన మే మేమిటఁ బరితృప్తి నొందఁ జేయంగలవారము? భవదీయదర్శనంబున నిఖిలశోభనంబుల నందెద మని ప్రియపూర్వకంబుగాఁ బలికిన నా నందనందనుమాటలకు నానందకందళితహృదయారవిందుండును, మందస్మితసుందరవదనారవిందుండును నగుచు నారదుండు వెండియుఁ జని చని. 615**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కనున్+కొనుచున్= చూస్తూండగా; చనుచున్+ఉండన్= వెళ్ళుతూండగా; ఒక్క+ఎడన్= ఒకచోట; ఆ+ముని+ఇంద్రునకున్= ఆ మునిశ్రేష్ఠుడైన నారదునికి; ముకుందుండు= శ్రీకృష్ణుడు; ప్రతి+ఉత్థానంబుచేసి= ఎదురుకొని లేచి నిలుచుండి; ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠుడా; సంపూర్ణకాములు= తీరిన కోరికలు కలవారు; అయిన మిమ్మున్= అయినట్టి మిమ్ములను; అపూర్ణులము+ఐన= కోరికలు తీరనట్టి వారమైన; ఏము= మేము; ఏమిటన్= దేనితో; పరితృప్తిన్= పూర్ణమైన తృప్తిని; ఒందన్+చేయన్+కలవారము?= పొందునట్లు చేయగలము?; భవదీయదర్శనంబు= మిమ్ములను దర్శించుటచే; నిఖిలశోభనంబులన్= ఎల్ల శుభాల్ని; అందెదము+అని= పొందెదమని; ప్రియపూర్వకంబు+కన్= ఆనందపడేట్లుగా; పలికినన్= పలుకగా; ఆ నందనందను= ఆ నందుని తనయుడైన శ్రీకృష్ణుని; మాటలకున్= మాటలకు; ఆనందకందళితహృదయ+అరవిందుండును= ఆనందం మొలకెత్తే హృదయకమలం కలవాడు; మందస్మిత సుందరవదన+అరవిందుండును= చిరునవ్వుతో అందంగా ఉండే ముఖకమలం కలవాడు; అగుచున్= అవుతూ; నారదుండు= నారదమహర్షి; వెండియున్= ఇంకను; చని చని= ముందుకు వెళ్లి వెళ్లి...

**తా :** నారదమహర్షి ఈ విధంగా ఒక్కొక్క సుందరాంగిగృహంలో శ్రీకృష్ణుడు ఒక్కొక్క వినోదంతో ఉండగా చూస్తూ పోతుండగా ఒకచోట శ్రీకృష్ణుడు ఆ మునీంద్రునికి ఎదురువచ్చి నమస్కరించి – మునీంద్రా! మీరు కోరికలన్నియు దీరిన మహానుభావులు. మేము కోరికలు తీరక వాటికై వెంపరలాడేవాళ్లం. మీ వంటివారిని మేము ఏ విధంగా పరితృప్తుల్ని చేయగలం? మీవంటి మునీంద్రుల దర్శనంచే సకల శుభాలూ పొందుతున్నాము అని ప్రియపూర్వకంగా చెప్పగా – ఆ మాటలు విని నారదుడు మనసులో ఆనందిస్తూ చిరునవ్వుతో మరికొన్ని ఇండ్లకు వెళ్లాడు.

**విశే :** ఇక్కడ శ్రీకృష్ణుడు నారదమహర్షికి చెప్పిన మాట నర్మగర్భితమైంది. నిజానికి, నారదుడు ఆ మాటలు శ్రీకృష్ణునికి చెప్పాల్సినవి కానీ, కృష్ణుడే ముందుగా చెప్పడం చూస్తే, అది పూర్ణకాముడైన ఆ శ్రీకృష్ణుని లీలావిశేషమే తప్ప వేరే కాదు.

**క. అనఘాత్ముఁడు గనుఁగొనె నొక, వనితామణిమందిరమున వనకేళీ సం**
**జనితానందుని ననిమిష, వినమితచరణారుణారవిందు ముకుందున్. 616**

**ప్రతి :** అనఘ+ఆత్ముఁడు= పాపచింతలేని మనస్సుగల నారదుడు; ఒక వనితామణి= ఒక స్త్రీరత్నంయొక్క; మందిరమునన్= ఇంటిలో; వనకేళీ జనిత+ఆనందునిన్= వన విహారం చేయడంవల్ల ఆనందం పొందినవాణ్ణి; అనిమిష= దేవతలచే; వినమిత= మ్రొక్కబడిన; చరణ+అరుణ+అరవిందున్= ఎఱ్ఱని పాదపద్మాలు గలవాణ్ణి; ముకుందున్= మోక్షాన్ని ప్రసాదించే శ్రీకృష్ణుణ్ణి; కనుఁగొనెన్= చూచాడు.

**తా :** నారదమహాముని – మరో ఉత్తమ స్త్రీ ఇంట వనవిహారంతో ఆనందిస్తున్నవాడూ, దేవతలచే మొక్కులు గైకొనేవాడూ, ఎఱ్ఱని పాదపద్మాలతో ప్రకాశించేవాడూ అయిన ఆ ముకుందుణ్ణి చూచాడు.

**క. పరమేష్ఠిసుతుఁడు గనె నొక, తరుణీభవనంబునందుఁ దను దాన మనో౽ం**
**బురుహమునఁ దలఁచుచుండెడి, నరకాసురదమనశూరు నందకుమారున్. 617**

**ప్రతి :** పరమేష్ఠిసుతుఁడు= బ్రహ్మకొడుకు – నారదుడు; ఒక తరుణీ భవనంబు+అందున్= మఱొక ప్రియురాలి ఇంట; తనున్= తనను; తాను+ఎ= తానే; మనస్+అంబురుహమునన్= మనః కమలమున; తలఁచుచున్= ధ్యానిస్తూ; ఉండెడి= ఉన్నట్టి; నరకాసుర దమనశూరున్= నరకాసురుణ్ణి సంహరించిన శూరుణ్ణి; నందకుమారున్= నందుని కొడుకైన శ్రీకృష్ణుణ్ణి; కనెన్= సందర్శించాడు.

**తా :** నారదమహాముని మరో సుందరాంగి ఇంటిలో పరబ్రహ్మయైన తన్ను తానే హృదయంలో ధ్యానిస్తున్నవాడూ, నరకాసురుని సంహరించిన శూరుడూ నందకుమారుడూ అయిన శ్రీకృష్ణుణ్ణి దర్శించాడు.

**వ. మఱియుం జని చని. 618**

**ప్రతి :** మఱియున్= ఇంకను; చని చని= వెళ్ళి వెళ్ళి...

**తా :** ఇంకనూ ముందుకు వెళ్ళగా

**సీ. ఒకచోట నుచితసంధ్యోపాసనాసక్తు నొకచోటఁ బౌరాణికోక్తికలితు**
**నొకచోటఁ బంచయజ్ఞోచితకర్ముని నొకచోట నమృతోపయోగలోలు**
**నొకచోట మజ్జనోద్యోగానుషక్తుని నొకచోట దివ్యభూషోజ్జ్వలాంగు**
**నొకచోట ధేనుదానోత్కలితాత్ముని నొకచోట నిజసుతప్రకరయుక్తు**

**తే. నొక్క చోటను సంగీతయుక్తచిత్తు, నొక్కచోటను జలకేళియుతవిహారు**
**నొక్కచోటను సన్మంచకోపయుక్తు నొక్కచోటను బలభద్రయుక్తచరితు. 619**

**ప్రతి :** ఒకచోటన్= ఒక ప్రదేశంలో; ఉచిత సంధ్యా+ఉపాసన+ఆసక్తున్= కాలోచితమైన సంధ్యావందనాది కార్యక్రమాల్లో ఆసక్తి గలవాణ్ణి; ఒకచోటన్= మరోచోట; పౌరాణిక+ఉక్తి కలితున్= పురాణాలు చెప్పేవారిమాటల్ని వినే వాణ్ణి; ఒకచోటన్= ఇంకొకచోట; పంచయజ్ఞ+ఉచిత కర్మునిన్= పంచయజ్ఞాలనే కర్మలు నడిపేవాణ్ణి; ఒకచోటన్= ఒక తావున; అమృత+

ఉపయోగలోలున్= అమృతాన్ని ఆస్వాదించేవాణ్ణి; ఒకచోటన్= మరొక తావున; మజ్జన+ఉద్యోగ+అనుషక్తునిన్= స్నానం చేయుటకు ప్రయత్నించేవాణ్ణి; ఒకచోటన్= మరొకచోట; దివ్యభూషా+ఉజ్జ్వల+అంగున్= దివ్యమైన ఆభరణాల్ని అలంకరించుకొన్న శరీరాంగాలు గలవాణ్ణి; ఒకచోటన్= మరొకచోట; ధేనుదాన+ఉత్+కలిత+ఆత్మునిన్= లేగదూడతో ఉన్న ఆవును దానం చేయడంలో ఉత్కంఠ కలవాణ్ణి; ఒక చోటన్= ఒక ప్రదేశంలో; నిజసుత ప్రకరయుక్తున్= తన కుమారులతో గుమిగూడి ఉండేవాణ్ణి; ఒక్కచోటను= మరొకచోట; సంగీతయుక్తచిత్తున్= సంగీతంతో ఆనందించే మనస్సుగలవాణ్ణి; ఒక్కచోటను= ఒకచోటను; జలకేళీయుతవిహారున్= జలక్రీడలతో విహరించేవాణ్ణి; ఒకచోటను= మరొక తావున; సత్+మంచక+ఉపయుక్తున్= మంచి మంచెమీద కూర్చున్నవాణ్ణి; ఒక్కచోటను= ఒక్కచోట; బలభద్రయుక్తచరితున్= అన్నయగు బలరామునితో కూడి తిరుగాడే వాణ్ణి.

**తా :** ఒకచోట సంధ్యావందనం చేస్తూ, ఒక ఇంట పురాణం వింటూ, మరొక తావున పంచమహాయజ్ఞాలు చేస్తూ, ఇంకొకయింట అమృతం సేవిస్తూ, మరొక్కచోట స్నానం ఆచరిస్తూ, వేరొక తావున ఆభరణాలు ధరిస్తూ, మరొకచోట లేగదూడ తోడి ఆవును దానమిస్తూ, మరొక యింట కొడుకులతో కూడి ఆనందిస్తూ, వేరొక యింట సంగీతం వింటూ, ఇంకొక్కచోట మంచెలపై ఎక్కి వినోదిస్తూ, మరోచోట బలరామునితో కూడి తిరుగుతున్న శ్రీకృష్ణుణ్ణి నారదుడు చూచాడు.

**విశే :** శ్రీకృష్ణుడు పదహారువేల సతులతో ఎలా ప్రవర్తిస్తున్నాడో చూడాలనే కుతూహలంతో పనిగట్టుకొని నారదుడు ద్వారకకు వచ్చాడు. వచ్చి శ్రీకృష్ణభగవానుడు ఒకొక్క ఇల్లాలిఇంట ఒకొక్క కార్యంలో నిమగ్నుడై సవిలాసంగా గడపడం చూశాడు.

శ్రీకృష్ణుడు – సర్వభూతాత్మకుడు. "వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్రయమ్" అని కదా స్వామిని గూర్చిన వచనం. కావున, స్వామి సర్వవ్యాపకుడు అనే విషయాన్ని నారదుడు మరొక్కసారి నిర్ధారణ చేసికొన్నాడు.

**వ. మఱియును. 620**

**ప్రతి :** మఱియును= ఇంకను...

**సీ. సకలార్థసంవేది యొకయింటిలోపలఁ జెలితోడ ముచ్చటల్ సెప్పుచుండు**
**విపులయశోనిధి వేఱొకయింటిలో సరసిజాననఁ గూడి సరసమాడుఁ**
**బుండరీకదళాక్షుఁ డొండొకయింటిలోఁ దరుణికి హారవల్లరులు గ్రుచ్చుఁ**
**గరుణాపయోనిధి మఱియొక యింటిలోఁ జెలిఁ గూడి విడియము సేయుచుండు**

**ఆ. వికచకమలనయనుఁ డొకయింటిలో నవ్వు, బ్రవిమలాత్ముఁ డొకటఁ బాడుచుండు**
**యోగిజనవిధేయుఁ డొకయింట సుఖగోష్ఠి సలుపు ననఘుఁ డొకటఁ జెలఁగుచుండు. 621**

**ప్రతి :** సకల+అర్థసంవేది= సర్వ విషయాలూ చక్కగా తెలిసిన శ్రీకృష్ణుడు; ఒక+ఇంటిలోపలన్= ఒక ఇంటిలో; చెలితోడన్= ప్రియురాలితో; ముచ్చటల్+చెప్పుచున్+ఉండున్= కబుర్లు చెబుతుంటాడు; విపులయశస్+నిధి= విస్తారమైన కీర్తిశాలియైన శ్రీకృష్ణుడు; వేఱు+ఒక+ఇంటిలోన్= మరియొక ఇంటిలో; సరసిజ+ఆననన్+కూడి= కమలముఖియగు ప్రియురాలితో కలసి సరసమాడున్= సరసంగా మాటలాడుతుంటాడు; పుండరీకదళ+అక్షుఁడు= తామరపూల రేకులవంటి కన్నులు

గలవాడు; ఒండు+ఒక+ఇంటిలోన్= మరో ఇంటిలో; తరుణికిన్= యౌవనాంగి అయిన ప్రేయసికి; హారవల్లరులు= పూలదండలు; గ్రుచ్చున్= గ్రుచ్చుతుంటాడు (కొప్పున అలంకరిస్తూ); మఱి+ఒక+ఇంటిలోన్= వేరొక యింటిలో; చెలిన్= ప్రియురాలితో; కూడి= కలిసి; విడియము= తాంబూలము; చేయుచున్+ఉండున్= సేవిస్తూ ఉంటాడు; వికచకమల నయనుండు= విచ్చిన తామరలవంటి నేత్రాలు గల శ్రీకృష్ణుడు; ఒక+ఇంటిలోనవున్= ఒక ఇంటిలో నవ్వుతుంటాడు; ప్రవిమల+ఆత్ముఁడు= నిర్మలమైన మనస్సు గలవాడు; ఒకటన్= ఒకచోట; పాడుచున్+ఉండున్= పాడుతుంటాడు; యోగిజనవిధేయుఁడు= యోగిజనులకు లోబడి ఉండేవాడు; ఒక+ఇంటన్= ఒక యింటిలో; సుఖగోష్ఠి+సలుపున్= హాయిగా ఇష్టాగోష్ఠిలో ఉంటాడు; అనఘుఁడు= పుణ్యాత్ముడగు కృష్ణుడు; ఒకటన్= ఒకచోట; చెలఁగుచున్+ఉండున్= ఆనందిస్తూ ఉంటాడు.

**తా :** సర్వవిషయాలు తెలిసినవాడు; మిక్కిలి కీర్తి కలవాడు, కరుణాసముద్రుడు, పుండరీకాక్షుడు, నిర్మలమైన మనస్సుగలవాడు, యోగీశ్వరులకు లోబడినవాడు, పాపము లేనివాడు అగు శ్రీకృష్ణపరమాత్మ ఆయా ఇండ్లలో ఉండే ప్రియురాళ్లతో తన ఇష్టానుసారం ఒకచోట ముచ్చటలాడుతూ, ఒకచోట సరసాలాడుతూ, ఒకచోట ప్రియురాలి కొప్పును పూలదండలతో అలంకరిస్తూ, ఒక ప్రేయసితో కలసి తాంబూలం సేవిస్తూ, ఒకచోట పాటలు పాడుతూ, ఒకచోట సుఖంగా ప్రొద్దుపుచ్చుతూ, ఒకచోట సంతోషంతో విహరిస్తుంటాడు. శ్రీకృష్ణుడు పదహారువేలమంది యువతీజనంతో కొత్త కాపురాలు నడిపేవిధాన మిది.

**వ. ఇట్లు సూచుచుం జని చని. 622**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; చూచుచున్= చూచుకుంటూ; చని= వెళ్ళి...

**క. చతురాననసనందనుఁ డం, చితమతిఁ జని కాంచె నొక్క చెలిగేహమునన్**
**గ్రతుకర్మాచరణుని నా, శ్రితభయహరణున్ సురేంద్రసేవితచరణున్. 623**

**ప్రతి :** చతుర్+ఆననసనందనుఁడు= నాల్గు ముఖాలు గల బ్రహ్మదేవునికి పుత్రుడగు నారదుడు; అంచితమతిన్= పూజ్యతోడి బుద్ధితో; చని= వెళ్లి; ఒక్క చెలిగేహమునన్= ఒక ప్రియురాలి యింటిలో; క్రతుకర్మాచరణునిన్= యజ్ఞసంబంధికర్మలు, నిర్వర్తించేవాణ్ణి; ఆశ్రిత భయహరణున్= తనను ఆశ్రయించినవారిభయాన్ని పోగొట్టేవాణ్ణి; సురేంద్రసేవితచరణున్= దేవేంద్రునిచే సేవింపబడిన పాదాలు కలవాణ్ణి - శ్రీకృష్ణుణ్ణి; కాంచెన్= చూచాడు.

**తా :** నాల్గుముఖాలుగల బ్రహ్మదేవునికి పుత్రుడైననారదుడు శ్రీకృష్ణునియెడ గౌరవప్రదమైన బుద్ధితో ఒక యిల్లాలి యింటికి పోయి - అచట యజ్ఞకర్మలు నడుపుతూ, ఆశ్రితుల్ని కాపాడుతున్నట్టి, ఇంద్రునిచే సేవింపబడే పాదపద్మాలతో ప్రకాశించే శ్రీకృష్ణుణ్ణి చూచాడు.

**క. వృత్రారినుతునిఁ బరమ, పవిత్రుని నారదుఁడు గాంచె వేఱొక యింటం**
**బుత్త్రక పౌత్త్రక దుహితృ క, ళత్రసమేతుని ననంతు లక్షణవంతున్. 624**

**ప్రతి :** వృత్ర+అరినుతున్= వృత్రాసురుని సంహరించిన దేవేంద్రునిచేత కొనియాడబడేవాడును; పరమ పవిత్రునిన్= మిక్కిలి పరిశుద్ధుడైన వాణ్ణి; న+అంతున్= అనంతున్= అంతంలేనట్టి వాణ్ణి; లక్షణవంతున్= శుభలక్షణోపేతుణ్ణి; పుత్త్రక=

కొడుకులతోను; పౌత్రక= పుత్రుల సంతానమగు మనుమలతోను; దుహితృ= కుమార్తెలతోను; కళత్ర= భార్యలతోను; సమేతునిన్= కూడియున్న వాణ్ణి; వేఱొక+ఇంటన్= మరొక యింటిలో; కాంచెన్= చూచాడు.

**తా :** దేవేంద్రునిచే కొనియాడబడెడువాడూ, పవిత్రుడూ, అంతంలేనివాడూ, సర్వశుభలక్షణోపేతుడూ అయిన శ్రీకృష్ణుడు – కొడుకులతో, మనుమలతో, కూతుళ్లతో భార్యలతో కూడియుండగా నారదుడు మరొక యింటిలో చూచాడు.

**క. సుందరమగు నొకసుందరి, మందిరమునఁ బద్మభవకుమారుఁడు గాంచెన్**
**నందితనందున్ సుజనా, నందున్ గోవిందు నతసనందు ముకుందున్. 625**

**ప్రతి :** సుందరము+అగు ఒక సుందరి= అందమైన ఒక సుందరి; మందిరమునన్= ఇంటిలో; పద్మభవకుమారుఁడు= పద్మం నుండి పుట్టిన బ్రహ్మయొక్క తనయుడు (నారదుడు); నందితనందున్= నందుణ్ణి ఆనందింప చేసేవాడు; సుజన+ఆనందున్ (సుజనానందున్)= మంచివారైన భక్తులను సంతోషపెట్టువానిని; గోవిందున్= వేదాంతవాక్యాలకు లొంగేవాడిని; నత సనందున్= సనందునిచే నమస్కరింపబడేవాడు అయిన; ముకుందున్= మోక్షాన్ని ప్రసాదించే శ్రీకృష్ణుణ్ణి; కాంచెన్= చూచాడు.

**తా :** అందగత్తెయగు మఱియొక ప్రియురాలి యింటిలో సజ్జనులైనవారికి సంతోషాన్ని కలుగచేస్తూ, వేదాలచే తెలియబడువాడు, నందుణ్ణి ఆనందింప చేయువాడు, సనందునిచే నమస్కరింపబడే వాడు అయిన ముకుందుణ్ణి నారదుడు చూచాడు.

**క. జలజభవసుతుఁడు గనె నొక, నలినాక్షినివాసమందు నతభద్రేభున్**
**జలదాభున్ గతలోభు, న్నలకాళిజితద్విరేఫు నంబుజనాభున్. 626**

**ప్రతి :** జలజభవసుతుఁడు= తామరయందు పుట్టిన బ్రహ్మకు కొడుకైన నారదుడు; ఒక నలిన+అక్షి నివాసము+అందున్= తామరలవంటి కన్నులు గల ఒక ప్రియురాలి యింటిలో; నతభద్ర+ఇభున్= మేలైన జాతి ఏనుగుచే మొక్కించుకొనే వాడు; జలద+ఆభున్= మేఘమును బోలిన శరీరకాంతివాడు; నీలమేఘశ్యాముడు; గతలోభున్= లోభంలేనివాడు; అలకాళి= ముంగురుల సమూహంచేత; జితద్విరేఫున్= జయింపబడిన తుమ్మెదలు కలవాడు అయిన; అంబుజనాభున్= బొడ్డున తామరపువ్వుగల శ్రీకృష్ణుణ్ణి; కనెన్= చూచాడు.

**తా :** నారదుడు మరియొక స్త్రీ యింటిలో తుమ్మెదల్ని గెలువజాలిన నల్లని ముంగురులు గలవాణ్ణి, నీలమేఘశ్యాముణ్ణి లోభములేనివాణ్ణి, పద్మనాభుణ్ణి, భద్రజాతి ఏనుగులచే నమస్కారములు అందుకొంటున్న శ్రీకృష్ణుణ్ణి చూచాడు.

**విశే :** ద్విరేఫము – వ్యుత్పత్తి – రెండు రేఫలు అనగా రకారాలు గలది అని అర్థం. ఈ ద్విరేఫము అనేది – 'భ్రమరము' అనే పదాన్ని బట్టి వచ్చింది. 'భ్రమరము' – అంటే పూలచుట్టూ తిరుగుతూ ఉండేది – తుమ్మెద అని అర్థం. భ్రమరంలో రెండు రకారాలు ఉన్నాయి. భ్ర – లో ఒకటి, ర – ఒకటి. రెండు రేఫలు గలది అని ఈ శబ్దాన్నిబట్టి తుమ్మెదకు 'ద్విరేఫము' అనే పదం ఏర్పడింది.

**మ. ఒకయింటం గజవాజిరోహకుఁడునై యొక్కింట భుంజానుఁడై**
**సకలాత్ముండు పరుండు షోడశసహస్రస్త్రీనివాసంబులం**
**దొకటోటింటను దప్పకుండ నిజమాయోత్సాహుఁడై యుండ న**
**య్యకలంకున్ వరదున్ మహాపురుషు బ్రహ్మణ్యున్ నతాబ్జాసనున్. 627**

**ప్రతి :** ఒక+ఇంటన్= ఒక ఇంటిలో; గజవాజిరోహకుఁడున్+ఐ= ఏనుగులను, గుఱ్ఱములను ఎక్కేవాడై; ఒక్కింటన్= ఒక ఇంటిలో; భుంజానుఁడు+ఐ= భోజనం చేస్తున్నవాడై; సకల+ఆత్ముండు= సకలమూ తనయందు కలవాడైన; పరుండు= పరమాత్మ; షోడశసహస్రస్త్రీనివాసంబులన్= పదియారువేలస్త్రీల ఇళ్లలో; ఒకబోటి+ఇంటనున్= ఒక స్త్రీ ఇంటియందైన; తప్పకుండ= తప్పకుండ (లేకుండా ఉండక); నిజమాయా+ఉత్సాహుఁడు+ఐ= తనయొక్క మాయ వలని పొందిన ఉత్సాహం కలవాడై; ఉండన్= ఉండగా; ఆ+అకలంకున్= ఆ కళంకం లేని స్వచ్ఛమైనవాణ్ణి; వరదున్= వరాలు ఇచ్చేవాణ్ణి; మహాపురుషున్= విరాట్పురుషుణ్ణి; బ్రహ్మణ్యున్= వేదంలో చెప్పినధర్మాల్ని నిర్వర్తిస్తూ; నత+అబ్జ+ఆననున్= బ్రహ్మచే నమస్సులు అందుకొనే శ్రీకృష్ణుణ్ణి – (చూచాడు)...

**తా :** ఒక ఇంటిలో ఏనుగులను, గుఱ్ఱాలను ఎక్కి వినోదించే వాణ్ణి, ఒక యింటిలో భోజనం చేస్తూ, పదహారువేల స్త్రీల గృహాలలో తన మాయా ప్రభావం వల్ల ప్రకాశిస్తున్న – పవిత్రుణ్ణి, వరప్రదాత, వేదధర్మ ప్రవర్తకుణ్ణి, విరాట్పురుషుణ్ణి, బ్రహ్మచే సేవింపబడేవాడైన శ్రీకృష్ణుణ్ణి నారదుడు చూచాడు.

**క. అస్తోకచరితు నమిత స, మస్తసుధాహారు వేదమస్తకతల వి**
**న్యస్తపదాంబుజయుగళు న, పాస్తాశ్రితనిఖిలపాపుఁ బరము ననంతున్. 628**

**ప్రతి :** అస్తోకచరితున్= గొప్ప నడవడి గలవాడు; నమిత సమస్తసుధా+ఆహారున్= సమస్త దేవతలచేత నమస్కరించుబడేవాడు; వేదమస్తకతల= వేదాలకు చివర ఉండే ఉపనిషత్తులనే ప్రదేశాలలో; విన్యస్త= ఉంచబడిన; పదాంబుజయుగళున్= రెండు పాదకమలాలు గలవాడూ; అప+అస్త+ఆశ్రిత నిఖిలపాపున్= ఆశ్రితులయొక్క సమస్తపాపాలు తొలగించేవాడూ; పరమున్= సర్వోత్తముడైన; అనంతున్= శ్రీకృష్ణభగవానుణ్ణి – (చూచెను).

**తా :** గొప్పప్రవర్తనకలవాడూ, ఎల్లదేవతలచే మ్రొక్కులందుకొనేవాడూ, ఉపనిషత్తుల్లో ప్రతిపాదింపబడిన పాదకమలాలు గలవాడూ, తనను ఆశ్రయించినవారి పాపాలన్నీ తొలగించేవాడూ, సర్వోత్తముడైన శ్రీకృష్ణుణ్ణి నారదుడు చూచాడు.

**ఆ. పరమభాగవతుఁడు పరమేష్ఠితనయుండు, మనుజలీలఁ జెంది మహితసౌఖ్య**
**చిత్తుఁడైన యా హృషీకేశు యోగ మా, యాప్రభావమునకు నాత్మ నలరి. 629**

**ప్రతి :** పరమభాగవతుఁడు= భగవద్భక్తులలో ఉత్తముడైన; పరమేష్ఠితనయుండు= బ్రహ్మకొడుకైన నారదుడు; మనుజలీలన్= సామాన్యమానవుడిలాగా; చెంది= పొంది; మహితసౌఖ్యచిత్తుఁడు+ఐన= గొప్ప సుఖాలలో మునిగిన మనస్సు గలవాడు; ఆ హృషీక+ఈశున్= సర్వేంద్రియాలకు అధిపతియైన శ్రీకృష్ణుడు; యోగ= నిశ్చల ధ్యానయోగంయొక్క; మాయా ప్రభావమునకున్= జరగనిది జరిగినట్లుగా చూపించే మహిమకు; ఆత్మన్= మనసులో; అలరి= సంతోషించి.

**తా :** పరమభాగవతుల్లో ద్వితీయుడైనా అద్వితీయస్థానాన్ని ఆక్రమించిన నారదుడు (ప్రహ్లాదునికి అసలు గురువు. నారాయణ మంత్రోపదేశం చేసినవాడు) బ్రహ్మమానసపుత్రుడు. ఆ పరమభక్తాగ్రేసరుడు, సకల ఇంద్రియాలకు అధిపతియైన శ్రీకృష్ణపరమాత్మ, సాధారణమైన నరజన్మను ధరించి, మానవాతీతమైన గొప్పసుఖాలలో యోగమాయాప్రభావంతో జీవితాన్ని గడపడం చూచి, ఆయన సామర్థ్యానికి ఆత్మలో సంతోషించాడు.

**క. మాయురె? హరి! హరి! వరద! య, మేయగుణా! యనుచు నాత్మ మెచ్చి మునీంద్రుం**
**డాయదునాయకు సుజన వి, ధేయుని కిట్లనియె 'దేవ! త్రిజగములందున్. 630**

**ప్రతి :** మాయురె!= ఔరా!; హరి= ప్రళయకాలంలో సర్వం నీలో లీనం చేసుకొనేవాడా!; హరి= భక్తుల పాపాలను హరించేవాడా!; వరద= నిన్ను ఆరాధించేవారికి సకల వరాలను ఇచ్చేవాడా!; అమేయగుణా!= మేర తెలియరాని కల్యాణగుణాలు కలవాడా!; అనుచున్= అంటూ; ఆత్మన్= మనసులో; మెచ్చి= మెచ్చుకొని; ముని+ఇంద్రుండు= మునిశ్రేష్ఠుడైన నారదుడు; ఆ యదువంశనాయకున్= ఆ యదువంశానికి ప్రభువైన; సుజన విధేయునకున్= సత్పురుషులకు విధేయుడైన శ్రీకృష్ణునితో; ఇట్లు+అనియెన్= ఇట్లు చెప్పాడు; దేవ!= ఓ భగవానుడా!; త్రిజగములు+అందున్= స్వర్గమర్త్య పాతాళాలనే మూడులోకాలలో...

**తా :** ఔరా! శ్రీహరీ! వరదా! అమేయగుణాకరా! అంటూ ఆశ్చర్యంతో శ్రీకృష్ణుణ్ణి తన మనస్సులో మెచ్చుకొంటూ నారదమహర్షి సజ్జనవిధేయుడైన శ్రీకృష్ణుణ్ణి చూచి ఓ దేవా! మూడులోకాలలో నీ మాయ తెలియగలవా రున్నారా?

**క. నీ మాయఁ దెలియువారలె, తామరసాసన సురేంద్రతాపసు లైనన్**
**ధీమంతులు నీభక్తిసు, ధా మాధుర్యమునఁ బొదలు ధన్యులు దక్కన్. 631**

**ప్రతి :** ధీమంతులు= బుద్ధిమంతులైనవారు – (ఆత్మకు ఆత్మకాని దానికి గల భేదం తెలిసినవారు); నిజ= తమయొక్క; భక్తిసుధా మాధుర్యమునన్= భక్తి అనే అమృతంయొక్క తియ్యదనంచేత; పొదలు= వృద్ధిపొందునట్టి; ధన్యులు= కృతార్థులు; తక్కన్= తప్ప; తామరస+ఆసన= తామరపువ్వు ఆసనంగా గల బ్రహ్మ; సుర+ఇంద్ర= సురేంద్ర= దేవతల నాయకుడైన ఇంద్రుడు; తాపసులు+ఐనన్= తపస్సంపన్నులైన మహాఋషులైనా; నీమాయన్= నీయొక్క మాయను; తెలియువారలు+ఎ?= తెలుసుకోగలరా? తెలుసుకోలేరు.

**తా :** మూడు లోకాల్లో బుద్ధిమంతులై నీ మీది భక్తి అనే అమృతాన్ని సేవించి, వృద్ధిపొందే కృతార్థులు తప్ప, బ్రహ్మ ఇంద్రాదిదేవతలుగాని, మహర్షులుగాని నీ మాయాప్రభావాన్ని తెలుసుకోగలరా? (తెలిసికోలేరు అని తాత్పర్యం.)

**విశే :** ఈ భావాన్నే సద్గురు శ్రీత్యాగరాజస్వామివారు మాయామానుష విగ్రహుడైన శ్రీరామునిపై ఆరోపించి, "ఏమయ్య రామ! బ్రహ్మేంద్రాదులకు నైన నీమాయ తెలియవశమా!? అనే కృతి రచించారు. రామభక్తి సామ్రాజ్యాన్ని నిర్మించి స్థాపించారు. **"మమ మాయా దురత్యయా!** – గీత. 'నా మాయను ఎవ్వరూ దాటిపోలేరు?' అన్నాడు. గీతా ప్రవక్త.

**క. అని హర్షించుచు 'నిఁక నేఁ, బనివినియెద నిఖిలలోకపావనమును స**
**జ్జనహితమునైన నీకీ, ర్తన మఖిలజగంబులందుఁ దగ నెఱిఁగింతున్. 632**

**ప్రతి :** అని= అని; హర్షించుచున్= ఆనందిస్తూ; ఇఁకన్= ఇక; ఏన్= నేను; పని వినియెదన్= బయలుదేరుతాను; నిఖిల లోకపావనమునున్= ఎల్ల లోకాలలో పవిత్రమైందీ; సత్+జనహితమున్+ఐన= మంచివారికి మేలు చేకూర్చేదీ అయిన; నీ కీర్తనము= నీ గొప్పతనాన్ని; అఖిలజగంబుల+అందున్= అన్నిలోకాల్లో; తగన్= ఒప్పునట్లుగా; ఎఱిఁగింతున్= తెలియపరుస్తాను.

**తా :** ఇట్లు పలికి ఆనందిస్తూ దేవా! నేనిక మీనుండి సెలవు తీసుకొంటాను. ఎల్ల లోకాలను పావనంచేసేదీ, మంచివారికి హితం చేకూర్చేదీ అయిన నీ గొప్పతనాన్ని అన్నిలోకాల్లో తెలియపరుస్తాను అన్నాడు.

**క. అని తద్వచనసుధాసే, చనమున ముదితాత్ముఁ డగుచు సంయమి చిత్తం**
**బునఁ దన్మూర్తిం దగ నిడు, కొని చనియెను హరినుతైకకోవిదుఁ డగుచున్. 633**

**ప్రతి :** అని= అనిచెప్పి; తద్= ఆ శ్రీకృష్ణపరమాత్మయొక్క; వచనసుధాసేచనమునన్= మాటలనే అమృతపుచినుకులతో; ముదిత+ఆత్ముఁడు+అగుచున్= ఆనందించిన మనస్సుగల వాడై; సంయమి= మునీంద్రుడైన నారదుడు; చిత్తంబునన్= మనస్సులో; తద్+మూర్తిన్= ఆ శ్రీకృష్ణునిరూపాన్ని; తగన్= గౌరవంతో; ఇడుకొని= నిలుపుకొని; హరినుత+ఏక= శ్రీహరిని కీర్తించడమే జీవితాశయంగా భావించిన; కోవిదుఁడు+అగుచున్= పండితు డవుతూ; చనియెన్= వెళ్లారు.

**తా :** శ్రీకృష్ణుని అమృతతుల్యమగు మాటలతో ఆనందాన్ని పొందినవాడై, ఆ దేవదేవునిరూపాన్ని మనసులో నిల్పుకొని, హరిని కీర్తించడమే జీవితధ్యేయమని భావించిన పాండిత్యంగలవాడై నారదుడు బయలుదేరాడు.

**క. ఈ పగిది లోకహితమతి, నా పరమేశ్వరుఁడు మానవాకృతిఁ ద్రిజగ**
**ద్దీపితచారిత్రుఁడు బహు, రూపములం బొందె సుందరుల నరనాథా! 634**

**ప్రతి :** నరనాథా!= ఓ రాజా!; ఈ పగిదిన్= ఈ రీతిగా; లోకహితమతిన్= లోకానికి మేలు చేకూర్చాలనే ఆలోచనతో; ఆ పరమేశ్వరుఁడు= ఆ శ్రీకృష్ణుడు; త్రిజగత్+దీపిత చారిత్రుఁడు= మూడు లోకాలలో ఎంతో ప్రకాశవంత మైన నడవడి గలవాడు; మానవ+ఆకృతిన్= మానవరూపంతో; సుందరులన్= స్త్రీల విషయాలలో; బహురూపములన్= అనేకాలైనవివిధరూపాలను; పొందెను= ధరించాడు.

**తా :** ఓ రాజా! ముల్లోకాలలో విశేషంగా ప్రకాశించే నడవడిగల శ్రీకృష్ణపరమాత్మ లోకాలకు మేలు చేయాలనే ఆలోచనతో మానవుడుగా జన్మించి పదహారువేల స్త్రీలను ఆనందింప చేయడానికి బహురూపాలు ధరించి ప్రవర్తించాడు.

**విశే :** పరమాత్ముడు ఒక్కడే అయినా లోకకల్యాణంకోసం అందుకు తగిన ఎన్నెన్నో రూపాలు ధరిస్తూంటాడు. ఆయన సంకల్పంతోనే ఈ సృష్టి జరిగింది. నిజానికి ఆయనకు మనవంటి జన్మలేకున్నా - ఎన్నోజన్మలు కలవాడుగా ప్రకాశిస్తుంటాడు. ఇదంతా యోగమాయా ప్రభావం.

**చ. అని హరి యిట్లు షోడశసహస్రవధూమణులం బ్రియంబునన్**
**మనసిజకేళిఁ దేల్చిన యమానుషలీల సమగ్రభక్తితో**
**వినినఁ బఠించినం గలుగు విష్ణుపదాంబుజభక్తియున్ మహా**
**ధనపశుపుత్త్రమిత్రవనితాముఖసౌఖ్యములున్ నరేశ్వరా!' 635**

**ప్రతి :** నర+ఈశ్వరా!= రాజా! (పరీక్షిత్తు); అని= ఇట్లని; హరి= శ్రీకృష్ణుడు; ఇట్లు= ఈ విధంగా; షోడశసహస్రవధూమణులన్= పదియారువేల స్త్రీ రత్నాలను; ప్రియంబునన్= ప్రేమతో; మనసిజకేళిన్= మన్మథక్రీడలలో; తేల్చిన= ఆనందింపచేసిన; అమానుషలీల= మానవబుద్ధికి అతీతమైన విలాసాన్ని; సమగ్రభక్తితో= కొఱతలేని భక్తితో; వినినన్= విన్నాను; పఠించినన్= చదివినా; విష్ణుపద+అంబుజ భక్తియున్= శ్రీమహావిష్ణుపదకమలములందు భక్తిభావన; మహాధన= అధికమైన ధనసంపద; పశు= గోసంపద; పుత్త్ర= కొడుకులు; మిత్ర= స్నేహితులు; వనితా= స్త్రీలు; ముఖ= మొదలైనవారిచే; సౌఖ్యములును= సుఖాలు; కలుగున్= సమకూడుతాయి.

**తా :** ఓ రాజా! ఈ రీతిగా శ్రీకృష్ణుడు పదియారువేల స్త్రీలను రతికేళి తేలించి సంతోషపెట్టిన మానవాతీతశక్తిని గూర్చి సమగ్రమైన భక్తితో ఎవరైతే విందురో, చదువుదురో వారికి శ్రీవిష్ణుపాదభక్తితోపాటు, వెలలేని ధనసంపద, గోసంపద, కొడుకులు, మిత్రులు, భార్యలు లభించి వారివలన అనేకసుఖాలు సమకూడుతాయి. (అని ఈ ఘట్టాన్ని విన్నా చదివినా లభించేదాన్ని ఫలశ్రుతిగా వివరించాడు శుకమహర్షి.)

**వ. అని చెప్పి యప్పారాశర్యనందనుం డభిమన్యునందనున కిట్లనియె. 'నా నిశావసానంబునఁ బద్మబాంధవాగమనంబును గమలినీలోకంబునకు మునుకలుగ నెఱింగించు చందంబునం గలహంస సారసరథాంగముఖజలవిహంగంబులరవంబులు సెలంగ నరుణోదయంబున మంగళపాఠకసంగీత మృదుమధురగాననినదంబును లలితమృదంగవీణావేణునినాదంబును ఏతేర మేలుకని తనచిత్తంబునఁ జిదానందమయుం బరమాత్ము నవ్యయు నవికారు నద్వితీయు నజితు ననంతు నచ్యుతు నమేయు నాఢ్యు నాద్యంతవిహీనుఁ బరమబ్రహ్మంబు నైన తన్నుం దా నొక్కింత చింతించి, యనంతరంబ విరోధిరాజన్య నయనకల్హారంబులు ముకుళింప భక్తజననయనకమలంబులు వికసింప నిరస్తనిఖిలదోషాంధకారుం డైన గోవిందుండు మొగిచిన లోచనసరోజంబులు వికసింపఁజేయుచుఁ దల్పంబు డిగ్గి చనుదెంచి యంత. 636**

ప్రతి : అనిచెప్పి= పైవిధంగా చెప్పి; ఆ+పారాశర్యనందనుండు= వ్యాసుని పుత్రుడైన శుకమహర్షి; అభిమన్యునందనునకున్= అభిమన్యుని కొడుకైన పరీక్షిన్మహారాజుతో; ఇట్లు+అనియెన్=ఈ విధంగా చెప్పెను; ఆ నిశ+అవసానంబునన్= నారదుడు వీడ్కొని వెళ్లిన ఆ రాత్రి తెల్లవారుతూండగా; పద్మబాంధవ+ఆగమనంబును= పద్మాలకు మిత్రుడైన సూర్యునిరాకను; కమలినీలోకంబునకున్= తామర తీగల సమూహానికి; మునుకలుగ నెఱిగించు చందంబునన్= ముందుగా తెలియచెప్పే విధంగా; కలహంస= ఉత్తమజాతిహంసలు; సారస= బెగ్గురుపక్షులు; రథ+అంగముఖ= చక్రవాకపక్షులు మొదలైన; జలవిహంగంబుల రవంబులు= నీటిపక్షులకూతలు; చెలంగన్= అతిశయించగా; అరుణ+ఉదయంబునన్= అరుణుడు ఉదయించే సమయంలో; మంగళ= శుభం కల్గించే గీతాలను; పాఠక= పాడునట్టివారి; సంగీత= సంగీతమూ; మృదుమధురగాన నినదంబును= లలితంగా, శ్రావ్యంగాపాడే పాటలయొక్క ధ్వనులూ; లలితమృదంగ వీణావేణు నినాదంబును= మనోజ్ఞమైన రాగ, తాళధ్వనులతో మద్దెలల, వీణల, వేణువుల ధ్వనులూ; ఏతేరన్= వినబడగా; మేలుకని= మేల్కొని; తన చిత్తంబునన్= తన మనస్సులో; చిత్+ఆనందమయున్= చిదానందమయున్= జ్ఞానానందస్వరూపుడైనవాడును; పరమాత్మున్= విరాట్స్వరూపుణ్ణి; న+వ్యయున్= అవ్యయున్= నాశం లేనివాణ్ణి; న+వికారున్= అవికారున్= ఎట్టి మార్పు లేనివాణ్ణి; న+ద్వితీయున్= అద్వితీయున్= తనకు సాటిరాగల రెండవ వాడు లేనివాడును; న+జితున్= అజితున్= జయింపబడనివాడును; న+అంతున్= అనంతున్= అంతం లేనివాడును; న+చ్యుతున్= అచ్యుతున్= చ్యుతిలేనివాడును; న+మేయున్= అమేయున్= కొలతకు అందనివాణ్ణి; ఆఢ్యున్= సంపన్నుడైనవాణ్ణి; ఆది+అంతవిహీనున్= ఆద్యంతవిహీనున్= మొదలు తుది లేనివాణ్ణి (జననమరణాలు లేనివాడు); పరబ్రహ్మంబున్+ఐన= పరబ్రహ్మ అయిన; తన్నున్+తాను= తనను తాను; ఒక్కింత చింతించి= కొంచెం సేపు ఆలోచించి; అనంతరంబు+అ= ఆ తరువాత; విరోధిరాజన్య= శత్రురాజుల; నయన= కన్నులనే; కల్హారంబులు= ఎఱ్ఱ కలువలు; ముకుళింపన్= ముడుచుకొనగా; భక్తజన= భక్తులయొక్క; నయన కమలంబులు= తామరలవంటి కన్నులు; వికసింపన్= విచ్చుకొనగా; నిరస్త= తొలగింపబడిన; నిఖిల= సమస్తమైన; దోష= పాపాలనే; అంధకారుండు+ఐ= చీకట్లు గలవాడైన; గోవిందుండు= శ్రీకృష్ణుడు; మొగిచిన= మూసుకొని ఉన్న; లోచన సరోజంబులు= కన్నులనే తామరల్ని; వికసింపన్= విచ్చునట్లు; చేయుచున్= చేస్తూ; తల్పంబు= మంచం; డిగ్గి= దిగి; చనుదెంచి= వచ్చి; అంత= అంతటన్ – ఆ తరువాత...

**తా :** అని ఈ విధంగా చెప్పి, శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో ఇంకా ఇలా చెప్పసాగాడు. ఆ నారదుడు వచ్చి వెళ్లిన మరునాటి తెల్లవారుజామున తామరతీగలకు వికాసం కల్పిస్తూ ముందుముందుగా సూర్యభగవానుడు వస్తున్నాడు - అనేవార్తను తెలియజేస్తున్నయా? అన్నట్లు కలహంసలు, బెగ్గురుపక్షులు, చక్రవాకాలు వంటి నీటిపక్షుల కలధ్వనులు వినబడగా, అరుణోదయ సమయంలో మేలుకొలుపులు పాడేవారి పాటలు చెవులకు ఇంపు కొలుపుతూ ఉండగా, మద్దెలల, వీణల, వేణువుల వంటి వాద్యాల మనోహరమైన ధ్వనులు వినబడగా శ్రీకృష్ణుడు నిద్రలేచి - జ్ఞానానంద స్వరూపుడు, పరమాత్ముడు, నాశరహితుడు, అవికారుడు, అద్వితీయుడు, అజితుడు, తుదిలేనివాడు, జ్ఞానంనుండి జాఱనివాడు, ఏ కొలతలకు అందనివాడూ, చావు పుట్టుకలు లేనివాడైన పరబ్రహ్మ తనకు తాను ధ్యానించుకొని, కొంతసేపు గడపి పిమ్మట శత్రువులకు సంకోచం, భక్తులకు విరాగం కలిగేటట్లుగా, దోషాలనెడిచీకట్లను పోగొట్టే సూర్యునివంటి శ్రీకృష్ణుడు మూసినకన్నులు తెరచి మంచం దిగి వచ్చి తరువాత

**సీ. మలయజకర్పూరమహితవాసితహేమకలశోదకంబుల జలకమాడి**
**నవ్యలసన్మృదుదివ్యవస్త్రంబులు వలనొప్ప రింగులువాఱఁ గట్టి**
**మకరకుండలహారమంజీరకేయూరవలయాదిభూషణావలులు దాల్చి**
**ఘనసారకస్తూరికాహరిచందనమిళితపంకము మేన నలర నలఁది**

**తే. మహితసౌరభ నవకుసుమములు దుఱిమి, పొసఁగ రూపైన శృంగారరస మనంగ**
**మూర్తిఁ గైకొన్న కరుణాసముద్ర మనఁగ, రమణ నొప్పుచు లలితదర్పణము చూచి. 637**

**ప్రతి :** మలయజ= మంచి గంధముచేతను; కర్పూర= పచ్చకర్పూరముతోను; మహిత= గొప్పమహిమ గల; వాసిత= పరిమళిస్తున్న; హేమకలశ+ఉదకంబులన్= బంగారు బిందెలలోని నీటితో; జలకము+ఆడి= స్నానంచేసి; నవ్యలసత్+మృదు= కొత్తవైన ప్రకాశిస్తున్న మెత్తని; దివ్యవస్త్రంబులను= మేలిమివస్త్రాలను; వలను+ఒప్పన్= నేర్పుతో; రింగులువాఱన్= చుంగులు వ్రేలాడునట్లుగా; కట్టి= కట్టుకొని; మకరకుండల= మొసలి ఆకారంతో చేసిన చెవిపోగులు; హార= ముత్యాలహారాలు; మంజీర= అందెలు; కేయూర= భుజకీర్తులు; వలయ= కంకణాలు; భూషణ+ఆవలులున్= నగల వరుసల్ని; తాల్చి= ధరించి; ఘనసార= పచ్చకర్పూరంతోను; కస్తూరికా= కస్తూరితోను; హరిచందన= మంచిగంధంతోను; మిళిత= కూర్చిన; పంకము= మెత్తని పూతను; మేనన్= దేహానికి; అలరన్= అందంగా; అలఁది= పూసుకొని; మహిత= గొప్పవైన; సౌరభ= పరిమళంతో కూడిన; నవకుసుమములు= అప్పుడే కొత్తగా కోసి తెచ్చిన పువ్వులను; తుఱిమి= తలలో అలంకరించుకొని; పొసఁగన్= అందగించేటట్లు; రూపు+ఐన= రూపం ధరించిన; శృంగారరసము+అనన్+కన్= శృంగారరసమా అనేటట్లు; మూర్తిన్= ఆకృతిని; కైకొన్న= ధరించిన; కరుణాసముద్రము+అనన్+కన్= దయా సముద్రమా అనేటట్లు; రమణన్= మనోహరంగా; ఒప్పుచున్= ప్రకాశిస్తూ; లలిత= సుకుమారమైన; దర్పణమున్= అద్దాన్ని; చూచి= చూచుకొని...

**తా :** మంచి గంధం, కస్తూరి మొదలైన పరిమళద్రవ్యాలు కలపడంచే సువాసనా భరితాలైన బంగారుకలశాలలోని జలాలతో స్నానం చేసి, కొత్తవి, మెత్తనివి దివ్యాలైన మంచివస్త్రాలు కుచ్చెళ్లు అందంగా పెట్టుకొని, కట్టుకొని మకర కుండలాలు, అందెలు, హారాలు, భుజకీర్తులు, కంకణాలువంటి ఆభరణాలు అలంకరించుకొని, పచ్చకర్పూరంతో కలిపి తయారు చేసిన చందనాన్ని ఒడలి నిండా పూసుకొని, కొత్తగా కోసిన పువ్వులను తలలో ముడుచుకొని, ఆకృతి పొందిన శృంగారరసమో, దయాసముద్రమో అన్నట్లు ప్రకాశిస్తూ తనసౌందర్యాన్ని నిలువుటద్దంలో చూచుకొని

**తే. కడcగి సారథి తెచ్చిన కనకరథము, సాత్యకి హితప్రియోద్ధవసహితుc డగుచు**
**నెక్కి నిజకాంతి దిక్కులc బిక్కటిల్లc, బూర్వగిరిc దోcచు భానునిcబోలి వెలిcగె. 638**

**ప్రతి :** కడcగి= పూని; సారథి= రథం నడిపేవాడు; తెచ్చిన= తీసుకొనివచ్చిన; కనకరథమున్= బంగారురథాన్ని; సాత్యకి= తమ్ముడైన సాత్యకి; హితప్రియ+ఉద్ధవ సహితుcడు+అగుచున్= తనకు హితుడూ, ఇష్టుడూ అయిన ఉద్ధవునితో కూడినవాడై; ఎక్కి= రథాన్ని ఎక్కి; నిజకాంతి= తనయొక్క దేహకాంతి; దిక్కులన్= అన్ని దిక్కులందు; పిక్కటిల్లన్= వ్యాపించగా; పూర్వగిరిన్= తూర్పుకొండపై; తోcచు= కనబడునట్టి; భానునిన్+పోలెన్= సూర్యభగవానునిలాగా; వెలిcగెన్= ప్రకాశించాడు.

**తా :** సారథి పూనికతో తెచ్చిన బంగారు రథం మీద శ్రీకృష్ణుడు సాత్యకి తోడను తనకు హితుడూ, ఇష్టుడూ అయిన ఉద్ధవునితోను ఎక్కి, తన శరీరకాంతి దిక్కులన్నిట వ్యాపించగా తూర్పుకొండపై ప్రకాశించే సూర్యునివలె ప్రకాశించాడు.

**సీ. అభినవనిజమూర్తి యంతఃపురాంగనానయనాబ్జములకు నానంద మొసcగ**
**సలలితముఖచంద్రచంద్రికాతతి పౌరజనచకోరముల కుత్సవము సేయ**
**మహనీయకాంచనమణిమయభూషణదీప్తులు దిక్కులc దేజరిల్ల**
**నల్ల నల్లన వచ్చి యరదంబు వెస డిగ్గి హలకులిశాంకుశజలజకలశ**

**తే. లలితరేఖలు ధరణి నలంకరింప, నుద్ధవుని కరతల మూని యొయ్య నడచి**
**మహితగతి దేవతాసభామధ్యమునను, రుచిరసింహాసనమునc గూర్చుండె నెలమి. 639**

**ప్రతి :** అభినవ నిజమూర్తి= క్రొత్తగా అలంకరించుకొన్న తనరూపం; అంతఃపుర+అంగనా= అంతఃపుర స్త్రీలయొక్క; నయన+అబ్జములకున్= కనులనెడి తామరలకు; ఆనందము+ఒసcగన్= ఆనందాన్ని కలుగజేయగా (శ్రీకృష్ణుడు భాస్కరునివలె ప్రకాశించడంచే ఈ అంతఃపురస్త్రీలకన్నులనే తామరలకు ఆనందం కల్గజేయగా); సలలిత ముఖచంద్ర= మిక్కిలి మనోహరమైన చంద్రునియొక్క; చంద్రికాతతి= వెన్నెలల సమూహం; పౌరజన చకోరములకున్= పురజనుల కన్నులకు; ఉత్సవము+చేయన్= పండుగ చేయగా (వెన్నెల చకోరాలకు ఆహారమని కవిసమయం); మహనీయ= గొప్పదైన; కాంచన మణిమయభూషణ= బంగారము, మణులు కూర్చి తయారుచేసిన ఆభరణాల; దీప్తులు= కాంతులు; దిక్కులన్= అన్ని దిక్కుల్లో; తేజరిల్లన్= వెలుగొందగా; అల్లన్+అల్లనన్+వచ్చి= మెల్లమెల్లగా వచ్చి; అరదంబు= రథాన్ని; వెసన్= తొందరగా; డిగి= దిగి; హల కులిశ= నాగలివంటి వజ్రాయుధంవంటి; అంకుశ= అంకుశంవంటి (ఏనుగును లొంగదీయడానికి వాడే ఆయుధము); జలజ= తామరపువ్వులాంటి; కలశ= అమృతకలశంవంటి; లలిత= మనోజ్ఞమైన; రేఖలు= గీతలు; ధరణిన్= భూమిని; అలంకరింపన్= అలంకరించగా (పరమాత్మయగు శ్రీకృష్ణునిపాదాలలో – నాగలి, వజ్రాయుధం, అంకుశం, తామరపుష్పం, అమృతకలశం మున్నగు చిహ్నాల రేఖలు గలవని); ఉద్ధవునిన్= తనకు హితుడగు ఉద్ధవుణ్ణి; కరతలము+ఊని= చేతిని ఊతగా పట్టుకొని; ఒయ్యన్+నడచి= నెమ్మదిగా నడచి; మహితగతిన్= గంభీరమైన రీతితో; దేవతాసభామధ్యముననున్= దేవతల సభామధ్యంలో; రుచిరసింహాసనమునన్= గొప్పగా ప్రకాశిస్తున్న సింహాసనంపై; ఎలమిన్= సంతోషంతో; కూర్చుండెన్= కూర్చున్నాడు.

**తా :** కొత్త అలంకారాలతో ప్రకాశిస్తూ తన శరీరకాంతులు అంతఃపురస్త్రీల కన్నులనే తామరలకు ఆనందాన్ని కూర్చగా, మనోహరమైన తన ముఖమనే చంద్రుని కాంతులు అనగా వెన్నెలలు పురజనులనే చకోరాలకు పండుగ చేస్తుండగా,

మణులతో ప్రకాశించే తన బంగారుఆభరణాల కాంతిదిక్కులన్నిట వ్యాపిస్తుండగా, మెల్లమెల్లగా వచ్చి రథం దిగి – తన పాదాలందు గల – హలరేఖ, కులిశరేఖ, అంకుశరేఖ, జలజరేఖ, కలశరేఖలు భూదేవికి అలంకారాలుగా చేసి ఉద్ధవుని చేయి ఊతగా చేసుకొని నెమ్మదిగా నడచి **'సుధర్మ'** అను సభామధ్యంలో సింహాసనంపై సంతోషంతో కూర్చున్నాడు.

**విశే :** ఇంద్రునిసభకు 'సుధర్మ' అని పేరు. దీన్ని శ్రీకృష్ణుడు ఇంద్రుని నుండి పొందాడు.

**చ. అతివిభవంబునం దనరి యాత్మతనుద్యుతి తేజరిల్లఁగా**
**హితులు పురోహితుల్ వసుమతీశులు మిత్రులు బాంధవుల్ బుధుల్**
**సుతులును మాగధుల్ కవులు సూతులు మంత్రులు భృత్యులున్ శుభ**
**స్థితిఁ గొలువంగఁ నొప్పె నుడుసేవితుఁడైన సుధాంశుఁడో యనన్. 640**

**ప్రతి :** అతివిభవంబునన్= అధికమైన వైభవంతో; తనరి= ఒప్పి; ఆత్మతనుద్యుతి= తన శరీరకాంతి; తేజరిల్లన్+కాన్= ప్రకాశింపగా; హితులు= మేలుకోరే ఆప్తులు; పురోహితుల్= బ్రాహ్మణులు; వసుమతి+ఈశులు= భూపాలకులైన రాజులు; మిత్రులు= మిత్రులు; బాంధవుల్= చుట్టాలు; బుధుల్= పండితులు; సుతులును= కొడుకులును; మాగధుల్= స్తుతిపాఠకులు; కవులు= కవులు; సూతులు= రథసారథులు; మంత్రులు= మంత్రులు; భృత్యులున్= సేవకులును; శుభస్థితిన్= మేలగు రీతితో; కొలువన్+కన్= కొలువై ఉండగా; ఉడుసేవితుఁడు+ఐన= నక్షత్రాలతో కొలువైయున్న; సుధా+అంశుడు+ఓ+అనన్= చంద్రుడా అనునట్లు; ఒప్పెన్= ప్రకాశించెను.

**తా :** మిక్కిలి వైభవంతో తన శరీరకాంతి వెలుగగా – ఆప్తులు, పురోహితులు, రాజులు, స్నేహితులు, చుట్టాలు, పండితులు, తనయులు, స్తుతిపాఠకులు, మంత్రులు, సారథులు భక్తితో పరివేష్ఠించి సేవింపగా – నక్షత్రాలచే సేవింపబడుతున్న – చుక్కల్లో చంద్రుడా అన్నట్లు శ్రీకృష్ణుడు ప్రకాశిస్తున్నాడు.

**క. కరుణార్ద్రదృష్టిఁ బ్రజలం, బరిరక్షించుచు వివేకభావకళా చా**
**తురి మెఱసి యిష్టగోష్ఠిం, బరమానందమున రాజ్యభారకుఁ డగుచున్. 641**

**ప్రతి :** కరుణార్ద్రదృష్టిన్= దయతోకూడిన చల్లనిచూపుతో; ప్రజలన్= జనులను; పరిరక్షించుచున్= చక్కగా కాపాడుతూ; వివేక భావకళాచాతురిన్= వివేకంతో కూడి ఆలోచనల్ని వర్తింపచేసే నేర్పుతో; మెఱసి= ప్రకాశించి; ఇష్టగోష్ఠిన్= తనకు ప్రియమైన ముచ్చటలాడుతూ; పరమ+ఆనందమునన్= మిక్కిలి సంతోషంతో; రాజ్యభారకుఁడు= రాజ్యపరిపాలన భారాన్ని వహించినవాడు; అగుచున్= అవుతూ.

**తా :** ప్రజలందరినీ దయతో కూడిన చల్లనిచూపులతో లెస్సగా పరిరక్షిస్తూ తన తెలివితో, చాతుర్యంతో వివిధ వ్యాపారాలు నిర్వర్తించే కళను ప్రదర్శిస్తూ, ఇష్టగోష్ఠి చేస్తూ ఎంతో ఆనందంతో రాజ్యభారాన్ని వహించి పరిపాలన సాగించే వాడవుతూ.

**వ. ఇవ్విధంబునం బ్రతిదివసంబును నుండు నవసరంబున నొక్క నాఁ డపూర్వదర్శనుండైన భూసురుం డొక్కరుండు సనుదెంచి సభామధ్యంబునం గొలువున్న ముకుందునిం బొడగని దండప్రణామం బాచరించి వినయంబునఁ గరంబులు మొగిచి యిట్లనియె. 642**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ తీరుగా; ప్రతి దివసంబును= ప్రతిరోజును; ఉండున్= ఉన్న; అవసరంబునన్= సమయంలో; ఒక్కనాఁడు= ఒకానొకరోజున; అపూర్వదర్శనుండు+ఐన= మునుపెన్నడూ చూడని; భూసురుండు= బ్రాహ్మణుడు; ఒక్కరుండు= ఒకడు; చనుదెంచి= వచ్చి; సభామధ్యంబునన్= సభామధ్యంలో; కొలువున్న= కొలువు తీరియున్న; ముకుందునిన్= శ్రీకృష్ణుని; పొడగని= దర్శించి, చూచి; దండప్రణామంబు ఆచరించి= సాగిలబడి, నమస్కారం చేసి; వినయంబునన్= మిక్కిలి అణకువతో; కరంబులు మొగిచి= చేతులు జోడించి; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** ఈ ప్రకారం శ్రీకృష్ణుడు కొలువు చేస్తుండగా ఒకనాడు మున్నెన్నడు చూచి ఎరుగని ఒక బ్రాహ్మణుడు వచ్చి, కొలువు కూటంలో కొలువున్న శ్రీకృష్ణుణ్ణి జూచి సాగిలబడి మ్రొక్కి, అతివినయంతో చేతులు జోడించి, ఇలా పలికాడు.

**క. కంజవిలోచన! దానవ, భంజన! యోగీంద్రవిమలభావలసద్బో**
**ధాంజన! దీప్తినిదర్శన!, రంజితశుభమూర్తి! కృష్ణ! రాజీవాక్షా! 643**

**ప్రతి :** కంజవిలోచన!= తామరపూవులవంటి కన్నులుగలవాడా! దానవభంజన!= రాక్షసులను సంహరించినవాడా! యోగి+ఇంద్ర= యోగీశ్వరులయొక్క; విమల= స్వచ్ఛమైన; భావల= మనస్సునందు; సద్బోధ= మంచితెలివి అనే; అంజన!= అంజన (అంజనం వేసి చూస్తే రహస్యమైన విషయాలు తెలుసుకోబడుతాయి); దీప్తినిదర్శన!= ప్రకాశానికి నిదర్శనమైనవాడా!; రంజిత= విరాజిల్లుచున్న; శుభమూర్తి!= మేలయిన ఆకృతి గలవాడా!; కృష్ణ!= శ్రీకృష్ణా!; రాజీవ+అక్షా!= తామరపువ్వులవంటి కన్నులు గలవాడా!

**తా :** తామరలవంటి కన్నులుగలవాడా! రాక్షసులను నాశనం చేసేవాడా! యోగీశ్వరుల మనస్సులకు జ్ఞానాంజనమైన వాడా! కాంతికి నిదర్శనమై 'వెలుగు' వాడా! బలరాముని తమ్ముడా! శ్రీకృష్ణా!

**తే. అవధరింపు జరాసంధుఁ డతులబలుఁడు, దనకు మ్రొక్కని ధారుణీధవుల నెల్ల**
**వెదకి తెప్పించి యిరువదివేల నాఁకఁ, బెట్టినాఁడు గిరివ్రజపట్టణమున. 644**

**ప్రతి :** అవధరింపు= వినవయ్యా; జరాసంధుఁడు= జరాసంధుడు; అతులబలుఁడు= ఈడులేని బలం గలవాడు; తనకున్ మ్రొక్కని= తనకు నమస్కరించని; ధారుణీధవులన్+ఎల్లన్= రాజులందరినీ; వెదకి తెప్పించి= వెదకి తీసుకొని వచ్చేటట్లుగా చేసి; ఇరువదివేలన్= ఇరువది వేలమందిని; గిరివ్రజపట్టణమునన్= గిరివ్రజపట్టణంలో; ఆఁకన్= చెఱలో; పెట్టినాఁడు= బంధించాడు.

**తా :** ఓ కృష్ణా! వినవయ్యా! జరాసంధుడు మిక్కిలిబలాఢ్యుడు. తనకు సాటి లేనివాడు; తన ఆజ్ఞకు అణగి తనకు నమస్కరించని రాజుల్ని వెదకి తెప్పించి గిరివ్రజమనే పట్టణంలో ఇరువది వేలమందిని చెఱసాలలో బంధించాడు.

**తే. వారు పుత్తేర వచ్చినవాఁడ నేను, నరవరోత్తమ! నృపులవిన్నపము గాఁగ**
**విన్నవించెద నామాట వినినమీఁద, ననఘ! నీ దయ!, వీరిభాగ్యంబుకొలఁది. 645**

**ప్రతి :** వారు= జరాసంధునిచే బంధింపబడిన రాజులు; పుత్తేరన్= పంపగా; వచ్చినవాడన్= వచ్చినట్టి వాణ్ణి; నేను; నరవర+ఉత్తమ!= రాజశ్రేష్ఠా!; నృపుల= రాజుల; విన్నపము కాన్+కన్= మనవి అగునట్లు; విన్నవించెదన్= వివరించి చెబుతాను; నామాట వినిన మీఁదన్= నా మాటలు విన్న తరువాత; అనఘ= పుణ్యాత్ముడా!; నీదయ, వారిభాగ్యంబు కొలఁది= నీకు వారిపై కలిగే దయ, వారిఅదృష్టం ఎంతో అంతే కదా!

**తా :** ఓ పుణ్యాత్ముడా! రాజశ్రేష్ఠుడా! శ్రీకృష్ణా! ఆ రాజులు పంపగా వచ్చినవాణ్ణి నేను. వారు మనవి చేయుమన్న విషయాలు నేను నీకు విన్నవిస్తాను. నా మాటలు విన్న మీదట వారి అదృష్టానికి తగిన రీతిలో నీదయ వారికి లభించునుగాక!

**విశే :** 'నీదయ! మా అదృష్టం' అనే మాట తెలుగు నుడికారం. 'మీ చిత్తం మాప్రాప్తం' అనే వాడుక కూడా కలదు.

**వ. అని ధరాధిపుల విన్నపంబుగా నిట్లనియె. 646**

**ప్రతి :** అని; ధరా+అధిపుల విన్నపంబు+కాన్= రాజుల మనవిగా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని చెప్పి, ఆ రాజులందరూ వచ్చి, మనవి చేసుకొన్నట్లే ఆ బ్రాహ్మణుడు వారిమాటలను విన్నవించాడు.

**ఉ. వారిజనాభ! భక్తజనవత్సల! దుష్టమదాసురేంద్ర సం**
**హార! సరోరుహాసనపురారిముఖామరవంద్యపాద పం**
**కేరుహ! సర్వలోకపరికీర్తితదివ్యమహాప్రభావ! సం**
**సారవిదూర! నందతనుజాత! రమాహృదయేశ! మాధవా! 647**

**ప్రతి :** వారిజనాభ!= బొడ్డున తామరపుష్పం గలవాడా!; భక్తజనవత్సల= భక్తజనుల ఎడల వాత్సల్యం గలవాడా!; దుష్టమద+అసుర+ఇంద్ర సంహార!= క్రొవ్వెక్కిన దుష్ట రాక్షసరాజులను సంహరించినవాడా!; సరస్+రుహ+ఆసన= పద్మం ఆసనంగా గల బ్రహ్మ; పుర+అరి= త్రిపురాసురసంహారుడైన శివుడు; ముఖ+అమర= మొదలైన దేవతలచే; వంద్య= నమస్కరింపదగిన; పాదపంకేరుహ= పాదపద్మాలు గలవాడా!; సర్వలోక= అన్నిలోకాలలో; పరికీర్తిత= బాగుగా శ్లాఘింపబడిన; దివ్య= దేవతాసంబంధమైన; మహాప్రభావ= గొప్పమహిమ గలవాడా!; సంసారవిదూర!= సంసారానికి మిక్కిలి దూరంగా ఉండేవాడా!; నందతనూజాత!= నందుని తనయుడా!; రమాహృదయ+ఈశ!= లక్ష్మీదేవి హృదయానికి నాయకుడా!; మాధవా!= ఓ శ్రీకృష్ణా!

**తా :** బొడ్డున పద్మంగలవాడివి, భక్తజనులయందు ప్రేమగలవాడివి, దుష్టరాక్షసులను సంహరించినవాడివి, బ్రహ్మ, శివుడు మున్నగు దేవతలచే నమస్కరింపదగిన పాదపద్మాలు గలవాడివి, ఎల్లలోకాలలో కీర్తింపబడిన దివ్యప్రభావం గలవాడివి, సంసార సంబంధం లేనివాడివి, నందుని కుమారుడివి, లక్ష్మీదేవి ప్రాణనాయకుడవైన శ్రీకృష్ణా! మాధవా!

**ఆ. ఆర్తజనుల మమ్ము నరసి రక్షింపు మ, హాత్మ! భక్తజనభయాపహరణ!**
**నిన్ను మది నుతించి నీకు మ్రొక్కెదము నీ, చరణయుగము మాకు శరణ మనఘ! 648**

**ప్రతి :** మహా+ఆత్మ!= గొప్ప మహిమగలదేవా!; భక్తజన భయ+అపహరణ!= భక్తుల భయాలను పోగొట్టేవాడా; అనఘ= పాపం లేనివాడా!; ఆర్తజనులన్ మమ్మున్= సాంసారికబాధలచే దుఃఖితులైన మమ్ము; అరసి= చూచి; రక్షింపుము= కాపాడవయ్యా!; నిన్ను మదిన్+నుతించి= నిన్ను మనస్సులో స్తుతించి; నీకు మ్రొక్కెదము= నీకు నమస్కరిస్తాము; నీ చరణయుగము= నీ రెండు పాదాలే; మాకున్ శరణు= మాకు రక్షకమైనవి.

**తా :** గొప్ప మహిమగలవాడా! భక్తుల భయాన్ని తొలగించేవాడా! పుణ్యాత్ముడా! సాంసారికబాధలచే దుఃఖితులమైన మమ్మల్ని కాచి రక్షించవయ్యా! నిన్ను మదిలో స్తుతించి, నీకు మ్రొక్కుతున్నాము. నీ రెండుపాదాలే మాకు దిక్కు.

**క. బలియురఁ దండింపఁగ దు, ర్బలులను రక్షింప జగతిపై నిజలీలా**
**కలితుఁడవై యుగయుగమున, నలవడ నుదయింతు కాదె? యభవ! యనంతా! 649**

**ప్రతి :** అభవ= పుట్టుక లేనివాడా!; అనంతా!= అంతంలేని ఓ దేవా!; బలియురన్= బలవంతుల్ని; దండిపన్+కన్= శిక్షించడానికి; దుర్బలులను= బలహీనుల్ని; రక్షింపన్= కాపాడటానికి; జగతిపైన్= భూమిమీద; నిజలీలాకలితుఁడవు+ఐ= నీదైన లీలతో కూడినవాడివై; యుగయుగమునన్= ప్రతియుగంలో; అలవడన్= తగినరీతిలో; ఉదయింతు కాదు+ఎ?= పుడుతుంటావు కదా!

**తా :** జనన మరణాలు లేని ఓ శ్రీకృష్ణా!, దుష్టులైన బలవంతుల్ని శిక్షించడానికి సాధువులైన బలహీనుల్ని రక్షించడానికి ఈ భూమిపై నీ లీలావిలాసాలకు తగిన రీతిలో యుగయుగంలో అవతరిస్తుంటావు కదా!

**క. నీమదిఁ దోఁపని యర్థం, బీ మేదిని యందుఁ గలదె యీశ్వర! భక్త**
**స్తోమసురభూజ! త్రిజగత్, క్షేమంకర ! దీనరక్షసేయు మురారీ! 650**

**ప్రతి :** ఈశ్వర!= ఓ భగవానుడా!; భక్తస్తోమసురభూజ!= భక్తజనసమూహానికి కల్పవృక్షం అయిన వాడా!; త్రిజగత్ క్షేమంకర!= మూడు లోకాలకు మేలు చేసేవాడా!; ముర+అరీ!= మురాసురుణ్ణి సంహరించినవాడా! శ్రీకృష్ణ!; నీమదిన్+ తోఁపని= నీ మనసుకు తోచని; అర్థంబు= విషయము; ఈ మేదిని+అందున్= ఈ భూమిలో; కలదు+ఎ= ఉన్నదా?; దీనరక్ష+ చేయు(ము)= దీనుల్ని రక్షింపవయ్యా!

**తా :** సర్వరక్షకుడవై ఈశ్వరా! భక్తజనులపాలిటికల్పవృక్షమా! ముల్లోకాలను రక్షించే కృష్ణా! నీ మనస్సుకు తోచని విషయం ఈ భూమిపై ఉందా? నీవన్నీ తెలిసినవాడివి. దీనుల్ని రక్షించవయ్యా!

**క. నీ పంపు సేయకుండఁగ, నా పద్మభవాదిసురలకైనను వశమే?**
**శ్రీపతి! శరణాగతులం, జేపట్టి నిరోధ ముడుగఁ జేయుము కృష్ణా! 651**

**ప్రతి :** శ్రీపతి= లక్ష్మీనాథుడవైన శ్రీకృష్ణా; నీ పంపు+చేయక+ఉండన్+కన్= నీ ఆజ్ఞ నిర్వర్తింపకుండా; ఆ పద్మభవ+ఆది సురలకున్+ఐనను= బ్రహ్మ మొదలైన దేవతలకైనా; వశము+ఏ?= శక్యమా?; శరణ+ఆగతులన్= శరణంటూ నిన్ను చేరవచ్చినవారిని; చేపట్టి= స్వీకరించి; కృష్ణా!; నిరోధమున్= నిర్బంధాన్ని; ఉడుగన్= మానేటట్లుగా; చేయుము= చేయువయ్యా!; కృష్ణా!

**తా :** లక్ష్మీనాథుడవైన ఓ శ్రీకృష్ణా! నీవు చెప్పిన పనిని చేయక పోవడం బ్రహ్మాదిదేవతలకైనా శక్యంకాదు. కాబట్టి, నిన్ను శరణు జొచ్చినవారిని చేపట్టి, వారిని నిర్బంధంనుండి విముక్తుల్ని చేసి, కాపాడవయ్యా!

**క. అభవుఁడ వయ్యును జగతిం, బ్రభవించుట లీల గాక భవ మందుటయే**
**ప్రభువులకుం బ్రభుఁడవు మము, సభయాత్ముల నరసి కావఁ జను నార్తిహరా! 652**

**ప్రతి :** ఆర్తిహరా!= దుఃఖాలను పోగొట్టేవాడా!; అభవుఁడవు+అయ్యునున్= పుట్టుక లేనివాడవైనా; జగతిన్= భూమిపై; ప్రభవించుట= పుట్టుట; లీల+కాక= వేడుకగాక; భవము+అందుట+ఏ= నిజంగా పుట్టడమా?; ప్రభువులకున్= దేవతా ప్రభువులకు; ప్రభుఁడవు= ఏలికవు; మమున్= మమ్ము; స భయ+ఆత్ములన్= భయంతో కూడి ఉన్నవారిని; అరసి= విచారించి; కావన్= రక్షింప; చనున్= తగును.

**తా :** అందరి దుఃఖములను పోగొట్టేవాడివైన శ్రీకృష్ణా! నీవు పుట్టుక లేనివాడవైనా భూమిపై పుట్టడం కేవలం ఒక వేడుక కోసం మాత్రమే. నిజానికి ఇది పుట్టడం కాదు. కాబట్టి, బ్రహ్మాది దేవతా ప్రభువులందరికీ రాజువైన నీవు భయాత్ములమైన మమ్మల్ని కాచి రక్షించాలి. మా భయం తొలగించి తీరాలి! ఎందుకంటే నీవు ఆర్తిహరుడివి కదా!

**క. కదనమున నీ భుజావలి, కెదిరింపఁగ లేక పాఱఁడే విక్రమ సం**
**పద సెడఁగ జరాసంధుఁడు, పదునెనిమిదిసార్లు ధరణిపాలురు నవ్వన్. 653**

**ప్రతి :** కదనమునన్= యుద్ధంలో; నీ భుజావలికిన్= నీ భుజసమూహానికి; ఎదిరింపన్+కన్+లేక= ఎదిరించి పోరాడలేక; విక్రమసంపద చెడన్+కన్= పరాక్రమ సంపద చెడిపోగా; జరాసంధుఁడు= జరాసంధుడు (జరయను రాక్షసిచే కూర్చబడిన వాడు); పదునెనిమిదిసార్లు= పద్దెనిమిది తడవలు; ధరణిపాలురు= భూపాలకులు; నవ్వన్= పరిహసింపగా; పాఱఁడు+ఏ= పరుగెత్తిపోలేదా!

**తా :** ఇంతకుముందు జరాసంధుడు యుద్ధంలో నిన్ను నిలువరించలేక తన పరాక్రమం తగ్గిపోగా నీ భుజబలానికి తట్టుకోలేక రాజులందరు నవ్వుతుండగా భయంతో పాఱిపోలేదా?

**వ. ఇట్లు తనపడినబన్నములం దలంపక సింహంబు సమదదంతావళంబుల నరికట్టి కావరించు చందంబున మమ్ముం జెఱపట్టి బాధించుచున్న య ప్పాపాత్ముని మర్దించి కారాగృహబద్ధుల మగు మా నిర్బంధంబులు వాపి, సుతదారమిత్రవర్గంబులం గూర్చి యనన్యశరణ్యులమైన మమ్ము రక్షింపు' మని విన్నవించి రని బ్రాహ్మణుండు విన్నపంబు సేయు సమయంబున. 654**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; తనపడిన బన్నములన్= తానుపొందిన పరాభవాల్ని; తలంపక= గుర్తుంచుకోకుండా; సింహంబు= సింహము; సమద దంతావళంబులన్= మదపుటేనుగుల్ని; అరికట్టి= అడ్డగించి; కావరించు చందంబునన్= బాధించే విధంగా; మమ్మున్= మమ్మల్ని; చెఱపట్టి= చెఱలో పెట్టి; బాధించుచున్న= బాధపెడుతూఉన్న; ఆ+పాప+ఆత్మునిన్= పాపాత్ముడైన ఆ జరాసంధుణ్ణి; మర్దించి= మదం అణిగేటట్లు హింసించి; కారాగృహబద్ధులము+అగు= చెరసాలలో బంధింపబడిన; మా నిర్బంధంబులు= మా బంధనాలు; వాపి= పోగొట్టి; సుతదారమిత్ర వర్గంబులన్= కొడుకులతో, భార్యలతో, మిత్రసమూహాలతో; కూర్చి= కలిపి; న+అన్యశరణ్యులము+ఐన మమ్మున్= వేరొక దిక్కులేక భగవంతుడవైన నీవే దిక్కని శరణు పొందినవారమైన మమ్మల్ని; రక్షింపుము= కావవయ్యా; అని= అంటూ; విన్నవించిరి+అని= మనవి చేసిరని; బ్రాహ్మణుండు= బంధితులైనవారు పంపగా వచ్చిన విప్రుడు; విన్నపంబు+చేయు సమయంబున్= మనవి చేస్తున్న వేళలో...

**తా :** తాను పొందిన అవమానాన్ని గుర్తుంచుకోక, జరాసంధుడు మదించిన ఏనుగుల్ని నిర్బంధించి హింసించే సింహంలాగా మమ్మల్ని చెరసాలలో పెట్టి బాధిస్తున్నాడు. ఈ పాపాత్ముణ్ణి సంహరించడానికి నీవు తప్ప వేరెవరూ రక్షకులు లేని మమ్మల్ని రక్షించి, మా పుత్రులతో, భార్యలతో, మిత్రులతో మమ్ము చేర్చవలసిందని ఆ రాజులు మనవి చేసుకొన్నారని వారు పంపగా వచ్చిన బ్రాహ్మణుడు చెప్పుచుండగా

## ❖ నారదుండు శ్రీకృష్ణునితో ధర్మజు రాజసూయము నెరవేర్పు మని చెప్పట ❖

**సీ. శారదచంద్రికాసారంగరుచితోడ జడముడికెంపు చేcజఱచి నవ్వ**
**శరదంబుదావృతసౌదామనీలతాశోభc గాంచనకటిసూత్ర మలర**
**లలితపూర్ణేందుమండలకలంకముగతి మృదుమృగాజినరుచి మించుcజూపc**
**గల్పశాఖాగ్రసంగతపుష్పగుచ్ఛంబు లీలc గేలను నక్షమాల యమర**

**తే. భూరిపుణ్యనదీతోయపూరణమునc, దగు కమండలు వొక్క హస్తమునc దనర**
**వెల్ల జన్నిద మఱుత శోభిల్ల వచ్చె, నారదుండు వివేకవిశారదుండు. 655**

**ప్రతి :** వివేకవిశారదుండు= మంచి చెడులను వేర్పరచే విషయంలో నేర్పరి అయిన; శరద= శరత్కాలంలోని; చంద్రికా= చంద్రకిరణాలతోడి; సారంగ= జింకయొక్క; రుచితోడన్= ప్రకాశంతో; జడముడి= జడలయొక్క ముడి; కెంపున్= ఎర్రని కెంపురాయిని; చేన్+చఱచి= చేతితో తట్టి; నవ్వన్= పరిహాసం చేస్తుండగా; శరత్ అంబుద= శరత్కాల మేఘాలతో; ఆవృత= చుట్టబడిన; సౌదామనీలతా= మెరుపుతీగ యొక్క; శోభన్= కాంతితో; కాంచనకటిసూత్రము= బంగారు మొలతాడు; అలరన్= ప్రకాశించగా; లలిత= అందమైన; పూర్ణ+ఇందుమండల= నిండుచంద్రబింబంలోని; కలంకము గతిన్= మచ్చవలె (చంద్రునిలోని జింకవలె); మృదు= మెత్తనైన; మృగ+అజిన= జింకతోలు; రుచి= కాంతి; మించన్= అతిశయించి; చూపన్= చూపగా; కల్పశిఖా+అగ్ర= కల్పవృక్షపుకొమ్మల చివరిభాగంలో; సంగత= కూడియున్న; పుష్పగుచ్ఛంబు= పూలగుత్తి; లీలన్= వలె; కేలను= చేతిలో; అక్షమాల= జపమాల; అమరన్= ఒప్పుతుండగా; భూరి= గొప్పదైన; పుణ్యనదీతోయపూరణమునన్= పుణ్యనదుల నీటితో నింపబడి; తగు= ఒప్పుతున్న; కమండలువు= పాత్ర; ఒక్క హస్తమునన్= ఒక చేతిలో; తనరన్= ఒప్పుతూ ఉండగా; వెల్లజన్నిదము= తెల్లని జందెము; అఱుతన్= మెడలో; శోభిల్లి= ప్రకాశిస్తూండగా; నారదుండు= నారదమహర్షి; వచ్చెన్= వచ్చాడు.

**తా :** వివేకవిశారదుడగు నారదుడు – శరత్కాలపువెన్నెలలో వెలుగే జింకలాగా ప్రకాశించే ఎర్రని జడముడితోను, శరత్కాలమేఘాలచే ఆవరింపబడిన మెరుపుతీగయా అన్నట్లున్న బంగారుమొలతాడుతోను, మనోహరమైన నిండు చంద్రునిలోని మృగచిహ్నమా అన్నట్లున్న జింకతోలు ప్రకాశించగా, కల్పవృక్షపు చిటారుకొమ్మన పూచి వేలాడుతూ ఉన్న పూలగుత్తివలె ఒప్పుతున్న జపమాల చేతిలో ధరించి, ఒక చేతిలో పుణ్యనదుల్లోని జలాలు నింపిన కమండలువు ఒప్పుతూ ఉండగా శ్రీకృష్ణుని సభామండపానికి వచ్చాడు.

**క. చనుదెంచె నట్లు ముని నిజ, తనుకాంతుల నఖిలదిగ్వితానము వెలుcగన్**
**వనజాప్తుcబోలి యయ్యదు, జనములు గృష్ణుండు లేచి సంప్రీతిమెయిన్. 656**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; ముని= నారదమహాముని; నిజతనుకాంతులన్= తన దేహకాంతులచేత; అఖిల దిక్+వితానము= ఎల్లదిక్కుల సమూహం; వెలుcగన్= ప్రకాశిస్తుండగా; వనజ+ఆప్తున్= తామరలకు మిత్రుడైన సూర్యుణ్ణి; పోలి= పోలినట్లు; చనుదేరన్= రాగా; ఆ+యదు జనములు= ఆ సభలోనున్న యాదవులు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; లేచి= ఆసనముల నుండి లేచినవారై; సంప్రీతిమెయిన్= ఆనందంతో...

**తా :** ఆ విధంగా నారదమహాముని "సూర్యుడే వచ్చేసినాడా!" అన్నట్లు జనులు భ్రాంతిపడే విధంగా తన దేహకాంతులచే దిక్కులన్నింటిని ప్రకాశింపజేస్తూ రాగా - ఆ సభామండపంలో ఉన్న యాదవులు, శ్రీకృష్ణుడు గౌరవంతో తమ తమ ఆసనాలనుండి లేచి ఆనందంతో

**క. వినయమున మ్రొక్కి కనకా, సనమునఁ గూర్చుండఁబెట్టి సముచితవివిధా**
**ర్చనములఁ దనిపి మురాంతకుఁ, డనియెన్ వినయంబు దోఁప న మ్మునితోడన్. 657**

**ప్రతి :** వినయమునన్ మ్రొక్కి= అడకువతో నమస్కరించి; కనక+ఆసనమునన్= బంగారు ఆసనంమీద; కూర్చుండన్+పెట్టి= కూర్చొనబెట్టి; సముచిత వివిధ+అర్చనములన్= తగినట్టి నానావిధాలైన పూజలతో; తనిపి= తృప్తి గలిగించి; ముర+అంతకుఁడు= శ్రీకృష్ణుడు; ఆ+మునితోడన్= ఆ నారదమహర్షితో; వినయంబుతోఁపన్= అణకువ కనబడేటట్లుగా; అనియెన్= అన్నాడు.

**తా :** శ్రీకృష్ణుడు, యాదవజనులు మిక్కిలి వినయంతో నారదునికి నమస్కరించి, బంగారు ఆసనంపై కూర్చుండబెట్టి ఆ మహాముని గౌరవానికి తగిన రీతిలో అనేక విధాలైన అర్చనలు చేసి, తృప్తి పరిచాడు. ఆ తరువాత శ్రీకృష్ణుడు అణకువతో నారదమహామునితో ఇలా అన్నాడు.

**తే. ఇప్పు డెందుండి వచ్చితి విందులకును?, నఖిలలోకైకసంచారి వగుటఁజేసి**
**నీ యెఱుంగని యర్థంబు నిఖిలమందు, నరయ లేదండ్రు; మి మ్మొకఁ డడుగవలయు. 658**

**ప్రతి :** ఇప్పుడు+ఎందుండి= ఇప్పుడు ఎక్కడనుండి; ఇందులకును= ఇక్కడికి; వచ్చితివి= వచ్చావు; అఖిల లోక+ఏక సంచారివి= అన్ని లోకాల్లో ముఖ్యంగా తిరిగేవాడివి నీవొక్కడివే; అగుటన్+చేసి= కావడంవల్ల; నీ+ఎఱుంగని= నీకు తెలియని; అర్థంబు= విషయం; నిఖిలము+అందున్= ఈ ప్రపంచమంతటిలో; అరయన్= విచారించగా; లేదు+అండ్రు= లేదని పెద్దలు చెబుతారు; మిమ్మున్+ఒకఁడు= మిమ్మల్ని ఒక విషయం; అడుగవలయున్= అడగాలి!

**తా :** ఓ మహర్షీ! ఇప్పుడు మీరు ఎక్కడ నుండి ఇక్కడకు వచ్చారు? మీరు అన్నిలోకాలలో సంచరించేవారు - కాబట్టి ఈ ప్రపంచంలో మీకు తెలియని సంగతులు ఏవీ ఉండవని పెద్దలంటారు. కాబట్టి, మిమ్మల్ని ఒక విషయం అడగాలి.

**తే. పాండునందను లిప్పు డేపగిది నెచట, నున్నవారలొ యెఱిఁగింపు మన్న మౌని**
**కరసరోజాతములు మోడ్చి కడఁకతోడఁ, బలికెఁ గమలాక్షుఁ జూచి సద్భక్తి మెఱసి. 659**

**ప్రతి :** పాండునందనులు= పాండవులు; ఇప్పుడు; ఏపగిదిన్= ఏ విధంగా; ఎచ్చటన్+ఉన్నవారలు+ఒ= ఎక్కడ ఉన్నారో; ఎఱిఁగింపుము= తెలియజేయండి; అన్నన్= అనగా; మౌని= నారదమహాముని; కరసరస్+జాతములు= కమలాలనేచేతులు; మోడ్చి= ముకుళించి (నమస్కరించి); కడఁకతోడన్= పూనికతో; కమల+అక్షున్+చూచి= శ్రీకృష్ణుణ్ణి చూచి; సత్+భక్తి మెఱసి= అనన్యమైన భక్తితో ప్రకాశిస్తూ; పలికెన్= పలికాడు.

**తా :** పాండవులు ఇప్పుడు ఎక్కడ ఏ విధంగా ఉన్నారో తెలియజేయవలసిందిగా శ్రీకృష్ణుడు అడుగగా నారదుడు సద్భక్తితో చేతులు జోడించి నమస్కరించి పుండరీకాక్షునితో ఉత్సాహంగా ఇలా చెప్పసాగాడు.

**వ. దేవా! విశ్వనిర్మాణకర్తవై, మాయివై, సకలకార్యోత్పాదనాదిశక్తి యుక్తుండవై, పావకుండు దారువులందు నంతర్హితప్రకాశుండై యున్నచందంబున వర్తించుచున్న నీదు దురత్యయంబయిన మాయాశతంబులఁ బెక్కు మాఱులు పొడగంటి నిదియు నాకు నద్భుతంబుగా; దదియునుం గాక నీ సంకల్పంబున జగంబుద్భవంబై భవత్పరతంత్రంబు నగు; నట్టి నీ కిష్టంబైన వస్తువు సాధుతరంబుగాఁ దెలియ నెవ్వండు సమర్థుం? డే పదార్థంబు ప్రమాణమూలంబునం దోఁచు నదియును లోకవిచక్షణుండవైన నీదు రూపంబు; మఱియును ముక్తిమార్గంబు నెఱుంగక సంసారపరవశులైన జీవుల మాయాంధకారంబు నివర్తింపఁజేయ సమర్థంబగు; నీ దివ్యలీలావతారంబులం గలుగు కీర్తి యను ప్రదీపంబు ప్రజ్వలింపఁజేసి కృపసేయు దట్టి నీకు నమస్కరించెద; నది గావున నీ ప్రపంచంబున నీ యెఱుంగని యర్థంబు గలదె? యని కృష్ణునకు నారదుం డిట్లనియె. 660**

**ప్రతి :** దేవా! = శ్రీకృష్ణా!; విశ్వనిర్మాణకర్తవు+ఐ= ఈ ప్రపంచాన్నే నిర్మించినవాడివై; మాయివి+ఐ= మాయావివై; సకల= సమస్తమైన; కార్య= పనులు, కార్యక్రమాలు; ఉత్పాదన+ఆది= పుట్టించుట, పెంచుట మొదలగు; శక్తియుక్తుండవు+ఐ= సామర్థ్యంతో కూడుకొన్నవాడై; పావకుండు= అగ్ని; దారువుల+అందున్= దుంగలందు; అంతర్హిత ప్రకాశుండు+ఐ= కనబడని ప్రకాశం కలవాడవై; ఉన్న చందంబును= ఉన్నరీతిగా; వర్తించుచున్న= ప్రవర్తిస్తూ; దురత్యయంబు+అయిన= దాటుటకు శక్యం కానిదైన; నీదు= నీ యొక్క; మాయాశతంబులన్= అనేకాలైన మాయల్ని; పెక్కుమాఱులు= అనేక పర్యాయాలు; పొడగంటిన్= చూశాను; ఇదియున్= ఇదికూడా; నాకున్= నాకు; అద్భుతంబు+కాదు= వింతకాదు; అదియునున్+కాక= అదీకాక; నీ సంకల్పంబున= నీ తలంపుచే; జగంబు= ఈ లోకం; ఉద్భవంబు+ఐ= పుట్టిందై; భవత్ పరతంత్రంబు= నీ యధీనంలో నడిచేది; అగున్= అగును; అట్టి నీకున్= అటువంటి శక్తియుక్తుడవగు నీకు; ఇష్టంబు+ఐన వస్తువు= ప్రియమైన వస్తువు; సాధు తరంబు+కాన్= మిక్కిలి బాగుగా; తెలియన్= తెలుసుకోడానికి; ఎవ్వండు= ఎవ్వడు; సమర్థుండు? = శక్తిగలవాడు?; ఏ పదార్థంబు= ఏ వస్తువు; ప్రమాణమూలంబునన్= వేదశాస్త్రాల ప్రధానఆధారాలతో; తోఁచున్= కనబడుతుందో; అదియును= అదికూడా; లోకవిచక్షణుండవు+ఐన= లోకంలో నేర్పరివైన; నీ+రూపంబు= నీ స్వరూపం; మఱియును= అదీగాక; ముక్తిమార్గంబున్= మోక్షాన్ని పొందేదారిని; ఎఱుంగక= తెలియలేక; సంసారపరవశులు+ఐన= సంసారంలో ఎంతో ఆసక్తి కలిగినా; జీవుల= ప్రాణుల; మాయా+అంధకారంబు= అజ్ఞానమనే చీకటిని; నివర్తింపన్+చేయన్= విడిపోయేటట్లుగా చేయగల; సమర్థంబు+అగు= శక్తిమంతమైన; నీ= నీయొక్క; దివ్యలీలా+అవతారంబులన్= దేవతాసంబంధమైన రామకృష్ణాది అవతారాలవలన; కలుగు= లభించే; కీర్తి+అను= యశస్సు అనే; ప్రదీపంబు= మిక్కిలి కాంతిమంతమైన దీపాన్ని; ప్రజ్వలింపన్+చేసి= బాగుగా వెలుగునట్లు చేసి; కృప+చేయుదు(వు)= అనుగ్రహించెదవు; అట్టి నీకున్= అటువంటి నీకు; నమస్కరించెదన్= మ్రొక్కుతున్నాను; ; అది+కావునన్= విషయమంతా అలాంటిది కాబట్టి; ఈ ప్రపంచంబునన్= ఈ సృష్టిలో; నీ+ఎఱుంగని= నీకు తెలియని; అర్థంబు+కలదు+ఎ? = సంగతి ఉందా? అనీ; కృష్ణునకున్= కృష్ణునితో; నారదుండు+ఇట్లనియెన్= నారదుడు ఇలా చెప్పాడు.

**తా :** దేవా! నీవు సృష్టికర్తవు. మాయాస్వరూపుడివి. కార్యములను పుట్టించువాడివి. కఱ్ఱలో దాగిన అగ్నివలె కనబడకుండ ప్రకాశించువాడివి. సర్వమాయాస్వరూపుడవైన నీ మాయాకలాపాలు ఎన్నోసార్లు చూశాను. ఇది నాకు కొత్త కాదు. వింతకాదు. నీ సంకల్పంచేత పుట్టింది. నీ అధీనంలో ఉంది. నీకు ప్రియమైన వస్తువు ఇట్టిదని తెలియగల సమర్థు డెవరు?

ఏ పదార్థం వేదశాస్త్రప్రమాణంగా తోస్తుందో అది సర్వలోకాల్లో సమర్థుడవైన నీ రూపమే! అదిగాక ముక్తిమార్గం తెలియక సంసారసాగరంలో బడి కొట్టుమిట్టాడే జీవుల అజ్ఞానమనే చీకటిని పోగొట్టగల సమర్థుడివి. నానావిధాలైన లీలలను చూపునట్టి నీ అవతారాలలో నీకు గలిగిన యశస్సు అనే దీపాన్ని వెలిగించి అనుగ్రహించినట్టి నీకు మ్రొక్కెదను. ఈ సర్వసృష్టియందు నీకు తెలియని విషయం ఒకటి మిగిలి ఉందని నేను చెప్పగలవాడనా? అని నారదుడు శ్రీకృష్ణ స్వామితత్త్వాన్ని ప్రశంసించి – ఇంకను ఇలా చెప్పసాగాడు.

**సీ. 'అయినను వినిపింతు నవధరింపుము దేవ! పాండుతనూజుండు పారమేష్ఠ్య**
**కామానుమోదియై కావింప నున్నాఁడు రాజసూయమహాధ్వరంబు నిష్ఠ**
**రవణింప లోకవిడంబనార్థము గాక, పరికింపఁ దన కాత్మబంధువుఁడవు**
**భక్తవత్సలుఁడవు పరమపూరుషుఁడవు యజ్ఞరక్షకుఁడవు యజ్ఞభోక్త**

**తే. వగు భగవత్సేవ చాలదే సుగతి వడయ?, నైన నీ మేనబావ ధర్మాత్మజుండు**
**అతనియజ్ఞంబు రక్షింప నంబుజాక్ష! వలయు విచ్చేయు మచటికి వలను మెఱసి. 661**

**ప్రతి :** దేవ!= శ్రీకృష్ణా!; అయినను= అన్ని విషయములు నీకు తెలిసినవే అయినా; వినిపింతున్= చెప్పెదను; అవధరింపుము= వినుము; పాండుతనూజుండు= పాండురాజుకొడుకైన ధర్మరాజు; పారమేష్ఠ్య= పరమేష్ఠి అయిన బ్రహ్మ సంబంధమైన లోకాన్ని పొందవలెననే; కామ= కోరికలలో; అనుమోది+ఐ= ఇష్టంగలవాడై; రాజసూయమహా+ అధ్వరంబు= రాజసూయమనే గొప్ప యజ్ఞాన్ని; కావింపనున్నాఁడు= చేయనున్నాడు; నిష్ఠ= యజ్ఞయాగాదులందు గల శ్రద్ధ; రవణింప= కనబడేటట్లు చేయడం; లోకవిడంబన+అర్థము= లోకంలో ప్రసిద్ధికోసం; కాక= అంతేకాని; పరికింపన్= చూడగా; తనకున్= ధర్మరాజుకు; సుగతి+పడయన్= సద్గతిని పొందటానికి; ఆత్మబంధువుఁడవు= దగ్గరి చుట్టమైనవాడివి; భక్తవత్సలుఁడవు= భక్తుల ఎడ ప్రేమగలవాడివి; పరమపూరుషుఁడవు= యజ్ఞాలను రక్షించేవాడివి; యజ్ఞభోక్తవు+అగు= యజ్ఞంలో అర్పించే హవిర్భాగాలను స్వీకరించేవాడివైన; భవత్+సేవ= నిన్ను సేవించడం; చాలదు+ఏ= చాలదా? ఐనన్= అయినప్పటికి; ధర్మ+ఆత్మజుండు= ధర్మాత్మజుండు= యమధర్మరాజు కుమారుడు ధర్మరాజు; నీ మేనబావ= నీ మేనత్త కొడుకు; అతని యజ్ఞంబు= ఆ ధర్మరాజు చేసే యజ్ఞం; రక్షింపన్= కాపాడటానికి; అంబుజ+అక్ష!= తామరలవంటి కన్నులుగల కృష్ణా; అచటికిన్= ఆ యజ్ఞానికి; వలనుమెఱసి= నీ వైభవాన్ని ప్రకాశింపచేసి; విచ్చేయవలయున్= రావలెను.

**తా :** నీకు సర్వం తెలిసియున్నప్పటికీ నన్ను అడిగావు కాబట్టి చెబుతాను విను. పాండురాజు కొడుకైన ధర్మరాజు యజ్ఞం చేసి బ్రహ్మలోకాన్ని పొందాలనే కోరికతో రాజసూయ మహాయాగాన్ని చేయబోతున్నాడు. అట్లు ఆ యజ్ఞం చేయతలపెట్టడం లోకంలో ప్రసిద్ధి పొందడానికే గాని, సద్గతిని పొందడానికి నిన్ను సేవిస్తే చాలుగదా? నీవు దగ్గఱ చుట్టానివి, భక్తవత్సలుడవు, పరమపురుషుడవు, యజ్ఞరక్షకుడవు, యజ్ఞంలోని హవిస్సును స్వీకరించే కర్తవు కావున, నీ మేనత్తకొడుకగు ధర్మరాజు చేసే యజ్ఞానికి సర్వవైభవంతో నీవు తప్పక రావాలి సుమా!

**క. నీ పేరు వినిన నొడివినఁ, బాపంబులు దూలిపోవు పద్మాక్ష; జగ**
**ద్దీపక! నీ దర్శనమున, నేపారవె భక్తజనుల కిహపరసుఖముల్. 662**

**ప్రతి :** పద్మ+అక్ష!= తామరలవంటి కన్నులుగల కృష్ణ; జగత్+దీపక= జగత్తును ప్రకాశింపచేసేవాడా; నీపేరు; నొడివినన్= పలికితే; పాపంబులు= పాపాలన్నీ; మాసిపోవున్= నశించిపోతాయి; నీ దర్శనమునన్= నిన్ను చూడడంవలన; భక్త

జనులకున్= నిన్ను సేవించేవారికి; ఇహపరసుఖములు= ఈ లోకంలోను పరలోకంలోను సుఖాలు; ఏపారవు+ఎ= అతిశయింపవా? (అతిశయింప పని భావం)

**తా :** ఓ శ్రీకృష్ణా! లోకాన్ని ప్రకాశింపజేసేవాడా! పద్మాలవంటి కన్నులుగలవాడా! నీ పేరు విన్నను, నీరూపానికన్నను పాపాలన్ని పటాపంచలైపోతాయి. నిన్ను భక్తితో కొలిచేవారికి ఈ భూలోకంలో పరలోకంలో సుఖాలు అధికంగా లభింపవా? (లభిస్తుంది!)

**మ. భవదీయోజ్జ్వలకీర్తిదిగ్వితతులన్ భాసిల్లు యుష్మత్పదో**
**ద్భవనైర్మల్యజలంబు లుత్కలికఁ బాతాళంబునం బాఱు భో**
**గవతీనామమునం దనర్చి ధరణిం గంగానదీపూరమై**
**దివి మందాకినియై జగత్త్రయమునం దీపించుఁ గాదే? హరీ! 663**

**ప్రతి :** హరీ!= ఓ శ్రీకృష్ణా; భవదీయ+ఉజ్జ్వలకీర్తి= ప్రకాశవంతమైన నీదైన కీర్తి; దిక్+వితతులన్= దిక్కుల సమూహాలలో – పది దిక్కులందు; భాసిల్లున్= ప్రకాశిస్తాయి; యుష్మత్= నీ; పద+ఉద్భవ= పాదాలనుండి పుట్టిన; నైర్మల్య= నిర్మలమైన; జలంబులు= నీళ్లు; ఉత్కలికన్= తహతహతో; పాతాళంబునన్= పాతాళ లోకంలో; భోగవతీ నామమునన్= భోగవతి అను పేరుతో; తనర్చి= ప్రసిద్ధిపొంది; పాఱున్= ప్రవహిస్తుంది; ధరణిన్= భూలోకంలో; గంగానదీపూరము+ఐ= గంగానదీజలాలై; దివిన్= ఆకాశంలో, స్వర్గలోకమందు; మందాకిని+ఐ= మందాకిని అనే పేరుతో; జగత్త్రయమునన్= స్వర్గమర్త్యపాతాళలోకాలు మూడింటిలో; దీపించున్= ప్రకాశిస్తుంది; కాదు+ఏ= కదా!

**తా :** ఓ శ్రీకృష్ణా! నీ నిర్మలమైన కీర్తి దశదిశలలో ప్రకాశించేటట్లుగా నీ పాదాలయందు పుట్టిన నీళ్లు మిక్కిలి నిర్మలత్వంతో పాతాళలోకంలో భోగవతి అనే పేరుతో, భూలోకంలో గంగానది అనే పేరుతో, స్వర్గలోకంలో మందాకిని అనే పేరుతో – ముల్లోకాల్లో ప్రకాశిస్తున్నాయి కదా?

**క. ఆ మఖవేళ సమస్త ధ, రామండలిఁ గల్గు మేటిరాజులు మౌని**
**స్తోమంబును భవదీయ మ, హామహిమముఁ జూచి సత్కృతార్థతఁ బొందన్. 664**

**ప్రతి :** ఆ మఖవేళన్= ఆ రాజసూయయాగ సమయంలో; సమస్త ధరామండలిన్= ఈ భూమండలమంతటా; కల్గు మేటిరాజులు= ఉన్నట్టి గొప్పరాజులు; మౌనిస్తోమంబును= మునుల సమూహమూ; భవదీయ= నీయొక్క; మహామహిమమున్+చూచి= గొప్ప మహిమను గాంచి; సత్కృతార్థత= ఎంతో ఉత్తమమైన ఫలసిద్ధిని; పొందన్= పొందేటట్లుగా...

**తా :** జరుగబోయే రాజసూయయజ్ఞంలో ఈ భూమిమీది గొప్పరాజులు, మునుల సమూహం నీ గొప్ప మహిమను చూచి, ఉత్తమస్థితి పొంద (గలరు)

**క. కలరని చెప్పిన న మ్మునిఁ, పలుకులకు ముదంబు నొంది పంకజనాభుం**
**డెలనవ్వు మొగమునకుఁ జెలు, వొలయఁగఁ బాటించి యుద్ధవున కిట్లనియెన్. 665**

**ప్రతి :** కలరు= ఉన్నారు; అనిచెప్పిన= అని చెప్పినట్టి; ఆ+ముని పలుకులకున్= ఆ నారదమహాముని మాటకు; ముదంబు+ ఒంది= ఆనందాన్ని పొంది; పంకజనాభుండు= శ్రీకృష్ణుడు; ఎలనవ్వు= చిరునవ్వు; మొగమునకున్= ముఖానికి;

చెలువు+ఒలయన్+కన్= అందాన్ని చేకూర్చగా; పాటించి= నారదుని మాటను అంగీకరించి; ఉద్ధవునకున్= ఉద్ధవునితో; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** అని నారదుడు పలుకగా శ్రీకృష్ణుడు ఆనందించి, చిరునవ్వు ముఖానికి కొత్త అందాన్ని చేకూర్చగా, నారదుని మాట మన్నించి ఉద్ధవునితో ఇలా చెప్పాడు.

## ✤ శ్రీకృష్ణు డుద్ధవుని యాలోచన చొప్పన ధర్మరాజు పాలికిఁ బోవుట ✤

**క. 'ఉద్ధవ! మహితవివేక స, మిద్ధవచోవిభవ! కార్య మేగతి నడచున్**
**వృద్ధవరానుమతంబుగ, బోద్ధవ్యము గాఁగఁ జెప్పు పురుషనిధానా! 666**

**ప్రతి :** పురుషనిధానా!= పురుషులలో శ్రేష్ఠమైన నిధివంటివాడా! మహిత= గొప్పదైన; వివేక= తెలివితో కూడిన; సమ్+ఇద్ధ= సమిద్ధ= కొనియాడతగిన; వచస్+విభవ!= మాటనేర్పరితనం గలవాడా!; ఉద్ధవ!= ఉద్ధవుడా!; కార్యము= ఇప్పుడు మనం చేయవలసినపని; ఏ గతిన్= ఏ విధంగా; నడచున్= నడుపవలసి ఉందో; వృద్ధవర+అనుమతంబుగ= శ్రేష్ఠులైన పెద్దలు సమ్మతించేటట్లుగా. బోద్ధవ్యము= బోధింపదగిందిగా; కాన్+కన్= అగునట్లుగా; చెప్పు= చెప్పుము.

**తా :** పురుషశ్రేష్ఠుడా! గొప్పతెలివితేటలతో పదిమంది మెచ్చుకొనేవిధంగా మాటల నేర్పు పుష్కలంగా ఉన్న ఉద్ధవా! శ్రేష్ఠులైన పెద్దలు అంగీకరించే విధంగానూ, వాళ్లు మెచ్చుకొనేరీతిలోనూ కార్యం ఎలా నడపాలో దాన్ని చెప్పవయ్యా!

**తే. అనఘచారిత్ర ! నీవు మా యక్షియుగము, వంటివాఁడవు మనకు నవశ్య మగుచుఁ**
**జేయఁ దగినట్టి కార్యంబుఁ జెప్పు నీవు, ఏమి పంచినఁ గావింతు నిద్ధచరిత!' 667**

**ప్రతి :** ఇద్ధ చరిత= కొనియాడదగిన నడవడిగల ఉద్ధవా!; అనఘచారిత్ర= దోషరహితమైన నడవడి గలవాడా!; నీవు= నీవు; మా+అక్షియుగమువంటివాడవు= మా రెండు కన్నులవంటివాడివి; మనకున్= మనందరకు; అవశ్యము+అగుచున్= తప్పనిదై; చేయన్+తగినట్టి= చేయతగినట్టి; కార్యంబున్= పనిని; చెప్పు= చెప్పుము; నీవు= నీవు; ఏమి పంచినన్= ఏ పని చేయమన్నా; కావింతున్= తప్పక చేసెదను.

**తా :** పుణ్యచారిత్రుడవై కొనియాడదగిన నడవడి గలవాడా! ఉద్ధవా! నీవు మాకు రెండు కన్నులవంటివాడివి. కాబట్టి నీవు చెప్పిన పని చేయడానికి సిద్ధంగా ఉన్నాను. చేయవలసిన పని చెప్పు.

**వ. అని సర్వజ్ఞుండైన హరి యజ్ఞుండపోలెఁ దన్ను నడిగినఁ బురుషోత్తముని భాషణంబులకు మనంబున సంతసిల్లి, యతనిపాదంబులు దన మనంబున నిడికొని, 'వృద్ధానుమతంబుగా నా యెఱింగిన తెఱంగు విన్నవించెద నవధరింపుము; దేవా! దేవముని చెప్పినట్లు భవదీయభక్తుండైన యుధిష్ఠిరుయాగపాలనంబు సేయం గైకొనుట కార్యం; బదియునుం గాక నిఖిలదిగ్విజయమూలంబగు రాజసూయకృత్యంబునందు జరాసంధమర్దనంబును, నతనిచే బద్ధులైన రాజులం గారాగృహవిముక్తులం గావించుటయుం జేకూరు; నదియునుం గాక నాగాయుతసత్త్వుండును, శతాక్షౌహిణీబలాన్వితుండును నగు మాగధుని వధియింప మన ప్రభంజననందనుండు గాని యొండొరులు సమర్థులుగా; రట్లగుట నతండు భూసురులేమి గోరిన, నయ్యర్థంబు వృథసేయక యిచ్చుం; గపటవిప్రవేషంబునం జని యాజరాసంధుని నాహవభిక్ష వేఁడి,**

**భవత్సన్నిధానంబున న ప్పవమానతనయుం డతని వధియించు నట్టి కార్యంబు సేఁత బహుళార్థసాధనం బగు' నని పలికిన నారదుండును యాదవజనంబులును సభ్యులునుం బొగడి; రంత. 668**

**ప్రతి :** అని= అంటూ; సర్వజ్ఞుడు+ఐన హరి= సర్వం తెలిసిన శ్రీకృష్ణుడు; అజ్ఞుండు+పోలెన్= ఏమీ తెలియనివానివలె; తన్నున్+అడిగినన్= తనను అడగ్గా; పురుషోత్తముని= శ్రీకృష్ణునియొక్క; భాషణంబులకున్= మాటలకు; మనంబునన్= మనస్సులో; సంతసిల్లి= ఆనందించి; అతనిపాదంబులు= శ్రీకృష్ణునిపాదాలు; తన మనంబునన్= తన మనస్సులో; ఇడికొని= స్థాపించుకొని; వృద్ధ+అనుమతంబుగా= పెద్దలు అంగీకరించేటట్లుగా; నా+ఎఱింగిన తెఱంగు= నాకు తెలిసిన విధం; విన్నవించెదన్= చెబుతాను; అవధరింపుము= వినవయ్యా; దేవా!= శ్రీకృష్ణా!; దేవముని= నారదుడు; చెప్పినట్లు= చెప్పిన విధంగా; భవదీయ= మీయొక్క; భక్తుండు+ఐ= సేవకుడై; యుధిష్ఠిరు= ధర్మరాజుయొక్క; యాగపాలనంబు+ చేయన్= యజ్ఞాన్ని పాలించడానికి; కైకొనుట= స్వీకరించడం; కార్యంబు= చేయదగింది; అదియునున్+కాక= అదీగాక; దిక్+విజయమూలంబు+అగు= సాటి రాజులనందరినీ జయించడం (ప్రధానంగాగల); రాజసూయకృత్యంబునందు= రాజసూయ కార్యంలో; జరాసంధ మర్దనంబునున్= జరాసంధుని సంహరించుట; అతనిచే బద్ధులు+ఐన= జరాసంధునిచే బందీలుగా చేయబడిన; రాజులన్= రాజులను; కారాగృహ విముక్తులం గావించుటయున్ చేకూరున్= చెరసాలనుండి విడిపించడమూ కలసివస్తుంది; అదియునున్+కాక= అదిమాత్రమేగాక; నాగాయుతసత్త్వుండును= పదివేల యేనుగుల బలం గలవాడూ; శత+అక్షౌహిణీబల+అన్వితుండును= నూరు అక్షౌహిణీల సేనాబలంతో కూడుకొన్నవాడూ; అగు= అయినట్టి; మాగధునిన్= మగధరాజగు జరాసంధుణ్ణి; వధియింపన్= సంహరించడానికి; మన ప్రభంజన నందనుడు+కాని= వాయు తనయుడైన భీముడుతప్ప; ఒండు+ఒరులు= ఇతరులు; సమర్థులు గారు= శక్తులుగారు; అట్లు+అగుటన్= అందువలన; అతండు= ఆ జరాసంధుడు; భూసురులు= భూమిమీద సంచరించే దేవతలు – బ్రాహ్మణులు; ఏమి+కోరినన్= ఏమి అడిగినా; ఆ+అర్థంబు= ఆ అడిగిన దాన్ని; వృథ+చేయక+ఇచ్చున్= కాదనక తప్పక ఇస్తాడు; కపట విప్రవేషంబునన్= కపటమైన బ్రాహ్మణవేషంతో; చని= వెళ్లి; ఆ జరాసంధునిన్= ఆ జరాసంధుని; ఆహవభిక్షవేఁడి= యుద్ధం భిక్షగా కోరి; భవత+సన్నిధానంబునన్= నీ సమక్షంలో; ఆ+పవమానతనయుండు= ఆ వాయుపుత్రుడైన భీముడు; అతనిన్= ఆ జరాసంధుణ్ణి; వధియించు+అట్టి కార్యంబుసేత= చంపడంచేత; బహుళార్థసాధనంబు+అగున్= చాలాపనులు సాధించినట్లవుతుంది; అని పలికినన్= అని చెప్పగా; నారదుండును= నారదమహర్షియు; యాదవజనంబులును= సభలోని యాదవులును; సభ్యులునున్= సభలోగల వారందరును; పొగడిరి= ఉద్ధవుణ్ణి మెచ్చుకొన్నారు; అంతన్= ఆ తరువాత...

**తా :** ఈ విధంగా సర్వమూ తెలిసిన శ్రీకృష్ణుడు ఏమియు తెలియనివాడిలాగా ఉద్ధవుణ్ణి అడగ్గా ఉద్ధవుడు శ్రీకృష్ణుని మాటలకు ఆనందించి ఆ స్వామి పాదపద్మాలు మనస్సులో నిలుపుమని – పెద్దలందరూ మెచ్చే ఆలోచనను చెబుతాను విను. ఓ శ్రీకృష్ణా! నారదమహర్షి చెప్పినట్లు నీ ప్రియభక్తుడైన ధర్మరాజు చేసే రాజసూయయాగాన్ని రక్షించటం ముఖ్యకర్తవ్యం. రాజసూయయాగంలో అన్నిదిక్కుల్నీ జయించడం ప్రధానకార్యంగా ఉంటుంది. కాబట్టి, ఆ దిగ్విజయసందర్భంలోనే జరాసంధుణ్ణి సంహరించి వాని చెరలో నున్న రాజుల్ని విడిపించడం కూడా సమకూడుతుంది. పదివేలయేనుగుల బలమూ; నూరు అక్షౌహిణుల సైన్యమూ గల జరాసంధుణ్ణి జయించడం వాయుపుత్రుడైన మన భీమునికి తప్ప ఇతరులకెవరికీ సాధ్యంకాదు. ఇక ఆ జరాసంధుడు బ్రాహ్మణులు ఏది కోరినప్పటికీ సందేహించకుండా ఇస్తాడు. కాబట్టి, బ్రాహ్మణవేషంతో వెళ్లి జరాసంధుణ్ణి యుద్ధమే భిక్షగా వేడినట్లయితే నీ సన్నిధానంలో భీముడు జరాసంధుని సంహరించడమూ; దానివలన చాలా పనులు కలిసిరావడమూ జరుగుతుంది అని ఉద్ధవుడు చెప్పగా, నారదుడు యాదవులు, సభాసదులు అందరూ అతణ్ణి మెచ్చుకొన్నారు. ఆ తర్వాత

సీ. **తరలవిచిత్రకస్థగితప్రభావలిఁ దనరారు గరుడకేతనము వెలుఁగఁ**
**గాంచనచక్రసంఘటితఘంటాఘణ ఘణనినాదముల దిక్కరులు బెదర**
**సలలితమేఘపుష్పకవలాహకశైబ్యసుగ్రీవతురగవిస్ఫురణ దనర**
**బాలసూర్యప్రభాభాసమానద్యుతిదిగ్వితానం బెల్ల దీటుకొనఁగఁ**

తే. **బ్రకటరుచి నొప్పు తేరు దారుకుఁడు దేర, నెక్కి వెడలెడు నపుడు పెంపెనయఁ జెలఁగె**
**శంఖకాహళపటహనిస్సాణడిండి, మాదిరవములు భరితదిగంతములుగ.** **669**

**ప్రతి :** తరల= చలిస్తున్న; విచిత్రక= చిత్రాలచేత; (బొమ్మలచేత); స్థగిత= కూర్చబడిన; ప్రభావలిన్= కాంతి సమూహంచేత; తనరారు= ఒప్పుచున్న; గరుడకేతనము= గరుడధ్వజం; వెలుఁగన్= ప్రకాశించగా; కాంచనచక్ర= బంగారు చక్రాలతో; సంఘటిత= కూర్చబడిన; ఘంటా= గంటలయొక్క; ఘణఘణనినాదములన్= ఘణఘణమను చప్పుళ్లచేత; దిక్కరులు= అష్టదిగ్గజాలు; బెదరన్= భయపడగా; సలలిత= మిక్కిలి అందమైన; మేఘ, పుష్పక, వలాహక, శైబ్య, సుగ్రీవ తురగ= మేఘం, పుష్పకం, వలాహకం, శైబ్యం, సుగ్రీవం అను పేర్లుగల ఐదు గుఱ్ఱాల; విస్ఫురణ= విశేషమైన ప్రకాశం; తనరన్= ఒప్పగా; బాలసూర్యప్రభా= ఉదయిస్తున్న సూర్యునికాంతివలె; భాసమాన= వెలుగుతున్న; ద్యుతి= కాంతి; దిక్+వితానంబు+ఎల్లన్= అన్ని దిక్కులలో; దీటుకొనన్+కన్= వ్యాపించగా; ప్రకటరుచిన్= మిక్కిలి కాంతితో; ఒప్పు= ఒప్పుతున్న; తేరు= రథం; దారుకుఁడు= శ్రీకృష్ణరథసారథియగు దారుకుడు; తేరన్= తీసుకొనిరాగా; ఎక్కి= ఆ రథమెక్కి; వెడలెడు+అపుడు= శ్రీకృష్ణుడు వెళ్లేటప్పుడు; పెంపు+ఎనయన్= గౌరవం సమకూడేవిధంగా; శంఖ= శంఖాలు; కాహళ= బూరాలు; పటహ= తప్పెటలు; నిస్సాణ= చర్మవ్యాధులు; డిండిమ= పెద్దఢక్క; ఆదిరవములు= ఆయావాద్యాల ధ్వనులు; భరితదిక్+అంతములు+కన్= దిక్కులచివర్లవరకు వ్యాపించి దిక్కులను నింపే విధంగా; చెలఁగెన్= మ్రోగాయి.

**తా :** మిక్కిలి చలిస్తూ, రంగురంగులతో చిత్రింపబడిందై ప్రకాశిస్తున్న గరుడధ్వజాలూ, దిగ్గజాలు బెదరిపోయేటట్లుగా ఘణఘణధ్వనులతో మ్రోగుతున్న రథచక్రాలకు కట్టిన గంటలును, అందమైనమేఘం, పుష్పకం, వలాహకం, శైబ్యం, సుగ్రీవం అనే ఐదు గుఱ్ఱాలను గల్గి ఉదయకాలసూర్యకాంతివలె ప్రకాశిస్తున్న బంగారురథాన్ని, దారుకుడనే సారథి తీసుకొని రాగా శ్రీకృష్ణుడు ఆ రథాన్ని అధిరోహించి బయలుదేరి వెళుతుండగా – శ్రీకృష్ణుని గౌరవానికి తగినట్లు, శంఖాలు, బూరాలు, తప్పెటలు, పెద్ద ఢక్కలు, డోలులు మున్నగు వాద్యములు ఒక్కుమ్మడి మ్రోగసాగాయి. వాటి ధ్వనులు దిక్కులు పిక్కటిల్లేటట్లు వ్యాపించాయి.

క. **మనుజేశ్వరునకుఁ దాలాం, కునకును గురువృద్ధజనులకును జెప్పి ప్రియం**
**బున ననుపఁ గాంచన స్యం, దనసామజవాజిభటకదంబము గొలువన్.** **670**

**ప్రతి :** మనుజ+ఈశ్వరునకున్= మహారాజైన ఉగ్రసేనునికి; తాల+అంకునకును= తాటిచెట్టు ధ్వజంగా గల బలరామునికి; గురువృద్ధజనులకును= పూజ్యులకు వృద్ధులకును; చెప్పి= చెప్పి; ప్రియంబునన్= ప్రేమతో; అనుపన్= వారు పంపగా; కాంచనస్యందన= బంగారు రథాలు; సామజ= ఏనుగులు; వాజి= గుఱ్ఱముల; భట= భటుల; కదంబము= సమూహం; కొలువన్= కొలువగా...

**తా :** శ్రీకృష్ణుడు ఉగ్రసేనమహారాజుకు, బలరామునికి, పూజ్యులైన పెద్దలకు చెప్పి, వారియనుమతి తీసుకొని బంగారుతేరులు, ఏనుగులు, గుర్రాలు, భటులు మున్నగు చతురంగబలములు కొలువగా

**తే. వందిమాగధసూతకైవారరవము, వసుమతీసురకోటిదీవనల మ్రోఁత**
**లనుగమింపంగ సతులు సౌధాగ్రశిఖర, సీమలందుండి ముత్యాలసేస లొలుక. 671**

**ప్రతి :** వందిమాగధ= రాజుగారి పూర్వీకుల్ని చెప్పే వంశవృక్ష కీర్తనలు చేసేవారు; సూత= తమ పోషకుడైన రాజుయొక్క ఘనకార్యాలను కీర్తించేవారు; కైవార= స్తోత్రములు చేసేవారు; రవము= ధ్వనియును; వసుమతీ సురకోటి= బ్రాహ్మణుల సమూహంయొక్క; దీవనల మ్రోఁతలన్= ఆశీర్వచనములయొక్క ధ్వనులతో; అనుగమింపన్+కన్= వెంబడింపగ; సతులు= స్త్రీలు; సౌధ+అగ్ర శిఖర సీమల+అందున్+ఉండి= మేడల పైభాగాలనుండి; ముత్యాలసేసలు= ముత్యాల తలంబ్రాలు; ఒలుకన్= చల్లగా.

**తా :** వందిమాగధాదుల స్తుతులు, స్తోత్రపాఠాలధ్వనులు, బ్రాహ్మణుల ఆశీర్వాదవచనాల ధ్వనులు పరస్పరం కలిసి సందడిగా నుండగ మేడల పైభాగాలనుండి స్త్రీలు ముత్యాల తలంబ్రాలు పోయగా

**క. లీలం జని కృష్ణుఁడు వా, హ్యాలిన్ నవకుసుమఫలభరానతశాఖా**
**లోల ఘనసారసాల ర, సాల వనస్థలములందుఁ జతురత విడిసెన్. 672**

**ప్రతి :** కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; లీలన్+చని= విలాసంగా వెళ్లి; నవకుసుమ= క్రొత్తగా వికసించిన పువ్వుల; ఫల= పండ్ల; భరానత= బరువుచే వంగిన; శాఖాలోల= చలించుచున్న కొమ్మలుగల; ఘనసార= కర్పూరపు చెట్లు; సాల= మద్దిచెట్లు; రసాల= తియ్యమామిడి చెట్లుగల; వనస్థలముల+అందున్= తోటలలో; వాహ్యాలిన్= (విహారాన్నిగూర్చి) విహారంకై; చతురతన్= చాతుర్యంతో; విడిసెన్= దిగెను.

**తా :** శ్రీకృష్ణుడు వినోదంగా వాహ్యాళికై వెళ్లి, కొత్తపూల పండ్ల బరువుచే వంగిన కొమ్మలు గల కర్పూరపు చెట్లు, మద్దిచెట్లు, తియ్యమామిడి చెట్లుగల తోటలలో విడిదిచేశాడు.

**వ. అట్టి యెడ సరోజనాభుశుద్ధాంతంబున. 673**

**ప్రతి :** అట్టియెడన్= ఆ సమయమున; సరోజనాభు= శ్రీకృష్ణునియొక్క; శుద్ధాంతంబున= అంతఃపురంలో...

**తా :** ఆ సమయంలో శ్రీకృష్ణుని అంతఃపురంలో

**సీ. వికచమరందనవీనసౌరభలసన్మందారకుసుమదామములు దుఱిమి**
**చారుసుగంధకస్తూరికాఘనసారమిళితచందనపంకమెలమి నలఁది**
**కనకకుండలరణత్కంకణనూపురముద్రికాభూషణంబులు ధరించి**
**యంచితముక్తాఫలాంచలమృదులదివ్యాంబరమ్ములు సెలువారఁగట్టి**

**తే. యర్ధచంద్రుని నెకసక్కె మాడునట్టి, యలికఫలకలఁ దిలకము లలరఁ దీర్చి**
**పెంపు దీపింప నుడురాజబింబముఖులు, నవచతుర్విధశృంగార మవధరించి. 674**

**ప్రతి :** వికచ= విచ్చుకొన్న; మరంద= తేనెలతోను; నవీనసౌరభ= కొత్త పరిమళాలతోను; లసత్= ఒప్పుతున్న; మందార కుసుమదామములు= మందార పూలమాలలు; తుఱిమి= తలలో ధరించి; చారు= అందమైన; సుగంధ= పరిమళంతో

కూడిన; కస్తూరికా= కస్తూరి; ఘనసార= కర్పూరం; మిళిత= కలిపినట్టి; చందనపంకము= మంచి గంధపుపూతలు; ఎలమిన్= సంతోషంతో; అలఁది= పూసుకొని; కనకకుండల= బంగారుచెవిపోగులు; రణత్= మ్రోగుతున్న; కంకణ= కడియాలు; నూపుర= కాలిఅందెలు; ముద్రికా= ఉంగరాలు మున్నగు; భూషణంబులు= ఆభరణాలు; ధరించి= అలంకరించుకొని; అంచిత= మనోహరమైన; ముక్తాఫల+అంచల= ముత్యాలపూసలు గుచ్చిన చెంగులుగల; మృదుల= మెత్తని; దివ్య+అంబరములు= దివ్యాలైన వస్త్రాలను; చెలువారన్= అందం ప్రకటితమయ్యేటట్లు; కట్టి= కట్టుకొని; అర్ధచంద్రునిన్= అర్ధచంద్రబింబాన్ని; ఎకసెక్కమాడున్+అట్టి= పరిహాసం చేసే; అలికఫలకలన్= నొసటి భాగాల్లో; తిలకములు= అలంకరించుకొనే రకరకాల బొట్లు; అలరన్= ఒప్పునట్లుగా; తీర్చి= దిద్దుకొని; పెంపు= ఆధిక్యం; దీపింపన్= ప్రకాశించగా; ఉడురాజ బింబముఖులు= చంద్రబింబాలవంటి ముఖాలు గల ఆ అంతఃపుర స్త్రీలు; నవ= క్రొత్తదైన; చతుర్+విధ= నాలుగు విధాలైన (వస్త్రభూషణ మాల్య అనులేపనాలనే నాల్గురకాలు); శృంగారము= అలంకారాలను; అవధరించి= చేసుకున్నవారై...

**తా :** విరిసి పూదేనెలతో, పరిమళంతో అలరారుతున్న మందారపుష్పాలను కొప్పులో తురుముకొని, కస్తూరి, పచ్చకర్పూరం మొదలైన పరిమళద్రవ్యాలు కలిపి తయారుచేసిన చందనపు మైపూతను పూసుకొని, బంగారు కుండలాలు, ధ్వనిస్తున్న కంకణాలు, అందెలు మొదలైన ఆభరణాలు ధరించి, ముత్యాలు అంచులందు కుట్టిన మెత్తని దివ్యాలంకారాలైన చీరలు కట్టుకొని, అరచందమామను బోలిన నొసటియందు కస్తూరితిలకాలను దిద్దుకొని, చంద్రుణ్ణిబోలిన ముఖబింబాలు గల ఆ అంతఃపురకాంతలు - వస్త్రభూషణ మాల్య అనులేపనాలనే నాల్గువిధాలైన అలంకారాలతో ఒప్పినవారైనారు.

**తే. జలజలోచనుకడకు నుత్కలికతోడఁ, దనరు శిబికల నెక్కి నందనులుఁ దాముఁ**
**గనఁగ నేతేరఁ బ్రతిహారజనులు వేత్ర, కలితులై పౌరులను నెడగలుగ జడియ. 675**

**ప్రతి :** జలజలోచనుకడకున్= శ్రీకృష్ణుని వద్దకు; ఉత్కలికతోడన్= తహతహతో; తనరు శిబికలన్= ఒప్పునట్టి పల్లకీలను; ఎక్కి= ఎక్కినవారై; నందనులున్= కొడుకులును; తామున్= తామును; కనన్+కన్= చూచుటకు; ఏ తేరన్= రాగా; ప్రతిహారజనులు= ద్వారపాలకులు; వేత్రకలితులు+ఐ= బెత్తాలు పట్టుకొన్నవారై; పౌరులను= పురజనుల్ని; ఎడగలు+కన్= ఎడంగా జరిగేటట్లు; జడియన్= త్రోయగా...

**తా :** కృష్ణునివద్దకు పోవాలనే తహతహతో అంతఃపురాంగనలు తగు పల్లకీలనెక్కి, ద్వారపాలకులు చేత బెత్తాలు పట్టుకొని దారికి అడ్డంగా ఉంటూ చూడవచ్చిన పురజనుల్ని దూరంగా తొలగజేస్తూ ఉండగా పుత్రులతో సహా వస్తూ ఉండగా కృష్ణుని దగ్గరకు రాసాగారు.

**క. అసమాస్త్రుఁడు పులు గడిగిన, కుసుమాస్త్రములను హసించుకోమలతనువుల్**
**మిసమిస మెఱవఁగ వేశ్యా, విసరము దాసీజనంబు విభవ మెలర్పన్. 676**

**ప్రతి :** అసమ+అస్త్రుఁడు= మన్మథుడు; పులు+కడిగిన= మురికి పోయేటట్లు కడిగిన; కుసుమ+అస్త్రములను= పూల బాణాలను; హసించు= వెక్కిరించే; కోమల తనువుల్= సుకుమారమైన శరీరాలు; మిసమిస మెఱవన్+కన్= మిసమిసమని మెఱసిపోతూ ఉండగా; వేశ్యావిసరము= వేశ్యాసమూహం; దాసీజనంబు= దాసీజనం; విభవము+ఎలర్పన్= ఐశ్వర్యం అతిశయింపగా...

**తా :** మన్మథుడు మొటికి పోవునట్లు కడిగిన పూలబాణాలను వెక్కిరించేలా సుతిమెత్తనైన, తళతళలాడుతున్న శరీరాలు గల వేశ్యల సమూహం, పరిచారికల గుంపు తమ సంపద ప్రకటమగునట్లుగా

**ఆ. హరుల వేసడములఁ గరులను నెక్కి తోఁ, నరుగుదేర బహువిధాయుధములు**
**దాల్చి సుభటకోటి దగిలి రా నంతఃపు, రాంగనలు సితాంబుజాక్షుకడకు. 677**

**ప్రతి :** హరులన్= గుఱ్ఱాలను; వేసడములన్= కంచర గాడిదల్ని; కరులన్= ఏనుగుల్ని; ఎక్కి= ఎక్కి; తోన్= తనతోకూడ; అరుగుదేరన్= బయలుదేరిరాగా; బహువిధ+ఆయుధములు= వివిధాలైన ఆయుధాలను; తాల్చి= ధరించి; సుభటకోటి= శ్రేష్ఠులైన భటుల సమూహం; తగిలిరాన్= వెంటరాగా; అంతఃపుర+అంగనలు= అంతఃపుర స్త్రీలు; సిత+అంబుజాక్షు కడకున్= తెల్లతామరల రేకులవంటి కన్నులు గల శ్రీకృష్ణుని దగ్గరకు...

**తా :** గుఱ్ఱాలను, కంచరగాడిదలను, ఏనుగులను ఎక్కి వేశ్యలు, దాసీజనాలు బయలుదేరగా, వివిధాలైన ఆయుధాలను ధరించి, నమ్మకమైన భటులు వెంటరాగా అంతఃపురస్త్రీలు శ్రీకృష్ణుని వద్దకు వచ్చారు.

**వ. వచ్చి రంత. 678**

**ప్రతి :** వచ్చిరి+అంతన్= వచ్చారు...

**తా :** అంతట అంతఃపురాంగనలు రాగా

**క. నారదుని, మాధవుఁడు స, త్కారంబున వీడుకొలుప నతఁడును హృదయాం**
**భోరుహమునఁ గృష్ణునకును, వారక మ్రొక్కుచును వెస దివంబున కరిగెన్. 679**

**ప్రతి :** మాధవుఁడు= శ్రీకృష్ణుడు; నారదునిన్= నారదమహర్షిని; సత్కారంబునన్= గౌరవంతో; వీడుకొలుపన్= సాగనంపగా; అతఁడును= ఆ నారదుడును; హృదయ+అంభోరుహమునన్= మనః కమలంలో; కృష్ణునకును= శ్రీకృష్ణునికి; వారక= ఆలస్యం చేయక; మ్రొక్కుచును= నమస్కరిస్తూ; వెసన్= వేగంగా; దివంబునకున్= స్వర్గలోకానికి; అరిగెన్= వెళ్లాడు.

**తా :** అంతట శ్రీకృష్ణుడు నారదమహర్షిని సన్మానించి వీడ్కొల్పగా అతడును తన మనఃకమలంలో శ్రీకృష్ణుణ్ణి తలచుకొని నమస్కరిస్తూ ఆలస్యం చేయకుండా దేవలోకానికి వెళ్లాడు.

**క. నరవరుల దూతయును ముర, హరుచే నభయప్రదాన మంది ధరిత్రీ**
**వరుల కడ కేగి పద్మో, దరువచనము సెప్పి సమ్మదంబునఁ దేల్చెన్. 680**

**ప్రతి :** నరవరుల దూతయును= జరాసంధునిచే బంధింపబడిన రాజులు పంపిన దూతకూడా; మురహరుచేన్= మురాసురుణ్ణి సంహరించిన శ్రీకృష్ణునిచే; అభయప్రదానము+అంది= భయంలేదు నేను రక్షిస్తాననే మాటను స్వీకరించి; ధరిత్రీ వరుల కడకున్= రాజోత్తములవద్దకు; ఏగి= వెళ్లి; పద్మ+ఉదరువచనము= శ్రీకృష్ణుడు అభయహస్తంతో చెప్పిన మాటను; చెప్పి= చెప్పి; సమ్మదంబునన్= ఆనందంలో; తేల్చెన్= తేలేటట్లు చేశాడు.

**తా :** జరాసంధునిచెరలో ఉన్న రాజోత్తములచే పంపబడిన దూతకూడా శ్రీకృష్ణునిచే భయపడవలసినపనిలేదనే నమ్మకమైన మాటను గ్రహించి, ఆ రాజుల వద్దకు వెళ్లి శ్రీకృష్ణుడిచ్చిన అభయాన్ని గూర్చి చెప్పి ఆ రాజుల హృదయాలకు సంతోషం కలిగించాడు.

**వ. అంతఁ గృష్ణుండు నిజకాంతాతనయబంధుసుహృజ్జనసమేతుండై కదలి చనునెడ. 681**

**ప్రతి :** అంతన్= అంతట; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; నిజ= తనయొక్క; కాంతా తనయ బంధు సుహృత్+జన= భార్యలతో, కొడుకులతో, బంధువులతో, మిత్రులతో; సమేతుండు+ఐ= కూడుకున్నవాడై; కదలి= ప్రయాణమై; చను+ఎడన్= వెళ్లుచుండగా...

**తా :** అంతట శ్రీకృష్ణుడు తన భార్యలు, కొడుకులు, బంధువులు, మిత్రులు వెంటరాగా ప్రయాణమై పోతూ ఉండగా

**చ. కటపటరత్నకంబళనికాయకుటీరము లుల్లసిల్ల ను**
**త్కటపటుచామరధ్వజపతాకకిరీటసితాతపత్త్ర వి**
**స్ఫుటఘనహేతిదీధితి నభోమణిఁ గప్పఁగఁ దూర్యఘోషముల్**
**చటులతిమింగిలోర్మిరవసాగరఘోషము నాక్రమింపఁగన్. 682**

**ప్రతి :** కట= చాపలు; పట= వస్త్రములు; రత్న కంబళ నికాయ= రత్నాలు తాపిన కంబళ్ల సమూహాలుగల; కుటీరములు= కుటీరాలు; ఉల్లసిల్లన్= ఒప్పుతూ ఉండగా; ఉత్కట= హెచ్చైన; పటు= దృఢమైన; చామర= వింజామరలు; ధ్వజ= జెండాలస్తంభాలు; పతాక= జెండాల వస్త్రాలు; కిరీట= కిరీటాలు; సిత+ఆతపత్ర= తెల్ల గొడుగుల; విస్ఫుట= బాగుగ ప్రకాశించునట్టి; ఘనహేతి= గొప్ప కత్తులయొక్క; దీధితి= కాంతి; నభస్+మణిన్= సూర్యుణ్ణి; కప్పన్+కన్= అవరించివేయగా; తూర్యఘోషముల్= వాద్యాలధ్వనులు; చటుల= తీవ్రంగా చలిస్తున్న; తిమింగల= తిమింగలాలనే పెద్దచేపలతోకూడిన; ఊర్మి= అలలయొక్క; రవ= సవ్వడి; సాగరఘోషమున్= సముద్రంయొక్క ధ్వనిని; ఆక్రమింపన్+కన్= లోబరచుకోగా...

**తా :** చాపలు, వస్త్రాలు, రత్నకంబళ్లు, డేరాలు మొదలైనవి గల్గిన కుటీరాలు, మిక్కిలి ఉన్నతాలైన వింజామరల యొక్క ధ్వజాలూ, ధ్వజాలకు కట్టిన వస్త్రాలు, కిరీటాలు, తెల్లగొడుగులు, తళతళలాడే కత్తుల కాంతులు సూర్యకాంతిని అణచి వేస్తూ ఉండగా, వాద్యాల ధ్వనులు - తిమింగలాలు మొదలైన పెద్దపెద్ద చేపలతో ఎగిసిపడుతున్న చప్పుళ్లూ, అలల సవ్వడులూ కలిసి సముద్రం రణగొణధ్వనులతో విస్తరించగా

**క. కరిహరిరథసుభటసము, త్కరములు సేవింప మురవిదారుఁడు గడచెన్**
**సరిదుపవనదుర్గసరో, వరజనపదపురపుళిందవనగోష్ఠములన్. 683**

**ప్రతి :** కరిహరిరథ= ఏనుగుల, గుఱ్ఱాల, రథాల; సుభట= సుశిక్షితులైన సైనికుల; సముత్కరములు= సమూహాలు; సేవింపన్= కొలువగా; మురవిదారుఁడు= మురాసురుణ్ణి సంహరించిన శ్రీకృష్ణుడు; సరిత్= సెలయేళ్లను; ఉపవన= ఉద్యానవనాల్ని; దుర్గ= కోటలను; సరోవర= సరస్సులను; జనపద= జనులు నివసించే ఊళ్ళను; పుర= పట్టణాలను; పుళిందవన= కిరాతులు నివసించే వనాల్ని; గోష్ఠములన్= పశువుల కొట్టాలను; కడచెన్= దాటి వెళ్ళాడు.

**తా :** శ్రీకృష్ణుడు చతురంగబలాలు తనను కొలిచిరాగా ఏరులు, ఉద్యానవనాలు, దుర్గప్రదేశాలు, కొలంకులు, పల్లెపట్టులు; పట్టణాలు; కిరాతకులు నివసించే అడవులు, పశువుల కొట్టాలు దాటి వెళ్లాడు.

**వ. ఇట్లు గడచి చనుచు నానర్తకసౌవీరమరుదేశంబులు దాటి ఇందుమతిని దర్శించి, దృషద్వతి నుత్తరించి, సరస్వతీ నది దాఁటి మత్స్యవిషయంబులు లోనుగాఁగడచి యింద్రప్రస్థ నగరంబు డాయం జని, తత్పురోపకంఠవనంబున విడిసిన. 684**

**ప్రతి :** ఇట్లు+కడచి= ఈ విధంగా దాటి; చనుచున్= వెళ్లుతూ; ఆనర్తక సౌవీర మరుదేశంబులు= ఆనర్తకము, సౌవీరము, మరు అనే దేశాలు; దాటి= కడచి; ఇందుమతిని= ఇందుమతి అనే నదిని; దర్శించి= చూచి; దృషద్వతిన్= దృషద్వతి అనే నదిని; ఉత్తరించి= దాటి; సరస్వతీనది= సరస్వతీ నదిని; దాఁటి= దాటుకొని; మత్స్య విషయంబులు= మత్స్య దేశం; లోను+కాన్= మొదలైనవి; కడచి= దాటి; ఇంద్రప్రస్థనగరంబు= ఇంద్రప్రస్థమనే పట్టణము; డాయన్+చని= సమీపించి; తత్+పురోపకంఠ= ఆ పట్టణపు వెంబడి ఉన్న; వనంబునన్= తోటలో; విడిసినన్= దిగగానే...

**తా :** ఈ విధంగ ప్రయాణం చేస్తూ శ్రీకృష్ణుడు ఆనర్తక సౌవీర మరుదేశాలు దాటి, ఇందుమతి, దృషద్వతి, సరస్వతి అనే నదులను దాటి, మత్స్య దేశం మీదుగా ఇంద్రప్రస్థనగరంపొలిమేరల్లోని తోటలో దిగగా

## ❖ పాండవులు శ్రీకృష్ణు నెదుర్కొని తోడ్కొనిపోవుట ❖

**క. హరిరాక యెఱిఁగి ధర్మజు, డఱలేని ముదంబుతోడ ననుజులు బంధుల్**
**గురుజనసచివపురోహిత, పరిచారకకరిరథాశ్వభటయుతుఁ డగుచున్. 685**

**ప్రతి :** హరిరాక= శ్రీకృష్ణుడు వచ్చాడనే విషయాన్ని; ఎఱిఁగి= తెలుసుకొని; ధర్మజుఁడు= ధర్మరాజు; అఱలేని= కొఱతలేని; ముదంబుతోడన్= ఆనందంతో; అనుజులు= తమ్ములు; బంధుల్= బంధువులు; గురుజన= పూజ్యులగు పెద్దలతోడను; సచివ= మంత్రులతోను; పురోహిత= పురోహితుడైన ధౌమ్యునితోడను; పరిచారిక= సేవకులతోను; కరి రథ+ అశ్వభటయుతుఁడు+అగుచున్= ఏనుగులు, రథాలు, గుఱ్ఱాలు, పదాతి దళాలతో కూడినవాడై...

**తా :** శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థనగరం పొలిమేరలోని వనాలలో విడిసె నని తెలిసి ధర్మరాజు – తమ్ములు, చుట్టాలు, కుటుంబములోని పెద్దలు, పురోహితుడగు ధౌమ్యుడు, పరిచారక జనులు, చతురంగబలాలు తన వెంటరాగా

**క. చిందములు మొరయ గాయక, బృందంబుల నుతులు సెవుల బెరయఁగ భక్తిన్**
**డెందము దగులఁగఁ బరమా, నందంబున హరి నెదుర్కొనం జనుదెంచెన్. 686**

**ప్రతి :** చిందములు= శంఖములు; మొరయన్= మ్రోగగా; గాయక బృందంబుల= పాటలు పాడేవారి సమూహముల యొక్క; నుతులు= స్తుతి పాటలు; చెవుల బెరయన్+కన్= చెవుల్లో వ్యాపిస్తుండగా; భక్తిన్= భక్తిలో; డెందము= మనస్సు; తగులన్+కన్= లగ్నంకాగా; చనుదెంచెన్= వచ్చెను.

**తా :** శంఖాలు మ్రోయగా, గాయకులు పాడే పాటలు వింటూ కృష్ణుణ్ణి సేవించాలనుకొనే కోరిక మనస్సును నింపగా మిక్కిలి ఆనందంతో శ్రీకృష్ణుణ్ణి ఎదురేగి స్వాగతించుటకు ధర్మరాజు వచ్చాడు.

**వ. ఇట్లు చనుదెంచి ధర్మనందనుండు సమాగతుండైన సరోజనాభునిం బెద్దతడవు గాఢాలింగనంబు చేసి, రోమాంచకంచుకితశరీరుండై యానందబాష్పధారాసిక్త కపోలుండై నిర్భరానందకందళితహృదయుండై**

**బాహ్యంబు మఱచియుండె; నప్పుడు హరిని వాయునందనవాసవతనూభవులు గౌఁగిటం జేర్చి సమ్మదంబు నొందిరి; మాద్రేయులు దండప్రణామంబు లాచరించి; రంతఁ బుండరీకాక్షుండు విప్రవృద్ధజనంబులకు నమస్కారంబు చేసి, వారలు గావించు వివిధార్చనలం బరితుష్టుండై కేకయసృంజయాదిభూవిభుల మన్నించి సూతమాగధాదుల కనేకపదార్థంబు లొసంగి, చతురంగబలసమేతుండై వివిధమణితోరణాది విచిత్రాలంకృతంబు నతివైభవోపేతంబునైన పురంబు ప్రవేశించి రాజమార్గంబునం జనుచుండఁ బౌరకామిను లట్టి యెడ. 687**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; చనుదెంచి= వచ్చి; ధర్మనందనుండు= ధర్మరాజు; సమాగతుండు+ఐన= తమ పట్టణానికి వచ్చిన; సరోజనాభునిన్= శ్రీకృష్ణుణ్ణి; పెద్ద తడవు= చాలాసేపు; గాఢ+ఆలింగనంబుచేసి= గట్టిగా కౌగలించుకొని; రోమాంచ= గగుర్పాటుచేత; కంచుకిత= కవచంగా చేయబడిన; శరీరుండు+ఐ= శరీరం కలవాడై; ఆనందబాష్పధారాసిక్త= ఆనందముతో వచ్చిన కన్నీటిధారలతో తడిసిన; కపోలుండు+ఐ= చెక్కిళ్లు కలవాడై; నిర్భర+ఆనంద= భరింపలేని సంతోషంతో; కందళిత హృదయుండు+ఐ= వికాసం పొందిన హృదయం కలవాడై; బాహ్యంబు= బయటి ప్రపంచాన్ని; మఱచి+ఉండెన్= మరచి ఉన్నాడు; అప్పుడు= ఆ సమయంలో; హరినిన్= శ్రీకృష్ణుణ్ణి; వాయునందన వాసవ తనూభవులు= వాయునందనుడైన భీముడూ, ఇంద్రతనయుడైన అర్జునుడూ; కౌఁగిటన్+చేర్చి= కౌగిటిలో చేర్చుకొని; సమ్మదంబున్= మిక్కిలి ఆనందాన్ని; ఒందిరి= పొందారు; మాద్రేయులు= మాద్రికొడుకులయిన నకులసహదేవులు; దండప్రణామంబులు= సాగిలబడి మ్రొక్కుటలు; ఆచరించిరి= చేశారు; అంతన్= అంతట; పుండరీక+అక్షుండు= శ్రీకృష్ణుడు; విప్రవృద్ధజనంబులకున్= బ్రాహ్మణులకు, పెద్దలకు; నమస్కారంబు చేసి= నమస్కరించి; వారలు+కావించు= ఆ పెద్దలు బ్రాహ్మణులు చేసే; వివిధ+అర్చనలన్= బహువిధాలయిన మర్యాదలచే; పరితుష్టుండు+ఐ= మిక్కిలి ఆనందించినవాడై; కేకయ సృంజయ+ఆది= కేకయ, సృంజయాది దేశాల; భూవిభులన్= రాజులను; మన్నించి= ఆదరించి; సూత మాగధ+ఆదులకున్= సూతులు, మాగధులు మొదలైనవారికి; అనేకపదార్థంబులు+ఒసగి= చాలవస్తువుల్ని ఇచ్చి; చతురంగబలసమేతుండు+ఐ= రథ గజ తురగ పదాతిబలాలతో కూడినవాడై; వివిధ మణితోరణ+ఆది= నానావిధాలయిన రత్నమయములైన తోరణాలు మున్నగు; విచిత్ర+అలంకృతంబున్= వింత వింత అలంకారాలు చేయబడి; అతివైభవ+ఉపేతంబును+ఐన= మిక్కిలి వైభవంతో కూడుకున్న; పురంబు= పట్టణంలోనికి; ప్రవేశించి= చొచ్చి; రాజమార్గంబునన్= రాజవీథులలో; చనుచుండన్= వెళ్లుచుండగా; పౌరకామినులు= పురంలోని స్త్రీలు; అట్టి+ఎడన్= ఆ సమయంలో...

**తా :** ఆ రీతిగా ధర్మరాజు తమ్ము చూడవచ్చిన శ్రీకృష్ణునికి ఎదుర్కోలు చేసి, చాలసేపు గట్టిగా కౌగలించుకొని పులకించిన శరీరం గలవాడై, ఆనందబాష్పాలచే చెక్కిళ్లు తడిసిపోగా, మనస్సు సంతోషంతో సర్వాన్ని మరచిపోయిన స్థితిలో ఉన్నాడు. భీమార్జునులును శ్రీకృష్ణుణ్ణి కౌగలించుకొని సంతసం పొందారు. నకుల సహదేవులు శ్రీకృష్ణునికి సాగిలబడి మ్రొక్కి వారి దీవెనలు పొంది కేకయుడు, సృంజయుడు మున్నగు రాజులను సన్మానించి, తనతో కూడా వచ్చిన సూతులకు, మాగధులకు వివిధ బహుమానాలిచ్చి చతురంగబలాలతో కదిలి, వివిధరత్నతోరణాలతో అలంకరించిన ఆ ఇంద్రప్రస్థపట్టణంలో ప్రవేశించి రాజమార్గంలో ప్రయాణిస్తూ ఉండగా ఆ పట్టణంలోని స్త్రీలు - ఆ సమయంలో

**సీ. కొఱనెలపైఁ దోచు నిరులునాఁ జెలువొంది నొసలిపైఁ గురులు తుంపెసలు గునియ**
**హాటకమణిమయతాటంకరోచులు గండభాగంబుల గంతు లిడఁగ**

స్ఫురితవిద్రుమనిభాధరబింబరుచితోడ దరహాసచంద్రిక సరసమాడ
నొండొంటితో రాయు నుత్తుంగకుచకుంభములు మొగంబులకును బుటము లెగయ

**తే.** బడుగునడుములు వడఁకంగ నడుగు లిడఁగ, రవళిమెట్టెలు మణినూపురములు మొరయఁ
బొలుచు కచబంధములు భుజంబుల నటింపఁ, బయ్యెదలు వీడి యాడ సంభ్రమముతోడ. 688

**ప్రతి :** కొఱనెలపైన్= అరచందమామమీద; తోఁచు= కానవచ్చునట్టి; ఇరులునాన్= చీకట్లు అనునట్లు; చెలువు+ఒంది= అందగించి; నొసలిపైన్= నుదుటిపై; కురులు= (ముంగురులు); తుంపెసలు గునియన్= అల్లలాడుతుండగా; హాటకమణిమయ= బంగారమూ, మణులతో చేసిన; తాటంక= చెవికమ్మల; రోచులు= కాంతులు; గండభాగంబులన్= చెక్కిళ్లపై; గంతులు+ఇడన్+కన్= గంతులు వేస్తుండగా; స్ఫురిత= ప్రకాశించే; విద్రుమనిభ= పగడాల్ని పోలిన; అధరబింబ= దొండపండు వంటి పెదవుల; రుచితోడన్= కాంతితో; దరహాస చంద్రిక= చిరునవ్వు వెన్నెల; సరసము+ఆడన్= వినోదించగా; ఒండు+ఒంటితోన్= ఒకదానితో ఒకటి; రాయు= ఒరసుకొనునట్టి; ఉత్తుంగ కుచకుంభములు= ఎత్తయిన కుండలవంటి స్తనాలు; మొగంబులకును= ముఖాలపైకి; పుటములు+ఎగయన్= పైకి ఎగురుతుండగా; బడుగు= సన్నని; నడుములు= నడుములు; వడఁకంగన్= వణకుతుండగా; అడుగులు+ఇడన్+కన్= అడుగులు వేయగా; రవళి మట్టెలు= మువ్వల మట్టెలు; మణినూపురములు= మణులు తాపిన అందెలు; మొరయన్= మ్రోయగా; పొలుచు= ఒప్పినట్టి; కచబంధములు= జుట్టుముడులు; భుజంబులన్+నటింపన్= భుజాలమీద నాట్యమాడగా; పయ్యెదలు= పైటలు; వీడియాడన్= జారివ్రేలాడుతుండగా; సంభ్రమముతోడన్= తొట్రుపాటుతో...

**తా :** అరచందమామను ఆవరించిన చీకట్లవలె నొసళ్లపై అలకలు అల్లలాడగా, రత్నాలకమ్మలకాంతులు చెక్కిళ్లపై వ్యాపించగా; ఎఱ్ఱని పగడాలవలె, దొండపండ్లవలె పెదవులకాంతులతో చిరునవ్వు వెన్నెలలు వినోదింపగా, గబ్బిగుబ్బలు ముఖంవైపునకు నిక్కుతుండగ, కాలిమట్టెలఅందెలరవళులు మనోజ్ఞంగా ధ్వనిస్తూ ఉండగా, సన్నని నడుములు అల్లాడగా నడిచేటప్పుడు పైటలు జారుతుండగా, భుజాలపై వారి జుట్టు ముడులు నాట్యమాడగా తొందరతో

**వ.** ఇట్లు కృష్ణసందర్శన కుతూహల పరస్పరాహూయమానలై గురుపతి సుతబంధుజనంబులు వారింప నతిక్రమించి సమున్నతభర్మహర్మ్యశిఖరాగ్రంబు లెక్కి కృష్ణుం జూచి తమలో నిట్లనిరి. 689

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కృష్ణసందర్శన= శ్రీకృష్ణుణ్ణి దర్శించే; కుతూహల= తొందరతో కూడిన కోరికతో; పరస్పర+ఆహూయమానలు+ఐ= ఒకరిని ఒకరు పిలుచుకున్నవారై; గురు= తల్లిదండ్రులు; పతి= భర్తలు; సుత= కొడుకులు; బంధుజనంబులు= చుట్టాలు; వారింపన్= వద్దన్నను; అతిక్రమించి= వారిమాటను నిరాకరించి; సమున్నత= మిక్కిలి ఎత్తైన; భర్మ= బంగారంతో నిర్మించిన; హర్మ్య= మేడలయొక్క; శిఖర+అగ్రంబులు= పై భాగాలు; ఎక్కి= ఎక్కి; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; చూచి= దర్శించి; తమలోన్= తమలో తాము; ఇట్లు+అనిరి= ఈ విధంగా అనుకున్నారు.

**తా :** ఆ విధంగా పురస్త్రీలు శ్రీకృష్ణుణ్ణి చూడాలనే వేడుకతో ఒకరిని ఒకరు పిలుచుకొంటూ కదలి – తలిదండ్రులు, భర్తలు, కొడుకులు, చుట్టాలు మొదలైన తమవారంతా పోవద్దన్నా వినక వారిమాటను త్రోసిపుచ్చి, ఎత్తయిన బంగారు సౌధాల పై భాగాలపైకి ఎక్కి శ్రీకృష్ణుణ్ణి చూచి తమలో తాము ఇట్లు అనుకోసాగారు.

**సీ.** విశ్వగర్భుండునా వెలయు వే ల్పిల యశోదానందులకుఁ బ్రియసూనుఁ డయ్యె;
బ్రహ్మాదిసురలకు భావింపఁగా రాని బ్రహ్మంబు గోపాలబాలుఁ డయ్యె;

**వేదశాస్త్రంబులు వెదకి కానఁగలేని గట్టి వ్రేతల ఱోలఁ గట్టుపడియె;**
**దివిజుల కమృతంబు దవిలి యిచ్చిన భక్తసులభుండు నవనీతచోరుఁ డయ్యె**

**తే. నెనయఁ గమలాసతికిఁ జిత్తమీని వేల్పు, గొల్లయిల్లాండ్ర యుల్లముల్ పల్లవింపఁ**
**జేసె నని కామినులు సౌధశిఖరములను, గూడి తమలోన ముచ్చటలాడి రధిప! 690**

**ప్రతి :** అధిప!= ఓ రాజా!; విశ్వగర్భుండు నాన్= ఈ ప్రపంచమంతా కడుపులో గలవాడు; వెలయు వేల్పు= ప్రసిద్ధి పొందిన భగవానుడు; ఇలన్= ఈ భూమిపై; యశోదానందులకున్= యశోదాదేవి నందమహారాజులకు; ప్రియసూనుఁడు+ అయ్యెన్= ప్రియమైన కొడుకయ్యాడు; బ్రహ్మ+ఆది సురలకున్= బ్రహ్మ మొదలయిన దేవతలకు; భావింపన్+కాన్= తెలుసుకొనుటకు; రాని= శక్యంకాని; బ్రహ్మంబు= పరబ్రహ్మం; గోపాలబాలుఁడు+అయ్యెన్= గోవులను కాచే బాలుడుగా అయ్యాడు; వేదశాస్త్రంబులు= వేదాలు, శాస్త్రాలు; వెదకి= శ్రద్ధగా పరికించి; కానన్+కన్+లేని= తెలుసుకోలేనట్టి; గట్టి= గొప్పవాడు; వ్రేతల= గొల్లవాళ్లయొక్కఇల్లాండ్రు; ఱోలఁన్= ఱోటికి; కట్టుపడియెన్= కట్టివేయబడ్డాడు; దివిజులకున్= దేవతలకు; అమృతంబు= అమృతము; తవిలి= ప్రయత్నంతో పూనుకొని; ఇచ్చిన= ఇచ్చినట్టి; భక్తసులభుండు= భక్తుల యెడల వాత్సల్యంతో సులభంగా లభించేవాడు; నవనీతచోరుఁడు+అయ్యెన్= వెన్నలు దొంగలించే వాడయ్యాడు; ఎనయన్= లెక్కింపగా; కమలాసతికిన్= లక్ష్మీదేవికికూడా; చిత్తము+ఈని= మనస్సు అర్పించని; వేల్పు= భగవానుడు; గొల్ల+ఇల్లాండ్రు+అ= గొల్ల కుటుంబినుల, ఉల్లముల్= మనస్సులు; పల్లవింపన్= చిగురింపగా; చేసెన్+అని= చేశాడు అని; కామినులు= పురస్త్రీలు; సౌధశిఖరములను+కూడి= మేడల పై భాగంపై కలుసుకొని గుంపుగా కూడి; తమలోనన్= తమలో తాము; ముచ్చటలాడిరి= ముచ్చటించుకోసాగారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఇతడు ఈ విశ్వమునంతా తనగర్భంలో ఉంచుకున్నవాడైనా యశోదకు, నందునికి ప్రియపుత్రుడై మెలగాడు. బ్రహ్మ మొదలుగా గల దేవతలకు కూడా ఇట్టివాడని తెలియరానివాడు గొల్లపిల్లడై తిరుగాడాడు. వేదాలు, శాస్త్రాలు పరిశోధించికూడా కనుగొనలేని ఈ ఘనుడు గొల్లవారియింట రోటికి కట్టుబడ్డాడు. దేవతలకు పూనికతో అమృతము తెచ్చియిచ్చిన భక్తసులభుడైన దేవుడు వెన్నదొంగగా ప్రసిద్ధిపొందాడు. లక్ష్మీదేవికి కూడా మనస్సు ఈయని ఈ మహానుభావుడు గోపికా స్త్రీల మనస్సులు రంజింప చేశాడు గదా అంటూ ఆ పురస్త్రీలందరూ మేడలపై చేరి గుమిగూడి శ్రీకృష్ణుని గూర్చి ఒకరితో ఒకరు చెప్పుకోసాగారు.

**వ. మఱియును. 691**

**ప్రతి :** మఱియును= ఇంకనూ...

**సీ. గోపాలబాలురఁ గూడి యాడెడివాఁడు వ్రేపల్లెలోపల నేపు రేఁగి,**
**చల్ల లమ్మగఁ బోవుసతులకొంగులు పట్టి మెఱుఁగుఁజెక్కిళ్ళను మీటి మీటి,**
**కలికియై ముద్దాడిఁ గౌఁగిటఁ జేర్చిన పూఁబోఁడికుచములు పుణికి పుణికి**
**పాయనియనురక్తి డాయఁ జీరిన యింతి యధరసుధారసం బాని యాని**

**తే. యురుసమాధిపరాష్టాంగయోగయుక్తు, లైన యోగీశ్వరులు గాననట్టి జెట్టి**
**వల్లవీజనవనకల్పవల్లి యయ్యె, ననుచుఁ బొగడిరి కృష్ణు న య్యబ్జముఖులు. 692**

**ప్రతి :** గోపాలబాలురన్= గోపబాలురతో; కూడి+ఆడెడివాఁడు= కలిసి క్రీడించేవాడు; వ్రేపల్లె లోపలన్= గొల్లపల్లెలో; ఏపు రేఁగి= మిక్కిలి అతిశయించి; చల్లలు+అమ్మగన్+పోవు= మజ్జిగలు అమ్ముకోవడానికి పోతున్న; సతుల= స్త్రీలయొక్క; కొంగులు పట్టి= కొంగులు పట్టుకొని; మెఱుఁగు+చెక్కిళ్ళను= తళతళలాడే చెక్కిళ్లను; మీటి మీటి= నిమిరి నిమిరి; కలికి+ఐ= మనసుపడిందై; ముద్దాడి= ముద్దుపెట్టుకొని; కౌఁగిటన్+చేర్చిన= కౌగలించుకోగా; పూవు+పోఁడి= పువ్వువంటి శరీరంగల ఆ స్త్రీ; కుచములు= గుబ్బలు; పుణికి పుణికి= తడిమి తడిమి; పాయని+అనురక్తిన్= తొలగని అనురాగంతో; డాయన్= దగ్గరకు రాగా; చీరిన= పిలిచిన; ఇంతి= ఆ స్త్రీ యొక్క; అధరసుధారసంబు= మోవి అమృతాన్ని; ఆని+ఆని= త్రాగి త్రాగి; ఉరు= గొప్పవైన; సమాధిపర= సవికల్ప, నిర్వికల్పాలనే సమాధులయందాసక్తి గలిగి; అష్ట+అంగయోగ= యమం, నియమం మున్నగు ఎనిమిది యోగాలతో; యుక్తులు+ఐన= కూడుకొన్నవారైన; యోగీశ్వరులు= యోగులలో శ్రేష్ఠులు; కానన్+అట్టి= దర్శించలేని; జెట్టి= శూరుడు; వల్లవీజన= గోపికాజనముల; వనకల్పవల్లి+అయ్యెన్= వనానికి కల్పలత అయ్యాడు; అనుచు= అంటూ; ఆ+అబ్జముఖులు= ఆ పద్మాలవంటి ముఖాలు గల గోపికలు; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; పొగడిరి= కొనియాడారు.

**తా :** వ్రేపల్లెలో గోపబాలురతో కలసి ఆడుకొనే బాలకృష్ణుడు మజ్జిగలు అమ్ముకోవడానికి వెళ్లే గొల్లపడుచుల పైటలను లాగి, వారి చెక్కిళ్లను నొక్కి, అందగత్తె అయిన గోపిక తనను ముద్దులాడ చేరబిలిచి కౌగిలించగా ఆమె స్తనాలను పుణికి, ఎంతో ప్రేమతో చేరబిలిచిన స్త్రీని ముద్దాడి – బహుకాలం శ్రమకోర్చి అష్టాంగయోగం అభ్యసించి, సమాధి నిష్ఠులై ఉండే యోగీశ్వరులకు చిక్కని పరబ్రహ్మం గోపికల వనంలో కల్పవృక్షమా అనేటట్లు వర్తించాడని ఆ పురంలోని స్త్రీలు శ్రీకృష్ణుణ్ణి ప్రశంసించారు.

**మ. అని యిబ్భంగి సరోజలోచనలు సౌధాగ్రంబు లందుండి య**
**వ్వనజాతాక్షుని దివ్యమూర్తిఁ దమభావంబందుఁ గీలించి సం**
**జనితానందరసాబ్ధిమగ్న లగుచున్ సంప్రీతిఁ దద్భవ్య కీ**
**ర్తనలై చల్లిరి నవ్యలాజములు మందారప్రసూనావలుల్. 693**

**ప్రతి :** అని; ఈ+భంగిన్= ఈ విధంగా; సరోజలోచనలు= తామరలవంటి కన్నులుగల ఆ స్త్రీలు; సౌధ+అగ్రంబుల+అందున్+ఉండి= మేడలపై భాగంపై చేరి; ఆ+వనజాత+అక్షుని= ఆ పుండరీకాక్షుని; దివ్యమూర్తిన్= దివ్యమైన రూపాన్ని; తమ భావంబు+అందు= తమ తమ మనస్సులలో; కీలించి= నిలుపుకొని; సంజనిత= పుట్టినట్టి; ఆనందరస+అబ్ధిమగ్నలు+అగుచున్= ఆనందరస సాగరంలో మునిగిన వారవుతూ; సంప్రీతిన్= మిక్కిలి అనురాగంతో; తద్= ఆ శ్రీకృష్ణునికి సంబంధించిన; భవ్యకీర్తనలు+ఐ= గొప్పవైన కీర్తనలు గలవారై; నవ్య లాజములు= కొత్త పేలాలను; మందార ప్రసూన+ఆవలుల్= మందార కుసుమాలను; చల్లిరి= చల్లారు.

**తా :** ఈ విధంగా ఆ గోపికాస్త్రీలు మేడల పైభాగాలనుండి శ్రీకృష్ణుని దివ్యమైన స్వరూపాన్ని చూచి, ఎంతో అనురాగంతో ఆ మూర్తిని మనసులో నిలుపుకొని, సంతోషసాగరంలో మునిగి తేలుతూ, చాలా ప్రీతితో శ్రీకృష్ణచరిత్రను గానం చేస్తూ, క్రొత్తపేలాలను, మందారకుసుమాలను అతనిపై చల్లారు.

**వ. తదనంతరంబ శోభనపదార్థంబులు కొనివచ్చి ధరామరధరావరవణిక్పుంగవులు దామోదరునకు కానుక లిచ్చిరి. పుణ్యాంగనాజనంబులు పసిండిపళ్లెరంబులఁ గర్పూరనీరాజనంబులు నివాళింప నంతః**

**పురంబు సొత్తెంచె; నంతం గుంతిభోజనందనయుం గృష్ణునిం గని పర్యంకంబు డిగ్గి కౌఁగిలింప నా యదువల్లభుఁడు మేనత్తకుం బ్రణామం బాచరించెఁ; బాంచాలియు ముకుందునకు నభివందనం బొనరించి కుంతిపంపున గోవిందుభామినులగు రుక్మిణి మొదలగువారికి గంధాక్షతకుసుమతాంబూలంబు లిడి లలితదుకూలమణిభూషణంబులం బూజించె; యుధిష్ఠిరుండును గమల నయనుని వధూజనుల ననుగత బంధుమిత్రపుత్త్రసచివపురోహితపరిచారకసముదయంబుల నుచితంబులగు స్థలంబుల విడియింప నియమించి దినదినంబును నభినవంబులగు వివిధోపచారంబులు గావించుచుండె. 694**

**ప్రతి :** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; ధరా+అమర= బ్రాహ్మణులు; ధరావర= రాజులు; వణిజ్(క్)+పుంగవులు= వ్యాపారం చేయడంలో శ్రేష్ఠులైన వైశ్యులు; శోభనపదార్థంబులు= మంగళద్రవ్యాలను; కొనివచ్చి= తీసుకువచ్చి; దామోదరునకున్= శ్రీకృష్ణునికి; కానుకలు= బహుమానాలు; ఇచ్చిరి= సమర్పించారు; పుణ్య+అంగనాజనంబులు= ముత్తైదువలు; పసిండి పళ్లెరంబులన్= బంగారు పళ్లెరాలలో; కర్పూర నీరాజనంబులు= కర్పూరపు హారతులు; నివాళింపన్= సమర్పించగా; అంతఃపురంబు+చొత్తెంచెన్= అంతఃపురంలోనికి వచ్చాడు; అంతన్= అప్పుడు; కుంతి భోజనందనయున్= కుంతీదేవియు; కృష్ణునిన్+కని= శ్రీకృష్ణుణ్ణి చూచి; పర్యంకంబు= మంచము; డిగి= దిగి; కౌగిలింపన్= ఆలింగనం చేసుకోగా; ఆ యదువల్లభుఁడు= ఆ యదువంశప్రభువగు శ్రీకృష్ణుడు; మేన+అత్తకున్= మేనత్త అయిన కుంతికి; ప్రణామంబు+ఆచరించెన్= నమస్కారం చేశాడు; పాంచాలియున్= పాంచాలరాజపుత్రియైన ద్రౌపదికూడా; ముకుందునకున్= శ్రీకృష్ణునికి; అభివందనంబు+ఒనరించి= నమస్కరించి; కుంతిపంపునన్= అత్తగారగు కుంతీదేవి ఆదేశంమేరకు; గోవిందు భామినులు+అగు= శ్రీకృష్ణుని భార్యలైన; రుక్మిణి మొదలగువారికిన్= రుక్మిణీదేవి మొదలగువారికి; గంధ+అక్షత కుసుమతాంబూలంబులు= చందనం; అక్షతలు, పువ్వులు, తాంబూలాలు; ఇడి= ఇచ్చి; లలిత దుకూల మణిభూషణంబులన్= మనోహరమైన వస్త్రాలతోను, రత్నాభరణాలతోను; పూజించెన్= గౌరవించారు; యుధిష్ఠిరుండును= ధర్మరాజుకూడా; కమలనయనుని వధూజనులన్= శ్రీకృష్ణునిభార్యలను; అనుగత= కృష్ణునితో కూడా వచ్చిన; బంధు= బంధువుల; మిత్ర= స్నేహితుల; పుత్ర= కొడుకుల; సచివ= మంత్రుల; పురోహిత= పురోహితుల; పరిచారక= సేవకుల; సముదయంబులన్= సమూహాలను; ఉచితంబులు+అగు స్థలంబులన్= తగినట్టి తావులలో; విడియింపన్= ఉండడానికి; నియమించి= ఏర్పాటు గావించి; దినదినంబును= రోజురోజుకు; అభినవంబులు+అగు= క్రొత్తక్రొత్తవయిన; వివిధ+ ఉపచారంబులు= రకరకముల సేవలు; కావించుచున్+ఉండెన్= చేస్తూ ఉన్నాడు.

**తా :** ఆ తరువాత – బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు తమతమ స్థాయికి తగురీతిలో మంగళకరమగు వస్తువులను తెచ్చి, శ్రీకృష్ణునకు కానుకలుగా సమర్పించారు. ముత్తైదువలు బంగారుపళ్లెరాలలో కర్పూరపుహారతుల్ని ఇచ్చారు. కృష్ణుడు ఆ మర్యాదలను ప్రీతితో స్వీకరిస్తూ అంతఃపురంలోనికి ప్రవేశింపగా అచట పానుపుపైనున్న కుంతీదేవి లేచి పాన్పుదిగి వచ్చి మేనల్లుని కౌగలించుకొని ఆదరింపగా శ్రీకృష్ణుడును మేనత్తయగు కుంతికి సాగిలపడి మొక్కాడు. ద్రౌపది శ్రీకృష్ణునికి నమస్కరించింది. తన అత్తగారగు కుంతీదేవి చెప్పిన విధంగా రుక్మిణి మొదలైన శ్రీకృష్ణుని భార్యలకు గంధపుష్పాదులు, మనోహరాలైన వస్త్రాలు, రత్నమయాలైన ఆభరణాలు ఇచ్చి అర్చించింది. ధర్మరాజుకూడా శ్రీకృష్ణునిభార్యలను, కృష్ణునితో కూడా వచ్చిన చుట్టాలను, మిత్రులను, పరిచారకలను గౌరవించి, వారివారికి తగిన విడిదిగదులు ఏర్పాటుచేసి, ఏ రోజుకారోజు వారందరికీ క్రొత్తక్రొత్తవైన సేవలు చేయిస్తూ వచ్చాడు.

**క. హరియు యుధిష్ఠిరసముచిత, పరిచర్యల కాత్మ నలరి పార్థుఁడు దానున్**
**సరసవిహారక్రియలను, సురుచిరగతిఁ గొన్నినెలలు సుఖ ముండె నృపా! 695**

**ప్రతి :** నృపా!= ఓరాజా!; హరియున్= శ్రీకృష్ణుడును; యుధిష్ఠిరసముచితపరిచర్యలకున్= ధర్మరాజు చేసిన తగిన ఉపచారాలకు; ఆత్మన్= మనస్సులో; అలరి= సంతోషించి; పార్థుఁడున్= అర్జునుడూ; తానున్= తానును; సరస విహారక్రియలను= సరసమైన వినోద కార్యక్రమాలతో; సురుచిరగతిన్= మనోజ్ఞమైన విధంగా; కొన్ని నెలలు= కొన్ని నెలలు; సుఖము+ఉండెన్= సుఖంగ అక్కడ ఉన్నాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుడుకూడా ధర్మరాజు చేసే వివిధాలైన ఉపచారాలకు మనసులో ఆనందించి, అర్జునుడితో పాటు తాను వినోదంగా సంచరిస్తూ కొన్నినెలలు సుఖంగా ఇంద్రప్రస్థపురంలో గడిపాడు.

**వ. అంత 696**

**తా :** అంతట

## ❖ ధర్మరాజు శ్రీకృష్ణు ననుమతంబున భీమాదుల దిగ్విజయమునకుఁబంపుట ❖

**సీ. ధరణీశ! యొకనాఁడు ధర్మతనూజుండు ప్రవిమలనిజసభాభవనమందు**
**హితులు మంత్రులు పురోహితులును సుతులును మిత్రులు బంధువుల్ క్షత్రవరులుఁ**
**బరిచారకులు సూత పాఠక కవి బుధవరులును మునులును వరుసఁ గొలువఁ**
**జిరలీల నవరత్నసింహాసనస్థుఁడై గొలువుండి వినతుఁడై నలిననాభు**

**తే. భువనరక్షణదక్షు నద్భుతచరిత్రు, యదుకులేశ్వరు మురదైత్యమదవిభేది**
**నాప్తు నయవేదిఁ జతురుపాయప్రవీణుఁ, జూచి, యిట్లని పలికె నస్తోకచరిత! 697**

**ప్రతి :** ధరణి+ఈశ= ఓ మహారాజా!; అస్తోకచరిత్ర= గొప్పనడవడి కలవాడా!; ఒకనాఁడు= ఒకరోజు; ధర్మతనూజుండు= ధర్మరాజు; ప్రవిమల నిజసభాభవనము+అందు= నిర్మలమైన తన సభామండపంలో; హితులు= హితంగోరే ఆప్తులు; మంత్రులు= మంత్రులు; పురోహితులును= పురోహిత బ్రాహ్మణులును; సుతులును= కొడుకులు; మిత్రులు= స్నేహితులు; బంధువుల్= చుట్టాలు; క్షత్రవరులున్= రాజశ్రేష్ఠులు; పరిచారకులు= సేవకులు; సూత= వంశావళిని చెప్పేవారు; పాఠక= పాటలు, బిరుదుగద్యలు పాడేవారు; కవిబుధవరులును= కవివరులూ, పండితోత్తములును; మునులును= మునులును; వరుసన్= వరుసగా; కొలువన్= సేవింపగా; చిరలీలన్= శాశ్వతమైన విలాసంతో; నవరత్నసింహ+ఆసనస్థుఁడు+ఐ= నవరత్నాలు తాపిన సింహాసనంపై కూర్చున్నవాడై; కొలువు+ఉండి= కొలువుదీరి; వినతుఁడు+ఐ= మిక్కిలి అణకువతో; నలిననాభున్= నాభియందు కమలంగలవాణ్ణి (శ్రీకృష్ణుణ్ణి); భువనరక్షణదక్షున్= పదునాల్గు భువనాలను రక్షించగల శక్తిమంతుణ్ణి; అద్భుత చరిత్రున్= ఆశ్చర్యాన్ని గొల్పే నడవడి గలవాణ్ణి; యదుకుల+ఈశ్వరున్= యదువంశ ప్రభువును; మురదైత్యమదవిభేదిన్= మురాసురుని మదాన్ని కూల్చినవాణ్ణి; ఆప్తున్= తమకు మిక్కిలి కావలసినవాణ్ణి; నయవేదిన్= నీతిని బాగుగ తెలిసినవాణ్ణి; చతుర్+ఉపాయ ప్రవీణున్= సామదానభేదదండాలనే నాల్గురకాలైన ఉపాయాలలో నేర్పరిని; చూచి= అయిన కృష్ణుణ్ణి చూచి; ఇట్లు+అని పలికెన్= ఈ విధంగా చెప్పాడు.

**తా :** గొప్ప నడవడిగల ఓ పరీక్షిన్మహారాజా! ఒకనాడు ధర్మరాజు నిర్మలమైన తన సభామండపంలో ఆప్తులు, పురోహితులు, చుట్టాలు, మంత్రులు, మునులు, కవీశ్వరులూ, పండితోత్తములు వచ్చి ఉండగా - కమలనాభుడు, అద్భుతచరిత్రుడు, మురారి, యదువంశశ్రేష్ఠుడు, నీతిమంతుడు, సామదానభేద దండోపాయాలను ప్రయోగించటంలో నేర్పరి అయిన కృష్ణుడు కొలువుదీని ఉన్నాడు. అపుడు తమకు అత్యంత ఆప్తుడైన శ్రీకృష్ణుణ్ణి చూచి ఇలా పలికాడు.

**తే. అనఘచారిత్ర! రాజసూయాధ్వరంబు, నెమ్మిఁ గావించువేడుక నెమ్మనమున**
**నెనయుచున్నది యది నిర్వహింప నీవ, కాక నా కాత్మబంధువుల్ గలరె యొరులు? 698**

**ప్రతి :** అనఘచారిత్ర! = పాపంలేని చరిత్రగలవాడా! పుణ్యాత్ముడా!; రాజసూయ+అధ్వరంబున్ = రాజసూయమనే గొప్ప యాగాన్ని; నెమ్మిన్ = ప్రీతితో; కావించు = చేయాలనే; వేడుక = కోరిక; నెఱ+మనమునన్ = నిండు మనస్సులో; ఎనయుచున్+ఉన్నది = కలుగుతూంది; అది = ఆ యాగం; నిర్వహింపన్ = నడిపించడానికి; నీవు+అ+కాక = నీవుకాక; నాకున్ = నాకు; ఆత్మబంధువుల్ = ఆత్మీయులైనచుట్టాలు; ఒరులు = ఇతరులు; కలరె? = ఉన్నారా? (లేరని భావం)

**తా :** పుణ్యచరిత్రుడవైన ఓ కృష్ణా! నాకు రాజసూయయాగం చేయాలనే కోరిక మనస్సులో కలిగింది కనుక, యాగం నెఱవేర్చుటకు నీవు కాక నాకు కావలసినచుట్టాలు మరెవరు లేరుకదా! నీవే దాన్ని నడిపించాలి.

**ఉ. ఎవ్వరు నీ పదాంబుజము లెప్పుడుఁ గొల్తురు భక్తినిష్ఠులై**
**యెవ్వరు నిన్నుఁ బ్రేమ నుతియింతురు భూరివివేకశాలురై**
**యవ్విమలాత్ము లందుదు రుదంచితశోభననిత్యసౌఖ్యముల్**
**నివ్వటిలంగఁ గృష్ణ! నిను నేర్చి భజించిన రిత్తవోవునే? 699**

**ప్రతి :** కృష్ణ! = ఓ శ్రీకృష్ణా!; ఎవ్వరు = ఏ జనులు; నీ పద+అంబుజములు = నీ పాదపద్మాలు; భక్తినిష్ఠులు+ఐ = అనన్యమైన భక్తి కలవారై; ఎప్పుడున్ = సర్వకాలాల్లో; కొల్తురు = సేవించెదరో!; ఎవ్వరు = ఏ జనులు; నిన్నున్ = నిన్ను; భూరివివేకశాలురు+ఐ = అధికమైన వివేకంతో కూడినవారై; ప్రేమన్ = ప్రేమతో; నుతియింతురు = పొగడుతారో!; ఆ+విమల+ఆత్ములు = అటువంటి నిర్మలమైన మనస్సు ఉండేవాళ్ళు; ఉత్+అంచిత శోభన = మిక్కిలి గొప్పవైన శుభాలూ; నిత్యసౌఖ్యముల్ = శాశ్వతమైన సుఖాలూ; నివ్వటిలన్+కన్ = నెరవేరేటట్లుగా; అందుదురు = పొందుతారు; నినున్ = నిన్ను; నేర్చి = కొలువదగిన విధాన్ని తెలుసుకుని; భజించినన్ = కొలిచిన ఎడల; రిత్త+పోవునే? = వృథాగా పోవునా? (పోదని భావం)

**తా :** శ్రీకృష్ణా! ఏ జనులు నీ పాదకమలసేవ నిత్యమూ చేస్తుంటారో, ఏ మానవులు నిన్ను సదా పొగడుతుంటారో; అట్టి నిర్మలమనస్కులు అధికమైన శుభాలూ, సుఖాలూ కొరత లేకుండ పొందుతారు. నిన్ను గూర్చి తెలిసి, నిన్ను అర్చించేవారికి ఫలాలు లభించకుండా ఆ అర్చన వృథాగా పోతుందా? (పోదని భావం)

**వ. అనినఁ గృష్ణుండు ధర్మనందనున కిట్లనియె 700**

**ప్రతి :** అనినన్ = అని చెప్పగా; కృష్ణుండు = శ్రీకృష్ణుడు; ధర్మనందనునకున్ = ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్ = ఈ విధంగా చెప్పాడు.

**తా :** ధర్మరాజు ఆ విధంగా చెప్పగా శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇలా అన్నాడు.

చ. **నయగుణశాలి! పాండునృపనందన! నీ తలఁ పొప్పు నీ క్రతు**
**క్రియ మునిదేవతాపితృసుకృత్యమునై నిఖిలోగ్రశాత్రవ**
**క్షయమును బాంధవప్రియము సంచితపుణ్యము నిత్యకీర్తియున్**
**జయము నొసంగు దీనిఁ గురుసత్తమ! వేగ యుపక్రమింపవే! 701**

**ప్రతి :** నయగుణశాలి! నీతిచేతను, గుణములచేతను ఒప్పునట్టివాడా!; కురుసత్తమ!= కురువంశ శ్రేష్ఠుడవైన ఓ ధర్మరాజా!; పాండు నృపనందన!= పాండురాజపుత్రుడవయిన ధర్మరాజా!; నీతలఁపు+ఒప్పున్= నీవు తలంచిన పని తగినట్టిది; ఈ క్రతుక్రియ= నీవు చేసే ఈ యాగ కార్యక్రమం; ముని దేవతా పితృ= మునులకు, దేవతలకు, పితృదేవతలకు; సుకృత్యమును+ఐ= ఉత్తమమయిన పనియై; నిఖిల+ఉగ్రశాత్రవ= భయంకరమైన శత్రువులందరియొక్క; క్షయమునున్= నాశనాన్ని; బాంధవప్రియమునున్= బంధువులకు ప్రీతిని; సంచితపుణ్యమున్= కూడబెట్టిన పుణ్యాన్ని; నిత్యకీర్తియున్= శాశ్వతమయిన కీర్తిని; జయమున్= గెలుపును; ఒసంగున్= ఇస్తుంది; వేగ= శీఘ్రంగా; దీనిన్= దీన్ని (ఈ యాగాన్ని); ఉపక్రమింపుము+ఏ= ప్రారంభించుమా!

**తా :** మేలైన నీతిశాస్త్ర విషయాలు తెలిసిన, గుణవంతుడవైన, కురుశ్రేష్ఠుడవైన, పాండురాజు తనయుడవైన ఓ ధర్మరాజా! నీవు తలపెట్టిన ఈ యజ్ఞం మునులకు, దేవతలకు, పితృదేవతలకు మంచి కార్యక్రమమై, భయంకరమైన శత్రువులకు నాశకారకమై, బంధువులకు ప్రీతికరమై, పుణ్యవంతమై, జయకరమై, నీకు యశస్కరమై నట్టిది కనుక ఈ కార్యాన్ని వెంటనే ప్రారంభించవలసింది.

క. **మనుచరిత! నీ సహోదరు, లనుపమదివ్యాస్త్రవేదు లాహవభూమిం**
**జెనకిన వైరినృపాలురఁ, దునుమఁగఁ జాలుదురు శౌర్యదుర్దమభంగిన్. 702**

**ప్రతి :** మనుచరిత!= మనువు నడవడిక వంటి నడవడిక గలవాడా!; నీ సహ+ఉదరులు= నీ తోడబుట్టిన మీ తమ్ములు; అనుపమ= సాటిలేని; దివ్య+అస్త్రవేదులు= దివ్యమైన అస్త్రవిద్య తెలిసినవారు; ఆహవభూమిన్= యుద్ధరంగంలో; చెనకిన= ఎదిరించిన; వైరినృపాలురన్= శత్రురాజులను; శౌర్యదుర్దమభంగిన్= శూరత్వం చేత అణప శక్యంగాని రీతిలో; తునుమన్+ కన్= చంపడానికి; చాలుదురు= సమర్థులు అవుతారు.

**తా :** ఓ ధర్మరాజా! నీ తమ్ములు సాటిలేని దివ్యమైన అస్త్రవిద్యలు తెలిసినవారు. యుద్ధభూమిలో ఎదిరించిన శత్రురాజుల్ని తమ శౌర్యంతో అనాయాసంగా సంహరించి నీకు విజయాన్ని చేకూర్చగల సమర్థులు.

క. **గెలువుము విమతనృపాలుర, వెలయుము బుధవినుతమైన విశ్రుతకీర్తిన్**
**నిలుపుము నిఖిలధరా మం, డలిని భవచ్ఛాసనము దృఢంబుగఁ జెల్లన్. 703**

**ప్రతి :** విమతనృపాలురన్= శత్రురాజుల్ని; గెలువుము= జయించుము; బుధ= దేవతలచేత; వినుతము+ఐన= కొనియాడబడునట్టి; విశ్రుతకీర్తిన్= ప్రసిద్ధికెక్కిన యశస్సుతో; వెలయుము= ప్రకాశించుము; నిఖిల ధరామండలినిన్= ఈ భూమండలాన్నంతటినీ; భవత్+శాసనము= నీయొక్క ఆజ్ఞ; దృఢంబు+కన్= గట్టిగా; చెల్లన్= చెల్లేటట్లుగా; నిలుపుము= స్థాపించుము.

**తా :** ఓ ధర్మరాజా! నీవు నీ శత్రురాజుల నందరిని జయించి, దేవతలు ప్రశంసించే విధంగా నిర్మలమైన కీర్తి లోకమంతటా వ్యాపింపజేసి, ఈ భూమండలం అంతటా నీ ఆజ్ఞ చెల్లుబడి అయ్యేటట్లుగా స్థిరపరచు.

**క. నీ పంచుకార్య మొరులం, జూపక యేఁ జేయ నిన్ను జుట్టన వ్రేలం**
**జూపఁగ వచ్చునె! సకల ధ, రాపతులకు నీకుఁ జేయరానిది గలదే!. 704**

**ప్రతి :** నీ పంచుకార్యము= నీవు నియోగించే కార్యం; ఒరులన్= ఇతరుల్ని చేయవలసిం దని; చూపక= చూపకుండా (చెప్పకుండా); ఏన్= నేనే; చేయన్= చేస్తూండగా; సకల ధరాపతులకున్= రాజులందరికి; నిన్నున్= నిన్ను; చుట్టనవ్రేలన్= చూపుడు వ్రేలితో; చూపన్+కన్ వచ్చున్+ఎ?= ఇత డిలాంటివాడని వేలెత్తి చూపగలరా?

**తా :** ఓ ధర్మరాజా! నీవు చెప్పిన పనిని ఇతరులకు చెప్పక నేనే స్వయంగా చేస్తుండగా, లోకంలోని రాజులలో ఎవ్వరు నిన్ను ఏ విషయంలోనైనా వేలెత్తి చూపగలరా? నీకు చేయశక్యంగాని పని ఏముంది గనుక?

**వ. కావున. 705**

**ప్రతి :** కావున= అందువలన...

**క. విమలమతి నిట్టి మఖ రా, జమునకుఁదెప్పింపవలయు సంభారంబుల్**
**సమకూర్పుము; నీ యనుజుల, సమదగతిం బంపు నిఖిలశత్రుల గెల్వన్. 706**

**ప్రతి :** విమలమతిన్= నిర్మలమైన బుద్ధితో; ఇట్టి మఖరాజమునకున్= ఇటువంటి శ్రేష్ఠమైన యజ్ఞానికి; తెప్పింపవలయు= తెప్పించవలసిన; సంభారముల్= వివిధ వస్తువుల్ని; సమకూర్పుము= తెప్పించి ఉంచండి; నీ అనుజులన్= నీ తమ్ముళ్లను; నిఖిలశత్రులన్= పగవారినందరను; గెల్వన్= జయించునట్లు; సమదగతిన్= అమిత (దర్పంతో); పంపు= పంపుము.

**తా :** నిర్మలమైన మనస్సుతో ఈ గొప్ప యజ్ఞాన్ని చేయడానికి కావలసిన అనేక వస్తుసంభారాలను తెప్పించు. నీ తమ్ముళ్లను లోకంలోని శత్రురాజులందరినీ (దర్పంతో) జయించి రమ్మని పంపు.

**క. అను మాటలు విని కుంతీ, తనయుఁడు మోదమునఁ బొంగి తామరసాక్షున్**
**వినుతించి శౌర్యకలితుల, యనుజుల దెసఁ జూచి పలికె హర్షముతోడన్. 707**

**ప్రతి :** అను మాటలు, విని= శ్రీకృష్ణుడు చెప్పిన ఆ మాటలు విని; కుంతీ తనయుఁడు= ధర్మరాజు; మోదమునన్= ఆనందంతో; పొంగి= ఉప్పొంగినవాడై; తామరస+అక్షున్= కమలనేత్రుడైన కృష్ణుణ్ణి; వినుతించి= పొగడి; హర్షముతోడన్= సంతోషంతో; శౌర్య కలితుల= శూరులైన; అనుజుల దెసన్= తమ్ములవైపు; చూచి పలికెన్= చూచి ఇలా చెప్పాడు.

**తా :** శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు విని ధర్మరాజు ఆనందంతో ఉప్పొంగి, కృష్ణుణ్ణి పొగడి, సంతోషితస్వాంతుడై మిక్కిలి శూరులైన తన తమ్ములవైపు చూచి ఇలా పలికాడు.

**క. సృంజయభూపాలకులును, గుంజరరథవాజిసుభటకోటులు నినుఁ గొ**
**ల్వం జను మని సహదేవుని, నంజక పొ మ్మనియె దక్షిణాశ జయింపన్. 708**

**ప్రతి :** సృంజయ భూపాలకులును= సృంజయదేశపురాజులును; కుంజర రథ వాజి సుభటకోటులు= ఏనుగులు, రథాలు, గుఱ్ఱాలు, కాలిబంట్ల సమూహం; నినున్= నిన్ను; కొల్వన్+చనుము+అని= సేవిస్తూ నీ వెంటరాగా బయలుదేరుము అని; సహదేవునిన్= తన చిన్నారితమ్ముడైన సహదేవుణ్ణి; అంజక= వెనుకాడక; దక్షిణ+ఆశన్= దక్షిణదిక్కును; జయింపన్= జయించడానికి; పొమ్ము+అనియెన్= పంపించాడు.

**తా :** సృంజయ దేశపురాజులు తగిన చతురంగ బలాలతో నిన్ను సేవిస్తుండగా, నీవు దక్షిణ దిక్కును జయించి రమ్మని ధర్మరాజు తన చిన్న తమ్ముడైన సహదేవుణ్ణి పంపించాడు.

**క. ప్రకటచతుర్విధసేనా, ప్రకరంబులు గొలువఁ బంచెఁ బడమటిదిశకున్**
**నకులున్ విదళితరిపుభూ, పకులున్ శౌర్యంబు మెఱసి పార్థివముఖ్యా! 709**

**ప్రతి :** పార్థివముఖ్యా!= ఓ రాజశ్రేష్ఠుడా!; ప్రకట= ప్రసిద్ధమైన; చతుర్+విధసేనా ప్రకరంబులు= నాల్గు విధాలైన రథ–గజ–అశ్వ–పదాతి సేనాసమూహాలు; కొలువన్= సేవింపగా; పడమటి దిశకున్= పడమటి దిక్కునకు; విదళిత= నరకబడిన; రిపు భూపకులున్= శత్రురాజులు గల; నకులున్= నకులుడనే; సోదరునిన్= తమ్ముణ్ణి; శౌర్యంబు= శూరత్వం; మెఱసి= ప్రకాశించేటట్లుగా; పంచెన్= పంపాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ధర్మరాజు ఏనుగులు, రథాలు, గుఱ్ఱాలు, కాలిబంట్లు అనే నాల్గు విధాలైన సేనలతో శత్రువులనందరినీ నఱికివేయగలవాడైన నకులుణ్ణి శూరత్వం మెఱిసేటట్లుగా పడమటి దిక్కును గెలువమని పంపాడు.

**క. దుర్జనభంజను శౌర్యో, పార్జితవిజయప్రకాండు నాహవనిపుణు**
**న్నర్జునమహితయశోనిధి, నర్జును నుత్తరపుదిశకు ననిచె నరేంద్రా! 710**

**ప్రతి :** నర+ఇంద్రా!= రాజులలో శ్రేష్ఠుడవైన పరీక్షిన్మహారాజా!; దుర్జనభంజనున్= దుర్మార్గుల్ని సంహరించేవాడు; శౌర్య+ఉపార్జిత= తన శూరత్వంచేత సంపాదించుకున్న; విజయ ప్రకాండున్= గెలుపుల సమూహాలు కలవాడు; ఆహవనిపుణున్= యుద్ధం చేయుడంలో నేర్పరి అయిన; అర్జున మహిత యశోనిధిన్= స్వచ్ఛమైనది తెల్లనిది అయిన గొప్ప కీర్తికి నిధియైన; అర్జునున్= అర్జునుణ్ణి; ఉత్తరపుదిశకున్= ఉత్తరదిక్కుకు; అనిచెన్= పంపాడు.

**తా :** ఓ రాజా! దుష్టులను భంగపెట్టేవాడు, తన శౌర్యంతో ఆర్జించిన విజయపరంపరలు గలవాడు, యుద్ధవిద్యయందు నేర్పరి. స్వచ్ఛమైన గొప్పకీర్తి గలవాడు అయిన అర్జునుణ్ణి ఉత్తరదిక్కు జయించడానికి పంపాడు.

**ఆ. మహితశౌర్యనిధులు మత్స్యకేకయ మద్ర, భూతలేంద్రబలసమేతముగను**
**దర్పమొప్పఁ బంచెఁ దూర్పుదిక్కునకు ను, ద్దామనిహతవైరిధాము భీము. 711**

**ప్రతి :** మహిత శౌర్యనిధులు= గొప్పశౌర్యానికి నిధులైనవారు; మత్స్య= మత్స్యదేశంయొక్క; కేకయ= కేకయ దేశంయొక్క; మద్ర= మద్రదేశంవారైన; భూతల+ఇంద్ర= రాజులయొక్క; బలసమేతముగను= బలాలతో కూడి; దర్పము= గర్వం; ఒప్పన్= ఒప్పునట్లుగా; ఉద్దామ= ఎక్కువగా; నిహత= చంపబడిన; వైరి= శత్రువులయొక్క; ధామున్= తేజస్సులు గలవాణ్ణి; భీమున్= భీమసేనుణ్ణి; తూర్పుదిక్కునకున్= తూర్పుదిక్కుకు; పంచెన్= పంపాడు.

**తా :** గొప్ప శౌర్యోపేతులైన మత్స్య, కేకయ, మద్రదేశపు రాజులయొక్క సేనలను కూడుకొని, తన శౌర్య వీర్య ప్రతాపాలకు తగినట్లుగా – అనేక వీరులను చంపి, వారి తేజస్సు హరించిన భీమసేనుణ్ణి తూర్పుదిక్కులోని రాజులను జయించడానికి పంపాడు.

**చ. పనిచిన వార లేగి ఘనబాహుపరాక్రమవిక్రమంబుల**
**న్ననుపమశౌర్యులైన చతురంతమహీశుల నోర్చి కప్పముల్**
**కనకవినూత్నరత్నతురగప్రముఖాఖిలవస్తుజాతముల్**
**గొని చనుదెంచి ధర్మజునకుం బ్రణమిల్లి యుదాత్తచిత్తులై., 712**

**ప్రతి :** పనిచినన్= పంపగా; వారలు+ఏగి= వారువెళ్లి; ఘన బాహుపరాక్రమ= గొప్పదైన భుజపరాక్రమంచేత; విక్రమంబులన్= విశేషమైన ప్రతాపంతోను; అనుపమ= సాటిలేని; శౌర్యులైన= పరాక్రమంగల వారైన; చతుర్+అంత మహీ+ఈశులన్= నాల్గు దిక్కులలోని రాజులను; ఓర్చి= జయించి; కనక= బంగారు; వినూత్న= మిక్కిలి కొత్తవైన; రత్న= రత్నాలు; తురగ= గుఱ్ఱాలు; ప్రముఖ= మొదలైన ప్రసిద్ధి పొందిన; అఖిల వస్తుజాతముల్= సమస్త వస్తువుల సముదాయాలను; కప్పముల్= కప్పములుగా; కొని= తీసుకొని; చనుదెంచి= వచ్చి; ఉదాత్తచిత్తులు+ఐ= గంభీరమైన మనస్సులు గలవారై; ధర్మజునకున్= ధర్మరాజుకు; ప్రణమిల్లి= నమస్కరించి...

**తా :** అట్లు పంపగా ధర్మజుని తమ్ములైన భీమార్జున నకులసహదేవులు తమ తమ భుజబలాల్నీ ప్రతాపాన్నీ ప్రకాశింపజేసి, ఎంతో శూరులైన నాల్గుదిక్కుల్లోని రాజుల్ని గెలిచి వారినుండి ధనం, రత్నాలు, గుఱ్ఱాలు మొదలైన ప్రముఖవస్తువుల నన్నింటినీ కప్పములుగా స్వీకరించి, గాంభీర్యంతో కూడిన మనస్సు గలవారై వచ్చి, ధర్మరాజుకు నమస్కరించారు.

**చ. తమతమ పోయి వచ్చినవిధంబుల భూపతులన్ జయించుటల్**
**క్రమముగఁ జెప్ప నందుల జరాతనయుం డరివెట్టఁ డయ్యె నం**
**చమరవరేణ్యనందనుఁ డహంకృతి దక్కఁగ విన్నవించినన్**
**యమసుతుఁ డూరకుండె వికలాత్మకుఁడై విని యంతఁ గృష్ణుఁడున్. 713**

**ప్రతి :** తమ తమ పోయివచ్చిన= తమయొక్క దిగ్విజయాలకు వెళ్లి వచ్చిన; విధంబులు= విధానాలూ; భూపతులన్= రాజులను; జయించుటల్= గెలవడం; క్రమమునన్= వరుసగా; చెప్పన్= చెప్పగా; అందులన్= ఆ రాజులలో; జరా తనయుండు= జరాసంధుడు; అరివెట్టఁడు+అయ్యెన్= కప్పము కట్టనివాడయ్యాడు; అంచున్= అంటూ; అమరవరేణ్య నందనుండు= దేవతాశ్రేష్ఠుడైన ఇంద్రుని కొడుకైన అర్జునుడు; అహంకృతి= గర్వము; తక్కఁగ= అణగునట్లు; విన్నవించినన్= మనవి చేయగా; విని= విని; యమసుతుఁడు= యమధర్మరాజు కొడుకైన ధర్మరాజు; వికల+ఆత్మకుండు+ఐ= వికలమైన మనస్సుతో ఏమీ తోచనివాడై; ఊరక+ఉండెన్= ఏమీ మాట్లాడకుండా ఉండిపోయాడు; అంతన్= అంతట; కృష్ణుఁడున్= శ్రీకృష్ణుడు...

**తా :** నాల్గుదిక్కులకు వెళ్లినవారు తాము ఆయా ప్రాంతాలకు వెళ్లి, రాజుల్ని జయించి వచ్చిన విశేషాలు వరుసగా చెప్పారు. జరాసంధుడు ఓటమిని అంగీకరించినప్పటికీ కప్పం కట్టలేదనే విషయాన్ని అర్జునుడు అహంకారాన్ని తగ్గించుకొని మనవి చేశాడు. ఆ విషయాన్ని విని, ధర్మరాజు ఏమి చేయడానికీ తోచకుండా ఊరికే ఉండిపోయాడు. అప్పుడు శ్రీకృష్ణుడు

**తే. ధర్మనందనుఁ జూచి యుత్కలికతోడఁ, బలికె మాగధుఁ బోరఁ జంపఁగ నుపాయ**
**మొకటి గల దది సెప్పెద నుద్ధవుండు, నాకుఁ జెప్పినచందంబు నయచరిత్ర! 714**

**ప్రతి :** ధర్మనందనున్= ధర్మరాజును; చూచి= చూచి; ఉత్కలిక తోడన్= కుతూహలంతో; పలికెన్= చెప్పాడు; నయచరిత్ర= నీతియుక్తమైన నడవడిక గలవాడా (ధర్మరాజా!); మాగధున్= జరాసంధుణ్ణి; పోరన్= యుద్ధంలో; చంపన్+కన్= సంహరించడానికి; ఉపాయము+ఒకటి= ఒక ఉపాయం; కలదు= ఉంది; నాకున్= నాతో; ఉద్ధవుండు= ఉద్ధవుడు; చెప్పిన చందంబు= చెప్పిన విధం; చెప్పెదన్= చెబుతాను.

**తా :** ధర్మరాజును చూచి శ్రీకృష్ణుడు కుతూహలంతో ఓ రాజా! జరాసంధుణ్ణి చంపడానికి ఉపాయం ఒకటి ఉంది. అది నాకు ఉద్ధవుడు చెప్పింది. నీకు వివరంగా చెప్తాను – వినుము.

**చ. విను మగధేశ్వరుం డెపుడు విప్రజనావళియందు భక్తియున్**
**వినయముఁ గల్గి యెద్దియును వేఁడినచో వృథసేయ కిచ్చుఁ గా**
**వున విజయుండునుం బవనపుత్త్రుఁడు నేనును బ్రాహ్మణాకృతిం**
**జని రణభిక్ష వేఁడిన వశంవదుఁడై యతఁ డిచ్చుఁ గోరికల్. 715**

**ప్రతి :** విను= వినుము; మగధ+ఈశ్వరుండు= జరాసంధుడు; ఎపుడున్= ఎల్లప్పుడు; విప్రజన+ఆవళి+అందున్= బ్రాహ్మణజనసమూహంపట్ల; భక్తియున్= భక్తియు; వినయమున్= అణకువయు; కల్గి= కలిగి; ఎద్దియును= ఏదైనా; వేఁడినచోన్= అడిగినట్లయితే; వృథ+చేయక= కాదనక (కోరిక వ్యర్థముచేయక); ఇచ్చున్= ఇచ్చాడు; కావునన్= కాబట్టి; విజయుండునున్= అర్జునుడును; పవనపుత్త్రుఁడున్= భీముడును; ఏనును= నేనును; బ్రాహ్మణ+ఆకృతిన్= బ్రాహ్మణుల వేషాలతో; చని= వెళ్లి; రణభిక్ష వేఁడినన్= యుద్ధాన్ని భిక్షగా కోరినట్లయితే; అతఁడు= ఆ జరాసంధుడు; వశంవదుఁడు+ ఐ= అనుకూలుడై; కోరికల్= మా కోరిన కోరికలు; ఇచ్చున్= ఇస్తాడు.

**తా :** ఉద్ధవుడు చెప్పింది చెబుతాను విను! అని శ్రీకృష్ణుడు ధర్మరాజుతో – రాజా! జరాసంధుడు ఎల్లప్పుడు బ్రాహ్మణులయందు భక్తిగలవాడు. అణకువగలవాడు. బ్రాహ్మణులు ఏది కోరినా కాదనక ఇచ్చేవాడు. కనుక, అర్జునుడూ, భీముడూ, నేనునూ బ్రాహ్మణవేషధారులమై వెళ్లి, యుద్ధాన్నే భిక్షగా కోర్తాము. బ్రాహ్మణుల పట్లగల గౌరవంతో మాకు అనుకూలుడై మేము కోరిన కోరికను మన్నించి తప్పక రణభిక్షను ఇస్తాడు.

**వ. అట్టియెడ. 716**

**ప్రతి :** అట్టి+ఎడన్= అట్టి సందర్భంలో...

## ❖ శ్రీకృష్ణ భీమార్జునులు జరాసంధుని వధింపఁ బోవుట ❖

**తే. తవిలి యప్పుడు మల్లయుద్ధమున వానిఁ, బిలుకుమార్పింప వచ్చును భీముచేత!**
**ననిన ధర్మజుఁ 'డదిలెస్స' యనిన విప్ర, వేషములు దాల్చి యరిగిరి విశదయశులు. 717**

**ప్రతి :** అప్పుడు= ఆ యుద్ధభిక్షను ఇచ్చినప్పుడు; తవిలి= పూని; మల్లయుద్ధమునన్= మల్లయుద్ధంలో; భీముచేతన్= భీమునిచేత; వానిన్= ఆ జరాసంధుణ్ణి; పిలుకుమార్పింపవచ్చును= చంపింప వచ్చును; అనినన్= అని చెప్పగా;

ధర్మజుఁడు= ధర్మరాజు; అది లెస్స+అనినన్= ఈ ఆలోచన బాగుందని చెప్పగా; విశదయశులు= శుద్ధమైన కీర్తిగల వారయిన ఆ శ్రీకృష్ణభీమార్జునులు; విప్రవేషములు= బ్రాహ్మణ వేషాలు; తాల్చి= వేసుకొని; అరిగిరి= వెళ్లారు.

**తా :** జరాసంధుడు యుద్ధభిక్షను సమర్పించినప్పుడు మేము పూనికతో భీమునిచేత జరాసంధుణ్ణి చంపించగలం అని శ్రీకృష్ణుడు చెప్పగా ధర్మరాజు ఈ ఆలోచన బాగుంది అన్నాడు. ఆ తర్వాత, శుద్ధయశోవంతులైన శ్రీకృష్ణుడు, భీముడు, అర్జునుడు బ్రాహ్మణవేషాలు వేసుకొని, జరాసంధుని నగరానికి వెళ్లారు.

**వ. ఇట్లు కృష్ణభీమార్జునులు బ్రాహ్మణవేషంబులు దాల్చి త్రేతాగ్నులుం బోలెఁ దమ శరీరతేజోవిశేషంబులు వెలుంగ, నతిత్వరితగతిం జని గిరివ్రజంబు సొచ్చి యందు నతిథిపూజలు శ్రద్ధాగరిష్ఠచిత్తుండై కావించుచున్న జరాసంధునిం గనుంగొని యిట్లనిరి. 718**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కృష్ణభీమ+అర్జునులు= శ్రీకృష్ణుడు, భీముడు, అర్జునుడు; బ్రాహ్మణ వేషంబులు+తాల్చి= బ్రాహ్మణ వేషాలు వేసుకొని; త్రేతాగ్నులున్+పోలెన్= మూడు అగ్నులవలె; తమశరీర తేజస్+విశేషంబులు= తమ తమ దేహాలలోని విశేషమైన తేజస్సులు; వెలుంగన్= ప్రకాశించగా; అతి త్వరితగతిన్+చని= ఎంతో వేగంతో వెళ్లి; గిరివ్రజంబు= జరాసంధుని పట్టణమైన గిరివ్రజమనే నగరంలో; చొచ్చి= ప్రవేశించి; అందున్= ఆ నగరులో; అతిథిపూజలు= అతిథులకు గావించే పూజలు; శ్రద్ధా గరిష్ఠచిత్తుండు+ఐ= చాల శ్రద్ధతో పెంపొందిన చిత్తంగలవాడై; కావించుచున్+ఉన్న= చేస్తున్న; జరాసంధునిన్= జరాసంధుణ్ణి; కనున్+కొని= చూచి; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తా :** శ్రీకృష్ణభీమార్జునులు బ్రాహ్మణవేషాలు ధరించి, ముగ్గురిశరీరాలు తేజోవంతాలై మూడగ్నులవలె ప్రకాశిస్తూ ఉండగా అతివేగంగా గిరివ్రజ పట్టణానికి వెళ్లి, ఆ పట్టణంలో చాల శ్రద్ధతో అతిథులను పూజిస్తూన్న జరాసంధుణ్ణి చూచి ఇట్లన్నారు.

**విశే :** త్రేతాగ్నులు - 1. గార్హపత్యం 2. ఆహవనీయం 3. దక్షిణాగ్ని.

**క. 'ధరణీశ! యతిథిపూజా, పరుఁడవు నీ వనుచు దిశలఁ బలుకఁగ విని మే**
**మరుదెంచితిమి మదీప్సిత, మఱసేయక యిమ్ము సువ్రతాచారనిధీ! 719**

**ప్రతి :** ధరణి+ఈశ= ఓ రాజా!; నీవు= నీవు; సువ్రతాచారనిధీ!= మంచి వ్రతాలను ఆచరించుటకు ఆశ్రయమైనవాడా!; అతిథిపూజాపరుఁడవు= అతిథుల్ని పూజించడంలో నిష్ఠ ఉండేవాడివి; అనుచున్= అంటూ; దిశలన్= అన్ని దిక్కులలో; పలుకన్+కన్= జనులంతా చెప్తుంటే; విని= విన్నవారమై; మేము= మేము ముగ్గురం; అరుదెంచితిమి= వచ్చాము; మత్+ఈప్సితము= మా యొక్క కోరికను; అఱ+చేయక= తక్కువ చేయక (కాదనక); ఇమ్ము= ఒసగుము.

**తా :** ఓ రాజా! సదాచార సంపన్నా! నీవు అతిథి పూజలు అతి నిష్ఠతో చేసేవాడివని దశదిశలలో నిన్ను గూర్చి జనులు చెప్పగా విని మేము వచ్చాం. మా మనస్సులోని కోర్కెను మన్నించి కాదనక ఇవ్వాలి అన్నారు.

**క. అతిథిజనంబుల భక్తిన్, సతతముఁ బూజించి యుచితసత్కారము లు**
**న్నతి నడపు సజ్జనులు శా, శ్వతకీర్తులు ధరణిఁ బడయఁ జాలుదు రనఘా! 720**

**ప్రతి :** అనఘా!= పాపము లేనివాడా!; సతతము= ఎల్లప్పుడు; పూజించి= పూజలుచేసి; ఉచిత సత్కారములు= తగినట్టి సన్మానాలు; ఉన్నతిన్= గౌరవభావంతో; నడుపు= నిర్వహించే; సత్+జనులు= ఉత్తమ జనులు; ధరణిన్= భూమిపై; శాశ్వతకీర్తులు= నాశనంలేని యశస్సులు; పడయన్+చాలుదురు= పొందగలుగుతారు.

**తా :** ఓ పుణ్యాత్ముడా! ఎల్లకాలం అతిథుల్ని తగిన రీతిలో భక్తిగౌరవాలతో సన్మానించేవారు, పూజించేవారు అయిన ఉత్తములు ఈ భూమిపై శాశ్వతమైన కీర్తిని పొందుతారు.

**క. పరికింపఁగ దేహం బ, స్థిర మని నిజబుద్ధిఁ దలఁచి చిరతరకీర్తి**
**స్ఫురణం బ్రస్తుతి కెక్కని, పురుషుఁడు జీవన్మృతుండు భూరివివేకా! 721**

**ప్రతి :** భూరివివేకా!= అధికమైన వివేకం గలవాడా!; పరికింపన్+కన్= చూడగా; దేహంబు= ఈ శరీరం; అస్థిరము+అని= స్థిరం కానిది అని; నిజబుద్ధిన్= తన మనస్సున; తలఁచి= భావించి; చిరతర కీర్తిస్ఫురణన్= మిక్కిలి శాశ్వతమైన కీర్తి యొక్క ప్రకాశంచేత; ప్రస్తుతికిన్= పొగడ్తకు; ఎక్కని= గణనకు రానట్టి; పురుషుఁడు= మానవుడు; జీవత్+మృతుండు= బ్రతికీ చచ్చినవాడే అవుతాడు.

**తా :** మహావివేకంగల జరాసంధుడా! చక్కగా పరిశీలించి చూడగా ఈ శరీరం స్థిరమైంది కాదని తెలిసి, శాశ్వతమైన కీర్తిని పొందడానికి ప్రయత్నం చేయని మానవుడు బ్రతికీ చచ్చినవాడే అవుతాడు.

**క. ధారుణిలోన వదాన్యుల, కీ రాని పదార్థ మొక్కటేనిం గలదే**
**కోరినఁ దన మేయెముకలు, ధీరుండై యిచ్చె నని దధీచిని వినమే? 722**

**ప్రతి :** ధారుణిలోనన్= భూమిలో; వదాన్యులకున్= దానం చేయటంలో ప్రీతిగలవారికి; ఈరాని= ఇయ్యరాని; పదార్థము= వస్తువు; ఒక్కటి+ఏనిన్= ఒక్కటైనా; కలదు+ఏ= ఉన్నదా?; కోరినన్= కోరగా; తన= తనయొక్క; మే= శరీరంలోని; ఎముకలు= ఎముకలు; ధీరుండు+ఐ= ధైర్యవంతుడై; ఇచ్చెన్+అని= ఇచ్చాడని; దధీచిని= దధీచి అనుమహర్షిని గూర్చి; వినము+ఏ= వినలేదా? (విన్నాం కదా!)

**తా :** లోకంలో దాతలకు ఇది ఇవ్వదగిందీ కాదు, ఇది అనే వస్తువు ఒక్కటికూడా లేదు. ఏది కోరినా ఇస్తారు. దధీచి అనే మహర్షి దేవతలు కోరగా తన శరీరంలోని ఎముకలను అతి ధైర్యంతో సమర్పించిన విషయం విన్నాం కదా!

**విశే :** దధీచి ఇచ్చిన వెన్నెముకతోనే ఇంద్రునివజ్రాయుధం చేయబడింది.

**క. అడిగిన వృథసేయక తన, యొడ లాఁకలిగొన్న యెఱుకు కోగిరముగ నే**
**ర్పడ నిచ్చి కీర్తిఁ గనె నని, పుడమిన్ మును వినమె యల కపోతము ననఘా! 723**

**ప్రతి :** అనఘా!= పాపం లేనివాడా!; పుడమిన్= ఈ నేలమీద; మును= పూర్వం; అడిగినన్= తనను కోరగా; వృథ+చేయక= వ్యర్థం చేయకుండా (కాదనక); తన+ఒడలు= తన శరీరం; ఆకలిగొన్న= ఆకలితో నున్న; ఎఱుకుకున్= బోయవానికి; ఓగిరము+కన్= భోజనంగా; ఏర్పడన్= ప్రసిద్ధంగా; ఇచ్చి; కీర్తిన్= కీర్తిని; కనెన్+అని= పొందిందని; అల కపోతమున్= ప్రసిద్ధి చెందిన పావురాన్ని గురించి; వినము+ఏ= విన్నాం కదా!

**తా :** ఓ పుణ్యపురుషా! పూర్వం ఈ భూమిపై ఒక పావురం తనను యాచించిన బోయవాని కోరికను కాదనక అతని ఆకలి తీర్చుటకు దేహాన్నే ఆహారంగా అర్పించి శాశ్వతమైన కీర్తిని పొందిందనే కథను విన్నాం కదా!

**క. ఆ యింద్రాగ్నులు శ్యేనక, వాయస రూపములఁ దన్ను వలఁతిగ వేఁడన్**
**ధీయుతుఁడై మును శిబి తన, కాయము గోసిచ్చె నన జగంబుల వినమే! 724**

**ప్రతి :** మును= పూర్వకాలంలో; ఆ+ఇంద్ర+అగ్నులు= ప్రసిద్ధమైన ఇంద్రుడు, అగ్నిదేవుడు; శ్యేనక= డేగయొక్కయు; వాయస= కాకియొక్కయు; రూపములన్= రూపాలతో; తన్నున్= తనను; వలతిగన్= నేర్పుగా; వేఁడన్= అర్థించగా; శిబి= శిబిచక్రవర్తి; ధీయుతుఁడు+ఐ= బుద్ధి విశేషం గలవాడై; తన కాయమున్= తన శరీరాన్ని; కోసి+ఇచ్చెన్+అనన్= కోసి ఇచ్చాడని; జగంబులన్= లోకంలో; వినము+ఏ!= వినలేదా? (విన్నాం కదా!)

**తా :** పూర్వకాలంలో శిబి చక్రవర్తి తనను పరీక్షించడానికై ఇంద్రుడు డేగగా, అగ్ని కాకిగా రూపాలు ధరించి వచ్చి మాంసాన్ని కోరగా శిబి ధీయుతుడై తన శరీరాన్ని తెగువతో కోసి యిచ్చిన విషయం మనం విని ఉన్నాం కదా!

**ఆ. ధీరమతులు రంతిదేవహరిశ్చంద్ర, బలులు నుంఛవృత్తి బ్రాహ్మణునిని**
**మున్ను సెప్ప వినమె? సన్నుతచరితులు, సన్న నైన నేఁడు నున్నవారు. 725**

**ప్రతి :** ధీరమతులు= మానసికమైన ధైర్యం గల; రంతిదేవ= రంతిదేవుడు; హరిశ్చంద్ర= హరిశ్చంద్రుడు; బలులున్= బలి చక్రవర్తి మున్నగు చక్రవర్తులు; ఉంఛవృత్తిన్= తిరిపమెత్తి జీవించే; బ్రాహ్మణునినిన్= ఒక బ్రాహ్మణుణ్ణి గురించి; మున్ను= పూర్వం; చెప్పన్+వినము+ఎ?= చెప్పగా విన్నాం కదా; సన్నుత చరితులు= కొనియాడదగిన నడవడిక గల ఆ మహాత్ములు; చన్నన్+ఐనన్= చనిపోయినప్పటికీ; నేఁడున్= నేటికిని; ఉన్నవారు= జీవించి ఉన్నవారే కదా!

**తా :** మానసిక ధైర్యంగల రంతిదేవుడు, హరిశ్చంద్రుడు, బలి అనే చక్రవర్తులు, బిచ్చమెత్తుకొని జీవించే ఒక బ్రాహ్మణుడు పూర్వకాలంలో చేసిన దానవిశేషాలు మనం విని ఉన్నాం కదా! సన్నుతచరితులైన ఆ మహాత్ములు చనిపోయినప్పటికీ జీవించియున్నవారివలెనే నేటికినీ ప్రజలు చెప్పుకొంటున్నారు. (యశఃకాయులై జీవించి ఉన్నారు అని తాత్పర్యం.)

**వ. అనిన విని జరాసంధుండు వారల రూపంబులును, మేఘగంభీరభాషణంబులును, గుణకిణాంకంబులును మహాప్రభావంబులును జూచి తన మనంబున 'వీరలు బ్రాహ్మణవేషధారులైన రాజేంద్రులు గానోపుదు; ర, ని తలంచి 'యిమ్మహాత్ములు గోరిన పదార్థంబ కాదు; ప్రాణంబు లేనియు నిత్తు; నదియునుం గాక తొల్లి బలీంద్రుండు విప్రవ్యాజంబున నడిగిన విష్ణుదేవునకు నాత్మపదభ్రష్టత్వం బెఱింగియు విచారింపక జగత్త్రయంబు నిచ్చి కీర్తిపరుం డయ్యె; క్షత్రబంధుం డనువాఁడు బ్రాహ్మణార్థంబు నిజప్రాణపరిత్యాగంబు సేసి నిర్మలంబగు యశంబు వడసె; నది గావున ననిత్యంబైన కాయంబు విచారణీయంబు గాదు; కీర్తి వడయుట లెస్స' యని తలంచి యుదారుండై కృష్ణార్జునభీములం గని యిట్లనియె. 726**

**ప్రతి :** అనినన్= శ్రీకృష్ణాదులు దాతల గాథలు వివరింపగా; విని= శ్రద్ధగా విని; వారల= ఆ మువ్వురియొక్క; రూపంబులును= ఆకారములును; మేఘగంభీర= మేఘంవలె గంభీరంగా ఉన్న; భాషణంబులును= మాటలును; గుణకిణ+అంకంబులు= వింటినారి ఒరయడంచేత ఏర్పడిన కాయల గుర్తులును; మహా ప్రభావంబులును= గొప్ప మహిమతో ఒప్పుతూ ఉండడం; చూచి= గమనించి; తన మనంబునన్= తన మనస్సులో; వీరలు= ఈ ముగ్గురు; బ్రాహ్మణ వేషధారులు+ఐన= బ్రాహ్మణ వేషాలను ధరించిన; రాజ+ఇంద్రులు= రాజశ్రేష్ఠులు; కాన్+ఓపుదురు= అయి

ఉండవచ్చును; అని తలంచి= అని అనుకొని; ఈ+మహా+ఆత్ములు= ఈ మహానుభావులు; కోరిన పదార్థంబు+అ+కాదు= కోరినట్టి వస్తువుమాత్రమే కాదు; ప్రాణంబులు+ఏనియున్= నా ప్రాణాలనైనా; ఇత్తును= తప్పక ఇస్తాను; అదియునున్+కాక= అదీగాక; తొల్లి= పూర్వం; బలి+ఇంద్రుండు= బలిచక్రవర్తి; విప్రవ్యాజంబునన్= బ్రాహ్మణవేషధారియై; అడిగిన= అడిగినప్పుడు; విష్ణుదేవునకున్= సాక్షాత్తూ ఆ నారాయణునికి; ఆత్మ= తనయొక్క; పదభ్రష్టత్వంబు= పదవి పోతుందనే విషయం; ఎఱింగియున్= తెలిసికూడా; విచారింపక= ఆలోచించక; జగత్త్రయంబున్= మూడు లోకాల్ని; ఇచ్చి= సమర్పించి; కీర్తి పరుండు+అయ్యెన్= యశస్వి అయ్యాడు; క్షత్రబంధుండు+అనువాడు= క్షత్రబంధుడు అనువాడు; బ్రాహ్మణ+అర్థంబు= బ్రాహ్మణునికోసం; నిజప్రాణపరిత్యాగంబు+చేసి= తన ప్రాణాలను విడిచి; నిర్మలంబు+అగు= స్వచ్ఛమైన; యశంబు+ పడసెన్= కీర్తిని పొందాడు; అది కావునన్= అట్ల కాబట్టి; అనిత్యంబు+ఐన= శాశ్వతం కాని; కాయంబు= శరీరం; విచారణీయంబు కాదు= ఆలోచింపదగింది కాదు; కీర్తి+పడయుట= కీర్తిని పొందడమే; లెస్స= మంచిది; అని తలంచి= అని ఆలోచనచేసి; ఉదారుండు+ఐ= దానం చేయడంలో గంభీరుడై; కృష్ణ+అర్జున భీములన్+కని= శ్రీకృష్ణ, అర్జున, భీముల్ని చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తా :** అనగా విని వారి ఆకారాల్నీ, మబ్బు ఉఱిమినట్లు గంభీరంగా ఉండే వారిమాటల్నీ, వింటినారిఒరపిడిచే కాయలు కాచిన వారిచేతుల్నీ, వారి తేజస్సునూ చూచి మనస్సులో 'వీరు బ్రాహ్మణ వేషధారులైన రాజోత్తములై ఉంటారు. ఇట్టి వీరు అడిగిన వస్తువులే కాదు నా ప్రాణాలనైనా ఇస్తాను. అదీగాక పూర్వం బలిచక్రవర్తి బ్రాహ్మణవటువురూపంలో ఆ విష్ణువే వచ్చి యాచింపగా, తన పదవి పోతుందని తెలిసికూడా సంకోచించక ముల్లోకాల్నీ దానమిచ్చి కీర్తిదేహుడైనాడు. క్షత్రబంధుడనేవాడు బ్రాహ్మణునికొరకు తన ప్రాణాలు విడిచి, కీర్తిని పొందాడు. కాబట్టి, ఈ అశాశ్వతమైన శరీరాన్నిగూర్చి విచారించడం మాని, కీర్తిని పొందడం మేలు అని తలచి కృష్ణభీమార్జునులను చూచి ఇలా చెప్పాడు.

**క. భూరిగుణులార! మీ మది, కోరిక యెఱిఁగింపుఁ డేమి కోరిన నైనన్**
**ధీరత నొసఁగుటయే కా, దారయ నా శిరము ద్రుంచి యైనను నిత్తున్. 727**

**ప్రతి :** భూరిగుణులార!= గొప్పగుణాలు గల సత్పురుషులార!; మీ మది కోరిక= మీ మనస్సులోని కోరికను; ఎఱిఁగింపుఁడు= తెలియపరచండి; ఏమి కోరినన్+ఐనన్= మీరు ఏమి కోరినా; ధీరతన్= ధైర్యంతో; ఒసగుటయే కాదు= ఇవ్వడమే కాదు; ఆరయన్= ఆలోచించగా; నా శిరమున్= నా శిరస్సునైనా సరే; త్రుంచి+ఐనను= తెగగొట్టి అయినా; ఇత్తును= సమర్పిస్తాను.

**తా :** గొప్ప గుణవంతులైన సత్పురుషులారా! మీ కోరిక ఏమో తెలియచెప్పండి. మీరు ఏమి కోరినప్పటికీ తప్పక ధైర్యంతో ఇస్తాను. అంతేకాదు, కావాలంటే నా తలను తెగగొట్టియైనా మీకు సమర్పిస్తాను.

**ఉ. నావుడుఁ గృష్ణుఁ డమ్మగధనాథున కిట్లను భూవరేణ్య! నీ**
**భావము సూనృతవ్రతశుభస్థితిఁ జెందు టెఱుంగవచ్చె మా**
**కీవలె నాజిభిక్ష యితఁ డింద్ర తనూభవుఁ డే నుపేంద్రుఁడం**
**బావని యీతఁ డిం దొకనిఁ బైకొని యెక్కటి పోరఁగాఁ దగున్ 728**

**ప్రతి :** నావుడున్= జరాసంధుడు అట్లు చెప్పగా; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఆ+మగధనాథునకున్= ఆ మగధరాజగు జరాసంధునితో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; భూవరేణ్య!= ఓ రాజశ్రేష్ఠుడా!; నీ భావము= నీ మనస్సు;

సూనృతవ్రతశుభస్థితిన్= సత్యం పలకడమే వ్రతంగా గల్గిన మేలిమి స్థితిని; చెందుట= పొందడం; ఎఱుంగన్+ వచ్చెన్= తెలియవచ్చింది; మాకున్= మాముగ్గురికీ; ఆజిభిక్ష= యుద్ధమనే భిక్షను; ఈవలెన్= ఇవ్వాలి; ఇతఁడు+ ఇంద్రతనూభవుఁడు= ఈతడు ఇంద్రునికొడుకు – అర్జునుడు; ఏన్= నేను; ఉపేంద్రుఁడన్= కృష్ణుణ్ణి; ఈతండు= ఈతడు; పావని= పవనుని తనయుడైన భీముడు; ఇందున్+ఒకనిన్= మా ముగ్గురిలో ఒకణ్ణి; పైకొని= ఎదుర్కొని; ఎక్కటి= ఒంటరిగా; పోరఁగాన్= యుద్ధము చేయటం; తగున్= తగును.

**తా :** అనగా, ఆ శ్రీకృష్ణుడు జరాసంధుణ్ణి చూచి “ఓ రాజోత్తమా! నీవు సత్యవాక్యపాలనంలో శ్రద్ధగలవాడవై ఉండటం మాకు స్పష్టంగా తెలియవచ్చింది. మాకు నీవు యుద్ధాన్ని భిక్షగా ఇవ్వాలి. నేను కృష్ణుణ్ణి. ఇతడు అర్జునుడు. ఈతడు పవనపుత్రుడైన భీముడు. మా ముగ్గురిలో ఎవరితోనైనా ఒక్కరితో, ఒక్కడవే యుద్ధం చేయడం మాకు కావాలి” అన్నాడు.

**చ. అన విని వాఁడు నవ్వి యహహా! విన వింతలు పుట్టె మున్ను న**
**న్ననిమొన నోర్వఁ జాలక భయంబునఁ బాఱితి పెక్కుమార్లు; వం**
**చన మధురాపురిన్ విడిచి సాగరమధ్యమునందు డాఁగవే?**
**వనరుహనాభ! నీ బిరుదు వాఁడితనంబును నాకు వింతయే? 729**

**ప్రతి :** అనన్= అని కృష్ణుడు చెప్పగా; విని= విన్నవాడై; వాఁడు= ఆ జరాసంధుడు; నవ్వి= నవ్వి; అహహా!= ఆహా! ఆహా!; వినన్ వింతలు పుట్టెన్= వినడానికి వింతలైనమాటలు పుట్టాయి; మున్ను= మునుపు; నన్నున్= నన్ను; అని మొనన్= యుద్ధరంగంలో; ఓర్వన్+చాలక= భరించి జయించలేక; పెక్కుమార్లు= అనేక పర్యాయాలు; భయంబునన్= భయంతో; పాఱితి= పారిపోయితివి; వనరుహనాభ= తామరపుష్పం బొడ్డున గలవాడా (శ్రీకృష్ణా!); వంచనన్= మోసంతో; మధురాపురిన్= మధురానగరాన్ని; విడిచి= వదలి; సాగరమధ్యము+అందున్= నట్టనడిసంద్రంలో; డాఁగవు+ఏ?= నీవు దాక్కొనలేదా?; నీ బిరుదు= నీ శూరత్వం; వాఁడి తనంబును= పరాక్రమం; నాకున్= నాకు; వింత+ఏ= క్రొత్తయా!

**తా :** అని కృష్ణుడు చెప్పగా జరాసంధుడు నవ్వుతూ “ఔరా! ఓ కృష్ణా! ఈనాడు నీ నోటి నుండి కొత్త కొత్త మాటలు విన్పిస్తున్నాయి. మునుపు నీవు యుద్ధంలో నాతో పోరాడలేక అనేకపర్యాయాలు పారిపోలేదా? కపటమార్గంలో మధురా పట్టణాన్ని విడిచి, సముద్రమధ్యంలో దాక్కొనలేదా? నీ శౌర్యం, పరాక్రమం నేనెఱుగనివా? అని పరిహాసం చేశాడు.

**క. ఇన్నేల సెప్ప? మాయలఁ, బన్నినఁ బో విడువ గోపబాలక! బల సం**
**పన్నుని మాగధభూవరు, న న్నెఱుఁగవె తొల్లి నందనందన! పోరన్? 730**

**ప్రతి :** గోపబాలక!= ఓ గోవులను కాచే గోపకుల బాలుడా!; నందనందన= నందుని కొడుకైన కృష్ణా!; ఇన్ని+ఏల+చెప్ప?= ఇన్ని మాటలు చెప్పనేల? మాయలన్= కపటనాటకాలను; పన్నినన్= వేసినట్లయితే; పో విడువన్= పోనివ్వను; బలసంపన్నునిన్= బలసంపద గలవాణ్ణి; మాగధభూవరున్= మగధదేశపు రాజునైన; నన్నున్= నన్ను; తొల్లి= పూర్వం; పోరన్= యుద్ధంలో; ఎఱుఁగవు+ఎ= ఎట్టి వాడనో నీవు ఎరుగవా?

**తా :** నందునికొడుకువైన ఓ గోపాల బాలుడా! నీతో ఇన్ని మాటలెందుకు? నీ వెన్ని కపటవేషాలు వేసినా నిన్ను విడిచిపెట్టేది లేదు. బలాఢ్యుడై ఈ మగధరాజుయుద్ధరంగంలో ఎంతటి వీరుడో! నీవు ఇది వరలో చూచి అనుభవ పూర్వకంగా తెలుసుకొన్నదే కదా!

ఉ. కాన రణోర్వి న న్నెదురఁ గష్టము గాన తలంగు; గోత్ర భి
త్సూనుఁడు భూరిబాహుబలదుర్దముఁ డయ్యును బిన్న; యీ మరు
త్సూనుఁడు మామకప్రకటదోర్బలశక్తికిఁ జూడఁ దుల్యుఁడౌ;
వీని నెదుర్తు నంచుఁ జెయివీచె జరాసుతుఁ డుగ్రమూర్తియై. 731

**ప్రతి :** కానన్= కావున; రణ+ఉర్విన్= యుద్ధభూమిలో; నన్ను+ఎదురన్= నన్ను ఎదిరించడం; కష్టము+కానన్= చాల కష్టం కాబట్టి; తలంగు= తొలగిపో!; గోత్రభిత్సూనుఁడు= పర్వతాలను ఖండించిన ఇంద్రునికొడుకగు అర్జునుడు; భూరి బాహుబల దుర్దముఁడు+అయ్యునున్= అధికమైన భుజబలం అణచ శక్యం కానివాడు అయినప్పటికి; పిన్న= చిన్నవాడు; ఈ మరుత్సూనుఁడు= ఈ వాయునందనుడయినభీముడు; చూడన్= చూడగా; మామక= నాయొక్క; ప్రకటదోస్+బలశక్తికిన్= ప్రసిద్ధమైన భుజసామర్థ్యానికి; తుల్యుఁడు+ఔ= సమానుడగును; వీనిన్= ఈ భీముణ్ణి; ఎదుర్తున్= ఎదిరిస్తాను గాక; అంచున్= అంటూ; జరాసుతుఁడు= జరాసంధుడు; ఉగ్రమూర్తి+ఐ= భయంకరమైన రూపం గలవాడై; చేయివీచెన్= ఇటు రమ్మని చేయి విసరి ఆహ్వానించాడు.

**తా :** అనేక పర్యాయాలు నీవు నాతో పోరాడజాలక ఓడిపోయినవాడివి – కనుక నీకు నన్నెదిరించడం కష్టసాధ్యం కాబట్టి నువ్వు తప్పుకో. అర్జునుడు భుజబలంలో అధికుడే అయినప్పటికి పసివాడు. ఈ వాయుతనయుడైన భీముడు నాకు సరియైన యోధుడుగా నా బలాన్ని సహింపగలవాడుగా కన్పిస్తున్నాడు. కాబట్టి, ఈ భీముణ్ణే ఎదిరిస్తానని భయంకర రూపుడై జరాసంధుడు భీముణ్ణి యుద్ధానికి రమ్మని చేయి విసరి పిలిచాడు.

క. కరువలిసుతునకు నొక భీ, కరగద నిప్పించి యొక్కగదఁ దనకేలన్
ధరియించి నలువురును గ్ర, చ్చఱఁ బురివెలి కేగి యచట సమతలభూమిన్. 732

**ప్రతి :** కరువలిసుతునకున్= వాయుపుత్రుడైన భీమునికి; ఒక భీకరగదన్= ఒక పెద్ద భయంకరమైన గదను; ఇప్పించి= ఇప్పించి; ఒక్క గదన్= ఒక గదను; తనకేలన్= తన చేతియందు; ధరియించి= పూని; నలువురును= శ్రీకృష్ణుడు, అర్జునుడు, భీముడు, జరాసంధులు; క్రచ్చఱన్= ప్రయత్నపూర్వకముగ; పురివెలికి+ఏగి= పట్టణము వెలుపలికి వెళ్లి; అచట= అక్కడ; సమతలభూమిన్= ఎత్తు పల్లములు లేని చదునుగా ఉన్న భూమిపై...

**తా :** అప్పుడు జరాసంధుడు ఒక భయంకరమైన గదను భీమునికి ఇప్పించి, తానూ ఒక గదను పూని, కృష్ణార్జునులను వెంటబెట్టుకొని నలుగురు నగరము బయటికి పోయి అచట ఎత్తుపల్లములు లేని చదునుగా గల ప్రదేశంలో

## ❖ శ్రీకృష్ణ సహాయుం డగు భీముండు జరాసంధునితో యుద్ధము సేయుట ❖

సీ. పర్వతద్వంద్వంబు పాథోధియుగళంబు మృగపతిద్వితయంబు వృషభయుగము
పావకద్వయము దంతావళయుగళంబు దలపడు వీఁక నుద్దండలీలఁ
గదిసి యన్యోన్య భీకరగదాహతుల నుగ్రంబుగ విస్ఫులింగములు సెదరఁ
గెరలుచు సవ్యదక్షిణమండలభ్రమణములను సింహచంక్రమణములను

**తే. గదిసి పాయుచు డాసి డగ్గఱచు మింటి, కెగసి క్రుంగుచుఁ గ్రుంగి వే యెగసి భూమి
పగుల నార్చి ఛటచ్ఛటోద్భటమహోగ్ర, ఘనగదాఘట్టనధ్వని గగన మగల. 733**

**ప్రతి :** పర్వతద్వంద్వంబు= రెండు కొండలు; పాథోధి యుగళంబు= రెండు సముద్రాలు; మృగపతి ద్వితయంబు= సింహాల జంట; వృషభయుగము= ఎడ్లజత; పావక ద్వయము= ఇరువురు అగ్నులు; దంతావళ యుగళంబు= రెండు ఏనుగులు; తలపడువీఁకన్= పోరాడే విధంగా; ఉద్దండలీలన్= అతిశయించినతీరున; కదిసి= చేరి; అన్యోన్యభీకర గదాహతులన్= ఒకరినొకరి భయంకరమైన గదల తాకిడిచేత; ఉగ్రంబునన్= భయంకరంగా; విస్ఫులింగములు= నిప్పు కణికలు; చెదరన్= రాలగా; కెరలుచున్= రేగుతు; సవ్య దక్షిణమండల భ్రమణములను= ఎడమనుండి కుడికి, కుడినుండి ఎడమకు గుండ్రంగా తిరుగుతూ; సింహ చంక్రమణములను= సింహం కుప్పించి దూకినట్లుగా; కదిసి= సమీపిస్తూ; పాయుచున్= దూరంగా పోతూ; డాసి= మరల సమీపించి; డగ్గఱచున్= దగ్గరగా వస్తూ; మింటికిన్+ఎగసి= ఆకాశానికి ఎగిరి; క్రుంగుచున్= నేలబారుగా వంగుతూ; క్రుంగి= అణగి; వే= వేగంగా; ఎగసి= మీదికి ఎగిరి; భూమి పగులన్= నేల బద్దలగునట్లుగా; ఆర్చి= కేకవేసి; ఛటచ్ఛట+ఉద్భట= ఛటఛటమనే, అధికమైన; మహా+ఉగ్ర= మిక్కిలి భయంకరమైన; ఘన= గొప్పదియైన; గదా= గదలయొక్క; ఘట్టన= తాకిడిచేతవచ్చిన; ధ్వనిన్= మ్రోతలచేత; గగనము= ఆకాశం; అగలన్= భేదిల్లగా...

**తా :** రెండుపర్వతాలు, రెండుసముద్రాలు, రెండుసింహాలు, రెండుఆబోతులు, రెండుఅగ్నులు, రెండుఏనుగులు - ఒకదానితో ఒకటి తలపడి పోరాడుతున్నట్లుగా మిక్కిలి భయంకరంగా, ఒకరిగద మరొకరి గదకు తగులుటచే నిప్పు కణికలు రాలుతుండగా, పెచ్చురేగి కుడినుండి ఎడమకు, ఎడమనుండి కుడికి తిరుగుతూ, సింహంవలె ఎగిరి దూకుతూ, దగ్గరకు పోయి, వెనక్కు వస్తూ, దూరంగా పోయి దగ్గరగా వస్తూ, ఎంతో పైకి, భూమికి మ్రొగ్గుతూ, నేలమీదకు వంగి పైకి ఎగురుతూ భూమి అదరునట్లు కేకలు వేస్తూ, భయంకరాలైన గదల తాకిడిచే పుట్టిన ధ్వని ఆకాశాన్ని బ్రద్దలు చేస్తుండగా జరాసంధుడు, భీముడు పోరాడారు.

**వ. పోరునంత. 734**

**ప్రతి :** పోరు+అంతన్= యుద్ధం చేయగా...

**మ. గద సారించి జరాతనూభవుఁడు హుంకారప్రఘోషంబులం
జద లల్లాడఁగఁ బాదఘట్టనములన్ సర్వంసహాభాగముం
గదలన్ వాయుజు వ్రేసె; వ్రేయ నతఁ డుగ్రక్రోధదీప్తాస్యుఁడై
యది తప్పించి విరోధిమస్తకము వ్రేయన్ వాఁడు వోఁదట్టుచున్. 735**

**ప్రతి :** జరాతనూభవుఁడు= జరాసంధుడు; గదన్+సారించి= గదను విసరి; హుంకార ప్రఘోషంబునన్= హుం అను గొప్ప ధ్వనిచేత; చదలు= ఆకాశం; అల్లాడన్+కన్= చలింపగా; పాదఘట్టనములన్= కాలిచే అదమడంచేత; సర్వంసహా భాగమున్= ఈ భూభాగమంతా; కదలన్= అదిరేటట్లుగా; వాయుజువ్రేసెన్= భీముణ్ణి కొట్టాడు; వ్రేయన్= ఆ విధంగా కొట్టగా; అతఁడు= ఆ భీముడు; ఉగ్రక్రోధ దీప్త+ఆస్యుడు+ఐ= భయంకరమైన కోపంతో ఎఱ్ఱగా వెలుగుతున్న ముఖం

కలవాడై; అది= ఆ దెబ్బను; తప్పించి= తప్పించుకొని; విరోధిమస్తకము= పగవాడగు జరాసంధునితలను; వ్రేయన్= కొట్టగా; వాఁడున్= ఆ జరాసంధుడుకూడ; పోఁదట్టుచున్= ఆ దెబ్బను తప్పించుకొంటూ...

**తా :** జరాసంధుడు గదసారించి భీముని తలమీద భూమి అల్లలాడునంతటి తీవ్రంగా కొట్టగా, ఆ దెబ్బను తప్పించుకొని ఉగ్రమైన కోపంతో, ఎఱ్ఱబడిన ముఖంతో శత్రువుయొక్క తలపై భీముడు కొట్టగా, జరాసంధుడుకూడ ఆ దెబ్బను తప్పించుకొన్నాడు.

**చ. మదవక భీమసేనుఁడును మాగధరాజు గడంగి బెబ్బులుల్**
**విడివడులీల నొండొరుల వీఁపులు మూఁపులునుం బ్రకోష్ఠముల్**
**నడితల లూరుజానుజఘనప్రకరంబులు బిట్టు వ్రయ్యఁగాఁ**
**బిడుగులఁబోలు పెన్గదల బెట్టుగ వ్రేయుచుఁ బాయుచున్ వెసన్. 736**

**ప్రతి :** భీమసేనుఁడును= భీముడుకూడ; మదవక= వెనుదీయక; మాగధరాజు= జరాసంధుడు; కడంగి= పూనికతో; బెబ్బులుల్= పెద్దపులులు; విడివడులీలన్= అడ్డూ, ఆపూ లేక విజృంభించినట్లు; ఒండొరుల= ఒకరికొకరియొక్క; వీఁపులు= వీపులు; మూపులునున్= భుజాల మీది భాగాలూ; ప్రకోష్ఠముల్= ముంజేతులూ; నడితలలు= తలలమీది నడిమి భాగాలు, మాడుపట్లు; ఊరు= తొడలు; జాను= మోకాళ్లు; జఘన= మొల ప్రదేశములయొక్క; ప్రకరంబులు= సముదాయములు; బిట్టు= మిక్కిలి; వ్రయ్యన్+కాన్= పగిలిపోగా; పిడుగులన్= పిడుగులతో; పోలు= పోల్చదగిన; పెన్+గదలన్= పెద్ద గదలతో; బెట్టుగన్= గట్టిగా; వ్రేయుచున్= కొట్టుతూ; వెసన్= వేగంగ; పాయుచున్= ఆ దెబ్బలు తగలకుండా తప్పించుకొంటూ యుద్ధం చేస్తున్నారు.

**తా :** భీమసేనుడు, జరాసంధుడు ఒకరికొకరు తీసిపోక, పూనికతో పెద్దపులులు విజృంభించి, పోరాడేటట్లు ఒకరికొకరి – వీపులు, మూపులు, తొడలు, మొలలు, మోకాళ్లు, ముంజేతులు మాడుపట్టులు – మొదలగు అవయవాలు విరుగునట్లుగా కొట్టుకొంటూ, పిడుగులలాంటి ఆ గదల దెబ్బలు ఒకరు కొట్టినవి మరొకరికి తగులకుండ తప్పించుకొంటూ పోరాడారు.

**లయవిభాతి!**

**బెడ గడరు పెన్గదలు పొడిపొడిగఁ దాఁకఁ బెనుపిడుగు లవనిం దొరఁగ నుడుగణము రాలన్**
**మిడుఁగుఱులు పోరి చెదలడర హరిదంతములు వడఁక జడధుల్ గలఁగ బుడమి చలియింపన్**
**వెడచఱువ మొత్తియును దడఁబడఁగ నత్తియును నెడమగుడు లాఁచి తిరుగుడు పడఁగ వ్రేయన్**
**వడవడ వడంకుచును సుడివడక డాసి చల ముడుగ కపు డొండొరుల వడి చెడక పోరన్. 737**

**ప్రతి :** బెడఁగు= బాగు; అడరు= అతిశయించు; పెన్+గదలు= పెద్ద గదలు; పొడిపొడి+కన్= పొడిపొడియగునట్లుగా; తాఁకన్= ఒకదానితో ఒకటి కొట్టుకొనగ; పెను పిడుగులు= పెదపెద్ద పిడుగులు; అవనిన్= భూమిపై; తొరఁగన్= పడగా; ఉడుగణములు= నక్షత్ర సమూహాలు; రాలన్= రాలగా; మిడుఁగుఱులు= నిప్పురవ్వలు; పోరిన్= మిక్కిలిగా; చదలన్+అడరన్= ఆకాశమంతా వ్యాపించగా; హరి+అంతములు= దిక్కుల అంచులు; వడఁకన్= వణికిపోగా; జడధుల్= సముద్రాలు; కలగన్= అల్లకల్లోలంకాగా; పుడమి= భూమి; చలియింపన్= కంపింపగా; వెడ చఱువన్= సారహీనమయ్యేటట్లు;

మొత్తియును= కొట్టియును; తడఁబడన్+కన్= కంగారుపడేటట్లు; అత్తియును= గట్టిగా నొక్కిపెట్టియు; ఎడమగుడు లాఁచి= దూరంగా వెళ్లి వేగంగా వచ్చి కొట్టియు; తిరుగుడు పడన్+కన్= వెనక్కు ముందుకు తిరుగుడు పాటు పొందేటట్లు; వ్రేయన్= కొట్టగా; వడవడవడంకుచును= వడవడ వణుకుచు; సుడివడక= నీరసపడక; డాసి= సమీపించి; చలము+ఉడుగక= పట్టుదల వదలక; అపుడు= అప్పుడు; ఒండ+ఒరులన్= పరస్పరం; వడి చెడక= వేగం తగ్గక, (ఉత్సాహంతో); పోరన్= పోరాడగా...

**తా :** భీమజరాసంధులు నేర్పుతో పెద్దగదలు పొడిపొడి అగునట్లుగా తాడిస్తూ, ఆకాశంనుండి పిడుగులు పడుతున్నట్లుగాను, నక్షత్రాలు రాలిపడేటట్లు, గదలు కొట్టుకొనే వేగానికి పుట్టిన నిప్పురవ్వలు ఆకాశాన్ని కప్పివేసేటట్లు, దిక్కులు చలించగా, సముద్రాలు పొంగేటట్లు, భూమి బ్రద్దలయ్యేటట్లు – ఒకరొకరి సత్తువలు తగ్గేటట్లు కొట్టుతూ, తడబడే విధంగా నొక్కి పట్టి, దూరానికి వెళ్లి దగ్గరకు వచ్చి, వెనుకముందులకు తిరుగుడు పడునట్లు కొట్టుతూ, వడవడ వణికేటట్లు చేసి ఇద్దరిలోను గల పట్టుదల తగ్గక, వేగం తగ్గక ఉత్సాహంతో పోరాడుతుండగా

**వ. ఇవ్విధంబునం బోరుచుండ నొండొరుల గదాదండంబులు దుమురులైనన్ బెండు వడక సమద దిగ్వేదండశుండాదండమండితప్రచండంబు లగు బాహుదండంబు లప్పగించి ముష్టియుద్ధంబునకు డగ్గఱి. 738**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధంగా; పోరుచున్+ఉండన్= యుద్ధం చేస్తూ ఉండగా; ఒండొరులు= ఇరువురి; గదాదండంబులు= గదలు; తుమురులు+ఐనన్= పొడిపొడియైనను; బెండువడక= సారహీనులుకాక; సమద= మదించిన; దిక్+వేదండ= దిక్కులనుండే ఏనుగు – దిగ్గజము; శుండాదండ= సాపుగానున్న తొండాలను; మండిత= అలంకరింపబడే; ప్రచండంబులు+అగు= మిక్కిలి భయంకరాలయిన; బాహుదండంబులు= భుజాలను; అప్పళించి= చఱచి; ముష్టి యుద్ధంబునకున్= పిడికిళ్లతో చేసే యుద్ధానికి; డగ్గఱి= కలియబడి.

**తా :** ఈ విధంగా యుద్ధం చేస్తూ ఉండగా ఇద్దరిగదలు ఒకదాని తాకిడికి ఒకటి విఱిగి పొడిపొడియై పోగా, నిరుత్సాహపడక మదించిన దిగ్గజముల తొండాలను పోలే నిడుపాటి భుజాలను చఱచుకొంటూ పిడికిటి పోట్లతో పోరాడటానికై కలియబడ్డారు.

**లయగ్రాహి!**

**కాల వెస డాచియును గీ లెడలఁ ద్రోచియును దాలుములు దూలఁ బెడకేల వడి వ్రేయన్**
**ఫాలములు గక్షములుఁ దాలువులు వక్షములు వ్రీలు నెముకల్ మెదడు నేలఁ దుమురై వే**
**రాల విపులక్షతవిలోలమగు నెత్తురులు జాలుగొని యోలిఁ బెనుఁగాలువలుగం బే**
**తాలమదభూతములు ఖేలనలఁ జేతులను దాళములు తట్టుచు సలీలగతి నాడన్. 739**

**ప్రతి :** కాలన్= కాలితో; వెసన్= వేగంగా; డాచియును= తన్నియు; కీలు+ఎడలన్= కీళ్లు సడలిపోయేటట్లు; త్రోచియును= త్రోసియు; తాలుములు= ఓపికలు; తూలన్= నశించగా; పెడకేలన్= చేతిప్రక్కల; వ్రేయన్= కొట్టగా; ఫాలములు= నుదుటి భాగాలు; కక్షములున్= చంకలును; తాలువులు= దవడలు; వక్షములు= ఱొమ్ములు; వ్రీలున్= వ్రేలాడు; ఎముకల్= ఎముకలను; మెదడు= తలలోని మాంసము; నేలన్= నేలయందు; తుమురు+ఐ= పొడియై; వే= వేగంగా; రాలన్= రాలగా; విపులక్షత విలోలము= పెద్ద గాయంచేత చాల వేగంగా చలిస్తున్నది; అగు= ఐన; నెత్తురులు= నెత్తురులు;

జాలుగొని= ప్రవాహమై; ఓలిన్= క్రమంగా; పెను+కాలువగన్= పెద్దకాలువగా; బేతాళమదభూతములు= బేతాళము మున్నగు మదించినపిశాచాలు; ఖేలనలన్= వేడుకతో ఆట్లాడగా; చేతులను= చేతులతో; తాళములు= తాళములు; తట్టుచున్= వేయుచు; సలీలగతిన్= విలాసమైనపద్ధతితో; ఆడన్= నాట్యమాడగా...

**తా :** కాళ్లతో తన్నుతూ, కీళ్లు సడలునట్లు పడద్రోసి, ఓపికలు నశింప చేస్తూ, పెడకేల వేస్తూ, నుదురులు, చంకలు, దవడలు, గుండెలు దెబ్బలు తగిలి ఎముకలు వ్రేలాడగా, మెదడునందలి మాంసము పిండియై నేలపై రాలగా, ఆయా అవయవాలకు తగిలిన పెద్దపెద్ద దెబ్బలనుండి రక్తము ఏరులై పారగా, బేతాళాది పిశాచాలు తాళాలు తట్టుతూ నృత్యం చేయగా భీమజరాసంధులు పోరాడారు.

**విశే :** వృత్తము – లయగ్రాహి. ఇదియు లయ ప్రధానమైనది. పాదానికి ముప్పై అక్షరాలు. వరుసగా – 'భజసనభజసనభయ' అనే గణాలు ఉంటాయి. 1, 9, 14, 25 – ప్రాసయతిస్థానాలు.

**ఉ. ప్రక్కలుఁ జెక్కులున్ మెడలుఁ బాణితలంబులచేఁ బగుల్చుచున్**
**ముక్కులు నక్కులుం జెవులు ముష్టిహతిన్ నలియంగ గ్రుద్దుచున్**
**డొక్కలుఁ బిక్కలున్ ఘనకఠోరపదాహతి నొంచుచున్ నెఱుల్**
**దక్కక స్రుక్క కొండొరులఁ దార్కొని పేర్కొని పోరి రుగ్రతన్. 740**

**ప్రతి :** ప్రక్కలున్= రెండు వైపులా; చెక్కులున్= చెక్కిళ్లును; మెడలున్= మెడలును; పాణితలంబులచేన్= అరచేతులతో; పగుల్చుచున్= విరగ్గొట్టుతూ; ముక్కులున్= ముక్కులు; అక్కులున్= రొమ్ములును; చెవులు= చెవులు; ముష్టిహతిన్= పిడికిలి దెబ్బచేత; నలియన్+కన్= నలిగి పోయేటట్లు; గ్రుద్దుచున్= మోదుతూ; డొక్కలున్= కడుపు పక్క భాగాలు; ఘనకఠోర= గొప్పదైన, కఠినమైన; పద+ఆహతిన్= కాలితో తన్నిన దెబ్బలతో; నొంచుచున్= నొప్పిస్తూ; నెఱుల్= క్రమాలు; తక్కక= మానక; స్రుక్కక= అలసిపోకుండా; ఒండు+ఒరులన్= ఒకర్నొకర్ని; దార్కొని= ఎదుర్కొని; పేర్కొని= పేర్లు చెప్పుకొని; ఉగ్రతన్= భయంకరంగా; పోరిరి= పోరాడారు.

**తా :** ప్రక్కలు, చెక్కిళ్లు, మెడలు అరచేతితో విరగగొట్టుతూ, ముక్కులు, రొమ్ములు, చెవులు, పిడికిళ్లతో గ్రుద్దుకుంటూ, డొక్కలు, పిక్కలు కఠినమైన కాలిదెబ్బలతో నొప్పిస్తూ, యుద్ధక్రమాలు మానక, ఒకరికొకరు తగ్గక ఎదుర్కొని, పేర్లు చెప్పుకొని కొట్టుకుంటూ భయంకరంగా భీమ జరాసంధులు పోరాడారు.

**ఉ. హుమ్మని మ్రోఁగుచుం బెలుచ హుంకృతు లిచ్చుచుఁ బాసి డాసి కో**
**కొమ్మనుచు న్నొడ ళ్ళగల గుల్లల తిత్తులుగాఁ బదంబులం**
**గ్రుమ్మచు ముష్టిఘట్టనల స్రుక్కుచు నూర్పులు సందడింపఁగా**
**సొమ్మలు వోవుచుం దెలియుచున్ మదిఁ జేవయుఁ లావుఁ జూపుచున్. 741**

**ప్రతి :** హుమ్మని మ్రోగుచున్= హుమ్ అని చప్పుడు చేస్తూ; పెలుచన్= గట్టిగా; హుంకృతులు= హుంకారాలు; ఇచ్చుచున్= చేస్తూ; పాసి= దూరంగా తొలగి; డాసి= మరల సమీపించి; కోకొమ్ము= ఇదిగో తీసుకో; అనుచున్= అంటూ; ఒడళ్ళు= శరీరాలు; అగలన్= విరిగిపోవునట్లు; గుల్లలతిత్తులుగాన్= గుల్లలుపోసిన సంచులవలె కాగా; పదంబులన్= కాళ్లతో; క్రుమ్మచున్= అణగద్రొక్కుతూ; ముష్టిఘట్టనలన్= పిడికిటి పోట్లతో; స్రుక్కుచున్= అలసట పొందుతు; ఊర్పులు

సందడింపన్+కాన్= పెద్దగా ఊపిరులు తీసుకొంటూ; సొమ్మలు+పోవుచున్= మూర్ఛిల్లుతు; మదిన్= మనస్సులో; తెలియుచున్= అంతలో తేరుకొంటూ; చేవయున్= శూరత్వాన్ని; లావున్= బలాన్ని; చూపుచున్= ప్రదర్శిస్తూ...

**తా :** హుంకారధ్వనులు చేస్తూ, దూరంగా పోతూ, మరల దగ్గరికి వస్తూ, ఇదిగో ఈ దెబ్బ కాచుకోమంటూ, దేహాలు నలిగి పోయేటట్లు మోకాళ్లతో క్రుమ్ముతూ, పిడికిళ్లతో శరీరంలోని ఎముకలన్నీ విరిగేటట్లుగా పొడుస్తూ - శరీరం ఆ ముక్కలతో గుల్లలతో నిండిన సంచివలె ఉండగా, నిట్టూర్పులు విడుస్తూ, మూర్ఛపోతూ, అంతలోనే తెప్పరిల్లుతూ, తమ శౌర్యం బలపరాక్రమాలు ప్రదర్శిస్తూ పోరాడినారు.

**విశే :** గుల్లల తిత్తులు - పూర్వం సున్నం తయారు చేయడానికి నత్తగుల్లలను వాడేవారు. ఆ గుల్లలు తేలికగా డొంకల వలె ఉంటాయి. ఈ వీరులు ఎముకలు గుల్లలయ్యేటట్లుగా కొట్టుకోవడంలో వారిశరీరాలు గుల్లలతో నింపిన సంచులవలె గలగలలాడుతున్నాయని వర్ణనం.

**వ. ఇవ్విధంబున వజ్రివజ్రసన్నిభంబగు నితరేతరముష్టిఘట్టనంబుల భిన్నాంగులై, రక్తసిక్తశరీరంబుల తోడం బుష్పితాశోకంబుల వీఁకను, జేగుఱుఁగొండలచందంబునను జూపట్టి పోరుచుండఁ గృష్ణుండు జరాసంధుని జన్మమరణప్రకారంబు లాత్మ నెఱుంగుటం జేసి వాయుతనూభవున కలయికలేక లావును జేవయుఁ గలుగు నట్లుగాఁ దద్గాత్రంబునందు దనదివ్యతేజంబు నిలిపి యరినిరసనోపాయం బూహించి సమీరనందనుండు సూచుచుండ నొక్కశాఖాగ్రంబు రెండుగాఁ జీల్చివైచి వాని నట్ల చీరి చంపుమని సంజ్ఞగాఁ జూపిచెప్పిన నతండు నాకీలు దెలిసి యవక్రపరాక్రముండై మాగధుఁ బడఁద్రోచి వానిపదంబు పదంబునం ద్రొక్కి బాహుయుగళంబున రెండవపదంబుఁ గదలకుండం బట్టి మస్తకపర్యంతంబుఁ బెళ బెళమని చప్పు ళ్ళుప్పతిల్ల మత్తదంతావళంబు దాళవృక్షంబు సీరుచందంబునఁ బాద జాను జంఘోరుకటి మధ్యోదరాంస కర్ణనయనంబులు వేఱువేఱుభాగంబులుగా వ్రయ్యలు వాపి యార్చినఁ బౌరజనంబులు గనుంగొని భయాకులులై హాహాకారంబులు సేసి రంత. 742**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా; వజ్రివజ్రసన్నిభంబు+అ= ఇంద్రుని వజ్రాయుధంతో పోలినట్టి; ఇతర+ఇతర= పరస్పరం; ముష్టి ఘట్టనంబులన్= పిడికిటి దెబ్బలచేత; భిన్న+అంగులు+ఐ= విరిగిన శరీరావయవాలు కలవారై; రక్తసిక్త శరీరంబులతోడన్= రక్తంతో తడిసిన శరీరంతో; పుష్పిత+అశోకంబుల= పూచిన అశోక వృక్షాల; వీఁకను= వలెను; జేగుఱు= ఎఱ్ఱని; కొండల చందంబునను= కొండలవలెను; చూపట్టి= కనబడుతు; పోరుచున్+ఉండన్= యుద్ధం చేస్తుండగా; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; జరాసంధుని= జరాసంధుని; జన్మమరణ ప్రకారంబులు= పుట్టుక, చావు విధానాలు; ఆత్మన్+ ఎఱుంగుటన్+చేసి= తనకు తెలిసిన వాడగుట చేసి; వాయుతనూభవునకున్= భీమునికి; అలయిక లేక= శ్రమ లేకుండునట్టి; లావును= బలమును; చేవయున్= ధైర్యమూ; కలుగునట్లు+కాన్= కలటిగేటట్లు; తద్+గాత్రంబు+అందున్= అతని శరీరమునందు; తన దివ్యతేజంబు= తనయొక్క దైవ సంబంధమైన తేజస్సును; నిలిపి= ఉంచి; అరినిరసన+ఉపాయంబు= శత్రువును అణచే ఉపాయాన్ని; ఊహించి= ఆలోచించి; సమీర నందనుండు= భీముడు; చూచుచుండున్= చూస్తుండగా; ఒక్క శాఖా+అగ్రంబు= ఒక రెమ్మను; రెండు+కాన్= రెండుభాగాలుగా; చీల్చివైచి= నిలువుగాచీల్చి; వానిన్+అట్లు+అ= జరాసంధుణ్ణి కూడ ఆ విధంగానే; చీరిచంపుము+అని= నిలువుగ చీల్చి చంపుమని; సంజ్ఞ+కాన్= సైగచేసి; చూపి

చెప్పినన్= రెమ్మను చీల్చి చూపి చెప్పగా; అతండున్= ఆ భీముడును; ఆ కీలు= ఆ మర్మం; తెలిసి= గ్రహించి; అవక్రపరాక్రముండు+ఐ= తిరుగులేని పరాక్రమం గలవాడై; మాగధున్= జరాసంధుణ్ణి; పడన్+త్రోచి= పడగొట్టి; వాని పదంబు= వానికాలు; పదంబునన్+త్రొక్కి= తనకాలితో తొక్కిపట్టి; బాహుయుగళంబునన్= రెండు భుజాలతోను; రెండవ పదంబున్= రెండవకాలిని; కదలకుండన్+పట్టి= కదలకుండా పట్టుకొని; మస్తకపర్యంతంబున్= తలవరకు; పెళపెళమని= పెళపెళమను; చప్పుళ్లు= శబ్దములు; ఉప్పతిల్లన్= పుట్టగా; మత్తదంతావళంబు= మదించిన ఏనుగు; తాళవృక్షంబు= తాటి చెట్టును; చీరు చందంబున్= చీల్చేవిధంగా; పాద= కాళ్లు; జాను= మోకాళ్లు; జంఘా= పిక్కలు; ఊరు= తొడలు; కటి= పిరుదులు; మధ్య= నడుము; ఉదర= కడుపు; అంస= మూపులు; కర్ణ= చెవులు; నయనంబులు= కన్నులు; వేఱువేఱు భాగంబులు+కాన్= వేరువేరుగా విడదీసినట్లు; వ్రయ్యలువాపి= చీలికలుచేసి; ఆర్చినన్= పెద్దగా నాదం చేయగా; పౌరజనంబులు= పురజనులు; కనున్+కొని= చూచి; భయాకులులు+ఐ= భయంతో కలతచెందిన వారై; హాహాకారంబులు= అయ్యో అయ్యో అను అరపులు; చేసిరి= అరిచారు; అంతన్= అంతట...

**తా :** ఈ విధంగా భీమజరాసంధు లిద్దరూ వజ్రాయుధం దెబ్బలవంటి పిడికిటిపోట్లచేతను, ఒకరినొకరు గట్టిగా కొట్టుకోవడంవల్ల నెత్తురులు కారుతూ వారిశరీరం నెత్తురుతో తడిసి, పూచిన అశోకపు చెట్లవలెను, ఎఱ్ఱనికొండలవలెను ఒప్పుతుండగా తీవ్రంగా పోరాడుతుండగా, శ్రీకృష్ణుడు జరాసంధుని జన్మరహస్యం, మరణవిధానం తెలిసినవాడు కనుక, భీముడు అలసిపోకుండా శౌర్యం చెడి నీరసపడకుండ తనదివ్యతేజాన్ని అతనిదేహంలో చొప్పించి, దేహబలాన్ని చేకూర్చాడు. ఒక రెమ్మను తీసుకొని నిలువుగా చీల్చి, రెండుభాగాలుగా చేసి చూపి ఈ విధంగా చంపమని సైగ చేశాడు. భీముడు శ్రీకృష్ణునిసైగలోని రహస్యాన్ని గ్రహించి, జరాసంధుణ్ణి నేలమీద పడవేసి తనకాళ్లతో వాని ఒకకాలిని గట్టిగా కదలకుండ తొక్కిపెట్టి, రెండుచేతులతోను రెండవకాలిని కదలకుండ పట్టుకొని – ఒక పక్క కాలు, చేయి, కన్ను, ముక్కు, తొడలు, మీగాళ్లు, కడుపు మొదలైన అవయవాలన్నీ రెండుచీలికలుగా చీల్చి పడవైచి సింహనాదం చేయగా పౌరులు ఆ దృశ్యాన్ని చూచి భయపడి హాహాకారాలు చేశారు అప్పుడు

## ❖ కారాగృహవిముక్తులగు రాజులు శ్రీకృష్ణుని స్తుతించుట ❖

**క. అనిలజుని దేవపతినం, దనుఁడును బద్మాక్షుఁడును నుదారత నాలిం**
**గనములు సేసి పరాక్రమ, మున కద్భుతమంది మోదమునఁ బొగడి రొగిన్. 743**

**ప్రతి :** అనిలజుని= భీమసేనుణ్ణి; దేవపతి నందనుఁడును= ఇంద్రుని కుమారుడైన అర్జునుడు; పద్మ+అక్షుఁడును= శ్రీకృష్ణుడూ; ఉదారతన్= గొప్పగా; ఆలింగనములు+చేసి= కౌగలించుకొని; పరాక్రమమునకున్= అతని పరాక్రమానికి; అద్భుతము+అంది= ఆశ్చర్యపడి; మోదమునన్= ఆనందంతో; ఒగిన్= క్రమంగా; పొగడిరి= పొగడారు.

**తా :** అర్జునుడు, శ్రీకృష్ణుడు భీమసేనుణ్ణి గౌరవంతో కౌగలించుకొని అతని పరాక్రమానికి ఆశ్చర్యపడి ఆనందంతో పొగడారు.

**క. వనజాక్షుఁ డంత గరుణా, వననిధియును భక్తలోకవత్సలుఁడును గా**
**వున మాగధసుతు సహదే, వునిఁ బట్టము గట్టెఁ దన్నవోన్నతపదవిన్. 744**

**ప్రతి :** అంతన్= ఆ తరువాత; వనజ+అక్షుఁడు= శ్రీకృష్ణుడు; కరుణా వననిధియును= కరుణాసముద్రుడూ; భక్తలోక వత్సలుఁడును= భక్తజనులయందు వాత్సల్యంగలవాడూ; కావునన్= అగుటచే; మాగధసుతున్= జరాసంధుని కొడుకైన;

సహదేవునిన్= సహదేవుడనేవాణ్ణి; తద్+నవ+ఉన్నతపదవిన్= ఆ జరాసంధునిరాజ్యానికి కొత్తదైన ఉన్నతపదవికి; పట్టము+కట్టెన్= పట్టాభిషేకం చేశాడు.

**తా :** శ్రీకృష్ణుడు దయాసముద్రుడు, భక్తజనులపట్ల వాత్సల్యం కలవాడు కాబట్టి, జరాసంధునికొడుకైన సహదేవుణ్ణి ఆదరించి ఆ రాజ్యానికి అధిపతిగా నూత్నపదవి నిచ్చి స్వయంగా పట్టాభిషేకమహోత్సవం జరిపించాడు.

**క. మగధాధినాథునకు ము, న్నగపడి చెఱసాలలను మహాదుఃఖములన్**
**నొగులుచుఁ దన పాదాంబుజ, యుగళము చింతించుచున్న యుర్వీశ్వరులన్. 745**

**ప్రతి :** మగధ+అధినాథునకున్= జరాసంధునికి; మున్ను= పూర్వం; అగపడి= చిక్కి; చెఱసాలలను= కారాగారాల్లో; మహాదుఃఖములన్= అధికమైనబాధలతో; నొగులుచున్= దుఃఖపడుచు; తన పాద+అంబుజ యుగళము= తన పాదపద్మముల జంటను; చింతించుచున్న= తలంచుతున్న; ఉర్వీ+ఈశ్వరులన్= భూపతులగు రాజులను...

**తా :** జరాసంధునిచేత చిక్కి, చెఱసాలలలో అధికమైన దుఃఖంతో బాధపడుతూ, శ్రీకృష్ణుని పాదపద్మాలనే స్మరిస్తున్న రాజులను

**వ. అ య్యవసరంబునఁ గృష్ణుండు దన దివ్యచిత్తంబున మఱవ నవధరింపక చెఱలు విడిపించిన వారలు పెద్దకాలంబు కారాగృహంబులం బెక్కుబాధలంబడి కృశీభూతశరీరు లగుటం జేసి రక్తమాంస శూన్యంబులై త్వగస్థిమాత్రావశిష్టంబులును, ధూళిధూసరంబులు నైన దేహంబులు గలిగి కేశపాశంబులు మాసి జటాబంధంబులైన శిరంబులతో మలినవస్త్రులై చనుదెంచి యప్పుడు. 746**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; తన దివ్యచిత్తమ్మునన్= తన దివ్యమైన అంతరంగంలో; మఱవన్+అవధరింపక= చెఱలోని రాజులు పంపిన బ్రాహ్మణుని మాటలను మరచిపోక; చెఱలు= బంధనాలను; విడిపించిన= విడిపించగా; వారలు= ఆ రాజులు; పెద్దకాలంబు= బహుదినములు; కారాగృహంబులన్= చెరసాలలలో; పెక్కు బాధలన్+పడి= అనేకమయిన బాధలు అనుభవించి; కృశీభూతశరీరులు= చిక్కిపోయిన శరీరాలు కలవారు; అగుటన్+చేసి= అగుటచే; రక్తమాంస శూన్యంబులు+ఐ= రక్తం, మాంసం లేనివై; త్వక్+అస్థిమాత్ర+అవశిష్టంబులును= తోలు, ఎముకలు మాత్రం మిగిలినవీ; ధూళిధూసరంబులును= దుమ్ముకొట్టుకున్నవీ; ఐన= అయినట్టి; దేహంబులు+కలిగి= శరీరాలు కలిగి; కేశపాశంబులు= సిగలముడులు; మాసి= మాసినవై; జటాబంధంబులు+ఐన= జడలముళ్లతో కూడిన; శిరంబులతోన్= తలలతోను; మలినవస్త్రులు+ఐ= మాసిపోయిన బట్టలతోను; చనుదెంచి= వచ్చి; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** శ్రీకృష్ణుడు చెఱలోనిరాజులు పంపిన బ్రాహ్మణునిమాటలు తన మనస్సున గుర్తుపెట్టుకొని ఉండడంచేత – ఆ రాజులను వెంటనే విడుదల చేయించాడు. ఆ రాజులంతా చిరకాలంగా చెరసాలలో ఉండటంచే చిక్కిపోయి రక్తమాంసాలు లేక ఎండిపోయారూ, దుమ్ము కొట్టుకుపోయిన దేహం గలవారూ, జుట్టు చిక్కులు పడి జడలు కట్టి ఉండగా, బట్టలు మాసిపోయి సంస్కారహీనమైన స్థితిలో శ్రీకృష్ణునివద్దకు వచ్చారు.

**సీ. నవపద్మలోచను భవబంధమోచను భరితశుభాకారు దురితదూరుఁ**
**గంగణకేయూరుఁ గాంచనమంజీరు వివిధశోభితభూషు విగతదోషుఁ**

**పన్నగాంతకవాహు భక్తమహోత్సాహు నతచంద్రజూటు నున్నతకిరీటు**
**హరినీలనిభకాయు వరపీతకౌశేయుఁ గటిసూత్రధారు జగద్విహారు**

**తే. హారవనమాలికామహితోరువక్షు, శంఖచక్రగదాపద్మశార్ఙ్గహస్తు**
**లలిత శ్రీవత్సశోభితలక్షణాంగు, సుభగచారిత్రు దేవకీసుతునిఁ గాంచి. 747**

**ప్రతి :** నవపద్మలోచనున్= అప్పుడే విచ్చుకున్న పద్మాలవంటి కన్నులు గలవాడూ; భవబంధమోచనున్= జన్మ బంధాలను పోగొట్టేవాడూ; భరితశుభ+ఆకారున్= నిండైన శుభాలే ఆకారంగా గలవాడు; దురితదూరున్= పాపాలకు దూరమైనవాడు; కంకణ కేయూరున్= కంకణాలు భుజకీర్తులు ధరించినవాడు; కాంచన మంజీరున్= బంగారు అందెలు గలవాడు; వివిధశోభితభూషున్= నానావిధాలైన ప్రకాశించే ఆభరణాలు కలవాడు; విగతదోషున్= పాపరహితుడు; పన్నగ+ అంతకవాహున్= పాముల్ని సంహరించే గరుత్మంతుడు వాహనంగా గలవాడును; భక్తమహా+ఉత్సాహున్= భక్తులకు మిక్కిలి ఉత్సాహాన్ని కలిగించేవాడు; నత చంద్రజూటున్= నమస్కరించిన శివుడు కలవాడు; ఉన్నతకిరీటున్= ఎత్తయిన కిరీటం గలవాడు; హరినీలనిభకాయున్= ఇంద్రనీలమణులకాంతివంటికాంతిగల శరీరం గలవాడు; వరపీత కౌశేయున్= శ్రేష్ఠమైన పసుపుపచ్చని పట్టువస్త్రం గలవాణ్ణి; కటిసూత్రధారున్= మొలనూలు ధరించినవాణ్ణి; జగత్+విహారున్= లోకమందంతటా విహరించేవాణ్ణి; హార వనమాలికా మహిత+ఉరువక్షున్= ముత్యాలహారాలతో, వనమాలతో ఒప్పుచున్న గొప్పవక్షస్థలం గలవాణ్ణి; శంఖచక్రగదాపద్మశార్ఙ్గహస్తున్= శంఖం, చక్రం, గద, పద్మం, శార్ఙ్గలను ధరించిన చేతులు గలవాణ్ణి; లలిత శ్రీవత్సశోభిత లక్షణ+అంగున్= మనోజ్ఞమైన శ్రీవత్సమనే పేరుగల ప్రకాశించే గురుతు గల దేహం గలవాణ్ణి; సుభగచారిత్రున్= మంచి నడవడిక గలవాడూ; దేవకీ సుతునిన్= దేవకీదేవి కుమారుడైన శ్రీకృష్ణుణ్ణి; కాంచి= దర్శించి...

**తా :** అప్పుడే వికసించిన తామరలవంటి కన్నులుగలవాడూ, సంసారబంధాలను విడిపించేవాడూ, శుభమైన ఆకారంగలవాడును, పుణ్యాత్ముడూ, కంకణాలు, భుజకీర్తులు, బంగారుఅందెలు కలవాడూ, ప్రకాశిస్తున్న వివిధ ఆభరణాలు కలవాడూ, దోషరహితుడూ, గరుడవాహనుడూ, భక్తులకు మేలైన ఉత్సాహాన్ని కలుగజేసేవాడూ, శివునిచే నమస్కరింపబడే వాడు, మేలయిన కిరీటం గలవాడు, ఇంద్రనీలంవంటి దేహంగలవాడు, మేలైన పసుపు పచ్చని పట్టుబట్ట కలవాడు, మొలనూలు దాల్చినవాడు, జగత్తునందంతట విహరించేవాడు, హారాలు వనమాల మున్నగువాటిచే ప్రకాశించేవక్షస్థలం గలవాడూ, శంఖచక్రాదిఆయుధాలుగల హస్తాలుగలవాడు, వక్షస్థలంపై శ్రీవత్సమనే గుర్తు గలవాడూ, మంచి నడవడిక గలవాడూ, దేవకీదేవి కుమారుడూ అయిన శ్రీకృష్ణుణ్ణి రాజులు చూచి

**చ. భరితముదాత్ములై విగతబంధనులై నిజమస్తముల్ మురా**
**సురరిపుపాదపద్మములు సోఁకఁగ జాఁగిలి మ్రొక్కి నమ్రులై**
**కరములు మోడ్చి యో పరమకారుణికోత్తమ! సజ్జనార్తి సం**
**హరణవివేకశీల! మహితాశ్రితపోషణ! పాపశోషణా! 748**

**ప్రతి :** భరితముత్+ఆత్ములు+ఐ= సంతోషంతో నిండిన మనస్సుకలవారై; విగతబంధనులు+ఐ= పోయిన బంధనాలు కలవారై; నిజమస్తముల్= తమయొక్క శిరస్సులు; ముర+అసురరిపు= మురు డనే రాక్షసుని శత్రువగు శ్రీకృష్ణుని; పాదపద్మములు

సోఁకన్+కన్= పాదపద్మాలకు తగిలేటట్లుగా; చాఁగిలి= సాష్టాంగపడి; మ్రొక్కి= నమస్కరించి; నమ్రులు+ఐ= వంగినవారై; కరములు= చేతులు; మోడ్చి= ముకుళించుకొని; ఓ పరమకారుణిక+ఉత్తమ!= కరుణ గలిగినవారిలో ఉత్తముడా!; సజ్జన+ఆర్తి సంహరణవివేకశీల!= మంచివారియొక్కదుఃఖాన్ని పోగొట్టే విషయంలో ఉచితానుచిత జ్ఞానం కలవాడా!; మహితాశ్రితపోషణ!= ఉన్నతులైన ఆశ్రితుల్ని పోషించేవాడా!; పాపశోషణా!= పాపాన్ని నశింపచేసేవాడా!

**తా :** ఆ రాజులందరు మిక్కిలి సంతోషించిన మనస్సులు కలవారై అన్ని బంధాలను తొలగించుకొని, తమ తలలు శ్రీకృష్ణుని పాదకమలాలకు తాకేటట్లు సాగిలబడి మ్రొక్కి, వినయంతో వంగి, చేతులు జోడించుకొని మంచికరుణగలవాడూ, సజ్జనుల దుఃఖాన్ని పోగొట్టేవాడూ, వివేకవంతుడైనవాడూ, ఆశ్రయించినవారిని పోషించడంలో గొప్పవాడూ, పాపాలను పోగొట్టేవాడూ అయిన ఓ స్వామీ! - అని

**ఆ. వరద! పద్మనాభ! హరి! కృష్ణ! గోవింద, దాసదుఃఖనాశ! వాసుదేవ!**
**యవ్యయాప్రమేయ! యనిశంబుఁ గావింతు, మిందిరేశ! నీకు వందనములు 749**

**ప్రతి :** వరద!= కోరిన వరాలు ఇచ్చేవాడా!; పద్మనాభ!= పద్మనాభుడా!; హరి!= పాపాలను హరించేవాడా!; కృష్ణ!= కృష్ణా!; గోవింద!= గోవిందా!; దాసదుఃఖనాశ= సేవకుల దుఃఖాన్ని పోగొట్టేవాడా; వాసుదేవ!= సర్వప్రాణుల్లో నివసించేవాడా!; అవ్యయ!= నాశనం లేనివాడా!; అప్రమేయ= ఇంతటివాడవని చెప్పశక్యముగాని వాడా!; ఇందిర+ఈశ!= లక్ష్మీనాథా!; అనిశంబు= ఎల్లప్పుడు; నీకున్= నీకు; వందనములు= నమస్కారాలు; కావింతుము= చేస్తున్నాము.

**తా :** కోరిన కోరికలన్నీ తీర్చేవాడూ, పద్మం బొడ్డున కలవాడూ, పాపాలను హరించేవాడూ, సర్వాన్ని సృష్టించేవాడూ, వేదవేద్యుడు, సేవకుల దుఃఖాలను నశింపజేసేవాడూ, సర్వప్రాణులలో వసించేవాడూ, నశించనివాడూ, మేర లేనివాడూ, శ్రీలక్ష్మీనాథుడూ అయిన నీకు మేము సర్వదా నమస్కరిస్తున్నాము.

**ఉ. ధీరవిచార! మమ్ము భవదీయ పదాశ్రయులన్ జరాసుతో**
**దారనిబంధనోగ్రపరితాపము నీ కరుణావలోకనా**
**సారముచేత నార్చితివి; సజ్జనరక్షయు దుష్టశిక్షయు**
**న్నారయ నీకుఁగార్యములు యాదవవంశ పయోధిచంద్రమా! 750**

**ప్రతి :** ధీరవిచార!= ధీరులైనవారిచేత విచారణ చేయదగినవాడా!; యాదవ వంశపయోధి చంద్రమా!= యదువంశమనే సముద్రానికి చంద్రునివంటివాడా! (శ్రీకృష్ణా); భవదీయ= నీయొక్క; పద+ఆశ్రయులన్= పాదాలను ఆశ్రయించి ఉన్న; మమ్మున్= మమ్మల్ని; జరాసుత= జరాసంధుని; ఉదార= అధికమైన; నిబంధన= బంధించడంవలన; ఉగ్ర= తీవ్రమైన; పరితాపము= సంతాపాన్ని; నీ= నీ యొక్క; కరుణ+అవలోకన= దయతో కూడిననీ చూపులనే; సారముచేతన్= ఆ జడివానచేత; ఆర్చితివి= పోగొట్టినావు; ఆరయన్= చూడగా; సజ్జన రక్షయున్= సుజనులను రక్షించడం; దుష్ట శిక్షయున్= చెడ్డవారిని శిక్షించడం; నీకున్= నీకు; కార్యములు= చేయదగ్గ పనులు.

**తా :** - యాదవవంశశ్రేష్ఠుడవు అయిన - ఓ కృష్ణా! క్రూరుడైన జరాసంధుని నిర్బంధంలో మేము పొందుతున్న దుఃఖతాపాన్ని నీ కరుణావలోకమనే జడివానతో పోగొట్టి నీ పాదాలను ఆశ్రయించిన మమ్మల్ని ఆదరించావు. విచారింపగా మంచివారిని రక్షించుట, చెడ్డవారిని శిక్షించుట నీ పనులుకదా! అన్నారు.

**సీ. అవధరింపుము మాగధాధీశ్వరుఁడు మాకు బరమబంధుఁడు గాని పగయ కాఁడు**
**ప్రకటితరాజ్యవైభవమదాంధీభూతచేతస్కులము మమ్ముఁ జెప్ప నేల?**
**కమనీయజలతరంగములకైవడిదీపశిఖవోలెఁ జూడ నస్థిరములైన**
**గురుసంపదలు నమ్మి పరసాధనక్రియాగమ మేది తద్బాధకంబు లగుచుఁ**

**తే. బరఁగ నన్యోన్య వైరానుబంధములను, బ్రజలఁ గారించుచును దుష్టభావచిత్తు**
**లగుచు నాసన్నమృత్యుభయంబు దక్కి, మత్తులై తిరుగుదురు దుర్మనుజు లంత. 751**

**ప్రతి :** అవధరింపుము= మేము చెప్పే విన్నపాలు వినవయ్యా!; మాగధ+అధీశ్వరుఁడు= జరాసంధుడు; మాకున్= మా కందరికీ; పరమ బంధుఁడు+కాని= మిక్కిలి ఆప్తుడైన చుట్టమే గాని, పగయ కాఁడు= శత్రువు కానేకాదు; ప్రకటిత= ప్రసిద్ధమైన; రాజ్యవైభవ= రాజ్యసంపదచేత కలిగిన; మద+అంధీభూత= మదంచేత గ్రుడ్డిగా చేయబడిన; చేతస్కులము= మనస్సులు గలవారం; మమ్మున్= మా విషయాలు; చెప్పన్+ఏల= చెప్పవలసిన పనియేమి; కమనీయ= మనోజ్ఞాలైన; జలతరంగముల= నీటి అలల; కైవడిన్= వలెను; దీపశిఖ+పోలెన్= దీపజ్వాలవలెను; చూడన్= పరిశీలింపగా; అస్థిరములు+ఐన= స్థిరాలు కాని; గురుసంపదలు= గొప్ప సంపదలు; నమ్మి= నమ్ముకొన్నవారమై; పరసాధన క్రియా+ ఆగమము= పరలోకాన్ని చేరడానికి తగిన క్రియలను; ఏది= చేయక; తద్+బాధకంబులు+అగుచున్= ఆ పరలోకానికి అడ్డు పెట్టునట్టి; పరఁగన్= ఉండునట్టి; అన్యోన్యవైర+అనుబంధములను= ఒకరితో ఒకరికి గల పగతోడి అనుబంధంతో; ప్రజలన్= జనులను; కారించుచును= బాధిస్తూ; దుష్టభావచిత్తులు+అగుచున్= చెడ్డ ఆలోచనలతో కూడిన మనస్సులు గలవారమౌతూ; ఆసన్న= సమీపించిన; మృత్యుభయంబు+తక్కి= మరణభయం లేక; మత్తులు+ఐ= ఒళ్లు తెలియని వారై; దుర్+మనుజులు= చెడ్డవారు; తిరుగుదురు= తిరుగుతారు; అంత= అంతట...

**తా :** శ్రీకృష్ణా! మా విన్నపం చిత్తగింపవయ్యా! జరాసంధుడు మాకు దగ్గర చుట్టమేగాని పగవాడు కాదు. మేమును రాజ్యలక్ష్మిచేత కన్నుగానక ఉన్నవారం. ఇట్టి మా విషయాలు చెప్పే పని ఏముంది? లోకంలో దుష్టులగువారు నీటి అలలవలెను, దీపజ్వాలవలెను క్షణకాలంలో నశించే సంపదలనే గొప్పగా తలచి, ఆ సంపదలనే నమ్ముకొని పరలోకసాధనకై చేసే కార్యక్రమా లేవీ చేయడానికి ప్రయత్నించక, పరలోకసాధనకు అడ్డుపడే – పరస్పరవిరోధ భావంతో ప్రజలను బాధించే ఆలోచనలతో తిరుగుతూ ఉంటారు.

**చ. కడపటిచేఁత నైహికసుఖంబులుఁ గోల్పడి రిత్త కోర్కి వెం**
**బడిఁబడి యెండమావులఁ బిపాసువులై సలిలాశ డాయుచుం**
**జెడు మనుజుల్ భవాబ్ధిదరిఁ జేరఁగలేక నశింతు; రట్టి యా**
**యిడుమలఁ బొందఁ జాలము రమేశ! త్రిలోకశరణ్య! మాధవా! 752**

**ప్రతి :** రమా+ఈశ= ఓ లక్ష్మీనాథా!; త్రిలోకశరణ్య!= మూడు లోకాలకు శరణమైనవాడా!; మాధవా!= శ్రీకృష్ణా!; కడపటి+చేతన్= మానవునికి సంబంధించిన పనులలో చివరిదైన చావుచేత; ఐహిక సుఖంబులున్= ఈ లోకంలోని సుఖాలను; కోలు+పడి= పోగొట్టుకొని; రిత్తకోర్కె వెంబడిన్= వృథాయైన కోర్కెలవెంట; పడి= పడి; పిపాసువులు+ఐ= దాహంతో కూడినవారమై; ఎండమావులన్= నీళ్లు లేనివైన; సలిల+ఆశన్= నీరు అని ఆశపడి (భ్రాంతితో); డాయుచున్=

సమీపిస్తూ; చెడు= చెడిపోవునట్టి; మనుజుల్= మానవులు; భవ+అబ్ధిదరిన్= జన్మలనే సముద్రం యొక్క ఆవలి గట్టును; చేరఁగన్+లేక= చేరుకోలేక; నశింతురు= నాశనమవుతారు; అట్టి= ఆ విధమైన; ఆ+ఇడుమలన్= ఆ కష్టాలను; పొందఁజాలము= పడలేము.

**తా :** లక్ష్మీనాథా! త్రైలోక్యశరణ్యా! ఓ శ్రీకృష్ణా! ఈ లోకంలోని జనులు వ్యర్థమైనకోరికలు గలవారై దప్పిగొన్నవాడు ఎండమావుల్లో నీళ్లున్నాయని భ్రమపడి త్రాగవచ్చును అనే ఆశతో ముందుముందుకు పోతున్నట్లు మెలగుతూ ఈ జన్మమనెడి సముద్రం ఆవలి గట్టును చేరలేక నశిస్తుంటారు. కాబట్టి, మరణించి ఈ లోకంలోని సుఖాలను పొందనేరని ఈ కష్టాలను మేము పడలేము. మమ్మల్ని రక్షించు.

**ఉ. వేదవధూశిరోమహితవీథులఁ జాల నలంకరించు మీ**
**పాదసరోజయుగ్మము శుభస్థితి మా హృదయంబులందు ని**
**త్యోదితభక్తిమైఁ దగిలియుండు నుపాయ మెఱుంగఁ బల్కు దా**
**మోదర! భక్తదుర్భవపయోనిధితారణ! సృష్టికారణా! 753**

**ప్రతి :** దామోదర!= తులసీమాలలు ఉదరంపై వ్రేలాడునట్టివాడా!; భక్త= భక్తుల; దుర్+భవ= చెడు జన్మలనెడు; పయస్+నిధి= సముద్రాన్ని; తారణ!= దాటించేవాడా!; సృష్టికారణా!= ఈ ప్రపంచసృష్టికి హేతువైనవాడా!; వేదవధూశిరోమహితవీథులన్= వేదాలనే స్త్రీయొక్క శిరస్సు అనే గొప్పమార్గాల్ని; చాలన్= మిక్కిలి చక్కగా; అలంకరించు= అలంకరించే; మీ పాదసరోజ యుగ్మము= నీ అడుగు తామరల జంట; శుభస్థితిన్= మంచి ఉనికితో; మా హృదయంబుల+అందున్= మా మనస్సులలో; నిత్య+ఉదిత భక్తిమైన్= నిరంతరం పుట్టుతున్న భక్తితో; తగిలి= ఆసక్తులమై; ఉండు+ఉపాయము= ఉండునట్టి ఉపాయాన్ని; ఎఱుంగన్+పల్కు= తెలిసేటట్లు చెప్పవయ్యా!

**తా :** భక్తజనులను సంసార సాగరంనుండి దాటించేవాడా! ఉదరంపై తులసి మాలలు వ్రేలాడుతూ ఉండేవాడా! ప్రపంచసృష్టికి హేతువైనవాడా! వేదాంతమార్గాన్ని చక్కగా అలంకరించే నీ అడుగుతామరలు మా మనస్సులలో శుభస్థితిని నిలచి ఉండేటట్లు చేసి, నిత్యము భక్తితో నీ పాదాలను సేవించే ఉపాయం మాకు తెలియజేయవయ్యా!

**క. అని తను శరణము వేఁడిన, జననాథులవలను సూచి సదమలభక్తా**
**వన చరితుఁడు పంకజ లో, చనుఁ డిట్లను వారితోడ సదయామతియై. 754**

**ప్రతి :** అని= అంటూ; తనున్= తనను; శరణము= రక్షణం; వేఁడిన= కోరిన; జననాథులవలను= రాజులవైపు; చూచి= చూచి; సత్+అమల= మిక్కిలి నిర్మలమైన; భక్త+అవన= భక్తులను రక్షించే; చరితుఁడు= చరిత్ర కలవాడు; పంకజలోచనుఁడు= శ్రీకృష్ణుడు; సదయామతి+ఐ= దయతో కూడిన మనస్సుగలవాడై; వారితోడన్= ఆ రాజులతో; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు.

**తా :** అంటూ ఈ విధంగా రక్షింపుమని తనను ప్రార్థించినరాజులను చూచి, భక్తరక్షణశీలుడైన శ్రీకృష్ణుడు దయాంతరంగుడై ఆ రాజులతో ఇలా బదులు పలికాడు.

**చ. 'జనపతులార! మీ పలుకు సత్యము; రాజ్యమదాంధచిత్తులై**
**ఘనముగ విప్రులం బ్రజలఁ గాఱియఁబెట్టుటఁజేసి కాదె వే**

**న నహుషరావణార్జునులు నాశము నొందిరి; కాన ధర్మ పా**
**లనమునఁ గాక నిల్చునె? కులంబు బలంబుఁ జిరాయురున్నతుల్. 755**

**ప్రతి :** జనపతులార!= ఓ రాజులారా! మీ పలుకు= మీ మాట; సత్యము= నిజం; రాజ్యమద+అంధచిత్తులు+ఐ= ప్రభుత్వమువలన మదించి కన్నుగానని మనస్సు గలవారై; ఘనముగన్= అధికముగ; విప్రులన్= బ్రాహ్మణులను; ప్రజలన్= ప్రజలను; కాఱియన్+పెట్టుటన్+చేసికాదె= బాధలు పెట్టటంవలనే కదా!; వేన= వేనుడు; నహుష= నహుషుడు; రావణ= రావణుడు; అర్జునులు= కార్తవీర్యార్జునుడు మొదలైనవారు; నాశమున్= నాశనాన్ని; ఒందిరి= పొందారు; కానన్= కాబట్టి; ధర్మపాలనమునన్= ధర్మం తప్పక పరిపాలించడంచేతనే; కాక= కాక; కులంబున్= వంశము; బలంబున్= బలమూ; చిర+ఆయుస్+ఉన్నతుల్ (చిరాయురున్నతుల్)= దీర్ఘాయుస్సూ, గౌరవమూ; నిల్చున్+ఎ= నిలబడుతుందా? చెడిపోకుండా ఉంటుందా?

**తా :** ఓ రాజులారా! మీరు చెప్పిన మాట నిజము. రాజ్యమదంచేత మంచిచెడ్డలు విచారించక మూఢబుద్ధులై, బ్రాహ్మణులను, రాజ్యంలోని ప్రజలను మిక్కిలి బాధించడం చేతనే కదా! వేనుడు, నహుషుడు, రావణుడు, కార్తవీర్యార్జునుడు అనేవారు మునుపు నశించారు. కాబట్టి, ధర్మం తప్పక పరిపాలించటంచేత వంశమూ, బలమూ, దీర్ఘాయుస్సూ, గౌరవమూ చెడకుండా ఉంటాయి. ధర్మపాలనమే సర్వాన్నీ రకిస్తుంద శ్రీకృష్ణుడు రాజులతో చెప్పాడు.

**వ. అది గావున మీ మనంబుల దేహం బనిత్యంబుగాఁ దెలిసి. 756**

**ప్రతి :** అది+కావునన్= విషయం అటువంటిది కాబట్టి; మీ మనంబులన్= మీ మనస్సులలో; దేహంబు= ఈ శరీరం; అనిత్యంబు+కాన్= శాశ్వతం కాదని; తెలిసి= తెలుసుకొని...

**తా :** కావున ఈ శరీరం శాశ్వతము కాదని మీరు మీ మనస్సులలో తెలుసుకొని

**ఉ. మీరలు ధర్మముం దగవు మేరయుఁ దప్పక భూజనాళిఁ బెం**
**పారుచు సౌఖ్యసంపదల నందఁగఁ బ్రోచుచు భూరియజ్ఞముల్**
**గౌరవవృత్తి మత్పరముగా నొనరింపుచు మామకాంఘ్రి పం**
**కేరుహముల్ భజించుచు నకిల్బిషులై చరియింపుఁ డిమ్ములన్. 757**

**ప్రతి :** మీరునున్= మీరు కూడా; ధర్మమున్= ధర్మాన్ని; తగవు= నీతి; మేరయున్= మర్యాదయును; తప్పక= మీరక; భూజన+ఆళిన్= భూమిమీది జనులను; పెంపు+ఆరుచున్= వృద్ధి అతిశయింపగా; సౌఖ్యసంపదలన్= సౌభాగ్య సౌఖ్యాలను; అందన్+కన్= పొందునట్లుగ; ప్రోచుచున్= కాపాడుతు; భూరియజ్ఞముల్= గొప్పయజ్ఞాలు; గౌరవ వృత్తిన్= గౌరవము తోడి పనిగా; మత్+పరము+కాన్= నాకు సమర్పణంగా; ఒనరింపుచున్= చేస్తూ; మామక= నాయొక్క; అంఘ్రిపంకేరుహముల్= పాదపద్మాలు; భజించుచున్= సేవిస్తూ; అకిల్బిషులు+ఐ= పాపాలు లేనివారై; ఇమ్ములన్= లెస్సగా; చరియింపుఁడు= వర్తించండి.

**తా :** ఓ రాజులారా! మీరు ధర్మం, నీతి, మర్యాద తప్పకుండా భూప్రజలకు సుఖాలు, సంపదలు, సమకూడేటట్లు కాపాడుతూ, విశేషాలైన యజ్ఞాలు గౌరవంతో నాకు సమర్పణగా చేస్తూ నా పాదపద్మాలను సేవిస్తూ పుణ్యాత్ములై లెస్సగా నడచుకోండి అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పాడు.

**వ. అట్లయిన మీరలు బ్రహ్మసాయుజ్యప్రాప్తు లయ్యెదరు; మదీయపాదారవిందంబులందుఁ జలింపని భక్తియుఁ గలుగునని యానతిచ్చి యా రాజవరుల మంగళస్నానంబులు సేయించి వివిధమణిభూషణ మృదులాంబరమాల్యానులేపనంబు లొసంగి, భోజనతాంబూలాదులం బరితృప్తులం జేసి యున్నత రథాశ్వసామజాధిరూఢులం గావించి నిజరాజ్యంబులకుఁ బూజ్యులం చేసి యనిచిన. 758**

**ప్రతి :** అట్లు+అయిన= ఆ విధంగా నడచుకొన్నట్లయితే; మీరలు= మీరందరు; బ్రహ్మసాయుజ్యప్రాప్తులు= బ్రహ్మైక్యాన్ని పొందగలవారౌతారు. మదీయ= నాయొక్క; పాదారవిందంబుల+అందున్= నా పాదపద్మాలందు; చలింపని భక్తియున్= నిశ్చల భక్తీ; కలుగున్+అని= కలుగ గలదని; ఆనతి+ఇచ్చి= చెప్పి; ఆ రాజవరులన్= ఆ రాజశ్రేష్ఠుల్ని; మంగళ స్నానంబులు+ చేయించి= పవిత్రమైనస్నానాలు కావింపించి; వివిధమణిభూషణ= వివిధములైనమణులు తాపిన ఆభరణాలు; మృదుల+ అంబర= మెత్తనివస్త్రాలు; మాల్య+అనులేపనంబులు= పూలమాలలు, శరీరానికి పూసుకొనే చందనాదులు; ఒసంగి= ఇచ్చి; భోజన తాంబూల+ఆదులన్= భోజనాలచేత, తాంబూలంచేత; పరితృప్తులన్+చేసి= మిక్కిలి తృప్తి పొందునట్లు చేసి; ఉన్నత రథ= ఎత్తైన రథాలనూ; అశ్వ= గుఱ్ఱాలనూ; సామజ= ఏనుగులనూ; అధిరూఢులన్+కావించి= ఎక్కించి; పూజ్యులం చేసి= గౌరవించి; నిజ రాజ్యంబులకున్= వారివారిరాజ్యాలకు; అనిచినన్= పంపించగా...

**తా :** అట్లు నడచుకొనిన మీరు మోక్షాన్ని పొందడమేగాక నా పాదాలయందు భక్తిగల్గినవారౌతారు అని చెప్పి శ్రీకృష్ణుడు ఆ రాజులందరికీ శుభప్రదమైన మంగళస్నానాలు చేయించి వారికి వివిధాలైన రత్నాభరణాలు, మెత్తని వస్త్రాలు, పూలదండలు, చందనాది మైపూతలు ఇప్పించి అలంకరింపచేసి మంచి భోజనతాంబూలాదులను ఇచ్చి మిక్కిలి తృప్తి పరచి వారివారికి తగినట్లు రథాలు, గుర్రాలు, ఏనుగులు వాహనాలుగా ఏర్పాటుచేసి, గౌరవించి వారివారిరాజ్యాలకు పాలకులుగా పంపాడు.

**క. నరవరు లీ చందంబున, మురసంహరుచేత బంధమోక్షణులై సు**
**స్థిరహర్షంబులతో నిజ, పురములకుం జనిరి శుభవిభూతి తలిర్పన్. 759**

**ప్రతి :** నరవరులు= రాజులు; ఈ చందంబునన్= ఈ విధంగా; మురసంహరుచేతన్= మురాసురుణ్ణి సంహరించిన శ్రీకృష్ణుని చేత; బంధమోక్షణులు+ఐ= చెరసాలలనుండి విడుదల పొందినవారై; సుస్థిర హర్షంబులతోన్= స్థిరమైన ఆనందాలతో; నిజపురంబులకున్= వారివారి నగరాలకు; శుభవిభూతి= మంచి భాగ్యం; తలిర్పన్= అంకురించగా; చనిరి= వెళ్లారు.

**తా :** ఈ విధంగా రాజులు శ్రీకృష్ణునిచే చెరసాలలనుండి విడువబడి మిక్కిలి ఆనందంతో, మంచి సంపదలు కలుగగా వారివారి నగరాలకు వెళ్లారు.

**క. హరిమంగళగుణకీర్తన, నిరతముఁ గావించుచును వినిర్మలమతులై**
**గురుబంధుపుత్త్రజాయా, పరిజన మలరంగఁ గృష్ణుఁ బద్మదళాక్షున్. 760**

**ప్రతి :** హరిమంగళగుణకీర్తనన్= శ్రీకృష్ణునికల్యాణగుణాల స్తుతిని; నిరతమున్= ఎల్లప్పుడును; కావించుచునున్= చేస్తూ; వినిర్మలమతులు+ఐ= మిక్కిలి స్వచ్ఛమైన మనస్సు గలవారై; గురు= తల్లిదండ్రులు; బంధు= చుట్టాలు; పుత్ర= కుమారులు; జాయా= భార్యలు; పరిజనము= సేవకులు; అలరన్+కన్= ఆనందింపగా; పద్మదళ+అక్షున్= తామర రేకులవంటి కన్నులుగల; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి...

**తా :** శ్రీకృష్ణుని కల్యాణ గుణాలు సదా కీర్తిస్తూ ఎంతో స్వచ్ఛమైన మనస్సుగలవారై తల్లిదండ్రులు, బంధువులు, తనయులు, భార్యలు, సేవకులు ఆనందింప పద్మదళాక్షుడగు శ్రీకృష్ణుణ్ణి

**వ. బహుప్రకారంబులం బొగడుచుఁ దమ తమ దేశంబులకుం జని. 761**

**ప్రతి :** బహుప్రకారంబులన్= అనేకరీతుల; పొగడుచున్= స్తుతిస్తూ; తమతమ= తమతమ; దేశంబులకున్+చని= దేశాలకు వెళ్లి...

**తా :** శ్రీకృష్ణుని బహువిధాలుగా స్తుతిస్తూ తమ తమ దేశాలకు వెళ్లి

**క. నళినదళలోచనుఁడు దముఁ, దెలిపిన సద్ధర్మపద్ధతినిఁ దగవరులై**
**యిలఁ బరిపాలించుచు సుఖ, ముల నుండిరి మహితనిజవిభుత్వము లలరన్. 762**

**ప్రతి :** నళినదళలోచనుఁడు= తామర రేకులవంటి కన్నులుగల శ్రీకృష్ణుడు; తమున్= తమనుగూర్చి; తెలిపిన= తెలియ పరచిన; సద్ధర్మ పద్ధతినిన్= మేలైన ధర్మమార్గాన్ని; తగవరులు+ఐ= న్యాయనిర్ణేతలై; ఇలన్= భూమిని; పరిపాలించుచున్= పాలనం చేస్తూ; మహితనిజవిభుత్వములు= గౌరవంతోడి తమ ప్రభుత్వాలు; అలరన్= ప్రకాశించగా; సుఖములన్= సుఖాలతో; ఉండిరి= ఉన్నారు.

**తా :** ఆ రాజులు పద్మదళనేత్రుడైన శ్రీకృష్ణుడు తమకు బోధించిన ధర్మమార్గాల్లో క్రమంతప్పక నడచుకొంటూ తమ మేలైన పరిపాలనవిధానాలు ప్రకాశించగా భూమిని ఏలుతూ సుఖాలు అనుభవించసాగారు.

**వ. ఇట్లు కృష్ణుండు జరాసంధవధంబును, రాజలోకంబునకు బంధమోక్షణంబును గావించి, వాయునందనవాసవనందనులుం దాను జరాసంధతనయుండగు సహదేవుండు సేయు వివిధంబులగు పూజలు గైకొని, యతని నుండ నియమించి, యచ్చోటు గదలి కతిపయప్రయాణంబుల నింద్రప్రస్థ పురంబునకుం జనుదెంచి, తద్ద్వారప్రదేశంబున విజయశంఖంబులు పూరించినఁ బ్రతిపక్షభయదంబును, బాంధవప్రమోదంబును నగు న మ్మహాఘోషంబు విని, పౌరజనంబులు జరాతనయుమరణంబు నిశ్చయించి సంతసిల్లిరి. వారిజాక్షుండును భీమసేన పార్థులతోఁ బురంబు ప్రవేశించి ధర్మనందనునకు వందనం బాచరించి, తమ పోయిన తెఱంగును, నచ్చట జరాసంధుని వధియించిన ప్రకారంబును సవిస్తరంబుగా నెఱింగించిన నతండు విస్మయవికచలోచనంబుల నానందబాష్పంబులు గురియ, న మ్మాధవుమాహాత్మ్యంబునకుఁ దమయందలి భక్తిస్నేహదయాదిగుణంబులకుం బరితోషంబు నొందుచుఁ గృష్ణునిం జూచి యిట్లనియె. 763**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; జరాసంధ వధంబును= జరాసంధుణ్ణి చంపడం; రాజలోకంబునకున్= రాజుల సమూహానికి; బంధమోక్షణంబు= చెరనుండి విడుదల కలిగించడం; కావించి= చేసి; వాయునందన వాసవనందనులున్= = వాయునందన భీముడూ, అర్జునుడును; తానునున్= తానూ; జరాసంధతనయుండు+అగు సహదేవుండు= జరాసంధుని కొడుకైన సహదేవుడు; చేయు= చేసే; వివిధంబులు+అగు= అనేకవిధాలైన; పూజలు+కైకొని= పూజలను స్వీకరించి; అతనిన్= ఆ సహదేవుణ్ణి; ఉండన్= ఆగుమని; నియమించి= ఆజ్ఞాపించి; ఆ+చోటు+కదలి= ఆ ప్రదేశంనుండి బయలుదేరి; కతిపయప్రయాణంబులన్= కొన్ని ప్రయాణాలు చేసి; ఇంద్రప్రస్థపురంబునకున్=

ఇంద్రప్రస్థనగరానికి; చనుదెంచి= వచ్చి; తత్+ద్వార ప్రదేశంబునన్= ఆ నగరి వాకిలి ముందట; విజయ శంఖంబులు= తమ గెలుపును వ్యక్తం చేసేశంఖాలు; పూరించినన్= ఊదగా; ప్రతిపక్ష భయదంబును= పగవారికి భయం కలుగజేసేదీ; బాంధవ ప్రమోదంబును= బంధుజనులకు ఆనందదాయకమూ; అగు= అయిన; ఆ+మహాఘోషంబు విని= ఆ పెద్దధ్వనులను విని; పౌరజనంబులు= పురజనులు; జరాతనయుమరణంబు= జరాసంధునిచావు; నిశ్చయించి= నిజమని నమ్మి; సంతసిల్లిరి= సంతోషించారు; వారిజ+అక్షుండును= శ్రీకృష్ణుడూ; భీమసేన పార్థులతోన్= భీమార్జునులతో; పురంబు ప్రవేశించి=పురంలోనికి వచ్చి; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; వందనంబున్= నమస్కారాన్ని; ఆచరించి= చేసి; తమ పోయిన తెఱంగును= తాము వెళ్లిన విధం; అచ్చటన్= అక్కడ; జరాసంధునిన్= జరాసంధుణ్ణి; వధియించిన= చంపిన; ప్రకారంబును= విధానాన్ని; సవిస్తరంబుగాన్= విపులంగా; ఎఱింగించినన్= చెప్పగా; అతండు= ఆ ధర్మరాజు; విస్మయ= ఆశ్చర్యంతో; వికచలోచనంబులన్= విప్పారిన కన్నులలో; ఆనందబాష్పంబులున్= ఆనందంవల్ల వచ్చిన కన్నీరు; కురియన్= కురియగా; ఆ+మాధవు= ఆ శ్రీకృష్ణునియొక్క; మాహాత్మ్యంబునకున్= మహిమకు; తమ+అందలి= పాండవులయందుగల; భక్తిస్నేహ దయా+ఆది గుణంబులకున్= భక్తి, స్నేహం, దయ మొదలైన గుణాలకు; పరితోషంబున్= చాల ఆనందాన్ని; ఒందుచున్= పొందుతూ; కృష్ణునిన్+చూచి= శ్రీకృష్ణుణ్ణిచూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా శ్రీకృష్ణుడు జరాసంధుణ్ణి చంపి, ఆయనచే చెరలో పెట్టబడిన రాజులను చెరనుండి విడిపించి, భీమార్జునులు తాను జరాసంధునికొడుకైన సహదేవుడు చేసిన మర్యాదలు స్వీకరించి, అతణ్ణి రాజ్యంలో నిలిపి, అందుండి బయలుదేరి కొన్నిప్రయాణాలు చేసి, ఇంద్రప్రస్థపురానికి వచ్చి, ఆ పురద్వారంలో నిలిచి, తమ విజయగాథను తెలియపరిచేతీరులో శంఖనాదం చేయగా ఆ పట్టణంలోని జనులు జరాసంధుడు మరణించాడని సంతోషించారు. ఆ మహాధ్వని శత్రువులకు భయం కలిగేటట్లు, బంధుజనులకు ఆనందాన్ని కలిగించేటట్లు ఉంది. శ్రీకృష్ణుడు భీమార్జునులతో నగరంలోకి వచ్చి, ధర్మరాజుకు నమస్కరించి - తాము వెళ్లిన విధానం, జరాసంధుణ్ణి చంపిన పద్ధతీ, చెరసాలలోని రాజులందరను విడిపించిన విశేషాల్ని సవివరంగా తెలియజేశాడు. ఆ విషయాలు విని ధర్మరాజు శ్రీకృష్ణుని మహిమకు, తమ విషయంలో అతనికి గల భక్తి, స్నేహం, దయ మొదలైన గుణాలకు ఎంతో ఆనందిస్తూ శ్రీకృష్ణుణ్ణి చూచి ఇలా చెప్పాడు.

**సీ. 'కమలాక్ష! సర్వలోకములకు గురుఁడవై తేజరిల్లెడు భవదీయమూర్తి**
**యంశాంశసంభవు లగు లోకపాలురు నీ యాజ్ఞఁ దల మోచి నిఖిలభువన**
**పరిపాలనిపుణులై భాసిల్లుచున్న వా రట్టి నీ కొక నృపునాజ్ఞ సేయు**
**టరయ నీమాయ గాకది నిక్కమే? యేక మై యద్వితీయమై యవ్యయంబు**

**తే. నైన నీ తేజమున కొక హాని గలదె?, చిన్మయాకార! నీ పాదసేవకులకు**
**నాత్మపరభేదబుద్ధి యెందైనఁ గలదె? పుండరీకాక్ష! గోవింద! భువనరక్ష! 764**

**ప్రతి :** కమల+అక్ష!= పద్మాలవంటి కన్నులుగల ఓ శ్రీకృష్ణా!; చిద్+మయ+ఆకార!= జ్ఞాన స్వరూపుడా!; పుండరీక+అక్ష!= తెల్లతామరలవంటి కన్నులు గల స్వామీ!; గోవింద!= వేదాలచే తెలియబడేవాడా!; భువనరక్ష!= రక్షించేవాడా!; సర్వలోకములకున్= అన్ని లోకాలకు; గురుఁడవు+ఐ= తండ్రివై; తేజరిల్లెడు= ప్రకాశించే; భవదీయమూర్తి= నీయొక్క మూర్తి; అంశ+అంశసంభవులు= అంశ యొక్క కళనుండి పుట్టినవారు; అగు లోకపాలురు= అయిన లోకాలను పాలించేవారు (రాజులు); నీ+ఆజ్ఞన్= నీ ఉత్తరువును; తలమోచి= శిరసావహించి; నిఖిలభువన పరిపాల నిపుణులు+ఐ= ఎల్ల లోకాల్ని

ఏలగల నైపుణ్యం గలవారై; భాసిల్లుచున్న వారు= ప్రకాశిస్తున్నారు; అట్టి నీకున్= అటువంటి శక్తియుక్తుడవగు నీకు; ఒక నృపున్= ఒక రాజుయొక్క; ఆజ్ఞ+చేయుట= చెప్పిన పనిచేయటం; అరయన్= చూడగా; నీ మాయ+కాక= నీయొక్క మాయకాక; అది నిక్కము+ఏ= అది నిజమా?; ఏకము+ఐ= ఒక్కటే అయి; అద్వితీయము+ఐన= తనవంటిది మరొకటి లేనిదైన; అవ్యయంబును+ఐన= నాశనం లేనిదైన; నీ తేజమునకున్= నీ యొక్క ప్రకాశానికి; ఒక హాని గలదు+ఎ= ఏ విధమైన చెరుపైనా కలదా?; నీ పాదసేవకులకున్= నీ సేవించేవారికి; ఎందున్+ఐనన్= ఎక్కడైనా; ఆత్మపర భేదబుద్ధి= నేను, ఇతరులు అనే ఆలోచన; కలదు+ఎ= కలదా? (ఉండదని భావం)

**తా :** 'ఓ శ్రీకృష్ణా! నీ అంశతో బుట్టిన వారైన రాజులు నీ ఆజ్ఞను శిరసావహించి ఎల్ల లోకాలు ఏలుటకు సమర్థులై ఉన్నారు. అట్టి నీవు ఒక రాజు చెప్పిన పని చేయటం నీ మాయ కాక నిజమా? ఏక స్వరూపుడవు, అద్వితీయుడవు, నాశం లేనివాడవు అయిన నీ ప్రకాశానికి ఎప్పటికైన హాని ఉందా? లేదు. జ్ఞాన స్వరూపుడవు, పుండరీకాక్షుడవు, వేదాలచే తెలియబడేవాడవు, లోక రక్షకుడవు అయిన నీ అడుగులను నమ్మి కొలిచే వారికి తాను, ఇతరుడు అనే భేదబుద్ధి ఉంటుందా! (ఉండదు?)

## ❖ ధర్మరాజు చేసెడి రాజసూయమునందు శ్రీకృష్ణుండు శిశుపాలుని వధించుట ❖

**వ. అని గోవిందునిం బొగడి యద్దేవు ననుమతంబునం గుంతీసుతాగ్రజుండు పరతత్త్వవిజ్ఞానులైన ధరణీసురులను ఋత్విజులంగా వరియించి. 765**

**ప్రతిపదార్థం :** అని= పైన తెల్పిన విధంగా; గోవిందునిన్= శ్రీకృష్ణుణ్ణి; పొగడి= ప్రశంసించి; ఆ+దేవున్= దివ్యమైన తేజస్సుతో ప్రకాశిస్తున్న ఆ శ్రీకృష్ణునియొక్క; అనుమతంబునన్= అంగీకారంతో; కుంతీసుత+అగ్రజుండు= కుంతీదేవియొక్క కుమారులలో పెద్దవాడైన ధర్మరాజు; పరతత్త్వ విజ్ఞానులు+ఐన= ఉత్కృష్టమయిన భగవంతుని నిజ స్వభావాన్ని విశదంగా తెలిసికొన్న వారైన; ధరణీసురులను= భూదేవతలను (బ్రాహ్మణులను); ఋత్విజులన్+కాన్= యజ్ఞాన్ని చేయించేవారుగా; వరియించి= (శాస్త్రోక్తరీతి ననుసరించి) ఏర్పరచుకొని...

**తాత్పర్యం :** ధర్మరాజు జరాసంధుణ్ణి జయించి భీమార్జునులతో ఇంద్రప్రస్థపురానికి వచ్చిన శ్రీకృష్ణుని గొప్పతనాన్ని పలుతెరగుల ప్రస్తుతించాడు. అటుపిమ్మట ఆ దేవదేవునిఅంగీకారంతో, వేదవిదులూ, బ్రహ్మవేత్తలూ అయిన బ్రాహ్మణులను రాజసూయయాగానికి ఋత్విక్కులుగా (నిర్వాహకులుగా) స్వీకరించాడు.

**సీ. సాత్యవతేయ కశ్యప భరద్వాజోపహూతి విశ్వామిత్ర వీతిహోత్ర**
**మైత్రేయ పైల సుమంతు మధుచ్ఛంద గౌతమ సుమతి భార్గవ వసిష్ఠ**
**వాసుదేవాకృతవ్రణ కణ్వ జైమిని ధౌమ్య పరాశరాథర్వ కవషు**
**లసిత వైశంపాయ నాసురి భార్గవ క్రతు వీరసేన గర్గ త్రికవ్య**

**ఆ. ముఖ్యులైన పరమమునులను గృపుని గాం, గేయ కుంభ జాంబికేయ విదుర**
**కురుకుమార బంధుకులవృద్ధధారుణీ, సుర నరేంద్ర వైశ్యశూద్రవరుల. 766**

**ప్రతి :** సాత్యవతేయ= సత్యవతీ పరాశరుల తనయుడైన వేదవ్యాసుడు; కశ్యప= మొట్టమొదటి ప్రజాపతియైన కశ్యపుడు; భరద్వాజ+ఉపహూతి= వాల్మీకిశిష్యుడైన భరద్వాజుడూ, ఉపహూతి; విశ్వామిత్ర= గాధిపుత్రుడైన విశ్వామిత్రుడు; వీతిహోత్ర= వీతిహోత్రుడనే పేరుగల ఋషి; మైత్రేయ= మైత్రేయుడు; పైల= వేదవ్యాస శిష్యుడైన పైలుడు; సుమంతు= వేదవ్యాస శిష్యుడైన సుమంతుడు; మధుచ్ఛంద= విశ్వామిత్రుని పుత్రుడు (ఛందస్సు మధువువలె స్రవించేదిగనుక ఆ పేరు); గౌతమ= అహల్య భర్త – గౌతమధర్మశాస్త్ర కర్త అయిన గౌతముడు; సుమతి; భార్గవ= భృగుమహర్షి కొమరుడైన చ్యవనుడు; వసిష్ఠ= వసిష్ఠుడు; వామదేవ+అకృతవ్రణ= వామదేవుడు, అకృతవ్రణుడు; కణ్వ= విశ్వామిత్రుడు మేనకకు పుట్టిన శకుంతలను పెంచి పెద్ద చేసినవాడైన కణ్వుడు; జైమిని= వ్యాస శిష్యుడు; ధౌమ్య= ధర్మరాజు పురోహితుడైన ధౌమ్యుడు; పరాశర+అథర్వ+కవషులు= వ్యాసుని తండ్రి పరాశరుడు, అథర్వుడు, కవషుడు; అసిత= అసితుడు; వైశంపాయన+ఆసురి= వ్యాస శిష్యుడైన వైశంపాయనుడు, ఆసురి; భార్గవ= భృగువంశీయుడైన పరశురాముడు; క్రతు= క్రతువు; వీరసేన= వీరసేనుడు; గర్గ= శ్రీకృష్ణునికి నామకరణం చేసిన గర్గుడు; త్రికవ్యముఖ్యులు+ఐన= త్రికవ్యుడు మొదలగు ప్రసిద్ధులయిన; పరమమునులను= తపోధనులైన ఉత్తమ మునీంద్రులను; కృపునిన్= కృపాచార్యుణ్ణి; గాంగేయ= గంగానందనుడైన భీష్ముణ్ణి; కుంభజ+ఆంబికేయ= ద్రోణాచార్యుణ్ణి, అంబిక కుమారుడైన ధృతరాష్ట్రుణ్ణి; విదుర= విదురుణ్ణి; కురుకుమార= ధృతరాష్ట్రుణ్ణి నూరుగురు కుమారుల్ని; బంధు= చుట్టాలను; కులవృద్ధ= కురువంశంలోని తదితరవృద్ధజనులను అందరినీ; ధారుణీసుర నర+ఇంద్ర వైశ్య శూద్రవరులన్= శ్రేష్ఠులయిన బ్రాహ్మణులను, క్షత్రియులను, వైశ్యులను, శూద్రులనూ (రప్పించాడు)...

**తా :** ధర్మరాజు – వేదవ్యాసుడు, కశ్యపుడు, భరద్వాజుడు, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, చ్యవనుడు, జైమిని, ధౌమ్యుడు, పరాశరుడు, వైశంపాయనుడు, పరశురాముడు మొదలుగాగల మహర్షి పుంగవులను, గురువులయిన కృపాచార్య, ద్రోణాచార్యులను, కురువృద్ధులయిన భీష్మవిదురులను, పెదతండ్రి ధృతరాష్ట్రుని, ఆయన పుత్రులను, కులపెద్దలు మొదలైన సమస్తబంధువులను, బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య జనులలో ప్రముఖులైనవారలను రాజసూయయాగానికి సాదరంగా ఆహ్వానించాడు.

**క.** **రప్పింప వారు హర్షము, లుప్పతిలఁగ నేఁగుదెంచి యుచితక్రియలం**
**దప్పక కనుఁగొనుచుండఁగ, నప్పుడు విధ్యుక్తనియతులై భూమిసురుల్.** **767**

**ప్రతి :** రప్పింపన్= ఎంతో ఆదరంతో పిలిపించగా; వారు= ఆ పిలువబడినవాళ్లందరూ; హర్షములు= సంతోషాలు; ఉప్పతిలన్+కన్= కలుగగా; ఏఁగు+తెంచి= వచ్చి; ఉచితక్రియలన్= చక్కగా జరుపబడుతున్న అక్కడి పనులను; తప్పక= విడువకుండా; కనున్+కొనుచున్+ఉండన్+కన్= ఆసక్తితో చూస్తూ ఉండగా; అప్పుడు= ఆ సమయంలో; భూమిసురుల్= యాగం చేయించటానికి వచ్చిన బ్రాహ్మణులు; విధి+ఉక్త= శాస్త్రంలో పేర్కొనబడ్డ; నియతులు+ఐ= నియమాలు అనుసరించినవారై...

**తా :** ధర్మరాజుచే ఆహ్వానితులైన ఆ ఋషులు, గురువర్యులు, బంధుజనులు, పురప్రముఖులు మొదలైనవాళ్లంతా ఆనందాతిశయంతో రాజసూయయాగం జరిగే ప్రదేశానికి తరలివచ్చి, అక్కడ జరుగుతున్న కార్యక్రమాలు కుతూహలంతో తిలకిస్తూ ఉండారు. ఆ సందర్భంలో ఋత్విజులైన విప్రులు (యుధిష్ఠిరునికి యజ్ఞదీక్షను ఇచ్చేకార్యాన్ని చేపట్టారు)

**ఆ.** **కడఁగి సవనభూమిఁ గనకలాంగలముల, నర్థి దున్ని పాండవాగ్రజునకు**
**నచట దీక్షచేసి యంచితస్వర్ణ మ, యోపకరణముల నలోపముగను,** **768**

**ప్రతి :** కడఁగి= పూనుకొని; సవనభూమిన్= యజ్ఞంచేసే ప్రదేశాన్ని; కనక లాంగలములన్= బంగారు నాగళ్లచే; అర్థిన్= ఆసక్తితో; దున్ని= చాళ్లుపడేలాగున చక్కగా దున్ని, అందులో అపవిత్రమైన వస్తువులేవీ లేకుండా పరిశీలించి; పాండవ+అగ్రజునకున్= పాండవులలో పెద్దవాడైన ధర్మజునికి; అచటన్= దున్ని చదునుచేసి పవిత్రీకరించిన ఆ యజ్ఞభూమియందు; అంచిత= మిగుల ఒప్పియున్నవైన; స్వర్ణమయ= బంగారుతో చేయబడిన; ఉపకరణములన్= సాధనములచే; అలోపముగను చేసి= ఏలాంటి కొదువ లేకుండా; దీక్షచేసి= యజ్ఞకార్యాను విధి ప్రకారంగా పూనుకొనేట్టు చేసి...

**తా :** రాజసూయ యాగం నిమిత్తమై ఉద్దేశించిన ప్రదేశంలో ఋత్విక్కులైన బ్రాహ్మణులు బంగారునాగళ్లతో బాగా దున్ని, శుద్ధి కావించారు. అనంతరం బంగారు పరికరాలతో విధి విహితంగా ధర్మరాజును యజ్ఞకార్య దీక్షితుణ్ణి కావించారు.

**విశే :** యజ్ఞదీక్షితునికి నిత్యం నిర్వహింపవలసిన సంధ్యావందనాది కార్యాలతోపాటుగా బ్రహ్మచర్య నియమం, ఆహార నియమం, భూమిపై పరుండటం లాంటి నియమాలు నిర్దేశింపబడి ఉంటాయి. 'యజమాని' అయిన వ్యక్తి యజ్ఞకార్యనిర్వహణకు సంకేతంగా దీక్షాకంకణాన్ని దీక్షావస్త్రాలను ధరించి ఉండాలి, ఆ యజ్ఞం పరిసమాప్తి అయ్యేంతవరకు అతడు యజ్ఞవాటికను విడిచి వెళ్లకూడదు. 'యజ్ఞం' పవిత్రమయిన కార్యం కాబట్టి, యజ్ఞం చేసేవారూ, చేయించేవారూ నియమనిష్ఠలతో ఉండాలి – అనేది సారాంశం.

**వ. ఇట్లు నియమంబున సముచితక్రియాకలాపంబులు నడపుచుండి రప్పుడు. 769**

**ప్రతి :** ఇట్లు = ఈ రీతిగా; నియమంబునన్= శాస్త్రంలో చెప్పబడిన విధంగా; సముచిత= మిక్కిలి తగియున్న; క్రియా కలాపంబులు= పనుల సమూహాలను; నడపుచున్+ఉండిరి= ఋత్విజులు జరుపుతూ ఉండినారు; అప్పుడు= ఆ యాగం ప్రారంభిస్తూ ఉన్న వేళలో...

**తా :** ఈ విధంగా బ్రాహ్మణులు నియమానుసారంగా ఆయా సముచిత కార్యాలను నిర్వహిస్తూ ఉండినారు. ఆ సమయంలో ధర్మరాజు

**క. సకలావనీశు లిచ్చిన, యకలంక సువర్ణరత్న హయధనవస్త్ర**
**ప్రకరంబులు మొదలగు కా, నుక లందుకొనన్ సుయోధనుని నియమించెన్. 770**

**ప్రతి :** సకల= సమస్తమైన; అవని+ఈశులు= భూమండలంలోని ఆయా రాజ్యాలను పాలించే రాజులు; ఇచ్చిన= సమర్పించిన; న+కలంక= ఎలాంటి మచ్చలేని; సువర్ణ= బంగారం; రత్న= తొమ్మిది రకాలైన రత్నాలు; హయ= మేలైన గుర్రాలు; వస్త్ర= పట్టువస్త్రాలు; ప్రకరంబులు= వీటన్నింటియొక్క సముదాయాలు; మొదలు+అగు= ఇలాంటి అనేకరకాలైన; కానుకలు= బహుమానాలను; అందుకొనన్= స్వీకరించటానికి; సుయోధనుని= ధృతరాష్ట్రుని పెద్ద కుమారుడైన దుర్యోధనుణ్ణి; నియమించెన్= ఏర్పాటు చేశాడు.

**తా :** ధర్మరాజు రాజసూయయాగంలో రాజులందరూ తనకు కానుకలుగా సమర్పించే ధన కనక వస్త్ర వాహనాది వస్తు సమూహాల నన్నింటినీ స్వీకరించే నిమిత్తంగా పెదతండ్రి కొడుకుల్లో పెద్దవాడైన సుయోధనుణ్ణి నియమించాడు.

**సీ. అర్థిజాతము గోరినట్టి వస్తువు లెల్లఁ దగఁ బంచి యిడఁగ రాధాతనూజు**
**సరసాన్నపానాదిసకలపదార్థముల్ పాకముల్ సేయింపఁ బవనతనయుఁ**

**బంకజోదరు నొద్దఁ బాయక పరిచర్య దవిలి కావింప వాసవతనూజు**
**సవననిమిత్తంబు సంచితద్రవ్యంబు పెంపుతో వేగఁ దెప్పింప నకులు**

**తే. దేవగురువృద్ధధాత్రీసురావళులను, నరసి పూజింప సహదేవు నఖిలజనులఁ**
**బొలుచు మృష్టాన్నతతులఁ దృప్తులను జేయ, ద్రౌపదిని నియమించెను ధర్మసుతుఁడు. 771**

**ప్రతి :** ధర్మసుతుఁడు= ధర్మరాజు; అర్థిజాతము= యాచకులగుంపు; కోరిన+అట్టి= కావాలని అడిగిన; వస్తువులు+ఎల్లన్= వస్తువుల నన్నింటిని; తగన్= చక్కగా; పంచి+ఇడఁగన్= వేరువేరుగా తీసి ఇవ్వడానికి (దానం చేయడానికి); రాధాతనూజున్= కర్ణుణ్ణి; సరస= రసవంతాలైన (రుచికరాలైన); అన్నపాన+ఆది= ఆహారం, తాగేనీళ్లు మొదలైన; సకలపదార్థముల్= రకరకాలైన భోజనవస్తువుల్ని; పాకంబు+చేయింపన్= తగినట్లు రుచికరంగా వండించటానికి; పవనతనయున్= భీమసేనుణ్ణి; పంకజ+ఉదరుని+ఒద్దన్= శ్రీకృష్ణుని సన్నిధిలో; పాయక= విడువక; తవిలి= మక్కువ గలిగి; పరిచర్య= సేవ; కావింపన్= చేయడానికి; వాసవతనూజున్= అర్జునుణ్ణి; సవననిమిత్తంబు= రాజసూయయాగంకోసం; సంచితద్రవ్యంబున్= సేకరించి ఉంచిన ధనాన్ని; పెంపుతోన్= వైభవంతో; వేగన్+తెప్పింపన్= యజ్ఞంచేస్తున్న చోటికు త్వరగా తెప్పించడానికి; నకులున్= నకులుణ్ణి; దేవ= ఇంద్రాది దేవతలను; గురు= కృపాచార్య, ద్రోణచార్యాది గురువర్యులను; వృద్ధ= బాహ్లికుడు, భీష్ముడు మొదలుగాగల పెద్దలను; ధాత్రీసుర= వేదవ్యాస, కశ్యపాదిబ్రాహ్మణోత్తములయొక్క; ఆవళులను= సమూహాలను; అరసి= చక్కగా తెలుసుకొని; పూజింపన్= అర్హతను అనుసరించి పూజించడానికి; సహదేవున్= సహదేవుణ్ణి; అఖిలజనులన్= యజ్ఞం చూడడానికి వచ్చిన యావన్మందిని; పొలుచు= కంటికి ఇంపుగా ప్రకాశిస్తున్న; మృష్ట+అన్నతతులన్= నిర్మలమైన వేర్వేరు భోజనపదార్థాల సముదాయాలచేత సంతోషింపచేయడానికి; ద్రౌపదిన్= పట్టపురాణియైన ద్రౌపదీదేవిని; నియమించెను= ఏర్పాటు కావించాడు.

**తా :** ధర్మరాజు యాగానికి విచ్చేసిన అందరినీ తగినట్లు ఆదరించేందుకు అనువుగా, తనకు ఆప్తులైనవారిని ఈ కింది విధంగా ఆయా ముఖ్య బాధ్యతల్లో నియమించాడు.

యాచకబృందాల కోరికలను తీర్చటానికి కర్ణుణ్ణి, చతుర్విధాలైన ఆహారపదార్థాలను కమ్మగా వండించటానికి భీముణ్ణి, శ్రీకృష్ణుణ్ణి సేవించటానికి అర్జునుణ్ణి, దక్షిణలు మున్నగువాటికోసం ధనాన్ని తెప్పించటానికి నకులుణ్ణి, దేవ బ్రాహ్మణులను, గురువులను, పెద్దలను అనుగుణంగా అర్చించి గౌరవించటానికి సహదేవుణ్ణి, సమస్త ప్రజానీకాన్ని రుచికరమైన ఆహారపదార్థాలతో సంతోషింపచేయడానికి ద్రౌపదీదేవిని నియమించాడు.

**వ. అ య్యవసరంబున. 772**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ విధంగా రాజసూయయాగం కొనసాగుతూ ఉన్న సమయంలో...

**తా :** అలా ధర్మపుత్రునియాగం కొనసాగుతూ ఉండగా

**చ. హరి శిఖి దండపాణి నికషాత్మజ పాశి సమీర గుహ్య కే**
**శ్వర శశిమౌళి పంకరుహసంభవ చారణ సిద్ధ సాధ్య కి**
**న్నర గరుడోరగామరగణంబులు వచ్చి మఖంబుఁ జూచి య**
**చ్చెరువడి తొల్లి యెవ్వరును జేయుమఖంబులు నింత యొప్పునే? 773**

**ప్రతి :** హరి= దేవేంద్రుడు; శిఖి= అగ్నిదేవుడు; దండపాణి= యమధర్మరాజు; నికష+ఆత్మజ= నైరృతి; పాశి= వరుణుడు; గుహ్యక+ఈశ్వర= కుబేరుడు; శశిమౌళి= ఈశ్వరుడు; పంకరుహ సంభవ= బ్రహ్మదేవుడు; చారణ= దేవగాయకులు; సిద్ధ సాధ్యకిన్నర= ఎనిమిది విధాలైన సిద్ధులు (శక్తులు)గల దివ్యజాతీయులు; గరుడ= గరుడులనే పేరుగల దివ్యపక్షుల తెగకు చెందినవారు (గరుత్మంతుని వంశీయులు); ఉరగ= దివ్య సర్పాలు; అమరగణంబులు= దేవతలు– వీరందరియొక్క సమూహాలు; వచ్చి= ఆ ప్రదేశానికి చేరుకొని; మఖంబున్+చూచి= రాజసూయ యజ్ఞాన్ని కన్నులార కాంచి; అచ్చెరువు+పడి= ఆశ్చర్యపడి; తొల్లి= పూర్వకాలంలో; ఎవ్వరునున్= ఎందరో గొప్పవారుకూడా; చేయు మఖంబులు= చేసిన రాజసూయ యాగాలు; ఇంత+ఒప్పున్+ఏ?= ఇంతటి వైభవంతో ప్రకాశించాయా? (లేదు – అని సారాంశం)

**తా :** అప్పుడు దేవేంద్రుడు మొదలైన దిక్పాలకులూ, బ్రహ్మాది దేవతలూ, కిన్నర సిద్ధ సాధ్య గరుడ చారణాది దేవబృందాలూ ధర్మజుడు నిర్వహిస్తూ ఉండిన యజ్ఞాన్ని చూచి, 'పూర్వం ఏ రాజన్యుడు కూడా ఇంత గొప్పగా రాజసూయాన్ని చెయ్యలేదు' – అని ఎంతగానో మెచ్చుకొన్నారు.

**క. అదిగాక యిందిరావిభు, పదములు సేవించునట్టి భాగ్యము గలుగం**
**దుదిఁ బడయరాని బహు సం, పద లెవ్వియుఁ గలవె? యనుచుఁ బ్రస్తుతి సేయన్. 774**

**ప్రతి :** అది+కాక= అంతే కాకుండా; ఇందిరా విభు= లక్ష్మీదేవికి పతియైన శ్రీకృష్ణునియొక్క; పదములు= చరణాలను; సేవించు+అట్టి= భక్తితో ఆరాధించే; భాగ్యము+కలుగన్= అదృష్టం లభించడంవల్ల; తుదిన్= అలా సేవించిన పిదప; పడయరాని= పొందరాని; బహుసంపదలు= అనేకవిధాలైన ఐశ్వర్యాలు; ఎవ్వియున్+కలవు+ఎ?= ఏవైనా ఉన్నాయా? (ఉండనే ఉండవు); అనుచున్= అంటూ; ప్రస్తుతి+చేయన్= ధర్మతనయుని భాగ్యాన్ని కొనియాడుతూ ఉండగా.

**తా :** అంతేగాక, లక్ష్మీనాథుడైన శ్రీకృష్ణుని పాదపద్మాలను భక్తితో సేవించే అదృష్టంకలవాళ్లకు (ధర్మరాజాదులకు) పొందలేని సంపదలేవీ ఉండవు కదా! – అని బ్రహ్మాదిదేవతలు, దిక్పాలకులు, తదితరదివ్యగణాలూ పెక్కురీతుల ప్రశంసించారు.

**విశే :** ధర్మరాజు నిర్వహిస్తున్న రాజసూయయాగంయొక్క అపూర్వవైభవానికి కారణం – ఇందులో చక్కగా ఊహింపబడింది. శ్రీకృష్ణుని యెడల ధర్మరాజుకుగల అచంచలభక్తి అందరికీ తెలిసిందేనని ఇందువల్ల వెల్లడౌతూంది.

**వ. అప్పుడు. 775**

**ప్రతి :** అప్పుడు= ఆ విధంగా దేవతలప్రస్తుతులు కొనసాగుతూ ఉండగా...

**చ. అమరసమానులై తనరు యాజకవర్గము లోలి రాజ సూ**
**య మఖవిధానమంత్రముల నగ్నిముఖంబుగఁ జేసి ధర్మజుం**
**గ్రమమున వేలిపింపఁ గ్రతురాజసమాప్తి దినంబునన్ నృపో**
**త్తముఁడు గడంగి యాజకసదస్యగురుద్విజకోటిఁ బెంపునన్. 776**

**ప్రతి :** అమరసమానులు+ఐ= దేవతలతో సాటియైన వాళ్లయి; తనరు= విలసిల్లుతున్న; యాజకవర్గములు= ఋత్విజుల సముదాయాలు; అగ్నిముఖంబు+కన్+చేసి= అగ్నిదేవుణ్ణి ప్రతిష్ఠించి, ఆహ్వానించే కార్యం నిర్వహించి; ఓలిన్= వరుసగా; రాజసూయమఖ= రాజసూయయాగంయొక్క; విధాన= ఆచరించే పద్ధతులను తెల్పునట్టి; మంత్రములన్= వేదమంత్రాలచేత;

క్రమమునన్= వరుస ప్రకారంగా; ధర్మజున్= ధర్మరాజుచేత; వేలిపింపన్= హోమం చేయించగా; క్రతురాజ= యజ్ఞాలన్నింటిలో గొప్పదయిన రాజసూయయాగంయొక్క; సమాప్తి దినంబునన్= ముగింపు రోజున; నృప+ఉత్తముడు= రాజులలో శ్రేష్ఠుడైన ధర్మరాజు; కడంగి= పూనుకొని; యాజక= యజ్ఞం చేయించిన ఋత్విక్కుల; సదస్య= యజ్ఞాన్ని తిలకిస్తూ ఉండిన ప్రధానసభ్యుల; గురు= పూజనీయులైన పెద్దల; ద్విజ= బ్రాహ్మణుల; కోటిన్= సమూహాలను; పెంపునన్= గొప్పగా...

**తా :** దేవతలతో సమానమైన తేజస్సుగల ఋత్విజులు అగ్నిప్రతిష్ఠ చేసి, రాజసూయయాగం ద్వారా ఆ యా హోమద్రవ్యాలను ధర్మతనయునిచేత క్రమంగా వేలిపించి, యజ్ఞాన్ని పరిసమాప్తి కావించారు. ఆ ముగింపురోజున ధర్మరాజు ఆ యా ఋత్విజులనూ, పెద్దలయిన సభాసదులనూ సముచితమైన రీతిని పూజించాలని నిశ్చయించాడు.

**విశే :** దేవతలకు అగ్నిముఖము - అని శాస్త్రప్రమాణం. 'అగ్నిముఖా వై దేవాః' - అని ఆర్షోక్తి. ఇందువల్లనే యజ్ఞాలలో ఆ యా దేవతలను ఉద్దేశించి మంత్రపూర్వకంగా సమర్పించే హవిస్సులు అగ్నిలోనే హోమంచేయబడుతాయి. ఈ పద్యంలో "అగ్నిముఖంబుగఁజేసి" - అనటంలో 'అగ్నిదేవుణ్ణి దేవతలకు ముఖంగా ప్రవర్తించేట్టుగా ప్రార్థించి, హోమకుండంలో అగ్నిని వెలిగించి' - అనే విశేషమైన భావం ఇమిడివుంది.

**వ. పూజించునప్పు డం దగ్రపూజార్హు లెవ్వ రని యడిగిన సదస్యులు దమకుఁ దోఁచిన విధంబులం బలుక వారిభాషణంబులు వారించి వివేకశీలుండును, జతురవచనకోవిదుండును నగు సహదేవుండు భగవంతుండును, యదుకుల సంభవుండును నైన శ్రీకృష్ణునిం జూపి 'యి మ్మహాత్ముని సంతుష్టుం జేసిన భువనంబు లన్నియుం బరితుష్టిం బొందు' నని చెప్పి ధర్మజుం జూచి యిట్లనియె. 777**

**ప్రతి :** పూజించు+అప్పుడు= పైన చెప్పిన వాళ్లందరిని పూజించటానికి పూనుకొన్న వేళలో; అందున్= ఆ పూజింపదగిన వాటిలో; అగ్రపూజా+అర్హులు= మొదటగా పూజించడానికి తగినవారు; ఎవ్వరు= ఏ వ్యక్తి; అని+అడిగినన్= అని ధర్మరాజు ప్రశ్నింపగా; సదస్యులు= సభలో ఉన్నవారు; తమకున్= వారికి; తోఁచిన విధంబులన్= తలపులకు వచ్చిన విధంగా; పలుకన్= తెలియచేయగా; వారి భాషణంబులు= అట్లు పలికిన ఆ యా సభ్యుల మాటలను; వారించి= కాదని; వివేక శీలుండును= చక్కని తెలివితో ఆలోచించే స్వభావంకలవాడూ; చతురవచన కోవిదుండును= నేర్పుగా మాట్లాడటంలో నిపుణుడూ; అగు= అయిన; సహదేవుండు= ధర్మజుని తమ్ములలో చివరివాడైన సహదేవుడు; భగవంతుండును= ఉత్తమ గుణగణాలచే పూజనీయుడు; యదుకులసంభవుండునున్= యదుమహీపతివంశంలో జన్మించినవాడు; ఐన= అయినట్టి; శ్రీకృష్ణున్= శ్రీకృష్ణదేవుణ్ణి; చూపి= సభకు చూపించి; ఈ+మహా+ఆత్మునిన్= గొప్ప మహిమతో గూడిన ఈ పుణ్యాత్ముణ్ణి; సంతుష్టున్+చేసినన్= అగ్రపూజద్వారా సంతోషింపజేస్తే; భువనంబులు+అన్నియున్= సమస్తలోకాలు; పరితుష్టిన్+పొందున్= మిక్కిలి సంతోషాన్ని పొందుతాయి; అని చెప్పి= అని పల్కి; ధర్మజున్+చూచి= అన్నయగు ధర్మనందనునివైపు చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా పూజకు ఉపక్రమించే సందర్భంలో ధర్మసూనుడు 'ఇందులో అగ్రపూజకు అర్హులయిన వారెవరో?' - అని సవినయంగా సభను ప్రశ్నించాడు. సభాసదులు తమకు తోచినట్లు తలకొక రీతిగా కొందరను సూచించారు. అప్పుడు బుద్ధిశాలీ, మాటల్లో నేర్పరీ ఐన సహదేవుడు వారీ మాటల్ని వారించి, భగవానుడైన శ్రీకృష్ణుణ్ణి చూపిస్తూ 'ఈ మహానుభావుణ్ణి అగ్రపూజచే ఆనందింపచేస్తే సకలలోకాలూ సంతోషిస్తాయి' - అని చెప్పి; అన్నయైన ధర్మరాజుతో ఇలా పల్కినాడు.

**ఉ. కాలము దేశమున్ గ్రతువుఁ గర్మముఁ గర్తయు భోక్తయున్ జగ**
**జ్జాలము దైవమున్ గురువు సాంఖ్యము మంత్రము నగ్ని యాహుతుల్**
**వేళలు విప్రులున్ జననవృద్ధిలయంబుల హేతుభూతముల్**
**లీలలఁ దానయై తగ వెలింగెడు నెక్కటితేజ మీశుఁడున్. 778**

**ప్రతి :** కాలము= వసంతాది ఋతువులతో గూడియున్న కాలం; దేశమున్= దేశమంతాను; క్రతువున్= (రాజసూయాది) యజ్ఞమూ; కర్మమున్= చేయబడే ప్రతిపనీ; కర్తయున్= ఆ పనిని చేసేవ్యక్తీ; భోక్తయున్= ఆ పనియొక్క ఫలితాన్ని అనుభవించేవాడూ; జగత్+జాలము= లోకాలన్నీ; దైవము= వాటిని నడపే దైవమూ; గురువు= ఉపదేశకుడైన ఆచార్యుడూ; సాంఖ్యము= తత్త్వజ్ఞానం; మంత్రము= (హోమాది సందర్భాల్లో) ఉచ్చరింపబడే వేదమంత్రం; అగ్ని= (హోమకుండంలోని) అగ్నీ; ఆహుతుల్= (ఆయా దేవతలను ఉద్దేశించి అగ్నిలో వేసే) హోమద్రవ్యాలూ; వేళలు= కాలస్వరూపంలోని విభాగాలైన ఆయా సమయాలూ; విప్రులు= (యజ్ఞయాగాది పవిత్ర కార్యాలు నిర్వహించే) బ్రాహ్మణులూ; జనన= జీవుల పుట్టుకకు; వృద్ధి= పెరుగుదలకు; లయంబుల= వినాశంయొక్క; హేతుభూతముల్= మూలకారణాలు; లీలలన్= (వీటన్నింటియందు) వినోదంగా; తాన+ఐ= తన స్వరూపమే అయినవాడై; తగన్= బాగుగా; వెలింగెడు= ప్రకాశించే; ఎక్కటి తేజము= ఏకైక దివ్యతేజస్సు; ఈశుఁడున్= ఈ చెప్పిన అంతటికీ అధిపతియైనవాడూ; ఇతడు+ఎ= ఈ శ్రీకృష్ణుడే!...

**తా :** యజ్ఞం చేసే కాలం, ఆ యజ్ఞం, అందలి క్రియాకలాపాలు, యజ్ఞంలో ఉచ్చరించేమంత్రాలూ, హోమకుండంలోని అగ్నీ, అందులో వేల్వబడే ఆహుతులూ, యజ్ఞాన్ని చేయించే బ్రాహ్మణులూ, యజ్ఞకర్తా, యజ్ఞఫలభోక్తా, ఈ సమస్త జగత్తులూ, వాటిల్ని నడపే దైవమూ, సకల జీవుల సృష్టి, స్థితి, లయాలూ, వాటి హేతువులూ, వేళలూ – వీటన్నింటిలోనూ అఖండంగానూ, అద్వితీయంగానూ ప్రకాశిస్తూవున్న తేజస్స్వరూపుడు ఈ శ్రీకృష్ణుడే! (అని తెలియదగింది)

**చ. ఇతఁడె యితండు గన్ను లొకయించుక మోడ్చిన నీ చరాచర**
**స్థితభువనంబు లన్నియు నశించు నితం డవి విచ్చిచూచినన్**
**వితతములై జనించుఁ బ్రభవిష్ణుఁడు విష్ణుఁడు నైన యట్టి యీ**
**క్రతుఫలదుండుగా కొరుఁ డొకం డెటు లర్హుఁడు శిష్టపూజకున్? 779**

**ప్రతి :** ఇతడు+ఎ= (ఏక దివ్య స్వరూపుడైన) ఈ శ్రీకృష్ణుడైన; ఇతండు= ఈ శ్రీకృష్ణుడు; కన్నులు= నేత్రాలు; ఒక+ఇంచుక= కొంచెం సేపు; మోడ్చినన్= మూసుకొంటే; చర+అచరస్థిత= కదిలేవీ, కదలనివీ ఐన వస్తువులతో కూడిన; ఈ భువనంబులు+ అన్నియున్= ఈ (విశాల విశ్వంలోని) పదునాలుగు లోకాలూ; నశించున్= నశించిపోతాయి; ఇతండు= ఈ భగవానుడు; అవి= ఆ కన్నులను; విచ్చి చూచినన్= తెరచి చూచినట్లయితే; వితతములు+ఐ= విస్తరించినవై; జనించున్= పుడతాయి; ప్రభవిష్ణుఁడు= ప్రకాశీలుడు; విష్ణుఁడున్+ఐన+అట్టి= అంతటా వ్యాపించి ఉండే విష్ణువు అయినట్టి; ఈ క్రతు ఫలదుండు+కాక= యజ్ఞాలకు ఫలితాలను ప్రసాదించే ఈ శ్రీకృష్ణుడుగాక; ఒరుఁడు+ఒకండు= వేరొక వ్యక్తి; శిష్టపూజకున్= యజ్ఞంలో శ్రేష్ఠుడుగా పూజను స్వీకరించడానికి; ఎటులు+అర్హుఁడు?= ఏ రీతిగా యోగ్యు డవుతాడు? (మరొకడు అర్హుడు కాజాలడని అభిప్రాయం).

**తా :** విష్ణు స్వరూపుడూ, ప్రభావశాలీ అయిన ఈ శ్రీకృష్ణుడు కన్నులు మూసుకొంటే చరాచరాలైన ఈ లోకాలన్నీ నశిస్తాయి; కన్నులు విప్పి చూస్తే ఈ లోకాలన్నీ మళ్లీ జన్మించి విస్తరిస్తాయి. ఇంతేగాక, సమస్తయజ్ఞాలకు ఫలాన్ని ప్రసాదించే ఈ మహాత్ముడే ఇందులో అగ్రపూజకు అర్హుడు. మరొకడెవ్వడూ ఇందుకు యోగ్యుడు కాడు.

**ఉ. ఈ పురుషోత్తమున్ జగదధీశు ననంతుని సర్వశక్తుఁ జి**
**ద్రూపకు నగ్రపూజఁ బరితోషితుఁ జేయ సమస్తలోకముల్**
**వే పరితుష్టిఁ బొందుఁ బృథివీవర! కావున నీవు కృష్ణునిన్**
**శ్రీపతిఁ బూజసేయు మెడసేయక మాటలు వేయు నేటికిన్? 780**

**ప్రతి :** పృథివీవర!= ఓ మహారాజా!; జగత్+అధీశున్= సమస్తలోకాలకు అధిపతియైనవాణ్ణి; న+అంతునిన్= అంతములేనివాణ్ణి; సర్వశక్తున్= సకలశక్తులు గలవాణ్ణి; చిత్+రూపకున్= జ్ఞానమే తన స్వరూపంగా గలిగినవాణ్ణి; ఈ పురుష+ఉత్తమున్= పురుషులందరిలో శ్రేష్ఠుడైన యీ శ్రీకృష్ణుణ్ణి; అగ్రపూజన్= ప్రథమ పూజచేత; పరితోషితున్+చేయన్= చక్కగా సంతోషింపబడినవాడు కాగా; సమస్తలోకముల్= అన్ని లోకాలూ; వే= వెంటనే; పరితుష్టిన్+పొందున్= సమగ్రంగా సంతృప్తి పొందుతాయి; కావునన్= అందువల్ల; నీవు= యజ్ఞకర్తవైన నీవు; శ్రీపతిన్= లక్ష్మీదేవికి భర్తయైనవాణ్ణి; కృష్ణునిన్= ఈ శ్రీకృష్ణుణ్ణి; ఎడ+చేయక= ఆలస్యం చేయకుండా; పూజ+చేయుము= పూజించు; మాటలు వేయున్= ఇక పెక్కు మాటలు; ఏటికిన్= ఎందులకు? (ఈ విషయమై ఇక పెక్కుపల్కులు చెప్పవలసిన పని లేదని అభిప్రాయం).

**తా :** ఓ మహారాజా! సమస్త లోకాలకు అధీశుడూ, అనంతుడూ, సకల శక్తిమంతుడూ, జ్ఞాన స్వరూపుడూ, లక్ష్మీనాథుడూ అయిన ఈ పురుషోత్తముణ్ణి ఇందు అగ్రపూజద్వారా సంతోషింపజేస్తే అఖిలజగాలూ పరిపూర్ణంగా ఆనందిస్తాయి. కాబట్టి, ఆలస్యం లేకుండా ఆ పూజాకార్యాన్ని పూర్తి గావింపగోరుతున్నాను.

**క. అని సహదేవుఁడు పలికిన, విని యచ్చటిజనులు మనుజవిభులు ఋషులున్**
**మునుకొని మనములు మోదము, దనుకఁగ 'నిది లెస్స' యనిరి ధర్మజుఁ డంతన్. 781**

**ప్రతి :** అని= అని పైరీతిగా; పలికినన్= పలుకగా; విని= వినినట్టి; అచ్చటిజనులు= ఆ రాజసూయయాగసభలోని ప్రజలు; మనుజవిభులును= రాజులూ; ఋషులున్= మునీంద్రులూ; మునుకొని= మొదలుకొని క్రమంగా అందరియొక్క; మనములు= వారివారి మనస్సులు; మోదము= సంతోషం; తనుకఁగన్= అతిశయించగా; ఇది= ఇపుడు సహదేవుడు ప్రకటించిన అభిప్రాయం; లెస్స= మిక్కిలి తగి ఉంది; అనిరి= అన్నారు; అంతన్= అట్లు సభాసదులు వెల్లడించిన పిదప; ధర్మజుఁడు= ధర్మరాజు...

**తా :** 'కావున ఆలసింపక నీవు శ్రీకృష్ణుణ్ణి పూజించు' - అని సహదేవుడు ధర్మజునితో చెప్పిన మాటలు వినిన ఆ సభలోని ప్రజలు, రాజులు, ఋషులు మున్నగు వారందరూ మిగుల సంతోషించారు; 'సహదేవునిఅభిప్రాయం సముచితంగా ఉంది' - అన్నారు. అనంతరం ధర్మరాజు

**క. మునిజనమానసమధుకర, వనజాతములైన యట్టి వారిజదళ లో**
**చను పదయుగళప్రక్షా, ళన మొగిఁ గావించి తజ్జలంబులు భక్తిన్. 782**

**ప్రతి :** మునిజనమానస= మునీంద్రుల మనస్సులనే; మధుకర= తుమ్మెదలకు; వనజాతములు+ఐన= పద్మాలయిన; అట్టి= అటువంటి; వారిజదళలోచను= తామరపూరేకలను పోలిన (విశాలమైన, అందమైన) కన్నులుగల శ్రీకృష్ణుని; పదయుగళన్= పాదాల జంటను; ప్రక్షాళనము= బాగుగా కడగడం; ఒగిన్= విధి ప్రకారంగా; కావించి= (శ్రద్ధతో) చేసి; తద్+జలంబులు= అట్లు కడిగిన ఆ నీళ్లను; భక్తిన్= భక్తి భావంతో...

**తా :** అప్పుడు ధర్మరాజు మునీశ్వరుల మనస్సులనే తుమ్మెదలకు పద్మాలవంటివయిన శ్రీకృష్ణునిచరణాలను శ్రద్ధతో కడిగాడు. అట్లు కడిగిన ఆ జలాన్ని భక్తితో

**క. తానును గుంతియు ననుజులు, మానుగ ద్రుపదాత్మజయును మస్తకములఁ బెం**
**పూనిన నియతి ధరించి మ, హానందము బొంది రతిశయప్రీతిమెయిన్. 783**

**ప్రతి :** తానును= ధర్మరాజు తానూ; కుంతియున్= తల్లియైన కుంతీదేవి; అనుజులు= తమ్ములు (భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు అనే నల్వురూ); ద్రుపద+ఆత్మజయును= ద్రుపదుని కూతురైన ద్రౌపదియు; అతిశయప్రీతిమెయిన్= అధికమయిన ఆసక్తితో; పెంపు+ఊనిన= వైభవం ఉట్టిపడుతున్న; నియతిన్= నియమక్రమంతో; మానుగన్= సొంపుగా; మస్తకములన్ ధరించి= శిరములపై ధరించి; మహా+ఆనందమున్= గొప్పదైన సంతోషాన్ని; పొందారు.

**తా :** ధర్మనందనుడు తానూ, తనతల్లి కుంతీదేవీ, నలుగురు సోదరులూ, పత్నిఅయిన ద్రౌపదిదేవీ అత్యంతఆసక్తితో, వైభవం విలసిల్లగా శ్రీకృష్ణునిపాదజలాన్ని తమ తమ శిరస్సులమీద చక్కగా చల్లుకొని, ఎంతో గొప్పగా ఆనందించారు.

**క. చంచత్కాంచనరుచిరో, దంచితవస్త్రముల నూతనార్క ప్రభలన్**
**మించిన రత్నములం బూ, జించెన్ ధర్మజుఁడు కృష్ణు జిష్ణు సహిష్ణున్. 784**

**ప్రతి :** ధర్మజుఁడు= ధర్మనందనుడు; చంచత్= జిగేలుమని ప్రకాశించే; కాంచన= బంగారు (జలతారు)చేత; రుచిర= కాంతులుగలవైన; ఉత్+అంచిత వస్త్రములన్= మిక్కిలి పూజింపదగిన వస్త్రాలతోనూ, (పట్టు) వస్త్రాలచేతను; నూతన+అర్క ప్రభలన్= కొత్తగా ఉదయిస్తున్న సూర్యుని కాంతులను; మించిన= అతిశయించిన కాంతులుగల; రత్నములన్= మణులచేతను; సహిష్ణున్= సమస్తాన్ని సహించే శక్తి గలవాణ్ణి; జిష్ణున్= జయించే స్వభావంకలవాణ్ణి; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; పూజించెన్= గొప్పగా పూజించాడు.

**తా :** బంగారు జలతారు కాంతులతో ఒప్పుతూ ఉన్న పట్టువస్త్రాలతోను, ఉదయిస్తున్న సూర్యునికాంతులను మించిన ప్రకాశమానమైన రత్నాలతోను ధర్మరాజు జయశీలుడయిన శ్రీకృష్ణదేవుణ్ణి (ప్రీతిగౌరవాలతో) పూజించాడు.

**వ. ఇట్లు పూజించి యానందబాష్పజలబిందుసందోహకందళిత నయనారవిందంబులం గోవిందుని సుందరాకారంబు దర్శింపఁ జాలకుండె; నట్లు పూజితుండై తేజరిల్లు పుండరీకాక్షు నిరీక్షించి హస్తంబులు నిజమస్తకంబుల ధరించి వినుతులు సేయుచు, నఖిలజనంబులు జయజయ శబ్దంబు లిచ్చిరి; దేవతలు వివిధతూర్య ఘోషంబులతోడం బుష్పవర్షంబులు గురియించిరి; అయ్యవసరంబున. 785**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; పూజించి= భక్తితో పూజచేసి; ఆనందబాష్పజల= సంతోషంవల్ల కలిగిన కన్నీళ్లయొక్క; బిందుసందోహ= నీటిచుక్కలతో; కందళిత= అంకురించిన (పొంగిన); నయన+అరవిందంబులన్= కమలములవంటి

కన్నులచేత; గోవిందుని= శ్రీకృష్ణునియొక్క; సుందర+ఆకారంబు= మనోహరమయిన స్వరూపాన్ని; దర్శింపన్+చాలక+ ఉండెన్= స్పష్టంగా చూడలేకపోయాడు; అట్లు= ఆ విధంగా; పూజితుండు+ఐ= ధర్మరాజుచే పూజింపబడినవాడై; తేజరిల్లు= ప్రకాశిస్తున్న; పుండరీక+అక్షున్= తెల్లతామరపూలవంటి అందమైన కనులు గలవాణ్ణి (శ్రీకృష్ణుని); అఖిలజనంబులు= ఆ సభలోని ప్రజలందరు; నిర్+ఈక్షించి= చక్కగా దర్శించి; హస్తంబులు= రెండు చేతులును; నిజమస్తకంబులన్= తమ తమ తలలపై; ధరించి= ఉంచి (తలపై దోసిలి ఘటించి నమస్కరిస్తూ); జయజయశబ్దంబులు+ఇచ్చిరి= జయ, జయ అనే పలుకులను (బిగ్గరగా) పలికారు; దేవతలు= స్వర్గలోక మందలి దేవతలు; వివిధ= అనేక విధాలయిన; తూర్య= (మంగళ) వాద్యాలయొక్క; ఘోషంబులతోడన్= (ఇంపైన) ధ్వనులతో పాటుగా; పుష్పవర్షంబులు= పూలవానలను; కురియించిరి= పైనుండి కురిపించారు; ఆ+అవసరంబునన్= అట్టి (శుభ) సందర్భంలో...

**తా :** ఈ విధంగా పురుషోత్తముడైన శ్రీకృష్ణుణ్ణి భక్తితో పూజించిన ధర్మజుని కండ్లనిండా సంతోషబాష్పాలు పొంగిపొరలినాయి. అందువల్ల ఆయన గోవిందునిమంగళకరమైన సుందరస్వరూపాన్ని స్పష్టంగా చూడలేకపోయాడు. ఇలా పూజించబడి ప్రకాశిస్తున్న పుండరీకాక్షుణ్ణి దర్శించి, అక్కడి సభలోని జనులందరూ శిరస్సులపై దోసిళ్లు చేర్చి స్తుతిస్తూ జయజయ ధ్వానాలు చేశారు. పైనుండి దేవతలు వివిధమంగళవాద్యాలను మోగిస్తూ పూలవానలు కురిపించారు.

**క. దమఘోషసుతుఁడు దద్విభ, వము సూచి సహింప కలుక వ్రేలఁగాఁ బీ**
**ఠము డిగ్గి నిలిచి నిజ హ, స్తము లెత్తి మనోభయంబు దక్కినవాఁడై. 786**

**ప్రతి :** దమఘోషసుతుడు= దమఘోషుడనే రాజుయొక్క కుమారుడు (శిశుపాలుడు); తద్+విభవము= శ్రీకృష్ణునికి ధర్మరాజు కావించిన ఆ సన్మానవైభవాన్ని; చూచి= బాగుగా తిలకించి; సహించక= ఓర్వలేక; అలుక= కోపం; వ్రేలన్+కాన్= కలుగగా; పీఠము= (సభలో తాను కూర్చుండిన) పీఠంనుండి; డిగ్గి నిలిచి= దిగి నిలువబడి; నిజహస్తములు= తన రెండు చేతులను; ఎత్తి= పైకి చాపి; మనస్+భయంబు= మనస్సులో భీతి; తక్కినవాఁడు+ఐ= ఏమీ లేనివాడై...

**తా :** అప్పుడు దమఘోషుని కుమారుడైన శిశుపాలుడు శ్రీకృష్ణునికి జరిగిన ఆ పూజావైభవాన్ని చూచి, సహించలేకపోయాడు. అసూయవల్ల కోపంతో ఆసనంనుండి దిగి, నిర్భయంగా రెండుచేతులను పైకి చాపినాడు.

**వ. అప్పు డప్పుండరీకాక్షుండు వినుచుండ సభాసదులం జూచి యిట్లనియె. 787**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; ఆ+పుండరీక+అక్షుండు= ఆ శ్రీకృష్ణుడు; వినుచున్+ఉండన్= వింటుండగా; సభాసదులన్+చూచి= (శిశుపాలుడు) సభలోఉన్నవారిని చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నారు.

**తా :** శ్రీకృష్ణుడు వింటూ ఉండగా శిశుపాలుడు సభలోని వారిని తేరిపారజూచి ఇలా అన్నాడు.

**క. 'చాలుఁ బురే యహహా! యీ, కాలము గడవంగ దురవగాహం బగు నీ**
**తేలా తప్పెను నేఁ డీ, బాలకు వచనములచేతఁ బ్రాజ్ఞులబుద్ధుల్? 788**

**ప్రతి :** ఈ కాలము= ఈ కాలంయొక్క ప్రభావం; కడవన్+కన్= దాటడానికి; దుర్+అవగాహంబు+అగున్= ఆ కళింపు చేసుకోరానిది అవుతుంది; చాలున్+పురే!= చాలబాగా ఉంది!; అహహా!= ఆహోహో!; నేఁడు= ఈనాడు; ప్రాజ్ఞులబుద్ధుల్= బుద్ధిమంతులు; పెద్దలునయిన వాళ్ళ బుద్ధులు; ఈ బాలకు= ఈ బాలునియొక్క; నీతి= న్యాయమార్గంనుండి; ఏలా= ఎందువల్ల; తప్పెను?= తొలగిపోయాయి?

**తా :** కాలంయొక్క ప్రభావం అతిక్రమింప వీలు కానిది! ఇందుచేతనే ఈనాడు ఈ సభయందుగల మహర్షులు, మహారాజులు మొదలుగాగల బుద్ధిమంతులైన పెద్దల బుద్ధులు ఒక బాలకుని (సహదేవుని) మాటలు విని నీతిమార్గంనుండి ఎందువల్ల తొలగిపోయాయో కదా!

**వ. ఇట్లు దప్పిన తెఱం గెట్లనినఁ బాత్రాపాత్రవివేకంబు సేయనేర్చిన విజ్ఞాననిపుణులు, నున్నతసత్త్వ గరిష్ఠులు, బహువిధతపోవ్రతనియమశీలురు, ననల్పతేజులు, మహైశ్వర్యశక్తిధరులుఁ, బరతత్త్వవేదులు, నఖిలలోకపాలపూజితులు, విగతపాపులుఁ బరమయోగీంద్రులు నుండ వీరిం గైకొనక వివేకరహితులై గోపాలబాలునిం బూజ సేయుటకు నెట్లు సమ్మతించిరి; పురోడాశంబు సృగాలంబున కర్హం బగునే? యదియునుంగాక. 789**

**ప్రతి :** ఇట్లు= ఇప్పుడు చెప్పినరీతిగా; తప్పిన తెఱంగు= నీతిమార్గంనుండి తొలగినవిధంగా; ఎట్లు+అనినన్= ఎలాగంటే; పాత్ర+అపాత్రవివేకంబు= ఇది అర్హతగలది; ఇది అర్హత లేనిది – అనే తెలివితోడి విభజనం; చేయన్+నేర్చిన= చేయజాలినట్టి; విజ్ఞాన నిపుణులు= విశేషమైన తెలివి గలిగిన నేర్పరులు; ఉన్నత= మిగుల గొప్పదైన; సత్త్వ= సత్త్వ గుణంచేత; గరిష్ఠులు= గొప్పవారు; బహువిధ= పెక్కువిధాలైన; తపస్+వ్రత= తపస్సులయొక్క వ్రతాలయొక్క; నియమ శీలురు= నియమాలను ఆచరించేస్వభావం కలవారు; న+అల్పతేజులు= తక్కువకాని (గొప్ప) తేజస్సు గలవారు; మహా+ఐశ్వర్యశక్తిధరులు= గొప్పసంపదతో గూడిన విశిష్టమైన శక్తిని ధరించినవారు; పరతత్త్వవేదులు= ఉత్కృష్టమైన పరబ్రహ్మయొక్క స్వభావాన్ని చక్కగా తెలిసినవారు; అఖిలలోకపాలపూజితులు= లోకాలన్నింటిలోని పరిపాలకులైన ఇంద్రాదులచే పూజింపబడేవారు; విగతపాపులు= తొలగినపాపాలు గలవారు (పాపాలు లేనివారు); పరమయోగి+ ఇంద్రులున్= యోగంలో ఉత్కృష్టమైన స్థితిని అందుకొన్న యోగీశ్వరులును; ఉండన్= ఎందరో ఉండగా; వీరిన్= ఈ చెప్పిన వీరలలో ఒకరినైనా; కైకొనక= పూజింపదగిన వాణ్ణిగా స్వీకరించక; వివేక రహితులు+ఐ= తెలివిలేనివారై; గోపాలబాలునిన్= గొల్ల పిల్లవాణ్ణి; పూజ+చేయుటకున్= శ్రేష్ఠునిగా అగ్రపూజ చేయడానికి; ఎట్లు= ఏ విధంగా; సమ్మతించిరి?= ఈ బుద్ధిమంతులైన పెద్దలు అంగీకరించారు?; పురోడాశంబు= యజ్ఞంలో దేవతల్ని ఉద్దేశించి హోమం చేయబడే అప్పం; సృగాలంబునకున్= నక్కకు; అర్హంబు+అగునే?= ఇవ్వదగి ఉంటుందా? (ఇవ్వతగింది కాదు); అదియునున్+కాక= అంతేగాకుండా...

**తా :** ఇక్కడి ప్రాజ్ఞులు న్యాయమార్గాన్ని తప్పిన విధం ఏలాగంటే, యోగ్యులను అయోగ్యులను నిర్ణయించగల నేర్పరులు, గొప్ప సత్త్వగుణసంపన్నులు, తపోనియమశీలురు, తేజస్వులు, ఐశ్వర్యయుక్తులు, పరబ్రహ్మ స్వరూపం తెలిసిన జ్ఞానులు, సమస్తలోకపాలకులచే పూజింపబడినవారు, పాపరహితులైన పరమయోగీశ్వరులు– అనేకులు ఈ సభలో ఉన్నారు. వీళ్లలో ఏ ఒక్కరినీ లక్ష్యపెట్టకుండా, ఒక గొల్ల పిల్లవాణ్ణి ఉత్తముణ్ణిగా పూజచేయటానికి వీళ్లంతా ఎలా అంగీకరించినారో? ఇలా చేయటం పవిత్రమైన యజ్ఞపురోడాశాన్ని నక్కకు వేయడం వంటిది!

**సీ. గురుదేవ శూన్యుండు కులగోత్ర రహితుండు దలిదండ్రు లెవ్వరో తడవఁ గాన**
**మప్పులఁ బొరలెడు నాదిమధ్యావసానంబులం దరయ మానంబు లేదు**
**బహురూపియై పెక్కుభంగుల వర్తించు వావివర్తనములు వరుసలేవు**
**పరికింప విగతసంబంధుండు తలపోయ మా నిమిత్తంబున మానిసయ్యెఁ**

**తే. బరఁగ మున్ను యయాతిశాపమునఁ జేసి, వాసి కెక్కదు యాదవవంశమెల్ల**
**బ్రహ్మతేజంబు నెల్లఁ గోల్పడిన యితఁడు, బ్రహ్మఋషి సేవ్యుఁ డగునె గోపాలకుండు? 790**

**ప్రతి :** గురుదేవ శూన్యుండు= గురువులుగాని, దేవుడుగాని లేనివాడు; కులగోత్రరహితుండు= కులంగాని, గోత్రంగాని లేనివాడు; తల్లి+తండ్రిలు+ఎవ్వరు+ఓ= ఈతని తల్లీ, తండ్రీ ఎవరో; తడయన్= పేరుకొనుటకు; కానము= తెలియజాలము; అప్పులన్= నీళ్లలో; పొరలెడున్= నిత్యం పొరలాడుతూ ఉంటాడు (చుట్టూ నీళ్లుగల సముద్రద్వీపం (ద్వారక)లో నిత్యం నివసిస్తూ ఉంటాడు); అరయన్= విచారిస్తే; ఆది మధ్య+అవసానంబుల+అందున్= మొదటగాని, నడుమగాని, చివరగాని; మానంబు= గౌరవం; లేదు; బహురూపి+ఐ= అనేక రూపాలను ధరిస్తున్నవాడై; పెక్కుభంగులన్= అనేకరీతులుగా; వర్తించున్= లోకంలో ప్రవర్తిస్తూ ఉంటాడు; వావి, వరుస, వర్తనములు= బంధుత్వపు క్రమాల్ని అనుసరించి నడచుకోవడాలు; లేవు= ఇతనికి లేనే లేవు; పరికింపన్= పరిశీలించినట్లయితే; విగత సంబంధుండు= తొలగిన సంబంధాలు కలవాడు, (ఎవ్వరితోను బంధుత్వాదిసంబంధాలు లేనివాడు); మానిమిత్తంబునన్= కారణంచేత (శ్రీకృష్ణునిమేనత్తయైన సాత్వతి శిశుపాలుని తల్లి. ఆ చుట్టరికంవల్ల - అని శిశుపాలుని అభిప్రాయం); మానిసి+అయ్యెన్= వ్యక్తిత్వం కలవాడయ్యాడు; పరఁగన్= ప్రసిద్ధంగా; మున్ను= పూర్వం; యయాతిశాపమునన్+చేసి= యయాతి అనే రాజేంద్రునియొక్క శాపంవల్ల; యాదవవంశము+ఎల్లన్= 'యదువు' అనే వానివంశమంతా; వాసికిన్+ఎక్కదు= ప్రసిద్ధి పొందనిది అయింది; బ్రహ్మతేజంబున్+ఎల్లన్= బ్రహ్మవర్చస్సునంతటినీ; కోల్పడిన= కోల్పోయిన (యయాతి మహారాజుయొక్క శాపం కారణంగా బ్రహ్మర్షులు లేని సముద్రమధ్యంలోని దుర్గంలో నివసిస్తూ ఉండినందున యదువంశీయు లందరు బ్రహ్మతేజాన్ని కోల్పోయిన వారయ్యారు); గోపాలకుండు= గొల్లవాడైన; ఇతఁడు= ఈ శ్రీకృష్ణుడు; బ్రహ్మఋషిసేవ్యుఁడు+అగునె?= ఈ సభలోని బ్రహ్మర్షివర్యులచే పూజించదగినవాడయినాడా? (కాదని - అని శిశుపాలుని నిర్ణయం)

**తా :** గురువులూ, దేవుడూ లేనివాడు, అలాగే కులగోత్రాలూ లేనివాడు, తల్లిదండ్రులు ఎవరో తెలియనివాడు, నిత్యం నీళ్లలో పొరలాడేవాడు, మొదలు, నడుమ,చివరలు లేని మానహీనుడు, అనేక రూపాలు ధరించి, పెక్కు విధాల ప్రవర్తిల్లేవాడు, వావివరుసలు, సంబంధబాంధవ్యాలు లేనివాడు అయిన ఈతడు మావల్ల ఒక మనిషిగా తయారయ్యాడు. వీళ్ల పూర్వుడైన యదువుకు యయాతిమహారాజు ఇచ్చిన శాపం కారణంగా యదువంశం రాజ్యార్హతను కోల్పోయి ప్రశస్తిలేని దయింది. అందుచేతనే వీళ్లకు బ్రహ్మవర్చస్సు నశించింది. ఇలాంటి ఈ గోపాలకుడు ఈ సభలోని బ్రహ్మర్షులందరికి పూజింప దగినవాడెలా అయినాడు? (కాలేడు)

**క. జారుఁడు జన్మావధియును, చోరుఁడు ముప్పోకలాఁడు సుమహితపూజా**
**చారక్రియలకు నర్హుఁడె, వారక యితఁ డనుచు నశుభవాక్యస్ఫూర్తిన్. 791**

**ప్రతి :** ఇతఁడు= ఈ గోపాలబాలకుడు; జారుఁడు= వ్యభిచారి; జన్మ+అవధియునున్= పుట్టినప్పటినుండీ, చోరుఁడు= దొంగ; మూడు+పోకలు+ఆఁడు= మూడు త్రోవలలో నడచేవాడు; సుమహిత= మిక్కిలి గొప్పవిఅయిన; పూజా+ ఆచారక్రియలకున్= పూజా కార్యాలను సమర్పించడానికి; వారక= తప్పక; అర్హుఁడు+ఎ= యోగ్యతగలవాడా? (కాదు); అనుచున్= అని అంటూ; అశుభవాక్యస్ఫూర్తిన్= అమంగళకరాలైన మాటలయొక్క తీవ్రతతో (నిలుచుండినాడు)...

**తా :** ఈ కృష్ణుడు పుట్టిననాటినుండీ చోరుడు. అటుపై జారుడు. ఒక మార్గంలోగాక, మూడుదారుల్లో నడిచేవాడు. అటువంటి ఈతడు మిగుల ఉత్తమమైన అగ్రపూజాకార్యానికి అవశ్యంగా ఎలా యోగ్యుడయ్యాడు? – అని ఆ శిశుపాలుడు తీవ్రంగా అమంగళకరమైన మాటలతో (నిందించాడు)

**చ. అని తను దూఱనాడిన మురాంతకుఁ డా శిశుపాలువాక్యముల్**
**విని మదిఁ జీరికిం గొనఁడు వి్రశుతఫేరవరావ మాత్మఁ గై**
**కొనని మృగేంద్రరీతి మునికోటియు రాజులుఁ బద్మనాభు నా**
**డిన యవినీతిభాషలకు డెందమునం గడు వంత నొందుచున్. 792**

**ప్రతి :** అని= అని ఈ రీతిగా; తనున్= తనను; దూఱన్+ఆడిన= నిందిస్తూ పలుకగా; మురా+అంతకుఁడు= మురుడనే రక్కసుని అంతమొందించినవాడు (శ్రీకృష్ణుడు); ఆ శిశుపాలువాక్యముల్= శిశుపాలుని ఆ దూషణవాక్యాలను; విని= వినినప్పటికిని; వి్రశుతఫేరవరావము= నక్కయొక్క గొప్పఅరుపును; ఆత్మన్= తన మనస్సున; కైకొనని= స్వీకరించని; మృగ+ఇంద్రరీతిన్= మృగరాజగు సింహంవిధంగా; చీరికిన్+కొనఁడు= లక్ష్యపెట్టక ఉండినాడు; మునికోటియున్= ఆ సభలోని మునిబృందాలు; రాజులున్= అక్కడ చేరి ఉండిన రాజులు; పద్మనాభున్= పద్మం నాభియందు గలవానిని (శ్రీకృష్ణుని) ఉద్దేశించి; ఆడిన= పలికిన; అవినీతి భాషలకున్= నీతిలేని మాటలకు; డెందమునన్= హృదయంలో; కడు వంతన్= మిక్కిలిగా చింతను; ఒందుచున్= పొందుతున్నవారై.

**తా :** శిశుపాలు డట్లు దూషించినప్పటికిని, నక్క కూతలను వినికూడా లెక్కపెట్టని సింహంవలె శ్రీకృష్ణుడు వాని మాటలను లక్ష్యపెట్టక, ధీరతతో ఉండినాడు. సభలో ఉండిన ఋషులు, రాజులుమాత్రం వాని పరుషవాక్కులకు చాలా బాధ పడినారు.

**ఉ. వీనులు మూసికొంచు విన విస్మయ మంచు 'ముకుంద! మాధవా!**
**శ్రీనిధి! వీని నేగతికిఁ జేర్చెదొ' యంచు దురాత్ముఁ దిట్టుచు**
**న్నా నరనాథులున్ మునులు నచ్చట నిల్వక పోవఁ బాండు సం**
**తానము లప్రమేయబలదర్పమహోద్ధతరోషచిత్తులై. 793**

**ప్రతి :** ఆ నరనాథులున్= ఆ సభలోని భూపతులు; మునులున్= మహర్షులు; వినన్= వినడానికి; విస్మయము+అంచున్= 'ఆశ్చర్యంగా ఉందంటూ'; వీనులు= చెవులను; మూసికొంచున్= చేతులతో మూసుకొని; ముకుంద!= మోక్షం ఒసగేవాడా! (శ్రీకృష్ణా!); మాధవా!= లక్ష్మీదేవికి పతియైనవాడా! (వాసుదేవా!); శ్రీనిధి!= సమస్త సంపదలకు నెలవైనవాడా! (శ్రీపతీ!); వీనిన్= దుష్టుడైన ఈ శిశుపాలుణ్ణి; ఏగతికిన్= ఏ దశకు; చేర్చెదు+ఒ?= చేరుస్తావో కదా!; అంచున్= అని అంటూ; దుర్+ఆత్మున్= దుర్మార్గుణ్ణి (శిశుపాలుని); తిట్టుచున్= తూలనాడుతూ; అచ్చటన్= ఆ సభలో; నిల్వక= నిలువకుండా; పోవన్= వెలుపలికి వెళ్లగా; పాండు సంతానములు= పాండురాజుకుమారులు; అప్రమేయ= అపరిమితమైన; బలదర్ప= బలగర్వాలతో; మహా+ఉద్ధత= మిగుల పెల్లుబికిన; రోష+చిత్తులు+ఐ= కోపంతో నిండిన మనస్సులు కలవారై...

**తా :** శిశుపాలుని పరుషవాక్కులను వినలేక సభలోని రాజులు, మునులు చెవులు మూసుకొంటూ, 'శ్రీకృష్ణా! వీనిని ఏ గతికి చేరుస్తావో' – అని అంటూ ఆ శిశుపాలుణ్ణి నిందిస్తూ – ఆ సభనుండి వెళ్ళిపోయారు. అప్పుడు పాండవులు అంతులేని ఆగ్రహానికి లోనయ్యారు.

**విశే :** భగవంతుణ్ణి నిందించిన వాడేగాక, ఆ నిందను విన్నవాళ్లుకూడ నరకంలో పడతారు- అనే విశ్వాసాన్ని అనుసరించి సభయందలి మహారాజులు, మహర్షులు చెవులు మూసుకొని సభనుండి వెలుపలికి వెళ్లారు.

**వ. అప్పుడు కేకయ సృంజయభూపతులుం దాము వివిధాయుధపాణులై యదల్చి నిల్చిన వాఁడును బిఱుతివక యదల్చి పలకయు వాలునుం గైకొని భుజాగర్వదుర్వారుండై గోవిందునిఁ దదనువర్తులైన వారలం గుపితుండై నిందింప నమ్ముకుందుం డాగ్రహంబున లేచి తన కట్టెదుర నెదిర్చియున్న శిశుపాలుని రూక్షేక్షణంబుల వీక్షించుచు, నా క్షణంబ తన్మస్తకంబు నిశితధారా కరాళంబైన చక్రంబున నవక్రపరాక్రముండై రుధిరంబు దొరఁగం దునుమ, న మ్మహాకలకలం బాకర్ణించి చైద్యబలంబులు దదీయపక్షచరులైన భూపతులును గనుకనిం బఱచి; ర య్యవసరంబున. 794**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; కేకయ సృంజయ భూపతులున్= కేకయ దేశీయులు, సృంజయదేశీయులుఅయిన రాజులు; తామును= పాండవులు; వివిధ+ఆయుధపాణులు+ఐ= అనేకవిధాలైన ఆయుధాలను చేతులలో ధరించినవారై; అదల్చి+నిల్చినన్= శిశుపాలుణ్ణి హెచ్చరిస్తూ నిలువగా; వాడును= ఆ శిశుపాలుడుకూడ; పిఱుతివక= వెనకడుగు వేయక (జంకకుండా); పలకయున్= డాలును; వాలునున్= కత్తిని; కైకొని= చేతపట్టి; భుజాగర్వ= భుజబలగర్వంచేత; దుర్వారుండు+ఐ= నివారింప వీలుకానివాడై; గోవిందునిన్= శ్రీకృష్ణుణ్ణి; తత్+అనువర్తులు+ఐనవారలన్= ఆయనను అనుసరించి వర్తించే వారిని; కుపితుండు+ఐ= కోపంగలవాడై; నిందింపన్= తిట్టగా; ఆ+ముకుందుండు= ఆ శ్రీకృష్ణుడు; ఆగ్రహంబునన్= క్రోధంతో; లేచి= తన పీఠంనుండి లేచి నిలువబడి; తన కడు+ఎదురన్= తనయొక్క ఎట్టఎదురుగా; ఎదిర్చి+ఉన్న= ధిక్కరించిఉండిన; శిశుపాలునిన్= శిశుపాలుణ్ణి; రూక్ష+ఈక్షణంబులన్= తీక్ష్ణమైన చూపులతో; ఈక్షించుచున్= చూస్తూ; న+వక్ర పరాక్రముండు+ఐ= మొక్కవోని శౌర్యం కలవాడై; ఆక్షణంబు+అ= ఆ నిమిషంలోనే; తద్+మస్తకంబు= ఆతని శిరస్సును; నిశితధారా= మిగులవాడియైన పదునుగల; చక్రంబునన్= సుదర్శన చక్రంతో; రుధిరంబు+తొరఁగన్= రక్తం ప్రవహించేటట్లుగా; తునుమన్= ఖండింపగా; ఆ+మహాకలకలంబు= ఆ గొప్ప అలజడిని; ఆకర్ణించి= విని; చైద్యబలంబులును= చేది దేశంనుండి వచ్చిన సైన్యాలు, తదీయపక్ష+చరులు+ఐన= చేది దేశపు రాజైన శిశుపాలుని పక్షాన ప్రవర్తిల్లే; భూపతులునున్= రాజులందరు; కనుకనిన్+పఱచిరి= భీతితో గూడిన తొందరచేత పారిపోయారు; ఆ+అవసరంబునన్= ఆ సందర్భంలో...

**తా :** ఆ సమయంలో పాండవులు కేకయ, సృంజయ దేశాల రాజులతోపాటు ఆయుధాలు ధరించి వచ్చి శిశుపాలుణ్ణి హెచ్చరించారు. శిశుపాలుడు ఎవరినీ లెక్కపెట్టక, కత్తి, డాలు ధరించి శ్రీకృష్ణుని ఎదుటికి వచ్చి, వాళ్లనందరినీ నిందింపసాగాడు. అప్పుడు శ్రీకృష్ణుడు ఆగ్రహంతో లేచి, శిశుపాలుణ్ణి తీవ్రంగా చూస్తూ ఎంతో వాడి గల భయంకరమైన సుదర్శనచక్రంతో శిశుపాలుని శిరస్సును ఖండించాడు. ఆ కోలాహలాన్ని విని శిశుపాలుని సైన్యాలు, అతని పక్షంలోని రాజులు తత్తరపాటుతో పారిపోయారు.

**క. మునివరులును జనపతులును, గనుఁగొని వెఱఁ గందఁ జైద్యు గాత్రమునందుం**
**డనుపమ తేజము వెలువడి, వనజోదరు దేహమందు వడిఁ జొచ్చె నృపా! 795**

**ప్రతి :** నృపా!= ఓ పరీక్షిన్మహారాజా!; మునివరులును= అక్కడుండిన మునీశ్వరులూ; జనపతులును= రాజులూ; కనుఁగొని= చూచి; వెఱఁగు+అందన్= ఆశ్చర్యపడుతుండగా; చైద్యు= చేది దేశాధీశుడైన శిశుపాలునియొక్క;

గాత్రము+అందున్+ఉండి= శరీరంనుండి; అనుపమతేజము= గొప్పకాంతి (జ్యోతి); వెలువడి= బయలువెడలి; వనజ+ఉదరు= నాభియందు కమలం కల విష్ణువైన శ్రీకృష్ణుని; దేహము+అందున్= శరీరంలో; వడిన్= త్వరగా; చొచ్చెన్= ప్రవేశించింది.

**తా :** మహారాజా! అప్పుడు అక్కడుండిన మునీంద్రులు, రాజులు చూచి ఆశ్చర్యపడుతుండగా శిశుపాలుని శరీరంనుండి ప్రకాశమానమైన ఒక జ్యోతిపైకి వచ్చి శ్రీకృష్ణుని దేహంలో ప్రవేశించింది.

**వ. అనిన మునివరునకు భూవరుం డిట్లనియె. 796**

**ప్రతి :** అనినన్= అని చెప్పగా; మునివరునకున్= మునిశ్రేష్ఠుడైన శుకయోగీశ్వరునికి; భూవరుండు= భూనాథుడైన పరీక్షిత్తు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని పల్కిన శుకయోగీంద్రునితో పరీక్షిన్మహీపతి ఇలా అన్నాడు.

**క. 'కమలాక్షుని నిందించిన, దమఘోషతనూభవుండు దారుణమల కూ**
**పమునుం బొందక యే క్రియ, సుమహితమతిఁ గృష్ణునందుఁ జొచ్చె మునీంద్రా! 797**

**ప్రతి :** ముని+ఇంద్రా!= మునులలో శ్రేష్ఠుడా!; కమల+అక్షునిన్= తామరలవంటి అందమైన కన్నులుగలవాణ్ణి (శ్రీకృష్ణుణ్ణి); నిందించిన= తిట్టినటువంటి; దమఘోషతనూభవుండు= దమఘోషుని కుమారుడైన శిశుపాలుడు; దారుణ= కఠోరమైన; మలకూపమునన్= మలినంతో నిండిననూతిలో; పొందక= పడిపోవక; ఏక్రియన్= ఏ విధంగా (ఏ హేతువువల్ల); సుమహితమతిన్= మిగుల గొప్పదైన మనస్సు గలిగి; కృష్ణ+అందున్= శ్రీకృష్ణదేవునందు; చొచ్చెన్= ప్రవేశించినాడు?

**తా :** ఓ మునిశ్రేష్ఠా! శ్రీకృష్ణుణ్ణి నిందించిన శిశుపాలుడు మలంతో నిండిన నరకకూపంలో పడిపోవక ఆ భగవానుని దివ్యదేహంలోని ఉదాత్తమనస్కుడై ఏ విధంగా ప్రవేశింపగలిగినాడో సెలవియ్యండి!

**వ. అనిన శుకయోగి రాజయోగి కిట్లనియె. 798**

**ప్రతి :** అనినన్= అని అడుగగా; శుకయోగి= శుకమునీంద్రుడు; రాజయోగికిన్= రాజర్షియైన పరీక్షిత్తుకు; ఇట్లు= ఈ చెప్పబోయేరీతిగా; అనియెన్= అన్నాడు.

**తా :** అప్పుడు పరీక్షిత్తుయొక్క ప్రశ్నకు సమాధానంగా శుకుడు ఈ కిందివిషయం వెల్లడించాడు.

**మ. మధుదైత్యాంతకుమీఁది మత్సరమునన్ మత్తిల్లి జన్మత్రయా**
**వధి యే ప్రొద్దుఁ దదీయరూపగుణదివ్యధ్యానపారీణ ధీ**
**నిధి యౌటన్ శిశుపాలభూవిభుఁడు తా నిర్ధూతసర్వాఘుఁడై**
**విధిరుద్రాదుల కందరాని పదవిన్ వే పొందె నుర్వీశ్వరా! 799**

**ప్రతి :** ఉర్వీ+ఈశ్వరా!= భూమికి నాథుడైనవాడా; మధుదైత్య+అంతకుమీది= మధుడనే రాక్షసుణ్ణి అంతమొందించిన శ్రీమహావిష్ణునిపై గల; మత్సరమునన్= అసూయచేత; మత్తిల్లి= గర్వించినవాడై; జన్మత్రయ+అవధిన్= మూడు జన్మల వరకు; ఏ ప్రొద్దున్= ఏ కాలంలోనూ (నిరంతరం); తదీయ= ఆ దేవునియొక్క; రూప= మనోహరమైన ఆకృతిని; గుణ=

గుణగణాలను; దివ్యధ్యాన= నిర్మలంగా ధ్యానించడంలో; పారీణ= ఆరితేరిన; ధీ= బుద్ధికి; నిధి+ఔటన్= నిధికావడంవల్ల; శిశుపాల భూవిభుఁడు= శిశుపాలుడనే రాజు; తాన్= తాను; నిర్ధూత= పూర్తిగా తొలగింపబడిన; సర్వ+అఘుఁడు+ఐ= సమస్తపాపాలు గలవాడై (పాపాలన్నీ తొలగిపోయినవాడై); విధి= బ్రహ్మ; రుద్ర+ఆదులకున్= పరమేశ్వరుడు మొదలైన దేవతాధీశులకు కూడా; అందరాని= అందుకోవడానికి సాధ్యంకాని; పదవిన్= స్థానాన్ని (సాయుజ్యాన్ని); వే పొందెన్= వేగంగా పొందాడు.

**తా :** శిశుపాలుడు గతమూడు జన్మలనుండి వైరబుద్ధితో ఆ శ్రీమహావిష్ణుని రూపాన్నీ గుణాలను (నిందావ్యాజంతో) నిరంతరం ధ్యానించడంలో ఆరితేరి ఉండడంచేత సమస్తపాపాలనుండి విముక్తుడై బ్రహ్మరుద్రాదులకుకూడా అందరాని మోక్షపదవిని పొందాడు.

**వ. అంత ధర్మనందనుండు ఋత్విగ్గణంబులను సదస్యులను బహుదక్షిణలం దనిపి వివిధార్చనలం బూజించి యవభృథస్నానక్రియాపరితోషంబున. 800**

**ప్రతి :** అంతన్= ఆ తరువాత; ధర్మనందనుండు= ధర్మదేవుని వరపుత్రుడైన ధర్మరాజు; ఋత్విక్+గణంబులను= యజ్ఞం చేయించిన ఋత్విజుల బృందాలను; సదస్యులను= యజ్ఞానికి విశిష్టంగా విచ్చేసిన ముఖ్య సభ్యులైనవారిని; బహుదక్షిణలన్= ద్రవ్యరూపమైన అనేక సంభావనలతో; తనిపి= తృప్తి పొందించి; వివిధ+అర్చనలన్= పలుతెరగుల పూజలతో; పూజించి; అవభృథస్నాన= యజ్ఞంచివరలో యజమాని మంత్రపూర్వకంగా చేసే పవిత్రమైన స్నానాన్ని; క్రియా= ఆచరించాలనే; పరితోషంబునన్= ఆనందంతో...

**తా :** పిమ్మట ధర్మరాజు ఋత్విక్కులను, సదస్యులను గొప్పగా దక్షిణల నిచ్చి సంతోషింపచేసి, అనేక విధాల పూజించి, అవభృథస్నానం చేయాలనే ఆనందంతో బయలుదేరాడు.

**సీ. మురజమృదంగగోముఖశంఖడిండిమపణవాదిరవము లంబరము నిండఁ**
**గవిసూతమాగధగాయకవందివైతాళికవినుతు లందంద బెరయ**
**వితతమర్దళవేణువీణారవంబుల గతులకు నర్తకీగతులు సెలఁగఁ**
**దరళవిచిత్రకధ్వజపతాకాంకితస్యందనగజవాజిచయము లెక్కి**

**తే. సుతసహోదరహితపురోహితజనంబు, గటకకేయూరహారకంకణకిరీట**
**వస్త్రమాల్యానులేపనవ్రాతములను, విభవ మొప్పారఁ గైసేసి వెడల నంత. 801**

**ప్రతి :** మురజ= ముర్మురధ్వనులు చేసే వాద్యవిశేషం; మృదంగ= మద్దెల; గోముఖ= ఆవు ముఖంవంటి ఆకారంగల చర్మవాద్యం; శంఖ= శంఖం; డిండిమ= గుమ్మడం; పణవ+ఆది= ఉడుక మొదలైన వాద్యాలయొక్క; రవములు= మంగళవాద్యాల ధ్వనులు; అంబరము నిండన్= ఆకాశమంతా వ్యాపించగా; కవి= కవులు; సూత= రథములనడిపేవారు; మాగధ= వంశ, పరాక్రమాదులను కొనియాడేవారు; గాయక= గాయకులు (పాటకాండ్రు); వంది= స్తోత్రపాఠకులు; వైతాళిక= తెల్లవారు జామున మేలుకొలుపులు పాడేవారు; వినుతులు= వీరలందరియొక్క ప్రస్తుతులు; అందున్+అందున్+అ= అక్కడక్కడ; బెరయన్= వ్యాపించగా; వితత= విరివియైన; మర్దళ= మద్దెలల; వేణు= పిల్లనగ్రోవుల; వీణా= వీణల; రవంబుల= ఈ మంగళవాద్యాల మనోజ్ఞధ్వనులయొక్క; గతులకున్= పోకడలకు; నర్తకీ= చక్కనినాట్య కత్తెలయొక్క;

గతులు= నృత్యాలు (నడకలు); చెలఁగన్= అతిశయించగా; తరళ= చలిస్తున్న; విచిత్రక= చిత్రమైన రంగులుగల; ధ్వజపతాకా= జండాలచేత; అంకిత= కూడియున్న; స్యందన= తేరుల; గజ= ఏనుగుల; వాజి= గుఱ్ఱాల యొక్కయు; చయములు= సమూహాలను; ఎక్కి= మీద కూర్చొని; సుత= కుమారులు; సహ+ఉదర= తమ్ములు; హిత= స్నేహితులు; పురోహితజనంబు= పురోహితులు; కటక= కాలికడియాలు; కేయూర= భుజకీర్తులు; హార= కంఠంలో ధరించే హారాలు; కంకణ= చేతికడియాలు; కిరీట= శిరస్సుపై ధరించు మకుటాలు; వస్త్ర= పట్టుబట్టలు; మాల్య= మంచిమంచి పూలదండలు; అనులేపన వ్రాతములను= శరీరానికి పూసుకొనే శ్రీగంధ, చందనాది మైపూతలచేత; విభవము+ఒప్పారన్= గొప్పతనం గోచరించే విధంగా; క్రైసేసి= అలంకరించుకొని; వెడలన్= బయలుదేరగా; అంతన్= అటుపిదప....

**తా :** మృదంగం, శంఖం, గోముఖం, డిండిమం, పణము మంగళవాద్యాల ధ్వనులు మిన్నంటుతుండగా, కవులు సూతులు, మాగధులు, గాయకులు, వందులు, వైతాళికుల – పొగడ్తలు అడుగడుగన వినిపిస్తూ ఉండగా, వేణువీణా మురజాది వాద్యాల శబ్దాల కనుగుణంగా నట్టువకత్తెలు నాట్యాలు చేస్తుండగా, అందమైన పతాకలుగల రథాలను, ఏనుగులను, గుఱ్ఱాలను ఎక్కి ధర్మజుని తమ్ములు, మిత్రులు, పురోహితులు హారకేయూర కిరీటాది ఆభరణాలను చక్కగా అలంకరించుకొని వైభవంతో ధర్మజుని వెంట కదలినారు.

**వ. మఱియు యదు సృంజయ కాంభోజ కురు కేకయ కోసల భూపాల ముఖ్యులు చతుర్విధ సేనాసమేతులై ధరణి గంపింప వెన్నంటి నడతేర ఋత్విఙ్నికాయంబును సదస్యులును బ్రహ్మఘోషంబు లొలయ మున్నిడికొని శోభమానానూన ప్రభా భాసమాన సువర్ణమయ మాలికాదివ్య మణిహారంబులు గంఠంబునం దేజరిల్ల నున్నత జవాశ్వంబులం బూన్చిన పుష్పరథంబు గళత్రసమేతుండై యెక్కి యతిమనోహర విభవాభిరాముండై చనుదెంచు చుండె; నప్పుడు వారాంగనాజనంబులు తమవారలం గూడికొని. 802**

**ప్రతి :** మఱియున్= అంతేగాక; యదు= యదువంశీయులైన; సృంజయ= సృంజయ వంశీయులైన; కాంభోజ= కాంభోజ దేశీయులైన; కురు= కురుదేశీయులైన; కేకయ= కేకయ దేశీయులైన; కోసల= కోసల దేశీయులయిన; భూపాలముఖ్యులు= శ్రేష్ఠులయిన రాజులు; చతుర్+విధ= తేరులు, ఏనుగులు, గుఱ్ఱాలు; కాలిబంట్లు – అనే నాలుగు విధాలయిన; సేనా= సైన్యంతో; సమేతులు= కూడుకొన్నవారై; ధరణి+కంపింపన్= భూమి కంపిస్తునట్లుగా; వెన్ను+అంటి= వెంబడించి; నడతేరన్= కదలిరాగా; ఋత్విక్+నికాయంబును= యజ్ఞం చేయించిన పురోహితులను; సదస్యులను= యజ్ఞపర్యవేక్షణకావించిన వేదమూర్తులను; బ్రహ్మఘోషంబులు+ఒలయన్= వేదనాదాలు ఒప్పారుతుండగా; మున్ను+ఇడికొని= వేదపారాయణ కావిస్తున్న ఋత్విక్కులను, సదస్యులను ముందుభాగంలో ఉంచుకొని; శోభమాన= మిగుల ఒప్పిన; అనూన= తక్కువకాని (ఎక్కువైన); ప్రభా= కాంతులచే; భాసమాన= ప్రకాశిస్తున్న; సువర్ణమయ= బంగారుతో నిర్మితాలైన; మాలికా= దండలయొక్క; దివ్య= దేవతా సంబంధమైన మహిమతో ఒప్పుతున్న; మణిహారంబులు= రత్నాలతో కూర్పబడిన మాలలును; కంఠంబునన్= మెడయందు; తేజరిల్లన్= ప్రకాశిస్తుండగా; ఉన్నత= ఎత్తైన; జవన+అశ్వంబులన్= వడిగల గుఱ్ఱాలను; పూన్చిన= కట్టినట్టి; పుష్పరథంబున్= పూలతో చక్కగా అలంకరింపబడినతేరును; కళత్రసమేతుండు+ఐ= ధర్మపత్నితో కూడుకొని; ఎక్కి; అతిమనోహర= మిగుల ఇంపైన; విభవ= సంపదచే; అభిరాముండు+ఐ= మనోహరంగా విరాజిల్లుతున్నవాడై; చను+ తెంచుచున్+ఉండెన్= వస్తూ ఉండినాడు; అప్పుడు= ఆ సమయంలో; వార+అంగనా జనంబులు= వేశ్యలబృందాలు; తమవారలన్+కూడికొని= తమకు సహాయకులైన పరిజనులతోపాటుగా...

**తా :** అంతేగాక, యదు, కాంభోజ, కురు, కేకయ, కోసల దేశాధిపతులైన రాజులు చతురంగబలాలతో వెంట నడువగా, ఋత్విక్కులు, సదస్యులు వేద పారాయణం కావిస్తూ ముందు వెళ్లుతుండగా, సువర్ణ మాలికలు, దివ్య మణిహారాలు దేదీప్య మానంగా కంఠంలో ప్రకాశిస్తూవుండగా, వేగంగల గుఱ్ఱాలను పూన్చిన రథాన్ని పత్నీసహితుడై అధిరోహించి, అమిత వైభవంతో ధర్మరాజు ప్రయాణం సాగించినాడు.

**సీ. కనకాద్రిసానుసంగతకేకినులభాతిఁ గ్రొమ్ముళ్ళు వీఁపుల గునిసి యాడఁ**
**దరళతాటంకముక్తాఫలాంశుద్యుతుల్ చెక్కుటద్దములతోఁ జెలిమిసేయఁ**
**బొలసి యదృశ్యమైపోని క్రొమ్మెఱుంగులగతులఁ గటాక్షదీధితులు దనర**
**మంచుపై నెగయ నుంకించు జక్కవ లనఁ జన్నులు జిలుఁగు కంచెలల నఱుమ**

**తే. మహితకుచభారకంపితమధ్య లగుచు, నర్థి మొలనూళ్ళు మెఱయఁ బయ్యదలు జారఁ**
**గరసరోజాతకంకణక్వణనములును, జరణనూపురఘోషముల్ సందడింప. 803**

**ప్రతి :** కనక+అద్రిసాను= బంగారుకొండ (మేరువు)యొక్క చరియలలో చేరిన; కేకినుల భాతిన్= నెమళ్లవలె; క్రొత్త+ముడులు= అందమైన జారుకొప్పులముడులు; వీఁపులన్= ఆ వారంగనల వీపులమీద; గునిసి+ఆడన్= నర్తిస్తుండగా; తరళ= చలిస్తున్న; తాటంక= చెవికమ్మలయందలి; ముక్తాఫల= ముత్యాలయొక్క; అంశుద్యుతుల్= కిరణాల కాంతులు; చెక్కు+అద్దములతోన్= అద్దాలవలె నునుపైన చెక్కిళ్లతో; చెలిమి+చేయన్= మైత్రిని పాటించగా (కదలుతూవున్న చెవికమ్మలందలి ముత్యాలకాంతులు వారల చెక్కిళ్లలో ప్రతిబింబిస్తూ ఉన్నాయని భావం); పొలసి= ఏర్పడి; అదృశ్యము+ఐపోని= అంతరించి పోనట్టి; క్రొత్త+ మెఱుఁగుల గతులన్= కొత్త మెరుపులవలె; కటాక్ష= కడగంటి చూపులయొక్క; దీధితులు= కాంతులు; తనరన్= మిగుల ఒప్పుతుండగా; మంచుపైన్= మంచుమీదికి; ఎగయన్+ఉంకించు= ఎగరడానికి ప్రయత్నిస్తున్న; జక్కవలు+అనన్= చక్రవాక పక్షులన్నట్లుగా; చన్నులు= పాలిండ్లు; జిలుఁగుకంచలలన్= (కంచెల) సన్నని రవికలను; అఱుమన్= ఆక్రమించగా; మహిత= అధికమైన; కుచభార= చన్నుల బరువువల్ల; కంపిత+మధ్యలు+అగుచున్= వణకుతున్న నడుములు గలవారై; అర్థిన్= కోరికతో; మొలనూళ్లు= నడుములకు అలంకరించుకొన్న మొలతాళ్లు; మెఱయన్= భాసిస్తుండగా; పయి+ఎదలు= పైటలు (ఎదలపై ఒప్పుతున్న చెరగులు); జారన్= ఎదలపై నుండి పక్కకు జారుతుండగా; కరసరోజాత= కమలాలవంటి చేతులలోని; కంకణ= కడియాలయొక్క; క్వణనములును= ఇంపగు ధ్వనులును; చరణ= కాళ్ళయందలి; నూపుర= అందెలయొక్క; ఘోషముల్= సవ్వడులు; సందడింపన్= కలిసి శబ్దిస్తుండగా...

**తా :** ఆవేళ వారవనితల బృందాలు బంగారుకొండ సానువుల్లోని నెమళ్లవలె వాళ్లజుట్టుముడులు వీపులపై నాట్యంచేస్తుండగా, కదలుతున్న చెవికమ్మలందలి మంచిముత్యాలకాంతులు అద్దాలవంటిచెక్కిళ్లపై ప్రతిబింబిస్తుండగా స్థిరమైన మెరుపు తీగలవంటి వాళ్ల కడగంటి చూపులు వెలుగులను వెదజల్లుతుండగా, మంచుపొరచాటునుండి పైకెగయడానికి యత్నించే గుండ్రని జక్కవపిట్టలవలె వాళ్ల చన్నులు తెల్లని రవికలనుండి పైకి ఉబుకుతూవుండగా, స్తనభారంచేత చలిస్తున్న నడుములు గలవారై, ఒడ్డాణాలు నడుమున మెరుస్తుండగా, పైటలు జీరాడుతుండగా, హస్తకంకణాల, కాలి అందెల ధ్వనులు ఇంపుగా నినదిస్తుండగా తమతమ పరివారాలతో కలిసి ముందుకు సాగారు.

**వ. మఱియు నయ్యిందువదన లందంద మందగమనంబునం జెందు ఘర్మజలబిందు సందోహకందళిత మందహాసచంద్రికాసుందరవదనారవిందంబుల నిందిందిరరుచిరచికురబృందంబులు చిందఱ వందఱలై**

**సందడిగొన, నమందానందహృదయలై, సువర్ణశృంగసంగతంబులైన సంకుమదమలయజముఖ సురభితోయంబులు సముదాయంబులై తమతోయంబుల వారిపయిం జల్లుచుఁ జెందొవలఁ గెందమ్మి విరుల రచియించిన చిమ్మనగ్రోవులఁ దావులు గల పూఁదేనియలు నించి, వావులు దెలిపి, లేవలు మీఱఁ గ్రేవలనుండి యిమ్ములం గని చిమ్ముచుఁ, మృగమదకుంకుమపంకంబునుం గొంకక బింకముల జంకెన లొలయం బంకజసన్నిభంబులగు మొగంబుల నేమఱించి చరుముచు నుల్లంబులు పల్లవింపఁ బెల్లదరి యందియలు గల్లుగల్లని మొరయఁ గ్రేళ్లు దాఁటుచుం జారు చంద్రికాసారఘనసారధూళి మిళితరజనీపరాగంబు రాగంబు రంజిల్లం గరంబులం బుచ్చికొని శిరంబులం జల్లుచుఁ జిత్తంబుల నమ్మత్తకాశినుల వృత్తంబులగు కుచంబుల కెత్తు వత్తు మని బిత్తరించుపువ్వు గుత్తులం దత్తఱంబున వ్రేయుచుఁ బరిహసించుచు నన్యోన్యకర కిసలయకనకకరండభరితంబగు పన్నీటం జెంగావిజిలుఁగుఁ బుట్టంబులు దట్టంబుగాఁ దోఁగి మర్మంబులు బయలు పడిన నగ్గలంబు లగు సిగ్గులకు నొప్పిదంబులగు తమకనుఱెప్ప లడ్డంబు సేయుచుఁ బురుషులుం దాము నారామ లభిరామలీలారసోక్తు లెనయ నంతరంగంబుల సంతసంబునం బంతంబు లిచ్చుచు వసంతంబు లాడిరి. అవ్వేళ నతులవిమానారూఢులైన యింద్రపురంధ్రీజనంబులుంబోలె హాటకశిబిక లెక్కి, నిజచేటికాజనంబులు సేవింపఁ జనుదెంచు భూకాంతకాంతాజనంబులుం దమ సరసంబులకు నర్హంబులైన ధరణీపాలవధూలలామంబు లాదరించు చెలులపైఁ దమ సఖీజనంబులం బురికొల్పి చల్లించుచు భావగర్భితంబు లగువారి చతురసరసోక్తుల మందహాసచంద్రికలు ముఖకమలలీలావిలాసలక్ష్మిం బ్రోదిసేయం జని; రవ్విధంబున నిజసామ్రాజ్యవిభవంబు పూజ్యంబుగా నజాతశత్రుండు గంగాప్రవాహంబున కరిగి యందు నిజవధూయుక్తుండై శాస్త్రోక్తప్రకారంబున నవభృథస్నానం బాచరించె; నా సమయంబున. 804**

ప్రతి : మఱియున్= అంతేగాక; ఆ+ఇందువదనలు= చంద్రబింబంవంటి ముఖాలుగల ఆ వారకాంతలు; అందున్+అందున్+అ= అక్కడక్కడే; మందగమనంబునన్= మెల్లగా నడచుటవల్ల; చెందు= కల్గిన; ఘర్మజల= చెమటనీటియొక్క; బిందు సందోహ= చుక్కల సమూహంచేత; కందళిత= అంకురించిన; మందహాస= చిరునగవు అనెడి; చంద్రికా= వెన్నెలచే; సుందర= అందగించి ఉన్న; వదన+అరవిందంబులన్= తామరపువ్వులను పోలిన ముఖాలయందు; ఇందిందిర రుచిర= తుమ్మెదల కాంతులవంటికాంతులు గలిగి మనోహరంగా ఉన్న; చికుర బృందంబులు= ముంగురుల సమూహాలు; చిందఱవందఱలు+ఐ= అటూ ఇటూ చెదిరినవై; సందడి+కొనన్= కలిసిపోగా; అమంద+ఆనందహృదయలు+ఐ= అతిశయించిన సంతోషంతోగూడిన మనస్సులు గలవారై; సువర్ణశృంగ సంగతంబులు+ఐన= బంగారుతో చేయబడిన పొడుగాటి కొమ్ములయందు కూర్పబడిఉన్న; సంకుమద= జవ్వాజి; మలయజముఖ= శ్రీగంధం మొదలైన సువాసన ద్రవ్యాలచేత; సురభి తోయంబులు= పరిమళభరితాలైన నీళ్లను; సముదాయంబులు+ఐ= గుంపులుగా గూడి; తమ తోయంబులవారిపయిన్= తమ పరివారంలోనివారిమీద; చల్లుచున్= కలయజల్లుతూ; చెన్+తొవలన్= ఎఱ్ఱకలువ పూవులచేతను; కెంపు+తమ్మివిరులన్= ఎఱ్ఱ తామరపూవులచేతను; రచియించిన= తయారు చేసినట్టి; చిమ్మన+క్రోవులన్= నీళ్లు చిమ్మెడు గొట్టాలతో; తావులు+కల= సువాసనలు గలిగిన; పూవు+తేనియలు= ఆయా పూవులనుండి సేకరించిన; తేనెలను; నించి= నింపి; వావులు+తెలిపి= చుట్టరికపు వరుసలను పేర్కొంటూ, లేవలు మీఱన్= సొగసులు అతిశయించగా;

కేవలన్+ఉండి= పక్కలలో (దాగుకొని) ఉండి; ఇమ్ములన్+కని= శరీరాలలో సరియైన చోట్లను గురిచూచి; చిమ్ముచున్= సూటిగా చిమ్ముతూ; బింకములన్= గర్వంతోకూడిన; జంకెనలు= బెదరింపులు; ఒలయన్= విలసిల్లగా; ఏమఱించి= ఏమార్చి (మోసగించి); మృగమద= కస్తూరితో తయారుచేసిన (బురదవలె చిక్కని) లేపమును; కుంకుమ పంకంబునున్= కుంకుమపువ్వుతో చేసిన (బురదవంటి) మైపూతను; పంకజసన్నిభంబులు+అగు= పద్మాలను పోలినట్టి; మొగంబులన్= తమ పరివారంలోని వారిముఖాలపై; కొంకక= ఏలాంటిసంకోచం లేకుండ; చరుముచున్= ఒక్కుమ్మడిగా చేతితో పూస్తూ; ఉల్లంబులు= మనస్సులు; పల్లవింపన్= చిగురించగా (వికసించగా); పెల్లు+అడరి= మిగుల అతిశయించి; అందియలు= కాళ్లయందు ధరించే చిరుగజ్జెల (అందెలు); గల్లు గల్లు+అని= గల్లుగల్లుమనెడి ధ్వనులతో; మొరయన్= శబ్దించగా; క్రేళ్లుదాఁటుచున్= వేగంగా గంతులు వేస్తూ; పాఱుచున్= పరువెత్తుతూ; చారు= మనోజ్ఞమైన; చంద్రికా+ఆసార= వెన్నెలసోనవంటి; ఘనసారధూళి= పచ్చకప్పూరపుదుమ్ముచే; మిళిత= కలసియున్న; రజనీపరాగంబు= పసుపుపొడిని; రాగంబు= మనస్సులలోని అనురాగం; రంజిల్లన్= ఒప్పారగా; కరంబులన్= చేతులతో; పుచ్చికొని= తీసుకొని; శిరంబులన్= తలలపై; చల్లుచున్= వెదజల్లుతూ; చిత్తంబులన్= మనస్సులలో; ఆ+మత్తకాశినుల= మదించినటువంటి ఆ యువతులయొక్క; వృత్తంబులు+అగు= గుండ్రనివైన; కుచంబులకున్= పాలిండ్లకు; ఎత్తువత్తుము+అని= సమానంగా తులతూగగలమని; బిత్తరించు= సరసమాడుతున్న; పువ్వుగుత్తులన్= పూలచెండ్లను; తత్తఱంబునన్= త్వరత్వరగా; వ్రేయుచున్= (చన్నులమీద) విసరివేస్తూ; పరిహసించుచున్= పరియాచకాలాడుతూ; అన్య+అన్య= ఒకరొకరియొక్క; కరకిసలయ= చిగురాకులవంటి చేతులయందలి; కనకకరండ= బంగారు బరిణెలయందు; భరితంబు+అగు= నిండి ఉన్నట్టి; పన్నీటన్= సువాసనగలిగిన చల్లని నీటిచేత; చెన్ను+కావి= ఎర్రని (కావి)రంగు గల; జిలుగు పుట్టంబులు= సన్నని (పలుచని) వస్త్రాలు (చీరలు); దట్టంబు+కాన్= అధికంగా; తోఁగి= తడిసిపోయి; మర్మంబులు= లోపల రహస్యంగా ఉండే అంగాలు; బయలుపడినన్= (తడసిన వస్త్రములనుండి) బయటికి గోచరిస్తూ ఉన్నందున; అగ్గలంబులు+అగు= అధికమైనట్టి, సిగ్గులకున్= లజ్జించుటలనెడి అనేభావాలకు; ఒప్పిదంబులు+అగు= అనుగుణాలయిన; తమ కనుఱెప్పలు= (ఆ వారవనితలు) తమ తమ కన్నుల రెప్పలను; అడ్డంబు+చేయుచున్= మూసుకొంటూ; పురుషులున్= ఊరేగింపునందలి (రసికులగు) మగవారును; తామున్+ఆ రామలు= ఆ వారయువతులు; అభిరామ= మిగుల మనోహరమైన; లీలారస+ఉక్తులు+ఎనయన్= హాస్యరసంతో కూడిన పలుకులు ఇంపొందగా, అంతరంగంబులన్= హృదయసీమలయందలి; సంతసంబునన్= సంతోషంచేత; పంతంబులు+ఇచ్చుచున్= (ఒకరిని మించి మరియొకరు) పంతపు మాటలు పల్కుతూ; వసంతంబులు+ఆడిరి= (అనురాగ సూచకాలైన) ఎర్రనీళ్లను పరస్పరం చల్లుకొన్నవారైరి; ఆ+వేళన్= ఆ సంతోష సమయంలో; అతుల విమాన+ఆరూఢులు+ఐన= గొప్పవైన విమానాలను ఎక్కినవారై; ఇంద్ర= దేవేంద్రునియొక్క; పురంధ్రీ జనంబులున్+పోలెన్= ఇల్లాండ్రవలె; హాటకశిబికలు+ఎక్కి= బంగారు పల్లకీలను అధిరోహించి; నిజ= తమ తమయొక్క; చేటికాజనంబులు= చెలికత్తెలు; సేవింపన్= సేవాభావనతో వెంట నడుస్తుండగా; చను+తెంచు= వస్తున్న; భూకాంత కాంతాజనంబులున్= రాజపత్నులు (మహారాణులు); తమ సరసంబులకున్= తమ పరిహాసాలకు; అర్హంబులు+ఐన= తగినవారైన; ధరణీపాల వధూలలామంబులు= ఉత్తములయిన మహారాణులు; ఆదరించు= మన్నించే; చెలులపైన్= చెలికత్తెలమీద; తమ సఖీజనంబులన్= తమవద్ద నున్న చెలికత్తెలను; పురికొల్పి= ప్రేరేపించి; చల్లించుచున్= (ఎదుటి మహారాణులయొక్క) చెలికత్తెలపై వసంతాలను చల్లిస్తూ; భావగర్భితంబులు+అగు= సుకుమారభావాలతో కూడియున్న; వారి= ఎదుటి రాణులయొక్క, వారిచెలులయొక్క; చతురసరస+ఉక్తులన్= నేర్పుతో గూడిన పరిహాసపు పలుకులవలన కలిగిన; మందహాస

చంద్రికలు= చిరునగవు వెన్నెలలు; ముఖకమల= పద్మాలను పోలిన మోములయొక్క; లీలావిలాసలక్ష్మిన్= సహజంగా ఉన్న సౌందర్య శోభను; ప్రోది+చేయన్= పెంపొందించగా; చనిరి= ముందుకు సాగారు; ఆ విధంబునన్= ఆ ప్రకారంగా; అజాతశత్రుండు= ధర్మరాజు; నిజ= తనయొక్క; సామ్రాజ్య విభవంబు= గొప్పరాజ్యముయొక్క; వైభవం; పూజ్యంబు+కాన్= గౌరవింపదగిందై ప్రకాశిస్తూ ఉండగా; న+జాతశత్రుండు (అజాతశత్రుండు)= పుట్టని శత్రువులుగలవాడు (శత్రువులు లేనివాడు ధర్మరాజు); గంగాప్రవాహంబునకున్= గంగానదివద్దకు; అరిగి= వెళ్లి; అందున్= పవిత్రమైన ఆ గంగానదియందు; నిజవధూయుక్తుండు+ఐ= తన ధర్మపత్నితో గూడినవాడై; శాస్త్ర+ఉక్తప్రకారంబునన్= శాస్త్రంలో చెప్పబడిన విధంగా; అవభృథస్నానంబు= యజ్ఞం పూర్తి అయిన పిదప మంత్ర పూర్వకంగా చేసే పవిత్ర స్నానం; ఆచరించెన్= చేశాడు; ఆ సమయంబునన్= ఆ విధంగా పవిత్రస్నానంచేసిన వేళయందు...

**తా :** ధర్మనందనుని పరివారంలోని మందగమనలైన ఆ వారవనితలు చిరునగవులు తొణికిసలాడే తమ ముఖపద్మాలపై తుమ్మెదలవంటి ముంగురులు చలిస్తుండగా ఆనందంతో ప్రక్కనున్న తమవారిపై చిమ్మనగ్రోవులతో పన్నీరు చిమ్ముతూ కస్తూరి, కుంకుమ లేపనాలను వారిముఖాలమీద పూస్తూ, పూల చెండ్లను విసరుతూ, వరసైనవారితో పరిహాసాలాడుతూ వసంతకేళి జరుపసాగారు.

దేవకాంతలవంటి రాజపత్నులు చెలికత్తెలు వెనువెంట సేవిస్తూ నడువగా, బంగారుపల్లకీల నెక్కివస్తూ తమ సరసాలకు యోగ్యురాండ్రైన రాజకాంతల చెలికత్తెలపైకి తమ చెలికత్తెలను పురికొల్పి వసంతాలు చల్లిస్తూ, చమత్కార సంభాషణలతో చిరునవ్వులు చిందిస్తూ పయనం సాగించారు. ఈ రీతిగా గొప్ప సామ్రాజ్యవైభవంతో ధర్మరాజు గంగానదికి వెళ్లి, ధర్మపత్నీసమేతంగా పవిత్ర అవభృథస్నానం చేశాడు.

**క. అనిమిషదుందుభి ఘన ని, స్వనములు వీతెంచెఁ బుష్పవర్షము గురిసెన్**
**మునిదేవపితృమహీసుర, వినుతుల రవ మెసఁగె నపుడు విమలచరిత్రా! 805**

**ప్రతి :** విమలచరిత్రా!= స్వచ్ఛమైన చరిత్రగల పరీక్షిన్మహారాజా!; అపుడు= ఆ విధంగా ధర్మరాజు అవభృథస్నానం చేసిన వేళలో; అనిమిష= దేవతలయొక్క; దుందుభి= భేరులయొక్క; ఘననిస్వనములు= గొప్పధ్వనులు; వీచు+తెంచెన్ – వీతెంచెన్= వినవచ్చాయి (వినిపించాయి); పుష్పవర్షము= పూలవాన; కురిసెన్= ఆకసంనుండి కురిసింది; ముని= మునీంద్రులయొక్క; దేవ= దేవతలయొక్క; పితృ= పితృదేవతలయొక్క; మహీసుర= బ్రాహ్మణులయొక్క; వినుతుల= స్తోత్రాలయొక్క; రవము= శబ్దం; ఎసఁగెన్= అతిశయించింది.

**తా :** నిర్మలచరిత్రుడవైన పరీక్షిద్రాజేంద్రా! ధర్మరాజు సతీసమేతుడై అవభృథస్నానంచేసిన ఆ సమయంలో దేవతలు భేరులు మొదలైన మంగళవాద్యాలను మోగించి, పూలవాన కురిపించారు. మహర్షులు, దేవతలు, పితృదేవతలు ధర్మరాజుయొక్క ఆ యజ్ఞఅవభృథకార్యాన్ని ప్రశంసించారు.

**క. నరు లెట్టి పాపులైనను, గర మర్థిని నెద్ది సేసి గతకల్మషులై**
**చరియింతు రట్టి యవభృథ, మరుదుగఁ గావించి రెలమి నఖిలజనంబుల్. 806**

**ప్రతి :** నరులు= మానవులు; ఎట్టిపాపులు+ఐనను= ఎటువంటి పాపాలు చేసినవారైనా; కరము+అర్థినిన్= మిక్కిలి ప్రీతితో; ఎద్ది+చేసి= ఏ అవభృథస్నానం చేసి; గతకల్మషులు+ఐ= పాపాలు తొలగిపోయినవారై; చరియింతురు= జీవిస్తూ

ఉంటారో; అట్టి= అటువంటి మహిమగల్గిన; అవభృథము= అవభృథస్నానాన్ని; అఖిలజనంబుల్= ఆ పరివారంలోని జనులందరూ; అరుదుగన్= ఆశ్చర్యకరంగా; ఎలమిన్+కావించిరి= ప్రీతితో చేశారు.

**తా :** మానవులు ఎంతటిపాపాత్ములయినా ఏ స్నానం చేసి, సకలపాపాలనుండి విముక్తులౌతుంటారో, అట్టి ప్రభావంగల ఆ అవభృథస్నానాన్ని అక్కడ చేరిన జనులందరూ ఆసక్తితో ఆచరించారు.

**ఆ. అంత ధర్మతనయుఁ డభినవమృదుల దు, కూల సురభికుసుమమాలికాను**
**లేపనములు రత్నదీపితభూషణా, వళులు దాల్చి వైభవమున నొప్పె. 807**

**ప్రతి :** అంతన్= ఆ పవిత్రస్నానానికి తరువాత; ధర్మతనయుఁడు= ధర్మరాజు; అభినవ= నూతనమైన; మృదుల= మిగులమెత్తనైన; దుకూల= పట్టువస్త్రాలను; సురభి= పరిమళయుతమైన; కుసుమమాలికా= పూలదండలను; అనులేపనములు= శ్రీగంధం, జవ్వాజిమొదలైన వస్తువులతో తయారుచేసిన మైపూతలను; రత్నదీపిత= నవరత్నాలచే ప్రకాశింపజేయబడిన; భూషణ+ఆవళులు= సువర్ణాభరణసమూహాలను; తాల్చి= ధరించి; వైభవమునన్= సంపదతో ఠీవితో గూడిన శోభావిశేషంతో; ఒప్పెన్= విలసిల్లాడు.

**తా :** ధర్మరాజు కొత్తవైన పట్టువస్త్రాలను, పరిమళభరితమైన పూలమాలలను ధరించి, అనేక రత్నమయఆభరణాలను అలంకరించుకొని మహావైభవంతో ప్రకాశించాడు.

**వ. అంత నవభృథస్నానానంతరంబున మరలి చనుదెంచి, 808**

**ప్రతి :** అంతన్= తరువాత; అవభృథస్నాన+అనంతరంబునన్= గంగానదిలో అవభృథస్నానం చేసిన పిమ్మట; మరలి= తిరిగి; చను+తెంచి= ఇంద్రప్రస్థపురానికి వచ్చి...

**తా :** గంగానదీలో అవభృథస్నానం కావించిన తరువాత ధర్మరాజు మరల ఇంద్రప్రస్థనగరానికి వచ్చి

**ఉ. పాండుతనూభవాగ్రజుఁడు పాండుయశోనిధి భాసమాన మా**
**ర్తాండనిభుండు యాజకసదస్యమహీసురమిత్రబంధు రా**
**ణ్మండలిఁ బూజ సేసి బుధమాన్యచరిత్రుడు వారి కిచ్చె నొం**
**డొండ దుకూలరత్నకనకోజ్జ్వలభూషణముఖ్యవస్తువుల్. 809**

**ప్రతి :** పాండుయశస్+నిధి= తెల్లని (స్వచ్ఛమైన) కీర్తికి నిలయమైనవాడు; భాసమాన= మిగుల ప్రకాశిస్తున్న; మార్తాండ నిభుండు= సూర్యుణ్ణి పోలినవాడు; బుధమాన్యచరిత్రుడు= సజ్జనులచే కొనియాడదగిన చరిత్రగలవాడు; పాండుతనూభవ+అగ్రజుఁడు= పాండురాజు పుత్రులలో పెద్దవాడు అయిన ధర్మరాజు; యాజక= యజ్ఞం చేయించినవారు; సదస్య= యజ్ఞకార్యాన్ని పర్యవేక్షించినవారు; మహీసుర= బ్రాహ్మణులు; మిత్ర= స్నేహితులైనవారు; బంధు= చుట్టాలు; రాట్= తదితరులైన రాజులు; మండలిన్= వీరందరియొక్క సమూహాన్ని; పూజ+చేసి= తగినట్లుగా పూజించి; వారికిన్= వారలందరికీ; ఒండు+ఒండు+అ= వరుసగా ఒక్కొక్కరికి; దుకూల= పట్టువస్త్రాలు; రత్న= నవరత్నాలతో గూడిన; కనక+ఉజ్జ్వల భూషణ= బంగారుచే చేయబడి మిగుల ప్రకాశిస్తున్న ఆభరణాలు; ముఖ్య= మొదలయిన; వస్తువుల్= మిగుల విలువైన వస్తువులను; ఇచ్చెన్= ఆదరంతో బహుమానంగా ఇచ్చాడు.

**తా :** ప్రకాశిస్తున్న సూర్యుణ్ణి బోలిన పరాక్రమశాలి, నిర్మలకీర్తికి నిలయుడు, సజ్జనులచే నిత్యం కొనియాడబడుతూ ఉండేవాడు అయిన పాండవజ్యేష్ఠుడు (ధర్మరాజు) రాజసూయ యాగాన్ని నిర్వహింపజేసిన ఋత్విజులను, సదస్యులను, బ్రాహ్మణోత్తములను, బంధువులను, మిత్రులను రాజులను అందరినీ సముచితంగా పూజించి, వారలకు ఒక్కొక్కరికి వరుసగా పట్టువస్త్రాలు, మణిమయాలయిన బంగారుఆభరణాలు మొదలైన అమూల్యవస్తువులను బహుమానంగా ఇచ్చాడు.

**విశే :** ఈ పద్యంలో ధర్మరాజు కీర్తి, పరాక్రమం, సచ్చరిత్రం, ఔదార్యగుణం – ఉదాత్తంగా ఆవిష్కరింపబడినాయి.

**వ. అట్లు నారాయణపరాయణులై దేవసమానప్రకాశప్రభావంబుల సకలనరనారీలోకంబు లనర్ఘ్యరత్నమయ భూషణమాల్యానులేపనంబులు ధరించి పరమానందభరితాత్ములై యొప్పియుండి; రంత. 810**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; సకలనరనారీలోకంబులు= ఇంద్రప్రస్థపట్టణమందలి స్త్రీలు, పురుషులూ అందరూ; నారాయణ పర+అయనులు+ఐ= శ్రీమన్నారాయణుని (శ్రీకృష్ణుని) యందే నిమగ్నమైన బుద్ధిగలవారై; దేవ సమాన= దేవతలతో సమానమైన; ప్రకాశ+ప్రభావంబులన్= తేజస్సు, మహిమ – ఈ రెండు విశిష్ట లక్షణాలను గలిగినవారై; న+అర్ఘ్య (అనర్ఘ్య)= అమూల్యమై (మిగుల విలువైన); రత్నమయ= మణులతోగూడిన; భూషణ= సొమ్ములు; మాల్య= పూలమాలలు; అనులేపనంబులు= మైపూతలు; ధరించి= తాల్చి; పరమ+ఆనందభరిత+ఆత్ములు+ఐ= గొప్ప సంతోషంతో నిండిన మనస్సులు గలవారై; ఒప్పి+ఉండిరి= ఆనందంగా ఉన్నారు.

**తా :** ఆ ప్రకారంగా ఇంద్రప్రస్థరాజధానియందలి స్త్రీపురుషులు అందరూ శ్రీకృష్ణదేవునియందు భక్తి తాత్పర్యాలు గలవారై, దైవీ తేజస్సుతో ప్రకాశిస్తూ, రత్నాభరణాలను, గంధమాల్యాదులను ధరించి పరమానందభరితులై ఉండారు.

**చ. సునిశితభక్తిఁ దన్మఖముఁ జూడఁగ వచ్చిన యట్టి దేవతా**
**ముని ధరణీసుర ప్రకరభూవరవిడ్జనశూద్రకోటి య**
**జ్జనవరచంద్రుచే నుచితసత్కృతులం బరితోషచిత్తులై**
**వినయముతోడ ధర్మజుని వీడ్కొని పోవుచుఁ బెక్కుభంగులన్. 811**

**ప్రతి :** సునిశిత భక్తిన్= మిగుల తీవ్రమైన భక్తిభావనతో; తద్+మఖమున్= ఆ రాజసూయయాగాన్ని; చూడన్+కన్+వచ్చిన+అట్టి= సందర్శించేందుకై విచ్చేసినట్టి; దేవతా= దేవతలు; ముని= మునీంద్రులు; ధరణీసురప్రకర= బ్రాహ్మణసంఘాలు; భూవర= భూపతులు; విట్+జన= వైశ్యులు; శూద్రకోటి= శూద్రుల సమూహాలు; ఆ+జనవర చంద్రుచేన్= ఆ రాజ శ్రేష్ఠునిచేత (ధర్మజునిచేత); ఉచిత సత్కృతులన్= వారివారికి తగినట్లుగా ధర్మరాజు కావించిన సన్మానాలతో; పరితోషచిత్తులు+ఐ= సంతోషంతో నిండిన హృదయాలుగలవారై; వినయముతోడన్= రాజుగారి యెడల అణకువ గలిగినవారై; ధర్మజునిన్= మహారాజైన ధర్మనందనుణ్ణి; వీడ్కొని పోవుచున్= వీడ్కోలుపు చెప్పి వెళ్లుతూ; పెక్కుభంగులన్= అనేక రీతులుగా...

**తా :** మహారాజైన ధర్మజుడు నిర్వహిస్తూ ఉన్న రాజసూయయజ్ఞాన్ని చూడాలని భక్తితత్పరులై ఏతెంచిన దేవతలు, మునులు, బ్రాహ్మణులు, రాజులు, వైశ్యులు, శూద్రులు ధర్మరాజుచే సముచితంగా సన్మానింపబడినవారైనారు. అలా సమ్మానింపబడినవారందరూ పరమసంతోషిత హృదయులై వినయంతో మహారాజువద్ద సెలవుగైకొని వెళ్లిపోయారు.

**విశే :** మహారాజు ఎడల ఆనాటి ప్రజలకుగల భక్తి ప్రపత్తులు ఈ పద్యంలో చక్కగా వెల్లడవుతున్నాయి.

**చ. హరిచరణాంబుజాతయుగళార్చకుఁడై పెనుపొందు పాండు భూ**
**వరసుతరాజసూయమఖవైభవమున్ నుతియించుచున్ సమా**
**దరమున నాత్మభూముల కుదారత నేఁగిరి ధర్మసూనుఁడున్**
**సరసిజనేత్రుఁ దా ననుపఁజాలక యుండు మటంచు వేఁడినన్. 812**

**ప్రతి :** హరిచరణ+అంబుజాతయుగళ= పద్మాలను పోలిన శ్రీకృష్ణుని పాదాల జంటను; అర్చకుఁడు+ఐ= పూజించేవాడై; పెనుపు+ఒందు= అభివృద్ధి పొందుతున్న; పాండు భూవరసుత= రాజశ్రేష్ఠుడైన పాండురాజు పుత్రుడైన ధర్మరాజు చేసిన; రాజసూయ మఖవైభవమున్= రాజసూయయజ్ఞంయొక్క; గొప్పతనాన్ని; సమాదరమునన్= మిగుల ప్రీతితో; నుతియించుచున్= అనేకవిధాలుగా కొనియాడుతూ; ఉదారతన్= ఘనంగా; ఆత్మభూములకున్= తమతమ ప్రదేశాలకు; ఏఁగిరి= వెళ్లారు; ధర్మసూనుడున్= ధర్మతనయుడు; తాను; సరసిజనేత్రున్= కమలాలనుపోలిన కన్నులు గలిగిన శ్రీకృష్ణదేవుణ్ణి; అనుపన్+చాలక= (ద్వారకకు) సాగనంపుటకు ఇష్టంలేక; ఉండుము+అటు+అంచున్= ఇచ్చటనే కొంతకాలము ఉండవలసిందని; వేఁడినన్= ప్రార్థింపగా...

**తా :** శ్రీకృష్ణదేవుని పాదపద్మాల్ని ఆరాధించే ధర్మరాజు నిర్వహించిన రాజసూయ యాగవైభవాన్ని ప్రశంసిస్తూ, యజ్ఞానికి విచ్చేసినవాళ్లందరూ తమతమ నివాసభూములకు వెళ్లారు. ఆ సమయంలో ధర్మజుడు శ్రీకృష్ణుణ్ణి సాగనంపేందుకు ఇష్టపడక, ఇంకా కొన్నాళ్లు ఉండమని ప్రార్థించాడు.

**వ. ఇట్లు పాండవాగ్రజు ప్రార్థనం గైకొని దామోదరుండు సమస్తయాదవులను గుశస్థలికిఁ బోవం బనిచి కతిపయ పరిజనంబులుం దానును నతనికిఁ బ్రియంబుగాఁ దన్నగరంబునఁ బ్రమోదంబున నుండెనని చెప్పి మఱియు నిట్లనియె. 813**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పాండవ+అగ్రజు= పాండవుల్లో పెద్దవాడగు ధర్మరాజుయొక్క; ప్రార్థనన్+కైకొని= వేడికోలును స్వీకరించి (అంగీకరించి); దామ+ఉదరుండు= శ్రీకృష్ణుడు; సమస్త యాదవులను= ద్వారకనుండి తనవెంట యాగానికి వచ్చిన యాదవులందరిని; కుశస్థలికిన్= ద్వారకానగరానికి; పోవన్+పనిచి= వెళ్లడానికి ఆదేశించి; కతిపయ పరిజనంబులున్= కొంతమంది సేవకులూ; తానునున్= శ్రీకృష్ణుడు తానుకూడా; అతనికిన్= ఆ ధర్మజునికి; ప్రియంబు+కాన్= ప్రీతి కలుగునట్లుగా; తద్+నగరంబునన్= ఆ ఇంద్రప్రస్థ పురంలో; ప్రమోదంబునన్= మిగుల సంతోషంతో; ఉండెన్= ఉన్నాడు; అని చెప్పి= అని శుకయోగి ఈ విధంగా వివరించి; మఱియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ధర్మనందనుని ప్రార్థనను మన్నించి శ్రీకృష్ణుడు తనవెంట వచ్చిన యాదవుల నందరినీ కుశస్థలీనగరానికి (ద్వారకకు) పంపించాడు. తానుమాత్రం కొంతమంది పరిజనులతో పాండవాగ్రజునికి ప్రియంగా ఇంద్రప్రస్థంలో ఉండినాడు - అని చెప్పి, శుకయోగీంద్రుడు పరీక్షిత్తుతో మళ్లీ ఇలా అన్నాడు.

**చ. 'జనవర! పాండుభూపతనుజాతుఁడు దుస్తరమౌ మనోరథా**
**బ్ధిని సరసీరుహాక్షుఁడను తెప్పకతంబున దాఁటి భూరి శో**

**భనయుతుండై మనోరుజయుం బాసి ముదాత్మకుండై వెలింగె న**
**వ్వనరుహనాభుదాసజనవర్యులకుం గలవే యసాధ్యముల్?** **814**

**ప్రతి :** జనవర!= నరనాథా! (పరీక్షిద్రాజేంద్రా!); పాండుభూపతనుజాతుండు= పాండురాజ తనయుడైన ధర్మరాజు; దుస్తరము+ఔ= దాట వీలుకానిదైన; మనస్+రథ+అబ్ధినిన్= రాజసూయయాగసంకల్పమనే సముద్రాన్ని; సరసీరుహ+అక్షుండు+అను= కమలాక్షుడైన శ్రీకృష్ణదేవుడనే; తెప్పకతంబునన్= ఓడవల్ల; దాంటి= ఆవలికి దాటి; మనస్+రుజయున్= మనస్సులోని రోగాన్ని (దిగులును); పాసి= తొలగజేసికొని; ముద+ఆత్మకుడు+ఐ= ప్రీతితోగూడిన మనస్సు గలవాడై; భూరి శోభనయుతుడు+ఐ= గొప్ప గొప్ప శుభపరంపరతో గూడుకొన్నవాడై; వెలింగెన్= భాసించాడు; ఆ+వనరుహనాభు= పద్మం బొడ్డునందు గలిగిన ఆ శ్రీమహావిష్ణువుయొక్క (శ్రీకృష్ణదేవునియొక్క); దాసజనవర్యులకున్= శ్రేష్ఠులైన భక్తజనులకు; న+సాధ్యముల్= నెరవేరని పనులు; కలవు+ఏ?= ఉంటాయా? (ఉండవు–అనిసారాంశం)

**తా :** శ్రీకృష్ణదేవుని భక్తాగ్రగణ్యుడైన ధర్మజుడు రాజసూయాన్ని నిర్వహించాలనే కాంక్ష అనే సముద్రాన్ని ఆ దేవదేవుడనే ఓడద్వారా దాటి, మానసిక చింతను అధిగమించి, ఘనమైన సంతోషంతో ప్రకాశించాడు. పద్మనాభుని దాసులకు సాధింపజాలని మహాకార్యాలు ఉండవుకదా!

**వ. అట్టియెడ.** **815**

**ప్రతి :** అట్టి+ఎడన్= అటువంటి సందర్భంలో...

**తా :** రాజసూయం నిర్వహించిన ధర్మరాజు నెమ్మదిగా, సంతోషంగా ఉండిన ఆ సందర్భంలో

**ఆ. రాజసూయమఖవరప్రభావమునకు, నఖిలజనులు మోదమంది రపుడు**
**కలుషమానసుండు కులపాంసనుండు సుయో, ధనుం డొకండు దక్క ధరణినాథ!'** **816**

**ప్రతి :** ధరణినాథ!= ఓ భూపతీ! (పరీక్షిద్రాజా!); అపుడు= ఆ వేళలో; రాజసూయ మఖవర= రాజసూయమనే పేరులో శ్రేష్ఠమైన యజ్ఞంయొక్క; ప్రభావమునకున్= మహిమతో గూడిన వైభవానికి; కలుషమానసుండు= చెడుతలంపుగలవాడు; కులపాంసనుండు= వంశానికి చెడు కలిగించేవాడు అయిన; సుయోధనుండు+ఒకండు+తక్క= ఒక్క దుర్యోధనుడు తప్ప; అఖిలజనులు= జనులందరు; మోదము+అందిరి= సంతోషం పొందినారు.

**తా :** పరీక్షిద్రాజేంద్రా! కల్మషమైన మనస్సుగలవాడు, కులదూషకుడు – అయిన దుర్యోధనుడు తప్ప, తక్కిన సమస్త ప్రజలు శ్రేష్ఠమైన ఆ రాజసూయయజ్ఞంయొక్క వైభవానికి ఎంతో ఆనందించారు.

**వ. అనిన విని శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె.** **817**

**ప్రతి :** అనినన్= శుకయోగి అట్లు పల్కగా; విని= ఆలకించి; పరీక్షిద్+నర+ఇంద్రుండు= పరీక్షిన్మహారాజు; శుకయోగి+ఇంద్రునకున్= యోగులలో శ్రేష్ఠుడయిన శుకమునీంద్రునికి; ఇట్లు= ఈ దిగువ చెప్పబోయే విధంగా; అనియెన్= అన్నాడు.

**తా :** అని చెప్పగా, వినిన పరీక్షిత్తు శుకమహర్షితో మళ్లీ ఇలా అన్నాడు.

**ఆ. 'అఖిలజనుల కెల్ల నానందజనకమై, యెనయు మఖము కురుకులేశ్వరునకుఁ**
**గర మసహ్యమైనకారణ మెయ్యది, యెఱుఁగఁ బలుకు నాకు నిద్ధచరిత!' 818**

**ప్రతి :** ఇద్ధచరిత!= పవిత్రమైన చరిత్రగల మునీంద్రా!; అఖిలజనులకున్+ఎల్లన్= జనులందరికీ; ఆనందజనకము+ఐ= సంతోషాన్ని కలిగించేదై; ఎనయు మఖము= సమకూడినదైయున్న రాజసూయయాగం; కురుకుల+ఈశ్వరునకున్= కౌరవ వంశానికి అధిపతియై ఉన్నవానికి (దుర్యోధనునికి); కరము= మిక్కిలి; న+సహ్యము(అసహ్యము)+ఐన= సహింపరానిదయిన; కారణము= హేతువు; ఏ+అది= ఏది (అది); నాకున్= నాకు; ఎఱుఁగన్+పలుకు= తెలియునట్లుగా చెప్పగోరుతున్నాను.

**తా :** ప్రశస్తమైన చరిత్రగల మునీంద్రా! సమస్త జనులకు సంతోషాన్ని కలిగించిన ధర్మజుని రాజసూయయాగం దుర్యోధనునికి మాత్రం ఏ కారణంచేత సహింపరానిదైంది? ఈ విషయం నాకు వివరించండి!

**చ. అనిన మునీంద్రుఁ డిట్లను ధరాధిపుతోఁ గురురాజు పాండు నం**
**దనులదెస న్ననేకదురితంబులు నిచ్చలుఁ జేయుచుండు నై**
**నను నొకనాఁడు పంకరుహనాభదయాపరిలబ్ధభూరి శో**
**భన జితదేవదైత్యనరపాలకరాజ్యరమామహత్త్వమై. 819**

**ప్రతి :** అనినన్= అని అడుగగా; ముని+ఇంద్రుఁడు= మునులలో శ్రేష్ఠుడైన శుకయోగి; ధరా+అధిపుతోన్= భూనాథుడైన పరీక్షిత్తుతో; ఇట్లు+అనున్= ఈ రీతిగా అన్నాడు; కురురాజు= కురువంశపు రాజైన దుర్యోధనుడు; పాండునందనుల దెసన్= పాండవులవైపున (పాండవుల యెడల); నిచ్చలున్= ఎల్లప్పుడు; అనేక దురితంబులు= పెక్కు పాపాలు (అపకారాలను); చేయుచున్+ఉండున్= చేస్తూ ఉన్నాడు; ఐననున్= అలా నిత్యం అపకారాలు చేస్తూ ఉండినప్పటికిని; పంకరుహనాభ= పద్మనాభుని (శ్రీకృష్ణుని)యొక్క; దయా పరిలబ్ధ= అనుగ్రహంచేత చేకూరినట్టి; భూరిశోభన= గొప్పవైన శుభాలచేత; జిత= జయింపబడిన; దేవ= దేవతలయొక్క; దైత్య= రాక్షసులయొక్క; నరపాలక= రాజులయొక్క; రాజ్యరమామహత్త్వము+ఐ= రాజ్యసంపదల మహిమతో కూడియున్నదైనందువలన; ఒకనాఁడు= నిత్యము...

**తా :** అని ప్రశ్నించిన పరీక్షిన్మహారాజుతో శుకమహర్షి ఇలా అన్నాడు. 'దుర్యోధనుడు ఎల్లవేళల పాండవులకు అనేక అపకారాలు చేస్తూ ఉండినప్పటికీ శ్రీకృష్ణదేవుని దయావిశేషంచేత లభించిన రాజ్యలక్ష్మీమాహాత్మ్యంచేత ధర్మరాజు నిత్యమూ విరాజిల్లుతున్నాడు. ఆయనకు లభించిన రాజ్యలక్ష్మీవైభవం ఎటువంటిదంటే – అది దేవ, దానవ, మానవ పరిపాలకుల రాజ్యలక్ష్మీ విభవాలను మించిన శోభావిశేషం గలిగి ప్రకాశిస్తూ ఉండేది.

**చ. వెలయు ననూనసంపదల విశ్రుతకీర్తుల మిన్ను ముట్టఁ బెం**
**పలరిన పాండుభూవరసుతాగ్రజుఁ దంతిపురంబులోన ను**
**జ్జ్వలమణి భూషణాంశురుచిజాలము బర్వఁ బయోజనాభు ను**
**త్కలిక భజించుచున్ ఘనసుఖస్థితి భూరిమనోహరాకృతిన్. 820**

**ప్రతి :** వెలయు+అనూన సంపదలన్= తనకు లభించి ప్రసిద్ధికెక్కిన సిరిసంపదలచేతను; విశ్రుతకీర్తులన్= మిగుల ప్రసిద్ధిగాంచిన కీర్తులచేతను; మిన్నుముట్టన్= ఆకసాన్ని తాకునటువంటి; పెంపు+అలరిన= గొప్పతనంతో విలసిల్లినట్టి;

పాండుభూవరసుత+అగ్రజుఁడు= పాండుభూనాథునిపుత్రులలో పెద్దవాడైన ధర్మరాజు; ఉజ్జ్వల మణిభూషణ+అంశురుచి జాలము= తాను ధరించిన ప్రకాశవంతమైన రత్నాభరణాల కిరణాల కాంతుల సమూహం; పర్వన్= అంతట ప్రసరిస్తుండగా; భూరి మనోహర+ఆకృతిన్= మనస్సును మిగుల ఆకర్షించునట్టి సుందరమైన స్వరూపంతో; అంతిపురంబులోనన్= మయసభాభవనంలోని అంతఃపురంలో; పయోనాభున్= పద్మనాభుణ్ణి (శ్రీకృష్ణుని); ఉత్కలికన్= కుతూహలంతో; భజించుచున్= సేవిస్తూ; ఘన సుఖస్థితిన్= మిక్కిలి అతిశయమైన సౌఖ్యాన్ని అనుభవిస్తూ (ఉండగా– అని)...

**తా :** తనకు చేకూరిన ప్రసిద్ధమైన, అనంతమైన సంపదలతోను గొప్పకీర్తితోను ధర్మరాజు అంతఃపురంలో తన రత్నాలంకారాల కాంతులు అంతటా ప్రకాశిస్తూ ఉండగా, మనోజ్ఞమైన ఆకారంగలవాడై, శ్రీకృష్ణదేవుణ్ణి మిగుల కుతూహలంతో, ఆసక్తితో సేవిస్తూ అధికమైన ఆనందంతో ఉన్నాడు.

**వ. ఉండం గనుంగొని యదియునుంగాక యొక్కనాఁడు లలితాష్టమీశశాంకబింబంబుల విడంబించుచు నింద్రనీలరుచినిచయంబు నపహసించు కుటిలకుంతలంబులు నటనంబు సలుపం దనరు నిటల ఫలకంబులును, బుష్పచాపుచాపంబు రూపునేపుమాపు భ్రూయుగోపాంతంబులై సౌదామనీదామరుచి స్తోమంబులై, కర్ణాంతసీమంబులై యంజనంబులతోడ రంజిల్లు నేత్రకంజంబులును, నవమల్లికాముకుళ విభాసితదంతమరీచికానిచయోద్దీపిత మందహాసచంద్రికాధవళితంబులును ముకురోపమితంబులై కర్ణకుండలమణిమరీచిజాలంబులు బెరసి బహుప్రకారంబులఁ బర్వం బొలుచు కపోలపాలికలును, విలసితగ్రైవేయకముక్తాఫలహారనిచయంబుల కిమ్ము చూపక మిసమిసని పసగల మెఱుంగులు గిఱికొనమీఁటినం బగులు ననం బొగడం దగి మొగంబులకుం బుటంబు లెగయు నుత్తుంగపీనకుచభారంబుల వ్రేఁగు లాఁగ లేక తూఁగాడుచుం గరతల పరిమేయంబు లగు మధ్యభాగంబులును, ఘనజఘనమండలావతీర్ణ కాంచనకాంచీకలాపకింకిణీకలకలనినాదోల్లసితంబులగు కటిప్రదేశంబులును, సల్లలితహల్లకపల్లవకాంతుల మొల్లంబులఁ గొల్లలు గొని యభిరామంబులై శోభిల్లు పదపాణితలంబులును, నలసగతులం బదంబులం దనరు మణినూపురంబులు గోపురంబులం బ్రతిస్వనంబు లొలయ మొరయ నలరు చరణారవిందంబులును, రత్నవలయకంకణాంగులీయకాదివివిధభూషణద్యుతి నిచయంబు లుష్ణమరీచికరనిచయంబుల ధిక్కరింప వెలుంగు కరకంజంబులును, మృగమదఘనసార హరిచందనాగరుకుంకుమపంకంబుల భాసురంబులగు వాసనలు నాసారంధ్రంబులకు వెక్కసంబులై పొలయు సౌభాగ్యంబులు గలిగి చైతన్యంబు నొందిన మాణిక్యపుబొమ్మలవిధంబున గగనమండలంబు నిర్గమించి, వసుధాతలంబున సంచరించు చంద్రరేఖల చెలువున శృంగార రసంబు మూర్తీభవించిన జగంబుల మోహపఱచు మోహినీదేవతల చందంబున, విలసించు మాధవవధూసహస్రంబుల సంగతిని సౌదామనీలతయునుం బోలె నొప్పుచుండెడు ద్రుపదరాజనందన విభవంబును రాజసూయమహాధ్వరోత్సవంబునం జూచి చిత్తంబుత్తలపడ సుయోధనుండు సంతాపానలంబునం గ్రాఁగుచుండె; నంత నొక్కనాఁడు ధర్మనందనుఁడు నిర్మలం బగు సభాభవనంబునకుం జని. 821**

**ప్రతి :** ఉండన్= ధర్మజుడు మహావైభవంతో గూడిన ఆనందంతో ఉంటుండగా; కనున్+కొని= చూచి; అదియున్+కాక= అలా చూడడమేగాకుండా; ఒకనాడు= ఒకరోజు; లలిత= మనోహరమైన; అష్టమీ శశ+అంకబింబంబులన్= అష్టమి

నాటిరాత్రి గోచరించే సగం గుండ్రనైయుండే చంద్రునిఆకారాలను; విడంబించుచున్= సరిపోలుచున్నవై; ఇంద్రనీల రుచినిచయంబున్= ఇంద్రనీల మణులయొక్క కాంతుల సమూహాన్నీ; అపహసించు= పరిహసించునట్టి; కుటిల కుంతలంబులు= వంకరలైన ముంగురులు; నటనంబు సలుపన్= నాట్యం చేస్తున్న విధంగా కదలాడుతుండగా; తనరు= ఒప్పుతున్న; నిటలఫలకంబులును= ఫలకాలను బోలిన ఫాలభాగాలును; పుష్పచాపు= పూలవింటివాడైన మన్మథుని; చాపంబు= ధనుస్సుయొక్క; రూపున్= ఆకారాన్ని; ఏపున్+మాపు= ఆధిక్యాన్ని తగ్గించివేస్తున్న; భ్రూయుగ= కనుబొమల యొక్క; ఉప+అంతంబులు+ఐ= సమీపానికి వ్యాపించియున్నవై; సౌదామనీదామ= మెరుపుతీవలవరుసలయొక్క; రుచిస్తోమంబులు+ఐ= కాంతుల సమూహాలు గలవై (ఆ కాంతుల సమూహాలను వెదజల్లుచున్నవియై); కర్ణ+ అంతసీమంబులు+ఐ= చెవుల చివరలే హద్దుగా విస్తరించినవై; అంజనంబులతోడన్= కాటుకలచే; రంజిల్లు= అందగించియున్న; నేత్రకంజంబులును= కమలాలనుపోలిన కన్నులును; నవమల్లికాముకుళ= విరజాజి మొగ్గలవలె; విభాసిత= ప్రకాశిస్తున్న; దంత= పలువరుసయొక్క; మరీచికానిచయ= కాంతుల సముదాయంచే; ఉద్దీపిత= అధికంగా ప్రకాశింపజేయబడిన; మందహాసచంద్రికా= వెన్నెలలవంటి చిరునగవులచేత; ధవళితంబులును= తెల్లగా చేయబడినవియును; ముకుర+ఉపమితంబులు+ఐ= అద్దాలను సరిపోలుచున్నవై; కర్ణకుండల= చెవి కమ్మలయందలి; మణిమరీచి జాలంబులు= మణుల కాంతుల సముదాయాలు; బెరసి= కూడుకొన్నవై (చిరునవ్వుల తెల్లనికాంతులతో కలసిమెలసి); బహు ప్రకారంబులన్+పర్వన్= అనేక రీతులుగా ప్రసరింపగా; పొలుచు= (మిగుల) ఒప్పుచున్నటువంటి; కపోలపాలికలును= మంగళకరాలైన వెడల్పాటి పాలికలవంటి అందమైనచెక్కిళ్లును; విలసిత= ప్రకాశమానమైన; గ్రైవేయక= బంగారు కంఠసరములు; ముక్తాఫల= మంచిముత్యాలదండలు మొదలుగాగల; హార నిచయంబులకున్= కంఠహారాల సమూహాలకు; ఇమ్ము చూపక= ఎడము (చోటు) ఇయ్యకుండా; మిసమిసని పస+కల= నిగనిగ మెరస్తూ పరిపుష్టి గలవై; మెఱుంగులు గిఱికొన= కాంతులు చుట్టూ ప్రసరించగా; మీటినన్= వేలితో అలవోకగా తాకిన మాత్రాననే; పగులును+అనన్= విచ్చుకొని పోవునేమో – అని; పొగడన్+తగి= మెచ్చుకొనదగియున్నవై; మొగంబులకున్= (చను) మొనలకు; పుటంబులు+ఎగయు= పైకి ఉబ్బెడు; ఉత్తుంగ= ఎత్తైన; పీన= బలిసియున్న; కుచభారంబుల= భారమైన చన్నులయొక్క; వ్రేఁగులు= బరువులకు; ఆగలేక= తాళజాలక; తూఁగు+ఆడుచున్= తూలి ఆడుచున్నట్టి వారలయొక్క; కరతలపరిమేయంబులు+అగు= అరచేతితో (పట్టుకొని) కొలువజాలియున్నటువంటి; మధ్యభాగంబులును= నడుము ప్రదేశాలును; ఘనజఘనమండల= గుండ్రని గొప్పవైన మొలప్రదేశములనుండి; అవతీర్ణ= (ఇంచుక) జారిన; కాంచన= బంగారుతో చేయబడిన; కాంచీ కలాప= మొలనూలియందలి; కింకిణీ= చిరుమువ్వలయొక్క; కలకల నినాద= మధురములైన కలకలధ్వనులచే; ఉత్+ లసితంబులు+అగు= ప్రకాశించుచున్నవైన; కటిప్రదేశంబులును= నడుము కింది ప్రదేశాలును; సత్+లలిత= మిగుల సుందరములైన; హల్లక= ఎరకలువలయొక్కయు; పల్లవకాంతుల= చిగురుటాకుల కాంతులయొక్క; మొల్లంబులన్= సంపదలను; కొల్లలు+కొని= దోచుకొని (అతిక్రమించి); అభిరామంబులు+ఐ= మిగులమనోజ్ఞాలై; శోభిల్లు= ప్రకాశిస్తున్న; పదపాణితలంబులును= అరికాళ్లును, అరిచేతులను; అలసగతులన్= మెల్లనినడకలవల్ల; పదంబులన్= పాదాలయందు; తనరు= ఒప్పుతున్న; మణి నూపురంబులు= మణులు లోపలపొదిగిన అందెలు; గోపురంబులన్= ద్వారప్రదేశాలలో; ప్రతిస్వనంబులు= ప్రతిధ్వనులు; ఒలయన్= కలుగునట్లు; మొరయన్+అలరు= ఒప్పుచున్నటువంటి; చరణ+ అరవిందంబులును= పద్మాలను సరిపోలుతున్న పాదాలును; రత్నవలయ= రత్నాలు చెక్కిన బంగారుభుజకీర్తులు; కంకణ= చేతికడియాలు; అంగుళీయక+ఆది= ఉంగరాలు మొదలుగాగల; వివిధ= పెక్కురకాలైన; భూషణ= సొమ్ములయొక్క; ద్యుతినిచయంబులు= కాంతుల సమూహాలు; ఉష్ణమరీచి= సూర్యునియొక్క; కరనిచయంబులన్= కిరణాల సముదాయాన్ని;

ధిక్కరింపన్= తిరస్కరించగా; వెలుంగు= ప్రకాశించే; కరకంజంబులును= పద్మాలవంటి చేతులును; మృగమద= కస్తూరి; ఘనసార= పచ్చకప్పురం; హరిచందన= శ్రీగంధం; అగరు= అగరు చెట్టునుండి తీసిన పరిమళద్రవ్యం; కుంకుమ= కుంకుమపువ్వు; పంకంబుల= ఈ సుగంధవస్తువులతో తయారుచేసిన మైపూతల (ద్రవంబుల) చేత; భాసురంబులు+అగు= మిగుల వ్యాపించి ప్రకాశిస్తున్నవైన; వాసనలు= సువాసనలు; నాసారంధ్రంబులకున్= ముక్కుపుటాల ద్వారాలకు; వెక్కసంబులు+ఐ= అతిశయించినవై; పొలయు= అంతటా విస్తరించునట్టి; సౌభాగ్యంబులు కలిగి= సుగంధ పరిమళాల సంపదలతో ఒప్పుతున్నవారై; చైతన్యంబున్+ఒందిన= ప్రాణాలు పొందినటువంటి; మాణిక్యము+బొమ్మల విధంబునన్= మాణిక్యాలతో నిర్మింపబడినబొమ్మలవలె; గగనమండలంబు= ఆకాశప్రదేశంనుండి; నిర్గమించి= వెలువడి; వసుధా తలంబునన్= భూమండలంమీద; సంచరించు= తిరుగాడుతున్న; చంద్రరేఖల చెలువునన్= చంద్రబింబపు కళలయొక్క సౌందర్యంతో; శృంగారరసంబు= శృంగారరసం; మూర్తీభవించిన= (అందమైన) స్వరూపాలను ధరించిన; జగంబులన్= లోకాలను; మోహపఱచు= సౌందర్యంచేత ఆకర్షించి తబ్బిబ్బుపడజేయునట్టి; మోహినీదేవతల చందంబునన్= మోహినీ దేవతలవలె; విలసించు= (సహజమైనసాత్త్వికశృంగారచేష్టలతో) విలసిల్లుతున్న; మాధవవధూసహస్రంబుల సంగతిని= శ్రీకృష్ణునియొక్క పదునారువేలమంది పత్నులతో కూడుకొన్నదై; సౌదామనీలతయున్+పోలెన్= మెరుపుతీగవలె; ఒప్పుచున్+ఉండెడు= విరాజిల్లుతున్నట్టి; ద్రుపదరాజనందన= ద్రౌపదీదేవియొక్క; విభవంబును= శోభగలిగి ప్రకాశిస్తున్న సమున్నతదశను; రాజసూయమహా+అధ్వర+ ఉత్సవంబునన్= ఆనందప్రదమైన 'రాజసూయ' మనెడి గొప్పయాగంయొక్క వైభవాన్ని; చూచి= తిలకించి; చిత్తంబు= హృదయం; ఉత్తలము+పడన్= కలవరపడగా; సంతాప+అనలంబునన్= చింతఅనెడిఅగ్నిలో; క్రాగుచున్+ఉండెన్= మరగిపోతూ ఉండినాడు; అంతన్= అట్లుండగా; ఒక్కనాఁడు= ఒక దినం; ధర్మనందనుండు= ధర్మరాజు; నిర్మలంబు+అగు= మిగుల స్వచ్ఛమయిన; సభాభవనంబునకున్+చని= సభను నిర్వహించెడి కొలువు కూటానికి వెళ్ళి...

**తా :** దుర్యోధను డొకనాడు మయసభా భవనంలో శ్రీకృష్ణునిపదునారువేలమంది పత్నులతో కలసిమెలసియున్న ద్రౌపదిని చూచాడు. ఆ పదహారువేలమంది పత్నులు ప్రాణంగల మాణిక్యపు బొమ్మలవలె, దివినుండి భువికి దిగివచ్చిన చంద్రరేఖలవలె, శృంగారరసస్వరూపిణులైన మోహినీదేవతలవలె భాసిస్తూ ఉన్నారు. ద్రౌపది వారినడుమ మెరుపుతీగవలె ప్రకాశిస్తూ ఉంది. అలా వెలుగొందుతూ ఉన్న ద్రుపదనందన యొక్క వైభవాన్నీ, రాజసూయయజ్ఞంయొక్క మహోత్సవాన్ని కన్నారా కాంచిన సుయోధనుడు మనస్సులో ఎంతో కలతపడి, పరితాపమనే అగ్నిలో తపించిపోసాగినాడు.

ద్రౌపదీదేవి అంతఃపురంలో విలసిల్లుతూవున్న పదహారువేలమంది శ్రీకృష్ణుని పత్నులు అష్టమినాటిచంద్రునిపోలిన అందమైన ఫాలభాగాలుగలవారై, ఇంద్రనీలమణుల కాంతులను పరిహసించే ముంగురులతో ప్రకాశిస్తూ ఉన్నారు. వారి కనుబొమలు మన్మథునిధనుస్సును తిరస్కరించేవిగా ఉండగా, కన్నులు కర్ణాంతవిశాలాలై కాటుకతో తళతళమెఱుస్తూ ఉన్నాయి. విరజాజిమొగ్గలవంటి పలువరుసలు గల వారిచిరునగవు వెన్నెలలు, కర్ణాభరణాల్లోని మణులకాంతులు విశాలమైనవాళ్ల చెక్కిళ్లలో కమనీయంగా కలిసిమెలసి ప్రతిఫలిస్తూ ఉన్నాయి.

ముత్యాలహారాలకుసైతం సందీయకుండా మిసమిసలాడుతున్న ఉన్నత వక్షోజాలతో, అరచేతిలో ఇమిడిపోతాయేమో అనిపించే సన్నని నెన్నడుములతో; చిఱుగంటల ఇంపైన సవ్వడులుగల బంగారు ఒడ్డాణాలు, మొలనూళ్లు గల కటిప్రదేశాలతో, చెంగలువపూరేకులవంటి లేలేత పాణిపాదతలాలతో, ఘల్లుఘల్లున మధురంగా ప్రతిధ్వనిస్తూవున్న కాలి అందెలతో, అంతటా కాంతులీనుతున్న భుజకీర్తులు, కంకణాలు, ఉంగరములు అలంకరించుకొన్న కరకమలాలతో, నలుదెసల అపూర్వ

పరిమళాలను వెదజల్లుతూవున్న కస్తూరి, శ్రీగంధం, పచ్చకప్పూరం మొదలైన ద్రవ్యాలతో తయారుచేసిన మైపూతలతో అపూర్వంగా ప్రకాశిస్తూ ఉన్నారు. వారు ప్రాణంతో ఉండే మాణిక్యాలబొమ్మల్లాగా, దివినుండి భువికి దిగివచ్చిన చంద్రరేఖవలె, శృంగారసం మూర్తీభవించిన మోహినీదేవతల్లాగా విరాజిల్లుతూండే మహాసౌందర్యవతులైన శ్రీకృష్ణుని పదునారువేల భార్యలమధ్య మెరపుతీగలాగా ప్రకాశిస్తూన్న ద్రౌపదీదేవి సౌభాగ్యాన్నీ, రాజసూయయాగ మహావైభవాన్నీ చూచి, దుర్యోధనుడు అసూయతో లోలోపల బాధపడసాగాడు. ఇలా ఉండగా ఒకనాడు ధర్మరాజు నిర్మలమైన ఆ సభాభవనానికి వచ్చి

**సీ. సుతసహోదరపురోహితబాంధవామాత్యపరిచారభటకోటి బలసి కొలువఁ**
**గలితమాగధమంజుగానంబుఁ బాఠకపఠనరవంబును బ్రమద మొసఁగఁ**
**గంకణఝణఝణత్కారంబు శోభిల్ల సరసిజాననలు చామరము లిడఁగ**
**మయవినిర్మితసభామధ్యంబునను భాసమానసింహాసనాసీనుఁ డగుచు**

**తే. నమరగణములు గొలువఁ బెంపారు ననిమి, షేంద్రుకైవడి మెఱసి యుపేంద్రుఁ డలర**
**వరుసఁ గొలువున్న య తతి దురభిమాని, క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు. 822**

**ప్రతి :** సుత= కుమారులు; సహ+ఉదర= తమ్ములు; పురోహిత= శుభాశుభవైదిక కర్మలను చేయిస్తూ మేలుకీడులను తెలిపే ఆచార్యులు; బాంధవ= చుట్టాలు; అమాత్య= మంత్రులు; పరిచార= సేవకులు; భటకోటి= సైనికుల సమూహం; బలసి= చుట్టుకొని; కొలువన్= సేవిస్తూ ఉండగా; కలిత= సమకూడిన; మాగధ= స్తోత్రపాఠకులయొక్క; మంజుగానంబున్= ఇంపైనగానం; పాఠక= (బిరుదగద్యలు మొదలైనవానిని) చక్కగా చదివెడివారియొక్క; పఠనరవంబును= చదువుతూ ఉండే శబ్దాలును; ప్రమదము+ఒసఁగన్= సంతోషం కలిగిస్తూ ఉండగా; కంకణ= చేతికడియాలయొక్క; ఝణ ఝణత్+కారంబు= ఝణఝణమనెడి మనోహరధ్వని; శోభిల్లన్= విలసిల్లుతుండగా; సరసిజ+ఆననలు= కమలాలవంటి అందమైన ముఖాలుగలిగిన పరిచారికలు; చామరములు+ఇడన్+కన్= చమరీమృగములకేశాలతో తయారైన తెల్లని వింజామరలతో (రాజుకు) వీస్తూ ఉండగా; మయ= మయుడను దానవ శిల్పిచే; వినిర్మిత= బాగుగా నిర్మింపబడియున్న; సభామధ్యంబునకున్= కొలువుకూటమునడిమిప్రదేశంలో; భాసమాన= వెలుగొందుచున్న; సింహ+ఆసన+ఆసీనుఁడు+ అగుచున్= సింహాసనంమీద చక్కగా కూర్చున్నవాడై; అమరగణములు= దేవతల బృందాలు; కొలువన్= సేవిస్తూ ఉండగా; పెంపు+ఆరు= గొప్పగా ప్రకాశించే; అనిమిష+ఇంద్రుకైవడిన్= దేవతల అధిపతియగు దేవేంద్రునివలె; మెఱసి= గొప్పగా ప్రకాశిస్తూ; ఉప+ఇంద్రుఁడు= ఇంద్రునితమ్ముడు (శ్రీకృష్ణుడు); అలరన్= సంతసిస్తూ ఉండగా; వరుసన్= క్రమమైన రీతిలో; కొలువున్న+ఆ+తతిన్= సభదీరిన ఆ వేళలో; దుర్+అభిమాని= తనవిషయమై (అంతులేని) చెడ్డదైన అభిమానం కలవాడు; క్రోధ= కోపం; మాత్సర్య= ఓర్వలేనితనం; ధనుఁడు= ఈ రెండు దుర్గుణాలను ధనంగా గలవాడు; సుయోధనుండు= (అయిన) దుర్యోధనుడు...

**తా :** ఒకనాడు ధర్మరాజు మయుడు నిర్మించియిచ్చిన సభాభవనంలోని సింహాసనంమీద ఆసీనుడై కొలువు దీరాడు. కొడుకులు, తమ్ముళ్లు, పురోహితులు, బంధువులు, మంత్రులు, సేవకులు ఆయన్ను సేవిస్తున్నారు. వందిమాగధుల స్తోత్రపాఠాలు సంతోషాన్ని కలిగిస్తున్నాయి. చేతి కడియాలు కమనీయంగా ధ్వనిస్తూ ఉండగా యువతీలలామలు వింజామరలను వీస్తున్నారు. వివిధ దేవతాబృందాలచేత సేవింపబడుతున్న దేవేంద్రునివలె విరాజిల్లుతూ ఉన్న ధర్మనందనుణ్ణి తిలకించి సంతోషిస్తూ శ్రీకృష్ణుడు ఆ సభలో అలరారుతున్నాడు. ఆ సమయంలో కోపం, అసూయ, దురభిమానం - ఈ దుర్గుణాలే ధనంగా గలవాడైన దుర్యోధనుడు ఆ సభకు వచ్చాడు.

**విశే :** తాను ఎదుటివారితో సుఖంగా యుద్ధంచేయగలవాడు గనుక 'సుయోధనుడు'; అలాగే అతికష్టంతోనే ఎదుటివాళ్లు తనతో యుద్ధంచేయడానికి శక్యమైనవాడు గనుక 'దుర్యోధనుడు'. ఈ రీతిగా కురురాజుకు ఈ రెండుపేర్లు సాభిప్రాయంగా ఏర్పడ్డాయి.

**ఉ. కాంచనరత్నభూషణనికాయముఁ దాల్చి సముజ్జ్వలప్రభో**
**దంచితమూర్తి నొప్పి ఫణిహారులు ముందటఁ గ్రందు వాయ వా**
**రించి సహోదరుల్ నృపవరేణ్యులు పార్శ్వములన్ భజింప నే**
**తెంచెను రాజసంబున యుధిష్ఠిరుపాలికి వైభవోన్నతిన్. 823**

**ప్రతి :** కాంచన రత్నభూషణ నికాయమున్= బంగారంతోను, రత్నాలచేతను నిర్మింపబడిన ఆయా ఆభరణాల సముదాయాన్ని; తాల్చి= (అనువైన రీతిని) ధరించి; సమ్+ఉత్+జ్వల ప్రభా= చక్కగా ప్రకాశిస్తున్న కాంతులతో గూడిన; ఉత్+అంచిత మూర్తిన్= మిక్కిలి ఒప్పిదమైన ఆకారంతో; ఒప్పి= అందగించి; ముందటన్= ముందు భాగంలో; ఫణిహారులు= ద్వారపాలకులు; క్రందు+పాయన్= సందడి ప్రక్కకు తొలగిపోవునట్లుగా; వారించన్= అడ్డగిస్తుండగా; సహ+ఉదరుల్= తమ్ములు; నృపవరేణ్యులు= రాజశ్రేష్ఠులు; పార్శ్వములన్= ఇరువైపుల; భజింపన్= సేవిస్తుండగా; వైభవ+ఉన్నతిన్= అధికమయిన మహిమతో; రాజసంబునన్= రాచఠీవితో; యుధిష్ఠిరుపాలికిన్= ధర్మరాజు వద్దకు; ఏ+తెంచెను= వచ్చాడు.

**తా :** స్వర్ణమయాలైన మణిభూషణాలు ధరించి, రాజసం ఉట్టిపడే తేజస్సుతో దుర్యోధనుడు తమ్ములు, రాజులు ఇరువైపుల తనను సేవిస్తూ రాగా, ముందుభాగంలో కాపలాదారులు జనుల్ని అడ్డగించి, దారి కల్పిస్తూ ఉండగా, మహావైభవంతో ధర్మరాజు సమక్షానికి విచ్చేశాడు.

**వ. అట్లు సనుదెంచి మయమాయామోహితంబైన సభాస్థలంబునందు. 824**

**ప్రతి :** అట్లు= ఆ రీతిగా; చను+తెంచి= వచ్చి; మయ= మయుడనే శిల్పియొక్క; మాయా= మాయా శక్తిచేత; మోహితంబు+ఐన= భ్రమింపచేయబడిందైన; సభాస్థలంబు+అందున్= (మిక్కిలి విశాలమైనదైన) ఆ సభాస్థలంలో...

**తా :** దుర్యోధనుడు ఆ విధంగా మహావైభవంతో ధర్మరాజు కొలువు దీరియున్న మయసభా భవనంలోనికి విచ్చేశాడు. ఆ సభాభవనం అంతటా దానవశిల్పాచార్యుడైన మయుని మాయాశక్తిచేత భ్రమింపజేస్తూంది.

**క. సలిలములు లేనితావున, వలువలు వెస నెగయఁ దిగిచి వారక తోయం**
**బులు గల చోటను జేలం, బులు దడియఁగఁ బడియె నిజవిభుత్వము దఱుఁగన్. 825**

**ప్రతి :** సలిలములు లేని తావునన్= నీళ్లు లేనిచోట; వలువలు= కట్టుకొన్న దుస్తులు; వెసన్= శీఘ్రంగా; ఎగయన్+తిగిచి= (నీళ్లున్నవనే భ్రాంతితో) పైకిలాగుకొని; వారక= అవశ్యం (తప్పక); తోయంబులు= నీళ్లు; కలచోటను= ఉన్నటువంటి చోట; చేలంబులు= కట్టుకొన్న బట్టలు; తడియన్+కన్= ఆ చోటగల నీళ్లలో తడిసిపోగా; నిజ విభుత్వము= తన గొప్పతనం; తఱుగన్= తగ్గిపోగా; పడియెన్= నీటిలో పడిపోయాడు.

**తా :** ఆ విధంగా సభకేతెంచిన సుయోధనుడు నీళ్లు లేని స్థలంలో నీళ్లున్నవని భ్రమపడి, కట్టుకొన్న వస్త్రాలు పైకి లాగుకొన్నాడు. అలాగే, నీళ్లున్నచోట నీళ్లు లేవనుకొని మామూలుగా వెళ్ళినందువల్ల వస్త్రాలు తడిసిపోయి, తడబడి ఆ నీటిపట్టులో చతికిలపడ్డాడు.

**క. ఆ విధ మంతయుఁ గనుఁగొని, పావని నవ్వుటయు నచటి పార్థివులును గాం**
**తావలియును యమతనయుఁడు, వావిరిఁ జేసన్నఁ దమ్ము వారింపంగన్. 826**

**ప్రతి :** ఆ విధము+అంతయున్= ఆ రీతిగా భ్రాంతివల్ల సుయోధనుడు పడిన అవస్థనంతటినీ; కనున్+కొని= చూచి; పావని= వాయువుయొక్క వరసుతుడైన భీమసేనుడు; నవ్వుటయున్= నవ్వగా; యమతనయుఁడు= యమునివరపుత్రుడయిన ధర్మరాజు; చేసన్నన్= చేతిసైగతో; వావిరిన్= మిక్కిలిగా (స్పష్టంగా); వారింపన్+కన్= నివారిస్తున్నప్పటికీ!; అచటి పార్థివులును= ఆ సభలో ఉండిన రాజులును; కాంతా+ఆవలియును= యువతుల సమూహం...

**తా :** ఆ విధంగా భ్రాంతికి గుఱియైన దుర్యోధనుణ్ణి చూచి భీముడు నవ్వాడు. ధర్మరాజు సైగచేసి వారిస్తున్నా లెక్క చేయక అక్కడున్న రాజులు, స్త్రీలూ

**వ. దామోదరానుమోదితులయి మహారవంబుగాఁ బరిహాసంబులు చేసిన సుయోధనుండు లజ్జావనత వదనుండై కుపితమానసుం డగుచు నయ్యెడ నిలువక వెలువడి నిజపురంబున కరిగె; నయ్యవసరంబున ధీవిశాలురైన సభాసదులగు నచ్చటిజనంబుల కోలాహలంబు సంకులంబైన నజాతశత్రుండు చిత్తంబున విన్ననై యుండె; న ప్పుండరీకాక్షుండు భూభారనివారకారణుం డగుటం జేసి దుర్యోధను నపహాసంబునకుం గా దనం డయ్యె; నంత. 827**

**ప్రతి :** దామ+ఉదర+అనుమోదితులు+అయి= శ్రీకృష్ణునిచే అంగీకరింపబడినవారై (అనుమతించటంచేత ప్రోత్సాహపరుప బడినవారై); మహారవంబు+కాన్= గొప్ప శబ్దం కలిగే విధంగా; పరిహాసంబులు+చేసినన్= వేళాకోళం చేయగా; సుయోధనుఁడు= దుర్యోధనుడు; లజ్జా+అవనతవదనుండు+ఐ= సిగ్గుతో ముఖం వంచినవాడై; కుపితమానసుండు+అగుచున్= కోపంతో గూడిన మనస్సుకలవాడౌతూ; ఆ+ఎడన్= అక్కడ; నిలువక= ఉండక; వెలువడి= వెలుపలికి వచ్చి; నిజపురంబునకున్= తన పట్టణానికి (హస్తినాపురానికి); అరిగెన్= వెళ్లాడు; ఆ+అవసరంబునన్= ఆ సందర్భంలో; ధీవిశాలురు+ఐన= విశాలమైన బుద్ధిగలవారైనట్టి; సభాసదులు+అగు= ఆ సభలోనివారైన; ఆచ్చటిజనంబుల= అక్కడున్న జనులయొక్క; కోలాహలంబు= సందడిధ్వని; సంకులంబు+ఐనన్= వ్యాపించిందికాగా; న+జాతశత్రుండు(అజాతశత్రుడు)= పుట్టని శత్రువులుగలవాడు (శత్రువులు లేనివాడు) ధర్మరాజు; చిత్తంబునన్= మనస్సులో; విన్నన్+ఐ+ఉండెన్= చిన్నబోయి ఉండినాడు (విచారంతో ఉండినాడు); ఆ+పుండరీక+అక్షుండు= తెల్లదామరపూలవంటి విశాలమైన కన్నులుగల ఆ శ్రీకృష్ణుడు; భూభార నివార కారణుండు= భూమిభారాన్ని నివారించేనిమిత్తమై అవతరించినవాడు; అగుటన్+చేసి= అయినందువల్ల; దుర్యోధను+ అపహాసంబునకున్= భీమాదులు దుర్యోధనుణ్ణిగూర్చి అపహాస్యంచేసినందుకు; కాదు+అనండు+అయ్యెన్= ఆ రీతిగా పరిహసించరాదని వాళ్లను నిషేధించకుండా మౌనంవహించి ఉండినాడు; అంతన్= అటు పిమ్మట...

**తా :** దుర్యోధనుడు మయసభాభవనంలో తనకు జరిగిన అవమానానికి సిగ్గుతో తలవంచుకొని, కోపంతోతన నగరానికి వెళ్లాడు. అప్పుడు బుద్ధిమంతులైన సభ్యుల వేళాకోళంతో కూడిన సందడిధ్వని వినిపించింది. అందుచేత ధర్మరాజు చింతతో చిన్నబోయాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు భూభారాన్ని నివారించటానికి అవతరించినవాడు కావడంచేత ఆ పరిహాసకులను నివారించక మౌనం వహించాడు.

**క. హరి ధర్మసుతుని వీడ్కొని, తరుణీహితబంధుజనకదంబము గొలువం**
**బరితోషమునఁ గుశస్థల, పురమునకుం జనియె మోదమున నరనాథా! 828**

**ప్రతి :** నరనాథా!= నరేశ్వరా! (పరీక్షిన్మహారాజా!); హరి= శ్రీకృష్ణుడు; ధర్మసుతునిన్= ధర్మనందనుణ్ణి; వీడ్కొని= వెళ్ళుటకు అనుమతిగైకొని; తరుణీ= యువతులు; హిత= మిత్రులు; బంధుజనకదంబము= చుట్టాల సమూహం; పరితోషమున్= మిగుల సంతోషంతో; కొలువన్= సేవిస్తుండగా; కుశస్థలపురమునకున్= కుశస్థలీ (ద్వారకా) నగరానికి; మోదమునన్= ఆనందంతో; చనియెన్= వెళ్లాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! ఆ తరువాత శ్రీకృష్ణదేవుడు ధర్మనందనుణ్ణి వీడ్కొని, సతీసుతహితబంధుసమూహసమేతంగా సంతోషంతో ద్వారకాపురికి వెళ్లాడు.

**చ. జనవరబంధమోక్షణముఁ జైద్యవధంబును బాండురాజ నం**
**దన మఖరక్షణంబును నుదారతఁ జేసిన యట్టి దేవకీ**
**తనయుచరిత్రభాసురకథాపఠనాత్ములు గాంతు రిష్ట శో**
**భన బహుపుత్త్రకీర్తులును భవ్యవివేకము విష్ణులోకమున్. 829**

**ప్రతి :** జనవరబంధ= రాజులయొక్క చెరను; మోక్షణము= తొలగించడం; చైద్యవధంబును= శిశుపాలుణ్ణి సంహరించడం; పాండురాజనందన= పాండురాజు కుమారుడగు ధర్మరాజుయొక్క; మఖ రక్షణంబునున్= రాజసూయ యాగాన్ని చక్కగా పూర్తి అయేటట్లు కాపాడడం; ఉదారతన్= గొప్పమనస్సుతో; చేసిన+అట్టి= నెరవేర్చినటువంటి; దేవకీతనయుచరిత్ర= దేవకీదేవి కుమారుడైన శ్రీకృష్ణునియొక్క పవిత్రమైనచరిత్రకు సంబంధించిన; భాసురకథా= ప్రకాశిస్తున్నటువంటి; గాథలను; పఠన+ఆత్ములు= (శ్రద్ధతో) చదివేవారు; ఇష్టశోభన= కోరిన శుభాలను; బహుపుత్ర= అనేకులైన కుమారుల్నీ; కీర్తులును= (నిర్మలమైన) యశస్సుల్నీ; భవ్యవివేకము= శ్రేష్ఠమైన జ్ఞానాన్నీ; విష్ణులోకమున్= (చివరకు) శ్రీమహావిష్ణుదేవుని వైకుంఠలోకాన్ని; కాంతురు= చూస్తారు (పొందుతారు).

**తా :** జరాసంధునిచెరలో ఉన్న ఇరవైవేల ఎనిమిదివందలమంది రాజులను బంధవిముక్తులను కావించడం; శిశుపాలుణ్ణి సంహరించడం, ధర్మనందనుని రాజసూయ యజ్ఞాన్ని సంరక్షించటం – ఈ ఘనకార్యాలను ఉదారబుద్ధితో చేసిన శ్రీకృష్ణదేవుని పవిత్ర చరిత్రలోని విజయ గాథలను అభినివేశంతో చదివేవాళ్ళ సకలసౌభాగ్యాల్నీ, బహుపుత్రసంతతిని, మంచి తెలివితేటల్నీ; స్వచ్ఛమైన కీర్తిని, తుదకు విష్ణుసాయుజ్యాన్ని (మోక్షాన్ని) పొందుతారు.

**క. అని శుకయోగీంద్రుం డ, మ్మనుజేంద్రునిఁ జూచి పలికె మఱియును శ్రీకృ**
**ష్ణుని యద్భుతకర్మంబులు, వినిపింతుం జిత్తగింపు విమలచరిత్రా! 830**

**ప్రతి :** అని= అని చెప్పి; శుకయోగి+ఇంద్రుండు= యోగీశ్వరులలో శ్రేష్ఠుడయిన శుకమహర్షి; ఆ+మనుజ+ఇంద్రునిన్= ఆ మానవనాథుణ్ణి; చూచి; పలికెన్= ఇలా అన్నాడు; విమలచరిత్రా!= నిర్మలమైన నడవడి గలిగిన పరీక్షిత్ రాజేంద్రా!; శ్రీకృష్ణుని= (అవతారమూర్తియైన) శ్రీకృష్ణదేవుని; అద్భుతకర్మంబులు= ఆశ్చర్యకరమైన పనులు; మఱియును= ఇంకా కొన్నిటిని; వినిపింతున్= మీకు చెపుతాను; చిత్తగింపు(ము)= మనస్సుపెట్టి ఆలకించండి!

**తా :** శ్రీకృష్ణుని కథలను పఠిస్తే కలిగే సత్ఫలితాలను గూర్చి చెప్పిన అనంతరం, శుకయోగీశ్వరుడు పరీక్షిత్తును చూచి, 'ఆ అవతారపురుషుడు కావించిన అద్భుతకార్యాలను వినిపిస్తాను; ఆసక్తితో ఆలకించమని' – అన్నాడు.

## ❖ సాల్వుండు శివప్రసాదంబున సౌభకవిమానంబు వడసి ద్వారకాపురిపై దండెత్తుట ❖

**సీ.** **వసుధేశ! విను; మును వైదర్భిపరిణయవేళ దుర్మదశిశుపాలభూమి**
**వరునకుఁ దోడ్పడ నరుదెంచి సైనికావలితోడఁ దొడరి దోర్బలము దూలి**
**హరిచేత నిర్జితులైన రాజులలోనఁ జైద్యుని చెలికాఁడు సాల్వభూమి**
**పతి జరాసంధాదిపార్థివప్రకరంబు విన మత్సరానలవిపులశిఖల**

**తే.** **ధాత్రి నిటమీఁద వీతయాదవము గాఁగఁ, గడఁగి సేయుదు నని దురాగ్రహముతోడఁ**
**బంతములు పల్కి యటఁ జని భరితనిష్ఠఁ, దపము కావింపఁ బూని సుస్థలమునందు. 831**

**ప్రతి :** వసుధా+ఈశ!= భూమిపతీ! (రాజా!); విను= వినవయ్యా!; మును= పూర్వం; వైదర్భి= విదర్భదేశ రాజకుమారి అయిన రుక్మిణియొక్క; పరిణయవేళన్= వివాహసమయంలో; దుర్+మద= చెడ్డ (తగని) గర్వంకలవాడైన; శిశుపాల భూమివరునకున్= శిశుపాలుడనే భూనాథునికి; తోడు+పడన్= సహాయం చేయడానికి; అరుదెంచి= వచ్చి; సైనిక+ ఆవలితోడన్= సైనికులగుంపుతో; తొడరి= ఎదిరించి; దోస్+బలము= భుజ బలం; తూలి= నశించి (పూర్తిగాతగ్గిపోయి); హరిచేతన్= శ్రీకృష్ణునిచేత; నిర్జితులు+ఐన= జయింపబడ్డవారైన; రాజులలోనన్= రాజులలో; చైద్యుని చెలికాడు= చేదిదేశపు రాజగు శిశుపాలుని స్నేహితుడు; సాల్వభూమిపతి= సాల్వుడనే రాజు; జరాసంధ+ఆది= జరాసంధుడు మొదలయిన; పార్థివప్రకరంబు= రాజుల బృందము; వినన్= వింటుండగా; మత్సర+అనల= ఈర్ష్య అనే అగ్నియొక్క; విపులశిఖలన్= దీర్ఘ కోపమనే గొప్ప మంటలచేత; ఇటమీదన్= ఇంకమీదట; ధాత్రిన్= ఈ భూమండలాన్ని; వీతయాదవముకాన్+కన్= తొలగిన యాదవుల సమూహములు కలది అగునట్లుగా (యాదవ కులమనేది లేకుండా ఉండే విధంగా); కడగి+చేయుదున్+అని= పూనుకొని చేస్తానని; దుర్+ఆగ్రహముతోడన్= చెడు (అధికమైన) కోపంతో; పంతములు= పట్టుదలతో గూడిన పౌరుష వాక్యాలు; పల్కి= (గొప్పగా) పలికి; అటన్+చని= అలా పల్కిన వెంటనే వెళ్లి; భరితనిష్ఠన్= పరిపూర్ణమైన శ్రద్ధతో; సుస్థలము+అందున్= మంచి (ప్రశాంతమైన) ప్రదేశంలో; తపమున్+కావింపన్= తపస్సు చేయడానికి; పూని= నిశ్చయించి...

**తా :** పరీక్షిన్మహీపతీ! వినండి. ఇంతకు ముందు రుక్మిణీవివాహసమయంలో శిశుపాలునికి సహాయంగా సేనలతో వచ్చి, శ్రీకృష్ణునిచే ఓడింపబడ్డ రాజులలో సాళ్వుడనేవాడు ఒకడు కలడు. వాడు శ్రీకృష్ణునియందు ఈర్ష్యను పెంచుకొని, ఈర్ష్యాగ్ని జ్వాలలతో 'యాదవుల నందరిని నాశనం చేస్తా'నని జరాసంధాది రాజుల సమక్షంలో మొండిగా ప్రతిజ్ఞ చేశాడు. వెనువెంటనే అత్యంతనిష్ఠతో ఒకానొక ప్రశాంత ప్రదేశాన్ని చేరుకొని పరమేశ్వరుణ్ణిగూర్చి తపస్సు చేయటానికి పూనుకున్నాడు.

**క.** **ధృతి వదలక యుగ్రస్థితిఁ, బ్రతిదినమును బిడికెఁ డవనిరజ మశనముగా**
**నతినియమముతో నా పశు, పతి శంకరు ఫాలనయను భర్గు నుమేశున్. 832**

**ప్రతి :** ధృతి= ధైర్యాన్ని; వదలక= విడువక; ఉగ్రస్థితిన్= తీవ్రమయిన పద్ధతితో; ప్రతిదినమును= ప్రతిరోజూ; పిడికెడు= పిడికిలి పరిమాణంకల; అవనిరజము= భూమియొక్క ధూళి (దుమ్ము); అశనము+కాన్= ఆహారంగా; అతినియమముతోన్=

కఠినమైన కట్టుబాటుతో; ఆ పశుపతిన్= పశువులకు (జీవరాసులకు) అధిపతియైనవాణ్ణి; శంకరున్= శుభాలు గలిగించేవాణ్ణి; ఫాలనయనున్= నొసటియందు కన్నుగలవాణ్ణి; భర్గున్= సర్వసంహారకుణ్ణి; ఉమా+ఈశున్= పార్వతీదేవికి పతియైన శివుణ్ణి...

**తా :** సాల్వుడు ధైర్యంవిడువక, తీవ్రమైన పట్టుదలతో, ప్రతిరోజూ పిడికెడు దుమ్మును మాత్రమే ఆహారంగా తీసుకొంటూ కఠినమైన నియమాన్ని అవలంబించి ఫాలలోచనుడు, పశుపతి, ఉమానాథుడు స్వరసంహారకుడూ అయిన పరమశివుణ్ణి ఉద్దేశించి తపస్సు చేయడం ప్రారంభించాడు.

**క. చెదరని నిజభక్తిని ద, త్పదపద్మము లాత్మ నిలిపి పాయక యొక యేఁ**
**దుదితక్రియ భజియించిన, మదనారియు వానిభక్తి మహిమకు వశుఁడై. 833**

**ప్రతి :** చెదరని= చలించని; నిజభక్తినిన్= తన భక్తిభావనతో; తత్+పదపద్మములు= ఆ పరమేశ్వరుని చరణ కమలాలు; ఆత్మన్= మనస్సులో; నిలిపి= స్థిరంగా ఉంచుకొని; పాయక= తొలగిపోకుండా; ఒక+ఏఁడు= ఒక సంవత్సరకాలం; ఉదిత క్రియన్= శాస్త్రంలో చెప్పబడిన విధంగా; భజియించినన్= శ్రద్ధతో సేవించగా; మదన+అరియున్= మన్మథునికి శత్రువయిన ఈశ్వరుడును; వాని భక్తిమహిమకున్= ఆ సాల్వుని గొప్ప దైవభక్తి ప్రభావానికి; వశుడు+ఐ= స్వాధీనపడినవాడై...

**తా :** ఆ సాల్వుడు దృఢమైన నిశ్చలభక్తిభావంతో పరమశివుని పదపద్మాలపై మనస్సు నిలిపి, సంవత్సరంపాటు నిర్విరామంగా తపస్సు చేశాడు. అందువల్ల వానిభక్తిమహిమకు పరమేశ్వరుడు వశుడై

**క. బోరనఁ బ్రత్యక్షంబై, కోరినవర మేమి యైనఁ గొసరక యిత్తున్**
**వారక వేఁడు మ టన్నను, నా రాజతపోధనుండు హరునకుఁ బ్రీతిన్. 834**

**ప్రతి :** బోరనన్= శీఘ్రంగా; ప్రత్యక్షంబు+ఐ= ఎదుట సాక్షాత్కరించినవాడై; కోరినవరము= నీవు కోరుకునే వరం; ఏమి+ఐనన్= ఏదైనప్పటికినీ; కొసరక= సందేహించకుండా; ఇత్తున్= ఇస్తాను; వారక= తప్పకుండా; వేఁడుము= కోరుకో; అటు+అన్ననున్= అని పలుకగా; ఆ రాజతపస్+ధనుండు= తపస్వియైన ఆ రాజు; హరునకున్= శంకరునికి; ప్రీతిన్= ప్రేమతో...

**తా :** పరమేశ్వరుడు ప్రత్యక్షమై 'నీవు ఏ వరం కోరినా ఇస్తాను వేడుకో' – అనగా అప్పుడు ఆ సాల్వుడైన రాచతపసి శంకరునికి ప్రీతితో

**తే. వందనం బాచరించి యానందవికచ, వదనుఁడై నొస లంజలిఁ గదియఁ జేర్చి**
**శ్రితదయాసార! నన్ను రక్షించెదేని, నెఱుఁగ వినిపింతు వినుము మదీప్సితంబు. 835**

**ప్రతి :** వందనంబు+ఆచరించి= (సాక్షాత్కరించిన శంకరునికి) భక్తితో నమస్కారం చేసి; ఆనంద వికచవదనుఁడు+ఐ= (సాల్వుడు) సంతోషంతో వికసించిన ముఖంకలవాడై; నొసలన్= నుదుటిపైన; అంజలిన్= దోసిలిని; కదియన్+చేర్చి= తాకునట్లుగా పెట్టుకొని; శ్రిత= (తనను) ఆశ్రయించినవాళ్లకు; దయా+ఆసార!= కృపాగుణమనే జడివాన అయినవాడా! (దయను జడివానవలె కురిపించేవాడా!); నన్నున్= (నీ భక్తుడనైన) నన్ను; రక్షించెదు(వు)+ఏనిన్= కాపాడేవాడివైతే; మత్+ఈప్సితంబు= నా కోరికను; ఎఱుఁగన్+వినిపింతున్= (నీకు) తెలిసేటట్లు వినిపిస్తాను; వినుము= వినవలసింది.

**తా :** తాను కావించిన తపస్సుకు వశుడై, ప్రత్యక్షమయిన పరమేశ్వరునికి సాల్వుడు భక్తిభావంతో నమస్కరించాడు; నొసటిమీద అంజలిని చేర్చి, ఆనందంతో విప్పారినముఖంతో ఇలా విన్నవించాడు. 'శరణాగతులపై దయావర్షాన్ని కురిపించే శంకరా! నీ భక్తుడనగు నన్ను రక్షింపదలంచినట్లైతే, నా కోరికను నీకు వినిపిస్తున్నాను, వినుము!' - అన్నాడు.

**తే. గరుడ గంధర్వ యక్ష రాక్షస సురేంద్ర, వరులచే సాధ్యపడక నా వలయు నెడల**
**నభ్రపథమునఁ దిరిగెడు నట్టి మహిత, వాహనము నాకు దయసేయు వరద! యీశ! 836**

**ప్రతి :** వరద!= వరాలు ఇచ్చేవాడా!; ఈశ!= పరమేశ్వరా!; గరుడ= గరుడులయొక్క; గంధర్వ= గంధర్వులయొక్క; రాక్షస= రాక్షసులయొక్క; సుర= దేవతలయొక్క; ఇంద్రవరులచేన్= నాయకోత్తములచేత; సాధ్యపడక= సాధించడానికి వీలుగాక (వాళ్లలో ఏ ఒక్కరికైనా లొంగనిదై ఉంటూ); నా వలయు+ఎడలన్= నా కిష్టమయిన చోటలో; అభ్రపథమునన్= ఆకాశమార్గంలో; తిరిగెడు+అట్టి= సంచరింపగలిగినట్టి; మహిత= గొప్ప మహిమగలిగిన; వాహనము= ప్రయాణసాధనం (విమానము); నాకున్= నాకు; దయ+చేయు(ము)= అనుగ్రహించుము.

**తా :** భక్తులకు వరాలు ప్రసాదించే పరమేశ్వరా! గరుడులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, దేవతలు - ఈ దేవజాతుల నాయకుల కెవ్వరికీ సాధ్యంకానిదై, నా ఇష్టమైన చోట్లకు ఆకాశమార్గంలో స్వేచ్ఛగా సంచరించగల వాహనాన్ని నాకు ప్రసాదించు.

**వ. అని అభ్యర్థించినం బ్రసన్నుండై హరుండు వానికోర్కి కనురూపంబైన పురంబు నిర్మింప మయుని నియోగించిన నతండును 'నట్ల చేసెద' నని కామగమనంబును నతివిస్తృతంబునుగా లోహంబున నిర్మించి సౌభకం బను నామం బిడి సాల్వున కిచ్చిన వాఁడును బరమానందంబునం బొంది తద్విమానారూఢుండై యాదవుల వలని పూర్వవైరంబుఁ దలంచి దర్పాంధచేతస్కుండై ద్వారకానగరంబుపైఁ జని నిజసేనాసమేతంబుగాఁ దత్పురంబు నిరోధించి. 837**

**ప్రతి :** అని= పై విధంగా; అభి+అర్థించినన్= గొప్పగా వేడుకోగా; హరుండు= పరమశివుడు; ప్రసన్నుండు+అయి= సంతోషంతో అనుగ్రహించినవాడై; వాని కోర్కికిన్= ఆ సాల్వుడు కోరిన కోరికకు; అనురూపంబు+ఐన= మిగుల తగియున్నదైన; పురంబు= (కామగమనం కలిగి, వాహనంగా ఉపయోగపడునట్టి) పట్టణాన్ని; నిర్మింపన్= తయారుచేయడానికి; మయుని= దానవశిల్పాచార్యుడైన మయబ్రహ్మను; నియోగించినన్= ఆజ్ఞాపించగా; అతండును= ఆ మయుడు; అట్లు+అ చేసెదన్= ఆ ప్రకారంగానే చేస్తాను; అని= అని చెప్పి; కామగమనంబును= తలచిన చోటికి వెళ్లగలిగింది; అతివిస్తృతంబును+కాన్= చాలా విశాలమై ఉండేదిగా; లోహంబునన్= ఇనుముచేత; నిర్మించి= తయారుచేయించి; సౌభకంబు+అను= 'సౌభకం' - అనే; నామంబు+ఇడి= పేరుపెట్టి; సాల్వునకున్+ఇచ్చినన్= సాల్వుని కీయగా; వాఁడును= ఆ సాల్వుడూ; పరమ+ ఆనందంబునన్+పొంది= అమితమైన సంతోషాన్ని పొందినవాడై; తత్+విమాన+ఆరూఢుండు+ఐ= వెంటనే పట్టణరూపంలో ఉన్న ఆ విమానాన్ని ఎక్కి; యాదవులవలని= యాదవ వంశీయులపై నున్న; పూర్వవైరంబున్= (తనకు గల) వెనుకటి శత్రుత్వాన్ని; తలంచి= భావించి; దర్ప+అంధ+చేతస్కుండు+ఐ= గర్వంచేత గుడ్డిదైన మనస్సుగలవాడై; ద్వారకానగరంబుపైన్= (శ్రీకృష్ణుడు నిర్మింపజేసిన) ద్వారక అనే పట్టణం మీదికి; చని= దాడివెడలి; నిజసేనా సమేతంబు+కాన్= తన సైన్యాలతో గూడుకొన్నవాడై; తత్+పురంబున్= ఆ పట్టణాన్ని; నిరోధించినన్= అడ్డగించగా (ముట్టడించగా)...

**తా :** సాల్వుని కోరికమేరకు శంకరుడు అనువైన ఒక పట్టణాన్ని నిర్మించి ఇమ్మని మయుణ్ణి ఆజ్ఞాపించాడు. తదనుగుణంగా మయశిల్పి ఇనుముతో ఒక పట్టణాన్ని తయారుచేసి, 'సౌభక'మనే పేరుపెట్టి సాల్వునికిచ్చాడు. అతడు ఆనందంతో దాన్ని అధిరోహించి, యాదవులమీద తనకున్న శత్రుత్వాన్ని తలచి, గర్వంతో కన్ను మిన్ను గానక వెళ్లి, సేనలతో ద్వారకను ముట్టడించాడు.

**సీ. సరిదుపవనసరోవరములు మాయించి బావులు గలఁచి కూపములు సెఱిచి**
**కోటలు వెస వీటతాటముల్ గావించి పరిఖలు పూడ్చి వప్రములు ద్రొబ్బి**
**యట్టళ్లు ధరఁ గూల్చి యంత్రముల్ దునుమాడి కాంచనధ్వజపతాకములు నఱికి**
**భాసురగోపురప్రాసాదహర్మ్యేందు శాలాంగణములు భస్మములు చేసి**

**తే. విమలకాంచనరత్నాదివివిధవస్తు, కోటినెల్లను నందంద కొల్లపుచ్చి**
**ప్రజలఁ జెఱపట్టి దొరలను భంగపెట్టి, తఱిమి యి బ్భంగిఁ బెక్కుబాధల నలంచి. 838**

**ప్రతి :** సరిత్= నదులను; ఉపవన= ఉద్యానవనాలను; సరస్+వరములు= కొలనులను; మాయించి= రూపు మాయజేసి; బావులు= దిగుడు బావులను; కలఁచి= కలియబెట్టి; కూపములు= చేదుడు బావులను (నూతులను); చెఱిచి= చెడగొట్టి; కోటలు= పట్టణపు కోటల గోడలను; వెసన్= శీఘ్రంగా; వీటతాటముల్+కావించి= తారుమారు పడజేసి; పరిఖలు= (కోటవెలుపల చుట్టునుండు) అగడ్తలను; పూడ్చి= నీళ్లులేకుండా పూడిపించి; వప్రములు= కోటకొమ్మలను; ద్రొబ్బి= పడదోసి; అట్టళ్లు= కోట వాకిలిమీదను, బురుజులమీదను రక్షణకోసం నిర్మించి ఉండిన గదులను; ధరన్= భూమిపైన; కూల్చి= పడగొట్టి; యంత్రముల్= (రక్షణకొరకు ఏర్పరచియుంచిన) యంత్రములను; తునుము+ఆడి= (తుంటలుగా) తుంటలుచేసి; కాంచన= బంగారమైన; ధ్వజ పతాకములు= జండాల కర్రలను, ఆయాగురుతులుగల పతాకవస్త్రాలను; నఱికి= ఖండించివేసి; భాసుర= ప్రకాశించే; గోపుర= వాకిళ్లను; ప్రాసాద= రాజభవనాలను; హర్మ్య= గృహాలను; ఇందుశాలా= (ఉన్నతాలైన) చంద్రశాలలను; అంగణములు= ముంగిటి ప్రదేశాలను; భస్మములు+చేసి= బూడిద కావించి; విమల= స్వచ్ఛమైన; కాంచన రత్న+ఆది= బంగారుమయమైన, రత్నాలు పొదిగిన; వివిధవస్తుకోటిన్+ఎల్లను= సమస్త వస్తువుల సమూహాలనన్నిటిని; అందున్+అందున్+అ= అక్కడక్కడ (అడుగడుగున); కొల్లపుచ్చి= దోపిడి చేసి; ప్రజలన్= పౌరులను; చెఱపట్టి= బంధించి; దొరలను= రాజోద్యోగులను, అధికారులను; భంగపెట్టి= అవమానపరచి; తఱిమి= భయపెట్టి పారదోలి; ఈ+భంగిన్= ఈ ప్రకారంగా; పెక్కుబాధలన్= అనేక బాధలచేత; నలంచి= నలుగజేసి (నొప్పించి)...

**తా :** సాల్వుడు సౌభకంపై వచ్చి ద్వారకను ముట్టడించాడు. ఆ ముట్టడిలో నదులను, ఉద్యానవనాలను ధ్వంసం కావించాడు. సరస్సులను, బావులను, కందకాలను గజిబిజిచేసి పూడ్పించాడు. కోటగోడలను, బురుజులను కూలద్రోయించినాడు. రక్షణయంత్రాలను, పతకాలను తునుకలుగా నరికించాడు. గోపురాలను, మిద్దెలను, మేడలను, చంద్రశాలలను కాల్చివేయించాడు. సువర్ణరత్నాది అమూల్య వస్తుసముదాయాన్ని పూర్తిగా కొల్లగొట్టినాడు. ప్రజలను చెరపట్టి అధికారులైన వారిని అవమానించాడు. ఈ రీతిగా ద్వారకలోని ప్రజానీకాన్ని పెక్కు బాధలకు గురిచేశాడు.

**చ. మదమున నంతఁ బోవక విమానయుతంబుగ నభ్రవీథికిన్**
**గొదకొని యేపుమై నెగసి కొంకక శక్తిశిలామహీరుహ**

**ప్రదరము లోలిమైఁ గురిసి బంధురభూమిపరాగశర్కరల్**
**వదలక చల్లుచున్ వలయవాయువుచే దిశ లావరించుచున్.** **839**

**ప్రతి :** అంతన్+పోవక= అంతటితో ఆగకుండా; విమానయుతంబు+కన్= తన సౌభకవిమానంతో; అభ్రవీథికిన్= ఆకాశమార్గానికి; గొదగొని= విజృంభించి; ఏపుమైన్= బలంతో; ఎగసి= ఎగిరి; కొంకక= వెనుదీయక; శక్తి= శక్తి అనే పేరుగల ఆయుధాలను; శిలా= బండరాళ్లను; మహీరుహ= చెట్లను; ప్రదరములు= బాణాలను; ఓలిమైన్= వరుసగా; కురిసి= విమానంనుండి కురిపించి; బంధుర= దట్టంగా; భూమిపరాగ= మట్టిదుమ్మును; శర్కరల్= ఇసుక రేణువులను; వదలక= ఎడతెరపి లేకుండా; చల్లుచున్= విమానంనుండి పట్టణంమీద చల్లుతూ; వలయవాయువుచేన్= సుడిగాలులనే (సృజించిన); దిశలు+ఆవరించుచున్= అన్ని దిక్కులూ కమ్ముకొనజేస్తూ...

**తా :** అంతటితో ఆగక, సాల్వుడు విమానంతో ఆకాశంలోకి ఎగిరిపోయి, అక్కడనుండి శక్త్యాయుధాలను, బండలను, వృక్షాలను, బాణాలను వరుసగా ద్వారకపై కురిపించాడు; దుమ్మును, ఇసుకను దట్టంగా వర్షింపజేస్తూ, సుడిగాలుల ద్వారా ద్వారకను అమితంగా కల్లోల పరుపసాగాడు.

**వ. అట్టియెడ.** **840**

**ప్రతి :** అట్టి+ఎడన్= ఆ విధంగా యుద్ధం చేస్తూ ఉండగా...

**తా :** ఆ ప్రకారంగా సాల్వుడు అకస్మాత్తుగా ద్వారకాపురిని ముట్టడించి యుద్ధం సాగిస్తూ ఉండగా

**క. చటులపురత్రయదనుజో, త్కటదుష్కరబాధ్యమానధారుణిగతి న**
**పుటభేదన మెంతయు వి, స్ఫుటపీడం జెంది వగల సుడివడుచుండన్.** **841**

**ప్రతి :** చటుల= (తీవ్రంగా) చలిస్తున్న; పురత్రయ= మూడు పట్టణాలుగల; దనుజ+ఉత్కట= మదించిన రాక్షసులవల్ల; దుస్తర= నివారింప వీలుకాని రీతిగా; బాధ్యమాన= నొప్పించబడుతున్న; ధారుణిగతిన్= భూమివలె (భూమండలంవలె); ఆ+పుటభేదనము= ఆ పట్టణం (ద్వారకాపురం); ఎంతయున్= మిక్కిలి; విస్ఫుటపీడన్+చెంది= విశేషమైన బాధను పొంది; వగలన్= ఇక్కట్టులచే; సుడి+పడుచున్+ఉండన్= తిరుగుడుపడుతుండగా...

**తా :** ఆ సమయంలో త్రిపురాసురులనే భయంకరులైన రక్కసులవల్ల మిగుల బాధింపబడిన భూలోకంవలె ఆ ద్వారకానగరం సాల్వునిచేత అమితమైన ఇక్కట్టులకు పాల్పరుపబడి తల్లడిల్లుతూ ఉండగా

**చ. కని భగవంతుఁడున్ రథిశిఖామణియు న్నగు రౌక్మిణేయుఁ డ**
**జ్జనముల 'నోడ కుండుఁ' డని సంగరకౌతుక మొప్ప దివ్య సా**
**ధనములుఁ బూని సైనికకదంబము గొల్వ ననూనమీన కే**
**తన రుచి గ్రాల నున్నతరథస్థితుఁడై వెడలెన్ రణోర్వికిన్.** **842**

**ప్రతి :** భగవంతుఁడున్= భగవంతుడు; రథి శిఖామణియున్= రథంమీదనుండి యుద్ధం చేయగలవారిలో శ్రేష్ఠుడైనవాడూ; అగు= అయిన; రౌక్మిణేయుఁడు= రుక్మిణీదేవి కుమారుడయిన ప్రద్యుమ్నుడు; ఆ+జనములన్= ద్వారకలోని ప్రజలను; ఓడక+ఉండుడు+అని= భయపడకుండా ధైర్యంగా ఉండండి - అని పల్కుతూ; సంగర కౌతుకము+ఒప్పన్= యుద్ధం

చేయటంలో తనకున్నట్టి ఉత్సాహం అతిశయిస్తుండగా; దివ్యసాధనములన్= శక్తిమంతాలైన యుద్ధ సాధనాలను (దివ్యశక్తితో గూడిన ఆయుధాలను); పూని= ధరించి; సైనిక కదంబము= సైనికుల సమూహం; కొల్వన్= వెంట నడుస్తూ ఉండగా; న+నూన= తక్కువకాని (గొప్పదయిన); మీనకేతనరుచి= చేపగుర్తుగల జెండాయొక్క కాంతి; గ్రాలన్= ప్రకాశిస్తూ ఉండగా; ఉన్నతరథస్థితుఁడు+ఐ= ఎత్తైన (గొప్ప) రథంలో ఉన్నవాడై; రణ+ఉర్వికిన్= యుద్ధభూమికి; వెడలెన్= బయలుదేరాడు.

**తా :** ద్వారకలోని జనుల కలతపాటును గమనించి, భగంతుడూ, రథికశ్రేష్ఠుడూ అయిన ప్రద్యుమ్నుడు 'భయపడకండి!' – అని ప్రజలను ధైర్యపరుస్తూ మహోత్సాహంతో దివ్యములైన అనేకాయుధాలను దాల్చి, సైన్యాలు సేవిస్తుండగా, మత్స్యధ్వజం ప్రకాశిస్తూ ఉన్న గొప్పతేరు నెక్కి యుద్ధభూమికి బయలుదేరాడు.

**వ. అ య్యవసరంబున. 843**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= (ప్రద్యుమ్నుడు రథారూఢుడై యుద్ధభూమికి వెడలిన) ఆ సందర్భంలో...

**తా :** శ్రీకృష్ణునికుమారుడైన ప్రద్యుమ్నుడు ప్రజానీకానికి ధైర్యం చెపుతూ, రణోత్సాహంతో సమరభూమికి వెళ్లుతున్న సమయంలో

**చ. సమధికబాహుశౌర్యజితచండవిరోధులు వెళ్లి రున్నత**
**క్షమగదభానువిందశుకసాత్యకిసారణచారుదేష్ణ సాం**
**బ మకరకేతనాత్మజశ్వఫల్కతనూభవతత్సహోదర**
**ప్రముఖయదూత్తముల్ విమతభంజనులై కృతవర్మ మున్నుగన్. 844**

**ప్రతి :** సమ్+అధిక= మిక్కిలి అతిశయించిన; బాహుశౌర్య= భుజబలపరాక్రమంచేత; జిత= జయింపబడిన; చండవిరోధులు= తీవ్రమైన శత్రువులుగలవారు (తమబాహువుల పరాక్రమంతో భీకరశత్రువుల్ని జయించిన వారు); కృతవర్మ మున్నుగన్= కృతవర్మ మొదలుకొని; గద= గదుడు; భానువింద= భానువిందుడు; శుక= శుకుడు; సాత్యకి= సాత్యకి; సారణ= సారణుడు; చారుదేష్ణ= చారుదేష్ణుడు; సాంబ= సాంబుడు; మురకేతన+ఆత్మజ= మొసలి జండాగల మన్మథుని (ప్రద్యుమ్నుని) కుమారుడైన అనిరుద్ధుడు; శ్వఫల్క తనూభవ= శ్వఫల్కుని కుమారుడైన అక్రూరుడు; తత్+సహ+ఉదర= ఆయన తమ్ముడు; ప్రముఖ= మున్నగు ప్రసిద్ధులైన; యదు+ఉత్తముల్= యాదవ శ్రేష్ఠులు; విమత భంజనులు+ఐ= విరోధులను సంహరించగల స్తోమతతో గూడినవారై; ఉన్నతక్షమన్= గొప్పదైన ఓరిమితో (సహనశక్తితో); వెళ్లిరి= రణరంగానికి పోయారు.

**తా :** ఆ విధంగా ప్రద్యుమ్నుడు యుద్ధభూమికి బయలుదేరినసమయంలో అతిశయించిన తమ బాహువుల బలపరాక్రమాలచేత శత్రువులను సంహరించే సామర్థ్యంగలవారైన కృతవర్మ, గదుడు, భానువిందుడు, శుకుడు, సాత్యకి, సారణుడు, చారుదేష్ణుడు, సాంబుడు, అనిరుద్ధుడు, అక్రూరుడు మొదలయిన యాదవవీరులందరూ యుద్ధరంగానికి పయనమయినారు.

**విశే :** గదుడు= బలరాముని తమ్ముడు (రోహిణి ఆరుగురుకుమారులలో ఒకడు).

భానువిందుడు = ఒకానొక యాదవవీరుడు.

శుకుడు = ద్వారకాపురిలోని యదువీరులలో ఒకడు.

సాత్యకి = సత్యకుడను యాదవరాజుయొక్క కుమారుడు. 'యుయుధానుడు' అనేది ఇతని నామాంతరం.

సారణుడు = బలరాముని సోదరులలో ఒకడు (గదుని తమ్ముడు).

చారుదేష్ణుడు = శ్రీకృష్ణునికి రుక్మిణియందు కలిగిన కుమారుడు.

సాంబుడు = శ్రీకృష్ణునికి జాంబవతియందు కలిగిన కుమారుడు.

మకరకేతనాత్మజుడు = అనిరుద్ధుడు (ప్రద్యుమ్నునికొడుకు).

శ్వఫల్క తనూభవుడు = శ్వఫల్కుని పుత్రుడు (అక్రూరుడు).

కృతవర్మ = వృష్ణివంశంలో జన్మించిన ఒక రాజు. ద్వారకాపురివాస్తవ్యుడు. మహారథియైన వీరుడు. శ్రీకృష్ణభక్తుడు.

**క. వారణవాజిస్యందన, వీరభటావలులు సనిరి విశ్వము వడఁకన్**
**ఘోరాకృతి వివిధాయుధ, భూరిద్యుతు లర్కబింబముం గబళింపన్. 845**

**ప్రతి :** వారణ= ఏనుగులు; వాజి= గుర్రాలు; స్యందన= రథాలు; వీరభట+ఆవలులు= వీరులైన సైనికుల సమూహాలు; వివిధ+ఆయుధ= పెక్కుతెరగులైన యుద్ధ ఆయుధాలయొక్క; భూరిద్యుతులు= గొప్పకాంతులు; అర్కబింబమున్= సూర్యమండలాన్ని; కబళింపన్= మింగివేయగా (పూర్తిగా ఆవరింపగా); విశ్వము= ప్రపంచం; వడఁకన్= దద్దరిల్లగా; ఘోర+ఆకృతిన్= భీకరమైన ఆకారాలతో; చనిరి= (రణస్థలికి) వెళ్లారు.

**తా :** భూమి కంపిస్తూ ఉండగా, అనేకాయుధాల మితిమీరిన కాంతులు సూర్యబింబాన్ని కప్పివేయగా, చతురంగబలాలతో కూడినవారై, యాదవవీరులందరు శత్రువులకు భయం కలిగించే స్వరూపాలతో యుద్ధరంగాని కేగినారు.

**వ. చని యా గోవిందనందనస్యందనంబుం బలసందోహంబునుం దలకడచి, యదుసైన్యంబులు సాల్వబలంబులతోడం దార్కొని బెరయునప్పుడు దేవదానవసంకులసమరవిధంబునం దుములం బయ్యె; న య్యెడ. 846**

**ప్రతి :** యదుసైన్యంబులు= యాదవులసేనలు; చని= (ఆ ప్రకారంగా రణరంగానికి) వెళ్లి; ఆ గోవిందనందన= శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నునియొక్క; స్యందనంబున్= రథాన్ని; బలసందోహంబునున్= (మొదట ప్రద్యుమ్నుని వెంట వెళ్లిన) సైన్యసమూహాన్ని; తల+కడచి= (శత్రుసేనలతో యుద్ధం చేయాలన్న ఉత్సాహంతో) అతిక్రమించిపోయి; సాల్వబలంబుల తోడన్= సాల్వునియొక్కసేనలతో; తారు+కొని= పైబడి ఎదిరించి; బెరయు+అప్పుడు= కమ్ముకొనిన సమయంలో; దేవ దానవ= దేవతలయొక్క, రాక్షసులయొక్క; సంకుల సమరవిధంబునన్= సందడి (దొమ్మి) యుద్ధంవలె; తుములంబు+అయ్యెన్= దట్టమై సాగింది; ఆ+ఎడన్= ఆ సందర్భంలో...

**తా :** ఆ విధంగా అరివీరభయంకరంగా బయలువెడలిన యదువీరుల చతురంగబలాలు, తొలుత వెళ్లిన ప్రద్యుమ్నుని రథాన్నిసైతం దాటిపోయి, సమరోత్సాహంతో సాల్వుని సేనలను కమ్ముకొన్నట్లుగా ఎదిరించాయి. అప్పుడు ఆ యిరు పక్షాలనడుమ సాగినసమరం (పూర్వపు) దేవదానవులయుద్ధంవలె ఎడతెరపిలేనిదిగా గోచరించింది.

**మ. వితతజ్యాచయటంకృతుల్ మదజలావిర్భూతశుండాల ఘీం**
**కృతు లుద్యద్భటహుంకృతుల్ మహితభేరీభాంకృతుల్ భీషణో**
**ద్ధతనిస్సాణధణంకృతుల్ ప్రకటయోధవ్రాతసాహంకృతుల్**
**కుతలంబున్ దివి నిండ మ్రోసె రిపుసంక్షోభంబుగా భూవరా! 847**

**ప్రతి :** భూవరా!= ఓ పరీక్షిన్మహారాజా!; వితత= విస్తారమైన; జ్యాచయ= (వీరుల చేతులలోని) విల్లుల అల్లెత్రాళ్లయొక్క; టంకృతుల్= ఎక్కుపెట్టి బాణాలను విడిచేటప్పుడు కలిగే 'ఠాం' అనే శబ్దాలు; మదజల= (చెక్కిళ్లయందు స్రవించే) మదజలధారలవల్ల (మదజలధారల ప్రేరణలవల్ల); ఆవిర్భూత= (గొప్పగా) కలిగిన; శుండాల= మదపుటేనుగులయొక్క; ఘీంకృతులు= 'ఘీం' అనే శబ్దాలు (ఘీంకారాలు); ఉద్యత్+భట= ఉత్సాహంతో సంసిద్ధులైయున్న యుద్ధ భటులయొక్క; హుంకృతుల్= పరాక్రమసూచకాలైన హుంకారాలు; మహిత= గొప్పవియైన; భేరీ= యుద్ధభేరులయొక్క; భాంకృతుల్= 'భాం' అనే శబ్దాలు; భీషణ+ఉద్ధత= భయం కలిగించే కఠినమైన; నిస్సాణ= చర్మవాద్యాల (తప్పెటల)యొక్క; ధణంకృతుల్= ధణధణమనే శబ్దాలు; ప్రకట= స్పష్టమయిన; యోధవ్రాత= వీరుల సమూహాలయొక్క; స+అహంకృతుల్= గర్వంతో కూడినట్టివి (పౌరుషవాక్కులు); కుతలంబున్= భూమండలాన్ని; దివిన్= ఆకాశాన్ని; నిండన్= నిండునట్లుగా; రిపు= శత్రువులకు; సంక్షోభంబు+కాన్= కలవరపరచునవిగా; మ్రోసెన్= ధ్వనించాయి.

**తా :** రాజేంద్రా! ఆ సైన్యాల్లోని విలుకాండ్రయొక్క అల్లెత్రాళ్లటంకారాలు, మదపుటేనుగుల ఘీంకారాలు, వీరభటుల హుంకారాలు, యుద్ధభేరుల భాంకారాలు, తప్పెటలవంటి చర్మవాద్యాల భయంకరధణధణధ్వనులు, వీరవరుల పౌరుషవాక్యాలు – ఈ శబ్దాలు విరోధులను కలవరపరుస్తూ భూమ్యాకాశాలు నిండిపోయాయి.

**మ.** **హరిరింఖారథనేమిసద్భటపదవ్యాఘట్టనోద్ధూత దు**
**స్తరధూళీపటలప్రభూతనిబిడధ్వాంతప్రవిధ్వంస కృ**
**త్కరశాతాసిగదాదిహేతిరుచు లాకాశంబు నిండన్ వియ**
**చ్చరదృక్కుల్ మిఱుమిట్లు గొల్ప సమరోత్సాహంబు సంధిల్లఁగన్.** **848**

**ప్రతి :** హరిరింఖా= గుర్రాల గిట్టలయొక్క; రథనేమి= తేరుచక్రాల కమ్ములయొక్క; సత్+భటపద= శ్రేష్ఠులైన (బలిష్ఠులైన) సైనికుల పాదాలయొక్క; వి+ఆఘట్టన= అధికమగు రాపిడిచేత; ఉత్+ధూత= (భూమినుండి) పైకి లేచిన; దుస్తర= దాటుటకు వీలుగాని; ధూళీపటల= దుమ్ముల సమూహంవల్ల; ప్రభూత= బాగుగా ఏర్పడిన; నిబిడధ్వాంత= దట్టమైన చీకట్లను; ప్రవిధ్వంసకృత్= పూర్తిగా ధ్వంసం గావిస్తున్న (పూర్తిగా తొలగిస్తున్న); శాత+అసి= పదునుగల కత్తులయొక్క; గదా+ఆది= గద మొదలైన; హేతిరుచులు= ఆయుధాలకాంతులు; ఆకాశంబు నిండన్= గగన భాగమందంతటా వ్యాపించగా; వియత్+చర= ఆకాశంలో సంచరించేవాళ్లయొక్క; దృక్కుల్= చూపులు; మిట్లు+మిట్లు(మిరుమిట్లు)+కొల్పన్= కన్నులనుండి చెదరిపోతుండగా; సమర+ఉత్సాహంబు= యుద్ధం చేయాలనే ఆసక్తి; సంధిల్లన్+కన్= కలుగుతుండగా...

**తా :** గుర్రాల గిట్టలవల్ల, రథచక్రాలవల్ల, సైనికుల పాదాలవల్ల భూతలంనుండి లేచిన ధూళీ సమూహం ఆకాశాన్ని చీకట్లతో నింపింది. ఆ చీకట్లను పోగొడుతూ సైనికుల చేతులలోని కత్తులు మున్నగు ఆయుధాల కాంతులు ఆకాశసంచారులైన దేవజాతులకు కన్నులు మిఱుమిట్లు గొల్పుతూ ఆకాశమంతటా విస్తరించాయి.

**చ.** **తలకొని సైనికుల్ గవిసి తార్కొని పేర్కొని పాసి డాసి యం**
**కిలి గొన కెమ్ము లమ్ములఁ బగిల్చి నొగి ల్చితరేతరుల్ తలల్**
**నలియఁగ మొత్తి యొత్తి నయనంబుల నిప్పులు రాల లీల నొ౯**
**దలలు లలాటముల్ ఘనగదాహతి నొంచి కలంచి పోరఁగన్.** **849**

**ప్రతి :** సైనికుల్= ఆ యుద్ధరంగమందలి సైనికులు; ఇతర+ఇతరుల్= పరస్పరం (ఒకరి నొకరు); కవిసి= కమ్ముకొని; తారు+కొని= కవిసి; పేరు+కొని= (ఎదుటిసైనికుని) గట్టిగా పేర్కొని; పాసి= పక్కకు తొలగి; డాసి= మరల సమీపించి; అంకిలి+కొనక= కలత చెందక; అమ్ములన్= బాణాలచేత; ఎమ్ములు= శత్రువుల ఎముకలను; పగిల్చి= పగులగొట్టి (విరిచి); నొగిల్చి= నొప్పించి; తలల్= తలలను; నలియన్+కన్= నలిగిపోవునట్లుగా; మొత్తి= (గదవంటి ఆయుధంతో)కొట్టి; ఒత్తి= (ఆయుధంతో) దగ్గరపడునట్లుగా ఒత్తిడి కలిగించి; నయనంబులన్= కన్నులనుండి; నిప్పులు రాలన్= రోషాధిక్యంచేత నిప్పురవ్వలు రాలిపడుతుండగా; ఘనగదా+ఆహతిన్= గొప్పగదలతో గట్టిగా కొట్టడంచేత; ఔ+తలలు= తలలపై (నడిమి) భాగాలను; లలాటముల్= నొసళ్లను; నొంచి= బాగుగా నొప్పించి; కలంచి= కలవరపరచి; పోరన్+కన్= యుద్ధం చేస్తుండగా...

**తా :** యాదవ, సాల్వసేనలు పరస్పరం భీకరంగా ఎదిరించి, బాణాలచే విరోధుల ఎముకలను పగులగొట్టుతూ, గొప్ప గదలతో నడితలలపైన, నొసళ్లమీద గట్టిగా బాదుతూ, కోపంవల్ల కన్నులనుండి నిప్పురవ్వలు రాలుతూ ఉండగా, రణోత్సాహం రంజిల్లగా పోరాడాయి.

**వ. అ య్యవసరంబునం బ్రద్యుమ్నుండు గనుంగొని. 850**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ప్రద్యుమ్నుండు= శ్రీకృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుడు; కనున్+కొని= ఉభయసైన్యాలు భీకరంగా పోరాడుతూ ఉండగా చూచి...

**తా :** ఆ తీరున యాదవ, సాల్వసేనలు హోరాహోరిగా యుద్ధంచేస్తుండగా ప్రద్యుమ్నుడు చూచి

**మ. అనయంబుం గలుషించి సౌభపతి మాయాకోట్లు చంచచ్ఛరా**
**సన నిర్ముక్తనిశాతదివ్యమహితాస్త్రశ్రేణిచేఁ దత్క్షణం**
**బున లీలాగతి నభ్రగుల్ మనములన్ భూషించ మాయించె న**
**వ్వనజాతాప్తుఁడు భూరిసంతమసమున్ వారించుచందంబునన్. 851**

**ప్రతి :** అనయంబున్= మిక్కిలి; కలుషించి= కోపగించుకొని; సౌభపతి= సౌభకమనెడు విమానానికి అధిపతియగు సాల్వునియొక్క; మాయాకోట్లు= కోట్లకొలది (అనేక) మాయలను; చంచత్= మెఱయుచున్నటువంటి; శర+ఆసన= వింటినుండి; నిర్ముక్త= చక్కగా విడువబడిన (ప్రయోగింపబడిన); నిశాత= మిగుల వాడియైన; దివ్య= దైవీసంబంధమైనశక్తితో గూడియున్న; మహిత= గొప్ప మహిమ గలిగినవైన; అస్త్రశ్రేణిచేన్= మంత్ర పూర్వకాలైన బాణాల వరుసచేత; ఆ+వనజాత+ఆప్తుడు= పద్మాలకు నెచ్చెలియైన సూర్యభగవానుడు; భూరి= గొప్పదైన; సంతమసమున్= దట్టమైన చీకటిని; వారించు చందంబునన్= తొలగజేసే విధంగా; తత్+క్షణంబునన్= ఆ నిమిషంలోనే; అభ్రగుల్= ఆకసంలో పయనించేవారు (దేవతాబృందాలు); మనములన్= తమతమమనస్సులందు; భూషింపన్= ప్రశంసించగా; లీలాగతిన్= క్రీడవలె (అనాయాసంగా); మాయించెన్= నశింపజేశాడు.

**తా :** ఆ సమయంలో ఆ సంకులసమరాన్ని తిలకించిన ప్రద్యుమ్నుడు వీరావేశంతో విజృంభించి, సూర్యభగవానుడు తన కిరణాలతో కారుచీకట్లను పటాపంచలు కావించినట్లు, మహిమగల తన దివ్యాస్త్రజాలంతో సాల్వుడు పన్నిన మాయాజాలాన్ని విలాసంగా భేదించి నశింపజేశాడు.

**వ. మఱియును.** **852**

**తా :** అంతేగాక

**చ. అతిరథికోత్తముం డన నుదంచితకాంచనపుంఖపంచ విం**
**శతి విశిఖంబుల న్నతనిసైనికపాలుని నొంచి యుగ్రుఁడై**
**శత శతకోటికోటినిభసాయకముల్ పరఁగించి సాల్వభూ**
**పతి కకుదంబు నొంచి లయభైరవుకైవడిఁ బేర్చి వెండియున్.** **853**

**ప్రతి :** అతిరథిక+ఉత్తముండు+అనన్= (ఈతడు) ఉత్తములయిన రథికులను (రథంపైనుండి యుద్ధముచేయు వీరవరులను) మించిపోయాడని (చూచేవారు) కొనియాడేటట్లుగా; ఉత్+అంచిత= మిగుల తగినవైన; కాంచనపుంఖ= బంగారు ఱెక్కలుగల; పంచవింశతి= ఇఱువదియైదు; విశిఖంబులన్= బాణాలచేత; అతనిసైనికపాలునిన్= ఆ సాల్వునిసేనాధిపతిని; నొంచి= నొప్పించి; ఉగ్రుడు+ఐ= మిక్కిలి భీతిని గొల్పుతున్నవాడై; శత= నూరు; శతకోటి కోటి నిభ= దేవేంద్రుని నూరుకోట్ల వజ్రాయుధములకు సమానమైన; సాయకముల్= బాణాలను; పరగించి= ప్రయోగించి; సాల్వభూపతి= సాల్వుడనే రాజుయొక్క; కకుదంబున్= వీపుపైభాగాన్ని (మూపును); నొంచి= నొప్పించి; లయభైరవుకైవడిన్= ప్రళయకాలంలో సర్వప్రాణులను సంహరించే కాలభైరవునివలె; పేర్చి= విజృంభించి; వెండియున్= మరల...

**తా :** అతిరథుల్లో శ్రేష్ఠుడయిన ప్రద్యుమ్నుడు బంగారుఱెక్కలు గలిగిన ఇఱువదియైదు బాణాలు ప్రయోగించి, సాల్వుని సేనాపతిని బాగా నొప్పించాడు. ఇంకా, కోట్లకొలదీ ఇంద్రునివజ్రాయుధంల్లాంటి బాణాలను అనేకంగా ప్రయోగించి, సాల్వుని మూపును గొప్పగా గాయపఱచాడు. అంతటితో విరమింపక, ప్రళయకాలంలోని భైరవునివలె విజృంభించి యుద్ధం చేయసాగినాడు.

**విశే :** భారతం – ఉద్యోగ, భీష్మ – అతిరథాదుల వివరాలు.

**చ. పదిపది యమ్ములన్ మనుజపాలవరేణ్యుల నొంచి రోషముం**
**గదురఁగ మూఁడుమూఁడు శితకాండములన్ రథదంతివాజులం**
**జదియఁగ నేసి యొక్కొక నిశాతశరంబున సైనికావలిన్**
**మదము లడంచి యిట్లతఁ డమానుషలీలఁ బరాక్రమించినన్.** **854**

**ప్రతి :** అతడు= అతిరథశ్రేష్ఠుడైన ఆ ప్రద్యుమ్నుడు; రోషమున్+కదురన్+కన్= కోపముతోగూడిన ఉద్రేకము అతిశయింపగా; పదిపది+అమ్ములన్= రెండు పదల వాడిబాణాలచేత; మనుజపాలవరేణ్యులన్= సాల్వునికి బాసటగా వచ్చినట్టి రాజశ్రేష్ఠులను; నొంచి= బాధపఱచి; మూడు మూడు శితకాండములన్= వాడిగల మూడుమూడు బాణాలను; రథదంతి వాజులన్= రథాలను, ఏనుగులను, గుఱ్రాలను; చదియఁగన్+ఏసి= నలిగి పడునట్లుగా ప్రయోగించి; ఒక్క+ఒక నిశాత శరంబునన్= వాడిగల ఒక్కొక్క బాణంచేత; సైనిక+ఆవళిన్= సైనికుల గుంపుల యొక్క; మదము+అడగించి= వాళ్ల బలగర్వాన్ని అణచివేసి; ఇట్లు= ఈ రీతిగా; న+మానుషలీలన్= సాధారణ మానవశక్తికి అతీతమైన విలాసంతో; పరాక్రమించినన్= శౌర్యముతో విజృంభించగా...

**తా :** ప్రద్యుమ్నుడు పదిపదిబాణాలతో సాల్వునిమిత్రులైన మహారాజులను నొప్పించాడు. మూడు మూడు బాణాలు ప్రయోగించి రథ, గజ తురగాలను నేలగూల్చినాడు. ఒక్కొక్క బాణంచేత సైనికుల బలగర్వాన్ని అణచివేశాడు. ఈ రీతిగా ఎదురులేని విధంగా పరాక్రమించినాడు.

**క. దుర్మానవహరు నద్భుత, కర్మమునకు నుభయసైనికప్రకరంబుల్**
**నిర్మలమతి నుతియించిరి, భర్మాచలధైర్యు విగతభయుఁ బ్రద్యుమ్నున్. 855**

**ప్రతి :** ఉభయసైనికప్రకరంబుల్= ఇరువైపుల ఉన్న సైనికుల సమూహాలు; భర్మ+అచలధైర్యున్= బంగారుకొండ (మేరుపర్వతము) వంటి సుస్థిరమైన ధైర్యము గలవాణ్ణి; విగతభయున్= పోయిన భయము గలవానిని (ఏ మాత్రము భీతి లేనివానిని); ప్రద్యుమ్నున్= ప్రద్యుమ్నుణ్ణి; అద్భుతకర్మమునకున్= యుద్ధరంగములో ఆతడు చేసిన గొప్పకార్యానికి; నిర్మలమతిన్= (పక్షపాతంలేని) స్వచ్ఛమైన మనస్సుతో; నుతియించిరి= కొనియాడారు.

**తా :** మేరునగధీరుడు, నిర్భయుడు, శత్రువుల్ని సంహరించేవాడు నయిన ప్రద్యుమ్నుణ్ణి, ఆశ్చర్యకరమయిన ఆతని పరాక్రమ నైపుణ్యానికి మెచ్చి, స్వపక్షమందలి సైనికులతోపాటు, శత్రుపక్షంలోని సైనికులుసైతం పక్షపాతంలేని నిర్మల బుద్ధితో ప్రశంసించారు.

**వ. అ య్యవసరంబున. 856**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** ఆ రీతిగా ఇరువైపుల సైనికులు ప్రద్యుమ్ని పరాక్రమాన్ని ప్రశంసిస్తూవున్న సందర్భంనందు

**ఉ. సాంబుని సాల్వభూవిభుఁడు సాయకజాలము లేసి నొంచినన్**
**జాంబవతీతనూభవుఁడు చాపము సజ్యము సేసి డాసి సా**
**ల్వుం బదియేను తూపుల నవోన్నతవక్షము గాఁడ నేసి శా**
**తాంబకవింశతి న్నతనిసౌభక మల్లలనాడ నేసినన్. 857**

**ప్రతి :** సాల్వభూవిభుడు= సాల్వభూపతి; సాంబునిన్= (జాంబవతియందు) శ్రీకృష్ణుని పుత్రుడైన సాంబుణ్ణి(పై); సాయక జాలములు= బాణాల సమూహములు; ఏసి= ప్రయోగించి; నొంచినన్= నొప్పింపగా; జాంబవతీతనూభవుడు= జాంబవతీ కుమారుడు (సాంబుడు); చాపము= విల్లును; సజ్యము+చేసి= సిద్ధము చేసి (ఎక్కుపెట్టి); సాల్వున్+డాసి= సాల్వుణ్ణి సమీపించి; పది+ఏను తూపులన్= పదునైదు బాణాలను; నవ+ఉన్నత వక్షమున్= క్రొంగొత్తగా ప్రకాశిస్తున్న ఎత్తైన వక్షఃస్థలాన్ని; కాఁడన్+ఏసి= నాటుకొనేట్లుగా ప్రయోగించి; అతని= ఆ సాల్వునియొక్క; సౌభకము= సౌభకమనే విమానం; అల్లనన్+అల్లనన్+ఆడన్= మిక్కిలి చలించునట్లుగా; శాత+అంబకవింశతిన్= మిక్కిలి వాడిగల ఇఱువదిబాణాలను; ఏసినన్= వేయగా.

**తా :** ప్రద్యుమ్నుని పరాక్రమాన్ని ఉభయసైన్యాలు కొనియాడుతూ ఉన్న ఆ సమయంలో సాల్వుడు శ్రీకృష్ణుడి మఱియొక కుమారుడైన సాంబునిపై ఎన్నో బాణాలను ప్రయోగించి మిక్కిలి నొప్పించాడు. వెంటనే సాంబుడు విల్లెక్కిడి సాల్వుని ఱొమ్ముపై పదునైదు బాణాలను వేసి, ఇఱువదివాడిగల బాణాలు వేసి వాడి సౌభకవిమానం అల్లాడేటట్లు చేసినాడు.

చ. గదుఁడు మహోగ్రవృత్తి నిజకార్ముక నిర్గతవిస్ఫురద్విధుం
తుద వదనాభబాణవితతుల్ పరఁగించి విరోధిమస్తముల్
గుదులుగ గ్రుచ్చి యెత్తుచు నకుంఠితవిక్రమకేళి లోలుఁడై
చదల సురల్ నుతింప రథిసత్తముఁ డొప్పె నరేంద్రచంద్రమా! 858

**ప్రతి :** నర+ఇంద్ర చంద్రమా!= రాజశ్రేష్ఠులలో చంద్రునివలె ఉత్తముడవైన పరీక్షిన్మహీపతీ!; రథిసత్తముఁడు= రథమునందుండి యుద్ధమొనరించువారిలో శ్రేష్ఠుడు; గదుడు= శ్రీకృష్ణుని తమ్ముడైన గదుడు; మహా+ఉగ్రవృత్తిన్= మిగుల భయం గొలిపే విధంగా; నిజకార్ముక= తనయొక్క వింటినుండి; నిర్గత= వెలువడుచున్న; విస్ఫురత్= మిగులప్రకాశించే; విధుంతుద= రాహువుయొక్క; వదన+ఆభ= నోటిని పోలియున్న; బాణవితతుల్= అమ్ముల సమూహాలను; పరగించి= ప్రసరించజేసి; విరోధిమస్తముల్= శత్రువుల శిరస్సులను; గుదులుగన్= గుత్తులుగా; గ్రుచ్చి= బాణాలకు కూర్చి; ఎత్తుచున్= (అందరకు కనబడులాగున) శత్రువుల శిరస్సుల గుత్తులు గ్రుచ్చిన బాణాలను అందరికీ కనబడేటట్లు పైకెత్తుతూ; న+కుంఠిత= మొక్క వోవని; విక్రమ కేళిలోలుడు+ఐ= పరాక్రమమనెడి ఆటయందు ఆసక్తిగలవాడై; చదలన్= ఆకాశంలో; సురల్= దేవతలు; సుతింపన్= కొనియాడుచుండగా; ఒప్పెన్= విలసిల్లాడు.

**తా :** పరీక్షిద్రాజేంద్రా! రథికులలో ఉత్తముడైన గదుడు రాహుముఖాన్నిపోలిన భీకరబాణసమూహాలను ప్రసరింపజేసి, శత్రువుల శిరస్సులను ఆ బాణాలకు గుత్తులుగా గూర్చి పైకెత్తి చూపుతూ, పరాక్రమప్రదర్శనమనే ఆటలో ఆసక్తుడై ఉండినాడు. ఆ సమయంలో ఆకాశంలో దేవతాబృందాలు అతనిపరాక్రమకేళిని తిలకిస్తూ ప్రశంసించసాగారు.

ఉ. సాత్యకి చండరోషమున సాల్వమహీవరు భూరిసౌభ సాం
గత్య చతుర్విధోగ్రబలగాఢతమఃపటలంబు భాసు రా
దిత్య మయూఖపుంజరుచితీవ్రశరంబులఁ జూపి సైనిక
స్తుత్యపరాక్రమప్రకటదోర్బలుఁడై విలసిల్లె భూవరా! 859

**ప్రతి :** భూవరా!= రాజా!; సాత్యకి= శ్రీకృష్ణుని మఱియొక తమ్ముడైన సాత్యకి; చండరోషమునన్= తీవ్రమైన కోపంతో; సాల్వమహీవరు= సాల్వ భూనాథునియొక్క; భూరి= గొప్పదయిన; సౌభసాంగత్య= సౌభక విమానంతో కూడి ఉన్న; చతుర్+విధ= రథాలు; ఏనుగులు; గుఱ్ఱాలు, కాల్బలం అనే నాలుగు విధాలై ఉండే; ఉగ్రబల= భయం కల్గించే సైన్యాలు అనే; గాఢ= దట్టమయిన; తమస్+పటలంబున్= చీకటుల సమూహాన్ని; భాసుర= బాగుగా ప్రకాశిస్తున్నట్టి; ఆదిత్య= సూర్యునియొక్క; మయూఖపుంజ= కిరణాల సమూహాలయొక్క; రుచి= కాంతులవంటి కాంతులుగలవైన; తీవ్రశరంబులన్= మిఱుమిట్లుగొల్పే వాడిబాణాలచేత; మాపి= రూపు మాపి (నశింపజేసి); సైనికస్తుత్య= ఇరువైపుల యందలి సైనికులచే ప్రశంసింపబడుతున్న; పరాక్రమ= యుద్ధం చేయడంలోని శౌర్యంచేత; ప్రకట= వెల్లడి అవుతున్న; దోస్+బలుడు+ఐ= భుజములయందలి బలంకలవాడై; విలసిల్లెన్= మిగుల ప్రకాశించాడు.

**తా :** భూనాథా! శ్రీకృష్ణునిసోదరుడైన సాత్యకి తీవ్రమైనకోపంతో చతురంగబలసహితమై యున్న సాల్వుని సౌభక విమానమనే చీకట్లను మిఱుమిట్లుగొల్పుచున్న సూర్యకిరణాలను పోలిన వాడిబాణాలచే పటాపంచలు కావించాడు. ఆతని పరాక్రమాన్ని ఇరువైపులనున్న సైనికులు మిగుల ప్రశంసించినారు.

**ఉత్సాహము**

**భానువిందుఁ డుద్ధతిన్ విపక్షపక్షసైన్యదు**
**ర్మాన కాననానలోపమానచండకాండసం**
**తాన మూన నేసి చూర్ణితంబు చేసెఁ జాప వి**
**ద్యా నిరూఢి దేవతావితాన మిచ్చ మెచ్చఁగాన్. 860**

**ప్రతి :** భానువిందుడు= భానువిందుడనే యాదవవీరుడు; ఉద్ధతిన్= గర్వంతో; విపక్ష పక్షసైన్య= శత్రుపక్షంలోని సేనలనెడి; దుర్+మాన= చెడ్డ (తగని) అహంకారంగల; కానన= అడవికి; అనల+ఉపమాన= అగ్నివంటి (దావాగ్నివంటి); చండ= వాడిగల; కాండ సంతానము= బాణాల సముదాయాన్ని; ఊనన్+ఏసి= నాటుకొనేటట్లుగా ప్రయోగించి; దేవతావితానము= (ఆకాశంలోని) దేవతల గుంపు; ఇచ్చన్= తమతమ మనస్సులయందు; చాపవిద్యానిరూఢిన్= విలువిద్యలోని (భానువిందునియొక్క) నేర్పరితనాన్ని; మెచ్చఁగన్= మెచ్చుకొంటుండగా; చూర్ణితంబు+చేసెన్= (వారలందరిని) పొడిపొడిగా చేశాడు.

**తా :** భానువిందుడు అహంకరించియున్న శత్రుపక్షసైన్యమనే అరణ్యాన్ని తీక్ష్ణమైన దావానలంవంటి తన బాణసముదాయంతో దహించి, చూర్ణంచేసి వైచాడు. అలాంటి ఆతని ధనుర్విద్యాకౌశలాన్ని తిలకించిన ఆకాశంలోని దేవతలసమూహం తమ తమ మనస్సులలో ఎంతగానో మెచ్చుకొన్నారు.

**ఉత్సాహము**

**చారుదేష్ణుఁ డాగ్రహించి శత్రుభీషణోగ్ర దో**
**స్సారదర్ప మేర్పడన్ నిశాత బాణకోటిచే**
**దారుణ ప్రతాపసాల్వదండనాథమండలిన్**
**మారి రేఁగినట్లు పిల్కుమార్చి పేర్చి యార్చినన్. 861**

**ప్రతి :** చారుదేష్ణుడు= శ్రీకృష్ణుని కుమారుడైన చారుదేష్ణుడు; ఆగ్రహించి= కోపగించి; శత్రుభీషణ= విరోధులకు భయం కల్గేటట్లు; ఉగ్ర= భయంకరమైన; దోస్+సార= భుజబలంవల్ల ప్రకాశించే; దర్పము= ఉత్సాహగర్వం; ఏర్పడన్= ప్రకటమయ్యేటట్లు; నిశాత= చాల పదునైన; బాణకోటిచేన్= అమ్ముల సమూహంచేత; దారుణ ప్రతాప= తీక్ష్ణమైన పరాక్రమం గలిగిన; సాల్వ= సాల్వునియొక్క; దండనాథమండలిన్= సేనాపతుల బృందాన్ని; మారి= మృత్యుకారకమైన మశూచికాది వ్యాపకరోగం (అంటుజాడ్యం); రేగిన+అట్లు= విజృంభించిన రీతిగా; పేర్చి= అతిశయించి; పిల్కుమార్చి= నశింపజేసి; ఆర్చినన్= ఉత్సాహంతో బిగ్గరగా అరవగా.

**తా :** రుక్మిణీతనయుడైన చారుదేష్ణుడు కోపంతో విజృంభించి, వాడియైన బాణ పరంపరను ప్రయోగించి సాల్వుని సేనానుల్ని అందరినీ మారిరేగిన రీతిగా సంహరించి, ఉత్సాహంతో గట్టిగా సింహగర్జన చేశాడు.

**క. శుకుఁ డాయోధన విజయో, త్సుకమతి బాహాబలంబు సొప్పడ విశిఖ**
**ప్రకరంబులఁ దను శౌర్యా, ధికుఁ డన విద్వేషిబలతతిం బరిమార్చెన్. 862**

**ప్రతి :** శుకుడు= శుకుడనే యాదవవీరుడు; ఆయోధన= యుద్ధంలో; విజయ= విజయాన్ని పొందాలనే పట్టుదలతో; ఉత్సుకమతి= మిక్కిలి కుతూహలంతో కూడిన మనస్సుగలవాడై; బాహాబలంబు= భుజ బలం; చొప్పు+పడన్= అందరికీ తెలిసేటట్లుగా; విశిఖప్రకరంబులన్= బాణాల సమూహాలను; తను= తాను; శౌర్య+అధికుడు+అనన్= పరాక్రమ విజృంభణలో గొప్పవాడని (ఇతరులు) పొగడగా; విద్వేషిబలతతిన్= శత్రుసేనల గుంపులను; పరిమార్చెన్= చంపివేశాడు.

**తా :** శుకుడు సమరవిజయకాంక్షగలవాడై, తన భుజబలాన్ని చూపరులు పొగిడే విధంగా శౌర్యాతిశయంతో బాణాలు ప్రయోగిస్తూ, శత్రువులబలాలను (సేనలను) నశింపజేశాడు.

**ఉ. సారణుఁ డేపుమైఁ గదిసి శాత్రవవీరులు సంచలింప దో**
**స్సార మెలర్పఁ గుంతశరశక్తిగదాక్షురికాది హేతులన్**
**వారక వాజిదంతిరథవర్గములం దునుమాడి కాల్వురన్**
**వీరముతోడఁ బంపె జమువీటికిఁ గాఁపుర ముగ్రమూర్తియై. 863**

**ప్రతి :** సారణుడు= బలరాముని తమ్ముళ్లలో ఒకడైన సారణుడు; ఉగ్రమూర్తి+ఐ= భయంకరమైన ఆకారంగలవాడై; శాత్రవవీరులు= ఎదుటి పక్షమందలివీరులు; సంచలింపన్= భీతితో తడబడగా; ఏపుమైన్= రణోత్సాహంతో; కదిసి= శత్రుసేనలను సమీపించి; దోస్+సారము= బాహువుల శక్తి; ఎలర్పన్= ప్రకాశించేటట్లుగా; కుంత= బల్లెములు; శర= అమ్ములు; శక్తి= బలిష్ఠాలైన ఈటెలు; క్షురికా= చురకత్తులు; ఆది= మొదలుగాగల; హేతులన్= ఆయుధాలచేత; వారక= ఎడతెగకుండా; వాజి= గుఱ్ఱాలు; దంతి= ఏనుగులు; రథ= తేరులు; వర్గములన్= వీటిన్నిటియొక్క; వర్గములన్= సముదాయాలను; తునుము+ఆడి= చిన్న ముక్కలుగా ఖండించివైచి; కాల్వురన్= కాలిబంట్లను; వీరముతోడన్= శౌర్యంతో; జమువీటికిన్= సంయమనీ పురమనేపేరు గల యముని పట్టడానికి; కాపురము= నివాసముగా (ఉండుటకై); పంపెన్= పంపివేసినాడు.

**తా :** బలభద్రుని తమ్ముడైన సారణుడు శత్రుసైన్యాలు భీతిల్లేటట్లుగా ఉగ్రరూపుడై ఉత్సాహంతో సమీపించి, బల్లెములు, బాణాలు, ఈటెలు, గదలు, కత్తులు మొదలైన ఆయుధాలను నిరంతరం ప్రయోగిస్తూ సాల్వుని సేనలోని గుఱ్ఱాలను, ఏనుగులను, రథాలను ఖండించి వేశాడు; సైనికులను సంహరించి యమపురికి పంపివేశాడు.

**క. అక్రూరుఁడు దదనుజులు న, వక్రపరాక్రమము మెఱసి వైరుల బాహా**
**విక్రమమున వధియించిరి, చక్రప్రాసాదివివిధసాధనములచేన్. 864**

**ప్రతి :** అక్రూరుడున్= యాదవులలో గొప్ప సేనాపతియైన అక్రూరుడూ; తద్+అనుజులున్= ఆయన తమ్ముళ్లు; న+వక్రపరాక్రమము= మొక్కవోని శౌర్యంతో; మెఱసి= ప్రకాశించి; వైరులన్= విరోధుల్ని; బాహా విక్రమమునన్= భుజాల శక్తిచేత; చక్ర= చక్రాలు; ప్రాస+ఆది= ఈటెలు మొదలయిన; వివిధసాధనములచేన్= పలురకాలైన యుద్ధ సాధనాలచేత; వధియించిరి= చంపారు.

**తా :** మహావీరుడైన అక్రూరుడూ ఆయన సోదరులూ గొప్ప భుజబల పరాక్రమంతో మెరసి, చక్రప్రాసాది అనేక ఆయుధాలను ప్రయోగించి విరోధులను వధించారు.

**మ. కృతవర్మక్షితినాయకుండు విశిఖశ్రేణిం బ్రమత్తార్యధి**
**శ్రిత వర్మంబులఁ జించి మేనుల శతచ్ఛిద్రంబులం జేయ న**
**ద్భుతకర్మం బని సైనికుల్ పొగడ శత్రుల్ దూలుచో సంగర**
**క్షితి ధర్మంబుఁ దలంచి కాచె రథికశ్రేష్ఠుండు భూమీశ్వరా! 865**

**ప్రతి :** భూమి+ఈశ్వరా!= భూపతివైన పరీక్షిన్మహారాజా!; రథికశ్రేష్ఠుండు= రథంనుండి యుద్ధంచేసే వారలలో ఉత్తముడయిన; కృతవర్మ క్షితినాయకుండు= కృతవర్మ అనే పేరుగల యాదవరాజు; విశిఖశ్రేణిన్= బాణాల సమూహాలచేత; ప్రమత్త+అరి= మిక్కిలిగా మదించిన శత్రువులచే; అధిశ్రిత= పొందబడిన (ధరింపబడిన); వర్మంబులన్= కవచాలను; చించి= భేదించి; మేనులన్= దేహాలను; శత+ఛిద్రంబులన్+చేయన్= నూరు (అనేక) రంధ్రాలుగా చేయగా; సైనికుల్= రెండువైపులాగల సైనికులు; అద్భుతకర్మంబు+అని= ఆ రీతిగా లెక్కలేనన్ని గాయాలతో శత్రువుల్ని హడలగొట్టడం ఆశ్చర్యకరమైన కార్యమని; పొగడన్= పొగడుతుంటే; శత్రులు= మదించిన విరోధివీరులు; తూలుచోన్= వణకుతూ పాటిపోతుండగా; సంగరక్షితి ధర్మంబున్= యుద్ధ భూమిలో అనుసరించదగిన న్యాయాన్ని; తలంచి= ఆలోచించి; కాచెన్= అటువంటి వారిని చంపకుండా కాపాడాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! రథికోత్తముడైన కృతవర్మభూపతి బాణాలచే శత్రువీరుల కవచాలను భేదించి వాళ్లశరీరాలను పెక్కుగాయాలు గావించి, ముక్కలు ముక్కలుగా నరికివేయసాగాడు. అది అద్భుతకృత్యమని శత్రుసైనికులు సైతం పొగడసాగారు. వారిలో కొందరు విరోధులు భయంచేత పారిపోతూవుండగా, యుద్ధధర్మాన్ని అవలంబించి కృతవర్మ వారిని చంపక విడిచిపెట్టాడు.

**వ. అ య్యవసరంబున సాల్వుండు గోపోద్దీపిత మానసుండై యుండ మాయావిడంబకంబైన సౌభకం బప్పుడు. 866**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; సాల్వుండు= సాల్వరాజు; కోప+ఉద్దీపితమానసుండు+ఐ= కోపంచేత అతిశయంగా వెలిగింపజేయబడిన మనస్సుగలవాడై; ఉండన్= ఉంటుండగా; మాయావిడంబకంబు+ఐన= మాయను అనుసరించే; సౌభకంబు= సౌభకమనెడి విమానం; అప్పుడు= సాల్వుడు కోపంతో ఉండగా...

**తా :** కృతవర్మ చేసిన తీవ్రమైన యుద్ధంవల్ల సాల్వునికి ఆగ్రహం కలిగింది. తదనుసారం ఆతడి సౌభకవిమానం మాయా ప్రభావంతో విజృంభించింది.

**సీ. ఒకమాటు నభమునఁ బ్రకటంబుగాఁ దోఁచు, నొకమాటు ధరణిపై నొయ్య నిలుచు**
**నొకమాటు శైలమస్తకమున వర్తించు నొకపరిఁ జరియించు నుదధినడుమ**
**నొక్క తోయంబున నొక్కటియై యుండు నొక్కెడఁ గనుఁగొనఁ బెక్కు లగును**
**నొకమాటు సాలసంయుక్తమై పొడసూపు నొకతోయ మన్నియు నుడిగి తోఁచు**

**ఆ. నొక్కతేప కొఱవి యుడుగక త్రిప్పిన, గతి మహోగ్రవృత్తిఁ గానవచ్చు**
**మఱియుఁ బెక్కు గతుల నరివరుల్ గలఁగంగఁ, దిరిగె సౌభకంబు ధీవరేణ్య! 867**

**ప్రతి :** ధీవరేణ్య!= బుద్ధిమంతులలో శ్రేష్ఠుడా! (పరీక్షిన్మహారాజా!); సౌభకంబు= సౌభక విమానం; ఒకమాటు= ఒక పర్యాయం; నభమునన్= ఆకాశంలో; ప్రకటంబు+కాన్= స్పష్టంగా; తోచున్= గోచరిస్తుంది; ఒకమాటు= మఱొక మాఱు; ధరణిపైన్= భూమిమీద; ఒయ్యన్+నిలుచున్= తిన్నగా నిలుస్తుంది; ఒకమాటు= ఇంకొక పర్యాయం; శైలమస్తకమునన్= కొండ శిఖరంపైన; వర్తించున్= ఉంటుంది; ఒకపరిన్= ఇంకొక వేళ; ఉదధినడుమన్= సముద్రం మధ్యలో; చరియించున్= తిరుగుతుంది; ఒక తోయంబునన్= ఒక తడవను; ఒక్కటి+ఐ+ఉండున్= ఒక్కటిగా ఉంటుంది; ఒక్క+ఎడన్= ఇంకొక సమయాన; కనున్+కొనన్= చూడగా; పెక్కులు+అగును= అనేకవిమానాలుగా ఏర్పడి గోచరిస్తుంది; ఒకమాటు= మఱియొక మారు; సాలసంయుక్తము+ఐ= కోటగోడతో కూడి ఉండేదై; పొడ+చూపున్= కనిపిస్తుంది; ఒక తోయము= ఇంకొకమాఱు; అన్నియున్+ఉడిగి= ఏమియు లేకుండగనే; తోచున్= గోచరిస్తుంది; ఒక్కతేప= ఒకానొక తడవ; కొఱవి= నిప్పు కొఱవిని; ఉడుగక= విరమింపక; త్రిప్పిన గతిన్= గుండ్రంగా త్రిప్పినట్లుగా; మహా+ఉగ్రవృత్తిన్= ఎంతో భయంకరమయిన విధంగా; కానవచ్చున్= కనబడుతుంది; అరివరుల్= వైరులైన యాదవులు; కలగన్+కన్= కలవరపడేటట్లుగా; మఱియున్= ఇంకను; పెక్కుగతులన్= అనేక విధాలైనసంచారాలతో; తిరిగెన్= తిరిగింది.

**తా :** పరీక్షిన్మహారాజా! ఆ సౌభకవిమానం తన మాయాబలంచేత ఒక పర్యాయం ఆకాశంలో కనపడుతుంది. ఒకమారు భూమిమీద నిలుస్తుంది. ఒకమారు కొండశిఖరంమీద వర్తిస్తుంది. ఒకసారి సముద్రమధ్యంలో విహరిస్తుంది. ఒకవేళలో ఒక్కటిగానూ, మరుక్షణంలో అనేక రూపాలుగానూ కనబడుతుంది. ఒకమారు చుట్టూ ప్రాకారంతో చూపట్టుతుంది. మరియొకమారు ఏమీ లేకుండగా కనిపిస్తుంది. ఒక మాటు గొప్పకొఱవిని గిరగిర త్రిప్పినట్లు భయంకరంగా దర్శనమిస్తుంది. ఈ విధంగా మాయావిమానం యాదవులు కలవరపడేలాగున అనేకవిధాలుగా తిరిగింది.

**వ. ఇ వ్విధంబున సౌభకంబు వర్తించుటం జేసి యదుసైన్యంబులచే దైన్యంబు నొందిన నిజసైన్యంబుల మరలం బురికొల్పి సాల్వుం డప్పుడు. 868**

**ప్రతి :** సౌభకంబు= సౌభకమనెడి మాయావిమానం; ఈ+విధంబునన్= ఈ రీతిగా; వర్తించుటన్+చేసి= తిరుగుతున్నందున; సాల్వుండు= సాల్వుడు; అప్పుడు= ఆ వేళలో; యదుసైన్యంబులచేన్= ద్వారకలోని యాదవుల సేనలచేత; దైన్యంబున్+ఒందిన= దీనత్వాన్ని పొందినట్టి; నిజసైన్యంబులన్= తన సేనలను; మరల= మళ్లీ; పురికొల్పి= యుద్ధానికి ప్రోత్సహించి...

**తా :** ఈ రీతిగా సౌభకవిమానం విజృంభించేసరికి, అంతవరకు యాదవుల సేనలవల్ల జాలినొందియున్న తన సైన్యాన్ని సాల్వభూపతి మళ్లీ యుద్ధానికి ప్రేరేపించి

**క. స్ఫురదనలాభశరంబులు, పొరిఁ బొరిఁ బుంఖానుపుంఖములుగా నేయం**
**దెరలియు మరలియు మురిసియు, విరిసియుఁ బిఱుతివక పోరె వెస యదుబలముల్. 869**

**ప్రతి :** స్ఫురత్+అనల+ఆభశరంబులు= ప్రకాశించే అగ్ని జ్వాలలవంటి బాణాలు; పొరిన్+పొరిన్= మాటిమాటికి (వరుసగా); పుంఖ= బాణము చివరి ఱెక్క; అనుపుంఖములుగాన్= పుంఖమును అనుసరించిన బాణాలుగా (ఒకబాణాన్ని అనుసరించి మఱొక బాణముగా ఎడతెగని విధంగా); ఏయన్= వేయగా; యదుబలముల్= యాదవులసైన్యాలు; తెరలియున్= వెనుకకు చలించియు; మరలియున్= మరల ముందుకు వచ్చియు; మురిసియున్= సంతోషంతో చేరియు; విరిసియున్= చెదరిపోయియు; పిరుతివక= వెనకంజవేయక; వెసన్= శీఘ్రంగా; పోరెన్= యుద్ధంచేశాయి.

**తా :** అప్పుడు సాల్వుడు ఎడతెగకుండా అగ్నిశిఖలలాంటి బాణాలను యాదవసైన్యంపై ప్రయోగించాడు. అయినప్పటికీ యాదవుల బలాలు వెనుకంజ వేయకుండా ధైర్యంతో యుద్ధం సాగించాయి.

**క. అయ్యెడ మానము వదలక, దయ్యక మగపాడితో దృఢంబుగఁ బోరన్**
**దయ్య మెఱుంగును నెక్కటి, కయ్యం బపు డయ్యెఁ బేరుగల యోధులకున్. 870**

**ప్రతి :** ఆ+ఎడన్= ఆ రీతిగా యుద్ధం కొనసాగుతున్న సందర్భంలో; మానము= రోషం; వదలక= విడువక; దయ్యక= అలసిపోవక; మగపాడితోన్= మగతనంతో; దృఢంబు+కన్= స్థిరంగా; పోరన్= పోరు చేస్తుండగా; పేరు+కల యోధులకున్= రెండువైపులా పేరెక్కిన పేరుమోసిన ప్రసిద్ధవీరులకు; అపుడు= అప్పుడు; ఎక్కటి కయ్యంబు= ఒకనితో ఒకడే పోరునట్టి యుద్ధం (ద్వంద్వయుద్ధము); అయ్యెన్= ఏర్పడ్డది; దయ్యము= దైవానికి; ఎఱుంగును= తెలుసు. (ఆ ద్వంద్వయుద్ధంయొక్క తీవ్రత ఆదైవాని కొక్కనికే తెలియును అనగా అంతటి హోరాహోరిగా సాగినదని అభిప్రాయం)

**తా :** ఆ సమయాన ఇరు పక్షాల యోధులూ అలసిపోకుండా పౌరుషంతో పోరాడసాగారు. అప్పుడు వాళ్లలో పేరుమోసిన యోధులమధ్య ద్వంద్వయుద్ధం ఆరంభమయింది.

**క. మును ప్రద్యుమ్న కుమారుని, ఘననిశితాస్త్రములచేతఁ గడు నొచ్చిన సా**
**ల్వుని మంతిరి ద్యుమనాముఁడు, సునిశిత గదచే నమర్చి సుమహితశక్తిన్. 871**

**ప్రతి :** మును= మునుపు (యుద్ధప్రారంభంలో); ప్రద్యుమ్న కుమారుని= శ్రీకృష్ణుని కొమరుడైన ప్రద్యుమ్నునియొక్క; ఘన= గొప్పవియైన; నిశిత+అస్త్రములచేతన్= వాడిగల బాణాలచేత; కడునొచ్చిన= మిగుల బాధను పొందినట్టి; సాల్వుని మంతిరి= సాల్వుని మంత్రి; ద్యుమనాముడు= 'ద్యుముడు' - అను పేరుగలవాడు; చేన్= చేతియందు; సునిశితగదన్= మిగులవాడిగల గదను; అమర్చి= చక్కగా ధరించి; సుమహిత శక్తిన్= ఎంతో అధికమైన బలంతో...

**తా :** యుద్ధ ఆరంభమైన సమయంలో ప్రద్యుమ్నుడి బాణజాలంచేత బాధింపబడిన ద్యుమడనే పేరుగల సాల్వుని మంత్రి గొప్పగదను ధరించి అధికమైన బలంతో (ప్రద్యుమ్న కుమారుణ్ణి ఎదుర్కొన్నాడు)

**చ. వెరవును లావుఁ జేవయును వీరముఁ బీరము గల్గి డాసి యా**
**సరసిజనాభనందను విశాలభుజాంతరముం బగిల్చినన్**
**విరవిరవోయి మేను నిడువెంద్రుక వెట్టఁగఁ జేతిఁ సాధనో**
**త్కరములు దేరిపై వదలి కన్నులు మూయుచు మూర్ఛనొందినన్. 872**

**ప్రతి :** వెరవును= ఉపాయం; లావున్= బలము; చేవయును= అంతశ్శక్తియును; వీరము= పరాక్రమాన్ని; బీరము= గర్వం; కల్గి= ఇవియన్నియు కలవాడై; డాసి= సమీపించి; సరసిజనాభనందను= శ్రీకృష్ణుని తనయుడైన ప్రద్యుమ్నునియొక్క; విశాల= వెడల్పైన; భుజ+అంతరమున్= రెండు భుజాల మధ్యభాగాన్ని (వక్షఃస్థలాన్ని); పగిల్చినన్= పగిలేటట్లుగా (గదతో) కొట్టగా; విరవిర+పోయి= విలవిలలాడుతు పరవశత నొంది; మేను= దేహం; నిడువెంద్రుక+పెట్టగ= గగుర్పాటు కలుగగా; చేతి= చేతిలోని; సాధన+ఉత్కరములు= యుద్ధానికి సంబంధించిన శస్త్ర అస్త్రాల సముదాయం; తేరిపైన్= రథం మీద; వదలి= జారవిడిచి; కన్నులు మూయుచున్= కన్నుల్ని మూసుకొంటూ; మూర్ఛన్+ఒందినన్= మూర్ఛిల్లగా...

**తా :** నైపుణ్యం, పరాక్రమం, గర్వం వెల్లడి అవుతుండగా ద్యుముడు ప్రద్యుమ్నుణ్ణి సమీపించి వక్షఃస్థలం పగిలేటట్లు గదతో కొట్టినాడు. ఆ దెబ్బతో అతడు విలవిలలాడిపోయి, మేనెల్ల గగుర్పాటు నొందగా, చేతిలోని ఆయుధాల్ని జారవిడిచి, కనులు మూడలుపడగా, రథంమీద మూర్ఛపోయాడు.

**ఆ. సమరధర్మవేది సమధికనయవాది, దారుకునిసుతుండు ధైర్యయుతుఁడు**
**రథముఁ దోలికొనుచు రణభూమి వెడలి వే, చనియె మూర్ఛదేఱి శంబరారి. 873**

**ప్రతి :** సమరధర్మవేది= యుద్ధ ధర్మాన్ని తెలిసినవాడు; సమ్+అధిక నయవాది= నీతి శాస్త్రంలో మిగుల నేర్పుగలవాడు; ధైర్యయుతుఁడు= ధైర్యంగలవాడు; దారుకుని సుతుండు= శ్రీకృష్ణుని రథసారథియయిన దారుకుని కొడుకు; రథమున్= ప్రద్యుమ్నుడు ఉండే తేరును; తోలికొనుచు= తోలుకొని పోవుచూ; వే= వేగముగా; రణభూమి వెడలి= యుద్ధభూమినుండి వెలికి వచ్చి; చనియెన్= వెళ్లినాడు; శంబర+అరి= శంబరుడనే రక్కసునికి శత్రువు (మన్మథుడు– అనగా ప్రద్యుమ్నుడు); మూర్ఛ+తేఱి= మూర్ఛనుండి తేరుకొని...

**తా :** యుద్ధధర్మం చక్కగా తెలిసినవాడు, నీతి కోవిదుడు, ధైర్యశాలి అయిన దారుకతనయుడు ప్రద్యుమ్నుని రథాన్ని యుద్ధరంగంనుండి వేగంగా ప్రక్కకు తోలుకొని వెళ్లాడు. అంతలో ప్రద్యుమ్నుడు మూర్ఛనుండి తేఱుకొనినాడు.

**విశే :** సనత్కుమారుని అంశతో రుక్మిణీ కృష్ణులకు జన్మించిన తనయుడు ప్రద్యుమ్నుడు. ఇతడు పూర్వజన్మంలో మన్మథుడు. ప్రద్యుమ్నుడు శంబరుడనే రాక్షసుణ్ణి సంహరించడంచేత ఈతనికి 'శంబరారి' అను పేరు ఏర్పడింది.

**ఉ. సారథిఁ జూచి యిట్లనియె శాత్రవవీరులు సూచి నవ్వఁగాఁ**
**దేరు రణక్షితిన్ వెడలఁ దెచ్చితి తెచ్చితి దుర్యశంబు పం**
**కేరుహనాభుఁడున్ హలియు గేలికొనన్ యదువంశసంభవుల్**
**బీరము దప్పి యిప్పగిదిఁ బెల్కుఱి పోవుదురే రణంబునన్. 874**

**ప్రతి :** సారథిన్+చూచి= తన రథాన్ని దోలే దారుకునియొక్క కుమారుణ్ణి చూచి; ఇట్లు+అనియెన్= ప్రద్యుమ్నుడు ఈ రీతిగా పల్కినాడు; శాత్రవవీరులు= శత్రుపక్షమందలి వీరులు; చూచి= చూచి; నవ్వన్+కాన్= నవ్వుతుండగా; తేరు= నా రథాన్ని; రణక్షితిన్= యుద్ధభూమినుండి; వెడలన్= తొలగునట్లుగా; తెచ్చితి(వి)= తీసుకొని వచ్చినావు; దుర్+యశంబు= (నాకు) చెడుకీర్తిని; తెచ్చితి(వి)= తెచ్చిపెట్టినావు; పంకేరుహనాభుడున్= నాభియందు పద్మముగలవాడును (శ్రీకృష్ణుడును); హలియున్= హలము (నాగలి) ఆయుధంగా గలవాడును (బలరాముడును); గేలి+కొనన్= పరిహాసము చేయునట్లుగా; యదువంశసంభవుల్= ప్రసిద్ధమైనయాదవవంశంలో జననమందినవారు; బీరము+తప్పి= శౌర్యమును కోల్పోయి; ఈ+పగిదిన్= ఈ రీతిగా; రణంబునన్= యుద్ధంలో; పెల్కుఱి= భీతిచేత కలవరపడి; పోవుదురు+ఏ?= పోవుదురా? (పోవరుకదా!)

**తా :** మూర్ఛనుండి తేరుకొనిన ప్రద్యుమ్నుడు సారథిని మందలించినాడు. 'శత్రువీరులు నవ్వుకొనేటట్లుగా, శ్రీకృష్ణుడు, బలరాముడు ఎగతాళిచేసేటట్లుగా యుద్ధభూమినుండి నా రథాన్ని ప్రక్కకు తప్పించి అపకీర్తి తెచ్చావు. యదువంశంలో జన్మించిన వీరవరులు శౌర్యాన్ని విడనాడి, ఈ విధంగా యుద్ధరంగంనుండి ఎన్నటికీ తొలగిపోరు.'

**వ. అనిన నతం డతని కిట్లనియె. 875**

**ప్రతి :** అనినన్= అని ప్రద్యుమ్నుడు పల్కగా; అతండు= ఆ సారథి; అతనికిన్= ఆప్రద్యుమ్నకుమారునికి; ఇట్లు+అనియెన్= చెప్పబోవు రీతిని పల్కినాడు.

**తా :** ప్రద్యుమ్నుడు పై విధంగా సారథిని మందలించగా, సారథి రథియైన ప్రద్యుమ్నకుమారునితో ఇలా పల్కినాడు.

**క. 'రథి రిపుచే నొచ్చిన సా, రథియును సారథియు నొవ్వ రథియును గావం**
**బృథుసమరధర్మ; మిఁక న, వ్యథచిత్తుఁడ వగుచుఁ గడఁగు వైరుల గెలువన్'. 876**

**ప్రతి :** రథి= రథికుడు (రథంపై నుండి యుద్ధం చేసేవాడు); రిపుచేన్= శత్రువుచేత; నొచ్చినన్= బాధను పొందినచో; సారథియును= రథాన్ని నడిపేవాడూ; సారథియున్= ఆ సారథియే; నొవ్వన్= యుద్ధంలో బాధనొందినయెడల; రథియును= రథికుడును; కావన్= కాపాడుట; పృథు= గొప్పదైన; సమరధర్మము= యుద్ధధర్మం; ఇఁకన్= ఇకమీదట; న+వ్యథచిత్తుడవు+ అగుచున్= విచారానికి లోనుగానటువంటి మనస్సు గలవాడవై; వైరులన్= విరోధులను; గెలువన్= జయించడం కోసం; కడగు(ము)= ఉత్సాహంతో ప్రయత్నించు.

**తా :** శత్రువులచేత రథికుడు బాధింపబడినపుడు సారథీ, సారథి దెబ్బతిన్నప్పుడు రథికుడూ సమయానుకూలంగా పరస్పరం సంరక్షించుకోవటం గొప్పదైనయుద్ధధర్మం. కాబట్టి, నేను రథాన్ని ప్రక్కకు మరలించినాను అందుకు నీవు చింతింపక, శత్రువుల్ని జయించడానికి ప్రయత్నించు.

**వ. అనిన విని. 877**

**ప్రతి :** అనినన్= సారథి అట్లు పల్కగా; విని= ప్రద్యుమ్నుడు విన్నవాడై...

**తా :** సమరధర్మాన్నిగూర్చి సారథి ఆవిధంగా వివరించగా వినిన రథి (ప్రద్యుమ్నకుమారుడు) సంతోషించాడు.

**ఉ. సంచితభూరిబాహుబలశౌర్యుఁడు సారథిమాట కాత్మ మో**
**దించి యుదాత్తకాండరుచిదీపితచాపముఁ దాల్చి మౌర్వి సా**
**రించి గుణధ్వనిన్ బృహదరిప్రకరంబుల భీతి ముంచి తో**
**లించె రథంబు మేదిని చలింపఁగ నా ద్యుముమీఁద నేర్పునన్. 878**

**ప్రతి :** సంచిత= సమకూడియున్న; భూరి= గొప్పదైన; బాహుబల= భుజశక్తితో గూడిన; శౌర్యుడు= పరాక్రమం గలవాడు (ప్రద్యుమ్నుడు); సారథిమాటకున్= యుద్ధ ధర్మాన్ని గురించి సారథి చెప్పిన వాక్యానికి; ఆత్మన్= మనస్సునందు; మోదించి= సంతసించి; ఉదాత్తకాండ= శ్రేష్ఠాలైన బాణాలయొక్క; రుచి= కాంతులచే; దీపిత= ప్రకాశింపజేయబడునట్టి; చాపమున్= వింటిని; తాల్చి= ధరించి; గుణధ్వనిన్= వింటిని ఎక్కుపెట్టి, అల్లెత్రాటిని లాగినందున కలిగిన శబ్దంచేత; బృహత్+ అరిప్రకరంబులన్= గొప్పగొప్ప శత్రువుల సమూహాలను; భీతిన్= భయంలో; ముంచి= మునుగునట్లు చేసి; మేదిని= భూమి; చలింపన్+కన్= కదలునట్లుగా; రథంబున్= తన తేరును; నేర్పునన్= నేర్పుతో; ఆ ద్యుముమీదన్= సాల్వుని మంత్రియగు ద్యుమునిపైకి; తోలించెన్= వేగంగా నడిపించినాడు.

**తా :** గొప్పగా భుజబలం సమకూడిన వీరుడైన ప్రద్యుమ్నుడు సారథిపలికిన సమరనీతి వాక్యాలకు సంతోషించాడు. వెంటనే విల్లెక్కుపెట్టి, ధనుష్టంకారంతో శత్రుసమూహాలను భయభ్రాంతుల్ని చేస్తూ, ద్యుమునిపైకి తన రథాన్ని నేర్పుతో వేగంగా తోలించాడు.

**వ. అట్లు డగ్గఱి.** **879**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; డగ్గఱి= సమీపించి...

**తా :** ఆ రీతిగా నిపుణతతో రథముమీద వేగంగా ద్యుముణ్ణి సమీపించినవాడై

**చ. అరితను వష్టబాణముల నాగ్రహవృత్తిఁ బగిల్చి నాల్గిటం**
**దురగములన్ వధించి యొకతూపున సారథిఁ ద్రుంచి రెంట ని**
**ష్ఠురతర కేతుచాపములు చూర్ణముచేసి యొకమ్మునన్ భయం**
**కరముగఁ ద్రుంచె నా ద్యుమునికంఠ మకుంఠిత విక్రమోద్ధతిన్.** **880**

**ప్రతి :** అరి తనువు= శత్రువుయొక్క (ద్యుమునియొక్క) శరీరాన్ని; ఆగ్రహవృత్తిన్= తీవ్రమైన కోపంతో; అష్టబాణములన్= ఎనిమిది బాణాలతో; పగిల్చి= పగిలిపోయేటట్లుగా గాయపఱచి; సారథిన్= ద్యుమునియొక్క రథసారథిని; ఒక తూపునన్= ఒకేయొక బాణంచేత; త్రుంచి= తుంటలు కావించి; తురగములన్= (ఆతని రథానికి కట్టిన) గుఱ్ఱాలను; వధించి= చంపి; నిష్ఠురతర= మిక్కిలి కఠినాలైయున్న; కేతు+చాపములు= పతాకాన్ని, వింటిని; రెంటన్= రెండు బాణాలచే; చూర్ణము చేసి= పొడిపొడి చేసి; ఆ ద్యుముని కంఠము= ఆ ద్యుముడనే మంత్రియొక్క కంఠాన్ని; న+కుంఠిత= మొక్కవోనట్టి; విక్రమ= శౌర్యంయొక్క; ఉద్ధతిన్= అతిశయంచేత; ఒక+అమ్మునన్= ఒకే యొక బాణంచేత; భయంకరముగన్= (చూపరులకు) భయం కలిగేటట్లుగా; త్రుంచెన్= ఖండించి వేశాడు.

**తా :** ప్రద్యుమ్నుడు రథంమీద ద్యుముణ్ణి సమీపించినాడు. రోషంతోగూడిన శౌర్యంతో వానిశరీరాన్ని గాయాలపాలు గావించాడు. నాలుగు బాణాలతో (నాలుగు) గుఱ్ఱాలను, ఒకబాణంచేత సారథిని సంహరించాడు. రెండమ్ములచే పతాకాన్ని, ధనుస్సును పొడిపొడి కావించాడు. చివరగా ఒకేయొక పదునైనబాణంతో ద్యుముని కంఠాన్ని ఖండించాడు.

**మ. కని సాంబ ప్రముఖాదియోధవరు లుత్కంఠాత్ములై మీన కే**
**తను నగ్గించి సువర్ణపుంఖనిశితాస్త్రశ్రేణి సంధించి సా**
**ల్వుని సైన్యావలిమస్తముల్ వెరవు లావున్ మీఱఁగా నొక్క యె**
**త్తున వే త్రుంచిరి తాటిపండ్లు ధరఁ దోడ్తో రాల్చు చందంబునన్.** **881**

**ప్రతి :** సాంబప్రముఖ+ఆది= ప్రసిద్ధుడైన సాంబుడు మొదలుగాగల; యోధవరులు= వీరశ్రేష్ఠులు; కని= ప్రద్యుమ్నుని పరాక్రమ కృత్యాన్ని తిలకించి; ఉత్కంఠ+ఆత్ములు+ఐ= కుతూహలంతో గూడిన మనస్సులుగలవారై; మీనకేతనున్= చేపగుర్తు జెండాపై గలవాణ్ణి, (ప్రద్యుమ్నుని); అగ్గించి= ప్రశంసించి; సువర్ణపుంఖ= బంగారు ఱెక్కలు గల; నిశిత+అస్త్రశ్రేణిన్= మిక్కిలివాడియైన; మంత్రపూర్వకమైనబాణాల వరుసను; సంధించి= వింటిపై ఎక్కుపెట్టి; వెరవు= నైపుణ్యం; లావున్= బలం; మీఱన్+కాన్= అతిశయింపగా; సాల్వుని= సాల్వునియొక్క; సైన్య+ఆవలి= సైనికుల సమూహాలయొక్క; మస్తముల్=

తలలను; తాటిపండ్లు= తాటి చెట్లకుండే పండ్లను; తోడ్తోన్= వెంటవెంటగా; ధరన్= భూమిపైన; రాల్చు చందంబునన్= రాల్చురీతిగా; ఒక్క+ఎత్తునన్= ఒక్కుమ్మడిగా; వే+త్రుంచిరి= వేగంగా ఖండించి వేశాడు.

**తా :** ప్రద్యుమ్నుని వీరవిజృంభణం చూచి, సాంబుడు మొదలయిన యోధవర్యులు ప్రద్యుమ్నుణ్ణి ఎంతో కొనియాడి, పదునైన బాణజాలంతో తాటిపండ్లను నేలమీద ఒక్కుమ్మడిగా రాల్చిన విధంగా సాల్వుని సైనికుల శిరస్సులను వేగంగా ఖండించి వేశాడు.

**వ. అట్టి యెడ. 882**

**ప్రతి :** అట్టి+ఎడన్= అటువంటి సమయంలో...

**తా :** ఆ విధంగా సాంబుడు మొదలైన యోధవరులు సాల్వునిసేనలను సంహరించిన వేళయందు

స్రగ్ధర

**కూలున్ గుఱ్ఱంబు లేనుంగులు ధరఁ గెడయున్ గుప్పలై; నుగ్గునూచై**
**వ్రాలున్ దేరుల్; హతంబై వడిఁబడు సుభటవ్రాతముల్; శోణితంబుల్**
**గ్రోలున్, మాంసంబు నంజుం గొఱకు, నెముకలన్ గుంపులై సోలుచున్ బే**
**తాలక్రవ్యాదభూతోత్కరములు; జతలై తాళముల్ దట్టి యాడున్. 883**

**ప్రతి :** గుఱ్ఱములు= గుర్రాలు; కూలున్= కూలిపడ్డాయి; ఏనుంగులు= ఏనుగులు; ధరన్= భూమిమీద; కుప్పలు+ఐ= ప్రోగులై; కెడయున్= ఒరిగిపడ్డాయి; తేరుల్= రథాలు; నుగ్గునూచ+ఐ= పొడిపొడియయి; వ్రాలున్= పడిపోయాయి; సుభటవ్రాతముల్= మంచి సైనికుల గుంపులు; హతంబు+ఐ= చంపబడ్డవై; వడిన్= వేగంగా; పడున్= పడినాయి; బేతాళ= పిశాచాలయొక్క; క్రవ్యాద= రాక్షసులయొక్క; భూత= దయ్యాలయొక్క; ఉత్కరములు= గుంపులు; శోణితంబుల్+క్రోలున్= రక్తాన్ని త్రావదొడిగినాయి; మాంసంబు= మాంసాలను; నంజున్= ఆసక్తితో నంచుకొంటున్నాయి; గుంపులు+ఐ= గుంపులుగా కూడి; సోలుచున్= విలాసంగా వాలుచున్నవై; ఎముకలన్= ఎముకలను; కొఱకున్= కొఱుకుతున్నాయి; జతలు+ఐ= జతలు జతలుగా ఏర్పడినట్టివై; తాళముల్+తట్టి+ఆడున్= చేతులతో లయానుకూలంగా చప్పట్లు తట్టుతూ ఆడుతున్నాయి.

**తా :** సాల్వుని సేనలకు, యాదవసైన్యాలకూ జరిగిన ఆ భీకరసంగ్రామంలో గుర్రాలు కూలిపడినాయి. ఏనుగులు కుప్పలుగా భూమిపై పడిపోయాయి. రథాలు పొడిపొడి అయిపోయాయి. భటులు నేలపై పడిపోయారు. ఆ సమయంలో భూతాలు, రక్కసులు, పిశాచాలు గుంపులై ఆనందంతో రక్తపానం చేస్తూ, మాంసాలను నంజుకొంటూ, ఎముకలు కొరుకుతూ, జతలుగా కూడి చప్పట్లు తట్టుతూ మైమరచి నాట్యం చెయ్యసాగాయి.

**విశే :** ఇది స్రగ్ధర అనే వృత్తం. స్రగ్ధరలో ప్రతిపాదంలో **మరభనయయయ** – అనే గణాలు ఉంటాయి. ప్రతిచరణంలో 8, 15 అక్షరములు యతిమైత్రి స్థానాలు. ప్రాసనియమం ఉంటుంది.

**వ. మఱియు నొక్కయెడ. 884**

**ప్రతి :** మఱియున్= అంతేగాక; ఒక్క+ఎడన్= ఇంకొకవైపున...

**తా :** ఆ యుద్ధరంగంలో మఱోవైపున

**సీ.** **ఖండితశుండాలగండముల్ నక్రముల్; భూరితుండంబులు భుజగసమితి;**
**పదతలంబులు గచ్ఛపంబులు; దంతముల్ శక్తులు; గుంభనిర్ముక్తమౌక్తి**
**కములు రత్నములు; వాలములు జలూకముల్; మెడలు భేకంబులు; మెదడు రొంపి;**
**ప్రేవులు పవడంపుఁ దీవెలు; నరములు నాఁచు; మజ్జంబు ఫేనంబు; లస్థి**

**ఆ.** **సైకతములు; రక్తచయము తోయంబులు;, నొరగు నెడల నొరలు మొఱలు ఘన త**
**రంగరవముగా మతంగజాయోధన, స్థలము జలధిఁ బోల్పఁ దగె నరేంద్ర!** **885**

**ప్రతి :** నర+ఇంద్ర!= ఓ రాజా!; ఖండిత= నఱకివేయబడిన; శుండాల గండముల్= ఏనుగుల చెక్కిళ్ల ప్రదేశాలు; నక్రముల్= మొసళ్లు; భూరితుండంబులు= మిగుల పొడుగాటి తొండాలు; భుజగసమితి= సర్పాల సముదాయాలు; పదతలంబులు= ఏనుగుల అరికాళ్లు; కచ్ఛపంబులు= తాబేళ్లు; దంతముల్= ఏనుగుల దంతాలు; శుక్తులు= ముత్యపు చిప్పలు; కుంభనిర్ముక్త= ఏనుగుల కుంభస్థలాలనుండి వెలువడ్డటువంటి; మౌక్తికములు= ముత్యాలు; వాలములు= ఏనుగుల శరీరానికిగల తోకలు; జలూకముల్= జలగలు; మెడలు= ఏనుగుల మెడల భాగాలు; భేకంబులు= కప్పలు; మెదడు= ఏనుగుల మెదడులు; రొంపి= బురద; ప్రేవులు= ఏనుగులప్రేగులు; పవడము+తీవలు= సముద్రమందలి పగడపుతీగలు; నరములు= ఏనుగుల శరీరంలోని నరాలు; నాచు= సముద్రపుపాచి; మజ్జంబు= ఏనుగుల యెముకల మధ్య ఉండే సారం; ఫేనంబు= సముద్రమందలి నురుగులు; అస్థి= ఏనుగుల (పొడిపొడియైన) యెముకలు; సైకతములు= ఇసుక తిన్నెలు; రక్తచయము= నెత్తుటి సమూహాలు; తోయంబులు= సముద్రమందలి నీళ్లు; ఒరగు+ఎడలన్= పడిపోయే సమయంలో; ఒరలు= వెలువడునట్టి; మొఱలు= బాధను వ్యక్తం చేసే ధ్వనులు; ఘన తరంగరవము+కాన్= గొప్పగొప్ప సముద్రపు టలల హోరుమనే శబ్దంగా; మతంగజ+ఆయోధనస్థలము= గజసేనలు ఉండే యుద్ధభూమి; జలధిన్= సముద్రాన్ని; పోల్పన్+తగెన్= సరిపోల్పదగియుండినది.

**తా :** ఆ యుద్ధరంగంలోని గజసైన్యాలుండే ప్రదేశం ఒక సముద్రంలాగా గోచరిస్తూ ఉన్నది. ఖండించబడ్డ ఏనుగుల గండభాగాలే మొసళ్లు, పొడవైన తొండాలే సర్పాల సమూహాలు, ఏనుగుల అరికాళ్లే తాబేళ్లు, ఏనుగుల దంతాలే ముత్యపు చిప్పలు. కుంభస్థలాలనుండి జారిపడిన ముత్యాలే సముద్రమందలి రత్నాలు. ఏనుగుల తెగిపడ్డతోకలే జలగలు; విడివడిన ఏనుగులమెడలభాగాలే కప్పలు; ఏనుగులమెదడుసమూహం సముద్రంలోని బురద. ఏనుగుల శరీరాలనుండి బయల్పడిన (రక్తంతో తడిసి యెఱ్ఱబడిన) ప్రేవులే సముద్రమందలి పవడపు తీగలు. ఏనుగుల శరీరాలనుండి వెలువడిన నరాలే సముద్రపు పాచి తీగలు. ఎముకల నడుమ నుండు మూలుగే నురుగుల గుంపులు. పొడిపొడియైన ఎముకలే ఇసుక దిబ్బలు; ఏనుగుల శరీరాలనుండి పారిన రక్తసమూహములే సముద్రజలములు. ఏనుగులు ఒరిగి పడుచూ కావించిన ఆర్తనాదాలే సముద్రతరంగాలు గొప్ప ధ్వనులు. ఈ రీతిగా ఆ యుద్ధభూమి ప్రాంతం సముద్రంతో సరిపోలినదై గోచరించింది.

**వ.** **ఇ వ్విధంబున యదుసాల్వబలంబులు చలంబునఁ బరస్పరజయకాంక్షలం దలపడి పోరు పూర్వ పశ్చిమసముద్రంబులవడువున నిరువదియేడుదినంబు లతిఘోరంబుగాఁ బోరునెడ నింద్రప్రస్థ పురంబునుండి ద్వారకానగరంబునకు నగధరుండు సనుదేర ముందటం గానవచ్చు దుర్నిమిత్తంబులం గనుంగొని కృష్ణుండు దారుకునిం జూచి యిట్లనియె.** **886**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా (పైన వర్ణించిన ప్రకారంగా); యదు సాల్వబలంబులు= యాదవులయొక్క, సాల్వునియొక్క సైన్యాలు; చలంబునన్= పట్టుదలతో; పరస్పర జయకాంక్షలన్= ఒకరినొకరు జయించాలనే కోరికలతో; తలపడి= ఎదుర్కొని; పోరు= పోరాడుచున్న; పూర్వ పశ్చిమసముద్రంబుల వడువునన్= తూర్పు, పడమర సముద్రాలలాగా; ఇరు+పది+ఏడు దినంబులు= ఇరువదియేడురోజులు; అతిఘోరంబు+కాన్= చాలా భయంకరంగా; పోరు+ఎడన్= యుద్ధం చేస్తూవుండగా; నగధరుండు= శ్రీకృష్ణుడు; ఇంద్రప్రస్థపురంబునుండి= పాండవ రాజధానియగు ఇంద్రప్రస్థమనెడి నగరంనుండి; చనుదేరన్= వస్తుండగా; ముందటన్= ఎదుటి భాగాన; కానవచ్చు= కానిపించుచున్న; దుర్+నిమిత్తంబులన్= చెడు శకునాలను; కనున్+కొని= చూచి; కృష్ణుడు= శ్రీకృష్ణుడు; దారుకునిన్+చూచి= తన రథసారథియైన దారుకుణ్ణి వీక్షించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికినాడు.

**తా :** ఈ విధంగా యాదవులసేనలు, సాల్వుని సేనలు ఒకరినిమఱొకరు జయించాలనే పట్టుదలతో గూడిన కోరికతో తూర్పుపడమరసముద్రాలు పోరాడినట్లు ఇరువదేడు దినాలు అతిభీకరరీతిని యుద్ధంచేశాయి. ఆ సమయంలో ఇంద్రప్రస్థ పురినుండి ద్వారకకు వస్తూ మధ్యమార్గంలో కానవచ్చిన అపశకునాలను పరికించి, శ్రీకృష్ణుడు సారథియైన దారుకునితో ఇలా అన్నాడు.

**శా. కంటే దారుక! దుర్నిమిత్తము లనేకంబుల్ మహాభీలముల్**
**మింటన్ మేదినిఁ దోఁచుచున్న యవి; నెమ్మిన్ ఖాండవప్రస్థ మే**
**నుంటం జైద్యహితక్షితీశ్వరులు మాయోపాయులై మత్పురి**
**న్గెంటింపం జనుదేరఁ బోలుదురు; పోనీ తేరు వేగంబునన్. 887**

**ప్రతి :** దారుక!= సారథియైన దారుకా!; మహా+ఆభీలముల్= మిగుల భయంకరాలైనట్టివి; న+ఏకంబుల్= పెక్కులు; దుర్+నిమిత్తములు= చెడ్డవైనశకునాలు; మింటన్= ఆకాశంలో; మేదినిన్= భూమిమీదను; తోచుచున్+ఉన్న+అవి= గోచరిస్తూ ఉన్నాయి; ఏను= నేను; నెమ్మిన్= ప్రీతితో (నెమ్మదితో-ప్రశాంతతతో); ఖాండవప్రస్థము= ఇంద్ర ప్రస్థనగరంలో; ఉంటన్= ఉన్నందువల్ల; చైద్యహిత= చేదిదేశపురాజైన శిశుపాలునికి మిత్రులయినట్టి; క్షితి+ఈశ్వరులు= భూనాథులు (రాజులు); మాయా+ఉపాయులు+ఐ= కపటంతోగూడిన ఉపాయాలు ఆలోచించినవారై; మత్+పురిన్= నా పట్టణాన్ని (ద్వారకను); గెంటింపన్= పాడుచేయడానికోసం; చను+తేరన్+పోలుదురు= వచ్చి ఉంటారని తోస్తున్నది; తేరు= రథాన్ని; వేగంబునన్= త్వరగా; పోనీ= పోనిమ్ము!

**తా :** 'చూచావా! దారుకా! ఆకాశంలోనూ, భూమిమీదా మహాభయంకరంగా అపశకునాలు గోచరిస్తున్నాయి. నేను ఇంద్రప్రస్థపురిలో కుదురుగా ఉంటూ ఉండగా గమనించి, శిశుపాలుని స్నేహితులైన రాజులు కొందరు నా పట్టణాన్ని నశింపజేసే కపటోపాయంతో దండెత్తి వచ్చిన్నట్లు తోస్తున్నది. రథాన్ని వేగంగా పోనీ!

**వ. అని యతిత్వరితగతిం జనుదెంచి తత్పురంబు డగ్గఱి మహాబలపరాక్రమంబులం బ్రతిపక్ష బలంబులతోడం దలపడి పోరు యదుబలంబులును నభోవీథి నభేద్యమాయావిడంబనంబునం బ్రతివీరు లెంతకాలంబునకు నే యుపాయంబునను సాధింప నలవిగాని సౌభకవిమానంబునం దున్న సాల్వునిం గని తద్విమానంబు డాయం దన తేరు దోల సారథిని నియమించి కదియం జను మురాంతకుని వీక్షించి**

**యదుసైనిక ప్రకరంబులు పరమానందంబునం బొందిరి; మృతప్రాయంబులై యున్న సైన్యంబులం గనుగొని సౌభకపతివిక్రమక్రియాకలాపుం డగుచు నురవడించి. 888**

**ప్రతి :** అని= అని సారథితో పల్కి; అతిత్వరితగతిన్= మిక్కిలి వేగంతోకూడిన గమనంతో; చను+తెంచి= వచ్చి; తత్+పురంబు= ఆ ద్వారకానగరాన్ని; డగ్గఱి= సమీపించి; మహాబల= గొప్పదైన బలంతోనూ; పరాక్రమంబులన్= శౌర్యంతోనూ; ప్రతిపక్షబలంబులతోడన్= ఎదుటి పక్షంవాడైన సాల్వుని సైన్యాలతో; తలపడి పోరు= డీకొని యుద్ధం చేస్తున్న; యదుబలంబులను= యాదవ సేనల్ని; నభస్+వీథిన్= ఆకాశమార్గాన; న+భేద్య= భేదింప వీలుపడని (ఓడింపవీలు కాని); మాయావిడంబనంబునన్= కపటంతో ఉపద్రవం కల్గిస్తుండుటచేత; ప్రతివీరులు= ఎదుటిపక్షంలోని వీరులు; ఎంత కాలంబునకున్= ఎంత కాలానికైనా (ఎన్నాళ్లకైనను); ఏ+ఉపాయంబునను= ఎటువంటి గొప్ప ఉపాయంచేతకూడా; సాధింపన్+అలవికాని= లోబరచుకోవడానికి శక్యం కానట్టి; సౌభక విమానంబు+అందున్+ఉన్న= సౌభకమనే మాయాశక్తిమయమైన విమానంలో ఉన్నటువంటి; సాల్వునిన్= సాల్వుణ్ణి; కని= చూచి; తద్+విమానంబు= ఆ విమానాన్ని; డాయన్= సమీపించే విధంగా; తన తేరు= తన రథమును; తోలన్= నడుపునట్లుగా; సారథిని= తన సారథియగుదారుకుణ్ణి; నియమించి= ఆజ్ఞాపించి; కదియన్+చను= ఆ రీతిగా సాల్వునివిమానాన్ని సమీపించేవిధంగా ఉన్న; ముర+అంతకుని= మురుడను రక్కసుని సంహరించిన శ్రీకృష్ణుణ్ణి; వీక్షించి= చూచి; యదుసైనికప్రకరంబులు= యాదవులసైనికసమూహాలు; పరమ+ఆనందంబునన్+పొందిరి= గొప్ప సంతోషాన్ని పొందారు; సౌభకపతి= సౌభకమనెడి విమానానికి అధిపతియైన సాల్వుడు; మృతప్రాయంబులు+ఐ+ఉన్న= (తగినంత బలములేనందున) దాదాపు చనిపోయిన వారిలాగా కన్పిస్తూన్న; సైన్యంబులన్= తన సేనలను; కనున్+కొని= చూచి; విక్రమక్రియా కలాపుండు+అగుచున్= పరాక్రమాన్ని ప్రదర్శించాలనే క్రియలు గలవాడై; ఉరవడించి= వేగిరపడి విజృంభించి...

**తా :** అలాగ శ్రీకృష్ణుడు ఆజ్ఞాపించగానే దారుకుడు అతిత్వరగా తేరును పోనిచ్చాడు. ద్వారకను సమీపించిన వాసుదేవుడు శత్రుసేనలతో తలపడి యుద్ధంచేస్తున్న యాదవ సైన్యాలను, ఆకాశమార్గంలో మాయాప్రభావంతో మోసగిస్తూ యదువీరులకు సాధ్యంకాకుండా ఉన్న సౌభకవిమానాన్నీ, అందులోవున్న సాల్వుణ్ణీ చూచాడు. వాని సమీపానికి రథాన్ని తోలించాడు. శ్రీకృష్ణుణ్ణి వీక్షింపగానే యాదవసేనలు పరమానందం పొందాయి. చైతన్యం కోల్పోయి, దైన్యంతో ఉన్న తన సైన్యాన్ని పరికించి, సాల్వుడు పూనికతో విజృంభించాడు.

**చ. మిడుఁగుఱు లెల్లెడం జెదర; మింటను మంటలు పర్వ; ఘంటికా**
**ఘణఘణ భూరినిస్వననికాయమునన్ హరిదంతరాళముల్**
**వణఁక; మహోగ్రశక్తిఁ గొని వారక దారుకుమీఁద వైవ దా**
**రుణగతి నింగి నుండి నిజరోచులతోఁ బడు చుక్కకైవడిన్. 889**

**ప్రతి :** మిడుగురులు= నిప్పురవ్వలు; ఎల్ల+ఎడన్= అంతట; చెదరన్= చెదరిపడుతూ ఉండగా; మింటను= ఆకాశంలో; మంటలు= జ్వాలలు; పర్వన్= వ్యాపిస్తుండగా; ఘంటికా= చిరుగంటలయొక్క; ఘణఘణ= ఘణఘణఅనెడి; భూరి నిస్వన నికాయమునన్= గొప్ప శబ్దాల సమూహంచేత; హరిత్+అంతరాళముల్= అన్ని దిక్కుల మధ్యభాగాలు; వణకన్= కంపించగా; మహా+ఉగ్రశక్తిన్= చాలా భయంకరమయిన 'శక్తి' అనేపేరుగల దివ్యమైన ఆయుధాన్ని; కొని= చేతితో గైకొని; వారక= అడ్డులేని రీతిగా; దారుకుమీదన్= శ్రీకృష్ణుని సారథియైన దారుకునిపై; వైవన్= విసరివేయగా; నింగినుండి=

ఆకాశంనుండి; నిజరోచులతోన్= తన కాంతులతో; దారుణగతిన్= తీక్ష్ణమైన వేగంతో; పడు= భూమిపై పడబోతున్నట్టి; చుక్కకైవడిన్= నక్షత్రంవలె...

**తా :** నిప్పురవ్వలు అన్నివైపులా చెదరిపడుతుండగా, ఆకసంలో మంటలు ప్రసరిస్తూ ఉండగా; చిరుగంటల ధ్వనులచే దిక్కుల నడిమి ప్రదేశమంతా వణకుతుంటే మహాభయంకరమయిన 'శక్తి' అనే దివ్యమైన ఆయుధాన్ని సాల్వుడు శ్రీకృష్ణుని సారథియైన దారుకునిపైకి విసరివేసినాడు. అది చుక్క తెగిపడుతున్నట్లుగా రాసాగింది.

**క. వడిఁ జనుదేరఁగఁ గని య, ప్పుడు నగధరుఁ డలతి లీలవోలెన్ దానిం**
**బొడిపొడియై ధరఁ దొరఁగఁగఁ, నడుమన వెసఁ ద్రుంచె నొక్క నారాచమునన్. 890**

**ప్రతి :** వడిన్= అమితమైన వేగంతో; చను+తేరగన్= (సారథి మీదికి) వస్తూవుండగా; కని= చూచి; అప్పుడు= ఆ వేళలో; నగధరుడు= శ్రీకృష్ణుడు (గోవర్ధన పర్వతమును ధరించినవాడు); కని= చూచి; దానిన్= 'శక్తి' యనే ఆ దివ్యాయుధాన్ని; ఒక్క నారాచమునన్= ఒకేయొక బాణంచేత; అలతి లీలన్+పోలెన్= స్వల్పమైన వినోదపుటాటవలె; పొడిపొడి+ఐ= చిన్నచిన్నముక్కలై; ధరన్= భూమిమీద; తొరగన్+కన్= పడుతున్నట్లుగా; వెసన్= శీఘ్రంగా; నడుమన్+అ= మధ్యలోనే; త్రుంచెన్= తుంటలుగా చేశాడు.

**తా :** వెలుగులీనే ఒకానొక నక్షత్రం ఆకాశంలోనుండి తెగిపడిన రీతిగా వేగంగా దారుకునిమీదికి దూసుకొని ఆ దివ్యశక్తి వస్తూవుండగా, దాన్ని శ్రీకృష్ణుడు ఒక్కబాణంతో మధ్యమార్గంలోనే పొడిపొడిగా చేసి నేలపై రాలేట్లు చేశాడు.

**చ. గురుభుజుఁ డంతఁ బోవక యకుంఠిత శూరత శత్రుసైన్యముల్**
**దెరలఁగ నుగ్రతం గొఱవిఁ ద్రిప్పిన కైవడి మింట దిర్దిరం**
**దిరుగుచు దుర్నిరీక్ష్యమగు దీపితసౌభము సాల్వుఁ జండ భా**
**స్కర కిరణాభషోడశ నిశాతశరంబులఁ గాఁడ నేసినన్. 891**

**ప్రతి :** గురుభుజుడు= గొప్ప భుజాలు (బాహువులు) గలవాడు (శ్రీకృష్ణుడు); అంతన్+పోవక= అంతటితో ఊరుకోక (సాల్వుని శక్త్యాయుధాన్ని పొడిపొడిగా చేయటంతో ఊరుకోక); న+కుంఠిత శూరతన్= మొక్కవోని (అడ్డులేని) శౌర్యంచేత; శత్రుసైన్యముల్= విరోధియైన సాల్వునిసేనలు; తెరలగన్= (భయంచేత) చలించిపోయేటట్లుగా; మింటన్= ఆకాశంలో; ఉగ్రతన్= భీకరంగా; కొఱవిన్= కొఱవిని; త్రిప్పినకైవడిన్= (వేగంగా) త్రిప్పినట్లుగా; దిర్దిరన్+తిరుగుచున్= దిర్దిరమని ధ్వనిచేస్తూ తిరుగుతున్న; దుర్+నిరీక్ష్యము+అగు= చూడటానికి వీలుకాకుండా ఉన్న; దీపిత సౌభమున్= ప్రకాశిస్తున్న సౌభక విమానాన్నీ; సాల్వున్= (అందులోనున్న) సాల్వుణ్ణీ; చండభాస్కర= చాలవాడిగా వెలుగుతున్న సూర్యునియొక్క; కిరణ+ఆభ= కిరణాలను పోలిన; షోడశ నిశాత శరంబులన్= మిక్కిలి వాడిగల పదుహారుబాణాలచేత; కాడన్+ఏసినన్= బాగుగా నాటుకొనునట్లు కొట్టగా...

**తా :** గొప్ప బాహుబలసంపన్నుడైన శ్రీకృష్ణ డంతటితో శాంతించక, మొక్కవోని పరాక్రమంతో, కొఱవి త్రిప్పినట్లుగా ఆకాశంలో భీకరంగా తిరుగుతూ చూడ శక్యం గాకుండా ఉన్నసౌభకవిమానాన్నీ, అందులో ఉన్న సాల్వుణ్ణీ మిక్కిలి వాడియైన సూర్యకిరణాలవంటి పదునైన పదహారు బాణాలను బాగా నాటుకొనేటట్లుగా ప్రయోగించాడు.

**చ. కదు వడి నల్గి వాఁడు నిజకార్ముకమున్ జలదస్వనంబు కై**
**వడి మొరయించుచున్ వెడఁదవాతి శరంబులఁ బద్మలోచను**
**న్నెడమభుజంబు గాఁడ వడి నేసినఁ దెంపతి చేతిశార్ఙ్గమున్**
**విడిచె రథంబుపై గగనవీథి సురల్ భయమంది చూడఁగన్. 892**

**ప్రతి :** వాడు= ఆ సాల్వుడు; కదువడిన్= మిగుల త్వరగా; అల్గి= కోపించి; నిజకార్ముకమున్= తనయొక్క వింటిని; జలదస్వనంబుకైవడిన్= మేఘంయొక్క ధ్వని (ఉరుము)వలె; మొరయింపుచున్= శబ్దింపజేస్తున్నవాడై; పద్మలోచనున్= తామరపువ్వులవంటి (విశాలమైన, అందమైన) కన్నులు గలవాణ్ణి (శ్రీకృష్ణుని); వెడదవాతి శరంబులన్= వెడల్పైననోళ్లు (మొనలు)గల బాణాలచేత; ఎడమ భుజంబున్= ఎడమవైపు భుజాన్ని; కాడన్= నాటుకొనునట్లు; వడిన్+ఏసినన్= తీవ్రంగా కొట్టగా; తెంపు+అతి= సాహసాన్ని కోల్పోయినవాడై; గగనవీథిన్= ఆకాశమార్గంలోని; సురల్= దేవతలు; భయము+అంది= భీతినొంది; చూడన్+కన్= చూడగా; చేతి శార్ఙ్గమున్= తన చేతిలోని శార్ఙ్గమనే వింటిని; రథంబుపైన్= తేరుమీద; విడిచెన్= జారవిడిచినాడు.

**తా :** సాల్వుడు మిగుల కోపించి, తనధనుస్సును మేఘం ఉఱిమినట్లుగా ధ్వనింపజేస్తూ శ్రీకృష్ణుని ఎడమభుజంలో నాటుకొనే టుగా వెడల్పు మొనలుగల బాణాలను వేగంగా ప్రయోగించాడు. ఆ దెబ్బకు తెగువను కోల్పోయిన కృష్ణుడు శార్ఙ్గమనే తన వింటిని రథంపై జారవిడిచినాడు. అందుకు ఆకసంలో ఉన్నదేవతలు భీతిల్లి చూడసాగారు.

**క. హాహా యని భూతావళి, హాహాకారములు సేయ నంతట దేఱ**
**న్నాహరిఁ గనుఁగొని యతఁ డు, త్సాహంబునఁ బలికె బాహు శౌర్యస్ఫూర్తిన్. 893**

**ప్రతి :** భూత+ఆవళి= (చుట్టుగల ప్రకృతిలోని) భూతాల సమూహం; హాహా+అని= హా! హా! – అనే శబ్దాలతో; హాహాకారములు+చేయన్= విచారాన్ని ప్రకటిస్తూ హాహాకారాలు చేయగా; అంతటన్= భూతాలు హాహాధ్వనులు చేస్తున్నంతలో; తేఱన్= శ్రీకృష్ణుడు బాధనుండి తెప్పిరిల్లగా; ఆ హరిన్= అట్లు తేరుకొన్న ఆ కృష్ణుణ్ణి; కనున్+కొని= చూచినవాడై; అతడు= ఆ సాల్వుడు; బాహుశౌర్యస్ఫూర్తిన్= భుజ పరాక్రమమువల్ల కలిగిన ఆవేశంతో; ఉత్సాహంబునన్= (యుద్ధం చేయటంలోని) అభిలాషతో; పలికెన్= ఇలా పలికాడు.

**తా :** శ్రీకృష్ణుడు వింటిని తేరుపై జారవిడిచినందుకు ప్రకృతియందలి భూతాలు హాహాకారాలు చేశాయి. అంతలో ఆయన సాల్వుని బాణాలవలన కలిగిన బాధనుండి తేరుకొన్నాడు. అది గమనించిన సాల్వుడు భుజశౌర్యం ప్రేరేపిస్తూండగా శ్రీకృష్ణుణ్ణి చూచి యుద్ధఉత్సాహంతో ఇలా పల్కాడు.

**చ. 'నళినదళాక్ష! మత్సఖుఁడు నాఁ దగు చైద్యుఁడు గోరినట్టి కో**
**మలి నవినీతిమైఁ దగవుమాలి వరించితి; వంతఁ బోక దో**
**ర్బలమున ధర్మనందను సభాస్థలి నేమఱి యున్న వాని న**
**చ్ఛలమునఁ జంపి తట్టి కలుషంబున నేఁడు రణాంగణంబునన్. 894**

**ప్రతి :** నళినదళ+అక్ష!= తామరపూరేకులవంటి (విశాలమైన, అందమైన) కన్నులుగలవాడా! (శ్రీకృష్ణా!); మత్+సఖుడునాన్+తగు= నాయొక్క స్నేహితుడని (ప్రసిద్ధిగ) చెప్పదగిన; చైద్యుడు= చేదిదేశానికి రాజైన శిశుపాలుడు; కోరిన+అట్టి=

(భార్యగా) వరించినటువంటి; కోమలిన్= యువతిని (సుకుమారమైన దేహముగలదానిని); న+వినీతిమైన్ (అవినీతిమైన్)= నీతిలేకుండా (నీతిని పాటించకుండా); తగవు మాలి= న్యాయపద్ధతిని విడిచిపెట్టి; వరించితివి= భార్యగా స్వీకరించినావు; అంతన్+పోక= అంతటితో చాలించక; ధర్మనందను= ధర్మరాజుయొక్క; సభాస్థలిన్= రాజసూయయజ్ఞానికి చెందిన సభాప్రదేశంలో; దోస్+బలమునన్= తన భుజబలాన్ని ప్రదర్శించాలనే విషయంలో; ఏమఱి+ఉన్నవానిన్= అజాగ్రత్తగా ఉండినవాణ్ణి (శిశుపాలుని); అచ్చలమునన్= ఆగ్రహంతో; చంపితి= సంహరించావు; అట్టి కలుషంబునన్= అట్టి పాపంతో (కూడినవాడవైయున్న నీవు); నేడు= ఈ రోజున; రణ+అంగణంబునన్= యుద్ధ భూమియందు...

**తా :** 'కృష్ణా! నా మిత్రుడు (శిశుపాలుడు) కోరిన కన్యకను (రుక్మిణిని) నీవు నీతి మాలినవాడివై అన్యాయంగా స్వీకరించావు. అది చాలక ధర్మజుని సభాస్థలిలో ఏ మరుపాటున ఉన్న ఆతణ్ణి పగబూని ఆగ్రహంతో సంహరించావు. అటువంటి కలుషాత్ముడివైన నీవు నేడు రణరంగంలో (నిలిచినాతో పోరాడాలి)

**క. తల చెడి పాఱక బాహా, బల మొప్పఁగ నాదు దృష్టిపథమున ధృతితో**
**నిలిచిన నిష్ఠుర విశిఖా, ర్చుల ముంచి మదీయసఖుని సూ డిటు దీర్తున్. 895**

**ప్రతి :** తలచెడి= ధైర్యాన్ని కోల్పోయి; పాఱక= పారిపోకుండ; బాహాబలము+ఒప్పన్+కన్= భుజ శక్తి ప్రకాశించే విధంగా; ధృతితోన్= ధైర్యంతో; నాదు దృష్టిపథమునన్= నా చూపుమేరలో; నిలిచినన్= నీవు నిలబడినట్లైతే; నిష్ఠుర= కఠోరమైన; విశిఖ+అర్చులన్= నా బాణాలయొక్క అగ్నిజ్వాలలో; ముంచి= నిన్ను ముంచివేసి; మదీయసఖునిన్= నా మిత్రుడైన శిశుపాలునియొక్క; సూడు= పగను; ఇటు= ఈ విధంగా; తీర్తున్= తీర్చుకుంటాను.

**తా :** కలుషాత్ముడవైన నీవు యుద్ధరంగంలో అధైర్యంతో పారిపోక, భుజబలంతో నా ఎదుట ధైర్యంగా నిలువబడ గలిగినట్లయితే, నా మిత్రుణ్ణి సంహరించిన పాపానికి పరిహారంగా నిన్ను నా యొక్క కర్కశబాణాగ్నిజ్వాలలలో ముంచివేసి పగ తీర్చుకుంటాను.

**చ. అనిన మురాంతకుండు దరహాసము మోమునఁ దొంగలింప సా**
**ల్వునిఁ గని 'యోరి! లావు లగువుం గల పోటరివోలెఁ బ్రేలె దే**
**మనినను బాటు సన్నిహిత మౌట యెఱుంగవు మూఢచిత్త! వొ'**
**మ్మని గదఁ గేలఁ ద్రిప్పి యభియాతిని శత్రుని వ్రేసె నుద్ధతిన్. 896**

**ప్రతి :** అనినన్= అని సాల్వుడు పౌరుషోక్తులు పల్కగా; ముర+అంతకుండు= మురుడనే రక్కసుని అంతం చేసినవాడు (శ్రీకృష్ణుడు); దరహాసము= చిఱునవ్వు; మోమునన్= ముఖంపై; తొంగలింపన్= ప్రకాశింపగా; సాల్వునిన్+కని= సాల్వుణ్ణి చూచి; ఓరి!= ఒరే!; మూఢచిత్త!= అజ్ఞానము ఆవరించిన మనస్సుగలవాడా!; లావు= బలము; లగువున్+కల= లాఘవం (నేర్పు) గలిగిన; పోటరి+పోలెన్= వీరునివలె; ప్రేలెదు(వు)= వదరుచున్నావు; ఏమి+అనినను= నీవు ఏమిమాట్లాడి నప్పటకీ; పాటు= పడిపోవుట (పతనము); సన్నిహితము+ఔట= దగ్గరకావడం; ఎఱుంగవు= తెలియలేక పోతున్నావు; పొమ్ము!+అని= పోరా! అని; కేలన్= చేతితో; గదన్= గదాయుధాన్ని; త్రిప్పి= గిరగిరత్రిప్పి; అభియాతినిన్= ఎదిరించినవాణ్ణి; శత్రునిన్= శత్రువగు సాల్వుణ్ణి; ఉద్ధతిన్= గర్వంతో; వ్రేసెన్= వేగంగా విసరి వేశాడు.

**తా :** ఆ విధంగా బీరాలు పలికిన సాల్వుని మాటలకు శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు. 'ఓరీ మూఢుడా! బలపరాక్రమాలుగల శూరునివలె ప్రేలుతున్నావు. నీకు చావు మూడిన సంగతిని గుర్తించలేకుండా ఉన్నావు'. – అని పల్కి తన గదను గిరగిర త్రిప్పి, ఒడుపుగా వానిపై విసరాడు.

**వ. అట్లు వ్రేసిన. 897**

**ప్రతి :** అట్లు= ఆ రీతిగా ఒడుపుతో; వ్రేసినన్= సాల్వునిపై వేయగా...

**తా :** ఆ విధంగా శ్రీకృష్ణుడు గదాయుధాన్ని సాల్వునిపై విసిరవేసిన తర్వాత

**క. పెనుమూర్ఛ నొంది వెస ము, క్కున వాతను నెత్తురొల్కఁ గొంతవడికి నొ**
**య్యన తెలిసి నిలువరింపక, చనె వాఁడు నదృశ్యుఁ డగుచు సౌభముఁ దానున్. 898**

**ప్రతి :** వాడు= ఆ సాల్వుడు; వెసన్= వెంటనే (శ్రీకృష్ణుని గద తనకు తగిలినతోడనే); ముక్కునన్= ముక్కులోనుండి; వాతను= నోటిలోనుండి; నెత్తురు+ఒల్కన్= (జలజల) రక్తం కారగా; పెనుమూర్ఛన్+ఒంది= గాఢమైన మూర్ఛపోయి; కొంతవడికిన్= కొంతసేపటికి; ఒయ్యనన్= తిన్నగా; తెలిసి= మూర్ఛనుండి తేరుకొని, తెలివినొంది; నిలువరింపక= యుద్ధంలో స్థిరంగా నిలువకుండా; సౌభమున్+తానున్= సౌభకవిమానంతోపాటు ఆ సాల్వుడును; న+దృశ్యుడు (అదృశ్యుడు)+అగుచున్= (మాయచే) కనబడనివాడవుతూ; చనెన్= వెళ్లిపోయాడు.

**తా :** అప్పుడు శ్రీకృష్ణుని గదాఘాతంచేత తన నోటినుండీ, ముక్కునుండీ రక్తం స్రవిస్తూ ఉండగా సాల్వుడు తీవ్రంగా మూర్ఛపోయాడు. కొంతసేపటికి మెల్లగా తేరుకొన్నవాడై, అక్కడ నిలువకుండా వెంటనే సౌభకంతోపాటు మాయమైపోయాడు.

**వ. అ య్యవసరంబున. 899**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** ఆ విధంగా సాల్వుడు విమానంతోకూడా అదృశ్యమైపోయిన సందర్భంలో

**తే. గగనమందుండి యొకఁ డార్తుఁ డగుచు వచ్చి, నందనందనుపాదారవిందములకు**
**వందనము సేసి యానకదుందుభిని మ, హోగ్రుఁడై పట్టితెచ్చె సాల్వుండు గడఁగి. 900**

**ప్రతి :** గగనము+అందున్+ఉండి= ఆకాశంనుండి; ఒకడు= ఒకానొక మనుష్యుడు; ఆర్తుడు+అగుచున్= దుఃఖిస్తూవున్నవాడయి; వచ్చి= శ్రీకృష్ణుని వద్దకువచ్చి; నందనందను= నందుని కుమారుడైన శ్రీకృష్ణునియొక్క; పాద+అరవిందములకున్= పద్మాలవంటి (అందమైన) పాదాలకు; వందనము+చేసి= నమస్కారం చేసి; సాల్వుండు= సాల్వుండు; మహా+ఉగ్రుడు+ఐ= ఎంతో భయాన్ని కల్గిస్తున్నవాడై; కడగి= పూనుకొని; ఆనకదుందుభిన్= వసుదేవుణ్ణి; పట్టితెచ్చెన్= పట్టుకొని తెచ్చాడు(బంధించి తీసుకొని వచ్చాడు).

**తా :** ఆ సమయంలో ఆకసంనుండి ఒకానొక మనుష్యుడు (బిగ్గరగా) దుఃఖిస్తూ శ్రీకృష్ణునివద్దకు వచ్చాడు. ఆయన పాదకమలాలకు వందనం చేసి, ఇలా విన్నవించాడు. 'దేవా! (మీ తండ్రియైన) వసుదేవుణ్ణి క్రూరుడైన సాల్వుడు బంధించి తెచ్చాడు.'

**విశే :** 'ఆనకము' అంటే తప్పెటవంటి వాద్యం; 'దుందుభి' అనగాభేరి. వసుదేవుడు జన్మించిన సమయంలో దేవతలు ఆకాశం నుండి శుభసంతోషసూచకంగా ఈ రెండువిధాలైన వాద్యాలను మ్రోయించారు. అందుచేత, వసుదేవునికి "ఆనక దుందుభి"– అనే నామధేయం సార్థకంగా ఏర్పడింది.

**తే. దేవ! మీ కెఱిఁగింపఁగాఁ దివిరి యిటకు, దేవకీదేవి నన్నుఁ బుత్తెంచె' ననఁగ**
**విని సరోరుహనాభుఁడు ఘనవిషాద, మగ్నుఁ డయ్యెను గురుమీఁది మమతఁ జేసి. 901**

**ప్రతి :** దేవ!= పూజనీయుడా!; దేవకీదేవి= తమ తల్లియగు దేవకీదేవి; మీకున్+ఎఱిగింపన్+కాన్= ఈ విషయాన్ని మీకు తెలియజేయడానికై; తివిరి= పూని (అదే పనిగా); నన్నున్= నన్ను; ఇటకున్= ఇచ్చటికి (మీవద్దకు); పుచ్చు+తెంచెన్= పంపెను; అనన్+కన్= అని పల్కగా; విని= విని; సరస్+రుహనాభుడు= కమలాన్ని నాభిలో గలవాడు (శ్రీకృష్ణుడు); గురుమీది= తండ్రిపై తనకున్నటువంటి; మమతన్+చేసి= ప్రేమానురాగాల కారణంగా; ఘన విషాదమగ్నుడు+అయ్యెను= అతిశయమైన దుఃఖంలో మునిగిపోయాడు.

**తా :** దేవదేవా! ఈ విషయాన్ని మీకు తెల్పేనిమిత్తం తల్లి దేవకీదేవి నన్నిక్కడికి పంపింది – అని చెప్పగా, శ్రీకృష్ణుడు తండ్రియెడగల ప్రేమాధిక్యంచేత తీవ్రమైనవిషాదానికి లోనయ్యాడు.

**క. 'నరగంధర్వసురాసుర, వరులకు నిర్జింపరానివాఁడు బలుం దే**
**మఱ కరయ హీనబలుచేఁ, బరికింపఁగ నెట్లు పట్టువడు నొకొ, యనుచున్ 902**

**ప్రతి :** నర= మానవులలో; గంధర్వ= గంధర్వులనే పేరుగల దేవజాతులలో; సుర+అసుర= దేవతలలో, రాక్షసులలోను; వరులకున్= శ్రేష్ఠులయినవారికిసైతం; నిర్జింపరానివాడు= జయించడానికి వీలుకానివాడైన; బలుండు= బలరాముడు; ఏమరక+అరయన్= ఏమరుపాటు (అజాగ్రత్త) లేకుండా కాపాడుతూవుండగా; పరికింపన్+కన్= ఆలోచింపగా; హీనబలుచేన్= తక్కువ బలంగల వానిచేత (సాల్వునిచేత); ఎట్లు= ఏ విధంగా; పట్టు+పడున్+ఒకొ= పట్టుబడుతాడోకదా! (పట్టువడ్డాడోకదా!); అనుచున్= అని భావిస్తూ...

**తా :** 'దేవ దానవ గంధర్వ మానవశ్రేష్ఠులైన వారికి కూడా జయింపరాని బలరామదేవుడు జాగరూకతతో కాపాడుతూ ఉండగా, హీనబలుడైన సాల్వునిచే తండ్రియగు వసుదేవుడేలాగున పట్టువడినాడోకదా!' – అని వాసుదేవుడు ఆశ్చర్యంతో ఆలోచింపసాగాడు.

**వ. మఱియును. 903**

**ప్రతి :** మఱియును= ఇంకను అలా ఆలోచిస్తూ వున్నందున...

**క. భావంబు గలఁగ 'నాహా!, దైవకృతం బెవ్వరికిని దప్పింపఁగ రా**
**దే విధినైనను నని శో, కావిలమతిఁ బలుకుచున్న న త్తఱి వాఁడున్. 904**

**ప్రతి :** భావంబు= మనస్సు; కలఁగన్= కలతనొందగా; దైవకృతంబు= విధియొక్క నిర్ణయం; ఎవ్వరికినిన్= ఎటువంటి వారికైనా; ఏవిధిన్+ఐనను= ఏప్రకారంగా నైనప్పటికిని; తప్పింపన్+కన్+రాదు= తొలగించడానికి వీలుకాదు కదా!; ఆహా!= అహహా!; అని= అని ఈ రీతిగా; శోక+ఆవిలమతిన్= దుఃఖంచేత కలగబారిన మనస్సుచేత; పలుకుచున్+ఉన్నన్= అంటూ ఉండగా; ఆ+తఱిన్= ఆ సమయంలో; వాడున్= ఆ సాళ్వుడు కూడా...

**తా :** అలా అనుకొంటూ, మనస్సు వికలత పొందగా 'దైవనిర్ణయాన్ని తప్పించడానికి ఎవరికైనా, ఏవిధంగానైనా సాధ్యంకాదు గదా!' – అని దుఃఖిస్తూ విచారంతో పలుకుతూవుండగా, అంతలో ఆ సాల్వుడు (తన మాయాబలాన్ని ప్రదర్శింపసాగాడు)

**వ.** **తన మాయాబలంబునఁ గ్రమ్మఱం దోఁచి కృతకవసుదేవునిం గల్పించి యతనిం బంధించి కొనితెచ్చి 'పుండరీకాక్ష! నిరీక్షింపు భవజ్జనకుండు వీఁడె; యిప్పుడు నీవు గనుంగొన వీనితలఁ ద్రుంతు నింక నెవ్వనికింగా మనియెదు? కావం గల శక్తి గల దేనిం గావు' మని దురాలాపంబు లాడుచు మృత్యుజిహ్వాకరాళంబైన కరవాలంబు గేలం బూని జళిపించుచు న మ్మాయావసుదేవునిశిరంబు దునిమి తన్మస్తకంబు గొని వియద్వర్తియై చరియించు సౌభకవిమానంబు సొచ్చె; నంత గోవిందుండు గొంతతడవు మనంబున ఘనంబగు శోకంబునం గుందుచుండి యాత్మసైనికులు దెలుపం దెలివొంది యది మయోదితంబైన సాల్వునిమాయోపాయం బని యెఱింగె; నంతం దనకు వసుదేవుండు పట్టువడె నని చెప్పిన దూతయు న మ్మాయాకళేబరంబును నా క్షణంబ విచిత్రంబుగా మాయంబై పోయె; ననంతరంబ.** **905**

**ప్రతి :** తన మాయాబలంబునన్= సాల్వుడు తనయొక్క మాయాశక్తిచేత; క్రమ్మరన్= మరల; తోచి= శ్రీకృష్ణునికి కనిపించి; కృతక వసుదేవునిన్= మాయాకల్పితుడైన వసుదేవుణ్ణి; కల్పించి= తన మాయచే సృజించి; అతనిన్= ఆ రీతిగా కల్పించిన వసుదేవుణ్ణి; బంధించి= (త్రాళ్లవంటి సాధనములచేత) కట్టివైచి; కొనితెచ్చి= తీసుకొనివచ్చి; పుండరీక+అక్ష!= తెల్లదామరపూవులవంటి నేత్రాలు గలవాడా (శ్రీకృష్ణా!); నిర్+ఈక్షింపు= బాగుగా చూడుము; వీడు+ఎ= ఈతడే; భవత్+జనకుండు= నీయొక్కతండ్రి; ఇప్పుడు= ఈ క్షణంలో; నీవు= ఆతనితనయుడవైన నీవు; కనున్+కొనన్= చూస్తూ ఉండగానే; వీనితలన్= వీనియొక్క శిరస్సును; త్రుంతున్= శరీరాన్నుండి త్రుంచివేస్తూవున్నాను; ఇంకన్= ఇకమీదట; ఎవ్వనికిన్+కాన్= ఎవ్వనికొరకై; మనియెదు(వు)= జీవించివుంటావు?; (నీవు జీవించి ఉండటం వ్యర్థం – అని సాల్వుని చెడు తలంపు); కావన్+కల శక్తి= ఇతణ్ణి కాపాడగలిగినట్టిబలం; కలదు+ఏనిన్= నీకు ఉన్నట్లయితే; కావుము= కాపాడుకొనుము; అని = అని ఈ విధంగా; దుర్+ఆలాపంబులు= చెడుపల్కులు; ఆడుచున్= చెప్పుతూ; మృత్యుజిహ్వా కరాళంబు+ఐన= మృత్యుదేవతయొక్క నాలుకలాగా భయంకరమైన; కరవాలంబు= కత్తిని; కేలన్+పూని= చేతితో పట్టుకొని; జళిపించుచున్= అటునిటు త్రిప్పుతూ; ఆ+మాయావసుదేవుని= ఆ కృత్రిమ వసుదేవునియొక్క; శిరంబున్= తలను; తునిమి= ఖండించి; తద్+మస్తకంబున్= ఆ శిరస్సును; కొని= పట్టుకొని; వియత్+వర్తి+ఐ= ఆకాశంలో ఉండునట్టిదై; చరియించు= తిరుగాడుచుండెడి; సౌభకవిమానంబు+చొచ్చెన్= సౌభకమనే విమానంలోనికి వెళ్లిపోయాడు; అంతన్= వాడట్లు వెళ్లిపోయిన పిదప; గోవిందుండు= (గోవుల కధిపతియైన) శ్రీకృష్ణుడు; కొంత తడవు= కొంతసేపు; మనంబునన్= తన మనస్సులో; ఘనంబు+అగు= గొప్పదైన; శోకంబునన్= దుఃఖంచేత; కుందుచున్+ఉండి= చింతిస్తూ ఉన్నవాడై; ఆత్మసైనికులు= తనయొక్క సేనలోనివారు; తెలుపన్= (ధైర్యవచనాలతో కర్తవ్యాన్ని గూర్చి) వివరింపగా; తెలివి+ఒంది= సమయోచితమైన జ్ఞానాన్ని పొందినవాడై; అది= ఆ రీతిగా సాల్వుడు తన యెదుట కావించిన పని; మయ+ఉదితంబు+ఐన= మయుడను రాక్షసశిల్పిచేత బోధింపబడి; సాల్వునిచే ప్రదర్శితమైనట్టి; సాల్వుని మాయా+ఉపాయంబు= సాల్వుడు చేసిన కపటమైన ఉపాయమేగాని, నిజమైందికాదని; ఎఱింగెన్= తెలుసుకొన్నాడు; అంతన్= అటు పిమ్మట; తనకున్= శ్రీకృష్ణుడగు తనకు; వసుదేవుండు= వసుదేవరాజు; పట్టు+పడెన్= సాల్వునిచే పట్టుకొనబడినాడు; అని చెప్పిన దూతయున్= అని తొలుత తనవద్దకు వచ్చి చెప్పిన సేవకుడును ఆ+మాయా కళేబరంబును= సాల్వుడు కొని వచ్చిన ఆ మాయావసుదేవుని

శరీరం కూడ; విచిత్రంబు+కాన్= ఆశ్చర్యకరంగా; మాయంబు+ఐ+పోయెన్= కనిపించకుండాపోయాయి; న+అంతరంబు (అనంతరంబు)+అ= అటు తరువాత వెనువెంటనే...

**తా :** అంతలో సాల్వుడు మరల కనిపించాడు. మాయావసుదేవుణ్ణి కల్పించి బంధించుకొని వచ్చాడు. "కృష్ణా! వీడే మీ తండ్రి. నీ యెదుటే వీని శిరస్సును ఖండించివేస్తాను. బలంకలవాడవైతే రక్షించుకో!" – అని పరుషంగా దుర్భాషలు పల్కుతూ, ఖడ్గాన్ని జళిపిస్తూ కల్పితవసుదేవుని శిరస్సును త్రుంచి, ఆ తలతోపాటు సౌభకవిమానంలోకి వెళ్లిపోయాడు. ఆ దృశ్యాన్ని చూచిన శ్రీకృష్ణుడు సాధారణమనుష్యునివలె కొంతసేపు అత్యంతదుఃఖంలో మునిగిపోయాడు. అప్పుడు తనసైన్యంలోని ప్రముఖులు కొందఱు సందర్భోచితాలైన పల్కులతో ధైర్యపరుస్తూ, కర్తవ్యాన్నిగూర్చి ప్రబోధించారు. అదంతా మయుడనే రక్కసునిద్వారా సాల్వుడు నేర్చుకొన్న మాయా విద్యాప్రభావమేనని శ్రీకృష్ణుడు ఆలోచించి తెలిసికో గలిగాడు. అంతలో 'వసుదేవుడు పట్టుబడినా'డని చెప్పిన దూతా, ఆ మాయాకళేబరమూ మాయమైపోయాయి.

**క. ముని లపుడు గొంద ఱచటికిఁ, జనుదెంచి విమోహియైన జలజదళాక్షుం**
**గనుఁగొని సమధికభక్తిన్, వినయంబునఁ బలికి రంత విష్ణున్ జిష్ణున్. 906**

**ప్రతి :** అపుడు= సాల్వుని మాయావిద్యనుగూర్చి శ్రీకృష్ణుడు తెలిసికొనిన ఆ సమయంలో; కొందఱు మునులు= మహర్షులు కొందరు; అచటికిన్= శ్రీకృష్ణుడుడే ఆ ప్రదేశానికి; చను+తెంచి= విచ్చేసి; విమోహి+ఐన= విచారం తొలగిపోయి విశిష్టమైన తెలివితో గూడుకొని ఉన్నట్టి; జిష్ణున్= జయించే స్వభావం గలవాణ్ణి; విష్ణున్= అంతటా వ్యాపించి ఉండు స్వభావంగల శ్రీమహావిష్ణువుయొక్క అవతారమయిన వాణ్ణి; జలజదళ+అక్షున్= తామరపూరేకులవంటి (అందమైన, వెడల్పాటి నేత్రాలు గలిగియున్న శ్రీకృష్ణుని); కనున్+కొని= దర్శించి; అంతన్= వెంటనే; సమ్+అధికభక్తిన్= మిగుల అధికమైన భక్తిభావంతో; వినయంబునన్= వినమ్రతగలవారై; పలికిరి= మనవిచేశారు.

**తా :** ఆ సమయంలో మునీంద్రులు కొందరు మాయావిముక్తుడు, జయశీలుడు, విష్ణుస్వరూపుడు, కమలదళనేత్రుడు – అయిన శ్రీకృష్ణునివద్దకు వచ్చి, భక్తియుక్తులై, వినయంతో ఇలా విన్నవించారు.

**సీ. కమలాక్ష! సర్వలోకములందు సర్వమానవులు సంసారనానావిధైక**
**దుఃఖాబ్ధిమగ్నులై తుదిఁ జేర నేరక వికలత్వమునఁ బొందువేళ నిన్నుఁ**
**దలఁచి దుఃఖంబులఁ దరియింతు రట్టి సద్గుణ నిధివై దేవకోటికెల్లఁ**
**బట్టుగొమ్మై పరబ్రహ్మాఖ్యఁ బొగడొంది పరమయోగీశ్వరప్రకరగూఢ**

**తే. పరచిదానందదివ్యరూపమున వెలుఁగు, దనఘ! నీ వేడ? నీచజన్మాత్మజనిత**
**ఘనభయస్నేహమోహాశోకంబు లేద?, ననుచు సంస్తుతి సేసి వా రరిగి రంత. 907**

**ప్రతి :** న+అఘ! (అనఘ)= పాపమే లేనటువంటివాడా!; కమల+అక్ష!= తామరపూరేకులవంటి (అందమైన) కన్నులుగలవాడా! (శ్రీకృష్ణా!); సర్వలోకముల+అందున్= అన్ని లోకాల్లోనూ (దేశాలలోనూ); సర్వమానవులు= మనుష్యులెల్లరూ; సంసార= ఈ సంసారానికి సంబంధించిన; నానావిధ= అనేకరీతుల గోచరిస్తున్న; ఏక దుఃఖ+అబ్ధి= ఒకే విధమైన శోకమనే సముద్రంలోపల; మగ్నులు+ఐ= మునిగినవారై; తుదిన్= ఆ దుఃఖసాగరంయొక్క చివరను (ఒడ్డును); చేరన్+నేరక= చేరుకొన జాలక (చేరుకొనే ఉపాయం తెలియక); వికలత్వమునన్+పొందువేళన్= కలతతో అధైర్యపడిన సమయంలో;

నిన్నున్+తలచి= (సర్వేశ్వరుడవైన) నిన్ను ధ్యానించి; దుఃఖంబులన్= (సంసారంలో కలిగిన) సమస్త దుఃఖాలను; తఱియింతురు= దాటుతుంటారు; అట్టి= అటువంటి (దుఃఖాలను నివారింపగల); సత్+గుణ+నిధివి+ఐ= అత్యుత్తమగుణాలకు నెలవైయున్నవాడివై; దేవకోటికిన్+ఎల్లన్= దేవతలకు అందరకినీ; పట్టు+కొమ్మ+ఐ= ముఖ్య ఆధారమై; పరబ్రహ్మ+ఆఖ్యన్= పరబ్రహ్మ స్వరూపుడనే పేరుతో; పొగడు+ఒంది= ప్రశస్తిని పొందియున్నవాడివై; పరమయోగి+ఈశ్వర= గొప్ప యోగిశ్రేష్ఠుల యొక్క; ప్రకర= సమూహానికి సైతం; గూఢ= రహస్యమైయున్న; పర= ఉత్కృష్టమైన; చిత్+ఆనంద= జ్ఞానం, ఆనందం – అనే లక్షణాలు గలిగి ఉండే; దివ్య రూపమునన్= ఈ లోకాని కంటె పవిత్రమైన మనోహరమైన ఆకారంతో; వెలుగుదు(వు)= ప్రకాశిస్తూవుంటావు; నీవు+ఏడ?= అటువంటి (దేవుడవైన) నీ వెక్కడ?; నీచజన్మ= తక్కువైన పుట్టుక గల్గిన మనుజులయొక్క; ఆత్మ= మనస్సులలో; జనిత= పుట్టినట్టి (కలిగినట్టి); ఘన= గొప్పవియైన; భయ= భయాలు; స్నేహ= మైత్రీభావాలు; మోహ= అజ్ఞానంవల్ల కలిగే భ్రమలు; శోకంబులు= దుఃఖంబులు; ఏడన్?= ఎక్కడివి? (ఉండవు); అనుచున్= అని పలుకుతు; సంస్తుతి+చేసి= గొప్పగా కొనియాడి; వారు= ఆ మునీశ్వరులు; అరిగిరి= వెళ్లిపోయారు; అంతన్= అటుపిదప...

**తా :** 'పాపరహితుడవైన పుండరీకాక్షా! సమస్తమానవులూ సంసారమనే పలురకాలై ఉండే దుఃఖసముద్రంలో మునిగి గట్టుచేరజాలక కొట్టుమిట్టాడుతున్న వేళలో నిన్ను ధ్యానించి ఆ దుఃఖాలను నివారింపజేసికొంటూ ఉంటారు. అటువంటి సద్గుణాలకు నిలయుడవై, దేవతలందరకు ముఖ్యాధారుడవై పరబ్రహ్మస్వరూపుడవై, పరమయోగీంద్రులకుసైతం అందరానటువంటి ఉత్కృష్టమైన చిదానందస్వరూపంతో ప్రకాశిస్తూవుండే నీ వెక్కడ? అల్పులైనవారి మనస్సుల్లో ఆవిర్భవించే భయం, మోహం, శోకం మొదలగునవి ఎక్కడ? నిజంగా నీవు వాటికి అతీతుడవు కదా!' – అని ఈ విధంగా సన్నుతించి ఆమునీశ్వరులు తమదారిన తాము వెళ్ళిపోయారు.

**విశే :** 905వ వచనంలో ఆత్మసైనికులు తెలుపగా శ్రీకృష్ణుడు తెలివొందినట్లు చెప్పబడినది. ఆ తెలుపుట సాధారణ మానవోచితమై ఉన్నది. వెనువెంటనే మునీశ్వరులు వచ్చి ప్రస్తుతిస్తు శ్రీకృష్ణుని హెచ్చరించడం మిగుల సందర్భానుగుణమై. శ్రీకృష్ణుని దివ్యత్వాన్ని చాటుతోంది.

**చ. హరి దనమీఁద ఘోరనిశితాశుగజాలము లేయు సాల్వభూ**
**వరు వధియింపఁ గోరి బహువారిదనిర్గతభూరివృష్టి వి**
**స్ఫురణ ననూనతీవ్రశరపుంజములన్ గగనంబుఁ గప్పి క్ర**
**చ్చఱ రిపుమౌళిరత్నమును జాపము వర్మముఁ ద్రుంచి వెండియున్. 908**

**ప్రతి :** హరి= శ్రీకృష్ణుడు; తనమీదన్= తనపై; ఘోర= కఠోరాలైన; నిశిత= వాడిగల్గిన; ఆశుగజాలములు= బాణాల సమూహాలను; ఏయు= వేయుతున్న; సాల్వభూవరున్= సాల్వరాజును; వధింపన్+కోరి= చంపదలంచినవాడై; బహు= అనేకాలైన; వారిద= మేఘాలనుండి; నిర్గత= వెలువడిన; భూరి= గొప్ప; వృష్టి= వర్షంయొక్క; విస్ఫురణన్= తీవ్రతగల; (మేఘసమూహంనుండి వెలువడుచున్న వర్షధారలను బోలిన తీవ్రవేగంగలిగిన); న+నూన(అనూన)= తక్కువకానట్టి; తీవ్ర= మిగులవాడియైన; శరపుంజములన్= బాణాల సమూహాలచేత; గగనంబున్= ఆకాశాన్ని; కప్పి= ఆవరింపజేసి; క్రచ్చు+అఱన్= శీఘ్రంగా; రిపు= శత్రువయిన సాల్వునియొక్క; మౌళిరత్నమును= శిరస్సుపైనున్న కిరీటంలోని ప్రధానమైన మణినీ; చాపమున్= వానివింటినీ; వర్మమున్= వాని కవచాన్నీ; త్రుంచి= ఖండించి; వెండియున్= మరియు...

**తా :** శ్రీకృష్ణుడు తనమీద వాడిబాణాలు ప్రయోగిస్తూవున్న సాల్వుణ్ణి సంహరింప నిశ్చయించాడు. అందువల్ల, వర్షధారలవంటి తీవ్రమైన బాణజాలంతో ఆకాశాన్నంతటినీ కప్పివేసి శీఘ్రంగా ఆతని కిరీటంలోని రత్నాన్నీ, వాని ధనుస్సునూ, కవచాన్నీ భేదించి వేశాడు.

**మ. వితతక్రోధముతోడఁ గృష్ణుఁడు జగద్విఖ్యాతశౌర్యక్రియో**
**ద్ధతశక్తిన్ వడిఁ ద్రిప్పి మింట మెఱుఁగుల్ దట్టంబుగాఁ బర్వ ను**
**గ్రతఁ జంచద్గద వైచి త్రుంచె వెసఁ జూర్ణంబై ధరన్ రాల నా**
**యత భూరిత్రిపురాభమున్ మహితమాయాశోభమువ్ సౌభమున్. 909**

**ప్రతి :** కృష్ణుడు= శ్రీకృష్ణుడు; వితత= విస్తారమైన (అధికమైన); క్రోధముతోడన్= ఆగ్రహంతో; చంచత్+గదన్= ప్రకాశిస్తున్న గద అనే ఆయుధాన్ని; జగత్+విఖ్యాత= విశ్వమంతటా ప్రశస్తిపొందిన; శౌర్యక్రియా= తన పరాక్రమచర్యచేత; ఉద్ధత= అతిశయించినట్టి; శక్తిన్= బలంతో; వడిన్+త్రిప్పి= ఎంతో వేగంగా గిరగిర త్రిప్పి; మింటన్= ఆకాశంలో; మెఱుఁగుల్= మిఱుమిట్లుగొల్పే కాంతులు; దట్టంబు+కాన్= అధికంగా; పర్వన్= వ్యాపించగా; ఆయత= విశాలమైన; భూరి= గొప్పవైన; త్రిపుర+ఆభమున్= త్రిపురాసురుల పట్టణాలవంటిదైన; మహిత= అధికమయిన; మాయా= మాయా ప్రభావంచేత; శోభమున్= శోభిల్లుచున్నదైన (ప్రకాశించుచున్నట్టి); సౌభమున్= సౌభకమనే పట్టణాన్ని; చూర్ణంబు+ఐ= పొడిపొడియై; ధరన్= నేలమీద; రాలన్= రాలిపడిపోవునట్లుగా; వైచి= విసరివైచి; వెసన్= శీఘ్రంగా; త్రుంచెన్= విఱిచివేశాడు.

**తా :** శ్రీకృష్ణుడు జగద్విఖ్యాతమైన వీరవిజృంభణగల అమితమైన శక్తితో ఆకాశంనిండా మెఱుగులు ప్రసరించేటట్లుగా తన గొప్పగదను అమితవేగంగా త్రిప్పి, విసరి వేసినాడు. అలా శీఘ్రంగా విసరివేసి, త్రిపురాలలాంటిదీ, గొప్ప మాయాప్రభావంకలదీ అయిన సౌభకవిమానాన్ని పొడిపొడి గావించి కూల్చి వేశాడు.

**వ. అట్లు కృష్ణుం డమ్మయనిర్మితమాయావిమానంబు నిజగదాహతి నింతింతలు తునియలై సముద్రమధ్యంబునం దొరంగం జేసిన సాల్వుండు గోఱలు వెఱికిన భుజంగంబుభంగి గండడంగి విన్ననై విగతమాయాబలుం డయ్యును బొలివోవని బీరంబున వసుధాతలంబునకు డిగ్గి యాగ్రహంబున. 910**

**ప్రతి :** అట్లు= ఆ రీతిగా; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; నిజగదా+ఆహతిన్= తన గదయొక్క గొప్పదెబ్బచేత; ఆ+మయనిర్మిత= మయుడనెడి ఆ రాక్షస శిల్పాచార్యునిచే తయారుచేయబడిన; మాయావిమానంబు= మాయతో గూడినట్టి విమానాన్ని; ఇంతలు+ఇంతలు (ఇంతింతలు)= చిన్నచిన్నవియైన; తునియలు+ఐ= ముక్కలై; సముద్రమధ్యంబునన్= సముద్రంయొక్క నడిమి ప్రదేశంలో; తొరంగన్+చేసినన్= రాలిపడులాగున చెయ్యగా; సాల్వుండు= సాల్వుడనే పేరిటిరాజు; కోరలు+పెఱికిన= విషంగల పొడుగాటి పన్నులను లాగివేయబడ్డ; భుజంగంబుభంగిన్= సర్పంవలె; గండు+అడంగి= పౌరుషము అణగిపోయి; విన్నన+ఐ= కాంతితగ్గి చిన్నబోయినవాడై; విగత= కోల్పోయిన; మాయాబలుండు+అయ్యును= కపటమగు మాయాశక్తిని కోల్పోయినవాడై యున్నప్పటికిని; పొలి+పోవని= చెడిపోనట్టి (తగ్గని); బీరంబునన్= పరాక్రమముతో; వసుధా తలంబునకున్= ఆకాసంనుండి భూమిపైకి; డిగ్గి= దిగినవాడై; ఆగ్రహంబునన్= కోపంతో...

**తా :** ఆ విధంగా శ్రీకృష్ణుడు తన గదాయుధపు దెబ్బచేత మయుడు నిర్మించిన మాయావిమానాన్ని (సౌభకాన్ని) పొడిపొడి గావించి, సముద్రంపై రాలిపడేట్టు చేశాడు. అప్పుడు సాల్వుడు కోరలు పెరికివేసిన క్రూరసర్పంలాగా పౌరుషం నశించి,

మాయాశక్తిని కోల్పోయి చిన్నబోయియున్న వాడైనప్పటికిని తగ్గని పరాక్రమంతో ఆకాసంనుండి క్రిందికి దిగినాడు, కోపం వహించి (గదనుచేత పూనినాడు)

**క. కరమునఁ బవినిభ మగు భీ, కరగద ధరియించి కదియఁగాఁ జనుదేరన్**
**మురహరుఁ డుద్ధతి సాల్వుని, కరము గదాయుక్తముగను ఖండించె నృపా! 911**

**ప్రతి :** నృపా!= పరీక్షిన్మహారాజా!; కరమునన్= సాల్వుడు తనచేతియందు; పవినిభము+అగు= దేవేంద్రుని వజ్రాయుధంవంటిదైన; భీకరగదన్= భయం గొలిపే గదను; ధరియించి= పట్టుకొని; కదియన్+కాన్= (తనను) ఎదిరించడం కోసం; చను+తేరన్= రాగా; మురహరుడు= మురాసురుణ్ణి సంహరించినవాడు (శ్రీకృష్ణుడు); ఉద్ధతిన్= మిగుల కఠినమైన రీతిలో; సాల్వుని కరము= సాల్వునియొక్క చేతిని; గదాయుక్తముగను= గదాయుధంతోపాటుగా; ఖండించెన్= త్రుంచివేసినాడు.

**తా :** ఓ రాజా! సాల్వుడు ఆగ్రహంతో వజ్రాయుధంవంటి భీకరమైన గదను ధరియించి శ్రీకృష్ణుణ్ణి ఎదుర్కోవడానికి వచ్చాడు. వెంటనే శ్రీకృష్ణుడు తన ఖడ్గంతో గదను పూనియున్న వానిచేతిని కఠోరమైనరీతిలో ఖండించివేశాడు.

**క. అంతం బోవక కినుక న, నంతుఁడు విలయార్కమండలాయతరుచి దు**
**ర్దాంతంబగు చక్రంబు ని, తాంతంబుగఁ బూన్చి సాల్వధరణిపు మీఁదన్. 912**

**ప్రతి :** న+అంతుడు (అనంతుడు)= అంతము లేనివాడు (శ్రీకృష్ణుడు); అంతన్+పోవక= అంతటితో ఊరుకొనక; కినుకన్= కోపంతో; విలయ+అర్కమండల= ప్రళయకాలంలోని సూర్యునిబింబాన్ని పోలిన; ఆయత= విశాలమై (గుండ్రనిదై)యున్న; రుచి= కాంతులుగలద్దై; దుర్+దాంతంబు+అగు= అణచడానికి (జయించడానికి) వీలుకానిదైన; చక్రంబు= సుదర్శనచక్రాన్ని; నితాంతంబుగన్= మిగుల అధికంగా (గట్టిగా); పూన్చి= పట్టుకొని; సాల్వధరణిపుమీదన్= సాల్వరాజుమీద...

**తా :** శ్రీకృష్ణుడు అంతటితో ఆగక, ప్రళయకాల సూర్యమండలప్రభలను వెదజల్లుతూ ఉండే అజేయమైన సుదర్శనచక్రాయుధాన్ని చక్కగా చేతిలో ధరించి సాల్వరాజుపై ప్రయోగించాడు.

**క. గురుశక్తి వైచి వెస భా, సురకుండలమకుటరత్నశోభితమగు త**
**చ్ఛిరము వడిఁ ద్రుంచె నింద్రుఁడు, వరకులిశముచేత వృత్రు వధియించుక్రియన్. 913**

**ప్రతి :** గురుశక్తిన్= (శ్రీకృష్ణుడు) గొప్ప బలంతో; వైచి= (సుదర్శన చక్రాన్ని) వేసి; ఇంద్రుడు= దేవతలరాజైన ఇంద్రుడు; వరకులిశముచేతన్= శ్రేష్ఠమైన (శక్తివంతమయిన) వజ్రాయుధంచేత; వృత్రున్= వృత్రుడనే రాక్షసుని; వధియించుక్రియన్= చంపిన ప్రకారంగా; భాసుర= ప్రకాశించుచున్నట్టి; మకుటరత్న= కిరీటమందలి మణుల(కాంతుల)చేత; శోభితము+అగు= ప్రకాశింపజేయబడుచున్నదగు; తద్+శిరమున్= ఆ సాల్వుని తలను; వడిన్= (శౌర్యంతోగూడిన) సామర్థ్యంతో; వెసన్= త్వరగా; త్రుంచెన్= ఖండించినాడు.

**తా :** దేవేంద్రుడు వజ్రాయుధంచేత వృత్రాసురుణ్ణి సంహరించిన విధంగా శ్రీకృష్ణుడు సుదర్శనచక్రంచేత మకుటమణి కాంతులచేత ప్రకాశిస్తూవున్న సాల్వుని శిరస్సును శౌర్యంతో శీఘ్రంగా ఖండించివేశాడు.

## ❖ శ్రీ కృష్ణుండు దంతవక్త్రుని వధించుట ❖

**వ. ఇట్లు మాయావి యైన సాల్వుండును సౌభకంబును గృష్ణుచేతం బొలియుటఁ గనుంగొని నిజసఖులగు సాల్వపౌండ్రకశిశుపాలురకుఁ బారలౌకికక్రియలు మైత్రిం గావించి దంతవక్త్రుం డతిభీషణాకారంబుతో నప్పుడు. 914**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; మాయావి+ఐన= మాయచేత మోసపుచ్చేవాడైన; సాల్వుండును= సాల్వరాజూ; సౌభకంబునున్= ఆతని విమానమైన సౌభకమూ; కృష్ణుచేతన్= శ్రీకృష్ణునివల్ల; పొలియుటన్= నశించిపోవడాన్ని; కనున్+కొని= చూచి (తెలుసుకొని); దంతవక్త్రుండు= శ్రీకృష్ణునిమేనత్త (సాత్వతి) కుమారుడును, శిశుపాలునితమ్ముడును అయిన దంతవక్త్రుడనేవాడు; నిజసఖులు+అగు= తన స్నేహితులయిన; సాళ్వ= సాళ్వుడు; పౌండ్రకవాసుదేవ= పౌండ్రకవాసుదేవుడు; శిశుపాలురకున్= శిశుపాలుడు అనువారికి; మైత్రిన్= (స్వచ్ఛమైన) మిత్రునియొక్క ధర్మంతో; పారలౌకికక్రియలు= పరలోకంలో ఉత్తమగతులు కల్గజేయడానికై చేయు వేదసమ్మతాలైన కర్మలను; కావించి= నెఱవేర్చి; అతిభీషణ+ఆకారంబుతోన్= మిక్కిలి భయంగొలిపెడు ఆకారంతో; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఈ ప్రకారంగా శ్రీకృష్ణుడు కపటియైన సాల్వుణ్ణీ, ఆతనిసౌభకవిమానాన్నీ ధ్వంసంచేయటం తెలుసుకొన్నవాడై, దంతవక్త్రుడు ఆ వాసుదేవునిచే సంహరింపబడిన తన మిత్రుడగు పౌండ్రకవాసుదేవునికీ, తన అన్నయగు శిశుపాలునికీ, స్నేహితుడైన సాల్వునికీ వరుసగా పరలోకక్రియలు చక్కగా నిర్వర్తించాడు. అనంతరం అతిభీషణమైన ఆకారంతో శ్రీకృష్ణుని మీదికి యుద్ధసన్నద్ధుడై వెళ్లాడు.

**చ.** **పెట పెటఁ బండ్లు గీఁటుచును బెట్టుగ మ్రోయుచుఁ గన్ను గ్రేవలం**
**జిటచిట విస్ఫులింగములు చింద మహోద్ధతపాదఘట్టనన్**
**నటనిటనై ధరిత్రి వడఁకాడ వడిన్ గద కేలఁ ద్రిప్పుచున్**
**మిటమిట మండు వేసవిని మించు దివాకరుఁ బోలి యుగ్రతన్. 915**

**ప్రతి :** పండ్లు= నోటిలోని పండ్లవరుసను; పెటపెటన్= పెటపెటమనే ధ్వని కలిగేటట్లుగా; గీటుచునున్= కొఱుకుతూ; బెట్టుగన్= గొప్పగా; మ్రోయుచున్= అఱచుచు; కన్ను+క్రేవలన్= కన్నుల చివరలనుండి; చిటచిట= చిటచిట అనే ధ్వనితోగూడ; విస్ఫులింగములు= నిప్పురవ్వలు; చిందన్= రాలుతుండగా; ధరిత్రి= భూమి; మహా+ఉద్ధత= మిక్కిలి తీవ్రమయిన (గర్వంతోకూడిన); పాదఘట్టనన్= పాదాల తాకిడివల్ల; అటన్+ఇటన్+ఐ= అటు నిటు కదలి; వడకు+ఆడన్= వణకుతూ ఉండగా; గద= గదాయుధాన్ని; కేలన్= చేతితో; వడిన్= వేగంగా; త్రిప్పుచున్= గుండ్రంగా త్రిప్పుతూ; మిటమిట= మిటమిటమని శబ్దం చేసేటట్లుగా; మండు= వెలుగుతున్న; వేసవినిన్= ఎండకాలంలో (గ్రీష్మఋతువునందు); మించు= అతిశయించి ప్రకాశించే; దివాకరున్+పోలి= సూర్యునివలె; ఉగ్రతన్= భయంకరంగా...

**తా :** దంతవక్త్రుడు పండ్లు పటపట కొరుకుతూ, బిగ్గరగా అరుస్తూ కన్నులనుండి మిణుగురులు రాలుస్తూ, కాలితాపులచే నేల వణకేలాగున నడుస్తూ, గదను గిరగిర త్రిప్పుతూ, వేసవియందలి సూర్యబింబంలాగా తీవ్రంగా మండిపడుతూ శ్రీకృష్ణుని మీదికి విజృంభించాడు.

**చ.** **వడిఁ జనుదేరఁ జూచి యదువల్లభుఁ డుల్లము పల్లవింప న**
**ప్పుడు గదఁ గేలఁబూని రథమున్ రయమొప్పఁగ డిగ్గి యుగ్రతం**
**గడఁగి విరోధికి న్నెదురుగాఁ జన వాఁ డతినీచవర్తియై**
**యడరుచు నట్టహాసముఖుడై వలచే గదఁ ద్రిప్పుచున్ హరిన్. 916**

**ప్రతి :** వడిన్= వేగంగా; చను+తేరన్= రాగా; చూచి= చూచినవాడై; యదువల్లభుఁడు= యదువంశానికి అధిపతియైన శ్రీకృష్ణుడు; ఉల్లము= మనస్సు; పల్లవింపన్= చిగిరింపగా (వికసింపగా); అప్పుడు= ఆ సమయంలో వెంటనే; గదన్=

గదాయుధాన్ని; కేలన్+పూని= చేతితో పట్టుకొని; రథమున్= తేరును; రయము+ఒప్పన్+కన్= వేగం విలసిల్లగా; డిగ్గి= దిగి; ఉగ్రతన్= (శత్రువుకు) భీతిగొలుపునట్లుగా; కడగి= పూని; విరోధికిన్= వైరియగు దంతవక్త్రునికి; ఎదురు+కాన్+చనన్= ఎదురుగా వెళ్లగా; వాడు= ఆ దంతవక్త్రుడు; అతినీచవర్తి+ఐ= మిక్కిలి నీచమైన స్వభావంతో ప్రవర్తించినవాడై; అడరుచున్= విజృంభిస్తూ; వలచేన్= కుడిచేతితో; గదన్+త్రిప్పుచున్= గదను గిరగిర త్రిప్పుతున్నవాడై; అట్టహాసముఖుడు+ఐ= పెద్దగా నవ్వుతున్న ముఖంకలవాడై; హరిన్= శ్రీకృష్ణుణ్ణి...

**తా :** ఆ రీతిగా తనపైకి వస్తూ ఉన్న దంతవ్రక్తుణ్ణి చూచి, ఉల్లాసంతోగూడిన మనస్సుతో శ్రీకృష్ణుడుకూడా గదాహస్తుడై రథం దిగినాడు. విరోధికి ఎదురుగా నడిచాడు. మిగుల నీచస్వభావంగల ఆతడు కుడిచేత గదను త్రిప్పుతూ, అట్టహాసం ఉట్టిపడుతుండగా శ్రీహరితో ఇలా చెప్పాడు.

**వ. కనుంగొని పరిహాసోక్తులుగా నిట్లనియె. 'నీవు మదీయభాగ్యంబునం జేసి నేఁడు నా దృష్టిపథంబునకు గోచరుండ వైతివి. మిత్రద్రోహివైన నిన్ను మాతులేయుండ వని మన్నింపక దేహంబునందు వర్తించు నుగ్రవ్యాధి నౌషధాదిక్రియల నివర్తింపఁ జేయు చికిత్సకునిచందంబున బంధురూపశాత్రవుండవు గావున నిన్ను దంభోళిసంరంభగంభీరంబైన మదీయగదాదండహతిం బరేతనివాసంబున కనిచి మున్ను నీచేత నిహతులైన నాదుసఖుల ఋణంబుఁ దీర్తు' నని దుర్భాష లాడుచు డగ్గఱి. 917**

**ప్రతి :** కనున్+కొని= శ్రీహరిని (శ్రీకృష్ణుని)చూచి; పరిహాస+ఉక్తులు+కాన్= గేలి చేసెడి మాటలుగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పల్కినాడు; నీవు= నీవు; మదీయభాగ్యంబునన్+చేసి= నాయొక్క అదృష్టంచేత; నేడు= ఈ రోజు; నా దృష్టి పథంబునకున్= నాకంటి చూపుయొక్క మార్గంలోనికి (వచ్చి); గోచరుండవు+ఐతివి= కనిపించినవాడివైనావు; మిత్రద్రోహివి+ఐన= నాయొక్క స్నేహితులకు ద్రోహం చేసినవాడివైనట్టి (నా స్నేహితులను చంపినట్టి); నిన్నున్= నిన్ను; మాతులేయుండవు+అని= మేనమామ కుమారుడివని; మన్నించక= సహింపక; దేహంబు+అందున్= శరీరంలోపల; వర్తించు= ఉంటున్న; ఉగ్రవ్యాధిన్= మిగుల తీవ్రమైన జబ్బును; ఔషధ+ఆదిక్రియలన్= మందులు (మంత్రములు) మొదలగు చర్యలచే; నివర్తింపన్+చేయు= మరల్చడానికిజేసే (నివారింపజేసే); చికిత్సకుని చందంబునన్= వైద్యునిలాగా; బంధురూప= చుట్టంఆకారంలో ఉన్నటువంటి; శాత్రవుండవు= విరోధివి; కావునన్= అందువలన; నిన్నున్= నిన్ను; దంభోళి సంరంభ= వజ్రాయుధంవంటి తీవ్రత గలిగి ఉండి; గంభీరంబు+ఐన= మిక్కిలి గొప్ప స్వరూపం గలదైన; మదీయ= నాయొక్క; గదాదండ= బలమైన దండంవంటి గద అనే ఆయుధంయొక్క; ఆహతిన్= దెబ్బచేత; పరేత నివాసంబునకున్= యముని ఇంటికి; అనిచి= పంపివేసి; మున్ను= ఇంతకు పూర్వం; నీ చేత= నీవలన; హతులు+ఐన= చంపబడ్డవారైన; నా సఖుల= నా మిత్రులయొక్క; ఋణంబున్= అప్పును; తీర్తును+అని= తీర్చగలను – అని; దుర్+భాషలు= చెడుపలుకులు; ఆడుచున్= మాట్లాడుతు; డగ్గరి= సమీపించి...

**తా :** 'కృష్ణా! నా భాగ్యవశాన నేడు నీవు నాకంటబడినావు. బంధురూపంలో ఉన్న శత్రుడివి నీవు. శరీరంలో ప్రవేశించిన భయంకరమైనవ్యాధిని శక్తిమంతమైన ఔషధంతో నివారింపజేసేవైద్యునివలె నా మిత్రద్రోహివైన నిన్ను – మేనమామ కుమారుడనే ఆదరభావం చూపక ఇంద్రుని వజ్రాయుధంలాంటి నా గదాదండపు పెట్టుచేత యముని లోకానికి పంపిస్తాను. ఆ విధంగా నీవు చంపిన నా మిత్రుల ఋణాన్ని తీర్చుకోగలను' – అంటూ దంతవక్త్రుడు పరిహాస పూర్వకమైన దుర్భాషలాడుతూ శ్రీకృష్ణుణ్ణి సమీపించాడు.

**చ. పెనుగదఁ బూన్చి కృష్ణుతల బెట్టుగ మొత్తిన నంకుశాహతిన్**
**గనలెడి గంధసింధురముకైవడి సింధురభంజనుండు పెం**
**పున పవిభాసమానగదఁ బూని మహోగ్రతఁ ద్రిప్పి దంత వ**
**క్త్రుని యురముం బగిల్చినఁ గుదుల్కొనుచున్ రుధిరంబు గ్రక్కుచున్. 918**

**ప్రతి :** పెనుగదన్= పెద్దదైయున్న గదాయుధాన్ని; పూన్చి= బాగుగా పట్టుకొని; కృష్ణుతలన్= శ్రీకృష్ణునిశిరస్సును; బెట్టుగన్= గట్టిగా; మొత్తినన్= కొట్టగా; అంకుశ+ఆహతిన్= అంకుశంయొక్క దెబ్బచేత; కనలెడి= కోపించునట్టి; గంధసింధురము కైవడిన్= మదించిన ఏనుగువలె (ఆగ్రహించి); సింధుర భంజనుండు= కువలయాపీడమనెడి యేనుగును సంహరించినవాడైన శ్రీకృష్ణుడు; పెంపునన్= అతిశయమైనశక్తితో; పవి= ఇంద్రుని వజ్రాయుధంలాగా; భాసమాన= ప్రకాశిస్తూ ఉన్నట్టి; గదన్= గదాయుధాన్ని; పూని= పట్టుకొని; మహా+ఉగ్రతన్= మిక్కిలి భయాన్ని కల్గించేటట్లుగా; త్రిప్పి= గిరగిర త్రిప్పివైచి; దంతవక్త్రుని+ఉరమున్= దంతవక్త్రుని వక్షఃస్థలాన్ని; పగిల్చినన్= పగులగొట్టగా; గుదుల్+కొనుచున్= మూటకట్టుగా కూలబడిపోవుచు; రుధిరంబు+క్రక్కుచున్= రక్తం కక్కుకొంటూ...

**తా :** అలాగ దుర్భాషలాడుతూ దంతవక్త్రుడు తన గదాదండంతో శ్రీకృష్ణునితలపై మోదినాడు. అంకుశంపోటుచే ఆగ్రహించిన మదపుటేనుగులాగా కోపగించిన శ్రీకృష్ణుడు వజ్రాయుధంవంటి తనగదాయుధాన్ని వేగంగా గిరగిర త్రిప్పివేసి, దంతవక్త్రుని వక్షఃస్థలాన్ని పగులగొట్టాడు. ఆ దెబ్బకు వాడు కుప్పగూలి, రక్తం క్రక్కుతూ పడిపోయాడు.

**వ. తత్క్షణంబ పర్వతాకారంబగు దేహంబుతో నొఱలుచు నేలం గూలి కేశపాశంబులు సిక్కువడఁ దన్నుకొనుచుఁ బ్రాణంబులు విడిచె; నప్పుడు నిఖిలభూతంబులు నాశ్చర్యంబు వొందఁ దద్గాత్రంబున నుండి యొక్క సూక్ష్మ తేజంబు వెలువడి గోవిందునిదేహంబుఁ బ్రవేశించె, నయ్యవసరంబున నగ్రజుమరణంబు గనుంగొని కుపితుండై కనుఁగవల నిప్పు లుప్పతిల్ల విదూరథుండు గాలానలజ్వాలాభీలకరాళంబైన కరవాలంబును బలకయుం గేలం దాల్చి దామోదరుదెసకుఁ గవయుటయుం గనుంగొని. 919**

**ప్రతి :** తత్క్షణంబు+అ= ఆ వెనువెంటనే; పర్వత+ఆకారంబు+అగు= కొండవంటిఆకారం (పరిమాణం) గలిగిన; దేహంబుతోన్= శరీరంతో; ఒఱలుచున్= దుఃఖిస్తు; నేలన్+కూలి= భూమిపై బడినవాడై; కేశపాశంబులు= (తలయందలి) పొడుగాటి (త్రాళ్లవంటి) వెంద్రుకలు; చిక్కు+పడన్= చిక్కుపడిపోయేట్టుగా; తన్నుకొనుచున్= (బాధచేత) కాళ్లను విదిలించుతూ; ప్రాణంబులు= ప్రాణాలు; విడిచెన్= విడిచిపెట్టినాడు; అప్పుడు= ఆ సమయంలో; నిఖిలభూతంబులున్= సమస్తప్రాణులు; ఆశ్చర్యంబున్+ఒందన్= ఆశ్చర్యపడి చూస్తూ ఉండగా; తద్+గాత్రంబునన్+ఉండి= ఆతనియొక్క శరీరంనుండి; ఒక్క సూక్ష్మతేజంబు= సన్నని యాకారం గల్గిన కాంతి స్వరూపం; వెలువడి= వెలుపలికి వచ్చి; గోవిందుని దేహంబున్= శ్రీకృష్ణుని శరీరాన్ని; ప్రవేశించెన్= ప్రవేశించింది; ఆ+అవసరంబునన్= ఆ సందర్భంలో; అగ్రజమరణంబున్= తన అన్నయొక్క మృతిని; కనున్+కొని= చూచినవాడై; కుపితుండు+ఐ= కోపగించినవాడై; విదూరథుండు= విదూరథుడనేవాడు; కనున్+కవల= రెండు నేత్రాలనుండి; నిప్పులు+ఉప్పతిల్లన్= (కోపంచేత) అగ్గిరవ్వలు వెలువడుతుండగా; కాల+అనలజ్వాలా= ప్రళయకాలంలో మండే అగ్నిజ్వాలలాగా; ఆభీలకరాళంబు+ఐన= (చూడగానే) భయంకరమై, వెఱపు పుట్టించేదైన; కరవాలంబునున్= ఖడ్గాన్ని; పలకయున్= డాలును; కేలన్+తాల్చి= చేతియందు ధరించి; దామ+ఉదరుదెసకున్= శ్రీకృష్ణుని వైపునకు; కవియుటన్= పరుగెత్తి రావటాన్ని; కనున్+కొని= చూచి...

**తా :** ఆ క్షణంలోనే దంతవక్త్రుడు పర్వతంలాంటి శరీరంతో నేలపై బడి తన్నుకొంటూ ప్రాణాలు విడిచినాడు. ఆ దృశ్యాన్ని చూస్తున్న సమస్తప్రాణి సమూహం ఆశ్చర్యపడుతూవుండగా, ఒకానొక సూక్ష్మతేజస్సు ఆతని శరీరంలోనుండి బయలువెడలి శ్రీకృష్ణునిలో ప్రవేశించింది. ఆ సమయంలో దంతవక్త్రుని తమ్ముడైన విదూరథుడు మిగులకోపంతో ప్రళయాగ్ని జ్వాలలాగా అత్యంత భీకరమైయున్న ఖడ్గాన్నీ, డాలునూ ధరించి, శ్రీకృష్ణునిమీదికి దూకినాడు.

**చ. జలరుహలోచనుండు నిజసాధనమై తనరారుచక్రమున్**
**వలనుగఁ బూన్చి వైవ నది వారక వానిశిరంబు ద్రుంచె న**
**బ్బలియుఁడు సౌభ సాల్వ శిశుపాల సహోదర తత్సహోద రా**
**వలుల వధించి తత్కులమువారి ననేకులఁ ద్రుంచె నీ గతిన్. 920**

**ప్రతి :** జలరుహలోచనుండు= తామరపూరేకులవంటి అందమైన, విశాలమైన కన్నులుగలవాడు (శ్రీకృష్ణుడు); నిజసాధనము+ఐ= యుద్ధంలో తనకు ముఖ్యఉపకరణమై; తనరు+ఆరు= ప్రకాశించునట్టి; చక్రమున్= సుదర్శన చక్రాన్ని; వలనుగన్= నేర్పుతో; పూన్చివైవన్= ధరించి ఆతనివైపు ప్రయోగించగా; అది= ఆ సుదర్శనం; వారక= తప్పక; వానిశిరంబున్= ఆ విదూరథుని తలను; త్రుంచెన్= ఖండించి వేశాడు; ఆ+బలియుడు= బలవంతుడైన ఆ శ్రీకృష్ణుడు; సౌభ= సౌభమనే మాయాశక్తిగలిగిన విమానపురాన్ని; సాల్వ= సాల్వుణ్ణి; శిశుపాల సహోదర= శిశుపాలుని తమ్ముడయిన దంతవక్త్రుణ్ణి; తత్+సహ+ఉదర+ఆవలులన్= అతని తమ్ముడైన విదూరథుణ్ణి, వానిని అనుసరించి (యెదిరింపవచ్చిన) సమూహాన్ని; వధించి= చంపివేసి; ఈ గతిన్= ఇదే విధంగా; తత్+కులమువారిన్= ఆ వంశానికి చెందిన వాళ్లనూ; న+ఏకులన్ (అనేకులన్)= చాలమందిని; త్రుంచెన్= సంహరించాడు.

**తా :** శ్రీకృష్ణుడు తన సుదర్శనాయుధాన్ని నిపుణతతో ప్రయోగించి విదూరథుని శిరస్సును త్రుంచివేశాడు. బలవంతుడైన ఆ కమలలోచనుడు ఈ రీతిగా సౌభకాన్ని, సాల్వుణ్ణి, శిశుపాలుని సోదరుడైన దంతవక్త్రుణ్ణి, వాని తమ్ముడైన విదూరథుణ్ణి, తనను ఎదిరించడానికి వచ్చిన అతని సోదరులను, అలాగే ఆ వంశీయులు చాలమందినీ సంహరించాడు.

**వ. అ య్యవసరంబున. 921**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సందర్భంలో...

**తా :** ఆ రీతిగా శ్రీకృష్ణుడు విదూరథుణ్ణి, వాని వంశంవారిని సంహరించిన సమయంలో

**క. నరమునియోగిసురాసుర, గరుడోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభ**
**శ్చర కిన్నరకింపురుషులు, హరిమహిమ నుతించి రద్భుతానందములన్. 922**

**ప్రతి :** నర= మానవులు; ముని= మునులు; యోగి= యోగులు; సుర= దేవతలు; అసుర= రాక్షసులు; గరుడ= గరుడులూ; ఉరగ= ఉరగులు; సిద్ధ= అరుదైన శక్తులుగల సిద్ధులు; సాధ్య= సాధ్యులనే దేవతాజాతీయులు; నభస్+చర= ఆకాసంలో సంచరించే; కిన్నర= గుర్రపు ముఖం, నరశరీరం గలిగిన దేవజాతివారు; కింపురుషులు= మానవ శిరస్సు, గుర్రపుశరీరం గలిగిన దేవజాతివారు; హరిమహిమన్= శ్రీకృష్ణుని ప్రభావాన్ని; అద్భుత+ఆనందములన్= ఆశ్చర్యంతోనూ, సంతోషంతోనూ, నుతించిరి= కొనియాడారు.

**తా :** ఆ సమయంలో నరులూ, మునులూ, యోగులూ, దేవతలూ, రాక్షసులూ, గరుడులూ, నాగులూ, సిద్ధులూ, సాధ్యులూ, గంధర్వులూ, తరచుగా ఆకాశంలో సంచరిస్తూ ఉండే కిన్నరులూ, కింపురుషులూ మొదలైనవారందరూ ఆశ్చర్యంతోనూ, ఆనందంతోనూ శ్రీకృష్ణుని మహిమను ప్రస్తుతించారు.

**వ. మఱియు నప్సరోజనంబులు నృత్యంబులు సలుప, వేల్పులు కుసుమవర్షంబులు గురియ, దేవతూర్యంబు లవార్యంబులై మొరయ, యదువృష్ణిప్రవరులు సేవింపఁ, బరమానందంబును బొంది నిజవిజయాంకితంబులైన గీతంబుల వందిజనంబులు సంకీర్తనంబులు సేయ, నతిమనోహరవిభవాభిరామంబును, నూతనాలంకారంబును నైన ద్వారకానగరంబు శుభముహూర్తంబునం బ్రవేశింపం జనునెడ. 923**

**ప్రతి :** మఱియున్= అంతేగాక; అప్సరస్+జనంబులు= దేవవేశ్యల సమూహాలు; నృత్యంబులు+చలుపన్= నాట్యాలు చేయగా; వేల్పులు= దేవతలు; కుసుమవర్షంబులు= పూలవానలు; కురియన్= ఆకాశంనుండి కురియించగా; దేవతూర్యంబులు= దేవతల మంగళవాద్యాలు; అవార్యంబులు+ఐ= నివారించుటకు వీలుకానంతటి సమృద్ధిగలవై; మొరయన్= ధ్వనిస్తుండగా; యదువృష్ణి ప్రవరులు= యదువంశీయులలోను, వృష్ణివంశమువారిలోను ప్రముఖులైన వ్యక్తులు; సేవింపన్= భక్తితో తనను అనుసరించి వస్తూ ఉండగా; పరమ+ఆనందంబును= అధికమయిన సంతోషాన్ని; పొంది= అనుభవించినవాడై నిజవిజయ= తనయొక్క విజయగాథలచేత; అంకితంబులు+అయిన= సమకూర్చబడినవైన; గీతంబులన్= పాటలను; వందిజనంబులు= (ఆస్థానాల్లో) స్తోత్రాలు చేసేవారు; సంకీర్తనంబులు+చేయన్= చక్కగా పాడుతుండగా; అతిమనస్+హర= మనస్సుల్ని ఎంతో ఆకర్షించే; విభవ= గొప్పతనంచే; అభిరామంబును= మిగుల ఒప్పుచున్నదియును; నూతన+ అలంకారంబును= కొంగ్రొత్తగా అలంకరింపబడియున్నదియును; ఐన= అయియున్నట్టి; ద్వారకానగరంబున్= తన రాజధానియైన ద్వారకానగరాన్ని; శుభముహూర్తంబునన్= మంచి ముహూర్తంలో; ప్రవేశింపన్+చను+ఎడన్= (శ్రీకృష్ణుడు) ప్రవేశించుటకై వెళ్ళుతూవుండగా...

**తా :** అప్సరసలు నృత్యాలు చేస్తూ ఉండగా, దేవతలు పుష్పవర్షాలు కురిపిస్తూ ఉండగా, దేవదుందుభులు బ్రహ్మాండంగా మ్రోగుతూ ఉండగా, యదువృష్ణి వీరవరులు అనుసరించి నడువగా, వందిమాగధులు తన విజయగాథల గీతాలను ఆలాపిస్తూ ఉండగా వాసుదేవుడు మహావైభవంతో శుభముహూర్తంలో చక్కగా అలంకరింపబడిన ద్వారకా నగరం ప్రవేశించాడు.

**క. పురసతులు విరులు లాజలు, గురుసౌధాగ్రములనుండి కురియఁగ వికచాం**
**బురుహాక్షుం డంతఃపుర, వర మర్థిం జొచ్చె వైభవం బలరారన్. 924**

**ప్రతి :** పురసతులు= ద్వారకానగరంలో నివసిస్తూన్న పుణ్యాంగనలు; గురుసౌధ+అగ్రములనుండి= పెద్దవైన (ఎత్తైన) మేడల పైభాగాలనుండి; విరులు= పూవులు; లాజలు= నీటిలో కొద్దిగా తడిపి తయారు చేసిన మంగళకరాలైన అక్షతలు (అక్షతలు); కురియగన్= కురిపిస్తూ ఉండగా; వికచ+అంబురుహ+అక్షుండు= బాగుగా వికసించిన తామరపూవువలె అందమై; విశాలమైయున్న కన్నులుగలవాడు (శ్రీకృష్ణుడు); వైభవంబు+అలరారన్= గొప్పతనం విలసిల్లగా; అంతఃపురవరము= ఉత్తమమైన అంతఃపురాన్ని; అర్థిన్= ప్రీతితో; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తా :** ఆ వేళలో ద్వారకపురమందలి పుణ్యస్త్రీలు ఎత్తైన మేడలమీది నుంచి తనపై మంగళాక్షతలను కురిపిస్తూవుండగా, శ్రీకృష్ణుడు శుభముహూర్తంలో ఆనందంతో అంతఃపురాన్ని ప్రవేశించాడు.

**విశే :** అధిపతి శత్రువులను జయించి రాజధానిని ప్రవేశించినప్పుడు పుణ్యస్త్రీలు మేడలమీదనుండి ఆయనపై మంగళకరంగా పూవులతో కూడిన అక్షతలను చల్లటం భారతదేశంలో ప్రాచీనకాలంనుండీ ఆచరింపబడుతూవున్న ఉత్తమమైన ఆచారం.

**వ. అట్లు యోగీశ్వరేశ్వరుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును, నిఖిలజగదీశ్వరుండును నైన పురుషోత్తముండు సుఖంబుండె నంత. 925**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా (పురప్రవేశం కావించి); యోగి+ఈశ్వర+ఈశ్వరుండును= యోగులలో శ్రేష్ఠులైన వారందరికీ ఉత్తముడైనవాడును; షట్+గుణ= ఆఱు ప్రశస్తగుణములతోనూ; ఐశ్వర్య= ఎనిమిదివిధాలైన ఐశ్వర్యాలతోనూ; సంపన్నుండును= కూడుకొని ఉన్నవాడును; నిఖిలజగత్= సమస్త ప్రపంచానికి; ఈశ్వరుండునున్+ఐన= పాలకుడైన; పురుష+ఉత్తముండు= పురుషులందరిలోకీ శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుడు; సుఖంబు+ఉండెన్= సంతోషంతో ఉన్నాడు; అంతన్= అటుపిమ్మట...

**తా :** ఆ రీతిగా యోగీశ్వరేశ్వరుడూ, షడ్గుణైశ్వర్యసంపన్నుడూ, సమస్తజగత్తుకు అధిపతీ అయిన శ్రీకృష్ణుడు ద్వారకానగరిలో సంతోషంగా ఉన్నాడు. ఆ తర్వాత

**క. కౌరవపాండవపృథుసమ, రారంభ మెఱింగి తీర్థయాత్ర నెపముగా**
**సీరాంకుఁ డుభయకులులకు, నారయ సముఁ డగుటఁ జేసి యరిగె నరేంద్రా! 926**

**ప్రతి :** నర+ఇంద్రా!= నరపతీ! (పరీక్షిత్ రాజేంద్రా!); సీర+అంకుఁడు= నాగలి గుర్తుగా గలవాడు – బలరాముడు; కౌరవపాండవ= కౌరవుల, పాండవులయొక్క; పృథు= గొప్పదైన; సమర+ఆరంభము= యుద్ధం మొదలయ్యే సంగతిని; ఎఱింగి= ముందుగానే తెలుసుకొన్నందున; ఆరయన్= ఆలోచించిచూడగా; ఉభయకులులకున్= ఆ రెండువంశాల వారికిని; సముఁడు+అగుటన్+చేసి= సమానుడై ఉన్నందువలన; తీర్థయాత్ర నెపము+కాన్= పుణ్యతీర్థాలకు యాత్ర కావించడం అనే మిషతో; అరిగెన్= వెళ్లాడు.

**తా :** పరీక్షిన్మహారాజా! బలరామదేవుడు కౌరవపాండవయుద్ధం త్వరలో ప్రారంభం కానున్నదని తెలుసుకొన్నవాడై ఇరు పక్షాలకూ సమానంగా కావలసినవాడు కాబట్టి, తీర్థయాత్రలు చెయ్యాలనే నెపంతో ద్వారకనుండి తరలివెళ్లాడు.

## ✣ బలరాముండు తీర్థయాత్రకుఁ జనుట ✣

**వ. అట్లు సని మొదలం బ్రభాసతీర్థంబున నవగాహంబు సేసి, యందు దేవర్షిపితృతర్పణంబులు సంప్రీతిం గావించి విమలతేజోధనులగు భూసురప్రవరులు దనతో నరుగుదేరం గదలి చని క్రమంబున సరస్వతియు బిందుసరోవరంబును వజ్రతీర్థంబును విశాలానదియు సరయువును యమునయు జాహ్నవీ తీర్థంబును గనుంగొనుచు నచట నచట నవగాహనదేవర్షిపితృతర్పణబ్రాహ్మణసంతర్పణంబులను భూసురయుక్తుండై నడపుచుం జని సకలలోక స్తుత్యంబును నిఖిలముని శరణ్యంబు నగు నైమిశారణ్యంబు సొచ్చి, యందు దీర్ఘసత్త్రంబు నడపుచున్న మునిజనంబులం గనుంగొనిన వారును ప్రత్యుత్థానంబు సేసి రామునకు వినతులై యాసన పూజావిధానంబులు గావించిన నతండును బ్రముదితమానసుం డగుచు సపరివారంబుగాఁ గూర్చున్న యెడ. 927**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; చని= తీర్థయాత్రకు వెడలి; మొదలన్= తొలుత; ప్రభాస తీర్థంబునన్= 'ప్రభాసం' అనే పేరుగల పుణ్యతీర్థంలో; అవగాహంబు+చేసి= మునిగి (స్నానంచేసి); అందున్= ఆ పుణ్యతీర్థంలో; దేవ+ఋషి+పితృ= దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు; తర్పణంబులు= మంత్రపూర్వకంగా తృప్తిని కలిగించే కార్యాలను; సంప్రీతిన్= ఎంతో శ్రద్ధాసక్తులతో; కావించి= చేసి; విమల తేజస్+ధనులు+అగు= స్వచ్ఛమైన బ్రహ్మతేజస్సే ధనంగా గలవారయిన; భూసురప్రవరులు= ఉత్తములైన బ్రాహ్మణులు; తనతోన్= తనవెంట; అరగు+తేరన్= రాగా; కదలి చని= ప్రయాణమై; క్రమంబునన్= వరుసగా; సరస్వతియున్= సరస్వతీనదిని; బిందుసరోవరంబును= బిందుసరస్సును; వజ్రతీర్థంబును= వజ్రతీర్థాన్ని; విశాలానదియున్= 'విశాలా' అనే నదిని; సరయువును= సరయూనదిని; యమునయున్= యమునానదిని; జాహ్నవీ తీర్థంబును= గంగా నదిని; కనున్+కొనుచున్= సందర్శిస్తూ; అచటన్+అచటన్= ఆయాపుణ్యనదీ తీర్థాలలో; అవగాహనంబులును= మునుగుటలును (పవిత్రస్నానాలను); దేవ+ఋషి+పితృ తర్పణంబులును= దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు, తర్పణకార్యాలను; భూసురసంతర్పణంబులును= బ్రాహ్మణులకు భోజనాలను సమర్పించడంద్వారా సంతోషింపజేసి; భూసురయుక్తుండు+ఐ= తన వెంట వచ్చిన బ్రాహ్మణులతో కూడుకొన్నవాడై; నడపుచున్= ఆచరిస్తూ; చని= ముందుకేగి; సకలలోక= సమస్తలోకాలవారిచేత; స్తుత్యంబును= కొనియాడదగిందై ఉన్న; నిఖిలమునిజనశరణ్యంబున్+అగు= మునిజనులకందరికీ నిలయమై ఉన్న; నైమిశ+అరణ్యంబున్= నైమిశమనే పేరుగల అడవిని; చొచ్చి= ప్రవేశించి; అందున్= (పవిత్రమైన) ఆ అరణ్యంలో; దీర్ఘసత్త్రంబు= బహుకాలపరిమితిగల గొప్ప యజ్ఞాన్ని; నడపుచున్న= నిర్వహిస్తున్న; మునిజనంబులన్= మునుల సమూహాన్ని; కనున్+కొనినన్= దర్శించగా; వారును= ఆ మునీశ్వరులును; ప్రతి+ఉత్థానంబు+చేసి= భక్తి గౌరవాలచే ఎదురేగి వచ్చి; రామునకున్= బలరామదేవునికి; వినతులు+ఐ= వినయంతో నమస్కారాలు చేసినవారై; ఆసన= కూర్చోవడానికి తగిన పీఠాన్ని; అర్ఘ్య+ఆది= పూజించడానికి తగిన వస్తువుల్ని సమర్పించడంలో; పూజావిధానంబులు= పూజించేటటువంటి కార్యక్రమాలను; కావించినన్= నెరవేర్చగా; అతండును= ఆ బలరామదేవుడును; ప్రముదితమానసుండు+అగుచున్= సంతోషంతో మనస్సు నిండినవాడై; సపరివారంబు+కాన్= తన వెంట వచ్చిన విప్రోత్తములు మొదలైనవాళ్లతో కూడ; కూర్చున్న+ఎడన్= కూర్చున్నప్పుడు...

**తా :** ఆ విధంగా బలరాముడు తీర్థయాత్రలకు బయలుదేరి మొదట ప్రభాసతీర్థానికి వెళ్లి, పుణ్యస్నానం ఆచరించి, ప్రీతితో దేవతలకు, ఋషులకు, పితృదేవతలకు తర్పణాలు వదిలాడు. బ్రాహ్మణోత్తములు వెంటరాగా, సరస్వతీనది, బిందు సరోవరం, వజ్రతీర్థం, విశాలానది, సరయూనది, యమున, గంగ మున్నగుపుణ్యనదుల్లో స్నానాలు చేసి, దేవ, ఋషి, పితృగణాలకు తర్పణాలు నిర్వహించాడు. బ్రాహ్మణశ్రేష్ఠులకు సంతర్పణలు చేశాడు. అనంతరం సమస్తలోకాలకు స్తుతి పాత్రమైందీ, సకల మునిసమాజానికి నివాసమూ - అయిన నైమిశారణ్యంలోకి ప్రవేశించాడు. ఆ సమయంలో ఆ మునీశ్వరులు సుదీర్ఘకాలికమైన సత్రయాగాన్ని నిర్వహిస్తున్నారు. వారందరూ బలరామునికి భక్తితో ఎదురేగి, వినయంతో స్వాగతం పలికి, అతిథి సత్కారాలు ఆచరించారు. అందుకు ఆనందించి, బలరాముడు సపరివారంగా ఆసీనుడైనాడు.

**విశే :** "ప్రభాసము" : సౌరాష్ట్రదేశంలో సరస్వతీనది పడమటిసముద్రంలో కలిసేచోట వెలసియున్న పుణ్యతీర్థం. చంద్రుడు ఈ నదిలో స్నానంచేసి, తనకృశత్వాన్ని వదిలించుకొని ప్రభాసుడైనాడు. ఇందువలన ఆ తీర్థానికి 'ప్రభాస తీర్థ'మనే నామధేయం సార్థకంగా ఏర్పడింది.

**క.** **ఆ నెఱిఁ దనుఁ గని ప్రత్యు, త్థాన నమస్కారవిధులు దగ నడపక పెం**
**పూనిన పీఠముపై నా, సీనుండగు సూతు శేముషీవిఖ్యాతున్.** **928**

**ప్రతి :** ఆ నెఱిన్= ఆ క్రమంలో; తనున్+కని= తనను చూచి; ప్రతి+ఉత్థాన= భక్తి గౌరవాలతో లేచి ఎదురు వెళ్లటం; నమస్కారవిధులు= నమస్కారం చేయటంలాంటి చర్యలు; తగన్+నడపక= సముచితరీతిని చేయకుండా; పెంపు+ఊనిన= గొప్పతనం పెంపొందిన; పీఠముపైన్= ఉన్నతమగు ఆసనంమీద; ఆసీనుండు+అగు= కూర్చొనియున్న; శేముషీవిఖ్యాతున్= ప్రజ్ఞచేత ప్రసిద్ధి చెందినవాణ్ణి; సూతున్= సూతుడనే పౌరాణికుణ్ణి...

**తా :** ఆ సమయంలో తక్కిన మునులలాగా తన కెదురేగి వచ్చి నమస్కారాది సముచిత కార్యాలను చెయ్యకుండా ఉన్నతాసనంమీద అలాగే కూర్చుండిన ప్రజ్ఞాసముపేతుడైన సూత పౌరాణికుణ్ణి

**విశే :** "జ్ఞానవయోవృద్ధుడు వచ్చినప్పుడు యువకుడుగా ఉన్నవాడి ప్రాణాలు నిలువున పైకి పోవడానికి ప్రయత్నిస్తాయి. కాబట్టి, చిన్నవయస్సులో ఉన్నవాడు కూర్చున్నస్థానం నుండి లేచి, ఎదురేగి నమస్కరించి, మర్యాద చేయడంవలన ఆ ప్రాణాలు పోకుండా నిలుస్తాయి." అని మనుధర్మశాస్త్రం సూచించింది. (మను-2-120)

**వ. కనుంగొని యతనిసమీపంబున నున్న విప్రవరులం జూచి రాముండు రోషించి 'వీఁడు నన్నుఁ గని లేవకుండుటకు హేతు వెయ్యదియొకో? ఈ ప్రతిలోమజాతుండు మునిగణసభాస్థలంబునఁ దానొక్క ముఖ్యుండపోలె దురభిమానంబున శక్తిమనుమనివలనం గొన్నికథలు గాథలు గఱచి విద్వద్గణ్యుని విధంబున విఱ్ఱవీఁగెడును; నీచాత్ముం డభ్యసించు విద్యలెల్లను మనంబున విచారించి చూచిన మదకారణంబులు గాని సత్త్వగుణగరిష్ఠంబులు గావు, ధర్మసంరక్షణంబు సేయ నవతరించిన మాకు నిట్టి దుష్టమర్దనం బవశ్యకర్తవ్యం, బని తలఁచి హస్తంబున ధరించిన కుశాగ్రంబున నా సూతుని వధించిన నక్కడి మునీంద్రు లెల్ల హాహాకారంబుల తోడం దాలాంకునిఁ జూచి యిట్లనిరి. 929**

**ప్రతి :** కనున్+కొని= చూచి; అతని సమీపంబునన్= ఆ సూతునికి దగ్గరగా ఉన్నట్టి; విప్రవరులన్= బ్రాహ్మణ శ్రేష్ఠులను; చూచి= చూచి; రాముఁడు= బలరాముడు; రోషించి= కోపగించినవాడై; వీఁడు= ఈ సూతుడు; నన్నున్+కని= (పూజ్యుడనైన) నన్ను చూచికూడా; లేవక+ఉండుటకున్= గౌరవసూచకంగా లేవక అలాగే కూర్చొని ఉండటానికి; హేతువు= కారణం; ఏ+అది+ఒకో?= ఏదో?; ఈ ప్రతిలోమ జాతుండు= ఉన్నత కులానికిచెందిన స్త్రీకి, తక్కువకులంలో పుట్టిన పురుషునికి జన్మించిన ఇతడు (సూతుడు); మునిగణ= మునుల సమూహంతోగూడిన; సభాస్థలంబునన్= సభాప్రదేశంలో; తాను= తాను; ఒక్క ముఖ్యుండు+అ+పోలెన్= అందరికన్నా ప్రముఖుడయిన వ్యక్తివలె; శక్తిమనుమని వలనన్= శక్తి మహామునియొక్క మనుమడైన వేదవ్యాసునివల్ల; కొన్ని కథలు, గాథలు= కొన్ని కథలను, కొన్ని చరిత్రలను; కఱచి= నేర్చుకొని; విద్వత్+గణ్యుని విధంబునన్= విద్వాంసులలో లెక్కింపదగ్గవాణ్ణి; దుర్+అభిమానంబునన్= చెడ్డదైన అహంభావంతో; వీగెడును+ వీఁగెడును= అతిశయంగా గర్విస్తున్నాడు; ఇట్టి నీచ+ఆత్ముండు= ఇలాంటి అల్పమైన మనస్సు (భావన)కలవాడు; అభ్యసించు= నేర్చేటటువంటి; విద్యలు+ఎల్లను= విద్యలన్నీ; మదకారణంబులు+కాని= గర్వాన్ని కల్గించేవేగాని, సత్త్వగుణ= నిర్మలమైన సత్త్వగుణంచేత; గరిష్ఠంబులు+కావు= శ్రేష్ఠమైనవి కావు; ధర్మసంరక్షణంబు+చేయన్= ఈ లోకంలో ధర్మాన్ని కాపాడటానికి; అవతరించిన= మనుష్యరూపంతో జన్మించినట్టి; మాకున్= మాకు; ఇట్టి= ఇలాంటి; దుష్టమర్దనంబు= దుర్మార్గులను సంహరించటం; అవశ్యకర్తవ్యంబు= తప్పనిసరిగా చేయదగి ఉంది; అని తలంచి= అని మనస్సునందు నిశ్చయించి; హస్తంబునన్= చేతియందు; ధరించిన= తాల్చి ఉన్న; కుశ+అగ్రంబునన్= దర్భగడ్డియొక్క కొనతో; ఆ సూతునిన్= అక్కడ

కూర్చుండి ఉన్న సూతుణ్ణి; వధించినన్= చంపగా; అక్కడి ముని+ఇంద్రులు+ఎల్లన్= అక్కడ నున్న మునీశ్వరులందరూ; హాహాకారంబులతోడన్= అధికమైన విచారాన్ని వెల్లడించే 'హా! హా!'యనే శబ్దాలను చేస్తున్నవారై; తాల+అంకునిన్+చూచి= తాటిచెట్టు (జండాపై) గుర్తుగా గలవాడైన బలరాముణ్ణి చూచి; ఇట్లు+అనిరి= ఈ ప్రకారంగా అన్నారు.

**తా :** సూతుడు తనను జూచి లేవనందుకు బలరాముడు కోపించాడు. వెంటనే అచ్చటి ఋషులను చూచి ఇలా పల్కాడు 'వీడు మహర్షులసభలో తానే పెద్దగా భావించి, దురభిమాని ఐనాడు. వ్యాసునివద్ద కొన్ని కథలూ, గాథలూ నేర్చుకొని విద్వాంసుడినని విర్రవీగుతున్నాడు. విద్య ఇలాంటి అల్పులలో గర్వాన్నే పెంచుతుందిగాని సత్త్వగుణాన్ని పెంపొందించదు కదా! ధర్మాన్ని సంరక్షించేందుకై అవతరించిన మాకు ఇలాంటి దుష్టుల్ని శిక్షించడం అవశ్యకర్తవ్యం' - అని పలుకుతూ తన చేతిలోగల దర్భపోచయొక్క కొనతో సూతుణ్ణి సంహరించాడు. అది చూచి అక్కడి మునీంద్రులందరూ హాహాకారాలు చేశారు. అనంతరం బలరామునితో ఇలా పల్కినారు.

**విశే :** సూతుడు : క్షత్రియునికి బ్రాహ్మణస్త్రీయందు జన్మించినవాడు; లేదా వైశ్యునికి క్షత్రియస్త్రీయందు జన్మించినవాడు సూతుడు. అందువల్లనే బలరాముడు సూతుణ్ణి 'ప్రతిలోమజాతుడు' - అని పేర్కొనినాడు. ద్వాపరయుగంలోని భారతీయసమాజంలో సూతకులస్థులు విద్యావేత్తలైన పౌరాణికులుగా, యుద్ధనీతినిపుణులుగా, రథసారథులుగా ప్రముఖస్థానాన్ని వహించియుండినారు.

**క. అనఘా! యితనికి బ్రహ్మా, సన మే మిచ్చుటను నీవు సనుదే నితఁ డా**
**సనము దిగఁ డయ్యె నింతయు, మును నీమది నెఱుఁగ నర్థముం గలదె? హలీ! 930**

**ప్రతి :** అనఘా!= పాపంలేనివాడా! (మహాత్మా!); హలీ!= నాగలిని ధరించువాడా! (బలరామా!); మేము= నైమిశారణ్యంలోని ఋషులమైన మేమందరం; ఇతనికిన్= ఈ సూతపౌరాణికునికి; బ్రహ్మ+ఆసనము= ఉత్తముడయిన బ్రాహ్మణునికి ఇయ్యదగిన స్థానాన్ని; ఇచ్చుటను= ఇచ్చి ఉన్నందున; ఇతడు= ఈ సూతుడు; నీవు+చనుదేన్= నీ విచ్చటికి విచ్చేయగా; ఆసనము= అట్లుమే మిచ్చిన ఉన్నతపీఠంనుండి; దిగడు+అయ్యెన్= దిగకుండా ఉండినాడు; ఇంతయున్= ఈ విషయమంతా; మును= ముందుగా; నీ మదిన్= నీయొక్క మనస్సునందు; ఎఱుగని+అర్థమున్+కలదె?= తెలియజాలని సంగతి అంటూ ఉంటుందా? (ఉండదు కదా!)

**తా :** మహానుభావా! బలరామా! మా కందరికీ పురాణాలు వివరిస్తూ ఉన్న ఈ సూతునికి (ఈ యజ్ఞంపూర్తి అయ్యేదాకా) శ్రేష్ఠమైన బ్రహ్మాసనాన్ని మేమే ఏర్పరచాము. అందువల్లనే నీవు వచ్చినప్పుడు ఈతడు బ్రహ్మాసనంనుండి దిగలేదు. (అవతార పురుషుడవయిన) నీ మనస్సుకు ముందుగా ఈ విషయం తెలియకుండా ఉంటుందా? (ఉండదు కదా!)

**క. ఎఱిఁగెఱిఁగి బ్రహ్మహత్యా, దురితంబున నీమనంబు దూకొనెఁ బాపో**
**త్తరణప్రాయశ్చిత్తము, దొరఁకొని కావింపు మయ్య దుర్జనహరణా! 931**

**ప్రతి :** దుర్జనహరణా!= పాపాత్ములైనవారిని సంహరించువాడా!; ఎఱిగి+ఎఱిగి= తెలిసి తెలిసి; నీ మనంబు= నీ మనస్సు; బ్రహ్మహత్యా= బ్రాహ్మణుని సంహరించుట అనేటటువంటి; దురితంబునన్= పాపమునందు; దూఁట+కొనెన్= చొఱవతో; పాప+ఉత్తరణ= ఈ పాతకంనుండి దాటుటకు అనువయిన; ప్రాయశ్చిత్తమున్= పాపపరిహారమునకై చేయదగియుండు కర్మమును; దొరకొని= ప్రయత్నించి; కావింపుము+అయ్య= చేయవయ్యా!

**తా :** దుష్టులను సంహరించే స్వభావంగల బలరామదేవా! తెలిసితెలిసీ నీవు బ్రహ్మహత్యాపాతకానికి పాల్పడినావు. ఈ పాప నివారణకు తగిన ప్రాయశ్చిత్తకార్యాన్ని వెంటనే ప్రారంభించవలసింది.

**విశే :** సూతుడు పుట్టుకచేత బ్రాహ్మణేతరుడైనను నైమిశారణ్యఋషులు తమ తపశ్శక్తివల్ల ఉన్నతమగు బ్రహ్మాసనంపై ఆయన్ను కూర్చుండజేసినారు. ఆ విధంగా అతనికి బ్రాహ్మణత్వం ప్రాప్తించింది. ఆతణ్ణి సంహరించినందున బలరామునికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకొనింది.

**వ. అదియునుం గాక పరమపావనుండవైన నీవు ధర్మంబు దప్పిన నెవ్వరు మాన్పంగలరు? కావునఁ బ్రాయశ్చిత్తంబు గైకొని నడపకున్న ధర్మంబు నిలువ; దట్లు గావున దీనికిఁ బ్రతీకారంబు పుట్టింపు' మనిన నతండు వారలం గనుంగొని 'తామసంబున నిట్టి పాపంబు సేయంబడియె. దీనికి ముఖ్యపక్షంబునఁ బ్రతికృతి యెఱింగింపుండు, వీనికి నాయువును బహుసత్త్వంబును నొసంగిన మీ కిష్టం బగునే? నట్లు నాయోగమాయచేఁ గావింతు' నన నమ్మునులు నీ యస్త్రమాహాత్మ్యంబునకు మృత్యువునకు మాకు నెవ్విధంబున వైకల్యంబు నొందకుండునట్లు గావింపు మనిన నతం దందఱం జూచి యప్పుడు. 932**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాకుండా; పరమపావనుండవు+ఐన= పరమపవిత్రుడవైనట్టి; నీవు= (అవతారపురుషుడవైనట్టి) నీవు; ధర్మంబు+తప్పినన్= ధర్మాన్ని ఆచరింపక అతిక్రమించినట్లయితే; ఎవ్వరు= ఎవ్వరు; మాన్పన్+కలరు?= నివారింపగలరు? (నివారింపజాలరు); కావునన్= అందుచేత; ప్రాయశ్చిత్తంబున్+కైకొని= అందుకు పరిహారమైన పద్ధతిని చేపట్టి; నడపకున్నన్= ఆచరింపకపోయినట్లైతే; ధర్మంబు= ధర్మమార్గాన్ని ఆచరించటం; నిలువదు= ఉండదు; అట్లు+కావునన్= పరిస్థితి అట్లు ఉందికాబట్టి; దీనికిన్= ఈ బ్రహ్మహత్యాదోషానికి; ప్రతీకారంబు= బదులు చేయటం (పరిహారం); పుట్టింపుము= కల్పించవలసింది; అనినన్= అని పల్కగా; అతండు= ఆ బలరాముడు; వారలన్= ఆ మహర్షులను; కనున్+కొని= చూచి; తామసంబునన్= కోపంవలన; ఇట్టి పాపంబు= ఇటువంటి పాపకార్యం (సూతుణ్ణి చంపటం); చేయన్+పడియెన్= చేయడం జరిగింది; దీనికిన్= ఈ పాపానికి; ముఖ్యపక్షంబు+ఐన= ప్రధానమైన పద్ధతియైన; ప్రతికృతిన్= బదులు కార్యాన్ని; ఎఱింగింపుఁడు= తెలియచేయండి; వీనికిన్= ఈ సూతునికి; ఆయువును= పరిపూర్ణమైనఆయుస్సును; బహుసత్త్వంబునున్= గొప్పదైన బలమును; ఒసంగినన్= ఇచ్చినట్లయితే; మీకున్+ఇష్టంబు+అగునేన్= ప్రియమయిందయితే; నా యోగమాయచేన్= యోగంద్వారా సాధించిన విశిష్టమైన నామాయాశక్తిచేత; అట్లు= ఆ విధంగానే; కావింతున్= చేస్తాను; అనినన్= అనిచెప్పగా; ఆ+మునులు= ఆ ఋషీశ్వరులు; నీ+అస్త్రమాహాత్మ్యంబునకున్= (నీవు దర్భకొస ద్వారా ప్రయోగించిన మంత్రపూర్వకమైన) నీ బాణంయొక్క మహిమకు; మృత్యువునకున్= జరిగిపోయిన మరణంయొక్క సంఘటనకు; మాకున్= ఈ సూతునికి ఉత్తమాయుస్సును, శక్తిని ఇచ్చి వివిధ పుణ్య కథలను వినుచున్న మా సత్యావాక్కులకూ; ఏ విధంబునన్= ఏ రీతిగా; వైకల్యంబు+ఒందకుండున్= లోపం వాటిల్లకుండా ఉంటుందో; అట్లు= ఆ విధంగా; కావింపుము= చేయుము; అనినన్= అనికోరగా; అతండు= ఆ బలరామదేవుడు; అందఱన్+చూచి= ఆ ఋషీశ్వరుల నందరిని చూచి; అప్పుడు= ఆ వేళ...

**తా :** అంతేగాక, పరమపవిత్రుడవైన నీవే ధర్మాన్ని తప్పితే, ఇక మాన్పగలవారెవరు? కాబట్టి, నీవు ప్రాయశ్చిత్తం చేసుకోకపోతే ధర్మానికి మనుగడ ఉండదు గనుక, నీవు ఇందుకు అనుగుణమైన ప్రాయశ్చిత్తాన్ని ఆలోచించు. అప్పుడు బలరాముడు వాళ్లతో ఇలా అన్నాడు. 'తొందరపడి ఈ పాపం చేశాను. దీనికి ప్రతిక్రియను మీరే తెల్పగలరు. నా యోగమాయా

ప్రభావంచేత సూతుణ్ణి బ్రతికించి, దీర్ఘమైన ఆయుర్దాయంగల గొప్ప బలవంతుణ్ణిగా చేస్తాను. అది మీకు సమ్మతమేనా?' (అన్నాడు)

అప్పుడు ఋషులు ఇలా అన్నారు :

'దేవా! నీ అస్త్రప్రభావానికీ, మృత్యుదేవతకూ, మాకూ (మా సత్యవాక్కులకూ) ఎటువంటిలోటు వాటిల్లకుండే విధంగా చేయవలసింది'. అప్పుడు బలరాముడు మరల ఋషులతో ఇలా పల్కినాడు.

**క. ధాత్రీవర! సమధిక చా, రిత్రుఁడు హలపాణి పలికె ధృతి 'నాత్మా వై**
**పుత్త్రక నామాసి' యను ప, విత్రశ్రుతి వాక్యసరణి విశదం బగుటన్. 933**

**ప్రతి :** ధాత్రీవర!= భూనాథా! (పరీక్షిన్మహీపతీ!); సమ్+అధికచారిత్రుడు= మిగుల అతిశయమైన జీవితచరిత్ర గలిగియున్నవాడగు; హలపాణి= నాగలిని చేతిలో (ఆయుధంగా) ధరించి ఉండేవాడు (బలరామదేవుడు); ధృతిన్= ధైర్యంతో (స్థిరమైన అభిప్రాయంతో); పలికిన్= ఇలా పలికినాడు; ఆత్మా(త్వం)= జీవుడవైన నీవు; వై= నిశ్చయంగా, పుత్రకనామా+అసి= పుత్రుడవుగా జన్మిస్తున్నావు; అను= అనేటటువంటి; పవిత్ర= పరిశుద్ధమైన (స్వచ్ఛమైన); శ్రుతి= వేదంలోని; వాక్యసరణి= వాక్యరీతి; విశదంబు+అగుటన్= ప్రసిద్ధమైందగుటచేత...

**తా :** పరీక్షిన్మహారాజా! ఉదాత్తచరితుడైన బలరామదేవుడు నిశ్చయభావంతో ఋషుల నుద్దేశించి ఇలా పలికినాడు. "ఆత్మా వై పుత్ర నామాసి" - అనే పవిత్రమైన వేదవాక్యం ప్రసిద్ధమై ఉన్నది కదా! అందువలన

**క. ఈ సూతసూనుఁ డిపుడు మ, హాసత్త్వము నాయువును ననామయమును వి**
**ద్యా సామర్థ్యము గలిగి సు, ధీసత్తములార! యీక్షితిన్ విలసిల్లున్. 934**

**ప్రతి :** సుధీసత్తములార!= పండితశ్రేష్ఠులైన ఋషిపుంగవులారా!; ఈ సుతసూనుడు= (నేను బ్రతికిస్తున్న) ఈ సూతుని కుమారుడు; ఇపుడు= ఇప్పటినుండి; మహాసత్త్వము= గొప్పబలము, సత్త్వగుణమూ; ఆయువును= సుదీర్ఘమైన ఆయుర్దాయమును; అనామయమును= ఆరోగ్యమును; విద్యాసామర్థ్యము= సకలవిద్యలలో నైపుణ్యాన్ని; కలిగి= పొందినవాడై ఈక్షితిన్= ఈ భూమిపై; విలసిల్లున్= ప్రకాశిస్తాడు.

**తా :** విద్వత్ శ్రేష్ఠులైన మునీంద్రులారా! నేను బ్రతికిస్తున్న ఈతని పుత్రుడు నేటినుండి అధికమైన బలం, పరిపూర్ణమైన ఆయుస్సు, మంచి ఆరోగ్యం, చక్కని విద్యాప్రావీణ్యం గలిగినవాడై ఈ లోకంలో ప్రకాశిస్తాడు.

**విశే :** 1. బలరామదేవుడు తాను సంహరించిన సూతునినుండి తన యోగమాయాప్రభావంతో ఆతని పుత్రుని (మరియొక సూతుని) సృష్టించాడు. ఆతనికి అమితబలాన్ని, ఆయుస్సును, ఆరోగ్యాన్ని ప్రసాదించాడు.

చనిపోయిన తండ్రియగు సూతుని పేరు రోమహర్షణుడు; ఆతనినుండి సృష్టింపబడిన సూతుని పేరు రౌమహర్షణి (ఉగ్రశ్రవసుడు).

2. రోమహర్షణుడు సాక్షాత్తుగ జీవితుడు కాకపోవటంచేత బలరాముని అస్త్రానికి, మృత్యువునకు సత్యత్వం చేకూరింది. అలాగే సూతుడు పుత్రుని రూపంలో జీవించడంచేత, అతనికి బలం, ఆయుస్సు, ఆరోగ్యం చేకూరటంచేత ఋషీశ్వరుల వాక్కులకు సత్యత్వం సిద్ధించింది.

**వ. అని సూతుం బునర్జీవితుంగాఁ జేసి మునులం జూచి యిట్లనియె. 935**

**ప్రతి :** అని= అని పలికి; సూతున్= (రోమహర్షణుడను) సూతుణ్ణి ఆతని కుమారుని ద్వారా; పునః+జీవితున్+కాన్= మరల బ్రతికిన వానినిగా; చేసి= చేసి; మునులన్+చూచి= అచ్చటి మునీంద్రులను చూచి; ఇట్లు+అనియెన్= మరల ఈ విధంగా పల్కినాడు.

**తా :** బలరామదేవుడు సూతుణ్ణి ఆతని పుత్రుని రూపంతో బ్రతికించి మళ్లీ ఇలా అన్నాడు.

**తే.** **'ఏ నెఱుంగక చేసిన యీ యవజ్ఞ, శాంతి వొంద నేయది యభీష్టంబు మీకు**
**దానిఁ గావింతు ననిన మోదంబు నొంది, పలికి ర త్తాపసులు హలపాణిఁ జూచి.** **936**

**ప్రతి :** ఏన్= నేను; ఎఱుంగక=సూతునికి మీరు బ్రహ్మాసనం ఇచ్చిన సంగతి తెలియక; చేసిన= చేసినట్టి; ఈ+అవజ్ఞ= అనాదరపూర్వకమైన అపరాధం; శాంతి+పొందన్= ఉపశమించుటకు; మీకు= పెద్దలైన మీకు; ఏ+అది= ఏ విషయం; అభి+ఇష్టంబు= మిక్కిలి ఇష్టమయిందో; దానిన్= ఆ విషయాన్ని; కావింతున్= చేస్తాను (చెప్పండి!); అనినన్= అనికోరగా; ఆ+తాపసులు= ఆ ఋషీశ్వరులు; మోదంబున్+ఒంది= (బలరాముని పశ్చాత్తాపంతోకూడిన మాటలకు) సంతోషించినవారై; హలపాణిన్= నాగలిని చేతియందు ధరించి ఉండేవాడైన (నాగలి ఆయుధంగా గలవాడైన) బలరామదేవుణ్ణి; చూచి...

**తా :** 'నేను మీయెడల తెలియక చేసిన ఈ అపరాధం శాంతించే విధంగా, అందుకు ప్రాయశ్చిత్తంగా మీకు మిగుల ఇష్టమైన ఏదైన ఒక కార్యాన్ని చేస్తాను; సెలవీయండి!' అని పల్కగా ఆ మహర్షులు బలరాముణ్ణి చూచి

**చ.** **'హలధర! యిల్వలుండను సురారితనూజుఁడు పల్వలుండు నాఁ**
**గలఁ డొక దానవుండు బలగర్వమునం బ్రతిపర్వమందు న**
**చ్చలమున వచ్చి మా సవనశాలల మూత్రసురాస్రపూయ వి**
**ట్పలలము లోలిమైఁ గురిసి పాడఱఁ జేయును యజ్ఞవాటముల్.** **937**

**ప్రతి :** హలధర!= బలరామదేవా!; ఇల్వలుండు+అను= ఇల్వలుడు అనే పేరుగల; సుర+అరి= దేవతలశత్రువు (రాక్షసుని)యొక్క; తనూజుడు= తనయుడు; పల్వలుండు+నాన్= పల్వలుడు అనే (పేరుగలిగిన); ఒక దానవుండు= ఒకానొక రక్కసుడు; కలడు= ఉన్నాడు; ప్రతి పర్వము+అందున్= (వాడు) ప్రతిమాసంలో వస్తుండే పూర్ణిమ, అమావాస్య – అనే పర్వదినాలలో; అచ్చలమునన్= పట్టుదలతోగూడిన ఆగ్రహంతో; వచ్చి= ఈ నైమిశాటవికి వచ్చి; బలగర్వమునన్= బలమువలని అహంకారంతో; మా సవనశాలలన్= మా యజ్ఞాలు చేసే యజ్ఞశాలల మీద; మూత్ర= మూత్రం; సురా= కల్లు; అస్ర= నెత్తురు; పూయ= చీము; విట్= మలము; పలలములు= మాంసాలు; ఓలిమైన్= వరుసగా; కురిసి= (ఆకాశంనుండి) కురిపించి; యజ్ఞవాటముల్= యజ్ఞములు చేస్తుండే ప్రదేశాల్ని; పాడు+అఱన్+చేయును= పాడయ్యేటుగా చేస్తున్నాడు.

**తా :** 'బలరామదేవా! ఇల్వలుడనే రాక్షసుని కుమారుడు పల్వలుడు. వాడు బలగర్వితుడై పట్టుబట్టి ద్వేషంతో ప్రతియొక్క పర్వంనాడూ వచ్చి, మా యజ్ఞశాలలమీద మలమూత్రాలను, చీమునెత్తురులను, మద్యమాంసాలను కురిపించి, ఆ శాలల్ని పాడుచేస్తూన్నాడు.

**వ.** **కావున దుష్టదానవుం ద్రుంచుటయు మాకుం గరంబు సంతసంబగు; నంత మీఁద నీవు విమలచిత్తుండవై భారతవర్షంబునం గల తీర్థంబుల ద్వాదశమాసంబు లవగాహనంబు సేయు; మట్లయిన సర్వపాపనిష్కృతి యగు నని పలుకునంతఁ బర్వసమాగమంబైన.** **938**

**ప్రతి :** కావునన్= కనుక; ఆ దుష్టదానవున్= దుర్మార్గుడయిన ఆ రాక్షసుణ్ణి; త్రుంచుటయున్= చంపుట; మాకున్= మునీశ్వరులమగు మా కందరికీ; కరంబు= మిక్కిలి; సంతసంబు+అగున్= సంతోషాన్ని కలిగించేదవుతుంది; అంతమీఁదన్= ఆ రాక్షసుణ్ణి సంహరించిన పిదప; నీవు= నీవు; విమలచిత్తుండవు+ఐ= నిర్మలమైన మనస్సుతో గూడి ఉన్నవాడివై; భారతవర్షంబునన్+కల= భారతదేశంలో ఉండే; తీర్థంబులన్= పుణ్య జలాలు గల సరోవరాలు మొదలైన పవిత్ర ప్రదేశాలలో; ద్వాదశమాసంబులు= పన్నెండు నెలలు; అవగాహనంబు+చేయుము= మునుగుచు పుణ్యస్నానాలను చేయవలసింది; అట్లు+అయినన్= ఆ విధంగా ఆచరించినట్లయితే; సర్వపాప= చేసిన సమస్తపాపాలకు; నిష్కృతి= పరిహారం (ప్రాయశ్చిత్తం); అగున్+అని= కలుగుతుంది అని; పలుకు+అంతన్= పలికేంతలోపలనే; పర్వ= పర్వదినం; సమ్+ఆగమంబు+ఐనన్= ప్రాప్తింపగా...

**తా :** కాబట్టి, ఆ దుష్టరాక్షసుణ్ణి సంహరించి మాకు సంతోషాన్ని కలిగించు అటు పిమ్మట నిర్మలచిత్తంతో సంచరిస్తూ పన్నెండుమాసాలు భారతవర్షంలోని వివిధపుణ్యతీర్థాల్లో పవిత్రస్నానాలు ఆచరించు! అందువల్ల సమస్తపాపాలు తొలగిపోతాయి అని వాళ్లు అంటూ ఉండగానే పర్వదినం వచ్చేసింది.

**విశే :** మామూలు దినాల్లోకన్నా పర్వదినాల్లో యజ్ఞయాగాదులు ఆచరించటం అధికఫలదాయకమని త్రికాలజ్ఞులైన మహర్షిపుంగవుల నిశ్చయం.

పూర్ణిమ, అమావాస్య, రవిసంక్రాంతి, బహుళ అష్టమి, బహుళ చతుర్దశి – ఈ ఐదిటికి 'పంచపర్వము'లని వ్యవహారం. ఈ పంచపర్వాలలోను పూర్ణిమకు ప్రాధాన్యం చెప్పబడింది.

**సీ. మునులు యజ్ఞక్రియోన్ముఖు లౌటఁ గనుఁగొని పఱతెంచి యసుర తద్భవనములను**
**రక్తవిణ్మూత్రసురామాంసజాలంబు నించి హేయంబు గావించి పెలుచఁ**
**బెంధూళి ఱాలును బెల్లలు నురలెడు చక్రానిలము వీఁచి చదల నపుడు**
**గాటుకకొండసంగతిఁ బొల్చు మేను తామ్రశ్మశ్రుకేశసమాజములును**

**తే. నవ్యచర్మాంబరము భూరినాసికయును, గఱకు మిడిగ్రుడ్లు నిప్పులు గ్రక్కు దృష్టి**
**వ్రేలు పెదవులు దీర్ఘకరాళ జిహ్వా, కయును ముడివడ్డబొమలును గలుగువాని. 939**

**ప్రతి :** మునులు= నైమిశారణ్యంలోని మునీశ్వరులు; యజ్ఞక్రియా= యజ్ఞానికి సంబంధించిన కార్యాలలో; ఉత్+ముఖులు+ఔటన్= ఉద్యుక్తులైన సంగతిని (నిమగ్నులౌతూవున్న విషయాన్ని); కనున్+కొని= కనిపెట్టి; అసుర= పల్వలుడనే రక్కసుడు; పఱచు+తెంచి= పరుగెత్తివచ్చి; తద్+భవనములను= ఆ ఋషీశ్వరుల నివాసాల్లో; రక్త= నెత్తురు; విట్= మలము; మూత్ర= మూత్రం; సురా= కల్లు; మాంస= మాంసం; జాలంబు= వీటి సమూహాలు; నించి= పూర్తిగా నిండజేసి; హేయంబు+కావించి= సహింపవీలుకాని విధంగా మలినపఱచి; పెలుచన్= దండిగా; పెన్+ధూళి= గొప్పదుమ్ము; ఱాలును= రాళ్లు; పెల్లలున్= మట్టి ముద్దలను; ఉరలెడు= రాలుపడునట్టి; చక్ర+అనిలము= చక్రంవలె గుండ్రంగా తిరుగెడుగాలి (సుడిగాలి); వీచి= తీవ్రంగా విసరి; అపుడు= అటుపిమ్మట; చదలన్= ఆకసంలో; కాటుక కొండసంగతిన్= కాటుకకొండవిధంగా; పొల్చుమేను= ఒప్పుతున్నశరీరం; తామ్ర= రాగివలె ఎర్రని; శ్మశ్రు= గడ్డము, మీసాలు; కేశసమాజములను= శిరస్సునందలి వెండ్రుకల సమూహం; నవ్య= క్రొత్తదయిన; చర్మ+అంబరము= కట్టుకొన్న చర్మపు

వస్త్రం; భూరి నాసికయును= మిగుల పెద్దదైన ముక్కు; కఱకు= కఠోరమైన; మిడిగ్రుడ్లు= ముందుకు పొడుచుకొని వచ్చినట్లున్న కనుగ్రుడ్లు; నిప్పులు= అగ్నికణములు; క్రక్కు దృష్టి= వేగంగా వెలికి ప్రసరిస్తున్న చూపులు; వ్రేలు పెదవులు= పెద్దగా వ్రేలాడుతూవున్న పెదవులు; దీర్ఘ= పొడవైన; కరాళ= భీకరమయిన; జిహ్వికయును= నాలుకయు; ముడి+పడ్డ బొమలును= కోపంచేత ముడివడిన కనుబొమలు; కలుగువానిన్= ఇవన్నీ కలవానిని. ('కనియెన్')...

**తా :** పర్వదినం కావటంచేత నైమిశారణ్యంలోని మహర్షులు యజ్ఞకార్యానికి పూనుకొనటం పల్వలుడు పసికట్టాడు. వెంటనే వచ్చి ఆకాశంనుండి రక్తాన్ని, మలమూత్రాలను, మద్యమాంసాలను కురిపించి, మున్యాశ్రమాలను నానాబీభత్సం కావించాడు. ధూళితో, రాళ్లతో, మట్టిగడ్డలతో నిండిన సుడిగాలులు వీచేలాగున చేశాడు. కాటుక కొండను పోలిన నల్లని భారీ శరీరం, క్రొత్తగా ఒలిచిన మానవచర్మాన్ని వస్త్రంగా చుట్టుకొని, ఎర్రనిగడ్డం, మీసాలు గలిగి, పెద్దముక్కూ, మిడిగ్రుడ్లూ, నిప్పులు విరజిమ్మేచూపులు, వ్రేలాడుతున్నపెదవులూ, మిగుల పొడుగైన, భీకరమైన నాలుకా కలిగి, ముడివడినకనుబొమలతో అమితభయం గొల్పుతూ ఆకసంలో సంచరిసూ ఉండిన ఆ పల్వలుణ్ణి బలరాముడు చూచాడు.

**మహాస్రగ్ధర:**

**కనియెం దాలాంకుఁ డుద్యత్కరచటులనటత్కాలదండాభశూలున్**
**జనరక్తాసిక్తతాలున్ సమధిక సమరోత్సాహలోలుం గఠో రా**
**శని తుల్యోదగ్రదంష్ట్రాజనితశిఖికణాచ్ఛాదితాశాంతరాళున్**
**హననవ్యాపారశీలున్నతిదృఢఘనమస్తాస్థిమాలుం గరాళున్. 940**

**ప్రతి :** తాల+అంకుడు= తాటిచెట్టును (జండా) గుర్తుగా గలిగినవాడు (బలరామదేవుడు); ఉద్యత్= పైకెత్తబడియున్న; కర= చేతియందు; చటుల= అటూ ఇటూ కదలుతూ; నటత్= చలిస్తున్న; కాలదండ+ఆభ= కాలుని (యముని) హస్తమందలి దండాయుధాన్ని పోలినట్టి; శూలున్= ఇనుప ఈటెగలవాణ్ణి; జనరక్త= మనుజుల రక్తంచేత; ఆసిక్త= బాగుగా తడిసియున్న; తాలున్= దవుడలు గలవాణ్ణి; సమ్+అధిక= మిగుల అధికమైన; సమర+ఉత్సాహలోలున్= యుద్ధం చేయుటయందలి ఉత్సాహంచే తన్మయుడైయున్నవాణ్ణి; కఠోర= క్రూరమైనట్టి; అశని తుల్య= (ఇంద్రుని) వజ్రాయుధంతో సమానమైన; ఉత్+అగ్ర= భయంకరమైన; దంష్ట్రా= కోరలనుండి; జనిత= పుట్టిన; శిఖికణ= అగ్ని కణాలచేత; ఆచ్ఛాదిత= కప్పివేయబడిన; ఆశా+అంతరాళున్= దిక్కుల మధ్యభాగం కలవాణ్ణి; హనన వ్యాపారశీలున్= చంపివేయటమనే కార్యాన్నే స్వభావంగా కలవాణ్ణి; అతిదృఢఘన= మిక్కిలి దృఢమైన, గొప్పవియైనట్టి; మస్త+అస్థిమాలున్= (మానవుల) తలలతోనూ, ఎముకలతోనూ కూర్చబడియున్న మాలను (దండను) ధరించి ఉన్నవాణ్ణి; కరాళున్= వెఱపు పుట్టించే ఆకారం కలవాణ్ణి; కనియెన్= చూచాడు.

**తా :** పల్వలుడనే ఆ రాక్షసుడిచేతిలో యమదండంలాంటి శూలాయుధం తీవ్రంగా చూస్తూవుంది. ఆతనిదౌడలు మానవరక్తంచేత బాగా తడిసి ఉన్నాయి. వాడు అత్యధికమైన యుద్ధోత్సాహంకలవాడుగా గోచరిస్తున్నాడు. వజ్రాయుధంలాంటి వాడికోరలనుండి నిప్పురవ్వలు వెలువడుతూ దిగంతరాళాన్ని ఆవరిస్తున్నాయి. వాడిమెడలోని తలల, ఎముకల హారాన్నిబట్టి ప్రాణుల్ని చంపడమే వాని స్వభావంగా వెల్లడవుతున్నది. అటువంటి భయంకరాకారుడైన రక్కసుణ్ణి బలరామదేవుడు చూచాడు.

**విశే :** ఛందస్సు – ఇరువదిరెండవ ఛందస్సుకు చెందిన ఈ మహాస్రగ్ధరావృత్తంలో ప్రతిపాదంలోనూ స, త, త, న, స, ర, ర, గ – అనే అక్షరగణాలు వరుసగా ఉంటాయి. ప్రతిపాదంలోనూ 9వ అక్షరం, 16వ అక్షరం – రెండు యతిమైత్రి

ఉ. వెండియుఁ గ్రొమ్మెఱుంగు లుడువీథి వెలుంగఁగ నుల్లసద్గదా
దండముఁ గేలఁ ద్రిప్పుచు నుదారత రా బలభద్రుఁ డాసురో
ద్దండ విఘాతులౌ ముసలదారుణలాంగలముల్ దలంప మా
ర్తాండనిభంబులై యెదురఁ దత్క్షణమాత్రన తోఁచినన్ వెసన్. 941

**ప్రతి :** వెండియున్= మరియు; ఉడువీథిన్= నక్షత్రమార్గంలో (ఆకసంలో); క్రొత్త+మెఱుంగులు= నూతనములైన కాంతులు; వెలుంగన్+కన్= ప్రకాశిస్తూ ఉండగా; ఉల్లసత్= మిక్కిలి ప్రకాశిస్తున్న; గదాదండమున్= కొయ్యదండం వంటి గదాయుధాన్ని; కేలన్= చేతితో; త్రిప్పుచున్= గిరగిర త్రిప్పుచు; ఉదారతన్= గాంభీర్యంతో; రాన్= తనపైకిరాగా; బలభద్రుడు= బలరామదేవుడు; ఆసుర= రాక్షసులయొక్క; ఉత్+దండ= విజృంభణను; విఘాతులు+ఔ= నశింపజేయునవియైన; ముసల= రోకలి; దారుణ= భీకరమైన; లాంగలముల్= నాగలి– అనే రెండు ఆయుధాలను; తలంపన్= మనస్సులో స్మరింపగా; తత్క్షణమాత్రన= ఆ క్షణమాత్రంలోనే; మార్తాండనిభంబులు+ఐ= సూర్యునివలె గొప్పగా ప్రకాశిస్తున్నవై; వెసన్= శీఘ్రంగా; తోఁచినన్= ప్రత్యక్షంకాగా...

**తా :** ఆకాశంలో క్రొత్తకాంతులను విరజిమ్మే విధంగా గదను వేగంగా త్రిప్పుతూ, పల్వలుడు తనమీదికి రావటాన్ని బలభద్రుడు గమనించాడు. వెంటనే రాక్షస సంహారకార్యంలో సమర్థాలైన రోకలి, నాగలి – అనే తన రెండు ఆయుధాలను స్మరించాడు అవి తత్క్షణమే సూర్య సమాన తేజంతో బలరాముని యెదుట ప్రత్యక్షమయ్యాయి.

వ. అట్లు సన్నిహితంబులైన తన కార్యసాధనంబు లగు నిజసాధనంబులు ధరియించి యప్పుడు. 942

**ప్రతి :** అట్లు= ఆ విధంగా తన మనస్సులో స్మరించగానే; సన్నిహితంబులు+ఐన= సమీపించినవైన; తన= తనయొక్క; కార్యసాధనంబులు+అగు= శత్రువులను సంహరించే కార్యానికి సాధనాలయినట్టి; నిజ సాధనంబులు= తన ఆయుధాలను; ధరియించి= చేతపూని; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఆ రీతిగా తాను సంకల్పించినవెంటనే తన వద్దకు చేరిన తన కార్యాన్ని సాధించే శక్తిమంతాలైన ఆయుధాలను రెండిటిని ధరించిన పిమ్మట

చ. గగనమునం జరించు సురకంటకు కంఠము చేఁతినాగటం
దగిలిచి రోఁక లెత్తి బెడిదం బదరన్ నడునెత్తి మొత్తినన్
బుగబుగ నెత్తు రొల్క నిల బోరగిలం బడె వజ్రధారచేఁ
దెగి ధరఁ గూలు భూరిజగతీధరముం బురుడింప బెట్టుగాన్. 943

**ప్రతి :** గగనమునన్= ఆకాశంలో; చరించు= తిరుగుతున్న; సురకంటకు= దేవతలకు ముల్లులాంటివాడైన ఆ రాక్షసుని (దేవతలకు విరోధియైన రాక్షసునియొక్క); కంఠము= కంఠాన్ని; చేతినాగటన్= తన యెడమచేతిలోని నాగలిచేత; తగిలించి= తగుల్కొనులాగున కావించి క్రిందకి లాగి; రోకలి+ఎత్తి= కుడిచేతిలోని రోకలిని పైకెత్తి; బెడిదంబు+అదరన్= భయంకరత్వం అతిశయింపగా; నడునెత్తి= రక్కసుని నట్టనడితలను; మొత్తినన్= గట్టిగా కొట్టగా; భుగభుగ= భుగభుగయను ధ్వనితో; నెత్తురు+ఒల్కన్= రక్తంకారగా; వజ్రధారచేన్= ఇంద్రుని వజ్రాయుధపు పదను (తాకటం)చేత; తెగి= రెక్కలు తెగిపోయి; ధరన్+కూలు= భూమిపై పడిపోయే; జగతీధరమున్= పర్వతాన్ని; పురుడింపన్= సరిపోలుతూ; ఇలన్= నేలమీద; బెట్టు+కాన్= ఘోరంగా; బోరగిలన్+పడెన్= బోర్ల పడిపోయాడు.

**తా :** ఆ రీతిగా సాక్షాత్కరించిన తన ఆయుధాలను రెండిటిని అందుకొని బలరామదేవుడు ఆకాశంలో సంచరిస్తూవున్న పల్వలుని కంఠానికి తన ఎడమచేతియందలి నాగలిని తగిలించి, క్రిందికి లాగినాడు. వెనువెంటనే కుడిచేతిలోని రోకలితో వాని నడినెత్తిపై బలంగా మోదినాడు. ఆ దెబ్బకు దేవేంద్రుని వజ్రాయుధంవేటుకు తెక్కలు విరిగి పడ్డ కొండలాగా భుగభుగమను ధ్వనితో శరీరంనుండి నెత్తురు స్రవిస్తూవుండగా భూమిపై బోరగిలపడిపోయాడు.

**వ. అట్లు పల్వలుండు మడిసిన. 944**

**ప్రతి :** అట్లు= ఆ రీతిగా; పల్వలుండు= పల్వలుడనే రాక్షసుడు; మడిసినన్= మరణింపగా...

**తా :** ఆ విధంగా బలరాముని చేతిలో పల్వలుడు మృతి నొందిన పిమ్మట

**క. మునివరులు గామపాలుని, వినుతించిరి వేయువేల విధముల వృత్రుం**
**దునిమిన యింద్రుని నమరులు, వినుతించిన రీతి నపుడు విమలచరిత్రా! 945**

**ప్రతి :** విమలచరిత్రా!= నిర్మలమైన చరిత్ర గలవాడా!; మునివరులు= నైమిశారణ్యంలోని మునిశ్రేష్ఠులు; అపుడు= ఆ వేళలో; కామపాలునిన్= బలరాముణ్ణి; వృత్రున్= వృత్రాసురుణ్ణి; తునిమిన= చంపిన; ఇంద్రునిన్= దేవేంద్రుణ్ణి; అమరులు= దేవతలు; వినుతించిన రీతిన్= విశేషంగా కొనియాడిన విధంగా; వేయువేలవిధములన్= అనేక రీతులలో; వినుతించిరి= విశేషంగా ప్రస్తుతించినారు.

**తా :** పైవిధంగా పల్వలుడు కూలిపడటం చూచి, వృత్రాసురుణ్ణి సంహరించిన దేవేంద్రుణ్ణి దేవతలు వినుతించిన విధంగా నైమిశారణ్యమునీశ్వరులు బలరామదేవుణ్ణి అనేకరీతుల ప్రస్తుతించారు.

**తే. అంత నభిషిక్తుఁ జేసి యత్యంత సురభి, మంజులామ్లాన కంజాత మాలికయును**
**నంచితాభరణములు దివ్యాంబరములు, నర్థి నిచ్చినఁ దాల్చి యా హలధరుండు. 946**

**ప్రతి :** అంతన్= అటుపిమ్మట; అభిషిక్తున్+చేసి= పవిత్రాలైన తీర్థజలాలతో మంత్రపూర్వకంగా మంగళస్నానం చేయించి; అతి+అంతసురభి= మిక్కిలి సువాసన గలిగిన; మంజుల= మనోహరమైన; అమ్లాన= వాడిపోని; కంజాత మాలికయును= తామరపూవులమాలను; అంచిత+ఆభరణములు= అందమైన ఆభరణాలను; దివ్య+అంబరములు= లోకాతీతమైన మిగుల మనోహరాలైన వస్త్రాలు; అర్థిన్= ప్రీతితో; ఇచ్చినన్= ఆ ఋషులు సమర్పించగా; ఆ హలధరుండు= ఆ బలరామదేవుడు; తాల్చి= చక్కగా ధరించి...

**తా :** నైమిశారణ్యలోని మహర్షులు బలరామదేవుణ్ణి పుణ్యజలాలతో అభిషిక్తుణ్ణి కావించారు. సౌరభాలు వెదజల్లే సుందర పద్మమాలికతో అలంకరించినారు. అందమైన ఆభరణాలను, దివ్యవస్త్రాలను ప్రీతితో సమర్పించారు. మునీంద్రులకు ఆనందం కలిగేటట్లు బలరాముడు వాటిల్ని సముచితంగా ధరించాడు.

**క. దేవేంద్రుఁ బోలి యొప్పెను, ధీవిలసితుఁ డగుచు మునితతిన్ వీడ్కొని తన్**
**సేవించుచుఁ గతిపయ వి, ప్రావలి సనుదేరఁ గౌశికాఖ్యంబునకున్. 947**

**ప్రతి :** దేవ+ఇంద్రున్+పోలి= దేవతల కధిపతియైన దేవేంద్రునిలాగా; ఒప్పెను= విరాజిల్లినాడు; ధీవిలసితుడు+అగుచున్= బుద్ధిబలంచేత ప్రకాశిస్తున్నవాడగుచూ; మునితతిన్= అచ్చటి మునిబృందాన్ని; వీడ్కొని= పోయి వచ్చెదనని విన్నవించి

విడిచి; కతిపయవిప్ర+ఆవలి= కొంతమంది బ్రాహ్మణుల సముదాయము; తన్= తనను; సేవించుచున్= వెంట ఉండి కొలుస్తూ; చను+తేరన్= రాగా; కౌశికా+ఆఖ్యంబునకున్= కౌశికి అనే పేరుగల నది వద్దకు...

**తా :** నైమిశారణ్య మునీశ్వరులచే సమ్మానితుడైన బలరాముడు దేవేంద్రునివలె భాసించాడు. బుద్ధిశాలియైన ఆయన ఆ మునిసమూహాన్ని వీడ్కొని, విప్రోత్తములు కొందరు తనను సేవిస్తూ వెంటరాగా 'కౌశికి' అనే నదీతీరానికి

**వ. చని యమ్మహానదిం గృతస్నానుండై యచ్చోటు వాసి సరయువునందుఁ గ్రుంకులిడి ప్రయాగ నవగాహనంబు సేసి, దేవర్షిపితృతర్పణంబు లాచరించి పులస్త్యాశ్రమంబు సొచ్చి గోమతిం దర్శించి గండకీనది నుత్తరించి విదళితభవపాశ యగు విపాశయందుఁ దోఁగి శోణనదంబున నాప్లావితుండై గయ నాడి గంగాసాగరసంగమంబు దర్శించి మహేంద్ర నగంబున కరిగి. 948**

**ప్రతి :** చని= కౌశికీనది దగ్గరికి వెళ్లి; ఆ+మహానదిన్= ఆ గొప్పనదిలో (జీవనదియందు); కృతస్నానుండు+ఐ= స్నానం ఆచరించినవాడై; ఆ+చోటు= ఆ కౌశికీనదీ ప్రాంతాన్ని; పాసి= వీడి; సరయువు+అందున్= సరయూనదిలో; క్రుంకులు+ఇడి= మునుగుటలు కావించి (స్నానాలుచేసి); ప్రయాగన్= ప్రయాగక్షేత్రమందుగల త్రివేణీ సంగమంలో; అవగాహనంబు+చేసి= స్నానం కావించి; దేవ+ఋషి పితృ తర్పణంబులు= దేవతలకు, ఋషీశ్వరులకు, పితృదేవతలకు మంత్రపూర్వకంగా చేయవలసిన తృప్తికార్యాలను; ఆచరించి= చక్కగా నెఱవేర్చి; పులస్త్య+ఆశ్రమంబు+చొచ్చి= పులస్త్య మహాముని తపస్సు కావించిన ఆశ్రమాన్ని ప్రవేశించి; గోమతిన్= గోమతీనదిని; దర్శించి= (భక్తితో) దర్శించి; గండకీనదిన్= గండకి అనే పేరుగల నదిని; ఉత్తరించి= దాటి; విదళిత= చీల్చివేయబడిన (తొలగింపబడిన); భవపాశ+అగు= పుట్టుక అనే సంసారపాశపు కట్టుతాళ్లు గలది (సంసార బంధాలను తొలగించునదియైన); విపాశ+అందున్= సంసారంయొక్క ఆవలిగట్టును ఛేదిణీ చేసే విపాశ అనెడి నదిలో; తోగి= బాగుగామునిగి; శోణనదంబునన్= శోణ అను పేరుగల నదమునందు; ఆప్లావితుండు+ఐ= స్నానం చేసిన వాడై; గయన్= గయాక్షేత్రమున గల గంగానదియందు; ఆడి= స్నానమాడి; గంగా సాగరసంగమంబు= గంగ సముద్రంలో కలిసిన పవిత్రస్థలాన్ని; దర్శించి= చూచి; మహా+ఇంద్ర నగంబుకున్= మహేంద్ర పర్వతానికి; అరిగి= వెళ్లి...

**తా :** బలరాముడు కౌశికీనదిలో స్నానంచేశాడు. అక్కడ నుండి వెళ్లి సరయూనదిలో మునిగాడు. అటుపై ప్రయాగకేగి త్రివేణీ సంగమంలో దేవర్షి పితృతర్పణాలు నిర్వహించాడు. పులస్త్యాశ్రమంమీదుగా వెళ్లి గోమతీనదిని దర్శించి, గండకీ నదిని దాటి, సంసారబంధమోచనియైన విపాశలో పవిత్ర స్నానంచేసి, శోణనదంలోనూ, గయలోనూ మునుకలువేసి, అటుపై గంగా సాగరసంగమ సందర్శనానంతరం మహేంద్ర పర్వతం చేరుకొన్నాడు.

**క. రాముఁడు గనుఁగొనె భార్గవ, రామున్ రజనీశకుల ధరావరనగ సు**
**త్రామున్ సన్నుతసుగుణ, స్తోమున్ గారుణ్యసీము సుజనలలామున్. 949**

**ప్రతి :** రాముడు= బలరాముడు; రజనీ+ఈశ= చంద్రునియొక్క; కుల= వంశాని చెందిన; ధరావర= భూపతులనే; నగ= కొండలకు; సుత్రామున్= దేవేంద్రుడైనవాణ్ణి; సత్+నుత= మిగుల కొనియాడబడిన; సుగుణస్తోమున్= సద్గుణాల సమూహం కలవాణ్ణీ; కారుణ్య= దయాగుణానికి; సీమున్= చివరి హద్దయిన వాణ్ణి; సుజనలలామున్= సత్పురుషుల్లో శ్రేష్ఠుడైన వాణ్ణి; భార్గవరామున్= భృగువంశంలో అంతరించిన పరశురామదేవుణ్ణి; కనున్+కొనెన్= సందర్శించాడు.

**తా :** బలరాముడు (నిరంకుశులైయున్న) క్షత్రియకులాన్ని తునుమాడినవాడూ, దయాది సమస్తసద్గుణాలకు నెలవైనవాడూ, సజ్జనులకు అలంకారమైనవాడూ, భృగువంశ జాతుడూ అయిన పరశురామస్వామిని మహేంద్రాచలంమీద సందర్శించినాడు.

**ఆ. కని నమస్కరించి కౌతుకం బలరార, నతని వీడుకొని హలాయుధుండు**
**గౌమరు మిగిలి సప్తగోదావరికి నేఁగి, యందుఁ దీర్థమాడి యచటు గదలి. 950**

**ప్రతి :** హల+ఆయుధుండు= బలరాముడు; కౌతుకంబు+అలరారన్= ఆసక్తి విలసిల్లగా; కని= మహేంద్రగిరిమీద నున్న పరశురాముణ్ణి దర్శించి; నమస్కరించి= ఆ అవతారమూర్తికి భక్తితో నమస్కారంకావించి; అతనిని= ఆ పరశురామదేవుణ్ణి; వీడుకొని= వెళ్లివచ్చెదనని విన్నవించి; కౌమరు మిగులు= సౌందర్యం అతిశయించియున్న; సప్తగోదావరికిన్= (దాక్షారామక్షేత్ర ప్రాంతమందలి) సప్తగోదావరీనదీ సమీపానికి; ఏగి= వెళ్లి; అందున్= ఆ పుణ్యనదియందు; తీర్థము+ఆడి= పవిత్రస్నానంచేసి; అచట+కదలి= ఆ ప్రదేశం నుండి కదలిపోయి...

**తా :** బలరాముడు కుతూహలం విలసిల్లగా పరశురామదేవుణ్ణి సందర్శించి వందనం కావించాడు. అచ్చటినుండి మిగుల మనోహరమైయున్న సప్తగోదావరిని సందర్శించి, అందులో పుణ్యస్నానం కావించాడు.

**విశే :** సప్తగోదావరి : గౌతమి, వశిష్ట, ఆత్రేయ, వైనతేయ, తుల్యభాగ, భరద్వాజ (విశ్వామిత్ర), జమదగ్ని – అనే పేర్లుగల ఏడు పాయలుగా చీలినందువల్ల గోదావరికి 'సప్తగోదావరం' అనే పేరు ప్రసిద్ధం.

**వ. వేణీపంపాసరస్సులం జూచి భీమనది కేఁగి యందుఁ గుమారస్వామిని దర్శించి, శ్రీశైలంబునకుఁ జని, వేంకటాచలంబు దర్శించి, కామకోటిశక్తిని నిరీక్షించి, కాంచీపురంబుం గాంచి, కావేరికిం జని యమ్మహావాహిని నవగాహనంబు సేసి. 951**

**ప్రతి :** వేణీ= కృష్ణవేణీనదిని; పంపాసరస్సులన్= పంప అనే పేరిటి సరోవరాన్ని; చూచి= చూచి; భీమనదికిన్+ఏగి= భీమరథి యనెడి నదికి వెళ్లి; అందున్= ఆ నదీతీరాన నెలకొనియున్న; కుమారస్వామిని= సుబ్రహ్మణ్యస్వామిని; దర్శించి= చూచి; శ్రీశైలంబునకున్= సుప్రసిద్ధ శైవక్షేత్రమైన శ్రీశైలానికి; చని= వెళ్లి; వేంకట+అచలంబు= సుప్రసిద్ధ వైష్ణవక్షేత్రమైన వేంకటాద్రిని; దర్శించి= చూచి; కాంచీపురంబున్= (మోక్షమిచ్చే సప్తపురాలలో నొకటైన) కాంచీనగరాన్ని; కాంచి= చూచి; కామకోటి శక్తిని= ఆ పుణ్యక్షేత్రంలోగల కామకోటి పీఠంపై నెలకొనివున్న కామక్షీ అమ్మవారిని; నిరీక్షించి= బాగుగా దర్శించి; కావేరికిన్+చని= కావేరీనది వద్ద కేగి; ఆ+మహావాహినిన్= ఆ గొప్పనదిలో; అవగాహనంబు+చేసి= స్నానమాడి...

**తా :** సప్తగోదావరిని సందర్శించిన అనంతరం బలభద్రస్వామి కృష్ణవేణీనదిని, పంపాసరోవరాన్ని తిలకించాడు. అటు పిమ్మట భీమరథీనది వద్ద కరిగి, అచ్చట నెలకొని ఉన్న సుబ్రహ్మణ్యస్వామిని సందర్శించాడు. ఆ తరువాత శ్రీశైలం, వేంకటాచలం, కాంచీపురి మొదలయిన పుణ్య క్షేత్రాలను చూచి, కావేరిని చేరి, ఆ మహానదిలో పుణ్యస్నానం కావించాడు.

**విశే :** భరతఖండంలోని 18 శక్తిపీఠాల్లో కాంచీపురం ఒకటి.

**స్రగ్ధర:**

**సేవించెన్ రంగధామున్ శ్రితనివహ పయస్సింధుసంపూర్ణసోముం**
**గావేరీమధ్యసీమున్ ఘనకలుషమహాకాలకూటోగ్ర భీమున్**

**దేవారిశ్రీవిరామున్ దివిజవినుతసందీపితానంతనామున్**
**ధీవిజ్ఞానాభిరాముం ద్రిభువనవిలసద్దేవతాసార్వభౌమున్. 952**

**ప్రతి :** (బలరాముడు); శ్రితనివహ= తనను ఆశ్రయించిన భక్తుల సమూహమనే; పయస్+సింధు= పాలకడలికి; సంపూర్ణసోమున్= పరిపూర్ణ చంద్రుడైనవానిని; ఘన కలుష= గొప్పవియైన పాపాలనబడే; మహాకాలకూట= తీవ్రమయిన కాలకూటవిషానికి; ఉగ్ర= భయాన్ని గొలిపేటటువంటి; భీమున్= రుద్రుణ్ణీ; దేవ+అరిశ్రీ= దేవతల శత్రువులైన రాక్షసులయొక్క సంపదలకు (శోభకు); విరామున్= విశ్రాంతి కలిగించేవాణ్ణి (రాక్షసులను సంహరించివేసేవాణ్ణి); దివిజవినుత= దేవతలచే విశేషంగా స్తుతింపబడిన; సందీపిత= ప్రకాశించునట్టి; అనంతనామున్= అంతులేని పేర్లకలవాణ్ణి; ధీవిజ్ఞాన+అభిరామున్= బుద్ధియందలి గొప్పతెలివిచేత మిగుల మనోహరుడై యుండువానిని; త్రిభువన= మూడులోకాలలోనూ; విలసత్= విరాజిల్లుతున్నట్టి; దేవతా= దేవతల కందరకూ; సార్వభౌమున్= చక్రవర్తి (అధిపతి) యైనవానిని; కావేరీ మధ్య= కావేరీనది నడుమనున్న ప్రదేశంలో ఉండేవాణ్ణి; రంగధామున్= శ్రీరంగనాథస్వామిని; సేవించెన్= భక్తితో ఆరాధించాడు.

**తా :** తనను శరణుపొందిన ఆశ్రితులనే క్షీరసాగరానికి పున్నమచంద్రుడైనవాడూ, పాపాలనే కాలకూటాన్ని కబళించే పరమేశ్వరుడూ, రాక్షసుల సంపదలను ఉపసంహరించేవాడూ, దేవతలచే వినుతింపబడిన అనంత నామధేయాలు గలవాడూ, అద్వితీయమయిన బుద్ధి విశేషంచేత మనోజ్ఞంగా భాసించేవాడూ, సమస్తదేవతలకు సార్వభౌముడూ, కావేరీ మధ్యదేశంలో వేంచేసివున్నవాడూ అయిన శ్రీరంగనాథుణ్ణి బలరాముడు భక్తిప్రపత్తులతో సేవించాడు.

**విశే :** కావేరీకొల్లడం నదుల మధ్య గల భూభాగానికి (ద్వీపానికి) 'రంగ'మని పురాణ ప్రసిద్ధి. ఆ 'రంగము'ను నివాసంగా గలిగి ఉన్నందున అచ్చట వెలసివున్న అర్చామూర్తికి 'రంగధాము'డని వ్యవహారం. 'ఇవతల కావేరి, అవతల కొల్లడము, నడుమనే శ్రీరంగనాథపురము' అని స్త్రీల పాటల్లో ప్రసిద్ధి.

**శ్లో॥ కావేరీ విరజాసేయం వైకుంఠం రంగమందిరమ్ ।**
**సవాసుదేవో రంగేశః ప్రత్యక్షం పరమం పదమ్ ॥ - గరుడపురాణమ్.**

'రంగము'నకు 'శ్రీరంగము' - అనేది పవిత్రమైన నామాంతరం.

ఈ ఘట్టంలో సంస్కృతమూలంలో "శ్రీరంగాఖ్యం మహాపుణ్యం యత్రసన్నిహితో హరిః" - అని అర్ధశ్లోకంలో చెప్పబడిన విషయాన్ని భక్తకవీశ్వరుడైన బమ్మెరపోతన తెలుగున స్రగ్ధరావృత్తంలో పెంపొందించివుండటం విశేషం!

"స్రక్" - అనగా పూలదండ. "స్రగ్ధర" - అనగా పూలమాలను ధరించినట్లుగా ఉండే పద్యమని భావం. అర్చామూర్తులలో అగ్రగణ్యుడైన శ్రీరంగనాథుణ్ణి వర్ణించటంలో మహాకవి ఈ పద్యాన్ని రచించడం సాభిప్రాయమైన విశేషం! శ్రీరంగనాథునికి ఆళ్వారులలో ప్రసిద్ధుడైన పెరియాళ్వార్ యావజ్జీవం చేసింది పుష్ప మాలాకైంకర్యమే! అంతేకాదు, పెరియాళ్వార్ పెంపుడు కూతురు గోదాదేవి చేసింది కూడా పుష్పమాలా కైంకర్యమే! కాబట్టి 'స్రగ్ధరా' వృత్తం సార్థకం!

**వ. అచ్చోటు వాసి వృషభాద్రి నెక్కి, హరిక్షేత్రంబు ద్రొక్కి, మధురాపురంబున కరిగి, సేతుబంధనంబు మెట్టి, యచటం బదివేల పాఁడిమొదవుల భూసురుల కిచ్చి, రామేశ్వరుం దర్శించి, తామ్రపర్ణికిం జని, మలయాచలం బెక్కి, యగస్త్యునిం గని నమస్కరించి, దక్షిణసముద్రంబు దర్శించి , కన్యాఖ్యదుర్గాదేవి నుపాసించి, పంచాప్సరంబను తీర్థంబున నాప్లవనం బాచరించి, గోకర్ణంబున నిందుమౌళిని దర్శించి,**

**ద్వీపవతి యైన కామదేవిని వీక్షించి, తాపిం బయోష్ణిని దర్శించి, నిర్వింధ్యంబు గడచి, దండకావనంబున కరిగి, మాహిష్మతీ పురంబున వసియించి, మనుతీర్థం బాడి, క్రమ్మఱం బ్రభాసతీర్థంబునకు వచ్చి యచ్చటి బ్రాహ్మణ జనంబులవలనఁ బాండవధార్తరాష్ట్రుల భండనంబునందు సకలరాజలోకంబు పరలోకగతు లగుటయు, వాయునందనసుయోధనులు గదాయుద్ధ సన్నద్ధులై యుండుటయు నెఱింగి వారల వారించు తలంపున నచటికిం జని. 953**

**ప్రతి :** (బలరాముడు) ఆ+చోటు+పాసి= ఆ శ్రీరంగక్షేత్రాన్ని వీడి; వృషభ+అద్రిన్= ఋషభగిరిని; ఎక్కి= అధిరోహించి; హరిక్షేత్రంబున్+త్రొక్కి= అచ్చట నెలకొనియున్న శ్రీహరి పుణ్యక్షేత్రాన్ని మెట్టి స్వామిని దర్శించి; మధురాపురంబునకున్= దక్షిణ మధురాపురానికి; అరిగి= వెళ్లి; సేతుబంధనంబు= శ్రీరామేశ్వరమహాక్షేత్రంలో; మెట్టి= ప్రవేశించి; అచటన్= (మహాపాపాలను నశింపజేసే) ఆ రామసేతు క్షేత్రంలో; భూసురులకున్= బ్రాహ్మణోత్తములైనవారికి; పదివేల పాడిమొదవులన్= పదివేల పాడిఆవులను; ఇచ్చి= దానమిచ్చి; రామ+ఈశ్వరున్= (ఆ పవిత్ర ప్రదేశంలో వెలసియున్న) రామేశ్వర శ్రీమహాదేవుణ్ణి; దర్శించి= సందర్శించి; తామ్రపర్ణికిన్+చని= తామ్రపర్ణీనదివద్దకు వెళ్లి (అందులో స్నానంచేసి); మలయ+అచలంబు+ఎక్కి= మలయపర్వతమనే కులగిరిని అధిరోహించి; అగస్త్యునిన్+కని= ఆ మలయాచలంపై చక్కగా కూర్చొనియున్న అగస్త్యమహర్షిని దర్శించి; నమస్కరించి= గోత్ర, నామాదులను చెప్పి ఆయన పాదాలకు వందనం కావించి; దక్షిణసముద్రంబు= దక్షిణ దిశయందలి సముద్రాన్ని; దర్శించి= చూచి; కన్యా+ఆఖ్య= కన్య (కన్యాకుమారి) అను పేరు గల్గిన; దుర్గాదేవిన్= దుర్గాంబికను; ఉపాసించి= ఆసీనుడై అచ్చట భక్తితో ఆరాధించి; పంచ+అప్సరంబు+అను= పంచాప్సరమనే పేరుగల; తీర్థంబునన్= పుణ్య సరోవరతీర్థంలో; ఆ ప్లవనంబు+ఆచరించి= బాగుగా మునిగితేలుచు స్నానము చేసి; గోకర్ణంబునన్= (పడమటి సముద్రానికి దగ్గరలో ఉన్న) గోకర్ణమనే పుణ్యక్షేత్రంలో; ఇందుమౌళిన్= చంద్రుణ్ణి శిరస్సుపై ధరించినవాణ్ణి (గోకర్ణేశ్వరుణ్ణి); దర్శించి= భక్తితో సందర్శించి; ద్వీపవతి+ఐన= ద్వీప ప్రదేశంలో నివసిస్తున్న; కామదేవిని= కామదేవి యను పేరిటి పార్వతీదేవిని; వీక్షించి= బాగుగా దర్శించి; తాపిన్= తాపీనదిని; పయస్+ఉష్ణిని= పయోష్ణి అనే నదిని; దర్శించి= చూచి; నిర్వింధ్యంబున్+కడచి= నిర్వింధ్యమనే నదిని దాటి (తాపి, పయోష్ణి, నిర్వింధ్య – ఈ మూడునదుల్లోనూ బలరామదేవుడు స్నానమాడినటులు భావింపదగును); దండకావనంబునకున్+అరిగి= 'దండక' – అను పేరుగల అరణ్యానికి వెళ్లి; మాహిష్మతీపురంబునన్= మహిష్మతి అనే పట్టణంలో నివసించి; మనుతీర్థంబు+ఆడి= 'మను' – అనే పుణ్యతీర్థంలో స్నానంచేసి; క్రమ్మఱన్= మరల; ప్రభాసతీర్థంబునకున్= ప్రభాసమనే పేరుగల పుణ్యతీర్థానికి; వచ్చి= వచ్చి; అచటి= అక్కడనున్న; బ్రాహ్మణ జనులవలనన్= బ్రాహ్మణబృందాలవల్ల; పాండవ ధార్తరాష్ట్రుల= పాండవులయొక్క, ధృతరాష్ట్రుని కుమారులైన కౌరవులయొక్క; భండనంబు+అందున్= యుద్ధంలో; సకల రాజలోకంబున్= దేశంలోని సమస్త రాజులసమూహాలు; పరలోకగతులు+అగుటయున్= యుద్ధంలో మరణించి పరలోకానికి వెళ్ళి పోవుటయును; వాయునందన= వాయుదేవుని వరంవల్ల జన్మించిన భీమసేనుడును; సుయోధనులు= దుర్యోధనుడును; గదాయుద్ధసన్నద్ధులు+ఐ= గదలతో యుద్ధం చెయ్యటానికి సిద్ధపడినవారై; ఉండుటయున్= ఉండటాన్ని; ఎఱింగి= (బ్రాహ్మణులవలన) తెలుసుకొని; వారలన్= ఆ యిరువురను; వారించు తలంపునన్= గదాయుద్ధంనుండి విరమింపజేసే ఉద్దేశంతో; అచటికిన్+చని= గదాయుద్ధానికి సన్నద్ధులైన ఆ యిరువురి వద్దకు వెళ్లి...

**తా :** బలరాముడు శ్రీరంగనాథుణ్ణి సందర్శించిన పిదప వృషభాద్రి, మధుర, సేతుబంధం దర్శించి, అచ్చటి బ్రాహ్మణులకు పదివేల పాడియావులను దానం చేశాడు. రామేశ్వరం మొదలైన ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలను చూచి, మలయాచలంఎక్కి,

అగస్త్య మునీంద్రునికి అభివందనం కావించి, కన్యాకుమారిని గాంచి, గోకర్ణక్షేత్రంలో పరమేశ్వరుణ్ణి సందర్శించాడు. తాపి, పయోష్ణి, నిర్వింధ్యానదులను దాటి, దండకారణ్యంలో ప్రవేశించి, క్రమంగా మళ్లీ ప్రభాసతీర్థం చేరినాడు. కౌరవపాండవయుద్ధంలో సమస్తరాజులూ హతులయ్యారనీ, భీమదుర్యోధనులు గదాయుద్ధానికి సన్నద్ధులౌతున్నారనీ ప్రభాసతీర్థమందలి బ్రాహ్మణులవల్ల తెలుసుకొన్నాడు. అందువల్ల వారిరువురినీ ఆ గదాయుద్ధాన్నుండి నివారించేందుకు ఆ ప్రదేశానికి వెళ్లాడు.

**తే. ధర్మనందనుఁ దనకు వందనము సేయు, కృష్ణు నరు మాద్రిసుతుల వీక్షించి యేమి**
**పలుక కుగ్ర గదాదండపాణు లగుచుఁ, గ్రోధమునఁ బోరు భీమదుర్యోధనులను. 954**

**ప్రతి :** తనకున్= (బలరాముడు) తనకు; వందనము+చేయు= నమస్కరించుచున్న; ధర్మనందనున్= ధర్మరాజును; కృష్ణున్= శ్రీకృష్ణుని; నరున్= అర్జునుని; మాద్రిసుతులన్= మాద్రీదేవి కుమారులైన నకుల సహదేవులను; ఈక్షించి= చూచి; ఏమి పలుకక= వాళ్లందరితోనూ ఏమీ మాట్లాడకుండా; ఉగ్ర= భీకరమైన; గదాదండపాణులు+ అగుచున్= గదా దండాలను చేతులందు పూనినవారైయుండి; క్రోధమునన్= కోపంతో; పోరు= యుద్ధంచెయ్యటానికి సంసిద్ధులై (పలురకాల విన్యాసాలు చేయుచుండిన); భీమ దుర్యోధనులను= భీముణ్ణీ, దుర్యోధనుణ్ణీ చూచి...

**తా :** బలరాముడు భక్తితో తనకు నమస్కరించిన శ్రీకృష్ణుణ్ణి, పాండవులను చూచికూడా పలుకరింపలేదు. గదాయుద్ధానికి సంసిద్ధులౌతూవున్న భీమదుర్యోధనుల దగ్గరికే సరాసరి వెళ్లాడు.

**వ. చూచి వారల డాయం జని యిట్లనియె. 955**

**ప్రతి :** చూచి= బలరాముడు భీమదుర్యోధనులను చూచినవాడై; వారలన్= వారిద్దరినీ; డాయన్+చని= సమీపంగా వెళ్లి, ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తా :** బలరాముడు భీమ సుయోధనులను చూచి, దగ్గరకు వెళ్లి, వాళ్లతో ఇలా అన్నాడు.

**సీ. వీరపుంగవులార! వినుఁడు;మీలోపల భూరిభుజాసత్త్వమున నొకండు**
**ప్రకటితాభ్యాససంపద్విశేషంబున నొక్కండు యధికుఁడై యుంటఁజేసి**
**సమబలు; లటు గాన చర్చింపఁగా నిందు, జయ మొక్కనికి లేదు సమరమందుఁ;**
**గాన యూరక పోరఁగా నేల మీ కని వారింప నన్యోన్య వైరములను**

**తే. నడరి తొల్లింటిదుర్భాష లాత్మలందుఁ, దలఁచి తద్భాషణము లపథ్యములు గాఁగ**
**మొక్కలంబునఁ బోర నా ముష్టికాసు,రారి వీక్షించి వీరి శుభాశుభములు, 956**

**ప్రతి :** వీరపుంగవులార!= వీరులలో శ్రేష్ఠులైనవారలారా!; వినుడు= నా మాటలు వినండి!; మీలోపలన్= మీ యిరువురలో; ఒకండు= ఒక్కడు (భీమసేనుడు); భూరి= గొప్పదైన; భుజాసత్త్వమునన్= భుజ బలంచేతను; ఒక్కండు= ఇంకొక్కడు (దుర్యోధనుడు); ప్రకటిత= స్పష్టంగా తెలియబడిన; అభ్యాస= నిరంతరం అభ్యాసం చేయడమనే; సంపత్+విశేషంబునన్= విశేషమైన సంపదచేతను; అధికుఁడు+ఐ= గొప్పవాఁడై; ఉంటన్+చేసి= ఉన్నందువల్ల; సమబలులు= ఇద్దరూ సమాన బలంకలవారే; అటుగాన= అందుచేత; ఇందున్= ఈ విషయమై; చర్చింపన్+కాన్= పరిశీలించగా; ఒక్కనికిన్= ఇద్దరిలో

ఏ ఒక్కనికీ; సమరము+అందున్= యుద్ధంలో; జయము లేదు= గెలుపు లేదు; కాన= కనుక; మీకున్= మీ ఇద్దరికీ; ఊరక= వ్యర్థంగా (వృథాగా); పోరన్+కాన్+ఏల?= యుద్ధం చేయడం ఎందుకు?; అని వారింపన్= అని బలరాముడు నివారించగా; అన్య+అన్యవైరములను= పరస్పరం ఏర్పడియున్న విరోధభావనలచేత; అడరి= అతిశయించినవారై; తొల్లింటి= పూర్వం ఒకరినుద్దేశించి మరియొకరు చెప్పిన; దుర్+భాషలు= చెడ్డ మాటలు (తిట్లు, ప్రతిజ్ఞలు మొదలై); ఆత్మల+అందున్= మనస్సులలో; తలచి= స్మరించి (జ్ఞాపకంచేసికొని); తద్+భాషణములు= బలరాముని ఆ వాక్యాలు; అపథ్యములుకాన్+కన్= ఇష్టమైనవి కానందున (రుచించనందువలన); మొక్కలంబునన్= మూర్ఖపు పట్టుతోగూడిన శౌర్యంతో; పోరన్= యుద్ధం చేయబూనగా; ఆ ముష్టికాసుర+అరి= ముష్టికుడనే రాక్షసునికి శత్రువైన బలరాముడు; వీక్షించి= వారిద్దరిని చూచినవాడై; (తనలో తాను ఇలా అనుకొన్నాడు); వీరి= ఈ భీమదుర్యోధనులిరువురియొక్క; శుభ+అశుభములు= మేళ్లు, కీడులు...

**తా :** అలా భీమదుర్యోధనులను సమీపించిన బలరాముడు వారితో ఇలా పల్కాడు. 'వీరశ్రేష్ఠులారా! మీలో ఒకడు (భీముడు) భుజబలంలో అధికుడు; మరొకడు (సుయోధనుడు) అభ్యాససంపదలో శ్రేష్ఠుడు. అందువల్ల మీరిద్దరూ గదాయుద్ధంలో సమానబలశాలురు. కనుక మీలో ఎవరూ ఎవరినీ గెలువలేరు. అలాంటప్పుడు ఊరక యుద్ధం చెయ్యడమెందుకు?' – అని. ఆ హితవచనాలు వాళ్లకు రుచించలేదు. అందుకు కారణం వాళ్ల మనస్సుల్లో మెదలుతూవున్న పాత పగలు, ప్రతిజ్ఞలూను. అందువల్ల వాళ్లిరువురూ పట్టుదలతో, పౌరుషంతో పోరాడటానికే నిశ్చయించుకొన్నారు. వీళ్లకు మేలు కీడులు ఎలా జరుగవలసివుంటే అలా జరుగుతాయి' – అని నిర్ణయించుకొని, బలరాముడు ద్వారకకు మరలినాడు.

**వ. ఎట్లు గావలయు నట్ల యయ్యెడుం గాక యని యచ్చోట నిలువక యుగ్రసేనాదిబంధుప్రకరంబులు పరితోషంబున నెదుర్కొన ద్వారకాపురంబు సొచ్చి, యందుండి మగిడి నైమిశారణ్యంబునకుం జని, యందుల మునిపుంగవు లనుమతింప నచ్చట నొక మఖంబు గావించి, బహుదక్షిణ లొసంగి యంచితజ్ఞాన పరిపూర్ణు లగునట్లుగా వరం బిచ్చి, రేవతియునుం దానును బంధుజ్ఞాతియుతంబుగా నవభృథస్నానం బాచరించి యనంతరంబ. 957**

**ప్రతి :** ఎట్లు+కావలయున్= (భీమ సుయోధనుల గదాయుద్ధంవల్ల సంభవింపబోయే మేలుకీడులు) ఏ రీతిగా కలుగనున్నవో; అట్లు+అ= అలాగే; అయ్యెడన్+కాక!= అగునుగాక!; అని= అని బలరాముడు తన మనస్సులో నిర్ణయించుకొన్న; ఆ+చోటన్= ఆ యుద్ధభూమిలో; నిలువక= ఉండకుండా; ఉగ్రసేన+ఆది= ఉగ్రసేనుడు; బంధుప్రకరంబులు= బంధుజనుల సమూహాలు; పరితోషంబునన్= సంతోషంతో; ఎదుర్కొనన్= ద్వారకలోనుండి ఎదురేగిరాగా; ద్వారకాపురంబు+చొచ్చి= ద్వారకాపట్టణంలో ప్రవేశించి; అందున్+ఉండి= ఆ ద్వారకా నగరంలోనుండి; మగుడన్= మరల; నైమిశ+అరణ్యంబునకున్= నైమిశారణ్యానికి; చని= వెళ్లి; అందుల మునిపుంగవులు= ఆ నైమిశారణ్యంలోని మునిశ్రేష్ఠులు; అనుమతింపన్= అంగీకరించగా; అచ్చట= ఆ ప్రదేశంలో; ఒక మఖంబు= ఒక యాగాన్ని; కావించి= చేసి; బహుదక్షిణలు= అనేకద్రవ్యదక్షిణలు; ఒసంగి= ఋత్విక్కులకు దానంచేసి; అంచిత= ఒప్పియున్న; జ్ఞాన= జ్ఞానంచేత; పరిపూర్ణులు+అగునట్లుగాన్= పరిపూర్ణమైన వారగునట్లుగా (పరిపూర్ణజ్ఞానవంతులగునట్లుగా); వరంబు+ఇచ్చి= వరాన్ని ప్రసాదించి; రేవతియునున్+తానును= ధర్మపత్నియైన రేవతీదేవియును, బలరాముడు తానును; బంధుజ్ఞాతియుతంబు+కాన్= చుట్టాలతోనూ, దాయాదులతోనూ; అవభృథ స్నానంబు= యజ్ఞం ముగింపైన తర్వాత చేసేపవిత్రమైనస్నానాన్ని; ఆచరించి= చక్కగా నిర్వర్తించి; అనంతరంబు+అ= తరువాత.

**తా :** ఉగ్రసేనాది బంధువుల బృందాలు ద్వారకలోనుండి ఎదురేగి, వచ్చి బలరామదేవునికీ స్వాగతం పలికారు. ఆయన అచ్చట కొంతకాలంనుండి మళ్లీ సపరివారంగా నైమిశాటవికి వెళ్లినాడు. అక్కడ ఋషీశ్వరుల అంగీకారంతో ఒక యజ్ఞాన్ని నిర్వహించాడు. భూరిదక్షిణలతో ఋత్విక్కుల్ని; తదితర బ్రాహ్మణుల్ని సంతోషింపజేశాడు; యజ్ఞం చివర ధర్మపత్ని రేవతీదేవితోనూ, బంధుజనులతోనూ కూడి అవభృథస్నానాన్ని చక్కగా ఆచరించాడు.

**విశే :** అవభృథము : యజ్ఞం ముగించిన తర్వాత వివిధ దోషపరిహారంకోసం చేసే మంత్రపూర్వకమైన పవిత్రస్నానం.

**చ. విలసితమాల్యచందననవీనవిభూషణరత్నవస్త్రముల్**
**పొలుపుగఁ దాల్చి యంచితవిభూతిఁ దలిర్చెను బూర్ణచంద్రికా**
**కలితసుధాంశురేఖ యెసకం బెసఁగన్ నిజబంధులోచనో**
**త్పలచయ ముల్లసిల్లఁ బరిపాండురచారుయశోవిలాసుఁడై. 958**

**ప్రతి :** (బలరామదేవుడు) విలసిత= ప్రకాశించే; మాల్య= పుష్పమాలికలు; చందన= శ్రీగంధపుమైపూతలు; నవీన విభూషణ= కొంగ్రొత్త ఆభరణాలు; రత్నవస్త్రముల్= రత్నాలుకూర్చిన పట్టువస్త్రాలు; పొలుపుగన్= అందంగా; తాల్చి= ధరించి; పూర్ణచంద్రికా కలిత= పరిపూర్ణమైన వెన్నెలలతో కూడియున్న; సుధా+అంశు= అమృత కిరణుడైన చంద్రునియొక్క; రేఖ= సౌందర్యం; ఎసకము+ఎసఁగన్= అతిశయింపగా; నిజబంధు= తన చుట్టాలయొక్క; లోచన= నేత్రాలనే; ఉత్పలచయము= తెల్లకలువపూవుల సమూహం; ఉల్లసిల్లన్= సంతోషంతో వికసింపగా; పరిపాండుర= మిక్కిలి తెల్లనైన; చారు= అందమైన; యశస్+విలాసుడు+ఐ= కీర్తి చేత మిక్కిలి ప్రకాశించే; అంచితవిభూతిన్= ఎంతో తగియున్న ఐశ్వర్యంతో (వైభవంతో); తలిర్చెను= భాసించాడు.

**తా :** బలరామదేవుడు పుష్పమాలికలను ధరించి, చందనపు మైపూతతో; వినూత్న భూషణాలతో రత్నాంబరాలతో పున్నమ చంద్రునివలె ప్రకాశిస్తూ, బంధువుల నేత్రాలనే తెల్లకలువల సమూహానికి పరిపూర్ణమైన వికాసాన్ని ప్రసాదించాడు. మిక్కిలి తెల్లని కీర్తి గలిగి భాసిస్తూ, అమిత వైభవంతో విరాజిల్లసాగాడు.

**వ. ఇ వ్విధంబున ననంతుండు నప్రమేయుండును మాయామానుష విగ్రహుండు నసంఖ్యబలశాలియునైన బలదేవుం డతివైభవంబున నిజపురంబు ప్రవేశించి సుఖం బుండె' నని చెప్పి యిట్లనియె . 959**

**ప్రతి :** ఈ+ విధంబునన్= ఈ ప్రకారంగా; అనంతుండును= అంతమే లేనివాడు (ఆదిశేషుని అవతారమైనవాడు); అప్రమేయుండును= ఇంతయని పరిమితి నిర్ణయించడానికి వీలుకాని మహిమగలవాడు; మాయామానుష విగ్రహుండును= కల్పించుకున్న మనుష్యస్వరూపంగలవాడు; అసంఖ్య= ఇంతయని లెక్కింపవీలుకాని; బలశాలియున్+ఐన= బలం గలవాడైన; బలదేవుండు= బలరామదేవుడు; అతివైభవంబునన్= గొప్ప ఐశ్వర్యస్ఫూర్తితో; నిజపురంబు= తనదైన ద్వారకానగరాన్ని; ప్రవేశించి= చొచ్చి; సుఖంబు+ఉండెన్= సుఖంగా ఉండినాడు; అని చెప్పి= అని యీ రీతిగా వివరించిన శుకమునీంద్రుడు; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= పరీక్షిత్తుతో ఇలా చెప్పాడు.

**తా :** ఆదిశేషుని అవతారమైనవాడూ, మహామహిమోపేతుడూ, మాయామానుషవేషధారీ, అమితబలశాలీ - అయిన బలరామదేవుడు ఈ విధంగా మహావైభవంతో ద్వారకను ప్రవేశించి, అచ్చట సుఖంగా ఉన్నాడు - అని చెప్పి శుకమహర్షి పరీక్షిత్తుతో మళ్లీ చెప్పటానికి ఉపక్రమించాడు.

## ✤ కుచేలోపాఖ్యానము ✤

**క. హలధరుఁ డమర్త్యచరితుం, డలఘుభుజాబలుఁ డొనర్చు నద్భుతకర్మం**
**బులు పెక్కు నాల్గుమోములు, గల మేటియు లెక్కపెట్టఁ గలఁడె నరేంద్రా! 960**

**ప్రతి :** నర+ఇంద్రా!= నరులకు అధిపతియైనవాడా! (మహారాజా!); అమర్త్యచరితుండు= మనుష్యులకు అతీతమైన చరిత్రకలవాడు (మాయామానుష విగ్రహుడు); అలఘు భుజాబలుడు= గొప్పబాహుబలం కలవాడు; హలధరుడు= నాగలిని ఆయుధంగా ధరించినవాడు (బలరామదేవుడు); ఒనర్చు+అద్భుతకర్మంబులు= ఈ లోకంలో ఆచరించే ఆశ్చర్యంతో కూడిన కార్యాలు; పెక్కు= అనేకమైనవి; నాల్గుమోములు+కలమేటియున్= నాలుగు ముఖాలచే ప్రఖ్యాతిగడించిన సృష్టికర్తయైన బ్రహ్మదేవుడుకూడ; లెక్కపెట్టన్+కలడె?= లెక్కింపగలడా? (లెక్కింపజాలడు).

**తా :** మాయా మానుషస్వరూపుడు, గొప్ప భుజబలంకలవాడు, హలాయుధుడు అయిన బలరామస్వామి నిర్వహించే ఆశ్చర్యకరాలైన కార్యాలు ఎన్నో ఉన్నాయి. చతుర్ముఖబ్రహ్మకుకూడా వాటిని ఇన్నని లెక్కపెట్టడం సాధ్యంకాదు – అని శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజుతో చెప్పాడు.

**చ. అనిన మునీంద్రుఁ గన్గొని ధరాధిపుఁ డిట్లను పద్మపత్త్ర లో**
**చనుని యనంతవీర్యగుణసంపద వేమఱు విన్న నైననుం**
**దనియదు చిత్త మచ్యుతకథావిభవం బొకమాటు వీనులన్**
**వినిన మనోజపుష్పశరవిద్ధుఁడు నైన విరామ మొందునే? 961**

**ప్రతి :** అనినన్= పైరీతిగా చెప్పాగా; ముని+ఇంద్రున్= మునులలో శ్రేష్ఠుడైన శుకయోగిని; కన్గొని= చూచి; ధరా+అధిపుడు= భూమికి అధిపతియైన పరీక్షిత్తు; ఇట్లు+అనున్= ఈ విధంగా అంటున్నాడు; పద్మపత్రలోచనుని= తామరపూరేకులవంటి (వెడల్పాటి అందమైన) కన్నులుగల శ్రీకృష్ణదేవునియొక్క; అనంతవీర్యగుణసంపద= అంతులేని శౌర్యాన్ని, ఉత్తమ గుణసంపదను గూర్చి; వేమఱున్= వెయ్యిమారులు (పెక్కు పర్యాయాలు); విన్నన్+ఐనన్= వినినప్పటికిని; చిత్తము= మనస్సు; తనియదు= తృప్తిని చెందదు; అచ్యుత కథావిభవంబు= శాశ్వతుడైన శ్రీకృష్ణునికథల మహిమను; మనస్+జ= మన్మథునియొక్క; పుష్పశర= పూలబాణాలచేత; విద్ధుడున్+ఐనన్= కొట్టింపబడినవాడుకూడ; ఒక మాటు= ఒక్కమాఱు; వీనులన్= చెవులారా; వినినన్= వినినట్లయితే; విరామము+ఒందునే?= మళ్లీ మళ్లీ వినకుండా ఉంటాడా? (వినకుండా ఉండలేడు)

**తా :** అని శుకమహర్షి పల్కగా, పరీక్షిత్తు ఇలాగ అంటున్నాడు : 'కమలదళాక్షుని అంతులేని పరాక్రమప్రశస్తిని గురించి, అంతులేని గుణగణాలనుగూర్చి వెయ్యిమార్లు విన్నా మనస్సుకు తృప్తి కలుగదు. ఆ విష్ణుదేవుని కథావైభవాన్ని ఒక్క పర్యాయం వింటే చాలు, కామునిబాణాలచే పీడింపబడినవాడుసైతం మళ్లీమళ్లీ వినకుండా ఉండలేడు.

**వ. అదియునుంగాక. 962**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాకుండా...

**తా :** పైన చెప్పినదానితోపాటుగా, ఈ క్రింది విషయంకూడా చిత్తగింపదగి ఉంది.

చ. హరి భజియించు హస్తములు హస్తము; లచ్యుతుఁ గోరి మ్రొక్కు త
చ్ఛిరము శిరంబు; చక్రధరుఁ జేరిన చిత్తము చిత్త; మిందిరా
వరుఁ గను దృష్టి దృష్టి; మురవైరి నుతించిన వాణి వాణి; య
క్షరుకథ లాను కర్ణములు కర్ణములై విలసిల్లుఁబో భువిన్. 963

**ప్రతి :** భువిన్= ఈ భూమియందు; హరిన్= శ్రీమహావిష్ణుని (శ్రీకృష్ణుని); భజియించు= భక్తితో సేవించునట్టి; హస్తములు= చేతులే; హస్తములు= సార్థకమైన చేతులు; అచ్యుతున్= చ్యుతి (నాశం)లేని ఆ దేవుని; కోరి మ్రొక్కు= ఆసక్తితో నమస్కరించే; తత్+శిరము= ఆ శిరస్సే; శిరంబు= నిజమైన శిరస్సు; చక్రధరున్= సుదర్శనమనెడి దివ్యమైన చక్రాన్ని ధరించి ఉండే ఆ దేవదేవుణ్ణి; చేరిన= చేరుకొనినట్టి; చిత్తము= మనస్సే; చిత్తము= నిజమైన మనస్సు; ఇందిరావరున్= లక్ష్మీదేవికి నాథుడైన ఆ స్వామిని చూచే; దృష్టి= చూపులే; దృష్టి= సార్థకమైన చూపులు; మురవైరిన్= మురుడనే రాక్షసునికి శత్రువైనవాణ్ణి; నుతించిన= కొనియాడేటటువంటి; వాణి= మాటే; వాణి= నిజమైన మాట; అక్షరుకథలు= నశింపని స్వభావం కలిగిన ఆ స్వామియొక్క కథల్ని; ఆను= వినునట్టి; కర్ణములు= చెవులే; కర్ణములు+ఐ= సార్థకమైన చెవులుగా; విలసిల్లున్+పో= ఒప్పుతూవుంటాయి సుమా!

**తా :** మునిచంద్రా! ఈ లోకంలో శ్రీహరిని పూజించే చేతులే సార్థకమైన చేతులు. ఆయనకు నమస్కరించే శిరస్సే శిరస్సు. ఆ చక్రధారియందు లగ్నమైన మనస్సే మనస్సు. ఆ లక్ష్మీనాథుణ్ణి చూచే కన్నులే కన్నులు. ఆ మురారిని స్తుతించే నోరే నోరు. శాశ్వతుడయిన ఆయనయొక్క దివ్యకథలను వినే చెవులే నిజమైన చెవులు సుమా!

క. హరిపాదతీర్థసేవా, పరుఁడై విలసిల్లునట్టి భాగవతుని వి
స్ఫురితాంగము లంగము; లా, పరమేశ్వరు నెఱుఁగ నాకుఁ బలుకు మునీంద్రా! 964

**ప్రతి :** ముని+ఇంద్రా!= మునుల్లో శ్రేష్ఠుడా! (శుకయోగీశ్వరా!); హరిపాదతీర్థ= శ్రీమహావిష్ణుని పాదాలయొక్క; పవిత్రజలాన్ని (శ్రీహరి పాదాలను అభిషేకించగా లభించిన పవిత్రమైననీటిని); సేవాపరుడు+ఐ= స్వీకరించడంలో ఆసక్తి గల్గినవాడై; విలసిల్లు+అట్టి= ప్రకాశిస్తూవుండే; భాగవతుని= భగవంతునియొక్క భక్తుని; విస్ఫురిత+అంగములు= విశేషంగా ప్రకాశించే అవయవాలే; అంగములు= (నిజమైన) అవయవాలు; ఆ పరమ+ఈశ్వరున్= తన పాదతీర్థాన్ని స్వీకరించటంచేత భక్తులను (భాగవతులను) ప్రకాశింపజేసే అందరికీ అధిపతియైన ఆ పరమేశ్వరుణ్ణి (ఆ శ్రీహరిని); నాకున్= (ఆయనయెడల భక్తి భావంగల) నాకు; ఎఱుఁగన్+పలుకు= తెలిసేటట్లుగా చెప్పండి!.

**తా :** మౌనీంద్రా! శ్రీహరిపాదతీర్థాన్ని సేవించటంలో ఆసక్తి కలిగి ప్రకాశించే పరమభాగవతునిఅవయవాలే నిజమైన అవయవాలు. అలాంటి విశిష్టమైన పాదతీర్థ ప్రభావంగలిగిన ఆ పరమేశ్వరుణ్ణి గూర్చి విశదంగా తెలియజేయగోరుతున్నాను.

సీ. అనుడు వేదవ్యాసతనయుఁ డా యభిమన్యు తనయునిఁ జూచి యిట్లనియెఁ బ్రీతి
జనవర! గోవిందసఖుఁడు కుచేలుండు, నా నొప్పు విప్రుండు మానధనుఁడు
విజ్ఞాని రాగాదివిరహితస్వాంతుండు శాంతుండు ధర్మవత్సలుఁడు ఘనుఁడు
విజితేంద్రియుఁడు బ్రహ్మవేత్త దారిద్ర్యంబు బాధింప నొరులఁ గార్పణ్యవృత్తి

**తే. నడుగఁ బోవక తనకుఁ దా నబ్బినట్టి, కాసు పదివేలనిష్కముల్గాఁ దలంచి**
**యాత్మ మోదించి పుత్రదారాభిరక్ష, యొకవిధంబున నడుపుచు నుండు నంత 965**

**ప్రతి :** అనుడున్= అని పరీక్షిత్తు పలుకగా; వేదవ్యాస తనయుడు= వేదవ్యాసుని కుమారుడైన శుకుడు; ఆ+అభిమన్యు తనయునిన్= అభిమన్యుని పుత్రుడైన పరీక్షిత్తును; చూచి= చూచి; ప్రీతిన్= సంతోషంతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పల్కినాడు; జనవర!= జనులకు పతివైన పరీక్షిత్ రాజేంద్రా!; గోవిందసఖుడు= శ్రీకృష్ణుని మిత్రుడు; కుచేలుండునాన్= కుచేలుడు అని పిలువబడిన; విప్రుండు= బ్రాహ్మణుడు; మానధనుడు= అభిమానమే (ఆత్మగౌరవమే) ధనంగా గలవాడు; విజ్ఞాని= గొప్ప విజ్ఞానంగలవాడు; రాగ+ఆది= స్వార్థంతో కూడిన అనురాగం, ద్వేషం మొదలైన దుర్గుణాలు; విరహిత= లేనట్టి; స్వాంతుండు= మనస్సుగలవాడు; శాంతుండు= శాంతమైన స్వభావంకలవాడు (అంతరింద్రియ నిగ్రహంకలవాడు); ధర్మవత్సలుడు= ధర్మంతో గూడిన ప్రవర్తనయందు ప్రీతిగలవాడు; ఘనుడు= గొప్ప స్వభావంకలవాడు; విజిత= జయింపబడిన; ఇంద్రియుడు= జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములుగలవాడు (ఇంద్రియములను జయించినవాడు); బ్రహ్మవేత్త= పరబ్రహ్మయొక్క తత్త్వాన్ని తెలుసుకొనినవాడు; దారిద్ర్యంబు= పేదతనము; బాధింపన్= తనను బాధిస్తూ ఉండగా; ఒరులన్= ఇతరులను; కార్పణ్యవృత్తిన్= దీన స్వభావంతో; అడుగన్+పోవక= యాచించటానికై వెళ్లక; తనకున్+తాను= తనంతట తానుగా; అబ్బిన+అట్టి= లభించినటువంటి; కాసు= (అతిచిన్న విలువగల) నాణెమును కూడా; పదివేల నిష్కముల్+కాన్= పదివేలబంగారునాణేలుగా; తలంచి= భావనచేసి; ఆత్మన్= మనస్సునందు; మోదించి= సంతోషించి; పుత్రదారా+అభిరక్షన్= కుమారులను; భార్యను రక్షించే (పోషించే) కార్యాన్ని; ఒక విధంబునన్= ఒక రీతిగా; నడపుచున్+ఉండున్= కొనసాగిస్తూ ఉండినాడు; అంతన్= అలా జీవనం సాగిస్తూ ఉండగా (ఒకనాడు)...

**తా :** అలా అడిగిన పరీక్షిత్తును చూచి శుకుడు సంతోషంతో ఇలా పలికాడు. "రాజేంద్రా! శ్రీకృష్ణుని బాల్యమిత్రుడైన కుచేలుడు అభిమానధనుడు, గొప్పవిజ్ఞాని, రాగద్వేషాలు లేనివాడు, పరమశాంతమూర్తి", ధర్మమార్గతత్పరుడు, జితేంద్రియుడు, బ్రహ్మవేత్త, తననూ, తనకుటుంబాన్నీ దారిద్ర్యం బాధిస్తూ ఉన్నా, ఇతరుల నెవ్వరినీ దీనతతో చేయిసాచి యాచించి యెరుగడు. తనంత తానుగా న్యాయంగా తనకు లభించిన చిన్నకాసునుకూడ పదివేల బంగారు మొహరీలనుగా భావించి, ఏదో ఒక రీతిగా భార్యా పుత్రులను పోషిస్తూ ఉండినాడు. ఇలా ఉండగా ఒక రోజున

**సీ. లలితపతివ్రతాతిలకంబు వంశాభిజాత్య తద్భార్య దుస్సహదరిద్ర**
**పీడచేఁ గడు నొచ్చి పెదవులు దడుపుచు శిశువు లాఁకటి చిచ్చుచేఁ గృశించి**
**మల మల మాఁడుచు మానసం బెరియంగఁ 'బట్టెఁ డోరెము మాకుఁబెట్టు' మనుచుఁ**
**బత్త్రభాజనధృతపాణులై తనుఁ జేరి వేఁడిన వీనులు సూఁడినట్ల**

**ఆ. యైన నొకనాఁడు వగచి నిజాధినాథుఁ, జేరి యిట్లని పలికె 'నో జీవితేశ!**
**తట్టుముట్టాడు నిట్టి పేదటిక మిట్లు, నొంప దీని కుపాయ మూహింప వైతి. 966**

**ప్రతి :** లలిత= హృద్యమైన; పతివ్రతా తిలకంబు= పతివ్రతా స్త్రీలలో తిలకంవంటి శ్రేష్ఠురాలు; వంశ+అభిజాత్య= ఉత్తమవంశంలో జన్మించినట్టి; తద్+భార్య= ఆ కుచేలుని పత్ని; దుస్+సహ= భరింపసాధ్యంకాని; దరిద్రపీడచేన్= పేదతనపు బాధచేత; కడున్+నొచ్చి= మనస్సున మిగుల చింతనొంది; ఒకనాడు= ఒక రోజున; శిశువులు= తన సంతానం;

ఆకటి చిచ్చుచేన్= ఆకలి అనే అగ్నిచేత; కృశించి= శరీరాలు చిక్కిపోయి; పెదవులు+తడుపుచున్= ఎండిపోయిన పెదవులను నాలుకతో తడపుకొంటూ; మలమల మాడుచున్= (కడుపునందలి జఠరాగ్నిచేత) మాడిపోతూ, మానసంబు= తన మనస్సు; ఎరియన్+కన్= పరితపించగా; పత్రభాజన= ఆకులతో చేసిన (దొన్నెలలాంటి) పాత్రలను; ధృత= ధరించబడిన; పాణులు+ఐ= చేతులుగలవారై (ఆకులను చేర్చి కుట్టి చేసిన దొన్నెలలాంటి పాత్రలను పట్టుకొన్నవారై); పట్టెడు+ఓరెము= చేతితో పట్టుకొన దగిన పరిమాణంగల అన్నం; మాకున్= మాకు; పెట్టుము= పెట్టవలసింది; అనుచున్= అంటూ; (ఆ శిశువుల పల్కులు); వీనులు= తన చెవులను; చూఁడినట్లు+అ= (వేడిచేసిన సాధనంతో) క్రుచ్చి కాల్చినట్లుకాగా; తనున్= తనను; చీరి= పిల్చి; వేడినన్= దీనంగా అడుగగా; వగచి= దుఃఖించిందై; నిజ+అధినాథున్= తనకు అధిపతియగు కుచేలుణ్ణి; చేరి= సమీపించి; ఇట్లు+అని= ఈ రీతిగా; పలికెన్= పలికింది; ఓ జీవిత+ఈశ!= నా జీవితానికి అధిపతివైన ఓ స్వామీ!; తట్టు+ముట్టు+ఆడు+అట్టి= మిగుల అతిశయించినట్టి; పేదఱికము= కడుబీదతనము; ఇట్లు= ఈ విధంగా; నొంపన్= (కుటుంబాన్ని) బాధపెట్టుతూ ఉండగా; దీనికిన్+ఉపాయము= దీన్ని తొలగించే ఉపాయాన్ని; ఊహింపవు+ఐతి (వి)= ఆలోచింపకుండా ఉన్నావుకదా!

**తా :** కుచేలుని పత్ని పతివ్రతాశిరోమణి ఉత్తమవంశంలో జన్మించినట్టిది. బిడ్డలు ఆకలితో నకనకలాడుతూ ఎండిన పెదవులను నాలుకతో తడుపుకుంటూ, చేతుల్లో ఆకుదొన్నెలు పట్టుకొని ఒకనాడు తనవద్దకు వచ్చి 'అమ్మా! పట్టెడన్నం పెట్ట'మని అడుగగా, ఆ మాటలకు ఆమె మిక్కిలి బాధపడి భర్తను సమీపించి దుఃఖపడుతూ ఇలా వేడుకొన్నది. 'జీవితేశ్వరా! ఇంటిలో పెల్లుగా పేదఱికం తాండవిస్తూవుంది. దీన్ని నివారించే సదుపాయాన్ని మీరాలోచించకున్నారుకదా!'

**విశే :** ఆమె పేరు చెప్పకుండానే, బిడ్డలదైన్యాన్ని చూచి చలించిన ఆ తల్లి పల్కులద్వారా మహాకవి ఈ సీసపద్యంలో కుచేలుని ధర్మపత్నియొక్క స్వరూప, స్వభావాలను ఆవిష్కరించియున్న తీరు నిరుపమానమైంది!

**వ. అని మఱియు నిట్లనియె. 967**

**ప్రతి :** అని= అని పతితో విన్నవించినదై; మఱియున్= మరల, ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పల్కినది.

**తా :** అని మనవిచేసి, మళ్లీ భర్తతో ఇలా పల్కింది.

**తే. బాలసఖుఁడైన యప్పద్మపత్త్ర నేత్రుఁ, గాన నేఁగి దారిద్ర్యాంధకార మగ్ను**
**లైన మము నుద్ధరింపుము; హరికృపా క, టాక్ష రవిదీప్తి వడసి మహాత్మ ! నీవు. 968**

**ప్రతి :** మహా+ఆత్మ!= గొప్ప ఆత్మగలవాడా!; బాలసఖుడు+ఐన= మీ యొక్క బాల్య స్నేహితుడైన; ఆ+పద్మపత్రనేత్రున్= తామరపూరేకులలాంటి (విశాలమైన, అందమైన) కన్నులుగలవాణ్ణి (శ్రీకృష్ణుణ్ణి); కానన్+ఏగి= దర్శించటానికై వెళ్లి; దారిద్ర్య+అంధకార= నిఱుపేదతనమనే చీకటిలో; మగ్నులు+ఐన= మునిగి ఉన్న; మమున్= మమ్మల్ని (తల్లిని, బిడ్డలను); హరి= శ్రీకృష్ణుని యొక్క; కృపా= దయతోగూడిన; కటాక్ష= కడగంటి చూపులు అనే; రవి= సూర్యునియొక్క; దీప్తి+పడసి= కాంతిని పొంది; ఉద్ధరింపుము= ఉజ్జీవించేలా చేయండి.

**తా :** ఆమె తన ప్రాణేశ్వరునితో ఇంకా ఇలా విన్నవించింది : 'మీ బాల్యమిత్రుడైన ఆ శ్రీకృష్ణదేవుణ్ణి సందర్శించండి! ఆయన కరుణాకటాక్షమనే సూర్యకాంతిచే దారిద్ర్యమనే చీకట్లో క్రుగ్గిపోతున్న మమ్మల్ని ఉద్ధరించండి.

**వ. మఱియును. 969**

**ప్రతి :** మఱియును= ఇంకా...

**చ. వరదుఁడు సాధుభక్తజనవత్సలుఁ డార్తశరణ్యుఁ డిందిరా**
**వరుఁడు దయాపయోధి భగవంతుఁడు కృష్ణుఁడు దాఁ గుశస్థలీ**
**పురమున యాదవప్రకరముల్ భజియింపఁగ నున్నవాఁడు; నీ**
**వరిగిన నిన్నుఁ జూచి విభుఁ డప్పుడ యిచ్చు ననూనసంపదల్. 970**

**ప్రతి :** వరదుడు= భక్తులకు వరాలిచ్చేవాడు; సాధు= సజ్జనులైన; భక్తజన= తన భక్తులైన జనులపట్ల; వత్సలుడు= ప్రేమతో కూడిన దయాగుణంకలవాడు; ఆర్త= బాధలతో, దుఃఖాలతో పీడింపబడుతున్నవారికి రక్షకుడైనవాడు; ఇందిరావరుడు= (సంపదలకు అధిదేవత అయిన) లక్ష్మీదేవియొక్క భర్త; దయాపయస్+ధి= దయాగుణానికి సముద్రుడైనవాడు (సముద్రమంతటి దయాగుణంకలవాడు); భగవంతుడు= ఆరుగొప్పగుణాలు సమగ్రంగా గలవాడు; కృష్ణుడు= శ్రీకృష్ణుడు; తాన్= తాను; కుశస్థలీపురమునన్= ద్వారకానగరంలో; యాదవప్రకరముల్= యాదవులసమూహాలు; భజియింపన్+కన్= భక్తితో సేవిస్తూ ఉండగా; ఉన్నవాడు= విరాజిల్లుతూ ఉన్నాడు; నీవు+అరిగినన్= నీవక్కడికి వెళ్లినట్లైతే; నిన్నున్+చూచి= బాల్యమిత్రుడవైన నిన్ను చూచినవెంటనే; విభుడు= సర్వశక్తి సమన్వితుడైన ఆ ప్రభుడు; అనూన= తక్కువకానట్టి; సంపదల్= ఐశ్వర్యాలను; అప్పుడు+అ= ఆ క్షణంలోనే; ఇచ్చున్= ప్రసాదిస్తాడు.

**తా :** భక్తవత్సలుడు, వరప్రసాది, ఆర్తరక్షకుడు, లక్ష్మీవల్లభుడు, దయాసముద్రుడు, భగవానుడు అయిన శ్రీకృష్ణుడు యాదవ బృందాలు తనను సేవిస్తూ ఉండగా ద్వారకాపురిలో విరాజిల్లుతూ ఉన్నాడు గదా! ఒక్కసారి వెళ్లి ఆ సర్వసమర్థుడైన ప్రభువును సందర్శించండి! ఆ దేవదేవుడు మిమ్మల్ని చూస్తేచాలు. ఆ క్షణమే మీకు అంతులేని సంపదలను తప్పక అనుగ్రహిస్తాడు.

**మ. కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁడై నట్టి దు**
**ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ**
**దలఁప న్నంతన మెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్; సుని**
**శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్? 971**

**ప్రతి :** (భగవంతుడైన శ్రీకృష్ణుడు); కలలోనన్= కలలోకూడా; తనున్= తనను; మున్ను+ఎఱుంగని= ఇంతకుముందు నామమాత్రంగా నైనా తలచని; మహాకష్ట+ఆత్ముడు+ఐనట్టి= మిక్కిలి పాపాత్ముడైన; దుర్+బలుడు= ఇంద్రియ బలహీనుడైనవాడు; ఆపత్+సమయంబునన్= ఆపదలు కలిగినవేళల్లో; నిజపద+అబ్జాతంబులు= తన పాదాలనే పద్మాలను (పద్మాలను పోలిన అందమైన పాదాలను); ఉల్లంబులోన్= మనస్సులో; తలపన్= ధ్యానింపగా; అంతన్+అ= వెంటనే; మెచ్చి= సంతోషించి; ఆర్తిహరుడు+ఐ= (అట్లు ధ్యానించినవానియొక్క) దుఃఖాన్ని పోగొట్టేవాడై; తన్నున్+ఐనన్= తననుకూడా; ఇచ్చున్= (కోరినయెడల) సమర్పించుకొంటాడు; సునిశ్చలభక్తిన్= మిక్కిలి స్థిరమైన భక్తిభావంతో; భజియించువారికి= తనను సేవించేవారికి; సంపత్+విశేష+ఉన్నతుల్= ఉన్నతమైన విశేషఐశ్వర్యాలను; ఇడడు+ఏ?= ఇవ్వడా? (తప్పకుండా ఇస్తాడు).

**తా :** కలలోకూడా తనను ఎన్నడూ స్మరించని పాపాత్ముడే అయినా, ఆపద వచ్చిన వేళలో ఒక్కసారి ఆ ఆర్తశరణ్యుని పాదపద్మాలను మనసారా స్మరిస్తేచాలు, అట్టివాణ్ణి సైతం ఆ భగవానుడు కనికరిస్తాడు. అవసరమైతే తనను తాను

సమర్పించుకోగలడు. అటువంటి దయామయుడు సుస్థిరమైన భక్తిభావంతో నిత్యమూ తనను ఆరాధించేవారికి గొప్ప గొప్ప ఐశ్వర్యాలను ఇయ్యకుండా ఉంటాడా? (తప్పక ప్రసాదిస్తాడు.)

**విశే :** పైరెండు పద్యాలమూలంగా కుచేలుని ధర్మపత్నియొక్క బుద్ధికుశలత వెల్లడౌతున్నది. "భార్యాశ్రేష్ఠతమ స్సఖా" అని సూక్తి. "భార్య సఖులలో శ్రేష్ఠతమురాలు"। "అధిక దుఃఖరోగార్తున కౌషధంబు సురుచిరంబుగ భార్యయె చూవెయెందు" అని నన్నయ సూక్తి.।

"కరణేషు మంత్రీ" – అనే ఉత్తమ ధర్మపత్నీ లక్షణానికి కుచేలుని భార్య చక్కని ఉదాహరణమనే సత్యాన్ని పైరెండు పద్యాలు మనోజ్ఞంగా నిరూపిస్తూవున్నాయి. పురుషునికి ముగ్గురే ఆప్తమిత్రులు 1. తల్లి 2. గురువు 3. భార్య. "ఆప్తవాక్యం ప్రమాణమ్" అన్నారు పెద్దలు.

**క. అని చెప్పిన న మ్మానిని, సునయోక్తుల కలరి భూమిసురుఁ డా కృష్ణుం**
**గన నేఁగుట యిహపర సా, ధన మగు నని మదిఁ దలంచి తన సతితోడన్. 972**

**ప్రతి :** అని చెప్పినన్= అని పైవిధంగా విన్నవించగా; ఆ+మానిని= ఆత్మాభిమానం కల ఆ స్త్రీయొక్క; సు+నయ+ఉక్తులకున్= ఉత్తమమైన నీతితోగూడిన పల్కులకు; అలరి= సంతసించి; భూమిసురుడు= బ్రాహ్మణుడు (కుచేలుడు); ఆ కృష్ణున్= ఆ శ్రీకృష్ణ పరమాత్మను; కనన్+ఏగుట= దర్శించేందుకు వెళ్లటం; ఇహ+పరసాధనము= ఈ లోకంయొక్క ప్రయోజనాన్ని, పరలోకంయొక్క ప్రయోజనాన్ని చేకూర్చుకునే ఉపాయం; అగున్+అని= అవుతుంది కదా!అని; మదిన్+తలంచి= మనస్సులో భావించి; తనసతితోడన్= తన పత్నితో (ఇలా అన్నాడు)...

**తా :** తన యిల్లాలు చెప్పినట్లుగా శ్రీకృష్ణుణ్ణి సందర్శించటానికి వెళ్లటం ఇహపరసాధకం కాగలదని భావించి, కుచేలుడు సతితో (ఇలా పలికినాడు)

**తే. నీవు సెప్పిన యట్ల రాజీవనేత్రు, పాదపద్మంబు లాశ్రయింపంగఁ జనుట**
**పరమశోభన మా చక్రపాణి కిపుడు, గాను కేమైనఁ గొంపోవఁ గలదె మనకు? 973**

**ప్రతి :** నీవు+చెప్పిన+అట్లు+అ= నీవు చెప్పిన ప్రకారంగానే; రాజీవనేత్రు= తామరపూలవంటి కన్నులుగల శ్రీకృష్ణునియొక్క, పాదపద్మంబులు= పద్మాలను బోలిన పాదాలను; ఆశ్రయింపన్+కన్= ఆశ్రయించేందుకు (శరణు పొందుటకు); చనుట= వెళ్లటం; పరమశోభనము= మిగుల శుభాన్ని కలిగించేది; ఆ చక్రపాణికిన్= సుదర్శనమనే చక్రాన్ని చేతియందు ధరించేవాడైన ఆ శ్రీకృష్ణునికి; కొని+పోవన్= తీసుకొని పోవటానికి; మనకున్= మనవద్ద (మన యింట్లో); కలదు+ఎ?= ఏమైనా ఉందా? (ఉన్నదేమో చూడుము – అని అభిప్రాయం)

**తా :** కుచేలుడు తన భార్యతో ఇలా అన్నాడు – నీవు చెప్పినట్లు 'శ్రీకృష్ణుని పాదపద్మాలను ఆశ్రయించడం మనకు శుభప్రదమైనదే! కానీ, ఆ చక్రపాణికి సమర్పించటానికి మనవద్ద ఏమైనా కానుక ఉందా?' చూడు.

**విశే :** "రిక్తహస్తేన నోపేయాత్ రాజానం దైవతం గురుమ్" అని పెద్దలమాట. అనగా రాజువద్దకుగాని, దేవుని సన్నిధికిగాని, గురువు సమక్షానికిగాని వెళ్లేటప్పుడు వట్టిచేతులతో వెళ్లరాదు. వాళ్లకేదైనా ఇవ్వడానికి కానుకను తీసుకొని వెళ్లాలని అభిప్రాయం.

శ్రీకృష్ణుడు రాజు, దైవం, గురువు – ఈ మూడూ కాబట్టి, అతని వద్దకు రిక్తహస్తాలతో పోనేపోరాదు. ఈ ధర్మం తెలిసినవాడూ, సహజంగా భక్తుడూ కనుక, కుచేలుడు ఆ కృష్ణునికి అర్పించటానికి ఏదైనా ఉందేమో చూడుమని తన పత్నికి చెప్పాడు.

**తే. అనిన న య్యింతి యౌఁగాక యనుచు విభుని, శిథిలవస్త్రంబుకొంగునఁ బృథుకతండు**
**లముల నొకకొన్ని ముడిచి నెయ్యమున ననుపఁ, జనియె గోవిందదర్శనోత్సాహి యగుచు.974**

**ప్రతి :** అనినన్= అని కుచేలుడు చెప్పగా; ఆ+ఇంతి= ఆ స్త్రీ; ఔన్+కాక= అవును నిజమేకదా!; అనుచున్= అంటూ; శిథిలవస్త్రంబు కొంగునన్= (కుచేలుడు కప్పుకొనియున్న) చినిగిన ఉత్తరీయపు అంచునందు; ఒకకొన్ని= చాలకొద్దిగా ఉన్న; పృథుక తండులములన్= బియ్యపు అటుకుల్ని; ముడిచి= మూటగా కట్టి; నెయ్యమునన్+అనుపన్= ప్రీతితో సాగనంపగా; గోవింద దర్శన+ఉత్సాహి+అగుచున్= శ్రీకృష్ణుణ్ణి సందర్శించే ఉత్సాహంతో కూడినవాడవుతూ; చనియెన్= వెళ్లాడు.

**తా :** 'అవును నిజమేకదా!' – అని పలికి కుచేలునిభార్య కొన్ని అటుకుల్ని ఆతని చినిగిన ఉత్తరీయపు కొంగున ముడివేసి, ప్రియంగా పతిదేవుణ్ణి సాగనంపింది. ఆ విప్రోత్తముడు గోవిందుణ్ణి దర్శింపబోతున్నాననే ఉత్సాహంతో పయనం సాగించాడు.

**వ. అట్లు సనుచుం దన మనంబున. 975**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; చనుచున్= గోవిందుణ్ణి దర్శించవలెననే ఉత్సాహంతో వెళ్లుతూ; తనమనంబునన్= కుచేలుడు తన మనస్సులో (తలపోయసాగాడు – ఆలోచింపసాగినాడు)...

**తా :** ఆ విధంగా కృష్ణుడిని చూడాలనే కోరికతో వెళ్తూ, ఆ కుచేలుడు తన మనస్సులో (ఆలోచింపసాగాడు)

**సీ. ద్వారకానగరంబు నే రీతిఁ జొత్తును? భాసురాంతఃపురవాసి యైన**
**య ప్పుండరీకాక్షు నఖిలేశు నెబ్భంగిఁ దర్శింపఁ గలనొ? తద్ద్వారపాలు**
**రెక్కడి విప్రుఁడ? విం దేల వచ్చెద?వని యడ్డ పెట్టిరే నపుడు వారి**
**కే మైనఁ బరిదాన మిచ్చి చొచ్చెద నన్న నూహింప నర్థశూన్యుండ నేను;**

**తే. నయిన నా భాగ్య; మతనిదయార్ద్రదృష్టి, గాక తలపోయఁగా నొండు గలదె? యాతఁ**
**డేల నన్ను నుపేక్షించు? నేటిమాట?, లనుచు నా ద్వారకాపుర మతఁడు సొచ్చి. 976**

**ప్రతి :** ద్వారకా నగరంబున్= ద్వారకా పట్టణాన్ని; ఏ రీతిన్= ఎలాగ; చొత్తును?= ప్రవేశింపగలను?; భాసుర= ప్రకాశిస్తూ ఉండే; అంతఃపురవాసి+ఐన= రాణివాసపు రాచనగరులో నివసిస్తుండేవాడైన; అఖిల+ఈశున్= సమస్తప్రపంచానికి అధిపతియైన; ఆ+పుండరీక+అక్షున్= తెల్లదామరలవంటి అందమైన ఆ శ్రీకృష్ణుణ్ణి; ఏ+భంగిన్= ఏ రీతిగా; దర్శింపన్+కలను+ఒ?= చూడ గల్గుదునో కదా!; తద్+ద్వారపాలురు= ఆ శ్రీకృష్ణుని నివాసభవనంయొక్క ద్వారంలో ఉండే కావలివాళ్లు; ఎక్కడి విప్రుడవు?= బ్రాహ్మణుడా! ఎక్కడినుండి వస్తూవున్నావు?; ఇందున్+ఏలన్+వచ్చెదవు?= ఈ భవనంలోనికి ఎందుకు వస్తూ ఉన్నావు?; అని= అని పలికి; అడ్డము+పెట్టిరి+ఏన్= లోపలికి వెళ్ళనీయకుండా అడ్డుకొన్నట్లయితే; వారికిన్= ఆ కావలివారికి; ఏమైనన్= ఏదైనా; పరిదానము= బహుమానము; ఇచ్చి= చేతి కందించి; చొచ్చెదన్+అన్నన్=

మందిరంలోపల ప్రవేశిస్తానులెమ్మనుకుంటే; ఊహింపన్= ఆలోచించగా; ఏనున్= నేను; అర్థశూన్యుండన్= ధనం లేనివాణ్ణి; అయినన్= అలాగ బహుమానం ఇచ్చే శక్తిలేనివాడనైనా; నా భాగ్యము= నా యొక్క అదృష్టం; అతని= ఆ శ్రీకృష్ణునియొక్క; దయాదృష్టి+కాక= కృపావీక్షణం కనుక; తలపోయన్+కాన్= ఆలోచించినట్లైతే; ఒండు+కలదు+ఎ?= ఇంకొకటి ఉన్నదా? (ఇంకొక విధంగా ఉండదు); ఆతఁడు= (దయగల) ఆ శ్రీకృష్ణుడు; నన్నున్= (ఆయన భక్తుడినైన) నన్ను; ఏలన్= ఎందుకు; ఉపేక్షించున్?= నిరాదరిస్తాడు (అశ్రద్ధ చేస్తాడు? – చెయ్యడని అభిప్రాయం); ఏటిమాటలు?= ఇవేం మాటలు? (ఇలా అనుకోవడం తగదు); అనుచున్= అని తనమనస్సున నిశ్చయించుకొంటూ; అతడు= ఆ కుచేలవిప్రుడు; ఆ ద్వారకాపురము= ఆ ద్వారకాపట్టణాన్ని; చొచ్చి= ప్రవేశించి...

**తా :** ద్వారకా పురికి వెళ్లుతూ కుచేలుడు దారిలో ఇలా ఆలోచించాడు. 'అంత పెద్ద ద్వారకాపురిని నేను ఎలా ప్రవేశించగలను? ఒక వేళ ప్రవేశించినా, అంతఃపురంలో నివసిస్తూవున్న శ్రీకృష్ణుణ్ణి ఎలా చూడగలను? ఒకవేళ ఆయన నివసించే భవనాన్ని సమీపించినా, అచ్చటి కావలివారు నన్ను లోపలకు వెళ్లనివ్వకపోతే, వాళ్లకు బహుమానంగా ఏమియ్యగలను? అయినా ఆ శ్రీకృష్ణుని దయాదృష్టిపై, నా అదృష్టం ఆధారపడి ఉంది. ఆ దయామయుడు తన భక్తుడైన నన్ను ఎందుకు ఉపేక్షిస్తాడు? ఆయన నన్ను తప్పక ఆదరిస్తాడు' – అని నిర్ణయించుకొని, ఆ విప్రవర్యుడు ద్వారకలో ప్రవేశించి

**విశే :** ఈ సీసపద్యంలో ద్వారకకు వెళ్లుతూవున్న కుచేలుని ఆలోచనాక్రమం అత్యంత స్వాభావికంగా వర్ణించబడింది. ఈ వర్ణనద్వారా నిరుపేద అయినా, సదాచార సంపన్నుడయిన ఆ బ్రాహ్మణుని భక్తివిశ్వాసాలు చక్కగా ఆవిష్కరింపబడినాయి.

**వ. ఇట్లు ప్రవేశించి రాజమార్గంబునం జని చని కక్ష్యాంతరంబులు గడచి చని ముందట. 977**

**ప్రతి :** అట్లు= ఆ రీతిగా; ప్రవేశించి= ద్వారకలో ప్రవేశించి; రాజమార్గంబునన్= రాచబాటలో; చనిచని= కొంతదూరం వెళ్లి (అటుతరువాత); కక్ష్య+అంతరంబులు= వేరువేరు భవనద్వారాలను; కడచి= దాటి; చని= వెళ్లి; ముందటన్= అటు ముందు ప్రదేశంలో...

**తా :** ద్వారకలో ప్రవేశించిన కుచేలుడు రాజమార్గంలో ముందుకు సాగిపోయాడు. అలా వెళ్లి, కొన్ని భవనద్వారాలను దాటి, శ్రీకృష్ణుడుండే మందిరాన్ని చేరుకొని ముందు భాగంలో

**సీ. విశదమై యొప్పు షోడశసహస్రాంగనాకలితవిలాససంగతిఁ దనర్చి**
**మహనీయతపనీయమణిమయగోపురప్రాసాదసౌధహర్మ్యములు సూచి,**
**మనము బ్రహ్మానందమును బొందఁ గడు నుబ్బి సంతోషబాష్పముల్ జడిగొనంగఁ**
**బ్రకటమై విలసిల్లు నొకవధూమణి మందిరమున నింతులు చామరములు వీవఁ**

**తే. దనరు మృదుహంసతూలికాతల్పమందుఁ, దానుఁ బ్రియయును బహువినోదములఁ దనరి**
**మహితలావణ్యమన్మథమన్మథుండు, ననఁగఁ జూపట్టు పుండరీకాయతాక్షు. 978**

**ప్రతి :** విశదము+ఐ= మనోహరమై; ఒప్పు= ప్రకాశిస్తున్న; షోడశసహస్ర+అంగనా= పదహారువేలమంది యువతులతో; కలిత= కూడియుండి; విలాససంగతిన్= (వారల) అందమైన చేష్టల సంచారాల సమ్మేళనాలచే; తనర్చి= అతిశయంగా శోభిల్లుతున్న; మహనీయ= మిగుల గొప్పవైన; తపనీయ= బంగారుతో నిర్మింపబడినవై; మణిమయ= అనేక మణులు తాపిన; గోపుర= గోపురాలు గలిగిన; ప్రాసాద= రాచనగరులు; సౌధ= సున్నంతో నిర్మింపబడిన భవనాలు; హర్మ్యములు=

సంపన్నములైన నివాసాలు; చూచి= సంతోషంగా చూచి; మనము= తన మనస్సు; బ్రహ్మ+ఆనందమును+పొందన్= మిగుల ఉన్నతమైన సంతోషాన్ని పొందగా; కడున్+ఉబ్బి= మిక్కిలి పొంగిపోయి; సంతోషబాష్పముల్= ఆనందబాష్పాలు; జడి+కొనన్+కన్= విడువకుండా కురియగా; ప్రకటము+ఐ= స్పష్టంగా తెలుస్తూ ఉన్నదై; విలసిల్లు= ప్రకాశిస్తున్న; ఒక వధూమణి= ఉత్తమురాలైన ఒక పత్నియొక్క; మందిరమునన్= గృహంలో; ఇంతులు= (పరిచారికలైన) స్త్రీలు; చామరములు= చమరీమృగాల వెంట్రుకలతో తయారుచేసిన వీవనలను; వీవన్= (చల్లదనపుహాయికొరకై) వీచుచుండగా; తనరు= ఒప్పుతున్న; మృదు= మెత్తని; హంసతూలికా= హంసల ఈెక్కలందలి మెత్తని యీకలచే సమకూర్చియున్న; తల్పము+అందున్= పానుపుమీద; తానున్= శ్రీకృష్ణుడు తానును; ప్రియయును= ప్రియురాలైన రుక్మిణీదేవియును; బహువినోదములన్= అనేకములగు వేడుకలచేత; తనరి= విలసిల్లుతూవుండి; మహిత= గొప్పదయిన; లావణ్య= దేహకాంతిచేత; మన్మథమన్మథుండు+అనన్+కన్= సౌందర్యానికి అధిదేవతయైన మన్మథునికే మన్మథుడు అనేటట్లుగా; చూపు+పట్టు(చూపట్టు)= గోచరిస్తున్న; పుండరీక+ఆయత+అక్షున్= తెల్లదామరలవలె విశాలమైన కన్నులు గలిగియున్న శ్రీకృష్ణుణ్ణి (దర్శించాడు)...

**తా :** కుచేలుడు బంగారంతో నిర్మించిన, రత్నాలు తాపినగోపురాలతో గొప్పగా గోచరిస్తూవున్న పదారువేలమంది (శ్రీకృష్ణుని) పత్నుల నివాసభవనాలను చూచి, బ్రహ్మానందం పొందినాడు. ఆ ఆనందంతో ఒక వధూమణి (రుక్మిణీదేవి) మందిరాన్ని ప్రవేశించాడు. ఆ మందిరంలో యువతులు వింజామరలు వీస్తూవుండగా హంసతూలికాతల్పంమీద రుక్మిణీదేవితోగూడి అనేక వినోదాలతో ఆనందిస్తూవున్న శ్రీకృష్ణుని చూచాడు. ఆ మహనీయ దృశ్యాన్ని దర్శింపగాదే ఆతని కన్నులనుండి ఆనందబాష్పాలు పెల్లుబికి ప్రవహింపసాగాయి.

**విశే :** బ్రహ్మానందం– మానుషానందానికి వేయిరెట్లు ఉన్నత స్థాయిలోనిది బ్రహ్మానందమని తైత్తిరీయోపనిషత్తు చెప్పింది.

**సీ. ఇందీవరశ్యాము, వందితసుత్రాముఁ గరుణాలవాలు, భాసురకపోలుఁ**
**గౌస్తుభాలంకారుఁ, గామితమందారు సురుచిరలావణ్యు, సురశరణ్యు**
**హర్యక్షనిభమధ్యు, నఖిలలోకారాధ్యు ఘనచక్రహస్తు, జగత్ప్రశస్తు,**
**ఖగకులాధిపయానుఁ, గౌశేయపరిధానుఁ బన్నగశయను, నబ్జాతనయను,**

**తే. మకరకుండలసద్భూషు, మంజుభాషు, నిరుపమాకారు, దుగ్ధసాగరవిహారు,**
**భూరిగుణసాంద్రు, యదుకులాంభోధిచంద్రు, విష్ణు, రోచిష్ణు, జిష్ణు, సహిష్ణుఁ, గృష్ణు. 979**

**ప్రతి :** ఇందీవర శ్యామున్= నల్లకలువల్ని పోలిన శ్యామల (నీల) వర్ణం కలవాణ్ణి; వందిత సుత్రామున్= (భక్తితో) నమస్కరించిన ఇంద్రుడు కలవాణ్ణి; కరుణా+ఆలవాలున్= దయాగుణమంతటికీ పాదైయున్నవాణ్ణి; భాసుర కపోలున్= కాంతితో మెరుస్తున్న చెక్కిళ్లు గలవాణ్ణి; కౌస్తుభ+అలంకారున్= (పాలసముద్రంనుండి లభించిన) కౌస్తుభమనే అపూర్వదివ్యరత్నాన్ని వక్షఃస్థలంలో ఆభరణంగా ధరించియున్నవాణ్ణి; కామితమందారున్= (భక్తుల) కోరికలకు కల్పవృక్షమైనవాణ్ణి; సురుచిర= మిగుల ఒప్పిదమైయున్న; లావణ్యున్= కాంతి గలవాణ్ణి; సురశరణ్యున్= దేవతలకు రక్షకుడైనవాణ్ణి; హరి+అక్షనిభ= సింహంనడుమువంటి; మధ్యున్= (సన్నని) నడుముగలవాణ్ణి; అఖిలలోక+ఆరాధ్యున్= సమస్తలోకాలవారికి పూజింపదగినవాణ్ణి; ఘన= గొప్పదైన (విశేషశక్తిగలదైన); చక్ర= సుదర్శనచక్రమగు ఆయుధాన్ని; హస్తున్= చేతియందు ధరించియుండేవాణ్ణి; జగత్+ప్రశస్తున్= విశ్వమంతటా ప్రఖ్యాతి వహించినవాణ్ణి; ఖగకుల+అధిప=

పక్షులకులాని కంతటికీ నాయకుడైన గరుత్మంతుణ్ణి; యానున్= (ప్రయనించు) వాహనంగా గలవాణ్ణి; కౌశేయపరిధానున్= పట్టువస్త్రాన్ని (పీతాంబరాన్ని) ధోవతిగా ధరించియున్నవాణ్ణి; పన్నగశయనున్= పాము (ఆదిశేషుడు) పానుపుగా గలవాణ్ణి; అబ్జాతనయనున్= తామరలవంటి (విశాలమైన అందమైన) నేత్రాలు గలవాణ్ణి; మకరకుండల= మొసలి ఆకారాలుగల చెవిపోగులను; సత్+భూషున్= మేలైన ఆభరణాలుగా గలవాణ్ణి; మంజుభాషున్= (చెవులకు) ఇంపుగానుండు పలుకులుగల వాణ్ణి (ఇంపుగా మాట్లాడేవాణ్ణి); నిరుపమ+ఆకారున్= సాటిలేని (గంభీరసుందరమైన) స్వరూపంకలవాణ్ణి; దుగ్ధసాగర విహారున్= పాలసముద్రంలో విహరించేవాణ్ణి; భూరిగుణసాంద్రున్= గొప్పగుణాలచే నిండుగా ప్రకాశించేవాణ్ణి (గొప్పవైన గుణములు సమృద్ధిగా గలవాణ్ణి); యదుకుల+అంభోధిచంద్రున్= యాదవవంశమనే సముద్రానికి పూర్ణచంద్రుడైన వాణ్ణి (చంద్రుడు సముద్రాన్ని ఉప్పొంగజేసినట్లుగా యదుకులాన్నంతటినీ సంతోషంతో ఉప్పొంగునట్లుగాజేసేవాడూ); రోచిష్ణున్= విశిష్టమైన ప్రకాశంతో విలసిల్లుతుండేవాణ్ణి; సహిష్ణున్= (సమస్తమును) సహించునట్టి స్వభావంగలవాణ్ణి; జిష్ణున్= జయించే స్వభావంకలవాణ్ణి; విష్ణున్= శ్రీమహావిష్ణువుయొక్క అవతారమైనవాణ్ణి; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి (చూచాడు)...

**తా :** నల్లకలువల వంటి దేహచ్ఛాయగలవాడు, దేవేంద్రునిచే భక్తితో నమస్కారం చేయబడేవాడు, దయకు నిలయమైనవాడు, ప్రకాశించే చెక్కిళ్లుగలవాడు, కౌస్తుభమణిని ధరించినవాడు, భక్తులైనవారికి కల్పవృక్షమైనవాడు, మిగుల ఆకర్షణీయమైన సౌందర్యంతో విలసిల్లేవాణ్ణి, దేవతలందరికీ దిక్కైనవాణ్ణి, సింహమధ్యముణ్ణి, సకలలోకాలలోనూ పూజనీయుడు, మహాసుదర్శనాయుధుడు, విశ్వవిఖ్యాతుడు, గరుడవాహనుడు, పీతాంబరధారి, శేషశాయి, అరవిందనేత్రుడు, మకరకుండ లాలంకారుడు, మధురభాషణుడు, సాటిలేని సుందరస్వరూపుడు, క్షీరసాగరంలో విహరించేవాడు, సమస్తసద్గుణసముపేతుడు, యాదవకులమనే సాగరానికి పున్నమి చంద్రుడైనవాడు, తేజశ్శాలి, జయశీలుడు, సహనస్వభావుడు, శ్రీమన్నారాయణుని అవతారమైనవాడు అయిన శ్రీకృష్ణుణ్ణి కుచేలుడు సంతోషంతో సందర్శించాడు.

**మ. కని డాయం జనునంతఁ గృష్ణుఁడు దళత్కంజాక్షుఁ డ ప్పేద వి**
**ప్రుని నశ్రాంతదరిద్రపీడితుఁ గృశీభూతాంగు జీర్ణాంబరున్**
**ఘనతృష్ణాతురచిత్తు హాస్యనిలయున్ ఖండోత్తరీయుం గుచే**
**లుని నల్లంతనె చూచి సంభ్రమవిలోలుండై దిగెం దల్పమున్. 980**

**ప్రతి :** కని= (కుచేలుడు శ్రీకృష్ణుని) చూచి; డాయన్+చను+అంతన్= దగ్గరకు వెళ్లుతూ ఉన్నంతలో; దళత్+కంజ+అక్షుడు= వికసించిన పద్మాలను పోలిన కన్నులుగలవాడు; కృష్ణుడు= శ్రీకృష్ణుడు; అశ్రాంత= ఎల్లప్పుడూ; దరిద్ర= నిరుపేదతనంచేత; పీడితున్= బాధింపబడుతూ ఉన్నవాణ్ణి; కృశీభూత+అంగున్= కృశించిన (చిక్కిపోయిన) శరీరం కలవాణ్ణి; జీర్ణ+అంబరున్= శిథిలమైన (చినిగిన) వస్త్రాలు గలవాణ్ణి; ఘనతృష్ణా+ఆతురచిత్తున్= గొప్పదైన ఆశచేత వేగిరపడుతున్న మనస్సు గలవాణ్ణి; హాస్యనిలయున్= హాస్యానికి స్థానమైనవాణ్ణి (చూచేవారికి నవ్వుపుట్టించేటట్లుగా ఉన్నవాణ్ణి); ఖండ+ఉత్తరీయున్= (కొంతమేర చినిగి) లోపించిన పైవస్త్రం కలవాణ్ణి; కుచేలునిన్= కుచేలుడనే విప్రుణ్ణి; అంతన్+అంతన్+ఎ= కొంతదూరంలో ఉండగానే; చూచి= చూచినవాడై; సంభ్రమ= గౌరవంతో కూడిన తత్తరపాటుతో; విలోలుండు+ఐ= చలించినవాడై; తల్పమున్= (తాను కూర్చొనియున్న) హంసతూలికాతల్పాన్ని; దిగెన్= దిగినాడు.

**తా :** నిరంతర దారిద్ర్యపీడితుడూ, కృశించిన శరీరంకలవాడూ, చినిగిపోయిన వస్త్రం కట్టుకొన్నవాడూ, ఆశాపూరిత చిత్తుడూ, పరిహాసానికి స్థానంగా ఉన్నవాడూ, చినిగిన పైపంచెను కప్పుకొన్నవాడూ ఐన కుచేలుడు తనవద్దకు వస్తూవుండగా అల్లంత దూరంలోనే చూచి, శ్రీకృష్ణుడు గౌరవభావంతోకూడిన తొందరతో గబగబా పానుపునుండి దిగాడు.

**విశే :** శ్రీకృష్ణుడికి కనిపించిన కుచేలుణ్ణి వ్యాసులవారు 'తం' (అతణ్ణి) అని మాత్రమే చెప్పారు. పోతన ఏడు విశేషణాలతో కుచేలుని రూపాన్ని దైన్యస్థితిని బొమ్మకట్టించాడు.

**క. కరమర్థి నెదురుగాఁ జని, పరిరంభణ మాచరించి, బంధుస్నేహ**
**స్ఫురణం దోడ్తెచ్చి, సమా, దరమునఁ గూర్చుండఁ బెట్టెఁ దన తల్పమునన్. 981**

**ప్రతి :** కరము+అర్థిన్= మిగులప్రీతితో; ఎదురు+కాన్+చని= ఎదురేగివెళ్లి; పరిరంభణము+ఆచరించి= కౌగిలించుకొని; బంధు= చుట్టాలయెడల ప్రకటించే; స్నేహస్ఫురణన్= మైత్రీభావం ఉట్టిపడేలాగున స్వాగతంతో; తోడు+తెచ్చి= తోడ్కొనివచ్చి; సమ్+ఆదరమునన్= అతిశయమైన ఆదరభావంతో; తన తల్పమునన్= తాను కూర్చుండియున్న హంసతూలికా తల్పంమీద; కూర్చు+ఉండన్+పెట్టెన్= కూర్చుండజేశాడు.

**తా :** శ్రీకృష్ణుడు అతిశయించిన ఆదరభావంతో కుచేలునికి ఎదురుగా వెళ్లి, అతణ్ణి ఆప్యాయతతో కౌగిలించుకొన్నాడు. బంధురీతితోగూడిన స్నేహం ఉట్టిపడేలాగున తోడ్కొని వచ్చి, తనపాన్పుపై కూర్చుండబెట్టాడు.

**తే. అట్లు గూర్చుండఁబెట్టి నెయ్యమునఁ గనక, కలశసలిలంబుచేఁ గాళ్ళు గడిగి భక్తిఁ**
**దజ్జలంబులు దనదు మస్తమునఁ దాల్చి, లలితమృగమదఘనసారమిళిత మైన. 982**

**ప్రతి :** అట్లు= ఆప్రకారంగా; కూర్చుండన్+పెట్టి= తల్పంమీద కుచేలుణ్ణి కూర్చోబెట్టి; నెయ్యమునన్= స్నేహంతో; కనకకలశ= బంగారుపాత్రలోని; సలిలంబుచేన్= నీళ్లచేత; కాళ్లు+కడిగి= (ఆ విప్రుని) పాదాలను బాగుగా కడిగి, శుభ్రపరచి; తద్+జలంబులు= ఆ కాళ్లుకడిగిన నీళ్లను; తనదుమస్తమునన్= తన శిరస్సుపై; తాల్చి= ధరించి (చల్లుకొని); లలిత= మనోహరమైన; మృగమద= కస్తూరితో; ఘనసార= పచ్చకర్పూరంతో; మిళితము+ఐన= కలుపబడిన...

**తా :** కుచేలుడు తల్పంమీద కూర్చుండిన పిదప శ్రీకృష్ణుడు బంగారుకలశంలోని నీళ్లతో ఆయన పాదాలను కడిగాడు. ఆ విధంగా కడిగినజలాన్ని భక్తితో తలమీద చల్లుకొన్నాడు.

**తే. మలయజము మేన జొబ్బిల్ల నలఁది యంత, శ్రమము వాయంగఁ దాళవృంతమున విసరి**
**బంధురామోదకలితధూపంబు లొసఁగి, మించు మణిదీపముల నివాళించి మఱియు. 983**

**ప్రతి :** మలయజము= శ్రీగంధాన్ని; మేనన్= కుచేలుని శరీరంపై; జొబ్బిల్లన్= స్రవించేటట్లుగా; అలది= పూసి; అంతన్= అటుపిమ్మట; శ్రమము+పాయన్+కన్= (నడచివచ్చిన) అలసట తొలగిపోయే విధంగా; తాళవృంతమునన్= తాటియాకు విసనకర్రతో; విసరి= (గాలిసోకునట్లుగా) విసరి; బంధుర= చిక్కని; ఆమోదకలిత= సువాసనతోగూడిన; ధూపంబులు= సువాసనపుపొగలను; ఒసగి= ఇచ్చి (సువాసనపు పొగలు శరీరంపై వ్యాపింపజేసి); మించు= ప్రకాశిస్తున్న; మణిదీపములన్= మణులతో సమకూర్చిన దీపాలచేత; నివాళించి= హారతియిచ్చి; మఱియున్= ఇంకా...

**తా :** శ్రీకృష్ణుడు కస్తూరీ, పచ్చకప్పురమూకలిపిన మంచిగంధాన్ని కుచేలుని శరీరానికి దట్టంగా పూసి, మార్గాయాసం తీరేలాగున స్వయంగా వీవన వీస్తూ, మణిమయాలైన దీపాలతో (మిత్రునికి మంగళదాయకంగా) హారతియిచ్చాడు.

**వ. సురభికుసుమమాలికలు సిగముడిం దుఱిమి, కర్పూరమిళితతాంబూలంబు నిడి, ధేనువు నొసంగి, సాదరంబుగా స్వాగతం బడిగిన నప్పు డవ్విప్రుండు మేనం బులకాంకురంబు లంకురింప నానందబాష్ప**

**జలబిందుసందోహుం డయ్యె; నట్టియెడం బద్మలోచనుండు మన్నించు నంగనామణి యగు రుక్మిణి కరకంకణరవంబు లొలయం జామరలు వీవం దజ్జాతవాతంబున ఘర్మసలిలంబు నివారించుచుండఁ జూచి శుద్ధాంతకాంతానివహంబులు దమ మనంబుల నద్భుతం బంది యిట్లనిరి. 984**

**ప్రతి :** సురభి= సువాసన గలిగిన; కుసుమమాలికలు= పూలదండలను; సిగముడిన్= జుట్టుముడిలోపల; తురిమి= ముడిచివైచి; కర్పూరమిళిత= పచ్చకప్పురంతోచేర్చిన; తాంబూలంబున్= తాంబూలాన్ని; ఇడి= ఇచ్చి; ధేనువున్+ఒసంగి= పాడియావును సమర్పించి; స+ఆదరంబు+కాన్= గౌరవంతో; సు+ఆగతంబు= శుభాగమనాన్నిగూర్చి; అడిగినన్= అడుగగా; అప్పుడు= ఆవేళ; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు(కుచేలుడు); మేనన్= శరీరంపై; పులక+అంకురంబులు= గగుర్పాటులు; అంకురింపన్= మొలకలెత్తగా; ఆనందబాష్పజల= సంతోషంవల్ల వెలువడే కన్నీళ్లయొక్క; బిందు సందోహుండు+అయ్యెన్= నీటిబొట్టుల సమూహంకలవాడయ్యాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; పద్మలోచనుండు= శ్రీకృష్ణుడు; మన్నించు= గౌరవించునట్టి; అంగనామణి+అగు= వనితలలో ఉత్తమురాలైన; రుక్మిణి= రుక్మిణీదేవి; కరకంకణరవంబులు= చేతి కడియాల ఇంపైన ధ్వనులు; ఒలయన్= వ్యాపించగా; చామరలు వీవన్= వింజామరలను వీచగా; తద్+జాతవాతంబునన్= ఆ వింజామరలవల్ల పుట్టిన (చల్లని) గాలిచే; ఘర్మసలిలంబు= చెమటనీటిని; నివారించుచుండన్= తొలగిస్తూ ఉండగా (ఆరజేయుచుండగా); చూచి= (కుతూహలంతో) చూచి; శుద్ధాంత= అంతఃపురమునందలి; కాంతానివహంబులు= యువతుల సమూహాలు; తమమనంబులన్= తమ తమ మనస్సులలో; అద్భుతంబు+అంది= ఆశ్చర్యాన్ని పొందినవారై; ఇట్లు+అనిరి= పరస్పరం ఈ విధంగా అనుకొన్నారు.

**తా :** శ్రీకృష్ణుడు కుచేలుని సిగలో పూలమాలలు ముడిచి, కర్పూరతాంబూలం ఇచ్చి, పాడియావును సమర్పించి, ప్రియమార కుశలమడిగాడు. గోవిందుడు చేసిన ఆ గౌరవానికి కుచేలునిశరీరం పులకించి, కనులనుండి ఆనందబాష్పాలు జలజల స్రవించాయి. ఆ దేవదేవుని ప్రియపత్ని పట్టపురాణి అయిన రుక్మిణీదేవి కరకంకణాలు మనోజ్ఞంగా ధ్వనిస్తూ ఉండగా వింజామర వీచింది. ఆ చల్లని మెల్లని గాలికి కుచేలుని చెమట ఆరిపోయి, శ్రమ తొలగి, హాయి కలిగింది. ఆ దృశ్యాన్ని చూచి అంతఃపురంలోని కాంతలు ఆశ్చర్యంతో ఇలా అనుకొన్నారు.

**ఉ. ఏమి తపంబు సేసెనొకొ! యీ ధరణీదివిజోత్తముండు తొల్**
**బామున, యోగివిస్ఫురదుపాస్యకుఁడై తనరారు నీ జగ**
**త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్నవాఁ;**
**డీ మహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్? 985**

**ప్రతి :** ఈ ధరణీదివిజ+ఉత్తముండు= ఈ విప్రశ్రేష్ఠుడు; తొల్ బామునన్= పూర్వజన్మలో; ఏమితపంబు= ఏ విధమైన తపస్సును; చేసెన్+ఒకొ!= చేశాడో కదా!; యోగి= యోగీశ్వరులకు; విస్ఫురత్+ఉపాస్యకుడు+ఐ= మిక్కిలి ప్రకాశించేటట్లుగా ధ్యానింపదగియున్నవాడై; తనరారు= విరాజిల్లునట్టి; ఈ జగత్+స్వామి= ప్రపంచానికంతటికీ అధిపతియైనవాడైన; రమా+అధినాథు= లక్ష్మీదేవికి భర్తయైన వానియొక్క (కృష్ణునియొక్క); నిజతల్పమునన్= తనపానుపుమీద; వసియించి యున్నవాడు= కూర్చొనియున్నాడు; మునిపుంగవులు= మునులలో శ్రేష్ఠులైనవారు; ఎంతవారలున్= ఎంతో గొప్పవారైయున్నప్పటికిని; ఈ మహనీయమూర్తికిన్= మహనీయత (మహిమ) ఆకారము దాల్చినట్లు ఉన్న ఈ మహానుభావునికి; ఎన+ఏ?= సాటియేనా? (సమానులవుతారా? – కారు.)

**తా :** ఈ బ్రాహ్మణోత్తముడు మునుపటి జన్మలో ఎటువంటి తపస్సు చేశాడో కదా! యోగిజన వందనీయుడైన లక్ష్మీనాథుని పానుపుపై కూర్చొని ఉన్నాడు. ఎంతగొప్ప మునీశ్వరులైన ఈ మహాత్మునికి సాటిరారు కదా!

**వ. అదియునుం గాక. 986**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాక...

**తా :** యోగీశ్వరులు ఈ మహనీయునికి సమానులు కాజాలరనే విషయంతోపాటుగా

**చ. తన మృదుతల్పమందు వనితామణి యైన రమాలలామ పొం**
**దును నెడఁగాఁ దలంపక యదుప్రవరుం డెదురేఁగి మోదముం**
**దనుకఁగఁ గౌఁగిలించి యుచితక్రియలం బరితుష్టుఁ జేయుచున్**
**వినయమునన్ భజించె; ధరణీసురుఁ డెంతటి భాగ్యవంతుఁడో ? 987**

**ప్రతి :** యదుప్రవరుండు= యదువంశంలో శ్రేష్ఠుడు (శ్రీకృష్ణుడు); తన మృదుతల్పము+అందున్= తనయొక్క మెత్తనైన హంసతూలికాతల్పం మీద; వనితామణి+ఐన= వనితలలో ఉత్తమురాలైన; రమాలలామ= లక్ష్మీస్వరూపిణి అయిన రుక్మిణి తోడి; పొందునున్= కూడి ఉండటాన్నికూడా; ఎడన్+కాన్= వేరుగా; తలంపక= ఆలోచించక (ఎలాంటి భేదభావం లేకుండా); ఎదురు+ఏగి= బ్రాహ్మణునికి ఎదురుగా వెళ్లి; మోదమున్+తనుకన్+కన్= సంతోషం కలిగేట్టుగా; కౌగిలించి= ఆలింగనం చేసుకొని; ఉచితక్రియలన్= తగినటుపరిచర్యలచేత; పరితుష్టున్+చేయుచున్= తృప్తిపొందినవాణ్ణిగా చేస్తూ; వినయమునన్= వినమ్రతతో; భజించెన్= సేవించాడు; ధరణీసురుడు= ఈ బ్రాహ్మణుడు; ఎంతటి భాగ్యవంతుడు+ఓ!= ఎంత అదృష్టవంతుడో కదా!

**తా :** తన ప్రియపత్నియైన రుక్మిణీదేవి తనతోపాటుగా ఆసీనురాలైయున్నప్పటికీ, ఎటువంటి భేదభావన లేకుండా శ్రీకృష్ణుడు వెంటనే లేచి, ఈ భూసురునికి ఎదురేగివెళ్లి, ప్రేమతో కౌగిలించుకొన్నాడు. తగినట్లు సత్కారాలుచేసి ఎంతో వినయంతో సేవించాడు. నిజంగా ఈ విప్రుడు ఎంతటి అదృష్టశాలియో కదా!

**వ. అను న య్యవసరంబున 988**

**ప్రతి :** అను+ఆ+అవసరంబునన్= అని పల్కుతున్న ఆ సమయంలో...

**తా :** అని అంతఃపుర కాంతలు పరస్పరం అనుకొంటూ ఉన్న సందర్భంలో

**క. మురసంహరుఁడు కుచేలుని, కరము గరంబునఁ దెమల్చి కడఁకన్ మన మా**
**గురుగృహమున వర్తించిన, చరితము లని కొన్ని నుడివి చతురత మఱియున్. 989**

**ప్రతి :** మురసంహరుడు= మురుడనే రాక్షసుణ్ణి చంపినవాడు (శ్రీకృష్ణుడు); కుచేలుని కరమున్= కుచేలుని చేతిని; కరంబునన్= తన చేత్తో; తెమల్చి= ప్రీతితో పట్టుకొని కదల్చి; కడకన్= పూనికతో (ఆసక్తితో); మనము= మనమిద్దరం; ఆ గురుగృహమునన్= ఆ గురువుగారి ఇంటిలో; వర్తించిన= నడచుకొనిన; చరితములు+అని= వృత్తాంతాలని; కొన్ని నుడివి= కొన్నింటిని తెలిపి; చతురతన్= నేర్పుతో; మరియున్= మరల...

**తా :** అంతఃపురకాంతలు అలా అనుకొంటూ ఉన్న సమయంలో శ్రీకృష్ణుడు ప్రేమతో కుచేలునిచేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. తాము గురుకులవాసం చేసిన రోజుల్లో జరిగిన విశేషాల్లో కొన్నిటిని ప్రస్తావించాడు. నిపుణతతో మళ్లీ

**సీ. బ్రాహ్మణోత్తమ ! వేదపాఠనలబ్ధదక్షత గల చారువంశంబువలనఁ**
**బరిణయం బైనట్టి భార్య సుశీలవర్తనములఁ దగ భవత్సదృశ యగునె?**
**తలఁప గృహక్షేత్రధనదారపుత్త్రాదు లందు నీ చిత్తంబు సెందకుంట**
**తోఁచుచున్నది; యేను దుది లోకసంగ్రహార్థంబు కర్మాచరణంబు సేయు**

**తే. గతి, మనంబులఁ గామమోహితులు గాక, యర్థిమై యుక్తకర్మంబు లాచరించి**
**ప్రకృతిసంబంధములు వాసి భవ్యనిష్ఠ, దవిలి యుందురు కొంద ఱుత్తములు భువిని. 990**

**ప్రతి :** బ్రాహ్మణ+ఉత్తమ!= బ్రాహ్మణులలో శ్రేష్ఠుడైనవాడా!; వేదపాఠన= వేదాన్ని చదివింపజేయడంలో; లబ్ధ= పొందియున్న; దక్షత+కల= సామర్థ్యంకలవారైన; చారువంశంబువలన= మంచి విప్రులవంశంనుండి; పరిణయంబు+ఐనట్టి= వివాహమైన; భార్య= నీ ధర్మపత్ని; సుశీలవర్తనములన్= ఉత్తమగుణాలచేత (స్వచ్ఛమైన ప్రవర్తనచేత); భవత్+సదృశ+అగున్+ఎ?= నీకు తగిందై ఉందా?; తలఁపన్= ఆలోచించి చూడగా; నీ చిత్తంబు= నీ మనస్సు; గృహ= ఇల్లు; క్షేత్ర= పొలాలు; ధన= డబ్బు; దార= భార్య; పుత్ర= కుమారులు; ఆదుల+అందున్= మొదలైన (ఇహలోకానికి సంబంధించిన) వాటి యెడల; చెందక+ఉంట= పొందకుండా ఉండటం (తగుల్కొనకుండా ఉండటం); తోచుచున్నది= (నామనస్సుకు) తెలుస్తూంది; ఏను= నేను; తుదిన్= ఉత్తమమైన ఆదర్శంగా; లోక సంగ్రహ+అర్థంబు= లోకాన్ని పాలించటంకోసమై (ఆదర్శంగా ఉండి లోకాన్ని రక్షించుటకొరకై); కర్మ+ఆచరణంబు= చేయవలసిన పనులను; చేయుగతిన్= చేస్తుండేటట్లుగా; భువినిన్= ఈ ప్రపంచంలో; కొందరు+ఉత్తములు= సత్పురుషులైనవారు కొంతమంది; మనంబులన్= తమ తమ మనస్సులలో; కామమోహితులు+కాక= కోరికలచే (ఆకర్షింపబడి) అజ్ఞానులుగాక; అర్థిమైన్= ఆసక్తితో; యుక్తకర్మములు= (తప్పక) చేయవలసియున్న మంచి పనులను; ఆచరించి= నెఱవేర్చి; ప్రకృతి సంబంధములు= (మాయతో గూడియున్న) ఐహికవిషయములతోడి సంబంధాలను; పాసి= తొలగి; భవ్యనిష్ఠన్= శ్రేష్ఠమైన కర్మలను ఆచరించటంలో; తవిలి+ఉందురు= ఆసక్తి కలిగి ఉంటారు.

**తా :** 'భూసురశ్రేష్ఠా! వేదాధ్యయనంలోనూ, అధ్యాపనం (వేదాన్ని అభ్యసింపచేయటం) లోనూ నేర్పరులైన వారియింట జన్మించిన నీ పత్ని సద్గుణవతియై నీకు అనుగుణంగా ప్రవర్తిస్తున్నదా? ఇంతకూ నీ మనస్సు ఇల్లూ, పొలాలూ, సంపదా, భార్యా, బిడ్డలూ – మొదలైన ఇహలోకవిషయాల యెడల లగ్నమై ఉన్నట్లుగా తోచటంలేదు. ఈ లోకక్షేమంకోసం నేను విధ్యుక్తకర్మల ఆచరిస్తూ ఉన్నరీతిగా, కొంతమంది సజ్జనులు మాయతో గూడిన ప్రకృతి సంబంధాలకు అతీతంగా ఉంటూ, శ్రేష్ఠమయిన కర్తవ్యాలను మాత్రం ఆసక్తితో ఆచరిస్తూ జీవిస్తారు.'

**వ. అని మఱియు నిట్లనియె. 991**

**ప్రతి :** అని= అని పలికి; మఱియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** అని పై రీతిగా పలికి, శ్రీకృష్ణుడు మళ్లీ కుచేలునితో ఇలా అన్నాడు.

**క. ఎఱుఁగుదువె ? మనము గురు మం, దిరమున వసియించి యతఁడు దెలుపఁగ వరుసన్**
**ఎఱుఁగఁగ వలసిన యర్థము, లెఱిఁగి పరిజ్ఞానమహిమ నెఱుఁగుట లెల్లన్. 992**

**ప్రతి :** మనము= మన మిద్దరమూ; గురుమందిరమునన్= గురువర్యుని ఇంటిలో; వసియించి= నివసించినప్పుడు; వరుసన్= క్రమంగా; అతడు= ఆ గురువర్యుడు; తెలుపన్+కన్= తెలియజేయగా; ఎఱుఁగన్+కన్+వలసిన= తెలుసుకోవలసిన; అర్థములు= విషయాలను; ఎఱిఁగి= తెలుసుకొని; పరిజ్ఞాన= పరిపూర్ణమైన జ్ఞానంయొక్క (పరమాత్మతత్త్వంయొక్క); మహిమన్= ప్రభావాన్ని (గొప్పతనాన్ని); ఎఱుఁగుటలు+ఎల్లన్= తెలుసుకొని సంతృప్తి చెందడం (ఆ విషయాలన్నీ); ఎఱుఁగుదువు+ఎ?= తెలుసుకొన్నావా? (ఆ సన్నివేశాలన్నీ నీకు గుర్తున్నాయి కదా!)

**తా :** శ్రీకృష్ణుడు కుచేలునితో ఇంకా ఈ విధంగా పలికినాడు. 'మనం గురువుగారిఇంటిలో ఉండి విద్యాభ్యాసం చేసేకాలంలో ఆయనవల్ల సమస్త విషయాలను తెలుసుకొన్నాము; అంతేగాక, పరతత్త్వాన్ని గూర్చికూడా ఆ గురువర్యుడు మనకు బోధింపగా చక్కగా తెలుసుకోగలిగాము. ఈ విషయాలన్నీ నీకు జ్ఞాపకంలో ఉన్నాయా? మిత్రమా!'

**వ. అని మఱియు గురుప్రశంస సేయం దలంచి యిట్లనియె. 993**

**ప్రతి :** అని= అని కుచేలుణ్ణి అడిగి; మఱియున్= మరల; గురుప్రశంస= గురువుగారిని ప్రస్తుతించటం; చేయన్+తలంచి= చేయటానికి మనస్సున నిశ్చయించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** గురుకులంలో తాము అభ్యసించిన జ్ఞాన, విజ్ఞానాల్ని గురించి, జ్ఞాపకం చేసి, అనంతరం గురువుగారిని ప్రస్తుతియదలంచి శ్రీకృష్ణుడు కుచేలునితో ఇలా అన్నాడు.

**తే. తివిరి యజ్ఞానతిమిరప్రదీప మగుచు, నవ్యయంబైన బ్రహ్మంబు ననుభవించు**
**భరితసత్త్వుండు సత్కర్మనిరతుఁ దతుల, భూసురశ్రేష్ఠుఁ దలఘుండు బుధనుతుండు. 994**

**ప్రతి :** అలఘుండు= గొప్పవాడు; బుధనుతుండు= సజ్జనులచేత కొనియాడబడేవాడు; సత్+కర్మనిరతుఁడు= ఉత్తమకర్మలను ఆచరించడంలో నిమగ్నమై ఉండేవాడు; తివిరి= ప్రయత్నించి; అజ్ఞానతిమిర= అజ్ఞానమనే చీకటికి; ప్రదీపము+ అగుచున్= బాగుగా ప్రకాశించే దీపం (తాను) అవుతూ; అవ్యయంబు+ఐన= నాశంలేనిదైన (శాశ్వతమైన); బ్రహ్మంబున్= పరబ్రహ్మను; అనుభవించు= (నిత్యం) పొందుతూవున్న; భరితసత్త్వుండు= నిండిన సత్త్వగుణంకలవాడు (సత్త్వగుణం పరిపూర్ణంగా కలవాడు); భూసురశ్రేష్ఠుడు= అయిన బ్రాహ్మణోత్తముడు (మన గురువర్యుడు).

**తా :** మన గురువరేణ్యుడు అజ్ఞానమనే అంధకారానికి గొప్ప దీపంలాంటివాడు. బ్రహ్మానందఅనుభవంలో నిమగ్నమైన చిత్తం కలవాడు. సత్కర్మపరాయణుడు. పుణ్యాత్ముడైన బ్రాహ్మణశ్రేష్ఠుడు. సజ్జనుల ప్రశంసలందుకునే మహనీయుడు.

**వ. అ మ్మహాత్మునివలన సకలవర్ణాశ్రమంబులవారికి నేను విజ్ఞానప్రదుండ నగు గురుండనై యుండియు గురుభజనంబు పరమధర్మం బని యాచరించితి; నది గావున. 995**

**ప్రతి :** నేను= శ్రీకృష్ణుడనైన నేను; విజ్ఞానప్రదుండన్+అగు= (అందరికీ) విజ్ఞానాన్ని ఇచ్చేవాడినైన; గురుండన్+ఐ+ఉండియున్= గురువర్యుణ్ణి అయి ఉండికూడా; సకలవర్ణ= బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు – అనే నాలుగువిధాలైన సమస్తజాతులవారికిని; ఆశ్రమంబులవారికిన్= బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్న్యాసం – అనే నాలుగురకాలైన

ఆశ్రమాలలోని సమస్త జనులకును; గురుభజనంబు= గురువర్యుణ్ణి సేవించటం; పరమధర్మంబు+అని= (ఆచరింపవలసిన) ఉత్కృష్టమైన ధర్మమని తెలియజేయడంకోసమై; ఆ+మహా+ఆత్మునివలనన్= (మన గురువర్యుడైన) ఆ మహానుభావునిద్వారా (ఆ మహానుభావుణ్ణి గురువుగా సేవించటంద్వారా); ఆచరించితిన్= చేసి చూపాను; అది+కావునన్= అదే ఆచరించవలసిన పద్ధతి గనుక...

**తా :** నేను సకలజనులకూ విజ్ఞానాన్నిచ్చే జగద్గురువునై ఉండీ కూడా, నాలుగుజాతులందలి, నాలుగుఆశ్రమాలలోని ప్రజలందరికీ గురుసేవనం ఆచరించవలసిన ఉత్తమధర్మమని ప్రబోధించేందుకే, మనగురువుగారిని సేవించాను.

**క. భూసురులకెల్ల ముఖ్యుఁడ, నై సకలకులాశ్రమంబులందును నెపుడున్**
**ధీసుజ్ఞానప్రదుఁ డన, దేశికుఁ డన నొప్పుచుందు ధృతి నెల్లెడలన్. 996**

**ప్రతి :** భూసురులకున్+ఎల్లన్= (లోకంలోని) బ్రాహ్మణులకు అందరికీ; ముఖ్యుడన్+ఐ= ముఖ్యమైనవ్యక్తినై; సకల= అన్నివిధాలైన; కుల+ఆశ్రమంబుల+అందునున్= నాలుగు వర్ణాలలోనూ; నాలుగు ఆశ్రమాలలోనూ (ఉండేవారలకు అందరికీ); ఎపుడున్= ఎల్లప్పుడూ; ధీ= బుద్ధికి; సుజ్ఞానప్రదుఁడు+అనన్= ఉత్తమమైన జ్ఞానాన్ని ఇచ్చేవాడిననీ; దేశికుడు+అనన్= ఉత్కృష్టమైన ఉపదేశాన్ని అనుగ్రహించే గురువుననీ; ఎల్ల+ఎడలన్= అన్ని చోటులందునూ (అంతటా); ధృతిన్= ధైర్యంతో (స్థిరమైన భావంతో); ఒప్పుచున్+ఉందున్= విరాజిల్లుతూ ఉంటాను.

**తా :** లోకంలోగల బ్రాహ్మణులందరికీ అత్యంత ఆప్తుడనై సకలవర్ణాలకూ, సమస్తాశ్రమాలకూ ఉత్తమమైన జ్ఞానాన్ని ప్రసాదించేవాడినై శ్రేష్ఠుడగు గురువర్యుడినై సర్వత్ర శాశ్వతంగా ప్రకాశిస్తూ ఉంటాను.

**తే. అట్టి వర్ణాశ్రమంబులయందు నర్థ, కుశలు లగువారు నిఖిలైకగురుఁడ నైన**
**నాదు వాక్యంబుచే భవార్ణవము పెలుచ, దాఁటుదురు మత్పదాంబుజధ్యానపరులు. 997**

**ప్రతి :** అట్టి= అటువంటి; వర్ణ+ఆశ్రమంబుల+అందున్= నాలుగుజాతులలోను, నాలుగుఆశ్రమాల్లోను; నిఖిలగురుడన్+ఐన= యావత్ ప్రపంచానికీ గురువర్యుడినైనట్టి; నాదు= నాయొక్క; వాక్యంబుచేన్= ఉపదేశవాక్యంచేత; మత్+పద+అంబుజ ధ్యానపరులు= నా పాద కమలాలను ధ్యానించుటయందు మిక్కిలి ఆసక్తిగలవారై; భవ+అర్ణవము= సంసారమనే సముద్రాన్ని; పెలుచన్= శీఘ్రంగా (తొందరగా); దాటుదురు= కడచిపోవుదురు (సంసారసాగరంయొక్క ఆవలితీరాన్ని చేరుకొంటారు); అర్థకుశలులు+అగువారు= వాళ్లే పరమార్థాన్ని (మోక్షాన్ని) పొందే నిపుణులు.

**తా :** సమస్తానికి గురువర్యుడనైన నాఉపదేశాన్ని అంగీకరించి, నా పాదపద్మాలను ధ్యానించుటయందే అమితమైన ఆసక్తిగలవారు ఈ సంసారసాగరాన్ని శీఘ్రంగా దాటి, మోక్షాన్ని పొందుతారు. అన్ని వర్ణాలలోనూ, ఆశ్రమాలలోనూ అలాంటివారలే పరమార్థాన్ని తెలిసిన పండితులు.

**వ. అదియునుం గాక సకలభూతాత్మకుండనైన యేను దపోవ్రతయజ్ఞదానశమదమాదులచేత సంతసింపను; గురుజనంబులఁ బరమభక్తి సేవించువారలం బరిణమింతు నని చెప్పి మఱియు మనము గురుమందిరమున నున్నయెడ నొక్కనాఁడు గురుపత్నీనియుక్తులమై యింధనార్థం బడవికిం జనిన న య్యవసరంబున. 998**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాక; సకలభూత= సమస్త ప్రాణులలోను; ఆత్మకుండును+ఐన= ఆత్మ స్వరూపుడినై ఉన్నటువంటి; ఏను= నేను; తపః= తపస్సు చెయ్యటంచేత; వ్రత= వ్రతాలను ఆచరించటంచేత; యజ్ఞ= యజ్ఞాలను చక్కగా నిర్వహించటంచేత; దాన= దానాలను ఇయ్యటంచేత; శమ= మనస్సు మొదలైన అంతరింద్రియాలను నిగ్రహించటంచేత; దమ= కన్ను మొదలయిన వెలుపలి ఇంద్రియాలను అదుపులో ఉంచటంచేత; ఆదులచేతన్= మొదలైన ఆచార పద్ధతులచే; సంతసింపను= అంతగా సంతోషపడేవాణ్ణిగాను; (మరేమనగా) గురుజనంబులన్= (జ్ఞానాన్ని ఉపదేశించేటటువంటి) గురువర్యులను; పరమభక్తిన్= ఉత్తమమైన భక్తిభావంతో; సేవించువారలన్= కొలిచేవారిని గూర్చి; పరిణమింతును= మిగుల సంతోషిస్తాను; అని చెప్పి= అని పలికి; మఱియును= ఇంకా; మనము= మనమిద్దరం; గురుమందిరమునన్= గురువుగారి ఇంటిలో; ఉన్న+ఎడన్= ఉన్నకాలంలో; ఒక్కనాడు= ఒకానొక రోజు; గురుపత్నీ నియుక్తులము+ఐ= గురువుగారిభార్యచే ఆజ్ఞాపింపబడినవారమై; ఇంధన+అర్థంబు= వంటకట్టెలు తేవటంకొరకై; అడవికిన్+చనిన= అడవి కేగిన; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** సమస్త ప్రాణులలోను ఆత్మయైయున్న నేను తపస్సు, వ్రతాలు, యజ్ఞాలు, దానాలు, ఇంద్రియనిగ్రహం – మున్నగు ఆచరణలవల్ల అంతగా సంతోషించను; మరేమంటే భక్తితో గురువర్యుణ్ణి సేవించేవారిని చూచి ఎంతో సంతోషిస్తాను. ఈ విధంగా పలికి, శ్రీకృష్ణుడు కుచేలునితో ఇంకా ఇలా అన్నాడు. 'మనం గురువుగారిఇంటిలో ఉన్నకాలంలో ఒకనాడు గురుపత్ని ఆజ్ఞానుసారం వంటకట్టెలు తీసుకొనిరావటానికి అడవికి వెళ్లాము. అది గుర్తుందికదూ! ఆ సందర్భంలో

**సీ.** **ఘుమఘుమారావసంకులఘోరజీమూతపటలసంఛన్నాభ్రభాగ మగుచుఁ**
**జటులఝంఝానిలోత్కటసముద్ధూతనానావిధజంతుసంతాన మగుచుఁ**
**జండదిగ్వేదండతుండనిభాఖండవారిధారాపూర్ణవసుధ యగుచు**
**విద్యోతమానోగ్రఖద్యోతకిరణజిద్విద్యుద్ద్యుతిచ్ఛటావిభవ మగుచు**

**తే.** **నదరి జడి గురియఁగ నినుఁ డస్తమింప, భూరినీరంధ్రనిబిడాంధకార మేచి**
**సూచికాభేద్యమై వస్తుగోచరంబు గాని, యట్లుండ మనము న వ్వానఁ దడిసి. 999**

**ప్రతి :** ఘుమ ఘుమ+ఆరామ= ఘుమ ఘుమయను గొప్ప శబ్దాలచేత; సంకుల= కలతపడిన; ఘోర జీమూతపటల= భయంకరాలైన మేఘాల సమూహాలచే; సంఛన్న= బాగుగా (పూర్తిగా) కప్పబడిన; అభ్రభాగము+అగుచున్= ఆకాశప్రదేశం కలదై; చటుల= చలిస్తున్న; ఝంఝా+అనిల= గాలివానచేత; ఉత్కట= అతిశయంగా; సమ్+ఉత్+ధూత= బాగుగా ఎగురగొట్టబడిన; నానావిధ= అనేకవిధాలైనట్టి; జంతుసంతానము+అగుచున్= (అడవియందలి) జంతువుల గుంపులతో కూడిందై; చండ= తీవ్రమైన; దిక్+వేదండ= అష్టదిక్కులలో భూభారాన్ని మోస్తున్న ఏనుగులయొక్క; తుండనిభ= తొండాలవంటి; అఖండ వారిధారా= ఎడతెరపిలేక కురుస్తున్న నీటిధారలచే; పూర్ణ= పూర్తిగా నిండిపోయిన; వసుధ+అగుచున్= భూభాగం కలది అవుతూ; విద్యోతమాన= మిక్కిలిగా ప్రకాశిస్తున్న; ఉగ్రఖద్యోత= తీక్ష్ణమైన సూర్యునియొక్క; కిరణ= కిరణాలను; జిత్= జయించేవిగా ఉన్నట్టి; విద్యుత్+ఛటా= మెఱుపుల సమూహాలయొక్క; విభవము+అగుచున్= గొప్పతనంతో కూడిందవుతూ; అదరి= అతిశయించి; జడి= తెరపిలేని వాన; కురియన్+కన్= కురియగా; ఇనుడు= సూర్యుడు; అస్తమింపన్= ఆ లోపలనే అస్తమించగా; భూరి= మిక్కిలి అధికంగా; నీరంధ్ర= సందులేని విధంగా; నిబిడ= దట్టంగా; అంధకారము= చీకటి; ఏచి= విజృంభించి; సూచికా+అభేద్యము+ఐ= సూదిచేతకూడా భేదించటానికి వీలుపడనంత గాఢంగా;

వస్తుగోచరంబు+కాని+అట్లు+ఉండన్= ఏ వస్తువూకూడా కనిపించనీయని పరిస్థితిలో; మనము= మనమిద్దరం; ఆ+వానన్= ఆ (గొప్ప) వర్షంలో; తడిసి= బాగుగా తడిసిపోయి...

**తా :** మనం అడవికి వెళ్లిన ఆ వేళలో గొప్పధ్వనులతో ఉరుముతూ ఆకాశమంతటా కారుమబ్బులు ఆవరించాయి. గాలివాన గొప్పవేగంతో వీచి, అడవిలోని వివిధజంతుసమూహాలను నిలువనీయకుండా చెల్లాచెదురు చేశాయి. వర్షధారలు దిగ్గజాల తొండాలంత పరిమాణంతో పడుతూ భూమిని ముంచివేశాయి. సూర్యకిరణాలను మించిన కాంతితో ప్రకాశిస్తూ మెఱుపులు మిఱుమిట్లు గొలిపాయి. అంతలో సూర్యుడు అస్తమించగా చీకట్లు ఎంతో దట్టంగా అలముకొన్నాయి ఏ వస్తువుకూడా కంటికి కనబడటంలేదు. అటువంటి ఆ జడివానలో మనమిద్దరం తడిసి ముద్దయిపోయి

**తే. బయలు గొందియుఁ బెను మిఱ్ఱుపల్లములును, రహితసహితస్థలంబు లేర్పఱుప రాక**
**యున్న యత్తఱి మనము నొండొరుల చేతు, లూతఁగాఁ గొని నడచుచు నుండునంత. 1000**

**ప్రతి :** బయలు= విశాలమైన ప్రదేశం; గొందియున్= సందుగానున్న చోటు; పెనుమిఱ్ఱు= మిగుల ఎత్తైనచోటు (మిట్ట); పల్లము= తగ్గుగానున్నచోటు; అంబురహిత= నీళ్లు దండిగా లేని; సహిత= నీళ్లుదండిగా ఉండేటటువంటి (లోతుగల); స్థలంబులు= ప్రదేశాలను; ఏర్పఱుపరాక+ఉన్న= వేరువేరుగా గుర్తించటానికి వీలుపడకుండా, అంతా జలమయంగా ఉండగా; ఆ+తఱిన్= ఆ సమయంలో; మనము= మన మిరువురం; ఒండు+ఒరుల చేతులు= ఒకరి చేతిని మరియొకరు; ఊతగాన్= ఆధారంగా; కొని= పట్టుకొని; నడచుచున్+ఉండు+అంతన్= ఆ చీకటిలో ఆవాననీళ్లలో నడస్తూ ఉండగా, అంతలోపల...

**తా :** బయలు ప్రదేశంగాని, సందుగానున్నచోటుగాని, ఎత్తుగాని, పల్లంగాని, లోతులేని ప్రదేశంగాని, లోతుగల ప్రదేశంగాని గుర్తింపవీలుగాకుండిన ఆవాననీటిలో ఆ చీకటిరాత్రిలో మనం ఒకరిచేతిని మరొకరు గట్టిగా పట్టుకొని ఆ అడవిలో నడిచాము కదా!

**క. బిసబిస నెప్పుదు నుడుగక, విసరెడి వలిచేత వడఁకు విడువక మనముం**
**బస చెడి మార్గముఁ గానక, మసలితి మంతటను నంశుమంతుఁడు పొడిచెన్. 1001**

**ప్రతి :** ఎప్పుడున్+ఉడుగక= ఎడతెరపి లేకుండా; బిసబిసన్= వేగంగా; విసరెడి= వీస్తున్నటువంటి; వలిచేతన్= చలిచేత; వడకు= వణకిపోవటం; విడువక= విడువనందువల్ల; మనమున్= మనం కూడా; పసచెడి= వికాసం కోల్పోయి; మార్గమున్+కానక= వెళ్లవలసిన దారితెలియలేక; మసలితిమి= అటు నిటు తిరుగాడితిమి; అంతటన్= (అలా తిరుగుతూ ఉండగా) అంతలోపల; అంశుమంతుఁడు= కిరణాలుగలవాడు (సూర్యుడు); పొడిచెన్= ఉదయించాడు.

**తా :** నిరంతరం వీస్తూవున్న తీవ్రమైన ఆ చలిగాలులకు మనదేహాలు వణకి దొడగాయి. అందువల్ల మనం దారి తెలియక, దిక్కుతోచక ఆ అడవిలో అటునిటు సంచరింపసాగాము. అలా సంచరిస్తూ ఉండగా, ఎట్టకేలకు సూర్యోదయం అయింది.

**క. తెలతెలవాఱెడివేళం, గలకల మని పలికెఁ బక్షిగణ మెల్లెడలన్**
**మిలమిలని ప్రొద్దుపొడువున, ధళ ధళ మను మెఱుఁగు దిగ్వితానము నిండెన్. 1002**

**ప్రతి :** తెలతెల+పాఱెడివేళన్= బాగా తెల్లవారే సమయంలో; పక్షిగణము= పక్షుల గుంపులు; ఎల్ల+ఎడలన్= అన్ని చోటులా; కలకల+అని= కలకలమనే ధ్వనులతో; పలికెన్= కూశాయి; మిలమిలని= మినమినమని ప్రకాశిస్తూవున్న;

ప్రొద్దు పొడుపునన్= సూర్యుని ఉదయంతో; ధళ ధళ+అను= మిగుల తెల్లనైన; మెఱఁగు= ప్రకాశం; దిక్+వితానము= దిక్కుల సమూహాలలో అంతటా; నిండెన్= వ్యాపించింది.

**తా :** తెల్లవారగానే పక్షుల కలకలధ్వనులు అంతటా వ్యాపించాయి. సూర్యుడు ఉదయింపగానే ధవళకాంతులు దిక్కులందంతటా నిండిపోయాయి.

**క. అప్పుడు సాందీపని మన, చొ ప్పరయుచు వచ్చి వానసోఁకునను వలిం**
**దెప్పిఱిలుటఁ గని ఖేదం, బుప్పతిలం బలికె నకట ! యో వటులారా ! 1003**

**ప్రతి :** అప్పుడు= అలాగా సూర్యుడు ఉదయించిన ఆ సందర్భంలో; సాందీపని= మనగురువర్యుడయిన సాందీపుడు; మన= మన ఇద్దరియొక్క; చొప్పు= జాడను; అరయుచున్= వెదకుతూ; వచ్చి= మనం ఉండే చోటికి వచ్చి; వానసోఁకునను= వానయొక్క తాకిడినుండి; వలిన్= చలిబాధనుండి తెప్పిఱిలుటన్+కని= (కొద్దిగా) తేరుకొని ఉండటాన్ని గమనించి; ఖేదంబు= విచారం; ఉప్పతిలన్= కలుగగా; పలికెన్= ఈ రీతిగా మాట్లాడాడు; ఓ వటులు+ఆరా!= ఓ బ్రహ్మచారులారా!

**తా :** అప్పుడు మన గురువర్యుడైన సాందీపుడు మనలను వెదకుకొంటూ అడవికి వచ్చాడు. వాననుండీ, చలినుండీ కొంచెం తేరుకొని ఉన్న మనల్ని చూచి చింతిస్తూ ఈ విధంగా అన్నాడు.

**చ. కటకట! యిట్లు మా కొఱకుఁగాఁ జనుదెంచి మహాటవిన్ సము**
**త్కటపరిపీడ నొందితిరి; గావున శిష్యులు ! మీ ఋణంబు నీఁ**
**గుట కిది కారణంబు సమకూరెడిఁ బో; యిట మీఁద మీకు వి**
**స్ఫుటధనబంధుదారబహుపుత్త్రవిభూతిజయాయురున్నతుల్. 1004**

**ప్రతి :** కటకట!= అయ్యయ్యో!; ఇట్లు= ఈ రీతిగా; మాకొఱకున్+కాన్= గురువులమైన మా పని నిమిత్తంగా; మహా+అటవిన్= అడవికి; జనుదెంచి= వచ్చి; సమ్+ఉత్కట= చాలా తీవ్రమైన; పరిపీడన్= అతిశయమైన బాధను; ఒందితిరి= పొందారు; కావునన్= కనుక; శిష్యులు!= శిష్యులారా!; మీ ఋణంబున్= గురువర్యునికి సమర్పించవలసిన మీ అప్పును; ఈఁగుటకున్= తీర్చుకోవడానికి; ఇది= ఈ విధంగా మాకోసం అడవిలో బాధలు పొందడం; కారణంబు= కారణం అయ్యింది; ఇటమీఁదన్= ఇకపై; మీకున్= ఈ ప్రకారంగా గురువుగారిఋణాన్ని తీర్చుకొన్న మీకు; విస్ఫుట= మిగుల స్పష్టములైన; ధన= ధనములు; బంధు= చుట్టాలు; దార= భార్యలు; బహుపుత్ర= చాలమంది కుమారులు; విభూతి= సంపదలూ; జయ= జయాలు; ఆయుస్= దీర్ఘాయుర్దాయాలూ; ఉన్నతుల్= అన్ని మార్గాల్లోనూ ఉన్నత స్థితులూ; సమకూరెడిన్+పో= తప్ప కల్గుతాయి సుమా!

**తా :** 'అయ్యో! శిష్యులారా! మా కోసమై ఈ విధంగా అడవికి వచ్చి చాలా బాధపడినారు. దీనివల్ల మీరు గురు ఋణం తీర్చుకొన్నవారైనారు. కనుక ఇకపై మీ కిరువురకు అతిశయించిన ధన, బంధు, దార, బహుపుత్ర సంపదలూ, దీర్ఘాయు, రున్నతులూ, విజయశ్రీలూ సమకూరగలవు' (అని ఆశీర్వదించినాడు).

**క. కని గారవించి యాయన, మనలం దోడ్కొనుచు నాత్మమందిరమునకుం**
**జనుదెంచుట లెల్లను నీ, మనమునఁ దలఁతే' యటంచు మఱియుం బలికెన్. 1005**

**ప్రతి :** కని గారవించి= మనల్ని ఆశీర్వాదాలతో ఆదరించి; ఆయన= గురువుగారైన సాందీపని; మనలన్= మన ఇద్దర్నీ; తోడు+కొనుచున్= వెంట బెట్టుకొని; ఆత్మమందిరమునకున్= తన నివాసానికి; చను+తెంచుటలు+ఎల్లను= చేరిన సంగతులన్నీ; నీమనమునన్= నీ మనస్సునందు; తలఁతు(వు)+ఏ?= తలచుకొంటూ ఉంటావా?; అటంచున్= అని అంటూ; మఱియున్= మళ్లీ; పలికెన్= ఇలా పలికినాడు.

**తా :** అలాగా దీవించి సాందీపని వాత్సల్యంతో మనలను తన మందిరానికి పిలుచుకొని వెళ్ళాడు. ఈ సంగతులన్నిటినీ నీవు ఎప్పుడైనా మనస్సులో అనుకుంటూ ఉంటావా? అని అంటూ, శ్రీకృష్ణుడు కుచేలునితో మళ్లీ ఈ విధంగా పలికాడు.

**వ. 'అనఘ! మన మధ్యయనంబు సేయుచు నన్యోన్యస్నేహవాత్సల్యంబులం జేయు కృత్యంబులు మఱవవు గదా!' యని యవి యెల్లం దలంచి యాడు మాధవుమధురాలాపంబులు విని యతనిం గనుంగొని కుచేలుం డిట్లనియె: 1006**

**ప్రతి :** అనఘ!= పాపంలేనివాడా! (పుణ్యాత్మా!); మనము= మనము; అధ్యయనంబు+చేయుచున్= (గురుకులంలో) వేదాన్ని అభ్యసిస్తూ, అన్య+అన్య= ఒకరిపట్ల మరొకరికి గల; స్నేహ, వాత్సల్యంబులన్= మైత్రీభావం, ప్రేమ - ఈ రెండు గుణాలు కలిగియుండటంవల్ల; చేయు= చేస్తూ ఉండిన; కృత్యంబులు= కార్యాలు (పనులు); మఱవవు+కదా!= ఇంకా మరచిపోలేదుగదా!; అని= అనిపలికి; అవి+ఎల్లన్= ఆ బాల్యచేష్టలనన్నింటిని; తలంచి= జ్ఞాపకంచేసుకొని; ఆడు= వాటినిగూర్చి ముచ్చటిస్తున్న; మాధవు= లక్ష్మీదేవికి భర్తయైన వానియొక్క (శ్రీకృష్ణునియొక్క) మధుర+ఆలాపంబులు= (చెవులకు) ఇంపైన పలుకులను; విని= చక్కగా ఆలకించి; అతనిన్+కనున్+కొని= ఆ శ్రీకృష్ణునివైపు చూచి; కుచేలుండు= కుచేలవిప్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పసాగాడు (విన్నవించాడు).

**తా :** పుణ్యాత్మా! మనం గురుకులంలో వేదాధ్యయనం చేస్తూ ఉండిన దినాలలో పరస్పరం స్నేహంతో, వాత్సల్యంతో చేసిన పనులన్నిటిని నీవు మఱచిపోలేదు కదా!' - అని మాధవుడు తను చిన్ననాటి ముచ్చట్లను ఉదాహరిస్తూ పల్కిన మధుర వాక్యాలను విని కుచేలుడు సంతోషించినవాడై, ఇలా అన్నాడు.

**క. వనజోదర ! గురుమందిర, మున మనము వసించునాఁడు ముదమునఁ గావిం**
**పని పను లెవ్వియుఁ గలవే?, విను మవి యట్లుండ నిమ్ము విమలచరిత్రా! 1007**

**ప్రతి :** విమలచరిత్రా= స్వచ్ఛమైన చరిత్రగలవాడా!; వనజ+ఉదర!= పద్మం ఉదరంలో కలవాడా! (పద్మనాభా! - శ్రీకృష్ణదేవా!); మనము= మన మిద్దరం; గురుమందిరమునన్= గురువుగారి ఇంటిలో; వసించునాఁడు= (అధ్యయనం నిమిత్తమై) నివసించే కాలంలో; ముదమునన్= సంతోషంతో; కావింపని పనులు= చేయని కార్యాలు; ఎవ్వియున్+కలవు+ఏ?= ఏవైనా ఉన్నాయా? (లేవు); అవి= ఆ సంతోషకరాలైన మంచిపనులు; అట్లు+ఉండన్+ఇమ్ము= వాటి విషయం అలా ఉండనిమ్ము!; వినుము= (ఇప్పుడు నేచెప్పబోయే విషయం) వినవలసింది!

**తా :** 'నిర్మలచరిత్రుడవైన పద్మనాభా! విద్యాభ్యాసంనిమిత్తమై మనం గురువుగారిగృహంలో నివసించినకాలంలో సంతోషంతో ఆచరింపని కార్యాలంటూ ఉన్నాయా? అవి అలా ఉండనీ! ఇప్పుడు నేను మనవిచేసేది చిత్తగించు.

**క. గురుమతిఁ దలఁపఁగఁ ద్రిజగ, ద్గురుఁడ వనం దగిన నీకు గురుఁ డనఁగా నొం**
**డొరుఁ డెవ్వఁ? డింతయును నీ, కరయంగ విడంబనంబ యగుఁ గాదె హరీ!' 1008**

**ప్రతి :** హరీ!= (భక్తజనుల) పాపాలను హరించేవాడా! (శ్రీకృష్ణా!); గురుమతిన్= గొప్ప బుద్ధితో; తలఁపన్+కన్= ఆలోచించగా (పరిశీలింపగా); త్రిజగత్+గురుఁడవు+అనన్+తగిన= మూడు లోకాలకూ గురువర్యుడవు – అనటానికి తగియున్న; నీకున్= నీకు; గురుఁడు+అనన్+కాన్= గురువనటానికి; ఒండు+ఒరుఁడు= మరొకడు; ఎవ్వడు?= ఎవ్వడున్నాడు? (అనగా ఎవ్వడును లేడని అభిప్రాయము); ఇంతయును= ఇదంతా (సాందీపని అనే గురువు వద్ద శిష్యుడుగా చేరి వేదాదులను అభ్యసించటం); అరయన్+కన్= ఆలోచించగా; నీకున్= జగత్తుకంతటికీ గురువర్యుడవైన నీకు; విడంబనంబు+అ= (లోకాన్ని) అనుకరించటమే; అగున్+కాదు+ఎ= అవుతున్నది కదా!

**తా :** శ్రీకృష్ణదేవా! మూడులోకాలకూ గురువర్యుడవైన నీకుకూడా మరొక గురువు దగ్గర చేరి అధ్యయనం చెయ్యటం, నీవు ఆయనకు శిష్యుడివి కావటం – ఇదంతా చూస్తే లోకులకు ఆదర్శంగా ఉండేందుకై నీవు లోకాన్ని అనుకరించటమేగాని, వేఱొకటి కాదుకదా! (ఇవన్నీ నీ లీలలే కదా!).

**వ. అని సాభిప్రాయంబుగాఁ బలికిన పలుకులు విని సమస్త భావాభిజ్ఞుండైన పుండరీకాక్షుండు మందస్మిత వదనారవిందుం డగుచు నతనిం జూచి 'నీ విచ్చటికి వచ్చునప్పుడు నాయందుల భక్తింజేసి నాకు నుపాయనంబుగ నేమి పదార్థంబు దెచ్చితి? వప్పదార్థంబు లేశమాత్రం బైనఁ బదివేలుగా నంగీకరింతు; నట్లు గాక నీచవర్తనుండై మద్భక్తిం దగులని దుష్టాత్ముండు హేమాచల తుల్యంబైన పదార్థంబు నొసంగిన నది నా మనంబునకు సమ్మతంబు గాదు; కావున. 1009**

**ప్రతి :** అని= అని పై రీతిగా; స+అభిప్రాయంబు+కాన్= తన అభిప్రాయాన్ని సూచిస్తూ సార్థకంగా; పలికిన పలుకులు= (కుచేలుడు) మాట్లాడిన మాటలను; విని= విని; సమస్తభావ= సకలప్రాణులయొక్క మనస్సులలోని భావాలను; అభిజ్ఞుండు+ఐన= చక్కగా ఎరిగినవాడైన; పుండరీక+అక్షుండు= కమలనేత్రుడు (శ్రీకృష్ణుడు); మందస్మిత= చిఱునవ్వుతోగూడిన; వదన+అరవిందుండు+అగుచున్= పద్మంవంటి ముఖం కలవాడవుతూ; అతనిన్+చూచి= ఆ కుచేలుణ్ణి చూచి; నీవు= నీవు; ఇచ్చటికిన్= ఈ ద్వారకాపురికి; వచ్చు+అప్పుడు= వచ్చేటప్పుడు; నా+అందులభక్తిన్+చేసి= నాపై గల భక్తి భావంచేత; నాకున్= నీ మిత్రుడినైన నాకు; ఉపాయనంబు+కాన్= కానుకగా; ఏమి పదార్థంబున్= ఏ వస్తువును; తెచ్చితివి?= తెచ్చావు; ఆ+పదార్థంబు= ఆ వస్తువు; లేశమాత్రంబు+ఐనన్= చాలాకొంచెంగా ఉన్నప్పటికీ; పదివేలు+కాన్= అదే పదివేలరెట్లుగా; అంగీకరింతున్= సమ్మతించి స్వీకరిస్తాను; అట్లు+కాక= ఆ రీతిగా నాయందు భక్తిభావంలేకుండా; నీచవర్తనుండు+ఐ= అల్పమైన ప్రవర్తనకలవాడై; మత్+భక్తిన్+తగులని= మనస్సులో నాపై భక్తిభావనతో కూడియుండనట్టి; దుష్ట+ఆత్ముండు= చెడుతలంపుతో కూడిన మనస్సుగలవాడు; హేమ+అచలతుల్యంబు+ఐన= బంగారుకొండతో (మేరుపర్వతంతో) సమానమైన; పదార్థంబున్= వస్తువును; ఒసంగినన్= కానుకగా సమర్పించినప్పటికీ; అది= అట్లు సమర్పించిన ఆ వస్తువు; నామనంబునకున్= నా మనస్సుకు; సమ్మతంబు+కాదు= ఇష్టం కాదు; కావునన్= అందుచేత...

**తా :** కుచేలుడు సాభిప్రాయంగా పలికిన పలుకులు విని సమస్తభావవేత్త అయిన శ్రీకృష్ణుడు వాటిలోని ఆంతర్యాన్ని గ్రహించాడు. చిఱునగవుచే అందగించిన ముఖకమలంకలవాడై 'మిత్రమా! నీవిచ్చటికి వస్తూ భక్తిభావంతో నాకేమి కానుక తీసుకొని వచ్చావు? నీవు తెచ్చిన ఆ కానుక కొంచెమైనా సరే, దాన్ని పదివేలరేట్లుగా స్వీకరిస్తాను. నా యందు భక్తిలేని నీచుడు మేరుపర్వతమంతటి పదార్థాన్ని తెచ్చియిచ్చినా అది నాకు ప్రియమైంది కాజాలదు'– అని

**క. దళమైనఁ బుష్పమైనను, ఫలమైనను సలిలమైనఁ బాయని భక్తిం**
**గొలిచిన జను లర్పించిన, నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్. 1010**

**ప్రతి :** పాయని భక్తిన్= తొలగని భక్తిభావంతో; కొలిచినజనులు= సేవించిన భక్తజనులు; దళము+ఐనన్= ఒక పత్రాన్నికాని; పుష్పము+ఐనను= ఒక్క పువ్వునుకాని; ఫలము+ఐనను= ఒక పండునైనా; సలిలము+ఐనన్= కొంచెం నీటినైనా; అర్పించినన్= సమర్పించినట్లైతే; ఏను= నేను; రుచిర+అన్నము+కన్+ఎ= మిక్కిలి రుచి గలిగిన అన్నంగానే; ఎలమిన్= ప్రీతితో; భుజింతున్= ఆహారంగా స్వీకరిస్తాను.

**తా :** 'మిత్రమా! నిశ్చలమైన భక్తిభావంతో నన్ను సేవించే జనులు పత్రమైనా, పుష్పమైనా, ఫలమైనా సరే! నాకు సమర్పిస్తే, దాన్ని రుచికరమైన ఆహారంగా స్వీకరించి, పరమప్రీతితో ఆరగిస్తాను' - అని శ్రీకృష్ణుడు కుచేలునితో అన్నాడు.

**క. అని పద్మోదరుఁ డాడిన, వినయోక్తుల కాత్మ నలరి విప్రుఁడు దాఁ దె**
**చ్చిన యడుకులు దగ నర్పిం, పను నేరక మోము వాంచి పలుకక యున్నన్. 1011**

**ప్రతి :** అని= అని పై విధంగా; పద్మ+ఉదరుఁడు= పద్మము నాభియందుగలవాడు (శ్రీకృష్ణుడు); ఆడిన= పలికిన; వినయ+ఉక్తులకున్= వినయగుణంతో కూడిన మాటలకు; విప్రుఁడు= బ్రాహ్మణుడు (కుచేలుడు); ఆత్మన్+అలరి= తనమనస్సులో సంతసించి; తాన్+తెచ్చిన= (కానుకగా సమర్పించటానికై) తాను తీసుకొని వచ్చిన; అడుకులు= అటుకులను; అర్పింపనునేరక= సమర్పించజాలక; మోము వాంచి= (సంకోచంతో) ముఖాన్ని క్రిందికి వంచుకొన్నవాడై; పలుకక+ఉన్నన్= మౌనంగా ఉండగా...

**తా :** అని శ్రీకృష్ణుడు పల్కిన వినయంతో కూడిన పల్కులకు కుచేలుడు ఎంతో ఆనందించాడు. కాని, తాను తెచ్చిన అటుకులను శ్రీకృష్ణునికి అర్పించజాలక సంకోచిస్తూ తలవంచి మౌనంగా ఉండినాడు.

**వ. అ వ్విప్రుండు సనుదెంచిన కార్యంబు కృష్ణుండు దన దివ్యచిత్తంబున నెఱింగి 'యితండు పూర్వభవంబున నైశ్వర్యకాముండై నన్ను సేవింపం డైన నిక్కుచేలుండు నిజకాంతాముఖోల్లాసంబుకొఱకు నా యొద్దకుఁ జనుదెంచినవాఁ; డితనికి నింద్రాదులకుం బడయరాని బహువిధంబులైన సంపద్విశేషంబు లీ క్షణంబ యొడఁ గూర్పవలయు' నని తలంచి యతండు జీర్ణవస్త్రంబుకొంగున ముడిచి తెచ్చిన యడుకులముడియఁ గని 'యిది యేమి' యని యొయ్యన నమ్ముడియఁ దన కరకమలంబుల విడిచి యయ్యడుకులు కొన్ని పుచ్చుకొని 'యివియ సకలలోకంబులను, నన్నును బరితృప్తిం బొందింపఁ జాలు' నని యప్పుడు. 1012**

**ప్రతి :** కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు (కుచేలుడు); చను+తెంచిన కార్యంబు= వచ్చిన పనిని; తన దివ్యచిత్తంబునన్= దివ్యమయిన శక్తితోగూడిన తన మనస్సుచేత; ఎఱింగి= తెలుసుకొన్నవాడై; ఇతండు= ఈ విప్రుడు; ఐశ్వర్యకాముండు+ఐ= సంపదలయెడ కోరికగలవాడై; పూర్వభవంబునన్= మునుపటి జన్మలో; నన్నున్= నన్ను; సేవిపండు= సేవించకుండా ఉండినాడు; ఐనన్= అయినప్పటికీ; ఈ+కుచేలుండు= ఈ కుచేలుడు; నిజకాంతా= తన భార్యయొక్క; ముఖ+ఉల్లాసంబుకొఱకున్= తన ధర్మపత్ని ముఖం సంతోషంతో వికసించాలనే కోరికతో; నా+ఒద్దకున్= నా దగ్గరికి; చను+తెంచినవాడు= వచ్చి ఉన్నాడు; ఇతనికిన్= ఈ పేద బ్రాహ్మణునికి; ఇంద్ర+ఆదులకున్= దేవేంద్రుడు మున్నగు

గొప్పవారికి; పడయన్+రాని= పొందరానట్టి; బహువిధంబులు+ఐన= రకరకాలైన; సంపత్+విశేషంబులు= అనేకములైన సంపదలను; ఈ క్షణంబు+అ= ఈ నిమిషంలోనే; ఒడన్+కూర్పన్+వలయున్= సమకూర్చాలి; అని తలంచి= అని భావించి; అతండు= ఆ కుచేలుడు; జీర్ణవస్త్రంబు కొంగునన్= చినిగిన ఉత్తరీయంయొక్క అంచునందు; ముడిచి తెచ్చిన= ముడివేసుకొని తీసుకొనివచ్చినట్టి; అడుకులముడియన్= అటుకల మూటను; కని= చూచి; ఇది+ఏమి?= ఈ మూట యేమిటి?; అని= అని పల్కి; ఒయ్యనన్= మెల్లగా; ఆ+ముడియన్= ఆ మూటను; తన కరకమలంబులన్= తామరపూలవంటి తన హస్తాలతో; విడిచి= విప్పి; ఆ+అడుకులుకొన్ని= ఆ మూటలోని అటుకులలో కొన్నింటిని; పుచ్చుకొని= కైకొని; ఇవి+అ= ఈ యొక్క పిడికెడు అటుకులే; సకలలోకంబులనున్= అన్నిలోకాల్నీ; నన్నునున్= నన్నుకూడా; పరితృప్తిన్+ పొందింపన్+చాలును= మిక్కిలి సంతోషాన్ని పొందింపగలుగుతాయి; అని= అని పలికి; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** శ్రీకృష్ణుడు తన దివ్యచిత్తంతో కుచేలుని రాకకుగల కారణాన్ని తెలుసుకున్నాడు. "పూర్వజన్మలో ఈ భూసురుడు ఐశ్వర్యంకోసం నన్ను సేవించలేదు. ఇప్పుడు తన భార్యసంతోషంకోసం నా వద్దకు వచ్చాడు. కనుక ఈతనికి ఇంద్రాదులకుసైతం లభించని అనేకసంపదలను ఈ క్షణంలోనే ప్రసాదించాలి" – అని భగవానుడు నిశ్చయించుకొన్నాడు. కుచేలుని చినిగిన ఉత్తరీయం అంచులో ముడివైచి ఉన్న చిన్న అటుకుల మూటను గమనించి 'ఇదేమిటి?' – అని అడిగి, ఆ మూటను విప్పి, ఒక పిడికెడు తీసుకొన్నాడు. 'నాకూ, ఈ సమస్త లోకాలకూ సంతృప్తి నీయటానికి ఇవి సరిపోతాయి' – అని తలంచి కృష్ణుడు వాటిల్ని ఆరగించాడు.

**క. మురహరుఁడు పిడికెఁ డడుకులు, గర మొప్పఁగ నారగించి కౌతూహలియై**
**మఱియును బిడికెఁడు గొనఁ ద, త్కర మప్పుడు పట్టెఁ గమల కరకమలములన్. 1013**

**ప్రతి :** మురహరుఁడు= మురాసురుణ్ణి సంహరించినవాడు (శ్రీకృష్ణుడు); పిడికెడు+అటుకులు= ఒక పిడికిలితో కైకొనిన అటుకులు; కరము+ఒప్పన్+కన్= మిగుల ఒప్పిదంగా; ఆరగించి= భుజించి; కౌతూహలి+ఐ= కుతూహలంతో కూడిన మనస్సుకలవాడై; మఱియును= ఇంకా; పిడికెఁడు+కొనన్= పిడికెడు అటుకులను తీసుకొంటూ ఉండగా; అప్పుడు= ఆ సందర్భంలో; కమల= లక్ష్మీదేవి (అనగా లక్ష్మీదేవి అంశతో అవతరించిన రుక్మిణీదేవి); తత్+కరము= ఆయనయొక్క చేతిని; కరకమలములన్= పద్మాలవంటిచేతులతో; పట్టెన్= (గట్టిగా) పట్టుకొనింది.

**తా :** శ్రీకృష్ణుడు పిడికెడు అటుకులను ఆరగించిన పిదప, కుతూహలంతో కుచేలుని ఉత్తరీయం కొంగులో ఉండే మూటలో ఇంకొక పిడికెడు అటుకులు తీసుకొంటూ ఉండగా, అప్పుడు రుక్మిణీదేవి తన పతిదేవునిహస్తాన్ని గట్టిగా పట్టుకొనింది.

**క. 'సొంపారఁగ నతనికి బహు, సంపద లందింప నివియ చాలును నిఁక భ**
**క్షింపఁగ వలవదు త్రిజగ, త్సంపత్కర ! దేవ దేవ ! సర్వాత్మ ! హరీ ! ' 1014**

**ప్రతి :** త్రిజగత్ సంపత్కర!= మూడులోకాలకు సంపదలను కలిగించువాడా!; దేవదేవ!= దేవతలకందరికీ దేవుడమైనవాడా!; సర్వ+ఆత్మ!= ఓంకార రూపమైన విశ్వస్వరూపుడివైన వాడా!; హరీ!= పాపాలను హరించేవాడా! (శ్రీకృష్ణా)!; ఇతనికిన్= ఈ బ్రాహ్మణోత్తమునికి; సొంపు+ఆరన్+కన్= ఇంపు కలుగునట్లుగా; బహుసంపదలు= అనేకములైన ఐశ్వర్యాల్నీ; అందింపన్= సమకూర్చటానికి; ఇవి+అ= మీరు మొదట భుజించిన పిడికెడు అటుకులే; చాలును= సరిపోతాయి; ఇఁకన్= మీదట; భక్షింపన్+గన్+వలవదు= భుజింపవద్దుసుమా!

**తా :** 'ముల్లోకాలకు సమస్త సంపదలను అనుగ్రహించే దేవదేవుడవైన శ్రీకృష్ణదేవా! ఈతనికి సమస్త సంపదలను అందించటానికై ఇంతకు ముందు మీరు తినిన పిడికెడు అటుకులే చాలు! కాబట్టి, ఇకపై భుజించకండి!' - అని రుక్మిణీదేవి భర్తను వారించింది.

**విశే :** రుక్మిణీదేవి శ్రీకృష్ణుణ్ణి రెండవ పిడికెడు (అటుకలను) భక్షింపనీయకుండా నివారించటానికిగల కారణాన్ని సంస్కృత భాగవతంయొక్క వ్యాఖ్యాతలు సముచితమైన రీతిలో వివరించారు. మొదటి పిడికెడు అటుకులతోనే ఆతనికి ఇహలోక పరలోకాలకు రెండిటికి సంబంధించిన సకల సంపదలూ సిద్ధించాయి. అటుపై రెండవ పిడికెడు అటుకులను గనుక భుజించినట్లైతే, సాక్షాల్లక్ష్మీదేవియే ఆతని అధీన కావలసివస్తుందని, అందువల్ల అలా చేయవద్దనీ లక్ష్మీదేవియొక్క అవతారమైన రుక్మిణీదేవి అలా స్వామిచేతిని పట్టుకొన్నది.

**వ. అని యిట్లు వారించె; న క్కుచేలుండును నా రాత్రి గోవిందు మందిరంబునఁ దనకు హృదయానందకరంబులగు వివిధపదార్థంబు లనుభవించి, మృదుల శయ్యాతలంబున నిద్రించి తనమనంబునం దన్ను సమధిక స్వర్గభోగానుభవుంగాఁ దలంచుచు మఱునాఁ డరుణోదయంబున మేల్కని కాలోచితకృత్యంబులు దీర్చి, యిందిరారమణుండు దన్నుఁ గొంత దవ్వనిపి యామంత్రితుం జేయఁ జనుచు నందనందన సందర్శనానంద లోలాత్ముండై తన మనంబున నిట్లనియె. 1015**

**ప్రతి :** అని= అనిపలికి; ఇట్లు= ఈ విధంగా; వారించెన్= (తన పతిని రెండవ పిడికిలితో అటుకులను తీసికోనీయకుండ) నివారించింది; ఆ+కుచేలుండునున్= ఆ కుచేలుడు కూడా; ఆ రాత్రి= ఆ రాత్రివేళలో; గోవిందు మందిరంబునన్= శ్రీకృష్ణుని భవనంలో; తనకున్= తనకు; హృదయ+ఆనందకరంబులు+అగు= మనస్సుకు సంతోషాన్ని కలిగించే; వివిధ= రకరకములయిన; పద+అర్థంబులు= ఆహారపదార్థాలను; అనుభవించి= (తనివితో) భుజించి; మృదుల= మెత్తవైన; శయ్యాతలంబునన్= పాన్పుమీద; నిద్రించి= (సుఖంగా) నిద్రపోయి; తనమనంబునన్= తన మనస్సులో; తన్నున్= తనను; సమ్+అధిక= మిక్కిలి అతిశయించిన; స్వర్గభోగ+అనుభవున్+కాన్= స్వర్గలోకమందలి సుఖాలను అనుభవించిన వాణ్ణిగా; తలంచుచున్= భావిస్తూ; మఱునాఁడు= ఆ మరుసటి రోజు; అరుణ+ఉదయంబునన్= సూర్యుని ఉదయకాలంలోని ఎర్రని తేజస్సు ప్రసరించేవేళలో (అరుణోదయం కాగానే); మేలు+కని= నిద్రలేచి; కాల+ఉచిత కృత్యంబులు= ఆ సమయానికి తగిన సంధ్యావందనాదిసత్కార్యాలను; తీర్చి= నెరవేర్చి; ఇందిరా రమణుండు= లక్ష్మీదేవికి (రుక్మిణీదేవికి) పతి (శ్రీకృష్ణుడు); తన్నున్= తనను; కొంతదవ్వు+అనిపి= కొంత దూరం సాగనంపి; ఆమంత్రితున్+చేయన్= వెళ్లిరమ్మని సంబోధిస్తూ వీడుకొలుపగా; చనుచున్= (దారిలో) వెళ్లుతూ; నందనందన= నందుని కుమారుడైన శ్రీకృష్ణునియొక్క; సందర్శన+ఆనంద= సందర్శనంవల్ల కలిగిన సంతోషంలో; లోల+ఆత్ముండు+ఐ= నిమగ్నమైన చిత్తంకలవాడై; తన మనంబునన్= తన మనస్సులో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అనుకొన్నాడు.

**తా :** కుచేలుడు ఆ రాత్రి శ్రీకృష్ణునిమందిరంలో ఎంతో రుచికరాలైన అనేకఆహారపదార్థాలను ఆరగించాడు. మెత్తని పాన్పుపై నిద్రించాడు. తాను గొప్పస్వర్గభోగాన్ని పొందిన భాగ్యవంతుడిగా భావించాడు. తెల్లవారగానే ఆతడు కాలోచిత కృత్యాలను నిర్వర్తించుకొని, తన ఊరికి బయలుదేరాడు. శ్రీకృష్ణునిచే కొంత దూరం సాగనంపబడి, వెళుతూ, గోవిందుణ్ణి సందర్శించి నందువల్ల కలిగిన అతిశయించిన ఆనందంతో తన మనస్సులో ఇలా అనుకోసాగాడు.

క. 'నా పుణ్య మరయ నెట్టిదొ, యా పుణ్యనిధిం బ్రశాంతు నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యునిఁ జి, ద్రూపకుఁ బురుషోత్తమునిఁ బరుం గనుఁగొంటిన్. 1016

**ప్రతి :** ఆ పుణ్యనిధిన్= పుణ్యానికి నెలవైనవాణ్ణి; ప్రశాంతున్= ప్రశాంతమైన స్వభావంగలవాణ్ణి; అచ్యుతున్= నాశంలేనివాణ్ణి; అఖిల వ్యాపకున్= ప్రపంచమంతా వ్యాపించియుండేవాణ్ణి; బ్రహ్మణ్యునిన్= బ్రాహ్మణులకు హితాన్ని కోరేవాణ్ణి; చిత్+రూపకున్= జ్ఞానస్వరూపుని; పరున్= ప్రకృతికంటె అతీతుడైనవానిని; పురుష+ఉత్తమునిన్= పురుషులందరిలో ఉత్తముడైనవానిని (శ్రీకృష్ణదేవుని); కనున్+కొంటిన్= దర్శించాను; అరయన్= పరికింపగా; నాపుణ్యము= నేను చేసిన పుణ్యం; ఎట్టిది+ఒ!= ఎటువంటిదో! (ఎంతటి గొప్పదో) కదా!

**తా :** నేను ఈ తరుణంలో పుణ్యాలరాశీ, ప్రశాంతస్వభావుడూ, అచ్యుతుడూ, సర్వవ్యాపకుడూ, బ్రాహ్మణహితం కోరేవాడూ, జ్ఞానస్వరూపుడూ, పరాత్పరుడూ – అయిన పురుషోత్తముణ్ణి కన్నులార కనుగొన గలిగాను. నిజంగా నేను చేసుకొన్న పుణ్యం ఎంత గొప్పదోకదా!

సీ. పరికింపఁ గృపణస్వభావుండ నై నట్టి యే నేడ? నిఖిలావనీశ్వరి యగు
నిందిరాదేవికి నెనయంగ నిత్యనివాసుఁడై యొప్పు నవ్వాసుదేవుఁ
డేడ? న న్నర్థిమైఁ దోడఁబుట్టినవానికైవడిఁ గౌఁగిటఁ గదియఁ జేర్చి
దైవంబుగా నన్ను భావించి నిజతల్పమున నుంచి సత్క్రియల్ పూని నడపి

తే. చారునిజవధూకరసరోజాతకలిత, చామరానిలమున గతశ్రమునిఁ జేసి
శ్రీకుచాలిప్తచందనాంచితకరాబ్జ, తలములను నడ్గు లొత్తె వత్సలత మెఱసి. 1017

**ప్రతి :** పరికింపన్= ఆలోచించిచూడగా; కృపణ స్వభావుండన్+ఐన+అట్టి= పేదరికమే సహజ లక్షణంగా గలిగినట్టి; ఏన్+ఏడ?= నేనెక్కడ?; నిఖిల+అవని+ఈశ్వరి+అగు= సమస్తమైన భూమండలానికి అధిదేవతయైన; ఇందిరాదేవికిన్= లక్ష్మీదేవికి; ఎనయన్+కన్= పొందికగా; నిత్యనివాసుఁడు+ఐ= సదా నివాసస్థానమై; ఒప్పు= విలసిల్లుతున్న; ఆ+వాసుదేవుఁడు+ఏడ?= వసుదేవుని తనయుడైన ఆ శ్రీకృష్ణు డెక్కడ?; నన్నున్= సామాన్యుడనైన నన్ను; తోడన్+పుట్టినవానికైవడిన్= తనతోపాటు జన్మించిన తనతమ్మునిలాగా; అర్థిమైన్= ప్రీతితో; కౌఁగిటన్= తన కౌగిటిలో; కదియన్+చేర్చి= దగ్గరగా చేర్చుకొని; నన్నున్= సామాన్యుడనైన నన్ను; దైవంబు+కాన్= దేవునితో సమానమైన పూజ్యభావనతో; భావించి= తలంచి; నిజతల్పమునన్+ఉంచి= తన పాన్పుపై కూర్చుండ బెట్టి; పూని= ఆసక్తితో పూనుకొని; సత్+క్రియల్= మంచి కార్యాలను (అర్ఘ్యము, పాద్యము మొదలైన పరిచర్యలను); నడపి= నిర్వహించి; చారు= అందమైన; నిజవధూ= తన పత్ని (రుక్మిణి)యొక్క; కరసరోజాత= పద్మంవంటి కోమలమైనహస్తంచేత; కలిత= పట్టుకొనబడిన; చామర+అనిలమునన్= వింజామరయొక్క గాలిచేత; గతశ్రమునిన్= (ప్రయాణపు) అలసట తొలగినవాణ్ణిగా; చేసి= చేసి; వత్సలత= వాత్సల్యం; మెఱసి= ప్రకాశించి; శ్రీకుచ= లక్ష్మీదేవియొక్క (రుక్మిణీదేవియొక్క) పాలిండ్లపై; ఆలిప్త= బాగుగా పూయబడిన; చందన= మంచిగంధంచేత; అంచిత= ఒప్పి ఉండే; కర+అబ్జతలములనున్= తామరపూలరేకులను పోలిన అరచేతులతో; అడ్గులు+ఒత్తెన్= నాపాదాలను శ్రమ తొలగేట్టు ఒత్తాడు.

**తా :** కుచేలుడు తన మనస్సున ఇంకా ఈ రీతిగా భావించాడు. "నిఱుపేదనైన నే నెక్కడ? జగదీశ్వరియైన శ్రీదేవికి నిత్య నివాసమైన వాసుదేవు డెక్కడ? ఆ నందనందనుడు నన్ను తన తోబుట్టువుతో సమానునిగా భావించి, అనురాగంతో కౌగిట

చేర్చినాడు. దేవునిగా భావించి, తన పాన్పుపై కూర్చుండజేసి పరిచర్యలు కావించాడు. ఆయనపత్ని నాకు వింజామర వీచి నాబడలికను పోగొట్టింది. సాక్షాత్తు లక్ష్మీదేవియైన రుక్మిణిని సంభాళించిన అరచేతులతో ఆప్యాయంగా నా పాదాలు ఒత్తి ఆదరించాడు కదా!

**వ. కావున. 1018**

**ప్రతి :** కావునన్= కనుక...

**తా :** నన్ను అలాగ ఆదరించాడు కనుకనే

**ఉ. శ్రీనిధి యిట్లు నన్నుఁ బచరించి ఘనంబుగ విత్త మేమియు**
**నీనితెఱంగు గానఁబడె; నెన్న 'దరిద్రుఁడు సంపదంధుఁడై**
**కానక తన్నుఁ జేరఁ' డని కాక శ్రితార్తిహరుండు సత్కృపాం**
**భోనిధి సర్వవస్తుపరిపూర్ణునిఁగా ననుఁ జేయకుండునే ? 1019**

**ప్రతి :** శ్రీనిధి= సంపదకు స్థానమైన శ్రీకృష్ణుడు; ఇట్లు= ఈ రీతిగా; నన్నున్= (నిఱుపేదనైన) నన్ను; పచరించి= (ఆసక్తితో) పరిచర్యలు కావించి; ఘనంబు+కన్= గొప్పగా; విత్తము+ఏమియున్= ద్రవ్యం ఏమాత్రంకూడా; ఈని తెఱంగు= ఇవ్వని వైఖరి; కానన్+పడెన్= గోచరించింది; ఎన్నన్= ఆలోచించిచూడగా; దరిద్రుఁడు= పేదయైనవాడు; సంపత్+ అంధుఁడు+ఐ= సంపదలచే (గర్వంచేత) గ్రుడ్డివాడై; కానక= చూడజాలక (ఏదికర్తవ్యమో తెలుసుకొనలేక); తన్నున్+ చేరఁడు+అని= (భక్తిలేక) తనను చేరుకోలేడనే అభిప్రాయంతోనే; కాక= అటుగాకపోతే; శ్రిత+ఆర్తిహరుండు= తనను ఆశ్రయించిన వారి బాధను హరించే (నివారించే)వాడు; సత్+కృపా+అంభోనిధి= ఉత్తమమైన దయాగుణానికి సముద్రమైనవాడు (అయిన శ్రీకృష్ణుడు); ననున్= తనను ఆశ్రయించినవాడనైన నన్ను; సర్వవస్తుపరి పూర్ణునిన్+కాన్= అన్ని వస్తువులసమృద్ధితో గూడుకొన్నవాణ్ణిగా; చేయక+ఉండున్+ఏ?= చెయ్యకుండా ఉండి ఉంటాడా? (తప్పక నన్ను సర్వవస్తుపరిపూర్ణునిగా చేసే ఉంటాడు).

**తా :** ఈ రీతిగా నన్ను ఆదరించిన శ్రీకృష్ణుడు నాకు ధనం ఏమాత్రం ఇవ్వలేదు. దరిద్రుడు సంపన్నుడైతే ఆ సంపదవల్ల అహంకారంతో అంధుడై తనను సేవించడని తలచినాడు కాబోలు! లేకుంటే ఆశ్రితజనుల ఆర్తిని నివారించే ఆ అపార కృపాసముద్రుడు తన భక్తుడైన నన్ను సకలసంపదలతో పరిపూర్ణునిగా చేయకుండా ఉంటాడా? తప్పక చేసి ఉండేవాడే!

**విశే :** శ్రీకృష్ణుడు తనకు సంపదలను ప్రసాదించకపోవటానికిగల కారణాన్ని ఊహించటంలో, భక్తి భరితమైన ఆయన శీలం వెల్లడవుతున్నది.

**వ. అని తన మనంబున వితర్కించుచు నిజపురంబునకుఁ జని చని ముందట. 1020**

**ప్రతి :** అని= అని పైరీతిగా; తన మనంబునన్= తన మనస్సులో; వితర్కింపుచున్= పలురకాలుగా ఆలోచిస్తూ; నిజపురంబునకున్= తన పట్టణానికి; చని చని= క్రమంగా వెళ్లినవాడై; ముందటన్= ఎదుట.

**తా :** కుచేలుడు పైరీతిగా తన మనస్సులో ఆలోచన చేస్తూ తన పురాన్ని చేరుకున్నాడు.

సీ. భానుచంద్రప్రభాభాసమానస్వర్ణచంద్రకాంతోపలసౌధములును
గలకంఠశుకనీలకంఠసముత్కంఠమానితకూజితోద్యానములును
ఫుల్లసితాంభోజహల్లకకల్హారకైరవోల్లసితకాసారములును
మణిమయకనకకంకణముఖాభరణవిభ్రాజితదాసదాసీజనములుఁ

తే. గలిగి చెలువొందు సదనంబుఁ గాంచి విస్మ, యమును బొందుచు నెట్టి పుణ్యాత్ముఁ డుందు
నిలయ మొక్కొ! యపూర్వమై నెగడె మహిత, వైభవోన్నతలక్ష్మీనివాస మగుచు. 1021

**ప్రతి :** భాను= సూర్యునియొక్క; చంద్ర= చంద్రునియొక్క; ప్రభా= కాంతులలాగా; భాసమాన= ప్రకాశిస్తున్న; స్వర్ణ= సువర్ణమయాలైన; చంద్రకాంత ఉపల= చంద్రకాంతపురాళ్లతో నిర్మింపబడిన; సౌధములను= భవనాలు; కలకంఠ= కోకిలలు; శుక= చిలుకలు; నీలకంఠ= నెమళ్లు – ఈ పక్షులయొక్క; సమ్+ఉత్కంఠ= మిక్కిలి ఉత్సాహంతో కూడినవైన; మానిత కూజిత= మెచ్చదగిన ధ్వనులతో విలసిల్లుతున్న; ఉద్యానములును= పూలతోటలును; ఫుల్ల= బాగుగా వికసించిన; సిత+అంభస్+జ= తెల్లతామరపూవులు; హల్లక= ఎఱ్ఱతామరపూవులు; కల్హార= మిగులసువాసనగల కమలాలు; కైరవ= తెల్లకలువలు – ఈ పూలజాతులచే; ఉత్+లసిత= కళకళలాడుతూ మిగుల ప్రకాశిస్తూ ఉన్న; కాసారములును= సరస్సులును; మణిమయ= మణులుచెక్కిన; కంకణ= చేతికడియాలు; ముఖ= మొదలుగాగల; ఆభరణ= సొమ్ములచే; విభ్రాజిత= విశేషంగా ప్రకాశిస్తూ ఉన్న; దాసదాసీజనములన్= సేవకులును, దాసీలును; కలిగి= కలిగి ఉండి; చెలువు+ఒందు= అందగించి ఉన్న; సదనంబున్= నివాసగృహాన్ని; కాంచి= చూచి; విస్మయమును+పొందుచున్= ఆశ్చర్యపడుతూ; ఎట్టి పుణ్య+ఆత్ముఁడు= ఎంతటిపుణ్యస్వరూపుడైన మహనీయుడో; ఉందు= నివసిస్తున్నట్టి; నిలయము+ఒక్కొ!= నివాసభవనమో!; మహితవైభవ+ఉన్నత= మహనీయమైన ఐశ్వర్యంచేత గొప్పదైనట్టి; లక్ష్మీనివాసము+అగుచున్= (సంపదలకు అధిదేవతయైన) లక్ష్మీదేవికి నివాసస్థానమై వర్ధిల్లుతూ; అపూర్వము+ఐ= మునుపెన్నడూ లేనిదై; నెగడెన్= వర్ధిల్లెను (వర్ధిల్లుతూవుంది).

**తా :** కుచేలుడు తనయెదుట సూర్యచంద్రుల ప్రభలతో ప్రకాశించే సువర్ణమయాలైన, చంద్రకాంతశిలానిర్మితాలైన భవనాలూ, చిలుకలు, కోయిలలు, నెమళ్లు మున్నగువాటికూజితాలలో విలసిల్లుతున్న ఉద్యానవనాలూ, వికసించిన పలురకాల పద్మాలతో, కలువపూలతో కన్నులపండువు కావిస్తూవున్న సరోవరాలూ, మణిమయ కనక కంకణాలు, రకరకాల భూషణాలు ధరించిన దాసదాసీ జనులూకలిగి వెలుగొందే మహోన్నతమందిరాన్ని చూచి ఆశ్చర్యపడినాడు. ఇది ఏ పుణ్యాత్ముని నివాసభవనమో? సిరిసంపదలకు నిలయమై అపూర్వంగా ప్రకాశిస్తూందని కుచేలుడు భావించాడు.

వ. అని తలపోయుచున్న యవసరంబున. 1022

**ప్రతి :** అని= పైరీతిగా; తలపోయుచున్+ఉన్న= ఆలోచన చేస్తూవున్న; అవసరంబునన్= సమయంలో...

**తా :** కుచేలుడు తనయెదుట నూతనంగా గోచరించిన అపూర్వసౌధాన్ని చూచి 'ఈ మహనీయసౌధం ఏ పుణ్యాత్ముని నివాస మందిరమో కదా!' అని ఆలోచిస్తూ ఉండినాడు. ఆ సందర్భంలో

తే. దివిజవనితలఁబోలెడు తెఱవ లపుడు, డాయ నేతెంచి 'యిందు విచ్చేయుఁ' డనుచు
విమలసంగీతనృత్యవాద్యములు సెలఁగ, గరిమఁ దోడ్కొని చని రంతిపురమునకును. 1023

**ప్రతి :** అపుడు= ఆ సమయంలో; దివిజవనితలన్= దేవతాస్త్రీలను; పోలెడు= సరిపోలుతూ ఉన్న; తెఱవలు= యువతులు; డాయన్= సమీపానికి (కుచేలునివద్దకు); ఏగు+తెంచి= వచ్చి; ఇందున్= ఈ మందిరంలోపలికి; విచ్చేయుఁడు+అనుచున్= వేంచేయండి! – అని ఇంపుగా పల్కుతూ; విమల= నిర్మలమైన (మనోజ్ఞములైన); సంగీత= చక్కనిపాటలు; నృత్య= నాట్యములు; వాద్యములు= మంగళకరములైనవాద్యాలు; చెలఁగన్= అతిశయంగా శబ్దిస్తుండగా; గరిమన్= గొప్పతనంతో (వైభవంగా); అంతిపురమునకును= అంతఃపురంలోపలికి; తోడ్కొని చనిరి= పిలుచుకొని వెళ్లారు.

**తా :** "ఆ సమయంలో దేవతాస్త్రీలను పోలిన యువతులు కుచేలునివద్దకు వచ్చి ఈ మందిరంలోనికి వేంచేయండి" అని ఇంపుగా పలుకుతూ మనోజ్ఞాలైన సంగీతనృత్యనాట్యవాద్యాలతో మంగళకరమైన శబ్దాలు ప్రసరిస్తుండగా వైభవోపేతంగా అలంకరించిన మందిరంలోనికి పిలుచుకొని వెళ్లారు.

**వ. ఇట్లు సనుదేర నతనిభార్యయైన సతీలలామంబు దనమనంబున నానందరసమగ్న యగుచు. 1024**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; చను+తేరన్= విచ్చేయగా; అతని భార్య+ఐన= ఆ కుచేలునిభార్యయైనట్టి; సతీలలామంబు= పతివ్రతలలో శ్రేష్ఠురాలు; తన మనంబునన్= తన మనస్సునందు; ఆనందరసమగ్న+అగుచున్= సంతోషమనే రసంలో మునిగింది అవుతూ...

**తా :** కుచేలుడు ఆ విధంగా యువతీమణులవెంట అంతఃపురంలోనికి విచ్చేసిన పిదప, ఆయన భార్యయైన ఉత్తమ సతీమణి తన మనస్సునందు ఎంతో సంతోషించింది.

**సీ. తన విభురాక ముందటఁ గని మనమున హర్షించి వైభవం బలర మనుజ**
**కామినీరూపంబు గైకొన్న యిందిరావనితచందంబునఁ దనరుచున్న**
**కలకంఠి తనవాలుఁగన్నులక్రేవల నానందబాష్పంబు లంకురింప**
**నతనిపాదంబుల కాత్మలో మ్రొక్కి భావంబున నాలింగనంబు సేసె**

**తే. నా ధరాదేవుఁ డతులదివ్యాంబరాభ, రణవిభూషితలై రతిరాజుసాయ**
**కములగతి నొప్పు పరిచారికలు భజింప, లలితసౌభాగ్య యగు నిజలలనఁ జూచి. 1025**

**ప్రతి :** ముందటన్= ఎదుట; తన విభురాకన్= తనపతి రాకను; కని= చూచి; మనమునన్= తన మనస్సులో; హర్షించి= సంతోషపడి; వైభవంబు+అలరన్= సంపదయొక్క ఠీవి ప్రకాశిస్తూ ఉండగా; మనుజకామినీ రూపంబున్+కైకొన్న= మానవస్త్రీ ఆకారాన్ని ధరించి ఉన్న; ఇందిరావనితచందంబునన్= లక్ష్మీదేవిలాగా; తనరుచున్న= ఒప్పుతూ ఉన్న; కలకంఠి= మనోహరమైన కంఠస్వరం కలది (కుచేలుని పత్ని); తన వాలు+కన్నుల= తనపొడవైన కన్నులయొక్క; క్రేవలన్= చివరలలో; ఆనందబాష్పంబులు= సంతోషబాష్పాలు; అంకురింపన్= మొలకలెత్తగా; అతని పాదంబులకున్= ఆ పతి (కుచేలునియొక్క) పాదాలకు; ఆత్మలోన్= తన మనస్సులో; మ్రొక్కి= నమస్కరించి; భావంబునన్= మనస్సులో; ఆలింగనంబు+చేసెన్= కౌగిలించుకొనింది; ఆ ధరాదేవుఁడు= ఆ భూసురుడు; అతుల దివ్య+అంబర+ఆభరణభూషితలు+ఐ= సాటిలేని దివ్యములైన వస్త్రాలు, సొమ్ములచేత అలంకరింపబడినవారై; రతిరాజుసాయకములగతిన్= రతీదేవిభర్తయైన మన్మథునిబాణాలలాగా; ఒప్పు= విలసిల్లుతూ ఉన్న; పరిచారికలు= దాసీజనం; భజింపన్= సేవిస్తూ ఉండగా; లలితసౌభాగ్య+అగు= మనోహరమైన సుకుమారమైన ముత్తైదువుయొక్క సంపదగలదైన; నిజలలనన్+చూచి= తన భార్యను చూచి...

**తా :** పతివ్రతాశిరోమణియైన కుచేలుని యిల్లాలు తన వల్లభుని రాకను తెలుసుకొని ఎంతో సంతోషంతో ఎదురు వచ్చింది. మానవరూపాన్ని ధరించిన మహాలక్ష్మిలాగా విలసిల్లుతూ ఉన్న ఆమెకడగన్నుల నుండి ఆనందబాష్పాలు రాలుతుండగా భర్త పాదాలకు మనస్సులో నమస్కరించి, భావంలో కౌగిలించుకొనింది. దివ్యాంబరాలు, దివ్యాభరణాలు ధరించి మన్మథుని బాణాలలాగా ఉన్న పరిచారికల సేవలందుకొంటూ ఐశ్వర్యశోభతో తులతూగుతూ ఉన్న తన ధర్మపత్నిని కుచేలుడు చూచి

**క.** **ఆ నారీరత్నంబును, దానును ననురాగరసము దళుకొత్తఁగ ని**
**త్యానందము నొందుచుఁ బెం, పూనిన హరిలబ్ధవైభవోన్నతి మెఱయన్.** **1026**

**ప్రతి :** ఆ నారీరత్నంబును= వనితలలో శ్రేష్ఠురాలయిన ఆ యిల్లాలును; తానునున్= కుచేలుడు తానూ; అనురాగరసము= (నిర్మలమైన) ప్రేమరసం; తళుకు+ఒత్తన్+కన్= ప్రకాశించగా; నిత్య+ఆనందమున్+ఒందుచున్= ఎల్లవేళల ఆనందాన్ని అనుభవిస్తూ; పెంపు+ఊనిన= గొప్పతనంతో కూడిందైన; హరి లబ్ధ= శ్రీకృష్ణదేవుని అనుగ్రహంచేత; లబ్ధ= పొందబడిందైన; వైభవ+ఉన్నతి= అతిశయమైన ఐశ్వర్యం; మెఱయన్= భాసించుచుండగా...

**తా :** ఉత్తమ దంపతులైన కుచేలుడూ, ఆయన ధర్మపత్నీ అన్యోన్యమైన అనురాగం విలసిల్లగా శ్రీకృష్ణునికృపతో లభించిన అంతులేని ఐశ్వర్యంతో నిత్యానందాన్ని పొందుతూ

**సీ.** **కమనీయపద్మరాగస్తంభకంబులుఁ గొమరారుపటికంపుఁగుడ్యములును**
**మరకతనవరత్నమయకవాటంబులుఁ గీలితహరినీలజాలకములు**
**దీపితచంద్రకాంతోపలవేదులు నంచితవివిధపదార్థములును**
**దగు హంసతూలికాతల్పంబులును హేమలాలితశయనస్థలములుఁ దనరు**

**తే.** **సమధికోత్తుంగభద్రపీఠముల సిరులు, మానితోన్నతచతురంతయానములును**
**వలయు సద్వస్తుపరిపూర్ణవాటికలును, గలిగి చెలువొందుమందిరం బెలమిఁ జొచ్చి.** **1027**

**ప్రతి :** కమనీయ= మనోజ్ఞమైన; పద్మరాగ= పద్మరాగమణులు చెక్కినట్టి; స్తంభకంబులున్= చిన్నస్తంభాలు; కొమరు+ఆరు= అందంగా విలసిల్లుతూవున్న; పటికము+కుడ్యములును= స్ఫటిక శిలలతో కట్టబడినటువంటి గోడలు; మరకత నవరత్నమయ= గరుడ పచ్చలు, నవరత్నాలు తాపినట్టి; కవాటంబులున్= వాకిళ్లు; కీలిత= పొదుగబడిన; హరినీల= ఇంద్రనీలమణులుగల; జాలకములు= గవాక్షాలు; దీపిత= ప్రకాశింపజేయబడిన; చంద్రకాంత+ఉపల= చంద్రకాంతపురాళ్లతో నిర్మితాలైన; వేదికలును= అరుగులు; అంచిత= ఒప్పుతూ ఉన్న; వివిధ పదార్థములును= పలురకాలైన సంభారాలు; తగు= ఎంతో చక్కగా అమరి ఉన్న; హంసతూలికా= హంసల ఱెక్కలందలి ఈకలతో నిర్మించబడిన; తల్పములును= పాన్పులు; హేమ లాలిత= బంగారంచేత అందంగా తీర్చిన; శయన స్థలములున్= పరుండే మందిరాలు; తనరన్= ఏర్పరచి ఉండగా; సమ్+అధిక= మిక్కిలి అతిశయించిన; ఉత్తుంగ= ఎత్తైనటువంటి; భద్రపీఠముల సిరులు= మంగళకరాలైన పీఠాల సంపదలూ; మానిత= కొనియాడబడిన; ఉన్నత= ఎత్తయిన; చతుర్+అంతయానములును= పల్లకీలు; వలయు= ఆవశ్యకాలైన; సత్+వస్తు= ఉత్తమవస్తువులచే; పరిపూర్ణ= బాగుగా నిండియున్న; వాటికలను= (విశాలమైన) వాడలును; కలిగి= కలిగి ఉండేదై; చెలువు+ఒందు= అందంతో విరాజిల్లుతూ ఉన్న; మందిరంబు= భవనాన్ని; ఎలమిన్= ప్రీతితో; చొచ్చి= ప్రవేశించి...

**తా :** ఎఱ్ఱని పద్మరాగమణులు తాపిన చిరుకంబాలు, తెల్లని స్ఫటికశిలా నిర్మితాలైన గోడలు, గరుడపచ్చలు చెక్కిన నవరత్నాల వాకిళ్లు, ఇంద్రనీల మణులు తాపిన గవాక్షాలు, చంద్రకాంత శిలావినిర్మిత వేదికలు, హంసతూలికాతల్పాలు, సువర్ణ మయాలైన శయనశాలలు, సిరులొలికే ఉన్నత భద్రపీఠాలు, పల్లకీలు, ఆవశ్యకాలైన ఉత్తమవస్తువులతో, సమస్త సంభారాలతో పరిపూర్ణాలై విలసిల్లుతూవున్న వాడలు – వీటన్నింటితో విరాజిల్లుతూవున్న మందిరాన్ని కుచేలుడు (సతీసమేతుడై) ప్రవేశించి

**వ. సుఖంబున నుండు నట్టియెడం దనకు మనోవికారంబులు వొడమకుండ వర్తించుచు, నిర్మలంబగు తన మనంబున నిట్లను; నింతకాలం బత్యంతదురంతంబగు దారిద్ర్యదుఃఖార్ణవంబున మునింగి యున్న నాకుం గడపటఁ గలిగినవిభవంబున నిప్పుడు. 1028**

**ప్రతి :** (అలాంటి దివ్యమందిరంలో సతీసమేతుడై ప్రవేశించిన కుచేలుడు) సుఖంబునన్+ఉండు+అట్టి+ఎడన్= సుఖంగా ఉండగా, అలాంటి సందర్భంలో; తనకున్= (నిర్మలచిత్తుడయిన) తనకు; మనస్+వికారంబులు= మనస్సుకు సంబంధించిన ఇంద్రియ వికారాలు; పొడమక+ఉండన్= కలుగకుండా; వర్తించుచున్= నడచుకొంటూ; నిర్మలంబు+అగు= అత్యంతస్వచ్ఛమైన; తనమనంబునన్= తన మనస్సులో; ఇట్లు+అనున్= ఇలా అనుకొన్నాడు; ఇంతకాలంబు= ఇన్ని సంవత్సరాల కాలం; దుర్+అంతంబు+అగు= అంతులేందైన; దారిద్ర్య= పేదఱికం అనేటటువంటి; దుఃఖ+అర్ణవంబునన్= దుఃఖమనే సాగరంలో; మునింగి ఉన్న= మునిగిపోయి ఉండినట్టి; నాకున్= నాకు; కడపటన్= జీవితంయొక్క చివరిదశయందు; కలిగిన= లభించిన; విభవంబునన్= ఐశ్వర్యంచేత; ఇప్పుడు= ఇప్పుడు...

**తా :** కుచేలుడు నూతనమందిరంలో సతీసమేతంగా సుఖంగా నివసిస్తూ, మనస్సులో ఇంద్రియవికారాలు కలుగకుండా ప్రవర్తిస్తూ, తనలో తాను ఇలా అనుకొన్నాడు : 'ఇంతకాలం అంతులేని పేదఱికం అనే దుఃఖసముద్రంలో మునిగి ఉండిన నాకు చివరిదశలో ఈ ఐశ్వర్యం లభించింది.

**ఆ. ఎన్నఁ గ్రొత్తలైన యిట్టి సంపదలు నా, కబ్బుటెల్ల హరిదయావలోక**
**నమునఁ జేసి కాదె ! నళినాక్షుసన్నిధి, కర్థి నగుచు నేను నరుగుటయును. 1029**

**ప్రతి :** ఎన్నన్= పరికింపగా; హరి= శ్రీహరియొక్క (శ్రీకృష్ణునియొక్క); దయా+అవలోకనమునన్+చేసి కాదె!= కృపతోగూడిన చూపులవలననే కదా!; క్రొత్తలు+ఐన= క్రొత్తగా సంప్రాప్తించినవైన; ఇట్టి సంపదలు= ఇట్టి ఐశ్వర్యాలు; నాకున్+అబ్బుట+ఎల్లన్= నాకు లభించటం అంతా; ఏను= కుచేలుడినైన నేను; అర్థిన్+అగుచున్= సంపదలను కోరుతున్నవాడినై; నళిన+అక్షు= కమలాక్షుడైన శ్రీకృష్ణునియొక్క; సత్+నిధికిన్= సమక్షానికి; అరుగుటయును= వెళ్లటం...

**తా :** పరిశీలించినట్లైతే శ్రీకృష్ణుని దయావీక్షణంవల్లనే నాకు క్రొత్తగా ఈ ఐశ్వర్యాలన్నీ సంప్రాప్తించాయి. ఈ సంపదలను కోరటానికే కదా కుచేలుడనైన నేను ఆ శ్రీహరిసన్నిధికి వెళ్లటం!

**క. నను నా వృత్తాంతంబును, దన మనమునఁ గనియు నేమి దడవక ననుఁ బొ**
**మ్మని యీ సంపద లెల్లను, నొనరఁగ నొడఁగూర్చి నన్ను నొడయనిఁ జేసెన్. 1030**

**ప్రతి :** ననున్= నిఱుపేదవాడనైన నన్ను; నా వృత్తాంతంబును= నేను ద్వారకలోని తనవద్దకు వచ్చిన నా విషయాన్నంతటినీ; కనియున్= తానే తెలుసుకొనికూడా; ఏమి తడవక= (నేను తన వద్దకు వచ్చిన కారణాన్ని) ఏ మాత్రమూ ప్రస్తావింపకుండానే;

ననున్= నన్ను; పొమ్మని= నీ పురానికి వెళ్లమని పలికి; ఈ సంపదలు+ఎల్లను= ఈ యైశ్వర్యాల నన్నింటినీ; ఒనరన్+కన్= తగిన విధంగా; ఒడన్+కూర్చి= సమకూర్చి; నన్నున్= (సామాన్యుడనైన) నన్ను; ఒడయనిన్= (ఈ సంపదలకు) అధిపతినిగా; చేసెన్= చేశాడు.

**తా :** సంపదలను అర్థిస్తూ నేను ఆ శ్రీహరి వద్దకు వెళ్ళాను. ఆ దేవదేవుడు నా సంగతి తెలిసికూడా నన్నేమీ అడుగలేదు. నన్ను వీడ్కొలిపి సాగనంపి, తరువాత నాకు ఈ సంపదలు ప్రసాదించి, నన్ను వీటికి అధీశుణ్ణి చేశాడు. ఆయన ఎంతటి దయామయుడోకదా!

**వ. అట్టి పురుషోత్తముండు భక్తినిష్ఠులైన సజ్జనులు లేశమాత్రం బగుపదార్థంబైన భక్తిపూర్వకంబుగా సమర్పించిన నది కోటిగుణితంబుగాఁ గైకొని మన్నించుటకు నిదియ దృష్టాంతంబు గాదె! మలిన దేహుండును, జీర్ణాంబరుండు నని చిత్తంబున హేయంబుగాఁ బాటింపక నాచే నున్న యడుకు లాదరంబున నారగించి నన్నుం గృతార్థునిం జేయుట యతని నిర్హేతుకదయయ కాదె! యట్టి కారుణ్యసాగరుండైన గోవిందుని చరణారవిందంబులయందుల భక్తి ప్రతిభవంబునఁ గలుగుం గాక! యని యప్పుండరీకాక్షుని యందుల భక్తితాత్పర్యంబునం దగిలి పత్నీసమేతుండై నిఖిలభోగంబులయందు నాసక్తిం బొరయక, రాగాది విరహితుండును నిర్వికారుండునునై యఖిలక్రియలందు ననంతుని యనంతధ్యానసుధారసంబునం జొక్కుచు విగతబంధనుండై యపవర్గప్రాప్తి నొందె; మఱియును. 1031**

**ప్రతి :** అట్టి= అటువంటి దయాపరుడైన; పురుష+ఉత్తముండు= శ్రీకృష్ణుడు; భక్తినిష్ఠులు+ఐన= తనయెడ భక్తిభావం స్థిరంగా కలిగియున్న; సత్+జనులు= సత్పురుషులు; లేశమాత్రంబు+అగు= మిక్కిలి కొంచెమైందగు; పదార్థంబు+ఐనన్= వస్తువైనప్పటికీ; భక్తిపూర్వకంబు+కాన్= భక్తిభావంతో; సమర్పించినన్= చక్కగా అర్పించినట్లైతే; అది= అట్లు భక్తితో సమర్పింపబడిన ఆ కొంచెమైన పదార్థాన్ని కూడా; కోటి గుణితంబు+కాన్= కోటిరెట్లుగా; కైకొని= స్వీకరించి; మన్నించుటకున్= ఆదరించుటకు; ఇది+అ= ఇదే (ఇప్పుడు నాకు సంపదలను అనుగ్రహించిన సంగతియే); దృష్టాంతము+కాదు+ఎ= నిదర్శనం కదా!; మలినదేహుండును= ప్రయాణంవల్ల, చెమటవల్ల మలినమైన శరీరంకలవాడు; జీర్ణ+అంబరుండును= చినిగిన వస్త్రాలు ధరించినవాడు; అని= అనే విషయాన్ని పాటించక; చిత్తంబునన్= తన మనస్సున; హేయంబు+కాన్= నీచంగా (అసహ్యంగా); పాటింపక= తలచక; నాచేన్+ఉన్న= నా వద్ద ఉండిన; అడుకులు= అటుకులను; ఆదరంబునన్= ఆప్యాయతతో; ఆరగించి= భుజించి; నన్నున్= పేదనైన నన్నుసైతం; కృత+అర్థునిన్+చేయుట= నెఱవేరిన కోరిక కలవాడుగా చేయటం; అతని= ఆ వాసుదేవునియొక్క; నిర్+హేతుక= ఎలాంటి కారణంలేనట్టి; దయ+అ+కాదు+ఎ= కృపయే కదా!; అట్టి= అటువంటి; కారుణ్య= దయాగుణానికి; సాగరుండు+ఐన= సముద్రుడైన; గోవిందుని= శ్రీకృష్ణునియొక్క; చరణ+అరవిందంబుల+అందులభక్తి= పాద పద్మాలపైగల భక్తి; ప్రతిభవంబునన్= ప్రతిజన్మలోను; కలుగున్+కాక!= కలుగుతూ ఉండుగాక!; అని= అని ప్రార్థించి; ఆ+పుండరీక+అక్షుని+అందుల= ఆ శ్రీకృష్ణునియందు; భక్తి తాత్పర్యంబునన్+తగిలి= భక్తిభావంతో కూడిన శ్రద్ధతో గూడియుండి; సతీసమేతుండు+ఐ= పత్నితో కూడియున్నవాడై; నిఖిల భోగంబుల+అందున్= (ఇహలోకంలోని) సమస్త సౌఖ్యాలో; ఆసక్తిన్+పొరయక= ఆసక్తిని పొందకుండా; రాగ+ఆది= స్వార్థపూర్వకమైన అనురాగంమొదలైన దోషాలు, దుర్గుణాలు; విరహితుండును= లేనివాడును; నిర్+వికారుండునున్+ఐ= ఏలాటి మానసికాలైన భావాలు లేనివాడినై; అఖిలక్రియల+అందున్= సమస్తకార్యాలను ఆచరించే సమయాల్లోనూ;

అనంతుని= అంతంలేని వానియొక్క (శ్రీకృష్ణునియొక్క); అనంత= అంతులేని; ధ్యాన= చింతించటం (ధ్యానించటం) అనే; సుధారసంబునన్= అమృతరసాన్ని పానంచేయటంద్వారా; చొక్కుచున్= పరవశుడౌతూ; విగతబంధనుండు+ఐ= సమస్త సంసారబంధాలు తొలగించుకొన్నవాడై (ఇహలోకానికి సంబంధించిన సకల బంధనాలన్నీ తొలగినవాడై); అపవర్గప్రాప్తిన్+ఒందెన్= మోక్షాన్ని ప్రాప్తింపజేసికొన్నవాడైనాడు; మఱియును= ఇంకా...

**తా :** అటువంటి దయామయుడైన పురుషోత్తముడు భక్తిభావ తత్పరులైన సత్పురుషులు సమర్పించిన వస్తువు కొంచెమైనా, దాన్ని కోటిరెట్లుగా భావించి, స్వీకరించి, భక్తజనులను ఆదరిస్తా డనటానికి నావృత్తాంతమే నిదర్శనం. మలినమైన నా శరీరాన్నీ, జీర్ణవస్త్రాల్నీ చూచి ఆ శ్రీకృష్ణుడు ఏ మాత్రం ఏవగించుకొనక, నావద్దనుండిన అటుకులను ప్రీతితో భుజించి, నన్ను ధన్యుణ్ణి చేశాడు. ఇలా చెయ్యటంలో అచ్యుతుని నిర్హేతుకవాత్సల్యం వెల్లడౌతున్నది. అంతటి దయాసముద్రుడైన గోవిందుని చరణకమలాలపై పరిపూర్ణమైన భక్తినాకు ప్రతిజన్మలోనూ కలుగుగాక! – అని యీరీతిగా భావించి హరిస్మరణ తత్పరుడై కుచేలుడు తన ధర్మపత్నితో గలసి జీవించాడు. భోగాలయెడల ఆసక్తి లేనివాడై, రాగద్వేషాదిద్వంద్వాలకూ, అరిషడ్వర్గాలకూ అతీతుడై, నిర్వికారుడై, హరిభక్తి సుధారసపానంతో తన్మయుడై, భవబంధాలను పాసి, మోక్షాన్ని పొందినాడు.

**ఆ. దేవదేవుఁ డఖిలభావజ్ఞుఁ డాశ్రిత, వరదుఁ డైన హరికి ధరణిసురులు**
**దైవతములు గాన ధారుణీదివిజుల, కంటె దైవ మొకఁడు గలడె భువిని? 1032**

**ప్రతి :** దేవదేవుడు= దేవతలకందరికీ దేవుడైనవాడు; అఖిలభావజ్ఞుడు= అన్ని భావాలను తెలిసినవాడు (అందరి భావాలనూ తెలిసినవాడు); ఆశ్రితవరదుఁడు= తనను ఆశ్రయించిన వారికి వరాల నొసగేవాడు; ఐన= అయినట్టి; హరికిన్= శ్రీకృష్ణునికి; ధరణిసురులు= బ్రాహ్మణులు; దైవతములు+కానన్= సాక్షాత్తు దైవస్వరూపులు కాబట్టి; భువిని= భూమండలంలో; ధారణీదివిజులకంటెన్= భూసురులకంటే; దైవము+ఒకఁడు= వేఱొక్కడైన దేవుడు; కలఁడు+ఎ?= ఉన్నాడా? (లేదని అభిప్రాయం).

**తా :** దేవదేవుడూ, అఖిలభావవేత్తా, ఆశ్రితవరదుడూ అయిన వాసుదేవునికి బ్రాహ్మణులు దైవస్వరూపులు. అందువల్లనే భూలోకంలో బ్రాహ్మణులకంటే వేఱొకదైవం లేదు.

**విశే :** శ్రీకృష్ణుడు బ్రాహ్మణోత్తములను దైవస్వరూపులుగా ఆదరించే స్వభావంకలవాడు కావుననే, కుచేలునికి అఖండమైన ఐహికాముష్మిక సంపదలను ప్రసాదించినా డని సారాంశం.

## ❖ ఫలశ్రుతి ❖

**క. మురహరుఁ డిట్లు కుచేలుని, చరితార్థునిఁ జేసినట్టి చరితము విను స**
**త్పురుషుల కిహపరసుఖములు, హరిభక్తియు యశముఁ గలుగు నవనీనాథా! 1033**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; మురహరుఁడు= శ్రీకృష్ణుడు; అవనీనాథా!= ఓ పరీక్షిత్ మహారాజా!; కుచేలునిన్= కుచేలుడనే బ్రాహ్మణోత్తముణ్ణి; చరిత+అర్థునిన్+చేసిన+అట్టి= మదిలోని కోరికలు నెరవేరేటట్లుగా చేసిన; చరితము= (పవిత్రమైన) చరిత్రమును; విను= వినేటటువంటి; సత్+పురుషులకున్= సజ్జనులకు; ఇహపరసుఖములు= ఇహలోక సుఖము, పరలోక సుఖము (మోక్షము); హరిభక్తి= శ్రీహరియందలి భక్తి; యశమున్= కీర్తి; కలుగున్= కలుగుతుంది.

**తా :** పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణదేవుడు కుచేలుడనే విప్రపుంగవుణ్ణి చరితార్థుణ్ణి గావించిన పవిత్ర చరిత్రను విన్న సత్పురుషులకు ఇహ, పరసుఖాలూ, హరిభక్తీ, యశస్సూ సంప్రాప్తిస్తాయి.

**విశే :** ఇది కుచేలోపాఖ్యానం చివర చెప్పబడిన ఫలశ్రుతి ఇలాగే, భాగవతంలోని చాలా ఉపాఖ్యానాలకు ఇటువంటి ఫలశ్రుతులు పేర్కొనబడి వుండటం ముఖ్యమైన విశేషం!

## ✤ శ్రీ కృష్ణుండు సకుటుంబముగా గ్రహణ స్నానమునకుఁ బోవుట ✤

**అవతారిక:** దీనికి ముందు జరిగిన కథలో తన బాల్యసఖుడైన కుచేలుణ్ణి శ్రీకృష్ణుడు చిన్ననాటి చెలిమితో ఆదరించి చక్కగా ఉజ్జీవింపజేసిన కథ వినిపించినాడు. విన్నశ్రోత పరీక్షిత్తు. వక్త శుకమహర్షి. అందుకే, భాగవతగాథ అంతా "వేదకల్పవృక్షవిగళితమై శుకముఖసుధాద్రవం"లో తడిసిందని చెప్పబడింది. భక్తిరసార్ద్రత భాగవతజీవధాతువు.

**వ. అనిన మఱియుం బరాశరపౌత్రున కర్జునపౌత్రుం డిట్లనియె. 1034**

**ప్రతిపదార్థం :** పరాశర పౌత్రునకున్= పరాశరుని మనుమనికి, శుకునికి (వ్యాసుడు పరాశరమహర్షి సుతుడు, శుకుడు పరాశరుని మనుమడు); అర్జున పౌత్రుండు= అర్జునుని మనుమడు పరీక్షిత్తు. (అర్జునుని కుమారుడు అభిమన్యుడు, అభిమన్యుని కుమారుడు పరీక్షిత్తు); ఇట్లు= ఈ విధంగా (కథ విన్నాక); అనియెన్= అన్నాడు.

**ఆ. దుష్టశిక్షణంబు దురితసంహరణంబు, శిష్టరక్షణంబుఁ జేయఁ దలఁచి**
**భువిని మనుజుఁ డగుచుఁ బుట్టిన శ్రీకృష్ణ, విమలచరిత మెల్ల విస్తరింపు. 1035**

**ప్రతి :** దుష్ట శిక్షణంబు= దుర్మార్గులైనవారిని శిక్షించడం; దురిత సంహరణంబు= పాపాలను పారదోలడం; శిష్టరక్షణంబున్= మంచివారిని రక్షించడం (అనే ఈ కార్యముల)ను; చేయన్+తలచి= చేయాలని భావించి; మనుజుఁడు+అగుచున్= మానవుడై; భువిని= భూమిపై; పుట్టి అవతారమెత్తిన; శ్రీకృష్ణ= శ్రీకృష్ణుని (విష్ణువు)యొక్క; విమల= పవిత్రమైన, చరితము+ఎల్లన్= చరిత్ర (కథ) అంతా; విస్తరింపు(ము)= వివరించి చెప్పండి.

**తా :** పాపులను శిక్షించి, వారి దుష్టకార్యాలను ముందు తరాలలో ఎవ్వరూ చేయకుండా కట్టడిచేసి, వారిచే బాధితులైన మంచివారికి రక్షణనిచ్చే మహాకార్యాలు చేసే లక్ష్యంతో శ్రీకృష్ణభగవానుడుగా అవతారమెత్తిన విష్ణుకథను విపులంగా చెప్పవయ్యా! అని పరీక్షిత్తు శుకమహర్షిని అడిగినాడు.

**వ. అనిన శుకుం డిట్లనియె. 1036**

**తా :** శుకమహర్షి పరీక్షిత్తు అడిగినదానికి జవాబుగా ఇలా అన్నాడు.

**సీ. ధరణీశ! బలుఁడును సరసిజోదరుఁడు నవోన్నతసుఖలీల నుందునంతఁ**
**జటులోగ్రకల్పాంతసమయమందును బోలె దృగసహ్యమై సముద్దీప్త మగుచు**
**రాజిల్లు సూర్యోపరాగంబు సనుదెంచు టెఱిఁగి భూజను లెల్ల వరుసఁ గదలి**
**మును జమదగ్నిరాముఁడు పూని ముయ్యేడు మాఱులు ఘనబలోదారుఁ డగుచు**

**తే. నిజభుజాదండమండితనిబిడనిశిత, చటుల దంభోళిరుచిరభాస్వత్కుఠార**
**మహితధారావినిర్భిన్నమనుజపాల, దేహనిర్ముక్తరుధిరప్రవాహములను. 1037**

**ప్రతి :** ధరణి+ఈశ!= ఓ భూపతీ (పరీక్షిన్మహారాజా)!; బలుఁడును= బలరాముడును, సరసిజ+ఉదరుఁడు= సరస్సునందు పుట్టింది కమలం, అది కడుపునందు కలవాడు (పద్మగర్భుడు) ఉదరనాభినుండి పుట్టిన పద్మంగలవాడు (బొడ్డుతమ్మిగలవాడు) విష్ణువు (ఆ శక్తితో అవతరించిన)= శ్రీకృష్ణుడు; నవ+ఉన్నత-సుఖ-లీలన్= కొత్తదైన, గొప్పదైన, దివ్యమైన క్రీడలతో; ఉండు+అంతన్= ఉన్నసమయంలో, (కాలం గడుపుతుండగా); చటుల+ఉగ్ర= చలిస్తూ భీకరమైన; కల్ప+అంత, సమయము+అందును+పోలెన్= యుగసమాప్తి వేళలోవలె; దృక్+అసహ్యము+ఐ= కంటికి (చూచుటకు) భరించరానిదై; సముద్దీప్తము+అగుచున్= విశేషంగా వెలుగులీనుతూ; రాజిల్లు= ప్రకాశించే; సూర్య= సూర్యునియొక్క; ఉపరాగంబు+చనుదెంచుట= గ్రహణం (రాహువు సూర్యగ్రహాన్నో చంద్రగ్రహాన్నో పట్టడాన్నే 'ఉపరాగము' అంటారు. దాన్నే "గ్రహణం" అనీ 'గ్రహకల్లోలం' అని కూడా అంటారు); ఎఱిఁగి= తెలుసుకొని, (జ్యోతిషశాస్త్రం తెలిసిన పండితులు గ్రహగతులు లెక్కించి ముందుగానే సూర్యగ్రహణం చెప్పగా తెలుసుకొని); భూజనులు+ఎల్లన్= ప్రజలంతా; వరుసన్+కదలి= గుంపులు గుంపులుగా తమ గ్రామాలను విడిచి, ప్రయాణించి; ముని= పూర్వం; జమదగ్నిరాముఁడు= జమదగ్ని కుమారుడైన పరశురాముడు; పూని= ప్రయత్న (ఉద్దేశ) పూర్వకంగా; మూడు+ఏడు+మారులు= ఇరువదిఒక్కసార్లు; ఘన-బల-ఉదారుఁడు+అగుచున్= మిక్కిలి బలంచేత అతిశయించినవాడై; నిజ= తనయొక్క; భుజాదండ= దండంవంటి చేతిలో; మండిత= ప్రకాశించే; నిబిడ= దట్టమైన, కఠినమైన; నిశిత= మిక్కిలి వాడియైన; చటుల= చలించే; దంభోళి-రుచిర= వజ్రాయుధపు కాంతివలె; భాస్వత్+కుఠార= ప్రకాశించే గండ్రగొడ్డలియొక్క; మహిత= గొప్పదైన; ధారా= అంచుచేత; వినిర్భిన్న= విశేషంగా ఛేదించబడిన; మనుజపాల= రాజులయొక్క; దేహ-నిర్ముక్త= శరీరాలనుండి బయటకువెడలిన, రుధిర ప్రవాహములను= రక్తపుటేర్లను...

**తా :** కుచేలుణ్ణి సత్కరించిన ఘట్టం తరువాత - కొంతకాలం గడిచింది. బలరామకృష్ణులు సుఖంగా కాలం గడుపుతున్నారు. జగత్ప్రళయకాలంలో వలె కన్నులు భరించలేనంత దేదీప్యమానంగా వెలుగుతున్న సూర్యబింబానికి గ్రహణంపడుతోందని తెలిసి, ప్రజలు పూర్వం జమదగ్ని మహర్షి కుమారుడైన పరశురాముడు మహాక్రోధంతో తన తండ్రిమృతికి కారణమైన రాజలోకాన్ని తన పదునైనగండ్రగొడ్డలి అంచుతో ఇరవై ఒక్కసార్లు తలలు నరికి, వారిరక్తధారల ప్రవాహాలతో (నిండిన ఐదు మడుగుల శ్యమంతకమనే పవిత్ర సరోవరాలున్న చోటికి కదలివెళ్లారు.)

**విశే :** సూర్యగ్రహణాన్ని సూర్యోపరాగమనీ, చంద్రగ్రహణాన్ని చంద్రోపరాగమనీ అంటారు. ఉపరాగమంటే గ్రహణం.

**తే. ఏనుమడువులు గావించె నెచటనేని, నట్టి పావనసుక్షేత్రమగు శ్యమంత**
**పంచకంబున కపుడు సంభ్రమముతోడఁ, జనిరి బలకృష్ణులును సంతసం బెలర్ప. 1038**

**ప్రతి :** ఎచ్చటన్+ఏనిన్= ఎక్కడనైతే; ఏను= ఐదు; మడువులు= మడుగులు; సరోవరములు లేదా గుంటలు; కావించెన్= చేసెనో, అట్టి, పావన సు+క్షేత్రము+అగు= పవిత్రమూ, శ్రేష్ఠమైన స్థలమూ అయిన; శ్యమంతక+పంచకంబునకున్= శ్యమంతకమనే పేరుగల ఐదుచెరువులకు; అపుడు= ఆ వేళ, ప్రజలంతా బయలుదేరుతుండగా; సంతసంబు+ఎలర్పన్= సంతోషము ప్రకటితమవుతుండగా; సంభ్రమముతోడన్= సంబరముగా; బల, కృష్ణులును= బలరామ, శ్రీకృష్ణులుసైతము; చనిరి= వెళ్లారు.

**తా :** పరశురాముడు ఇరువదొక్కమార్లు చంపిన రాజుల రక్తధారలతో శ్యమంతక పంచకమనే పేర ఐదుచెరువులను సృష్టించినాడు. అక్కడికి ద్వారకా ప్రజలు, ఆపై బలరామకృష్ణులుకూడా స్నాన, దానాదికాలకోసం సూర్యగ్రహణ సమయానికి అక్కడికి బయల్దేరినారు.

**వ. ఇట్లు నిష్కర్ములైన రామకృష్ణులు లోకధర్మానుపాలన ప్రవర్తనులై ద్వారకానగరరక్షణంబునకుం బ్రద్యుమ్న గద సాంబ సుచంద్ర శుక సారణానిరుద్ధ కృతవర్మాది యోధవరుల నియమించి, తాము నక్రూరవసుదేవోగ్రసేనాది సకలయాదవులుం గాంతాసమేతులై స్రక్చందనాభరణవస్త్రాదులు ధరియించి, శోభనాకారంబుల తోడం బుష్పక విమానంబు లనం బొలుచు నరదంబులను, మేఘంబుల ననుకరించు గజంబులను, మనోవేగంబులైన తురగంబుల నెక్కి, వియచ్చరులం బురుడించుపురుషులు దమ్ము సేవింపం జని యప్పుణ్యతీర్థంబుల నవగాహనంబు సేసి యుపవసించి యనంతరంబ. 1039**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; నిష్కర్మ= కర్మలులేనివారైన; రామకృష్ణులు= బలరాముడును, శ్రీకృష్ణుడును, లోకధర్మ+అనుపాలన= లోకంలోని ఆచరించదగిన ధర్మాన్ని, అనుసరించి పాలించే (ఆచరించు); ప్రవర్తనులై= నడతకలవారై; ద్వారకానగర, రక్షణంబునకున్= రాజధానియైన ద్వారకపట్టణాన్ని, రక్షించుటకు; ప్రద్యుమ్నుడు; గదుడు; సాంబుడు; సుచంద్రుడు; శుకుడు; సారణుడు; అనిరుద్ధుడు; కృతవర్మ+ఆది= కృతవర్మ మొదలైన శూర శ్రేష్ఠులను; నియమించి= నియమించి (రక్షణ భారానికై ఆజ్ఞాపించి); తామున్= తామిద్దరు సోదరులును, అక్రూర, వసుదేవ; ఉగ్రసేన+ఆది, సకలయాదవులున్= అక్రూరుడు, వసుదేవుడు, ఉగ్రసేనుడు మొదలైన వంశంలోని వృద్ధుల్ని, ఇతర యాదవుల్ని; కాంతా సమేతులై= భార్యలు, ఇతర స్త్రీలతోబాటుగా, స్రక్+చందన+ఆభరణ, వస్త్ర+ఆదులు= పూలమాలలు, గంధపు పూతలు, నగలు, దుస్తులు మొ॥ ధరియించి= అలంకరించుకొని; శోభన+ఆకారంబులతోడన్= శోభించేలా అందమైన రూపాలతో; పుష్పక విమానంబులు+అనన్+పొలుచున్= ప్రసిద్ధమైన పుష్పక విమానములా ఇవి అని పోల్చుకునేలా ఉన్న; అరదంబులను= రథంబులను; మేఘంబులన్ అనుకరించు గజంబులను= మేఘాలవలె ఉన్నట్టి ఏనుగులను; మనస్+వేగంబులు+ఐన= మనసుతో పోటీపడే పరుగుగల; తురగంబులన్+ఎక్కి= గుఱ్ఱాలను ఎక్కి; వియత్+చరులన్+పురుడించు= ఆకాశంలో సంచరించే దేవతల్ని అనుకరిస్తూ; పురుషులు= ఇతర పురుషులు, తమ్ము; సేవింపన్= తమను కొలుస్తూ ఉంటే; చని= వెళ్ళి; ఆ+పుణ్య తీర్థంబులన్= ఆ పవిత్రమైన జలాశయాల్లో; అవగాహనంబు+చేసి= స్నానం చేసి; ఉపవసించి= ఉపవాస దీక్షతో (నిరాహారిగా) ఉండి, అనంతరంబ= తరువాత...

**తా :** కర్మలను ఆచరించవలసిన అవసరంలేనప్పటికీ, లోకాచారాన్ని అనుసరించి, గ్రహణవేళస్నానాదిధర్మకర్మలను ఆచరించదలచి, ద్వారకా నగర రక్షణకు ప్రద్యుమ్నాదియువకులైన యోధులను నియమించి, వృద్ధులైన వసుదేవాదులతో, మిగిలిన పరివారంతో, స్త్రీజనంతో గంధమాల్యాభరణాదులు ధరించి, అందమైన అలంకరణలతో, పుష్పకాలవంటి రథాల్ని, మేఘాలవంటి ఏనుగుల్ని, శ్రేష్ఠమైన గుఱ్ఱాల్ని ఎక్కి సేవకజనం వెంటరాగా, సూర్యగ్రహణవేళ పవిత్రమైన సరోవరాల్లో స్నానంచేసి, ఉపవాస దీక్షతో ఉండినారు. ఆ తరువాత

**విశే :** (1) పుణ్యకార్యాచరణం సంస్కారబలాన్ని పెంచి, మనస్సును పాప సంకల్పాలనుంచి దూరం చేస్తుంది. అవతారపురుషులైన బలరామ, శ్రీకృష్ణులకు సామాన్య మానవులకువలె పుణ్యకర్మలు ఆచరించవలసిన పనిలేదు కనుక వారు నిష్కర్ములని సూచించబడింది. కాని, వారు ఇపుడు సాధారణప్రభువులవలెనే ఉన్నారు కనుక లోకాచారాలైన ధర్మాచరణం చేయవలసి

ఉంది. "యథా రాజా తథా ప్రజాః" అన్నట్లుగా రాజులు ప్రజలందరికీ ఆదర్శప్రాయులు. కనుక, సామాన్య ప్రజలకు ఈ పుణ్యకార్యాల పట్ల ఆసక్తి కలిగించడానికి, ప్రేరణగా బలరామకృష్ణులు ఆచరించారని భావించవచ్చు. అందుకే, సూర్యగ్రహణపవిత్రసమయంలో స్నానదానాదిధర్మకర్మాచరణానికై పవిత్ర తీర్థస్నానాలకు వెళ్లడం.

(2) ఒక జాతిలోని సంఘటిత శక్తిని ప్రచోదనం చేయడానికి ఇలాంటి సత్కార్యాచరణాలు, సదాచారాలు దోహదం చేస్తాయి. ఈ సామాజిక ప్రయోజనాన్ని కూడా రాజులు భావించి ప్రోత్సహించారు.

(3) ప్రవాహవేగం గల నది / తరంగాలలో స్నానంచేయడం ఆరోగ్యానికి దోహదం చేస్తుందని ఆయుర్వేదం తెలియజేస్తుంది.

(4) ప్రభువులు రాజధాని విడిచివెళ్లుతున్నారు కాబట్టి, ద్వారకారక్షణానికై యోధులను, యువకులను నియోగించినారు. వృద్ధులకు ధర్మాచరణం ఆవశ్యకం కనుక వసుదేవుడు, ఉగ్రసేనుడు మొ॥ వారు వెంబడి వచ్చినారు. ధర్మకార్యాచరణానికి పత్నీసమేతంగా వెళ్లాలి కనుక, స్త్రీ జనాన్ని తీసుకొనిపోయారు.

**క. భూసురవరులకు ననుపమ, వాసోఽలంకారధేనువసురత్నధరి**
**త్రీ సుమహితవస్తువు లు, ల్లాసంబున దాన మిచ్చి లాలితు లగుచున్. 1040**

**ప్రతి :** అనుపమ= సాటిలేని (ఉపమించలేని); వాసస్+అలంకార= వస్త్రాలూ, అలంకార ద్రవ్యాలూ; ధేను, వసు, రత్న= గోవులు, బంగారము, రత్నములు, ధరిత్రీ= భూమి (దానము), సుమహిత= మిక్కిలి గొప్పవైన; వస్తువులు= దానయోగ్యమైన సంభారాలు (ధాన్యాదులు); భూసుర – వరులకున్= బ్రాహ్మణ శ్రేష్ఠులకు; ఉల్లాసంబునన్= సంతోషంగా; దానము+ఇచ్చి= దానాలుచేసి; లాలితులు+అగుచున్= సంతోషింపబడినవారు కాగా...

**తా :** సాటిలేని దుస్తులు, ఆభరణాలు, గోవులు, బంగారు, రత్నాలు, భూమి మున్నగు విలువైన వస్తువులను యోగ్యులైన బ్రాహ్మణులకు దానముచేసి, వారిచే సంతోషపెట్టబడినవాళ్లై

**విశే :** దానంవల్ల అహంకార, మమకారాలు లేని మానసిక స్థితి ఏర్పడుతుందని, ప్రజల్లో త్యాగగుణం పెంపొందుతుందని పెద్దలు చెప్పారు.

**క. పునరవగాహనములు పెం, పొనరం గావించి బంధుయుక్తముగా భో**
**జన కృత్యంబులు దీర్చి స, దనురాగము లుల్లసిల్ల నచ్చోటఁ దగన్. 1041**

**ప్రతి :** పెంపు+ఒనరన్= వృద్ధి కలిగేలా; (ఉత్సాహంగా); పునః అవగాహనములు= తిరిగి స్నానాలు; కావించి= చేసి; బంధుయుక్తముగా= బంధువులతో కలిసి, భోజన కృత్యంబులు= విందు ఆరగించడం (వంటలు, తిండ్లు, తాంబూల సేవనాదులు); తీర్చి= పూర్తిచేసి; సత్+అనురాగములు= చక్కగా ఆత్మీయతలు; ఉల్లసిల్లన్= వెల్లివిరిసేలా; ఆ+చోటన్= ఆ జలాశయ తీరప్రాంతాల్లో; తగన్= యోగ్యంగా...

**తా :** గ్రహణం విడిచాక మోక్షణస్నానాలు ఉత్సాహంగా చేసి, అంతవరకు ఉపవసించినారుకనుక భోజనాదులు, బంధువులందరితో ఆత్మీయతలు వికసించేలా పరస్పరప్రేమలతో గావించి, ఆ ప్రదేశంలో చక్కగా

**విశే :** సూర్యచంద్ర గ్రహణాలకు కొన్నిగంటలముందే ఉపవాసదీక్ష. గ్రహణవేళ స్నానం మోక్షణవేళవరకు దాన, జప, తపాదులతో గడిపి, మోక్షణ స్నానానంతరం వంటలు ప్రారంభం - ఇది శాస్త్రసమ్మతవిధి. ఈ విధిని రామకృష్ణులు ఆచరించారు.

నదీ తీరంలో బంధుమిత్రులతో సూర్యగ్రహణ మోక్షణ స్నానానంతరం వంటలు వండుకొని సామూహికంగా భోజనాదులు చేయడంలో అనురాగం వెల్లి విరిసిందని పోతన వివరించాడు. ప్రజలలో సామరస్యం, సంఘటితభావం పెంపొందటానికి ఇలాంటి విధానాలు సహకరిస్తాయి.

**క. ఘనశాఖాకీర్ణములై, యినరశ్మలు దూఱనీక యెసకం బెసఁగన్**
**ననిచిన పొన్నల నీడల, ననిచిన వేడుకల నందనందనముఖ్యుల్. 1042**

**ప్రతి :** ఘన - శాఖా+ఆకీర్ణములు+ఐ= గొప్పనైన కొమ్మలచే, వ్యాపించినవై; ఇన= సూర్యుని; రశ్మి+లు (రశ్మలు)= కిరణములు; దూఱనీక= లోపలికి ప్రవేశించడానికి వీలులేనంతగా; ఎసకంబు+ఎసగన్= అతిశయించనవై; ననిచిన= వికసించిన (విస్తరించిన); పొన్నల= పొన్నచెట్ల; నీడల= ఛాయలలో; ననిచిన వేడుకలన్= అతిశయించిన సంబరాలతో; నంద నందన-ముఖ్యులు= నందుని కుమారుడైన కృష్ణుడు మొదలైనవారు...

**తా :** పొన్నచెట్లు బాగా కొమ్మలు, రెమ్మలతో విస్తరించుటచేత సూర్యకిరణాలు చొరలేనంత దట్టమైన ఆ అటవీ భూములలో విశ్రమించిన శ్రీకృష్ణుడు, అతని పరివారం

**క. తనరిన పల్లవ రుచిరా, సనముల నాసీను లగుచు సత్సుఖగోష్ఠిం**
**బెనుపొందఁగ నట వసియిం, చినచోఁ దత్పుణ్యతీర్థసేవారతులై. 1043**

**ప్రతి :** తనరిన= (సహజంగా) ఒప్పుతున్న; పల్లవ= చిగురుటాకులచే; రుచిర= మనోహరమైన; ఆసనములనున్= గద్దెలపై; ఆసీనులు+అగుచు= కూర్చున్నవారై; సత్+సుఖగోష్ఠిన్, సత్= శ్రేష్ఠమైన, లేదా సత్పురుషులతో; సుఖ= ఆనందకరమైన; గోష్ఠిన్= కబుర్లతో, చర్చలతో; పెనుపు+ఒందగన్= అతిశయించగా (పెనుపు= అభివృద్ధి కనుక తమ మనస్సులు సత్పురుషులతో గోష్ఠులవల్ల మరింత వికసించగా); అట= ఆ శ్యమంతక స్థలమందు, వసియించిన; చోన్= ఉన్నస్థలమందు లేదా ప్రాంతమందు; తత్+పుణ్య-తీర్థ-సేవారతులై= ఆ పుణ్య జలాశయాల సేవించడానికి ఇష్టపడుతున్నవారై...

**తా :** చిగురాకుల ఆసనాలపై సద్గోష్ఠులతో మనసులు ఆనందం పొందుతుండగ, ఆ శ్యమంతక సరోవరాలలో మరికొన్నిసార్లు స్నానంచేయడానికి ఆసక్తికలవారై

**విశే :** రాజులైనా, ప్రస్తుతం ప్రకృతి ఒడిలో ఉన్నారు కనుక చిగురుటాకులసెజ్జలే! సత్పురుషులు చుట్టూ ఉన్నారు గనుక సద్గోష్ఠులే! రాచకార్యాలు, మంత్రాంగాలకు దూరమైనచోటు. స్థలం, సమయం ఆధ్యాత్మిక వాతావరణం కనుక మనసు గోష్ఠిలో ఉల్లాసం పొందుతున్నది. జలాశయ పంచకం అతిశ్రేష్ఠమైందికనుక కేవల గ్రహణ స్నానంచేసి, తిరుగు ప్రయాణానికి బదులు 'తీర్థసేవారతి' అనగా మరింత సేవించే అభిలాష. పుణ్యనదీజలాలకు తీర్థాలని, పుణ్యప్రదేశాలకు క్షేత్రాలని స్థూలవ్యవహారం. జలస్థలాలన్న అర్థాలుగల ఈ పదాలకు అర్థవిశేషత స్థిరమైనది. గోవులుండే ప్రదేశం గోష్ఠం. పవిత్రమైనచోటు. సత్పురుషులుండునది అలాంటిదే. వారుచేసే చర్యలవల్ల ఆ స్థలం (గోష్ఠము) 'గోష్ఠి' అన్న అర్థం పొందింది. గొడవలుపడే చోటులు గోష్ఠులు కాజాలవు.

**వ. మున్న చనుదెంచి యున్న మత్స్యౌశీనరకోసలవిదర్భకురుసృంజయకాంభోజకేకయ మద్రకుంత్యారట్టకేర లాదిభూపతులును, మఱియుం దక్కినరాజవరులును, హితులును, నందగోపాది గోపాలురును, గోపికాజనంబులును, ధర్మరాజానుగతులై వచ్చిన భీష్మద్రోణధృతరాష్ట్రగాంధారీకుంతీ పాండవతద్దారనివహ సంజయవిదురకృపకుంతిభోజవిరాటభీష్మకనగ్నజిద్ద్రుపదశైబ్యధృష్టకేతు కాశిరాజదమఘోష విశాలాక్ష మైథిల యుధామన్యు సుశర్మలును, సపుత్రకుండైన బాహ్లికుండును మొదలుగా ననేకులు నుగ్రసేనాదియాదవ ప్రకరంబులం బూజలం దృప్తులం జేసిన వారునుం బ్రముదితాత్ములై; రయ్యెడ. 1044**

**ప్రతి :** మున్ను+అ= ఇంతకుముందే; చనుదెంచి+ఉన్న= వచ్చి ఉన్నట్టి; మత్స్య, ఔశీనర, కోసల, విదర్భ, కురు, సృంజయ, కాంభోజ, కేకయ, మంద్ర, కుంతి, ఆరట్ట, కేరళ+ఆది= కేరళ దేశాలకు చెందిన; భూపతులు= ఆయా దేశముల రాజులు; మరియున్= ఇంకా; తక్కిన రాజవరులును= పైన పేర్కొనబడని రాజశ్రేష్ఠులను, హితులును= మేలుకోరేవారును; నందగోప+ఆది గోపాలురును= నందగోపుడు మొదలుగాగల గోపాలకులు (యాదవులు); గోపికాజనంబులును= గోపికలూ; ధర్మరాజ+అనుగతులు+ఐ= ధర్మరాజును అనుసరించినవారై; వచ్చిన= వచ్చినట్టు; భీష్మ, ద్రోణ, ధృతరాష్ట్రులు, గాంధారి, కుంతీ (దేవులు); పాండవ= పాండవులు, తద్దారనివహ= వారివారిభార్యల (స్త్రీజనుల) గుంపులు, సంజయ, విదుర, కృప, కుంతిభోజ, విరాట, భీష్మక, నగ్నజిత్, ద్రుపద, శైబ్య, దృష్టకేతు, కాశిరాజ, దమఘోష, విశాలాక్ష, మైథిల, యుధామన్యు, సుశర్మలును; సపుత్రకుండైన బాహ్లికుండును= పుత్రులతో కూడిన బాహ్లికుడు; మొదలుగాగల అనేకులు= పేర్లు చెప్పలేనంతమంది, వచ్చి; ఉగ్రసేన+ఆది= ఉగ్రసేనుడు మొదలుగాగల; యాదవ ప్రకరంబులన్= (వృద్ధ) యాదవ సమూహాలను; పూజలన్+తృప్తులన్+చేసినన్= పూజలతో గౌరవించగా; వారును= కృష్ణుని పక్షంవారుకూడా; ప్రముదిత+ఆత్ములైరి= సంతోషించిన మనసులు కలవారైనారు; ఆ+ఎడ= ఆ సమయంలో...

**తా :** ద్వారకనుండి శ్రీకృష్ణాదులు వచ్చినట్టే, వివిధ దేశాలనుండి రాజులు వచ్చినారు. ధర్మరాజు, ఆయనతో తక్కిన పాండవులు, ఆయనను అనుసరించి వచ్చిన భీష్మ, ద్రోణ, ధృతరాష్ట్రులు, గాంధారి, కుంతి, కురు-దేశాల రాజులూ, వారి వారి భార్యలు సంజయుడు మొదలైన ధృతరాష్ట్రానుచరులు, బంధువులైన కుంతిభోజ, విరాట, భీష్మకాదిరాజులు వచ్చారు. యాదవ వంశంలోని వృద్ధులైన ఉగ్రసేనాదులను పూజించి గౌరవించారు. ఉభయులు సంతుష్టులైనారు. అప్పుడు

**విశే :** వచ్చినవారంతా వృద్ధులు, స్త్రీలు, ఏకాగ్రమైన పట్టుదలతో పుణ్యకార్యాలు చేసేవాళ్లు, శారీరక శ్రమకోర్చి సుదూర శ్యమంతక తీర్థానికి వచ్చారు. ఉత్తములు కనుక వృద్ధులకు పూజలు చేశారు. ఇందరు రాజులు వచ్చినా, దుర్యోధనాదులు, వారిని అనుసరించి వచ్చినవారు లేరు. వారికి పుణ్యమైన పనులను కలిసివచ్చేట్లు చేయడంగాని, ధర్మంపట్ల ఆసక్తిగాని లేదు. అందుకే వారి ప్రస్తావన లేదు. పై వచనంలో స్త్రీజనాన్ని మాటిమాటికి చెప్పటంచేత పుణ్యకార్యాలందు వారికి అభిరుచి అతిశయమని, ఇది నాటికి నేటికి ఒకే తీరుగా ఉన్నదని గమనించాలి. పురుషులకన్న, స్త్రీలకు ధర్మకార్యాలు చేయడంలో ఆసక్తి తొలినాళ్లనుండి అధికమే! సహజమే!

**క. ఆ రాజులు గాంచిరి నిజ, నారీయుతు లగుచు నంగనాపరివారున్**
**ధీరున్ దానవకుల సం, హారున్ గోపీమనోవిహారు నుదారున్. 1045**

**ప్రతి :** ఆ రాజులు= పైన పేర్కొనబడినవారు; నిజ - నారీ - యువతులు+అగుచున్= తమభార్యలు వెంబడిరాగా; ఉదారున్= ఉదారమైన (విశాలమైన) హృదయంకలవాడైన; గోపీమనోవిహారున్= గోపికల మనసులలో విహరించేవాడైన;

ధీరున్= ధైర్యవంతుడైన; దానవకుల సంహారున్= రాక్షసజాతిని సంహరించేవాడైన శ్రీకృష్ణుని; అంగనాపరివారున్= స్త్రీలు, భార్యలు, తక్కిన పరివారంగలవానిని; కాంచిరి= దర్శించుకొన్నారు.

**తా :** వచ్చిన రాజులంతా భార్యాసమేతులై ధైర్యవంతుడు, దానవసంహారి, గోపీజనవల్లభుడు, పరివారసహితుడైన శ్రీకృష్ణుని దర్శనం చేసికొన్నారు.

**విశే :** పూర్ణపురుషుడు, అవతారమూర్తి, రాక్షససంహారకుడైన శ్రీకృష్ణభగవానునిదర్శనం భార్యాసమేతులై వచ్చి దర్శించుకొన్న రాజులకు సూర్యగ్రహణ పవిత్ర సమయాన మరింత పుణ్యప్రదం. కానీ కేవలం ద్వారకకురాజుగా ఇతర రాజులు సందర్శించినట్టుగాక, భార్యాసమేతులై ఒక పుణ్యకార్యంగా దర్శించుకొన్నారని సూచన.

**వ. కని య మ్మాధవబలదేవులు సేయు సముచితపూజావిధానంబులం బరితృప్తులై, య మ్ముకుంద సాన్నిధ్యంబు గలిగి, తదీయసంపద్విభవాభిరాములై విలసిల్లుచున్న యుగ్రసేనాది యదు వృష్ణి పుంగవులం జూచి, వారలతోడ నా రాజవరులు మాధవుండు విన నిట్లనిరి. 1046**

**ప్రతి :** కని= దర్శించుకొని; ఆ+మాధవ, బలదేవులు= ఆ బలరామకృష్ణులు; చేయు= చేసే; సమ్+ఉచిత – పూజా – విధానంబులన్= వారివారి ఆభిజాత్యాలను బట్టి ఉచిత రీతిగా చేసిన ప్రతిపూజలతో; పరితృప్తులై= మిక్కిలి సంతోషించినవారై; ఆ+ముకుందు= అట్టి శ్రీకృష్ణునియొక్క; సాన్నిధ్యము= సాహచర్యం (దగ్గరలో ఉండుట – సత్+నిధి= శ్రేష్ఠమైన ఉనికి= సన్నిధి, దీని తద్ధితాంతరూపం సాన్నిధ్యం= దగ్గరితనం); కలిగి= పొంది; తదీయ= ఆయనచే అనుగ్రహింపబడిన; సంపత్+విభవ+అభిరాములు+ఐ= సంపదలు (ధనాదులు); విభవ= వైభవాలు (అధికారాదులు) పొంది; అతిశయిస్తున్నవారై; విలసిల్లుచున్న= జీవిస్తున్న (వికాసం పొందుతున్న); ఉగ్రసేన+ఆది= ఉగ్రసేనుడు, వసుదేవుడు మొదలుగాగల, యదువృష్ణి పుంగవులన్= యదు, వృష్ణి వంశీకులైన ఆ శ్రేష్ఠులను; చూచి= దర్శించి; వారలతోడన్= వారిని సంబోధిస్తూ; ఆ రాజవరులు= శ్రేష్ఠులైన ఆ రాజులు; మాధవుండు+వినన్= మాధవుడు (విష్ణువు) ఐన శ్రీకృష్ణుడు, వింటూ ఉండగా; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** ఆ శ్రేష్ఠులైన రాజులు బలరామకృష్ణులచే ఉచితమైన గౌరవాలు పొంది, శ్రీకృష్ణుని సన్నిధివల్ల తృప్తులై, వారి దయచేత సంపదలు, వైభవాలు పొందిన ఉగ్రసేనాదులతో కృష్ణుడు వింటుండగా ఇలా అన్నారు.

**మ. మన శాస్త్రంబులు వాక్కులున్ మనములున్ మాంగల్యముం బొంది పా**
**వనమై యొప్పెడి నే రమా విభుని భాస్వత్పాదపంకేజ సే**
**చన తోయంబుల నే మహాత్ముని పదాబ్జాతంబు లెందేని సోఁ**
**కినచోటెల్లను ముక్తి హేతు వగు, నీ కృష్ణుండె పో! చూడఁగన్. 1047**

**ప్రతి :** ఏ రమావిభుని= లక్ష్మీదేవి భర్తయైన ఏ విష్ణుని; భాస్వత్= ప్రకాశించే; పాదపంకేజ= (పంకేజమనగా బురదలో పుట్టినది కమలము) కమలములవంటి పాదములు; సేచన= కడుగుటవల్ల కలిగిన; తోయంబులను= జలములతో ; మన శాస్త్రంబులు= మన ఆచరణవిధులు (కర్మలు); మన వాక్కులు= మన మాటలు; మన మనములున్= మన మనస్సులు (త్రికరణములు); మాంగల్యమున్+పొంది= మంగళత్వాన్ని (శుభమును)పొంది; పావనమై+ఒప్పెడినిన్= పవిత్రమై అలరారునో; ఏ మహా+ఆత్ముని= ఏ పరమాత్ముని; పద+అప్+జాతంబులు= కమలములు (అప్= నీరు, జాతము=

పుట్టినది, కమలమని వ్యుత్పత్తి) కమలాలవంటి పాదములు, ఎందేనిన్= ఎక్కడనైనా; సోకిన= తగిలిన (మోపిన); చోటు+ ఎల్లన్= స్థలము అంతా; ముక్తిహేతువు+అగున్= మోక్షానికి కారణం అగునో, ఆతడు, చూడన్+కన్= పరిశీలించగా; ఈ కృష్ణుండు+ఎ= ఈ కృష్ణుడే; పో= సుమా!

**తా :** మన శాస్త్రాలు నిరూపించిన ఆచరణ విధులు, ఏ లక్ష్మీవల్లభుని పాదప్రక్షాళిత జలం మనవల్ల త్రికరణాలు పావనమవుతాయో, ఏ మహాత్ముని పాదాలు సోకిన మాత్రాన ఆ ప్రాంతం ముక్తిప్రదం అవుతుందో ఆ పుణ్యపురుషుడు ఈ కృష్ణుడే సుమా!

**విశే :** (1) సమకాలీనులైన రాజన్యులంతా శ్రీకృష్ణుని పరమాత్మగా భావించినారు. భగవంతుడు గోకులంలో పుట్టి, పెరిగి, తమలో ఒకడుగా జీవించడంవలన ఆత్మీయుడుగా భావిస్తున్న వారికి, ఈ మాటలు కృష్ణుణ్ణి మహిమాన్వితునిగా వివరిస్తున్నాయి. తమవాడని భావించడంవల్ల శ్రీకృష్ణుని దివ్యత్వాన్ని గుర్తించలేకపోయిన వీరికి ఉద్ధవాదుల బోధలు అవసరమయ్యాయి.

**చ. సనక సనందనాది మునిసత్తము లంచితయోగదృష్టిచేఁ**
**బనివడి యాత్మలన్ వెదకి పట్ట నగోచరమైనమూర్తి యి**
**ట్లనవరతంబు మాంసనయనాంచలగోచరుఁ డయ్యెనట్టె! యే**
**మన నగు? వీరిపుణ్యమున కాదట నెట్టితపంబు సేసిరో? 1048**

**ప్రతి :** సనక సనందన+ఆది= సనకుడు, సనందనుడు, మొదలైన; మునిసత్తములు= మునిశ్రేష్ఠులు; అంచిత= తగిన; యోగదృష్టిచే= పరమాత్మలో లయించే యోగముచే చూస్తూ; పనివడి= పనిగట్టుకొని; ఆత్మలన్= సర్వఆత్మలలో, పరమాత్మ, ఎక్కడకలడో అని; వెదకి పట్టన్= వెతుకుతూ, కనుగొన యత్నించినా; అగోచరమైన= కనపడనట్టి; మూర్తి= స్వరూపమైనవాడు, ఈ గోపకులకున్; ఇట్లు+అనవరతంబు= ఈ విధంగా ఎల్లవేళల; మాంసనయన+అంచల= చర్మచక్షువులకు; గోచరుడు= కనబడుతున్నవాడు; అయ్యెను+అట్టె= ఐనాడు కదా! ఏమి+అననగున్= ఏమి చెప్పాలి! వీరి పుణ్యమున కాద+అట= ఈ గోపకుల పుణ్యవశంచేతనే కదాట! అలాగా (వీరు) ఎట్టి తపంబు+చేసిరో! ఎంతగొప్ప తపస్సు చేశారో కదా!

**తా :** సనకసనందనాది గొప్ప మునులే యోగదృష్టితో భగవంతుణ్ణి దర్శించలేక సకలఆత్మలందు వెతికి, దొరకక ప్రయత్నిస్తున్నారు కదా! ఈ గోపకులు ఏమి తపస్సు చేశారో కాని, యోగమక్కరలేక, భౌతిక శరీరాలతో, చర్మ చక్షువులతో హరిని నిరంతరం చూడగలిగే భాగ్యవంతులయ్యారే! వీరి తపస్సు ఎంత గొప్పదో కదా!

**మ. నిరయస్వర్గము లాత్మఁ గైకొనక తా నిర్వాణమూర్తైన యీ**
**హరిఁ జూడన్, హరితోడఁ బల్క, హరిమే నంటన్, హరిం బాడఁగా**
**హరితో నేఁగ , సహాసనాస్తరణశయ్యావాసులై యుండఁగన్**
**హరి బంధుత్వసఖిత్వముల్ గలుగు భాగ్యం బెట్లు సిద్ధించెనో? 1049**

**ప్రతి :** నిరయస్వర్గములు= నరక స్వర్గలోకములు; ఆత్మన్= మనస్సునందు; కైకొనక= స్వీకరించక; తాన్= తాను; నిర్వాణమూర్తి+ఐన= ముక్తి స్వరూపుడైన; ఈ హరిన్+చూడన్= ఈ భగవంతుడైన కృష్ణుణ్ణి చూచుటకు; హరితోడన్+పల్కన్= కృష్ణునితో సంభాషించుటకు; హరిమేన్+అంటన్= కృష్ణుని శరీరమును తాకుటకు; హరిన్+పాడన్+కాన్= కృష్ణునిగూర్చి గానం చేయడానికి; హరితోన్+ఏగన్= కృష్ణునితో కలిసి తిరగడానికి; సహ+ఆసన+ఆస్తరణ+శయ్యా - వాసులు+ఐ+

ఉండగన్= ఆసనము, పరుపు, మంచములవంటి వానిపై కలిసి వసించుటకు; హరి బంధుత్వ; సఖిత్వముల్+కలుగు= భగవంతుడైన కృష్ణునితో చుట్టరికాన్ని; స్నేహాన్ని కలిగిన; భాగ్యంబు= అదృష్టము; ఎట్లు సిద్ధించెన్+ఓ= ఎలా కలిగిందోగదా!

**తా :** ఉగ్రసేనుడు మొదలుగాగల శ్రీకృష్ణుని బంధుకోటిలోని యదుపుంగవులకు, తాము చేసే పనులతో అనగా పాప, పుణ్యకర్మలతో సంబంధంలేకుండా, వాటిని వదిలివేసి, మోక్షస్వరూపుడైన ఆ భగవంతుడే తమ పక్కన ఉండుటచే ఆతనితో సాధారణ మానవునివలె, చూడడం, మాట్లాడించడం, శరీరాన్ని తాకడం, పాటలు పాడడం, కలిసి తిరగడం, ఆయనతోబాటే ఆసనాలు, పరుపులు, శయ్యలవంటివానిపై కూర్చోవడం, పడుకోవడం, ఆయనతో బంధుత్వస్నేహాలను పాటిస్తున్న ఈ అదృష్టం ఎలా దక్కిందో!

**తే. అనుచు యాదవ వృష్ణి భోజాంధకులును, హరిదయాలబ్ధనిఖిలార్థు లగుచు నున్న**
**మనికిఁ దమ చిత్తములఁ బలుమాఱుఁ బొగడి, పరిణమించిరి; యంత న ప్పాండుమహిషి. 1050**

**ప్రతి :** అనుచు= పైవిధంగా చెప్తూతూ; యాదవ, వృష్ణి, భోజ; అంధకులును= ఈ పేర్కొన్న కృష్ణుని బంధుగణములైనవారలు; హరిదయాలబ్ధ= కృష్ణుని (విష్ణుని) దయచేత పొందబడిన; నిఖిల+అర్థులు= సమస్తమైన కోర్కెలు తీరినవారు; అగుచున్+ఉన్న+మనికిన్= అవుతున్నవారి జీవనమును; తమ చిత్తములన్= తమ మనసులలో; పలుమాఱున్+పొగడి= అనేక పర్యాయములు, ప్రశంసించి, పరిణమించిరి= వెడలిపోయిరి; అంతన్+ఆ+పాండుమహిషి= అప్పుడు ఆ పాండురాజు భార్యఐన కుంతీదేవి...

**తా :** రాజులంతా, కృష్ణుని దయవల్ల తీరిన సకలమైన కోర్కెలుగల్గి హాయిగా జీవిస్తున్న వైనాన్ని పలుమార్లు ప్రశంసించి, చివరకు వీడ్కోలు తీసికొన్నారు.

**వ. అప్పుడు. 1051**

**ప్రతి :** అపుడు= రాజులు వదిలివెళ్లిన పిదప...

**క. తన సుతులకు గాంధారీ, తనయుల గావించు సపకృతంబుల కాత్మన్**
**ఘనముగ నెరియుచు నచ్చుటఁ, గనుఁగొనె వసుదేవు విగతకల్మషభావున్. 1052**

**ప్రతి :** తనసుతులకున్= తన కుమారులైన పాండవులకు; గాంధారీతనయులు= కౌరవులు (దుర్యోధనాదులు); కావించు= చేసేటటువంటి; అపకృతంబులకున్= అపకారములకు; ఆత్మన్= తన మదిలో; ఘనముగన్= ఎక్కువగా; నెరియుచు= బాధచెందుతూ; ఆ పాండు మహిషి= కుంతీదేవి; విగత కల్మష భావున్= పాపపు భావనలులేనట్టి; వసుదేవు= తన అన్న ఐన వసుదేవుని (కృష్ణుని కన్నతండ్రిని); కనుగొనెన్= చూచింది.

**తా :** కృష్ణుడు అవతారపురుషు డని పొగడి రాజులు వెళ్లిన పిదప, కుంతీదేవి, దుర్యోధనాదులవల్ల తన కుమారులైన పాండవులకు కల్గుచున్న ఇక్కట్లను మనసులో స్మరించి, బాధపడుతూ, పుణ్యాత్ముడు, కల్మషాలులేని తన అన్న వసుదేవునితో ఇలా అన్నది.

**వ. అట్లు గనుంగొని యతనితో నిట్లనియె. 1053**

**ప్రతి :** అట్లు కనుంగొని= అలా చూచి; అతనితో= వసుదేవునితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నది.

**క. ఓ యన్న ! పాండుతనయులు, నీ యల్లుం డ్రడవులందు నెఱి మృగములతోఁ**
**బాయని యిడుమలఁ బడఁ గరు, ణాయత్తుల రగుచు మీర లరయఁగ వలదే ? 1054**

**ప్రతి :** ఓ యన్న= ఓ అన్నయ్యా; నీ+అల్లుండ్రు= నీకు అల్లుళ్లు ఐన; పాండుతనయులు= పాండు రాజకుమారులైన ధర్మరాజు మొదలుగాగల ఐదుగురు; అడవుల+అందున్= అరణ్యాలలో; నెఱి+మృగములతోన్= గొప్పవైన క్రూర మృగాలతో, పాయని; ఇడుములు= తప్పించుకోలేని కష్టాలు; పడన్= అనుభవిస్తూ ఉండగా; కరుణ+ఆయత్తులరు+అగుచున్= దయగలవారై; మీరు+అరయగవలదే= మీరు పట్టించుకోవద్దా?

**తా :** నీకు అల్లుళ్ళైన పాండురాజకుమారులు ధర్మజాదులు క్రూరమృగాల మధ్య అరణ్యాలలో కష్టాలు పడుతుంటే మీరు దయార్ద్ర హృదయంతో వారి బాధలను పట్టించుకోరా?

**వ. అని బహుప్రకారంబుల సంతాపించుచు మఱియు నిట్లనియె. 1055**

**ప్రతి :** అని= పైవిధంగా చెప్పి; బహు ప్రకారంబులు= అనేక విధాలుగా; సంతాపించుచున్= దుఃఖిస్తూ; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇలా అనింది.

**తా :** పైవిధంగా చెప్పి, అనేకవిధాలుగా బాధపడుతూ, కుంతి అన్నగారైన వసుదేవునితో ఇలా అంది.

**క. అతిబలవంతపు విధి దాఁ, 'బ్రతికూలం బైనఁ గలరె బంధువు?' లనుచున్**
**ధృతి గలఁగ బాష్పజలపూ, రితలోచన యగు సహోదరిం జూచి యనెన్. 1056**

**ప్రతి :** అతి, బలవంతపు; విధి= అతి బలిష్ఠమైన (ఎదురులేని, విధి= దైవ నియోగము; తాన్= స్వయంగా; ప్రతికూలంబు+ఐనన్= వ్యతిరేకమైతే; బంధువులు+కలరె= బంధువులు సాయంగా); ఉంటారా?, అనుచున్= అంటూ; ధృతి= ధైర్యము; కలగన్= చెదిరిపోగా; బాష్పజల - పూరిత - లోచన+అగు= దుఃఖంవలన పుట్టిన నీటితో నిండిన కన్నులు గల; సహ+ఉదరిన్+చూచి; అనియెన్= తోబుట్టువు (చెల్లెలు కుంతిని)చూచి; (ఇలా అన్నాడు).

**తా :** విధియే బలవత్తరమై వ్యతిరేకంగా ఉంటే బంధువులుఉండి మాత్రం ఏమి చెయ్యగలరని కన్నీరు ఒలుకగా దుఃఖించే చెల్లెలు కుంతిని చూచి వసుదేవుడు ఇలా అన్నాడు.

**సీ. తల్లి! నీ కేల సంతాపింప మనమునఁ దలపఁక విధి నేల సొలసె? దింత**
**యఖిలనియామకుండగు నీశ్వరుఁడు మాయయవనికాంతరుఁడైన యట్టి సూత్ర**
**ధారుని కైవడిఁ దవిలి నటింపఁగ మనుజులు కీలుబొమ్మలు దలంపఁ**
**గావున విధిసేఁతఁ గడచి వర్తింపంగ, దేవతలకునైనఁ దీఱ; దట్లు**

**తే. క్రోధచిత్తుండు కంసుఁడు బాధపఱుప, నిలయములు దప్పి, నే నడవులఁ జరింప**
**ఘనకృపానిధి యీ హరి గలుగఁ బట్టి, కోరి మా కిండ్లు గ్రమ్మఱఁ జేరఁ గలిగె'. 1057**

**ప్రతి :** తల్లి= అమ్మా!; సంతాపింప= మనస్సులో బాధపడగా; నీకు+ఏల= నీ కెందుకు; మనమునన్= మనస్సులో; తలపక= సరిగా ఆలోచింపక; విధిన్= కర్మానుభవాన్ని; ఏల ఇంత సొలసెదు= ఎందుకు ఇంతగా నిందించుతున్నావు;

అఖిల నియామకుండు= అన్నిటిని నియంత్రించేవాడు (నియమించేవాడు); ఈశ్వరుండుఅగు= ఈశ్వరుడే (భగవంతుడే) కారణమౌతాడు; మాయ= మాయాజాలమనే తెర; యవనిక+అంతరుడైన= తెరవెనుక ఉన్న; అట్టిసూత్రధారుని= బొమ్మలాడించేవాణ్ణి; కైవడి= వంటి(వాడై); తగిలి= సంబంధంకల్గి; తలంప= భావించగా; నటింపగ= నటించే; కీలు బొమ్మలు= ఆటబొమ్మలు; కావున= కాబట్టి; విధి+చేత+కడచి= కర్మానుభవం వర్తింపజేసే భగవచ్ఛక్తిచేతిని దాటి, వర్తింపన్+కన్= ప్రవర్తించుటకు; దేవతలకున్+ఐనన్+తీఱదు= దేవతలకైనా సాధ్యపడదు; అట్లు= ఆ విధంగా; క్రోధ చిత్తుండు= మిక్కిలి కోపియైనవాడు; కంసుండు= కంసుదు దుర్మార్గుడు; బాధపఱుపన్= బాధపెట్టగా; నిలయములు+తప్పి= మా నెలవులు (నివాస స్థానాలు); వదిలి; నేను+అడవులన్+చరింపన్= నేను అరణ్యవాసాలు చేస్తుంటే; ఘనకృపానిధి= గొప్ప దయానిధియైన; ఈ+హరి+కలుగఁబట్టి= ఈ శ్రీకృష్ణుడు ఉండుటవలన (కొడుకుగా కలుగుటవలన) కోరి= ఉద్దేశితంగా; మాకు+ఇండ్లు= మా నివాసస్థలాలు; క్రమ్మఱ= తిరిగి; చేరన్+కలిగె= చేరుకోగలిగాము.

**తా :** అమ్మా! ఎందుకు తపించిపోతావు? ఆలోచించకుండా విధినెందుకు నిందిస్తావు? అన్నిటికి కర్త ఈశ్వరుడు. మాయ అనేది ఒక తెర. దానికి వెనుక ఉండి, బొమ్మలనాడించే సూత్రధారి ఈశ్వరుడు. అతనిచేతిలో ఉండి నటించే కీలు బొమ్మలవంటివారు మానవులు. దేవతలైనా, విధిని తప్పి ప్రవర్తించలేరు. మేము అలా దుర్మార్గుడైన కంసుని చేతిలో చాలా బాధలుపడి, తాళలేక అడవులు పట్టినాము. దయానిధియైన ఈ కృష్ణుని అనుగ్రహంవల్ల మా కష్టాలు తొలగి తిరిగి స్థిరనివాసులమైనాము.

**వ. అని యూరడిలం బలుకు నవసరంబున. 1058**

**ప్రతి :** అని; ఊరడిలన్+పలుకున్= కుంతీదేవి దుఃఖంనుండి తేరుకునేటుగా పలుకుతున్నట్టి; అవసరంబునన్= (ఆ) సమయంలో...

**క. నందయశోదలు గోపక, బృందంబులు గోపికలును బిరిగొని పరమా**
**నందంబునఁ జనుదెంచిరి, మందరధరుఁ జూచువేడ్క మనములఁ బొడమన్. 1059**

**ప్రతి :** నందయశోదలు= శ్రీకృష్ణునిపెంపుడు తల్లిదండ్రులైన గోపకులపెద్ద నందుడు; ఆయనభార్య యశోద; గోపక బృందంబులు= గోపాలుర సమూహాలు; గోపికలును= గోప స్త్రీలు; పిరిగొని= కలిసికొని; పరమ+ఆనందంబునన్= గొప్ప సంతోషంతో; మనమునన్= మనస్సులో; మందరధరున్= మందర పర్వతమును (కూర్మావతారంబును); ధరించిన= (మోసిన) విష్ణుస్వరూపుడగు శ్రీకృష్ణుణ్ణి; చూచు వేడ్క= చూచే సంబరం; పొడమన్= అంకురించగా; చను+తెంచిరి= విచ్చేసిరి.

**తా :** ద్వారకాధిపతి శ్రీకృష్ణుడు శ్యమంతక ప్రదేశానికి రాగా, వ్రేపల్లెలో ఉన్న శ్రీకృష్ణుని బాల్య బంధుగణం, తల్లిదండ్రులైన నందుడు, యశోదలతోపాటు గోపగోపికాగణం కృష్ణుణ్ణి చూచే సంబరంతో కలిసివచ్చారు.

**వ. ఇట్లు సనుదెంచి. 1060**

**ప్రతి :** ఇట్లు+చనుదెంచి= ఈ విధంగా, వచ్చి...

**తా :** ఈ విధంగా కృష్ణునివద్దకు వచ్చి

**క. అతిచిరకాలసమాగతు, నతని నిరీక్షించి వృష్ణియాదవభోజ**
**ప్రతతులు నెదురేఁగి సము, న్నతితో నాలింగనములు నడపిరి వరుసన్. 1061**

**ప్రతి :** అతిచిరకాల= చాలాకాలం గడచిన తర్వాత; సమ్+ఆగతున్= విశేషంగా విచ్చేసిన; అతనిన్= ఆ నందుణ్ణి; నిరీక్షించి= చూచి; వృష్ణి, యాదవ, భోజ ప్రతతులు= వృష్ణివంశీకులు, యదువంశీకులు, భోజవంశీకులైనవారి; ప్రతతులున్= గుంపులూ; ఎదురు+ఏగి= ఎదురుగా వెళ్లి (ఆహ్వానించి, గౌరవించి); సమ్+ఉన్నతితోన్= విశేష ఔన్నత్యంతో, ఆలింగనములు= కౌగిళ్లు; వరుసన్= వరుసగా; నడపిరి= ఆచరించారు.

**తా :** చాలాకాలం తరువాత వచ్చిన నందుణ్ణి చూచి వృష్ణి, యాదవ, భోజవంశీకుల గుంపులు ఎదురేగి ఒకరి తరువాత ఒకరు ఆలింగనాలు చేసుకొన్నారు.

**క. వసుదేవుఁడు వారికి సం, తసమునఁ గావించె సముచితక్రియ లంతన్**
**ముసలియు హరియును మ్రొక్కిరి, వెస నందయశోదలకును వినయం బెసఁగన్. 1062**

**ప్రతి :** వసుదేవుడు= కృష్ణుని కన్నతండ్రి; వారికిన్= యశోదానందులకు; అంతన్= అపుడు; సముచితక్రియలన్= తగినట్టి అతిథి మర్యాదల (క్రియల)ను; సంతసమునన్+కావించెన్= సంతోషంగా నెరవేర్చినాడు; నందయశోదలకును= (పెంపుడు) తల్లిదండ్రులకు; వినయంబు+ఎసగన్= వినయం ఒప్పేలా; ముసలియున్= రోకలి ఆయుధంగాగల బలరాముడును; హరియును= శ్రీకృష్ణుడును; మ్రొక్కిరి= నమస్కరించారు.

**తా :** యశోదానందులకు వసుదేవుడు సంతోషంగా ఆతిథ్యమిచ్చాడు. తల్లిదండ్రులకు బలరాముడు, కృష్ణుడు వినయంగా నమస్కరించారు.

**వ. అట్లు నమస్కృతులు సేసి, యాలింగనంబులు గావించి, నయనారవిందంబుల నానందబాష్పంబులు దొరఁగ నఱ లేని స్నేహంబులు చిత్తంబుల నత్తమిల్ల నేమియుం బలుకకుండి; రంత న య్యశోదాదేవి రామకృష్ణుల నిజాంకపీఠంబుల నునిచి యక్కునం గదియం దిగిచి, చెక్కిలి ముద్దుగొని, శిరంబులు మూర్కొని, చిబుకంబులు పుదుకుచుఁ, బునఃపునరాలింగనంబులు గావించి, పరమానందంబునం బొందుచు నున్నంతఁ బదంపడి. 1063**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; బలరామకృష్ణులు; నమస్కృతులు+చేసి= నమస్కారాలుచేసి; ఆలింగనంబులు+కావించి= కౌగిలించుకొని; నయన+అరవిందంబులన్= తామరలవంటి కన్నులలో; ఆనంద బాష్పంబులు= సంతోషంతో ఉబికిన కన్నీళ్లు, తొరఁగన్=కారగా; అఱలేని= సంపూర్ణమయిన; స్నేహంబులు= మమకారాలు; చిత్తంబులన్= మనసులలో; అత్తమిల్లన్= వ్యాపించగా; ఏమియున్+పలుకకుండిరి= మాటరాక, ఉండిరి; అంతన్+ఆ+యశోదాదేవి= అప్పుడు ఆ యశోదమ్మ; రామకృష్ణుల+నిజ+అంక పీఠంబులన్+ఉనిచి= బలరామకృష్ణులను (తనపిల్లలను); తన ఒడిలో ఉంచుకొని; అక్కునన్+కదియన్+తిగిచి= తన వక్షఃస్థలంకు దగ్గరగా లాగుకొని; చెక్కిలి+ముద్దుగొని= చెంపలు ముద్దుపెట్టి; శిరంబులు మూర్కొని= తలలు వాసనగొని (ముఖమును ఆన్చి); చిబుకంబులు పుదుకుచున్= గదువ (గడ్డము) నిమురుచు; పునః పునః+ఆలింగనంబులు+కావించి= మరల మరల కౌగిట్లోకి తీసుకొంటూ; పరమ+ ఆనందంబును+ పొందుచున్+ఉన్నంతన్= గొప్ప సంతోషాన్ని పొందుతూ ఉండగా; పదంపడి= పిదప...

**తా :** ఆ విధంగా బలరామకృష్ణులు నమస్కారాలుచేసి కౌగిలించుకొని తామరలవంటి కన్నులలో సంతోషంతో ఉబికిన కన్నీళ్లు కారగా, సంపూర్ణమైన మమకారాలు మనసులలో వ్యాపించగా ఏమీ మాట్లాడలేక ఉండిపోయారు. అప్పుడా యశోదమ్మ బలరామకృష్ణులను తన ఒడిలో ఉంచుకొని, తన వక్షస్థలానికి దగ్గరగా లాగుకొని చెంపలకు ముద్దుపెట్టి, తన ముఖాన్ని వారిశిరస్సులకు ఆనించి చిబుకాన్ని నిమురుచు మరల మరల కౌగిట్లోకి తీసుకుంటూ ఎంతో సంతోషాన్ని పొందుతుండగా, ఆ తర్వాత

**చ. స్థిరమతితోడ రోహిణియు దేవకియుం దగ నందగోప సుం**
**దరిఁ గని కౌఁగిలించికొని తత్కృతులెల్లఁ దలంచి యింతి! నీ**
**వరుఁడును నీవు బంధుజనవత్సలతన్ మును చేయు సత్కృతుల్**
**మఱవఁగ వచ్చునే ? తలఁప మా కిఁక నెన్నఁటికిం దలోదరీ! 1064**

**ప్రతి :** స్థిరమతితోడన్= గట్టి మనసు (ప్రేమ)తో; రోహిణియున్ దేవకియున్= బలరామ, కృష్ణుల తల్లులునూ; తగ= చక్కగా; నందగోప= గోపాలపతియైన నందుని సుందరిన్= నందుని భార్యయైన యశోదను; కౌఁగిలించుకొని= ఆలింగనము చేసుకొని; తత్= ఆమెయొక్క; కృతులు+ఎల్లన్= చేసిన సహాయాలు (మంచిపనులు) అన్నింటిని; తలంచి= స్మరించి; ఇంతి= ఓ యశోదమ్మా!; నీ వరుడును= నీ భర్తయైన నందుడు, నీవును; బంధుజన= బంధువులపట్ల; వత్సలతన్= ఆప్యాయతతో; తలపన్= ఆలోచిస్తే; మునుచేయు= గతంలో కావించిన; సత్+కృతుల్= మంచిపనులు; మాకున్+ఇకన్= మాకు; ఎన్నటికిన్= ఎన్నాళ్లకైనను; తల+ఉదరీ!= (సమతలమైన ఉదర భాగంకలది) అందమైన స్త్రీ యశోదా!; మఱువగ వచ్చున్+ఎ= మరచిపోగలమా?

**తా :** రోహిణీ, దేవకీ సతులిద్దరు యశోదాదేవిని నిండైన మనసుతో కౌగిలించుకొని, బలరామకృష్ణులను పెంచడంలో ఆమె పాటించిన అన్ని విధాల సత్కార్యాలను తలచుకొంటూ అమ్మా! యశోదా! మీ దంపతులిద్దరు బంధుప్రీతితో మాకు చేసిన మేలు (కార్యాలు) మరచిపోగలమే! అని అన్నారు.

**క. జననం బందుట మొదలుగ, ఘనమోహముతోడఁ బెంచుకతమునఁ దమకున్**
**జననీజనకులు వీరని, మనమునఁ దలపోయలేరు మము నీ తనయుల్. 1065**

**ప్రతి :** జననంబు+అందుట= పుట్టుక; మొదలుగన్= మొదట్నుంచీ; ఘనమోహముతోడన్= అపారమైన ప్రేమతో; పెంచుకతమునన్= పెంచిన కారణంగా; మమున్= మమ్మల్ని; తమకున్= తామిద్దరికి (రామకృష్ణులకు); జననీజనకులు వీరు+అని= తల్లిదండ్రులు, వీరే అని; నీ తనయుల్= నీ (పెంచిన) కుమారులు రామకృష్ణులిద్దరు; తలపోయలేరు= భావించలేరు.

**తా :** పుట్టినప్పటినుండి మీరే ఎంతో అల్లారుముద్దుగా పెంచి పెద్ద చేసినందువల్ల రామకృష్ణులిద్దరూ ఈనాటికీ నీ బిడ్డలమనే భావిస్తున్నారు. మమ్మల్ని తల్లిదండ్రులుగా అనుకోవటం లేదు.

**విశే :** కన్న ప్రేమ కన్న పెంచిన ప్రేమ విశేషమైనదని ఈ సన్నివేశం వల్ల తెలుస్తోంది.

**క. అంటిన ప్రేమను వీరిం, గంటికి ఱెప్పడ్డమైన గతిఁ బెంపఁగ మా**
**కంటెన్ నెన రౌటను మీ, యింటన్ వసియించి యుండి రిన్నిదినంబుల్. 1066**

**ప్రతి :** వీరిన్= రామకృష్ణులిద్దరినీ; అంటిన ప్రేమను= ప్రేమను బాగా అందించి; కంటికిన్ ఱెప్ప+అడ్డమైనగతి= కంటికి రెప్ప రక్షణగా ఉన్నవిధంగా; పెంపన్+కన్= పెంచగా; మాకంటెన్= మాకంటే బాగా; నెనరు+ఔటను= ప్రేమ ఎక్కువగా ఉండుటచే; ఇన్నిదినంబులు= ఇంతకాలము; మీ+ఇంటన్= మీ ఇంటిలో; వసియించి+ఉండిరి= నివసించారు.

**తా :** మీరు వీరిని ఎంతోప్రేమగా కంటికి రెప్పల్లా కాపాడుతూ పెంచి పెద్దచేశారు. మా కంటే మీరే ఎక్కువగా ప్రేమించారు. కనుక వారు మీ ఇండ్లల్లోనే హాయిగా ఇంతకాలం ఉన్నారు.

**వ. అని యిట్లు ప్రియాలాపంబులు పలుకుచుండు నవసరంబున గోపాలసుందరు లమందానంద కందళితహృదయ లయి హృదయేశ్వరుండైన గోవిందుఁడు చిరకాల సమాగతుం డగుటం జేసి, యతనిం జూచు తలంపు లుల్లంబుల వెల్లిగొనం జేరి. 1067**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; ప్రియ+ఆలాపంబులు= ప్రేమ పూర్వమైన మాటలు; పలుకుచున్+ఉండున్+ అవసరంబునన్= మాట్లాడుతున్న సందర్భంలో; గోపాలసుందరులు= గోపికలు; అమంద+ఆనంద= ఎక్కువ ఆనందంతో; కందళిత హృదయలు+అయి= ఉల్లాసం అంకురించిన హృదయాలుకలవారై; హృదయ+ఈశ్వరుండు+ఐన= హృదయాలకు ప్రభువు అనగా తమకు ప్రాణసమానమైనవాడు, ఐన; గోవిందుడు= (గోవులకు అధిపతి) శ్రీకృష్ణుడు; చిరకాల= చాలాకాలానికి; సమాగతుడు= వచ్చినవాడు; అగుటన్+చేసి= కావడంవల్ల; అతనిన్+చూచు తలంపులు= ఆయనను చూడాలనే కోరికలు; ఉల్లంబుల వెల్లికొనన్+చేరి= హృదయాలలో ఉప్పొంగగా; దగ్గరగా వచ్చి...

**తా :** రోహిణి, దేవకీదేవులు మాట్లాడుతుండగా గోపికాస్త్రీలు, తమ హృదయేశ్వరుడైన శ్రీకృష్ణుడు చాలాకాలం తరువాత రావడంచేత, ఆయనను చూడటానికి కోర్కెలు హృదయాలలో పొంగుతుండగా వచ్చారు.

**చ. నళినదళాక్షుఁ జూచి నయనంబులు మోడ్వఁగఁ జాల కాత్మలన్**
**వలచి తదీయమూర్తివిభవంబు దలంచుచుఁ గౌఁగిలించుచుం**
**బులకలు మేన జాదుకొనఁ బొల్తులు సొక్కిరి బ్రహ్మమున్ మనం**
**బునఁ గని చొక్కు యోగిజనముం బురుడింపఁగ మానవేశ్వరా! 1068**

**ప్రతి :** మానవ+ఈశ్వరా!= ఓ పరీక్షిన్మహారాజా!; నళినదళ+అక్షున్= కమలదళములవంటి కన్నులుకల ఆ శ్రీకృష్ణుని, చూచి, నయనంబులు+మోడ్వన్+కన్+చాలక= కన్నులు మూసుకొనలేక; ఆత్మలన్= తమ మనస్సులలో; వలచి= ప్రేమించి (ఇష్టపడి); తదీయమూర్తి విభవంబున్= ఆయన దేహ సౌందర్య వైభవాన్ని; తలంచుచున్= తలచుకొంటూ; కౌఁగలించుచున్= కౌగిలించుకొంటూ; మేనన్= వారి శరీరాలందు; పులకలు= గగురుపాట్లు; జాదుకొనన్= దట్టంకాగా; పొల్తులు= స్త్రీలు; బ్రహ్మమున్= భగవంతుణ్ణి; మనంబునన్+కని= మనస్సులో ఆరాధించి; చొక్కు= పరవశించే; యోగిజనమున్= యోగీశ్వరులను; పురుడింపన్+కన్= పోలికగాగల్గునట్లు; చొక్కిరి= ఆనంద పరవశలయ్యారు.

**తా :** సుందర రూపుడైన ఆ శ్రీకృష్ణుణ్ణి చూడగానే ఆ గోపికలు కన్నులు రెప్పలు వాల్చక చూచినారు. మనసులలోనే ఆయన దేహసౌందర్యానికి మోహించి కౌగిళ్లు ఇచ్చినారు. బ్రహ్మమును ఆరాధించే యోగులు ధ్యానంలో పరవశించినట్లు, శరీరాలలో పులకలు కలుగగా గోపికలు భౌతిక ప్రపంచాన్ని మరచారు.

**విశే :** గోపీకృష్ణుల పరస్పర ప్రేమ జీవాత్మ పరమాత్మల బాంధవ్యంవంటిదని భాగవతవ్యాఖ్యాతలు చెప్పారు.

**చ. పొలఁతుల భావ మాత్మఁ గని ఫుల్లసరోరుహలోచనుండు వా**
**రల నపు డేకతంబునకు రమ్మని తోకొని పోయి యందు న**
**ర్మిలిఁ బరిరంభణంబు లొనరించి లసద్దరహాసచంద్రికా**
**కలితకపోలుఁడై పలికెఁ గాంతల భక్తినితాంతచిత్తలన్. 1069**

**ప్రతి :** పొలతుల భావము= ఆ గోపికల చిత్తంలోని ఆలోచనల్ని; ఫుల్లసరోరుహ లోచనుండు= వికసించిన; తామరలవంటి కన్నులుకల శ్రీకృష్ణుడు; ఆత్మన్+కని= హృదయంలో గుర్తించి; వారలన్+అపుడు= ఆ గోపికలను ఆ సమయాన; ఏకతంబునకు రమ్మని; తోడ్కొని, పోయి= ఏకాంత (ఎవరులేని) స్థలానికి తీసుకొని పోయి; అందున్+అర్మిలిన్= అక్కడ ప్రేమతో; పరిరంభణములు+ఒనరించి= కౌగిళ్లు ఇచ్చి; లసత్+దరహాస, చంద్రికా, కలిత, కపోలుడు+ఐ= ప్రకాశించే చిరునవ్వుల వెన్నెలలచే కూడిన చెక్కిళ్లు కలవాడై; భక్తి నితాంతచిత్తులన్= భక్తిచే ఎల్లవేళల నిండిన చిత్తాలుగలవారు ఐన; కాంతలన్= గోపికలను (ఉద్దేశించి); పలికెన్= మాట్లాడినాడు.

**తా :** గోపికలయొక్క ప్రేమను శ్రీకృష్ణుడు పసిగట్టాడు. ఆ గోపికల మనోభావాలను గమనించిన శ్రీకృష్ణుడు ఏకాంత ప్రదేశానికి తీసుకొనిపోయి, ప్రేమతో కౌగిలింతలుఇచ్చి ఎడతెగని భక్తిభావంతో నిండిన వారితో చిరునవ్వులు చిందిస్తూ (ఇలా) పలికాడు.

**చ. 'వనజదళాక్షులార! బలవద్రిపువర్గములన్ జయింపఁగాఁ**
**జని తడ వయ్యె; దీనికి భృశంబుగ మీ మది నల్గకుండుఁడీ!**
**యనయము దైవ మిట్లు సచరాచరజాలము నొక్కవేళఁ గూ**
**ర్చును నొకవేళఁ బాపును మరుద్ధతతూల తృణంబులం బలెన్. 1070**

**ప్రతి :** వనజదళ+అక్షులార!= కమల దళాలవంటి కన్నులుండే గోపకాంతలారా!; బలవత్+రిపువర్గములన్= బలవంతులైన శత్రువులను; జయింపన్+కాన్+చని= గెలవడానికి వెళ్లి; తడవు+అయ్యె= (ఇంత) ఆలస్యమైంది; దీనికి= ఈ ఆలస్యానికి; మీ మదిన్= మీ మనస్సుల్లో; భృశంబుగన్= ఎక్కువగా; అల్గక+ఉండుడే!= కోపగించుకోకండి; దైవము= విధి (భగవచ్ఛక్తి); ఇట్లు= ఈ విధంగా; (వీటి) అనయమున్= ఎల్లప్పుడు; స+చర+అచర+జాలమున్= కదిలే ప్రాణులు; కదలని ప్రాణుల సమూహంతో కూడిన ఈ లోకాన్ని (జంతు, వృక్ష సంతతులను); మరుత్+హత+తూల+తృణంబులన్ బలెన్ = గాలిదెబ్బచే ఎగురగొట్టబడిన దూదివలె, గడ్డిపోచలాగ; ఒక్కవేళన్+కూర్చును= ఒకసారి కలుపుతుంది; ఒకవేళన్+పాపును= ఒకసారి విడదీస్తుంది.

**తా :** ఓ వనితలారా! మిమ్మల్ని విడిచిపోవడానికి కారణం ఉంది. బలవంతులైన శత్రువులను అణచి వేయడానికి విజయయాత్ర చేసినందువల్ల ఇక్కడికి రావడానికి ఇంత ఆలస్యమైంది. దీనికి మీరు కోపించవద్దు. గాలికెగుర గొట్టబడే దూది వలె, గడ్డిపోచలవలె విధి చరాచర ప్రపంచంలో జీవులను ఒక్కోసారి కలుపుతుంది. ఒక్కోసారి విడగొడుతుంది. (కలియుట విడిపోవుట ప్రాణులకు సహజమైనదని భావం.)

**సీ. తరలాక్షులార! మద్భక్తిచేతనులకుఁ దనరు మోక్షానందదాయకంబు**
**జపతపోవ్రతదానసత్కర్మముల ముక్తి కలుగంగ నేరదు కానఁ దలఁప**
**విధిశివసనకాదివిమలచిత్తంబులఁ బొడమిన భక్తి మీ బుద్ధులందు**
**జనియించె మీ పూర్వసంచితసౌభాగ్య మెట్టిదో యది తుదముట్టె నింక**

**తే. నటమటము గాదు మీకు నెన్నఁటికి నైనఁ, గలుగనేరవు నిరయసంగతములైనఁ**
**జన్మకర్మము లిటమీఁద మన్మనీష,సుమహితధ్యానలార! యో రమణులార! 1071**

**ప్రతి :** తరల+అక్షులార!= ప్రకాశించే కన్నులుగల గోపికలారా!; మత్+భక్తి= నాయందు భక్తి; చేతనులకు= ప్రాణులకు; మోక్ష+ఆనంద దాయకంబు= మోక్షంవల్ల ఆనందం కలిగే స్థితిని ప్రసాదించి; తనరున్= ప్రకాశిస్తుంది; జప, తపో, వ్రత, దాన; సత్కర్మముల= జపించడం, తపించడం, వ్రతాచరణం, దానాలివ్వడం, మంచిపనులు చేయడం వీటివల్ల (మాత్రమే); ముక్తికలుగంగ నేరదు= మోక్షం కల్గదు; కాన= కాబట్టి; తలపన్= విచారింపగా; విధి= బ్రహ్మ; శివ= శంకరుడు; సనకాది= సనకసనందనాది మునులు మొదలైనవారి; విమల చిత్తంబులన్= నిర్మలమైన మనస్సులలో; పొడమినభక్తి= పుట్టినభక్తి (ఆరాధనా భావం); మీ బుద్ధుల+అందున్ జనియించెన్= మీ మనస్సులలో పుట్టింది; మీ పూర్వ సంచిత సౌభాగ్యము= పూర్వజన్మల్లో దాచికొన్న పుణ్యం, ఎట్టిదో; అది తుదముట్టెన్= ఏదైతే ఉందో అది (ఫలవంతమై) చివరిదశకు చేరింది, ఇంకన్+అటమటము కాదు= అసత్యంకాదు; మీకున్, ఇటమీదన్= ఇంక ఈపైన; మత్+మనీషన్= నా సంబంధమైన జ్ఞానంచేత; ఓ రమణులార!= ఓ పడతులారా!; సుమహిత ధ్యానలారా!= ధ్యానంలో గొప్పస్థాయిని అందుకొన్నవారలార!; నిరయ= నరక; సంగతములైన= సంబంధమైన; జన్మ, కర్మములు= పుట్టుకలు; పుణ్యాపాపకర్మలు, మీకున్; ఎన్నటికిన్+ఐనన్= ఇంక ఎప్పటికి కూడా; కలుగనేరవు= సంభవించవు.

**తా :** గోపికల్లారా! నా యందలి భక్తివల్ల ప్రాణులకు మోక్షానందం సిద్ధిస్తుంది. భక్తిలేకుండా కేవలం జపతపాదులవల్ల, మోక్షం కలుగదు. శివుడు, బ్రహ్మ, సనకాది మునులు తమ మనస్సుల్లో నిలిపిన నిర్మలభక్తి మీలో పుట్టింది. మీ పూర్వజన్మ సంచిత పుణ్యం ఫలవంతమైంది. నా సంబంధమైన (భగవత్ సంబంధమైన) జ్ఞానంచేత ఇంక మీకు నరకాదులు, జననాదులు, పాపపుణ్యకర్మలు ఏవీ ఉండవు, అతీతమైన మోక్షం లభిస్తుంది. ఇది అసత్యం కాదు.

**విశే :** కర్మాది అనుభవాలవల్ల స్వర్గనరకాదులు, సంచిత కర్మఫలాలవల్ల పునర్జన్మాదులు, తిరిగి పాపపుణ్యకర్మాచరణం ఇది ఒక చక్రభ్రమణం. దీనినుండి తప్పించుకొనడం మోక్షస్థితి. దీనికై జపతపాదులు మాత్రమేగాక, భగవంతునియందు గాఢభక్తి అవసరం. బ్రహ్మేశ్వరాదులకుమాత్రమే అనుభవంలోనికి వచ్చిన ఈ మానసికస్థితి ప్రస్తుతం కృష్ణునివల్ల గోపికలకు అనుభవమైంది. గోపికల అనన్యభక్తి, జప, తప, దాన, ధర్మాది కర్మాచరణంకంటె శ్రేష్ఠమైందని భాగవత సందేశం.

**సీ. అఖిలభూతములకు ననయంబు నాదిమధ్యాంతరాంతర్బహిర్వ్యాప్తి నైన**
**ఘటపటాదికభూతకార్యంబులకు నుపాదానకారణములై తనరునట్టి**
**గగనానిలానలకక్షోణులను భూతపంచకం బైక్యత వడయుఁగాదె**
**లోకంబులందుఁ బంచీకరణవ్యవస్థలచేత నట్టి భూతముల రీతి**

**తే. గగనముఖభూతతత్కార్యకారణములఁ, దగిలి యాధారహేతుభూతంబ నైన**
**నాకుఁ బర మన్య మొక్కఁ డెన్నంగ లేదు, విమలమతులార! మాటలు వేయు నేల? 1072**

**ప్రతి :** విమలమతులార! = స్వచ్ఛమైన మనసులుగలిగిన ఓ గోపికలారా!; అఖిల భూతములకున్= సమస్త ప్రాణికోటికి; అనయంబు= ఎల్లప్పుడు; ఆది మధ్య+అంతర= మొదలు, మధ్య, చివరలైన స్థితులు; అంతన్+బహిర్ వ్యాప్తిని+ఐన= లోపల బయట (నేనే) వ్యాప్తమైన (స్థితిని), ఘట, పట+ఆదిక= కుండ, వస్త్రము (ఈ వస్తువులు తర్కశాస్త్రంలో కార్యకారణ సంబంధ ఉదాహరణలు) మొ॥; భూతకార్యంబులకున్= భౌతికమైన పనులకు; ఉపాదాన కారణములు+ఐ= ప్రధానకారణములై; తనరు+అట్టి= ఒప్పుచున్నట్టి; గగన+అనిల+అనల-క-క్షోణులను= ఆకాశం, వాయువు, అగ్ని, నీరు, భూమి అనే; భూతపంచకంబు= పంచభూతాలు; ఐక్యత+పడయున్+కాదె! = కలిసి పనిచేస్తాయి గదా!; లోకంబుల+అందున్= సర్వలోకాల్లో; పంచీకరణవ్యవస్థలచేత= పంచభూత సమష్టి కారణస్థితిచేత; అట్టి భూతములరీతి= ప్రాణులవలె; గగనముఖ= ఆకాశము మొదలైన; భూత= ప్రాకృతిక శక్తుల; తత్+కార్యకారణములన్= వాటి కార్యకారణ సంబంధముచేత; తగిలి= సంబంధమున్నట్టి; ఆధారహేతుభూతంబు+ఐన= ఆధారకారణమైన; నాకున్= భగవంతుడైననాకు; పరము; అన్యము+ఒక్కడు+ ఎన్నంగలేదు= పరమైన, స్వకీయమైన ఒక్క అంశమైనా (పరిశీలించిన) లేదు; మాటలు వేయునేల= మాటలు అధికం అక్కరలేదు.

**తా :** సర్వభూతాల్లో (సమస్త ప్రాణికోటిలో) జన్మ, జీవన, మృత్యువులు నేనే! లోపల, బయట నేనే వ్యాపించి ఉన్నాను. ఘటపటాది వస్తుజన్యతకు (సకలప్రాణి కార్యాలకు) ఉపాదానకారణాలైన పృథివ్యాపస్తేజోవాయురాకాశాలు (భూమి, నీరు, అగ్ని/తేజస్సు, వాయువు, ఆకాశం) వీటి ఐక్యకార్యఘటనకు నేనే కారణం. సకల లోకాల్లోని పంచీకరణ వ్యవస్థతో నడుపబడే ప్రాణులకు కారణమైన గగనాదిపంచభూతాలకు (పంచప్రాకృతికశక్తులకు) వాటి మధ్యగల కార్యకారణసంబంధం నేనే. ఆధారమూ నేనే. సర్వానికీ నేనే కర్తను. నాకు స్వపరభేధాలు లేవు. అంతా సమానమే! ఓ పడతులారా! ఇంతకన్న ఇంక ఎక్కువ చెప్పడమెందుకు?

**విశే :** 1. పంచభూతాల వ్యవస్థకు, సృష్టి స్థితిలయాలకు, ప్రాణికోటి జన్మ జీవన మృత్యువులకు, ఆధార ఆధేయాలకు, కార్యకారణాలకు సర్వానికి భగవచ్ఛక్తియే కారణమని బోధించిన శ్రీమద్భాగవతసారమంతా పోతన ఈ పద్యంలో పోత పోసినాడు

**2. ఘట పటా దిక భూతకార్యంబులు**

ఘటం (కుండ), పటం (వస్త్రం) మొ॥ పంచభూతాలచే ఏర్పాడిన కార్యరూపాలు.

**ఉదా :** కారణం : మట్టి;
కార్యం : కుండ;
కారణం : ప్రత్తి;
కార్యం : వస్త్రం
కుండను చేసే కుమ్మరి – కర్త
వస్త్రం నేసే సాలె – కర్త.

పరమేశ్వర సంకల్పమే ఈ సృష్టికి కర్త. అలాగే, కరాణం : పంచభూతాలు, కార్యం : సృష్టి

**3. ఉపాదాన కారణం :** ఏ కారణం లేనిదే కార్యం జరుగదో, కార్యంలో ఏ కారణం స్పష్టంగా తెలుస్తూ ఉంటుందో – అది ఉపాదాన కారణం.

**ఉదా :** కుండకు - మట్టి
వస్త్రానికి - ప్రత్తి

**4. పంచీకరణం :** పంచభూతాల గుణాలు ఒకదానితో ఒకటి సమ్మేళనం పొందటంవల్లనే ఈ సృష్టి ఏర్పడుతోంది. అలా సమ్మేళనం పొందడం అనే ప్రక్రియను 'పంచీకరణం' అని పేరు.

**5. పంచీకరణవ్యవస్థ :** ఐదు భాగాలుగా చేయడం అని అర్థం! సకల జగత్తుకు కారణుడైన పరమాత్మ మొట్టమొదట అవయవాలు లేకుండా ఉండిన మూల పదార్థాన్ని శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే ఐదు తన్మాత్రలుగా చేశాడు. అవి సూక్ష్మములై ఉండటంవలన తమోగుణాన్ని అధిష్ఠించి, వాటిని స్థూలంగా చేయసాగాయి. మొదట ఒక్కొక్క భూతాన్ని రెండుగాచేసి, అందొక భాగాన్ని అట్టే ఉంచి, తక్కిన సగభాగం ఒక్కొక్క దాన్ని నాలుగు భాగాలుగా చేశాడు. పిమ్మట ప్రతిభూతంయొక్క మిగిలిన, అర్ధబాగాన్ని తక్కిన భూతాల అష్టమాంశలను (1/8 భాగము) చేర్చి స్థూలనిర్మాణం చేశాడు. ఇలా, ప్రతిస్థూలభూతంలో నిజాంశంసగం, తక్కిన భూతాంశలు సగమై ఉండేట్లు చేశాడు.

(1/2+1/8+1/8+1/8+1/8=1) ఈ ప్రక్రియనే "పంచీకరణ వ్యవస్థ" అంటారు.

**తే. అనినఁ దెలివొంది వారు దేహాభిమాన, ములు సమస్తంబు విడిచి 'యో నలిననాభ!**
**నిఖిలజగదంతరాత్మ! మానితచరిత్ర!, భక్తజనమందిరాంగణపారిజాత! 1073**

**ప్రతి :** అనినన్= శ్రీకృష్ణుడు ఈ విధంగా ప్రాకృతికరహస్యాల్ని; భగవన్మూలశక్తిని విశదీకరించగనే; వారు= ఆ గోపికలు; తెలివి+ఒంది= వివేకాన్ని పొంది; దేహ+అభిమానంబులు; సమస్తంబు విడిచి= శరీరంపైగల ప్రేమలను అన్నిటిని వదిలి; ఓ నలిననాభ!= ఓ కృష్ణా!; నిఖిలజగత్+అంతరాత్మ!= సమస్త జగాల్ని ఆత్మలో కలిగినవాడా!; మానిత చరిత= గౌరవింపతగిన గొప్ప చరిత్రకలవాడా!; భక్తజన= భక్తులయొక్క; మందిర+అంగణ= ఇంటిపెరడులోని; పారిజాత= పారిజాతం చెట్టువంటివాడా!...

**తా :** మోహపరవశులైన ఆ గోపికలు శ్రీకృష్ణుని సర్వవ్యాప్త ఈశ్వరతత్త్వాన్ని భగవంతునినోటనే విని, వివేకాన్ని పొంది, తమ దేహాభిమానాల్ని విడిచారు. విష్ణుస్వరూపా! జగత్తులు నీలో నిల్పుకొన్నవాడా! భక్తుల కోర్కెలు తీర్చే పారిజాతమా! అని ప్రార్థించి

**తే. ఘోరసంసారసాగరోత్తారణంబు, ధీయుతజ్ఞానయోగిహృద్ధ్యేయవస్తు**
**వగుచుఁ జెలువొందు నీ చరణాంబుజాత, యుగళమును మా మనంబులఁ దగుల నీవె 1074**

**ప్రతి :** ఘోరసంసార సాగర= భయంకరమైన సంసారమనే సముద్రాన్ని; ఉత్తారణంబు= దాటగలిగేది; ధీయుత జ్ఞానయోగి= బుద్ధిమంతులై, జ్ఞానమనే యోగాన్ని ఆచరించేవారు; హృత్+ధ్యేయవస్తువు= హృదయాలలో; ధ్యానం చేయదగిన అంశమైంది; అగుచున్+చెలువు+ఒందు= అగుతూ సుందరమైన; నీ చరణ+అంబుజాత, యుగళమును= నీ పాదకమలాల జంటను; మా మనంబులన్= మా మనస్సుల్లో; తగులన్= స్థిరంగా ధ్యానించేలా; ఈవు+ఎ= ఇవ్వవయ్యా! (అని వేడినారు)

**తా :** ఘోరమైన సంసారసముద్రాన్ని దాటించేవీ, జ్ఞానయోగులైనవారి హృదయాల్లో ప్రతిష్ఠితమై ధ్యానింప తగిందై ప్రకాశించే నీ చరణ కమలాల్ని మా మనస్సుల్లో నిరంతరం ధ్యానించేలా వరమివ్వమని వేడినారు.

**విశే :** దేహికి ముందు దేహాభిమానం, ఆపై జ్ఞానసంపాదనం, ఆపై భగవద్భక్తి, ఆపై భగవల్లీనం – కాగల్గే ధ్యానయోగం – ఈ వరుసలో గోపికల పరిణతి ప్రదర్శించబడింది. కర్మయోగ, భక్తియోగ, జ్ఞానయోగాలు భగవత్సన్నిధికి సోపానక్రమం అని భాగవత సందేశం.

**క. అని వేడినఁ గృష్ణుఁడు ముని, వినతుఁడు కరుణించి వల్లవీజనములు గో**
**రిన యట్ల యిచ్చెఁ గరుణా, వననిధి సద్భక్తలోకవత్సలుఁ డంతన్. 1075**

**ప్రతి :** అని వేడినన్= ఇలా ప్రార్థింపగా, కృష్ణుడు; మునివినతుడు= మునులచే నమస్కరింపబడేవాడు; కరుణ= దయ అనే; వననిధి= జలానికి స్థానంవంటివాడు; సత్+భక్త లోకవత్సలుడు= శ్రేష్ఠులైన భక్తుల సమూహంపై వాత్సల్యం గలవాడు; అంతన్= అప్పుడు; వల్లవీ జనములు= గోపస్త్రీలు; కోరిన+అట్ల= వారు కోరుకొన్న విధంగా; కరుణించి= దయతో; ఇచ్చెన్= అనుగ్రహించాడు.

**తా :** గోపికల ప్రార్థనవిని, మునులచే నమస్కారాలు పొందేవాడు, కరుణాసముద్రుడు, భక్తులంటే అపారంగా వాత్సల్యంచూపే ఆ శ్రీకృష్ణుడు గోపికలు కోరినట్లుగా నిరంతరపదధ్యానాసక్తిని ప్రసాదించాడు.

**ఉ. ధర్మతనూభవుం గని పదంబులకున్ నతుఁడై సపర్యలన్**
**నిర్మలభక్తిమై నడపి నీవును దమ్ములు బంధుకోటి స**
**త్కర్మ చరిత్రులై తగు సుఖంబుల నొప్పుచు నున్నవారె నా**
**నర్మిలిఁ బాండవాగ్రజుఁడు న మ్మధుసూదనుతోడ నిట్లనున్. 1076**

**ప్రతి :** ధర్మతనూభవున్+గని= (యమ)ధర్మరాజు కుమారుడైన ధర్మరాజును చూచి; పదంబులకున్ నతుడై= పాదాలకు నమస్కరించి; నిర్మల భక్తిమైన్= స్వచ్ఛమైన భక్తితో; సపర్యలన్= సేవలు; నడపి= చేసి; నీవును, తమ్ములు, బంధుకోటి= నీవూ (ధర్మరాజు); తమ్ములైన తక్కిన పాండవులు నలుగురూ, బంధువులంతా, సత్+కర్మ చరిత్రులై= మంచి పనులు చేసేవారై; తగు సుఖంబులన్+ఒప్పుచున్+ఉన్నవారు+ఎ?= యోగ్యాలైన సుఖాలు అనుభవిస్తున్నారా? నాన్= అనగా; అర్మిలిన్= ప్రేమతో; పాండవ+అగ్రజుడు= పాండుకుమారులలో పెద్దవాడైన ధర్మజుడు; ఆ+మధుసూదనునితోడన్= ఆ శ్రీకృష్ణునితో; ఇట్లు+అనున్= ఇలా అన్నాడు.

**తా :** అక్కడికి వచ్చి శ్రీకృష్ణుడు ధర్మరాజును చూచి, పాదాలకు నమస్కరించి, కపటంలేని భక్తితో సపర్యలుచేసి, "నీవూ, తమ్ములూ, బంధువులూ. సత్కర్మలు చేస్తూ సుఖంగా ఉన్నారా?" అని కుశలం అడుగగా, ధర్మరాజు శ్రీకృష్ణునితో ఇలా బదులిచ్చాడు.

**క. సరసిజనాభ! భవత్పద, సరసీరుహ మాశ్రయించు జను లతిసౌఖ్య**
**స్ఫురణం బొలుపారుచు భువిఁ, జరియింపరె! భక్తపారిజాత! మురారీ! 1077**

**ప్రతి :** సరసిజనాభ= కమలం నాభియందు గలవాడా!; భక్తపారిజాత= భక్తులపాలిటి పారిజాతవృక్షమా!; ముర+అరీ!= ముర అనే రాక్షసుణ్ణి శత్రువుగా గలవాడా! శ్రీకృష్ణా!; భవత్+పద సరసీరుహము= నీయొక్క పాదపద్మాల్ని; ఆశ్రయించు జనులు= ఆధారంగా గల్గిన ప్రజలు; అతిసౌఖ్య స్ఫురణన్= గొప్ప సౌఖ్యస్ఫూర్తితో; పొలుపారుచున్= ప్రకాశిస్తూ; భువిన్= భూమిపై; చరింపరు+ఎ?= తిరుగుతారుకదా!

**తా :** పద్మనాభుడా! మురారీ! నీవంటి భక్తపారిజాతాన్ని ఆశ్రయించిన భక్తజనులు నిత్యసంతుష్టులై ఉంటారుగదా! అని ధర్మరాజు జవాబు ఇచ్చాడు.

**వ. అదియునుం గాక 1078**

**తా :** ఇంకా

**సీ. సుమహితస్వప్నసుషుప్తిజాగరములన్ మూఁడవస్థలఁ బాసి వాఁడి మిగిలి**
**వెలి నుందు లో నుందు; విశ్వమై యుందువు;, విశ్వంబు నీయందు వెలుఁగుచుండు;**
**భవదీయమహిమచేఁ బాటిల్లు భువనంబు, లుదయించు నొక వేళ నుడిగి మడుఁగు;**
**సంచితాఖండితాజ్ఞానివై యొప్పుచు నవిహతయోగమాయాత్మఁ దనరి**

**తే. దురితదూరులు నిత్యముక్తులకుఁ జెంద, నలవియై పెంపు దీపింతు వంబుజాక్ష !**
**ఘనకృపాకర ! నఖిలవికారదూర!, నీకు మ్రొక్కెద సర్వలోకైకనాథ ! 1079**

**ప్రతి :** సుమహిత= గొప్పగా; స్వప్న= కలలుకంటున్న స్థితి; సుషుప్తి= నిద్రావస్థ; జాగరములన్= మేల్కొనుట అనే; మూడు+అవస్థలన్= తెలివి, కల, నిద్ర అనే మూడు స్థితుల మనఃస్థితిని; పాసి= వదలిన అతీతస్థితిలో, వాడి మిగిలి= అతీతంగా ఉండి; వెలిన్+ఉందు(వు)= బయట ఉంటావు; లోన్+ఉందు(వు)= లోపల ఉంటావు; విశ్వము+ఐ+ఉందువు= విశ్వమే నీవై ఉంటావు; విశ్వంబు నీ+అందున్ వెలుగుచున్+ఉండు= ఈ సమస్తవిశ్వమే నీలో భాసిస్తుంది; భవదీయ మహిమచేన్= నీ మహిమచే; పాటిల్లు= నడిచే; భువనంబులు= చతుర్దశ భువనాలు; ఉదయించున్= పుట్టాయి; ఒకవేళన్+ఉడిగి, మడుగు= మరొకమారు అణగి, నశించి పోతూంటుంది; సంచిత+అఖండిత+జ్ఞానివి+ఐ= నిధిగా ఉన్న గొప్ప జ్ఞానస్వరూపివై; ఒప్పుచున్= ప్రకాశిస్తూ; అవిహిత= లోబడని; యోగమాయ+ఆత్మన్+తనరి= యోగమాయతో కూడిన రూపంతో ఒప్పి; దురితదూరులు= పాపానికి దూరంగా ఉండేవారికి; నిత్యముక్తులు= భవబంధాలను సర్వదా వదిలినవారికికూడా; చెందన్+అలవి+ఐ= పొందుటకు శక్యమై; పెంపు దీపింతువు= అతిశయంగా ప్రకాశిస్తావు; అంబుజాక్ష= కమలాల వంటి కన్నులుకలవాడా; ఘనకృప+ఆకర= గొప్పనైన దయకు నిలయమైనవాడా!; అఖిలవికారదూర= సమస్తాలైన వికారాలకు; దూరంగా ఉన్నవాడా!; సర్వలోక+ఏకనాథ= అన్ని లోకాలకు (నీవు మాత్రమే) ఈశ్వరుడవైనవాడా!; శ్రీకృష్ణా! నీకు మ్రొక్కెదన్= నీకు నమస్కరిస్తున్నాను.

**తా :** కృష్ణా! జాగ్రదాదిఅవస్థాత్రయానికి నీవు అతీతుడివి. సర్వత్ర వ్యాపించినవాడివి. విశ్వంలో నీవు, నీలో విశ్వం ఉన్నాయి. విశ్వాన్ని నిలిపి ఉంచేది నీవే. సర్వభువనాలు నీలోపుట్టి; నీలో స్థితికల్గి, నీలోనే నశిస్తాయి. అఖండ జ్ఞానస్వరూపుడివి. యోగమాయను నీలో ధరించినవాడివి. పుణ్యాత్ములు, నిత్యముక్తులైన యోగులైనవారికిసైతం లభించేవాడివి. నీరజాక్షుడివి, నిఖిలలోకేశ్వరుడివి, దయాసముద్రుడివి, సమస్త వికారాలూ దూరంచేసే ఓ జగద్రక్షకా! నీకు నమస్కరిస్తున్నాను అని ధర్మజుడు స్తుతించాడు.

**విశే :** 1. భాగవతం దశమస్కంధం అంతా కృష్ణావతారగాథ, భగవత్తత్త్వం, భగవంతుణ్ణి చేరే జీవన విధానం, విశ్వమూలాలు – వీటిమీదే విషయం కేంద్రీకృతమౌతుంది. సందర్భోచితంగా ఆయాపాత్రల రూపంలో భగవన్నుతి సువ్యక్తమౌతుంది. తనకు పాదాభివందనంచేసి నమస్కరించిన శ్రీకృష్ణుణ్ణి ధర్మజుడు స్తుతించిన ఈ విధానంలో ధర్మజుడు నిమిత్తంగా వ్యాసమహర్షి సర్వలోకులకూ భగవత్తత్త్వం సువ్యక్తం చేస్తున్న సందర్భమిది.

**క. అని వినుతించిన నచ్చుటి, జనపాలకబంధుమిత్రసకలజనములున్**
**విని యనురాగిల్లిరి నె, మ్మనముల నానంద జలధిమగ్నులు నగుచున్. 1080**

**ప్రతి :** అని వినుతించినన్= ఇలా ధర్మరాజు స్తుతించగా; అచ్చుటి జనపాలక, బంధు, మిత్ర; సకలజనములున్= అక్కడ ఉన్న రాజులు, కృష్ణుని బంధువర్గము, మిత్రులు, మిగిలినవారలు; నెఱ+మనములన్= నిండైన మనస్సులతో; విని= శ్రీకృష్ణుని దివ్యత్వాన్ని గూర్చి విని; ఆనంద జలధి మగ్నులున్+అగుచున్= ఆనందమనే సముద్రంలో మునిగినవారై; అనురాగిల్లిరి= సంతోషపడ్డారు.

**తా :** ఈ విధంగా ధర్మరాజు శ్రీకృష్ణుణ్ణి స్తుతించగా అక్కడ ఉన్న రాజులు, బంధువులు, మిత్రులు, గోపాలకులు, తదితరులు నిండైన మనసుతో సంతోషంతో విన్నారు.

**తే. అట్టి యొప్పగువేళ నెయ్యంబు మెఱసి, యొక్కచోటను సంతోషయుక్తు లగుచు**
**దానవాంతకసతులును ద్రౌపదియును, గూడి తమలోన ముచ్చట లాడుచుండి. 1081**

**ప్రతి :** అట్టి= అటువంటి; ఒప్పు+అగువేళ= చక్కని సమయంలో; నెయ్యంబు మెఱసి= స్నేహం అతిశయించగా; ఒక్కచోటను= ఒకేచోట; సంతోషయుక్తులు+అగుచున్= సంతోషించేవారవుతూ; దానవ+అంతక సతులును= (రాక్షసుల్ని సంహరించే) శ్రీకృష్ణునిభార్యలు; ద్రౌపదియును+కూడి= పాండవపత్నితోకలసి; తమలోన= పరస్పరం; ముచ్చటలు+ఆడుచుండి= సల్లాపాలు సలుపుతుండగా...

**తా :** అటువంటి చక్కని సందర్భంలో స్నేహంతోకూడి, ఒకేచోట గుమిగూడి, కృష్ణుని భార్యలు, ద్రౌపది ఆనందంగా సరసల్లాపాల్లో మునిగి ఉండగా

## ❖ లక్షణ యను శ్రీ కృష్ణుని యష్టమభార్య ద్రౌపదీ దేవికిఁ దన వివాహ వృత్తాంతంబు దెలుపుట ❖

**వ. అట్టియెడఁ గృష్ణ కథావిశేషంబులు పరితోషంబున నుగ్గడించుచుఁ బ్రసంగవశంబున నా రుక్మిణీదేవి మొదలగు శ్రీకృష్ణభార్యలం గనుంగొని పాంచాలి యిట్లనియె. 'మిమ్ముఁ బుండరీకాక్షుండు వివాహం బయిన తెఱంగులు వినిపింపుఁ డన వారును దమ పరిణయంబుల తెఱంగులు మున్ను నే నీకుం జెప్పిన విధంబున వినిపించి; రందు సవిస్తరంబుగాఁ దెలియం బలుకని మద్రరాజకన్యకావృత్తాంతం బా మానిని పాంచాలికిం జెప్పినవిధంబు విను మని శుకుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 1082**

**ప్రతి :** అట్టి+ఎడన్= ఆ సమయంలో; కృష్ణ కథావిశేషంబులు= శ్రీకృష్ణుని జీవిత గాథలు; పరితోషంబునన్= సంతోషంగా; ఉగ్గడించుచున్= వెల్లడిస్తూ; ప్రసంగవశంబునన్= మాటల సందర్భంగా; ఆ, రుక్మిణీదేవి, మొదలగు, శ్రీకృష్ణ, భార్యలన్+కనుంగొని= శ్రీకృష్ణుని దేవేరులను చూచి; పాంచాలి+ఇట్లు+అనియెన్= పాంచాలి (ద్రౌపది) ఇలా అంది; మిమ్మున్= మిమ్మల్ని; పుండరీక+అక్షుండు= (తెల్ల కలువలవంటి కన్నులు కల) శ్రీకృష్ణుడు; వివాహంబు+అయిన; తెఱంగులు= పెళ్లిచేసికొన్నవిధాలు; వినిపింపుఁడు+అనన్= చెప్పండనగా, వారును; తమ పరిణయంబుల తెఱంగులు= తమ పెళ్లిళ్లముచ్చట్లు; మున్ను= పూర్వ; నేన్= నేను; నీకున్+చెప్పిన విధంబునన్= నేను (శుకుడు); నీకు చెప్పిన ప్రకారంగా; వినిపించిరి= చెప్పారు; అందు సవిస్తరంబు+కాన్+తెలియన్+పలుకని= వారిగాథల్లో విపులంగా గతంలో తెలియజెప్పని; మద్ర రాజకన్యకా

వృత్తాంతంబు= మద్రదేశాధిపతి కూతురు లక్షణాదేవి వివాహకథ; ఆ మానిని= ఆ లక్షణ; పాంచాలికిన్+చెప్పిన విధంబు= ద్రౌపదికి చెప్పిన విధానం; వినుము+అని; శుకుండు పరీక్షిత్+నరేంద్రునికి= శుకమహర్షి పరీక్షిత్తు మహారాజుకు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తా :** ముచ్చటలో భాగంగా శ్రీకృష్ణునిగాథలు చెప్పుకుంటుండగా ద్రౌపదీదేవి, రుక్మిణి మొదలగు కృష్ణుని దేవేరుల్ని, మీ మీ వివాహవృత్తాంతాల్ని చెప్పండనగా వారు శ్రీకృష్ణుణ్ణి పరిణయమాడిన విధం వివరించారు. ఓ పరీక్షిన్మహారాజా! అది నేను నీకు గతంలో చెప్పాను. ఒక్క లక్షణాదేవి కథమాత్రం ఆమె ద్రౌపదికి చెప్పిన వృత్తాంతము ఇపుడు సవిస్తరంగా చెప్తానని శుకుడన్నాడు.

**సీ. పాంచాలితో మద్రపతిసుత యిట్లను సంగీతవిద్యావిశారదుండు**
**నారదుచేతి వీణాస్వనకలిత మై నట్టి గోవిందకథామృతంబు**
**దవిలి యేఁ గ్రోలి చిత్తము దన్మయత్వంబు నొంది మోదించుచు నుందునంత**
**దుహితృవత్సలుఁడు మద్గురుఁడు దా నది విని సదుపాయ మొక్కటి మదిఁ దలంచి**

**తే. చదల నెబ్భంగి నైన గోచరము గాక, వారిమధ్యములో నభివ్యాప్తి దోఁచు**
**మత్స్యయంత్రంబు కల్పించి మనుజు లెంత, వారి కైనను దివ్వ మోవంగరాని. 1083**

**ప్రతి :** పాంచాలితో= పాంచాల రాజపుత్రి ద్రౌపదితో; మద్రపతి సుత= మద్రదేశాధిపతి అయిన బృహత్సేనునికూతురు, ఇట్లు+అను= ఇలా అంది; సంగీత విద్యావిశారదుండు= సంగీత శాస్త్రంలో నైపుణ్యంగల్గిన; నారదు చేతి= నారద మహర్షి చేతిలోగల; వీణా స్వనకలితము+ఐనట్టి= 'మహతి' అనే పేరుగల వీణానాదంతో పాటు కలిపిన; గోవింద కథా+అమృతంబు= అమృతవంటి శ్రీకృష్ణుని కథ (గానం చేయగా); తవిలి= తగిలి= ఆకర్షితురాలనై; ఏన్+క్రోలి= నేను ఆస్వాదించి; చిత్తము= మనస్సు; తద్+మయత్వంబున్+ఒంది= పరవశత్వాన్ని పొంది; మోదించుచున్+ఉందునంత= సంతోషిస్తూ ఉండగా; దుహితృ వత్సలుడు= కూతురుపట్ల (మిక్కిలి) ప్రేమగల్గిన; మద్+గురుడు= నా తండ్రి; తాన్+అది, విని= నా ప్రేమను తెలుసుకొని; మదిన్= తన మనస్సులో; ఒక్కటి= ఒక; సత్+ఉపాయము= మంచి ఉపాయం; తలచి= భావించి; చదలన్= ఆకాశంలో; ఏ+భంగిన్+ఐనన్= ఏవిధంగా కూడా; గోచరమున్+కాక= కనబడకుండా; వారి మధ్యములోన్= నీళ్లనడుమ; అభివ్యాప్తి= చక్కగా వ్యాప్తమై (విస్తరించి); తోఁచు= కనబడే; మత్స్యయంత్రంబు= మత్స్యయంత్రాన్ని; కల్పించి; మనుజులు+ఎంతవారికిన్+ఐనను= ఎంతటి (బలాఢ్యులైన) వారికినైన; తివ్వ= తీయుటకు; మోవన్+కన్= మోయడానికి; రాని= వీలుకాని...

**తా :** ద్రౌపదితో లక్షణ తననుగూర్చి ఇలా చెప్పింది. సంగీత విశారదుడైన నారదుడు వీణావాదన తోడుచేసుకొని శ్రీకృష్ణుని కథల్ని పాటలుగా పాడి వినిపించగా, నేను వాటికి ఆకర్షితురాలనై, శ్రీకృష్ణుణ్ణే మనస్సునందు నిల్పి తన్మయురాలనై ఉండగా, ఆ విషయం తెలిసిన మా తండ్రి నామీద ప్రేమతో, శ్రీకృష్ణునకే ఇచ్చి నన్ను పెళ్లి చేయడానికి ఇతరరాజులకు కోపం రాకుండా ఒక ఉపాయం పన్నాడు. ఆకాశంలో ఉంచినా, ఎవరికీ కనబడకుండ, కింద నీటిలో మాత్రం ప్రతిబింబం కనబడేట్లు మత్స్యయంత్రాన్ని ఏర్పాటుచేశాడు. ఎంతటి గొప్పవాళ్లకైనా కదిలించడానికీ, అల్లెత్రాడు ఎక్కిరావడానికీ వీలుకాని

**విశే :** లక్షణకు శ్రీకృష్ణునిపై మక్కువ కల్గడానికి నారదుడు కారణం. ఆమె ప్రేమ తండ్రికి తెలిసింది. తండ్రికి పుత్రికపై అమితానురాగం. ఆయనకు అందుకే "దుహితృవత్సలు" డని విశేషణం వాడబడింది. కృష్ణుడుమాత్రం ఛేదించగల్గేటట్లు,

ఇతరులెవ్వరికీ సాధ్యంకాని ఒక ప్రత్యేకమైన మత్స్యయంత్రాన్ని స్వయంవరానికై ఏర్పాటుచేశాడు. అర్జునుని మత్స్యయంత్రభేదనంలో చేప కనబడుతుంది. ఇక్కడ పైన చేప కనబడదు. అదీ విశేషం. శ్రీకృష్ణుడు విలువిద్యలో అర్జునునికన్నా మేటి అని తెలుస్తూంది.

**తే. ధనువుఁ బవిచండనిష్ఠురాస్త్రంబు నచట, సంచితంబైన గంధపుష్పాక్షతలను**
**బూజ గావించి యునిచి యే పురుషుఁడేని, నిద్ధబలమున నీ చాప మెక్కు వెట్టి. 1084**

**ప్రతి :** ధనువున్= ధనుస్సునూ; పవి= వజ్రాయుధంవంటి; చండ= భయంకరమైన; నిష్ఠుర+అస్త్రంబున్= కఠినమైన బాణాన్ని ఉంచి; అచ్చట= మత్స్యయంత్రసమీపంలో; సంచితము+ఐన= వినియోగానికై ఉంచబడిన; గంధపుష్ప+అక్షతలను= సుగంధలేపనాలు, పువ్వులు, అక్షతలతో; పూజ+కావించి; పూజచేసి; ఉనిచి= ఉంచి; ఏ పురుషుడు+ఏనిన్= ఏ మగవాడైనా; ఇద్ధబలమునన్= ప్రకాశమానమైన బలంతో; ఈ చాపము+ఎక్కుపెట్టి= ఈ ధనుస్సు ఎక్కుపెట్టి (బిగించి)...

**తా :** ధనుస్సునూ, వజ్రాయుధంతో సమానమైన బాణాన్ని, మత్స్యయంత్రంవద్ద గంధాక్షతలు, పుష్పాలతో పూజించి, "ఏ పురుషుడైనా ఈ ధనుస్సు ఎక్కుపెట్టి

**క. ఈ సాయకంబు నారిం, బోసి వెసన్ మత్స్యయంత్రమున్ ధరఁ గూలన్**
**వేసిన శౌర్యధురీణుఁడు, నాసుత వరియించు నని జనంబులు వినఁగన్. 1085**

**ప్రతి :** ఈ సాయకంబు= ఈ బాణం; నారిన్+పోసి= అల్లెతాటికి సంధించి; వెసన్= వేగంగా; మత్స్యయంత్రమున్= చేప ప్రతిబింబించేలా ఏర్పర్చిన యంత్రాన్ని; ధరన్+కూలన్= నేలపై పడగా; వేసిన= విడిచిన; శౌర్యధురీణుడు= శూరత్వంచే నేర్పరియైనవాణ్ణి; నా సుత= నా కూతురు; వరియించున్+అని= పెళ్లాడుతుందని; జనంబులు వినఁగన్= ప్రజలంతా వింటుండగా (చాటెనని)...

**తా :** ఈ బాణాన్ని విల్లుకు ఎక్కుపెట్టి, మత్స్యయంత్రాన్ని నేలగూల్చిన ధనుర్విద్యా నైపుణ్యంగల శూరుణ్ణి నా కూతురు వరిస్తుందని అందరూ వింటుండగా (ప్రకటించాడు)

**క. చాటించిన న వ్వార్తకుఁ, బాటించిన సంభ్రమముల బాణాసన మౌ**
**ర్వీ టంకార మహారవ, పాటితశాత్రవులు బాహుబలసంపన్నుల్. 1086**

**ప్రతి :** చాటించినన్= మద్రాధిపతి చాటించగా; ఆ+వార్తకున్= ఆ ప్రకటనకు; పాటించిన= అనుగుణమైన; సంభ్రమములన్= తొట్రుపాటులతో; బాణ+ఆసన= ధనుస్సులయొక్క; మౌర్వీ= అల్లెతాటి; టంకార= ధ్వనియొక్క; మహారవ= గొప్పధ్వనిచే; పాటితశాత్రవులు= చీల్చబడిన శత్రువులుగలవారు; బాహుబల సంపన్నులు= భుజబల సంపదగలవారు...

**తా :** మా తండ్రి చాటింపు వేయిస్తే విని దానికనుగుణంగా, నన్ను వివాహమాడాలనే వేగిరపాటుతో గొప్పగొప్ప ధనుర్ధరులైన రాజులు

**క. సుందరతనులు దదుత్సవ, సందర్శనకుతుకు లమితసైన్యులు భూభృ**
**న్నందను లేతెంచిరి జన, నందితయశు లగుచు మద్రనగరంబునకున్. 1087**

**ప్రతి :** సుందరతనులు= అందమైన శరీరాకృతిగలవారు; తద్+ఉత్సవ సందర్శనకుతుకులు= ఆ పెండ్లి సంబరాన్ని చూడాలనే ఉబలాటంగలవారు; అమితసైన్యులు= గొప్పసైన్యంతో కూడినవారై; భూభృత్+నందనులు= రాజకుమారులు; జన నందితయశులు+అగుచున్= ప్రజలచే పొగడబడే కీర్తిగలవారై; మద్రనగరంబునకున్= మద్రనగరానికి; ఏతెంచిరి= వచ్చారు.

**తా :** వివాహసంబరాన్ని చూచే ఉబలాటంగలవారు అయిన అందమైన రాజకుమారులు కీర్తిమంతులు అమిత సైన్యాలతో మద్రనగరానికి వచ్చారు.

**క.** **చనుదెంచినవారికి మ, జ్జనకుఁడు వివిధార్చనములు సమ్మతిఁ గావిం**
**చిన నా బాహుబలాఢ్యులు, ధనువుం జేరంగ నరిగి ధైర్యస్ఫూర్తిన్.** **1088**

**ప్రతి :** చను+తెంచిన= వచ్చిన; వారికిన్= రాజులకు; మత్+జనకుఁడు= మా తండ్రి; సమ్మతిన్= సంతోషంగా; వివిధ+అర్చనములు= అనేకంగా పూజలు (అతిథి మర్యాదలు); కావించినన్= చేయగా; ఆ బాహుబల+ఆఢ్యులు= బలమైన భుజశక్తితో గొప్పవారైన ఆ రాజులు; ధైర్యస్ఫూర్తిన్= ధైర్యం స్ఫురించేలా; ధనువున్= వింటిని; చేరన్+కన్+అరిగి= దగ్గరగా వెళ్లి...

**తా :** స్వయంవరానికి వచ్చిన రాజుల్ని అర్ఘ్య, పాద్య, మజ్జన, భోజనవసతి తాంబూలాది అతిథిమర్యాదలతో సంతోషంగా ఆహ్వానించినాడు. మహాబలులైన వారు స్వయంవరమంటపంలో మత్స్యయంత్రభేదనానికి సన్నద్ధులై ధైర్యంగా ధనుస్సు దగ్గరగా పోయి

**వ.** **ఇట్లు దగ్గఱి యద్ధనువుం గనుంగొని.** **1089**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; దగ్గఱి= సమీపించి; ఆ+ధనువున్= ఆ విల్లును; కనుంగొని= చూచి...

**తా :** ఇలా సమీపించి ఆ ధనుస్సును చూచి

**ఉ.** **కొందఱు పూనలేక చనఁ, గొందఱు పూని కదల్పలేక పోఁ,**
**గొంద ఱొకింత యెత్త, నొక కొందఱు మోపిడలేక దక్కఁగాఁ,**
**గొంద ఱొకింత యెక్కిడుచుఁ, గోరి నృపాలకు లిట్లు సిగ్గునుం**
**జెంది తలంగి పోవుచును సీ యిట కేఁగుట నీతి త ప్పనన్.** **1090**

**ప్రతి :** కొందఱు= వచ్చినవారిలో కొద్దిమంది; పూనలేక= సిద్ధపడలేక; చనన్= వెళ్లిపోగా, కొందఱు; పూని కదల్పలేక= సిద్ధపడి విల్లును కదిలించలేక; పోన్= తొలగిపోగా; కొందఱు+ఒక+ఇంత+ఎత్తన్= మరికొద్ది మంది విల్లును కొంచెం ఎత్తగా; ఒక కొందఱు మోపు+ఇడలేక= మరికొందరు విల్లును నేలపై నిలబెట్టలేక; తక్కన్+కాన్= తొలగగా; కొందఱు+ఒకింత+ఎక్కిడుచున్= మరికొందరు కొంచెం ఎక్కుపెట్టగా; కోరి= మత్స్యయంత్రాన్ని కొట్టగోరి; ఇట్లు, నృపాలకులు= రాజులు; సిగ్గునున్+చెంది= సిగ్గుపడి; తలంగి పోవుచున్= తొలగిపోతూ; “సీ+ఇటకున్+ఏగుట(వచ్చుట) నీతి తప్పు”+ అనన్= ఛీ ఇక్కడకు వచ్చుట నీతి బాహ్యమైందని అనుకొంటూ...

**తా :** సభాప్రాంగణంలో కొందరు ధనుస్సు వద్దకే వెళ్లక, వెళ్లినా కొందరు కదల్చలేక, కొందరు కొంచెమెత్తి విఫలురై, కొందరునేలపై ఉంచి, అల్లెత్రాడు బిగించి, మరికొందరు బాణం బిగించలేక సిగ్గుపడి, "ఛీ! ఇక్కడికి రావడమే పెద్ద తప్పు" అనుకొంటూ

**వ. అట్టియెడ. 1091**

**ప్రతి :** అట్టి+ఎడన్= ఆ సమయంలో...

**క. భీముఁడు రాధేయుఁడు ను, ద్దామగతి న్నెక్కు ద్రోఁచి తగ నమ్మీనం**
**బేమఱక దిరుగుచుంటయుఁ, దా మేమియు నెఱుఁగలేక తలఁగిన పిదపన్. 1092**

**ప్రతి :** భీముడు; రాధేయుడు= కర్ణుడు; ఉద్దామగతిన్= భీకరంగా; ఎక్కన్+త్రోచి= ఎక్కుపెట్టి బాణంవేసి; తగన్+ఆ+మీనంబు= ఆ మత్స్యం చక్కగా; ఏమఱక+తిరుగుచుంటయున్= వేగంగా ఆగకుండా పైన తిరుగుతుండగా; ఏమియున్+ఎఱుగలేక= కొంచెంకూడా కనుక్కోలేక; తలఁగిన పిదపన్= వెళ్లిన తరువాత...

**తా :** భీముడూ, కర్ణుడూ ఆర్భాటంగా ముందుకు వచ్చి, విల్లు ఎక్కుపెట్టి బాణంవేసి, ఆ మత్స్యం అలుపెరుగని రీతిగా వేగంగా పైన తిరుగుతుంటే – దాన్ని కనుక్కోలేక విఫలురై వెనుతిరిగిన తరువాత

**క. అమరేంద్రతనయుఁ డ మ్మ, త్స్యము నేయ నుపాయ మెఱిఁగి తగ నేసియు మీ**
**నము ద్రుంపలేక సిగ్గున, విముఖుం డై చనియె నంత వికలుం డగుచున్. 1093**

**ప్రతి :** అమర+ఇంద్ర తనయుడు= దేవతల ప్రభువు ఐన ఇంద్రునికొడుకు – అర్జునుడు; ఆ+మత్స్యమున్+ఏయన్= ఆ యంత్రపుచేపను పడవేయడానికి; ఉపాయము+ఎఱిగి= తగిన విధానం తెలిసినవాడై; తగన్+ఏసియు= సరిగ్గా బాణం వేసికూడా; మీనము+త్రుంపలేక= చేపను పడగొట్టలేక; సిగ్గున విముఖుండు+ఐ= సిగ్గుతో ముఖం తిప్పుకొని; వికలుండు+అగుచున్= చిన్నబోయినవాడై; అంతన్ చనియెన్= అప్పుడు వెనుదిరిగి పోయినాడు.

**తా :** ఇంద్ర తనయుడైన అర్జునుడు మత్స్యయంత్రాన్నికొట్టే ఉపాయం తెలిసినవాడైనా, బాణంవేసి, చేపను పడగొట్టలేక విముఖుడై, వికలమనస్కుడై తిరిగిపోయాడు.

**వ. ఇట్లు సకలరాజకుమారులుం దమతమప్రయత్నంబులు విఫలంబులైన ముఖారవిందంబులు ముకుళించి దైన్యంబున విన్ననై చూచుచున్న యెడ. 1094**

**ప్రతి :** ఇట్లు= ఇలా; సకల రాజకుమారులున్= స్వయంవరానికి వచ్చిన అందరు రాకుమారులందరూ; తమతమ ప్రయత్నంబులు= ఎవరికి వారు చేసిన ప్రయత్నాలు; విఫలంబులు+ఐన= విఫలం కాగా; ముఖ+అరవిందంబులు= కమలములవంటిముఖాలు; ముకుళించి= ముడుచుకొని; దైన్యంబునన్+విన్నన్+ఐ= దీనత్వంచే చిన్నబోయి; చూచుచున్+ఉన్న+ఎడ= చూస్తున్న సమయంలో...

**తా :** వచ్చిన రాజకుమారులంతా మత్స్యయంత్రాన్ని ఛేదించే యత్నాలుచేసి అవి వమ్ముకాగా, చిన్నబోయి, దిగులుతో కూడిన ముఖాలతో చూస్తుండగా

**చ. సరసిజ పత్త్రలోచనుఁడు చాపము సజ్యము సేసి యుల్లస**
**చ్ఛర మరిఁబోసి కార్ముకవిశారదుఁడై యలవోక వోలె ఖే**
**చర మగు మీనముం దునిమె సత్వరతన్ సురసిద్ధ సాధ్య ఖే**
**చరజయశబ్ద మొప్పఁ బెలుచం గురిసెం దివిఁ బుష్పవర్షముల్. 1095**

**ప్రతి :** సరసిజపత్త్రలోచనుడు= తామరరేకులవంటి కన్నులు కల శ్రీకృష్ణుడు; చాపమున్= వింటిని; స+జ్యముచేసి= అల్లెత్రాడుతో కూడుకొన్నదానిగా చేసి; ఉల్లసత్+శరము= ప్రకాశిస్తున్న బాణం; అరిన్+పోసి= నారిని మధ్యలో బిగించి; కార్ముక విశారదుడై= బాణ ప్రయోగంలో నేర్పరిగా ఉండి; ఖేచరమగు= ఆకాశంలో తిరుగాడే; మీనమున్= యంత్రపుచేపను; సత్వరతన్= వేగంతో; అలవోకక+పోలె= తేలికగా; తునిమెన్= కూల్చాడు; సుర, సిద్ధ, సాధ్య, ఖేచర= దేవతలు, సిద్ధులు, సాధ్యులు, ఆకాశసంచారులైన దేవజాతులవారియొక్క; జయశబ్దము= జయ అనే శబ్దం; ఒప్పన్= బాగా పలుకుతుండగా; దివిన్= ఆకాశంనుండి, పుష్పవర్షముల్= పూలవానలు, పెలుచన్= దట్టంగా; కురిసెన్= వర్షించాయి.

**తా :** శ్రీకృష్ణుడు వింటికి అల్లెత్రాడుకట్టి, మెరిసే బాణాన్ని సంధించి, తన విలువిద్యా నైపుణ్యం ప్రకాశించగా ఆకాశంలో తిరుగాడే యంత్ర మీనాన్ని కూలవేశాడు. సురసిద్ధాదిదేవజాతులు జయజయ ధ్వానాలు చేశారు. ఆకాశంనుండి పూలవాన కురిసింది.

**వ. అయ్యవసరంబున నేనుం బరితుష్టాంతరంగనై పరమానందవికచ వదనారవింద నగుచు, నిందిందిర సన్నిభంబులగు చికురబృందంబులు విలసదలికఫలకంబునం దళుకు లొలుకు ఘర్మజలకణంబులం గరంగు మృగమదతిలకంపు టసలున మసలుకొనినం గరకిసలయంబున నోసరించుచు మిసమిస మను మెఱుంగుగములు గిఱికొన నెఱిగౌను వడవడ వడంక నప్పుడు మందగమనంబున. 1096**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ఏనున్= నేను కూడా; పరితుష్ట+అంతరంగన్+ఐ= బాగా సంతృప్తి చెందిన హృదయం కలదాన్నై; పరమ+ఆనంద వికచ= గొప్ప ఆనందంచే వికసించిన; వదన+అరవిందన్+అగుచున్= ముఖకమలంకలదాన్నై; ఇందిందిర సన్నిభంబగు= తుమ్మెదలతో సమానమైన; చికుర బృందంబులు= వెంట్రుకల సమూహాలు; విలసత్+అలిక ఫలకంబునన్= వికసించిన నుదుటి భాగంలో; తళుకులు+ఒలుకు= వెలుగులు చిమ్మే; ఘర్మజల కణంబుల= చెమట బిందువులతో; కరంగు= కరిగిన; మృగమద తిలకము+అసలున= కస్తూరి తిలకంయొక్క బురదలో; మసలుకొనినన్= చిక్కగా; కరకిసలయంబునన్= చిగురుటాకువంటి చేతితో; ఓసరించుచున్= తొలగించుకొంటూ; మిసమిస+అను= తళుకులీనే; మెఱుంగు గములు= మెరుపుల గుంపులు; గిఱికొనన్= వ్యాపించగా; నెఱి+కౌను= అందమైన నడుము వడవడ వడంకన్= గజగజలాడుతూ వణకుతూండగా; అప్పుడు= ఆ సమయంలో; మంద గమనంబునన్= మెల్లగానడుస్తూ...

**తా :** ఆ సమయంలో అంతులేని ఆనందం కల్గింది. ముఖం వికసించింది. సంభ్రమంవల్ల కల్గిన చెమట బిందువులు ఫాలభాగాన కారి కస్తూరితిలకాన్ని చిత్తడిచేయగా, ఆ రేఖల్లో చిక్కుకున్న తుమ్మెదల గుంపుల్లాంటి నల్లనికురుల్ని, చిగురుటాకు చేతులతో పక్కకు జరుపుతూ, తళుకులీనే మోముపై మెరుపులు వ్యాపించగా, అందమైన నడుము వణకుతుండగా మెల్లని నడకలతో

**విశే :** కృష్ణుడు కాక ఇతరులు మత్స్యయంత్రంకొడితే, వారినే పెళ్లాడవలసిన లక్షణకు తా నిష్టపడిన కృష్ణుడే మత్స్యయంత్రాన్ని భేదించడం వల్ల ఆమెకు అంతరంగం ఆనందంతో నిండింది. దానివల్ల ఉద్విగ్నత, స్వేదం, వణుకు ఏర్పడగా, నడుము వణుకుతుండగా, మెల్లగా నడుస్తూ

**చ. లలితపదాబ్జనూపురకలధ్వనితో దరహాసచంద్రికా**
**కలితకపోలపాలికలఁ గప్పు సువర్ణవినూత్నరత్న కుం**
**డల రుచు లొప్పఁ గంకణఝణంకృతు లింపెసలార రంగ భూ**
**తలమున కేగుదెంచి ముఖతామరసం బపు డెత్తి చూచుచున్. 1097**

**ప్రతి :** లలిత= మృదువైన; పద+అబ్జ= కమలాలను పోలిన పాదాలందలి; నూపుర= కాలి అందెల; ధ్వనితో= మనోహరమైన చప్పుడుతో; దరహాస చంద్రికా కలిత= చిరునవ్వు వెన్నెలలతో కూడుకొన్న; కపోల పాలికలన్+కప్పు= గండస్థలాల్ని కప్పే; సువర్ణవినూత్న రత్నకుండల రుచులు+ఒప్పన్= బంగారంతో చేసిన కొత్తరత్నాల చెవికమ్మల కాంతులతో ప్రకాశించగా; కంకణఝణంకృతులు+ఇంపు+ఎసలార= చేతికడియాల ఝణత్ ధ్వనులు అందంగా అతిశయించగా; రంగ భూతలమునకున్+ఏగుదెంచి= సభామంటపానికి వచ్చి; ముఖతామరసంబు+అపుడు+ఎత్తిచూచుచున్= కమలమువంటి ముఖాన్ని ఎత్తి చూస్తూ...

**తా :** కాలి అందెలు ఘల్లుమని మోగగా, చిరునవ్వులు పెదవులపై ప్రకాశింపగా, బంగారు కుండలాలకాంతి చెక్కిళ్లపై పడగా, చేతికడియాలు మనోహరంగా ధ్వనిస్తూండగా సభామంటపంలోకి వచ్చి నాల్గుదిక్కుల్నీ మొగమెత్తి చూస్తూ

**విశే :** సహజంగా స్వయంవరంలో కవియే స్వయంవర వధువును వర్ణిస్తాడు. కాని, ఇక్కడ వధువే తన ఆత్మకథ (స్వీయానుభవం) చెప్పడం కథనంలో విశేషం.

**చ. నరపతులం గనుంగొని మనంబున వారిఁ దృణీకరించి మ**
**త్కరజలజాతదివ్యమణికాంచనమాలిక న మ్మురారి కం**
**ధరమున లీలమై నిడి పదంపడి నవ్యమధూకదామ మా**
**హరికబరిం దగిల్చితి నయంబునఁ గన్నుల లజ్జ దేఱఁగన్. 1098**

**ప్రతి :** నరపతులన్= రాజులను; కనుంగొని= చూచి; మనంబున= మనస్సులో; వారిన్+తృణీకరించి= ఆ రాజుల్ని తిరస్కరించి; నయంబున= ధర్మం ప్రకారం; మత్+కర జలజాత= నా హస్తకమలాలలో గల; దివ్యమణి కాంచనమాలికన్= గొప్ప మణులచే పొదుగబడిన బంగారు హారాన్ని; ఆ+మురారి= ఆ శ్రీకృష్ణునియొక్క; కంధరమునన్= మెడలో; లీలమైన్= మెల్లగా; ఇడి= వేసి; పదంపడి= వెనువెంటనే; నవ్య మధూకదామమున్= కొత్తవైన ఇప్పపూలమాలను; ఆ హరికబరిన్= శ్రీకృష్ణునికొప్పులో; కన్నుల= కన్నులలో; లజ్జ= సిగ్గు; తేఱన్+కాన్= కనిపిస్తుండగా; తగిల్చితిన్= వేశాను.

**తా :** సభాభవనం మధ్యలో రాజులందర్నీ జూచి, వారిని తిరస్కరించి, నా చేతుల్లోగల దివ్యమణులు పొదిగిన కాంచన హారాన్ని శౌరిమెడలో వేశాను. అలాగే, ఇప్పపూలమాలనుకూడా విలాసంగా ఈ కృష్ణుని కొప్పుపై ఉంచాను. అపుడు నా కన్నుల్లో సిగ్గు దోబూచులాడింది.

**వ. అప్పుడు.** **1099**

**చ. కొలఁదికి మీఱఁగా దమరుగోముఖడిండిమమడ్డుశంఖ కా**
**హళ మురళీమృదంగ పణవానకదుందుభిఢక్కకాంస్య మ**
**ర్దళ మురజారజాదివివిధధ్వను లేపున భూనభోంతరం**
**బులఁ జెలఁగెన్ నటీనటనముల్ దనరారె మనోహరాకృతిన్.** **1100**

**ప్రతి :** కొలదికి= లెక్కకు; మీఱగాన్= మిక్కిలిగా; దమరు= ఢమరుకం; గోముఖం= ఈ పేరుగల వాద్యం, డిండిమ= చిన్న ఢంకా; మడ్డు= ఈ పేరుగల వాద్యం (గుమ్మెట); శంఖ= శంఖం; కాహళ= బూరకొమ్ము; మురళీ= వేణువు; మృదంగ= మృదంగం; పణవ= తప్పెట; ఆనక= భేరి; దుందుభి= పెద్ద ఢంకా; ఢక్క= మరొక రకమైన ఢంకా; కాంస్య మర్దళ= కంచు మద్దెల; మురజ= మరొకవిధమైన మద్దెల; ఆరజ= తోలువాద్యం; ఆది= మొదలైన; వివిధ ధ్వనులు= వాద్యాల రకరకాల చప్పుళ్లు; ఏపునన్= ఉద్ధతాలై; భూ నభః+అంతరంబులన్= భూమ్యాకాశాల మధ్యలో; చెలగెన్= వ్యాపించాయి; నటీనటనముల్= నాట్యకత్తెల నాట్యాలు; మనోహర+ఆకృతిన్= అందమైన రూపాల్లో; తనరారెన్= ఒప్పాయి.

**తా :** వరమాలవేసిన ఆ మధురక్షణంలో శుభసూచకంగా, ఆనంద చిహ్నంగా ఢమరుక, ఢంకాలు, శంఖాలు, మృదంగాలు, మధుర మురళీ దుందుభులు, ఢక్కామర్దళాలు మొదలైన వివిధరకాల వాద్యధ్వనులు చెలరేగి భూమ్యాకాశాల్లో నిండాయి. నాట్యకత్తెల నాట్యాలు మనోహరంగా ప్రదర్శింపబడినాయి.

**వ. అంత.** **1101**

**ప్రతి :** అంత= అప్పుడు...

**చ. అమరగణంబుఁ దోలి యురగారి సుధాకలశంబుఁ గొన్న చం**
**దమున సమస్తశత్రువసుధావరకోటిఁ దృణీకరించి య**
**క్కమల విలోచనుండు ననుఁ గౌఁగిట నొప్పుఁగ జేర్చి సింహ చం**
**క్రమణ మెలర్పఁ గొంచుఁ జనెఁ గాంచనచారురథంబుమీఁదికిన్.** **1102**

**ప్రతి :** అంత= అపుడు; అమరగణంబున్+దేవతల సైన్యాన్ని; తోలి= పారదోలి; ఉరగ+అరి= పాముల శత్రువైన గరుత్మంతుడు; సుధాకలశంబున్= అమృతంతో నిండి ఉన్న కుండను; కొన్న చందమునన్= స్వీకరించిన విధంగా; సమస్త శత్రు వసుధావరకోటిన్= శత్రురాజుల సమూహాన్ని అంతటిని; తృణీకరించి= తిరస్కరించి; ఆ+కమల విలోచనుండు= ఆ పద్మనేత్రుడైన శ్రీకృష్ణుడు; నన్నున్= నన్ను (లక్షణను); కౌఁగిటన్+ఒప్పుగన్+చేర్చి= అక్కున చక్కగా చేర్చుకొని; సింహ చంక్రమణము= సింహపుగమనం; ఎలర్పన్= ఒప్పగా; కాంచన చారురథంబు మీదికిన్= బంగారంతో చేయబడిన అందమైన రథముపైకి; కొంచున్= తీసుకొని; చనెన్= వెళ్లాడు.

**తా :** ఆ క్షణంలో దేవతల సైన్యాన్ని పారదోలి గరుత్మంతుడు అమృతభాండాన్ని ఎలా హరించాడో అలాగ, అపారమైన శత్రురాజసమూహాన్ని తిరస్కరించి, శ్రీకృష్ణుడు నన్ను అక్కున చేర్చుకొని సింహగమనంతో అందమైన బంగారు రథంమీదకు చేర్చాడు.

**వ. అట్లు రథారోహణంబు సేసిన. 1103**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; రథ+ఆరోహణంబు= రథాన్ని అధిరోహించుట (ఎక్కుట); చేసిన= చేయగా...

**చ. తురగచతుష్కమున్ విమతదుర్దమశూరతఁ బూన్చి దారుకుం**
**దరదము రొప్ప శత్రునికరాంధతమః పటలప్రచండ భా**
**స్కరరుచి నొప్పునట్టి నిజకార్ముకయుక్తగుణప్రఘోష సం**
**భరిత దిగంతరుం డగుచుఁ బద్మదళాక్షుడు వోవుచుండఁగన్ ! 1104**

**ప్రతి :** విమత= శత్రువుల; దుర్దమ= క్రూరంగా అణచివేయగల్గే; శూరతన్= శౌర్యంతో; తురగ చతుష్కమున్= నాలుగు గుర్రాలను; పూన్చి= కట్టి, దారుకుండు= శ్రీకృష్ణుని రథసారథి; అరదము= రథాన్ని; రొప్పన్= తోలగా; శత్రునికర= శత్రురాజుల సమూహమనే; అంధతమః+పటల= ఘాఢమైన చీకట్లసమూహాలకి; ప్రచండ భాస్కరరుచిన్= తీవ్రమైన సూర్యకాంతిగా; ఒప్పున్+అట్టి= అమరినట్టి; నిజకార్ముక= తన విల్లుకు; యుక్త= బిగించిన; గుణ ప్రఘోష= అల్లెతాటి ధ్వనితో; సంభరిత= నిండిన; దిక్+అంతరుడు+అగుచున్= దిక్కుల మధ్య భాగంకలవాడవుతూ; పద్మదళ+అక్షుడు= కమలపురేకులవంటి కన్నులు కలవాడైన శ్రీకృష్ణుడు; పోవుచుండన్+కన్= రథంపై పోతూఉండగా...

**తా :** లక్షణతో కూడి, శ్రీకృష్ణుడు రథమెక్కి సారథి అయిన దారుకుడు శత్రుసంహారశౌర్యంతో ప్రకాశించడానికి యోగ్యమైన మేలైన నాలుగు గుర్రాలు పూన్చిన రథం తోలుతూండగా, శత్రువులనే దట్టమైన చీకట్ల సమూహాలకు తీక్ష్ణమైన సూర్యకాంతివంటి ధనుస్సును తాల్చి, దాని అల్లెతాటి ధ్వనులతో దిగంతరాలు నింపుతూ, రథంపై ప్రయాణిస్తూ ఉండగా

**వ. అట్టియెడ సకలరాజలోకంబును గృష్ణునివిభవంబునకుం జూపోపక యసంఖ్యంబులగు మూఁకలు గట్టి య మ్మహాత్మునిమాహాత్మ్యంబు దెలియక దర్పాంధులై కడంగి 1105**

**ప్రతి :** అట్టి+ఎడ= ఆ సమయంలో; సకల రాజలోకంబును= రాజులందరూ; కృష్ణుని విభవంబునకున్= శ్రీకృష్ణుని వైభవానికి; చూపు+ఓపక= ఓర్వలేక; అసంఖ్యంబులు+అగు= అంతులేనన్ని; మూకలు+కట్టి= గుంపులుగాచేరి; ఆ+మహాత్ముని= భగవంతుడైన ఆతని; మాహాత్మ్యంబు= గొప్పతనాన్ని (మహత్తును); తెలియక= తెలుసుకోలేక; దర్ప+అంధులై= గర్వంతో గుడ్డివారై; కడంగి= పూని...

**తా :** స్వయంవరానికి వచ్చిన రాజులంతా శ్రీకృష్ణుని వైభవానికి కన్నుకుట్టి, ఓర్వలేక, స్వయంవర నియమాలు ఉల్లంఘించి, ఆయన మహిమల్ని తెలుసుకోలేక గర్వాంధకారంతో గుంపులుకట్టి యుద్ధసన్నద్ధులుకాగా

**ఉ. భావభవప్రసూనశరబాధితమానసులై సమస్త ధా**
**త్రీవరనందనుల్ బలువుఁ దెంపును బెంపును సొంపు నేర్పడన్**
**దేవకిరీటరత్నరుచిదీపితపాదసరోజుఁ డైన రా**
**జీవదళాక్షుఁ దాఁకిరి విశృంఖలవృత్తి నతిప్రయత్నులై. 1106**

**ప్రతి :** భావభవ= భావంనుండి పుట్టిన మన్మథునియొక్క; ప్రసూన, శర, బాధిత, మానసులై= పూలబాణాలచే బాధింపబడిన మనస్సులు కలవారై; సమస్త, ధాత్రీవర, నందనుల్= రాజకుమారులందరూ; బలువున్= శక్తిని; తెంపును= ధైర్యాన్ని;

పెంపును= ఆధిక్యాన్ని; సొంపున్= పరాక్రమ సౌందర్యాన్ని; ఏర్పడన్= ప్రకటిస్తూ; దేవ, కిరీట, రత్నరుచి, దీపిత, పాద సరోజుడు+ఐన= సమస్తదేవతలు నమస్కరించగా వారి కిరీటాల్లోని రత్నాలకాంతిచే ప్రకాశించే పాదకమలాలుగల; రాజీవ దళ+అక్షుని= తామరరేకులవంటి కన్నులు కలవాడైన శ్రీకృష్ణుణ్ణి; విశృంఖల వృత్తిన్= అడ్డులేని విధంగా; అతి ప్రయత్నులై= విశేషంగా ప్రయత్నాలుచేసి; తాకిరి= ఎదుర్కొన్నారు.

**తా :** మన్మథుని పూలబాణాల తాకిడికి ఓర్వలేక కామాతురులై, రాజులంతా, ధైర్య, శౌర్య, శక్తి, సామర్థ్యాల్ని ప్రకటిస్తూ, ఎల్లప్పుడూ దేవతల నమస్కారాలందుకొనే మహిమాన్వితుడైన కృష్ణునితో గర్వించి యుద్ధం ప్రారంభించారు.

**వ. అంత. 1107**

**ప్రతి :** అంతన్= అప్పుడు...

**చ. సరసిజలోచనుండు నిజశార్ఙ్గశరాసనముక్తహేమ పుం**
**ఖ రుచిరశాతసాయకనికాయములన్ రిపుకోటి నేసి సిం**
**ధురరిపువిక్రమప్రకటదోర్బలుఁడై విలసిల్లి యొత్తె దు**
**స్తర చలితాన్యసైన్యమును సజ్జనమాన్యముఁ బాంచజన్యమున్. 1108**

**ప్రతి :** సరసిజలోచనుడు= కమలాలవంటి కన్నులు కల కృష్ణుడు; నిజ= తన; శార్ఙ్గ = శార్ఙ్గమనే పేరుగల; శర+ఆసన= ధనుస్సునుండి; ముక్త= వదలబడిన; హేమ పుంఖ రుచిర= బంగారు రెక్కలతో ప్రకాశించే; శాత, సాయక= వాడియైన బాణాల; నికాయములన్= సమూహాల్ని; రిపుకోటిన్+ఏసి= శత్రు సమూహాలపై వేసి; సింధుర – రిపు – విక్రమ – ప్రకట– దోస్+బలుడై= ఏనుగుల శత్రువైన సింహంవంటి పరాక్రమాన్ని వ్యక్తపరచే భుజబలంకలవాడై; విలసిల్లి= ప్రకాశిస్తూ; దుస్తర= జయింపవీలుకాని; చలిత+అన్య – సైన్యమును= చెల్లాచెదురు చేసే శత్రుసేనలు కలదీ; సత్+జన – మాన్యమున్= మంచివారిచేత గౌరవింపబడేదీ అయిన; పాంచజన్యమున్= పాంచజన్యమనే పేరుగల తనశంఖాన్ని; ఒత్తెన్= పూరించాడు.

**తా :** సింహంవంటి పరాక్రమంతో చెలరేగుతూ తన శార్ఙ్గం నుండి బంగారు రెక్కలవాడి బాణాలను శత్రువులపై వేశాడు. తన భుజబల ప్రదర్శనతో ప్రకాశిస్తూ, వారితో యుద్ధంచేసి సైన్యాన్ని చెదరగొట్టే భీకర ధ్వనిగల తన పాంచజన్యాన్ని విజయ సూచకంగా ఊదాడు.

**ఉ. ఆ తఱి భూరిబాహుబలులైన విరోధినరేశ్వరుల్ మృగ**
**వ్రాతము లొక్కపెట్ట మృగరాజకిశోరముపై నెదిర్చి న**
**ట్లాతురులై చతుర్విధసమగ్రబలంబులతోడఁ గూడి ని**
**ర్ధూత కళంకుఁడైన నవతోయజనేత్రునిఁ జుట్టు ముట్టినన్. 1109**

**ప్రతి :** ఆ తఱిన్= ఆ సమయంలో, భూరి బాహుబలులైన= గొప్ప బాహుబలంకల; విరోధి నర+ఈశ్వరుల్= శత్రురాజులు; మృగ వ్రాతములు= అడవి జంతువులు; ఒక్కపెట్టన్= ఒకేసారిగా (ఒక్కపెట్టున); మృగరాజ కిశోరముపైన్= సింహం పిల్లపై; ఎదిర్చినట్లు= ఎదుర్కొన్నట్లు; ఆతురులై= ఆతురతతో; చతుర్+విధ – సమగ్ర – బలంబులతోడన్= రథ, గజ, తురగ, పదాతిసైన్యంతో; కూడి= కలిసి; నిర్ధూత= ఎగురగొట్టబడిన; కళంకుడు+ఐన= కళంకాలుగలవాడైన; నవతోయజ నేత్రునిన్= అప్పుడే వికసించిన తామరలవంటి నేత్రాలు గలవాడైన శ్రీకృష్ణుణ్ణి; చుట్టుముట్టినన్= ఆక్రమించగా...

**తా :** ఆ సమయంలో పరాక్రమవంతులైన శత్రురాజులు మృగాలన్నీ ఒక్కసారి సింహంమీద దూకినట్లు, తత్తరపాటుతో తమ చతురంగ బలాలతో కళంకరహితుడైన శ్రీకృష్ణుని చుట్టుముట్టగా

**చ. అలిగి మురాంతకుండు కులిశాభశరంబుల నూత్నరత్న కుం**
**డలములతో శిరంబులు, రణన్మణినూపురరాజితోఁ బదం**
**బులుఁ, గటకాంగుళీయకవిభూషణచాపశరాలితోడఁ జే**
**తులు, నిలఁ గూలఁగా విజయదోహలియై తునుమాడె వెండియున్. 1110**

**ప్రతి :** అలిగి= కోపించి; ముర+అంతకుండు= శ్రీకృష్ణుడు; కులిశ+ఆభ శరంబుల= వజ్రాయుధంతో సమానంగా ప్రకాశించే బాణాలతో; నూత్నరత్న కుండలములతో శిరంబులు= కొత్తవైన రత్నాలు పొదిగిన చెవిపోగులు ధరించిన రాజులశిరస్సులను; రణత్+మణినూపుర రాజితోన్= ధ్వనిస్తూ మణులు తాపడంచేసిన కాలి అందెల సమూహాలతో; పదంబులు= రాజుల పాదాలు, కటక+అంగుళీయక విభూషణచాపశరాలితోడన్= కడియాలు, ఉంగరాలు మొదలైన ఆభరణాలు, బాణాల సమూహాల్ని ధరించిన చేతులు; ఇలన్+కూలగా= నేలమీదపడేలా; విజయ దోహలి+ఐ= విజయంతో కూడిన ఉత్సాహంకలవాడై; తునుము+ఆడెన్= తెగవేశాడు.

**తా :** చుట్టుముట్టిన రాజులపై మిక్కిలి కోపించినవాడై తన బాణాలతో కుండలాలు ధరించిన వారితలల్ని, అందెలు ధరించిన పాదాల్ని, కడియాలు ఉంగరాలు ధరించిన చేతుల్ని నేలపై పడేలా తెగవేశాడు.

**క. హతశేషులు సొక్కాకుల, గతిఁ దూల నిశాతపవనకాండముల సము**
**ద్ధతి నేసి తోలి విజయో, న్నతుఁడై నిజనగరి కేగె నగధరుఁ డంతన్. 1111**

**ప్రతి :** హత శేషులు= చావగా మిగిలినరాజులు; చొక్క+ఆకులగతిన్= ఎండుటాకులవలె; తూల= ఎగిరిపోయేలా; నిశాత పవన; కాండముల= తీక్ష్ణమైన వాయవ్యాస్త్రాలను; సమ్+ఉద్ధతిన్= మిక్కిలి భీకరంగా; ఏసి= ప్రయోగించి; తోలి= పారదోలి; నగధరుడు= గోవర్ధన పర్వతమెత్తిన శ్రీకృష్ణుడు; అంతన్= అప్పుడు; విజయ+ఉన్నతుడు+ఐ= విజయంచేత గొప్పవాడై (గొప్పవిజయంసాధించి); నిజనగరికిన్+ఏగెన్= ద్వారకా నగరానికి వెళ్లాడు.

**తా :** యుద్ధంలో చావగా మిగిలిన రాజుల్ని తీక్ష్ణమైన వాయవ్యాస్త్రం ప్రయోగించి, ఎండుటాకుల్లా ఎగురగొట్టి, పారదోలి, విజయుడై ద్వారకా నగరానికి (నన్ను తీసికొని) చేరుకున్నాడు.

**వ. అట్లు మహితమంగళాలకృతంబును, నతిమనోహరవిభవాభిరామంబు నగు ద్వారకానగరంబున కరుగుదెంచిన మజ్జనకుండును బ్రియంబునఁ దోడన చనుదెంచి. 1112**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; మహిత మంగళ+అలంకృతంబును= గొప్పగా శుభంకరంగా అలంకరించబడింది; అతి, మనోహర విభవ+అభిరామంబును= గొప్పగా మనస్సును దోచే వైభవంచేత అందమైనదైన; ద్వారకా నగరంబునకున్= శ్రీకృష్ణుని రాజధానీ నగరానికి; అరుగుదెంచిన= లక్షణ కృష్ణునితో రథంపైరాగా; మత్+జనకుండును= నా తండ్రికూడా; ప్రియంబునన్= ఎంతో ఇష్టంగా; తోడన= వెంటనే; చనుదెంచి= వచ్చి...

**తా :** మంగళకరంగా అలంకరించబడి, మనోహరమైన వైభవంతో అందంగా ఉన్న ద్వారకానగరానికి మేము రాగా, మా వెనుకనే ఎంతో సంతోషంతో నా తండ్రికూడా వచ్చి

**చ. రణితవినూత్నరత్నరుచిరస్ఫుటనూపురహారకర్ణభూ**
**షణకటకాంగుళీయకలసత్పరిధానకిరీటతల్ప వా**
**రణ రథవాజిహేతినికరంబులనుం బరిచారికాతతిన్**
**బ్రణుతగుణోత్తరుం డయిన పద్మదళాక్షున కిచ్చె నెమ్మితోన్. 1113**

**ప్రతి :** రణిత= చప్పుడు చేస్తున్న; వినూత్న= మిక్కిలి కొత్తవైన; రత్న రుచిర స్ఫుట, నూపుర= రత్నాలకాంతిచే ప్రకాశించే కాలి అందెలు; హార= హారాలు; కర్ణభూషణ= కుండలాలు; కటక= కడియాలు; అంగుళీయక= ఉంగరాలతో; లసత్= ప్రకాశించే; పరిధాన= వస్త్రాలు; కిరీట= కిరీటాలు; తల్ప= పాన్పులు; వారణ= ఏనుగులు; రథ= రథాలు; వాజి= గుర్రాలు; హేతి= ఆయుధాలయొక్క; నికరంబులున్= సమూహాలు; పరిచారికా తతిన్= దాసీల గణాన్ని; ప్రణుత గుణ ఉత్తరుండు+అయిన= పొగడదగిన గుణాలచేత శ్రేష్ఠుడైన; పద్మదళ+అక్షునకున్= తామర దళాలవంటి కన్నులు కల శ్రీకృష్ణునికి; నెమ్మితోన్= ప్రేమతో; ఇచ్చెన్= సమర్పించెను.

**తా :** ద్వారకకు నా వెనుకే నా తండ్రి పెళ్లి కూతురితోబాటు అల్లునికి బహుమానంగా ఇచ్చేసారెగా రత్నభూషణాలైన గండపెండేరములు, హార, కుండల, కిరీట, కంకణ, అంగుళీయకాలు, శ్రేష్ఠమైన పీతాంబరాదివస్త్రాలు, హంసతూలికా తల్పాలు, రథగజ తురగాది వాహనాలు, వివిధరకాల ఆయుధాలు, దాసదాసీ జనాలు మొదలైన వాటిని లెక్కపెట్టలేనంత సంఖ్యలో ప్రేమగా సమర్పించాడు.

**వ. ఇట్లు మహనీయతేజోనిధియైన మాధవు దయాపరిలబ్ధనిఖిలవస్తువిస్తారుం డయ్యును, నిజాధికార శుద్ధికొరకు మరలఁ గన్యారత్నంబును, వినూత్నరత్నవ్రాతంబును సమర్పించె; నని భూసురవిసరంబులు వినుతింప మా తండ్రియైన బృహత్సేనుండు నన్నును సమస్తవస్తువులను గృష్ణునకు సమర్పించి, క్రమంబున సకల యాదవులనుం బూజించి మరలి నిజపురంబునకుం జనియె నని చెప్పినఁ గుంతియు, గాంధారియుఁ, గృష్ణయు, నఖిలనృపాలకాంతాజనంబులును, గోపికలుం దమతమ మనంబుల సర్వభూతాంతర్యామియు, లీలామానుషవిగ్రహుండును నైన పుండరీకాక్షచరణారవిందస్మరణానందపరవశలై కృష్ణుం బ్రశంసించి రంత. 1114**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; మహనీయ; తేజస్+నిధి+ఐన= గొప్ప తేజస్సుకు నిధివంటివాడైన; మాధవు= శ్రీకృష్ణుని, దయా, పరిలబ్ధ, నిఖిల, వస్తు; విస్తారుండు+అయ్యును= దయచేత; విశేషంగా పొందిన సమస్త వైభవ (వస్తువులచే) విస్తారమైన (విపులమైన)వాడు; ఐనా; నిజ+అధికార; శుద్ధికొఱకున్= తనరాచరికపు పద్ధతికొరకు; మరలన్= తిరిగి; కన్యా, రత్నంబును= శ్రేష్ఠమైన తనకూతురును; వినూత్న, రత్న, వ్రాతంబును= కొత్తవైన రత్నాల సమూహాన్ని; సమర్పించెన్+అని= సమర్పించాడని భూసుర; విసరంబులు= బ్రాహ్మణుల సమూహాలు; వినుతింపన్= పొగడగా; మా తండ్రి+ఐన, బృహత్సేనుండు, నన్నును; సమస్త వస్తువులను= కూతురిని, సారెను, కృష్ణునకున్= అల్లునికి; సమర్పించి= బహుమతిగా ఇచ్చి; క్రమంబునన్= వరుసలు పెట్టి పెద్దలనుండి పిన్నలవరకు; సకల యాదవులనున్= సమస్తయదుప్రముఖుల్ని; పూజించి= పూజలుచేసి గౌరవించి, మరలి, నిజపురంబునకున్= తిరిగి తన రాజధాని నగరానికి; చనియెన్= వెళ్లాడు; అని, చెప్పిన, కుంతియు, గాంధారియు, కృష్ణయున్= కౌరవస్త్రీలైన కుంతి, గాంధారి, ద్రౌపది, అఖిల నృపాల కాంతాజనంబులును= సమస్తరాజుల

భార్యలు; గోపికలున్= గోపస్త్రీలు; తమతమ మనంబుల= తమ మనస్సులలో; సర్వభూత+అంతర్యామియు= సమస్త ప్రాణులలో చరించేవాడూ; లీలామానుష విగ్రహుండును= లీలకొరకే మనుష్యరూపాన్ని తాల్చినవాడూ అయిన; పుండరీక+అక్ష= తెల్లతామరలవంటి కన్నులుకల విష్ణుమూర్తియొక్క; చరణ+అరవింద; స్మరణ= కమలాలవంటి పాదాలను ధ్యానించి; ఆనందపరవశులై= ఆనందంతో మైమరచి; కృష్ణున్+ప్రశంసించిరి= శ్రీకృష్ణుణ్ణి పొగిడారు; అంతన్= అపుడు...

**తా :** ఈయన వైభవమంతా శ్రీకృష్ణానుగ్రహమే అయినా రాజోచిత, వివాహోచిత ధర్మంగా తన కన్యను, సంపదల్ని తిరిగి సమర్పించాడు – అని బ్రాహ్మణులు పలికి, ఆశీర్వదించి పొగడగా, బృహత్సేనుడు, కన్యాకనకసంపన్నాది ఉపాయనాలు అల్లుడైన శ్రీకృష్ణునికి సమర్పించి, వరుసక్రమంలో పెద్దవారైన దేవకీవసుదేవాదులు మొదలుకొని, యదుపుంగవుల్ని పూజించి, మరలి, తన రాజధానికి పోయాడు." అని లక్షణ తనవివాహవృత్తాంతాన్ని చెప్పగా, అక్కడ ఉన్న కుంతి గాంధారి ద్రౌపది, ఇతరరాజపత్నులు, గోపికలు తమ హృదయాల్లో భగవంతుడైన విష్ణువు అవతారమైన శ్రీకృష్ణుని పాదాలకు నమస్కరించి ఆనంద పరవశులై

## ✤ నారదాది మహర్షులు శ్రీకృష్ణు దర్శనంబు సేసికొని వసుదేవునిచేఁ గ్రతువు సేయించుట ✤

**చ. బలవదరాతిమర్దనులఁ బాండురనీలనిభప్రభాంగులం**
**గలితనిజాననాంబుజవికాసజితాంచితపూర్ణచంద్ర మం**
**డలులఁ బరేశులన్ నరవిడంబనులం గరుణాపయోధులన్**
**విలసదలంకరిష్ణుల నవీనసహిష్ణుల రామకృష్ణులన్. 1115**

**ప్రతి :** బలవత్+అరాతి మర్దనులన్= బలవంతులైన శత్రువుల్ని అణచి వేసేవారిని, పాండుర నీల నిభ= తెల్లని, నల్లని వర్ణసమానులైన; ప్రభా+అంగులన్= కాంతిగల శరీరాలు గలవారిని; కలిత నిజ+ఆనన+అంబుజ వికాస= వికసించిన తమ ముఖకమలాల సౌందర్యంచేత; జిత+అంచిత= జయించబడి, ఒప్పుచున్న; పూర్ణచంద్రమండలులన్= నిండు (గుండ్రని) చంద్రుడు కలవారి; పర+ఈశులన్= శ్రేష్ఠమైన వైకుంఠలోకానికి ప్రభువులైనవారిని; నర+విడంబనులన్= మానవులుగా మసలేవారి; కరుణా పయోధులన్= దయకు సముద్రులైనవారిని; విలసత్+అలంకరిష్ణులన్= ప్రకాశమానమైన అలంకారాలు గలవారిని; నవీన సహిష్ణులన్=కొత్తదైన ఓర్పుగల; రామ కృష్ణులన్= బలరామకృష్ణుల్ని...

**తా :** బలవంతులైన శత్రువుల్ని అణచివేయడంలో సమర్థులూ, తెల్లని, నల్లని దేహకాంతులు కలవారూ, తమ ముఖకమలాల ప్రకాశంచేత నిండు చంద్రునివర్తులాకార సౌందర్యాన్ని గెలిచినవారూ, పరమపదస్థానాధిపతులైనవారూ, లీలతో మనుష్యులవలె ప్రవర్తించేవారూ, ప్రకాశమానమైన అలంకారాలుకలవారూ, దయాసముద్రులూ, ఓర్పులో నేర్పరులూ, అయిన బలరామ, కృష్ణుల్ని

**వ. సందర్శించు తలంపుల నందఱుఁ దమ హృదయారవిందంబులఁ బ్రేమంబు సందడిగొన నప్పుడు. 1116**

**ప్రతి :** సందర్శించు= చూడాలనే; తలంపులన్= ఆలోచనలతో; అందఱున్= మునులు అందరుకూడా; తమ, హృదయ+అరవిందంబులన్= తమ కమలాలవంటి గుండెలలో; ప్రేమంబు= ప్రేమ; సందడిన్+కొనన్= ఉప్పొంగగా (సడిచేయగా); అప్పుడు= ఆ సమయంలో...

**తా :** శ్రీకృష్ణుణ్ణి దర్శించాలనే ఉబలాటం తమ మనస్సులలో పొంగులువారగా, ఎంతో ఇష్టంగా అపుడు

**ఉ. ధీరమతిన్ ద్వితత్రితకదేవలసాత్యవతేయకణ్వులున్**
**నారదగౌతమచ్యవననాకుజగార్గ్యవసిష్ఠగాలవాం**
**గీరసకశ్యపాసితసుకీర్తిమృకండుజకుంభసంభ వాం**
**గీరులు యాజ్ఞవల్క్యమృగశృంగముఖాఖిలతాపసోత్తముల్. 1117**

**ప్రతి :** ధీరమతిన్= నిశ్చల బుద్ధితో; ద్విత= ద్వితుడు; త్రితక= త్రితకుడు; దేవల= దేవలుడు; సాత్యవతేయ= వాసుడు; కణ్వులున్= కణ్వుడు; నారద= నారదుడు; గౌతమ= గౌతముడు; చ్యవన= చ్యవనుడు; నాకుజ= (పుట్టనుండి పుట్టిన) వాల్మీకి; గర్గ్య= గార్గ్యుడు; వసిష్ఠ= వసిష్ఠుడు; గాల= గాలవుడు; అంగీరస= అంగీరసుడు; కశ్యప= కశ్యపుడు; అసిత= అసితుడు; సుకీర్తి= సుకీర్తి; మృకండుజ= మార్కండేయుడు; కుంభసంభవ= అగస్త్యుడు; అంగీరులు= అంగీరులు (అగ్ని ఉపాసకులు); యజ్ఞవల్క్య= యాజ్ఞవల్క్యుడు; మృగశృంగ= ఋష్యశృంగుడు; మున్నగు – అఖిల= సర్వులైన; తాపస+ఉత్తముల్= తాపస శ్రేష్ఠులు...

**తా :** ద్వారకలో భగవదంశ సంభూతులైన బలరామకృష్ణులున్నారని తెలిసి వారిని చూడాలనే నిశ్చలబుద్ధితో తాపసశ్రేష్ఠులైన ద్వితుడు, త్రితకుడు, దేవలుడు, వ్యాసుడు, కణ్వుడు, నారదుడు, గౌతముడు, చ్యవనుడు, వాల్మీకి, గార్గ్యుడు, వసిష్ఠుడు, గాలవుడు, అంగీరసుడు, కశ్యపుడు, అసితుడు, సుకీర్తి, మార్కండేయుడు, అగస్త్యుడు, అంగిరులు, యాజ్ఞవల్క్యుడు, ఋష్యశృంగుడు – మొదలైన ఇరువదియొక్క ఋషులందరూ

**విశే :** పైన పేర్కొనబడిన వివిధ కాలాలలోని తపస్సంపన్నులైన వీరు నిరంతరం హరిపదచింతనతో మోక్షార్థులై ఉన్నారు. తపస్సుతో సాధించవలసిన భగవత్ సాక్షాత్కారం చాలా సులభంగా ద్వారకలో లీలామానుషరూపంతో ఉన్న శ్రీకృష్ణుని సంగతివల్ల – కష్టసాధ్యమైన తపంకంటె, సులభసాధ్యమైన కృష్ణదర్శనం శ్రేష్ఠమని పురాణ ఋషులు భావించారు.

**వ. చనుదెంచినం గృష్ణుండు వారలకుఁ బ్రత్యుత్థానంబు సేసి వందనంబు లాచరించి వివిధార్చనలు గావించి యిట్లనియె. 1118**

**ప్రతి :** చనుదెంచినన్= ద్వారకకు ఆ మునులు రాగా; కృష్ణుండు= కృష్ణుడు; వారలకు= ఆ మునులకు; ప్రత్యుత్థానంబుసేసి= ఎదురేగి; వందనంబులు+ఆచరించి= నమస్కారాలుపెట్టి; వివిధ+అర్చనలు= అతిథులకిచ్చే పూజాదులు; కావించి= చేసి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** వచ్చిన ఆ మునులకు శ్రీకృష్ణుడు ఆహ్వానంపలికి, ఎదురేగి, మహర్షులకు నమస్కరించి, అతిథులకిచ్చే అర్ఘ్య, పాద్య, తాంబూలాది సకల మర్యాదలూచేసి, ఇలా అన్నాడు.

**సీ. 'సన్మునీశ్వరులార! జన్మభాక్కులమైన మాకు నిచ్చోట సమ్మతిని దేవ**
**నికరదుష్ప్రాపులు నిరుపమయోగీంద్రు లైన మీ దర్శనం బబ్బెఁ గాదె**
**ధృతి మందభాగ్యు లింద్రియ పరతంత్రులు నైన మూఢాత్ముల కనఘులార !**
**భవదీయ దర్శన స్పర్శన చింతన పాదార్చనలు దుర్లభంబు లయ్యు**

**తే. నేఁడు మాకిట సులభమై నెగడెఁ గాదె !, జగతిపైఁ దీర్థభూతులు సాధుమతులు**
**మిమ్ము దర్శించుటయు చాలు నెమ్మితోడ, వేఱ తీర్థంబు లవనిపై వెదక నేల ? 1119**

**ప్రతి :** సత్+ముని+ఈశ్వరులార!= పవిత్రులైన మునిశ్రేష్ఠులారా! జన్మ భాక్కులము= జన్మల్నిపొందిన మానవమాత్రులం; ఐన= అయిన; మాకున్= మా అందరికీ; ఇచ్చోట= ఈ+చోట= ఈ స్థలంలో; సమ్మతినిన్= అంగీకారపూర్వకంగా (అనుజ్ఞాయుతంగా), దేవ, నికర, దుష్+ప్రాపులు= దేవతల సమూహాలకు సైతం దుర్లభులు (దొరకనివారు); నిర్+ఉపమ= సాటిలేని; యోగి+ఇంద్రులు= శ్రేష్ఠులైనయోగులు; ఐన, మీ, దర్శనంబు+అబ్బెన్+కాదు+ఎ= మిమ్మల్ని చూచే భాగ్యం కలిగింది కదా!; ధృతిన్= సంతోషంగా; మందభాగ్యులు= దురదృష్టవంతులకు; ఇంద్రియ పరతంత్రులు+ఐన= ఇంద్రియవసులైన; మూఢ+ఆత్ములకున్= మూర్ఖులమైన; మాకున్+ఇట= మాకు ఇక్కడ; భవదీయ దర్శన స్పర్శన చింతన పాద+అర్చనలు= దర్శనం, తాకడం, ధ్యానం, పాదసేవ; దుర్+లభంబులు+అయ్యున్= కష్టంగా లభించేవి ఐనా; నేడు= ఈ రోజు; సులభము+ఐ= సుఖంగా లభించినవై; నెగడెన్+కాదు+ఎ!= ఒప్పాయికదా! జగతిపైన్= ఈ భూమిమీద; తీర్థభూతులు= నదీజలాల పవిత్రతతో సమానమైన; సాధుమతులు= సాధుబుద్ధిగలవారైన (ఐన); మిమ్మున్= మీ ఋషులందరిని; నెమ్మితోడన్= భక్తితో; దర్శించుట+అ+చాలున్= చూస్తేచాలు (ధన్యులమే); అవనిపైన్= ఈ భూమిపై; వేఱు+ఎ, తీర్థంబులు= వేరే పుణ్యతీర్థాలు; వెదకన్+ఏల?= వెదకవలసిన పని ఏముంది?...

**తా :** ఓ సత్పురుషులైన మునులారా! జన్మలు అనుభవించాల్సిన, మోక్షాన్ని వెదుకవలసిన మా వంటి మానవులకు మీ అనుజ్ఞతో దేవతలకు కూడా, దేవతలకు లభించని మీ దర్శనం లభించింది. అదృష్టహీనులం, ఇంద్రియాసక్తులం, జ్ఞానహీనులం అయిన మాకు సంతోషాన్నిచ్చే మీ దర్శనం, తాకడం అదృష్టం, ధ్యానించే అదృష్టం, పాదసేవ చేసేభాగ్యం సహజంగా అందనివి. అయినా, మాకు ఈరోజు ఇవన్నీ అతిసులభంగా లభించాయి. సాధుబుద్ధిగల సత్పురుషులైన మిమ్మందరినీ దర్శింస్తే చాలు, ఇక వేరుగా పుణ్యతీర్థాలు వెదికే పనిలేదుగదా!

**విశే :** దేవదేవుడైన శ్రీకృష్ణుడే సామాన్యునివలె మాట్లాడుతున్నాడు. మానవ జన్మల సారహీనత, సాధుజనసేవనం, తీర్థసేవనంవంటి పుణ్యప్రదమైన అంశాల ఔన్నత్యాన్ని చెప్పడం – లోకోద్ధరణకోసమే. సత్పురుష సమాగమం – పుణ్య తీర్థసేవనంతో సమాన పుణ్యఫలప్రదం. ఇక్కడ శ్యమంతక తీర్థపంచకసేవనం, నారదవ్యాసాది మహర్షి దర్శనం రెండూ లభించాయి.

**వ. అదియునుం గాక యుదక మయంబులైన తీర్థంబులును మృచ్ఛిలామయంబులైన దేవగణంబులును, దీర్థదేవతారూపంబులు గాకుండుట లే; దయిన నవి చిరకాలసేవనార్చనలం గాని పావనంబు సేయవు; సత్పురుషులు దర్శనమాత్రంబునం బావనంబుసేయుదు రని వెండియు. 1120**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాకుండా; ఉదక; మయంబులు+ఐన= నీళ్లతోనిండిన; తీర్థంబులును= పవిత్ర జలాశయాలూ; మృత్+శిలామయంబులు+ఐన= మట్టి లేదా రాతితో చేయబడిన; దేవగణంబులునున్= దేవతామూర్తుల నుండి దేవతల విగ్రహాలూ; తీర్థ దేవతారూపంబులు కాకుండుట లేదు= పాపాలను పోగొట్టే తీర్థాలుగా, వరప్రదాతలైన దేవతలుగా పుణ్యప్రదాలుగా కాకపోవు (అగును అని అర్థం) అవి ఉపాదేయాలే; అయినన్+అవి= అయినాకూడా (ఆ రెండూ తీర్థక్షేత్రాలు) చిరకాల; సేవా+అర్చనలన్+కాని= చాలాకాలం సేవిస్తేగాని, పూజిస్తేగాని; పావనంబులు+చేయవు=

మానవులను పవిత్రులుగా చేయవు; సత్+పురుషులు= సాధుజనులు, దర్శన, మాత్రంబునన్= కేవలం (వారిని) చూడడం చేతనే; పావనము+చేయుదురు= పవిత్రులుగా చేస్తారు; అని, వెండియున్= మరలా...

**తా :** అంతేకాదు, నీటితో నిండిన తీర్థాలు, మట్టి, శిలలతో నిర్మించిన దేవతావిగ్రహాలూ, తీర్థదేవతల రూపాలతో సేవించిన వారిని అనుగ్రహించేవే. కాని, వాటిల్ని చాలాకాలం సేవిస్తేనే పవిత్రత సిద్ధిస్తుంది. కానీ, పవిత్రులైన మహాత్ములను కేవలం చూస్తేనే పుణ్యం లభించి జనులు పావనులౌతారు.

**సీ. ఆదిత్యచంద్రాగ్నిమేదినీతారాంబుమారుతాకాశవాఙ్మనము లోలిఁ**
**బరికింపఁ దత్తదుపాసనంబులఁ బవిత్రములు సేయఁగ సమర్థములు గావు;**
**సకలార్థగోచరజ్ఞానంబు గల మహాత్మకులు దారు ముహూర్తమాత్రసేవఁ**
**జేసి పావనములు సేయుదు; రదియు న ట్లుండె ధాతుత్రయయుక్తమైన**

**తే. కాయమం దాత్మబుద్ధియుఁ గామినీ కు, మారులందు స్వకీయాభిమానములును**
**దివిరి జలమునఁ దీర్థబుద్ధియును జేయు, నట్టి మూఢుండు పశుమార్గుఁ డనఁగఁ బరఁగు. 1121**

**ప్రతి :** ఆదిత్య= సూర్యుడు, చంద్ర+అగ్ని= చంద్రుడు, అగ్ని; మేదినీ= భూమి; తార+అంబు= నక్షత్రాలు, నీరు, మారుత+ఆకాశ= గాలి, ఆకాశం, వాక్+మనములు+ఓలిన్= వాక్కు, మనస్సులు, వరుసగా; పరికింపన్= చూడగా; తత్+తద్+ఉపాసనంబులన్= ఆయాశక్తుల్ని పూజించగా; పవిత్రములు+చేయన్+కన్= ఉపాసకులను పాపరహితులుగా చేయడానికి; సమర్థములు+కావు= తగిన శక్తికలవి కావు; సకల+అర్థ, గోచర, జ్ఞానంబు+కల= అన్ని విషయాల్ని స్వయంగా చూచి అర్థం చేసుకొన్న; మహా+ఆత్మకులు= గొప్ప బుద్ధిగలవారు; తారు= తాము; ముహూర్త మాత్రసేవన్+చేసి= క్షణకాలం సేవించినంతమాత్రంచేత; పావనములు+చేయుదురు= పవిత్రములుగా చేస్తారు; అదియున్+అట్లు+ఉండెన్= సరే అది అలా ఉండనీ! ధాతుత్రయయుక్తమైన= వాత పిత్త శ్లేష్మములతోకూడిన; కాయము+అందున్+ఆత్మబుద్ధియున్= శరీరమునందు; ఆత్మబుద్ధియున్= ఆత్మబుద్ధీ; కామినీ కుమారుల+అందున్= భార్యాపుత్రులందు; స్వకీయ+అభిమానములును= తనదైన ఇష్టాల్ని; తివిరి= యత్నించి; జలమునన్= నీటిలో; తీర్థబుద్ధియునున్+చేయునట్టి= పవిత్రజలమని భ్రాంతిపడే; మూఢుండు= మూర్ఖుడు; పశుమార్గుడు= పశువు చరించేమార్గంలో పోవువాడు; అనన్+కన్+పరగు= అనవచ్చు.

**తా :** మనచుట్టూ ఉన్న పంచభూతాలైన భూమి, నీరు, అగ్ని, సూర్యచంద్ర నక్షత్రాలు, వాయువు, ఆకాశం, వాక్కు, మనస్సు అనే వాటిల్ని ఉపాసించినంతమాత్రాన మనలను అవి పవిత్రం చేయలేవు. అన్ని విషయాల్లో జ్ఞానంగల మహాత్ములు తమను సేవించిన క్షణకాలంలోనే మానవుల్ని పవిత్రులుగా చేస్తారు. అదలాఉంచి, ధాతుత్రయంతో నశ్వరమయ్యే శరీరాన్ని ఆత్మగా భావించడం, భార్యాపుత్రులు తనవారేననే అభిమానం కలిగి ఉండడం, సామాన్యజలాల్ని తీర్థా లని భ్రమించడం మూర్ఖుని పని. వాడు జ్ఞానహీనమైన జంతువుమార్గంలో పోవువాడు. పంచభూతోపాసనకంటె మహాత్ముల ఉపాసన చాలా శ్రేష్ఠం.

**వ. అని యివ్విధంబునం గృష్ణుం డాడిన సాభిప్రాయంబులగు వాక్యంబులు విని య మ్మునీంద్రులు విభ్రాంతహృదయులై యూరకుండి, ముహూర్తమాత్రంబున కమ్మహాత్ము ననుగ్రహంబు వడసి, మందస్మితముఖులై, యప్పుండరీకాక్షున కి ట్లనిరి; దేవా! నేమును దత్త్వవిదుత్తము లయిన బ్రహ్మారుద్రాదులును,**

**భవదీయ మాయావిమోహితులమై యుందుము; నిగూఢంబయిన నీ యిచ్ఛచేత మమ్ము ననుగ్రహించితివి. భవదీయ చరిత్రంబులు విచిత్రంబు; లి మ్మేదిని యొక్కటి యయ్యును బహురూపంబులఁ గానంబడు విధంబున నీవును మొదలఁ గారణరూపంబున నేకం బయ్యును ననేక రూపంబులు గైకొని, జగదుత్పత్తి స్థితి లయంబులకు హేతుభూతంబునా నద్భుతకర్మంబులం దగిలి, లీలావతారంబులు గైకొని, దుష్టజననిగ్రహంబును, శిష్టజనరక్షణంబును గావించుచుందు; వదియునుం గాక వర్ణాశ్రమధర్మంబు లంగీకరించి, పురుషరూపంబున వేదమార్గంబు విదితంబు సేసిన బ్రహ్మరూపివి; తపస్స్వాధ్యాయ నియమంబులచేత నీ హృదయంబు పరిశుద్ధంబు; గావున బ్రహ్మస్వరూపంబులైన వేదంబులందు వ్యక్తావ్యక్త స్వరూపంబు లేర్పడఁగా నుందువు; కావున, బ్రాహ్మణకులంబునెల్ల బ్రహ్మకులాగ్రణివై రక్షించిన మహానుభావుండవు; మాయాజవనికాంతరితుండవైన నిన్నును నీ భూపాలవర్గంబును, నేమును దర్శింపంగంటిమి; మా జన్మ విద్యా తపోమహిమలు సఫలంబు లయ్యె; నీకు నమస్కరించెద' మని బహువిధంబులఁ గృష్ణు నభినందించి, యమ్మురాంతకుచేత నామంత్రణంబులు వడసి తమ తమ నివాసంబులకుం బోవం దలంచు నవసరంబున. 1122**

**ప్రతి :** అని; ఈ+విధంబునన్= ఇలా; కృష్ణుండు+ఆడిన= శ్రీకృష్ణుడు పలికిన; స+అభిప్రాయంబులు+అగు= ఆలోచనాత్మకాలైన; (వాక్యంబులు) విని= మాటలు ఆలకించి; ఆ+ముని+ఇంద్రులు= ఆ ముని శ్రేష్ఠులు; విభ్రాంత హృదయులు+ఐ= ఆశ్చర్యకరమైన మనస్సులు కలవారై; ఊరకుండి= నిశ్శబ్దంగా ఉండి; ముహూర్త మాత్రంబునన్= ఒక్కక్షణంలో; ఆ+మహాత్ముని అనుగ్రహంబు+పడసి= ఆ శ్రీకృష్ణుని అనుమతిపొంది; మంద, స్మిత, ముఖులై= చిరునవ్వుచిందే ముఖం కలవారై; ఆ+పుండరీక+అక్షునకున్= తెల్లదామరలవంటి కన్నులుకల ఆ శ్రీకృష్ణునితో; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు దేవా!= ప్రభూ!; నేమును= మేముకూడా; తత్త్వవిత్+ఉత్తములు+అయిన= భగవత్‌తత్త్వాన్ని తెలిసినవారిలో ఉత్తములైన; బ్రహ్మరుద్ర+ఆదులు= బ్రహ్మ, శివుడు మొదలైనవారును, భవదీయ, మాయా, విమోహితులము+ఐ= నీయొక్క మాయచేత భ్రాంతిపొందినవారమై; ఉందుము= ఉంటాయి; నిగూఢంబు+అయిన= ఎవ్వరికీ తెలియని; నీ+ఇచ్ఛచేతన్= నీ సంకల్పం ప్రకారం; మమ్మును+అనుగ్రహించితివి= మమ్మల్ని అందరినీ దయతలచావు; భవదీయ చరిత్రంబులు= నీ దివ్యలీలలు; విచిత్రంబులు= ఆశ్చర్యకరమైనవి; ఈ+మేదిని+ఒక్కటి+అయ్యునున్= ఈ భూమి అంతటా ఒకటే అయినా; బహురూపంబులన్+కానంబడు విధంబునన్= అనేక విధాలుగా కనబడుతున్నట్టు; నీవును, మొదలన్= సృష్ట్యాదిలో నీవు; కారణరూపంబునన్= కారణరూపంగా ఉండి; ఏకంబు అయ్యును= ఒక్కడివే అయి; అనేక రూపంబులుగైకొని= బహురూపాలు స్వీకరించి; జగత్+ఉత్పత్తి; స్థితి, లయంబులకున్= ఈ ప్రపంచంయొక్క పుట్టుక, ఉనికి, నాశం అనే మూడుదశలకు; హేతు భూతంబు+నాన్= కారణమైనట్టిదా అన్నట్లు; అద్భుత కర్మంబులన్+తగిలి= విచిత్రమైన లీలలు ప్రదర్శించి; లీలా+అవతారంబులుగైకొని= క్రీడామాత్రంగా అవతారాలు ఎత్తి; దుష్టజన నిగ్రహంబును= దుర్మార్గులైనవారిని అణచివేసి; శిష్టజన రక్షణంబును= మంచివారిని రక్షించుట; కావించుచుందువు= చేస్తుంటావు; అదియునున్+కాక= అంతేకాక; వర్ణాశ్రమ ధర్మంబులు+అంగీకరించి= చాతుర్వర్ణంబులు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలు); చతురాశ్రమధర్మాలు (బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాసాశ్రమాలు); అంగీకరించి= స్వీకరించి (ఒప్పుకొని); పురుషరూపంబునన్= జీవిరూపంతో; వేదమార్గంబు= వైదిక పద్ధతిలో; విదితంబు సేసిన= స్పష్టపరచిన; బ్రహ్మరూపివి=

భగవత్స్వరూపానివి; తపఃస్వాధ్యాయనియమంబులచే= ధ్యానసమాధిపొందినతపస్సుయొక్క, వేదాధ్యయనంయొక్క; నియమంబులచేతన్= నియమధారణలచే; నీ హృదయంబు= నీ చిత్తం; పరిశుద్ధరాలు= పవిత్రమైంది; కావునన్= కనుక; బ్రహ్మస్వరూపంబులు+ఐన= భగవద్రూపాలైన; వేదంబుల+అందున్= ఋగ్యజుస్సామాధర్వవేదాలలో; వ్యక్త+అవ్యక్త స్వరూపంబులు= స్పష్టంగా కనబడని; కష్టపడేవిగా నీవు రూపాలు పొంది ఉందువు; కావునన్= కనుక; బ్రాహ్మణకులంబులన్+ ఎల్లన్= బ్రాహ్మణ జాతి అంతటిలో; బ్రాహ్మణకుల+అగ్రణివి+ఐ= బ్రాహ్మణవంశంలో శ్రేష్ఠుడివై; రక్షించిన= కాపాడిన; మహా+అనుభావుండవు= గొప్ప అనుభావం ఉండేవాడివి; మాయాజవనిక+అంతరితుండవు+ఐన= మాయ అనే తెరచే కప్పబడినవాడివి అయిన; నిన్నును, నీ భూపాలవర్గంబును= నిన్ను, నీ సహచరరాజలోకాన్ని; నేమును= మేముకూడా; దర్శింపన్+కంటిమి= చూడగల్గినాము; మా జన్మ; తపస్+మహిమలు= మా పుట్టుక, తపస్సు, మహిమలు, సఫలంబులు+ అయ్యెన్= సార్థకాలయ్యాయి; కృష్ణునిన్= శ్రీకృష్ణుణ్ణి; అభినందించి= పొగడి; ఆ+ముర+అంతకుచేతన్= (మురాసురుని సంహరించిన విష్ణువు అవతారుడైన) శ్రీకృష్ణునినుండి; ఆమంత్రణంబులు+పడసి= అనుజ్ఞలుపొంది; తమ తమ నివాసంబులకున్= స్వస్థానాలకు; పోవన్+తలంచున్= పోవుటకు ఆలోచించే; అవసరంబున= సందర్భంలో...

**తా :** ఇలా కృష్ణుడు పలికిన – ఆలోచనాత్మకమైన మాటలు విని, మునులంతా ఆశ్చర్యంగా చూచి కొంత సేపు నిశ్శబ్దంగా ఉండి, ఒక్కక్షణంలో ఆయన అనుమతి పొంది, చిరునవ్వులతో ఇలా అన్నారు. "దేవా! మేమూ, సృష్టి రహస్యం తెలిసిన బ్రహ్మాదులూకూడా నీ మాయచేత మోహితులమై ఉన్నాము. ఎవ్వరికీ అంతుబట్టని నీ సంకల్పంతో మమ్మల్ని దయతలిచావు. నీ లీలలు ఆశ్చర్యకరమైనవి. ఈ భూమి ఒకటే ఐనా వేరువేరు ప్రాంతాల్లో వివిధ రూపాలుగా కనబడినట్టే నీవుకూడా సృష్ట్యాదిలో కారణరూపంతో ఉండి, భిన్నరూపాలుగా కనబడి, ఈ ప్రపంచంయొక్క సృష్టి, స్థితి, లయాలకు కారణమైన అనేక లీలలుగా అవతారాలెత్తి దుష్టజన శిక్షణం, శిష్టజనరక్షణం చేస్తున్నావు. చాతుర్వర్ణ్యాశ్రమధర్మాలు స్వీకరించి, వేదాలు చెప్పిన మార్గాన్ని అనుమోదించిన బ్రహ్మస్వరూపుడవు. నిరంతర తపస్స్వాధ్యాయ నియమాలతో పవిత్రుడవు. వేద విహిత స్వరూపుడివి. బ్రాహ్మణ జాతిని రక్షించిన బ్రహ్మణ్యమూర్తివి. మహానుభావుడివి. మోహమనే తెరవెనుక ఉండి ఆడిస్తున్న నిన్ను, నీ సహచరులైన ఈ రాజలోకాన్ని మేమూ సందర్శించే భాగ్యం పొందాము. మా పుట్టుక, మా చదువు, మా తపస్సు, మా మహిమ, దీంతో సార్థకమయ్యాయి. నీకు నమస్కరిస్తున్నాము" అని మునులు శ్రీకృష్ణుణ్ణి పొగడి నుతించి, తమ నివాసాలకు వెళ్లేందుకు అనుమతి పొందారు.

**సీ. అ మ్మునీశ్వరులకు నానకదుందుభి యతిభక్తి వందనం బాచరించి**
**తాపసోత్తములార ! ధర్మతత్త్వజ్ఞులు మన్నించి వినుఁడు నా విన్నపంబు**
**సత్కర్మవితతిచే సంచితకర్మచయంబు వాపెడు నుపాయంబు నాకు**
**ఘనదయామతిఁ జెప్పుఁ డనిన నమ్మునివరుల్ భూవరుల్ విన వసుదేవుఁ జూచి**

**తే. యెలమిఁ బలికిరి నిఖిల యజ్ఞేశుఁడైన, కమలలోచనుఁ గూర్చి యాగములు సేయు**
**కర్మమునఁ బాయు నెట్టి దుష్కర్మమైన; నిదియె ధర్మంబు గాఁగ నీ మదిఁ దలంపు. 1123**

**ప్రతి :** ఆ+ముని+ఈశ్వరులకున్= ఆ మునిశ్రేష్ఠులకు; ఆనక దుందుభి= వసుదేవుడు (జననకాలంలో తప్పెటలు, దుందుభులు మోగినందువల్ల ఈయనకీపేరు); అతిభక్తిన్= గొప్పభక్తితో; వందనంబు+ఆచరించి= నమస్కరించి; తాపస+ఉత్తములార!= ముని శ్రేష్ఠులారా!; ధర్మతత్త్వజ్ఞులు= ధర్మముయొక్క తత్త్వం తెలిసిన మీరు, నా విన్నపంబు=

నా ప్రార్థనను; మన్నించి వినుఁడు= క్షమించి వినండి; సత్+కర్మ, వితతిచే= సత్కర్మల (మంచిపనుల) సమూహంతో; సంచిత కర్మచయంబు= పూర్వజన్మలో చేసిన కర్మల సంబంధం (సంచితం) ఐనదాన్ని అనుభవించవలసిన నేటిజన్మలోని కర్మలు; పాపెడున్= తొలగించవలసిన; ఉపాయంబు= మార్గం; నాకున్= నాకు; ఘన దయామతిన్= గొప్ప దయగల బుద్ధితో; చెప్పుడు= వివరించండి; అనినన్= అనగా; ఆ+మునివరుల్= ఆ మునిశ్రేష్ఠులు; భూవరుల్ వినన్= రాజులందరు వింటూండగా; వసుదేవున్+చూచి= వసుదేవునితో; ఎలమిన్= ప్రేమతో; పలికిరి= చెప్పారు; నిఖిలయజ్ఞ+ఈశుడు+ఐన= అన్ని యజ్ఞాలకీ అధీశుడు ఐన; కమలలోచనున్+కూర్చి= కృష్ణుణ్ణిగూర్చి; యాగములు+చేయు= యజ్ఞాలు చేయండి; కర్మమునన్= కార్యంవల్ల; ఎట్టి దుష్కర్మము+ఐనన్= ఎలాంటి చెడ్డచేత ఐనా; కర్మమున+పాయును= సత్కర్మచే తొలగిపోతుంది; ఇదియె; ధర్మంబు+కాగ= ఇదే సన్మార్గంగా; నీ మదిన్+తలంపు= నీ మనసులో భావించు.

**తా :** ఆ మహర్షులందరికీ వసుదేవుడు నమస్కరించి "మునీశ్వరులారా! మీరు ధర్మం బాగా తెలిసినవారు. క్షమించి నా మనవి వినండి. పూర్వజన్మకర్మల సంచితఫలం ఈ జన్మలో అనుభవించనక్కరలేని సత్కర్మాచరణం ఏదైనా ఉంటే దయతో తెలుపండి." అనగా ఆ ఋషులంతా వసుదేవునితో రాజులందరూ వినేలా "సమస్తయజ్ఞాలకి అధీశ్వరుడు ఈ శ్రీకృష్ణుడు. ఈతణ్ణి గూర్చి చేసిన యాగాలు మీరు ఆచరిస్తే ఎంతటి దుష్కర్మ అయినా తొలగిపోతుంది. ఇదే ధర్మరహస్యం" అని అన్నారు.

**వ. అదియునుం గాక. 1124**

**తా :** అంతేగాక

**క. దేవర్షిపితృఋణంబులు, భూవర ! మఖవేదపాఠపుత్త్రులచేతన్**
**వావిరి నీఁగని పురుషుఁడు, పోవు నధోలోకమునకుఁ బుణ్యచ్యుతుఁడై. 1125**

**ప్రతి :** భూవర= ఓ రాజా!; దేవ+ఋషి, పితృ ఋణంబులు= దేవతల ఋణం; ఋషుల ఋణం; పితృ ఋణాల్ని; మఖ= యజ్ఞాలచే; వేదపాఠ= వేదాధ్యయనంచేత; పుత్రులచేతన్= పుత్రసంతానలబ్ధిచేత; వావిరిన్= క్రమంగా; ఈఁగని= తీర్చుకోని; పురుషుడు= మనుజుడు; పుణ్యచ్యుతుడై= పుణ్యాలచే విడువబడి; అధః+లోకమునకున్= పాతాళాదిలోకానికి; పోవున్= పోతాడు.

**తా :** వసుదేవ మహారాజా! దేవ, ఋషి, పితౄణాలు పుట్టిన ప్రతివానికి ఆవశ్యకమై వస్తాయి. వాటిని తీర్చుకునే ప్రయత్నం చేయాలి. దేవఋణం – యజ్ఞాదులచే, ఋషి ఋణం – వేదాధ్యయనంచేత, పితృఋణం – పుత్రపౌత్రాది వంశ పరంపరాభివృద్ధిచే తీర్చబడుతుంది. వీటిని తీర్చలేని నరుడు పుణ్యాలకు దూరమై అధోలోకానికి వెళతాడు.

**విశే :** దేవతలు హవిస్సుచేత తృప్తి చెందుతారు. కనుక యజ్ఞాల ఆచరణ అవసరం. ఋషులు వేదాలు చెప్పారు. నీ తీరంలో నీవు అధ్యయనం చేసి అధీతి బోధనలచే వేదం తరతరాలకు అందించాలి. ఇది ఋషి ఋణం తీర్చుకోవడానికి మార్గం. పితృఋణం తీర్చాలంటే సంతానం ద్వారానే సాధ్యం.

గమనం "ఊర్ధ్వ లోకాలవైపే ఉంటే శ్రేష్ఠం. అధోలోకగమనం" హీనం. పుత్రులవల్ల ఊర్ధ్వలోకాలు, పుణ్యచ్యుతితో అధోలోకం రెండూ సూచించబడ్డాయి. త్రివిధ ఋణాలు, వాటిని సాధించే ఉపాయాలు సూచింపబడ్డాయి.

**వ. అట్లగుటం జేసి నీవును. 1126**

**ప్రతి :** అట్లు+అగుటన్+చేసి= అలా అవుతుంది గనుక; నీవును= నీవుకూడా...

**తా :** అలా కావడం వల్ల నీవు (వసుదేవుడు) కూడా

**క. వరతనయాధ్యయనంబులఁ, దరియించితి ఋణయుగంబు; దడయక ధరణీ**
**వరదేవఋణము సవనా, చరణుఁడవై యీఁగు టొప్పు సమ్మతితోడన్. 1127**

**ప్రతి :** వరతనయ= శ్రేష్ఠమైన కుమారుని; అధ్యయనంబులన్= వేదాధ్యయనంచే; ఋణయుగంబు= రెండు ఋణాలు (ఋషి ఋణం, పితౄణం); తరియించితి(వి)= దాటావు (తీర్చుకున్నావు); వరదేవ ఋణము= శ్రేష్ఠమైన దేవతా ఋణం, సమ్మతితోడన్= పెద్దల అనుమతితో; సవన+ఆచరణుడవు+ఐ= యజ్ఞం నిర్వహించి; ఈగుట= దాటుట (తీర్చుకొనుట); ఒప్పున్= సరిపడుతుంది.

**తా :** శ్రేష్ఠుడైన కుమారుణ్ణి కని, పితౄణం తీర్చుకొన్నావు. వేదాధ్యయనంతో ఋషిఋణం తీర్చుకొన్నావు. పెద్దల అనుమతంతో యజ్ఞాలు చేసి దేవఋణం తీర్చుకోవడం యుక్తం అని ఋషులు తెలిపారు.

**క. అనవుడు న వ్వసుదేవుఁడు, మునివరులకు ననియె వినయమున మీరలు సె**
**ప్పిన యట్లు మఖము సేసెద, దినకరనిభులార! మీరు దీర్పఁగ వలయున్. 1128**

**ప్రతి :** అనవుడున్= అనగా విని; ఆ+వసుదేవుఁడు= శ్రీకృష్ణుని తండ్రియైన ఆ వసుదేవ మహారాజు; వినయమునన్= ఎంతో అణకువతో; దినకర నిభులార= సూర్యునితో సమానమైన కాంతిగల ఓ మునులారా!; మీరలు+చెప్పిన+అట్లు= మీరు సూచించిన విధంగా; మఖము= యజ్ఞం; చేసెదన్= చేయగలను; మీరు, తీర్పగ వలయున్= మీరే యజ్ఞాన్ని నిర్వహించాలి.

**తా :** ఋషులు చెప్పిన సూచనను అంగీకరించి, ఎంతో వినయంగా, "సూర్యసమానులైన ఓ మునీశ్వరులారా! మీరు చెప్పినట్లే యాగం నిర్వహించి, దేవఋణం తీర్చుకుంటాను. కానీ, మీరే నాతో నిర్వహింప చేయించాలి" అని ప్రార్థించాడు.

**విశే :** వసుదేవుడు అడిగిందే తడవుగా వారిసలహాను పాటించదలచాడు. 'శుభస్య శీఘ్రమ్' అని కదా! పైగా మహారాజు శ్రీకృష్ణుని తండ్రి. స్థలం శ్యమంతక పంచక భూమి, అతిపవిత్రం. సమయం సూర్యోపరాగపుణ్యసమయం. బంధువర్గం అందరూ సిద్ధం. సూర్యగ్రహణవేళ సూర్యునివంటి తేజస్వులైన, అతి శ్రేష్ఠులైన మునులంతా ఎదురుగా ఉన్నారు. పెద్దల సూచన శిరోధార్యంగా, ఆముష్మికఫలదాయకంగా ఉంది. ఇంక ఆలస్యం దేనికి? ఈ అవకాశం లోకంలో ఎవ్వరికీ రానిది.

**వ. అని యభ్యర్థించి యమ్మునీంద్రుల యాజకులం గా వరించి, యప్పుణ్యతీర్థోపాంతంబున మహేంద్రామిత వైభవంబున, నష్టాదశభార్యాసమేతుండై, దీక్షఁ గైకొని య మ్మహాధ్వరంబు వేదోపదిష్ట విధిం బరిసమాప్తించి ఋత్విక్సికాయంబుల బహుదక్షిణలం దనిపి, భార్యాసమేతుండై యవభృథస్నానం బాచరించి, వివిధరత్నమణి మయభూషణ విచిత్రాంబర సురభి సుమానులేపనంబులు ధరించి, నిఖిలభూదేవ మునిబంధు రాజలోకంబుల నుచిత సత్కారంబులఁ బ్రీతులం గావించిన వారును గృష్ణానుమతి నాత్మనివాసంబులకుం జని; రందు. 1129**

**ప్రతి :** అని+అభ్యర్థించి= ఈ విధంగా ప్రార్థించి; ఆ+ముని+ఇంద్రుల= ఆ ఋషి శ్రేష్ఠులనే; యాజకులన్+కాన్ వరించి= యజ్ఞం చేసేవారుగా కోరి (నిర్ణయించి); ఆ+పుణ్యతీర్థ+ఉపాంతంబునన్= ఆ శ్యమంతకపంచకపుణ్యతీర్థం దగ్గరలో; మహా+ఇంద్ర+అమిత వైభవంబునన్= ఇంద్రునివంటి గొప్ప వైభవంతో; అష్టాదశభార్యా సమేతుండు+ఐ= పద్దెనిమిది మంది భార్యలతో కలిసి; దీక్షన్+కైకొని= యజ్ఞదీక్ష స్వీకరించి; ఆ+మహా+అధ్వరంబు= ఆ గొప్ప యజ్ఞాన్ని; వేద+ఉపదిష్ట విధిన్= వేదాల్లో చెప్పిన విధానంతో; పరిసమాప్తించి= పూర్తిచేసి; ఋత్విక్+నికాయంబుల= యజ్ఞనిర్వాహకులైన మంత్రవేత్తల సమూహాల్ని, బహు దక్షిణలన్+తనిపి= గొప్ప ద్రవ్యదానంతో తృప్తిపరచి; భార్యాసమేతుండై= భార్యలతోకూడి; అవభృథస్నానంబు+ఆచరించి= యజ్ఞాంతంలో చేసే స్నానాలుచేసి; వివిధరత్న, మణిమయభూషణ= పలురకాల రత్నాలు, మణులు తాపడంచేసిన ఆభరణాలు; విచిత్ర+అంబర= వివిధ రంగుల వస్త్రాలు; సురభి సుమ+అనులేపనంబులు= పరిమళంగలవైన పూలు, గంధాదులు (పూతలు); ధరించి= పెట్టుకొని; నిఖిల భూదేవ, ముని, బంధు, రాజ–లోకంబులన్= సమస్త బ్రాహ్మణుల, మునుల, బంధువుల, రాజుల సమూహాల్ని; ఉచిత, సత్కారంబులన్= యోగ్యాలైన సన్మానాలతో; ప్రీతులన్+కావించినన్= తృప్తులను చేయగా; వారును; కృష్ణ+అనుమతిన్= శ్రీకృష్ణుని అనుజ్ఞతీసుకొని; ఆత్మ నివాసంబులకున్+చనిరి= తమ ఇండ్లకు వెళ్లిరి; అందు...

**తా :** వసుదేవుడు మునిశ్రేష్ఠులను ప్రార్థించి,ఆ మునీంద్రులనే, యజ్ఞంచేయించే ఋత్విక్కులుగా ఎన్నుకొని, ఆ శ్యమంతకపంచక పుణ్యతీర్థాల దగ్గరి భూమిపై, ఇంద్రవైభవంతో, పద్దెనిమిదినుంచిభార్యలతో, దీక్ష స్వీకరించి, ఆ గొప్పయజ్ఞాన్ని వేదవిహితంగా పూర్తిచేసి, ఋత్విక్కులను గొప్పగా వినిమయ ద్రవ్యదానాలతో తృప్తిపెట్టి, భార్యలతో అవభృథ స్నానాలాచరించి, వజ్రాభరణాలు, విచిత్రవస్త్రాలు, సుగంధలేపనాలు, సుపుష్పమాలలు ధరించి, అక్కడ ఉన్న సమస్త బ్రాహ్మణ, ముని, బంధు, రాజులను యోగ్యంగా సన్మానించి, తృప్తిపెట్టినాడు. యజ్ఞానంతరం అందరూ కృష్ణుని అనుమతితో ఎవరిండ్లకు వారు వెళ్లిపోయారు.

**ఉ. ఆ తతి నుగ్రసేనవసుధాధిపపంకజనాభముష్టికా**
**రాతులు దమ్ము నర్థి మధురప్రియభాషల నిల్వ వేఁడినం**
**గౌతుక మాత్మ నివ్వటిలఁగా వసియించిరి గోపగోపికా**
**వ్రాతముతోడ నచ్చట ధరావర ! నందయశోద లిమ్ములన్. 1130**

**ప్రతి :** ధరావర= ఓ రాజా!; ఆ తతిన్= యజ్ఞసమాప్తి అయిన సమయంలో; ఉగ్రసేన వసుధ+ఆధిప= మధురనేలే కంసుని తండ్రి అయిన ఉగ్రసేన మహారాజు; పంకజనాభ= శ్రీకృష్ణుడు; ముష్టిక+అరాతి= ముష్టికుడనే రాక్షసుని శత్రువైన బలరాముడు; తమ్మున్= తమను; అర్థిన్= ప్రియంగా (కోరికతో); మధుర ప్రియభాషలన్= తియ్యని ప్రేమనుగొలిపే మాటలతో; నిల్వన్+వేడినన్= ఉండుమని అభ్యర్థించగా (తమతో ఉండటానికి వేడగా); కౌతుకము= కుతూహలం; ఆత్మన్= హృదయాల్లో; నివ్వటిలగా= పొంగగా; నందయశోదలు= శ్రీకృష్ణబలరాములను పెంచిన నందయశోదలు; గోప గోపికా వ్రాతముతోడన్= గోపాల, గోపికల సమూహాలతో; అచటన్= అక్కడ; వసియించిరి= నివసించారు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! 'మాతో ఉండమని' ఉగ్రసేన, శ్రీకృష్ణ, బలరాములు, ప్రేమతో అర్థించగా యశోదానందులు తమ గోపీగోపాలుర బృందాలతో కొన్నాళ్లు వారితో కలిసి సంబరంగా అక్కడే ఉన్నారు.

**క. హరినయముల హరిప్రియముల, హరిమధురాలాపములను హరికథల మనో**
**హరలీలఁ దగిలి నందుఁడు, నిరుపమగతి నచట మూఁడునెల లుండె నృపా! 1131**

**ప్రతి :** నృపా!= ఓ పరీక్షిన్మహారాజా!; హరి నయములన్= శ్రీకృష్ణుని నీతి పద్ధతులతో; హరిప్రియములన్= ఆతని ప్రేమ పూర్వక ప్రవర్తనలతో; హరి, మధుర+ఆలాపములను= ఆయన తియ్యని వాక్కులతో; హరికథలన్= కృష్ణుని లీలా వినోదాలతో; మనోహరలీలన్= మనస్సును హరించే విధంగా; తగిలి= బంధంకల్గి; నిర్+ఉపమగతిన్= సాటిలేని విధంగా; అచటన్= శ్రీకృష్ణునివద్ద; నందుడు= నందుడు (అతని పరివారం యశోదాసహితంగా); మూడు నెలలు; ఉండెన్= కలిసి ఉన్నాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణాదుల ప్రార్థనను మన్నించి, నందుడు వారితో కలిసి మూడునెలలు అక్కడే ఉన్నాడు. ఆ సమయంలో కృష్ణుని మర్యాదలతో, తల్లిదండ్రులపట్ల ప్రేమలతో, మధురమైన పలుకులతో, అతని లీలలుగా చెప్పుకునే జీవిత విశేషాలతో ఆనందంగా ఆస్వాదిస్తూ, కుటుంబ, బంధుమిత్రాదులమధ్య సాటిలేని విధంగా గడిపారు.

**చ. జలరుహలోచనాదియదుసత్తము లందఱు నన్నిభంగులం**
**గలితవిభూషణాంబరనికాయము లిచ్చి బహూకరించి వీ**
**డ్కొలిపిన నందముఖ్యులు ముకుందపదాబ్జమరందపాన స**
**ల్లలిత నిజాత్మషట్పదములన్ మరలించుచు నెట్టకేలకున్. 1132**

**ప్రతి :** జలరుహలోచన+ఆది= కమలాలవంటి కన్నులు కల శ్రీకృష్ణుడు మొదలుగాగల; యదుసత్తములు+అందఱున్= యదువంశ శ్రేష్ఠులు అందరూ; అన్నిభంగులన్= సకలవిధాలుగా; కలిత= కూడిన; విభూషణ+అంబరనికాయములు= సమూహాలను; ఇచ్చి; బహూకరించి= సత్కరించి; వీడ్కొల్పినన్= వీడ్కోలు పలుకగా; నందముఖ్యులు= నందుడు మొదలైనవారు; ముకుందపద+అబ్జ= శ్రీకృష్ణుని పాదపద్మాల; మరందపాన= మకరందం (పూలతేనె)తాగే; సత్+లలిత= మిక్కిలి కోమలమైన; నిజ+ఆత్మ= తమ మనస్సులనే; షట్పదములన్= తుమ్మెదల్ని; మరలించుచున్= శ్రీకృష్ణుని మరలిస్తూ; ఎట్టకేలకున్= చివరకు...

**తా :** బలరామ కృష్ణాదులు, తక్కిన యాదవులు, సకలవిధాలుగా గౌరవించి, ఆభరణ వస్త్రాదులు బహూకరించి వీడ్కొల్పగా, నందయశోదాది వ్రేపల్లె వాసులు కృష్ణపాదకమలాల మకరందం క్రోలే తమ మనస్సులనే తుమ్మెదల్ని, బలవంతంగా మళ్లించుకొంటూ, విడువలేక, విడువలేక, చివరకు

**వ. చని చని. 1133**

**ప్రతి :** చని చని= వెళ్లి వెళ్లి...

**ఆ. మరలి మరలి 'కృష్ణ! మాధవ! గోవింద!, పద్మనాభ! భక్తపారిజాత!**
**దేవదేవ! యనుచుఁ దివిరి చూచుచు మధు, రాభిముఖులు నగుచు నరిగి రంత. 1134**

**ప్రతి :** మరలి మరలి= తిరిగి తిరిగి చూస్తూ; (వెళ్లలేక వెళుతూ); కృష్ణ= శ్రీకృష్ణా!; మాధవ= మాధవా!; గోవింద!= గోవిందా!; పద్మనాభ= (బ్రహ్మజన్మకు కారణమైన) పద్మము నాభి (బొడ్డు)యందు కలవాడా!; భక్తపారిజాత!= భక్తులపాలిట పారిజాత వృక్షమా! (పారిజాతం= కోరినకోర్కెలు ఇచ్చేది); దేవదేవ!= దేవతలకే దేవుడైనవాడా!; అనుచున్= అంటూ ఈ విధంగా కృష్ణుణ్ణి స్మరిస్తూ; తివిరి చూచుచున్= ప్రయత్నించి చూస్తూ; మధుర+అభిముఖులున్+అగుచు= మధురా రాజ్యంవైపు వెళ్లేవారవుతూ (ఆ వైపునకు); అరిగిరి= వెళ్లారు; అంతన్= అపుడు...

**తా :** వెళ్లలేక వెళ్లలేక వెడుతూ, మాటిమాటికి వెనుకకు తిరిగిచూస్తూ, కృష్ణనామస్మరణచేస్తూ ప్రేమతో, ఆప్యాయతతో, భక్తిసూచకంగా పిలుస్తూ, స్మరిస్తూ మధురా రాజ్యంవైపు నందాదులు సాగిపోయారు. అప్పుడు

**క. క్రమమున నచ్చుటఁ బ్రావృ, ట్సమయం బగుటయును బంధుజనయాదవ వ**
**ర్గము లోలిఁ గొలువ సురగణ, నమితులు బలకృష్ణ లాత్మనగరంబునకున్. 1135**

**ప్రతి :** క్రమమునన్= కాలక్రమాన్ననుసరించి; అచ్చుటన్= ఆ శ్యమంత పంచకస్థలిలో; ప్రావృట్+సమయము= వర్షాకాలం; అగుటన్= రాగా; బంధుజన= బంధువులు; యాదవ వర్గములు= యదువంశీకుల సమూహాలు, ఓలిన్= వరుసగా; కొలువన్= కొలుస్తుండగా; సురగణ= దేవతల సమూహాలచే; నమితులు= నమస్కరింపబడినవారైన; బలకృష్ణులు= బలరాముడు, కృష్ణుడు, ఆత్మనగరంబునకున్= తమ నగరమైన ద్వారకకు...

**తా :** ఆ సమయంలో వర్షాకాలం ఆసన్నమైనందున బలరామకృష్ణులు ఆ శ్యమంతక పంచకభూమిని వదలి, యాదవ, బంధువర్గాలు కొలుస్తూండగా, దేవతానమస్కారాలందుకొంటూ ద్వారకకు (పయనమయ్యారు)

**వ. వచ్చి సుఖంబుండు నంత. 1136**

**ప్రతి :** వచ్చి= ద్వారకకుచేరి; సుఖంబు+ఉండున్+అంత= సుఖంగా ఉన్నంతలో – పిదప...

**తా :** బలకృష్ణులు ద్వారకచేరి సుఖంగా ఉన్నారు. అపుడు

### ❖ శ్రీకృష్ణ బలభద్రులు మృతులైన తమ సహోదరులఁ దెచ్చి దేవకిదేవికిఁ గనఁబఱచుట ❖

**సీ. అవనీశ ! యొక్కనాఁ డానకదుందుభిభార్య పద్మాక్షుండు బలుఁడుఁ దొల్లి**
**శరధిలోఁ జొచ్చిన గురుతనూభవునిని మరలంగఁ దెచ్చిన మహిమ లెల్ల**
**జనములు దమలోన సన్నుతుల్ సేయంగ విని తనసుతులు దుర్వృత్తుఁడైన**
**కంసుచే నిహతులై కాలునిపురి నున్నవారి నందఱఁ జూడఁ గోరి కృష్ణ**

**తే. బలులకడ కేగి కన్నుల బాష్పకణము, లొలుక నో రామ! రామ! నిత్యోన్నతాత్మ!**
**పరమపావనమూర్తి! యో మురవిభేది!, యిందిరానాథ! యోగీశ్వరేశ! కృష్ణ! 1137**

**ప్రతి :** అవని+ఈశ= ఓ పరీక్షిన్మహారాజా!; ఒక్కనాఁడు= ఒక రోజు; ఆనక దుందుభి= వసుదేవుని; భార్య= దేవకీదేవి; పద్మ+అక్షుండు= (తామరలవంటి కన్నులుకల) కృష్ణుడూ; బలుడున్= బలరాముడూ; తొల్లి= పూర్వం; శరధిలోన్= సముద్రంలో; చొచ్చిన= ప్రవేశించిన; గురు= సాందీపని మహర్షియొక్క; తనూభవునిన్= కుమారుణ్ణి; మరలన్+కన్+తెచ్చిన= తిరిగి (బ్రతికించి) తీసుకొనివచ్చిన; మహిమలు+ఎల్లన్= మానవాతీతకార్యాలు, అన్నీ; జనములు= ప్రజలు; తమలోనన్= తమలో తాము; సన్నుతుల్+చేయన్+కన్= కథలుగా పొగడుతూ చెప్పుకోగా; విని; తన సుతులు= తన కుమారులు (శ్రీకృష్ణునికి పూర్వం జన్మించిన తన బిడ్డలు ఆరుగురు); దుర్+వృత్తుడు+ఐన= దుష్టవర్తనుడైన; కంసుచేన్= కంసునిచేత; నిహతులై= చంపబడి; కాలునిపురిన్+ఉన్నవారిని= యమలోకంలో ఉన్నవార్ని; అందఱన్+చూడన్+కోరి= అందరినీ తానొకమారు దర్శించాలని అడిగి; కృష్ణ, బలుల కడకున్+ఏగి= శ్రీకృష్ణ, బలరాములవద్దకు వెళ్లి; కన్నుల బాష్పకణములు+

ఒలుకన్= కన్నీళ్లు జారగా; ఓ రామ! రామ= మనోహరుడవైన ఓ బలరామా!; నిత్య+ఉన్నత+ఆత్మ= ఎల్లప్పుడు గొప్ప మనసు కలవాడా!; పరమపావనమూర్తి= దివ్యమంగళరూపా!; ఓ మురవిభేది= మురాసురసంహారీ!; ఇందిరానాథ= లక్ష్మీపతీ!; యోగి+ఈశ్వర+ఈశ= యోగులైన వారిలో శ్రేష్ఠులైనవారికి ప్రభువైనవాడా!; కృష్ణా= ఓ కృష్ణా! (అని మొరబెట్టినది)...

**తా :** ద్వారకలో అందరూ సుఖంగా కాలంగడుపుతున్నారు. నీళ్లల్లో మునిగి యమలోకం చేరిన గురుపుత్రుని తీసుకొని వచ్చిన వృత్తాంతమంతా జనులనుంచి దేవకీదేవి విని శ్రీబలరాములను పరిపరివిధాల స్తుతిస్తూ, కన్నుల కన్నీరు కారుస్తూ మొరపెట్టుకొంది.

**క. ముర కంస చైద్య పౌండ్రక, నరక జరాతనయ యవన నరనాయకులన్**
**దురితాత్ములఁ బొరిగొని భూ, భర ముడిపిన యట్టి మేటిబలులు దలంపన్. 1138**

**ప్రతి :** దురిత+ఆత్ములైన= దుర్మార్గులైన; ముర= మురుడనే రాక్షసుడు; కంస= కంసుడు; చైద్య= శిశుపాలుడు; పౌండ్రక= పౌండ్రక వాసుదేవుడు; నరక= నరకుడు; జరాతనయ= జరాసంధుడు (బృహద్రథుని కుమారుడు); యవన= కాలయవనుడు మొ॥; నరనాయకులన్= రాజులను; పొరి+కొని= సంహరించి; భూ+భరము= భూభారాన్ని; ఉడిపిన+అట్టి= తొలగించినట్టి; మేటిబలులు= శ్రేష్ఠులైన మహాబలశాలురు; తలంపన్= పరిశీలించగా...

**తా :** దుర్మార్గులైన మురాసురుడు, కంసుడు, శిశుపాలుడు, పౌండ్రక వాసుదేవుడు, నరకాసురుడు, జరాసంధుడు, కాలయవనుడు మొదలైన మహా బలశాలులైన రాక్షసులను సంహరించి భూభారాన్ని తొలగించినవారు మీరే కదా! (అని దేవకి ప్రశంసించింది.)

**ఆ. జనన వృద్ధి విలయసంగతి నిఖిలంబుఁ, బొందఁ జేయు పరమపురుషులార !**
**మీకు లీల లౌట మీ రని నమ్మిన, దాన నేను వినుఁ డుదారులార!' 1139**

**ప్రతి :** జనన= సృష్టి; వృద్ధి= అభివృద్ధి; విలయ= నాశనం; సంగతి= వీటి కలయిక; నిఖిలంబున్= సమస్త ప్రకృతినీ; పొందన్+చేయు= స్థితిని పొందించే; పరమపురుషులార= భగవత్స్వరూపులారా!; మీకున్= మీ ఉభయులకు; లీలలు= క్రీడా మాత్రకార్యాలు; ఔటన్= అగుటచే; మీరు+అని= మీరు మాత్రమే (చేయగలరు) అని; నేను (దేవకీదేవి) నమ్ముతున్నాను; ఉదారులార!= విశాలబుద్ధి గలిగినవారా!; వినుడు= (నా విన్నపం) వినండి.

**తా :** జగత్తుకు సృష్టి స్థితి లయకారకులు మీరే! మీకు అవన్నీ లీలావినోదాలు. మిమ్మల్ని నమ్ముకున్నాను. దయచేసి నా కోరికతీర్చండి అని దేవకి ప్రార్థించింది.

**వ. అని యనేకవిధంబుల వినుతించుచు నిట్లనియె; మీరలు మహానుభావులరు; మీరు తొల్లి యనేకకాలంబు సనినక్రిందట మృతుండై, దండధరుమందిరంబున నున్న గురుకుమారుని మీ మహాప్రభావంబులు లోకంబులఁ బరిపూర్ణంబులై ప్రకాశింప; న క్కాలునిచెంత నుండి మగుడం దెచ్చి గురుదక్షిణగా నొసంగితి; రి వ్విధంబునం గంసునిచేత హతులైన మత్పుత్త్రుల నందఱ మరలం దెచ్చి నా మనంబున నున్న దుఃఖంబు నివారింపవలయు నని దేవకీదేవి ప్రార్థించినం దమతల్లి యాడిన మృదుమధురవాక్యంబు లత్యాదరంబున నాదరించి, యప్పుడు బలకృష్ణులు దమ యోగమాయామహత్త్వంబున సుతలంబునకుం జని; రట్టి యెడ. 1140**

**ప్రతి :** అని+అనేక విధంబులన్+వినుతించుచున్= ఇలా పలువిధాలుగా ప్రార్థిస్తూ; ఇట్లు+అనియెన్= (ఇంకా) ఇలా అనింది; మీరలు మహా+అనుభావులరు= మీరు ఎంతో గొప్పవారు; మీరు; తొల్లి= పూర్వం; అనేక కాలంబు+చనిన క్రిందట= గడిచిన చాలాకాలంకింద; మృతుండు+ఐ= చనిపోయి; దండధరుమందిరంబునన్= యముని మందిరంలో; ఉన్న; గురుకుమారునిన్= మీ గురువుగారి పుత్రుణ్ణి; మీ మహాప్రభావంబులు= మీ గొప్పనైన మహిమలు; లోకంబులన్= సమస్తలోకాల్లో; పరిపూర్ణంబులై ప్రకాశింపన్= నిండుగా వెలుగొందగా; ఆ+కాలునిచెంతన్+ఉండి= ఆ యమునివద్దనుండి; మగుడన్+తెచ్చి= తిరిగి (జీవితునిగా) తీసుకొనివచ్చి; గురుదక్షిణగా= గురువుగారికి సమర్పించవలసిన శుల్కంగా; ఒసంగితిరి= అర్పించారు; ఈ+విధంబునన్= ఇదే రీతిగా; కంసునిచేత హతులైన= కంసునిచే చంపబడిన; మత్+పుత్రులన్+అందఱన్= నా కుమారులనందర్నీ; మరలన్+తెచ్చి= తిరిగి జీవితులుగా తీసుకొనివచ్చి; నా మనంబునన్+ఉన్న దుఃఖంబున్= నా మనసులోని బాధను; నివారింపవలయున్= తొలగించాలి; అని దేవకీదేవి ప్రార్థించినన్= దేవకీదేవి పైవిధంగా విన్నవించగా; తమ తల్లి+ఆడిన= తమ తల్లిచెప్పిన; మృదు మధుర వాక్యంబులు= మెత్తనివైన, ప్రియములైన మాటలు; అతి+ఆదరంబునన్= మిక్కిలి గౌరవంతో; ఆదరించి= స్వీకరించి; అప్పుడు= ఆ సమయంలో; తమ యోగమాయా మహత్త్వంబునన్= తమ మాయాశక్తి ప్రభావంతో; సుతలంబునకున్+చనిరి= పాతాళలోకానికి బయల్దేరారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో...

**తా :** బలరామ, కృష్ణుల్ని అనేక విధాల నుతించి, "అయ్యా! మీరు మహానుభావులు. గతంలో చనిపోయి యమపురం చేరిన మీ గురుపుత్రుణ్ణి బతికించి, యమునివద్దనుండి తీసుకొనివచ్చి గురుదక్షిణగా గురువుకు సమర్పించారు. మహానుభావులారా! ఇదేవిధంగా కంసుడు చంపిన నా కుమారుల్నికూడా సజీవులుగా తెచ్చియిచ్చి నా దుఃఖాన్ని పోగొట్టండి"– అని ప్రార్థించింది. ఆమె మెత్తని తియ్యని పలుకులు విని గౌరవపూర్వకంగా స్వీకరించి, మాయాప్రభావంతో సుతల (పాతాళ) లోకానికి వెళ్లారు.

**మ. కనియెన్ దానవుఁ డింద్రసేనుఁడు దళత్కంజాక్షులన్ దక్షులన్**
**ఘనసారాంబుదవర్ణులన్ నిఖిలలోకైకప్రభాపూర్ణులన్**
**దనరారన్ హలచక్రపాణులను భక్తత్రాణులన్ నిత్య శో**
**భన వర్ధిష్ణుల రామకృష్ణుల జయభ్రాజిష్ణులన్ జిష్ణులన్. 1141**

**ప్రతి :** దానవుడు= రాక్షస వంశజుడు; ఇంద్రసేనుడు= బలిచక్రవర్తి; దళత్+కంజ+అక్షులు= విచ్చిన తామరరేకులవంటి కన్నులు గలవారు; దక్షులన్= సమర్థులైనవారిని; ఘనసార= పచ్చకర్పూరంవంటి రంగు; అంబుద= మేఘాలవంటి; వర్ణులన్= మేనిరంగు కలవారిని; నిఖిలలోక+ఏక ప్రభాపూర్ణులన్= సమస్తలోకంలో విశిష్టమైన కాంతికలవారిని; హల, చక్రపాణులన్= నాగలి, సుదర్శన చక్రం ధరించినవారిని; భక్తత్రాణులన్= భక్తులను రక్షించేవారిని; నిత్యశోభన= ఎల్లవేళల శుభాలతో; వర్ధిష్ణులన్= వర్ధిల్లేవారిని; జయభ్రాజిష్ణులన్= జయాలచే శోభించువారిని; జిష్ణులన్= జయశీలురను; రామకృష్ణులను= బలరాముణ్ణీ, శ్రీకృష్ణుణ్ణీ; తనరారన్= తనివితీరా; కనియెన్= దర్శించాడు.

**తా :** సుతల లోకాధీశుడైన బలిచక్రవర్తి బలరామ, కృష్ణుల్ని కన్నులార చూశాడు. వారు కమలదళాలవంటి కన్నులు కలవారు. కార్యసమర్థులు. పచ్చని, నీలివర్ణాల దేహచ్ఛాయలు గలవారు. సమస్తలోకాల్లో కాంతిమంతులైనవారు. హలాన్ని, చక్రాన్ని ధరించినవారు. భక్తులను పరిరక్షించేవారు. ఎప్పుడూ శుభాలతో ఒప్పేవారు. ఎల్లవేళల జయం పొందేవారు. జయశీలురు. అట్టివారు తనలోకానికి రాగా చూచాడు.

**చ. కని హితకోటితో నెదురుగాఁ జనుదెంచి మనోఽనురాగ సం**
**జనిత కుతూహలుం డగుచుఁ జాఁగిలి మ్రొక్కి సమగ్ర కాంచనా**
**సనముల నుంచి తచ్చరణసారససేచన సర్వలోక పా**
**వన సలిలంబు లౌదల ధ్రువంబుగఁ దాల్చి సుభక్తియుక్తుఁడై. 1142**

**ప్రతి :** కని= బలరామకృష్ణులిద్దర్నీ తనలోకానికి రాగా చూచి; హితకోటితో= హితుల సమూహంతో; ఎదురు+కాన్+చనుదెంచి= ఎదురువచ్చి; మనస్+అనురాగ, సంజనిత= మనస్సులో కల అనురాగంచే పుట్టిన; కుతూహలుండు+అగుచున్= ఉత్సాహంకలవాడై; చాగిలి మ్రొక్కి= సాగిలబడి నమస్కరించి (సాష్టాంగ నమస్కారంచేసి); సమగ్ర కాంచన+ఆసనములన్= మొత్తం బంగారంతో చేసిన కుర్చీలలో; ఉంచి= కూర్చోబెట్టి; తత్+చరణసారస= వారి పాదపద్మాల; సేచన= తడిపిన; సర్వలోకపావన= సమస్తలోకాలు పవిత్రం చేసే; సలిలంబులు= నీళ్లు; ఔదలన్+తాల్చి= తలపై చల్లుకొని; సుభక్తియుక్తుడై= గొప్పభక్తిగలవాడై...

**తా :** బలిచక్రవర్తి తన సన్నిహితులతో ఎదురుగా వెళ్లి బలరామ, కృష్ణులను ఆహ్వానించాడు. వారిపైగల భక్తివల్ల వారి రాకపట్ల కుతూహలుడై సాష్టాంగ దండప్రణామంచేసి బంగారు సింహాసనంపై కూర్చుండబెట్టి, వారికాళ్లుకడిగి, సమస్తలోకాల్లో పవిత్రాలైన ఆ జలాల్ని భక్తితో తలపై చల్లుకొన్నాడు.

**సీ. సురభికాలాగరుహరిచందనైలాదిధూపంబు లా విశ్వరూపకులకుఁ**
**గాంచనపాత్రసంగతరత్నకర్పూరదీపంబు లా జగద్దీపకులకుఁ**
**బాయసాపూపాన్నపక్వఫలాదినైవేద్యంబు లా వేదవేద్యులకును**
**దనరు వినూత్నరత్న ప్రభాభాసితాభరణంబు లా దైత్యహరణులకును**

**తే. మిలమిలని మంచుతోఁ బొలుపలరు బహు వి, ధాంబరంబులు నీలపీతాంబరులకు**
**సలలిత కుసుమమాలికామలయజాను, లేపనంబులు భూరినిర్లేపులకును. 1143**

**ప్రతి :** సురభి= సంపెంగ; కాల+అగరు= నల్లని అగరు ధూమం; హరిచందన= పసుపువన్నె చందనవృక్ష గంధం; ఏలా+ఆది= ఏలకులు మొదలైనవాటితో చేసిన; ధూపంబులు= సుగంధపుపొగలు; ఆ విశ్వరూపులకున్= విశ్వమే రూపమైన ఆ ఇరువురికి; కాంచన= బంగారం చేయబడిన; పాత్రసంగత= దీపపాత్రకు కలిపిన (అద్దిన); రత్న= రత్నాలుగల; కర్పూర దీపంబులు= కర్పూరంతో వెలిగించినదీపాలు; ఆ జగత్+దీపకులకున్= జగత్తుల్ని వెలిగించేవారికి (సమర్పించి); పాయస= క్షీరాన్నం; అపూప= అప్పాలు; అన్న= అన్నం; పక్వఫల= పండిన పండ్లు; ఆది నైవేద్యంబులు= మొదలైన నివేదనలు; ఆ వేదవేద్యులకున్= వేదాలచే తెలియదగిన ఆ భగవత్స్వరూపులకు; (సమర్పించి); తనరు= ఒప్పు; వినూత్నరత్న= కొత్తవైన రత్నాల; ప్రభాభాసిత+ఆభరణంబులు= కాంతితో ప్రకాశించే అలంకారాలు; ఆ దైత్యహరణులకు= ఆ రాక్షస సంహారులకు (సమర్పించి); మిలమిలమని= ప్రకాశించే; మంచుతోన్+పొలుపు+అలరు= మంచువంటి అందంతో ఒప్పు; బహువిధ+ అంబరములు= పలువిధాలైన పల్చని వస్త్రాలు; నీల, పీత+అంబరులకున్= నీలిరంగు వస్త్రాలు ధరించే బలరాముడు; పచ్చని వస్త్రం ధరించే కృష్ణుడు - వీరిరువురికి (సమర్పించి); సలలిత= కోమలత్వంగల్గిన; కుసుమ మాలికా= పూలమాలలు; మలయజ+అనులేపనంబులు= మలయపర్వతంలో బుట్టిన చందనవృక్షాల్ని అరగదీసినవై; ఒంటికి పూసుకునే గంధాలు; భూరినిర్లేపులకున్= అధికమైన ఉదాసీనత గలవారికి (సమర్పించాడు) బలరామకృష్ణులకు...

**తా :** బలిచక్రవర్తి తన లోకానికి వచ్చిన బలరామకృష్ణుల్ని స్వాగతించి, అర్చించాడు. విశ్వమే రూపమైన వారిని సంపెంగ, అగరు, చందన, ఏలాది ధూపాల్ని (వేసి), భువనాల్ని వెలిగించేవారికి బంగారు పాత్రలలో రత్నదీపాలు, కర్పూరదీపాలతో హారతిచ్చి, వేదాలచే తెలియబడే మహానుభావులకు పాయసాన్నఫలాదుల్ని నైవేద్యంగా ఇచ్చి, దేవతలకు శత్రువులైనవారికి నూత్న రత్నాభరణాల్ని, నీల పీతాంబరాలు ధరించేవారికి మంచువంటి పలుచని, తెల్లని విశిష్టవస్త్రాల్ని కట్టబెట్టి, అహంకారరహితులైన, వారికి చందనాది లేపనాలు, పూలమాలల్ని (సమర్పించి)

**వ. సమర్పించి, య ప్పుండరీకాక్షుని చరణారవిందంబు లొత్తుచు నానందబాష్పపూరంబు తోరంబుగా రోమాంచకంచుకితశరీరుం డగుచుం దన గరకమలంబులు ఫాలభాగంబునం గదియించి యిట్లని స్తుతియించె. 1144**

**ప్రతి :** సమర్పించి= పైవిధంగా బహువిధపూజలు; ఉపాయనాలు నివేదించి; ఆ+పుండరీక+అక్షుని= తెల్ల తామరలవంటి కన్నులు కలవానిని (కృష్ణుణ్ణి); చరణ+అరవిందములు+ఒత్తుచున్= కమలాలవంటి పాదాల్ని సంవాహనంచేస్తూ; ఆనంద బాష్పపూరంబు= సంతోషంవలన కారే కన్నీటి ప్రవాహం; తోరంబు+కాన్= దట్టంకాగా; రోమాంచ= గగురుపాటుతో నిక్కబొడిచిన వెంట్రుకలు; కంచుకిత= కవచంగామారిన; శరీరుండు+అగుచున్= శరీరం కలవాడవుతూ; తన కరకమలంబులు= కమలాలవంటి హస్తాలు; ఫాలభాగంబునన్+కదియించి= నుదుటిపై ఉంచుకొని; ఇట్లు+అని స్తుతియించెన్= ఇలా ప్రార్థించాడు.

**తా :** వివిధపూజలుచేసి, ఉపాయన సమర్పణంకావించి, శ్రీకృష్ణుని కమలాలవంటి చరణాలను ఒత్తుతూ, ఆనందంతో ఉబికిన కన్నీరు కారుతుండగా, పులకించిన శరీరంతో రెండుచేతులు నుదుట జోడించి, నమస్కరిస్తూ ఇలా ప్రార్థించాడు.

**ఉ. ధీయుతుఁడై నమో భగవతే హరయే పరమాత్మనే ముకుం**
**దాయ సమస్తభక్తవరదాయ నమః పురుషోత్తమాయ కృ**
**ష్ణాయ మునీంద్రవంద్యచరణాయ సురారిహరాయ సాంఖ్యయో**
**గాయ వినీల భాస్వదలకాయ రథాంగధరాయ వేధసే. 1145**

**ప్రతి :** ధీయుతుడు+ఐ= బుద్ధి (స్థిరపరచుకొని) మంతుడై; భగవతే= భగవంతుడా!; హరయే= హరుడా (శివుడని, హరించువాడని అర్థములు); పరమాత్మనే= పరమాత్మా!; ముకుందాయ= ముకుందుడా!; సమస్త భక్తవరదాయ= భక్తులందరిని రక్షించేవాడా!; నమః (నీకొరకు)= నమస్కారం; పురుష+ఉత్తమాయ= పురుషులలో శ్రేష్ఠుడా!; కృష్ణాయ= కృష్ణుడా!; ముని+ఇంద్ర వంద్య చరణాయ= మునిశ్రేష్ఠులచే నమస్కరించబడే పాదాలుకలవాడా!; సుర+అరిహరాయ= దేవతల శత్రువుల్ని (రాక్షసుల్ని) హరించువాడా!; సాంఖ్యయోగాయ= సాంఖ్యయోగ రూపమైనవాడా!; వినీల భాస్వత్= మిక్కిలి నీలంగా ప్రకాశించే; అలకాయ= ముంగురులు (వెంట్రుకలు) కలవాడా!; రథ+అంగధరాయ= చక్రాన్ని (ఆయుధముగా) ధరించినవాడా!; వేధసే= బ్రహ్మా!; (నీ కొరకు) నమః= నమస్కారం.

**తా :** బుద్ధిమంతుడైన బలిచక్రవర్తి "ఓ కృష్ణా! భగవంతుడా! హరుడా! పరమాత్మా! ముకుందుడా! సమస్త భక్తరక్షకా! పురుషోత్తమా! మునులచే నమస్కారాలందుకొనేవాడా! రాక్షసాంతకా! సాంఖ్యస్వరూపా! నీలకేశా! చక్రధారీ! బ్రహ్మా! నీ కొరకు నమస్కారాలని" స్తుతించాడు.

వ. అని యభినందించి యిట్లనియె. 1146

ప్రతి : అని= పైవిధంగా; అభినందించి= పొగడి; ఇట్లు= ఇంకా ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

తా : పైవిధంగా భగవంతునిలీలలు నామగ్రహణరూపమున పొగడి ఇంకా ఇలా అన్నాడు.

ఉ. రాజస తామసాత్ములకు రాదుగదా నినుఁ గాన నవ్య పం
కేజ దళాయతాక్ష ! మునిగేయ పవిత్రచరిత్ర ! విస్ఫుర
ద్రాజకళాధరాజ సురరాజ ముఖామర మౌళిరత్న వి
భ్రాజితపాదపీఠ ! భవబంధ విమోచన ! పద్మలోచనా ! 1147

ప్రతి : పద్మలోచనా= తామరరేకులవంటి విశాలమైన కన్నులు కలవాడా; కృష్ణా! రాజస= రజోగుణబద్ధులైన; తామస= తమోగుణబద్ధులైన; ఆత్ములకున్= వ్యక్తులకు; నినున్+కానరాదు+కదా!= నీ దర్శనము అలభ్యంకదా! నవ్యపంకేజ దళ+ఆయత+అక్ష!= అప్పుడే వికసించిన తామరల దళాలవంటి విశాలమైన కన్నులు గలవాడా!; మునిగేయ పవిత్ర చరిత్ర!= మునులు పాడే పవిత్రమైన ప్రవర్తన కలవాడా! విస్ఫురత్+రాజకళాధర+అజ= ప్రకాశించే చంద్ర కళలు ధరించిన శివుడు, బ్రహ్మ, సురరాజముఖ+అమర= దేవతల రాజైన ఇంద్రుడు మొదలుగాగల దేవతలయొక్క; మౌళిరత్న విభ్రాజిత పాదపీఠ!= తలపై ధరించిన రత్నాభరణాలచే (నమస్కరించినపుడు) కాంతిమంతమైన పాదపీఠం కలవాడా!; భవబంధవిమోచన= పుట్టుకచే గల్గిన బంధాలను తొలగజేయువాడా!

తా : శ్రీకృష్ణా! కేవలం సాత్త్వికులు మాత్రం దర్శించగలిగే నిన్ను రజస్తమోగుణులైన వారు చూడలేరు. పద్మాక్షా! నీ పవిత్ర చరిత్రలు మునులు దర్శించి గానం చేస్తున్నారు. శివబ్రహ్మేంద్రాది దేవతా ప్రముఖులు మిమ్ము నమస్కరించుటచే వారి శిరోరత్నాలచే నీ పాదపీఠం ప్రకాశిస్తోంది. నీ దర్శనంచే జన్మబంధాలు తొలగిపోతాయి.

మ. మది నూహింపఁగ యోగివర్యులు భవన్మాయాలతాబద్ధులై
యిద మిత్థ' మ్మన లేరు తామసులమై యేపారు మాబోఁటి దు
ర్మదు లేరీతి నెఱుంగఁజాలుదురు? సమ్యగ్జ్ఞానధీయుక్తి నీ
పదముల్ సేరెడి త్రోవఁ జూపి భవకూపంబుం దరింపింపవే! 1148

ప్రతి : మదిన్+ఊహింపన్+కన్= మదిలో (సూక్ష్మంగా) ఆలోచిస్తే; భవత్+మాయాలతాబద్ధులు+ఐ= నీ మాయ అనే తీగలతో బంధింపబడినవారైన; యోగివర్యులు= శ్రేష్ఠులైన యోగులు (సైతం); ఇదం+ఇత్థం+అనలేరు= ఇది (నీ స్వభావం) ఇలాగా అని (ఉంటుందని) చెప్పలేరు; తామసులము+ఐ+ఏపారు= అజ్ఞానమనే చీకటిచే కప్పబడిన స్వభావంగల; మాబోటి దుర్+మదులు= మా వంటి మదం (అహంకారం)తో చెడినవారు; ఏరీతిన్= ఏ విధంగా; ఎఱుంగఁజాలుదురు= తెలుసుకోగలరు; జ్ఞానధీయుక్తి= చక్కని జ్ఞానం; వివేచనాలతోకూడి ఉండి; నీ పదముల్ సేరెడి త్రోవన్+చూపి= నీ పాదాలు చేరే (ముక్తి) మార్గాన్ని దర్శింపచేసి; భవకూపంబున్+దరింపింపవే= సంసారం అనే నూతినుండి ఉద్ధరించుమా!

తా : యోగిశ్రేష్ఠులుసైతం నీ మాయలో చిక్కుకొని నీ తత్త్వాన్ని తెలుసుకోలేరు. మా వంటి తామసులు, అహంకారులు నిన్ను ఎలా తెలుసుకోగలరు? మాకు చక్కని జ్ఞానం, చక్కటి వివేకం ఇచ్చి నిన్ను చేరే ముక్తి మార్గం చూపి, ఈ సంసారకూపం నుండి ఉద్ధరించి నీ దగ్గరకు చేర్చుకోవయ్యా!

**విశే :** మాయ : "మునుపులేనిది, ముందు ఉండబోనిది – ఈ రెంటి నడుమ కొంతకాలంపాటు వ్యవహారగోచరమయినది మాయ. ఎప్పుడూ ఒకే విధంగా ఉండక మారుతుండటం దీని స్వభావం. ఏది సత్తుకాదో, అసత్తును కాదో అది మాయ. కావున, ఈ ప్రపంచం మాయ. ఒక్కమాటలో చెప్పాలంటే, ఏది మార్పు చెందుతుందో, ఏది ఎల్లకాలమూ ఉండదో, ఏది నశిస్తుందో అది మాయామయం. దీనికి విరుద్ధంగా మార్పుచెందక, నశింపక, ఎల్లకాలం ఉండేది ఆత్మ!

**ఉ. వైరముచేతఁ జేదినృపవర్గముఁ, గామముచేత గోపికల్,**
**మీఱినభక్తి నాశ్రితులు మిమ్ము నహర్నిశమున్ మనంబులం**
**దారఁగనీక రూపగుణతత్పరులై మిముఁ బొందు కై వడిన్**
**భూరివివేకసత్త్వగుణముల్ గల దేవత లంద నేర్తురే ! 1149**

**ప్రతి :** వైరముచేతన్= శత్రుభావంతో; చేదినృప= శిశుపాలునియొక్క; వర్గమున్= మొదలగువారు; కామముచేతన్= కోరికతో, ప్రేమతో; గోపికల్= గోపస్త్రీలు; మీఱినభక్తిన్= అతిశయమైన భక్తిభావంతో; అశ్రితుల్= ఆశ్రయించినవారు (పాండవులు, యాదవులు మొ॥వారు); మిమ్మున్= మిమ్మల్ని (బలరామ, కృష్ణుల్ని); అహర్+నిశమున్= పగలు, రేయి; మనంబులన్+తారగనీక= మనస్సులనుండి తొలగనీక; రూప, గుణ+తత్‌పరులై= మీ రూపగుణాల్ని ధ్యానించేవారై; మిమున్+పొందు= మిమ్ముచేరే కైవల్యం; కైవడిన్= విధానాన్ని; భూరి= గొప్పనైన; వివేక= జ్ఞానం; సత్త్వగుణముల్‌గల= సాత్త్వికలక్షణాలు (ఉన్నప్పటికిని); దేవతలు+అందనేర్తురే= దేవతాగణం పొందగల్గుతారా?

**తా :** శత్రువులుగా ఉండి చైద్యుడు మొ॥వారు, ప్రేమతో గోపికాస్త్రీలు, భక్తితో పాండవయాదవాదులు నిరంతరం మనస్సులో మీ రూపగుణాదుల్ని ధ్యానిస్తూ మోక్షం పొందుతున్నారు. మహాజ్ఞానులైనాకూడా దేవతలు నీ ధ్యానం లేక కైవల్యపదం అందుకోలేకపోతున్నారు.

**విశే :** నిరంతరం క్రోధంతో పగవారైన శిశుపాలాదులు స్మరించడంవల్ల వారికి ముక్తి. భగవద్ధ్యానం నిరంతరం చేయనివాడు వివేకి, విద్వాంసుడైనా వానికి కైవల్యం దూరమే.

**క. కాన భవత్పదపద్మ, ధ్యానంబునఁ గాని శాస్త్రతత్త్వంబులచేఁ**
**గానరు శ్రుతిసంవేద్యం, బైన భవత్పదముఁ జిన్మయాకార ! హరీ ! 1150**

**ప్రతి :** హరీ!= ఓ కృష్ణా! చిత్+మయ+ఆకార= జ్ఞానమయరూపా!; శ్రుతి= వేదాలచే; సంవేద్యంబు+అయిన= బాగుగా తెలుసుకొనబడేదైన; భవత్+పదము= నీ లోకం (కైవల్యం); భవత్+పదపద్మ ధ్యానంబునన్+కాని= నీ పాదపద్మాల్ని ధ్యానించడంచేతనేగాని; శాస్త్రతత్త్వంబులచే= శాస్త్రతత్త్వం తెలిసినంతమాత్రాన; కానరు= చూడలేరు (పొందలేరు)

**విశే :** పద పద్మమన్నచోట ధ్యానకేంద్రమని, భవత్పదమన్నచోట విష్ణుపదం అనగా ఆకాశమని పదశబ్దానికి అర్థద్వయం భిన్నంగా మహాకవి నిక్షేపించినాడు. చిదాకారుడుకాబట్టి ధ్యానంవలనేగాని గ్రంథాలవలన దొరకదని సారాంశం.

**వ. దేవా ! యే నరుండైన నేమి శ్రద్ధాగరిష్ఠచిత్తుండై మిమ్ముసేవించు నట్టి మహాత్ముండు విధిచోదితంబయిన ప్రమాణంబువలన విముక్తుండై వర్తించు; నట్లు గావున యోగీశ్వరుండవైన నీ వీశితవ్యులమైన మమ్ము నిష్పాపులం జేయు మని నుతించి మఱియు నిట్లనియె. 1151**

**ప్రతి :** దేవా!= ప్రభూ!; ఏ నరుండు+ఐనన్+ఏమి= ఏ మానవుడైనా సరే; శ్రద్ధా గరిష్ఠచిత్తుండు+ఐ= అతిశయమైన శ్రద్ధతో కూడిన మనస్సుగలవాడై; మిమ్ము సేవించున్+అట్టి= మిమ్మల్ని ఆరాధించే; మహా+ఆత్ముండు= గొప్పవాడు; విధి చోదితంబు+ఐన= కాలప్రేరితమైన; ప్రమాణంబువలనన్= నియమంవల్ల; విముక్తుండై, వర్తించున్= బంధాలు విడిచి వేస్తాడు; అట్లు కావునన్= అందువల్ల; యోగి+ఈశ్వరుండవు+ఐన= యోగులకు ప్రభువుడివై; నీవు; ఈశితవ్యులము+ఐన= పాలితులమైన; మమ్మున్= మమ్మల్ని; నిష్పా+పులన్= పాపరహితుల్నిగా; చేయుము= అనుగ్రహింపుమయ్యా!; అని; నుతించి= స్తుతించి, స్తుతిచేసి; మరియున్+ఇట్లు+అనియెన్= ఇంకా ఇలా అన్నాడు.

**తా :** శ్రద్ధచేత నిన్ను సేవించే వాడెవ్వడైనా భవబంధాలనుండి విముక్తి పొందుతాడు. యోగీశ్వరుడవైన నీవు నీచే పాలింపబడేవారమైన మమ్ము పాపరహితులుగా అనుగ్రహింపుమని ప్రార్థించి, ఇంకా ఇలా అన్నాడు.

**మత్తకోకిలము**

**'కంటి, గంటి భవాబ్ధి దాఁటఁగఁ గంటి, ముక్తినిధానముం**
**గంటి, నీ కరుణావలోకముఁ గంటి, బాపము వీడ ము**
**క్కంటి తామరచూలియుం బొడఁ గాన నట్టి మహాత్మ! నా**
**యింటికిం జనుదెంచి తీశ్వర! యేఁ గృతార్థతఁ బొందితిన్. 1152**

**ప్రతి :** ఈశ్వరా= ప్రభూ!; కంటిన్, కంటిన్= చూచాను చూచాను; (భృశార్థంలో ఆమ్రేడితం); భవ+అబ్ధి= సంసార సముద్రాన్ని; దాటన్+కన్+కంటిన్= దాటగా చూశాను; ముక్తి నిధానమున్= మోక్షమనే నిధిని; కంటిన్= చూశాను; నీ కరుణ+అవలోకమున్= నీ దయతోడి చూపును; కంటిన్= పొందాను; ముక్కంటి= మూడు కన్నులవాడైన శివుడు; తామరచూలియున్= బ్రహ్మకూడా; పొడఁగానన్+అట్టి= చూడలేనట్టి; మహా+ఆత్మ= మహానుభావా!; పాపము వీడ= పాపమంతా పోయ్యేలా; నా+ఇంటికిన్+చనుదెంచితి(వి)= మా ఇంటికి వచ్చావు; ఏన్+కృత+అర్థతన్= నేను సార్థకతను అనగా ధన్యతను; పొందితిన్= పొందాను.

**తా :** నిన్ను తనివిదీరా చూచాను. సంసారబంధమనే సముద్రాన్ని దాట గల్గాను. మోక్షనిధిని చూచాను. నీ దయా దృష్టులు నాపై ప్రసరింపగా చూశాను. బ్రహ్మ మహేశ్వరులు కూడా చూడలేని నా పాపాల్ని పోగొట్టావు. అట్టి నీవు, నా యింటికి వచ్చి నన్ను కృతార్థుణ్ణి చేశావు.

**వ. దేవా ! యేను భవద్దాసుండ ! నేది పంచినం జేయుదు; నిచ్చటికి మీరలు విజయంబు చేసిన కార్యం బానతీయ వలయు నని కరంబులు మొగిచి, విన్నవించినం బుండరీకాక్షుం డతనివాక్యంబులకు సంతసిల్లి యిట్లనియె. 1153**

**ప్రతి :** దేవా= ప్రభూ! ఏను భవత్+దాసుండన్= నేను నీ దాసుణ్ణి; ఏది పంచినన్+చేయుదున్= ఏది ఆజ్ఞాపించినా చేస్తాను; ఇచ్చటికి మీరలు విజయంబుచేసిన కార్యంబు= ఇక్కడికి మీరు విచ్చేసిన పనిఏమిటో; ఆనతి+ఈయవలయున్= ఆజ్ఞ ఇవ్వండి; అని కరంబులు మొగిచి= అని చేతులు జోడించి; విన్నవించినన్= ప్రార్థింపగా; పుండరీక+అక్షుండు= శ్రీకృష్ణుడు; అతని వాక్యంబులకున్ సంతసిల్లి= బలిమాటలకు సంతోషించి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** స్వామీ! నేను మీ దాసుణ్ణి. మీరు ఏది చెపితే అది చేస్తాను. ఇక్కడికి మీరు ఎందుకు వచ్చారో సెలవివ్వండి అని చేతులు జోడించి ప్రార్థించగా కృష్ణుడు బలి వినయానికి సంతోషించి ఇలా అన్నాడు.

**సీ. 'బలిదైత్య ! విను మున్ను ప్రథమయుగంబున నా మరీచికి భార్యయైన వర్ణ**
**యను నింతివలన నందను లార్వు రుద్భవ మైరి వా రొక్కనాఁ డబ్జభవుఁడు**
**తనపుత్త్రిపై మోహమునఁ గూడి రతికేళి యొనరింప వీరు నవ్వుటయుఁ గ్రోధ**
**మంది యాసురయోనియందుఁ బుట్టుం డని ఘనశాప మిచ్చె న వ్వనజజుండు.**

**తే. త న్నిమిత్తమునను వారు దగిలి హేమ, కశిపునకుఁ బుట్టి రంత నాకౌకసులకు**
**నొదవ వీరలఁ దెచ్చి య య్యోగమాయ, యడరి దేవకిగర్భమునందుఁ జొనుప. 1154**

**ప్రతి :** బలిదైత్య!= దితిసంతాన వంశీకుడవైన ఓ బలీ!; విను= వినుము; మున్ను ప్రథమయుగంబునన్= పూర్వం కృతయుగంలో; ఆ మరీచికి= మరీచి మహర్షికి; భార్యయైన; వర్ణ+అను ఇంతివలనన్= వర్ణ అనే పేరుగల స్త్రీవలన; నందనులు+ఆర్వురు= ఆరుగురు కుమారులు; ఉద్భవము+ఐరి= పుట్టారు; వారు+ఒక్కనాడు= వారొక్కరోజు; అబ్జభవుడు= బ్రహ్మ; తనపుత్త్రిపై మోహమునన్= తన కూతురిపైనే కామంకల్గి; కూడి, రతికేళి+ఒనరింపన్= కలిసి శృంగారక్రీడ చేయగా; వీరు నవ్వుటయున్= వీరు ఆర్గురు అపహాస్యంచేయగా; క్రోధము+అంది= కోపించి; ఆసుర+యోని+అందున్= రాక్షస జాతియందు; పుట్టుండు+అని= జన్మించమని; ఆ+వనజజుండు= ఆ పద్మ సంభవుడు (బ్రహ్మ); ఘనశాపము+ఇచ్చెన్= పెద్దశాపం పెట్టాడు; తద్+నిమిత్తమునను= ఆ కారణంగా; వారు= ఆర్గురు; తగిలి= భవబంధాల్లో తగులుకొని; హేమకశిపునకున్= హిరణ్యకశ్యపునికి; పుట్టిరి= జన్మించినారు; అంతన్= అప్పుడు; నాక+ఓకసులకున్= స్వర్గం స్థానంగా గల్గినవాడైన; దేవతలకు; ఒదవన్= ఉపయోగపడేలా; ఆ+యోగమాయ= ఆ యోగస్వరూపిణి ఐన మాయాదేవి; వీరలన్+తెచ్చి= ఈ ఆరుగురిని తెచ్చి; అడరి= పూని; దేవకీగర్భము+అందున్= దేవకీదేవిగర్భంలో; చొనుపన్= ప్రవేశపెట్టగా...

**తా :** ఓ బలిరాజా! పూర్వం కృతయుగంలో మరీచికి వర్ణ అనే భార్యవలన ఆరుగురు కుమారులు పుట్టారు. బ్రహ్మ ఒక రోజు తన కూతురినే కామించి రమించగా చూచి పరిహసించారు. బ్రహ్మ అందుకు కోపించి రాక్షసులుగా పుట్టుడని శపించాడు. శాపవశాత్తు వారు హిరణ్యకశ్యపునికి కొడుకులుగా పుట్టారు. దేవతల కోరికమేరకు యోగమాయాదేవి ఈ ఆరుగురుని దేవకీదేవి గర్భాన ఉంచగా

**విశే :** కంస నిర్యాణంలో యోగమాయ పాత్ర పెద్దది. వీరార్గురితో బాటు తానూ దేవకీ గర్భాన జన్మించి, జన్మలు చాలించి, అష్టమగర్భ శిశువుగా విష్ణునిరాకకు సుగమం చేసింది. ఇదంతా విష్ణుమాయే.

**క. దొరఁకొని కంసుఁడు దోడ్తోఁ, బొరిగొనెఁ దత్పుత్త్రశోకమునఁ దన చిత్తం**
**బెరియఁగ దేవకి వారల, దరిసింపఁగఁ గోరి పనుపఁ దగ నసురేంద్రా ! 1155**

**ప్రతి :** అసుర+ఇంద్ర= రాక్షసరాజా!; దొరకొని= ప్రయత్నపూర్వకంగా; కంసుడు; తోడ్తోన్= వెనువెంటనే, ఎప్పటికప్పుడు; పొరిగొనెన్= (వారిని ఆరుగురిని) చంపివేశాడు; దేవకి= మా తల్లి దేవకీదేవి; తత్+పుత్రశోకమునన్= ఆర్గురుపుత్రుల వియోగదుఃఖంతో; తన చిత్తంబు= తన మనసు; ఎరియన్+కన్= గర్భశోకమనే అగ్నితో దహింపబడుతూ ఉండగా; వారల దరిసింపన్+కన్= ఆ పుత్రుల్ని చూడాలని; కోరి= వాంఛించి; పనుపన్= పంపగా; తగన్= తగినట్టుగా...

**తా :** దేవకీదేవి తన ఆరుగురు కుమారుల్ని కంసుడు వెనువెంట చంపివేయగా పుత్రవియోగదుఃఖంతో శోకించి, ఆమె ఆ పుత్రుల్ని చూడాలని మమ్మల్ని కోరింది. ఆ కారణంగా మేము వచ్చాము.

**క. వచ్చితిమి వారిఁ గ్రమ్మఱఁ, దెచ్చెద మని తల్లి కోర్కిఁ దీర్పఁగ నిపు డే**
**మిచ్చటికిని నీకడఁ బొర, పొచ్చెము లేకున్నవారె పో వీ రనఘా! 1156**

**ప్రతి :** అనఘా= పవిత్రుడా!; వారిన్= ఆ ఆరుగురుని (మా అన్నలను) క్రమ్మఱ తెచ్చెదమని= తిరిగి తీసుకొనిరాగలమని; తల్లి కోర్కిన్ తీర్పన్+కన్= దేవకీదేవి కోర్కెను తీర్చడానికి; ఇపుడు+ఏము+ఇచ్చటికినిన్= ఇపుడు మేము ఇక్కడికి; వచ్చితిమి= నీ వద్దకు వచ్చాం; నీకడన్= నీ వద్ద; పొరపొచ్చెము లేక= విరోధమూ లేకుండా; ఉన్నవారు+ఎ పో= ఉన్నవారే; వీరు= ఈ ఆరుగురు దేవకీ సంతానం.

**తా :** ఓ పుణ్యపురుషా! మాకు ముందు జన్మించిన ఆ ఆరుగురుని తిరిగి మా తల్లి దేవకీదేవికి చూపించెదమని ఆమె కోర్కె తీరుటకై మేము నీ వద్దకు వచ్చాం. నీవద్ద సుఖంగా ఏ విరోధమూ లేకుండా ఉంటున్న ఈ ఆరుగురు వీరే అని చెప్పారు.

**క. వీరలఁ దోకొని యిపుడే, ధారుణికి న్నేగి జనని తాపము వాపన్**
**వీరలు నంతట శాపముఁ, దీఱి మదీయ ప్రసాదధీయుతు లగుచున్. 1157**

**ప్రతి :** వీరలన్= ఈ పిల్లలను, తోకొని= తోడ్కొని; ఇపుడు+ఏ ధారుణికిన్+ఏగి= సుతలంనుండి భూతలానికివెళ్లి; జనని తాపము= తల్లియొక్క దుఃఖం; వాపన్= పోగొట్టడానికి; వీరలున్+అంతటన్= వీరుకూడా అప్పుడు; శాపమున్ తీరి= శాపవిముక్తులై; మదీయప్రసాద= నా అనుగ్రహంపొంది; ధీయుతుల్+అగుచున్= ధీమంతులు అవుతూ...

**తా :** వీరిని ఇపుడే తీసుకొనిపోయి తల్లి పుత్రశోకాన్ని తీరుస్తాం. వీరుకూడా శాపవిముక్తులై నా అనుగ్రహాన్ని పొందుతారు.

**క. పొలుపుగ సుగతిం బొందఁగఁ, గల' రని హరి యాన తిచ్చి కరుణాన్వితుఁడై**
**బలిచే ననుమతిఁ గొని వా, రలఁ దోకొని వచ్చె ని ద్ధరామండలికిన్. 1158**

**ప్రతి :** పొలుపుగ= చక్కగా; సుగతిన్= ఉత్తమలోకాల్ని; పొందన్+కన్+కలరు= పొందుతారు; అని; హరి+ఆనతి+ఇచ్చి= శ్రీకృష్ణుడు అంగీకరించి; కరుణా+అన్వితుడై= దయతో కూడినవాడై; బలిచేన్+అనుమతిన్+కొని= బలి చక్రవర్తిచే అనుమతి (వీడ్కోలు) పొంది; ఈ+ధరామండలికిన్= ఈ భూమిపైకి; వారలన్+తోకొనివచ్చెన్= వారలను తీసుకొని వచ్చాడు.

**తా :** పిదప వారికి ఉత్తమలోకాలు సిద్ధిస్తాయి అని కృష్ణుడు చెప్పి, వారిపై కరుణగల్గి, బలి అనుమతి పొంది భూలోకానికి తీసుకొనివచ్చాడు.

**వ. అట్లు వారలం దోడితెచ్చి తల్లి కిట్లనియె. 1159**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; వారలన్= ఆ ఆరుగురిని; తోడి తెచ్చి= వెంటతీసుకొనివచ్చి; తల్లికిన్= దేవకీదేవితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆ విధంగా బలి అధీనంలోని సుతలలోకంనుండి ఆ ఆరుగురు అన్నలను తీసుకొనివచ్చి కృష్ణుడు దేవకీదేవితో ఇలా అన్నాడు.

**క. 'కనుఁగొనుము వీరె నీ నం, దను' లని జనయిత్రికడ ముదంబున వారి**
**న్నునిచిన న ద్దేవకియును, ఘనపుత్త్రస్నేహమోహకలితాత్మకయై. 1160**

**ప్రతి :** కనుగొనుము= చూడు; వీరు+ఎ= ఈ కుమారులే; నీ నందనులు= నీ కొడుకులు, అని; జనయిత్రికడ= తల్లివద్ద; ముదంబునన్= సంతోషంతో; వారిన్+ఉనిచినన్= ఆ ఆరుగురు పిల్లల్ని ఉంచగా; ఆ+దేవకియును= తల్లి దేవకి కూడా; ఘన పుత్ర స్నేహ= గొప్పదైన పిల్లలపైగల వాత్సల్యమనే; మోహకలిత+ఆత్మక+ఐ= మోహంతోకూడిన హృదయంగలదై...

**తా :** ఆ పిల్లలను సంతోషంగా తీసుకొనివచ్చి 'వీరే నీ కుమారులు' అని తల్లికి చూపించగా ఆమెకుకూడా పిల్లలమీద వాత్సల్యంతో మోహం కలిగిందై

**క. చన్నులు దిగ్గనఁ జేపఁగఁ, గన్నుల నానందబాష్పకణములు దొరఁగఁ**
**గ్రన్నన కౌఁగిట నిడి ననుఁ, గన్నన్నలు వచ్చి రనుచుఁ గౌతుక మొప్పన్. 1161**

**ప్రతి :** చన్నులు= స్తనాలు; దిగ్గన= హఠాత్తుగా; చేపగన్= క్షీరధారలు స్రవింపగా; కన్నులన్= కన్నులనుండి; ఆనంద బాష్పకణాలు= సంతోషంతో కారే కన్నీటి బిందువులు; తొరగన్= కారగా; క్రన్నన= వెంటనే; కౌగిటన్+ఇడి= ఒడిలోకి తీసుకొని; ననున్+కన్న+అన్నలు= నా కన్నబిడ్డలు; వచ్చిరి+అనుచున్= వచ్చారంటూ; కౌతుకము+ఒప్పన్= కుతూహలం ప్రకటించగా...

**తా :** పిల్లలను చూడగానే స్తనాలనుండి క్షీరధారలు స్రవింపగా, ఆనందబాష్పాలతో కౌగిట్లోకి (ఒడిలోకి) తీసుకొని నా కన్నబిడ్డలు వచ్చారంటూ తమకంతో లాలిస్తూ

**విశే :** తాను కన్నబిడ్డలే అయినప్పటికీ ఒక కన్నతల్లి తనబిడ్డను దేవుడిగా భావించి, గౌరవవాచకంతో సంబోధించి లాలించడం లోకసహజమైందే! ఆ విధంగా దేవకీదేవి తన ఆరుగురు బిడ్డల్ని "ననుఁ గన్న అన్నలు" అని వారిపై లాలన, ప్రేమ చూపింది.

**వ. అట్లు కౌఁగిటం జేర్చి నిజాంకపీఠంబున నునిచి, శిరంబులు మూర్కొని, చిబుకంబులు పుణుకుచుం బ్రేమాతిశయమున మేనం బులక లొలయం జన్నిచ్చిన, వారును వైష్ణవ మాయామోహితులై స్తన్యపానంబు సేయుచు భగవంతుడయిన రథాంగపాణి యంగసంగంబున విగతకల్మషులై విధిశాపసాగరంబు హరిదయా కటాక్షంబను నావచేతం దరించి నిజస్వరూపంబులు ధరించి, కృష్ణునకుఁ దలిదండ్రులకు వందనం బాచరించి గగనపథంబున నిజస్థానంబున కరిగి రంత దేవకీదేవి తన మనంబున. 1162**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; కౌఁగిటన్+చేర్చి= కౌగిలించుకొని; నిజ+అంకపీఠంబునన్+ఉనిచి= తన తొడపై కూర్చోపెట్టుకొని; శిరంబులు మూర్కొని= తలలు ఆఘ్రాణించి; చిబుకంబులు పుణుకుచున్= గడ్డం భాగం నిమురుతూ; ప్రేమ+అతిశయమునన్= అధికమైన ప్రేమతో; మేనన్= శరీరంలో; పులకలు+ఒలయన్= రోమములు నిక్కబొడుచుకొనగా; చన్ను+ఇచ్చిన= స్తనం (పాలు) ఇవ్వగా; వారును= ఆ సుతులు; వైష్ణవ మాయా మోహితులు+ఐ= విష్ణుమాయలో బడినవారై; స్తన్యపానంబు సేయుచు= పాలుతాగుతూ; భగవంతుడు+అయిన= విష్ణుస్వరూపుడైన; రథం+అ పాణిన్= చక్రం ధరించిన శ్రీకృష్ణస్వామి; అంగ సంగంబునన్= శరీరస్పర్శచే; విగతకల్మషులై= పాపములు పోగొట్టుకొన్నవారై; విధిశాపసాగరంబు= విధిచేత

ఏర్పడిన శాప సాగరంబు; హరిదయాకటాక్షంబు+అను= విష్ణువు కృప అనే కంటి కొసచూపు అనే; నావ చేతన్= నౌకచేత; తరించి= దాటి; నిజస్వరూపంబు ధరించి= తమ తమ నిజరూపములను పొంది; కృష్ణునకున్+తలిదండ్రులకు= తమ్ముడైన కృష్ణునికి తల్లి దేవకీదేవికి, తండ్రి వసుదేవునికి; వందనంబు+ఆచరించి= నమస్కారాలు పెట్టి; గగనపథంబునన్= ఆకాశమార్గాన; నిజస్థానంబునకున్= తమ నెలవులకు (స్వర్లోకానికి); అరిగిరి= వెళ్లిరి; అంత దేవకీదేవి; తనమనంబున= తన మనస్సులో...

**తా :** తల్లి దేవకీదేవి చనిపోయిన తన ఆరుగురు పిల్లలు బతికిరాగా సంతోషంగా కౌగిట్లోకి తీసికొని, ఒడిలో కూర్చోబెట్టుకొని, తలలు ఆఘ్రాణించి, చెంపలు, గడ్డం ప్రేమతో పుణికి, వాత్సల్యంతో గగుర్పాటురాగా, పాలివ్వగా, వారు విష్ణుమాయకు లోబడి బాలకులవలెనే పాలుతాగి, భగవంతుడైన కృష్ణుని స్పర్శతో పాపాలు పోయి విధిశాపసముద్రాన్ని హరిదయ అనే నావతో దాటి, నిజరూపాలతో, తల్లిదండ్రులకు, కృష్ణునికి నమస్కరించి, ఆకాశమార్గాన స్వర్లోకానికి చేరుకున్నారు. దేవకీదేవి తన మనస్సులో (ఇలా ఆలోచించింది)

**క. చచ్చిన బాలురఁ గ్రమ్మఱఁ, దెచ్చుట గడుఁ జిత్ర మనుచు దేవకి మదిలో**
**నచ్చెరువడి యిది యంతయు, నచ్చపు హరిమాయ గాక! యని తలఁచె నృపా! 1163**

**ప్రతి :** నృపా= రాజా!; చచ్చిన బాలురన్= చనిపోయిన తన పిల్లల్ని; క్రమ్మఱన్= తిరిగి; తెచ్చుట= తీసుకొనివచ్చుట; కడున్+చిత్రము+అనుచున్= మిక్కిలి విచిత్రమని; దేవకి; మదిలోన్+అచ్చెరువు+పడి= మనసులో ఆశ్చర్యపడి; ఇది+అంతయు= ఈ సంఘటనలన్నీ; అచ్చము= స్వచ్ఛమైన; హరిమాయగాక= విష్ణుమాయకాక (మరొకటి కాదని); తలఁచెన్= తలచింది.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! మరణించిన తన బాలకులను తిరిగి బతికించి తేవడం చాలా చిత్రమని మనసులో దేవకీదేవి ఆశ్చర్యపడి, ఇది అంతా అచ్చంగా విష్ణుమాయ అని భావించింది.

**క. పరమాత్ముఁ డఖిలజగదీ, శ్వరుఁ డగు కృష్ణుండు సేయు సత్కృత్యంబుల్**
**పరికింప నెన్నఁ బెక్కులు, ధరణీవర యనిన రాజు తా ముని కనియెన్. 1164**

**ప్రతి :** ధరణీవర= (భూమికి ఈశుడు అయి) ఓ మహారాజా! పరమ+ఆత్ముడు= మహానుభావుడు; అఖిల జగత్+ఈశ్వరుడు+అగు= సమస్తలోకాలకు అధిపతి అయిన; కృష్ణుండు= కృష్ణభగవానుడు; చేయు= లీలగా ప్రదర్శించే; సత్+కృత్యంబుల్= మంచి పనులు; పరికింపన్+ఎన్నన్= లెక్కించి చూడగా; పెక్కులు= అనేకం; అనిన; రాజు= పరీక్షిత్తు; తాన్= తాను; మునికిన్+అనియెన్= శుకమహర్షితో (ఇలా) అన్నాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! పరమాత్మా, సమస్తలోకాధిపతి అయిన కృష్ణుడు లీలలుగా సత్కార్యాలు ఎన్నో చేసినాడు అని అనగా శుకమహర్షితో పరీక్షిత్తు ఇలా అన్నాడు.

## ❖ సుభద్రా పరిణయము ❖

**సీ. మునినాథ! పార్థుండు వనజనాభునిసహోదరి సుభద్రను నే విధమునఁ బెండ్లి**
**యయ్యెను నా విధం బంతయు నాకును దెలియంగ నెఱిఁగింపు ధీవిశాల!**

**యనవుడు నా వ్యాసతనయుఁ డాతనిఁ జూచి వినవయ్య! నృప! దేవవిభునిసుతుఁడు**
**మును తీర్థయాత్రాసముత్సుకుండై చని రమణఁ బ్రభాసతీర్థమున నుండి**

**తే. యా తలోదరితోడినెయ్యంబు కలిమిఁ, జూడఁ గోరుచు రాముఁడు సుందరాంగిఁ**
**గౌరవేంద్రున కీ సమకట్టె ననుచుఁ, దనకు నెఱుఁగ రా నా పురందరసుతుండు. 1165**

**ప్రతి :** మునినాథ!= మునిశ్రేష్ఠుడైన ఓ శుకమహర్షీ! పార్థుండు= అర్జునుడు; ధీవిశాల= విస్తారమైన బుద్ధిగలవాడా!; వనజనాభుని= కృష్ణుని; సహ+ఉదరి= తోడబుట్టినది అయిన సుభద్రను; ఏ విధమునన్= ఏలాగున; పెండ్లి+అయ్యెను= పెండ్లి చేసికొన్నాడు? ఆవిధంబు+అంతయున్= ఆ సంగతి అంతా; నాకును, తెలియన్+కన్ ఎఱింగింపుము= నాకు తెలిసేలాచెప్పు; అనవుడు= అనగా; ఆ వ్యాసతనయుడు= ఆ వ్యాసునికుమారుడు శుకుడు; అతనిన్+చూచి= పరీక్షిత్తును వీక్షించి; వినవయ్య! నృప!= ఓ రాజా విను; దేవవిభునిసుతుడు= ఇంద్రకుమారుడైన అర్జునుడు; మును= పూర్వం; తీర్థయాత్రా+సమ్+ఉత్సుకుండు+ఐ= తీర్థయాత్రలు చేయాలని ఉవ్విళ్లూరుతూ; చని= వెళ్లి; ప్రభాస తీర్థమునన్+ఉండి= ప్రభాస తీర్థం చేరుకుని; ఆ+తల+ఉదరితోడి= అందగత్తె అయిన సుభద్రతోడి; నెయ్యంబు కలిమిన్= ప్రేమకారణంగా; చూడగోరుచున్= దర్శించాలనే కోరికతో; రాముడు= బలరాముడు; సుందర+అంగిన్= అందకత్తె అయిన చెల్లెలు సుభద్రను; కౌరవేంద్రునకున్= దుర్యోధనునకు; ఈ+సమకట్టెన్= పిల్లనివ్వడానికి సంకల్పించాడు; అనుచున్+తనకున్+ఎఱుగరాన్= అంటూ తనకు తెలియరాగా; ఆ పురందర సుతుడు= ఇంద్రకుమారుడైన అర్జునుడు...

**తా :** మహర్షీ! అర్జునుడు కృష్ణుని సోదరి ఐన సుభద్రను ఏ విధంగా పెళ్లి చేసుకొన్నాడు? ఆ వివరాలు నాకు చెప్పు. అని పరీక్షిత్తు అడగగా శుకమహర్షి ఇలా చెప్పడం ప్రారంభించాడు. ఇంద్రకుమారుడు అర్జునుడు పూర్వం తీర్థయాత్రల మీది ఉత్సాహంతో తిరుగుతూ ప్రభాసతీర్థానికి వచ్చినాడు. దానికి దగ్గరలో శ్రీకృష్ణుని ఇంటగల సుభద్రపై ప్రేమకారణంగా ఆమెను చూడాలనుకున్నాడు. బలరాముడు ఆమెను దుర్యోధనునకు ఇచ్చి పెండ్లిచేయాలని సంకల్పించినట్టు తెలుసుకున్న అర్జునుడు

**వ. అట్లు సుభద్రాదర్శనోత్సాహంబు దన మనంబున సందడిగొనం, ద్రిదండివేషంబు ధరియించి, ద్వారకాపురంబునకుం జనుదెంచి, య ప్పౌరజనంబులు భక్తిస్నేహంబుల ననిశంబుఁ బూజింపం దన మనోరథసిద్ధి యగు నంతకుం గనిపెట్టుకొని, వానకాలంబు సనునంతకు న ప్పట్టణంబున నుండు సమయంబున. 1166**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; సుభద్రాదర్శన+ఉత్సాహంబు= సుభద్రను చూడాలననే ఉబలాటం; తన మనంబునన్= తన మనస్సులో; సందడిగొనన్= అల్లరి చేస్తుండగా; త్రిదండి వేషంబున= సన్యాసి రూపం; ధరియించి= స్వీకరించి; ద్వారకాపురంబునకున్= సుభద్ర ఉన్నట్టి ద్వారకకు; చనుదెంచి= వచ్చి; ఆ+పౌరజనంబులు= ఆ ద్వారక ప్రజలు; భక్తిస్నేహంబులన్= భక్తిమరియు ఆత్మీయతలతో; అనిశంబు= ఎల్లవేళలా; పూజింపన్= అర్చిస్తూండగా; తనమనోరథ= తనకోరిక; సిద్ధి అగునంతకున్= ఫలించే వరకును; కనిపెట్టుకొని= ఎదురుచూస్తూ; వానకాలంబు+చను+అంతకున్= వానకాలం పోయేంతవరకు; ఆ+పట్టణంబునన్= ఆ ద్వారకలో; ఉండు సమయంబునన్= నివాసమేర్పర్చుకొన్న వేళలో...

**తా :** సుభద్రను చూడాలనే కోరిక తన మనసులో ఉత్తేజపరుస్తుండగా, సన్యాసి వేషంతో ద్వారకకు వచ్చి, పురజనులు భక్తి స్నేహాలతో కొలువగా, తనకోరిక తీరేవరకు ఓపికగా ఎదురుచూస్తూ వానకాలం వెళ్లేవరకు ఆ ద్వారకలో ఉండి

**క. రాముఁడు తత్కపటాకృతిఁ, దా మదిఁ దెలియంగలేక దగ నొకనాఁ డా**
**భూమీవర తాపసుఁ బో, రామిఁ గని యాత్మమందిరమునకుఁ దెచ్చెన్. 1167**

**ప్రతి :** భూమీవర= రాజా!; రాముడు= బలరాముడు; తత్= అట్టి అర్జునుని; కపట+ఆకృతిన్= మారు రూపంలో; తాన్= తాను; మది; తెలియంగలేక= మనసులో తెలుసుకోలేక; తగన్= సరిపడునట్లుగా (అర్జునునికోరిక ఈడేరునట్లుగా); ఒకనాడు= ఓ రోజు; తాపసున్= తపస్వి రూపంలో ఉన్న అర్జునుని; పోరామిన్+కని (వెళ్లిపోక, స్థిరంగా ఉండటంచూచి, ఆత్మమందిరమునకున్= తన నివాసభవనానికి; తెచ్చెన్= తీసుకొని వచ్చాడు.

**తా :** అర్జునుని కపటరూపాన్ని గుర్తించక, నిజమైన సన్యాసిగా భావించి, ఆతడు చాలాకాలం ద్వారకలో ఉండి, వెళ్లిపోవడంచూచి, తన మందిరానికి సాదరంగా ఆహ్వానించాడు.

**ఆ. తెచ్చి భిక్షసేయ దేవేంద్ర తనయుండు, గుడుచుచుండి యచటఁ గోరి మెలఁగు**
**నసమబాణు మోహనాస్త్రంబు కైవడి, వీరమోహి నన విహారలీల. 1168**

**ప్రతి :** తెచ్చి= అర్జునుణ్ణి తీసుకొనివచ్చి; భిక్ష+చేయ= భిక్షసమర్పిస్తుండగా; దేవ+ఇంద్ర= ఇంద్రుని; తనయుండు= కుమారుడు అర్జునుడు; కుడుచుచున్+ఉండి= నిత్యం భిక్షను స్వీకరిస్తూ ఉండగా; అచట= అర్జునుడున్నచోట; కోరి= ఉద్దేశపూర్వకంగా; విహారలీలన్= విహరిస్తూ; మెలగున్= సంచరిస్తూంది; అసమబాణు= బేసి సంఖ్యలో; మోహన+అస్త్రంబు= మన్మథుని సమ్మోహనాస్త్రం వలె; కైవడిన్ వీరమోహిని+అనన్= వీరుల్ని మిక్కిలి మోహింప చేస్తోందా అన్నట్లున్న సుభద్ర.

**తా :** బలరాముడు కపట సన్యాసిని తన ఇంటికి తెచ్చి ఆతిథ్యమిస్తుండగా అర్జునుడు అక్కడే ఉండి రోజూ భిక్షను గ్రహిస్తూ ఉండగా మన్మథుని సమ్మోహనాస్త్రంవలె ఉన్న వీరులను కూడా మిక్కిలి మోహపరుస్తోందా! అన్నట్లున్న సుభద్ర విహారంగా సంచరిస్తూంది.

**వ. అట్లు సుభద్ర విహరించుచున్న సమయంబున. 1169**

**ప్రతి :** అట్లు= ఉద్దేశపూర్వకంగా అర్జునునిపై ప్రీతితో; సుభద్ర; విహరించుచున్న= విహరిస్తూ ఉన్న; సమయంబున= వేళలో...

**తా :** అలా కపటసన్యాసిని అర్జునుడుగా గుర్తించి, అర్జునునిపైగల ప్రేమతో సన్యాసిని ప్రీతితో చూస్తూ సుభద్ర అక్కడే సంచరిస్తున్న వేళలో

**చ. జలరుహపత్త్రనేత్రు ననుసంభవ చారువధూలలామ స**
**ల్లలితవిహారవిభ్రమవిలాసము లాత్మకు విందు సేయ న**
**బ్బలరిపునందనుండు గని భావజసాయకబాధ్యమాన వి**
**హ్వలహృదయాబ్జుఁడై నిలిపె నత్తరుణీమణియందుఁ జిత్తమున్. 1170**

**ప్రతి :** జలరుహపత్రనేత్రు= (తామర రేకులవంటి నేత్రాలుగల) శ్రీకృష్ణునియొక్క; అనుసంభవ= తోడబుట్టిన; చారువధూలలామ= అందమైన శ్రేష్ఠురాలైన యువతియొక్క; సత్+లలిత= శ్రేష్ఠమైన కోమల; విహార= కదలికలు; విభ్రమ= భ్రమపుట్టించే; విలాసములు= సోయగాలు; ఆ+బలరిపు నందనుడు= ఆ అర్జునుడు; కని= చూచి; భావజ= మన్మథునియొక్క;

సాయక= బాణాలచే; బాధ్యమాన= బాధింపబడుతూ; విహ్వల= చలించిపోయిన; హృదయ+అబ్జుడై= కమలంవంటి హృదయంకలవాడై; ఆ+తరుణీమణి+అందు= శ్రేష్ఠురాలైన ఆ యువతి (సుభద్ర) యందు; చిత్తమున్= మనసును; నిలిపెన్= ఉంచాడు.

**తా :** శ్రీకృష్ణుని చెల్లెలు సుభద్ర కపటసన్యాసి అయిన అర్జునుని ముందు ఇటునటూ తిరుగాడుతుంటే ఆ సౌందర్యరాశి వయోవిలాసాలు, సొగసులు అర్జునునిమన్మథబాధను పెంచాయి. తన చిత్తాన్ని ఆమెయందే ఉంచి మన్మథబాధకు గురి అయినాడు.

**ఉ. ఆ తరుణీశిరోమణియు నర్జును నర్జునచారుకీర్తి వి**
**ఖ్యాతుని నింద్రనందను నకల్మషమానసుఁ గామినీ మనో**
**జాతునిఁ జూచి పుష్పశరసాయకజర్జరితాంతరంగయై**
**భీతిలి యుండె సిగ్గు మురిపెంబును మోహముఁ దేఱు చూపులన్. 1171**

**ప్రతి :** ఆ తరుణీ శిరోమణియున్= ఆ యువతీరత్నంకూడా; అర్జున= తెల్లని; చారు= మనోహరమైన; కీర్తివిఖ్యాతునిన్= కీర్తిచే ప్రసిద్ధుడైనవాణ్ణి; ఇంద్రనందనున్= ఇంద్రుని కుమారుణ్ణి; అకల్మషమానసున్= కల్మషాలు లేనట్టి మనస్సుకలవాణ్ణి; కామినీ మనోజాతునిన్= స్త్రీలకు మన్మథునివంటి వాణ్ణి; అర్జునునిన్= అర్జునుణ్ణి; చూచి= (నిత్యం) దర్శిస్తూ; పుష్పశరసాయక= మన్మథుని బాణాలచే; జర్జరిత= గాయపడిన; అంతరంగ+ఐ= హృదయంకలదై; సిగ్గు= సిగ్గు; మురిపెంబును= ప్రేమను; మోహము= ఎక్కువ కోరిక; తేఱు= తేటపరచే; చూపులన్= చూపులతో; భీతిలి+ఉండెన్= భయంతో కూడి ఉంది.

**తా :** అర్జునుని వంటిదే సుభద్రస్థితి. కీర్తిమంతుడు, కల్మషరహిత మానసుడు, మన్మథునివంటివాడైన ఇంద్ర నందనుని చూచి సుభద్ర అర్జునునిపట్ల అనురాగంతో మన్మథబాధ పొందింది. సిగ్గు, ప్రేమ, మోహం కన్నుల్లో ప్రతిఫలిస్తున్నా స్త్రీ సహజ భయంతో వ్యక్తంచేయలేని స్థితిలో ఉంది.

**వ. అట్లా నృపసత్తమమత్తకాశిను లొండొరుల చిత్తంబులు చిత్తజాయత్తంబులై కోర్కులు దత్తరింపం దాల్ములు వీడ సిగ్గునం జిట్టు ముట్టాడుచున్నయంత నొక్కనాఁడు దేవతామహోత్సవనిమిత్తం బత్తలోదరి పురంబు వెలుపలికి నరుగుదెంచిన నర్జునుండు గృష్ణ దేవకీ వసుదేవుల యనుమతంబు వడసి తోడనం దానును చని యప్పుడు. 1172**

**ప్రతి :** అట్లు+ఆ నృపసత్తమ మత్తకాశినులు= ఆ రాజైన అర్జునుడూ, ఉత్తమ స్త్రీయగు సుభద్రయు; ఒండొరుల చిత్తంబులు= పరస్పరం మనసులు; చిత్తజ+ఆయత్తంబులు+ఐ= మన్మథునికి లొంగినవారై; కోర్కులు= కోరికలు; తత్తరింపన్=సుందడించగా; తాల్ములువీడన్= ఓపికలు నశించగా; సిగ్గునన్= సిగ్గుతో; చిట్టుముట్టు+ఆడుచుక+ఉన్న+అంతన్= కలవరపడుచుండగా; ఒక్కనాడు= ఒక రాజు; దేవతా మహా+ఉత్సవ నిమిత్తము= దేవతల జాతరకోసం; పురంబు వెలుపలికిన్= నగరం బయటకు; అరుగుదెంచినన్= రాగా; అర్జునుండు; గృష్ణ, దేవకీ; వసుదేవుల= అన్న కృష్ణుడు; తల్లిదండ్రులైన దేవకీదేవి, వసుదేవుల; అనుమతంబు= అనుమతి; పడసి= పొంది; తోడనన్= తోడుత; తానును= అర్జునుడు కూడా సుభద్రవెంబడే, చని, అప్పుడు= వెళ్లిన సమయంలో...

**తా :** ఇట్లు సుభద్రార్జునులు పరస్పరానురాగంతో, మన్మథ భావాలచే మనస్సు ముసురుకొనగా, ఓపికలు నశించి సిగ్గుతో జగడమాడుతుండగా ఒకరోజు దేవతలకొరకు జాతరసాగగా, దానిలో పాల్గొనడానికి నగరం వెలుపలికి సుభద్ర వచ్చింది. అర్జునుడు కూడా కృష్ణ, దేవకీ, వసుదేవుల అనుమతిపొంది వారిఅంగీకారంతో సుభద్రను అనుసరించి ఊరి వెలుపలకి వచ్చినాడు.

**సీ. సాంద్రశరచ్చంద్రచంద్రికాస్ఫూర్తిచే రాజిల్లు పూర్ణిమారజనివోలెఁ**
**బూర్ణేందుబింబావతీర్ణమై యిలమీఁద, భాసిల్లు హరిణడింభంబుఁబోలె**
**సులలితమేఘమండలమును నెడఁబాసి వసుధఁ గ్రుమ్మరు తటిద్వల్లివోలె**
**మాణిక్యరచితసన్మహితచైతన్యంబు వొందిన పుత్తడిబొమ్మవోలె**

**తే. లలితవిభ్రమరుచికళాలక్షణములఁ, బొసఁగ రూపైన శృంగారరసముఁబోలె**
**నర్థిఁ జరియించుచున్న పద్మాయతాక్షిఁ, బ్రకటసద్గుణభద్ర సుభద్రఁ జూచి. 1173**

**ప్రతి :** సాంద్రశరత్+చంద్ర= చిక్కని శరత్కాలపు చంద్రుని; చంద్రికా= పండువెన్నెల; స్ఫూర్తిచే= కాంతిచే; రాజిల్లు= ప్రకాశించే; పూర్ణిమారజని+పోలెన్= పున్నమిరాత్రివలె; పూర్ణ+ఇందుబింబ= నిండు చంద్రబింబంనుండి; అవతీర్ణము+ఐ= దిగిందై; ఇలమీదన్ భాసిల్లు= నేలపై శోభించే; హరిణ డింభమున్+పోలె= లేడిపిల్లవలె; సులలిత= మిక్కిలిఒప్పిదమైన; మేఘమండలమును= మేఘాల గుంపునుండి; ఎడబాసి= విడిచి; వసుధన్+క్రుమ్మరు= భూమిపైనడయాడే; తటిత్+వల్లి+పోలెన్= మెరుపుతీగవలె; మాణిక్య రచిత= మణులు పొదిగిన; సత్+మహిత= చక్కని మేలైన; చైతన్యంబు= చేతనత్వం (ప్రాణం); పొందిన; పుత్తడిబొమ్మ+పోలెన్= బంగారు బొమ్మవలె; లలితవిభ్రమ= మనోజ్ఞమైన విలాసాలతత్తరపాటు యొక్క; రుచికళా= కాంతి కళల యొక్క; లక్షణములన్= గుణాలతో; పొసగరూపు+ఐన= చక్కగా అమరిన; శృంగారరసమున్+పోలెన్= శృంగార రసాధిదేవతవలె; అర్థిన్= కోరికలతో; చరియించుచున్+ఉన్న= తిరుగాడుతున్న; పద్మ+ఆయత+అక్షి= పద్మాలవంటి వెడల్పైన కన్నులుకలదైన; ప్రకటసద్గుణభద్ర= ప్రసిద్ధమైన మంచి గుణాలచే శుభవతి అయిన; సుభద్రను; చూచి= చూచినవాడై

**తా :** శరత్కాలంలోని నిండువెన్నెలలో ప్రకాశించే పున్నమిరాత్రివలె ఉన్నదీ, నిండు చంద్రబింబంనుండి కిందికి దిగి భూమిపై నడయాడే జింక పిల్లవలె ఉన్నదీ, మేఘమండలంనుండి ఇలకు దిగివచ్చి తిరుగుతున్న మెరుపుతీగెవలె ఉన్నదీ, మణులు పొదిగిన బంగారుబొమ్మకు చైతన్యంవచ్చి కదులుతున్నట్టు తిరుగుతున్నదీ, ప్రతికదలికలోనూ కాంతులుచిమ్మే కళలొలికిస్తూ, శృంగార రసాధిదేవత రూపుగొన్నట్టిదీ, ఉట్టిపడే మంచి గుణాలచే మంగళ కరమైనదీ అయిన ఆ సుభద్రను చూచినవాడై అర్జునుడు

**వ. అప్పుడు దాయం జని యరదంబుపై నిడుకొని పోవుచుండం గనుంగొని యదుబలంబులు మదంబున నంటం దాఁకిన, నప్పు డయ్యాఖండలనందనుండు ప్రచండగాండీవకోదండనిర్ముక్తకాండంబులం దూలించి, యఖండబాహుదండవిజయప్రకాండుండై ఖాండవప్రస్థపురంబున కరిగె; నట బలభద్రుం డవ్వార్త విని విలయసమయసమీరసఖునికైవడిం బటురోషభీషణాకారుండై క్రోధించినం గని కృష్ణుం డాదిగాఁ గల బంధుజనంబు లతనిచరణంబులకుం బ్రణమిల్లి మృదుమధురభాషణంబుల ననునయించి యొడంబడు నట్లుగా నాడిన నతండును సంతుష్టుం డయి మనంబునఁ గలంకదేఱి యప్పుడు. 1174**

**ప్రతి :** అపుడు= ఆ (సరైన) సమయంలో; డాయన్+చని= దగ్గరగా వెళ్లి; అరదంబుపైనిడుకొని= (సిద్ధంగా ఉన్న) రథంమీదికి ఎక్కించుకొని; పోవుచున్+ఉండన్= పారిపోతూండగా; కనున్+కొని= గమనించిన; యదుబలంబులు= యదుసైన్యాలు; మదంబున= శౌర్యంతో; అంటన్+తాకినన్= ఎదుర్కొని పోరాడగా; అప్పుడు; ఆ+ఆఖండల నందనుండు= ఆ ఇంద్రకుమారుడు అర్జునుడు; ప్రచండగాండీవ= భయంకరమైన గాండీవమనే కోదండ నిర్ముక్త కాండంబులన్= ధనువునుండి వదిలిన బాణాలచే; తూలించి= ఎగురగొట్టి; అఖండ బాహుదండ= గొప్పవైన; కర్రలవంటి బాహువులవలన; విజయ ప్రకాండుండు+ఐ= విజయంచే శ్రేష్ఠుడై; ఖాండవ ప్రస్థపురంబునకున్= ఇంద్రప్రస్థ నగరానికి; అరిగెన్= పోయాడు; అట బలభద్రుండు+ఆ+వార్తవిని= అక్కడ ద్వారకలో బలరాముడు; ఆ వార్త (అర్జునుడు సుభద్రను ఎత్తుకపోయినవార్త విని; విలయసమయ= ప్రళయకాలంలోని; సమీరసఖుని కైవడిన్= వాయుదేవుని స్నేహితుడైన అగ్నివలె; పటురోషణ భీషణ+ఆకారుండు+ఐ= మిక్కిలి క్రోధంచే భయంకరరూపాన్ని ధరించి; క్రోధించినన్= కోపగించగా; కని= చూచి; కృష్ణుండు+ఆదిగాగల= కృష్ణుడు మొదలుగాగల; బంధుజనంబులు= చుట్టాలు; అతని చరణంబులకున్= ఆతని పాదాలకు; ప్రణమిల్లి= నమస్కరించి; మృదుమధుర భాషణంబులన్= మెత్తని, తియ్యని మాటలతో; అనునయించి= బుజ్జగించి; ఒడంబడునట్లుగాన్= ఒప్పుకొనేలా; ఆడినన్= పలుకగా; అతండును= ఆయనకూడా; సంతుష్టుండు+అయి= తృప్తిచెంది; మనంబునన్= మనసులో; కలంకతేఱి= తేటపడి; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** అర్జునుడు సుభద్ర దగ్గరకువెళ్లి, ఆమెను తీసుకొని రథంమీద కూర్చుండబెట్టుకొని, కైకొనిపోతూండగా, యదుసైన్యాలు అడ్డగించాయి. ఆయన గాండీవం స్వీకరించి బాణాలతో వారిని చిందరవందరచేసి, గెలిచి, ఇంద్రప్రస్థ నగరానికి చేరాడు. బలరామునికి ఈవార్త తెలిసి, చెల్లెలిని అనుమతిలేకుండా తీసుకొనిపోయిన అర్జునునిపై ప్రళయకాలాగ్నివలె మండిపడ్డాడు. శ్రీకృష్ణుడు, తక్కిన చుట్టాలు అందరూ ఆయన పాదాలకు నమస్కరించి, ఆయనను శాంతపరచి, మృదువైన తియ్యనైన మాటలతో పరిస్థితులు వివరించి, సుభద్ర అర్జునుల దాంపత్యానికి అంగీకరింపజేశారు. బలరాముడు కోపం మానుకొని మనసు తేట పంచుకున్నాడు. తరువాత

**క. కరులం దేరుల నుత్తమ, హరులన్ మణిహేమభూషణాంబరభృత్యో**
**త్కర దాసికాజనంబుల, నరణంబుగ నిచ్చి పంపె ననుజకుఁ బ్రీతిన్. 1175**

**ప్రతి :** కరులన్= ఏనుగుల్ని; తేరులన్= రథాల్ని; ఉత్తమహరులన్= మేలుజాతి గుర్రాల్నీ; మణి= రత్నాల్ని; హేమభూషణ= బంగారు ఆభరణాల్ని; అంబర= వస్త్రాల్ని; భృత్య= సేవకులయొక్క; ఉత్కర= సమూహాల్ని; దాసికాజనంబులన్= దాసీజనాన్ని; అనుజకున్= చెల్లెలు సుభద్రకు; ప్రీతిన్= ప్రేమతో; అరణంబు+కన్= సారెగా; ఇచ్చిపంపెన్= బహుమతులుగా ఇచ్చి పంపాడు.

**తా :** బలరాముడు ప్రేమగా తనచెల్లెలు సుభద్రకు పెళ్లిలో తల్లిగారింటి బహుమతిగా రాజోచితమైన ఏనుగులు, గుర్రాలు, రథాలు, రత్నాలు, బంగారు ఆభరణాలు, వస్త్రాలు, దాసదాసీజనాన్నీ ఇచ్చి పంపాడు.

**వ. ఇట్లు కృష్ణున కభిమతంబుగా నర్జున సుభద్రల కరణం బిచ్చి పంపెనని చెప్పి శుకయోగీంద్రుండు మఱియు నిట్లనియె. 1176**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కృష్ణునకున్= శ్రీకృష్ణునికి; అభిమతంబు+కాన్= ఇష్టమయ్యేలా; అర్జున సుభద్రలకున్+ అరణంబు+ఇచ్చి= బావకు, చెల్లెలికి; బహుమతుల్ని, ఇచ్చి పంపాడు, అని చెప్పి, శుకయోగి+ఇంద్రుండు= యోగులలో శ్రేష్ఠుడైన శుకుడు; మఱియున్+ఇట్లు+అనియెన్= ఇంకా ఇలా అన్నాడు.

**తా :** శ్రీకృష్ణుని సలహామేరకు, అతడు ఇష్టపడేలా, సుభద్రార్జునులకు లోపం రానివ్వకుండా ఘనంగా సారె ఇచ్చి పంపినాడని చెప్పి శుకమహర్షి పరీక్షిత్తుతో తరువాతికథను చెప్పసాగాడు.

## ❖ శ్రీకృష్ణుండు ఋషిసమేతుండయి మిథిలానగరమునకుఁ బోవుట ❖

**సీ. నరనాథ! విను భువనప్రసిద్ధంబుగ దీపించునట్టి విదేహదేశ**
**మందు భూకాంతకు నాననదర్పణం బనఁ దనర్చిన మిథి లనుపురమునఁ**
**గలఁడు శ్రీహరిపాదకంజాతభక్తుండు గళితరాగాదివికారుఁ డమల**
**చరితుఁ దక్రోధుండు శాంతుండు నిగమార్థకోవిదుం డగు శ్రుతదేవుఁ డనెడి**

**తే. భూసురోత్తముఁ డొకఁ డనిచ్ఛాసమాగ, తంబు తుషమైన హేమశైలంబు గాఁగఁ**
**దలఁచి పరితోష మందుచుఁ దగ గృహస్థ, ధర్మమున నుండె సముచితకర్ముఁ డగుచు. 1177**

**ప్రతి :** నరనాథ! విను= ఓ పరీక్షిన్మహారాజా! వినుము; భువన ప్రసిద్ధంబు+కన్= లోక విఖ్యాతమై; దీపించిన+అట్టి= ప్రకాశించే; విదేహదేశము+అందున్= విదేహరాజ్యంలో; భూకాంతకున్= భూదేవికి, ఆననదర్పణంబు+అనన్= ముఖాన్ని చూచుకొనే దర్పణంవంటిదిగా; తనర్చిన= ఒప్పిన; మిథిల+అను పురమునన్= మిథిల అనే నగరంలో; శ్రీహరి పాదకంజాత= విష్ణుపాద పద్మాలపై; భక్తుండు= భక్తిగల్గినవాడు; గళితరాగ+ఆదివికారుడు= రాగద్వేషాదివికారాలు పారదోలినవాడు; అమల చరితుడు= స్వచ్ఛమైన చరిత్ర గల్గినవాడు; అక్రోధుండు= క్రోధంలేనివాడు; శాంతుండు= శాంతంగల్గినవాడు; నిగమ+అర్థకోవిదుండు= వేదార్థాలు బాగా తెలిసినవాడు, అగు, శ్రుతదేవుఁడు, అనెడి; భూసుర+ఉత్తముఁడు= శ్రుతదేవుడనే పేరుగల బ్రాహ్మణశ్రేష్ఠుడు, ఒకఁడు, కలదు; అనిచ్ఛా= కోరకుండ; సమాగతంబు= వచ్చింది; తుషము+న= ఊక అయినా; హేమశైలంబుకాన్+కన్= మేరునగమంత పెద్దదిగా; తలచి= భావించి; పరితోషము+అందుచున్= సంతోషిస్తూ; సమ్+ఉచితకర్ముఁడు+అగుచున్= శాస్త్రోక్తాలయిన కర్మలు గలవాడై; గృహస్థ ధర్మమున= గృహస్థాశ్రమనియమాలతో; తగన్= చక్కగా; ఉండెన్=ఉన్నాడు.

**తా :** ఓ మహారాజా! వినవయ్యా! లోకప్రఖ్యాతమైన విదేహ రాజ్యంలో భూదేవికి ముఖదర్పణంవంటి మిథిల అనే నగరం ఉంది. ఆ నగరంలో ఒక బ్రాహ్మణు డున్నాడు. అతడు విష్ణుభక్తుడు. రాగద్వేషాదివికారాలు వదిలినవాడు. స్వచ్ఛమైన నడవడిక గలవాడు. కోపంలేనివాడు. శాంతస్వభావుడు. వేదార్థనిర్ణయంలో పండితుడైన శ్రుతదేవుడు సార్థకనామధేయుడు. అతడు అయాచితంగా ప్రాప్తమైంది లేశమైనా మేరుపర్వతంగా భావించేవాడు. గృహస్థధర్మం ఆచరిస్తూ ఉచిత కర్మాచరణంకావిస్తూ ఉంటున్నాడు.

**ఉ. ఆ పురి నేలువాఁడు బహుళాశ్వుఁడు నా నుతి కెక్కినట్టి ధా**
**త్రీపతి యా ధరామరునిరీతిని నిష్కలుషాంతరంగుఁడై**

**యే పనులందు ధర్మగతి నేమఱఁ కర్థిఁ జరించుచుండె ల**
**క్ష్మీపతి వారిపైఁ గరుణఁ జేసి ప్రసన్నముఖాంబుజాతుఁడై. 1178**

**ప్రతి :** ఆ పురిన్+ఏలువాడు= ఆ నగరాన్ని ఏలేవాడు; బహుళాశ్వుదు+నాన్= బహుళాశ్వుడు అనుపేరుగలవాడై; నుతికిన్+ఎక్కినట్టి= ప్రసిద్ధికి ఎక్కిన; ధాత్రీపతి= రాజు; ఆ ధరా+అమరునిరీతి= బ్రాహ్మణునిలాగా, (తన రాజ్యంలోని శ్రుతదేవునివలెనే); నిష్కలుష+అంతరంగుడు+ఐ= పాపాలులేని హృదయంకలవాడై; ఏ పనుల+అందును= ఏ పనులలోనైనా; ధర్మగతిన్+ఏమరక= ధర్మాన్ని దాటక; అర్థిన్= శ్రద్ధతో; చరించుచున్+ఉండె= ప్రవర్తిల్లుతున్నాడు; వారిపై= ఆ ఇరువురిపై (శ్రుతదేవ, బహుళాశ్వులపై); లక్ష్మీపతి= శ్రీకృష్ణుడు; కరుణన్+చేసి= దయగల్గి; ప్రసన్నముఖ+అంబుజాతుడు+ఐ= ప్రసన్నముఖకమలంగలవాడై...

**తా :** ఆ మిథిలానగరాన్ని ఏలుతున్న ప్రసిద్ధుడైనరాజు బహుళాశ్వుడు. తన నగరంలోని శ్రుతదేవుడు (బ్రాహ్మణుని) వలెనే నిష్కల్మషుడై, ధర్మబద్ధుడై, ప్రవర్తిల్లుతున్నాడు. వారిపై కృష్ణునికి దయకలిగింది.

**వ. అట్లు కృష్ణుండు వారలం జూచువేడ్క నిజస్యందనారూఢుండై, నారదవామదేవాత్రికృష్ణరామాసితారుణదివిజగురుకణ్వ మైత్రేయచ్యవనులును, నేనును మొదలైన మును లనుగమింపం జనుచుఁ దత్తద్దేశ నివాసులగు నానర్తక ధన్వ కురు జాంగల వంగ మత్స్య పాంచాల కుంతి మధు కేకయ కోసలాది భూవరులు, వివిధవస్తుప్రచయంబులు గానిక లిచ్చి సేవింప, గ్రహమధ్యగతుండై దీపించు సూర్యునింబోలి, య ప్పుండరీకాక్షుండు మందస్మితసుందరవదనారవిందుం డగుచు వారలం గరుణార్ద్రదృష్టిం జూచి, యోగక్షేమంబు లరసి, సాదరభాషణంబుల నాదరించుచుఁ, గతిపయప్రయాణంబులం జని చని విదేహనగరంబు డాయం జనుటయు, నా బహుళాశ్వుండు న మ్మాధవురాక విని మనంబున హర్షించుచు వివిధపదార్థంబులు గానికలుగాఁ గొని, తానును శ్రుతదేవుండును నెదురుగాఁ జనుదెంచి యప్పుడు. 1179**

**ప్రతి :** అట్లు కృష్ణుండు= వాళ్లు ఆ విధంగా ఉండగా అనుగ్రహించిన కృష్ణుడు; వారలన్+చూచువేడ్క= వాళ్లను చూడాలనే సంబరంతో; నిజస్యందన+ఆరూఢుండు+ఐ= తన రథాన్ని ఎక్కినవాడై; నారద, వామదేవ, అత్రి, కృష్ణ, రామ, అసిత, అరుణ, దివిజగురు (బృహస్పతి), కణ్వ, మైత్రేయ, చ్యవనులను, నేనును (శుకమహర్షి) మొదలైన= పైపేరుగల వారేకాక మరికొందరు; మునులు+అనుగమింపన్= మునులు వెంటరాగా; చనుచున్= వెళుతూ; తద్+దేశనివాసులు+అగు= ఆయాదేశాలలో నివసించేవారైన; ఆనర్తక, ధన్వ, కురు, జాంగల, వంగ, మత్స్య, పాంచాల, కుంతి, మధు, కేకయ, కోసల+ఆది మొదలైన పేర్లు గలదేశాల; భూవరులు= రాజులు; వివిధ వస్తు ప్రచయంబులు= పలువిధాలైన వస్తు సమూహాలు; కానికలు+ఇచ్చి= బహుమానాలిచ్చి; సేవింపన్= సేవించగా; గ్రహమధ్యగతుండు+ఐ= గ్రహాలమధ్య సంచరించే; సూర్యునిన్+పోలి= సూర్యునివలె ఉండే; ఆ+పుండరీక+అక్షుండు= శ్రీకృష్ణుడు; మందస్మిత= మెల్లని చిరునవ్వుతో; సుందరవదన+అరవిందుండు+అగుచున్= అందమైన ముఖకమలంగలవాడై; వారలన్= ఆ రాజుల్ని; కరుణా+ఆర్ద్ర దృష్టిన్= దయతోనిండిన చూపులతో; యోగక్షేమంబులు+అరసి= స్థితిగతులూ, కుశలాలు రెండూ విచారిస్తూ; స+ఆదర భాషణంబులన్+ఆదరించుచున్= ఆప్యాయతతో కూడిన పలుకులతో గౌరవిస్తూ; కతిపయప్రయాణంబులన్= కొన్నిప్రయాణాలతో; చని= వెళ్లి; విదేహనగరంబు డాయన్+చనుటయున్= విదేహ పట్టణ సమీపానికి వెళ్లగా;

ఆ బహుళాశ్వుండు= (ఆ దేశపురాజు) బహుళాశ్వుడు, ఆ+మాధవుని రాకన్+విని= శ్రీకృష్ణుడు వచ్చినాడనే మాట విని; మనంబునన్ హర్షించుచున్= మనసులో సంతోషిస్తూ; వివిధ పదార్థంబులు= పలురకాలైన వస్తువులు; కానికలుకాన్+కొని= బహుమతులుగా వెంటపెట్టుకొని; తానును శ్రుతదేవుండును= రాజూ; బ్రాహ్మణుడూ- ఇద్దరూ; ఎదురు+కాన్= ఎదురుగా; చనుదెంచి= వచ్చి; అపుడు=అంత...

**తా :** శ్రీకృష్ణుడు మిథిలానగరంలోని ఆదర్శమూర్తులైన బహుళాశ్వరాజును, శ్రుతదేవుణ్ణి చూచే ఉత్సాహంతో, తనరథమెక్కి అక్కడికి బయల్దేరాడు. నారద శుకాది మహర్షులు వెంటవచ్చారు. మార్గమధ్యంలో వంగ, మత్స్య, పాంచాలాది రాజ్యాలు దాటుతూ, ఆయాదేశాలరాజులు, కృష్ణుణ్ణి వివిధ మర్యాదలతో సేవించగా, వారిపట్ల ఆదరంతో, చిరునవ్వులతో, దయాదృష్టితో, సాదరభాషణాలతో, యోగక్షేమ ప్రశ్నలతో పలకరిస్తూ, మధ్యమధ్య మజిలీలు (విశ్రాంతి)చేస్తూ, మిథిలను చేరినాడు. మాధవుని రాకవిని, రాజు, బ్రాహ్మణసమేతంగా వచ్చి, శ్రీకృష్ణునికి ఎదురువచ్చి తరువాత

**ఉ. ఆ మునికోటికిన్ వినయ మారఁగ వందన మాచరించి, యా**
**తామరసాభలోచనుఁ డుదారచరిత్రుఁడు పాపగోత్ర సు**
**త్రాముఁడు భక్తలోకశుభదాయకుఁడైన రమేశు సద్గుణ**
**స్తోముని పాదపద్మములు సోఁకఁగ మ్రొక్కి వినమ్రులై తగన్. 1180**

**ప్రతి :** బహుళాశ్వ శ్రుతదేవులు+ఇద్దరు; ఆ మునికోటికిన్= శ్రీకృష్ణుని వెంబడివచ్చిన మునుల సమూహానికి; వినయము+ఆరన్+కన్= మిక్కిలి వినయంతో; వందనము+ఆచరించి= నమస్కరించి; ఆ తామరసలోచనుఁడు= పద్మపురేకులవంటి కన్నులుగలవాడు; ఉదారచరిత్రుఁడు= గొప్ప చరిత్రగలవాడు; పాపగోత్ర సుత్రాముఁడు= పాపాలనే కొండలకు (అణచే) ఇంద్రునివంటివాడు, భక్తలోకశుభదాయకుఁడు= భక్తులకు శుభాలనిచ్చేవాడు, ఐన; రమా+ఈశున్= = శ్రీకృష్ణుణ్ణి; సత్+గుణస్తోముని= మంచిగుణాల సమూహ రూపమైన శ్రీకృష్ణుని; పాదపద్మములు= కమలాలవంటి పాదాలు; సోకన్+కన్ మ్రొక్కి= తగిలేలా (అంటి) నమస్కరించి; తగన్= ఉచితంగా; వినమ్రులు+ఐ= వినయంతో వంగినవారై,...

**తా :** మిథిలకు చెందినరాజు, బ్రాహ్మణుడు ఇద్దరూ శ్రీకృష్ణుని వెంబడివచ్చిన మునులకు ముందుగా వినయంగా మొక్కారు. పద్మనేత్రుడు, ఉదారుడు, పాపాలను పారదోలేవాడు, భక్తులకు శుభాలిచ్చేవాడూ, అయిన శ్రీకృష్ణుని పాదాలంటి వినయంగా నమస్కరించారు.

**చ. కరములు మోడ్చి యో పరమకారుణికోత్తమ! నీవు నీ మునీ**
**శ్వరులును మద్గృహంబునకు వచ్చి మముం గృప సేసి యిచ్చటం**
**గర మనురక్తిఁ బూజనలు గైకొనుఁ డంచు నుతించి వేఁడ నా**
**హరి మనమందు వారివినయంబుల కెంతొ ప్రమోద మందుచున్. 1181**

**ప్రతి :** కరములు మోడ్చి= చేతులు జోడించి; ఓ పరమకారుణిక+ఉత్తమ= దయగలవారిలో శ్రేష్ఠుడా! ఓ కృష్ణా! నీవున్= నీవూ; ఈ ముని+ఈశ్వరులును= ఈ ముని శ్రేష్ఠులును; మత్+గృహంబునకున్ వచ్చి= నా ఇంటికి వచ్చి; మమున్+కృప+చేసి= మాపై దయఉంచి; ఇచ్చటన్= ఇక్కడ; కరము+అనురక్తిన్= మిక్కిలి ఇష్టంగా; పూజనలు= పూజలు; కైకొనుడు+అంచున్=

స్వీకరించండి అంటూ; నుతించివేడన్= పొగడి, వేడగా; ఆ+హరి= శ్రీకృష్ణుడు; మనము+అందున్= మనసులో; వారివినయంబులకున్= వారి నమ్రతలకు; ఎంత+ఒ= మిక్కిలిగా; ప్రమోదము+అందుచున్= సంతోషిస్తూ...

**తా :** ఆ ఇద్దరూ చేతులు జోడించి, కృష్ణుణ్ణి "ఓ కరుణాసముద్రుడా! నీవూ ఈ మునులు మా ఇంటికి వచ్చి, మాపై అనుగ్రహం ఉంచి, మా ఉపచారాలు, సేవలు స్వీకరించాలని వేడుకొని శ్రీకృష్ణుడు వారిభక్తి వినయాలకు ఎంతో సంతోషిస్తూ

**చ. తిరముగ వారియిష్టములు దీర్పఁ దలంచి మురాసురారి యొం**
**డొరుల కెఱుంగకుండ మునియూథముఁ దానును నేఁగె వారి మం**
**దిరముల కేకకాలమున ధీరత నా ధరణీవరుండు వా**
**రిరుహదళాయతాక్షు మునిబృందములం గనకాసనంబులన్. 1182**

**ప్రతి :** ముర+అసుర+అరి= ముర అనే రాక్షసునికి శత్రువైన శ్రీకృష్ణుడు; తిరముగన్= స్థిరంగా; వారి+ఇష్టములు= వారిద్దరి కోర్కెలు; తీర్పన్+తలంచి= నెరవేర్చడానికి నిశ్చయించి; ఒండు+ఒరులకున్+ఎఱుగకుండన్= వారిద్దరిలో ఒకరికి మరొకరి ఇంట జరిగేది తెలియకుండ; తానును= కృష్ణుడూ; ముని యూథమున్= మునుల సమూహంతో; వారి మందిరములకున్= వారి నివాసాలకు; ఏకకాలమునన్= ఒకేసమయంలో; ఏగెను= వెళ్ళాడు; ఆ ధరణీవరుండు= రాజు (బహుళాశ్వుడు); ధీరతన్= ధైర్యంగా; వారిరుహదళ+ఆయత+అక్షున్= నీటిలో బుట్టిన తామరదళాలవంటి వెడల్పైన కన్నులు కలవాడైన (పద్మాక్షుడు) శ్రీకృష్ణుణ్ణి, మునిబృందములన్= మునుల సమూహాన్ని; కనక+ఆసనంబులన్= బంగారు ఆసనాలపై...

**తా :** శ్రీకృష్ణుడు వారికోరికమేరకు, ఒకరికి తెలియకుండ మరొకరి ఇంటికి తనవెంబడి ఉన్న మునులసమూహంతో ఏకకాలంలో వెళ్లినాడు. రాజు వీరిని బంగారుఆసనాలమీద

**సీ. కూర్చుండ నియమించి కొమరారుకాంచన కలధౌతకలశోదకములచేతఁ**
**బాదముల్ గడిగి తత్పావనజలములు దానును సతియు బాంధవజనంబుఁ**
**గర మర్థి నిజమస్తకంబుల ధరియించి వివిధార్చనములు సద్విధి నొనర్చి**
**మణిభూషణాంబరమాల్యానులేపనరాజితధూపనీరాజనములు**

**తే. భక్తిఁ గావించి పరిమృష్ట బహువిధాన్నపాయసాపూపపరిపక్వఫలములోలి**
**నారగింపఁగఁ జేసి కర్పూరమిళితలలితతాంబూలములు నెయ్య మలర నొసఁగె. 1183**

**ప్రతి :** కూర్చుండన్+నియమించి= కూర్చునే ఏర్పాట్లుచేసి; కొమరు+ఆరు= అందగించే; కాంచన కలధౌత= బంగారు వెండి; కలశ+ఉదకములచేతన్= పాత్రలలోని నీళ్లతో; పాదముల్ కడిగి= కాళ్లు కడిగి; తత్+పావనజలములు= అట్టి పవిత్రమైన నీరు; తానును, సతియున్; బాంధవజనంబున్= తాను, తనభార్య, తన బంధువర్గం, కరము+అర్థిన్= మిక్కిలి ప్రేమతో; నిజమస్తకంబులన్+ధరియించి= తమ తలలపై చల్లుకొని; వివిధ+అర్చనములు= పలురకాలైన పూజలు; సత్+విధిన్= చక్కని విధివిధానంతో; ఒనర్చి= చేసి; మణిభూషణ+అంబర–మాల్య–అనులేపన= రత్నాల ఆభరణాలు, వస్త్రాలు, మాలలు, మైపూతలు; రాజిత ధూప–నీరాజనములు= సువాసనలపొగలు, ప్రకాశించే హారతులు; భక్తిన్+కావించి=

భక్తితో చేసి; పరిమృష్ట= విశేషంగా కడుపు నిండుగా; బహువిధ= పలురకాలైన; పాయస= పాయసాలూ; అపూప= పిండివంటలు; పరిపక్వఫల= విశేషంగా పండిన ఫలాలు; ఓలిన్= వరుసగా; ఆరగింపన్+చేసి= తినబెట్టి; కర్పూర మిళిత= కర్పూరం కలిపిన; లలిత తాంబూలాలు= మనోహరమైన తాంబూలాలూ; నెయ్యము+అలరన్= స్నేహం ఒప్పగా; ఒసఁగెన్= ఇచ్చాడు.

**తా :** శ్రీకృష్ణుణ్ణి, మునిసంఘాల్నీ కూర్చోబెట్టి, అందమైన వెండిబంగారుచెంబులతో నీళ్లుపోసి కాళ్లు కడిగి, ఆ పవిత్ర జలాన్ని భక్తిభావంతో తనపై, భార్యాబంధువులందరిపై చల్లాడు. విధియుక్తంగా పూజలు చేశాడు. ఆభరణాలు, వస్త్రాలు, మాలలు, చందనం, ధూపం, హారతులు భక్తితో ఇచ్చాడు. పలురకాలైన అన్నవిశేషాలు, పాయసం, పిండివంటలు, పండ్లు మొదలైన వాటితో కడుపునిండా భోజనాలుపెట్టి, చక్కగా కర్పూరతాంబూలాలు ప్రేమతో ఇచ్చాడు.

**వ. ఇట్లు సమర్పించి యనంతరంబ య మ్మిథిలేశ్వరుండైన జనకుండు పరమానందంబును బొంది. 1184**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సమర్పించి= ఆతిథ్యం ఇచ్చి; అనంతరంబ= వెంటనే; ఆ+మిథిలా+ఈశ్వరుండు+ఐన= మిథిలకు రాజైన జనకుడు; పరమ+ఆనందంబునున్+పొంది= గొప్ప సంతోషాన్ని పొంది...

**తా :** శ్రీకృష్ణునికి, మునిగణానికి ఆతిథ్యం ఇచ్చి, పూజాదులు నిర్వహించి, బాగా సంతోషించి

**చ. హరిపదపద్మయుగ్మము నిజాంకతలంబునఁ జేర్చి యొత్తుచుం**
**బురుషవరేణ్య! యీ నిఖిలభూతగణావలి యాత్మలందు సు**
**స్థిరమతిఁ గర్మసాక్షివి సుధీవర! నీ పదభక్తకోటితో**
**నరయ నుమాధినాథచతురాస్యులుఁ బోల రటందు వెప్పుడున్. 1185**

**ప్రతి :** హరిపద - పద్మయుగ్మము= శ్రీకృష్ణుని పాదపద్మాల జంటను; నిజ+అంకతలంబునన్= తన ఒడిలో; చేర్చి= ఉంచుకొని; ఒత్తుచున్= ఒత్తుతూ (సంవాహనం చేస్తూ); పురుషవరేణ్యా= పురుషోత్తమా! ఈ నిఖిల భూతగణ+ఆవలి= ఈ సమస్త ప్రాణిసమూహంయొక్క; ఆత్మల+అందున్= ఆత్మలలో; సుస్థిరమతిన్= స్థిరచిత్తంతో; ఉన్న కర్మసాక్షివి= వారి కర్మలకు సాక్షివి; సుధీవర!= గొప్పవారైన బుద్ధిమంతులలో శ్రేష్ఠుడా!; అరయన్= పరిశీలించగా; నీ పదభక్త కోటితో= నీ పాదాలు ఆరాధించే భక్తజనావళితో; ఉమా+అధినాథ= ఉమాదేవి భర్త(శివుడు); చతుర+ఆస్యులున్= నాల్గుముఖాలు గలవాడైన బ్రహ్మకూడా; పోలరు+అట+అందువు+ఎప్పుడున్= ఎప్పటికిని పోలజాలరు అని (నీవు) అంటావు కదా!

**తా :** కృష్ణుని పాదపద్మాల్ని ఒడిలో చేర్చుకొని ఒత్తుతూ, ఓ పురుషోత్తమా! సకల ప్రాణికోటిలో నీవు వారి ఆత్మలందు స్థిరంగా ఉండి; వారి కర్మలకు సాక్షివై ప్రకాశిస్తున్నాను. శివుడూ బ్రహ్మ కూడా నీ పదారాధకులైన భక్తులతో సాటిరా రని నీవంటూ ఉంటావుకదా!

**వ. అట్టి లోకవిదితం బయిన భవద్వాక్యంబు నిక్కంబుగా భవదీయపాదారవిందంబులందు నొకానొకవేళ లేశమాత్రధ్యానంబు గల నా గృహంబున కకించనుం డని చిత్తంబునం దలంపక భక్తవత్సలుండ వగుటంజేసి విజయము చేసితివి; భవత్పాదపంకేరుహ ధ్యానసేవారతిం దగిలిన మహాత్ములు త్వద్ధ్యానంబు వదలం జాలుదురే? నిరంతరంబును శాంతచిత్తులై నిష్కించనులై యోగీంద్రులై నీ వలనం గోరిక గలవారలకు నిన్నైన నిత్తువు గదా! యని వెండియు నిట్లనియె. 1186**

**ప్రతి :** అట్టి లోకవిదితంబు+అయిన= అలా ప్రపంచానికి అంతటికీ తెలిసిన; భవత్+వాక్యంబు= నీ పలుకు; నిక్కంబు+కాన్= నిజమయ్యేటట్లుగా; భవదీయ= నీవైన; పాద+అరవిందంబుల+అందున్= పాదపద్మాలందు; ఒక+ఒకవేళన్= ఎప్పుడో ఓసారి; లేశమాత్రధ్యానంబు= అణుమాత్రం (కొంచెము) ధ్యానించడం; కల, అకించనుడు+అని= మిక్కిలి దరిద్రుడని (హీనుడని); చిత్తంబునన్+తలపక= మనసులో భావింపక; భక్తవత్సలుండవు+అగుటన్+చేసి= భక్తులపట్ల వాత్సల్యం చూపేవాడివి; కనుక; నా గృహంబునకున్= నా ఇంటికి; వేంచేసితివి= విచ్చేసినావు; భవత్+పాద పంకేరుహ= నీ పాదపద్మాల; ధ్యానసేవారతిన్= తలచుట, సేవించుట అనే వానితో ఇష్టపడేపనిలో; తగిలిన= నిమగ్నులైన; మహా+ఆత్ములు= గొప్పవారు; తద్+ధ్యానంబున్= ఆ ధ్యానాన్ని (తలపును); వదలన్+చాలుదురే?= వదలగలరా? నిరంతరంబును= ఎల్లవేళలా; శాంతచిత్తులు+ఐ= శాంతంతో కూడిన మనస్సుగలవారై; నిష్+కించనులు+ఐ= నిర్ధనులై; యోగి+ఇంద్రులు+ఐ= యోగిశ్రేష్ఠులై; నీవలనన్+కోరిక కలవారలకున్= నీనుండి వరములు కోరువారికి; నిన్నున్+ఐనన్= నిన్నుకూడా; ఇత్తువుకదా= సమర్పించుకొంటావు గదా!; అని= అంటూ; వెండియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అలాంటి ప్రసిద్ధికి తగినట్లు, నేను ఎప్పుడోగాని మీ పాదాలను కొలవని హీనుడనైన భక్తుడనైనప్పటికీ, నీ మనసులో ఎంతో ఆదరించి, నా ఇంటికి వచ్చావు. నీవు భక్తవత్సలుడివి. నీ పాదసేవలో రుచి తెలిసిన మహాత్ములు దాన్ని వదలలేరు. శాంతులూ, నిర్ధనులూ, యోగీంద్రులైనవారూ, నిన్ను సేవించేవారూ కోరితే, నిన్నుకూడా సమర్పించుకొంటావు అంటూ ఇంకా ఇలా అన్నాడు.

**తే. కృష్ణ! పరమాత్మ! యదుకులక్షీరవార్ధి, పూర్ణచంద్రమ! దేవకీపుత్త్ర! సుజన**
**వినుత! నారాయణాచ్యుత! వేదవేద్య!, భక్తజనపోషపరితోష! పరమపురుష! 1187**

**ప్రతి :** కృష్ణ!= శ్రీకృష్ణా! పరమ+ఆత్మ!= శ్రేష్ఠమైన ఆత్మస్వరూపుడవైనవాడా! యదుకుల= యదువంశమనే; క్షీరవార్ధి= పాలసముద్రానికి; పూర్ణచంద్రమా! నిండు (పూర్ణమి) చంద్రుడా! దేవకీపుత్ర!= దేవకి కుమారుడా! సుజన వినుత= మంచివారిచే పొగడబడేవాడా! నారాయణా!= మహావిష్ణూ!; అచ్యుత= చ్యుతి (నాశం)లేనివాడా!; వేదవేద్య= వేదాలచే తెలుసుకోదగినవాడా! భక్తజనపోష= భక్తుల్ని పోషించి; పరితోష!= సంతోషించేవాడా; పొందేవాడా!; పరమపురుష= పురుషశ్రేష్ఠా!

**తా :** పరమాత్మవైన ఓ కృష్ణా! యదుకులంలో దేవకీ గర్భంలో జన్మించినవాడా! సుజనులచే నుతించబడే వాడా! వేదాలలో వర్ణింపబడినవాడా! నారాయణా! నాశంలేనివాడా! సంతోషస్వరూపా! పరమపురుషా! భక్తపోషకా! అని స్తుతించినాడు.

**ఉ. శ్రీ పురుషోత్తమాఖ్య! యదుసింహకిశోరక! భక్తలోక ర**
**క్షా పరతంత్ర! నీవు మునిసంఘముఁ గొన్నిదినంబు లుండవే**
**నీ పదపద్మ రేణువులు నెమ్మి మదీయగృహంబు సోఁకినం**
**దాపసవంద్య! యే నిపుడ ధన్యుఁడ నయ్యెదఁ గాదె మాధవా! 1188**

**ప్రతి :** శ్రీ= శుభకరమైన; పురుష+ఉత్తమ+ఆఖ్య= పురుష శ్రేష్ఠుడనే పేరుగలవాడా! (పురుషోత్తముడని విశ్వమంతా పిలిచే, స్వామీ!); యదుసింహ= యదువంశ శ్రేష్ఠుడైన వసుదేవుని; కిశోరక= కుమారా! భక్తలోక రక్షా పరతంత్ర= భక్తుల సమూహాల్ని రక్షించే పనిలో నిమగ్నమైనవాడా! నీవు; మునిసంఘము= నీవూ, నీతోబాటు వచ్చిన మునుల సమూహం;

కొన్నిదినంబులు+ఉండవే= కొన్నిదినాలు మా ఆతిథ్యం స్వీకరించరాదా!; తాపసవంద్య= తపస్సుచేసే ఋషులచేత నమస్కరింపబడేవాడా!; నీ పదపద్మరేణువులు= నీ పదకమలాలధూళి; నెమ్మిన్= ప్రేమతో; మదీయగృహంబున్= నా ఇంటిని; సోకినన్= తగిలితే; ఏన్+ఇపుడు+అ= నేను తత్క్షణమే; మాధవా!= కృష్ణా! ధన్యుడన్+అయ్యెదగాన్+కాదు+ఎ= ధన్యుణ్ణి (కృతార్థుణ్ణి) అవుతాను కదా!

**తా :** పురుషోత్తమా! యదుసింహకిశోరా! భక్తరక్షకా! నీవు, నీ తోడి ఈ మునులు ఇంకా కొన్నాళ్లు ఇక్కడే ఉండరాదా! నీ పాద ధూళి నామందిరం సోకితే నేను కృతార్థుడినవుతాను.

**వ. అని యభ్యర్థించినం బ్రసన్నుండై య పుండరీకాక్షుండు నిమికులప్రదీపకుండైన జనకచక్రవర్తిం గరుణించి, య మ్మిథిలా నగరంబునం బౌరజనంబులకు నున్నత శోభనంబులు గావించుచుం గొన్నిదినంబు లుండె నంత. 1189**

**ప్రతి :** అని; అభి+అర్థించినన్= విశేషంగా కోరగా; ప్రసన్నుండు+ఐ= సుముఖుడై; ఆ+పుండరీక+అక్షుండు= ఆ శ్రీకృష్ణుడు; నిమికుల ప్రదీపకుండ+ఐన= నిమివంశాన్ని దీపసదృశంగా వెలిగించే; జనక చక్రవర్తిన్= జనకుడని పేరుగల ఆ బహుళాశ్వుణ్ణి; కరుణించి= దయతోచూచి; ఆ+మిథిలా నగరంబునన్= ఆతని రాజధాని మిథిలలో; పౌరజనంబులకున్= పురంలో ఉన్నవారికికూడా; ఉన్నత= గొప్ప; శోభనంబులు= శుభాలు; కావించుచున్= కలిగిస్తూ; కొన్నిదినంబులు+ఉండెన్= కొన్నిరోజులు నివసించాడు; అంత= అప్పుడు...

**తా :** బహుళాశ్వుడనే మారుపేరుగల ఆ మిథిలేశుడు జనకుడు ఈ విధంగా భక్తితో ప్రార్థించగా నిమికుల శ్రేష్ఠుడైన ఆ ప్రభువును, ఆ నగర పౌరుల్ని అనుగ్రహించి, కొన్నిరోజులు శ్రీకృష్ణుడు ఆ రాజుకు అతిథిగా ఉన్నాడు.

**విశే :** మిథిలనేలిన సుప్రసిద్ధ ప్రభువు ఇక్ష్వాకుని కుమారుడు నిమి. నిమి వంశంలోనివాడు జనకుడు. ఈ జనకుడు వైరాగ్య జనకుడు. ఇక్ష్వాకు వంశానికి కోడలైన సీత తండ్రి జనకుడు వేరు. అతడు త్రేతాయుగంలో ఇదే మిథిలను ఏలాడు. ఈ జనకుని (బహుళాశ్వుని) కాలం ద్వాపరయుగం. ఈ వంశంలోని రాజులందర్నీ జనకులనే పిలుస్తారు.

**మ. శ్రుతదేవుండును మోదియై మునిజనస్తోమంబుతో నిందిరా**
**పతిఁ దోకొంచు నిజాలయంబునకు నొప్ప న్నేగి యచ్చోట స**
**మ్మతి దర్భాస్తరణంబుల న్నునిచి సమ్యగ్జ్ఞానపారీణుఁడై**
**సతియుం దానుఁ బదాబ్జముల్ గడిగి చంచద్భక్తిఁ దత్తోయముల్. 1190**

**ప్రతి :** శ్రుతదేవుండును= శ్రుతదేవుడనేవాడు; మోది+ఐ= సంతోషించినవాడై; ముని జనస్తోమంబుతోన్= మునుల సమూహంతో; ఇందిరాపతిన్+తోకొంచున్= లక్ష్మీదేవి భర్తయైన శ్రీకృష్ణుణ్ణి తోడ్కొనివెళ్లి; నిజ+ఆలయంబునకున్= తన ఇంటికి; ఒప్పన్+ఏగి= చక్కగా వెళ్లి; ఆ+చోట= అక్కడ; సమ్మతిన్= (కృష్ణుని) అంగీకారంతో; దర్భ+ఆస్తరణంబులన్= దర్భతో చేసిన ఆసనాలపై; ఉనిచి= ఉంచి; సమ్యక్+జ్ఞానపారీణుడై= చక్కని జ్ఞానంతో పారం (అంచులు) ముట్టినవాడై (సుజ్ఞానపూర్ణుడై); సతియున్+తానున్= భార్య, తానూ; పద+అబ్జముల్= వారి పదకమలాల్ని; కడిగి= ప్రక్షాళనంచేసి; చంచత్+భక్తిన్= ప్రకాశించే భక్తితో; తత్+తోయముల్= ఆ నీళ్లను...

**తా :** జనకునిలాగే శ్రుతదేవుడుకూడా ఎంతో సంతోషంగా శ్రీకృష్ణుణ్ణీ, మునులల్నీ తన ఇంటికి తీసుకొనివెళ్లి, దర్భాసనాలపై కూర్చోబెట్టి, సతీసమేతంగా పాదప్రక్షాళనచేసి ఆ జలాల్ని

**చ. శిరములఁ దాల్చి నవ్యతులసీదళదామకుశప్రసూన వి**
**స్ఫుర దరవిందమాలికలఁ బూజ లొనర్చి గృహాంధకూప సం**
**చరణుఁడ నైన నాకడకుఁ జక్రి దనంతనె వచ్చునట్టి సు**
**స్థిరమతి నే తపంబు మును సేసితినో? యని సంతసించుచున్. 1191**

**ప్రతి :** శిరములన్+తాల్చి= (ఆ పవిత్ర జలాలు) శిరస్సులపై చల్లుకొని; నవ్యతులసీదళ దామ= కొత్తవైన తులసి ఆకుల మాలలు; కుశ ప్రసూన= దర్భలు, పువ్వులతో; విస్ఫురత్+అరవింద మాలికలన్= విచ్చుకున్న కమలాలమాలలతో; పూజలు+ఒనర్చి= పూజలుచేసి; గృహ+అంధకూప= ఇల్లు (సంసారం) అనే చీకటినూతిలో; సంచరణుడన్+ఐన= తిరుగాడుతున్న; నాకడకున్= నా వద్దకు; చక్రి= శ్రీకృష్ణుడు; తన+అంతన్+ఐ= తనకు తానే; వచ్చున్+అట్టి= రావటానికి; ఏన్= నేను; సుస్థిరమతి= స్థిరచిత్తంతో; మును= పూర్వజన్మలో; ఏ తపంబు చేసితిన్+ఒ= ఏ విధమైన తపస్సుచేసి పుణ్యం సంపాదించానో? అని; సంతసించుచున్= సంతోషపడుతూ...

**తా :** శ్రుతదేవుడు కృష్ణుని యొక్క, మునుల యొక్క పాదప్రక్షాళనజలాన్ని శిరస్సులపై చల్లుకొన్నాడు. తులసీమాలలు, దర్భలు, పూలు, కమలాలతో చేసిన మాలికలు ధరింపచేశాడు. శ్రుతదేవుడు సంసారకూపంలోపడ్డ నావంటి వానివద్దకు శ్రీకృష్ణభగవానుడు తనంత తానుగా రావడానికి నేను తపస్సు పూర్వజన్మలో చేశానోగదా అని సంతోషిస్తూ

**తే. మఱియుఁ దత్పాదతీర్థంబు మందిరమునఁ, గలయఁ జిలికించి సంప్రీతి గడలు కొనఁగఁ**
**బత్త్రఫలపుష్పతోయముల్ భక్తి నొసఁగి, హరిమురాంతకమూర్తి నిజాత్మ నిలిపి. 1192**

**ప్రతి :** మరియున్= ఇంకా; తత్+పాదతీర్థంబు= వారిపాదములు కడిగిన జలం; మందిరమునన్= తన ఇంటిలో; కలయన్+చిలికించి= అంతటా పడేలా చల్లించి; సంప్రీతి కడలుకొనన్+కన్= తృప్తి కలుగుతుండగా. పత్ర, ఫల, పుష్ప, తోయముల్= ఆకులు, పండ్లు, పూలు, నీళ్లు; భక్తిన్+ఒసగి= ప్రేమతో ఇచ్చి; ముర+అంతకమూర్తిన్= ముర అనే పేరుగల రాక్షసుణ్ణి చంపిన; హరిన్= విష్ణుణ్ణి (కృష్ణుణ్ణి); నిజ+ఆత్మన్+నిలిపి= తన హృదయంలో; నిలిపి=నిలుపుకొని...

**తా :** శ్రీకృష్ణుని పాదతీర్థాన్ని తన ఇల్లంతా (పవిత్రత కొరకు) చల్లించినాడు. ఫల, పత్ర, పుష్పాదులతో అర్చించి, తన హృదయంలో నిలుపుకొని

**విశే :** శ్రీకృష్ణుని పాదతీర్థం మందిరంలో చల్లించాడనడం అపూర్వం, విష్ణువుకు 'తీర్థపాదు'డనే పేరు ప్రసిద్ధిగా ఉంది. సామాన్య గృహస్థుల ఇండ్లల్లో చల్లే దానికి లభించే తీర్థం గోపంచితం. ఇక్కడ విష్ణువైన శ్రీకృష్ణుని, విశేషించి, గోవిందుని పాదాలు కడిగిన తీర్థమే లభించడం అపూర్వం, అద్భుతం.

**తే. మానితంబుగ విశ్వనిదానమూర్తి, యైన కృష్ణుండు దనయింట నారగించెఁ**
**దన మనోరథసిద్ధియుఁ దనకు నబ్బె, ననుచుఁ బైపుట్ట మల్లార్చి యాడుచుండె. 1193**

**ప్రతి :** మానితంబు+కన్= గౌరవపురస్సరంగా; విశ్వనిదానమూర్తి= విశ్వానికి కారణమైన వ్యక్తి (భగవంతుడు); ఐన కృష్ణుడు; తన ఇంటన్+ఆరగించెన్= తనింట్లో భోజనం చేశాడు; తనమనోరథసిద్ధియున్= తన మనసులోని కోరిక;

తనకున్+అబ్బెన్= తనకు లభించింది; అనుచున్= అంటూ; పైపుట్టము= పై వస్త్రం (ఉత్తరీయము) అల్లార్చి= గాలిలో తిప్పుతూ; ఆడుచుండెన్= ఎగురుతుండగా తిరుగుతూ నృత్యం చేశాడు.

**తా :** విశ్వవిభుడు నా ఇంట్లో భోజనం చేశాడు. తనకోరిక ఈడేరింది అంటూ ఆనందం పట్టలేక పై పంచె ఎగురవేస్తూ నృత్యం చేశాడు.

**చ. తరుణియుఁ దానుఁ బుత్రులుఁ బదంపడి కృష్ణు భజించుచుండ త**
**చ్చరణము లంకపీఠమునఁ జాఁచిన మెల్లన యొత్తుచున్ రమా**
**వరుఁ గని పల్కె భక్తజనవత్సల! మామకభాగ్య మెట్టిదో**
**హరచతురాస్యులు న్నెఱుఁగ నట్టి నినుం గనుగొంటి నెమ్మితోన్. 1194**

**ప్రతి :** తరుణియున్= భార్య; తాను, పుత్రులున్= కుమారులు; పదంపడి= ప్రయత్న పూర్వకంగా; కృష్ణుభజించుచున్+ఉండన్= శ్రీకృష్ణుణ్ణి సేవిస్తుండగా; తత్+చరణములు= ఆయన పాదాలు; అంకపీఠమునన్= ఒడిలో; చాచినన్= చాపిఉంచగా; మెల్లనన్+ఒత్తుచున్= గౌరవపూర్వకంగా ఒత్తుతూ; రమావరునిన్= లక్ష్మీపతిని; కని పల్కెన్= చూస్తూ ఇలా అన్నాడు; భక్తజనవత్సల= భక్తులపై వాత్సల్యం కలవాడా!; హర చతుర+ఆస్యులున్= శివుడు, నాలుగుముఖముల బ్రహ్మ కూడా; ఎఱుఁగన్+అట్టి= తెలుసుకోలేనట్టి; నినున్= నిన్ను; నెమ్మితోన్= ప్రేమతో (భక్తితో); కనుగొంటిన్= చూశాను; మామక= నాయొక్క; భాగ్యము+ఎట్టిదో= అదృష్టం ఎంత గొప్పదో కదా!

**తా :** తన కుటుంబంతోపాటు తానూ కృష్ణుణ్ణి సేవించి, పూజించి, ఆతని పాదాలు తన ఒడిలో పెట్టుకొని ఒత్తుతూ "స్వామీ! శివుడు, బ్రహ్మ కూడా తెలుసుకోలేని నిన్ను భక్తితో పొందాను. నా భాగ్య మెట్టిదోకదా!" అని స్తుతించాడు.

**క. మునియోగిమానసస్ఫుట, వనజంబుల నెల్లప్రొద్దు వర్తించు భవ**
**ద్ఘనదివ్యమూర్తి నా లో, చనగోచర మయ్యెఁ గాదె! సర్వాత్మ! హరీ! 1195**

**ప్రతి :** (ఓ)సర్వాత్మ= అందరిలోనూ ఆత్మవై చరించేదేవా!; హరీ= విష్ణుస్వరూపా!; ముని యోగిమానసస్ఫుట వనజంబులో= మునుల యోగుల మనస్సులనే వికసించిన పద్మాలలో; ఎల్లప్రొద్దు వర్తించు= సర్వవేళల్లో ప్రవర్తిల్లే; భవత్+ఘన దివ్యమూర్తి= నీ గొప్ప దేవతా స్వరూపం; నా లోచన గోచరము= నా కండ్లకు కనబడింది; అయ్యెన్+కాదు+ఎ= అయిందికదా!

**తా :** ఓ సర్వాంతర్యామీ! తపోయోగాలద్వారా మునులు యోగులుమాత్రమే తమ హృదయకమలాల్లో దర్శింపగల్గే నీ దివ్యరూపం నా కన్నులనిండా చూడగలిగానుకదా!

**వ. దేవా! నీ సచ్చరితంబులు గర్ణరసాయనంబులుగా నాకర్ణించుచు, నీకుం బూజ లొనర్చుచు, నీ చరణారవిందంబులకు వందనంబులు సేయుచు, నీ దివ్యనామసంకీర్తనంబులు సేయుచుం దమశరీరంబులు భవదధీనంబులుగా మెలంగు నిర్మలబోధాత్ము లగువారి చిత్తంబు లను దర్పణంబులం గానంబడుచుందువు; కర్మవిక్షిప్తచిత్తులైన వారిహృదయంబుల నుండియు, దూరగుండ వగుదు; వని మఱియు నిట్లనియె. 1196**

**ప్రతి :** దేవా!= కృష్ణా!; నీ సత్+చరితంబులు= నీ శ్రేష్ఠమైనగాథలు; కర్ణరస+అయనంబులు+కాన్= చెవులకు మధురద్రవాలుగా; ఆకర్ణించుచున్= వింటూ; నీకున్+పూజలు+ఒనర్చుచున్= నీకు సేవలుచేస్తూ; నీ చరణ+అరవిందములకున్=

నీ పాదపద్మాలకు; వందనంబులు+చేయుచున్= నమస్కరిస్తూ; నీ దివ్యనామ సంకీర్తనంబులు+చేయుచున్= నీ పవిత్రములైన నామాల్ని పాడుతూ; తమ శరీరంబులు= తమ దేహాలు; భవత్+అధీనంబులుగా= నీ అదుపులో ఉంచి; మెలంగు= ప్రవర్తించే; నిర్మలబోధ+ఆత్ములగు= స్వచ్ఛమైన జ్ఞానం పొందినవారి యొక్క; చిత్తంబులు+అను దర్పణంబులన్= మనసులు అనే అద్దాలలో; కానన్+పడుచుక+ఉందువు= కనబడుతా ఉంటావు; కర్మవిక్షిప్తచిత్తులు+ఐన= కర్మలచే తిరస్కరించబడిన మనసులుగలవారి; హృదయంబులన్+ఉండియున్= హృదయాల్లో ఉన్నా; దూరుండవు+అగుదువు= దూరమైపోతావు; అని; మఱియు; ఇట్లు+ అనియెన్= ఇంకా ఇలా అన్నాడు.

**తా :** వాసుదేవా! నీ దివ్యచరిత్రలు చెవులకింపుగా వింటూ, పూజలుచేస్తూ, నీ పాదాలకు నమస్కారాలర్పిస్తూ, నీ దివ్యనామం కీర్తిస్తూ, తన తనువంతా నీకర్పించే నిర్మలభక్తులహృదయాలనే దర్పణాల్లో కనబడతావు. కర్మిష్ఠులైన వ్యక్తుల హృదయాలకు దూరమవుతావు అని ఇంకా ఇలా అన్నాడు.

**సీ. నీకు మ్రొక్కెదఁ గృష్ణ! నిగమాంతసంవేద్య! లోకరక్షక! భక్తలోకవరద!**
**నీపాదసేవానిరతుని నన్ను నే పనిఁ బంపె దాన తిమ్మనినఁ గృష్ణుఁ**
**డెలనవ్వు మోమునఁ జెలువొంద నా విప్రుకర మాత్మకరమునఁ గదియఁ జేర్చి**
**పాటించి యతనితోఁ బలికెఁ దపశ్శక్తి వఱలిన య మ్మునివర్యు లెపుడుఁ**

**తే. దమ పదాంబుజరేణు వితానములను, దవిలి లోకంబులను బవిత్రంబు సేయు**
**వారు ననుఁ గూడి యెప్పుడు వలయునెడల, కరుగుదెంతురు నీ భాగ్య గరిమ నిటకు. 1197**

**ప్రతి :** కృష్ణ! నీకున్ మ్రొక్కెద= కృష్ణా! నీకు మొక్కెదను; నిగమ+అంత= (వేద+అంతములైన) ఉపనిషత్తులచే; సంవేద్య= తెలుసుకోబడే వాడా!; లోక రక్షక= లోకాల్ని రక్షించేవాడా!; భక్తలోక= భక్తకోటికి; వరద= వరాలు ఇచ్చేవాడా! నీ పాద సేవనా నిరతునిన్= నీ పాదాలు ఎప్పుడూ సేవించేవాడనైన; నన్నున్=నన్ను; ఏపనిన్+పంపెదు= ఏ కార్యానికై నియుక్తుణ్ణి చేస్తావు? ఆనతి+ఇమ్ము= ఆజ్ఞాపించు, అనిన, కృష్ణుడు, ఎలనవ్వు= చిరునవ్వు; మోమునన్= ముఖంలో; చెలువు+ఒందన్= ప్రకాశించగా; ఆ విప్రుకరము= ఆ బ్రాహ్మణుని (శ్రుతదేవుని) చేతిని; ఆత్మకరమునన్= తనచేతిలో; కదియన్+చేర్చి= కలిసేలా తీసుకొని; పాటించి= అతనిమాటకు సమ్మతించి; అతనితోన్+పలికెన్= అతనితో ఇలా అన్నాడు; తపస్‌శక్తి వఱలిన= తపస్సుచే సంపాదించిన శక్తితో ఒప్పే; ఆ+మునివర్యులు+ఎపుడున్= ఆ మునిశ్రేష్ఠులు ఎల్లవేళలా; తమపద+అంబుజరేణు వితానములను= తమ పాదపద్మాల; ధూళి సమూహంతో; తవిలి= కూడుకొని, లోకంబులను+పవిత్రంబు+చేయువారు= జగత్తును పవిత్రం చేస్తారు; ననున్+కూడి+ఎప్పుడున్= నాతో కలసిఉండి; ఎల్లవేళలా; వలయున్+ఎడలకున్= కావల్సిన చోట్లకు; అరుగు+తెంతురు= వస్తుంటారు; నీ భాగ్యగరిమన్= గొప్పదైన నీ అదృష్టంకొద్దీ; ఇటకున్= ఇక్కడకు (నీ ఇంటికి)...

**తా :** ఓ కృష్ణస్వామీ! నీకు దండాలు. వేదాంతవేద్యుడా! లోకాల్ని రక్షించేవాడా! భక్తులకోరికలు తీర్చేవాడా! నీ పాదసేవకునికి ఏమి ఆజ్ఞ? చెప్పు, చేస్తాను అని అనగా కృష్ణుడు చిరునవ్వుతో ఆతనిచేతిని ఆత్మీయంగా తనచేతిలోనికి తీసుకొని, తపోధనులైన ఈ మునులు తమపాదధూళితో సమస్తలోకాలు తిరిగి పునీతం చేస్తారు. నాతో కలిసిఉండి, నా వెంబడి వస్తారు. నీ అదృష్టంకొద్దీ నేడు నీ ఇంటికి

**వ. చనుదెంచిరి; పుణ్యస్థలంబులును విప్రులును దేవతలును సంస్పర్శనదర్శనార్చనంబులం బ్రాణులను సమస్త కిల్బిషంబులం బాయం జేయుదు; రదియునుం గాక బ్రాహ్మణుండు జనన మాత్రంబున జీవకోటియందు ఘనుండై యుండు, జపతపోధ్యానాధ్యయనాధ్యాత్మములం జతురుండై మత్కలాశ్రయుం డయ్యేనేని నతం డుత్తముండై వెలుంగు; నతనిం జెప్ప నేల? యని వెండియు నిట్లనియె. 1198**

**ప్రతి :** చనుదెంచిరి= (మునులు)వచ్చారు; పుణ్యస్థలంబులును= పవిత్రమైన క్షేత్రాలు; విప్రులును= వేదపండితులైన బ్రాహ్మణులు; దేవతలును= దేవతలూ; సంస్పర్శన= తాకుటచే; దర్శన+అర్చనంబులన్= దర్శించుటచే, పూజించుటచే; ప్రాణులను= జీవకోటి యొక్క; సమస్త కిల్బిషంబులన్= వారి సమస్త పాపాల్ని; పాయన్+చేయుదురు= దూరంచేస్తారు; అదియునున్+కాక= అంతేకాక; బ్రాహ్మణుండు= బ్రాహ్మణుడు (బ్రహ్మజ్ఞాని); జననమాత్రంబునన్= పుట్టుకతోనే; జీవకోటి+అందున్= ప్రాణుల్లో (మానవుల్లో); ఘనుండు+ఐ+ఉండు= గొప్పవాడై ఉంటాడు; జప, తపస్+ ధ్యాన+అధ్యయన+ అధి+ఆత్మములన్= జపం, తపం, ధ్యానం, అధ్యయనం, ఆత్మస్వరూపజ్ఞానాలలో; చతురుండు+ఐ= నేర్పరియై; మత్+కల+ఆశ్రయుండు= నా యందలి (బ్రహ్మ)జ్ఞానాన్ని ఆశ్రయించినవాడు+అయ్యెన్+ఏనిన్= అయితే; అతండు+ఉత్తముండు+ఐ= అతడు మరింత శ్రేష్ఠుడై; వెలుంగున్= ప్రకాశిస్తాడు; అతనిన్= ఇక అతణ్ణిగూర్చి; చెప్పన్+ఏలా= చెప్పడం ఎందుకు? (చెప్పనవసరమేలేదు); అని; వెండియున్+ఇట్లు+అనియెన్= ఇంకా ఇలా అన్నాడు.

**తా :** పవిత్రక్షేత్రాల్ని స్పర్శనంతో, దేవతల్ని దర్శనంతో, విప్రుల్ని అర్చనంతో గనుక ఆరాధిస్తే సమస్తప్రాణికోటి పాపాలు తొలగిపోతాయి. బ్రాహ్మణుడు (బ్రహ్మజ్ఞాని) పుట్టుకతోనే జీవకోటిలో శ్రేష్ఠుడుగా ఉంటాడు. నిత్యమూ జపం, తపం, వేదాధ్యయనం, ఆత్మజ్ఞాన శోధనంచేసేవాడైనా అంశను ఆశ్రయిస్తే మరింత శ్రేష్ఠుడవుతాడు. అట్టివాణ్ణి గూర్చి వేరే చెప్పనవసరం లేదు, అని ఇంకా ఇలా అన్నాడు.

**క. నా మది విప్రులపైఁ గల, ప్రేమము నా తనువునందుఁ బెట్టని కతనన్**
**భూమీసురు లర్హులు; నీ, వీ మునులం బూజ సేయు మిద్ధచరిత్రా! 1199**

**ప్రతి :** ఇద్ధచరిత్రా= ప్రసిద్ధమైన చరిత్రగలవాడా!; నా మదిన్= నా మనసులో; విప్రులపైగల ప్రేమము= బ్రాహ్మణులపైగల ప్రేమ; నా తనువు+అందున్= నా శరీరంపై; పెట్టనికతనన్= ఉంచని కారణంగా; భూమిసురులు= బ్రాహ్మణులు; అర్హులు= యోగ్యులు; నీవు+ఈ మునులన్= నీవు ఈ తపోధనుల్ని; పూజ+చేయుము= పూజించు.

**తా :** ఓ ప్రసిద్ధచరిత్రా! నా మనసులో బ్రాహ్మణులపైగల ప్రేమ నిజానికి నాకు నా శరీరంపై కూడాలేదు. బ్రాహ్మణులు పూజ్యులు కనుక ఈ మునుల్ని చక్కగా పూజించు.

**క. ఇదియే నా కిష్టము ననుఁ, బదివేలవిధంబు లొలయ భజియించుటగా**
**మది కిం పగు నటు గావున, వదలని భక్తిన్ భజింపు వసుధామరులన్! 1200**

**ప్రతి :** ఇది+ఎ నా కున్+ఇష్టము= ఇదే నాకు సమ్మతం; అటు కావునన్= అలా కాబట్టి; వదలనిభక్తిన్= ఏమరని భక్తితో; వసుధా+అమరులన్= భూసురుల్ని (బ్రాహ్మణుల్ని); భజింపుము= సేవించుము; ననున్= నన్ను (శ్రీకృష్ణుని) పదివేల విధంబులు= అనేకవిధాలుగా; ఒలయ= కూర్చిన; భజియించుటగా= సేవించినట్లుగా; మదికిన్+ఇంపు+అగు= మనసుకు ఆనందం కల్గిస్తుంది.

**తా :** నాకదే ఇష్టం. బ్రాహ్మణులను పూజిస్తే నన్ను పదివేలవిధాలుగా పూజించినట్టు భావించి ఆనందిస్తాను. కనుక బ్రాహ్మణుల్ని శ్రద్ధతో పూజించు.

**క. అని సర్వలోకవిభుఁ డగు, వనజోదరుఁ డానతిచ్చువాక్యంబుల జా**
**డన భూమీసురుఁ దమ్మని, జనులకు సద్భక్తిఁ బూజ సలిపెన్ వరుసన్. 1201**

**ప్రతి :** అని= ఈ విధంగా; సర్వలోకవిభుడు+అగు= సర్వలోకాధినాథుడైన; వనజ+ఉదరుడు= శ్రీకృష్ణుడు; ఆనతి+ఇచ్చు= ఆజ్ఞాపించు; వాక్యంబుల జాడన్= మాటల ప్రకారంగా; భూమీసురుడు= బ్రాహ్మణుడు (శ్రుతదేవుడు); ఆ+మునిజనులకున్= ఆ తాపసులందరికీ; వరుసన్= క్రమంగా; సద్భక్తిన్= చక్కని భక్తితో; పూజసలిపెన్= పూజలు చేశాడు.

**తా :** సమస్తలోకాధీశ్వరుడైన శ్రీకృష్ణుడు చెప్పిన ప్రకారం శ్రుతదేవుడు ఆ మునులందరికీ భక్తితో పూజలు చేశాడు.

**చ. ఎనయఁగఁ గృష్ణుఁ డంత మిథిలేశ్వరభూసురులం గృపావలో**
**కన మొలయ న్ననూనసుభగస్థితిఁ బొందఁగఁ జేసి వారి వీ**
**డ్కొని రథ మెక్కి దివ్యమునికోటియుఁ దానును వచ్చెఁ గ్రమ్మఱన్**
**జనవర! మోక్షదం బగు కుశస్థలికిం బ్రమదాంతరంగుఁడై 1202**

**ప్రతి :** జనవర= ఓ రాజా!; ఎనయన్+కన్= ఒప్పారగ; కృష్ణుఁడు+అంత= అప్పుడు కృష్ణుడు; మిథిలా+ఈశ్వర, భూసురులన్= మిథిలరాజు జనకుణ్ణీ; మిథిలబ్రాహ్మణుడు శ్రుతదేవుణ్ణీ; కృపా+అవలోకనము+ఒలయన్= దయతో కూడిన చూపులు ప్రకాశింప; అనూన సుభగస్థితిన్= అధికమైన గొప్ప సౌభాగ్య దశను; పొందన్+కన్+చేసి= పొందించి (ప్రసాదించి); వారిన్ వీడ్కొని; వారినుండి వీడ్కోలుపొంది; రథము+ఎక్కి, దివ్యమునికోటియున్= గొప్పవారైన మునుల సమూహమూ; తానును= కృషుడూ; ప్రమద+అంతరంగుడు+ఐ= సంతోషం హృదయంలో నిండినవాడై (వారై); మోక్షదంబు+అగు= మోక్షమిచ్చే; కుశస్థలికిన్= కుశస్థలమనే పేరుగలద్వారకకు; క్రమ్మఱన్= మరల, వచ్చెన్= వచ్చాడు.

**తా :** ఓ మహారాజా! కృష్ణుడు వారిద్దరినీ వీడ్కొని, వారికి దయతో సకల భాగ్యాలు ప్రసాదించి, రథమెక్కి, మునులతోపాటు ద్వారకకు తిరిగి వచ్చాడు.

## ❖ శ్రుతిగీతలు ❖

**వ. అని చెప్పిన బాదరాయణికి నభిమన్యు నందనుం డిట్లనియె; మునీంద్రా! ఘటపటాదివస్తు జాతంబు భంగి నిర్దేశింప నర్హంబు గాక, సత్త్వాదిగుణశూన్యంబైన బ్రహ్మంబునందు సత్త్వాదిగుణగోచరంబులైన వేదంబు లేక్రమంబునం బ్రవర్తించు, నట్టి చందంబు నా కెఱిఁగింపు మనిన భూవరునకు మునివరుం డిట్లనియె; 'సకల చేతనాచేతనాంతర్యామియైన సర్వేశ్వరుండు సర్వశబ్దవాచ్యుండు గావున సకలజంతు నివహంబులందు బుద్ధీంద్రియ మనః ప్రాణశరీరంబులను సృజియించి; చేతనవర్గంబునకు జ్ఞానప్రదుండగుం గావున సకలనిగమసమూహంబులును దత్స్వరూపగుణ వైభవప్రతిపాదకంబులు గావున ముఖ్యంబై ప్రవర్తించు; శ్రుతిస్తోత్రం బుపనిషత్తుల్యంబు; ననేకపూర్వఋషిపరంపరాయాతంబును నైన దీనిని శ్రద్ధాయుక్తుండై యెవ్వం డనుసంధించు, నతనికి మోక్షంబు సులభంబు; దీనికి నారాయణాఖ్యాతంబగు నొక్క యుపాఖ్యానంబు**

**గలదు; వినిపింతు, వినుము; భగవత్ప్రియుండైన నారదుం డొక్కనాఁడు నారాయణాశ్రమంబునకుం జని ఋషిగణసమేతుండైన నారాయణఋషిం గనుంగొని నీవు న న్నడిగినట్ల యమ్మహాత్ముని నడిగిన నతండు ము న్నీ యర్థంబు శ్వేతద్వీపవాసులైన సనకసనందనాదిదివ్యయోగీంద్రులు ప్రశ్న సలిపిన, వారలకు సనందనుండు చెప్పినప్రకారంబు నీ కెఱింగించెద' నని చెప్పం దొడంగె; శయానుండైన రాజశ్రేష్ఠునిఁ దత్పరాక్రమదక్షతాదిచిహ్నంబులను నుతియించు వందిజనంబులచందంబున జగదవసానసమయంబున ననేకశక్తియుతుండై యోగనిద్రావశుండైన సర్వేశ్వరుని వేదంబులు స్తోత్రంబు సేయు విధంబు నారాయణుండు నారదునకుం జెప్పిన తెఱంగు విను మని యిట్లనియె. 1203**

**ప్రతి :** అని చెప్పిన= పైవిధంగా జనక, శ్రుతదేవుల వృత్తాంతం చెప్పగా; బాదరాయణికి= వ్యాసుని కుమారుడైన శుకునికి; అభిమన్యునందనుండు+ఇట్లు+అనియెన్= అభిమన్యుని కుమారుడు పరీక్షిత్తు, ఇలా అన్నాడు; ముని+ఇంద్రా!= మునిశ్రేష్ఠా! ఘటపట+ఆది వస్తుజాతంబుభంగి= ఘట (కుండ); పట(వస్త్రా)లవంటి వస్తుసమూహాలవలె; నిర్దేశింపన్+అర్హంబు+కాక= ఇది అని చెప్పడానికి వీలులేని; సత్త్వ+ఆదిగుణ శూన్యంబు+ఐన= సత్త్వరజస్తమోగుణములు లేనిదైన (గుణశూన్యమని); బ్రహ్మంబు+అందున్= భగవత్తత్త్వమైన బ్రహ్మ పదార్థంలో; సత్త్వ+ఆదిగుణ గోచరంబులు+ఐన= సత్త్వాదిగణాలతో కూడిన వాటిల్ని వర్ణించే; వేదంబులు+ఏక్రమంబునన్= వేదాలు ఏవిధంగా; ప్రవర్తించున్= వర్ణిస్తాయి? అట్టిచందంబు= అలాటి (పరస్పర భిన్నమైన) విధానాన్ని; నాకున్+ఎఱిగింపుము+అనినన్= నాకు తెలియజేయవలసింది అని చెప్పగా; భూవరునకున్=రాజుకు; మునివరుండు= మునిశ్రేష్ఠుడైన శుకుడు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పినాడు; సకలచేతన+అచేతన+అంతర్+యామి+ఐన= చైతన్యంకలవీ, చైతన్యంలేనివీ అయిన; సృష్టిలోని సకలవస్తువులలోపల ఉండే; సర్వ+ఈశ్వరుండు= సర్వులకు అధిపతి అయిన భగవంతుడు; సర్వశబ్దవాచ్యుండు= 'సర్వ'మనే శబ్దంచేత (సర్వనామము) చెప్పబడేవాడు (అన్నిపేర్లు ఆయనవే ఆయనగురించే చెబుతాయి); కావున; సకల జంతునివహంబులు+ అందున్= అన్ని ప్రాణుల సమూహాల్లో; బుద్ధి+ఇంద్రియ; మనస్+ప్రాణ శరీరంబులను= హృదయం; శరీరంలో కదిలే అంగాలు, మనస్సు, ప్రాణం, శరీరాలను; సృజియించి= సృష్టించి; చేతనవర్గంబునకున్= చైతన్యంగల జీవసమూహానికి; జ్ఞానప్రదుండు+అగున్+కావున తానే జ్ఞానాన్ని ఇచ్చేవాడు కావున; సకల నిగమ సమూహాలును= అన్ని వేదలరాశులూ; తత్+స్వరూపగుణ వైభవ= ఆ భగవంతుని రూప, గుణ, వైభవాల్ని; ప్రాతిపదికములు= ప్రతిపాదించేవి; కావున ముఖ్యంబు+ఐ ప్రవర్తించున్= కాబట్టి, సాదనమై ఉంటాయి; శ్రుతిస్తోత్రంబు= వేదాల్లోని భగవంతుని స్తోత్రాలు (వర్ణించే ఋక్కులు, సామలు, మొ॥) ఉపనిషత్+తుల్యంబు= సారవంతమైన వేదాంత భాగాలతో సమానం; అనేక పూర్వఋషి పరంపరా+ఆయతము= అనేకులైన (బహు)పూర్వపు ఋషులు ఒకరినుండి ఒకరికి అందించగా విస్తరింపబడింది అయిన; దీన్ని= ఈ వేదస్తోత్రభాగాలను; శ్రద్ధా+ఆసక్తుడు+ఐ= శ్రద్ధకలిగి; ఎవ్వండు= ఎవరైతే; అనుసంధించున్= అనుసంధానం చేస్తాడో; అతనికిన్= వానికి; మోక్షంబు= ముక్తి; సులభము= తేలిక అవుతుంది; దీనికిన్= ఈ విధానానికి; నారాయణ+ఆఖ్యాతంబు+అగు= నారాయణుడనే ఋషిచేత చెప్పబడిందైన ఒక్క ఉప+ఆఖ్యానంబు+కలదు= ఒక్క చిన్నకథ ఉంది; వినిపింతున్; వినుము= చెప్పెదను, విను; భగవత్+ప్రియుండు+ఐన= భగవంతునికి ఇష్టమైన, నారదుండు+ఒక్కనాడు= నారదుడు ఒకరోజు; నారాయణ+ఆశ్రమంబునకున్+చని= నారాయణుడు నివసించే కలాపగ్రామానికి వెళ్లి, ఋషిగణ సమేతుండు+ఐన= ఋషి సమూహంతో కూడి ఉన్న; నారాయణ ఋషిన్+కనుగొని= నారాయణ ఋషిని సందర్శించి; నీవు నన్నున్+ అడిగినట్లు+అ= నీవు (పరీక్షిత్తు) ఏవిధంగా నన్ను(శుకుని) అడిగావో అలా; ఆ+మహాత్మునిన్+అడిగినన్= ఆ మహానుభావుణ్ణి అడుగగా;

అతండు= ఆ నారాయణ ఋషి; మున్ను+ఈ అర్థంబు= గతంలో ఈ విషయం; శ్వేతద్వీపవాసులు+ఐన= శ్వేతద్వీపమని పేరుగల (ఈ ద్వీపమందే వైకుంఠము ఉన్నది) సముద్రగర్భ ద్వీపంలో నివసించిన; సనక, సనందన+ఆది= సనకుడు, సనందనుడు మొదలైన (మిగిలిన ఇద్దరు సనత్సుజాతుడు, సనత్కుమారుడు–ఈ నలుగురు బ్రహ్మమానస పుత్రులు); దివ్యయోగి+ఇంద్రులు= దేవతా సంబంధీకులైన యోగిశ్రేష్ఠులు; ప్రశ్న+చలిపిన= ప్రశ్నించగా; వారలకున్; సనందనుడు చెప్పిన= వారికి సనందనుడు వివరించిన; ప్రకారంబు= విధానాన్ని; నీకున్+ఎఱింగించెదన్ అని= నీకు (నారదునకు); చెబుతానని; చెప్పన్+తొడంగెన్= నారాయణ ఋషి చెప్పసాగాడు; శయానుడైన= నిద్రించిన; రాజశ్రేష్ఠుని= ఒక చక్రవర్తిని; తత్+పరాక్రమ దక్షతా+ఆది= వాని శౌర్యం; సామర్థ్యం మొ॥ చిహ్నంబులన్= సంకేతించే సామర్థ్యగాథలను; నుతియించు= పొగడే; వంది జనంబుల చందంబునన్= వంది మాగధులవలె; జగత్+అవసాన సమయంబునన్= ఈ సృష్టి అంతంలో; అనేక శక్తియుతుండు+ఐ= బహుశక్తులు కలిగినవాడై; యోగనిద్రావశుండు+ఐన= యోగనిద్రకు వశమైపోయి నిద్రించిన; సర్వ+ఈశ్వరుని= సర్వాధీశుణ్ణి, పరమాత్ముణ్ణి; వేదంబులు స్తోత్రంబు చేయువిధంబు= వేదాలు పొగడే విధానం, నారాయణుండు= ఆ ఋషి; నారదునకున్+చెప్పిన= నారదునికి; చెప్పిన తెఱంగు= చెప్పిన విధానం; విను(ము)+అని+ ఇట్లు+అనియెన్= వినుము, అంటూ ఇలా చెప్పాడు.

**తా :** జనక శ్రుతదేవులకథ ముగించిన శుకునితో శ్రోత అయిన పరీక్షిత్తు మళ్లీ ప్రశ్నించాడు. "అయ్యా! ఘటపటాది వస్తు జాతానికి ఎలా ఉంటాయో అలా బ్రహ్మతత్త్వానికి సత్త్వరజస్తమోగుణాలు, రూపం, కార్యకారణబంధం ఉండదుగదా! అలాంటి వస్తుజాతతత్త్వాన్ని వర్ణించే సత్త్వాదిగుణాలకు లోబడిన వేదాలు భగవత్తత్త్వాన్ని ఎలా నిర్వచించగలవు?" ఈ సందేహాన్ని నివృత్తి చేయుము అన్నాడు. అపుడు పరీక్షిత్తుతో శుకుడు ఇలా చెప్పాడు. "చేతనపదార్థాలు, చైతన్యరహిత వస్తువులు అన్నిటిలో ఉన్న ఈశ్వరుడు **'సర్వ'** అనే శబ్దంతో సంబోధించబడతాడు. అన్ని ప్రాణుల్లో ప్రాణాలు, ఆత్మ, శరీరం, వాటి అంగాలు, హృదయం, మనస్సు వీటిల్ని సృష్టించి జీవులకు జ్ఞానాన్ని ఇచ్చేవాడు భగవంతుడు. కాబట్టి, వేదాలు భగవంతుని రూపగుణవైభవాల్ని ప్రతిపాదించేవే. అవి ముఖ్యసాధనాలు. వేదాల్లో భగవంతుణ్ణి వర్ణించే స్తోత్రాలన్నీ ఉపనిషత్తులంత గొప్పవి. వీటిని ఋషుల పరంపరచే పొంది ఎవడు శ్రద్ధాసక్తులతో అనుసంధించుకొనునో వానికి మోక్షం తథ్యం. నారాయణునిపేరుమీదుగాగల ఒక ఉపాఖ్యానం ఈ విధానాన్ని వివరిస్తుంది. భగవద్భక్తుడైన నారదుడు ఒకనాడు కలాపగ్రామంలోని నారాయణాశ్రమానికి వెళ్లి, ఋషులతో ఉన్న నారాయణుడనే ఋషిని, నువ్వు నన్ను అడిగినట్లే అడిగినాడు. ఆయన గతంలో ఇలాగే శ్వేతద్వీపవాసులైన సనకసనందనాదులు అడిగిన ఇదే సందేహానికి సనందనుడు చెప్పిన జవాబును నీకు (నారదునికి) తెలుపుతాను. అని చెప్పసాగాడు. ఒక చక్రవర్తి నిద్రించినపుడు అతని గుణగణాలు, శౌర్యము, దక్షతలను వందిమాగధులు ఎలా స్తోత్రం చేస్తారో అలాగే యోగనిద్రా పరవశుడైన భగవంతుణ్ణి, వేదాలు స్తోత్రంచేస్తున్నాయి. ఈ స్తోత్ర భాగాలైన వేదాలు అలాంటి సత్యాన్ని ప్రవచిస్తున్నాయి. అని నారదునికి చెప్పినాడు. ఆ 'నారాయణాఖ్యమైనగాథను' నారదునికి చెప్పిన దాన్ని విస్తారంగా శ్రుతిగీతాల రూపంలో శుకుడు మళ్లీ చెప్పసాగాడు.

**విశే :** (1) ఘటపటాది వస్తుజాత స్వరూప స్వభావాల వివరణ తర్కశాస్త్రంలో వస్తుంది. భగవత్తత్త్వం తర్కానికి లొంగేది కాదు. నిర్గుణబ్రహ్మాన్ని సగుణభౌతిక ప్రపంచానికి చెందినవైన వేదాలు ఎలా వర్ణించి నిరూపించగల్గుతాయని పరీక్షిత్తు ప్రశ్న.

(2) చైతన్య వస్తుజలానికి జ్ఞానాన్ని ఇచ్చేది భగవంతుడే. సర్వం ఈశ్వరుడే. వేదాలు అందులో భాగమే. వేదంలోని ఆ స్తోత్రాలు భగవత్తత్త్వాన్ని తెలిపే ఉపనిషత్తులంత విలువైనవని వేదం ప్రమాణంలో నిరూపించింది. ఆ స్తోత్రవాఙ్మయాన్ని అర్థంచేసికొని, ఆచరిస్తే మోక్షం సులభం అని వివరణ.

(3) సుఖనిద్రలో ఉన్న రాజుకు వందిమాగధులు మేలుకొలుపు గీతాలు పాడుతారు. ఆ పాటలలో రాజుశౌర్యం, కార్యదక్షత మొ॥ ఉంటాయి. యోగనిద్రలో ఉండే భగవంతుణ్ణి స్తోత్రం చేసే వేదాలు, వంది బృందాలగీతాలవంటి ప్రశంసలే. వంది మాగధులగీతాలకు రాజు స్పందించకున్నా అవి అబద్ధాలుకావు. ఇక్కడ గుణాతీతుడైన భగవంతుడు (యోగనిద్రలో ఉండి) స్పందించకున్నా వేదస్తోత్రాలు అబద్ధాలుకావు. (అవే తిరిగి అతనిని మేల్కొల్పుతాయి.)

(4) వేదాలు ఋషి ప్రోక్తాలు. ఋషులు ద్రష్టలు. **'నా నృషిః కురుతే కావ్యమ్'** అని లోకంలో కవులు ఋషులుగా చెప్పబడ్డారు. అతి ప్రాచీనకాలంనుండి ఋషులు చెపుతూ వస్తున్నవి పరంపరగా ఒకరినుండి ఒకరికి అంది స్థిరమైనాయి.

(5) శ్వేతద్వీపవాసులైన ఋషులకు (సనకసనందనాదులకు) సనందనుడు చెప్పినది ఇది. దీనిని విన్న నారాయణుడు (ప్రశ్నించిన) నారదునికి చెప్పాడు. దీనిని శుకుడు పరీక్షిత్తుకు చెప్పాడు. అది మనకు భాగవత గ్రంథరూపంలో లభించింది. (దీన్నే పరంపర అంటారు)

(6) విద్వాంసులకు భాగవతంతో పరీక్ష. అందులో దశమస్కంధం. దీనిలో అతిగహనమైన వ్యాఖ్యానమపేక్షించే భగవత్తత్త్వం కనిపిస్తుంది. అలాంటివాటిలో శ్రుతిగీతలు ఒకటి. ఇవి నారాయణఋషి కలాప గ్రామాశ్రమంలో నారదునికి చెప్పినవి. శ్రుతిగీతలకు విశిష్టత, పవిత్రత ఆపాదించింది ఇందుకే.

(7) "జగదవసాన సమయంబున....." ఇత్యాది చిట్టచివరివాక్యాలు శ్రుతిగీతలలో కీలకమైనవి. జగత్ ప్రళయం సంభవించినప్పుడు సప్తసాగరాలు ఏకార్ణవమైపోగా, అప్పుడు యోగనిద్రలో ప్రవేశించిన ఆదినారాయణునిలోని సర్వశక్తుల్నీ తిరిగి పొందడం కోసం వేదాలు యోగనిద్రనుండి స్వామిని మేల్కొల్పుతాయి. అప్పుడు పునః సృష్టి జరుగుతుంది. నారాయణుడు నారదునికి చెప్పాడు.

**సీ. జయ జయ హరి! దేవ! సకలజంతువులకు జ్ఞానప్రదుండవు గాన వారి**
**వలన దోషంబులు గలిగిన సుగుణసంతానంబుగాఁ గొని జ్ఞానశక్తి**
**ముఖ్యషడ్గుణపరిపూర్ణతఁ జేసి మా యాత్మవిశిష్టుండ వగుచుఁ గార్య**
**కారణాత్మకుఁడవై కడఁగి చరించుచు నున్న నీయందుఁ బయోరుహాక్ష!**

**తే. తివిరి యామ్నాయములు ప్రవర్తించుఁ గాన ప్రకటత్రిగుణాత్మకంబైన ప్రకృతితోడి**
**యోగ మింతయు మాన్పవే! యోగిమాన, సాంబుజాత మధువ్రత! యని నుతించి. 1204**

**ప్రతి :** హరి= కృష్ణా!; జయ జయ!= నీకు జయమగుగాక; దేవ= ప్రభూ!; సకలజంతువులకున్= ప్రాణికోటి కంతటికీ; జ్ఞాన ప్రదుండవు= జ్ఞానం ఇచ్చేవాడివి; కానన్= కాబట్టి; వారివలన దోషంబులు కలిగినన్= వారు దోషాలుచేస్తే; సుగుణ సంతానంబు+కాన్= వాటిని సుగుణాలు (సమూహంగా); కొని= స్వీకరించి; జ్ఞానశక్తిముఖ్య= జ్ఞానశక్తి మొ॥; షట్+గుణ పరిపూర్ణతన్+చేసి= ఆరుగుణాల్నీ నిండుగా ప్రసాదించి; (పూర్ణజ్ఞానిగా మలచి); మా+ఆత్మ విశిష్టుండవు+అగుచున్= మా ఆత్మలలో విశేషంగా విహరిస్తూ; కార్యకారణ+ఆత్మకుడవు+ఐ= కార్యం (పని), కారణం (నెపము) అనగా సర్వజీవుల ప్రవర్తనలు, అవి ప్రవర్తించడానికి కారణభూతమైన ఇచ్ఛ రెండూ నీవే అయి; కడగి= యత్నపూర్వకంగా; చరించుచున్న= తిరుగాడుతున్న; నీ+అందున్= నీలో; తివిరి= యత్నించి; ఆమ్నాయములు= వేదాలు; ప్రవర్తించున్= చరిస్తాయి; కానన్= కాబట్టి; పయోరుహ+అక్ష= పద్మాలవంటి కన్నులుకలవాడా!; త్రిగుణ+ఆత్మకంబు+ఐన= సత్త్వరజస్తమోరూపగుణాలుగల;

ప్రకృతితోడి= స్వభావంతో; యోగము= కలయిక; యోగిమానస= యోగుల మనస్సులనే; అంబుజాత= పద్మములకు; మధువ్రత= తుమ్మెద అయినవాడా! ఇంతయు మాన్పవ+ఏ= ఈ పాటిదాన్ని (బంధాలను) తొలగించవయ్యా!; అని; నుతించి= పొగడి...

**తా :** ఓ విష్ణూ! నీకు జయం. జయం. అన్ని జంతువులకు జ్ఞానం నీవల్లనే కలుగుతోంది. కనుక ఆ జ్ఞానంతో వారుచేసే దోషాల్ని సుగుణాలుగా భావించి, షడ్గుణపరిపూర్ణుల్నిచేసి, ఆత్మలలో తిరుగాడుతూ, కార్యమూ కారణమూ నీవే అయి ప్రవర్తిస్తున్న నీయందే వేదాలు ప్రవర్తిస్తాయి. సత్త్వరజస్తమోగుణాలతో కూడిన స్వభావంనుండి మాకున్న బంధం తెంపు. యోగుల హృదయాల్లో నిరంతరం ఉండేవాడా! నీకు జయం.

**వ. అదియునుం గాక 1205**

**తా:** అదీగాక

**సీ. పరమవిజ్ఞానసంపన్నులైనట్టి యోగీంద్రులు మహితనిస్తంద్రలీలఁ**
**బరిదృశ్యమానమై భాసిల్లు ని మ్మహీపర్వతముఖరప్రపంచ మెల్ల**
**బరఁగ బ్రహ్మస్వరూపము గాఁగఁ దెలియుదు రెలమి నీవును జగద్విలయవేళ**
**నవశిష్టుఁడవు గాన ననఘ! నీయందు నీ విపులవిశ్వోదయవిలయము లగు**

**తే. ఘటశరావాదు లగు మృద్వికారములు మృ, దాత్మకంబైన యట్లు పద్మాయతాక్ష!**
**తవిలి కారణరూపంబుఁ దాల్చి లీలఁ, గడఁగు నీయందు బుద్ధివాక్కర్మములను. 1206**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాక; పరమవిజ్ఞాన సంపన్నులు+ఐనట్టి= గొప్పజ్ఞాన సంపదగల్గిన; యోగి+ఇంద్రులు= శ్రేష్ఠులైనయోగులు; మహిత నిస్తంద్రలీలన్= గొప్ప అవిశ్రాంత విధానంగా; పరిదృశ్యమానము+ఐ= కనబడుతూ; భాసిల్లు= ప్రకాశించే; ఈ+మహీపర్వతముఖర= ఈ భూమి, పర్వతాలు మొదలైన; ప్రపంచము+ఎల్లన్= సర్వజగత్తూ; పరగన్= ఒప్పుచున్న; బ్రహ్మస్వరూపము+కాన్+కన్= పరబ్రహ్మ పదార్థంకాగా; ఎలమిన్= కూర్మి (భక్తి)తో; నీవును; జగత్+విలయవేళ= జగత్తునాశమయ్యే ప్రళయకాలంలో; అవశిష్టుడవు+కాన= మిగిలి వాడివి కాన ఒక్కడవే; అనఘ= పవిత్రుడా! నీ+అందున్= నీలో; విపుల విశ్వ+ఉదయ విలయములు+అగు= విశాలమైన విశ్వముయొక్క పుట్టుకలు, నాశములు అగును, ఘట, శరావ+ఆదులు= కుండలు, మూకుళ్లు మొ॥వి; మృత్+వికారములు= మట్టితో చేసినవి; తిరిగి; మృత్+ఆత్మకములు= మట్టిలోనే చేరిపోవునో; అట్లు= ఆవిధంగా; తవిలి= తగుల్కొని; కారణరూపంబుఁ+తాల్చి= కారణమైన రూపాలు ధరించి; నీ అందున్= నీలో; బుద్ధివాక్ కర్మలును= పైమూడు (మనసు, మాట, చేత); కడఁగున్= లీనమగును.

**తా :** అంతేగాక, యోగులు ఈ భౌతిక సృష్టిని, దీనిలోని ప్రతివస్తువును బ్రహ్మస్వరూపంగానే భావిస్తారు. ప్రళయకాలంలో సర్వప్రకృతీ నశించినా నీవొక్కడవే మిగిలిపోతావు. సృష్టి, లయాలలో ఈ సర్వప్రపంచం నీలోనే పుటుతూంది. కుండలు మొ॥ మట్టితో చేసిన వస్తువులు-మట్టిలోనే కలిసినట్లు బుద్ధి వాక్ కర్మలు నీలోనే లీనమవుతున్నాయి.

**క. అలవడఁ జేయుచు నుందురు, బలకొని యిలఁ బెట్టఁబడిన పదవిన్యాసం**
**బులు పతనకారణముగా, నలవున సేవించుచును గృతార్థులు నగుచున్. 1207**

**ప్రతి :** ఇలన్= భూమిపై; పెట్టబడిన= ఉంచబడిన (చేసిన); పదవిన్యాసంబులు= నడకలు (క్రియాకర్మలు); పతనకారణము+కాన్= పునర్జన్మ ఎత్తడానికి కారణాలు (సహాయపడేవి); కనుక, బలకొని= అతిశయించి; సేవించుచున్= సేవిస్తూ; కృత+అర్థులున్+అగుచున్= సార్థకజీవులవుతూ...

**తా :** జ్ఞానులు భూమిపైపుట్టి జీవితంలో 'అనివార్యమైన కర్మలు' చేస్తూ, తద్వారా పాపాదులు, ఆపై తిరిగి జన్మలు ఎత్తడం కాక, నీపై శ్రద్ధపెట్టి సేవిస్తూ, కృతార్థులు అవుతూరు.

**క. లీలం బ్రాకృతపూరుష, కాలాదికనిఖిలమగు జగంబుల కెల్లన్**
**మాలిన్యనివారక మగు, నీ లలితకథాసుధాబ్ధినిం గ్రుంకి తగన్. 1208**

**ప్రతి :** ప్రాకృత పురుష!= పురాతన పురుషా! (ఆది పురుషా!); కాల+ఆదిక నిఖిలము+అగు= కాలం మొదలైన వాటిచే రూపుకట్టే ఈ సమస్తమైన; జగంబులకున్+ఎల్లన్= సర్వప్రపంచానికీ; లీలన్= తేలికగా; మాలిన్య నివారకమగు= పాపాలను పోగొట్టే; నీ లలిత= నీ మనోజ్ఞమైన; కథాసుధా+అబ్ధినిన్= కథలనే అమృతసముద్రంలో; క్రుంకి= మునిగి; తగన్= చక్కగా...

**తా :** పురాణపురుషా! కాల, లయాదిక స్వరూపమైన ఈ సృష్టిలోని ప్రాపంచికులు, సర్వపాపవినాశకరమైన నీ అమృత కథలతో తరిస్తూ

**చ. భరిత నిదాఘ తప్తుఁడగు పాంథుఁడు శీతలవారిఁ గ్రుంకి దు**
**ష్కరమగు తాపముం దొఱఁగు కైవడి సంసరణోగ్రతాపమున్**
**వెరవునఁ బాయుచుందుదురు నిన్ను భజించు మహాత్మకుల్ జరా**
**మరణమనోగుణంబులఁ గ్రమంబునఁ బాయుట సెప్ప నేటికిన్? 1209**

**ప్రతి :** భరిత నిదాఘ= నిండువేసవి ఎండకు; తప్తుఁడు+అగు= మాడిపోయే; పాంథుడు= బాటసారి; శీతలవారిన్+క్రుంకి= చల్లని నీటిలో స్నానంచేసి; దుఃఖకరము+అగు తాపమున్= భరింపలేని వేడిమిని; తొఱగు కైవడిన్= పోగొట్టుకొనేవిధంగా; సంసరణ+ఉగ్రతాపమున్= సంసారమనే భయంకరమైన వేడిమిని; నిన్నున్ భజించు మహా+ఆత్మకుల్= నిన్ను సేవించే మహానుభావులు; వెరవునన్= ఉపాయంగా; పాయుచున్+ఉండుదురు= వదిలించుకోగల్గుతారు. (ఇక) జరామరణ= ముసలితనం, మరణం; మనస్+గుణంబులన్= చాంచల్యాదిగాగల మనస్సుకు సంబంధించిన లక్షణాల్ని; క్రమంబునన్= వరుసగా; పాయుట= వదిలించుకోవడం; చెప్పన్+ఏటికిన్= చెప్పేపనేముంది?

**తా :** నిండు వేసవిఎండకు తీవ్రంగా మాడుతున్న బాటసారి ఒక్కసారి చల్లనినీటిస్నానంచేస్తే ఎలా ఆనందిస్తాడో, సంసారమనే తాపాన్ని భరించలేక నిన్ను సేవించే మహానుభావులు దాన్ని పోగొట్టుకుంటారు. ఇక ముసలితనం, మరణం, మనోవాంఛలు వీటినుండి నీ భక్తులు విముక్తులు అవుతారని ప్రత్యేకించి చెప్పేపనేముంది?

**వ. అదియునుం గాక 1210**

**తా:** అంతేగాక

**సీ. అనయంబు దేహి నిత్యానిత్యసద్వివేలక్షణమునఁ బంచకోశవ్యవస్థ**
**నభివృద్ధిఁ బొరయుచు నందులోపల నున్న ప్రాణాన్నబుద్ధివిజ్ఞానమయము**

లను చతుష్కోశంబు లవ్వల వెలుఁగొందు నానందమయుఁ డీవు గాన దేవ!
సురుచిర స్వప్రకాశుండవు నీ పరిగ్రహము గల్గుటం జేసి కాదె ప్రకృతి

**తే.** మహదహంకారపంచతన్మాత్రగగన, పవన తేజోఽంబుభూభూతపంచకాది
కలితతత్త్వముల్ బ్రహ్మాండకార్యకరణ, మందు నెపుడు సమర్థంబు లగుటఁ జూడ. **1211**

**ప్రతి :** దేవ= ప్రభూ! అనయంబు= ఎల్లవేళలా; దేహి= దేహాన్ని ధరించిన వ్యక్తి (జీవుడు); నిత్య+అనిత్య సత్+విలక్షణమునన్= ఇది సత్తు, ఇది అసత్తు అనే విశేషలక్షణాలతోకూడిన; పంచకోశవ్యవస్థన్= ఐదుకోశాలు (ప్రాణమయ, అన్నమయ, బుద్ధిమయ (మనోమయ), విజ్ఞానమయ, ఆనందమయాలనే ఐదు)గల శారీరకవ్యవస్థచే, అభివృద్ధిన్= విశేష వృద్ధి (పెంపు)ని; పొరయుచున్= పొందుతూ; అందులోపలన్+ఉన్న= వాటిలోని; ప్రాణ+అన్న, బుద్ధి, విజ్ఞానమయములు+అను= ప్రాణమయ, అన్నమయ, బుద్ధిమయ (మనోమయ) విజ్ఞాన మయాలు అనే; చతుర్+కోశంబుల= నాలుగింటికీ; అవ్వలన్= ఆవలఉండే; వెలుగు+ఒందు= ప్రకాశించే; ఆనందమయుఁడు+ఈవు కానన్= ఆనందమయకోశం నీవే కాన (ఆనంద స్వరూపుడవు కనుక); సు, రుచిర, స్వ, ప్రకాశుండవు= చక్కగా వెలుగొందే స్వయం ప్రకాశరూపుడివి; నీ పరిగ్రహము కల్గుటన్+చేసి= నీవు అధీనం చేసికోవడంవల్ల; ప్రకృతి= చరాచరసృష్టి; మహత్= మహత్తు; అహంకార= అహంకారం అనగా ఆత్మ; (అహంకారరూపంతో తప్ప ఆత్మకు మరోరూపం ఉండదు); పంచతత్+మాత్రలు= ఐదు తత్త్వాలైన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు – ఇవి కలిగిన, గగన= ఆకాశ; పవన= వాయువు; తేజస్= వెలుగు; అంబు= జలం; భూ= భూమి అనే; భూతపంచక+ఆది= పంచభూతాలు మొదలైనవాటితో; కలితతత్త్వముల్= కూడి ఉన్న సృష్టిలక్షణాలు; బ్రహ్మ+అండ= గోళాకృతినున్న ఈ విశ్వంయొక్క; కార్యకరణము+అందున్= కార్య, సాధనాంశాలలో; ఎపుడు= నిత్యమూ; సమర్థంబులు+అగుటన్= సామర్థ్యంకల్గి ఉండటం; చూడన్+కాదు+ఎ= కనబడుతోందిగదా!

**తా :** దేహి శాశ్వతం, దేహం అశాశ్వతం (దేహి= జీవుడు, దేహం= శరీరం)అనే అంశాలతో కూడిన పంచకోశాలు అభివృద్ధి చెందుతాయి; అందులోని పంచమకోశం అయిన ఆనందమయుడివి నీవే! నీవు స్వయం ప్రకాశకుడవు. నీవు అధీనంలో ఉంచుకోవడంవల్లే ప్రకృతి, మహత్తు, అహంకారరూప ఆత్మ, పంచతన్మాత్రలు, పంచభూతాలు, వాటి తత్త్వంతో కూడిన సృష్టిలక్షణాలు, విశ్వకార్యాలు, తత్‌సాధన కారణాలు అన్నీ సర్వసమర్థంగా, నియమబద్ధంగా జరుగుతున్నాయి.

**విశే:– II పంచకోశవ్యవస్థ :** 1. అన్నమయకోశం 2. ప్రాణమయకోశం 3. మనోమయకోశం 4. విజ్ఞానమయకోశం 5. ఆనందమయకోశం. ఇందులో మొదటిది ప్రాథమికం. అట్టడుగుపొర, దానిమీదిపొర ప్రాణమయం, దానిపై పొర మనోమయం. దానిపై ఉన్నది విజ్ఞానమయం. అన్నిటికన్న పైన ఉన్నతస్థానంలో ఉండేది **ఆనందమయకోశం**. ఒక త్రికోణాకారంగా ఈ పంచకోశాలను సంభావిస్తే త్రికోణంలోని శిఖరాగ్రభాగమే **ఆనందమయకోశం**. తిరుమల శ్రీవారి దేవాలయంలో స్వామి గర్భగుడిపైగల విమానం పేరు **'ఆనందనిలయ విమానం'**. ఇదే ఏడవ కొండపై స్వామి గర్భగృహంలో నిలబడిన అధిష్ఠానం, మూలవిరాట్ విగ్రహం. స్వామి **ఆనందమయుడని** దీని అంతరార్థం!

**క.** కోరి శరీరులు భవదను, సారంబున నిహపరైక సౌఖ్యంబులఁ బెం
పారఁగ నందుచు నుందురు, ధీరజనోత్తము లనంగ దివిజారిహరా! **1212**

**ప్రతి :** దివిజ+అరి హరా!= దేవతల శత్రువులను (రాక్షసులను)హరించేవాడా!; శరీరులు= శరీరాన్ని ధరించినవారు; భవత్+అనుసారంబునన్= నిన్ను అనుసరించి ఉండడం చేత (పూజించి); ఇహ+పర+ఏక= ఈ లోక, పరలోక మాత్రాలైన;

సౌఖ్యంబులన్= సుఖాల్ని; ధీరజన+ఉత్తములు+అనన్+కన్= ధీరశ్రేష్ఠులని పిలువబడుతూ; పెంపు+ఆరన్+కన్= చాలా సమృద్ధిగా; అందుచున్+ఉందురు= పొందుతుంటారు.

**తా :** ధీరజనులని పేరొందిన కొందరు శరీరధారులు నిన్ను సేవించి, ఇహపరసౌఖ్యాలు పొందుతారు. (వీరుడు వేరు. ధీరుడు వేరు. వీరుడంటే యుద్ధవీరుడు. ధీరులంటే నిశ్చయాత్మమైన బుద్ధి శక్తితో ప్రకాశించే, ఆధ్యాత్మికసాధకులు. వీరు సాధన చేస్తూ పోగా ఒకనాటికి ధీరజనోత్తములవుతారు).

**ఆ. నిన్ను ననుసరింప నేరని కుజనులు, పవనపూర్ణచర్మభస్త్రిసమితి**
**యోజఁ జేయుచుందు రుచ్ఛ్వసనంబులు, బలసి యాత్మదేహభజను లగుచు. 1213**

**ప్రతి :** నిన్నున్= భగవంతుఁడైన నిన్ను; అనుసరింపనేరని= అనుసరించలేని (పూజించని); కుజనులు= చెడ్డవారు; బలసి= మదించి; ఆత్మ= తన; దేహ= శరీరాన్నే; భజనులు+అగుచున్= సేవిస్తూ ఉన్నవారై; ఉత్+శ్వసనంబులు= ఉచ్ఛ్వాసాలు; పవనపూర్ణ= గాలిచే నింపబడిన; చర్మభస్త్రిసమితి= తోలుతిత్తుల సమూహం; ఓజన్= వలె; చేయుచున్+ఉందురు= ప్రవర్తిస్తూంటారు.

**తా :** భగవంతుణ్ణి సేవింపనేరని దుష్టులు తమదేహాల్ని ఉచ్ఛ్వాసనిశ్వాసాలతో నింపుతూ, తోలుతిత్తులై మారి తిరుగుతూ, దేహాన్నే ప్రేమిస్తూ, అదే తమ జీవిత సర్వస్వంగా భావిస్తుంటారు.

**సీ. దేవ! కొందఱు సూక్ష్మదృక్కులై నట్టి మహాత్మకు లుదరస్థుఁడైన వహ్ని**
**గా మదిఁ దలఁతురు కైకొని మఱికొంద, ఆరుణు లనుపేర నమరు ఋషులు**
**లీల సుషుమ్నానాడీ మార్గగతుఁడవై, హృత్ప్రదేశమునఁ జరించుచున్న**
**రుచి దహరాకాశరూపిగా భావింతు, రట్టి హృత్పద్మంబునందు వెడలి**

**తే. వితతమూర్ధన్య నాడికాగతుల నోలి, బ్రహ్మరంధ్రంబుఁ బ్రాపించి పరమపురుష!**
**సుమహితానందమయపరంజ్యోతిరూపి, వైన నినుఁ బొంది మఱి పుట్ట రవనియందు. 1214**

**ప్రతి :** దేవ= ప్రభూ! కొందఱు= కొంతమంది; సూక్ష్మ దృక్కులు+ఐనట్టి= సూక్ష్మదర్శనులైనవారు; మహా+ఆత్మకులు= మహానుభావులు; (నిన్ను) ఉదరస్థుడు+ఐన= కడుపులో ఉన్న; వహ్ని= అగ్నిగా; మదిన్+తలతురు= మనసులో భావిస్తారు; మఱికొందఱు= ఇంకా కొంతమంది; ఆరుణులు+అను పేరన్+అమరు ఋషులు= ఆరుణులు అను నామంతో ప్రసిద్ధులైన మునులు; లీలన్= క్రీడగా; సుషుమ్నానాడీ= సుషమ్న అను పేరుగల నాడియొక్క; మార్గగతుడువు+ఐ= మార్గంలో సంచరించేవాడివై; హృత్+ప్రదేశమునన్= హృదయస్థానంలో; చరించుచున్+ఉన్న= తిరుగాడుతున్న; రుచి+దహర+ఆకాశరూపిగా= ప్రకాశించే దహరాకార రూపునిగా; భావింతురు= కొలుస్తారు; అట్టి; హృత్పద్మంబు+అందున్+వెడలి= అలాంటి హృదయమనే పద్మంలోనుండి బయలుదేరి; వితత మూర్ధన్య= విస్తరించిన; తలపైభాగంలో ఉన్నట్టి; నాడికాగతులన్= నాడీమండలపు నడకలవలె; ఓలిన్= పోలి; పరమపురుష= ఉత్తముడైన పురుషస్వరూపా!; బ్రహ్మరంధ్రము= తలమాడపట్టుపై గల రంధ్రాన్ని; ప్రాపించి= చేరి; సుమహిత+ఆనందమయ= చక్కటి గొప్పదైన ఆనందంతో నిండిన, పరంజ్యోతిరూపివి+ఐన= అతిశ్రేష్ఠమైన కాంతిరూపుడవైన; నిన్ను చేరి= నీ పదాన్ని (స్థానాన్ని) (కైవల్యస్థితిని అంది); మరి పుట్టరు= తిరిగి జన్మను పొందరు (ముక్తులౌతారు).

**తా :** దేవా! సూక్ష్మదర్శనులైన మహానుభావులు కొందరు నిన్ను జఠరాగ్ని స్వరూపుడివి అని భావిస్తారు. ఆరుణులనే ఋషులు నిన్ను సుషుమ్నానాడీద్వారంలో సంచరిస్తూ హృదయస్థ సూక్ష్మరూపిగా నిన్ను భావిస్తారు. హృదయపద్మంనుండి వెడలి, బ్రహ్మరంధ్రానిచేరి పరమకాంతిరూపుడిగా నిన్ను ధ్యానించి నీలో లీనమై మోక్షంపొంది, జన్మరహితులు అవుతారు.

**విశే : ఉదరస్థుడైనవహ్ని –** వహ్ని అండే అగ్ని. ఇది వైదికమైన త్రేతాగ్నులకంటే వేరైంది.

ఉదరస్థమైన అగ్ని – జఠరాగ్ని (వైశ్వానరాగ్ని)

ఈ 'జఠరాగ్ని'యే మానవులు తినే వివిధాలైన ఆహారపదార్థాలను జీర్ణంచేసి శరీరానికి శక్తినిచ్చేవిధంగా పనిచేసే అగ్ని. ఆకలికావడానికి కూడా ఈ అగ్నియే మూలకారణం. జఠరాగ్నికే 'వైశ్వానరాగ్ని' అని కూడా పేరు. సృష్టిలో ప్రతి ప్రాణి ఉదరంలో జఠరాగ్నిరూపంగా ఉండేవాడే 'వైశ్వానరాగ్ని'.

**వ. మఱియు వివిధకాష్ఠాంతర్గతుం డయిన వాయుసఖుండు తద్గత దోషంబునం బొరయక నిత్య శుద్ధుండై తరతమభావంబున వర్తించుచందంబున స్వసంకల్పకృతంబు లయిన విచిత్రశరీరంబులయందు నంతర్యామివై ప్రవేశించి, తత్తద్విచిత్రయోనిగతంబైన హేయంబులం బొరయక సకలాత్మసమంబై బ్రహ్మంబయిన నిన్ను నైహికాముష్మికఫలసంగమంబు లేక విగతరజోగుణంబులం దగిలి కొందఱు భజియించుచుండుదు; రదియునుం గాక దేవా! భవదీయసంకల్పాధీనంబు లయిన శరీరంబులం బ్రవేశించియున్న జీవసమూహంబు నీకు శేషభూతం బని తెలిసి కొందఱు భవనివారకంబయిన శ్రీమత్త్వచ్చరణారవిందంబులు సేవించి కృతార్థు లగుదురు; మఱియును. 1215**

**ప్రతి :** మఱియును= ఇంకా; వివిధ కాష్ఠ+అంతర్గతుండు+అయిన= రకరకాల కట్టెలలో ఉండిఉన్న; వాయుసఖుండు= వాయువుకు మిత్రుడైన అగ్నిదేవుడు; తద్+గత దోషంబునన్= ఆ కర్రలలోని దోషాల్ని; పొరయక= పొందక (అంటక); నిత్యశుద్ధుండు+ఐ= ప్రతిక్షణ పరిశుద్ధుడై; వర్తించుచందంబునన్= ప్రవర్తించే విధానంతో; స్వసంకల్ప కృతంబులు+అయిన= నీ (తన) సంకల్పంచేత చేయబడినవైన (సృజింపబడిన); విచిత్ర శరీరంబుల+అందున్= చిత్రవిచిత్రాలైన జీవులందు; అంతర్యామివై= లోపల సంచరించేవిధంగా; ప్రవేశించి= జీవుల ఆత్మలలో ప్రవేశించి; తద్+విచిత్ర యోనిగతంబు+ఐన= ఆయా చిత్రములైన జీవులగర్భాలలో; హేయంబులన్+పొరయక= గర్భస్థ శిశువు గడపవలసిన అతిహీనమైన అసహ్యమైన స్థితిని అంటకుండా; సకల+ఆత్మ సమంబు+ఐ= అన్ని ప్రాణులలో సమానమై; బ్రహ్మంబు+అయిన= భగవద్రూపమైన నిన్ను; ఐహిక+ఆముష్మిక= ఇహ (ఈ) లోకానికి; పరలోకానికి సంబంధించిన; ఫలసంగమంబు లేక= ప్రాప్తి (ఫలము) సంబంధంలేక; విగత రజస్+గుణములన్+తగిలి= రజోగుణాదుల్ని వదలి నిర్గుణస్థితిని స్వీకరించి; కొందరు భజియించుచున్+ఉండుదురు= కొందరు వ్యక్తులు సేవిస్తుంటారు; అదియునున్+కాక= అంతేకాక; దేవా!= ఓ ప్రభూ! భవదీయసంకల్ప+అధీనంబులు+అయిన= నీయొక్క సంకల్పాలకు లోబడిఉండే; శరీరంబులన్+ప్రవేశించి+ఉన్న= శరీరాల్లో చొచ్చి ఉన్నట్టి; జీవసమూహంబు= జీవకోటి (నీ అధీనంలోని) నీకు శేషభూతంబు= నీకు మిగిలిఉన్న నీ (భూత) అంశ అని; తెలిసి= జ్ఞానంపొంది; కొందఱు= మరికొందరు; భవనివారకంబు+అయిన= పుట్టుకను తప్పించగలిగే; త్వత్= నీ యొక్క; శ్రీమత్= శ్రీమంతంబైన (మంగళకరమైన); చరణ+అరవిందంబులు= పాదపద్మాలు; సేవించి= భజించి; కృత+అర్థులు= తీర్చబడినకోర్కెలు కలవారు; అగుదురు= ఔతారు; మరియును= ఇంకా...

**తా :** దేవా! కట్టెల్లో ఉండే అంతర్గతుడైన అగ్నిదేవుడు, కర్రలలోని దోషాలకు అతీతంతా పరిశుద్ధంగా ఎలా ఉంటాడో అలా నీ సంకల్పంచేత సృష్టించబడ్డ ఈ జీవరాశుల్లో వాటి లోపాలతో సంబంధంలేక అంతర్యామిగా (జీవాత్మల్లో) నెలకొని, వాటి వాటి జన్మాదికాల సమయంలో గర్భంలోని రోతల్ని అంటకుండా ఉంటూ, సకల జీవరాశి ఆత్మలపట్ల సముడవైన బ్రహ్మగా నిన్ను గుర్తించి, ఇహపరాల్లోని ఫలాలతో నిమిత్తంలేక రజోగుణ భిన్నులై ఉంటూ నిన్ను సేవించేవారు కొందరు. నీ సంకల్పానికి అధీనంగా ఉండే శరీరాల్లో జీవకోటిని నీ మహద్భూతాంశగా భావించి నీ చరణారవిందాల్ని కొలిచి జన్మమృత్యు బంధచక్రాన్ని తప్పించుకొని, కృతార్థులయ్యేవారు మరికొందరు.

**సీ. అనఘ! దుర్గమమైన యాత్మతత్త్వంబు ప్రవర్తించుకొఱకు దివ్యంబులైన**
**యంచిత రామకృష్ణాద్యవతారముల్ భజియించియున్న నీ భవ్యచరిత**
**మను సుధాంభోనిధి నవగాహనము సేసి విశ్రాంతచిత్తులై వెలయుచుండి**
**మోక్షంబు బుద్ధి నపేక్షింప నొల్లరు మఱియుఁ గొందఱు భవచ్చరణపంక**

**ఆ. జములఁ దగిలి పుణ్యతము లైన హంసల, వడుపు నొంది భాగవతజనముల**
**నొనరువారు ప్రకటయోగిజనప్రాప్య, మైన ముక్తిఁ గోర రాత్మలందు. 1216**

**ప్రతి :** అనఘ!= పవిత్రుడా!; దుర్+గమము+ఐన= చరింపలేనిదైన; (అర్థంకాని); ఆత్మతత్త్వంబు= నీ స్వభావం (భగవల్లక్షణం); ప్రవర్తించుకొఱకున్= వ్యక్తమయ్యేటందుకు; దివ్యంబులు+ఐన= మహిమలుగలవైన; అంచిత= ఒప్పుతన్న; రామకృష్ణ+ఆది+అవతారముల్= రాముడు, కృష్ణుడు మొ॥ అవతారాలు, భజియించి+ఉన్న= పొందున్న; నీ, భవ్య చరితము+అను= నీయొక్క గొప్పచరిత్ర అనే; సుధా+అంభస్+నిధిన్= అమృతసముద్రంలో; అవగాహనము+చేసి= స్నానమాడి; విశ్రాంతచిత్తులై= ప్రశాంతమైన బుద్ధితో; వెలయుచున్+ఉండి= ప్రకాశిస్తూ; బుద్ధి= మనస్సులో; మోక్షంబున్+అపేక్షింపన్= ముక్తిని కోరుటను; ఒల్లరు= అంగీకరించరు. మఱియు కొందఱు= ఇంకా కొందరు; భవత్+చరణ పంకజములన్+తగిలి= నీయొక్క పాదపద్మాలపై మనసు నిలిపి; పుణ్యతములు+ఐన= పుణ్యశ్రేష్ఠులైన; హంసల వడువున్+ఒంది= పరమ హంస యొక్క విధిని ఆచరించి; భాగవత జనములన్= భగవద్భక్తుల్ని; ఒనరువారు= పొందేవారు; ప్రకటయోగిజనప్రాప్యము+ఐన= ప్రసిద్ధమైన, యోగులకు పొందదగిన; ముక్తిన్= మోక్షాన్ని; ఆత్మల+అందున్= తమలో; కోరరు= ఆశించరు.

**తా :** పరమాత్మా! నీ లక్షణము సులభంగా అర్థంకాదు. అర్థం కావడం కోసం రామ, కృష్ణాది అవతారాల్ని సేవిస్తుంటారు. ఆ అవతారగాథల కథామృతంలో ఓలలాడిన ప్రశాంత చిత్తులు వేరే మోక్షంకోరరు. మరికొందరు పుణ్యాత్ములైన యోగులు ఆచరించినట్టు నీ పాదపద్మాలపై మనసులగ్నంచేసి భక్తుల్ని ఆరాధిస్తారు గాని మోక్షం కోరరు.

**విశే :** భగవత్కథామృతం, భాగవతులసేవనం మోక్షంకంటె శ్రేష్ఠాలని తాత్పర్యం.

**ఉ. కొందఱు నీ శరీరము లకుంఠితభక్తి భవద్వశంబులై**
**చెందఁగ నీ పదాబ్జములు సేరి భజించుచుఁ దత్సుఖాత్ములై**
**యుందురు కొంద ఱీ తనువు లోలి ధరించి భవత్పదాబ్జముల్**
**పొందుగఁ గొల్వలేక నిలఁ బుట్టుచుఁ జచ్చుచు నుందు రవ్యయా! 1217**

**ప్రతి :** అవ్యయా= నాశంలేనివాడా (భగవంతుడా)!; కొందరు= కొందరు సాధకులు; ఈ శరీరములు= ఈ దేహాలు; అకుంఠితభక్తిన్= మొక్కవోని భక్తిచే; భవత్+వశంబులు+ఐ= నీకు సమర్పించినవై; చెందన్+కన్= వసింపగా; నీపద+అబ్జములు= నీ పాదపద్మాలను; చేరి= చేరుకొని; భజించుచున్= ఆరాధిస్తూ; తత్+సుఖ+ఆత్ములు+ఐ= ఆ ఆరాధనవల్ల లభించే ఆనందం పొందినవారై; ఉందురు= జీవిస్తారు; కొందఱు= ఇంకొందరు జీవులు; ఈ తనువులు= ఈ శరీరాల్ని; ఓలి= క్రమంగా; ధరించి= స్వీకరించి; భవత్+పద+అప్+జ+ములు= నీ పాదపద్మాల్ని; పొందు+కన్= నియమంగా; కొల్వలేక= పూజించక; ఇలన్+పుట్టుచున్+చచ్చుచున్= భూమిపై జనన, మరణాలు పొందుతూ; ఉందురు= జీవిస్తారు.

**తా :** నిత్యుడవైన ఓ స్వామీ! ఈ భూమిపై కొందరు గొప్ప భక్తిచే తమదేహాలు నీకు అర్పణచేసి, నీ పాదాలు అర్చిస్తూ, పరమానందంతో జీవిస్తారు. మరికొందరుమాత్రం, నిన్ను పూజించక, వ్యర్థంగా జీవిస్తూ అనేక జన్మలు పొంది, అనేక దేహాలతో బాధలు అనుభవిస్తూ ఉంటారు.

**చ. యమ నియమాది యోగమహితాత్మకులైన మునీంద్రులున్ విరో**
**ధమునఁ దలంచు చైద్యవసుధావర ముఖ్యనృపుల్ ఫణీంద్ర భో**
**గము లన నొప్పు బాహువులు గల్గిన నిన్ను భజించు గోపికల్**
**క్రమమున నేమునున్ సరియ కామె భవత్కృప కంబుజోదరా! 1218**

**ప్రతి :** అంబుజ+ఉదర= కమలం ఉదరంలో గలవాడా విష్ణూ!; యమ, నియమ+ఆది= యమం నియమం-మొదలైన ఇంద్రియ నిగ్రహాల్ని పాటించి; యోగమహిత+ఆత్మకులు+ఐన= యోగం చేత మహానుభావులు ఐన; ముని+ఇంద్రులు= మునిశ్రేష్ఠులు; విరోధమునన్= శత్రుభావంతో; తలంచు= జపించే (నిత్యం స్మరించే); చైద్య వసుధావర ముఖ్యులు= చేది దేశాధిపతి శిశుపాలుడు మొదలైన రాజశ్రేష్ఠులు; ఫణి+ఇంద్ర, భోగములు+అన= శ్రేష్ఠమైన నాగజాతిసర్పముల పడగలవంటి; బాహువులు కల్గిన= చేతులు కలిగిన; నిన్నున్= నిన్ను; భజించు= ప్రేమతో కొల్చే; గోపికల్= గోపస్త్రీలు, ఏమునున్= మేముకూడా; క్రమమున= వరుసగా; భవత్కృపకు= నీ దయకు; సరియకామె= సరికామా!

**తా :** జితేంద్రియులు, యోగులు ఐన ముని శ్రేష్ఠులూ; విరోధభావంతో నిత్యం స్మరించే శిశుపాలాది శత్రువులూ; పాముల పడగలవంటి లేత చేతులతో నిన్ను నిత్యం కౌగిలించుకొని ప్రేమలు కురిపించే గోపికలూ; మేమూ, అందరం నీ కృపకు పాత్రులమేగదా! (జపం, తపం, యోగం, భక్తి, వైరం, ప్రేమ - ఏ రూపంలోలైనా నిన్ను ఆరాధిస్తే నీ కృప లభిస్తుంది.)

**మ. అరవిందాక్ష! భవత్స్వరూప మిలఁ బ్రత్యక్షంబునం గాన నె**
**వ్వరికిం బోలదు, శాస్త్రగోచరుఁడవై వర్తింతు, వీ సృష్టి ముం**
**దర సద్రూపుఁడవైన నీ వలననే ధాత్ర్యాద్యమర్త్యుల్ జనిం**
**చిరి, ని న్నంతకు మున్నెఱుంగఁగలమే చింతింప నే మచ్యుతా! 1219**

**ప్రతి :** అరవింద+అక్ష!= పద్మాక్షా! భవత్+స్వరూపము= నీ స్వరూపాన్ని; ఇలన్= భూమిపై; ప్రత్యక్షంబునన్= కన్నులతో; కానన్+ఎవ్వరికిన్+పోలదు= చూడడానికి ఎవరికైనా అసాధ్యమే; (నీవు) శాస్త్రగోచరుండవు+ఐ= శాస్త్రాలు (దర్శన శాస్త్రాలు) చెప్పే విధంగా కనబడుతూ; వర్తింతువు= ప్రవర్తిస్తావు; ఈ సృష్టిముందర= ఈ జగత్సృష్టికి ముందు కాలంలో; ధాతృ+ఆది+అమర్త్యుల్= బ్రహ్మమొదలుగాగల దేవతలు; సత్+రూపుడవు+ఐన= శాశ్వతమూర్తివైన; నీ వలనన్+ఎ=

నీ కారణంగానే; జనించిరి= పుట్టారు; నిన్నున్= భగవంతుడవైన నిన్ను; అచ్యుతా!= శ్రీకృష్ణా! చింతింపన్= ఆలోచించగా; అంతకు మున్ను= బ్రహ్మాదులకు ముందు (నీ స్వరూపాన్ని); ఎఱుంగన్+కలము+ఏ= తెలుసుకోగలమా?

**తా :** ఓ పద్మాక్షా! నీ సహజస్వరూపాన్ని ప్రత్యక్షంగా చూడడం ఎవ్వరికీ సాధ్యంకాదు. శాస్త్రాలు వివేచించి, విశ్లేషించి, సమన్వయించి నీ గుణగణ ప్రవర్తనాదుల్ని కొంత తెలిసేట్లుగా చేస్తున్నాయి. ఈ సృష్టి పుట్టకముందే నీవొక రూపాన్ని ధరించగా బ్రహ్మాది దేవతలందరూ అందుండి జన్మించారు. ఆ సృష్టికి పూర్వం నువ్వెలా ఉండేవాడివో, ఏ కొంతైనా నీ విశేష రూపరేఖావిలాసాదులేవో మేము ఊహించగలమా? మేము చ్యుతులం. నీవు చ్యుతిలేనివాడివి. నీ రూపస్థితి వాక్కులకూ, మనస్సుకూ అతీతమైనది. అది ఆత్మకుమాత్రమే గోచరిస్తుంది.

**వ. అట్టి నిన్నుం బరమాణుకారణవాదులైన కణాదగౌతమాదులును, బ్రకృతికారణవాదు లయిన సాంఖ్యులును, దేహాత్మవాదు లయిన బౌద్ధులును, వివిధంబులైన కుతర్కంబులచేతం బరస్పరావ్యాహతంబులైన మతంబులు దమ తమ కుతర్కవాదంబుల సమర్థించుచు నిన్నుం దెలియలేరు; మహాభాగ్యవంతు లయిన యోగీంద్రులకు నీవు ప్రత్యక్షంబైన నివి యన్నియు నసత్యంబు లని కానవచ్చు. వెండియుఁ గొందఱు సచరాచర వస్తుజాతంబులకు నంతర్యామివై సర్వంబు నీవ యగుటం దెలియలేక నిత్యం బనియు, ననిత్యం బనియు విపరీతబుద్ధిం దెలియుదురు; గాని భవదీయ దివ్యతత్త్వంబు నిక్కంబుగఁ దెలియనేరరు; కొందఱు జగచ్ఛరీరుండవు గాన జగద్రూపకుండవైన నిన్నుం గటక మకుట కర్ణికాది వివిధ భూషణభేదంబులం గనకంబు నిజస్వరూపంబు విడువక వర్తించుచందంబున జగద్వికారానుగతుండ వయ్యును నిఖిల హేయప్రత్యనీక కల్యాణగుణాత్మకుండవై యుందు వని యాత్మవిదులయిన వారు దెలియుదు; రదియునుం గాక.** **1220**

**ప్రతి :** అట్టినిన్నున్= అలాంటితత్త్వంగల నిన్ను; పరమ+అణు+కారణవాదులు+ఐన= పరమాణువులే సృష్టికి కారణం (భగవంతుడు అనేవాడొకడు సృష్టించడు) అని భావించి వాదించే; కణ్వ, గౌతములు= కణ్వ మహర్షి, గౌతమమహర్షి మొ॥ వారు; ప్రకృతి కారణవాదులు+ఐన= ప్రకృతే స్వయంభువు అని దానినుండే సర్వోత్పత్తి అనే భావించే; సాంఖ్యులును= సాంఖ్యమనే దర్శనశాస్త్రం నిర్మించిన కపిలాది మహర్షులూ; దేహ+ఆత్మవాదులు+అయిన= దేహమనేదే (ఈ జన్మలోని ఆత్మ) తప్ప పరమాత్మ మరొకరు ఉండరని వాదించే; బౌద్ధులును= బౌద్ధమతం (బుద్ధుడు, అతని అనుయాయులు) వారూ; వివిధంబులు+ఐన= పలురకాలు ఐన; కు-తర్కంబులచేతన్= తప్పుడు వాదనలతో; సమర్థించుచున్= తమ తమ సిద్ధాంతాల్ని బలపరుస్తూ ఉంటారు; నిన్నున్+తెలియలేరు= నిన్ను కనుగొనలేరు; మహాభాగ్యవంతులయిన= మిక్కిలి అదృష్టశాలురైన; యోగి+ఇంద్రులకున్= శ్రేష్ఠులైన యోగులకు; నీవు, ప్రతి+అక్షంబు+ఐన= కన్నులకు కనబడుచున్నావు కనుక; ఇవి+అన్నియున్= పైసిద్ధాంతాలన్నీ; అసత్యంబులు+అని= అబద్ధాలని; కానవచ్చును= తేల్తాయి; వెండియున్= ఇంకా; కొందరు= స, చర+అచర వస్తు జాతంబులకున్= కదిలే, కదలలేని (ప్రాణి, అప్రాణి) వస్తువులతో కూడినవాడికి; అంతర్+యామివి+ఐ= లోపల తిరుగాడేవాడివై; సర్వంబు నీవు+అ= సమస్తం నీవే; అగుటన్+తెలియకలేక= అయి ఉన్నావనడం తెలుసుకోలేక; నిత్యంబు+అనియున్= కొన్ని శాశ్వతాలు అనీ; అనిత్యంబు+అనియున్= కొన్ని అశాశ్వతాలు అనీ; విపరీత బుద్ధిన్= వ్యతిరేకమైన తెలివితేటలతో; తెలియుదురు= భావిస్తారు; కాని; భవదీయ= నీయొక్క; దివ్య తత్+త్వము= గొప్పదైన ఆ లక్షణాన్ని; నిక్కంబు+కన్= నిజంగా; తెలియనేరరు= తెలుసుకోలేరు; కొందరు ఆత్మవిదులు+

అయినవారు= కొందరు ఆత్మతత్త్వాన్ని (జీవాత్మ, పరమాత్మల ఐక్యలక్షణాన్ని) తెలిసినవారు; జగత్+శరీరుండవు కాన= జగత్తే శరీరంగా అనగా జగత్తు అంతా నీవై నిండినవాడివి కనుక; జగత్+రూపకుండవు+ఐన నిన్నున్= జగత్తులోని ప్రతిపదార్థం నీ రూపమేకనుక నిన్ను; కటక, మకుట; కర్ణికా+ఆది= కడియాలు, కిరీటాలు, చెవికుండలాలు మొదలైన; వివిధ భూషణ భేదంబులన్= పలురకముల ఆభరణాల తేడాల్తో – కనకంబు= బంగారం (అన్నిటిలో); నిజస్వరూపంబు విడువక= తనదైన రూపాన్ని వదిలిపెట్టక; వర్తించు చందంబునన్= ఉన్నవిధంగా; జగత్+వికార+అనుగతుండవు+ అయ్యునున్= ప్రపంచంలోని వివిధఆకృతులలో వాటిరూపంగా ఉంటున్నప్పటికీ; నిఖిల, హేయ; ప్రతి+అనీక, కల్యాణం, గుణ+ఆత్మకుండవు+ఐ నిఖిల= సమస్తమైన; హేయగుణ= అసహ్యలక్షణాలతో; ప్రత్యనీకగుణ= శత్రుగుణ; కల్యాణగుణ= శుభకరమైన గుణాలతో; ఉందు వని= ఆయాపదార్థాల స్వభావోచితమై ఉంటావని; ఆత్మవిదులు+అయినవారు= భగవదాత్మాంశమే తాము అని తెలిసినవారు; తెలియుదురు= అర్థంచేసుకొంటారు; అదియునున్+కాక= అంతేకాక...

**తా :** సకలచరాచర జగత్స్వరూపుడవైన నిన్ను అర్థం చేసుకోక, ఈ సృష్టికి (నీవుకాక) పరమాణువులే కారణమని చెప్పే కణ్వ, గౌతమాది పరమాణు సిద్ధాంతకారులూ, ప్రకృతియే తనకుతానుగా పుట్టిందని, దానినుండే సృష్టి అంతా పుట్టిందనీ భావించే కపిలాది సాంఖ్యసిద్ధాంతకారులూ, దేహమేతప్ప పరమాత్మ, పరలోకాదులూ ఉండవనే బౌద్ధులూ మొదలైన వారు తప్పుడు వాదనలతో తమసిద్ధాంతాల్ని సమర్థించుకొంటూ, నిన్ను తెలియలేరు. అదృష్టవంతులైన యోగులుమాత్రమే నిన్ను దర్శించగల్గుతున్నారు. వారికినీవు ప్రత్యక్షం అవుతావు కనుక పైవారి సిద్ధాంతాలు అబద్ధాలు అని తేలుతున్నాయి. సకల చరాచరవస్తుజాతంలో అంతర్యామిగా నీవు ఉన్నావని తెలియక కొన్ని శాశ్వతాలు, కొన్ని అశాశ్వతాలు అని విపరీత బుద్ధితో యోచించే కొందరు నీ దివ్యతత్త్వాన్ని అర్థంచేసుకోలేరు. జగత్తే శరీరంగా ఉండీ; నిన్ను గూర్చి – కడియాలు, కిరీటాలు, కుండలాలు అంటూ వివిధ రూపాలుగా ఉన్నా, వాటిలో అన్నిటా బంగారమే ఉన్నట్టు – నీవు కూడా జగత్తులోని ప్రాణులన్నిటిలో అవి హేయంగా ఉన్నా, శత్రుభావంతో ఉన్నా, శుభంకరంగా ఉన్నా అన్నిటా నీవే ఉన్నావని భగవతత్త్వాన్ని తెలుసుకొన్న జ్ఞానులు అనుభవపూర్వకంగా గ్రహిస్తారు.

**మ. వనజాతాక్ష ! భవత్పదాబ్జయుగసేవాసక్తులై నట్టి య**
**జ్జనముల్ మృత్యుశిరంబుఁ దన్ని ఘనసంసారాంబుధిన్ దాఁటి పా**
**వనులై లోకములుం బవిత్రములుగా వర్తించుచున్ నిత్య శో**
**భనమై యొప్పెడి ముక్తిఁ బొందుదురు శుంభద్వైభవోపేతులై. 1221**

**ప్రతి :** వనజాత+అక్ష= కమలములవంటి కన్నులు కలవాడా! భవత్= నీయొక్క; పద+అబ్జయుగ= పాదపద్మాల జంటను; సేవ+ఆసక్తులు+ఐన+అట్టి= సేవించుటలో ఆసక్తికలిగినట్టి; యత్+జనముల్= ఏ జనులైతే ఉన్నారో వారు; మృత్యు శిరంబున్= మృత్యువుతలను తన్ని= తన్ని; అనగా తిరస్కరించి; ఘనసంసార+అంబుధిన్= గొప్పదైన సంసారమనే సముద్రాన్ని; దాటి= తరించి; పావనులు+ఐ= పవిత్రులై; లోకములున్= లోకాలన్నీ; పవిత్రములు+కాన్= పావనములయ్యేలా; వర్తించుచున్= నడుస్తూ; నిత్య= ప్రతిక్షణం; శోభనము+ఐ= శుభకరమై; ఒప్పెడి= నిలిచే; శుంభత్= ప్రకాశించే; వైభవ+ఉపేతులు+ఐ= విభవాలతో కూడుకొన్నవారై; ముక్తిన్+పొందుదురు= మోక్షం పొందుతారు.

**తా :** ఓ కృష్ణా! నీ పాదపద్మారాధనతో నిరంతర సేవకులైన భక్తులు మృత్యువును తిరస్కరించి, సంసారమహాసముద్రాన్ని దాటి, పవిత్రులై లోకాలన్నీ పవిత్రంచేసే ప్రవర్తనలతో నిత్యశోభనకరమైన మోక్షాన్ని పొందుతారు.

**విశే :** మృత్యువును తిరస్కరించి, సంసారసాగరాన్ని దాటి, పవిత్ర జీవనంతో లోకాన్ని పునీతం చేస్తూ ఏకొందరో పుణ్యాత్ములు నిత్యశోభనమైన ముక్తిని గొప్ప వైభవంతో పొందుతున్నారట! వారు భగవత్పదయుగ నిరంతర సేవాసక్తులు! ఇటువంటివారే జీవన్ముక్తులు.

**మ. మిము సద్భక్తి భజింప నొల్ల కిల దుర్మేధం బ్రవర్తించు నీ**
**చ మతివ్రాతము నేర్పునం బసులఁ బాశశ్రేణి బంధించు చం**
**దమునం బెక్కగు నామరూపములచేతన్ వారి బంధించి దు**
**ర్గమ సంసారపయోధిఁ ద్రోతువు దళత్కంజాతపత్త్రేక్షణా! 1222**

**ప్రతి :** దళత= చక్కగా వికసించిన; కంజాతపత్ర= తామర రేకులవంటి; ఈక్షణా!= కన్నులు గలవాడా! (ఓ పద్మాక్షా!); మిమున్= మిమ్ము; సత్+భక్తిన్= చక్కని భక్తితో; భజింపన్+ఒల్లక= సేవించడానికి ఇష్టపడక; ఇల్= భూమిపై; దుర్+మేధన్= చెడ్డబుద్ధితో; ప్రవర్తించు= నడచుకొనే; నీచమతి= నీచపు బుద్ధులుగలవారి; వ్రాతము= సమూహాన్ని; నేర్పునన్= కౌశలంతో; పసులన్= జంతువుల్ని; పాశశ్రేణిన్= తాళ్లసమూహంతో; బంధించు చందంబునన్= కట్టివేసే విధంగా; పెక్కు+అగు= అనేకమైన; నామరూపముల చేతన్= పేర్లతో, దేహాలతో (నామ రూపాలు ఇచ్చి); వారిన్+ బంధించి= వారిని (భవబంధాలలో) బంధించి; దుర్+గమ= దాటరాని; సంసారపయోధిన్= సంసారసాగరంలో; త్రోతువు= తోస్తూ ఉంటావు.

**తా :** నిన్ను తిరస్కరించి, పూజించని హీనమతులను-జంతువుల్ని తాళ్లతో బంధించినట్లు-భవబంధాలరూపంలో బంధించి, అనేక నామాలు, దేహాలు (జన్మలు) ఇచ్చి దాటశక్యంగాని సంసారసముద్రంలో పడవేస్తావు.

**వ. దేవా! కర్మమూలంబులయిన పాణిపాదంబులు లేనివాఁడ వయ్యును స్వతంత్రుఁడవు గావున బ్రహ్మాదులు భవత్పరతంత్రులై యుండుదురు; స్థిరచరరూపంబులు గల చేతనకోటికి నీవు సర్వవిధ నియంతవు; గావున నీ కృపావలోకనంబుగల వారికి మోక్షంబు కరస్థితం బై యుండు; భవత్కృపావలోకనంబు లేని దుష్టాత్ములు దుర్గతిం గూలుదు; రట్టి జీవులు దేవ తిర్య ఙ్మనుష్య స్థావరాది శరీరంబులు సొచ్చి యణురూపులై యుందు; రందును నీ వంతరాత్మ వగుచు నుందువు; మఱియును. 1223**

**ప్రతి :** దేవా!= స్వామీ! కర్మమూలంబులు+అయిన= వివిధ క్రియాకర్మలకు మూలస్థానమైన; పాణిపాదంబులు= చేతులు, కాళ్లు, లేనివాడవు+అయ్యునున్= లేనట్టి (అశరీరుడవు) వాడివి అయినా; స్వతంత్రుడవు= సర్వాంగధారి అయిన వ్యక్తివలె ఇతరులపై ఆధారపడని స్వతంత్రుడివి; కావునన్= కాబట్టి; బ్రహ్మాదులు= బ్రహ్మమొదలైన దేవతలు; భవత్+పరతంత్రులు+ఐ= నీకు అధీనులై; స్వాధీనంలో; ఉండుదురు= ఉంటారు; స్థిర, చర రూపంబులు+కల= స్థిర (కదలలేని) రూపాలైన గిరులు, మొ॥; చర (కదిలే) రూపాలైన ప్రాణివృక్షాదులు, గల, చేతనకోటికిన్= చైతన్య రూప సమూహాలకు; నీవు; సర్వవిధ నియంతవు= అన్ని విధాలుగా (జన్మాది మృత్యుపర్యంతం) నియంత్రించువాడివి; కావున; నీ కృపా+అవలోకనంబు+ కలవారికిన్= నీ దయతోకూడిన చూపులు పొందేవారికి; మోక్షంబు= ముక్తి; కర-స్థితంబు+ఐ+ఉండున్= (కరతలామలకమే); భవత్+కృప+అవలోకనంబులేని= నీ దయాదృష్టిలేని; దుష్ట+ఆత్ములు= దుర్మార్గులు; దుర్+గతిన్+కూలుదురు= నరకాదిలోకాల్లో పడతారు; అట్టిజీవులు= ముక్తిలభించని ఆ ప్రాణులు; దేవ తిర్యక్+మనుష్య స్థావర+ఆది= దేవతలు, పశువులు, పక్షులు, మనుషులు, కదలని చెట్లు, కొండలు మున్నగు; శరీరంబులు= దేహాలలో; చొచ్చి= ప్రవేశించి;

అణురూపులు+ఐ+ఉందురు= సూక్ష్మరూపంలో ఉంటారు; అందునున్= ఆ సూక్ష్మరూపులలోకూడా; నీవు+అంతర్+ఆత్మవు+అగుచున్= నీవు లోపల నివసిస్తూ; ఉందువు= ఉంటావు; మఱియును= ఇంకా...

**తా :** క్రియాకర్మాదులు, తదంగాలు లేకున్నా, అశరీరుడవైనా నీవు స్వతంత్రమూర్తివి. బ్రహ్మాదులు నీ అధీనులు. చరాచరరూపాలకుగల ప్రాణికోటిని నీవు నియంత్రించే అధిపతివి. నీ దయగలవారికి ముక్తి కరతలామలకం. నీ దయలేనివారికి నరకాది దుర్గతులే! వారు వివిధ జాతులలో పుట్టి, అణురూపంలో దేహాల్లో ఉంటారు. వారిలోకూడా నీవు అంతరాత్మవై ఉంటావు.

**విశే : అంతరాత్మ :** ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి – గీత.

భగవంతుడు సర్వ ప్రాణికోటిలో ప్రవేశించి హృదయస్థానంలో కూర్చొని అన్నింటికీ సాక్షియై గమనిస్తుంటాడు.

**క. మదిఁ దలపోయఁగ జల బు, ద్బుదములు ధరఁ బుట్టి పొలియు పోలిక గల యా**
**త్రిదశాదిదేహములలో, వదలక వర్తించు నాత్మవర్గము నోలిన్. 1224**

**ప్రతి :** మదిన్+తలపోయన్+కన్= మనసులో ఆలోచిస్తే; జలబుద్బుదములు= నీటిబుడగలు; ధరన్+పుట్టి= భూమిమీద (నీటిలో) పుట్టి; పొలియు పోలిక+కల= నశించే విధంగా; ఈ త్రిదశ+ఆదిదేహములలో= ఈ దేవ తిర్యక్ మనుష్యాది శరీరాల్లో; వదలక= శరీరం విడువక; వర్తించు= ప్రవర్తించే; ఆత్మవర్గమున్= ఆత్మల సమూహాన్ని; ఓలిన్= వరుసగా...

**తా :** ఆలోచిస్తే – భూమ్మీద నీటిబుడగలు పుట్టి నశిస్తున్నట్టు తాత్కాలికజీవితాలుగా, దేవ మనుష్య తిర్యగాదిదేహాలు అంటిపెట్టుకొని ఉండే ఈ ఆత్మలన్నింటినీ

**ఆ. ప్రళయవేళ నీవు భరియింతు వంతకుఁ, గారణంబ వగుటఁ గమలనాభ!**
**భక్తపారిజాత! భవభూరితిమిర ది, నేశ! దుష్టదైత్యనాశ! కృష్ణ! 1225**

**ప్రతి :** కమలనాభ!= తామరపూవుబొడ్డులో కలవాడా!; భక్తపారిజాత= భక్తులపాలిటి (కోరిన కోరికలు ఇచ్చే) పారిజాత వృక్షమా!; భవ= పుట్టుక అనే; భూరి తిమిర= గొప్పచీకటికి; దిన+ఈశ= సూర్యుడా! దుష్టదైత్యనాశ= దుర్మార్గులైన రాక్షసులను సంహరించేవాడా!; కృష్ణా= ఓ శ్రీకృష్ణా! అంతకున్= అంతటికీ; కారణంబవు+అగుటన్=కారణం అగుటవలన;

**తా :** కృష్ణా! రాక్షససంహారీ! భక్తపారిజాతా! భవబంధవిమోచనా! కమలనాభా! ప్రాణికోటిలోని ఆత్మలన్నింటినీ తిరిగి నీవు ప్రళయకాలంలో నీలో లయింపచేసికొంటావు సృష్టి అంతటికీ నీవే కారణభూతుడవు.

**చ. అనఘ! జితేంద్రియస్ఫురణు లయ్యును జంచలమైన మానసం**
**బను తురగంబు బోధమహితాత్మ వివేకపు నూలిత్రాట న**
**ల్లనఁ గుదియంగఁ బట్టను దలంచుచు ముక్తి కుపాయలాభ మే**
**యనువును లేమికిన్ వగల నందెడు నాత్మలువో తలంపఁగన్. 1226**

**ప్రతి :** అనఘ!= పుణ్యాత్మా! జిత+ఇంద్రియస్ఫురణులు+అయ్యున్= ఇంద్రియాల్ని (కోర్కెలు) జయించామనే స్ఫూర్తికలిగి ఉన్నవారైనా; చంచలము+ఐన= ఇటు అటు తిరిగే (కోర్కెలవైపు పరిగెత్తే); మానసంబు+అను= మనస్సు అనే; తురగంబున్=

గు(ర్రాన్ని; బోధ= ఆత్మజ్ఞానంపొందిన; మహిత+ఆత్మ= గొప్పవైన రూపాలతో; వివేకము= తెలివి అనే; నూలి+(త్రాటన్= నూలుతో చేసిన తాడుతో; అల్లనన్= తిన్నగా; కుదియన్+కన్+పట్టను తలంచుచున్= వశంలోకి తెచ్చుకోవడానికి; పట్టుకోదలచి; (సాధ్యపడక) ముక్తికిన్= మోక్షానికై; ఉపాయలాభము= సాధించే మార్గపు లబ్ధి; ఏ+అనువును= ఏ త్రోవ; లేమికిన్= లేకపోవడాన్ని; తలంపన్+కన్= పరిశీలించగా (ఆలోచించగా); వగలన్+అందెదు= దుఃఖాన్ని పొందేవి; ఆత్మలు+పో!= జీవులే సుమా!

**తా :** ఓ పరమేశ్వరా! ఇంద్రియాల్ని జయించామని అనుకొంటూన్నా - స్థిత ప్రజ్ఞులు కానంతవరకూ-మనస్సు కోరికలతో చలిస్తూనే ఉంటుంది. కనుక స్వతంత్రంగా తిరుగుతూండే గుర్రాన్ని నూలిత్రాడుతో బంధించడం - ఎలా సాధ్యంకాదో అట్లే ఈ చంచలమైన మనస్సును వివేకంతో బంధించి, అధీనంలోకి తెచ్చుకోవాలి, అలా తెచ్చుకోలేకపోతే - మోక్షసాధనకు సరైన ఉపాయం (మార్గం) లభించక మానసికంగా దుఃఖిస్తూనే ఉంటారు.

"చపల స్వభావంతో ఉండేదీ, నిలుకడలేనిదీ, అయిన మనస్సు ఏయే విషయాలపై సంచరిస్తుందో ఆయాచోట్లనుండి దాన్ని మరలించి ఆత్మలోనే స్థాపితం చేయాలి. అంటే ఆత్మకు అధీనంగా చేయాలి" అన్నాడు గీతా ప్రవక్త (6 అధ్యా-26శ్లో).

**చ. గురుపదపంకజాతములు గొల్వని వారలువో మహాబ్ధి ని**
**స్తరణకుఁ గర్ణధారరహితంబగు నావను సంగ్రహించు బే**
**హరి గతి భూరి దుస్తర భవాంబుధిలోన మునుంగుచుందు రం**
**బురుహదళాక్ష! నీవు పరిపూర్ణుఁడవై తనరారఁగా నొగిన్. 1227**

**ప్రతి :** అంబురుహదళ+అక్ష= తామరరేకులవంటి కన్నులు గలవాడా! నీవు; పరిపూర్ణుడవు+ఐ= పూర్ణస్వరూపుడవై; ఒగిన్= చక్కగా; తనరు+ఆరన్+కాన్= ఒప్పుతుండగా, గురు= గొప్పవైన; (నీ)పద పంకజాతములు= నీ పాదపద్మములు; కొలువనివారలు= సేవించనేరనివారు; మహా+అబ్ధి= విశాలసముద్రమును; నిస్+తరణకున్= చక్కగా దాటడానికి; కర్ణధార రహితంబు+అగు= నావనడిపేవాడు లేని; నావను= పడవను; సంగ్రహించు= స్వీకరించే (ప్రయాణించు); బేహరిగతి= వ్యాపారివలె; దుస్+తర= దాటశక్యంకాని; భవ+అంబుధిలోనన్= భవసాగరంలో; మునుగుచున్+ఉందురు= మునిగి పోతారుసుమా!

**తా :** పద్మాక్షా! నీవు పరిపూర్ణుడవై ఉండగా, శ్రేష్ఠములైన నీ పాదపద్మాల్ని కొలువనివారు, చోదకుడులేని పడవనెక్కిన వ్యాపారివలె భవసాగరంలో మునిగిపోతారు సుమా!

**విశే :** గురుశబ్దానికి శ్రేష్ఠమైన అన్నది అర్థం. 'గురువు' అని కాదు. ఈ అధ్యాయమంతా విష్ణుకీర్తనమే. విష్ణువే పరమగురుడు. అతనివే పరమ (గురు) పాదములు. వ్యాపారి వెంబడి అతని సరుకులు, ధనం ఉంటుంది. వాని మునకలోవాడు, సరుకు, ధనం అన్ని పోతాయి.ఎవరెక్కినా మునుగుతారు. వ్యాపారినే ఉదాహరించడం ఇందువల్ల. కనుక అతడు మంచికర్ణధారి (నావికుణ్ణి) ఎంచుకోవాలి. భగవంతుడే మానవజీవిత నౌకాకర్ణధారి!

**తే. పుత్ర దార గృహ క్షేత్ర భూరివిషయ, ఘన సుఖాసక్తుఁ డగుచు నే మనుజుఁ డేని**
**నర్థిఁ జరియించు వాఁడు భవాబ్ధిలోనఁ, జెంది యె న్నాళ్ళకును దరిఁ జేర లేఁడు. 1228**

**ప్రతి :** ఏ మనుజుడు+ఏని= ఎంత గొప్ప మనుష్యుడైనా; పుత్రదారగృహ క్షేత్ర= కొడుకులని, భార్యఅని, ఇల్లని, పొలాలని; భూరివిషయ= గొప్పవైన అంశాలపట్ల; ఘన సుఖ+ఆసక్తుడు+అగుచున్= మిక్కిలిగా సుఖానుభవచిత్తుడై; అర్థిన్= మక్కువతో; చరియించువాడు= ప్రవర్తించేవాడు; భవ+అబ్ధిలోనన్= భవసాగరంలో; చెంది= ఉండి; ఎన్ని+నాళ్లకునున్= ఎన్నాళ్లైనా (ఏండ్లుగడచినా); దరిన్+చేరలేడు= ఒడ్డుకు చేరలేడు (భవబంధాలు తెంచుకోలేడు).

**తా :** నా భార్య, నా కొడుకు, నా ఇల్లు, నా పొలం అంటూ వాటిమీద మమకారం పెంచుకొని, జీవించేవాడు ఈ భవసాగరంనుండి ఎన్నటికీ బయటకు రాలేడు.

**సీ. జగతిపై బహుతీర్థసదనంబు లనఁ గల్గి పుణ్యానువర్తనస్ఫురితు లగుచుఁ**
**బాటించి నీ యందు బద్ధమత్సరములు లేక భక్తామరానోకహంబ**
**వగు భవత్పాదాబ్జయుగళంబు సేవించి భవపాశముల నెల్లఁ బాఱఁదోలి**
**సమమతులై యదృచ్ఛాలాభ తుష మేరు సమముగాఁ గై కొని సాధు లగుచుఁ**

**తే. బాదతీర్థంబు గల మహాభాగవత జ, నోత్తమోత్తము లైనట్టి యోగివరుల**
**వార కెప్పుడు సేవించువాఁడు వొందుఁ, బ్రవిమలానందమయ మోక్షపదము మఱియు. 1229**

**ప్రతి :** జగతిపైన్= భూమిమీద; బహుతీర్థ సదనంబులు+అనన్+కగల్గి= అనేకాలైన తీర్థాలకు నిలయాలు అనేలా; పుణ్య+అనువర్తన స్ఫురితులు+అగుచున్= పుణ్యాలను అనుష్ఠించడంచే (ఇతరులకు) స్ఫూర్తినిచ్చేవారై, బద్ధమత్సరములేక= ఈర్ష్యాదులకు బద్ధులుగాక (లొంగక); నీ+అందున్= నీయందే (భక్తిప్రపత్తి); పాటించి= లక్ష్యంగల్గి; భక్త= భక్తులకు; అమర+అనోకహంబవు= దేవతావృక్షమైన పారిజాతమవు; అయినట్టి; భవత్= నీయొక్క; పాద+అబ్జయుగళంబు= పాదపద్మాలజంటను; సేవించి= ఆరాధించి; భవపాశములు+ఎల్లన్= భవబంధాలు అన్నీ; పాఱన్+తోలి= పరిగెత్తేలా తరిమి; సమమతులు+ఐ= సర్వప్రాణులపట్ల సమభావనకల వారై; యదృచ్ఛాలాభ= ఏది ప్రాప్తమో (లభించిన); ఆ, తుష= ఊక నే; మేరుసమముగాన్= బంగారు పర్వతం లభించినంత తృప్తితో; కై+కొని= స్వీకరించి; సాధులు+అగుచున్= కోపస్వభావంలేనివారవుతూ; పాదతీర్థంబుకల= కాళ్లను నీళ్ళచే కడిగిన; మహాభాగవతజన= గొప్పభక్తులైనవారిలో; ఉత్తమ+ఉత్తములు+ఐనట్టి= శ్రేష్ఠులలో శ్రేష్ఠులైన; యోగివరులన్ వారక= యోగిశ్రేష్ఠుల్ని విడువక; ఎప్పుడున్= ఎల్లవేళలా; సేవించువాడు= ఆరాధించేవాడు; ప్రవిమల+ఆనందమయ= స్వచ్ఛమైన ఆనందంతో కూడిన; మోక్షపదమున్= ముక్తిమార్గాన్ని; పొందున్= పొందుతాడు; మరియు= ఇంకా...

**తా :** శ్రేష్ఠులైన భాగవతులు (భక్తులు) అనేకాలైన పవిత్ర తీర్థాలవలె సేవింపదగినవారు. వారి ఉనికి పవిత్ర తీర్థరాజం. తమ పుణ్యప్రవర్తనలచే ఇతరులకు ఆదర్శమైనవారూ. ఈర్ష్యాదులులేనివారూ, నిన్ను ఆరాధించి భవబంధాలు తొలగినవారూ, ప్రాణికోటిపట్ల సమబుద్ధి కల్గినవారూ, ప్రాప్తించింది అతిహీనమైనా (ఉముక అయినా) బంగారంవలె స్వీకరించి తృప్తిపడేవారూ, కోపతాపాలు లేనివారూ, తమ పాదజలాలు తీర్థంగా గ్రహింపదగిన పుణ్యపాదులు. అటువంటి యోగివరులే సదాసేవ్యులు. వారిని సేవించినవారికి మోక్షపదవి లభిస్తుంది.

**వ. సత్తైన ప్రకృతివలన నుత్పన్నంబైన యీ జగత్తు సత్తు గావలయు; నది యెట్లనినం గనకోత్పన్నంబులైన భూషణంబులు కనకమయంబు లయి కానంబడు చందంబున నని సాంఖ్యుండు వలికిన విని యద్వైతవాది**

యిట్లను; నెయ్యది యుత్పన్నంబుగా దది సత్తును గా; దను వ్యతిరేకవ్యాప్తి నియమంబు నిత్యసత్యం బైన బ్రహ్మంబునందుఁ దర్కహతం బగుం గావునం బ్రపంచంబు మిథ్యయని నిరూపించిన నా ప్రపంచంబు బ్రహ్మవిశేషణంబై కార్య కారణావస్థలు గలిగియున్న యంతమాత్రంబున మిథ్య గా నేర; దా ప్రపంచంబునకుఁ గార్యకారణావస్థలు నిత్యంబులు గావున నవస్థాద్వయయుక్తంబయిన ప్రపంచంబు నిత్యం బనిన వెండియు నద్వైతి యిట్లను; బహుగ్రంథప్రతిపాదితం బయిన జగన్మిథ్యాత్వంబు లేమి యెట్లనిన నదియునుం గర్మవశులైన జడుల నవిద్యా ప్రతిపాదకంబైన కుతర్కసమేతంబైన భారతి యంధపరంపరా వ్యవహారంబునం జేసి భ్రమియింపఁ జేయుఁ; గారణావస్థలయందును బ్రహ్మ విశేషణంబైన సూక్ష్మరూపంబునం బ్రపంచంబు సత్తైయుండు; సత్యంబు బాధాయోగ్యంబు గావున నీకు శేషంబయి యుండుఁ గావున నీవు దేహగతుండైన దేహియందు నంతర్యామి వయ్యుం గర్మఫలంబులం బొరయక గర్మఫలభోక్తయైన జీవునకు సాక్షిభూతంబవై యుందు; నట్టి నిన్ను నజ్ఞులైన మానవులు నిజకంఠలగ్నంబయిన కంఠికామణి నిత్యసన్నిహితంబై వెలుంగుచుండినను గానక వర్తించుతెఱంగునఁ దమహృదయపద్మమధ్యంబున ననంతతేజో విరాజమానుండవై ప్రకాశించు నిన్నుం దెలియలేరు. సకల బ్రహ్మాండ నాయకుండవైన నీయందు శ్రుతులు ముఖ్యవృత్తిం బ్రవర్తించు నని శ్రుత్యధిదేవతలు నారాయణు నభినందించినతెఱంగున సనందనుండు మహర్షుల కెఱింగించిన ప్రకారం బని నారాయణర్షి నారదునకుం జెప్పిన న మ్మహాత్ముండు మజ్జనకుండైన వేదవ్యాస మునీంద్రునకు నుపన్యసించె; న య్యర్థంబు నతండు నాకుం జెప్పిన విధంబున నీకుం జెప్పితి. నీ యుపాఖ్యానంబు సకలవేదశాస్త్రపురాణేతిహాససారం; బుపనిషత్తుల్యంబు; దీనిం బఠించువారునువిను వారును, విగతకల్మషులై యిహపరసౌఖ్యంబుల నొంది వర్తింతు; రని చెప్పిన శుకయోగీంద్రునకు రాజేంద్రుం డిట్లనియె. **1230**

**ప్రతి :** సత్తు+ఐన= సత్యమైన; ప్రకృతివలనన్= సృష్టివల్ల; ఉత్పన్నంబు+ఐన= పుట్టిన; ఈ జగత్తు= ఈ ప్రపంచం అంతా; సత్తుకావలయున్= సత్యమేకావాలి; అది+ఎట్లు+అనినన్= అదెలాగంటే; కనక+ఉత్పన్నంబులు+ఐన భూషణంబులు= బంగారంతో చేయబడిన ఆభరణాలు; కనకమయంబులు+అయి= బంగారంగానే; కానన్+పడుచందంబునన్= కనబడేవిధానంగా అని; సాంఖ్యుండు పలికినన్= సాంఖ్య దర్శనకారుడు వాదించగా; విని; అద్వైతవాది= జీవ, బ్రహ్మలు రెండూ ఒక్కటని వాదించేవాడు; ఇట్లు+అనున్= ఇలా; ఏ+అది+ఉత్పన్నంబు+కాదు= ఏది సృష్టించబడదో; అంటారు; అది సత్తును కాదు= అది సత్యంకాదు; అను; వ్యతిరేకవ్యాప్తి నియమంబు= వ్యతిరేకవ్యాప్తి అని పిలువబడే విధానం; నిత్యసత్యంబు+ఐన= ఎల్లప్పటికీ సత్యం అయిన; బ్రహ్మంబు+అందున్= బ్రహ్మ (భగవంతుని) యందు; తర్కహతంబు+అగున్= తర్క వాదనా విధానం కుప్పకూల్తుంది; కావున; ప్రపంచంబు మిథ్య+అని= ఈ జగత్తు మిథ్య (బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః' అని అద్వైత సిద్ధాంతం) అని; నిరూపించిన= నిరూపించగా; (తిరిగి అద్వైతవాదులకు వ్యతిరేకంగా వాదించేవారు దాన్ని ఖండిస్తూ) ఆ ప్రపంచంబు= ఆ జగత్తు; బ్రహ్మవిశేషణంబు+ఐ= భగవద్విరచితమై; కార్యకారణ+ అవస్థలు= కారణం, భగవంతుడు, కార్యము జగత్తు అనీ రెండు దశలు; కలిగి+ఉన్న+అంత మాత్రమునన్= కల్గినంత మాత్రాన; మిథ్య= అసత్యం కానేరాదు; ఆ ప్రపంచంబునకున్= ఆ జగత్తుకు; కార్యకారణ+అవస్థలు= సృష్టించేది–కారణం;

సృష్టింపబడింది–కార్యం– అనే దశలురెండూ; నిత్యంబులు= ప్రతిక్షణం జరిగేవి; కావున; అవస్థాద్వయ= పైరెండుదశలచే; యుక్తంబు+అయిన= కూడి ఉన్న; ప్రపంచంబు నిత్యంబు+అని= సిద్ధాంతీకరించగా; వెండియున్= మళ్లీ; అద్వైతి= అద్వైతాన్ని వాదించేవాడు; ఇట్లు+అనున్= ఇలా అంటున్నారు; బహుగ్రంథ= అనేక గ్రంథాల్లో; ప్రతిపాదితంబు+అయిన= ప్రతిపాదింపబడిన (ప్రతిష్ఠింపబడిన); జగత్+మిథ్యాత్వం లేమిన్= జగత్తు మిథ్య అనే సిద్ధాంతం లేకపోవుట అనేది; ఎట్లు+అనినన్= ఎలా కుదురుతుందంటే; అదియునున్= అదికూడా; కర్మవశులైన= కర్మలు చేయుటలో మునిగిన; జడులన్= జడులలో; అవిద్యా ప్రతిపాదకంబు+అయిన= అజ్ఞానంచే చెప్పబడిన; కుతర్కసమేతంబు+అయిన= చెడ్డవాదనలతో నిండిన; భారతి= చదువు అంధపరంపరావ్యవహారంబునన్= ఒక గుడ్డివానిసహాయాన్ని తీసుకొని మరొక గుడ్డివాడు నడిచిన విధంగా; చేసి= విధానంలో జరిగి; భ్రమియింపన్+చేయున్= భ్రాంతిని కల్గిస్తుంది; కారణ+అవస్థల+అందును= కారణరూపమైన దశలో; బ్రహ్మవిశేషణంబు+అయిన= భగవంతుని రచనగా (అనుగ్రహంగా); ప్రపంచంబు= జగత్తు; సూక్ష్మరూపంబునన్= అతిలఘు (సూక్ష్మ)రూపంలో; సత్తు= సత్యమై; ఉండున్= ఉంటుంది. (అసత్తు, మిథ్యకాదు); సత్యంబు= ఈ సత్తు బాధాయోగ్యము= బాధించుటకు సరిపడునది (జగత్తు బాధాకారకం, ముక్తి ఆనందదాయకం) కావున; నీకున్= ఓ భగవంతుడా!; నీకు, శేషంబు+అయి+ఉండున్= నీకు సంబంధించినదై మిగిలి ఉంటుంది; (భగవంతుడు శేషి, జీవుడు శేషుడు). కావున; నీవు; దేహగతుండు+ఐన దేహి+అందున్= శరీరస్వరూపంతో ఆచ్ఛాదితమైన ప్రాణి(ఆత్మ)యందు; అంతర్+యామివి+అయ్యున్= లోపల చరించువాడివైనా; కర్మఫలంబులన్+పొరయక= దేహిచేసే కర్మలవల్ల కలిగిన పుణ్యపాప ఫలాలు పొందక; అంటుకొనక; కర్మఫలభోక్త+ఐన= తానుచేసిన కృతాకృతకర్మల ఫలితాలైన పాప, పుణ్యాలను అనుభవించ వలసిన; జీవునకు= ప్రాణికి (ఆత్మకు); సాక్షీభూతంబవు+ఐ= సాక్ష్యంగా నిలిచినవాడవై; ఉందువు; అట్టి నిన్నున్= అలాంటి నిన్ను (భగవంతుని); అజ్ఞులు+ఐన మానవులు= మూర్ఖులు (జ్ఞానశూన్యులైన) మనుష్యులు; నిజ కంఠలగ్నంబు+అయిన= తనమెడకు వేయబడిన; కంఠికామణి= కంఠహారంలోని మణి; నిత్యసన్నిహితంబై= ఎప్పుడూ చాలాదగ్గరగా ఉండి; వెలుగుచున్+ఉండినను= ప్రకాశిస్తూ ఉన్నా; కానక వర్తించు తెఱంగునన్= కనపడకుండా ప్రవర్తించేవిధంగా; తమ హృదయ పద్మమధ్యంబునన్= తమ పద్మాలవంటి హృదయాలనడుమ; అనంత తేజో విరాజమానుండవు+ఐ= అంతులేని తేజస్సుచే వెలిగేవాడవై; ప్రకాశించు= మెరుస్తూఉన్న; నిన్నున్+తెలియలేరు= నిన్ను చూడలేరు; సకల బ్రహ్మ+అండ నాయకుండవు+ఐన= సమస్తలోకాలకూ అధినాథుడవు ఐన; నీ+అందున్= నీలో; శ్రుతులు= వేదాలు; ముఖ్యవృత్తిన్= విశిష్టమైన అర్థవివరణ వృత్తిలో; ప్రవర్తించున్+అని= పనిచేస్తాయి అని; శ్రుతి+అధిదేవతలు= వేదరూపులయిన అధిష్ఠానదేవతలు; నారాయణున్+అభినందించిన= శ్రీమహావిష్ణువును నుతించిన (పొగడిన); తెఱంగును= విధాన్ని; సనందనుడు= సనందనుడు అనే (బ్రహ్మ మానసపుత్రుడైన) ఋషి; మహర్షులకున్+ ఎఱింగించిన= మహర్షులకు తెలిపిన; ప్రకారంబు= విధం; అని, నారాయణ+ఋషి= నారాయణుడనే ముని; నారదునకున్+చెప్పిన= నారదమహర్షికి చెప్పగా; ఆ+మహా+ఆత్ముండు= ఆ మహానుభావుడు; మత్+జనకుండు+ఐన= నా తండ్రిగారైన; వేదవ్యాసముని+ఇంద్రునకున్= వ్యాసమహర్షికి; ఉపన్యసించెను= దగ్గరకు తీసుకొని చెప్పాడు; ఆ+అర్థంబున్+అతండు= ఆ విషయాన్ని మా తండ్రి వ్యాసుడు; నాకున్+చెప్పిన విధంబునన్= నాకు చెప్పిన పద్ధతిలో; నీకున్+చెప్పితిని= (ఓ పరీక్షిన్మహారాజా!) నీకు చెప్పాను; ఈ ఉప+ఆఖ్యానంబు= ఈ ఉపకథ; సకల వేద, శాస్త్ర, పురాణ+ఇతిహాససారంబు= సమస్తమైన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు మొదలైన వాటి సారాంశం; ఉపనిషత్+తుల్యంబు= ఉపనిషత్తులతో సమానం; దీనిన్+దీన్నిపఠించేవారును; వినువారును= ఈ శ్రుతిగీతలు చదివేవారు,

వినేవారు; విగతకల్మషులు+ఐ= పాపరహితులై (పవిత్రులై); ఇహపర సౌఖ్యంబులన్+ఒంది= ఇహలోక, పరలోక సుఖాలు పొంది; వర్తింతురు= ఉంటారు; అని, చెప్పిన; శుకయోగి+ఇంద్రునకున్= యోగులలో శ్రేష్ఠుడైన శుకమహర్షికి; రాజ+ఇంద్రుడు= రాజశ్రేష్ఠుడైన పరీక్షిత్తు; ఇట్లు+అనెను= ఇలా అన్నాడు...

**తా :** సత్యమైన ప్రకృతివలన పుట్టిన ఈ ప్రపంచం అంతా సత్యం కావాలి. బంగారంతో చేసిన ఆభరణాల్లో బంగారమే ఉంటుందిగదా! అని సాంఖ్యులు వాదిస్తారు. సృష్టించబడనిది సత్యం కాదు. వ్యతిరేకవ్యాప్తి నియమం ప్రకారం ఇది కుదరదు. నిత్యసత్యబ్రహ్మంలో తర్కం కుప్పకూలుతుంది. ప్రపంచం మిథ్య, సత్యంకాదని అద్వైతులు పైసాంఖ్యవాదాన్ని ఖండిస్తారు. ఈ జగత్తంతా బ్రహ్మవిరచితం అయితే కార్యకారణ సిద్ధాంతం ప్రకారం కారణుడైన భగవంతుడున్నపుడు, కార్యమైన జగత్తు ఉన్నట్టేకదా! అపుడు జగత్తు మిథ్య ఎలా అవుతుంది? అని తిరిగి సాంఖ్యులు ఖండిస్తారు. బహుగ్రంథప్రతిపాదితమైన జగన్మిథ్యావాదం అబద్ధం ఎలా అవుతుంది అని అద్వైతులు వాదిస్తారు. కర్మవశులైన జడులు అవిద్యవల్ల చెడ్డవాదనలతో కుతర్కం సాయంతో అంధులు పరంపరగా స్వీకరించే అజ్ఞానంవలె ఒక గ్రంథంనుండి మరోగ్రంథానికి అద్వైతభావనను అందించుకుంటారు. అంతేగాని, పుస్తకాల్లో ఉందని జగన్మిథ్య అనడం కుదరదని, సాంఖ్యులు మొదలైనవారు అద్వైతాన్ని ఖండిస్తారు.

కారణ రూపమైన భగవంతుని రచనగా ఈ సృష్టి సూక్ష్మరూపంలో ఉంటుంది. స్థూలంగా అంతా మిథ్యే. జగత్తు బాధాకారకం. (ముక్తి ఆనందకారకం) కాబట్టి, ఓ భగవంతుడా! ఈ సృష్టి నీకు శేషభాగమే. జీవుల ఆత్మలలో అంతర్యామివైన నీకు దేహిచేసే కర్మలవల్ల లభించే పాపపుణ్యాలు అంటవు. వాటిని అనుభవించవలసిన దేహికి సాక్ష్యంగా మాత్రం నిలుస్తావు. అలాంటి నిన్ను ప్రాణులు జ్ఞానశూన్యులై గుర్తించలేరు. కంఠానికి అతికినట్టుండే ఆభరణంలోని మణి నిత్యం ప్రకాశిస్తున్నా, అది మెడలో వేసుకున్నవాడికి కనపడనట్టు వారి హృదయపద్మాల్లో ప్రకాశించే నిన్ను వాళ్లు దర్శించలేరు. బ్రహ్మాండానికి అధినాయకుడవైన నిన్నే వేదార్థాలు వివరిస్తాయని శ్రుతులు మహావిష్ణువును అభినందించిన విధాన్ని సనందన ఋషి మహర్షులకు చెప్పాడని నారాయణుడనే ఋషి నారదునికి చెప్పాడు. నారదుడు వేదవ్యాసునికి దాన్ని చెప్పగా మాతండ్రి వ్యాసుడు నాకు చెప్పినదాన్ని పరీక్షిన్మహారాజా! నీకు చెప్పాను. ఇది వేద, శాస్త్ర, పురాణేతిహాససారం. ఉపనిషత్తులతో సమానమైన రహస్యం. దీన్ని విన్నవారికీ, పఠించినవారికీ సకలశుభాలు కల్గుతాయని, పాపాలు నశిస్తాయనని శుకమహర్షి చెప్పాడు. అది విని పరీక్షిత్తు శుకునితో ఇలా అన్నాడు.

## ❖ పరీక్షిత్తునకు శుకయోగి విష్ణు సేవా ప్రాశస్త్యంబు సెప్పుట ❖

**మ. మునినాథోత్తమ! దేవమానవులలో ముక్కంటి సేవించు వా**
**రనయంబున్ బహువస్తుసంపదల సౌఖ్యానందులై యుండ న**
**వ్వనజాతాక్షు రమామనోవిభుని శశ్వద్భక్తి సేవించు స**
**న్మునివర్యుల్ గడుఁ బేద లౌటకుఁ గతంబున్ నా కెఱింగింపవే. 1231**

**ప్రతి :** మునినాథ+ఉత్తమ= ఓ మునీంద్రా!; ముక్కంటి(ని)= మూడుకన్నులు కలవాడైన శివుణ్ణి; సేవించువారు= కొలిచేవారు; అనయంబున్= ఎల్లవేళలా; బహువస్తుసంపదల= అనేక సంపదలతో; సౌఖ్య+ఆనందులు+ఐ= ఎల్లవేళల ఆనందం కలవాళ్లై, ఉండగా; ఆ+వనజాత+అక్షు(న్) ఆ పద్మాక్షుణ్ణి; రమా మనోవిభునిన్= లక్ష్మీదేవీ మనోనాథుడైన విష్ణువును;

శశ్వత్+భక్తి= ప్రకాశించే భక్తితో; సేవించు సత్+మునివర్యుల్= కొలిచే శ్రేష్ఠులైనమునులు; కడున్+పేదలు+ఔటకున్= మిక్కిలి పేదవారు అగుటకు; కతంబున్= కారణాన్ని; నాకున్+ఎఱింగింపవు+ఏ?= నాకు తెలుపవయ్యా!

**తా :** ఓ మునిశ్రేష్ఠుడా! శివారాధకులు సదా సకలైశ్వర్యాలతో, సుఖసంతోషాలతో ఉంటారు. విష్ణువును కొలిచేవారు ఎల్లపుడు బీదవారై ఉంటారు. దీనికి కారణమేమిటో తెలుపమని పరీక్షిత్తు కోరినాడు.

**సీ.** **నావుడు శుకయోగి నరనాథుఁ గనుఁగొని విను మెఱింగింతుఁ దద్విధము దెలియ**
**ఘనశ క్తిసహితుండు కాలకంధరుఁడు దా వినుతగుణత్రయాన్వితుఁడు గాన**
**రాగాదియుక్తమై రాజిల్లుసంపద లాతనిఁ గొలుచువా రందుచుందు;**
**రచ్యుతుఁ బరము ననంతు గుణాతీతుఁ బురుషోత్తముని నాదిపురుషు ననఘు**

**తే.** **నర్థి భజియించువారు రాగాది రహితు, లగుచు దీపింతు రెంతయు ననఘచరిత!**
**ధర్మనందనుఁ డశ్వమేధంబు సేసి, పిదప సాత్త్వికకథనముల్ ప్రీతితోడ.** **1232**

**ప్రతి :** నావుడు= అనగావిని; శుకయోగి; నరనాథున్+కనుగొని= పరీక్షిత్తును చూచి; తద్+విధము తెలియన్= ఆ వివరం తెలిసేలా; ఎఱింగింతున్= చెపుతాను, వినుము; ఘనశక్తిసహితుండు= గొప్ప శక్తిమంతుడైన; కాలకంధరుడు= నల్లని కంఠంగలవాడు= శివుడు; తాన్= తాను స్వయంగా; వినుత గుణత్రయ+అన్వితుడు= పొగడదగిన సత్త్వరజస్తమోగుణాలతో కూడుకొన్నవాడు; కనుక; రాగ+ఆదియుక్తము+ఐ= ప్రేమాదులతో; రాజిల్లు= ప్రకాశించే; సంపదలు= ఐశ్వర్యాలు; ఆతనిని కొలుచువారు= ఆయనను సేవించేవారు; అందుచున్+ఉందురు= పొందుతూ ఉంటారు; (ఇక) అచ్యుతున్= నాశనంలేనివాణ్ణి; పరమున్= శ్రేష్ఠుణ్ణి; అనంతున్= అంతములేనివాణ్ణి; గుణ+అతీతున్= త్రిగుణములకు సంబంధములేని వాణ్ణి (గుణరహితుణ్ణి); అనఘు= పాపరహితుణ్ణి; ఆదిపురుషున్= సృష్ట్యాదిలో ఉన్నవాణ్ణి; పురుష+ఉత్తముని= పురుషులలో శ్రేష్ఠుణ్ణి; అర్థి= ప్రేమతో; భజియించువారు= సేవించేవారు; రాగ+ఆది రహితులు= అనురాగాదులు లేనివారు; అగుచున్= అవుతూ; ఎంతయున్= మిక్కిలిగా; దీపింతురు= ప్రకాశిస్తారు; ధర్మనందనుడు= ధర్మరాజు; అశ్వమేధంబు+చేసి= అశ్వమేధయాగం చేసినవాడై; పిదప= తరువాత; సాత్త్వికకథనముల్= సాత్త్వికమైన కథలు; ప్రీతితోడ= ఇష్టంగా...

**తా :** మహారాజా! నీవడిగిన ప్రశ్నకు వివరంగా సమాధానం చెపుతాను. శివుడు శక్తిమంతుడు. త్రిగుణాన్వితుడు. రాగాధీనుడు. (వీతరాగుడు కాడు). కనుక సంపదల్ని అతణ్ణి కొలిచేవారికి అనుగ్రహిస్తాడు. విష్ణువేమో అనంతుడు, గుణాతీతుడు, అనఘుడు, ఆదిపురుషుడు. అతణ్ణి సేవించువారు అతనివలెనే రాగాదివ్యక్తులుకాక వీతరాగులు. అట్టివారే పురుషోత్తముని సేవిస్తారు. వారికి ద్రవ్యసుఖాలు అక్కరలేదు. ధర్మనందనుడు యాగంచేసి, ప్రియంగా కథలు వింటున్నపుడు

**ఉ.** **నారదసంయమీంద్రు వలనన్ వినుచుండి యనంతరంబ పం**
**కేరుహనాభుఁ జూచి యడిగెం దగ నిప్పుడు నీవు నన్ను నిం**
**దారిన భక్తిమై నడిగినట్ల యతండును మందహాస వి**
**స్ఫార కపోలుఁడై పలికెఁ బాండుతనూభవుతోడఁ జెచ్చెరన్.** **1233**

**ప్రతి :** (ధర్మరాజు) నారద సంయమి+ఇంద్రువలనన్= నారద మునిశ్రేష్ఠునివలన; వినుచున్+ఉండి; అనంతరంబు= తరువాత; పంకేరుహనాభున్+చూచి= పద్మగర్భుడైన శ్రీకృష్ణుణ్ణి చూచి; ఇప్పుడు, నీవు= ఓ పరీక్షిన్మహారాజా!; నన్నున్

(శుకుణ్ణి); నిండారిన= నిండుగా; భక్తిమైన్= భక్తితో; అడిగినట్లు, తగన్= చక్కగా; అడిగెన్= అడిగాడు; అతండును= శ్రీకృష్ణుడుకూడా; పాండుతనూభవుతోడన్= పాండురాజకుమారుడైన ధర్మరాజుతో; మందహాస విస్ఫార కపోలుడు+ఐ= చిరునవ్వుతో వికసించిన చెక్కిళ్లు కలవాడై; పలికెన్= చెప్పాడు.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! నీవు నన్ను నిండు భక్తితో ఎలా ప్రశ్నించావో అదేరీతిగా ధర్మరాజు శ్రీకృష్ణుని ప్రశ్నించగా, కృష్ణుడు చిరునవ్వుతో ఇలా పలికాడు.

**సీ. వసుమతీనాథ! యెవ్వనిమీఁద నా కనుగ్రహబుద్ధి వొడము నా ఘనుని విత్త**
**మంతయుఁ గ్రమమున నపహరించిన వాఁడు ధనహీనుఁ డగుచు సంతాప మంద**
**విడుతురు బంధు ల వ్విధమున నొందిలి యై చేయునది లేక యఖిలకార్య**
**భారంబు లుడిగి మద్భక్తులతో మైత్రి నెఱపుచు విజ్ఞాననిరతుఁ డగుచుఁ**

**తే. బిదప వాఁ డవ్యయానందపదము నాత్మ, నెఱిఁగి సారూప్యసంప్రాప్తి నెలమి నొందుఁ**
**గాన మత్సేవ మిగుల దుష్కర మటంచు, వదలి భజియింతు రితరదేవతల నెపుడు. 1234**

**ప్రతి :** వసుమతీనాథ!= ఓ ధర్మరాజా! ఎవ్వనిమీదన్= ఏ వ్యక్తిమీద; నాకున్+అనుగ్రహబుద్ధి= నాకు (కృష్ణునికి) దయాబుద్ధి; పొడమున్= కలుగుతుందో; ఆ ఘనుని= ఆ మహానుభావుని యొక్క; విత్తము+అంతయున్= సంపదలన్నీ; క్రమమునన్= వరుసగా; అపహరించినన్= స్వీకరించగా వాడు; ధనహీనుడు+అగుచున్= బీదవాడు అవుతూ; సంతాపము+అందన్= దుఃఖిస్తుండగా; బంధువులు విడుతురు= చుటాలు దూరం అవుతారు; ఆ+విధమునన్= అలాగా; ఒందిలి+ఐ= దీనుడై; చేయు+అదిలేక= చేసేది ఏమీలేక; అఖిల కార్యభారంబులు+ఉడిగి= అన్ని పనుల ఒత్తిడులు తగ్గి; మత్+భక్తులతోన్= నా భక్తులతో; మైత్రి నెఱపుచున్= స్నేహాన్ని పాటిస్తూ; విజ్ఞాన నిరతుడు+అగుచున్= విశిష్టమైన భగవత్ జ్ఞానంపట్ల (తెలివిని) ఆసక్తుడు అవుతూ; సంపాదించడం; అభిరుచి కల్గి; పిదపన్= తరువాత; వాడు, అవ్యయ+ఆనంద పదమును= తరగని ఆనందస్థితిని; ఆత్మన్+ఎఱిగి= తన హృదయంలో తెలిసి (స్థిరపరచికొని); సారూప్య= భగవంతుని రూపంవంటి రూపం యొక్క; సంప్రాప్తిన్= లాభాన్ని; ఎలమిన్+ఒందున్= సంతోషంగా(తృప్తిని) పొందుతాడు; కాన= కాబట్టి; మత్+సేవ= నన్ను కొలుచుట; మిగుల దుష్కరము+అట+అంచున్= బాగా కష్టం అంటూ; (నన్ను); వదలి; ఎపుడున్ ఇతర దేవతలన్= సదా వేరేదేవుళ్లను; భజియింతురు= కొలుస్తారు.

**తా :** ఓ ధర్మరాజా! ఎవ్వరిమీద నాకు అనుగ్రహం కలుగుతుందో అతని సంపదలన్ని హరించి నిర్ధనుణ్ణి చేస్తాను. అపుడు బంధుమిత్రాదులు అతనికి దూరమై, దుఃఖితుడై సమస్తకార్యాలు వదిలి, నాభక్తులతో స్నేహంచేసి జ్ఞానియై, ఆనందపదవి పొంది, సారూప్యముక్తిని పొందుతాడు. అందుకే కష్టాలు, బీదరికం ఉంటాయని జనులు నా సేవ వదిలి, ఇతరదేవతలను సేవిస్తారు.

**విశే :** సంపదలు కలవారు భోగభాగ్యాలు అనుభవిస్తూ భగవంతుణ్ణి స్మరించరు. కష్టాలు వచ్చినపుడే భగవంతుడు జ్ఞాపకం వస్తాడు. ధనికుడు ధనంతో భోగాలేకాక ధనవృద్ధికోసంచేసే పనులతో వ్యగ్రుడై భగవన్నామం మరుస్తాడు. ఇది భగవంతుని సందేశం. అందుకే తాను తనభక్తులు బీదవారిగా ఉన్నా ఇష్టపడతాడు. భక్తి నిరతికొరకు సంపదలు తొలగిస్తాడని భగవంతునిలీలలో అది ఒకటని తాత్పర్యం.

**క. సేవింప వారు దమకుం, గావించిన శోభనములు గని నిజములుగా**
**భావించి వారి మఱతురు, భావములఁ గృతఘ్నవృత్తిపని తమ పనిగన్. 1235**

**ప్రతి :** సేవింపన్= భక్తులు ఇతరదేవతలను కొలువగా; వారు= ఆ దేవతలు; తమకున్= తమకు; కావించిన శోభనములు= చేసిన శుభాలు; కని= చూచి; నిజములుగా భావించి= యథార్థము అని తలచి; భావములన్= మనస్సులలో; వారిన్= ఆ దేవతలను; మఱతురు= మరచిపోతారు. కృతఘ్నవృత్తిపని= పొందిన సహాయాన్ని మరచిపోయేపని, తమపని+కన్= తమ నిత్యకృత్యంగా...

**తా :** నన్ను వదలి, ఇతర దేవతలను కొలిచి, వారిచ్చే సంపదలను నిజమని భావించి ఆ దేవతల్ని మరచిపోయారు. మరచి పోయే (కృతఘ్నత) పనియే తమ నిత్యకృత్యంగా

**క. మెలఁగుచు నుందురు; దీనికిఁ, గలదొక యితిహాస మిపుడు గై కొని నీకుం**
**దెలియఁగఁ జెప్పెద దానన, యలవడు నీ వడుగు ప్రశ్న కగు నుత్తరమున్. 1236**

**ప్రతి :** మెలఁగుచున్+ఉందురు= ప్రవర్తిస్తుంటారు; దీనికిన్= ఇందుకు సంబంధించిన; ఒక+ఇతిహాసము= ఒక కథ; ఇపుడున్+కైకొని= ఇపుడు స్వీకరించి, నీకున్+తెలియన్+కన్= నీకు తెలిసేలా; చెప్పెదన్= చెపుతాను; దానన్+అ= దానితోనే; నీవు+అడుగు ప్రశ్నకున్= నీవు ఇంతకు ముందు అడిగిన ప్రశ్నకు; అగు= అయినట్టి; ఉత్తరమున్= సమాధానం; అలవడున్= లభిస్తుంది.

**తా :** మెలగుతూ ఉంటారు; ఇందుకు సంబంధించిన ఒక ఇతిహాసాన్ని నీకు చెప్తాను. దానితో నీవడిగిన ప్రశ్నకు తగిన సమాధానం లభిస్తుంది.

### ✤ శివద్రోహంబు సేయంబూనిన వృకాసురుండు విష్ణుమాయచే మడియుట ✤

**క. శకుని యను దైత్యతనయుఁడు, వృకుఁ డనువాఁ డొకఁడు దుర్వివేకుఁడు సుజన**
**ప్రకరముల నలఁపఁ దెరువున, నొకనాఁ డొదిగుండి దివ్యయోగిం గడఁకన్. 1237**

**ప్రతి :** శకుని+అను దైత్యతనయుడు= శకుని అనిపేరుగల రాక్షస కుమారుడు; వృకుఁడు+అనువాఁడు+ఒకడు= వృకుడు అనేపేరుగలవాడు; దుర్+వివేకుఁడు= చెడ్డ బుద్ధికలవాడు; సుజన ప్రకరములన్+అలపన్= సజ్జనుల సమూహాన్ని; బాధించడానికి; తెరువునన్= ఉపాయంగా; ఒదిగి+ఉండి= దాగి ఉండి; ఒకనాఁడు; దివ్యయోగిన్= దేవఋషి అయిన నారదుణ్ణి; కడఁకన్= ప్రయత్నపూర్వకముగా...

**తా :** శకుని అనే పేరుగల రాక్షసునికొడుకు వృకాసురుడు సజ్జనసంతాపకారియై, చాలా ఉపాయంగా, దాగి ఉండి; ఒకనాడు నారద మహర్షి కనబడగా

**వ. కనుంగొని. 1238**

**ప్రతి :** కనున్+కొని= చూచి...

**క. కరములు ముకుళించి 'మునీ, శ్వర ! నారద ! లలితధీవిశారద ! నన్నున్**
**గరుణించి యాన తీ శుభ, కరు లగు హరిహరహిరణ్య గర్భులలోనన్ 1239**

**ప్రతి :** కరములు ముకుళించి= చేతులు జోడించి; ముని+ఈశ్వర!= ఓ మునిశ్రేష్ఠుడా! నారదా!; లలిత ధీవిశారద= మనోహరమైన బుద్ధికుశలత కలవాడా!; నన్నున్+కరుణించి= నన్ను దయతలచి; ఆనతి+ఈన్= ఆజ్ఞ ఇమ్ము; శుభకరులు+అగు= శుభాలనిచ్చే; హరి, హర, హిరణ్యగర్భులలోనన్= విష్ణు, శివ, బ్రహ్మలలో...

**తా :** వృకుడు చేతులు మోడ్చి నారదునితో "ఓ మునీశ్వరా! వివేకివైన నీవు నా మీద దయతో చెప్పవయ్యా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులలో

**ఆ.** **కడcగి కొలువ శీఘ్రకాలంబులోనన, యిష్టమైన వరము లిచ్చునట్టి**
**దైవ మెవ్వc డనిన దానవుc గనుcగొని, మునివరుండు పలికె ముదముతోడ. 1240**

**ప్రతి :** కడగి= పూని; కొలువన్= ఆరాధించగా; శీఘ్రకాలంబులోనన్+అ= అతిత్వరితంగానే; ఇష్టము+ఐన, వరములు= కోరిన వరాలు; ఇచ్చునట్టి దైవము+ఎవ్వడు+అనినన్= ఇచ్చే దైవం ఎవరు అనగా; దానవున్+కనుగొని= వృకుణ్ణిచూచి; ముని వరుండు= మునిశ్రేష్ఠుడైన నారదుడు; ముదముతోడన్= సంతోషంగా; పలికెన్= చెప్పాడు.

**తా :** శ్రద్ధగా పూజిస్తే ఈ త్రిమూర్తుల్లో ఎవరు శీఘ్రంగా భక్తులకు కోరినకోర్కెలు తీరుస్తారని వృకుడు అడుగగా నారదుడు సంతోషంగా ఇలా అన్నాడు.

**వ.** **వినుము; దుర్గుణసుగుణంబులలో నొక్కటి యెచ్చటం గలుగు నచ్చట నా క్షణంబ కోప ప్రసాదఫలంబులు సూపువాc డమ్మువ్వురయందు ఫాలలోచనుc డివ్విధంబుc దెలిసినవారై బాణాసుర దశకంధరులు సమగ్ర భక్తియుక్తులై సేవించి యసమాన సామ్రాజ్య వైభవంబుల నొంది ప్రసిద్ధులై; రట్లుగాన నీవు న మ్మహాత్ముని సేవింపు; మతనివలన నభిమతఫలంబులు వేగంబ ప్రాప్తం బయ్యెడి'నని చెప్పిన నతం డా క్షణంబ. 1241**

**ప్రతి :** వినుము= వృకాసురా! వినుము; దుర్+గుణ; సుగుణంబులలోన్= దుర్గుణ సుగుణాలలో; ఒక్కటి= ఏదైనా; ఎచ్చటన్+కలుగున్= ఎక్కడ ఉంటే; అచ్చట= అక్కడ; ఆక్షణంబు+అ= తత్‌క్షణమే; కోప, ప్రసాద= కోపమును; అనుగ్రహమును; ఫలంబులు చూపువాడు= ఫలితాలుగా ఇచ్చేవాడు (చూపువాడు); ఆ+మువ్వరి+అందున్= ఆ ముగ్గురు మూర్తులలో; ఫాలలోచనుండు= (నుదుట కన్నుకలవాడు) శివుడు; ఈ+విధంబున్= (ఈ సత్వర ఫలమందించే లక్షణంకల శివుణ్ణి) తెలిసినవారై= తెలుసుకొని; బాణ+అసుర, దశకంధరులు= బాణాసురుడు; రావణాసురుడు; సమగ్రభక్తియుక్తులు+ఐ= నిండు భక్తిని కలిగినవారై; సేవించి= ఆరాధించి; అసమాన సామ్రాజ్య వైభవంబులన్= సాటిలేని విశాల రాజ్యములను; రాచరిక వైభవాన్ని; ఒంది= పొంది; ప్రసిద్ధులు+ఐరి= ప్రఖ్యాతిగాంచినారు; అట్లుకాన నీవు ఆ+మహా+ఆత్ముని= కాబట్టి నువ్వు ఆ శివుణ్ణి; సేవింపుము= ఆరాధించుము; అతనివలనన్= ఆయన నుండి; అభిమత ఫలంబులు= ఇష్టమైన కోర్కెలు ఫలించుట; వేగంబు+అ= వేగంగానే; ప్రాప్తంబు+అయ్యెడిన్= పొందడం జరుగుతుంది; అని చెప్పినన్= అని చెప్పగా; అతండు+ఆక్షణంబు+అ= వృకాసురుడు అదే నిమిషంలోనే...

**తా :** నారదుడు – "తన భక్తులలో దుర్గుణమైనా సుగుణమైనా, కనబడితే అదే నిమిషంలో నిగ్రహం, అనుగ్రహం (దుర్గుణములకు కోపము, సుగుణములకు అనుగ్రహం)తో స్పందించే వాడు త్రిమూర్తులలో శివుడొక్కడే. ఫాలలోచనుని అనుగ్రహం కోరి, బాణాసుర, రావణాసురాది రాక్షసులు సామ్రాజ్యవైభవాలు ఆయన అనుగ్రహంతో పొందినారు. కాబట్టి, నువ్వు ఆయనను ఆరాధించు. నీ కోరిక వేగంగా ఈడేరుతుంది" అని చెప్పినాడు.

**సీ. దీపించు కేదారతీర్థంబునకు నేగి యతిసాహసాత్మకుం డగుచు నియతి**
**లోకముల్ వెఱఁగంద నా కాలకంధరు వరదుని నంబికావరునిఁ గూర్చి**
**తన మేనికండ లుద్దండుఁడై ఖండించి యగ్ని కాహుతులుగా నలర వేల్చి**
**దర్పకారాతి ప్రత్యక్షంబు గాకున్న జడియక సప్తవాసరమునందుఁ**

**తే. బూని తత్తీర్థమునఁ గృతస్నానుఁ డగుచు, వెడలి మృత్యువుకోఱనా వెలయునట్టి**
**గండ్రగొడ్డంటఁ దన మస్తకంబు దునుము, కొనఁగఁ బూనిన న య్యగ్నికుండమునను. 1242**

**ప్రతి :** దీపించు= ప్రకాశించే; కేదార తీర్థంబునకున్= కేదారమనే పేరుగల తీర్థానికి; ఏగి= వెళ్లి; అతి సాహస+ఆత్మకుండు+అగుచున్= మిక్కిలిగా సాహసాలుచేసే బుద్ధిగలవాడవుతూ; నియతిన్= నియమంతో; లోకముల్ వెఱఁగు+అందన్= ప్రపంచమంతా భయపడగా; ఆ కాలకంధరున్= ఆ శివుణ్ణి (నల్లని కంఠముగలవానిని); వరదునిన్= వరాలనిచ్చేవాణ్ణి; అంబికా వరునిన్= పార్వతీదేవి భర్తను (ఆ తీర్థస్వామియైన కేదారనాథుని); కూర్చి= లక్షించి; తన మేనికండలు= తన శరీరపు కండలు; ఉత్+దండుఁడ+ఐ= భీకరుడై; ఖండించి= కోసుకొని; అగ్నికిన్= అగ్నిదేవునికి; ఆహుతులు+కాన్= ఆహుతులుగా; వేల్చి= అగ్నికుండంలో వేసి; (అప్పటికిని) దర్పక+అరాతి= (మన్మథుని శత్రువైన) శివుడు; ప్రత్యక్షంబు+కాక+ఉన్నన్= ప్రత్యక్షంకాక పోవడంవల్ల; జడియక= జంకక; సప్తవాసరమున్+అందున్= ఏడవ రోజున; పూని= యత్నపూర్వకంగా; తత్+తీర్థమునన్= ఆ జలాలలో (కేదార తీర్థంలో); కృతస్నానుఁడు+అగుచున్= స్నానం చేసినవాడై; వెడలి= నీళ్లనుండి బయటికి వచ్చి; మృత్యువు కోఱ నాన్= మృత్యుదేవతయొక్క కోరయేమో అన్నట్లు; వెలయున్+అట్టి= ప్రకాశించునట్టి; గండ్రగొడ్డంటన్= గండ్ర గొడ్డలితో= గండ్రగొడ్డలితో; తన మస్తకంబున్= తన తలను; తునుము కొనన్+కన్= ఖండించుకొనడానికి; పూనినన్= ప్రయత్నించగా; ఆ+అగ్నికుండమునను= ఆ అగ్గి గుండంనుండి...

**తా :** కేదారతీర్థమని ప్రసిద్ధిగల తీర్థానికి వెళ్లి, సర్వజనులు భయపడేంత తీవ్రంగా, శివుణ్ణిగూర్చి (కేదారనాథునిగూర్చి) తపస్సు చేశాడు. యజ్ఞంచేసి హోమగుండంలో తనశరీరాన్ని కోసుకొని మాంసపు కండలను హవిస్సుగాచేసి వ్రేల్చినాడు. శివుడప్పటికీ ప్రత్యక్షం కాకపోవడంతో, ఏడవరోజు కేదారతీర్థంలో స్నానంచేసి శుచియై, బయటకువచ్చి మృత్యుదేవత కోరలాగా ఉండే భీకరమైన గండ్రగొడ్డలి తీసుకొని, తన తల నరికికొని హవిస్సుగా వేయడానికి సిద్ధపడగా, వెంటనే ఆ అగ్నిగుండంనుండి (శివుడు ప్రత్యక్షమైనాడు)

**క. అరుదుగ వెలువడి రుద్రుఁడు, గరుణ దలిర్పంగ వానికర మాత్మకరాం**
**బురుహమునఁ బట్టి తెగువకుఁ, జొరవలవదు; మెచ్చు వచ్చె సుమహిత చరితా! 1243**

**ప్రతి :** అరుదుగన్= విశేషంగా; రుద్రుఁడు= శివుడు; వెలువడి= ప్రత్యక్షమై; కరుణ తలిర్పన్+కన్= దయ అతిశయించగా; వాని కరమున్= వాని చేతిని; ఆత్మ కర+అంబురుహమునన్= తన హస్తపద్మంతో; పట్టి= పట్టుకొని; (తలఖండించుకొనకుండ ఆపి); సుమహిత చరితా= గొప్ప చరిత్రగలుగువాడా!; తెగువకున్+చొరవలదు= సాహసానికి పూనుకోవద్దు; మెచ్చువచ్చెన్= నిన్ను మెచ్చుకొన్నాను.

**తా :** అగ్నికుండంలోంచి శివుడు ప్రత్యక్షమై, వృకుణ్ణి అనుగ్రహించదలచి, ఎంతోదయతో, వానిచేతిని పట్టుకొని, తలఖండించుకోకుండా ఆపి, 'అంత సాహసం వద్దు. నీ భక్తికి మెచ్చాను', అన్నాడు.

**క. నీమదిఁ బొడమిన కోరిక, లేమైనను వేఁడు మిపుడ యిచ్చెద ననినం**
**దా మనమున సంతసపడి, యా మనుజాశనుఁడు హరుపదాంబుజములకున్. 1244**

**ప్రతి :** నీ మదిన్= నీ మనసులో; పొడమిన= కల్గినట్టి; కోరికలు+ఏమి+ఐనను= వాంఛలేవైనాసరే; వేడుము= కోరుకో; ఇపుడు+అ+ఇచ్చెద= వెంటనే ఇస్తాను; అనినన్= అని శివుడు అనగా; తాన్= ఆ వృకుడు; సంతసపడి= సంతోషించి; ఆ మనుజ+అశనుఁడు= ఆ రాక్షసుడు హరు పద+అంబుజములకున్= శివుని పాదపద్మములకు...

**తా :** నీ మనసులో ఎలాంటి కోర్కెలున్నా సరే, కోరుకో! వెంటనే ఇవ్వగలను అని శివు డనగా వృకాసురుడు సంతోషపడి, శివుని పాదాలకు (నమస్కరించినాడు)

**తే. వందనం బాచరించి 'యో యిందుమకుట!, ఫాలలోచన! వరద! మత్పాణితలము**
**నేను నెవ్వని తలమీఁద నిడిన వాఁడు, మస్తకము నూఱువ్రయ్యలై మడియ నీవె!' 1245**

**ప్రతి :** వందనంబు= నమస్కారం; ఆచరించి= చేసి; ఓ ఇందుమకుట= చంద్రుని తలపైగలవాడా (శివా!); ఫాలలోచన= నుదుటిపై కన్నుకలవాడా! వరద= వరాలు ఇచ్చువాడా!; మత్+పాణితలము= నా అరచేయి; నేనున్=నేను; ఎవ్వని తలమీఁదన్= ఎవని నెత్తిమీద; ఇడినన్+వాఁడు= పెడితే ఆ వ్యక్తి యొక్క; మస్తకము= తల, నూఱు వ్రయ్యలు+ఐ= నూరువ్రక్కలై; మడియన్+ఈవె= (వాడు) చచ్చేట్టుగా వరం ఇమ్ము.

**తా :** వృకుడు శివునిపాదములకు నమస్కరించి, 'స్వామీ! నా అరచేయి ఎవని నెత్తిమీద పెడితే వాడితల నూరువ్రక్కలై చావాలి' అని వరమిమ్మన్నాడు.

**క. అని వేఁడిన న మ్మాటలు, విని మదనారాతి నవ్వి విబుధాహితు కో**
**రిన వరముఁ దడయ కిచ్చిన, దనుజుఁడు తద్వరపరీక్షఁ దాఁ జేయుటకున్. 1246**

**ప్రతి :** అని వేడినన్= అని కోరగా; ఆ+మాటలు విని= ఆ ప్రార్థనలు విని; మదన+అరాతి= (మన్మథుని శత్రువైన)శివుడు; నవ్వి, విబుధ+అహితున్= (దేవతల శత్రువు (రాక్షసుడు) అయిన) వృకుణ్ణి; వృకుడు కోరిన వరమున్= కోరిన కోర్కె; తడయక+ఇచ్చినన్= వెంటనే ఇవ్వగా; దనుజుఁడు= ఆ రాక్షసుడు; తత్+వర పరీక్షన్= ఆ వరాన్ని, పరీక్షించడానికై, అపుడు ఆ వృకాసురుడు; తాన్+చేయుటకున్= తాను చేయడానికి...

**తా :** వృకుడు కోరిన ఆ వింతకోర్కెకు నవ్వి, శివుడు వెంటనే అనుగ్రహించినాడు. శివుడిచ్చిన వరంయొక్క ప్రభావాన్ని పరీక్షింపదలచి

**వ. ఆ క్షణంబ వరదాన గర్వంబున నుద్వృత్తుండై కడంగి. 1247**

**ప్రతి :** ఆ క్షణంబు+అ= ఆ వెంటనే; వరదాన గర్వంబునన్= దానంపొందిన వరంవలన గల్గిన గర్వంచేత; ఉత్+వృత్తుండు+ఐ= మదించిన ప్రవర్తన గలవాడై; కడంగి= ప్రయత్నించి...

**తా :** వరంపొందిన తత్క్షణం ఆ వరగర్వంచేత మిడిసిపడి

**క. ఆ హరుమస్తకమునఁ గడు, సాహసమునఁ జేయి వెట్ట జడియక కదియ**
**న్నోహో! తన మెచ్చులు దన, కాహా! పై వచ్చె ననుచు నభవుఁడు భీతిన్. 1248**

**ప్రతి :** ఆ హరు మస్తకమునన్= ఆ (వరమిచ్చిన) శివుని తలపైనే; కడున్+సాహసమునన్= మిక్కిలి సాహసంతో; చేయి+పెట్టన్+జడియక= చెయ్యి పెట్టడానికి జంకక; కవియన్= ముందుకురాగా; ఓహో!= అయ్యో!; తనమెచ్చులు= నా వరాలే; తనకు పై వచ్చెన్= నా పైకివచ్చాయి; ఆహా అనుచున్= అయ్యో అనుకుంటూ; భీతిన్= భయంతో; అభవుడు= శివుడు...

**తా :** వృకుడు సాహసంతో వరమిచ్చిన శివుని తలమీదే చెయ్యిపెట్టి పరీక్షించేందుకు ముందుకురాగా, నా వరాలు నాకే చుట్టుకుంటున్నాయని అయ్యో అని జడిసి ప్రాణభీతితో శివుడు

**క. దనుజుఁడు దన వెనువెంటం, జనుదే ముల్లోకములను సంత్రాసముఁ గై**
**కొని పాఱ, సురలు మనములఁ, దనికిరి దానికిని బ్రతివిధానము లేమిన్. 1249**

**ప్రతి :** దనుజుఁడు= రాక్షసుడు (వృకుడు); తనవెనువెంటన్= తన వెన్నువెంబడే; చనుదేన్= పరిగెత్తిరాగా; మూడు+లోకములును= త్రిలోకాలూ; సంత్రాసము= భయమును; కైకొని= పొంది; పాఱన్= పరుగెత్తగా; సురలు= దేవతలు; మనములన్= మనస్సుల్లో; దానికిని= ఆ వరానికి; ప్రతివిధానము= మారు పద్ధతి; లేమిన్= లేక; తనికిరి= భయపడ్డారు.

**తా :** వృకాసురుడు శివునితలపై చేయిపెట్టేందుకు రాగా, శివుడు భయంతో పారిపోగా, ముల్లోకవాసులు భయంతో పారిపోయారు. వర ప్రభావానికి మారు ఉపాయంలేక, ఏమితోచని దేవతలు భయపడ్డారు.

**వ. అట్లు చని చని. 1250**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా (ముందు శివుడు, వెనుక హస్తంచాచి వృకాసురుడు; చనిచని= పరుగెత్తి పరుగెత్తి)...

**తా :** ఆ విధంగా శివుని నెత్తిపై చేయిపెట్టదలచి, వృకుడు, అతనికి అందకుండా శివుడు పరుగెత్తి

**సీ. నిరుపమానందమై నిఖిలలోకములకు నవలయై యమృతపదాఖ్యఁ దనరి**
**దినకరచంద్రదీధితులకుఁ జొరరాక సలలితసహజతేజమున వెలుఁగు**
**సమధికంబగు శుద్ధసత్త్వగరిష్ఠమై కరమొప్ప యోగీంద్రగమ్య మగుచు**
**హరిపదధ్యానపరాయణులైన తద్దాసుల కలరు నివాస మగుచుఁ**

**తే. బ్రవిమలానంత తేజోవిరాజమాన, దివ్యమణిహేమకలితసందీప్తభవ్య**
**సౌధమండపతోరణస్తంభవిపుల, గోపురాదిభాసురము వైకుంఠపురము. 1251**

**ప్రతి :** నిర్+ఉపమ+ఆనందము+ఐ= సాటిలేని ఆనంద స్వరూపమై; నిఖిల లోకములకున్+అవల+ఐ= సమస్తలోకాలకు ఆవల ఉండేదై; అమృత పద+ఆఖ్యన్+తనరి= అమృత పదం అని పిలువబడి; దినకర, చంద్ర, దీధితులకున్= సూర్య చంద్రకాంతులకు; చొరరాక= ప్రవేశించే వీలులేక; సలలిత సహజతేజమునన్= మనోహరమై స్వయంప్రకాశమై వెలుఁగు; సమ్+అధికంబు+అగు= గొప్పనైన; శుద్ధ సత్త్వగరిష్ఠము+ఐ= పరిశుద్ధమైన సత్త్వరూపంతో మిన్నయై; కరము+ఒప్పన్= గొప్పగా ప్రకాశిస్తూ; యోగి+ఇంద్ర గమ్యము+అగుచున్= శ్రేష్ఠులైన యోగులకు పొందదగింది అగుతూ; హరిపదధ్యాన పరాయణులు+ఐన= విష్ణుపాదాలనే ధ్యానించడంలో నిమగ్నులైన; తద్+దాసులకున్+అలరు= ఆ విష్ణుసేవకులకు ఒప్పైన;

నివాసము+అగుచున్= నివాస స్థానమవుతూ; ప్రవిమల= మిక్కిలి స్వచ్ఛమైన; అనంత తేజన్+విరాజమాన= అంతులేని కాంతిచేత ప్రకాశిస్తూ; దివ్యమణి= దేవతాసంబంధమైన (లేదా శ్రేష్ఠమైన) మణులు; హేమ= బంగారంచే; కలిత= కూడుకొనిందై; సందీప్త= మిక్కిలి ప్రకాశించిన; భవ్య సౌధ= శోభనమైన భవనాలు; మండప= మంటపాలు; తోరణ స్తంభ= తోరణస్తంభాలు; విపులగోపుర= విశాలమైన గోపురాలు; ఆది= మొదలైనవాటితో; భాసురము= ప్రకాశిస్తూ; వైకుంఠపురము= వైకుంఠ నగరం (విష్ణువు నివాసస్థానము)...

**తా :** ఆనందస్వరూపం, లోకాతీతమైన స్థానం, సూర్యచంద్రకాంతులకు అందనిదీ, స్వయంప్రకాశకమూ, శుద్ధసత్త్వగుణానికి ప్రతిరూపంగా ప్రకాశించిందీ, యోగీంద్రులకు గమ్యస్థానమైందీ, హరిపదదాసులకు నివాసమైందీ, మణులు తాపడం చేసిన బంగారు భవనాలు, మంటపాలు, తోరణాలు, స్తంభాలు, గోపురాలతో ప్రకాశించే విష్ణుస్థానమైన వైకుంఠనగరాన్ని చూచాడు

**వ. కనుంగొని యమ్మహాస్థానంబు డాయం జనుటయు, నప్పుండరీకాక్షుం డఖండవైభవంబునం గుండలీశ్వరభోగతల్పంబునం బరమానందకందళితహృదయారవిందుండై యిందిరానయనచకోరకంబుల నిజమందహాససాంద్రచంద్రికావితతిం దేల్చుచు, నార్తభక్తజనరక్షణంబు పనిగా మెలంగుచు, వివిధ వినోదంబులం దగిలి యుండియు, ఫాలలోచనుం డద్దనుజపాలునకుం దలంపక యిచ్చిన వరంబు దన తలమీఁద వచ్చినం గలంగి చనుదెంచుట తన దివ్యచిత్తంబున నెఱింగి, య క్కాలకంధరుని యవస్థ నివారింపం దలంచి య య్యిందిరాదేవితోడి వినోదంబు సాలించి యప్పుడు. 1252**

**ప్రతి :** కనున్+కొని= కన్నులతో చూచి (శివుడు); ఆ+మహాస్థానంబు= ఆ గొప్పస్థానాన్ని; డాయన్+చనుటయున్= దగ్గరగా వెళ్లడంతో, ఆ+పుండరీకాక్షుండు= తెల్లతామర రేకులవంటి నేత్రాలుకల ఆ విష్ణువు; అఖండవైభవంబునన్= అతిశయమైన విభవంచేత; కుండలి+ఈశ్వర= పాములరాజు (ఆదిశేషుని); భోగతల్పంబునన్= పడగల నీడగల మంచంపై; పరమ+ఆనంద కందళిత= గొప్ప ఆనందం వెల్లివిరిసిన; హృదయ+అరవిందుడు+ఐ= కమలంవంటి హృదయంకల్గినవాడై; ఇందిరానయన చకోరకంబులకున్= లక్ష్మీదేవి కన్నులనెడు చకోరపక్షులకు; నిజమందహాస= తన చిరునవ్వులనే, సాంద్రచంద్రికా వితతిన్= దట్టమైన వెన్నెలల సమూహాలతో; తేల్చుచున్= సంతృప్తి పరుస్తూ; ఆర్తభక్తజన రక్షణంబు= దీనులైన భక్తుల్ని రక్షించుట; పనిగా మెలంగుచున్= ముఖ్య కార్యంగా ప్రవర్తిల్లుతూ; వివిధ వినోదంబులన్= పలురకాల సంబరాలలో; తగిలి+ఉండియున్= నిమగ్నమై ఉండి కూడా; ఫాలలోచనుండు= శివుడు; అ+దనుజ పాలునకున్= ఆ రాక్షసరాజుకు; తలంపక+ఇచ్చిన= (చక్కగా పరిశీలించక) ఆలోచించక, ఇచ్చినట్టి; వరంబు= అనుగ్రహపూర్వకమగు మాట; తన తలమీఁద వచ్చినన్= తన తలకు చుట్టుకొనగా (అని జాతీయము); కలంగి చనుదెంచుట= ఆందోళనచెంది (శివుడు); పరుగెత్తి రావడాన్ని; తన దివ్య చిత్తంబునన్= తన మహిమోపేతమైన బుద్ధితో; ఎఱిఁగి= తెలుసుకొని; ఆ+కాలకంధరుని= ఆ శివుని; అవస్థ= కష్టాన్ని; నివారింపన్ తలంచి= తొలగించ దలచి; ఆ+ఇందిరాదేవితోడి= ఆ లక్ష్మీదేవితో; వినోదంబు+ చాలించి= విలాసాలు మాని; అప్పుడు= ఆ సమయంలో (విష్ణువు)...

**తా :** శివుడు వైకుంఠానికి వెళ్ళాడు. ఆ సమయంలో విష్ణువు అఖండమైన వైభవంతో శేషతల్పంపై పడుకొని, లక్ష్మీదేవిని చిరునవ్వులతో పలకరిస్తూ, భక్తులను ఆదరిస్తూ ఉన్నాడు. ఆలోచించకుండా ఇచ్చిన వరంవల్ల శివుని తలపైకి వచ్చిన కష్టాన్ని దివ్యదృష్టితో తెలుసుకొని ఆ కష్టాన్ని తొలగింపదలచాడు. లక్ష్మీదేవితోడి వినోదాలను ఆపాడు. ఆ సమయంలో

**సీ. తాపింఛరుచితోడఁ ద్రస్తరించెడుమేనుఁ బసిఁడిముంజియుఁ దగు పట్టుగొడుగు**
**ధవళాంశురుచి జన్నిదంబును దిన్నని దండంబుఁ జేతఁ గమండలువును**
**బసుపుగోఁచియుఁ జిన్ని పట్టెవర్ధనమును రాజితంబైన మృగాజినంబుఁ**
**దూలాడు సిగయును, వ్రేలుమాఱుట గోఁచి, వేలిమి బొట్టును, వ్రేళ్ళ దర్భ,**

**తే. దనర సందీప్తహవ్యవాహనసమాన, కాంతిఁ జెలువొంది యద్భుతక్రమ మెలర్పఁ**
**జతురగతి నప్డు వటుకవేషంబు దాల్చి, వచ్చి యా నీచదానవవరునిఁ జేరి. 1253**

**ప్రతి :** తాపింఛరుచితోడన్= తమాల వృక్షపు కాంతిని; త్రస్తరించెడు= పరిహసించే (తిరస్కరించే); మేనన్= శరీరమందు; పసిఁడి ముంజియున్= బంగారు మొలత్రాడు; తగు= చక్కని; పట్టుగొడుగు= పట్టువస్త్రము కప్పిన ఛత్రమును; ధవళ+అంశురుచి= చంద్రునికాంతివంటి; జన్నిదంబును= జంధ్యాన్ని; తిన్నని దండంబున్= వంకరలేనికఱ్ఱను; చేతన్= చేతిలో; కమండలువును= కమండలం; పసుపుగోచియున్= పసుపు రంగుగల గోచియును; చిన్నిపట్టె వర్ధనమును= చిన్నగా నుదుట అలంకరించిన పట్టినామం; రాజితంబు+ఐన= రాజితంబైన; మృగ+అజినమున్= ప్రకాశించే జింకతోలును; తూల+ఆడు సిగయును= కదలుతున్న వెంట్రుకలు; వ్రేలుమాట= వ్రేళ్లు మార్చుచు కదిలించే; కోఁచి= జపమాల; వేలిమి= హోమం(లోని) బొట్టును= భస్మతిలకమును; వ్రేల్లదర్భ తనర= వ్రేళ్లయందు దర్భ ఒప్పగా; సందీప్త= ప్రకాశిస్తున్న (దీపించుచున్న); హవ్యవాహన= అగ్నితో; సమాన= సమానమైన; కాంతిన్+చెలువు+ఒంది= కాంతితో అందగించి; అద్భుతక్రమము= ఆశ్చర్యకరమైన విధానం; ఎలర్పన్= ఒప్పగా; అప్డు= అప్పుడు; చతురగతిన్= నేర్పరితనంతో, వటుక వేషంబు= చిన్న బ్రహ్మచారి రూపాన్ని; తాల్చి= ధరించి; వచ్చి= ప్రవేశించి; ఆ నీచ దానవవరునిన్= నీచుడైన దానవరాజును; చేరి= సమీపించి...

**తా :** విష్ణువు చిన్నవటువు వేషాన్ని అపుడు చాలాచతురంగా ధరించినాడు. చీకటిచెట్టుకాంతివంటి కాంతిగలమేనితో; బంగారు మొలతాడు; పట్టుగొడుగు; తెల్లని జంజెము, దండము, కమండలము, పసుపు నీళ్లలో ముంచి తడి ఆరిన గోచిపాత, చిన్నపట్టెనామము, చంకలో జింకతోలు, కదిలే సిగ, వ్రేళ్లుమారుస్తున్న జపమాల, భస్మపుబొట్టు, వేలికి దర్భపవిత్రలు, అగ్నివలె తేజరిల్లే దేహం ధరించాడు. ఈ రూపంతో వచ్చి వృకాసురుణ్ణి సమీపించాడు.

**వ. కైతవంబున నతనికి నమస్కరించి మృదుమధురభాషణంబుల ననునయించుచు న య్యసురవరున కిట్లను; ని వ్విధంబున మార్గపరిశ్రాంతుండవై యింత దూరంబేల చనుదెంచితి? సకల సౌఖ్యకారణంబైన యీ శరీరంబు నిరర్థకంబు సేసి వృథాయాసంబున దుఃఖపఱుపం దగునే? యి య్యెడం గొంత తడవు విశ్రమింపు; మీ ప్రయాసంబునకుఁ గతం బెయ్యది? కపటహృదయుండవు గాక నీ యధ్యవసాయం బెఱింగింపం దగునేని నెఱింగింపు'మని మృదుమధురంబుగాఁ బలికిన న మ్మహాత్మునిసుధారసతుల్యంబు లయిన వాక్యంబులు విని సంతసిల్లి, య ప్పిశితాశనుండు దన పూనినకార్యం బతని కెఱింగించిన. 1254**

**ప్రతి :** కైతవంబునన్= కపటంతో; అతనికిన్ నమస్కరించి= వృకునికి అభివాదంచేసి; మృదుమధుర భాషణంబులన్= మెత్తని తియ్యని మాటలతో; అనునయించుచున్= బుజ్జగిస్తూ; ఆ+అసురవరునకున్= ఆ రాక్షస రాజుకు; ఇట్లు+అనునున్= ఈ విధంగా అన్నాడు; ఈ+విధంబునన్= ఇలాగా; మార్గ పరిశ్రాంతుడవు+ఐ= ప్రయాణిస్తూ అలసిపోయి; ఇంతదూరంబు=

ఇంత దూరం; ఏలచనుదెంచితి(వి)= ఎందుకు వచ్చావు? సకలసౌఖ్యకారణంబు+ఐన= అన్ని సుఖాలకు నెలవు అయిన; ఈ శరీరంబు= ఈ మేను; నిరర్థకంబు+చేసి= వ్యర్థంచేసి; వృథా+ఆయాసంబునన్= వ్యర్థంగా కష్టపెట్టి; దుఃఖపఱుపన్+తగున్+ఏ= బాధపెట్టుట మంచిదా? ఈ+ఎడన్= ఈ సందర్భంలో; కొంత తడవు= కొంచెంసేపు; విశ్రమింపుము= విశ్రాంతి తీసుకో, మీప్రయాసంబునకున్= మీ ఈ పరిశ్రమకు; కతంబు+ఏ+అది= కారణం అని? కపట హృదయుండవు+కాక= మోసంలేని హృదయంతో; నీ, అధ్యవసాయంబు= నీ పూనిక; ఎఱింగింపన్+తగున్+ఏనిన్= చెప్పదగిందైతే; ఎఱింగింపుము= చెప్పుము; అని, మృదుమధురంబు+కాన్= తియ్యగా, మెల్లగా; పలికినన్= పలుకగా; ఆ+మహా+ఆత్ముని= ఆ మహానుభావుని; సుధారసతుల్యంబులు+అయిన= అమృత రసంతో సమానమైన; వాక్యంబులు విని= మాటలు విని; సంతసిల్లి= సంతోషించి; ఆ+పిశిత+అశనుండు= మాంసం ఆహారంగాగల్గిన ఆ రాక్షసుడు; తన పూనినకార్యంబు= తాను నిర్వహించదలచినపనిని; అతనికిన్+ఎఱింగించినన్= వటువుకు తెలుపగా...

**తా :** విష్ణువు కపటంతో నమస్కరించి తియ్యటిమాటలతో వృకాసురుణ్ణి బుజ్జగిస్తున్నట్లు మాట్లాడినాడు. "అలసిపోతూ ఇంత దూరం ఎందుకు వచ్చావు? అన్ని సుఖాలకు ఆశ్రయమైన శరీరాన్ని ఊరికే ఎందుకు నొప్పిస్తావు? కొంతసేపు ఇక్కడ విశ్రాంతి తీసుకో. నీ కష్టానికి కారణమేమిటి? నీకిష్టమైతే నీ లక్ష్యమేమిటో వివరించు. చెప్పతగినదయితే చెప్పు" అని అమృతమయంగా కపటవటువు మాట్లాడగా, వృకాసురుడు సంతోషించి, తన ప్రయత్నాన్ని తెలుపగా

**చ.** **హరి దరహాస మొప్పఁ బిశితాశనుఁ గన్గొని పల్కె దానవే**
**శ్వర! మును దక్షుశాపమునఁ జాలఁ బిశాచిప తౌట సూనృత**
**స్ఫురణము మాని సంతతము బొంకుచు నుండు పురారిమాట నీ**
**వరయక వెంట నేఁగఁ దగ దాతనిచేఁతలు మాకు వింతలే? 1255**

**ప్రతి :** హరి= విష్ణువు; దరహాసము+ఒప్పన్= చిరునవ్వు ప్రకాశించగా; పిశిత+అశనున్= మాంస భోజనుణ్ణి (రాక్షసుణ్ణి); కన్గొని= చూచి; పల్కెన్= ఇలా చెప్పాడు; దానవ+ఈశ్వర!= రాక్షసరాజా! ముును= పూర్వం; దక్షుశాపమునన్= దక్షుడు శపించడంచేత, చాలన్= తగినట్లు; పిశాచపతి+ఓటన్= పిశాచాలకు రాజు కావడంచే; సూనృత స్ఫురణము= నిజాలు చెప్పేగుణం; మాని= మానివేసి సంతతము బొంకుచున్ ఉండు= ఎల్లపుడూ అబద్ధాలు ఆడుతుండే; పుర+అరి= శివుని యొక్క; మాటన్= మాటను; నీవు+అరయక= నీవు సరిగ్గా తెలుసుకోలేక; వెంటన్+ఏగన్+తగదు= అతనివెంబడి వెళ్లుట సరికాదు; ఆతనిచేతలు మాకున్ వింతలే= అతని ప్రవర్తనలు మాకు వింత ఏమీకాదు. (ఇటువంటివి సహజమే)

**తా :** హరి వృకాసురునితో ఇలా అన్నాడు. "శివుడు దక్షుని శాపంవల్ల పిశాచగణానికి అధిపతియైనాడు. సత్యనిష్ఠ లేదు. బొంకులు పలుకుతాడు. అతని వరం (మాటలు) నమ్మి అతణ్ణి అనుసరిస్తూ ఇంత శ్రమకోర్చివచ్చావు. అతని ప్రవర్తన మాకు వింతకాదు."

**ఆ.** **నిజము పలికెనేని నెఱిఁ దన తలమీఁద, నీ కరంబు మోపనీక తలఁగి**
**వచ్చునోటు నితనివలనఁ బ్రత్యయమునఁ, దగుల నేమి గలదు దనుజవర్య! 1256**

**ప్రతి :** దనుజవర్య= ఓ రాక్షసరాజా! (శివుడు); నిజము పలికెన్+ఏనిన్= నిజంగా వరం ఇచ్చే ఉంటే; నెఱిన్= చక్కగా; తనతలమీఁదన్= తనశిరస్సుపై; నీ కరంబున్= నీ చేతిని; మోపనీక= పెట్టనీయకుండా; తలఁగి వచ్చునోటు!= తొలగి

పారిపోయేవాడేనా? అతని వలనన్= ఈ శివుని వల్ల; ప్రత్యయమునన్= విశ్వాసంతో; తాగులన్+ఏమి+కలదు= ఉండాలని ఏముంది?

**తా :** పరమేశ్వరుడు నిజమే పలికిఉంటే నీ చేయి అతని శిరస్సుమీద పెట్టనివ్వకుండా ఎందుకు పారిపోతాడు? అతణ్ణి నమ్మవలెనని ఏముంది? (నమ్మ వలసిన అవసరం లేదని భావం)

**ఆ. అశుచి యగుచు నతని నంటఁగఁ బని గాదు, కాలుఁ జేయిఁ గడిగి కడఁక వార్చి**
**యతనివెంట వేడ్క నరుగుదువే నీవు, నవల నంటఁ దగును నసురనాథ! 1257**

**ప్రతి :** అసురనాథ= రాక్షసరాజా! అశుచి+అగుచున్= శుచిమంతుడుకాక; అతనిన్+అంటన్+కన్= శివుణ్ణి తాకడం; పనికాదు= సరియైందిగాదు; కాలున్+చేయిన్+కడిగి= కాళ్లు చేతులు కడుక్కొని; కడఁక= ఆవల; వార్చి= ఆచమించి; అతనివెంట వేడ్కన్= ఆయన వెంబడి, వినోదంగా; అరుగుదువు+ఏ= పోతే; నీవున్ అవలన్+అంటన్+తగును= నీవు తరువాత తాకవచ్చును.

**తా :** నీవు శుచిలేక శివుణ్ణి తాకరాదు. కాళ్లు చేతులు కడుక్కొని, ఆచమించి, అతణ్ణి వెంబడించి తాకవయ్యా! అని విష్ణువు కపటవటువురూపంలో చెప్పినాడు.

**మ. అతిదుశ్శంకలు మాని పొమ్మనిన దైత్యారాతిమాయావిమో**
**హితుఁడై విస్మృతి నొంది తామసముచే నేపారి వాఁ డాత్మ పా**
**ణి తలంబున్ దననెత్తి మోపికొని తా నేలన్ వెసన్ గూలె వి**
**శ్రుతదంభోళిహతిన్ వడిం బడు మహాక్షోణీధరంబో యనన్. 1258**

**ప్రతి :** అతి దుస్+శంకలుమాని= అతిశయించిన చెడ్డవైన అనుమానాలు తొలగించుకొని; పొమ్ము+అనినన్= ముందుకు నడవమని చెప్పగా; దైత్య+అరాతి= రాక్షసుల శత్రువైన విష్ణువుయొక్క; మాయా విమోహితుడై= మాయచేత వెఱ్ఱివాడై; విస్మృతిన్+ఒంది= జ్ఞానంతొలగి; తామసముచేన్= అజ్ఞానమైనచేష్టతో; ఏపారి= అతిశయించి, వాఁడు+ఆత్మపాణితలంబున్= వృకుడు తన అరచేతిని; తననెత్తిన్+మోపికొని= తన తలపై పెట్టుకొని; విశ్రుత= ప్రసిద్ధమైన; దంభోళి= ఇంద్రుని వజ్రాయుధం యొక్క; హతిన్= దెబ్బకు; వడిన్+పడు= వేగంగా పడిపోయే; మహాక్షోణీధరంబు+అనన్= గొప్పపర్వతమా అన్నట్లుగా; తాన్+వెసన్= తాను వెంటనే; నేలన్+కూలెన్= నేలమీద కూలి పోయాడు.

**తా :** లేనిపోని అనుమానాలు పెట్టుకోవద్దని చెప్పగా విష్ణుమాయచే విచక్షణ జ్ఞానాన్ని పోగొట్టుకొని, తమోగుణంతో ఒప్పి, తన చేయి తన తలపైననే పెట్టుకొని వజ్రాయుధం దెబ్బకు నేలకూలిన పర్వతంలాగా, కూలిపోయాడు.

**వ. అట్లు దన తల నూఱువ్రయ్యలై నేలం గూలిన యసురం గని యప్పుడు. 1259**

**ప్రతి :** అట్లు= ఆ విధమైన విష్ణుమూర్తి మాయా ప్రలోభాలతో; తనతల= వృకుని శిరం; నూఱువ్రయ్యలు+ఐ= నూఱు వ్రక్కలుగా పగిలి; నేలన్+కూలిన= మరణించిన; అసురన్+కని= ఆ రాక్షసుణ్ణి చూచి

**తా :** ఆ విధంగా విష్ణుమాయతో వృకుడు శివునిసంగతి విడిచి, యథాలాపంగా తనచేయి తన తలపైనే పెట్టుకొని నూరుముక్కలుగా పగిలి మరణించాడు.

**క. సుర లసురాంతకుమీఁదన్, వరమందారప్రసూనవర్షము లోలిం**
**గురిసిరి తుములంబై దివి, మొరసెన్ సురదుందుభిప్రముఖతూర్యంబుల్. 1260**

**ప్రతి :** సురలు= దేవతలు; అసుర+అంతకు మీదన్= రాక్షస సంహారియైన విష్ణువుపై; వరమందార ప్రసూన= శ్రేష్ఠమైన మందారపుపూల; వర్షములు= వానలు; ఓలిన్= వరుసగా; కురిసిరి= కురిసేలా చేసినారు; తుములంబు+ఐ= సంకులమై (దట్టమై), దివిన్= ఆకాశంలో; సురదుందుభి= దేవతల ఢంకలు; ప్రముఖ= మొదలైన; తూర్యంబులు= వాద్యాలు; మొరసెన్= మ్రోగాయి.

**తా :** ఈ రాక్షస సంహారానికి దేవతలంతా విష్ణువుపై పుష్పవర్షం కురిపించారు. ఆకాశంలో దేవదుందుభులు మోగించారు.

**క. పాడిరి గంధర్వోత్తము, లాడిరి దివి నప్సరసలు, నన్యోన్యములై**
**కూడిరి గ్రహములు, భయముల, వీడిరి మునికోటు లంత విమలచరిత్రా! 1261**

**ప్రతి :** విమలచరిత్రా!= పవిత్రమైన చరిత్రగలవాడా!; అంతన్= ఆ సమయంలో; గంధర్వ+ఉత్తములు= గంధర్వ శ్రేష్ఠులు; పాడిరి= పాటలుపాడారు; దివిన్= దేవలోకంలో; అప్సరసలు= దేవనాట్యకత్తెలు; ఆడిరి= నృత్యాలు చేశారు; గ్రహములు= ఖగోళంలోని సౌరకుటుంబ గ్రహాలు; అన్య+అన్యములు+ఐ= పరస్పరం కలసికొని (ఒకరికొకరుతోడై); కూడిరి= ఒక్కచోట చేరినారు; మునికోటులు= మునుల సమూహాలు; భయములన్+వీడిరి= భయం పోగొట్టుకున్నారు.

**తా :** సచ్చరిత్రుడవైన ఓ ధర్మజా! రాక్షసుని చావుతో ఆనందించిన గంధర్వులు పాటలు పాడారు. అప్సరసలు, నాట్యమాడారు. సూర్యాది గ్రహాలు సంతోషంతో కూడినారు. మునులు తమహోమాది అగ్ని కార్యాలకు ఇక విఘాతం లేదని భయం వదలారు.

**క. మురహరుఁ డెల నవ్వొలయఁగఁ, బురహరుఁ దగఁ జూచి పలికె భూతేశ్వర! యీ**
**నరభోజనుండు నీ కి, త్తతి నెగ్గొనరింపఁ దలఁచి తానే పొలిసెన్. 1262**

**ప్రతి :** మురహరుడు= మురుడు అనే రాక్షసుణ్ణి చంపిన విష్ణువు; ఎల= లేతయైన; నవ్వు+ఒలయన్+కన్= నవ్వు ఒప్పుతుండగా; పురహరున్= త్రిపురాలను నాశనము చేసినవాడైన శివుణ్ణి; తగన్+చూచి పలికెన్= చక్కగా చూచి అన్నాడు; ఈ నరభోజనుండు= నరులను ఆహారంగా తీసికొనేవీడు; నీకున్= నీకు; ఈతతిన్= ఈ సమయంలో; ఎగ్గు= కీడు; ఒనరింపన్+తలచి= చేయదలచి; తానే పొలసెన్= స్వయంగా రాక్షసుడే మరణించాడు.

**తా :** మురహరుడు పురహరుణ్ణి చూచి, “శివా! నీకు కీడు తలపెట్టదలచిన ఈ వృకుడు తానే స్వయంగా మరణించాడు”. అని చెప్పాడు.

**వ. అది యట్టిద కాదె! యిజ్జగంబున నధికుండయినవానికి నపకారంబు గావించిన మానవునకు శుభంబు గలుగునే? యదియునుంగాక జగద్గురుండ వగు నీ కవజ్ఞ దలంచు కష్టాత్ముండు వొలియుటం జెప్పనేల? యిట్టి దుష్టచిత్తుల కిట్టి వరంబు లిచ్చుట కర్జంబు గాదని య ప్పురాంతకు వీడ్కొలిపిన, నతండు మురాంతకు ననేకవిధంబుల నభినందించి నిజమందిరంబునకుం జనియె నని చెప్పి యిట్లనియె. 1263**

**ప్రతి :** అది+అట్టి+అది+అ= ఆ సంఘటన అలా జరగాల్సిందే కదా! ఈ+జగంబునన్= ఈ జగత్తులో; అధికుండు+అయిన వానికిన్= అతిఉత్తముడైన; అపకారంబు కావించిన= కీడు తలపెట్టిన; మానవునకున్= మానవునికి; శుభంబు= మంచి; కలుగునే= జరుగుతుందా? అదియునున్+కాక= అంతేగాక; జగత్+గురుండవు+అగు+నీకున్= సర్వప్రపంచానికే గురుస్థానంలో ఉన్న నీకు; అవజ్ఞ+తలంచు= కీడు తలపెట్టేన; కష్ట+ఆత్ముండు= దుర్మార్గుడు; పొలియుటన్+చెప్పన్+ఏల= చావడం చెప్పాలా? ఇట్టి= ఇలాంటి; దుష్టచిత్తులకున్= దుర్బుద్ధులకు (దుర్మార్గులైన వారికి); ఇట్టి= ఈలాంటి ప్రమాదకరము లైన; వరంబులు+ఇచ్చుట= కోరినకోర్కెలు ప్రదానం చెయ్యడం; కర్జంబు కాదు= తగన పని కాదు; అని, ఆ+పుర+అంతకున్= ఆ శివుణ్ణి; వీడు+కొలిపినన్= సాగనంపగా; అతండు= పరమశివుడుకూడా; ముర+అంతకున్= విష్ణువును; అభినందించి= ప్రశంసించి; నిజమందిరంబునకున్= తన కైలాసానికి; చనియెన్+అని చెప్పి= వెళ్లినాడని చెప్పి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** విష్ణువు “అలా జరుగవల్సిందే గదా! లోకంలో ఉత్తములకు అపకారం చేసినవారికి శుభం ఎలా కల్గుతుంది? అంతేకాదు – జగద్గురువువైన శివా! నీకు కీడు తలపెట్టినవాడు చావక తప్పదు. ఇలాంటి దుర్మార్గులకు ప్రమాదకరమైన వరాలు ఇవ్వడం మంచిదికాదు”– అని పలికి శివునికి వీడ్కోలు చెప్పాడు. శివుడుకూడా తనను గండంనుండి తప్పించినందుకు విష్ణువును పలురీతులుగ పొగడి కైలాసానికి వెళ్లిపోయాడు అని కృష్ణుడు చెప్పిన విధంగా శుకుడు పరీక్షిత్తుకు చెప్పి; ఇంకా ఇలా అన్నాడు.

**క. మానవనాయక! యీ యా, ఖ్యానముఁ జదివినను వినిన ఘనపుణ్యులు ని**
**త్యానందసౌఖ్యములఁ బెం, పూనుదు రటమీఁద ముక్తి నొందుదు రెలమిన్! 1264**

**ప్రతి :** మానవనాయక!= ఓ పరీక్షిద్రాజా!; ఈ+ఆఖ్యానమున్= ఈ కథను; చదివినను= చదివినట్టి; వినిన= వినినట్టి ఘనపుణ్యులు= గొప్ప పుణ్యాత్ములు; నిత్య+ఆనంద సౌఖ్యములన్= ఎల్లప్పుడు, సుఖాన్ని, ఆనందాన్ని, పెంపు+ఊనుదురు= అభివృద్ధి చేసుకొంటారు; అటమీదన్= ఆపై; ఎలమిన్= ఎంతో ఇష్టంగా; ముక్తిన్+ఒందుదురు= మోక్షం పొందుతారు

**తా :** శుకుడు పరీక్షిత్తుతో “ఓ రాజా! ఈ కథ ఎవరు చదివినా, విన్నా, గొప్ప పుణ్యం సంపాదించి, సౌఖ్యాన్ని ఆనందాన్ని ఎల్లవేళల పొందడమేగాక, అంతిమంగా మోక్షాన్నీ పొందుతారు” అన్నాడు.

**వ. అని చెప్పి శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రున కిట్లనియె. 1265**

**ప్రతి :** అని= ఈ విధంగా; చెప్పి= ప్రబోధంచేసి; శుకయోగి+ఇంద్రుడు= యోగిశ్రేష్ఠుడైన శుకుడు; పరీక్షిత్+నర+ఇంద్రునకున్= పరీక్షిత్తు మహారాజుతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా ప్రవచించిన శుకుడు పరీక్షిత్తుకు ఇంకా ఇలా అన్నాడు.

**క. జననాయక! యింకఁ బురా, తనవృత్తం బొకటి నీకుఁ దగ నెఱిఁగింతున్.**
**వినుము తపోమహిమలఁ జెం, దిన మునిజనములు సరస్వతీనదిపొంతన్. 1266**

**ప్రతి :** జననాయక!= మహారాజా! ఇంకన్= ఇంకనూ; పురాతన వృత్తంబు= పురాతన కథ; ఒకటి నీకున్+తగన్= నీకు ఒకటి చక్కగా; ఎఱిఁగింతున్= చెపుతాను; వినుము= వినవయ్యా!; తపస్+మహిమలన్+చెందిన= తపఃప్రభావంగల; మునిజనములు= మునిజనులు; సరస్వతీనది పొంతన్= సరస్వతీనదీ సమీపంలో...

**తా :** శుకుడు పరీక్షిత్తుతో "రాజా! నీ కొక పురాతనకథ చెపుతాను. మహానుభావులైన మునీంద్రులు పూర్వం సరస్వతీ నదీతటంలో నివసిస్తూ

### ✤ భృగుమహర్షి త్రిమూర్తుల ప్రాశస్త్యంబు శోధించుటకుఁ బోవుట ✤

**క. వితతక్రియ లొప్పఁగ స, త్క్రతువుల నొనరించు చచటఁ గైగొని లక్ష్మీ**
**పతిభవ పితామహులలో, నతులితముగ నెవ్వ రధికు లని తమలోనన్. 1267**

**ప్రతి :** (మునులు) వితత క్రియలు+ఒప్పన్+కన్= విస్తరించిన పనులు కూర్చుకుని; సత్+క్రతువులన్+అచటన్= ఆసరస్వతీ నదీ తీరంలోచక్కని యాగాలను, కైకొని= చేపట్టి; ఒనరించుచున్= చేస్తూ; లక్ష్మీపతి - భవ - పితామహులలోన్= విష్ణువు, శివుడు, బ్రహ్మలలో; అతులితము+కాన్= సాటిలేని; ఎవ్వరు= ఎవరు; అధికులు= శ్రేష్ఠులు; అని, తమలోనన్= మునులు తమలోతాము (తర్కించుకొనిరి)

**తా :** సమస్త సంభారాలతో అనేకాలైన చక్కటి యాగాలు సరస్వతీ నదీతీరంలో చేస్తున్న మునులు ఒకనాడు త్రిమూర్తులలో ఎవ్వరు శ్రేష్ఠులు అని తర్కించుకొన్నారు.

**వ. ఇట్లు దలపోసి తన్మహత్త్వం బంతయుం దెలిసి రమ్మని భృగుమహాముని న మ్ముువ్వురు వేల్పులకడకుం బంపిన న త్తాపసోత్తముండు సని చని ముందట. 1268**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; తలపోసి= భావించి (తర్కించి); తద్+మహత్త్వంబు+అంతయున్= వారిగొప్పతనాన్నంతటినీ; తెలిసి రమ్ము+అని= కనుక్కొని రమ్మని; భృగుమహామునిన్= భృగు మహర్షిని; ఆ+ముువ్వురు వేల్పుల కడకున్= ఆ త్రిమూర్తుల వద్దకు; పంపినన్= పంపగా; ఆ+తాపస+ఉత్తముండు= ఆ శ్రేష్ఠుడైనతపస్వి; చని చని= బయల్దేరివెళ్లి; ముందు+అట= అక్కడ ముందుగా...

**తా :** తాపసులు, తర్కించుకొని, త్రిమూర్తులలో ఎవరుగొప్పో నిర్ణయించుకొని రమ్మని; భృగుమహర్షికి బాధ్యత అప్పచెప్పగా అతడు బయలుదేరి, ముందట

**క. జలరుహసంజాత సభా, స్థలమున కొగి నేఁగి యతని సత్త్వగుణంబుం**
**దెలియుటకై నుతివందన, ములు సేయకయున్న నజుఁడు ముసముస యనుచున్. 1269**

**ప్రతి :** జలరుహసంజాత= బ్రహ్మయొక్క; సభాస్థలమునకున్= కొలువు కూటానికి; ఒగిన్= వరుసగా; ఏగి= వెళ్లి; అతని= ఆ బ్రహ్మయొక్క; సత్త్వగుణంబున్= సాత్త్వికమైన స్వభావాన్ని; తెలియుటకున్+ఐ= తెలుసుకోవడానికై; నుతి; వందనములు= నమస్కారాలు, స్తోత్రాలు; సేయక+ఉన్నన్= చేయకుండా ఉంటే; అజుఁడు= బ్రహ్మ; ముసముస+అనుచున్= రుసరుస లాడుతూ...

**తా :** భృగువు బ్రహ్మసభలో ప్రవేశించి, అతని సాత్త్విక ప్రవృత్తిని పరీక్షింపదలచి, నమస్కరించక అవిధేయతతో నిలబడగా, బ్రహ్మకు కోపంవచ్చి రుసరుసలాడుతూ

**క. మనమునఁ గలఁగుచు భృగుఁ దన, తనుజాతుం దనుచు బుద్ధిఁ దలఁచినవాఁడై**
**ఘనరోషస్ఫురితాగ్నిని, ననయము శాంతోదకముల నల్లన నార్చెన్. 1270**

**ప్రతి :** మనమునన్+కలగుచున్= మనస్సులో తపిస్తూ; భృగున్= భృగుమహర్షిని; తన తనుజాతుండు+అనుచున్= తనకొడుకని; బుద్ధిన్+తలఁచినవాఁడు+ఐ= మనసులో భావించినవాడై; ఘనరోష+స్ఫురిత+అగ్నిన్= మిక్కిలిగా స్ఫురించే రోషమనెడు అగ్నిని; అనయము= అవశ్యం; శాంత+ఉదకములన్= శాంతమనెడు నీళ్లతో; అల్లనన్= మెల్లగా; ఆర్చెన్= ఆర్పెను.

**తా :** తనకు నమస్కరించలేదన్న కోపంతో బ్రహ్మ తన మనస్సులో కోపించి, భృగువు తన కొడుకు కావడంవల్ల కోపాన్ని మెల్లగా శాంతింపచేసికొన్నాడు.

**చ. మహిత తపోధనుండు మునిమండనుఁ డయ్యెడఁ బాసి వెండియు**
**న్నహిపతిభూషుఁ గాన రజతాద్రికి నేగిన న గ్గిరీంద్రుపైఁ**
**దుహినమయూఖశేఖరుఁడు దుర్గయుఁ దాను విశ్రమించుచున్**
**ద్రుహిణతనూభవుండు సనుదెంచుట కాత్మఁ బ్రమోద మందుచున్. 1271**

**ప్రతి :** మహిత= గొప్పనైన; తపస్+ధనుండు= తపస్సే ధనంగాగల్గినవాడు; మునిమండనుడు= మునులకే అలంకారమైనవాడు; భృగుమహర్షి; ఆ+ఎడన్+పాసి= ఆ చోటును వదిలి; వెండియున్= ఇంకా; అహిపతి భూషున్= శివుణ్ణి; కానన్= చూడడానికై; రజత+అద్రికిన్+ఏగినన్= వెండికొండకు (కైలాసగిరికి) వెళ్లగా; ఆ+గిరి+ఇంద్రు పైన్= ఆ పర్వతరాజు ఐన హిమాలయంపై; తుహిన – మయూఖ – శేఖరుఁడు= మంచు(చల్లని) కిరణాలుగలవాడైన చంద్రుణ్ణి; శిఖరము (తలపై)న ధరించిన శివుడు; దుర్గయున్= పార్వతీదేవియు; తానును= తానుకూడ (శివుడు) కూడా; విశ్రమించుచున్= విశ్రాంతి తీసుకొంటూ ఉండగా; ద్రుహిణ – తనూభవుండు= బ్రహ్మకుమారుడైన భృగువు; చనుదెంచుటకున్= రాకకు; ఆత్మన్+ప్రమోదము+అందుచున్= హృదయంలో సంతోషపడుతూ...

**తా :** భృగుమహర్షి బ్రహ్మలోకంనుండి బయలుదేరి, శివుణ్ణి చూడటానికి కైలాసానికి వెళ్లాడు. అక్కడ శివుడు, పార్వతీదేవితో బాటు విశ్రాంతిగా కూర్చుని ఉన్నాడు. బ్రహ్మకుమారుడైన భృగువురాకకు చాలా సంతోషిస్తూ

**క. కనుఁగొని భ్రాతృస్నేహం, బునఁ గౌఁగిటఁ జేర్చు ననుచు ముక్కంటి రయం**
**బున నెదురేగిన ముని రు, ద్రునియందలి సత్త్వగుణ మెఱుంగుటకొఱకై. 1272**

**ప్రతి :** కనుగొని= చూచి; భ్రాతృస్నేహంబునన్= సోదరభావంతో; కౌఁగిటన్+చేర్చున్+అనుచున్= కౌగిట్లోకి తీసుకొంటాడని; ముక్కంటి= శివుడు; రయంబునన్= వేగంగా; ఎదురు+ఏగినన్= ఎదుర్కొనుటకు వెళ్లగా; ముని= భృగువు; రుద్రుని+అందలి= శివునిలోని; సత్త్వగుణము+ఎఱుంగుటకొఱకున్+ఐ= సాత్త్విక లక్షణాన్ని పరిశీలించటానికై...

**తా :** భృగువును చూచి, సోదరభావంతో తనను కౌగిలించుకొంటాడని వేగంగా అతని వద్దకు వేగంగా వెళ్లగా, అతని సాత్త్వికలక్షణం పరీక్షించాలనుకున్న భృగువు

**వ. అతనిం గైకొనక యూరకుండిన. 1273**

**ప్రతి :** అతనిన్= ఆ శివుని; కైకొనక= స్వీకరింపక; ఊరకుండిన= పట్టించుకోకుండా ఉండగా...

**తా :** శివుడు ఆత్రంగా ఎదురురాగా, భృగువు అతణ్ణి చూడనివానివలె ప్రవర్తించగా

ఉ. ఆ నిటలాంబకుండు గమలాసననందనుఁ జూచి భూరి కా
లానలరోషవేషభయదాకృతిఁ దాల్చి పటుస్ఫులింగ సం
తానము లొల్క శూలమునఁ దాపసముఖ్యునురంబు వ్రేయఁగాఁ
బూనినఁ బార్వతీరమణి బోరన నడ్డము వచ్చి చెచ్చెరన్; 1274

**ప్రతి :** ఆ నిటల+అంబకుండు= నుదుట కన్నుకల ఆ శివుడు; కమల+ఆసన - నందనున్+చూచి= బ్రహ్మమానస పుత్రుడైన భృగువును చూచి; భూరి= గొప్పనైన; కాల+అనల= ప్రళయకాలపు అగ్నివంటి; రోషవేష= కోపంగల వేషంతో; భయద+ఆకృతిన్+తాల్చి= భయంగొలిపే ఆకారంగల్గి; పటు - స్ఫులింగ= గొప్పనిప్పురవ్వల; సంతానములు= గుంపులు; ఒలన్= రాలగా; శూలమునన్= తనచేతిలోని త్రిశూలంతో; తాపసముఖ్యుని+ఉరంబు= మునులలో శ్రేష్ఠుడైన భృగువువక్షస్థలాన్ని; వ్రేయన్+కాన్+పూనినన్= కొట్టబోగా; పార్వతీరమణి= పార్వతీదేవి; బోరన= హఠాత్తుగా; అడ్డము వచ్చి= భృగువుకు అడ్డపడి; చెచ్చెఱన్= వెంటనే...

**తా :** ఆ అవమానాన్ని సహించని ఫాలాక్షుడు, భృగువును చూచి, ప్రళయకాలరుద్రుడై, కళ్లనుండి నిప్పులురాలగా, శూలంతీసి, అతని వక్షఃస్థలంపై పొడువ బోయాడు. ప్రమాదం పసిగట్టిన పార్వతీదేవి భృగువుకు హఠాత్తుగా అడ్డంవచ్చి

క. తన విభుపాదములకు వం, దనముం గావించి సముచితప్రియముల న
య్యనలాక్షునికోపము మా, న్చిన నమ్మునినాథుఁ డచట నిలువక చనియెన్. 1275

**ప్రతి :** తన విభు= తన భర్తఅయిన శివునియొక్క; పాదములకు= పాదాలకు; వందనమున్+కావించి= నమస్కరించి; సముచిత - ప్రియములన్= తగినట్టి ఆప్యాయతలతో; ఆ+అనల+అక్షుని= ఆ శివుని యొక్క; కోపమున్= క్రోధాన్ని; మాన్చినన్= మాన్పగా; ఆ+మునినాథుఁడు= ఆ మునిశ్రేష్ఠుడైన భృగువు; అచటన్= ఆ కైలాసంలో; నిలువక= (ఇక) ఆగక; చనియెన్= వెళ్లిపోయాడు.

**తా :** పార్వతీదేవి తన భర్త అయిన శివుని పాదాలపైబడి, ఆప్యాయతలతో ఊరడించి, శాంతపరిచింది. వెంటనే భృగువు అక్కడనుండి వెళ్లిపోయాడు.

సీ. పొలుపొందు వైకుంఠపురమున కర్థితోఁ జని యందు సమధికైశ్వర్య మొప్పఁ
గమలాంక పర్యంకగతుఁడై సుఖించు న క్కౌస్తుభభూషు వక్షస్థలంబుఁ
దన పాదమున బిట్టు దన్నెఁ దన్నినఁ బాన్పు డిగి వచ్చి మునిఁ జూచి నగధరుండు
పదముల కెఱఁగి యో పరమతపోధన! యీగతి నీ వచ్చు టెఱుఁగ లేక

తే. యున్న నా తప్పు మన్నించి నన్నుఁ గరుణఁ, జూచి యీ దివ్యమణిమయస్ఫూర్తిఁ దనరు
రుచిరసింహాసనమునఁ గూర్చుండు దివ్య, తాపసోత్తమ! యభయప్రదాననిపుణ! 1276

**ప్రతి :** పొలుపు+ఒందు= అందంగా ఉన్న; వైకుంఠపురమునకున్= విష్ణునివాసస్థానానికి; అర్థితోన్+చని= కోరికతో వెళ్లి; అందున్= ఆ వైకుంఠంలో; సమధిక+ఐశ్వర్యము+ఒప్పన్= తగినంత గొప్ప సంపదలతో ప్రకాశింపగా; కమలా+అంక పర్యంకగతుఁడు+ఐ= లక్ష్మీదేవి యొక్క ఒడియే తనకు పాన్పుగా కలవాడై; సుఖించు= సుఖపడుతున్న; ఆ+కౌస్తుభభూషున్=

కౌస్తుభ మణిని భూషణంగా గల్గిన ఆ విష్ణుని; వక్షఃస్థలంబున్= వక్షఃస్థలాన్ని; తన పాదములన్= తనకాలితో; బిట్టు+తన్నెన్= గట్టిగా తన్నాడు; తన్నినన్+పాన్పుడిగివచ్చి= తన్నగా పాన్పునుండి దిగివచ్చి; మునిన్+చూచి= భృగుణ్ణి చూచి; నగధరుండు= గోవర్ధనధారియైన కృష్ణుడు (విష్ణువు); పదములకున్= భృగునిపాదాలకు; ఎఱఁగి= నమస్కరించి; ఓ పరమ తపస్+ధనా= గొప్ప తపస్సే ధనంగా గల్గినవాడా! మహర్షీ! దివ్యతాపస+ఉత్తమ!= దేవతా – తాపసులలో శ్రేష్ఠుడా! అభయప్రదాననిపుణ!= ఆర్తులకు అభయమిచ్చే విషయంలో నేర్పరి అయినవాడా!; ఈ గతిన్= ఈవిధంగా; నీవు= నీకు; వచ్చుట+ఎరుగలేక+ఉన్న= రావడం తెలియకుండా ఉన్నట్టి; నా తప్పు మన్నించి= నా పొరపాటు క్షమించి; నన్నున్+కరుణన్+చూచి= నన్ను దయతో అనుగ్రహించి; ఈ దివ్య మణిమయస్ఫూర్తిన్+తనరు= ఈ గొప్ప ప్రకాశంగల్గిన మణులతో ఉన్న, రుచిరసింహాసనమునన్= మనోహరమైన ఉన్నతాసనంపై; కూర్చుండు= కూర్చోవలసింది.

**తా :** భృగువు అందమైన వైకుంఠపురానికి వెళ్లి, శేషతల్పంలో లక్ష్మీసమేతుడై, కౌస్తుభమణిహారం వక్షఃస్థలంపై ధరించి, విశ్రాంతుడైన విష్ణువు వద్దకు వెళ్లి, అవమానం జరుపదలచి, తనపాదంతో వక్షంపై తన్నినాడు. విష్ణువు వెంటనే మంచంనుండి లేచివచ్చి, భృగువు పాదాలకు నమస్కరించినాడు. "మీరు వచ్చింది గమనించక మిమ్ము ఆహ్వానించలేదు. నన్ను దయతో అనుగ్రహించి, ఈ స్వర్ణ మణిమయ సింహాసనంపై కూర్చోండి" అని వినయంతో విష్ణువు ప్రార్థించినాడు.

**క. అలఘుపవిత్ర! భవత్పద, జలములు నను నస్మదీయ జఠరస్థ జగం**
**బుల లోకపాలురను బొలు, పలరఁగఁ బుణ్యులను జేయు ననఘచరిత్రా! 1277**

**ప్రతి :** అనఘ చరిత్రా!= పుణ్య చరిత్రంకలవాడా!; అలఘు పవిత్ర!= గొప్ప పవిత్రత గలవాడా! భవత్+పదజలములు= నీ కాళ్లుకడిగిన నీరు; ననున్= నన్ను; అస్మదీయ= నాకు చెందిన; జఠరస్థ= కడుపులోఉన్న; జగంబులన్= భువనాలను; లోకపాలురను= పధ్నాలుగు లోకాల పాలకులను; పొలుపు+అలరన్+కన్= చక్కగా; పుణ్యులను= పుణ్యాత్ములుగా; చేయున్= చేస్తుంది.

**తా :** మహానుభావా! నీ పాదజలాలు, నన్ను, నాకుక్షిలో ఉన్న చతుర్దశభువనాలను, లోకపాలకులనూ పవిత్రుల్ని చేస్తాయి.

**వ. మునీంద్రా! భవదీయపాదాబ్జహతి మద్భుజాంతరంబునకు భూషణం బయ్యె; భవదాగమనంబు మాఁ బోటివారికి శుభావహం బగుం గాదె; యేను ధన్యుండ నైతి నని మృదుమధురాలాపంబుల ననునయించిన న మ్మునివరుండు లక్ష్మీనాథుసంభాషణంబులకుఁ జిత్తంబునం బరమానందంబు నొంది, య మ్ముకుందు ననంతకల్యాణగుణనిధి నభినందించి యానందబాష్పధారాసిక్తకపోలుం డగుచుఁ దద్భక్తిపారవశ్యంబున నొండు పలుకనేరక యతనిచేత నామంత్రణంబు వడసి మరలి సరస్వతీతీరంబున నున్న మునుల సన్నిధికిం జనుదెంచి వారలం గనుంగొని. 1278**

**ప్రతి :** ముని+ఇంద్రా!= ముని శ్రేష్ఠుడా! భృగూ!; భవదీయ – పాద+అబ్జ+హతిన్= నీ పాదకమలాలయొక్క దెబ్బ; మత్+భుజ+అంతరంబునకున్= నా వక్షఃస్థలానికి; భూషణంబు+అయ్యెన్= అలంకారమైంది; భవత్+ఆగమనంబు= మీరాక; మాబోటివారికిన్= మా వంటివారికి; శుభ+ఆవహంబు+అగున్+కాదు+ఎ!= శుభానికి నెలవు కదా! ఏను ధన్యుండన్+ఐతిని= నేను ధన్యుడనయ్యాను; అని మృదు మధుర+ఆలాపంబులన్= మెత్తని తియ్యని మాటలతో; అనునయించినన్= ప్రేమగా బుజ్జగించగా; ఆ+మునివరుండు= ఆ మునిశ్రేష్ఠుడు; లక్ష్మీనాథు= విష్ణువుయొక్క;

సంభాషణంబులకున్= మాటలకు; చిత్తంబునన్= మనసులో; పరమ+ఆనందంబున్+ఒంది= మిక్కిలి సంతోషంపొంది; ఆ+ముకుందున్= ఆ విష్ణువును; అనంత కల్యాణ గుణనిధిన్= అంతులేని శుభా, గుణాలకూ నిధి అయినవాణ్ణి (విష్ణువును); అభినందించి= నుతించి; ఆనంద - బాష్పధారా - సిక్త - కపోలుండు+అగుచున్= ఆనందబాష్పధారలతో ధారలచే తడిసిన చెక్కిళ్లు కలవాడవుడు; తద్భక్తిపారవశ్యంబునన్= ఆతని యందలి భక్తియొక్క పరవశత్వం చేత, ఒందు పలుకనేరక= ఇతం విషయాలు పలుకలేక; అతనిచేతన్= విష్ణువుచేత; ఆ మంత్రణంబు+పడసి= అనుమతిపొంది; మరలి= తిరిగివెళ్లి; సరస్వతీ తీరంబునన్+ఉన్న= సరస్వతీ నదిఒడ్డున ఉన్న; మునుల= తాపసులయొక్క; సన్నిధికిన్+చనుదెంచి= దగ్గరకువచ్చి; వారలన్+కనుగొని= ఆ మునుల్ని చూచి...

**తా :** "మునిశ్రేష్ఠుడైన భృగూ! మీ పాదాలతాకిడి నా వక్షఃస్థలానికి ఆభరణం సుమా! మావంటివారికి మీరాక శుభకరం. నేను ధన్యుణ్ణి అయ్యాను" అని తియ్యగా సాత్త్వికగుణయుక్తంగా బుజ్జగింపుమాటలు పలుకగా, మహర్షి, విష్ణునిమాటలకు ఎంతో ఆనందించి, ఆ భగవంతుని కల్యాణగుణాలను ప్రశంసించి ఆనందబాష్పాలతో మరేమీ మాట్లాడ కుండా; వీడ్కొని, సరస్వతీనదీ తీరంలోని మునుల దగ్గరకుపోయి వాళ్లను చూచి

**సీ. మునినాయకులతోడఁ దన పోయి వచ్చిన తెఱఁగును దనమది దృష్టమైన**
**మూఁడుమూర్తుల విధంబును నెఱింగించిన విని వారు మనముల విస్మయంబు**
**నంది చిత్తంబున సందేహమును బాసి చిన్మయాకారుండు శ్రీసతీశుఁ**
**డనుపముఁ డనవద్యుఁ డఖిల కల్యాణగుణాకరుఁ డాదిమధ్యాంతరహితుఁ**

**తే. డై తనర్చిన పుండరీకాక్షుఁ డొకఁడ, కాక గణుతింప దైవ మొక్కరుఁడు వేఱ**
**కలఁడె యనుబుద్ధి విజ్ఞానకలితు లగుచు, హరిపదాబ్జాతయుగళంబు నర్థిఁ గొలిచి. 1279**

**ప్రతి :** మునినాయకులతోడన్= సరస్వతీ తీరమందలి మునిశ్రేష్ఠులతో; తన పోయి వచ్చిన తెఱఁగును= తాను పోయి వచ్చిన విశేషాల్ని; తనమదిన్= తనమనసుద్వారా; దృష్టము+ఐన= చూచిన (పరిశీలించిన); మూఁడు మూర్తుల విధంబునున్= త్రిమూర్తుల విధానాన్ని; ఎఱింగించినన్= చెప్పగా; విని, వారు= ఆ ఋషులు; మనములన్= తమ మనస్సులలో; విస్మయంబున్+అంది= ఆశ్చర్యపడి; చిత్తంబునన్= హృదయంలోని; సందేహమును+పాసి= అనుమానంవదలి; చిత్+మయ+ఆకారుండు= విజ్ఞానమే ఆకారమైనవాడు; శ్రీసతి+ ఈశుఁడు= లక్ష్మీదేవి భర్త; అనుపముడు= సాటిలేనివాడు; అనవద్యుడు= నిందలులేనివాడు; అఖిల కల్యాణగుణ+ఆకరుడు= సమస్త శుభకరాలైన గుణాలకు నిలయుడు; ఆది - మధ్య+అంత - రహితుఁడు+ఐ= మొదలు, నడుమ, తుదలేనివాడు అయి; తనర్చిన= ఒప్పిన; పుండరీక+అక్షుఁడు= తెల్లదామరల రేకులవంటి కన్నులు కలవాడు శ్రీమహావిష్ణువు; ఒకఁడు+అ+కాక= ఒక్కడేకాక; గణుతింపన్= లెక్కింపగా; ఒక్కరుఁడు= మరొకడు; వేఱు దైవము కలఁడు+ఎ= ఇతర దేవుడు ఉన్నాడా? (లేదు) అను, బుద్ధిన్= అనే బుద్ధియందు; విజ్ఞాన కలితులు+అగుచున్= తెలివిడి కలవారగుచు; హరిపద+అబ్జాత - యుగళంబున్= విష్ణువు పాదాలనే కమలాలజంటను; అర్థిన్+కొలిచి= ఇష్టంగా; సేవించి...

**తా :** తనను పంపించిన మునులతో, తన ప్రయాణాన్ని, తనతో త్రిమూర్తులు ప్రవర్తించిన విధానాన్ని, వారి స్వభావాల్నీ తెలియజేయగా, ఈ వృత్తాంతాన్ని విని, మునులు ఆశ్చర్యాన్ని పొందారు. వారు తమ మనస్సుల్లో సందేహాన్ని తొలగించుకొని, "అఖిల శుభంకరుడు, శాశ్వతుడైన విష్ణువు ఒక్కడే పరమదైవం" అని నిశ్చయించుకొని అతణ్ణీ కొలిచి

**వ. అట్లు సేవించి యవ్యయానందం బయిన వైకుంఠధామంబు నొంది; రని చెప్పి వెండియు నిట్లనియె. 1280**

**ప్రతి :** అట్లు సేవించి= ఆ విధంగా కొలిచి; అవ్యయ+ఆనందంబు+అయిన= నాశంలేని ఆనందస్వరూపంగల; వైకుంఠధామంబున్= వైకుంఠపురాన్ని; ఒందిరి= పొందారు; అని చెప్పి; వెండియున్+ఇట్లు+అనియెన్= ఇంకా శుకుడు ఇలా అన్నాడు.

**తా :** విష్ణువే పరదైవమని నిశ్చయించి కొలిచి, అతని అనుగ్రహంతో వైకుంఠాన్ని పొందారు. అని ఇంకా శుకుడిలా అన్నాడు.

## ❖ శ్రీకృష్ణుడు మృతు లయిన విప్రసుతులఁ దెచ్చుట ❖

**సీ. నరనాథ! యొకనాఁడు నలినాయతాక్షుండు వొలుచు కుశస్థలీపురమునందు**
**సుఖముండ నొక్క భూసురవర్యు భార్యకుఁ బుత్త్రుండు జన్మించి పుట్టినపుడ**
**మృతుఁడైన ఘనశోకవితతిచేఁ గ్రాఁగుచు, నా డింభకునిఁ గొంచు నవనిసురుఁడు**
**సనుదెంచి పెలుచ రాజద్వారమునఁ బెట్టి కన్నుల బాష్పాంబుకణము లొలుక**

**తే. బాపురే! విధి నను దుఃఖపఱుపఁ దగునె?, యనుచు దూఱుచుఁ దనుఁ దిట్టుకొనుచు వగల**
**డెంద మందంద యెరియ నాక్రందనంబు, సేయుచును వచ్చి యా విప్రశేఖరుండు. 1281**

**ప్రతి :** నరనాథ!= పరీక్షిన్మహారాజా! ఒకనాఁడు= ఒకనాడు; నలిన+ఆయత+అక్షుండు= తామరదళాలవంటి విశాలమైన కన్నులు కలవాడు (శ్రీకృష్ణుడు); పొలుచు= ప్రకాశిస్తున్న (నివసిస్తున్న); కుశస్థలీ పురమునందు= కుశస్థలీ అనే పేరుగల నగరమున (ద్వారకా నగరమునందు); సుఖము+ఉండన్= సుఖంగా ఉంటుండగా; ఒక్క భూసురవర్యు భార్యకున్= శ్రేష్ఠుడు ఐన ఒక బ్రాహ్మణుని భార్యకు; పుత్రుండు జన్మించి= కొడుకు పుట్టె; పుట్టినపుడ మృతుడు+ఐన= పుట్టగానే చనిపోగా; ఘన – శోక – వితతిచేన్= గొప్ప దుఃఖాల సమూహంచే; క్రాఁగుచున్= తపిస్తూ; ఆ డింభకునిన్+కొనుచున్= ఆ బాలుని మోసుకొనివచ్చి; అవనిసురుడు= బ్రాహ్మణుడు; చనుదెంచి= వచ్చి; పెలుచన్= ఆగ్రహంతో; రాజద్వారమునన్+ పెట్టి= రాజుగారి నివాసభవనం గడపవద్దపెట్టి; కన్నులన్= కళ్ళలోనుండి; బాష్ప+అంబుకణములు+ఒలుక= కన్నీటి బిందువులు జారగ; బాపురే= అయ్యో! విధి= భాగ్యము (కాలము); నను దుఃఖపఱుపన్+తగునె?= నన్ను ఇంత బాధపెట్టాలా?; అనుచు= అంటూ; దూఱుచున్= తిట్టుతూ; తనున్+తిట్టుకొనుచు= తనను తాను దూషించుకొంటూ; డెందము= హృదయము; వగల= దుఃఖముచే; అందంద+ఎరియన్= అంతట బాధించగా; ఆక్రందనంబు+చేయుచున్= మొఱపెట్టుతూ; వచ్చి, ఆ విప్రశేఖరుండు= ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు…

**తా :** పరీక్షిన్మహారాజా! శ్రీకృష్ణుడు ఒకపర్యాయం కుశస్థలీ నగరంలో అతిథిగా ఆనందిస్తుండగా, ఒక బ్రాహ్మణుని భార్య ప్రసవించింది. పుట్టిన కొడుకు పురిటిలోనే మరణించాడు. బ్రాహ్మణుడు మహాశోకంతో శిశువు శవాన్ని మోసుకొనివచ్చి, రాజద్వారం ముందరపెట్టి, విధిని, తనను నిందిస్తూ అమితమైన దుఃఖంతో దీనాలాపాలు చేస్తూ

**సీ. అధికశోకంబున నలమటఁ బొందుచు నచ్చటి జనులతో ననియెఁ బెలుచ**
**బ్రాహ్మణ విద్వేషపరుఁ డయి తగ శాస్త్ర పద్ధతి నడవక పాపవర్తి**

**యై క్షత్రబంధువుఁ డగు వాని దురితంబు చేత మత్పుత్త్రుండు జాతమైన**
**యప్పుడ మృతుఁ డయ్యె నక్కట! హింసకు రోయక యెప్పు డన్యాయకారి**

**తే. యగుచు విషయానుగతచిత్తుఁడైన యట్టి, రాజు దేశంబు ప్రజలు నిరాశు లగుచు**
**దుఃఖములఁ జాలవనటఁ బొందుదు రటంచు, నేడ్చుచును నట నిల్వక యేగె నపుడు. 1282**

**ప్రతి :** అధికశోకంబునన్= మిక్కిలి దుఃఖంతో; అలమటన్+పొందుచు= కుమిలిపోతూ; పెలుచన్= ఆగ్రహంతో; అచ్చటి జనులతోన్+అనియెన్= అక్కడ మూగిన ప్రజలతో ఇలా అన్నాడు; బ్రాహ్మణ విద్వేషపరుడై= బ్రాహ్మణులపట్ల ద్వేషంగలవాడై; తగన్= చక్కగా; శాస్త్రపద్ధతిన్= శాస్త్రాలలో చెప్పిన విధంగా; నడవక= ఆచరించకుండా; పాపవర్తి+ఐ= పాపాలుచేస్తూ; క్షత్రబంధువుఁడు= క్షత్రియుడై పుట్టికూడా క్షత్రియులు పాటింపవలసిన విధులను నిర్వర్తించనివాడు; అగు= ఐన; వాని= రాజుయొక్క; దురితంబుచేత= పాపంవలన; మత్పుత్రుండు= నాకుమారుడు; జాతమైన+అపుడ= పుట్టగానే; మృతుఁడు+ అయ్యెన్= చనిపోయాడు; అకట!= అయ్యో! హింసకున్= జనులను హింసించటానికి; రోయక= అసహ్యించుకొనక; ఎప్పుడున్= ఎల్లవేళల, అన్యాయకారి+అగుచున్= న్యాయంకాని పనులుచేస్తూ; విషయ+అనుగత - చిత్తుడు+ఐన+అట్టి= భౌతిక సుఖాలపై మనసుపెట్టినవాడైనట్టి; రాజు= రాజుయొక్క; దేశంబున్; ప్రజలు= దేశంలో; నివసించే జనులు; నిరాశులు+అగుచు= ఆశలుడిగినవారై, దుఃఖములన్+చాలదు= అంతులేని వ్యథలతో; వనటన్+పొందుదురు= కష్టాలు అనుభవిస్తారు; అనుచున్= అంటూ; ఏడ్చుచున్= ఏడుస్తూ; అట నిల్వక+ఏగెన్+అపుడు= అక్కడ ఆగక వెళ్లాడు. ఆ సమయంలో...

**తా :** అమితమైన దుఃఖంతో కుములుతూ, అక్కడ మూగి ఉన్న ప్రజలతో "బ్రహ్మద్వేషియై శాస్త్ర ధర్మాల్ని పాటించక, వర్ణాశ్రమ ధర్మాలు మంటగలిపి పాలించే రాజు పాపంవల్ల నా కుమారుడు చనిపోయాడు. హింసాత్మకుడై, అన్యాయాలు చేస్తూ భౌతిక సుఖాలకు లొంగి, పరిపాలన చేసేరాజు పాలించే దేశంలో ప్రజలు అమితంగా కష్టాలు పొందుతారు" అంటూ శాపనార్థాలు పెడుతూ; ఏడుస్తూ అక్కడ నిలువక వెళ్లిపోయాడు. ఆ సమయంలో

**వ. ఇవ్విధంబున మఱియు దన సుతులు మృతు లయినపుడెల్ల వారలం గొనివచ్చి యవ్విప్రుండు రాజు మొగసాలంబెట్టి రోదనంబు సేయుచు, నెప్పటియట్ల కొన్ని గాథలు సదివి పోవుచుండె; నివ్విధంబున నెనమండ్రు సుతులు మృతులైన పిదపం దొమ్మిదవ సుతుండును మృతుండైన వాని నెత్తికొని వచ్చి యెప్పటి విధంబునఁ బలవరించుచున్న యా బ్రాహ్మణునిం గని యర్జునుం డిట్లనియె. 1283**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఇలాగ; మఱియున్= ఇంకా; తనసుతులు= తనకుమారులు; మృతులు+అయినపుడు+ఎల్లన్= చనిపోతునప్పుడల్లా; వారలన్+కొనివచ్చి= ఆ పిల్లల శవాలను తీసికొనివచ్చి; ఆ+విప్రుండు= ఆ బ్రాహ్మణుడు; రాజు మొగసాలన్+పెట్టి= రాజుగారి నివాసభవనపు ముఖశాల (వాకిలి)లో ఉంచి; రోదనంబు+చేయుచున్= ఏడుస్తూ; ఎప్పటి+అట్ల= ఎప్పటిలాగే; కొన్ని గాథలు= కొన్ని వృత్తాంతాలు; చదివి పోవుచుండెన్= ఏకరువు పెట్టి వెళ్లుతూ ఉండేవాడు; ఆ+విధంబునన్= ఆ రీతిగా; ఎనమండ్రు సుతులు= ఎనిమిదిమంది కొడుకులు; మృతులు+ఐన పిదపన్= చనిపోయాక; తొమ్మిదవ సుతుండును= తొమ్మిదో కొడుకుకూడా; మృతుండు+ఐనన్= చనిపోగా; వానిన్+ఎత్తికొనివచ్చి= అతణ్ణి భుజాన వేసికొనివచ్చి; ఎప్పటి విధంబునన్= ఎప్పటిలాగే; పలవరించుచున్న= ఆక్రందిస్తున్న; ఆ+బ్రాహ్మణునిన్+కని= ఆ బ్రాహ్మణుణ్ణి చూచి; అర్జునుండు= ఆ సమయాన అక్కడికి కృష్ణదర్శనార్థం విచ్చేసి ఉన్న అర్జునుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా విధివశాత్తు పుట్టిన ప్రతిపిల్లవాడు చనిపోతుంటే ప్రతిపర్యాయం ఆ కుమారుని శవాన్ని తీసుకొని వచ్చి రాజభవనం ముందుంచి విలపిస్తూ, రాజు ధర్మవిరుద్ధవర్తనుడు, తత్కారణంగా ఈ అకాలమరణాలని ఏకరువుపెడుతూ రోదిస్తూ శాపనార్థాలు పెడుతూ బ్రాహ్మణుడు ఎనిమిదిసార్లు రావడంకాక, తొమ్మిదవసారి అదేవిధంగా తన కొడుకు చనిపోగా అతణ్ణి భుజానవేసుకునివచ్చి ఎప్పటిలా రోదిస్తుంటే ఆ బ్రాహ్మణుణ్ణి చూచి, అనుకోకుండా అక్కడికి వచ్చిన అర్జునుడు ఇలా అన్నాడు.

**క. ఈ పగిది నీవు వగలన్, వాపోవఁగఁ జూచి యకట! వారింపంగా**
**నోపిన విలుకాఁ డొక్కం, డీ పురి లేఁడయ్యె నయ్య! యిది పాప మగున్. 1284**

**ప్రతి :** ఈ పగిదిన్= ఈ విధంగా; నీవు వగలన్= నీవు దుఃఖాలతో; వాపోవఁగన్= ఆక్రందించగా; చూచి వారింపంగాన్= చూచి నివారించటానికి; ఓపిన విలుకాఁడు= సమర్థుడైన విలుకాడు; ఈ పురిన్= ఈ నగరంలో; ఒక్కండు= ఒక్కడైనా; లేడు+అయ్యెన్= లేడుకదా!; అయ్య= ఓ బ్రాహ్మణా!; ఇది పాపము+అగున్=ఇది మహా పాప మయ్యా!

**తా :** 'నువ్వీ విధంగా ఆక్రందనలు చేస్తుంటే నీ బాధతీర్చే యోధుడు (విలువిద్య తెలిసినవాడు) ఒక్కడూ ఈ రాజ్యంలోలేడు. ఇది ఈ రాజ్యప్రజలు చేసికొన్న పాపం' అని అర్జునుడు ఊరడించాడు.

**సీ. పుత్త్రులఁ గోల్పోయి భూరిశోకంబున వనటఁ బొందుచు విప్రవరులు సాల**
**నే రాజురాజ్యమందేని వసించుదు రారాజుఁ దలపోయ నవనిమీఁద**
**నటునిఁగా నాత్మ నెన్నం దగు; నీపుత్త్రు నే బ్రతికించెద నిపుడ పూని**
**యటు సేయనైతినే, ననలంబు సొచ్చెద నని భూసురుఁడు వెఱఁగందఁ బలుక**

**తే. నతఁడు విని యీ వెడఁగుమాట లాడఁ దగునె?, భూరివిక్రమశాలి రాముండు మేటి**
**బలుఁడు హరియును శౌర్యసంపన్ను లనఁగఁ,దనరు ప్రద్యుమ్నుఁ డతని నందనుఁడు మఱియు.**
**1285**

**ప్రతి :** పుత్రులన్+కోల్పోయి= కొడుకులను నష్టపోయి; భూరిశోకంబునన్= గొప్ప దుఃఖంతో; వనటన్+పొందుచున్= బాధపడుతూ; విప్రవరులు= బ్రాహ్మణ శ్రేష్ఠులు; చాలన్= విరివిగా; ఏ రాజు రాజ్యము+అందు+ఏని= ఏ ప్రభువు రాజ్యములోనైనా; వసించుదురు= నివసిస్తారో; ఆ రాజున్= ఆ ప్రభువును; తలపోయన్= ఆలోచించగా; అవని మీఁదన్= భూమిపై; నటునిఁగాన్+ఆత్మన్+ఎన్నన్+తగున్= నటునిగా (రాజుగాగాక) మనసులో భావించాలి; ఇపుడ పూని= ఇపుడే సన్నద్ధుడనై, నీ పుత్రున్+ఏ బ్రతికించెదన్= నీ మృతుడైన కుమారుణ్ణి నేను బతికిస్తాను; అటు+చేయన్+ఐతిన్+ఏని= అలా చేయలేకుంటే; అనలంబున్+చొచ్చెదన్= అగ్ని ప్రవేశం చేస్తానని; భూసురుఁడు వెఱగు+అందన్= బ్రాహ్మణుడు నివ్వెరపొయ్యేలా; పలుకన్= వీరాలాపములాడగా; అతఁడు విని= ఆ బ్రాహ్మణుడు విని; ఈ వెడఁగు మాటలు+ఆడన్+ తగునే?= ఈ వెఱ్ఱి మాటలు ఆడటమెందుకయ్యా!; భూరి విక్రమశాలి= గొప్ప పరాక్రమవంతుడు; రాముండు= బలరాముడు; మేటి బలుఁడు హరియును= శ్రేష్ఠుడైన యోధుడు శ్రీకృష్ణుడును; శౌర్యసంపన్నులు+అనఁగన్+తనరు= పరాక్రమమే సంపదగా గలవారని చెప్పతగిన; ప్రద్యుమ్నుడు= రుక్మిణీ కృష్ణుల సుతుడు ప్రద్యుమ్నుడనేవాడు; అతని నందనుడు= అతని కుమారుడు అనిరుద్ధుడు; మఱియు= ఇంకా...

**తా :** "పుత్రులను కోల్పోయి దుఃఖిస్తున్న బ్రాహ్మణులు ఏ రాజ్యంలో ఉంటారో, ఆ దేశమేలే రాజును నటుడిగా భావించాలి. నేను నీ కుమారుణ్ణి బతికిస్తాను. అలాచేయలేకుంటే అగ్ని ప్రవేశం చేస్తాను" అని బ్రాహ్మణుడు ఆశ్చర్యపడేలా అర్జునుడు ప్రతిజ్ఞ చేయగా, బ్రాహ్మణుడు విని" అంత వెర్రిమాటలెందుకు? బలరామ, శ్రీకృష్ణాదులు (చేయలేని పని మీరు చేయగలరా? అన్నాడు)

**తే. వినుతబలు లైన యాదవ వీరవరులుఁ, గలుగ వారలచేఁ గాని కార్యమీవు**
**చక్కఁబెట్టుట యెట్లు? నీచనెడు త్రోవఁ, బొమ్ము నావుడు న య్యింద్రపుత్త్రుఁ డపుడు. 1286**

**ప్రతి :** వినుత బలులు+ఐన= కీర్తించదగిన పరాక్రమవంతులు అయిన; యాదవ వీరవరులున్= యాదవులలోని శ్రేష్ఠులైన వీరులు; కలుగన్= ఉండగా; వారిచేన్+కాని= వాళ్లతో సాధ్యపడని; కార్యము= పని; ఈవు చక్కన్+పెట్టుట+ఎట్లు= నీవు ఎలా చక్కబెట్టగలవు?; నీ చనెడు త్రోవన్+పొమ్ము= నీ దారిని నీవుపోవయ్యా!; నావుడున్= అనగా; ఆ+ఇంద్రపుత్రుడు+ అపుడు= ఆ ఇంద్రసూనుడైన అర్జునుడు, ఆ సమయంలో...

**తా :** మహాపరాక్రమవంతులైన ప్రద్యుమ్నాది యదువీరులు చేయలేని పనిని నీవెలా సాధించగలవు. అనవసర ప్రగల్భాలు మాని నీ తోవను నీవు వెళ్లమన్నాడు. అప్పుడు అర్జునుడు (ఇలా అన్నాడు)

**క. మనమున దురహంకారము, ఘనముగఁ బొడముటయు, నపుడు కవ్వడి విప్రుం**
**గనుఁగొని యచ్చటిజనములు, వినఁగా నిట్లనియె రోషవిహ్వలమతియై. 1287**

**ప్రతి :** మనమునన్= మనసులో; దుస్+అహంకారము= చెడ్డదైన అభిమానము; ఘనముగన్= అతిశయంగా; పొడముటయున్= పుట్టగా; అపుడు= వెంటనే; కవ+వడి= జంట చేతులవడి విలుకాడు ఐన అర్జునుడు; విప్రున్+ కనుఁగొని= బ్రాహ్మణుణ్ణి చూచి; అచ్చటి= అక్కడి; జనములు= ప్రజలు; వినగాన్= వినేలా; రోష - విహ్వల - మతి+ఐ= కోపంచేత అదుపు తప్పిన బుద్ధితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు...

**తా :** బ్రాహ్మణుని తిరస్కారవాక్యాలకు, తన మనసులో దురభిమానం పెరిగి; అర్జునుడు కోపంతో అదుపు తప్పినవాడై అక్కడి ప్రజలు వినేలా ఇలా అన్నాడు.

**మ. బలుఁడం గాను; మురాసురాంతకుఁడఁ గాఁ; బ్రద్యుమ్నుఁడం గాను; నేఁ**
**దెలియం దత్తనయుండఁగా నని విరోధివ్రాతమున్ భీషణో**
**జ్జ్వల గాండీవ ధనుర్విముక్త నిశితాస్త్ర శ్రేణిచేఁ బీన్గు పెం**
**టలు గావించు పరాక్రమ ప్రకటచండ స్ఫూర్తి నేఁ బార్థుఁడన్. 1288**

**ప్రతి :** బలుఁడన్+కాను= నేను బలరాముణ్ణికాను; ముర+అసుర+అంతకుఁడన్+కాన్= మురుడు అనే రాక్షసుణ్ణి సంహరించిన విష్ణువును (కృష్ణుణ్ణి) కాను; ప్రద్యుమ్నుఁడన్+కాను= కృష్ణుడి పుత్రుడైన ప్రద్యుమ్నుణ్ణి కాను ; నేన్= నేను; తెలియన్= పరిశీలించగా; తత్+తనయుండన్+కాను+అని= అనిరుద్ధుణ్ణికాను అంటూ; విరోధివ్రాతమున్= శత్రు సమూహాన్ని; భీషణ - ఉజ్జ్వల - గాండీవ - ధనుః= భయంకరంగా ప్రకాశించే గాండీవమనే విల్లునుండి; విముక్త - నిశిత+అస్త్రశ్రేణిచేన్= వెడలిన పదునైన బాణాల సమూహంచే; పీనుగు పెంటలు గావించు= పీనుగుల కుప్పలను చేసే; పరాక్రమ - ప్రకట -

చండ – స్ఫూర్తిన్= ముందుకుదూకే; స్పష్టమైన; భయంకరమైన ప్రకాశంచేత; నేన్= నేను; పార్థుడన్= అర్జునుడను (సుమా!)

**తా :** నీ వింతకు ముందు చెప్పిన బలరాముడనో, కృష్ణుడనో, ప్రద్యుమ్నుడనో, అనిరుద్ధుడనో కాను, నేనెవ్వరంటే శత్రుసమూహాలను పీనుగల పెంటలుగా చేసే గాండీవం ధరించిన అర్జునుణ్ణి అని తనను ప్రశంసించుకొన్నాడు.

**వ. అదియునుంగాక. 1289**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాకుండా...

**తా :** అంతేకాక

**చ. బలిమిఁ బురాంతకుం దొడరి బాహువిజృంభణ మొప్ప నెక్కటిం**
**దలపడి పోరినట్టి రణధైర్యుని నన్ను నెఱుంగ వక్కటా!**
**పెలుకుఱ మృత్యుదేవతను బింక మడంచి భవత్తనూజుల**
**న్నలవుఁ జలంబుఁ జూపి కొనియాడఁగ నిప్పుడ తెచ్చి యిచ్చెదన్. 1290**

**ప్రతి :** పుర+అంతకున్= త్రిపురాసురసంహారి అయిన శివుణ్ణి; బలిమిన్+తొడరి= బలంతో ఎదిరించి; బాహువిజృంభణము+ ఒప్పన్= భుజోన్నతి ప్రకాశింపగా; ఎక్కటిన్+తలపడి= ఒంటిగా ఎదుర్కొని; పోరినట్టి= యుద్ధము చేసినట్టి; రణధైర్యుని= యుద్ధరంగంలో ధీరుడైనవానిని; నన్నున్+ఎఱుంగవు+అక్కట= నన్ను నీవు తెలుసుకోలేక పోతున్నావు కదా! పెలుకుఱన్= భయంతో అణగారే; మృత్యుదేవతను= మరణదేవతను; బింకము+అడంచి= గర్వము అణచివేసి; భవత్+తనూజులన్= నీ కుమారులను; అలవున్+చలంబున్+చూపి= బలమూ, పంతమూ ప్రదర్శించి; కొనియాడగన్= (అందరు) ప్రశంసించేలా; ఇప్పుడ= ఇపుడే; తెచ్చి+ఇచ్చెదన్= తీసుకొనిరాగలను.

**తా :** త్రిపురారియైన పరమశివుణ్ణే భుజబలంతో ఒంటరిగా ఎదుర్కొని యుద్ధంచేసిన నన్ను నీవెరుగవా? మృత్యుదేవతను భయపెట్టి, గర్వమణచి, నీ కుమారులనిపుడే తెచ్చియివ్వగలను.

**విశే :** జననజరామరణాలు భగవత్సంకల్పాలు. కృష్ణుడు భగవంతుడు. అర్జునుడు భౌతిక వాది. భుజాస్త్ర బలము నమ్మినవాడు.

**వ. అని నమ్మం బలికిన యర్జును ప్రతిజ్ఞకు భూసురుండు మనంబున నూరడిల్లి యతని నభినందించుచు నిజమందిరంబునకు జని కొన్ని దినంబు లుండునంత భార్యకుం బ్రసూతివేదనా సమయం బయినం జనుదెంచి వివ్వచ్చుం గని తద్విధం బెఱింగించిన న య్యింద్రనందనుం డప్పుడు. 1291**

**ప్రతి :** అని నమ్మన్+పలికిన= ఆ విధంగా నమ్మకం కలిగేటట్లు మాట్లాడిన; అర్జును ప్రతిజ్ఞకున్= అర్జునునియొక్క ప్రతిజ్ఞకు; భూసురుండు= బ్రాహ్మణుడు; మనంబునన్= మనస్సులో; ఊరడిల్లి= ఉపశమనంపొంది; అతనిన్+అభినందించుచు= అర్జునుణ్ణి ప్రశంసిస్తూ; నిజమందిరంబునకున్+చని= తన ఇంటికి వెళ్లి; కొన్నిదినంబులు+ఉండన్= కొంతకాలంగడుపగా; అంతన్= అపుడు; భార్యకున్= ఆ బ్రాహ్మణుని భార్యకు; ప్రసూతి – వేదనా – సమయంబు+అయినన్= పురిటినొప్పులకాలం కాగా; (బ్రాహ్మణుడు); చనుదెంచి= వచ్చి; వివ్వచ్చున్+కని= అర్జునుణ్ణి చూచి; తత్+విధంబు+ఎఱింగించినన్= ఆ విషయం చెప్పగా; ఆ+ఇంద్రనందనుండు+అప్పుడు= ఆ అర్జునుడు వెంటనే...

**తా :** పార్థుడు బ్రాహ్మణునికి నమ్మకం కలిగేలా పలికాడు. బ్రాహ్మణుడు దుఃఖంనుండి ఉపశమనంపొంది, అర్జునుణ్ణి అభినందించి, తన ఇంటికి మరలిపోయాడు. కొంతకాలానికి అతడి భార్య తిరిగి గర్భవతిఅయి, నవమాసాలుమోసి, పురిటి నొప్పులు పడుతూఉండగా, బ్రాహ్మణుడు రాజమందిరానికివచ్చి, అర్జునునకు సమాచారం ఇచ్చినాడు. అపుడు అర్జునుడు

**చ. లలిత విశిష్ట సంచిత జలంబుల నాచమనంబు సేసి, సు**
**స్థలమున నిల్చి రుద్రునకు సమ్మతి మ్రొక్కి మహాస్త్రవేది ని**
**ర్మల శుభమంత్రదేవతల మానసమందుఁ దలంచి గాండివం**
**బలవడ నెక్కు ద్రోచి బిగియం గదియించి నిషంగ యుగ్మమున్. 1292**

**ప్రతి :** మహా+అస్త్రవేది= గొప్ప అస్త్రములు తెలిసిన ఆ అర్జునుడు; లలిత= మనోహరమైన; విశిష్ట= విశేషంగా; సంచిత= సేకరించబడిన; జలంబులన్= నీటితో; ఆచమనంబుసేసి= మంత్రోచ్చారణతో జలాన్ని ప్రాశనం చేసి; సుస్థలమున నిల్చి= పవిత్రస్థలంలో నిలబడి; రుద్రునకున్= పరమ శివునకు; సమ్+మతిన్= మనసారా; మ్రొక్కి= నమస్కరించి; నిర్మల శుభమంత్రదేవతలన్= పవిత్రమైన శుభకరమైన మంత్రాలకు అధిదేవతలైన వారిని; మానసము+అందున్= మనస్సులో; తలంచి= భావించి; గాండీవంబు+అలవడ= గాండీవము కుదుర్చుకొని; ఎక్కు+త్రోచి= ఎక్కుపెట్టి; నిషంగ యుగ్మమున్= అమ్ముల పొదులు రెండింటినీ; బిగియన్+కదియించి= బిగుతుగా కట్టుకొని...

**తా :** అర్జునుడు పవిత్ర నదులనుండి స్వీకరించిన జలాలతో ఆచమనంచేసి, పవిత్ర స్థలంలో నిలబడి; శుచియై శివుణ్ణి ధ్యానించి, అస్త్రమంత్రాది దేవతల మంత్రాలు స్మరించి, ధ్యానించి, గాండీవం చేతబట్టి, ఎక్కుపెట్టుకొని, బాణాలపొది రెండు భుజాలకు రెంటిని కట్టుకొని మృత్యు దేవతపై యుద్ధానికి సిద్ధమయ్యాడు.

**వ. ఇ వ్విధంబునఁ గట్టాయితంబై యప్పుడు. 1293**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ పద్ధతిలో; యుద్ధానికి; కట్ట+ఆయితంబు+ఐ= సిద్ధము చేసికొని; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** పైన చెప్పినవిధంగా అర్జునుడు వివిధాస్త్రాలు, గాండీవం ధరించి యుద్ధసన్నద్ధుడై - ఆ సమయంలో

**సీ. భూసురు వెంట నిమ్ముల నేగి సూతికా భవనంబు చుట్టును బాణవితతి**
**నరికట్టి దిక్కులు నాకాశపథము ధ రాతలం బెల్ల నీరంధ్రముగను**
**శరపంజరముఁ గట్టి శౌర్యంబు దీపింపఁ గడు నప్రమత్తుఁడై కాచియున్న**
**యెడ న మ్మహీసురు నింతికిఁ బుత్త్రుండు జనియించె; నప్పుడచ్చటి జనంబు**

**తే. పోయెఁ బోయెఁ గదే యని బొబ్బ లిడఁగ, బొంది తోడన యాకాశమునకు మాయఁ**
**జెందె నప్పుడు దుఃఖంబు నొంది భూమి, సురుఁడు విలపించుచును మురహరుని కడకు. 1294**

**ప్రతి :** భూసురు వెంటన్= బ్రాహ్మణుని వెంబడి; ఇమ్ములన్+ఏగి= అనుకూలంగా వెళ్లి; సూతికా భవనంబు= ప్రసూతి ఇంటికి; చుట్టును= చుట్టూరా; బాణవితతిన్+అరికట్టి= బాణాల సమూహంతో అడ్డుకట్టి; దిక్కులు= ఎనిమిది దిక్కులు; ఆకాశపథము= ఊర్ధ్వదిక్కు; ధరాతలంబు= భూమివైపు (అధోదిశ); ఎల్లన్= అంతట అనగా దశదిశల; నీరంధ్రముగను= సందులేకుండ; శరపంజరమున్+కట్టి= బాణాలతో గూడుగా నిర్మించి; శౌర్యంబు దీపింపన్= పరాక్రమము ప్రకాశించగా;

కడున్+అప్రమత్తుడు+ఐ= మిక్కిలిగా జాగరూకుడై; కాచి+ఉన్న+ఎడ= రక్షిస్తూ ఉండగా; ఆ+మహీసురున్+ఇంతికిన్= ఆ బ్రాహ్మణుని భార్యకు; పుత్రుండు జనియించెన్= కుమారుడు పుట్టాడు; అపుడు+అచ్చటి జనంబు= ఆ సమయాన అక్కడ ప్రజలు; పోయెన్+పోయెన్+కదే= పోయాడు పోయాడు గదా; అని బొబ్బలు+ఇడఁగ= అరుపులు అరవగా; బొంది తోడన= శరీరంతోబాటు; ఆకాశమునకు మాయన్+చెందెన్= ఆకాశంలో మాయమైనాడు; అప్పుడు = ఆ సమయంలో; భూమిసురుడు= బ్రాహ్మణుడు; దుఃఖంబున్+ఒంది= మిక్కిలి దుఃఖించి; మురహరుని కడకు= శ్రీకృష్ణుని వద్దకు; విలపించుచును= ఏడుస్తూ...

**తా :** బ్రాహ్మణుని వెంబడి అతని ఇంటికివెళ్లి అర్జునుడు ప్రసూతి గృహానికి దశదిశలా సందులేకుండా బాణాలువేసి పంజరంవలె నిర్మాణంచేసి మృత్యువు చొరకుండాచేసి జాగరూకుడై కాపలాకాసినాడు. బ్రాహ్మణుని భార్యకు మగబిడ్డ పుట్టినాడు. అక్కడ వింతగా చేరిన జనం పోయాడు పోయాడని ఆర్తనాదాలు చేశారు. ఈ సారి ప్రాణాలు పోవడంకాదు, బిడ్డ బొందితో మాయమైనాడు. బ్రాహ్మణుడు మిక్కిలిగా దుఃఖించి కృష్ణుని వద్దకు వెళ్లినాడు.

**వ. అప్పుడు సని. 1295**

**ప్రతి :** అప్పుడు= అలా శరీరం మాయంకాగానే; సని= కృష్ణుని వద్దకువెళ్లి...

**తా :** మృత బాలుని శరీరం మాయంకాగానే ఆ బ్రాహ్మణుడు బాగా చింతించి తనరాజైన కృష్ణుని వద్దకు విలపిస్తూ వెళ్ళి

**క. ముందట నిల్చి ముకుంద! స, నందన మునివినుత; నందనందన! పరమా**
**నంద! శరదిందు చందన, కుంద యశస్సాంద్ర! కృష్ణ! గోవింద! హరీ! 1296**

**ప్రతి :** ముందు+అట= ఎదురుగా ఉన్న స్థలంలో; నిల్చి= నిలబడి; ముకుంద= మోక్షం ఇచ్చేవాడా!; సనందన – ముని – వినుత= సనక, సనందనాది మునులచే పొగడబడేవాడా!; నంద – నందన!= గోపకుడైన నందుని కుమారా! పరమ+ఆనంద= గొప్ప ఆనందమే రూపమైనవాడా!; శరత్+ఇందు – చందన – కుంద – యశః+సాంద్ర!= శరత్కాలపు చంద్రునివలె; చందనమువలె; మల్లెలవలె దట్టమైన కీర్తిగలవాడా! కృష్ణ= శ్రీకృష్ణా! గోవింద!= గోవులను పొందిన (రక్షించే)వాడా! హరీ!= (భక్తుల హృదయాలను) ఆకర్షించే (హరించు)వాడా= విష్ణూ!...

**తా :** వెళ్లిన బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని ముందట నిలబడి ఆర్తితోఁముకుందా! మునివినుతా! నందకుమారా! కీర్తిమంతుడా! కృష్ణా! గోవిందా! హరీ!

**వ. అవధరింపుము. దేవా! యర్జునుం డనెడి పౌరుషవిహీనుం డాడిన వృథాజల్పంబులు నమ్మి పుత్త్రుం గోలువడి బేలనైన నన్ను నేమందు? నిఖిల విశ్వోత్పత్తి స్థితి లయంబులకుఁ బ్రధాన హేతుభూతుండ వయిన నీవు సమర్థుండ వయ్యు, వారింపం జాలక చూచుచుండ, నొక్క మనుష్యమాత్రుండు దీర్పం జాలెడువాఁడు గలఁడె? యని వెండియు. 1297**

**ప్రతి :** దేవా!; అవధరింపుము= వినుము; అర్జునుండు+అనెడి= అర్జునుడని పేరుగల; పౌరుష – విహీనుండు= శక్తిచాలనివాడు; ఆడిన= మాటలాడిన; వృథా – జల్పంబులు= వ్యర్థమైన ప్రేలాపనలు; నమ్మి= విశ్వసించి; పుత్రున్= కుమారుణ్ణి; కోలువడి= కోలుపోయి; బేలన్+ఐన= దీనుడనైన; నన్నున్+ఏమందున్= నన్ను ఏమని నిందించు కోగలను?;

నిఖిల - విశ్వ - ఉత్పత్తి - స్థితి - లయంబులకున్= సమస్తములైన లోకముల సృష్టి - స్థితినాశములకూ; ప్రధాన - హేతు - భూతుండవు+అయిన= ముఖ్యకారకుడవైన; నీవు సమర్థుండవు+అయ్యు= నీవే ఈ పనికి యోగ్యుడవైనను; వారింపన్+చాలక= ఆపలేక; చూచుచు+ఉండన్= చూస్తూ ఉండగా; ఒక్క మనుష్యమాత్రుండు= కేవలం మానవ మాత్రుడైన; తీర్పన్+చాలెడువాఁడు+కలఁడే?= నెరవేర్చగలడే!; అని= అంటూ; వెండియు= ఇంకా...

**తా :** దేవా! విను. పౌరుషంలేని అర్జునుడు చేతకాకున్నా వ్యర్థమైన దంభాలు పలికి నా కుమారుణ్ణి రక్షిస్తానంటే నమ్మి, నా కొడుకును పోగొట్టుకున్నాను. నన్ను నేను నిందించుకోవాలి. సర్వలోకాల సృష్టి స్థితిలయాలకూ కారణభూతుడవైన నీవే వారింపలేక ఉండగా ఈ విపత్తును ఈ అర్జునుడనే మానవమాత్రుడు నివారించగలడా! అని ఇంకా

**క. ఎక్కడి పాండుతనూభవుఁ?, డెక్కడి విలుకాఁడు? వీని కెక్కడి సత్త్వం?**
**బెక్కడి గాండీవము? దన, కెక్కడి దివ్యాస్త్ర సమితి? యే మనవచ్చున్? 1298**

**ప్రతి :** ఎక్కడి పాండు తనూభవుఁడు= అర్జునుడు ఎక్కడ?; ఎక్కడి విలుకాఁడు= ఏపాటి విలువిద్యా నిపుణుడు?; వీనికి సత్త్వంబు+ఎక్కడ= వీని బలమేమిటి?; ఎక్కడిగాండీవము= గాండీవ ధనువు ఏపాటి?; తనకు+ఎక్కడి దివ్య+అస్త్ర సమితి= వీడి గొప్ప అస్త్రసమూహాలు ఏ మూలకు?; ఏమి+అనవచ్చున్= వీని ప్రగల్భాలు ఏమనుకోవాలి?

**తా :** అర్జునుడు ఒక పెద్ద విలుకాడా? వీని బలం ఏమిటికి? వీని గాండీవం ఏపాటిది? వీని దివ్యాస్త్రాలు ఏపాటివి?; ఏమనాలి?

**క. అని తను నోడక నిందిం, చిన విని య య్యర్జునుండు చిడిముడిపడుచుం**
**దనవిద్యమహిమ పెంపునఁ, జనియెన్ వెస దండపాణి సదనంబునకున్. 1299**

**ప్రతి :** అని= ఈ విధంగా; తనున్= తనను; ఓడక= సంకోచించక; నిందించిన= నిందించగా; విని; ఆ+అర్జునుండు విఫలుడైన అర్జునుడు; చిడుముడి పడుచున్= దుఃఖపడినవాడై; తన విద్య మహిమ పెంపునన్= తాను నేర్చిన గొప్పవిద్యగల మహత్త్వంచే; వెసన్= వెంటనే; దండపాణి= యముని యొక్క ; సదనంబునకున్= గృహానికి (యమలోకానికి); చనియెన్= వెళ్ళాడు.

**తా :** పై విధంగా అసమర్థుడని తనను నిందించగా విన్న అర్జునుడు మిక్కిలిగా కలతపడి, తన విద్యామహత్వంచేత వెంటనే యమలోకానికి వెళ్లాడు.

**క. చని యందు ధారుణీసుర, తనయులు లేకుంటఁ దెలిసి తడయక యింద్రా**
**గ్ని నిరృతి వరుణ సమీరణ, ధనదేశానాలయములు దగఁ బరికించెన్. 1300**

**ప్రతి :** చని= అర్జునుడు యమలోకానికి వెళ్లి; అందున్= ఆ లోకంలో; ధారుణీసుర - తనయులు= బ్రాహ్మణుని కుమారులు; లేకుంటన్+తెలిసి= లేకపోవటంతో; తడయక= ఆలస్యంచేయక; ఇంద్ర+అగ్ని నిరృతి - వరుణ - సమీరణ - ధనద+ఈశాన - ఆలయములు= ఇంద్రలోకాన్ని; అగ్నినివాసాన్ని; నిరృతి నివాసాన్ని; వరుణలోకాన్ని; వాయుదేవుని నిలయాన్ని; కుబేరుని నిలయాన్ని; ఈశానుని నివాసాన్ని (అష్టదిక్పాలకుల నివాసాలను); తగన్= లెస్సగా; పరికించెన్= పరిశీలించాడు.

**తా :** పైలోకాలకు తన మహిమతో వెళ్లి, ముందట యముని ఆలయమైన నరకంలో పరిశీలించి, అక్కడ బ్రాహ్మణ పుత్రుడు కనిపించని కారణంగా, అష్టదిక్పాలకుల స్థానాలలో మిగిలిన ఏడింటినీ పరిశీలించాడు.

**వ. వెండియు. 1301**

**ప్రతి :** వెండియు= మరియు...

**తా :** అష్టదిశల పిదప

**చ. నర సుర యక్ష కింపురుష నాగ నిశాచర సిద్ధ సాధ్య ఖే**
**చర విహగేంద్ర గుహ్యక పిశాచ నివాసములందు రోసి భూ**
**సురసుతు లేగినట్టి గతి సొప్పడకుండుటఁ జూచి క్రమ్మఱన్**
**ధరణికి నేగుదెంచి బెడిదంబుగ నగ్ని సొరంగఁ బూనినన్. 1302**

**ప్రతి :** నర= మనుష్యలోకం మొదలుగా; సుర= దేవతల లోకం; యక్ష= యక్షులలోకాన్ని; కింపురుష= కింపురుషులలోకాన్ని; నాగ= పాముల లోకాన్ని; నిశాచర= రాక్షసులలోకాన్ని, సిద్ధసాధ్య= సిద్ధుల, సాధ్యుల లోకాలను; ఖేచర= ఆకాశంలో సంచరించేవారిని; విహగ+ఇంద్ర= గరుత్మంతుని లోకాన్ని; గుహ్యక= గుహ్యకుల లోకాన్ని; పిశాచ నివాసముల+అందున్= పిశాచుల లోకంలో; రోసి= కోపించి; భూసుర సుతులు+ఏగినట్టి= బ్రాహ్మణ కుమారులు చనిపోయివెళ్లిన; గతి= మార్గం (చోటు); చొప్పడకుండుటన్= జాడతెలియకపోవటం; చూచి= గమనించి; క్రమ్మఱన్= తిరిగి; ధరణికిన్+ఏగుదెంచి= భూమికి తిరిగి వచ్చి; బెడిదంబుగన్= భయంకరంగా; అగ్ని+చొరంగన్= అగ్నిలో ప్రవేశించటానికి; పూనినన్= సిద్ధపడగా...

**తా :** ఆ తరువాత మిగిలిన దేవ, యక్ష, కింపురుషాది సమూహాలు నివసించే వారివారి నివాసాలకు వెళ్లి, ఎక్కడా బ్రాహ్మణ కుమారుల జాడ కానక, తిరిగి భూలోకానికివచ్చి, తన శపథంమేరకు అగ్నిలో ప్రవేశించటానికి సిద్ధపడ్డాడు.

**వ. అ వ్విధంబంతయు నెఱింగి య మ్మురాంతకుండు 'విప్రనందనుల నీకుం జూపెద' నని యనలంబు సొరకుండ నతని నివారించి యప్పుడు. 1303**

**ప్రతి :** ఆ+విధంబు= ఆ జరిగిన సంఘటనను; అంతయున్+ఎఱింగి= సంపూర్ణంగా తెలిసికొని; ఆ+ముర+అంతకుండు= ఆ శ్రీకృష్ణుడు; విప్రనందనులన్= బ్రాహ్మణ కుమారులను; నీకున్+చూపెదన్+అని= నీకు (అర్జునునికి) చూపగలను అంటూ; అనలంబున్+చొరకుండన్= అగ్నిలో ప్రవేశించకుండా; అతనిన్= అర్జునుణ్ణి; నివారించి= ఆపి; అప్పుడు= ఆ సందర్భంలో...

**తా :** అర్జునుడు బ్రాహ్మణ బాలకరక్షణలో విఫలుడైనందువల్ల తన ప్రతిజ్ఞమేరకు అగ్నిలో ప్రవేశించడానికి సిద్ధంకాగా, శ్రీకృష్ణుడు విషయమంతా తెలిసికొని, ఈ బ్రాహ్మణపుత్రులను నీకు చూపుతాను అని అగ్నిలో ప్రవేశించకుండ ఆపి, అప్పుడు

**ఉ. సుందరదివ్యరత్నరుచి శోభితమై తనరారు కాంచన**
**స్యందన మంబుజాప్తుఁ డుదయాచల మెక్కు విధంబు దోఁపఁ బౌ**

**రందరి దాను నెక్కి తనురశ్ములు దిగ్వితతిన్ వెలుంగ గో**
**విందుఁ డుదారలీలఁ జనె విప్రతనూజ గవేషణార్థియై. 1304**

**ప్రతి :** సుందర= అందమైన; దివ్య – రత్న – రుచి – శోభితమై= శ్రేష్ఠమైన మణులకాంతులచే కల్గిన ప్రకాశంతో; తనరు+ ఆరు= ఒప్పిన; కాంచన – స్యందనము= బంగారు రథాన్ని; అంబుజ+ఆప్తుడు= అంబు= నీటినుండి; జ= పుట్టిన= పద్మానికి; ఆప్తుడు= మిత్రుడైన సూర్యుడు; ఉదయ+అచలము= ఉదయపర్వతం; ఎక్కు విధంబు+తోఁపన్= ఎక్కేపద్ధతి స్ఫురించేటట్లు; పౌరందరి= పురందరుని కుమారుడైన అర్జునుడు; తానున్= శ్రీకృష్ణుడును; ఎక్కి= అధిరోహించి; తను – రశ్ములు= శరీరకాంతులు; దిక్+వితతిన్= దిక్కులసమూహాలలో; వెలుంగన్= ప్రకాశించగా; గోవిందుఁడు= కృష్ణుడు; ఉదారలీలన్= ఉదాత్తమైన పద్ధతిలో; విప్ర – తనూజ= బ్రాహ్మణకుమారులను; గవేషణ+అర్థి+ఐ= వెదికే కోరికతో; చనెన్= బయల్దేరాడు.

**తా :** అతిశ్రేష్ఠమైనమణులు తాపడంచేసిన బంగారురథాన్ని ఎక్కుతున్న కృష్ణుడు ఉదయాద్రినెక్కే సూర్యునివలె ప్రకాశించినాడు. అర్జునుణ్ణి ఎక్కించుకొని, శరీరకాంతులు దిక్కులలో ప్రకాశించగా; బ్రాహ్మణ బాలురను వెదకడానికి బయలుదేరాడు.

**విశే :** శ్రీకృష్ణుడు సూర్యునివలె, తనురశ్మి సూర్యరశ్మివలె, కాంచన రథం ఉదయపర్వతంలాగా, మణికాంతులు సూర్యకిరణాలలాగా, సూర్యకాంతులు దిక్కులు నిండినట్లు కృష్ణుని తనుకాంతులు అన్ని దిశలా వ్యాపిస్తున్నట్లు వర్ణించడంచేత సూర్యునివలెనే కృష్ణుడు సర్వలోక సందర్శనానికి బయలేరాడని – సూచింపబడుతోంది. ఇక్కడ శ్రీకృష్ణుడు సవితృమండల మధ్యవర్తి. విష్ణువువలె సృష్టి స్థితిలయములు ఆయన చేతిలోనివి. ఇది సంపూర్ణావతారలక్షణమనడానికి ఉన్న ఎన్నో ప్రమాణాలలో ఇది ఒకటి.

**చ. చని పురగోష్ఠ దుర్గ వన జానపదాచల పక్కణ ప్రభూ**
**త నదనదీ సరోవర యుతక్షితి నంతయు దాఁటి సప్త వా**
**రినిధుల దీవులం గులగిరి ప్రకరంబుల నుత్తరించి మే**
**రు నగము నాక్రమించుచు మరుద్గతితో రథ మేగ న త్తఱిన్. 1305**

**ప్రతి :** చని= బయల్దేరి; పుర= నగరాలు; గోష్ఠ= గోశాలలు; దుర్గ= కోటలు; వన= అడవులు; జానపద= పల్లెలు; అచల= పర్వతాలు; పక్కణ= బోయపల్లెలు; ప్రభూత= అధికమైన; నద= పడమటి ఏఱులు; నదీ= తూరుపు ఏఱులు (ప్రవహించు దిశనుబట్టి నదులకు ఈ విభజన); సరః+వరయుత= శ్రేష్ఠాలైన (పెద్దవైన) చెఱువులతో కూడిన; క్షితిన్+అంతయున్= భూమినంతటినీ అంతా; దాఁటి= దాటి; సప్త – వారినిధుల= ఏడు సముద్రాల; దీవులన్= మధ్య ద్వీపాలను; కులగిరి= ప్రధాన పర్వతాల; ప్రకరంబుల= సమూహాలను (పర్వత పంక్తులను); ఉత్తరించి= దాటి; మేరునగమును= మేరుపర్వతాన్ని; ఆక్రమించుచు= దాటుతూ; రథము= శ్రీకృష్ణుని రథం; మరుత్+గతితో= వాయువేగంతో; ఏగన్= వెళ్తూఉండగా; ఆ+తఱిన్= ఆ సమయంలో...

**తా :** పట్టణాలు, వాటి బహిఃప్రదేశగోశాలలు, దుర్గాలు, అడవులు, పల్లెలు, బోయతండాలు; గొప్పనైన నదీనదాలు; సరోవరాలుగల భూప్రపంచంచుట్టి; సప్తసముద్రాలు; వాటిమధ్య భూఖండాలు, కులపర్వతాలుదాటి, ఆపై మేరుపర్వతం దాటి, వాయువేగంతో శ్రీకృష్ణుని రథం ముందుకు సాగుతుండగా

**చ. మసలక భూరిసంతమసమండలముం దరియంగఁజొచ్చి సా**
**హసమునఁ బోవఁ బోవఁగ భయంకరమై మది గోచరింపమిన్**
**వసమతి మోఁకరిల్లి రథవాజులు మార్గము దప్పి నిల్చినన్**
**బిసరుహపత్త్రలోచనుఁ డభేద్యతమః పటలంబు వాపఁగన్. 1306**

**ప్రతి :** మసలక= మందగించక; భూరి= గొప్ప; సంతమస= చీకట్ల; మండలమున్= ప్రదేశాన్ని; తరియంగన్+చొచ్చి= దాటడానికై ప్రవేశించి; సాహసమునన్+పోవఁగ= ధైర్యము చెడక ముందుకుపోగా; భయంకరమై= భయం కలిగిస్తూ; మది గోచరింపమిన్= మనసుకు కనబడనిదై; వసమతి= శక్తికోల్పోయి; మోఁకరిల్లి= మోకాళ్లపై కూర్చుని; రథవాజులు= రథానికి కట్టిన గుర్రాలు; మార్గమున్ తప్పి= త్రోవతప్పి; నిల్చినన్= ఆగిపోగా; బిసరుహ పత్రలోచనుఁడు= తామర రేకులవంటి కన్నులు కలవాడైన శ్రీకృష్ణుడు; అభేద్య – తమః పటలంబు= భేదింపశక్యంకాని చీకటి దొంతరలను; పాపఁగన్= తొలగించడానికై...

**తా :** శ్రీకృష్ణుడు అర్జున సహితుడై రథారూఢుడై ప్రయాణిస్తూ అతిభీకరమైన అంధకార ప్రపంచంలోకి ప్రవేశించాడు. సాహసించి ఇంకాముందుకు పోగా, చీకటి దట్టమై కన్నుగానక, గుఱ్ఱాలు శక్తిహీనాలై తోవతప్పి, మోకాళ్లపై కూలబడినాయి. శ్రీకృష్ణుడు ఆ చీకటిని తొలగించడానికి

20వ శతాబ్దంలోని అంతరిక్ష పరిశోధకుల్లో ఖగోళశాస్త్ర వేత్తయైన ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ కూడా ఊర్ధ్వలోకంలో చొచ్చుకుపోయేకొద్దీ దట్టమైన కటికచీకటి (Pitch Darkness/Dark Matter) ఉందని దాని తర్వాత వెల్గురేకలున్నట్లు తెలుస్తున్నదన్నారు. కాని, ఆ 'కటిక చీకటి' గురించి, దాని తత్త్వమేమిటో తెలియడం లేదన్నారు.

'పెను చీకటి' తత్త్వం ఆ కృష్ణునికే తెలుసు. మానవులబుద్ధికి పరిశోధనలకు అందడం లేదు.

దీనినే ఉపనిషత్తు ఒకే వాక్యంలో 'తమసోమా జ్యోతిర్గమయ' అని చెప్పినది. ఇది సృష్టితత్త్వ రహస్యం.

**సీ. బాలభానుప్రభాభాసమానద్యుతిఁ గరమొప్ప నిజ రథాంగంబుఁ బనుప**
**న మ్మహాస్త్రం బేగి చిమ్మచీఁకటి నెల్ల నతిముతి నందంద నతికి వైచి**
**యగ్రభాగంబున నతులిత గతి నేగ నా మార్గమున నిజస్యందనంబు**
**గడువడిఁ దోలి యా కడిఁది తమోభూమిఁ గడవ ముందటకడఁ గాన రాక**

**తే. మిక్కుటంబుగ దృష్టి మిర్మిట్లు గొనఁగఁ, జదల వెలుఁగొందు దివ్యతేజంబుఁ జూచి**
**మొనసి గాండీవి కన్నులు మూసికొనుచు, నాత్మ భయమంది కొంతద వ్వరిగి యరిగి. 1307**

**ప్రతి :** బాలభానుప్రభా= బాలసూర్యుని కాంతివంటి; భాసమానద్యుతిన్= ప్రకాశించే కాంతితో; కరము+ఒప్పన్= అతిశయంగా ఉండగా; నిజ= తనయొక్క; రథ+అంగమున్= చక్రాన్ని; అనుపన్= పంపగా; ఆ+మహా+అస్త్రంబు= ఆ గొప్ప ఆయుధం; ఏగి= వెళ్లి; చిమ్మ చీఁకటిన్+ఎల్ల= గాఢ అంధకారాన్నంతటినీ; అతిముతిన్+అందు+అందన్= వేగంగా; అక్కడక్కడ; నతికివైచి= ఖండించి; అగ్రభాగంబునన్= ముందుగా; అతులిత= సాటిలేని; గతిన్= నడకతో; ఏగన్= వెళ్లగా; ఆ మార్గమునన్= దానివెంబడి; నిజస్యందనంబు= తన రథాన్ని; కదువడిన్ఁ+తోలి= మిక్కిలివేగంగా

నడిపి; ఆ+కడిఁది= ఆ కఠినమైన; తమోభూమిన్= చీకటి ప్రదేశాన్ని; కడవన్= దాటగా; ముందఱ కడన్= ముందరివైపు; కానరాక= కనబడక; మిక్కుటంబుగ= అతిశయంగా; దృష్టి మిర్మిట్లుకొనగన్= చూపులు చెదిరిపోగా; చదల వెలుఁగొందు= ఆకాశంలో ప్రకాశించే; దివ్యతేజంబున్= గొప్పవెలుగును; చూచి= కనుగొని; మొనసి= పూని (యత్నించి); గాండీవి= గాండీవం ధరించిన అర్జునుడు; కన్నులు మూసికొనుచు= నేత్రాలు మూతవేసికొని, ఆత్మ, భయము+అంది= మనసులో భయపడి; కొంతదవ్వు= కొంతదూరం; అరిగి, అరిగి= పోయి పోయి...

**తా :** బాలసూర్యుని కాంతివంటి కాంతితో ప్రకాశిస్తూ కృష్ణుడు ప్రయోగించిన చక్రం దూసుకువెళ్లి చీకటిని వేగంగా తొలగిస్తూపోగా దానివెంబడి ఆ వెలుగులో రథాన్ని పరిగెత్తిస్తూతోలి, చీకటి ప్రదేశాన్ని దాటినాడు. ఆ తరువాత కళ్లు మిరుమిట్లు గొలిపే మహాతేజస్సు ఆకాశంలో కనిపించింది. ఆ వెలుగును చూసి అర్జునుని భయం కలిగింది. కళ్లుమూతలు పడ్డాయి. అలా కొంతదూరం వెళ్ళి

**తే. కడఁగి దుర్వారమారుతోత్కటవిధూత, చటులసర్వంకషోర్మిభీషణగభీర**
**వారిపూరంబు సొచ్చి తన్నీరమధ్య, భాగమునఁ గోటిసూర్యప్రభలు వెలుంగ. 1308**

**ప్రతి :** కడగి= పూని; దుర్వార= వారింపశక్యంకాని; మారుత+ఉత్కట= గాలిచేత మిక్కిలిగా; విధూత= ఎగురగొట్టబడిన; చటుల= తీవ్రంగా చలించే; సర్వంకష= సముద్రంయొక్క; ఊర్మి= అలలుగల; భీషణ= భయంకరమైన; గంభీర= లోతైన; వారిపూరంబు= నీటితోనుండిన జలరాశిని; చొచ్చి= ప్రవేశించి; తద్+నీర మధ్యభాగమునన్= ఆ నీటిమధ్యలో; కోటిసూర్య ప్రభలు వెలుంగన్= కోటిసూర్యుల ప్రకాశంతో వెలుగుతున్న...

**తా :** కృష్ణుని రథానికి ముందుచీకటి, తరువాత వెలుగు, అడ్డమైనవి. ఇపుడు గొప్ప సముద్రంవంటి జలరాశి ఎదురైంది. గొప్పగా గాలివీచి సృష్టించిన మిక్కిలి చలించే అలలుగల సముద్రంవంటి ఆ జలరాశిలో ప్రవేశించగా వారికి కోటిసూర్యుల ప్రకాశంతో వెలుగుతున్న

**వ. అది మఱియును జారుదివ్యమణిసహస్రస్తంభాభిరామంబును, నాలంబితకమనీయనూత్నరత్న మాలికాలంకృతంబును, భానుశశిమయూఖాగమ్యంబును, ననంతతేజోవిరాజితంబును, బునరావృత్తి రహితమార్గంబును, నిత్యైశ్వర్యదాయకంబును, నవ్యయంబును, నత్యున్నతంబును, ననూనవిభవంబును, బరమయోగీంద్రగమ్యంబును, బరమభాగవతనివాసంబునునై యొప్పు దివ్యధామంబునందు. 1309**

**ప్రతి :** అది మఱియును= అది ఇంకా; చారు - దివ్యమణి - సహస్ర - స్తంభ= మనోహరమైన గొప్పవైన వేల రత్నాలు పొదిగిన స్తంభాలతో; అభిరామంబునున్= అందంగా శోభిస్తూ; ఆలంబిత= వేలాడుచున్న; కమనీయ= మనోహరమైన; నూత్నరత్న= కొత్తమణులతో చేయబడిన; మాలికా+అలంకృతంబును= హారాలతో అలంకరించబడిందీ; భాను - శశి - మయూఖ+అగమ్యంబునున్= సూర్యచంద్రుల కిరణాలు ప్రవేశించడానికి వీలుకానిది; అనంత= అంతులేని; తేజస్+విరాజితంబును= తేజస్సుతో ప్రకాశించేదీ; పునర్+ఆవృత్తి - రహిత - మార్గంబును= తిరిగి పుట్టడం అనేదిలేనట్టి మోక్షానికి దారిగా ఉన్న; నిత్య+ఐశ్వర్య దాయకంబునున్= ఎప్పుడూ సంపదల్ని ఇచ్చేదీ; అవ్యయంబునున్= అక్షయమైందీ; అతి+ఉన్నతంబునున్= మిక్కిలి ఎత్తైందీ; అనూన విభవంబును= తక్కువకాని వైభవంబుగలదీ; పరమయోగి+ఇంద్రగమ్యంబును= శ్రేష్ఠులైనయోగులు రావాలని; కోరుకొనేదీ; పరమ భాగవత నివాసంబును= గొప్ప భగవద్దాసులు నివసించేదీ, ఐ= అవుతు; ఒప్పు= ప్రకాశించే; దివ్యధామంబు+అందున్= దివ్యభవనంలోపల...

**తా :** ఆ జలరాశిమధ్యలో వేలాదిమణిస్తంభాలతో ప్రకాశించేదీ, రత్నహారాలు వేలాడుతుండేదీ, అంతులేని తేజస్సుతో ప్రకాశించేదీ, సూర్యచంద్రకాంతులు చొరలేనిదీ, జన్మరాహిత్యానికి మార్గమైందీ, ఐశ్వర్యాన్ని ఇచ్చేదీ, అంత మనేదిలేనిదీ, మహోన్నతమైందీ, అనల్పవైభవాస్పదమైందీ, పరమయోగులు తాము చేరాలని కోరుకొనేదీ, హరిభక్తులు నివసించేదీ ఐన ఒక దివ్య భవనంలో

**సీ. సాంద్రశరచ్చంద్రచంద్రికాకర్పూరనీహారహారాభదేహ మమర**
**నిందిందిరేందీవరేంద్రనీలద్యుతిఁ గర మొప్పు మేచకకంఠసమితి**
**యరుణాంశుబింబభాసురపద్మరాగవిన్యస్తసహస్రోరుమస్తకములు**
**వివృతాననోద్గతవిషధూమరేఖల లీలఁ జూపట్టిన నాలుకలును**

**తే. గలిత సాయంతనజ్వలజ్జ్వలనకుండ,ముల విడంబించు వేఁడిచూపులును గలిగి**
**భూరికలధౌతగిరినిభాకార మమరఁ, బరఁగు భోగీంద్రభోగతల్పంబునందు. 1310**

**ప్రతి :** సాంద్ర= దట్టమైన; శరత్+చంద్ర= శరత్కాలపు చంద్రుని యొక్క; చంద్రికా= వెన్నెలతో; కర్పూర= కప్పూరంతో; నీహార= మంచుతో; హార= ముత్యాలహారంతో; ఆభ= సమానమైన (తెల్లని); దేహము+అమరన్= శరీరం ఒప్పుతుండగా; ఇందిందిర= గండుతుమ్మెదలవంటి; ఇందీవర= నల్లకలువలవంటి; ఇంద్రనీల= నీలమణివంటి; ద్యుతిన్= కాంతితో; కరము+ఒప్పు= మిక్కిలిగా శోభించే; మేచక= నల్లని; కంఠసమితి= కంఠాల (పడగలకింది భాగములు) గుంపు గల్గి; అరుణ+అంశు – బింబ= ఎర్రనికిరణాలున్న బాలభానునివంటి; భాసుర= ప్రకాశమానమైన; పద్మరాగ= పద్మరాగమణులచే; విన్యస్త= పెట్టబడిన (ఉన్న), సహస్ర+ఉరు – మస్తకములు= గొప్పనైన వేయి తలలుగల్గి; వివృత+ఆనన= విచ్చుకున్న నోళ్లలోనుండి; ఉద్గత= బయలువెడలు; విషధూమ – రేఖల – లీలన్= విషపుపొగల వరుసలవలె; చూపట్టిన= కన్పిస్తున్న; నాలుకలును= నాలుకలుగల్గి; కలిత= మనోహరమైన; సాయంతన= సాయంకాలపు; జ్వలత్= ఎగసిపడే; జ్వలన= జ్వాలల; కుండములన్= అగ్నిగుండాల్ని; విడంబించు= పోల్చదగు; వేఁడిచూపులును= వేడిచూపులు గల్గి; భూరి= గొప్పదైన; కలధౌత నిభ= వెండికొండ (హిమాలయం)వంటి; ఆకారము+అమరన్= శరీరాకృతి కుదిరి ఉండగా; పరగు= ఒప్పు; భోగి+ఇంద్ర= పాముల రాజైనవాడు= ఆదిశేషుడు (ఈతడు); భోగతల్పము+అందున్= ఆ పడకపై (పడగల పాన్పుపై)…

**తా :** కృష్ణార్జునులు చూచిన దివ్యభవనంలో శరదృతువులోని వెన్నెలవలె, కర్పూరంవలె, మంచువలె, ముత్యాలవలె తెల్లని దేహంతో ఒప్పినవాడూ; తుమ్మెదలు, నల్లకలువలు, ఇంద్రనీలమణులవంటి నల్లని పడగకింది మెడలు గలవాడూ. ఉదయభానునివంటి లేత ఎరుపురంగులో ఉన్న పద్మరాగ మణులు నిలిచిన వేయి పడగలు (తలలు) గలవాడూ, తెరచిన నోళ్లనుండి విషధూమం బయటికి వెలువడుతున్నదా అన్నట్లున్న నాలుకలు కలవాడూ, సాయంకాలపు హోమకుండాలవంటి వేడి చూపులుగలవాడు, వెండికొండలా తెల్లని పెద్దదేహంగలవాడు ఐన ఆదిశేషుడు సుఖతల్పంగా అమరగా ఆ పడకపై…

**విశే :** ఆదిశేషుని దేహం చిత్రవర్ణసమేతం. తెల్లనాగుకనుక శరచ్చంద్ర చంద్రికలవంటి దేహం నల్లనిమెడలు, వేయిపడగలపై నిల్చిన ఉదయభానునివంటి లేత ఎరుపురంగులోని వేయిమణులు, హోమకుండం వేడివంటి ఎర్రనైన చూపులు, విషధూమాన్ని అనుకరించే నల్లని రెండువేలనాలుకలు, చుట్టలుగా చుట్టి పరచుకొన్న హిమాలయంవంటి వెండిరంగు శరీరం ఇలాసాగింది మనోహరంగా వర్ణన. పగలంతా జ్వలించిన హోమకుండల్లో సాయంత్రం జ్వాలలుకాక వేడిమాత్రం రగులుతూ, తగులుతూ

ఉంటుంది. కనుక వేడి చూపులకు సాయంతన హోమకుండాలతో పోలిక చెప్పబడింది. (1వ పాదంలో 2వ, 3వ) ఉపమ, (4వ పాదంలో) ఉత్ప్రేక్షాలంకారములు వరుసగా నిబంధింపబడ్డాయి.

**వ. సుఖాసీనుండై యున్నవాని డాయం జని యప్పుడు. 1311**

**ప్రతి :** సుఖ+ఆసీనుండు+ఐ= హాయిగా కూర్చున్నవాడై; ఉన్నవానిన్= ఉన్నట్టి శ్రీమహావిష్ణువును; డాయన్+చని= దగ్గరగావెళ్లి; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఆదిశేషునితో ఏర్పడ్డ పడకపై సుఖంగా కూర్చున్న విష్ణువుకు దగ్గరగా వెళ్లిన సమయంలో

**సీ. సజలనీలాంబుదశ్యామాయమానాంగు నాశ్రితావనముదితాంతరంగు**
**సనకాదియోగిహృద్వనజమదాళీంద్రు ముఖపద్మరుచిజితపూర్ణ చంద్రుఁ**
**గమనీయనిఖిలజగద్ధితచారిత్రుఁ బ్రత్యూషసంఫుల్లపద్మనేత్రు**
**నిందిరాహృదయారవిందారుణోల్లాసు శ్రీకరపీతకౌశేయవాసు**

**తే. హారకుండలకటకకేయూరమకుట, కంకణాంగదమణిముద్రికావినూత్న**
**రత్ననూపురకాంచీవిరాజమాను, భవమహార్ణవశోషు సద్భక్తపోషు. 1312**

**ప్రతి :** సజల= నీటితోకూడిన; నీల+అంబుద= నీలిమేఘంవంటి; శ్యామాయమాన= నల్లగా చేయబడిన; అంగున్= శరీరం కలవాణ్ణి; ఆశ్రిత+అవన= ఆశ్రయించినవారిని రక్షించడంలో; ముదిత= ఆనందించే; అంతరంగున్= హృదయం కలవాణ్ణి; సనక+ఆది - యోగి - హృత్= సనకసనందాదియోగిజనులహృదయాలు అనే; వనజ= పద్మాల్లో; మద+అళి+ఇంద్రున్= మదించిన శ్రేష్ఠమైన తుమ్మెదవంటివాణ్ణి; ముఖపద్మ= పద్మంవంటి తన ముఖంయొక్క; రుచి= కాంతిచే; జిత - పూర్ణ - చంద్రున్= ఓడించిన నిండు జాబిల్లి (చంద్రుని) గలవాణ్ణి; కమనీయ= మనోహరమైన; నిఖిల- జగత్+హిత - చారిత్రున్= సమస్త జగత్తుకు మేలుచేసే చరిత్రగలవాణ్ణి; ప్రత్యూష= వేకువకాలలో; సంఫుల్ల= బాగా వికసించిన; పద్మ= పద్మంవంటి; నేత్రున్= కన్నులు కలవాణ్ణి; ఇందిరా= లక్ష్మీదేవియొక్క; అరుణ - అరవింద= ఎఱ్ఱని కమలంవంటి; హృదయ+ఉల్లాసున్= మనస్సును; సంతోషపెట్టేవాణ్ణి; శ్రీకర= శుభంకరమైన; పీత= పచ్చని; కౌశేయ= పట్టు(తో నేయబడిన); వాసున్= వస్త్రం కలవాణ్ణి; హార= ముత్యాలపేరులు; కుండల= చెవిపోగులు; కటక= ముంజేతి కంకణాలు; కేయూర= భుజకీర్తులు; మకుట= కిరీటం; కంకణ= మోచేతి కడియాలు; అంగద= బాహుపురంబు; మణి ముద్రిక= వజ్రపుటుంగరాలు; వినూత్న - రత్న - నూపుర= సరికొత్త రత్నాలు తాపిన కాళ్లకడియాలు; కాంచీ= మొలనూలు గొలుసులచే విరాజమానున్= ప్రకాశించేవాణ్ణి; భవ - మహా+అర్ణవ - శోషున్= సంసారచక్రమనే (దాటరాని) మహాసముద్రాన్ని ఎండగట్టివాణ్ణి; సత్+భక్త - పోషున్= శ్రేష్ఠులైన భక్తుల్ని పోషించేవాణ్ణి...

**తా :** నీలమేఘంవంటి శ్యామలవర్ణంతో వెలిగేవాడు, ఆశ్రితుల్ని రక్షించడంలో ఆనందం పొందేవాడు, యోగి హృదయ పద్మాలలో నివసించేవాడు, నిండు జాబిల్లి మోమువాడు, జగత్తుకు హితంచేసేవాడు, వేకువనే వికసించిన పద్మాలవంటి కన్నులుకలవాడు, లక్ష్మీమానసోల్లాసి, పీతాంబరుడు, హారకుండలకేయురకిరీటాద్యాభరణాలు ధరించినవాడు. భవసాగరంనుండి తరింపచేసేవాడు, భక్తపోషకుడూ ఐన విష్ణు భగవానుణ్ణి.

**వ. మఱియు సునందాదిపరిజనసంతతసేవితు, నానందకందళితహృదయారవిందు, నరవిందవాసినీ వసుంధరాసుందరీసమేతు, నారదయోగీంద్రసంకీర్తనానందితు, నవ్యయు, ననఘు, ననంతు, నప్రమేయు, నజితు, నవికారు, నాదిమధ్యాంతరహితు, భవలయాతీతుఁ, గరుణాసుధాసముద్రు, నచ్యుతు, మహానుభావుఁ బరమపురుషుఁ, బురుషోత్తము, నిఖిలజగదుత్పత్తిస్థితిలయకారణుఁ, జిదచిదీశ్వరు, నష్టభుజుఁ, గౌస్తుభ శ్రీవత్సవక్షు, శంఖచక్ర గదాపద్మశార్ఙ్గాదిదివ్యసాధను, సర్వశక్తిసేవితుఁ బరమేష్ఠిజనకు నారాయణుం గనుంగొని దండప్రణామంబులు సేసి కరకమలంబులు మొగిచి భక్తిపూర్వకంబుగా నభినందించిన, న య్యాదిదేవుండును వారలం గరుణావలోకనంబులు నిగుడ నవలోకించి, దరహాసపూరంబు దోరంబుగా సాదరంబుగ నిట్లనియె. 1313**

**ప్రతి :** మఱియున్= ఇంకను; సునంద+ఆది= సునందుడు మొదలుగాగల; పరిజన – సంతత – సేవితున్= సమీపంగా చరించు సేవకులచే ఎల్లవేళల సేవింపబడేవాణ్ణి; ఆనంద – కందళిత – హృదయ+అరవిందున్= సంతోషంచే అంకురించిన పద్మంవంటి హృదయం గలవాణ్ణి; అరవిందవాసినీ= పద్మంలో వసించే లక్ష్మీదేవి; వసుంధరా సుందరీ= భూదేవి; యుత= ఇద్దరు దేవేరులతో కూడి ఉన్నవాణ్ణి; నారద – యోగి+ఇంద్ర= యోగిశ్రేష్ఠుడైన నారదుని యొక్క; సంకీర్తనా+ఆనందితున్= సంగీతకీర్తనలచే ఆనందించేవాణ్ణి; అవ్యయున్= వ్యయం లేనివాణ్ణి; అనఘున్= పాపంలేనివాణ్ణి; అనంతున్= అంతఁలేనివాణ్ణి; అప్రమేయున్= ఇంత అంత అనే హద్దులులేనివాణ్ణి; అజితున్= జయింపశక్యం కానివాణ్ణి; అవికారున్= ఎట్టి మార్పులూ పొందనివాణ్ణి; ఆది మధ్య+అంత రహితున్= మొదలు, నడుమ, తుది లేనివాణ్ణి, భవలయ+అతీతున్= పుట్టుకలకు; చావులకు అతీతమైనవాణ్ణి; కరుణా – సుధా – సముద్రున్= దయ అనే అమృతసాగరమైనవాణ్ణి; అచ్యుతున్= నాశం లేనివాణ్ణి; మహా+అనుభావున్= గొప్ప ప్రభావం కలవాణ్ణి; పరమ పురుషున్= పరమాత్మను, పురుష+ఉత్తమున్= పురుష శ్రేష్ఠుణ్ణి; నిఖిల – జగత్+ఉత్పత్తి – స్థితి – లయకారణున్= సమస్త విశ్వంయొక్క సృష్టి – స్థితి – లయాలకు కారణమైనవాణ్ణి; చిత్+అచిత్+ఈశ్వరున్= జ్ఞానాలజ్ఞానాలకు ప్రభువైనవాణ్ణి; అష్టభుజున్= ఎనిమిది చేతులుకలవాణ్ణి; కౌస్తుభ – శ్రీవత్స – వక్షున్= కౌస్తుభమణి; శ్రీవత్సం అనే పుట్టుమచ్చ ఎదపై కలవాణ్ణి; శంఖ – చక్ర – గదా – పద్మ – శార్ఙ్గ+ఆది – దివ్య – సాధనున్= శంఖం, చక్రం, గద, పద్మం, విల్లు, మొదలైన, దివ్య సాధనాలు (ఆయుధాలు) కలవాణ్ణి; సర్వశక్తి – సేవితున్= సర్వ శక్తులచే సేవించబడేవాణ్ణి; పరమేష్ఠి – జనకున్= బ్రహ్మకు తండ్రియైనవాణ్ణి; నారాయణున్= శ్రీమన్నారాయణుణ్ణి; కనున్+కొని= దర్శించి; దండప్రణామంబులు+చేసి= నమస్కారాలుచేసి; కరకమలంబులు= పద్మాలవంటిచేతులు, మొగిచి= ముడిచి; భక్తిపూర్వకంబు+కాన్= భక్తితోకూడ; అభినందించినన్= పొగడగా; ఆ+ఆదిదేవుండును= ఆ తొలిదైవం ఐన విష్ణువుకూడా; వారలన్= శ్రీకృష్ణార్జునుల్ని; కరుణా+అవలోకనంబులు= దయతో కూడిన చూపులు; నిగుడన్= అతిశయించగా; అవలోకించి= చూచి; దరహాస పూరంబు= చిఱునవ్వు; తోరంబు+కాన్= ఎక్కువ కాగా; స+ఆదరంబు+కన్= ఆప్యాయతతోకూడ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇంకా, సునందాది పరిచారకులచే సేవించబడుతున్నవాణ్ణి; సంతోష హృదయంకల్గినవాణ్ణి, శ్రీదేవీ, భూదేవీ సమేతుడైనవాణ్ణి, నారదాదుల సంకీర్తనలకు ఆనందించేవాడణ్ణి, అవ్యయుణ్ణి, పుణ్యాత్ముడూ, అనంతుడూ, అప్రమేయుడూ, జయంకలవాడు; మార్పులు లేదు, ఆదిమధ్యాంతాలు లేనివాడు, కరుణాసముద్రుడు, చ్యుతిలేనివాడు, మహానుభావుడు, పరమాత్ముడు,

పురుషశ్రేష్ఠుడు, జగదుత్పత్తి స్థితి, లయకారకుడు, జ్ఞానాజ్ఞాన ప్రభుడు, అష్టభుజుడు, కౌస్తుభశ్రీవత్సములు ఎదపై లాంఛనాలుగా కలవాడు, శంఖచక్రాది ఆయుధధారి, సర్వశక్తిమంతుడు, బ్రహ్మకు తండ్రియైనవాడు అగు శ్రీమన్నారాయణుణ్ణి కృష్ణార్జునులు దర్శించుకొని సాష్టాంగప్రణామాలు ఆచరించి, భక్తితో నుతించగా శ్రీమహావిష్ణువువారిని దయతోచూచి, చిరునవ్వుతో, ఆప్యాయంగా ఇలా అన్నాడు.

**క. ధరణికి వ్రేఁ గగు దైత్యులఁ, బొరిబొరి వధియించి ధర్మమున్ నిలుపుటకై**
**ధర జనియించితి రిరువురు, నరనారాయణు లనంగ నా యంశమునన్. 1314**

**ప్రతి :** ధరణికిన్= భూమికి; వ్రేఁగు+అగు= భారమైనట్టి; దైత్యులన్= రాక్షసుల్ని; పొరిపొరి= మిక్కిలిగా; వధియించి= సంహరించి; ధర్మమున్= ధర్మాన్ని; నిలుపుటకున్+ఐ= లోకంలో స్థిరపరడానికై; నా+అంశమునన్= నా అంశతో; ధరన్= భూమిపై; ఇరువురు= మీరుభయులు; నరనారాయణులు+అనన్+కన్= నరనారాయణులు అనే పేర్లతో; జనియించితిరి= పుట్టారు.

**తా :** భూమికి బరువైన రాక్షసుల్ని చంపి, ధర్మరక్షణ చేసేందుకు మీరిద్దరు నా అంశతో నరనారాయణులుగా భూమిపై జన్మించారు.

**క. ఆరూఢనియతితోఁ బెం, పారిన మిము ని మ్మునీంద్రు లర్థిం జూడం**
**గోరిన మీ వచ్చుటకై, ధారుణిసురసుతుల నిటకుఁ దగఁ దేవలసెన్. 1315**

**ప్రతి :** ఆరూఢ నియతితోన్= పరిణతమైన నియమాలతో; పెంపారిన= ప్రసిద్ధిగాంచిన; మిమున్= మీ ఇద్దరిని (కృష్ణార్జునులను); ఈ+ముని+ఇంద్రులు= వైకుంఠంలో ఈ మునీశ్వరులు; అర్థిన్+చూడన్= చూడాలనే కోరికతో; కోరినన్= కోరగా; మీ+వచ్చుటకై= మిమ్ము ఇక్కడికి రప్పించడాననికై; ధారుణీసుర= బ్రాహ్మణుని; సుతులన్= కుమారులను; ఇటకున్= ఇక్కడికి; తగన్= తగినవిధంగా; తేవలసెన్= తెప్పించాల్సివచ్చింది.

**తా :** భూభారంతగ్గించే గొప్ప నిష్ఠతో మీరిద్దరూ భూలోకంలో ప్రసిద్ధులుకాగా, మిమ్మల్నిద్దరినీ చూడాలని ఇక్కడి మునులు కోరగా బ్రాహ్మణకుమారులను తెచ్చే మిషతో మిమ్ము రప్పించాను - అని శ్రీ మహావిష్ణువన్నాడు.

**క. అని యా డింభకులను దో, కొని పొండని యిచ్చి వీడుకొలిపిన వారల్**
**వినతు లయి పెక్కువిధముల, వినుతించుచు నచటు వాసి విప్రునిసుతులన్. 1316**

**ప్రతి :** అని= ఈ విధంగా (విష్ణువు చెప్పి); ఆ - డింభకులను= ఆ పిల్లలను; తోకొని= తోడ్కొని; పొండు+అని= వెళ్లండి అంటూ; వీడుకొలిపినన్= వీడ్కొల్పగా; వారల్= కృష్ణార్జునులు; వినతులు+అయి= నమస్కరిస్తూ; పెక్కు విధములన్= బహురీతులుగా; వినుతించుచున్= కీర్తిస్తూ; అచటున్= ఆ వైకుంఠాన్ని; పాసి= వదిలి; విప్రుని సుతులన్= బ్రాహ్మణుని కుమారులను...

**తా :** విష్ణువిలా చెప్పి, బాలకుల్ని తీసుకొని వెళ్లండనగా, ఆయనను వీడ్కొని, నమస్కరించి, స్తుతించి బ్రాహ్మణబాలకులతో కృష్ణార్జునులు

**వ. తోడ్కొని సంప్రాప్తమనోరథులయి యబ్బాలకులఁ దత్తద్వయోరూపంబులతోడఁ దెచ్చి యాబ్రాహ్మణునకు సమర్పించిన నతండు సంతుష్టాంతరంగుం డయ్యె; న య్యవసరంబున. 1317**

**ప్రతి :** తోడ్కొని= బాలురను వెంటబెట్టుకొని; సంప్రాప్త – మనోరథులు+ఐ= కోర్కెలు ఫలించినవారై; ఆ+బాలకులన్= ఆ బ్రాహ్మణకుమారుల్ని; తత్+తత్+వయస్+రూపంబులతోడన్= ఆయా వయస్సులకు; తగిన రూపాలతో; తెచ్చి= తీసుకొనివచ్చి; ఆ బ్రాహ్మణునకున్= ఆ బాలకుల తండ్రి అయిన బ్రాహ్మణునికి; సమర్పించినన్= ఇవ్వగా; అతండు= ఆయన; సంతుష్ట= తృప్తిచెందిన; అంతరంగుడు= మనస్సుకలవాడు; అయ్యెన్= అయినాడు; ఆ+అవసరంబునన్= ఆ సందర్భంలో...

**తా :** తమ కోర్కెలు ఫలించగా శ్రీకృష్ణార్జునులు ఆ బాలకులను వారివారి వయస్సులకు తగిన రూపాలతో తీసుకొనివచ్చి వారితండ్రి అయిన బ్రాహ్మణునికి అప్పచెప్పారు. అతడు చాలా సంతోషించినాడు. ఆ సమయంలో

**చ. అనిమిషనాథనందనుఁ డహర్పతితేజుఁడు గృష్ణుతోడఁ దాఁ**
**జని యచటం గనుంగొనిన సర్వశరణ్యునిఁ బుండరీక నే**
**త్రుని నిజధామవైభవసమృద్ధికిఁ దన్మహనీయమూర్తికిన్**
**మనమున మోదమంది పలుమాఱును సన్నుతిఁ జేసె భూవరా! 1318**

**ప్రతి :** భూవరా= ఓ రాజా!; అనిమిష= దేవతల యొక్క; నాథ= (వారి) ప్రభువైన ఇంద్రుని యొక్క; నందనుఁడు= (కుమారుడైన) అర్జునుడు; అహఃపతి= సూర్యునివంటి; తేజుఁడు= తేజస్సుకల్గిన; కృష్ణుతోడన్= శ్రీకృష్ణునితో; తాన్+చని= తాను వెళ్లి; అచటన్= ఆ వైకుంఠంలో; కనున్+కొనిన= దర్శించిన; సర్వ శరణ్యునిన్= అందరు శరణుకోరేవాణ్ణి; పుండరీక నేత్రునిన్= తెల్లదామరలవంటి కన్నులుకలవాణ్ణి (శ్రీమహావిష్ణుని); నిజ – ధామ – వైభవ – సమృద్ధికిన్= ఆయన నివాసమైన వైకుంఠంయొక్క గొప్పదైన వైభవానికి; తద్+మహనీయ – మూర్తికిన్= ఆ గొప్పదైన రూపానికి; మనమునన్= మనస్సులో; మోదము+అంది= సంతోషపడి; పలుమాఱును= అనేక పర్యాయాలు; సన్నుతిచేసెన్= స్తుతించాడు...

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఇంద్రసూనుడైన అర్జునుడు శ్రీకృష్ణునితోబాటు వైకుంఠానికివెళ్లి శరణాగతరక్షకుడైన ఆ శ్రీమహావిష్ణువురూపాన్ని, వైభవాన్నీ కన్నులార వీక్షించినందుకు సంబరపడి, పలుమార్లు ఆ దేవదేవుణ్ణి స్తుతించినాడు.

**తే. వారిజాక్షుని భక్తమందారు ననఘుఁ, గృష్ణు నఖిలేశుఁ గేశవు జిష్ణుఁ బరము**
**వినుతి సేయుచుఁ దత్పాదవనజములకు, వందనము లాచరించి యానంద మొందె. 1319**

**ప్రతి :** వారిజ+అక్షున్= కమలనేత్రుణ్ణి; భక్తమందారున్= భక్తులపాలిటి కల్పవృక్షమైనవాణ్ణి; అనఘున్= పాపరహితుణ్ణి; అఖిల+ఈశున్= సర్వానికి ప్రభువైనవాణ్ణి; కేశవు= కేశిరాక్షసుణ్ణి సంహరించినవాణ్ణి; జిష్ణున్= జయశీలంకలవాణ్ణి; పరమున్= శ్రేష్ఠుడైనవాణ్ణి; కృష్ణున్= శ్రీకృష్ణుణ్ణి; వినుతి+చేయుచుచే= స్తుతిస్తూ; తత్+పాద – వనజములకున్= ఆయన పాదపద్మాలకు వందనములు= నమస్కారాలు; ఆచరించి= చేసి; ఆనందము+ఒందెన్= సంతోషాన్ని పొందాడు.

**తా :** కమలాక్షుడు, భక్తకల్పవృక్షము, సకలేశ్వరుడు, పురుషోత్తముడు, అతిపవిత్రుడు అయిన కృష్ణుణ్ణి స్తుతిస్తూ, ఆయన పాదాలకు నమస్కరించి, పరమానందం పొందాడు అర్జునుడు.

**వ. అంత. 1320**

**ప్రతి :** అంతన్= ఆ సమయములో...

**తా :** ఈ సంఘటన తరువాత

**మ. హరి సర్వేశుఁ డనంతుఁ డాద్యుఁ డభవుం డామ్నాయసంవేది భూ**
**సురముఖ్యప్రజలన్ సమస్తధనవస్తుశ్రేణి నొప్పారఁగాఁ**
**బరిరక్షించుచు ధర్మమున్ నిలుపుచుం బాపాత్ములం ద్రుంచుచుం**
**బరమోత్సాహ మెలర్ప భూరిశుభవిభ్రాజిష్ణుఁడై ద్వారకన్. 1321**

**ప్రతి :** హరి= విష్ణువు; సర్వ+ఈశుఁడు= సకలానికి ప్రభువు; అనంతుఁడు= అంతంలేనివాడు; ఆద్యుడు= సృష్టికి తానే మొదలైనవాడు; అభవుండు= పుట్టుకలేనివాడు; ఆమ్నాయ - సంవేది= వేదాలచే చక్కగా తెలియబడేవాడు; భూసుర - ముఖ్య - ప్రజలన్= బ్రాహ్మణులు మొదలైన ప్రజలను, సమస్త - ధన - వస్తు - శ్రేణిన్= అన్నిరకాలైన ధనధాన్యాదివస్తువుల్నీ; ఒప్పారన్+కాన్= ఒప్పుతుండగా; పరిరక్షించుచున్= కాపాడుతూ; ధర్మమున్= ధర్మాన్ని; నిలుపుచున్= స్థాపిస్తూ; పాప+ఆత్ములన్= పాపాత్ముల్ని; త్రుంచుచున్= చంపుతూ; పరమ+ఉత్సాహము+ఎలర్పన్= మిక్కిలివేడుక అతిశించగా; ద్వారకన్= ద్వారకానగరంలో; భూరి - శుభ - విభ్రాజిష్ణుడు+ఐ= గొప్ప శుభాలచే ఎక్కువగా ప్రకాశించేవాడా; ద్వారకన్= ద్వారకానగరంలో...

**తా :** అంతంలేనివాడు, సకలేశ్వరుడు, పుట్టుకలేనివాడు, వేదాలచే తెలియదగిన భగవంతుడైన కృష్ణుడు, బ్రాహ్మణాదులైన జాతి సర్వప్రజలను, సమస్తధన, కనక, ధాన్య, వస్తు, వాహన సమృద్ధమై సంతోషించేవిధంగా ఏలుతూ, ఆర్తులను కాపాడుతూ, ధర్మాన్ని పరమోత్సాహంగా ప్రతిష్ఠాపిస్తూ, పాపులను శిక్షిస్తూ ద్వారకలో ప్రకాశిస్తూ

**క. జనవినుతముగాఁ బెక్కు స, వనములు దనుఁ దాన కూర్చి వైదికయుక్తిం**
**బొనరించుచు ననురాగము, మనమునఁ దళుకొత్త దైత్యమర్దనుఁ డెలమిన్. 1322**

**ప్రతి :** జన - వినుతము+కాన్= ప్రజలు మెచ్చుకొనేలా; పెక్కుసవనములు= చాలా యజ్ఞాలు; తనున్+తాన= తనకు తానే; కూర్చి= కల్పించి; వైదికయుక్తిన్= వేదాలలో చెప్పినప్రకారంగా; పొనరించుచున్= చేస్తూ; దైత్యమర్దనుఁడు= రాక్షససంహారియైన కృష్ణుడు; అనురాగము= ప్రేమ; మనమునన్= మనసులో; తళుకొత్తన్= ప్రకాశించగా; ఎలమిన్= ప్రేమతో...

**తా :** తన రాజ్యప్రజలు ప్రశంసించేలా తనకు తానే నిర్ణయించి, వేదాలు చెప్పినట్లుగా పలుయజ్ఞాలు, ఎంతో ఇష్టంగా నిర్వహించాడు.

**విశే :** తనకు తానే అనడంలో ఓ విశేషం ఉంది. తానే సర్వయజ్ఞాలకు భోక్త. ఇక్కడ తనను తృప్తి పెట్టేందుకు ఇతరులు యజ్ఞాదులు చేయాలి. కాని, తానే యజ్ఞకర్తయై తనకు తానే (కర్త, భోక్త) చేశాడు. ఇది ప్రజల సంతోషంకొరకు, ధర్మాచరణకొరకు చేశాడు.

వ. అట్లు కృష్ణుండు ద్వారకానగరంబునఁ బూజ్యంబగు రాజ్యంబు సేయుచుఁ బురందరవిభవంబున నిరవొంది కనకమణిమయవిమానమండపగోపురప్రాసాదసౌధచంద్రశాలాంగణాదివివిధభవనంబులందును రంగదుత్తుంగతరంగడోలావిలోలకలహంసచక్రవాకకారండవసారస క్రౌంచముఖజలవిహంగవిలస దుచ్చలితగరుదనిలదరదమలకమలకుముదకహ్లారసందోహనిష్యందమకరందరసపానమదవదిందిందిరకుల కల గాయకఝుంకారనినదంబులును, నిరంతరవసంతసమయసముచితపల్లవితకోరకితబాలరసాలజాల లాలితకిసలయ విసర ఖాదనజాత కుతూహలాయమానకషాయకంఠకలకంఠకలరవమృదంగఘోషంబులును, నిశితనిజచంచూపుటనిర్దళితసకలజననయనానందసుందరనందితమాకందపరిపక్వఫలరంధ్రవిగళిత మధురరసాస్వాదనముదితరాజకీరశారికానికరమృదుమధురవచనరచనావశకృత్యంబులును నమరఁ, బురపురంధ్రీజనపీనపయోధరమండలవిలిప్తలలితకుంకుమపంకసంకులసౌగంధ్యానుబంధ బంధురగంధానుమోదితుండును, జందనాచలసానుదేశసంజాతమంజులమాధవీలతానికుంజ మంజుల కింజల్కరంజితనివాసవిసరవిహరమాణశబరికాకబరికాపరిపూర్ణసురభికుసుమమాలికాపరిమళ వహుండును, గళిందకన్యకాకల్లోలసందోహపరిస్పందకందళితమందగమనుండును నగు మందానిల విదూషకునిచేఁ బోషితాభ్యాసిత లాలిత లగు నేలాలతావితాననటుల నటనంబుల విరాజితంబులగు కాసారతీర భాసురోద్యానంబులందును, జారుఘనసారపటీరబాలరసాలసాలనీపతాపింఛజంబూజంబీరనింబ కదంబప్రముఖ ముఖ్యశాఖీశాఖాకీర్ణశీతలచ్ఛాయావిరచితవిమలచంద్రకాంతోపలవేదికాస్థలంబు లందును, నుదంచిత పింఛవిభాసితబాలనీలకంఠకేకారవాకులీకృతకృతకమహీధరంబులందును, లలితమణివాలుకానేక పులినతలంబులందును, గప్పురంపుం దిప్పలను, గురువేరు చప్పరంబులను, విరచితదారుయంత్రనిబద్ధ కలశనిర్యత్పయోధారాశీకరపరంపరాసంపాదితనిరంతరహేమంతసమయప్రదేశంబు లందును, నిందిరారమణుండు షోడశసహస్రవధూయుక్తుండై యందఱ కన్నిరూపులై లలితసౌదామనీలతాసమేత నీలనీరదంబుల విడంబించుచుఁ గరేణుకా కలిత దిగ్గజంబునోజ రాజిల్లుచు, సలిలకేళీవిహారంబులు మొదలుగా ననేకలీలావినోదంబులు సలుపుచు, నంతఃపురంబునఁ గొలువున్న యవసరంబున వివిధవేణువీణాదివాద్య వినోదంబులను, మంజులగానంబులను, గవిగాయకసూతవందిమాగధ జనసంకీర్తనంబులను, నటనటీజన నాట్యంబులను, విదూషకపరిహాసోక్తులను, సరససల్లాపమృదుమధురభాషణంబులను బ్రొద్దుపుచ్చుచు నానందరసాబ్ధి నోలలాడుచుండె; నంత. **1323**

ప్రతి : అట్లు= ఆ విధంగా; (జనరంజకంగా); కృష్ణుండు= శ్రీకృష్ణుడు, ద్వారకానగరంబునన్= (రాజధాని అయిన) ద్వారకపట్టణంలో; పూజ్యంబు+అగు= పూజనీయమైన; రాజ్యంబు+చేయుచున్= రాజ్యాధికారంచేబట్టి; పురందర= ఇంద్రుని; విభవంబునన్= వైభవంతో; ఇరవు+పొంది= ఒప్పారి (అభివృద్ధిపొంది); కనక= బంగారు; మణిమయ= వజ్రాలుతాపిన; విమాన= మందిరపు కప్పులు; మండప= మంటపాలు; గోపుర= మహాద్వారాలపై భాగాలు; ప్రాసాద= భవనాలు; సౌధ= మేడలు; చంద్రశాల= చంద్రకాంత శిలలతో చేసిన విశ్రాంతి గృహాలు; అంగణ= ముంగిలి (కొరడు) ఇళ్లు; ఆది= మొదలుగాగల వివిధ – భవనంబులందును= రకరకాల గృహములందు; రంగత్= ఒప్పుచున్న; ఉత్+తుంగ= బాగా

పైకిలేచిన; తరంగ= అలలచే; డోలా= ఊగుచున్న; విలోల= కదలుచున్న; కలహంస= శ్రేష్ఠమైన రాజహంసల; చక్రవాక= చక్రవాకపక్షులు; కారండవ= కరండపక్షుల; సారస= సారసపక్షుల; క్రౌంచముఖ= క్రౌంచపక్షుల మొ॥ జలవిహంగ= జలపక్షుల; విలసత్= విలసిల్లే; ఉచ్చలిత= బాగా విప్పార్చిన; గరుత్= రెక్కలచే; (పుట్టిన); అనిల= గాలిచేత; దరత్= నదిలోని (కాలువల); అమల= స్వచ్ఛమైన; కమల= తామరల; కుముద= కలువల; కల్హార= సౌగంధికముల; సందోహ= సమూహాలనుండి; నిష్యంద= స్రవించెడు; మకరంద= పూతేనెల; రసపాన= రసమును ఆస్వాదించి; మదవత్= మదించి ఉన్న; ఇందిందిర= ఆడుతుమ్మెదల; కుల= సమూహం అనే; కల= మనోహరమైన; గాయక= పాటగాళ్ల; ఝంకార - నినదంబులు= ఝుమ్మనే నాదాలు; నిరంతర= ఎల్లవేళల; వసంతసమయ= వసంతఋతుకాలంలోని; సమ్+ఉచిత= చక్కనియోగ్యమైన; పల్లవిత= చిగురించిన; కోరకిత= మొగ్గతొడిగిన; బాలరసాల= గున్నమామిడి చెట్లు; జాల= సమూహంచే; లాలిత= లాలించబడిన; కిసలయ= చిగురుల; విసర= సమూహమును; ఖాదన= తినుటచే; జాత= పుట్టిన; కుతూహలాయమాన= ఉత్సాహించుచున్న; కాషాయకంఠ= వగరుగొంతుతో; కలకంఠ= కోకిలల; కలరవ= మధురమైన ధ్వనికల్గిన; మృదంగ ఘోషంబులును= మృదంగవాద్య ధ్వనులును; నిశిత= వాడియైన; నిజచంచూపుట= తమ ముక్కుకొసలతో; నిర్దళిత= చీల్చబడిన; సకలజననయన+ఆనంద= సమస్త ప్రజల కన్నులపండువుగ; సుందర - నందిత= మనోహరమై; ఆనందకరమై, మాకంద= మామిడిచెట్ల; పరిపక్వ= బాగాపండిన; ఫలరంధ్ర= పండుయొక్క రంధ్రమునుండి; విగళిత= జారుచున్న; మధురరస= తియ్యని రసమును; ఆస్వాదన= త్రాగుటచే; ముదిత= ఆనందించిన; రాజకీర= రాచిలుకల; శారికా= గోరువంకల; నికర= సమూహంయొక్క; మృదుమధుర= మెత్తనైన, తియ్యనైన, వచన రచనావశ= మాటల కల్పనలచే స్వాధీనమైన కృత్యంబులును= చేష్టలును; అమరన్= ఒప్పగా; పురపురంధ్రీజన= నగర స్త్రీలయొక్క; పీన= బలసిన; పయోధర= పాలిండ్ల; మండల= వర్తులములపై; విలిప్త= పూయబడిన; లలిత= లేతయైన; కుంకుమ పంక= కుంకుమద్రవం చేత; సంకుల= కలిసిందైన; సౌగంధ్య+అనుబంధ= పరిమళపు జోడింపుచే; బంధుర= ఒప్పిన; గంధ+అనుమోదితుండును= సువాసనలకు బాగా సంతోషించినవాడు; చందన+అచల= గంధపుచెట్లకొండల; సానుదేశ= లోయ ప్రదేశాలలో; సంజాత= పుట్టిన; మంజుల= మనోహరమైన; మాధవీలతా= మాధవి తీగెల; నికుంజ= పొదరిండ్ల; మంజుల= మనోహర; కింజల్క= పూలకేసరాలచే; రంజిత= రంజిల్లిన (ఆహ్లాదితమైన); నివాస= ఉండుటకు వీలైనవాటి; విసర= సమూహంయొక్క; విహరమాణ= విహరిస్తున్న; శబరికా= శబరస్త్రీల; కబరికా= వెంట్రుకల కొప్పుల; పరిపూర్ణ= నిండైన; సురభి= సుగంధాలైన; కుసుమమాలికా= పూలమాలల; పరిమళవహుండు= సుగంధమును మోసేగాలి కలవాడు; కళిందకన్యకా= కళిందకు పుట్టిన కూతురు కాళిందీ(నది)యొక్క కల్లోల= అలల; సందోహ= సమూహంయొక్క; పరిస్పంద= బాగా స్పందించిన; కందళిత= ఆనందించు; మందగమనుండును= మెల్లగా నడుస్తున్న (వీస్తున్న); మంద+అనిల= మెల్లగా సాగే గాలిఅనే; విదూషకునిచే= నాటక ఉపనాయకునిచే; పోషిత= పెంచబడిన; అభ్యాసిత - అభ్యసించబడిన; లాలిత= లాలింపబడినది; అగు= ఐనట్టి; ఏలా లతా వితాన= ఏలకీ తీగెల సమూహము అనే; నటుల= నాట్యకళాభ్యాసకుల; నటనంబుల= నటనలచే; విరాజితంబులు+అగు= ప్రకాశిస్తున్న; కొసార తీర= సరస్సుల ఒడ్డుల్లో ఉండే; భాసుర= ప్రకాశిస్తున్న; ఉద్యానంబులందును= విహారవనములందును; చారు= మనోహరమైన; ఘనసార= కర్పూరంయొక్క; పటీర= చందనంయొక్క; బాలరసాల= గున్నమామిళ్ల; సాల= మద్దిచెట్ల; నీప= కడిమిచెట్ల; తాపింఛ= తమాలవృక్షములు; జంబూ= నేరేడుచెట్ల; జంబీర= మరువపుచెట్ల; నింబ= నిమ్మ; కదంబ= కడిమిచెట్లు; ప్రముఖ= మొదలైన; ముఖ్యశాఖీ= ముఖ్యమైన చెట్ల (శాఖలుకందిశాఖి= చెట్టు); శాఖ+ఆకీర్ణ= కొమ్మల వ్యాప్తివలన; శీతల= చల్లని; ఛాయా= నీడలలో;

విరచిత= కూర్పబడిన; విమల= స్వచ్ఛమైన; చంద్రకాంత+ఉపల= చంద్రకాంత శిలల(చేనిర్మితమైన); వేదికాస్థలంబులందును= గద్దెలమీదను; ఉత్+అంచిత= బాగా ఒప్పుచున్న; పింఛ= పింఛములచే; విభాసిత= ప్రకాశించు; బాలనీలకంఠ= చిన్ని నెమళ్ల; కేకా+ఆరవ= అరుపుల ధ్వనుల; ఆకులీకృత= సందడిగా చేయబడిన; కృతక మహీధరంబులందును= తయారు చేసుకొనబడిన పర్వతాలలో (సహజపు కొండలుకాక, మనుషులచే తయారు చేయబడిన కేళీపర్వతాలు); లలిత= చిన్నవైన; మృదువైన; వాలుకా= ఇసుకతో చేయబడిన; అనేక పులిన తలంబులందును= బహుళములైన తిన్నెలలో; కప్పురంపు దిప్పలను= కర్పూరం దిబ్బలు; కురువేరు చప్పరంబులను= వట్టివేళ్ల పందిళ్లలో; విరచిత= తయారు చేయబడిన; దారుయంత్ర= కర్రతో చేయబడ్డ యంత్రాలకు; నిబద్ధ= కట్టబడిన; కలశ= కుండలతో; నిర్యత్= ఎడతెరపిలేని; పయస్ధారాశీకర= నీటిధారలవలని తుంపరల; పరంపర= జల్లుజుల్లుగాపడగా; సంపాదిత= అందిన; నిరంతర= ఎల్లప్పటికిని (అన్నికాలాల్లో) హేమంతసమయ= చలికాలమునాటి వాతావరణంకల; ప్రదేశంబులందును= స్థలాలలో; ఇందిరా రమణుండు= (లక్ష్మీదేవి భర్త అయిన=) శ్రీకృష్ణుడు; షోడశ సహస్ర= పదహారువేల; వధూయుక్తుండై= భార్యలతో కలిసి; అందఱకున్+అన్నిరూపులై= పదహారువేల రూపాలతో; లలితసౌదామనీలతా= లేతమెరుపు తీగలతో; సమేత= కూడిన; నీలనీరదంబుల= నల్లనిమేఘాలవలె; విడంబించుచున్= అతిశయిస్తూ; కరేణుకా కలిత= ఆడయేనుగులతో కూడిన; దిక్+గజంబున్+ఓజన్= దిక్కులలో ఉండే (శ్రేష్ఠ) గజంవలె; రాజిల్లుచు= ప్రకాశిస్తూ; సలిల కేళీవిహారంబులు= నీళ్లతో ఆడే ఆటలు; మొదలుకాన్= సలుపుచు= చేస్తూ (క్రీడిస్తూ); అంతఃపురంబునన్= స్త్రీజనములుండే చోట్లలో; కొలువు+ఉన్న= విశ్రాంతుడైఉన్న; అవసరంబున= సమయంలో; వివిధవేణు వీణ+ఆది= రకరకాల మురళీ; వీణ మొదలైన వాద్యవినోదంబులను= వాదన పరికరాలతో ఆనందంగా క్రీడిస్తూ; మంజుల గానంబులను= మనోహరమైన పాటలతో; కవి, గాయక, సూత, వందిమాగధజన సంకీర్తనంబులను= కవులు, పాటగాళ్లు, సూతులు, స్తోత్రపాఠకులు మొ॥ వారి గానాలతోడను; నటనటీజన నాట్యంబులను= వేషగాళ్లు; వేషకత్తెల నృత్యములు; నాటకాలును; విదూషక= హాస్యగాళ్ల+పరిహాస+ఉక్తులను= హాస్యపు మాటల్ని; సరససల్లాప= రసవంతములైన; కబుర్లుకల; మృదుమధుర= మెత్తని; తీయని; భాషణంబులను= మాటలతోడను; ప్రొద్దుపుచ్చుచున్= కాలంగడుపుచు; ఆనందరస= సంతోషమనెడు; రస+అబ్ధిన్= రససముద్రంలో; ఓలలాడుచు+ఉండెన్= మునుగుచుండెను; అంత= అట్టి సమయంలో...

**తా :** శ్రీకృష్ణుడు ఆవిధంగా ద్వారక రాజధానిగా రాజ్యంచేస్తూ ఇంద్ర వైభవంతో విలసిల్లాడు. బంగారంతో చేసి, వజ్రాలు చక్రవర్తి నివసించే వజ్రాలు పొదిగిన సౌధాలు; గోపురాలు, మంటపాలు, మహాభవనాలు, మేడలు, చంద్రశాలలు, ఆ నగరంలో ఉన్నాయి. గృహాల్లో, క్రీడాసరోవరాల్లో, కాలువల్లో తరంగాలలో ఊగుతున్న హంసలు, చక్రవాకాదిజలపక్షులు రెక్కలు పటపటలాడించినప్పుడు విప్పారిన కమలాలు, కలువలలోని మకరందాన్ని ఆస్వాదిస్తున్న తుమ్మెదల గానాలు వినిపిస్తున్నాయి. నిరంతరం వసంతకాలం అనిపించేలా చిగురించి, మొగ్గలు తొడుగుతున్న గున్నమామిళ్లు, వాటిచిగుళ్లను తింటూ వగరు గొంతులతో కోకిలల పాటలు వినిపిస్తున్నాయి. రాచిలుకలు, గోరువంకలు తమ వాడిముక్కులతో చీల్చి గున్నమామిడి పండ్ల రసాలు గ్రోలి, ఆ తియ్యదనంతో ఆనందిస్తూ, మెత్తగా, తియ్యగా పలుకుతున్నాయి. విభుడు శ్రీకృష్ణుడు పురస్త్రీల స్తనమండలాలపై రాసిన కుంకుమ ద్రవసుగంధాలకు సంతోషిస్తున్నాడు. చందనవృక్షాలకొండల సానువుల్లో మాధవీలతల పొదరిండ్లలో తిరుగాడే శబరకాంతల కొప్పులలోని పూలతావిని మోసేగాలి అక్కడ వీస్తోంది. ఆ పరిమళాలకు కృష్ణుడు ఆనందిస్తున్నాడు యమునానది అలలతో చల్లబడిన, మెల్లగా వీస్తున్న వాయుదేవుడనే విదూషకుడు ఏలకీతీగలనే నటులకు నాట్యం నేర్పుతున్నాడా అన్నట్లు అక్కడి చెట్లు ఊగుతున్నాయి. చెరువుల తటముల వెంబడి చందనాదిసురభిళవృక్షాలు, ఉద్యానవనాల్లోని రసాల, సాలాది వివిధ వృక్షాల దట్టమైన కొమ్మలవల్ల సూర్యరశ్మిచొరని చల్లనినీడలలో చంద్రకాంత

శిలావేదికలపై; కృత్రిమమైన ఇసుక బయళ్లపై; కర్పూరపు తిప్పలపై; వట్టివేళ్లతో చల్లబరచిన పందిళ్లలో, కర్రయంత్రాలతో కుండలతో తోడిన బావినీళ్ల చల్లదనంతో నింపి, నిత్య హేమంతం తలపించే ప్రదేశాలలో, శ్రీకృష్ణుడు పదహారువేలమంది భార్యలతో, అందరికి అన్ని రూపాలతో, మెరుపు తీగలగుంపులలో నీలిమేఘంవలె, ఆడయేనుగులమధ్య మదగజంవలె ప్రకాశించేవాడు. జలవిహారాలు మొదలుగాగల కేళీలీలావినోదుడై, అంతఃపురాల్లో ఉంటున్నపుడు వేణు, వీణాదివాద్యగోష్ఠులతో, మధురగానశ్రవణంతో, చుట్టూ కవిగాయకాదులతో, నటనటీజననాట్యాలతో, విదూషకుల హాస్యోక్తులతో, సరససల్లాపాలతో, తీయనిమాటలతో కాలక్షేపం చేస్తూ ఆనందరసప్రవాహంలో ఓలలాడుతూ ఉన్నాడు. ఆ సమయంలో

**మ. అరవిందాక్షపదాంబుజాతయుగళధ్యానానురాగక్రియా**
**సరసాలాపవిలోకనానుగతచంచత్సౌఖ్యకేళీరతిం**
**దరుణుల్ నూఱుఁబదాఱువేలు మహితోత్సాహంబునం జొక్కి త**
**త్పరలై యొండు దలంప కుండిరి సవిభ్రాంతాత్మలై భూవరా! 1324**

**ప్రతి :** భూవరా!= ఓ రాజా!; అరవింద+అక్ష= పద్మనేత్రుడైన శ్రీకృష్ణునియొక్క; పద+అంబుజాత= పాదపద్మాల; యుగళ= జంటపై; ధ్యాన= మనస్సు పెట్టి; అనురాగ= ప్రేమకల్గిన; క్రియా= పనియందు; సరస+ఆలాప= మధురమైన సల్లాపాలతో కూడిన; విలోకన= చూపులతో; అనుగత= తోడుగాఉండి; చంచత్= ఒప్పుతున్న; సౌఖ్యకేళీరతిన్= దాంపత్య క్రీడయందలి ఆసక్తితో; తరుణుల్= భార్యలైన; నూఱున్+పదాఱువేలు= నూటపదహారువేలమంది; మహిత+ఉత్సాహంబునన్= గొప్పసంబరంతో; చొక్కి= పరవశలై; సవిభ్రాంత+ఆత్మలు+ఐ= శృంగార చేష్టలలో మునిగిన మనస్సులు కలవారై; ఒందు= మరేదీ (ఇతర విషయాలు); తలంపక+ఉండిరి= భావించకుండా ఉన్నారు.

**తా :** శ్రీకృష్ణునిపట్ల అమితమైన అనురాగంతో అతణ్ణే ధ్యానిస్తూ, సరస సల్లాపాలతో; వినోదక్రీడలతో, నిత్యదర్శనాదులతో పరవశలై, దాంపత్య సౌఖ్య కేళిలో మునిగినవారై 16,100 మంది భార్యలు ఇతరమైన ఆలోచనలన్నీ మానేస్తారు.

**వ. అదియునుం గాక. 1325**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక...

**తా :** అంతేకాదు

**మ. హరినామాంకితమైన గీత మొకమా టాలించి మూఢాత్ములున్**
**విరతిం బొందఁగఁజాలి యుందురఁట? యా విశ్వాత్ము నీక్షించుచున్**
**బరిరంభించుచు, నంటుచున్, నగుచు సంభాషించుచు న్నుండు సుం**
**దరు లానందనిమగ్న లౌట కిలఁ జోద్యం బేమి? భూవల్లభా! 1326**

**ప్రతి :** భూ వల్లభా!= ఓ పరీక్షిన్మహారాజా! మూఢ+ఆత్ములున్= మోహంలో నిండిన మనస్సుకలవారు కూడా; హరినామ+అంకితము+ఐన= హరినామసంబంధమైన; పేరుతోగల గీతము+ఒకటి= ఒకపాట; ఆలించి= విని; విరతిన్= విరక్తిని; పొందన్+కన్+చాలి= పొందగల్గి; ఉందురు+అఁట!= ఉంటారట! (అలాంటిది) ఆ విశ్వ+ఆత్మున్= ఆ భగవంతుణ్ణి; వీక్షించుచున్= దర్శించుకొంటూ; పరిరంభించుచున్= కౌగిలించుకుంటూ; అంటుచున్= తాకుతూ; నగుచున్= నవ్వుతూ;

సంభాషించుచున్= సలాపాలాడుతూ; ఉండు= ఉండే; సుందరులు= అందగత్తెలైన ఆ భార్యలు; ఆనంద-నిమగ్నలు+ఔటకున్= ఆనందంలో మునిగి ఉండడానికి; ఇలన్= భూమిపై; చోద్యంబు+ఏమి?= ఆశ్చర్యపడేదేముంది?

**తా :** హరినామాంకితమైన ఒక్క సంకీర్తనం వింటేనే మోహాత్ములైనవాళ్లుకూడా; విముక్తిని పొందుతారు కదా! అలాంటప్పుడు శ్రీకృష్ణుని చూస్తూ, మాట్లాడుతూ, తాకుతూ, కౌఁగిలించుకొంటూ, ఆనందపారవశ్యం పొందడంలో ఆశ్చర్యమేముంది?

**విశే :** సామాన్యుడు అనకుండా మూర్ఖులే విరక్తులౌతారని చెప్పడంలో అర్థసాంద్రత. అదికేవలం గీతానికే. అలాంటిది ఇన్ని అంశాల్లో భగవత్సాన్నిధ్యంకలవారి విషయంలో చెప్పేదేముంది?

వరాహపురాణంలోని మాలదాసరికథలో ప్రతిరోజూ కైశికీగాన కైంకర్యంచేసే దాసరిని బ్రహ్మరాక్షసి పట్టుకొని గానకైంకర్య ఫలమిమ్మని అడగడం, దానికి దాసరి సమాధానం; విష్ణునామ సంకీర్తనఫలంయొక్క గొప్పతనం చెప్పబడింది చూడు శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద ఆరవ ఆశ్వాసము. **"ఒక్క సంకీర్తనే చాలు వొద్దికై మము రక్షింపంగ, తక్కినవి భండారాన దాచివుండనీ"** అన్నాడు అన్నమయ్య!

**వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 1327**

**ప్రతి :** అని= ఈ విధంగా; చెప్పి= వివరించి; మఱియున్= ఇంకా; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అనెను.

**తా :** ఇలా వివరించి, ఇంకా ఈ విధంగా శుకుడు చెప్పినాడు.

**ఉ. వారక కృష్ణుఁ డిప్పగిది వైదికవృత్తి గృహస్థ ధర్మ మే**
**పారఁగ బూని ధర్మమును నర్థముఁ గామము నందుఁ జూపుచుం**
**గోరిక మీఱ సజ్జనులకుం గతి దాన యనంగ నొప్పి సం**
**సారిగతిన్ మెలంగె నృపసత్తమ! లోకవిడంబనార్థమై. 1328**

**ప్రతి :** నృపసత్తమ= రాజశ్రేష్ఠా! వారక= ఎడతెగక (సర్వదా); కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఈ+పగిదిన్= ఈ విధంగా; వైదికవృత్తిన్= వేదవిహితమైన విధానంలో; గృహస్థ ధర్మమున్= గృహస్థాశ్రమధర్మమందు; ఏపారఁన్+కన్+పూని= చక్కగా నిర్వర్తించి; ధర్మమును= ధర్మమునందు; అర్థమున్= అర్థాన్ని; కామము+అందున్= కామతిశయంలో; చూపుచున్= ప్రదర్శిస్తూ (సర్వజనులకు ధర్మ, అర్థ, కామాలనే ఆచరిస్తున్నాడని తెలిసేలా); కోరిక మీఱన్= కోరికలు అతిశయించేలా; సత్+జనులకున్= మంచివారికి; గతి= శరణు (మార్గము); తాను+అనన్+కన్= తానే అనేలా; ఒప్పి= ప్రకాశించి; లోకవిడంబన+అర్థము+ఐ= లోకం అనుసరించేందుకు; సంసారిగతిన్= సంసారివలె; మెలంగెన్= ప్రవర్తించాడు.

**తా :** ఈ విధంగా తన రాణులందరితో అఖండమైన భోగభాగ్యాలు అనుభవిస్తూ వేదవిహితమైన మార్గంలో గృహస్థాశ్రమధర్మాన్ని నిర్వహిస్తూ, ధర్మ, అర్థ, కామాలను అనుభవిస్తూ సజ్జనులకు ఆదర్శంగా సంసారివలే ప్రవర్తిస్తున్నాడు.

**సీ. హరి యిట్లు గృహమేధి యగుచు శతోత్తరషోడశసాహస్రసుందరులను**
**మును నీకు నెఱుఁగఁ జెప్పినరీతి నందఱ కన్ని రూపములు దా నర్థిఁ దాల్చి,**
**కైకొని యొక్కొక్క కామినీమణియందు రమణ నమోఘవీర్యమునఁ జేసి**
**పదురేసికొడుకులం బడసె రుక్మిణ్యాదిపట్టమహిషుల కుద్భవులు నైన**

**తే. నందనులలోన ధరణి నెన్నంగ బాహు, బలపరాక్రమవిజయసంపద్విశేష**
**మానితాత్ములు పదునెనమండ్రు; వారి నెఱుఁగ వినిపింతు వినుము రాజేంద్రచంద్ర! 1329**

**ప్రతి :** రాజ+ఇంద్ర+చంద్ర= మహారాజులలో శ్రేష్ఠుడా= పరీక్షిత్తూ!; హరి+ఇట్లు= శ్రీకృష్ణుడు ఈ విధంగా; గృహమేధి+ అగుచున్= గృహస్థుడవుతూ; శత+ఉత్తరషోడశ సాహస్ర= పదహారువేల నూరుమంది; సుందరులను= అందగత్తెలైన తన భార్యలను; మును= ఇదివరకు; నీకున్, ఎఱుఁగన్= తెలిసేలా; చెప్పినరీతిన్= చెప్పినట్టుగా; అందఱకు+అన్ని రూపములు= అందరికీ అన్ని రూపాలూ; తాన్+అర్థిన్+తాల్చి= తనను తానే ధరించి; కైకొని= పూని; ఒక్క+ఒక్క; కామినీమణి+అందున్= ఒక్కొక్క భార్యయందు; రమణన్= ఇష్టంగా; అమోఘ= సాటిలేని; వీర్యమునన్+చేసి= తేజస్సుచేత; పదురు+ఏసి= పదుగురేసి; (పదిమందిచొప్పున); కొడుకులన్+పడసెన్= కుమారులను; పడసెన్= పొందాడు; రుక్మిణి+ఆది= రుక్మిణి మొదలుగాగల; పట్టమహిషులకున్= పట్టపురాణులకు; ఉద్భవులున్+ఐన= పుట్టినట్టి; నందనులలోన్= కొడుకులలో; ధరణిన్= భూమిపై; ఎన్నన్+కన్= లెక్కపెట్టగా; బాహుబల= భుజబలంచే; పరాక్రమ= వీరత్వంచే; విజయ= జయాలచేత; సంపత్+విశేష= సంపత్తుయొక్క ప్రత్యేకతలచే; మానిత+ఆత్ములు= పూజ్యులైనవారు; పదునెనమండ్రు= పద్దెనిమిదిమంది పుట్టారు; వారిన్= ఆ కొడుకులను; ఎఱుఁగన్= తెలిసేలా; వినిపింతున్= చెపుతాను; విను...

**తా :** ఓ రాజశ్రేష్ఠా! శ్రీకృష్ణుడు ఇలా గృహస్థుడై, వంశం వృద్ధిచేసే క్రియలో పదహారువేల ఒకవందమంది సుందరాంగులకు అందరికీ అన్నిరూపాలూ ధరించి, ఏలుకొనగా, ఒక్కొక్కరికి పదిమంది కొడుకులు ప్రకారం పుట్టినారు. పట్టమహిషులైన రుక్మిణ్యాదులకు కల్గిన పుత్రుల్లో పద్దెనిమిదిమంది భుజబల, పరాక్రమ, విజయ, సంపత్తులచే సుప్రసిద్ధులైనారు. వారివివరాలు మీకు తెల్పుతాను. వినుము

**వ. అని మఱియు నిట్లను; వారలు ప్రద్యుమ్నానిరుద్ధ దీప్తిమద్భాను సాంబ మిత్ర బృహద్భాను మిత్రవింద వృకారుణ పుష్కర దేవబాహు శ్రుతదేవ సునందన చిత్రబాహు వరూధ కవి న్యగ్రోధ నామంబులం బ్రసిద్ధులైరి; వెండియుఁ ద్రివక్రయందు సంభవించిన యువశ్లోకుం డనువాఁడు దన జనకుండైన కృష్ణ పాదారవింద సేవారతుం డగుచు నారదయోగీంద్రునకు శిష్యుండై యఖండిత దివ్యజ్ఞాన బోధాత్మకుం డగుచు, స్త్రీ శూద్ర దాసజన సంస్కారకంబై స్మరణమాత్రంబున ముక్తి సంభవించునట్టి సాత్త్వత తంత్రం బను వైష్ణవస్మృతిం గల్పించె; నిట్లు మధుసూదననందనులు బహుప్రజలును, నధికాయురున్నతులును, ననల్ప వీర్యవంతులును, బ్రహ్మణ్యులునై విఖ్యాతిం బొందిరి. వారిని లెక్కవెట్టఁ బదివేల వత్సరంబులకైనం దీఱదు, మున్ను నీ కెఱింగించినట్లు తత్కుమారులకు విద్యా విశేషంబుల నియమించు గురుజనంబులు మూఁడు కోట్లు నెనుబదెనిమిది వేల నూర్గు రనం గల్గియుందు; ర క్కుమారుల లెక్కింప నెవ్వరికి శక్యం? బదియునుం గాక యొక్క విశేషంబు సెప్పెద విను మని యిట్లనియె. 1330**

**ప్రతి :** అని= చెప్పి; మఱియున్= ఇంకా; ఇట్లు= ఈ విధంగా; (శుకుడు) అనున్= చెప్పాడు; వారలు= ఆ శ్రేష్ఠులైన పుత్రులు వరుసగా; ప్రద్యుమ్న+అనిరుద్ధ; దీప్తిమత్+భాను, సాంబ, మిత్ర, బృహత్+భాను, మిత్రవింద, వృక+అరుణ, పుష్కర, దేవబాహు, శ్రుతదేవ, సునందన, చిత్రబాహు, వరూధ, కవి, న్యగ్రోధనామంబులన్= (1) ప్రద్యుమ్నుడు (2) అనిరుద్ధుడు (3) దీప్తిమంతుడు, (4) భానుడు; (5) సాంబుడు; (6) మిత్రుడు, (7) బృహద్భానుడు, (8) మిత్రవిందుడు,

(9) వృకుడు, (10) అరుణుడు, (11) పుష్కరుడు, (12) దేవబాహువు, (13) శ్రుతదేవుడు, (14) సునందనుడు, (15) చిత్రబాహుడు, (16) వరూధుడు, (17) కవి, (18) న్యగ్రోధుడు అను పేర్లచే; ప్రసిద్ధులు+ఐరి= ఖ్యాతి పొందినారు; వెండియున్= ఇంకా; త్రివక్ర+అందున్= త్రివక్ర అనే స్త్రీకి; సంభవించిన= పుట్టిన; యువశ్లోకుండు+అనువాఁడు= యువశ్లోకుడు అనే పేరుగలవాడు; తన జనకుండు+ఐన కృష్ణ= తన తండ్రియైన శ్రీకృష్ణునియొక్క; పాద+అరవింద సేవారతుండు+అగుచున్= పాదపద్మాలను సేవించడంలో ప్రీతి కలవాడై; నారదయోగి+ఇంద్రునకున్= నారదయోగి శ్రేష్ఠునకు; శిష్యుండు+ఐ= శిష్యుడై; అఖండిత= అంతులేని; దివ్యజ్ఞానబోధ+ఆత్మకుండు+అగుచున్= గొప్ప విజ్ఞానతత్త్వాన్ని తెలిసినవాడై; స్త్రీ, శూద్ర, దాసజన, సంస్కారకంబు+ఐ= స్త్రీలకు, చతుర్థజాతికి; సేవకజాతికి సంస్కరణను కలిగించేది అయి; స్మరణమాత్రంబునన్= కేవలం హరినామం స్మరించినంతమాత్రాన; ముక్తిసంభవించునట్టి= మోక్షం కలిగేలా; సాత్త్వతతంత్రంబు+అను= సాత్త్వత అనేపేరుగల ఒక అధ్యాత్మ విద్యను వైష్ణవస్మృతిన్= విష్ణుసంబంధమైన స్మృతిని కల్పించెన్= కనిపెట్టాడు; ఇట్లు మధుసూదన నందనులు= ఈవిధంగా శ్రీకృష్ణుని కుమారులు, బహుప్రజలును= బహు సంతానం గలవారూ; అధిక+ఆయుః+ఉన్నతులు= దీర్ఘఆయుర్దాయం ఉన్నతమైనవారు; న+అల్ప (అనల్ప)= గొప్ప; వీర్యవంతులును= బలసంపన్నులు; బ్రహ్మణ్యులున్+ఐ= బ్రహ్మజ్ఞానముకలవారై (వేదవిద్యలు తెలిసినవారై); విఖ్యాతిన్+పొందిరి= ప్రసిద్ధికెక్కారు; వారిని లెక్కపెట్టన్= వారిని లెక్కించాలంటే; పదివేల వత్సరంబులకు+ఐనన్+తీఱదు= పదివేల సంవత్సరాలైనా చాలదు; మున్ను= ఇంతకుముందు; నీకు+ఎఱింగించినట్లు= నీకు తెల్పినట్లు; తత్+కుమారులకు= ఆ పుత్రులకు; విద్యావిశేషంబులన్= వివిధ విద్యలను; నియమించు= నేర్పునట్టి; గురుజనంబులు= గురువులు; మూడుకోట్ల ఎనుబది+ఎనిమిదివేల నూర్గురు+అనన్= మూడుకోట్ల ఎనబై ఎనిమిదివేల ఒకవందమంది అని; కల్గియుందురు= కలిగి (నియుక్తులై) ఉన్నారు. ఆ+కుమారులన్ లెక్కింప= ఆ పుత్రుల సంఖ్యను లెక్కించడానికి; ఎవ్వరికి= ఎవ్వరికి; శక్యంబు= సాధ్యం? అదియునున్+కాక= అంతేకాదు; ఒక్క విశేషంబు+చెప్పెదన్= మరో విశేషం చెపుతాను; వినుము+అని+ఇట్లు+అనియెన్= వినవయ్యా అంటూ ఇలా (శుకుడు) అన్నాడు.

**తా :** శ్రీకృష్ణుని కుమారులు ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, దీప్తిమంతుడు, భానుడు, సాంబుడు, మిత్రుడు, బృహద్భానుడు, మిత్రవిందుడు, వృకుడు, అరుణుడు, పుష్కరుడు, దేవబాహుడు, శ్రుతదేవుడు, సునందనుడు, చిత్రబాహువు, వరూధుడు. కవి, న్యగ్రోధుడు అనే పేర్లుగలవారు పద్దెనిమిదిమంది అతి ప్రసిద్ధులు. అలాగే త్రివక్ర అనే భార్యవల్ల యువశ్లోకుడు అనే కుమారుడు పుట్టినాడు. అతడు తన తండ్రి కృష్ణునిపట్ల అమితమైన భక్తిభావంతో, ఆయన పాదాలే కొలుస్తూ, నారదునికి శిష్యుడై, దివ్యజ్ఞానం సంపాదించి; చదువురాని అగ్రవర్ణేతర జాతులుకూడా స్మరణమాత్రంచేత ముక్తిపొందే 'సాత్త్వత తంత్రం' అనే వైష్ణవస్మృతి విధానాన్ని రూపొందించాడు. ఈవిధంగా శ్రీకృష్ణుని సంతానం గొప్పసంతానాన్ని, దీర్ఘాయువును, ఉన్నతిని, బాహుపరాక్రమాన్ని, వైదికవిజ్ఞానాన్ని పొంది ప్రసిద్ధులైనారు. అమితసంఖ్యలోని ఆ సంతానాన్ని లెక్కపెట్టాలంటే పదివేలసంవత్సరాలైనా చాలదు. వీరికి విద్యలు నేర్పేందుకే మూడుకోట్ల ఎనుబదివేల నూర్గురు గురువులు నియమించబడ్డారు అంటే, వారిని లెక్కించడం ఎవరికి సాధ్యం? సరే, మరో విశేషం చెపుతాను. విను అని ఇలా అన్నాడు.

**క. నరవర! దేవాసుర సం, గరమున మును నిహతు లైన క్రవ్యాద సము**
**త్కరము నరేశ్వరులై ద్వా, పరమున జనియించి ప్రజల బాధలఁ బఱుపన్. 1331**

**ప్రతి :** నరవర!= నరులలో శ్రేష్ఠుడా(ఓరాజా!); ముని= పూర్వం; దేవ+అసుర= దేవదానవుల; సంగరమున= యుద్ధంలో; నిహతులైన= మరణించిన; క్రవ్యాద (మాంసము తినువారు)= రాక్షసుల, సముత్కరము= సమూహం; నర+ఈశ్వరులై=

రాజులై; ద్వాపరమున= ద్వాపరయుగంలో; జనియించి= పుట్టి; ప్రజల= ప్రజలను; బాధలన్+పఱుపన్= బాధలు పెట్టగా....

**తా :** పరీక్షిన్మహారాజా! దేవదానవయుద్ధంలో మరణించిన రాక్షసులు తిరిగి ద్వాపరయుగంలో రాజులై పుట్టి ప్రజలను బాధపెట్టగా

**క. హరి తద్వధార్థమై ని, ర్జరులను యదుకులమునందు జనియింపింపం**
**ధర నూటొక్కకులంబై, పరఁగిరి; వారిని గణింప బ్రహ్మకు వశమే? 1332**

**ప్రతి :** హరి= విష్ణువు; తత్+వధ+అర్థము+ఐ= వారిని సంహరించడంకోసం; నిర్+జరులను= (ముసలితనం లేనివారు=) దేవతలను; యదుకులమునందున్= యదువంశంలో; జనియింపింపన్= పుట్టేలా చేయగా; ధరన్= భూమిపై; నూట+ఒక్క కులంబై= నూటఒక్క వంశాలుగా పెరిగి; పరఁగిరి= అభివృద్ధి చెందినారు; వారిని= ఆ యాదవులను; గణింపన్= లెక్కించడానికి; బ్రహ్మకు వశమే= బ్రహ్మకైనా కూడా సాధ్యమా?

**తా :** రాక్షస అంశతో పుట్టిన ఆ రాజులను సంహరించటానికి, విష్ణువు దేవతలను యాదవులుగా పుట్టింపగా, వారు తామరతంపరగా నూటఒక్క వంశాలుగా అభివృద్ధి చెందినారు. వారిని లెక్కించటానికి బ్రహ్మకు కూడా వశం కాదు.

**వ. అట్టి యన్వయంబునందు మాధవునకు రుక్మిణీదేవి యందుఁ బితృసముండును, సమగ్ర భుజావిజృంభణుండునునై ప్రద్యుమ్నుండు జనియించె; నతనికి రుక్మికూఁతురగు శుభాంగి వలన ననిరుద్ధుం డుదయించె; నతనికి మౌసలావశిష్టుండైన వ్రజుండు సంభవించె; నతనికిఁ బ్రతిబాహుండు పుట్టె; వానికి సుబాహుండు జన్మించె; నతనికి నుగ్రసేనుండు ప్రభవించె; నతనికి శ్రుతసేనుండు గలిగె; నిట్లు యదువృష్ణిభోజాంధక వంశంబులు పరమ పవిత్రంబులై పుండరీకాక్షు నిరీక్షణ శయ్యాసనానుగత సరసాలాపస్నానాశన క్రీడావినోదంబుల ననిశంబునుం జెందుచు, సర్వదేవతార్థంబు సమస్తంబైన క్రతువు లొనరింపుచుఁ బరమానంద కందళిత చిత్తులై యుండి రని చెప్పి వెండియు. 1333**

**ప్రతి :** అట్టి= అలాంటి; అన్వయంబున్+అందున్= వంశంలో; మాధవునకున్= శ్రీకృష్ణునకు; రుక్మిణీదేవి+అందున్= పట్టమహిషి రుక్మిణియందు; పితృసముండును= తండ్రియైన శ్రీకృష్ణునంతటివాడు; సమగ్ర - భుజా - విజృంభణుండును+ఐన= సంపూర్ణపరాక్రమ ఔన్నత్యంకల; ప్రద్యుమ్నుండు= ప్రద్యుమ్నుడు అనే పేరుకల కుమారుడు, జనియించెన్= పుట్టాడు; అతనికి, రుక్మికూఁతురు+అగు= రుక్మికుమార్తె అయిన; శుభాంగివలన= శుభాంగి అనేపేరుగల భార్యయందు; అనిరుద్ధుండు= అనిరుద్ధుడు; ఉదయించెన్= పుట్టాడు; అతనికిన్= వానికి; మౌసల+అవశిష్టుండు= ముసలంయొక్క శేషమైన; వ్రజుండు= వ్రజుడు అనుపేరుగలవాడు; సంభవించెన్= పుట్టాడు; అతనికిన్+ప్రతిబాహుండు= వ్రజునికి ప్రతిబాహుడు అనేపేరుగలవాడు; పుట్టెన్= జన్మించాడు; వానికి సుబాహుండు= అతనికి సుబాహుడు అనేవాడు; జన్మించెన్= పుట్టాడు; అతనికిన్= వానికి; ఉగ్రసేనుండు= ఉగ్రసేనుడు అనేపేరుగల కుమారుడు; ప్రభవించెన్= పుట్టాడు; అతనికి= ఆయనకు; శ్రుతసేనుఁడు= శ్రుతసేనుడనే పేరుగలవాడు; కలిగెన్= పుట్టాడు; ఇట్లు= ఈ విధంగా; యదు - వృష్ణి - భోజ - అంధక వంశంబులు= యదు, వృష్ణి, భోజ, అంధక అనేపేరుగల వారి వంశ ములే; పరమ పవిత్రంబులు+ఐ= మిక్కిలి పునీతాలై; పుండరీక+అక్షు= తెల్లదామరలవంటి కన్నులుగల శ్రీకృష్ణుని; నిరీక్షణ= చల్లని చూపులతో, ఆయన సంపూర్ణ పర్యవేక్షణలో; శయ్య= నిద్ర;

ఆసన= కూర్చోవడం; అనుగత= వెంబడి తిరుగడం; సరస= వినోదంగా; ఆలాప= మాటాడటం; స్నాన= స్నానం చేయడం; అశన= భుజించడం; క్రీడా= ఆటలాడటం; వినోదంబులన్= వినోదించడం వంటి అనేకమైన పనులలో; అనిశంబునున్= ఎల్లవేళల; చెందుచున్= భాగస్వాములు అవుతూ; సర్వదేవతా+అర్థంబు= సకల దేవతల కోసం; సమస్తంబు+ఐన= అన్నివిధాలైన; క్రతువులు= యజ్ఞాదికము; ఒనరింపుచున్= చేస్తూ; చేయిస్తూ; పరమ+ఆనంద – కందళిత= మిక్కిలి ఆనందంతోనిండిన; చిత్తులై= హృదయాలుకలవారై; ఉండిరి= జీవనం గడిపారని; చెప్పి= వివరించి; వెండియు= ఇంకా...

**తా :** అలాంటి కృష్ణుని వంశంలో తొలుత ఆయనకు రుక్మిణివలన ప్రద్యుమ్నుడు, తండ్రి అంత పరాక్రమవంతుడై పుట్టినాడు. ఆయనకు మేనమామకూతురైన శుభాంగితో వివాహమై, అనిరుద్ధుడు జన్మించాడు. అతనికి వ్రజుడు, అతనికి ప్రతిబాహుడు, ఆయనకు సుబాహుడు, ఆతనికి ఉగ్రసేనుడు, వానికి శ్రుతసేనుడు పుట్టారు. ఇలా కృష్ణునివంశం యదు, వృష్ణి, భోజ, అంధకులనే పేర్లుగలవారితో పరమ పవిత్రమైన వంశాలుగా పరిఢవిల్లిందీ. కృష్ణుని సంతానం పుత్ర, పౌత్ర, ప్రపౌత్ర, ప్రప్రపౌత్రాదులు ఆయనతో నిత్య వ్యవహారాల్లో పాలుపంచుకొని సన్నిహితులై మెలగి, అనేక దేవతా సంబంధమైన క్రతువులలో పాల్గొని, ఆనందంగా ఉన్నారు.

**మ. పరమోత్సాహముతోడ మాధవుఁడు శుంభల్లీలఁ బూరించు న**
**మ్మురళీగానము వీనులం జిలికినన్ మోదించి గోపాల సుం**
**దరు లేతెంతు రరణ్యభూములకుఁ; దద్దాస్యంబు గావించి య**
**క్కరుణావార్ధి భజింపకుందురె బుధుల్ కౌరవ్యవంశాగ్రణీ! 1334**

**ప్రతి :** కౌరవ్య వంశ+అగ్రణీ!= కురువంశంలోని శ్రేష్ఠుడా! (పరీక్షిన్మహారాజా!) పరమ+ఉత్సాహముతోడ= మిక్కిలి వేడుకగా; మాధవుఁడు= శ్రీకృష్ణుడు; శుంభత్+లీలన్= ప్రకాశమానంగా (గొప్ప విధంగా); పూరించు= ఊదుతున్న; ఆ+మురళీగానము= ఆ వేణువుపాట; వీనులన్= చెవులలో; చిలికినన్= సేచనంకాగా (నిండగా); మోదించి= సంతోషించి; గోపాలసుందరులు= గోపికా కాంతలు; గోప బాలురు; అరణ్య భూములకున్= అడవులకు; (శ్రీకృష్ణుని చెంతకు) ఏతెంతురు= వస్తారు; తత్+దాస్యంబుగావించి= అతణ్ణి సేవించి; బుధుల్= పండితులు; ఆ+కరుణావార్ధిన్= ఆ దయా సముద్రుణ్ణి; భజింపకుందురె= పూజించకుండా ఉంటారా?

**తా :** మహారాజా! కృష్ణుడు వేణువు ఊదితే గోపాలురు, గోపికలు, ఆయన ఉన్న వన భూములకు పరిగెత్తుకొని వస్తారే? ఎల్లప్పుడూ ఆయననే సేవించే భక్తులైన పండితులు ఆ దయాసముద్రుణ్ణి ఆరాధించకుండా ఉంటారా?

**వ. మతి నెవ్వాని యమంగళఘ్న మగు నామం బర్థిఁ జింతించినన్**
**నుతి గావించిన విన్న మానవులు ధన్యుల్; భూరిసంసార దు**
**ష్కృతులం ద్రోతురు; కాలచక్ర మహితాస్త్రుం దట్టి యా కృష్ణుఁ డీ**
**క్షితిభారం బుడుగంగఁ జేయు టిది యే చిత్రంబు? భూవల్లభా! 1335**

**ప్రతి :** భూవల్లభా!= ఓ రాజా!; ఏ+వాని= ఎవరియొక్క; అమంగళఘ్న= అమంగళాన్ని నశింపజేసేదీ; అగు= ఐనట్టి; నామం= పేరును; అర్థిన్= ఇష్టంగా; మతిన్= హృదయంలో; చింతించినన్= స్మరిస్తే; నుతి+కావించినన్= పొగడితే; విన్నన్= వింటే; మానవుల్= అట్టి మానవులు; ధన్యుల్= ధన్యులు; భూరి= గొప్ప; సంసార= సంసార సంబంధమైన;

దుస్+కృతులన్= పాపాలను; త్రోతురు= తోసిపారవేస్తారు; అట్టి= అంత మహిమాన్వితుడైన; కాలచక్ర= కాలచక్రమనే పేరుగల; మహిత+అస్త్రుండు= గొప్ప (చక్ర) ఆయుధంకలవాడైన; ఆ= అట్టి; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఈ క్షితిభారంబున్= ఈ భూమిబరువును; ఉడుగంగన్+చేయుట= తొలగింప చేయడం; అనే; ఇది= ఈ కార్యం; ఏ చిత్రంబు= ఏమంత విశేషం!

**తా :** ఓ రాజా! అశుభాన్ని నశింపజేసే ఎవ్వని నామస్మరణ, హృదయంలో చేస్తారో వారి జీవనం సాథ్యం, ధన్యం అవుతుంది. సంసార సంబంధమైన దోషాలను తొలగించుకుంటారు. కాలచక్రమనేపేరుగల సుదర్శన చక్రాయుధం ధరించిన ఆ కృష్ణుడు భూభారం తొలగింపచేయడంలో వింతయేముంది?

**విశే :** 'తస్మై కాలాత్మనే నమః' అని శ్రీకృష్ణ సహస్రనామం. అందుచే ఆయన సుదర్శన చక్రంపేరు **'కాలచక్రం'** అనబడింది. కాలాత్మకుడూ ఆయనే, కాలాంతకుడూ ఆయనే! కాలంయొక్క స్థితిగతులు ఆయన అధీనంలోనివి. **'కాలచక్రము నిర్వికల్పముగాఁగ నేన నయింతు'** అని మహాభారతం- 'నారాయణ మార్కండేయ సంవాదము', ఆరణ్యపర్వం (ఆశ్వా 4 - పద్యం. 279).

**వ. ఇ వ్విధంబున గోపికాజన మనోజాతుండైన కృష్ణుండు లీలామానుష విగ్రహుండై నిజరాజధాని యైన ద్వారకాపురంబున నమానుష విభవంబు లగు సౌఖ్యంబులం బొదలుచుండె నని చెప్పి మఱియు నిట్లనియె. 1336**

ప్రతి : ఈ+విధంబునన్= ఈ పద్ధతిలో; గోపికాజన= గోపస్త్రీల; మనస్+జాతుండు= (మనస్సులో పుట్టినవాడు=) మన్మథుడు, అయిన, కృష్ణుండు= శ్రీకృష్ణుడు; లీలామానుష విగ్రహుండు+ఐ= లీలగా మానవరూపం ధరించినవాడై; నిజరాజధాని= తన రాజధాని; ఐన, ద్వారకాపురంబునన్= ద్వారకానగరంలో; అమానుష విభవంబున= దివ్యవైభవంగల, అగు; సౌఖ్యంబులన్= సుఖాలతో; పొదలుచున్+ఉండెన్= ప్రకాశిస్తున్నాడు. అని చెప్పి= అని వివరించి; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా గోపికలకు మన్మథుడైన శ్రీకృష్ణుడు లీలగా మానవ రూపం ధరించి, తన ద్వారకానగరంలో దివ్య వైభవంతో భోగభాగ్యాలు అనుభవిస్తున్నాడు అని వివరించి, ఇంకా ఇలా అన్నాడు.

**మ. మనుజేంద్రోత్తమ! యేను నీకుఁ ద్రిజగన్మాంగల్యమై యొప్పఁ జె**
**ప్పిన యీ కృష్ణకథాసుధారసము సంప్రీతాత్ములై భక్తిఁ గ్రో**
**లిన పుణ్యాత్ములు గాంతు రిందు సుఖముల్; నిర్ధూతసర్వాఘులై**
**యనయంబుం దుదిఁ గాంతు రచ్యుతపదం బైనట్టి కైవల్యమున్. 1337**

**ప్రతి :** మనుజ+ఇంద్ర+ఉత్తమ!= రాజులలో ఉత్తముడవైన పరీక్షిన్మహారాజా! ఏను= నేను (శుకమహర్షి); నీకున్= రాజుకు; త్రి - జగత్ - మాంగల్యమై= మూడు లోకాలకు మంగళకరమై; ఒప్పన్= ఒప్పేలా; చెప్పిన= వచించిన; ఈ కృష్ణ - సుధా - రసము= శ్రీకృష్ణుని కథ అనే ఈ అమృతజలం; సంప్రీత+ఆత్ములు+ఐ= తృప్తిపడిన మనస్సులు కలవారై; భక్తిన్= భక్తితో; గ్రోలిన= తాగిన; పుణ్య+ఆత్ములు= పవిత్రమైన మనస్సులుగలవారు; ఇందు= ఇహ లోకమందు; సుఖముల్= ఆనందాన్ని; కాంతురు= చూస్తారు; నిర్ధూత - సర్వ+అఘులై= ఎగురగొట్టబడిన అన్ని పాపాలు - కలవారై; అనయంబున్=

తప్పక; తుదిన్= మరణాంతంలో; అచ్యుతపదము+ఐనట్టి= నాశంలేని పదవిఐన; కైవల్యమున్= మోక్షమును; కాంతురు= పొందుతారు.

**తా :** ఓ పరీక్షిన్నరేంద్రా! నేను నీకు ముల్లోకాలకు మంగళకరమైనట్టి శ్రీకృష్ణ కథఅనే అమృతాన్ని అందించాను. దీన్ని భక్తితో గ్రోలిన పుణ్యాత్ములు, ఇహలోకంలో సుఖాలుపొంది, పుణ్యాత్ములై పరలోకంలో మోక్షాన్ని పొందుతారు.

**విశే :** పురాణగాథల్లో గాథాంతంలో ఫలశ్రుతి ఉంటుంది. అంటే శ్రుతిఫలం. దీన్ని విన్నవారిని మోక్షం లభిస్తుందని ముగింపు ఉంటుంది. కృష్ణకథకు ఇది ముగింపు. ఫలితానికి సంబంధించిన శాసనం ఇది. కృష్ణకథాసుధారసం తనివితీరా ఆస్వాదించినవారికి మోక్షం కరతలామలకం.

**క. అని యిట్లు బాదరాయణి, మనమున రాగిల్ల నాభిమన్యునకుం జె**
**ప్పిన విధమున సూతుఁడు ముని, జనుల కెఱింగింప వారు సమ్మతితోడన్. 1338**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; బాదరాయణి= వ్యాసుని కుమారుడగు శుకుడు; మనమున= మనస్సులో; రాగిల్లన్= రంజించేటట్లుగా; ఆభిమన్యునకున్= అభిమన్యుని కుమారుడగు పరీక్షిత్తుకు; చెప్పిన విధము= చెప్పిన రీతిని; సూతుడు= సూతమహర్షి; మునిజనులకున్= మునులకు; ఎఱింగింపన్= తెలుపగా; వారు= మునులు; సత్+మతి తోడన్= మంచి మనస్సులతో...

**తా :** ఈ విధంగా శుకుడు, పరీక్షిన్మహారాజుకు చెప్పిన అతిమనోహరమైన భాగవతకథలలోని శ్రీకృష్ణచరిత్రమును సూతుడు యథాతథంగా మునులకు చెప్పినాడు. వారు ఆనందంగా స్వీకరించారు

**క. సూతుని బహువిధముల సం, ప్రీతునిఁ గావించి మహిమఁ బెంపారుచు వి**
**ఖ్యాతికి నెక్కిన కృష్ణక, థాతత్పరులైరి బుద్ధిఁ దఱుఁగని భక్తిన్. 1339**

**ప్రతి :** సూతుని= సూతమహర్షిని; బహువిధముల= అనేకవిధాలుగా; సం – ప్రీతునిన్= విశేషంగా సంతోషపడ్డవానిగా; కావించి= చేసి; బుద్ధిన్= బుద్ధితో; తఱుగని భక్తిన్= తగ్గిపోని భక్తితో; మహిమన్= తన మాహాత్మ్యంతో; పెంపు+ఆరుచున్= అతిశయించుచు; విఖ్యాతికిన్+ఎక్కిన= ప్రసిద్ధికి ఎక్కిన; కృష్ణకథా= శ్రీకృష్ణుని గాథలో; తత్+పరులు= దానిలో ఇష్టము కల్గినవారు; ఐరి= ఐనారు.

**తా :** మునులు కృష్ణ కథ చెప్పిన సూతుని బహుభంగుల సత్కరించి, తృప్తి పెట్టిన మహిమాభిరామమైన కృష్ణగాథను గొప్పభక్తితో స్వీకరించి భజించారు.

**చ. సరసిజపత్త్రనేత్ర! రఘుసత్తమ! దుష్టమదాసురేంద్ర సం**
**హరణ! దయాపయోధి! జనకాత్మభవానన పద్మమిత్ర! భా**
**స్కర కులవార్ధిచంద్ర! మిహికావసుధాధరసూతిసన్నుత**
**స్ఫురితచరిత్ర! భక్త జనపోషణ భూషణ! పాపశోషణా! 1340**

**ప్రతి :** సరసిజ పత్రనేత్ర!= తామరపత్రాలవంటి నేత్రాలు గలవాడా!; రఘుసత్తమ= రఘువంశంలో శ్రేష్ఠుడా!; దుష్ట – మద – అసుర+ఇంద్ర – సంహరణ!= దుర్మార్గుడైన; మదించిన; రాక్షసరాజైన రావణుని చంపినవాడా! దయా –

పయోధి= దయకు సముద్రమా!; జనక+ఆత్మభవ+ఆనన - పద్మ - మిత్ర= జనకుని కూతురు (సీత)యొక్క ముఖ కమలానికి సూర్యుడా! భాస్కర - కుల - వార్ధి - చంద్ర!= సూర్యుని వంశమనే సముద్రానికి చంద్రుడా! మిహికా - వసుధా - ధర - సూతి - సన్నుత - స్ఫురిత - చరిత్ర!= మంచుకొండ కుమార్తె పార్వతీదేవిచేత కీర్తించబడిన ప్రకాశమాన చరిత్రగలవాడా! భక్త - జన - పోషణ - భూషణ= భక్తులను రక్షించుట (అనే గుణము) ఆభరణమైనవాడా! పాప - శోషణా= పాపాలను నశింపజేయువాడా!

**తా :** పద్మనేత్రుడా! రఘువంశశ్రేష్ఠుడా! రావణ సంహారా! దయానిధీ! సీతాముఖకమలభాస్కరా! సూర్యవంశమనే సముద్రంలో పుట్టిన చంద్రుడా! పార్వతీదేవి - కీర్తించిన చరిత్రగలవాడా! భక్తపోషణ అలంకారమైనవాడా! పాపాలు తొలగించేవాడా! శ్రీరామా!

**క. మారీచభూరిమాయా, నీరంధ్రమహాంధకార నీరేజహితా!**
**క్ష్మారమణవినుత పాదాం, భోరుహ! మహితావతార! పుణ్యవిచారా! 1341**

**ప్రతి :** మారీచ= మారీచుడను రాక్షసుని; భూరి - మాయా= గొప్పమాయ అను; నీరంధ్ర= దట్టమైన; మహా+అంధకార= గొప్పచీకటికి; నీరేజ - హితా= సూర్యుడా! క్ష్మారమణ= భూమికి భర్తలైన రాజులచే; వినుత= పొగడబడే; పాద+ అంభోరుహ!= కమలాల వంటి పాదాలుకలవాడా!; మహిత+అవతార!= గొప్ప అవతారాన్ని ధరించినవాడా!; పుణ్యవిచారా= పుణ్యమైన ఆలోచనలు కలవాడా!

**తా :** మారీచ రాక్షసునిచే కల్పించబడిన (మాయలేడి అనే) గొప్పచీకటి వంటి మాయను సూర్యునిలాగా ఛేదించినవాడా! రాజులచే పూజింపబడిన పాదాలు కలవాడా! ప్రశస్తమైన రామావతారం ధరించినవాడా! పుణ్యప్రదాలైన ఆదర్శవంతాలైన ఆలోచనల శోభించేవాడా!

**మాలిని.**

**శరధి మదవిరామా! సర్వలోకాభిరామా!**
**సురరిపువిషభీమా! సుందరీలోకకామా!**
**ధరణివరలలామా! తాపసస్తోత్రసీమా!**
**సురుచిరగుణధామా! సూర్యవంశాబ్ధిసోమా! 1342**

**ప్రతి :** శరధి= సముద్రంయొక్క; మద= పొగరును; విరామా= విశ్రమింప చేసినవాడా!; సర్వ - లోక+అభిరామా!= సమస్తలోకంలో అందమైనవాడా! సుర - రిపు - విష - భీమా= సురలకు శత్రువులైన రాక్షసులకు విషంవలె భయంకరుడా!; సుందరీ - లోక - కామా= అందగత్తెల సమూహాలకు మన్మథుడా! ధరణీ - వర - లలామా!= రాజులలో శ్రేష్ఠుడా!; తాపస స్తోత్ర - సీమా= మునులయొక్క పొగడ్తలకు హద్దు ఐనవాడా! సురుచిర - గుణ - ధామా!= మిక్కిలి చక్కనైన గుణాలకు కేంద్రమైనవాడా!; సూర్య - వంశ+అబ్ధి - సోమా= సూర్యవంశమనే సముద్రానికి చంద్రుడా!

**తా :** సముద్రుని పొగరు అణచినవాడా! అన్నిలోకాలలో సుందరమైనవాడా! రాక్షసులకు విషంవలె భీకరమైనవాడా! సౌందర్యనిధీ! రాజులలో శ్రేష్ఠుడా! మునులచే అంతులేకుండా పొగడబడేవాడా! చక్కటి గుణాలకు నిధానమైనవాడా! సూర్యవంశ సముద్రానికి చంద్రుడా!

గద్యము. ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన శ్రీమహాభాగవతం బను మహాపురాణంబునందుఁ బ్రద్యుమ్న జన్మంబును, శంబరోద్యోగంబును, సత్రాజిత్తునకు సూర్యుండు శ్యమంతకమణి నిచ్చుటయుఁ దన్నిమిత్తంబునం బ్రసేనుని సింహంబు వధియించుటయు, దాని జాంబవంతుండు దునిమి మాణిక్యంబు గొనిపోవుటయు. గోవిందుండు బ్రసేనుని దునిమి మణిఁ గొనిపోయె నని సత్రాజిత్తు కృష్ణునందు నింద నారోపించుటయుఁ, గృష్ణుండు దన్నిమిత్తంబున జాంబవంతునిం దొడరి మణియుక్తంబుగా జాంబవతిం గొనివచ్చి వివాహం బగుటయు, సత్రాజిత్తునకు మణి నిచ్చుటయు, సత్యభామా పరిణయంబును, బాండవులు లాక్షా గృహంబున దగ్ధు లైరని విని వాసుదేవుండు బలభద్ర సహితుండయి హస్తినాపురంబున కరుగుటయు, నక్రూరకృతవర్మల యనుమతంబున శతధన్వుండు సత్రాజిత్తుఁ జంపి మణిఁ గొనిపోవుటయుఁ, దదర్థం బా సత్యభామ కరినగరంబున కేగి కృష్ణునకు విన్నవించిన నతండు మరలి చనుదెంచి శతధన్వుం ద్రుంచుటయు, బలభద్రుండు మిథిలానగరంబునకుం జనుటయు, నందు దుర్యోధనుండు రాముని వలన గదావిద్య నభ్యసించుటయు, గృష్ణుండు సత్రాజిత్తునకుం బరలోక క్రియలు నడపుటయు, శ్యమంతకమణిం దాఁచినవాఁడయి యక్రూరుండు భయంబున ద్వారకానగరంబు విడిచి పోయిన నతని లేమి ననావృష్టి యైనం గృష్ణుం డక్రూరుని మరల రప్పించుటయు, దామోదరుం డింద్ర ప్రస్థపురంబున కరుగుటయు, నందర్జున సమేతుండయి మృగయా వినోదార్థం బరణ్యంబునకుం జని, కాళిందిం గొనివచ్చుటయు, ఖాండవ దహనంబును, నగ్నిపురుషుం డర్జునునకు నక్షయతూణీర గాండీవ కవచరథరథ్యంబుల నిచ్చుటయు, మయుండు ధర్మరాజునకు సభ గావించి యిచ్చుటయు, నగధరుండు మరలి నిజ నగరంబున కరుగుదెంచి కాళిందిని వివాహం బగుటయు, మిత్రవిందా నాగ్నజితీ భద్రా మద్రరాజకన్యలం గ్రమంబునఁ గరగ్రహణం బగుటయు, నరకాసుర యుద్ధంబును, దద్గృహంబున నున్న రాజకన్యకలం బదాఱువేలం దెచ్చుటయు, స్వర్గ గమనంబును, నదితికిం గుండలంబు లిచ్చుటయుఁ, బారిజాతాపహరణంబును, బదాఱువేల రాజకన్యలం బరిణయం బగుటయు, రుక్మిణీదేవి విప్రలంభంబును, రుక్మిణీస్తోత్రంబును, గృష్ణకుమారోత్పత్తియుఁ, దద్గురుజనసంఖ్యయుఁ, బ్రద్యుమ్ను వివాహంబును, ననిరుద్ధు జన్మంబును, దద్వివాహార్థంబు కుండిన నగరంబునకుం జనుటయు, రుక్మిబలభద్రుల జూదంబును, రుక్మి వధయు, నుషాకన్య యనిరుద్ధుని స్వప్నంబునం గని మోహించుటయు, దన్నిమిత్తంబునఁ, జిత్రరేఖ సకలదేశ రాజులఁ బటంబున లిఖించిచూపి యనిరుద్ధునిఁ దెచ్చుటయు, బాణాసుర యుద్ధంబును, నృగోపాఖ్యానంబును, బలభద్రుని ఘోషయాత్రయుఁ, గాళింది భేదనంబును, గృష్ణుండు పౌండ్రకవాసుదేవ కాశీరాజుల వధించుటయుఁ, గాశీరాజ పుత్రుండయిన సుదక్షిణుం డభిచారహోమంబు గావించి కృత్యం బడసి కృష్ణుపాలికిం బుత్తెంచిన సుదర్శనంబుచేతఁ గృత్యను సుదక్షిణ సహితంబుగాఁ గాశీపురంబును భస్మంబు సేయుటయు, బలరాముండు రైవత నగంబునందు ద్వివిదుండను వనచరుని వధియించుటయు, సాంబుండు దుర్యోధను కూఁతురగు లక్షణ నెత్తి కొని వచ్చినఁ గౌరవు

లతనిం గొనిపోయి చెఱంబెట్టుటయుఁ, దద్వృత్తాంతం బంతయు నారదువలన విని బలభద్రుండు నాగ నగరంబునకుఁ జనుటయుఁ, గౌరవులాడిన యగౌరవ వచనంబులకు బలరాముండు కోపించి హస్తినాపురంబును గంగం బడఁద్రోయ గమకించుటయుఁ, గౌరవులు భయంబున నంగనాయుక్తంబుగా సాంబుని దెచ్చి యిచ్చుటయు, బలభద్రుండు ద్వారకానగరంబునకు వచ్చుటయు, నారదుండు హరి పదాఱువేల కన్యకల నొకముహూర్తంబున నందఱ కన్నిరూపులై వివాహం బయ్యెనని విని తత్ప్రభావంబు దెలియంగోరి యరుగుదెంచుటయుఁ, దన్మాహాత్మ్యంబు సూచి మరలి చనుటయు, జరాసంధునిచేత బద్ధులైన రాజులు కృష్ణుపాలికి దూతం బుత్తెంచుటయు, నారదాగమనంబును, బాండవుల ప్రశంసయును, నుద్ధవ కార్యబోధంబును, నింద్రప్రస్థాగమనంబును, ధర్మరాజు సేయు రాజసూయారంభంబును, దిగ్విజయంబును, జరాసంధ వధయును, రాజ బంధమోక్షణంబును, రాజసూయంబు నెఱవేర్చుటయును, శిశుపాలవధయును, నవభృథంబును, రాజసూయ వైభవదర్శనా సహమాన మానసుండయి సుయోధనుండు మయనిర్మిత సభామధ్యంబునం గట్టిన పుట్టంబులు దడియం ద్రెళ్ళుటయు, దన్నిమిత్తపరిభవంబు నొంది రారాజు నిజపురి కరుగుటయుఁ, గృష్ణుండు ధర్మరాజ ప్రార్థితుం డయి యాదవుల నిలిపి కొన్ని నెలలు ఖాండవప్రస్థంబున వసియించుటయు, సాళ్వుండు దపంబు సేసి హరుని మెప్పించి సౌంభకాఖ్యంబగు విమానంబు వడసి నిజసైన్య సమేతుండై ద్వారకానగరంబు నిరోధించుటయు, యాదవసాళ్వయుద్ధంబును, గృష్ణుండు మరలి చనుదెంచి సాల్వుం బరిమార్చుటయును, దంతవక్త్రవధయును, విదూరథ మరణంబును, గృష్ణుండు యాదవబల సమేతుండై క్రమ్మఱ నిజపురంబునకుం జనుటయును, గౌరవ పాండవులకు యుద్ధం బగునని బలదేవుండు తీర్థయాత్ర సనుటయు, నందు జాహ్నవీ ప్రముఖనదులం గృతస్నానుం డయి నైమిశారణ్యంబునకుం జనుటయు, నచ్చటి మునులు పూజింపం బూజితుండయి తత్సమీపంబున నున్నతాసనంబున నుండి సూతుండు దన్నుం గని లేవకున్న నలిగి రాముండు గుశాగ్రంబున నతని వధించుటయు, బ్రహ్మహత్యా దోషంబు గలిగెనని మునులు వలికిన సూతుం బునర్జీవితుం జేయుటయు, న మ్మునులకుం బ్రియంబుగాఁ గామపాలుం డిల్వల సుతుండగు పల్వలుం బరిమార్చుటయు, వారిచేత ననుమతుండయి హలధరుండు దత్సమీపతీర్థంబుల స్నాతుండయి గంగాసాగర సంగమంబునకుం జనుటయు, మహేంద్ర నగప్రవేశంబును, బరశురామ దర్శనంబును, సప్తగోదావరిం గ్రుంకుటయు, మఱియు మధ్యదేశంబునం గల తీర్థంబు లాడి శ్రీశైల వేంకటాచలంబులు దర్శించుటయు, వృషభాద్రి హరిక్షేత్ర సేతుబంధ రామేశ్వరములం గని తామ్రపర్ణీతీర్థంబు లాడుటయు, గోదానంబు లొనరించి మలయగిరియందు నగస్త్యునిం గనుటయు, సముద్ర కన్యా దుర్గాదేవుల నుపాసించుటయు, నందు బ్రాహ్మణజనంబు వలనం బాండవ ధార్తరాష్ట్ర భండనంబున సకల రాజలోకంబును మృతి నొందిరని వినుటయు, వాయునందన సుయోధనులు గదా యుద్ధసన్నద్ధు లగుట విని వారిని వారించుటకై, రౌహిణేయుం డందుల కరుగుటయు, నచట వారిచేతం బూజితుండయి వారి నివారింపలేక మగిడి ద్వారక కరుగుటయుఁ, గొన్ని వాసరంబులకు

**మరల నైమిశారణ్యంబునకుం బోయి యచట యజ్ఞంబు సేసి రేవతియుం దానును నవభృథం బాడి నిజపురంబున కేతెంచుటయుఁ, గుచేలోపాఖ్యానంబును, సూర్యోపరాగంబునం గృష్ణుఁడు రామునితోఁ జేరి పురరక్షణంబునకుఁ బ్రద్యుమ్నాది కుమారుల నిలిపి షోడశ సహస్రాంగనా పరివృతుండయి యక్రూర వసుదేవోగ్ర సేనాది యాదవ వీరులు దోడరా శ్యమంతపంచక తీర్థంబున కరిగి కృతస్నానుండయి వసియించి యుండుటయుఁ, బాండవకౌరవాది సకల రాజలోకంబును దత్తీర్థంబునకు వచ్చుటయుఁ, గుంతీదేవి దుఃఖంబును, నందయశోదా సహితులైన గోపగోపికా జనంబులు చనుదెంచుటయుఁ, గుశలప్రశ్నాది సంభాషణంబులును, మద్ర కన్యా ద్రౌపదీ సంభాషణంబును, దదనంతరంబ సకల రాజలోకంబును శ్యమంతపంచకతీర్థంబున స్నాతులై రామకృష్ణాదియాదవ వీరుల నామంత్రణంబు చేసి నిజదేశంబులకుఁ బోవుటయుం, గృష్ణుని దర్శించుటకు మునీంద్రు లేతెంచుటయు, వారి యనుమతిని వసుదేవుండు యాగంబు నెరవేర్చుటయు, నందయశోదాది గోపికానివహంబుల నిజపురంబున కనిచి యుగ్రసేనాది యాదవ వీరులుం దానును మాధవుండు నిజపురప్రవేశంబు సేయుటయుఁ, దొల్లి కంసునిచేత హతులై బలిపురంబున నున్న దేవకీదేవి సుతుల రామకృష్ణులు యోగమాయా బలంబునఁ దెచ్చి యామె కిచ్చుటయు, నర్జునుండు సుభద్రను వివాహం బగుటయుఁ, గృష్ణుండు మిథిలానగరంబున కరుగుటయు, శ్రుతదేవజనకుల చరిత్రంబును, వారలతో బ్రాహ్మణప్రశంస సేయుటయు, శ్రుతిగీతలును, గృష్ణుండు మఱలి తన పురంబున కరుగుదెంచుటయు హరి హర బ్రహ్మల తారతమ్య చరిత్రంబును, గుశస్థలినుండు బ్రాహ్మణుని చరిత్రంబును, నతనితనయులు పరలోకంబునకుం బోయినఁ గృష్ణార్జునులు తమ యోగబలంబున వారిం దెచ్చి యవ్విప్రున కిచ్చుటయుఁ గృష్ణుం డర్జునుని వీడ్కొని ద్వారక కరుగుటయు, నందు మాధవుండయ్యె ప్రదేశంబుల సకల భార్యా పరివృతుండయి విహరించుటయు, యాదవ వృష్ణి భోజాంధకవంశ చరిత్రంబును నను కథలు గల దశమస్కంధంబు నందు నుత్తరభాగము.** **1343**

ప్రతి : ఇది= ఈ గ్రంథం; శ్రీ= ఐశ్వర్యవంతమైన; పరమ+ఈశ్వర= పరమశివుడైన భగవంతుని; కరుణా – కలిత= దయవల్ల కలిగిన; కవితా విచిత్ర= కవితా చాతుర్యంకల కేసనమంత్రి పుత్ర= కేసన అనే మంత్రిగారి కుమారుడైన; సహజ పాండిత్య= సహజమైన పాండిత్యంకల; పోతన+అమాత్య= పోతన (మంత్రి)చే; ప్రణీతంబు+ఐన= వ్రాయబడినట్టి; శ్రీ మహాభాగవతంబు+అను, మహాపురాణంబు+అందున్= గొప్ప పురాణగ్రంథంలో; ప్రద్యుమ్న జన్మంబును= ప్రద్యుమ్నుని పుట్టుక; శంబర+ఉద్యోగంబును= శంబరుని యత్నం; సత్రాజిత్తునకున్= సత్రాజిత్తు అనే రాజుకు; సూర్యుండు= సూర్యభగవానుడు; శ్యమంతకమణిని= శ్యమంతకం అను పేరుగల మణిని; ఇచ్చుటయున్= ప్రదానంచేయడం; తత్+నిమిత్తంబునన్= ఆ సందర్భంగా; ప్రసేనుని సింహంబు వధించడం= ప్రసేనుని సింహం చంపడం; దానిన్= ఆ సింహాన్ని; జాంబవంతుఁడు దునిమి= జాంబవంతుడుచంపి; మాణిక్యంబు కొనిపోవుటయు= మణిని తీసికొనిపోవుట; గోవిందుడు ప్రసేనుని దునిమి మణిన్+కొనిపోయెన్+అని= గోవిందుడే ప్రసేనుని చంపి మణిని ఎత్తుకొనిపోయాడని, సత్రాజిత్తు= సత్రాజిత్‌మహారాజు; కృష్ణుని+అందున్; నిందన్+ఆరోపించుటయున్= శ్రీకృష్ణునిపై నిందవేయుటయు, కృష్ణుండు, తత్+నిమిత్తంబునన్= శ్రీకృష్ణుడు ఆకారణంతో; జాంబవంతునిన్+తొడరి= జాంబవంతుని ఎదిరించి మణియుక్తంబుగా

జాంబవతిన్+కొని వచ్చి= మణితోసహాజాంబవతిని తీసికొనివచ్చి; వివాహంబు+అగుటయున్= పెళ్లి చేసికొనుట; సత్రాజిత్తునకున్+మణిన్+ఇచ్చుటయున్= సత్రాజిత్తుకు ఆతని మణిని అతనికి ఇచ్చుట; సత్యభామా - పరిణయంబును= సత్యభామను వివాహం చేసికోవడం; పాండవులు లాక్షాగృహంబునన్= పాండవులు లక్కఇంటిలో; దగ్ధులు+ఐరి+అని+ విని= కాల్చివేయబడ్డారని విని; వాసుదేవుండు; బలభద్రసహితుండు+ఐ= శ్రీకృష్ణుడు బలరామునితోపాటు హస్తినాపురంబునకున్+అరుగుటయున్= కౌరవుల రాజధాని హస్తినకు వెళ్లడం; అక్రూర; కృతవర్మల అనుమతంబునన్= అక్రూరుడు, కృతవర్మల సమ్మతితో; శతధన్వుండు= శతధన్వమహారాజు; సత్రాజిత్తునున్+చంపి= సత్రాజిత్తును సంహరించి; మణిన్+కొనిపోవడం= శ్యమంతకమణిని, ఎత్తుకొని పోవడం; తత్+అర్థంబు+ఆ సత్యభామ= అందుకే సత్యభామ; కరినగరంబునకున్+ఏగి= హస్తినకువెళ్లి; కృష్ణునకు విన్నవించిన= శ్రీకృష్ణునికి చెప్పగా; అతండు మరలి చనుదెంచి= ఆయన తిరిగివచ్చి; శతధన్వున్+త్రుంచుటయున్= శతధన్వుని సంహరించడం; బలభద్రుండు మిథిలానగరమునకున్+ చనుటయున్= బలరాముడు మిథిలకు వెళ్లడం; అందు దుర్యోధనుండు= అక్కడ సుయోధనుడు; రాముని వలనన్ గదావిద్యన్= బలరామునిదగ్గర గదాయుద్ధవిద్యను; అభ్యసించుటయున్= నేర్చుకోవడం, కృష్ణుండు సత్రాజిత్తునకున్+పరలోక క్రియలు నడుపుటయున్= చనిపోయిన సత్రాజిత్తుకు పరలోకావాప్తికి శ్రాద్ధతర్పణాది క్రియలు చేయడం; శ్యమంతకమణిన్ దాచినవాడై అక్రూరుండు; శతధన్వుని ప్రేరేపించి శ్యమంతకాన్ని తెప్పించి; తాను దాచిన సంగతి కృష్ణునకు తెలియునని; భయంబున ద్వారకానగరంబు విడిచిపోయినన్= భయంచేత ద్వారకను వదిలిపారిపోగా; అతనిలేమిన్= అతడు లేకపోవుటచే; న+అవృష్టి+ఐనన్= వానలు కురువకుండుటచేత; కృష్ణుండు+అక్రూరుని మరల రప్పించుటయున్= శ్రీకృష్ణుడు అక్రూరుని మరల పిలిపించుటయు; దామ+ఉదరుండు= కృష్ణుడు; ఇంద్ర ప్రస్థపురంబునకున్+అరుగుటయున్= పాండవ రాజధానిఐన ఇంద్ర ప్రస్థానికి వెళ్లుట; అందు+అర్జున సమేతుండు+అయి= అక్కడ అర్జునునితోబాటు; మృగయా వినోద+ అర్థంబు+ అరణ్యంబునకున్+చని= వేట వినోదంకొఱకు అరణ్యానికివెళ్లి; కాళిందిన్+కొనివచ్చుటయున్= కాళిందిని తీసికొనివచ్చుట; ఖాండవ దహనంబును= ఖాండవ వనాన్నికాల్చుట; అగ్ని పురుషుండు= అగ్నిదేవుడు; అర్జుననకున్= అర్జునునికి ప్రతిఫలంగా; అక్షయతూణీర - గాండీవ - కవచ - రథరథ్యంబులన్= ఎడతెగని బాణములు కల తూణీరం (బాణాలపొది), గాండీవమనే పేరుగల ధనుస్సు, కవచం, రథం, గుఱ్ఱాలు, వీటిని; ఇచ్చుటయున్= ప్రసాదించటం; మయుండు= మయుడనే దేవశిల్పి; ధర్మరాజునకున్= ధర్మజునకు; సభకావించి= సభా భవనాన్ని నిర్మించి; ఇచ్చుటయున్= ఇవ్వడం; నగధరుండు= పర్వతమును మోసినవాడు ఐన శ్రీకృష్ణుడు; మరలి= తిరిగివచ్చి; నిజనగరంబునకున్= తన ద్వారకకు; అరుగుదెంచి= వచ్చి; కాళిందిని వివాహంబు+అగుటయున్= కాళిందీదేవిని పెండ్లాడుట; మిత్రావిందా, నాగ్నజితి, భద్రా, మద్రరాజకన్యకలన్= మిత్రవింద, నగ్నజిత్తుకూతురు, నాగ్నజితి, కేకయదేశాధిపతి కూతురు, భద్ర, మద్రదేశపురాచకన్య లక్షణను క్రమంబునన్= వరుసగా; కరగ్రహణంబు+అగుటయున్= పెళ్లిచేసికొనుట; నరక+అసుర - యుద్ధంబునున్= నరకుడనే పేరుగల రాక్షసునితో యుద్ధము; తత్+గృహంబునన్+ఉన్న= వాని రాజభవనంలో బందీలైన; రాజకన్యకలన్+పదాఱువేలన్+తెచ్చుటయున్= పదహారువేల రాజకన్యకలను; విడిపించి; తీసికొనివచ్చుట; స్వర్గగమనంబును= స్వర్గానికి వెళ్లడం; అదితికిన్+కుండలంబులు+ ఇచ్చుటయున్= నరకుని నుండి తెచ్చిన సురలతల్లిఐన అదితి కుండలములకు; ఆమెకు అప్పగించుటయు; పారిజాత+ అపహరణంబున్= దేవలోకంనుండి; పారిజాతవృక్షమును ఎత్తుకొనివచ్చుటయు; పదాఱువేలరాజకన్యలన్+పరిణయం బగుటయు= పదహారువేల నరకుని చెరనుండి విముక్తలైన రాచకన్యలను పెళ్లిచేసికోవడం; రుక్మిణీదేవి విప్రలంభంబును= రుక్మిణీ దేవితో విరసోక్తులు ఆడడం; రుక్మిణీస్తోత్రంబును= ఆమెను తిరిగి ప్రసన్నం చేసికోవడం; కృష్ణకుమార+ఉత్పత్తియున్= కృష్ణునికి కుమారులజననం; తత్+గురుజనసంఖ్యయున్= వారికి విద్యలు చెప్పే గురువులసంఖ్య; ప్రద్యుమ్న వివాహంబును=

ప్రద్యుమ్నుని పెళ్లి; అనిరుద్ధ జన్మంబును= అనిరుద్ధుని పుట్టుక; తత్+వివాహ+అర్థము= ఆతనిపెళ్లి కొఱకు; కుండిన నగరంబునకున్+చనుటయున్= కుండిన నగరానికి వెళ్లడం; రుక్మిబలభద్రుల జూదంబును= రుక్మి మరియు బలరాములు జూదమాడుట; రుక్మి వధయున్= రుక్మిని చంపుట; ఉషాకన్య అనిరుద్ధుని స్వప్నంబుననన్+కని మోహించుటయున్= ఉష అనే కన్య స్వప్నంలో అనిరుద్ధుని చూసి ప్రేమించడం; తత్+నిమిత్తంబుననన్= ఆ కారణంగా; చిత్రరేఖ= ఉష చెలికత్తె; సకల దేశరాజులన్= అన్ని దేశాల రాజకుమారుల; పటంబుననన్ లిఖించి= చిత్రపటాలపై రాసి (పటము= పూర్వ వస్త్రం, వస్త్రచిత్రాలు ఉండేవి); చూపి= ఉషకున్+చూపి (స్వప్నమున కనబడ్డ రాకుమారుడైన); అనిరుద్ధునిన్= అనిరుద్ధుని; తెచ్చుటయు= తీసికొనిరావడం; బాణ+అసుర యుద్ధంబును= బాణుడనే పేరుగల రాక్షసరాజు (ఉషతండ్రి)తో యుద్ధం; నృగ+ఉపాఖ్యానంబును= నృగమహారాజు కథ; బలభద్రుని ఘోషయాత్రయున్= బలరాముని ఘోషయాత్ర; కాళింది భేదనంబు= కాళిందినదిని నాగలితో బలరాముడు చీల్చడం; కృష్ణుండు పౌండ్రక వాసుదేవ కాశీరాజుల వధించుటయున్= శ్రీకృష్ణుడు పౌండ్రక వాసుదేవుడు; కాశీరాజులను చంపుట, కాశీరాజ పుత్రుండు+అయిన= కాశిరాజకుమారుడైన; సుదక్షిణుండు= సుదక్షిణుడనే పేరుగలరాజు; అభిచారహోమము= అభిచారమను పేరుగల శత్రువులను చంపే (దుష్ట) యాగమును; కావించి= చేసి; కృత్యన్+పడసి= కృత్య అనే రాక్షసిని ప్రత్యక్షీకరించుకొని; కృష్ణుపాలికిన్+పుత్తెంచినన్= శ్రీకృష్ణుని వద్దకు పంపగా; సుదర్శనంబుచేతన్+కృత్యను= తన సుదర్శనమనే పేరుగల చక్రాయుధంతో కృత్యను; సుదక్షిణ సహితంబుగాన్= సుదక్షిణునితోబాటు; కాశీపురంబును= కాశీనగరాన్ని; భస్మంబు+చేయుట= బూడిదచేయడం; బలరాముడు రైవత నగంబునందున్= బలరాముడు రైవతకాద్రిపై; ద్వివిదుండు+అను వనచరునిన్= ద్వివిదుడనే పేరుగల ఆటవికుని; వధియించుటయున్= చంపివేయుట; సాంబుండు= కృష్ణుని కుమారుడగు సాంబుడు; దుర్యోధను కూతురగు లక్షణను= సుయోధనుని కుమార్తె లక్షణ అను పేరుగలదానిని; ఎత్తికొని వచ్చినన్= దొంగిలించి తీసుకొనిరాగా; కౌరవులు+అతనిన్+కొనిపోయి= తిరిగి కౌరవులు (ప్రతీకారముగా) సాంబుని బంధించి తీసుకొనిపోయి; చెఱన్+పెట్టుటయున్= చెరసాలలో బందీచేయగా; తత్+వృత్తాంతంబు+అంతయున్= ఆ విషయమంతా; నారదువలనన్+విని= నారదుని ద్వారా తెలిసికొని; బలభద్రుండు= బలరాముడు; నాగనగరంబునకున్= హస్తినాపురానికి; చనుటయున్= వెళ్లడం; కౌరవులు+ఆడిన+అగౌరవ వచనంబులకున్= కౌరవులు పలికిన అమర్యాదకరమైన మాటలకు; బలరాముండు+కోపించి= బలరాముడుకోపంతో; హస్తినాపురంబును గంగన్ పడన్+త్రోయన్ – గమకించుటయున్= కౌరవ రాజధానీ నగరాన్ని గంగలో పడవేసేందుకు ఉద్యమించడం; కౌరవులు భయంబున్= కౌరవులు భయంతో; అంగనాయుక్తంబున్= లక్షణతో బాటు; సాంబుని తెచ్చి+ఇచ్చుటయున్= బంధించిన సాంబుని తీసికొనిరావడం; బలభద్రుండు ద్వారకానగరంబునకున్ వచ్చుటయున్= బలరాముడు సాంబునితోబాటు ద్వారకకురాక; నారదుండు= నారదమహర్షి; హరిపది+ఆఱువేల కన్యకల= శ్రీకృష్ణుడు పదహారువేల స్త్రీలను; ఒక ముహూర్తంబుననన్= ఒకే లగ్నవేళలో; అందఱకున్+అన్నిరూపులు+ఐ= పదహారువేల రూపాలతో; వివాహంబు+అయ్యెను+అని విని= పెళ్లి చేసికొన్నాడనివిని; తత్+ప్రభావంబు+తెలియన్+కోరి= ఆయన మాహాత్మ్యమును తెలుసుకోవాలనుకొని; అరుగుదెంచుటయున్= వచ్చుటయు; తత్+మహాత్మ్యంబు+చూచి మరలిచనుటయున్= ఆ మహత్తు చూసివెళ్లిపోవుట; జరాసంధునిచేత బద్ధులైన రాజులు= జరాసంధునిచేత బంధింపబడిన ప్రభువులు; కృష్ణుపాలికిన్= కృష్ణునివద్దకు; దూతన్+పుత్తెంచుటయున్= దూతను (రాయబారిని) పంపుటయు; నారద+ఆగమనంబును= నారదునిరాక; పాండవుల ప్రశంసయును= పాండవులను కీర్తించుట; ఉద్ధవకార్య బోధంబును= ఉద్ధవుడు చేయతగిన వ్యవహారాన్ని తెలుపుట; ఇంద్ర ప్రస్థ+ఆగమనంబును= కృష్ణుడు పాండవరాజధాని ఇంద్ర ప్రస్థమునకు వచ్చుట; ధర్మరాజు+చేయు

రాజసూయ+ఆరంభంబును= ధర్మరాజు (కృష్ణప్రేరితుడై) చేసే రాజసూయ యాగ ప్రారంభము; దిక్+విజయంబును= దిక్కులను జయించుట; జరాసంధ వధయును= జరాసంధుని సంహారము; రాజబంధ మోక్షణంబును= (ఆతని చెరలోని) రాజులను విడిపించుట; రాజసూయంబు నెరవేర్చుటయును= రాజసూయ యాగపరిసమాప్తి; శిశుపాలవధయును= యాగంలో కృష్ణాధ్యక్ష్యాన్ని ఆక్షేపించిన శిశుపాలుని వధించుట; అవభృథంబును= యాగానంతర స్నానం; రాజసూయ వైభవ దర్శన+అసహన మానసుండు+ఐ= రాజసూయ యాగములోని ధర్మరాజు వైభవాన్ని చూసి ఓర్వలేని మనసుకల్గిన; సుయోధనుండు= దుర్యోధనుడు; మయనిర్మిత సభామధ్యంబునన్= మయుడు నిర్మించిన సభామధ్యలో; కట్టిన పుట్టంబులు= కట్టుకొన్న వస్త్రాలు; తడియన్+త్రెళ్లుటయున్= తడిసేలా పడిపోవుట; తత్+నిమిత్త పరిభవంబున్+ఒంది= ఆకారణంగా పరాభవం చెంది; రారాజు నిజపురికిన్+అరుగుటయున్= రాజరాజు దుర్యోధనుడు తన హస్తిన నగరానికి వెళ్లుటయు; కృష్ణుండు ధర్మరాజ ప్రార్థితుండు+అయి= ధర్మరాజు ప్రార్థించగా; కృష్ణుడు, యాదవులనిలిపి= యాదవులను ఆపి; కొన్ని నెలలు ఖాండవ ప్రస్థంబున వసించుటయున్= కొద్దిమాసాలు ఖాండవ ప్రస్థంలో నివసించుట; సాళ్వుండు+తపంబు+చేసి= సాళ్వుడను రాజు తపస్సుచేసి; హరుని మెప్పించి= హరుని తృపిపరచి; సౌంభక+ఆఖ్యంబు+అగు= సౌంభక మును పేరుగల; విమానంబు+పడసి= విమానము పొంది; నిజసైన్య సమేతుండు+ఐ= తనసైన్యంతో కలిసి; ద్వారకా నగరంబు నిరోధించుటయున్= ద్వారకాపట్టణం దాడిని అడ్డుకోవడం; యాదవసాళ్వయుద్ధంబును= సాళ్వునితో యాదవుల యుద్ధం; కృష్ణుండు మరలి చనుదెంచి సాల్వున్+పరిమార్చుటయున్= కృష్ణుడు (ధర్మరాజు వద్దనుండి) వెనుకకు వచ్చి సాల్వుని చంపడం; దంతవక్త్ర వధయును= దంత వక్త్రుని (శిశుపాలుని తమ్ముని) చంపడం; విదూరథ మరణంబును= విదూరథుని చావు; కృష్ణుండు యాదవబల సమేతుండు+ఐ= తన యాదవ సైన్యంతో కృష్ణుడు; క్రమ్మన్= తిరిగి; నిజపురంబునకున్+ చనుటయున్= తన నగరమైన ద్వారకలో ప్రవేశించడమూ; కౌరవపాండవులకు యుద్ధంబు+అగునని= కౌరవపాండవులకు (మహాభారత) యుద్ధం అవుతుందని; బలదేవుండు= బలరాముడు; తీర్థయాత్ర+చనుటయున్= తీర్థయాత్రలకు వెళ్లుట; అందు జాహ్నవీ ప్రముఖ నదులన్= వాటిలో గంగమొదలయిన నదులలో; కృతస్నానుండు+అయి= స్నానాలు చేసినవాడై; నైమిశ+అరణ్యంబునకున్+చనుటయున్= నైమిశ అనుపేరుగల అరణ్యానికి వెళ్లుట; అచ్చటి మునులు పూజింపన్= అక్కడి మునులు పూజించగా; పూజితుండు+అయి= పూజలు అందుకొని; తత్+సమీపంబునన్= దగ్గరలో; ఉన్నత+ఆసనంబునన్+ఉండి= ఎత్తైన ఆసన బ్రహ్మాసనంపై కూర్చుండి; సూతుండు తన్నున్+కని లేవకున్న= సూతుడు తనను చూచి గౌరవంగాలేచి నిల్చుండకపోవుటతో; అలిగి= కోపించి; రాముండు= బలరాముడు; కుశ+అగ్రంబునన్= దర్భమొనతో; అతని వధించుటయున్= అతనిని (సూతుని) చంపుట; బ్రహ్మహత్యాదోషంబు కలిగెన్+అని= బ్రాహ్మణుని చంపిన దోషము (పాపము) కలిగెనుఅని; మునులు+పలికినన్= మునులు తీర్పరించగా; సూతున్+పునఃజీవితున్+ చేయుటయున్= సూతుని తిరిగి బ్రతికించడం; ఆ+మునులకున్+ప్రియంబుగాన్= ఆ మునులు సంతోషించేలా; కామపాలుండు= కోరిన రూపములు ధరించువాడు; ఇల్వలసుతుండు+అగు పల్వలున్= ఇల్వలుడనే రాక్షసుని కుమారుడు పల్వలుని; పరిమార్చుటయున్= చంపుట; వారిచేన్+అనుమతుండు+అయి= వారిచేత అనుమతి తీసికొని; హలధరుండు= నాగలిని ధరించిన బలరాముడు; తత్+సమీప తీర్థంబులన్= దానికి దగ్గరి నదులలో; స్నాతుండు+అయి= స్నానము చేసి; గంగా సాగర సంగమంబునకున్+చనుటయున్= గంగ - సముద్రంలో కలిసేచోటికి వెళ్లుట; మహేంద్ర నగప్రవేశంబును= మహేంద్ర పర్వతానికి వెళ్లడం; పరశురామ దర్శనంబును= పరశురాముని దర్శించుట; సప్తగోదావరిన్+క్రుంకుటయున్= గోదావరి ఏడుపాయలుగా ప్రవహించిన పవిత్ర స్థలంలో స్నానంచేయడం; మఱియు, మధ్యదేశంబునన్+కల= ఇంకా

మధ్య(భారత) దేశంలోని; తీర్థంబులు+ఆడి= నదులలో స్నానమాడి; శ్రీశైల వేంకటాచలంబులు దర్శించుటయున్= శ్రీశైలం, వేంకటాచలం (తిరుమల) పర్వత దైవాలను దర్శనం చేసుకోవడం; వృషభ+అద్రి; హరిక్షేత్ర, సేతుబంధ, రామేశ్వరములన్+కని= వృషభాద్రిని, హరిక్షేత్రాన్ని, సేతుబంధ, రామేశ్వర క్షేత్రాలను దర్శించి, తామ్రపర్ణితీర్థంబులు+ఆడుటయున్= తామ్రపర్ణినదిలో స్నానంచేయుట; గోదానంబులు+ఒనరించి= గోవులను దానమిచ్చి; మలయగిరి+అందున్; అగస్త్యునిన్+కనుటయున్= మలయపర్వతమున నివసించు అగస్త్య మహర్షి దర్శనము; సముద్ర కన్యా దుర్గాదేవులన్+ఉపాసించడం= సముద్ర కన్యఐన కన్యాకుమారీ దుర్గామాతలను పూజించుట; అందు బ్రాహ్మణ జనంబువలనన్= ఆ చోట బ్రాహ్మణులు మాట్లాడుకొనగా; పాండవ – ధార్తరాష్ట్ర భండనంబునన్= కౌరవపాండవ (మహాభారత) యుద్ధంలో; సకల రాజలోకంబును= సమస్తరాజులు; మృతిన్+ఒందిరని వినుటయున్= చనిపోయినారని వినడం; వాయునందన సుయోధనులు= (వాయుదేవుని కుమారుడైన=)భీముడు, దుర్యోధనుడు, గదాయుద్ధ సన్నద్ధులగుటవిని= గదలతో యుద్ధమునకై సిద్ధపడిరని విని; వారినివారించుటకై= వారిని ఆపుటకై; రోహిణేయుండు+అందులకున్+అరుగుటయున్= (రోహిణీ కుమారుడైన=) బలరాముడు దానికై వెళ్లుట; అచట వారిచేతన్+పూజితుండు+అయి= అక్కడ వారితో పూజలు స్వీకరించి; వారి నివారింపలేక= వారిని ఆపలేక; మగిడి= తిరిగి; ద్వారకకు అరుగుటయున్= ద్వారకకు వెళ్లుట; కొన్ని వాసరంబులకున్= కొన్ని దినములకు; మరల నైమిశ+అరణ్యంబునకున్+పోయి= నైమిశమన్న అంణ్యానికిపోయి; అచ్చట యజ్ఞంబు+చేసి= అక్కడ ఋషుల సహాయంతో యజ్ఞం నిర్వర్తించి; రేవతియున్+తానును+అవభృథంబు+ఆడి= భార్య రేవతితోసహా యజ్ఞానంతర పరిసమాప్తి స్నానమైన అవభృథాన్నిచేసి, నిజపురంబునకు+ఏతెంచుటయున్= తన నగరానికి రావడం; కుచేల+ఉపాఖ్యానంబునంబును= శ్రీకృష్ణుని బాల్య సఖుడైన కుచేలుని కథ; సూర్య+ఉపరాగంబునన్= సూర్యగ్రహణవేళలో; కృష్ణుండు రామునితోన్+చేరి= శ్రీకృష్ణుడు బలరామునితో గలిసి; పురరక్షణంబునకున్= ద్వారకానగర రక్షణకు; ప్రద్యుమ్నాది కుమారుల నిలిపి= ప్రద్యుమ్నుడు మొదలుగాగల తమ కుమారులను ఉంచి; షోడశ సహస్ర+అంగనా పరివృతుండు+అయి= పదహారువేల భార్యలతో కలిసి; అక్రూర, వసుదేవ+ఉగ్రసేనాది యాదవవీరులు= అక్రూరుడు, వసుదేవుడు, ఉగ్రసేనుడు మొదలైన యాదవవీరులు; తోడు+రాన్= వెంబడిరాగా; శ్యమంతక పంచక తీర్థంబునకున్+అరిగి= శ్యమంతక పంచకమన్న పేరుగల ఐదుసరస్సుల వద్దకువెళ్లి; కృతస్నానుండు+అయి; వసించి, ఉండుటయున్= స్నానముచేసి అక్కడ ఉండటం; పాండవ కౌరవ+ఆది= పాండవులు, కౌరవులు మొదలుగాగల; సకల రాజలోకంబును= రాజులందరును; తత్+తీర్థంబునకు వచ్చుటయున్= ఆ శ్యమంతక తీర్థానికి వచ్చుట; కుంతీదేవి దుఃఖంబును= కుంతీదేవి బాధ; నందయశోదా సహితులు+ఐన గోపగోపికా జనంబులు= నందుడు, యశోదలతో బాటు గోపాలక, గోపికాస్త్రీలు, చనుదెంచుటయున్= వచ్చుట; కుశల ప్రశ్నాది సంభాషణంబులును= క్షేమసమాచారపుమాటలు; మద్రకన్యా ద్రౌపదీ సంభాషణలు= మద్రదేశాధిపతి కూతురులక్ష్మణ; ద్రౌపదీదేవి మాట్లాడుకున్న మాటలు; తత్+అనంతరంబ= దానికి తరువాత; సకల రాజలోకంబును= అందరు రాజులు శ్యమంతకపంచక తీర్థంబునన్= శ్యమంతక సరస్సులు ఐదింటిలో; స్నాతులు+ఐ= స్నానం చేసినవారై; రామకృష్ణాది యాదవవీరులన్+ఆమంత్రణంబు+చేసి= బలరామ, శ్రీకృష్ణులు, తక్కిన యాదవవీరులను వీడుకొని; నిజదేశంబులకున్= తమ రాజ్యాలకు; పోవుటయున్= వెళ్లిపోవుట; కృష్ణుని దర్శించుటకు ముని+ఇంద్రులు+ఏతెంచుటయున్= కృష్ణదర్శనార్థం మునులు రావడం; వారి+అనుమతిని వసుదేవుండు యాగంబు నెరవేర్చుటయున్= వారి అనుజ్ఞతో వసుదేవుడు యాగముచేయుట; నందయశోద+ఆది గోపికా నివహంబులన్= నందుడు, యశోద మొదలైన గోపాలురను; గోపికలను; నిజపురంబునకు+అనిచి= వారిండ్లకుపంపి; ఉగ్రసేన+ఆది యాదవ వీరులున్+తానును= ఉగ్రసేనుడు మొదలైన యాదవ

వీరులతో తను; మాధవుండు నిజపురప్రవేశంబు+చేయుటయున్= శ్రీకృష్ణుడు తనద్వారకకు వచ్చుట; తొల్లికంసునిచేత హతులై= పూర్వం కంసుడు చంపిన; బలిపురంబున ఉన్న= బలిచక్రవర్తితో ఉన్న; దేవకీదేవి సుతులన్= దేవకీదేవి కుమారులను, రామకృష్ణులు= బలరామకృష్ణులు; యోగమాయా బలంబునన్= యోగమాయశక్తితో; తెచ్చి= తిరిగి బతికించి తెచ్చి; ఆమెకు+ఇచ్చుటయున్= దేవకీదేవికి (తల్లికి) ఇచ్చుట; అర్జునుండు సుభద్రను వివాహంబగుటయున్= అర్జునుడు శ్రీకృష్ణుని చెల్లెలు సుభద్రను పెళ్లిచేసికోవడం; కృష్ణుండు మిథిలానగరంబునకున్+ అరుగుటయున్= శ్రీకృష్ణుడు మిథిలకు వెళ్లుట; శ్రుతదేవ, జనకుల చరిత్రంబును= మిథిలరాజు జనకుడు; శ్రుతదేవుడనే బ్రాహ్మణుని చరిత్ర; వారలతో బ్రాహ్మణ ప్రశంస చేయుటయున్= వారితో బ్రాహ్మణులను పొగడడం; శ్రుతిగీతలును= శ్రుతిగీతలను పేరుగల ధర్మవిషయాలు; కృష్ణుండు మఱలి తనపురంబునకున్+అరుగుదెంచుటయున్= శ్రీకృష్ణుడు మిథిలనుండి ద్వారకకు వచ్చుట; హరిహరబ్రహ్మల తారతమ్య చరిత్రంబును= త్రిమూర్తుల తేడాలగూర్చిన కథ; కుశస్థలినుండు బ్రాహ్మణుని చరిత్రంబు= కుశస్థలిలో నివసించి పుట్టినపుడే పుత్రులను కోల్పోతున్న బ్రాహ్మణుని కథ; అతని తనయులు పరలోకంబునకున్+పోయినన్= ఆయన కుమారులు; చనిపోయి పరలోకగతులుకాగా; కృష్ణ+అర్జునులు తమ యోగబలంబునన్= శ్రీకృష్ణుడు; అర్జునుడును తమ యోగబలంచేత (ఊర్ధ్వలోకాలు, వైకుంఠం) వెళ్లి; వారిన్+తెచ్చి+ఆ+విప్రునకున్= ఆ కుమారులను సజీవులుగా తీసికొనివచ్చి; తండ్రియైన ఆ బ్రాహ్మణునకు; ఇచ్చుటయున్= అప్పజెప్పడం; కృష్ణుండు+అర్జునుని వీడ్కొని= శ్రీకృష్ణుడు అర్జునునితో సెలవు పుచ్చుకొని; ద్వారకకు+అరుగుటయున్ - ద్వారకకు వెళ్లడం; అందు మాధవుండు= అక్కడ శ్రీకృష్ణుడు; ఆ+ఆ ప్రదేశంబుల= ఆయా ప్రదేశాలలో; సకలభార్యా పరివృతుండు+అయి= తన సమస్త భార్యలు కూడి ఉండగా; విహరించుటయున్= విహారాలు (క్రీడలు) చేయుట; యాదవ, వృష్ణి, భోజ+చరిత్ర అంధక వంశచరిత్రంబును= యాదవాది రాజుల వంశచరిత్రం; అను కథలుగల= అనే పై కథలున్నట్టి; దశమస్కంధంబు+అందున్= ఆంధ్రీకృత మహాభాగవతంలోని పదవస్కంధంలో; ఉత్తరభాగము= చివరి భాగం.

**తా :** పరమేశ్వరుని దయతో కవితా వైచిత్రిపొందిన, కేసనామాత్యుని పుత్రుడు, సహజ పాండిత్యుడు ఐన పోతనా మాత్యుడు రచించిన శ్రీమహాభాగవతమనే మహాపురాణంలో ప్రద్యుమ్న జననం, శంబరాసుర దమనం, సత్రాజిత్తు శ్యమంతకమణి పొందినకథ, ఆ రత్నము కొరకై సింహంచేత చంపబడిన తన తమ్ముడు ప్రసేనుని శ్రీకృష్ణుడు చంపినాడన్న నింద, ఆ నిందతో కృష్ణుడు జాంబవంతునితో యుద్ధముచేసి గెలిచి, మణిని తెచ్చి ఇచ్చుట, జాంబవతితో వివాహము, సత్రాజిత్తునొచ్చుకొని తన కూతురు సత్యభామను శ్రీకృష్ణునకిచ్చి వివాహము జరిపించడం, పాండవులు లక్కఇంటిలో కాలిపోయినారన్న వార్తవిని, హస్తినకుపోవడం, శతధన్వుడు సత్రాజిత్తును చంపి మణినెత్తుకపోయినాడన్న వార్త సత్యభామ శ్రీకృష్ణునకు తెలుపగా కృష్ణుడు శతధన్వుని వధించడం, బలరాముడు మిథిలకు వెళ్లి, అక్కడ దుర్యోధనునకు గదావిద్య ఉపదేశించుట, సత్రాజిత్తుకు అంత్యక్రియలు, మణినిదాచిన అక్రూరుడు ద్వారకవీడిపోగా, శ్రీకృష్ణుండు పిలిపించడం, శ్రీకృష్ణుడు ఇంద్ర ప్రస్థమునకు వెళ్లి, అర్జునునితోబాటు వేటకువెళ్లుట, కాళిందిని తేవడం, ఖాండవ దహనం, అగ్ని అర్జునునకు గాండీవాదులు ప్రసాదించడం, మయుడు ధర్మరాజునకు సభనిర్మించి యిచ్చుట కృష్ణుడు కాళిందిని వివాహమాడడం, మిగిలిన అష్టమహిషులతో పెళ్లి, నరకాసుర యుద్ధం, అతనిని చంపి, అతని చెరలోని పదహారు వేలమంది రాజకన్యలను విడిపించుట, అదితికి కుండలములు ఇచ్చి స్వర్గంనుండి పారిజాత వృక్షాన్ని తేవడం, రాజకన్యల్ని వివాహమాడటం, రుక్మిణిని ఉపాలంభించి, అనునయించుట, కుమారుల జన్మములు, అనిరుద్ధుని వివాహ నిమిత్తం బలరాముడు కుండిన నగరానికి వెళ్లడం, రుక్మివధ, ఉష అనిరుద్ధుని స్వప్నంలో చూచి మోహించుట, అనిరుద్ధుని బంధించిన

బాణాసురునితో యుద్ధం నృగోపాఖ్యానము, బలభద్రుని ఘోషయాత్ర, కాళిందీనది గర్వమణచుట; కృష్ణుడు పౌండ్రక వాసుదేవ, కాశీరాజుల సంహరించుట, సుదక్షిణుని అభిచార హోమం, తనపైకి వచ్చిన కృత్యను, సుదక్షిణుని చక్రాయుధంచే సంహరించి కాశీనగరాన్ని కాల్చడం, ద్వివిదుడను వనచరుని బలరాముడు సంహరించుట, సాంబుడు దుర్యోధనుని కూతురు లక్షణ నెత్తుకొని, కౌరవులు సాంబుని బంధించడం, బలరాముడు విడిపించడం, వారి వివాహం, నారదుడు పదహారువేల రాచకన్యలను పదహారువేల రూపాలతో వివాహమాడగా విని చూడరావడం, జరాసంధునిచే బంధించబడిన రాజులు శ్రీకృష్ణుని ప్రార్థించుట, ఉద్ధవుడు కార్యనిర్వహణాన్ని బోధించడం, కృష్ణుడు ధర్మరాజును రాజసూయానికై నియోగించడం, దిగ్విజయంలో భాగంగా జరాసంధవధ, రాజసూయ సందర్భంలో శిశుపాలవధ, రాజసూయవైభవాన్ని చూసిన సుయోధనుని ఈర్ష్య, మయసభలో అవమానం, ధర్మజుడు ప్రార్థించగా కృష్ణుడు ఖాండవ ప్రస్థంలో అతిథిగా ఉండటం, సాళ్వుడు శివవరదత్త విమానంతో ద్వారకను ముట్టడించడం, కృష్ణుడు వెనుకకు మరలివచ్చి సాళ్వుని, దంతవక్త్రుని, విదూరథుని చంపుట, పాండవకౌరవ యుద్ధం, బలరాముని తీర్థయాత్రాగమనం, అనేకనదీ స్నానాలు, నైమిశంలో సూతుని దర్భతో చంపడం, మునుల ప్రార్థనచే తిరిగి బ్రతికించుట, అక్కడ యజ్ఞనిరోధకులైన పల్వలాది రాక్షసులసంహారము, గంగాసాగరసంగమం మొ॥ దర్శించడం సముద్ర కన్యాకుమారివద్ద బ్రాహ్మణులచే మహాభారత యుద్ధంలో రాజులందరు చచ్చినారని వినడం; భీమసుయోధనుల గదాయుద్ధం ఆపుటకు తిరిగిరావడం, వారు వినకపోవడంచేత ద్వారకకు తిరిగిపోవడం, నైమిశంలో బలరాముడు యజ్ఞంచేయడం, కుచేలుని కథ, సూర్యగ్రహణవేళ బలరామకృష్ణులు శ్యమంతక పంచకాన్ని యాదవులతో కలిసివెళ్లుట, పాండవకౌరవాదు లక్కడికివచ్చి కృష్ణుని కలియడం, కుంతీదేవి దుఃఖం, లక్ష్మణ వివాహగాథ, కృష్ణుని దర్శింప మునీంద్రులు రావడం, వసుదేవుని యాగం, ద్వారకకు తిరిగివచ్చి, దేవకీదేవి తనయులను ఆమె కోరికపై బలి పురంనుండి తిరిగి బ్రతికించి తెచ్చిఇవ్వడం, అర్జున సుభద్రా వివాహం, కృష్ణుడు మిథిల వెళ్లి, జనక, శ్రుతదేవులననుగ్రహించడం, శ్రుతిగీతలు, త్రిమూర్తుల తారతమ్యకథ, కుశస్థలిలో బ్రాహ్మణుని కుమారులను బ్రతికించడం, ద్వారకలో శ్రీకృష్ణుడు తన భార్యలతో గృహమేధియై భోగభాగ్యాలనుభవించడం, అతని సంతానం యాదవ, వృష్ణి భోజాంధకులుగా వంశం తామరతంపరగా వృద్ధిపొందడం మొదలైన కథలుగల ఇది దశమస్కంధంలోని ఉత్తరభాగం.

*:: శ్రీకృష్ణార్పణమస్తు ::*

# పద్యగద్యసూచి

## దశమస్కంధము - ఉత్తరభాగము

## మావద్ద లభించు గ్రంథములు

### 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

| | | |
|---|---|---|
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |

